ప్రథమ ముద్రణ : 1999

ప్రతులు : 1000



ప్రతులకు :

శ్రీ పమిడిఘంటం శ్రీరఘురామ్,
శ్రీరామసదనము, ప్లాట్ నం. 1361, రోడ్ నం. 45,
జూబ్లీ హిల్సు కో-ఆపరేటివ్ హౌసింగ్ సొసైటీ,
హైదరాబాదు-500 033. ఫోన్ : 3608237

ఆచార్య కె. కమల,
16, తుల్జాగుడా, మోజంజాహీ మార్కెటు
హైదరాబాదు-500 001.

మూల్యం : రూ. 150/-

ముద్రణ :

శివాజీ ప్రెస్, సికింద్రాబాద్.

ఆర్ష విజ్ఞాన ట్రస్టు
శ్రీరామ సదనము,
ప్లాట్ నం. 1361, రోడ్ నం. 45,
జూబ్లీ హిల్సు కోఆపరేటివ్ హౌసింగ్ సొసైటి,
హైదరాబాదు-500 033.

ఈ గ్రంథ ముద్రణమునకు కావలసిన పేపరు సమకూర్చిన దాతలు

## శ్రీమతి & శ్రీ కొండూరి రాఘవాచార్యులుగారు

హైకోర్టు అడ్వొకేట్, హైదరాబాదు.

# కృతజ్ఞతాంజలి

కీర్తిశేషులు శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు వ్యాసభారతాన్ని యథామూలము గద్యానువాదాన్ని తెలుగులోనికి చేసినారు. అందు ఆదిపంచకము ఆది, సభా, అరణ్య, విరాటోద్యోగపర్వాలు, వాని ప్రచురణ జరిగిన తరువాత భీష్మపర్వ ముద్రణకు అనేక అవాంతరాలను ఎదుర్కొనవలసివచ్చింది. ఈ సమయములో 'ఆర్ష విజ్ఞాన ట్రస్టు' ద్వారా రామాయణము వంటి సద్గ్రంథములను ముద్రించి ప్రకాశిస్తున్న జస్టిస్ పమిడిఘంటం కోదండరామయ్యగారు ఈ పనిని నిర్వహించడానికి పూనుకున్నారు. తరతరాలు భద్రాచల సీతారామస్వామిని సేవించిన చేతులతో ఆర్ష విజ్ఞానానికి ఆరతిపట్టిన వదాన్యులు గుణజ్ఞులు వారు. వారి దర్శనములోని ఔచిత్యము ఈ గ్రంథ ప్రచురణ సాధ్యపడేటట్లు చేసింది. వారిది పమిడిఘంటం. తాము వ్రాసి ఇతరులచేత వ్రాయించడమే వారిలోని గొప్పతనాన్ని చాటుతుంది. చిరంజీవి అయిన వ్యాసభగవానుడే ఆర్ష విజ్ఞాన ట్రస్టును నడిపిస్తూ ఉన్న ధన్యజీవులను కాపాడవలెనని ప్రార్థిస్తున్నాను.

ట్రస్టుకు స్థాపకాధ్యక్షులు జస్టిస్ కోదండరామయ్యగారు. ఇప్పుడు శ్రీ పొత్తూరు వెంకటేశ్వరరావుగారు అధ్యక్షులు. వారు జగమెరిగిన పాత్రికేయులు. జర్నలిస్టు ప్రెస్సు అకాడెమీ చేర్మెన్, ఆంధ్రదేశ సంస్కృతిక క్షేత్రములో విశేష సేవలనందించిన ధన్యజీవులు – భీష్మపర్వ ప్రచురణ సాధ్యపడేటట్లు చేసినందుకు వారికి కృతజ్ఞతలు.

మేము కోరిన వెంటనే భీష్మపర్వాన్ని గూర్చి విద్వదభిప్రాయాలను అందించిన ఆచార్య మహామహోపాధ్యాయ శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడుగారికి, ఆచార్య ప్రమోద్ గణేశ్ లాల్యేగారికి, ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యముగారికి నా ధన్యవాదములు. మా నాయనగారి సమకాలిక విద్వాంసులను చేతనయినంత వరకు ఈ గ్రంథముద్రణ కార్యములో జోడింపజేయవలెనన్నదే నా ప్రయత్నము.

అనేక దశలలో ఈ ప్రకాశన కార్యానికి సహకరించిన వారు నా సోద

రులు. అగ్రజులు డాక్టర్ శ్రీ కప్పగంతుల ప్రభాకరశాస్త్రి గారికి నమస్కారములు. అనుజులు శ్రీ కప్పగంతుల వేంకటకృష్ణమూర్తికి ఆశీస్సులు.

సంస్కృతం ఎమ్.ఏ. విద్యార్థులు, రిసెర్చి స్కాలర్లు భీష్మపర్వము ప్రెస్ ప్రతిని తయారుచేయడానికి నాకు తోడ్పడినారు. వారికందరకు నేను శుభాభినందనలు తెలియజేస్తున్నాను.

సంవత్సరాల తరబడి ప్రెస్సువారికి విసుగులేకుండా చిరునవ్వుతో ప్రూపు అందించినవారు మా ప్రతివేశిని శ్రీమతి విజయలక్ష్మిగారు. ఆమెకు ధన్యవాదములు.

శివాజీప్రెస్సువారితో మా అనుబంధము ఈనాటిదికాదు. 1975 సంవత్సరములో శ్రీ లక్ష్మణశాస్త్రిగారు, మాదిరాజు విశ్వనాథరావుగారు కలిసి ఆంధ్ర ప్రబంధము రూపములో అనువదించిన "విక్రమాంక దేవచరితము" ను ముద్రించిన బంధువులు ఈ ప్రెస్సువారే.

ఈ గ్రంథ ముద్రణ యజ్ఞములో అధ్వర్యుస్థానము శివాజీ ప్రెస్సువారిది. మంచి గ్రంథములను ప్రకాశింపజేసిన యశస్సునందుకున్న ప్రెస్సు అధినేతలు శ్రీ నాగేందర్‌గారికి నా ధన్యవాదములు.

ఎంత ప్రయత్నించినా కొన్నితప్పులు దొర్లి ఉండవచ్చును. ఓపికతో చదివి గుణమును గ్రహించగలరని ఆంధ్రదేశములోని పాఠక రాజహంసలకు మనవి చేస్తూ ముగిస్తున్నాను.

ఈ భీష్మపర్వ ముద్రణములో గూడ యథాపూర్వము గీతాప్రెస్సు, గోరఖ్‌పూర్ వారి మహాభారత ప్రతినే అనుసరించడము జరిగింది. పాఠకులీవిషయాన్ని గ్రహించగలరు.

ఇట్లు

ప్రొ. కె. కమల

సంస్కృత విభాగము

ఉస్మానియా విశ్వవిద్యాలయము

28-6-99

ప్రమాది నామ సంవత్సర

జ్యేష్ఠ శుద్ధ పూర్ణిమ, వటసావిత్రీ పూర్ణిమ.

# శరతల్పము-జలతర్పణము

అనగనగా ఒక మారుమూల పల్లెటూళ్ళో ఆంధ్రదేశంలో మహబూబు నగరం జిల్లా అత్మకూరులో ఒక వీధిబడిలో ఎనిమిది సంవత్సరాల ఒక అమ్మాయి గొంతెత్తి పోతనామాత్యుని భాగవతపురాణంలోని పద్యాన్ని చదివితే స్కూళ్ల ఇన్స్పెక్టరు ముచ్చటపడి ఆ అమ్మాయికి పాఠము చెప్పిన గురువుగారికి రెండు రూపాయలు జీతము పెంచిపోయినాడట. గురువు బాగా నేర్పించబట్టే ఆ అమ్మాయి అంతబాగా ఒప్పజెప్పగలిగింది. ఇదంతా 65, 70 ఏండ్లనాటిమాట. ఆ అమ్మాయికి పదవ ఏట వివాహము జరగడం అత్తవారింటికి పోవడము. అందరికి జరిగినట్లే జరిగింది. కాని ఆమెలో విద్యాభినివేశము మాత్రము ఏనాడూ అడుగంటలేదు. ఎవరెక్కడ విద్యనుగూర్చి చర్చిస్తే అక్కడే కదలకుండా కూర్చొని వినేది భాగ్యవశాత్తు ఆమె శ్రీకప్పగంతులలక్ష్మణశాస్త్రిగారి అర్ధాంగి కాగలిగింది. లేకపోతే ఆ రోజులలో నాటకాంత సాహిత్య జ్ఞానమున్నవారిని గూడా అత్తవారిండ్లలో నోరుమెదపనిచ్చేవారుకారు. వారు శేషజీవితములో నిరక్షరాస్యులుగానే పరిగణింపబడి 'ఉత్పాద్యంతే విలీయంతే...' లాగా కాలము వెళ్లబుచ్చేవారు.

కాని ఈ అమ్మాయి భాగ్యవతి గదా! లక్ష్మణశాస్త్రిగారు వనపర్తి హైస్కూల్లో తెలుగు టీచరుగా పనిచేస్తూ ఊర్లో పనీపాట లేకుండా తిరుగుతూఉండే యువకులను పోగుచేసి వారికి సాయంకాల సమయంలో తెలుగు నేర్పి వారిచేత భాషాప్రవీణ విద్యాప్రవీణవంటి పరీక్షలకు కట్టించి తయారుచేసేవారు. అవిధంగా క్రమంగా బి.ఎ, ఎమ్.ఎ. పరీక్షలు చదివి ఉద్యోగాలలో చేరి ఉజ్జ్వలంగా ప్రకాశించిన ఆ తారలందరూ ఆయన పేరు చెప్పి దీపం పెట్టుకున్నారు. మహబూబ్ నగరంజిల్లాకంతటికి ఆయన గురువులయినారు. కావ్యరచనా వ్యాసంగంతోబాటు స్త్రీ విద్యావ్యాప్తికై వారు కృషిచేయడం ప్రశంసాస్పదము. చుట్టూ ఉండే స్త్రీలకు వారు విద్యాబోధ చేయడంవల్ల వారి అర్ధాంగికి అందులోచేరి యథాశక్తి విద్యావ్యాసంగములో కాలముగడపడము, మధ్యాహ్నవేళలో పిల్లలు తమకు అడ్డురాకుండగా తలుపులు మూసుకొని రామాయణ భారత భాగవతాలతోబాటు

కావ్యనాటకాదులు చదివి రసాస్వాదనము చేయడము ఆ అర్ధాంగికి పరిపాటి అయి పోయింది. ఆమెపేరే అన్నపూర్ణమ్మగారు- ఆమె మా తల్లికావటం మా పూర్వ పుణ్య ఫలమనే చెప్పాలి. ఆమె మాకు విద్యాగురువుకూడా. తనవెంట తిప్పుతూ పాఠము చెప్పేది. పద్యాలు, శ్లోకాలు నేర్పేది. మా నాయనగారివెంట చాలా సాహిత్య సభలకు వెళ్ళేది. అర్థముకాని విషయము పదే పదే అడిగి తెలుసు కునేది.

కాలక్రమాన ఆమెలోని దైవభక్తి, సాహిత్యాభినివేశము ఒకటితో ఒకటి పోటీపడి స్థిరపడినవి. దాదాపు రెండుకోట్ల రామనామము జపిస్తూ స్పృహ ఉన్నంతసేపు చేతిలో జపమాలను తిప్పుతూ కాన్సర్ వ్యాధితో కుంగిపోయి 18-5-97 నాడు ఇహలోక యాత్రను చాలించిన ధన్యజీవి మా అమ్మగారు కీ॥శే॥ అన్నపూర్ణమ్మగారు - లక్ష్మణశాస్త్రిగారి వెనుక ఒక శక్తి వారి తల్లి. కీ.శే. కప్పగంతుల పద్మావతమ్మగారు, మరి ఒక శక్తి వారి అర్ధాంగి అన్న పూర్ణమ్మగారు ఇందులో ఎంతమాత్రము అతిశయోక్తి లేదు.

అన్నపూర్ణమ్మగారిలో సాత్త్విక దివ్యతత్వాన్ని దర్శించిన లక్ష్మణశాస్త్రి గారి మిత్రులు కీ.శే. తిరుమల రామచంద్రగారు ఒక వ్యాస సంకలనానికి 'అహం భో! అభివాదయే'అని నామకరణము చేసి ఆ గ్రంథాన్ని మా అమ్మగారికి అంకితముచేసినారు-వారిమధ్యఉన్న అన్నాచెల్లెంద్ర అనుబంధానికి ఆ అంకితము ముద్రవేసింది.

మా నాయనగారు 1981 సంవత్సరములో పరమపదమును చేరుకున్న తరువాత అహర్నిశలు వారు ఆంధ్రీకరించిన "మహాభారతము" ముద్రింపబడవలె నని దాదాపు జపముచేసినారు మా అమ్మగారు-ఈరోజుల్లోనేగాదు, ఏరోజుల్లో నయినా గ్రంథనిర్మాణము ఎంతకష్టమో, ముద్రణము, ప్రకాశనము అంతే కష్ట సాధ్యము-మా అమ్మగారి తపఃఫలముగా 1990వ సంవత్సరమునుండి '95వ సంవత్సరమువరకు ఆది పంచకము (ఆది, సభా, అరణ్య, విరాటోద్యోగ పర్వాలు) సర్వాంగ సుందరంగా ప్రచురింపబడ్డవి.

ఒక పర్వముద్రణము జరుగుతూఉండగనే తరువాతి ముద్రణమునుగూర్చి మా అమ్మగారు ఆలోచించడము మొదలు పెట్టేవారు. ఉద్యోగపర్వ ముద్రణ వరకు కొంచెముడబ్బు ఇబ్బంది ఏర్పడి ఆలోచిస్తూఉంటే ఆంధ్ర విశ్వవిద్యాల

యము భౌతిక శాస్త్ర విభాగములో రీడరుగా పనిచేస్తున్న లక్ష్మీపతిరావుగారు అయా చితంగా పాతికవేలు ధనసహాయముచేసి, సనత్సు జాతీయ వివరణతోగూడిన ఉద్యోగ పర్వ ప్రచురణకు తోడుపడినారు.

కాలము ఇట్లా సాగుతుండగా మా అమ్మగారికి కాన్సర్‌వ్యాధి రావడము, దాదాపు రెండున్నర సంవత్సరాలు ఆ వ్యాధితో ఆమె యుద్ధముచేసి వెళ్లిపోవడం జరిగింది.

ఈ రెండున్నర సంవత్సరాలకాలము అహర్నిశలు, తాను బాధపడుతున్న సంగతి ప్రస్తావించకుండా 'భీష్మపర్వము' ప్రచురణనుగూర్చి రోజూ అడుగుతూ ఉండేది. నేను భీష్మువివలెనే శరతల్పములోఉన్నాను. నాకు భీష్మపర్వము చూపిస్తావా? మనయింటిని 'మహాభారతము' వారని పిలిస్తే బాగుంటుందిగదా! అని అడుగుతూఉండేది. ఎంత ప్రయత్నించినా ఆమె జీవితకాలంలో భీష్మపర్వ ప్రచురణ సాధ్యముకాలేదు.

ఈ రోజులలో జస్టిస్ పమిడిఘంటం కోదండరామయ్యగారు ఫోనుచేసి 'ఆర్ష విజ్ఞాన-ట్రస్టు' ద్వారా భీష్మపర్వము ముద్రణ కార్యాన్ని చేపట్టడానికి ముందుకువచ్చినారు. వారికి కృతజ్ఞతలు.

శరతల్పములో ఉన్నంతకాలము మా అమ్మగారికి చేయలేని జలదానము ఇప్పుడు భీష్మపర్వముద్రణవల్ల చేయడం జరిగిందని భావిస్తున్నాను-ఈ గ్రంథం లోని భగవద్గీతా జ్ఞానామృతాన్ని తనివితీర త్రాగి దప్పిక తీర్చుకోవలెనని స్వర్గవాసి అయిన మా అమ్మగారిని వేడుకుంటున్నాను.

ఈ గ్రంథముద్రణ మూడు పవిత్రాత్మలకు చల్లదనాన్ని ఇచ్చింది. శ్రీ లక్ష్మణశాస్త్రిగారు, వారి అర్ధాంగి, వారి మిత్రుడు శ్రీ తిరుమల రామచంద్రగారు.

ఆంధ్రదేశములోని గుణజ్ఞ పాఠకుల సంగతి వేరుగా చెప్పనక్కరలేదు-అత్యంతామోదములో భక్తిశ్రద్ధలతో ఈ ముద్రణకు స్వాగతము పలికింది పాఠకలోకము.

గూడూరు పోస్టాఫీసులో పనిచేస్తున్న ఎన్. వి. రమణగారు నెలకు రూ. 116 చొప్పున నాకు పంపినారు. వారు ఫోనుచేసి భారతముద్రణనుగూర్చి పరామర్శించినప్పుడంతా నాకంఠము రుద్ధమయిపోతుంది. ఎన్. వి. రమణగారి

వంటి సహృదయ పాఠకులెందరో ఎదురుచూసిన 'భీష్మపర్వాన్ని' జస్టిస్. కోదండ రామయ్యగారు శ్రీ పొత్తూరు వెంకటేశ్వరరావుగారు వారి ట్రస్టుద్వారా లోకానికి అందజేస్తున్నారు. వారికి నావందనాలు.

ఇంతకు పూర్వము ముద్రితములయిన గ్రంథ విశేషము లిట్లున్నవి.

మహాభారతము (యథామూలము-గద్యానువాదము)

అనువాదకులు-కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు

| | | పుటలు 1/8 డెమ్మి | | |
|---|---|---|---|---|
| 1. | ఆది పర్వము- | 800 | వెల రూ. | 100-00 |
| 2. | సభా ,, | 350 | ,, | 50-00 |
| 3. | అరణ్య ,, | దాదాపు 800 | ,, | 100-00 |
| 4. | విరాట ,, | 200 | ,, | 35-00 |
| 5. | ఉద్యోగ ,, | 800 | ,, | 99-00 |

ప్రాప్తి స్థానము - డా॥ కె. కమల

16, తుల్జాగూడా,

మోజంజాహీమార్కెట్,

హైదరాబాదు-500001.

శ్రీః

శ్రీమద్రామాయణ మహాభారతాలు అతి ప్రాచీనమైన భారతీయ సంస్కృతిని సుస్థిరంగా నిలిపిన రెండు గ్రంథాలు. మన సంస్కృతి వీటిసాహాయ్యంతో ఎన్నో సహస్రాబ్దాలకు పూర్వమే ఆసియాఖండాన్నంతనీ చుట్టివచ్చింది. ఈనాడు కూడా సకల ప్రపంచ సంచారం చేస్తూన్నది. వీటితో పోల్చదగిన గ్రంథాలు ప్రపంచవాఙ్మయంలో ఎక్కడాలేవని నిఃసంశయంగా చెప్పవచ్చు. వీటికి 'ఎపిక్స్' అని పేరుపెట్టి నామమాత్రసాధృశ్యంచేత, వీటిని, పాశ్చాత్యభాషల్లోఉన్న అత్యల్ప ప్రమాణాలు వాఙ్మయచరిత్రమాత్రసంరక్షితాలూఅయిన 'ఎపిక్స్'తో పోల్చడం వీటిని అవమానించడమే అవుతుంది. తాము ఆవిర్భవించిన రోజు మొదలు నేటి వరకు కొన్ని కోట్ల భారతీయుల, భారతీయేతరుల ఆలోచనాసరణిని ప్రభావితం చేస్తూ వస్తూన్న ఈ గ్రంథాలెక్కడ? కథా ప్రసంగ మాత్ర స్మరణీయాలైన అవి ఎక్కడ! "పర్వతే పరమాణౌచ పదార్థత్వం ప్రతిష్ఠితమ్"-పర్వతమూ పదార్థమే పరమాణువూ పదార్థమే!

గ్రంథ విస్తరంలోను విషయ వైవిధ్యంలోను, వస్తుగౌరవంలోను మహాభారతానికి సాటి మహాభారతమే."మహత్త్వాద్భారవత్త్వాచ్చ మహాభారతముచ్యతే" అని ప్రారంభికాధ్యాయాలలో వ్యాసుడే చెప్పినమాట అక్షరాలనిజం ఈ మహాభారతం పాశ్చాత్యుల గొప్ప ఎపిక్స్ అని చెప్పబడే ఇలియడ్, ఒడెస్సీలు కలిపితే ఎంతగ్రంథం అవుతుందో దానికంటె ఎనిమిదిరెట్లుపెద్దది. విద్యావంతులందరూ ఏదో ఒక ఆకారంలో-మూలంగాని, ఇతరభాషానువాదాలుగాని, దీనిని కొంచెమో అధికమో చదువుతోనే ఉన్నారు. ప్రవచనాలద్వారా, హరికథాదులద్వారా, సినిమా-దూరదర్శనాదులద్వారా దీని నిరంతర ప్రచారం ఈనాడుకూడా జరుగుతూనే ఉంది. అయితే ఖండితరూపాలలోను, సంక్షిప్త రూపాలలోను కాక మూలభారతాన్ని యథాతథంగా చదవడంలో ఉన్న ఆనందం అనన్యాదృశమైనది.

సంస్కృతభారతం చదవడం విద్యావంతులైనాకూడా అందరికీ శక్యం కాదు. అందుకు మంచి సంస్కృతభాషా పరిచయం ఉండాలి. అందుచేతనే ఇలాంటి ప్రాచీన గ్రంథాలకు భారతదేశంలోని ప్రాంతీయ భాషలలోకి, ఆంగ్ల

భాషాదులలోనికి అనువాదాలు బయలుదేరాయి. తెలుగులో మనకు కవిత్రయ భారతం, తదితరుల రచనలూకూడఉన్నా అవి మూల భారతం యథాతథంగా చదివిన సంతృప్తిని ఇవ్వజాలవనే విషయం సర్వవిదితమే. ఆ మహాకవులు అనుస రించిన అను వచన ఫక్కికవేరు. నిజానికి పద్య-ప్రాచీన గద్యరూపాలలో ఉన్న ఆ అనువాదాల్ని అర్థంచేసికొనగలిగిన తెలుగువారుకూడ ఈనాడు చాల అరుదు గానే కనబడుతున్నారు. పాఠశాలా-కళాశాలా-విశ్వవిద్యాలయాలలో పాఠ్య క్రమాన్ని నిర్ణయించే విద్యాధ్యక్షుల సౌలభ్యాకాంక్ష, వారి నిర్ణయాలకు ఆమోద ముద్రవేసే ప్రభుత్వం వారికి ప్రాచ్యభాషల విషయంలోఉన్న ఔదా సీన్యం-వీటి ధర్మమా అని మన తెలుగుకు ఒక నిర్ణీతస్థాయియే కనబడని ఈ రోజులలో ఆ భారత-భాగవత-రామాయణాదులవైపు దృష్టి సారించే వారెవ రుంటారు? మహాభారత విషయాలను సంపూర్ణంగా తెలుసుకోవాలనే వారి అభి లాషను సఫలం చేయడానికై శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు చేసిన ప్రశంస నీయ ప్రయత్నానికి ఫలంగా ఆవిర్భవించినదే ఈ "శ్రీ వేదవ్యాస మహా భారతము"

శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు భారత ప్రఖ్యాతిగాంచిన సంస్కృత పండితులు వీరి ఆంధ్రభాషా పాండిత్యం తెలుగువారందరికీ సుపరిచితమైనది. వీరు బిల్హణ రచితమైన విక్రమాంక దేవచరితాన్ని సంస్కృతంనుంచి తెలుగు లోనికి అనువదించి 'ఆంధ్రబిల్హణ'అను బిరుదాన్ని గ్రహించిన మహాకవులు. ఆంధ్రప్రదేశ ప్రభుత్వంలో ప్రాచ్య విద్యాశాఖోపనిదేశకులుగాఉండి చాలాకాలం సంస్కృతాంధ్రాది ప్రాచ్యభాషలకు ప్రభుత్వంద్వారా ప్రోత్సాహం లభింపజేసిన కార్యనిర్వహణదక్షులు. వీరు మహాభారతాన్ని ఒక్క శ్లోకంకూడ విడవకుండా యథాతథంగా తమ అనువాదంద్వారా తెలుగువారికి అందించడం ఆంధ్రుల అదృష్టమే అని చెప్పాలి. అయితే వీరు ఆది-సభా-వన-విరాట-ఉద్యోగ-భీష్మ-ద్రోణ పర్వాలుమాత్రమే పూర్తిచేయ గలిగారు.

గద్యరూపంలోఉన్న ఈ అనువాదం యథామూలంగా అన్యూనానతిరిక్తంగా పఠనయోగ్యమైన చక్కనిశైలిలో, పుస్తకంతెరిచి చదవడం ప్రారంభిస్తే "ఇంకా ఇంకా"అంటూ ముందుకు నడిపించేరీతిలో సాగింది. ఈ అనువాదం చదివినవారు మహాభారతం మూలం చదివినట్లే అని చెప్పడంలో సందేహంలేదు.

ఈ సంపుటంలో భీష్మపర్వం ప్రచురించబడుచున్నది. మొత్తం మహా

భారతానికే తరలం (హారమధ్యమణి) వంటిది శ్రీమద్భగవద్గీత అది ఈ పర్వాన్ని అలంకరిస్తున్నది. పద్దెనిమిది అధ్యాయాల (700 శ్లోకాల) ఈ భగవద్గీత వ్యాఖ్యానించడానికి సంస్కృతభాషా ప్రవేశం మాత్రంచాలదు. వేదాంత శాస్త్రపరిచయం కూడా ఉండాలి. శ్రీశాస్త్రిగారికున్న సాంప్రదాయిక వేదాంతశాస్త్ర పాండిత్యం దీని వ్యాఖ్యానంలో కనబడుతుంది. భగవద్గీతతప్ప ఇతర గ్రంథానికి కేవలం అనువాదంమాత్రమే ఇవ్వబడింది. మూల శ్లోకాలు ఇవ్వలేదు. భగవద్గీతకున్న లోకాదరాన్ని వైశిష్ట్యాన్ని దృష్టిలోపెట్టుకొని శ్రీశాస్త్రిగారు అనువాదంతోపాటు మూలంకూడ ఇచ్చారు. భగవద్గీతలోని కనీసం సగంశ్లోకాలు అధ్యాత్మిక విషయ ప్రతిపాదకాలవడంచేత కేవలానువాదం సరిపోదు. శ్రీశాస్త్రిగారు అలాంటి ప్రతి శ్లోకానికీ శాంకర భాష్యానుసారంగా స్పష్టమైన టీకకూడా వ్రాశారు. ఇది సర్వధా ప్రామాణికమైన టీక ఇది ఏవిధంగా స్పష్టార్థ ప్రతిపాదక మో—

"కర్మణోహ్యపిబోద్ధవ్యం బోద్ధవ్యంచ వికర్మణః
అకర్మణశ్చబోద్ధవ్యం గహనాకర్మణోగతిః"
"కర్మణ్యకర్మ యః పశ్యేదకర్మణి చ కర్మయః
సబుద్ధిమాన్మనుష్యేషు స యుక్తఃకృత్స్నకర్మకృత్"
(భ.గీ 4.17,18)

"క్షేత్రజ్ఞం చాపిమాం విద్ధి సర్వక్షేత్రేషు భారత,
క్షేత్రక్షేత్రజ్ఞయోర్ జ్ఞానం యత్తద్ జ్ఞానం మతంమమ"
(భ.గీ.13.2)

మొదలైన శ్లోకాల వ్యాఖ్యచూస్తే తెలుస్తుంది. మహాభారతానికి ఇలాంటి ఆంధ్రానువాదం అందించిన శ్రీలక్ష్మణశాస్త్రిగారు సకలాంధ్ర ధన్యవాదార్హులు.

ఈ సందర్భంలో మన ఇతిహాస పురాణాదులనుగూర్చిన ఒక్క విషయం గుర్తుచేయడం అవసరం. వీటిని రచించనవాళ్లు రాగద్వేషాదులకు అతీతులు, లోకోపకారైకపరాయణులు అయిన మహాపురుషులు. ఆనాడు వారికి ఆ చరిత్రలు ఏవిధంగా అందాయో వాటిని యథాతథంగా వ్రాసి మన కందించిన సత్యవ్రతులు. ఈనాడు మనం చూచే జీవిత చరిత్రలు, స్వీయచరిత్రలు మొదలైన వాటిలోకూడ కొన్ని సత్యాపలాపాలు, అసత్యప్రలాపాలు, స్వభావావిష్కరణలు కనబడతాయి.

ఆ రచయితల దృష్టి అదికాదు. విషయాన్ని ఉన్న దున్నట్లుగా, తెలిసినది తెలిసినట్లుగా రాబోయే తరాలవాళ్లకి అందిచడమే వాళ్లధ్యేయం. అందుచేతనే వాళ్లు ఈ కాలంలోనేకాదు. ఆ కాలంలోకూడా విడ్డూరంగా కనబడే వ్యాసోత్పత్తి, నియోగాదులు, పాండవజననం, వాళ్ల వివాహాదులు, ద్రోణాచార్యాదుల శిష్య పక్షపాతం, భీష్మాదులు కౌరవపక్షాన యుద్ధంచేయడం కర్ణాదుల చరిత్ర మొదలైనవి జంకూ గొంకూ లేకుండ వ్రాశారు. "ఆనాటి సాంఘిక పరిస్థితులవి" అనేది ఒక్కటే దీనికి సమాధానం. అలా కాకుండా-అవన్నీ ఈనాడు మన ఎదురుగా జరుగుతున్నాయన్నట్లు వాటినే పట్టుకొని వాదోపవాదాలుచేస్తూ ఆ గ్రంథాలలోఉన్న ఎన్నో మంచి విషయాలవైపు దృష్టికూడ ప్రసరింప చేయని వాళ్లు తెలుసుకొనవలసిన అనేకమైన ఉత్తమ విషయాలను, మహోన్నతాదర్శాలను, అద్భుత సాంస్కృతిక సంపదనూ కోల్పోతున్నారేమో అనిపిస్తుంది. ప్రతి ఒక్కరూ తమ వైయక్తికాలూ, సమసామయికాలూ అయిన అభిప్రాయాలు తాత్కాలికంగానైనా దూరంగాఉంచి కొన్ని గ్రంథాలనైనా పూర్తిగా వైషయిక దృష్టితో (Objectiue view) చదువుతే గొప్పలాభం పొంద కలుగుతారు. అలా కాకపోతే ఇతరులను మోసగించడమేకాదు తాముకూడ మోసపోతారు.

ప్రస్తుతం ఉస్మానియా విశ్వవిద్యాలయంలో సంస్కృత శాఖాధ్యక్షురాలుగా ఉన్న ప్రొఫెసర్ కమల తన తండ్రి శ్రీలక్ష్మణశాస్త్రిగారి విషయంలో ఉన్న అపారమైన భక్తితో మాతృ ప్రేరణాపష్టంభంతో, భ్రాతను మోదన హస్తావలంబంతో, తండ్రిగారు రచించిన మహాభారతం ప్రచురించడానికి నడుము కట్టుకొని అసాధారణమైన సంస్కృతి సేవచేస్తున్నారు. ఇదొకవిధమైన పితౄణ విముక్తి. అందుకు ఆమె అభినందనీయురాలు. అయితే కర్ణపర్వాది భారత భాగానువాదంకూడా తాను చేపట్టిన ఆమె తన తండ్రిగారు ప్రారంభించిన సత్కార్యాన్ని కొనసాగించి తద్వారా ఋషి ఋణవిముక్తికూడ పొందగలరని ఆశిస్తున్నాను.

పుల్లెల శ్రీరామచంద్రుడు

హైదరాబాదు
3-5-1999

श्रुत्वा त्विदमुपाख्यानं श्राव्यमन्यन्न रोचते —

The Maha bharata is an old source of Indian philosophy and religion. The ethos of India is based on customs. traditions and sanctions laid down in the Mahabharata. The ways of life, the glorified virtues, legends-Akhyanas and Upakhyanas-are explored and expanded in later Sanskrit books and also in books written in Indian Languages. The Mahabharata, is the mythification of Vedic Culture and norms, It is not only a historical Mahakavya, but has cherished all the sensibilities of Indian mind. Stalwarts like Vyasa, Bhisma and Krisna have been a perennial source of inspiration to the Indian talent, for thousands of years rlght from the Vedas. There is an unbroken continuity in Indian thought, which is marked by philosophical, spiritual and even empirical pursuits. The immortality of self, which is discussed in the Mahabharata in general and in Bh agavadgita in particular () is the echo of Vedie thoughts. For example, about the Atman, here is a famous RK;

अकामो धीरो अमृतः स्वयम्भू रसेन तृप्तो न कुतश्चनोनः ।
तमेव विद्वान्न बिभाय मृत्योरात्मानं धीरमजरं युवानम् ॥

(X 8.44)

The Mahabharata has tried to instil the spirit of the Vedas, on the background fo a family feud, which led to mass distruction. But even during the fighting periods many sages like Vyasa, Dhaumya and Vasistha have coolheadedly tendered pieces of advice for the good of the humanity acclaiming the worth of the mercy coming from the unknown source, which may be either God or destiny - they have emphasized human endeavour and the inculcating certain dharmas through abiding by certain code of conduct, in terms of sacrifice, charity, penance and discharging one's own duties.

Apart from the physical ailments and mental worries

the fear of unfriendly attacks and wicked manoeuvres looms large over the thinking persons of the Mahabharata times. Many dialogues in Santiparvam and many discourses like Viduraniti in the Udyogparvam deal with certain problems arising out of good an bad propensities of human beings Thus the Mahabharata has become a source book of ancient Indian principles of Ethics Morality and Dharma (to use a comprehensive term) and there is an undercurrent of spiritual aspiration throughout that helps man achieve perfection or final liberation. All the eighteen parvans of the Mahabharata with all their narratives and discourses, planning and strategies, ultimately aim at the achievement of four human goals.

Among the eighteen Parvams of the Mahabharata, Bhishmaparvam as the title suggests contains the heroic deed and the fighting skill of Bhisma. This Bhismaparvam is the sixth one in the big epic and consists of one hundred and seventeen Adhyayas. Adhyayas 1-24 deal with the geographical details, chapters 25-42 constitute the famous Bhagavadgita. The chapter 43 to chapter 122. exhaustively deal with the battle, which took place on ten consecutive days, in which various warriors fought bitterly with the rival heroes, using different types of weapons. For example, some of the names are mentioned in the following verses.

ऋष्टिभिश्च धनुभिश्च विमलैश्च परश्वधैः ।।

जटाभिर्मुसलैश्चैव भिण्डिपालैः सतोमरैः ।
आयसैः परिघैश्चैव निस्त्रिंशैर्विमलैः शितैः । भीष्म. (44 13.14)

An expression शरैश्च नतपर्वभिः has occurred many times, indicating the use of some special types of arrows.

The fight was going on in a forceful way.

आविष्टा इव युध्यन्ते पाण्डवाः कुरुभिः सह ।। भीष्म. 44.3

...On the battlefield, the dead bodies, smeared in blood

were lying everywhere. There is a gory description of the battlefield which is compared to a river.

(भीष्म 99-33-36)

Bhisma was very diffident about the success of the Kauravas from the very beginning. At one time, Duryodhana took Bhisma to task for that.

(भीष्म 54-32)

Even Sanjaya, had a word of praise for the Pandavas.

न ते युद्धान्निवर्तन्ते धर्मोपेता महाबला· ।
श्रिया परमया युक्ता यतो धर्मस्ततो जयः ॥
तेनावध्या रणे पार्था जययुक्ताश्च पार्थिव ॥ भीष्म. 65-18

Bhisma actually pleaded with Duryodhana to adopt a policy of conciliation. In the last Adhyayas, it is told that Bhisma himself suggested the most effective way of killing him He was made to fall down pushing forth Sikhandi in the battlefield.

Though the parvam as a whole deals with the violent warfare, the Bhagavadgita portion is skilfully inserted in the beginning. The general didactic attitude in the later stages of the development of the Mahabharata is crystalized in the Bhagavadgita. A number of editions has been published till now, with translations in various languages. The translations of Belvalkar, Radhakrishnan, Ryber and A. B. Roy are currently available. Among those who have given their own expositions about the inner meaning of the Gita Lokamanya Tilak, Aurobindo, Mahatma Gandhi, Vinoba Bhave, S. K. Maitra (Sadhana of the Bhagavadgita) T. M. P Mahadevan, V. G Bhat, K M.Munshi,&D.S. Sharma are famous. Till today many articles are appearing in journals and books are published in regional languages of India (the latest being "Gitadarsana, by Arjunwadkar in Marathi, published by Anandashrama, Pune, 1995). The moot question is-how to attain bliss, while living in this world and while being engaged in worldly activities?

It is not possible even to give a summary of the important articles and books in the preface. It may be briefly mentioned as Arjunwadkar has pointed out that G,ta is a sort of Vartika of the Upanishads. The tenets of Upanisadic philosophy were briefly mentioned, but that which was not directly mentioned, was expanded. In the Bhagavadgita every chapter is like an Upanishad. The word 'Yoga' is often used in the Gita, which means to the final beatitude. The spiri t of 'Yoga' has permeated the entire text. It has undergone some connotative changes, but the spirit of Yoga is never attenuated. The word 'Yoga' is for example, used in various senses, indicating its comprehensive meaning.

1) Performance of actions (II-39)

2) Even tempered activism (II-53)

3) Performing actions, without aspiring for any fruit(II,48)

4) Skilful way of doing duties, by whieh one is not affected by sins (II-50,57)

5) Means for attaining the absolute (normally used in this sense in the colophons of the Gita chapters)

6) The word is attached to other words, when they together express the sense of means for salvation. For example .

कर्मयोग: (V-2): भक्तियोग: (XIII-26) संन्यासयोग: (IX-28), ध्यानयोग: (VI. 12,23) ज्ञानयोग: (V. 24)

7) Capacity, strength eg.

ऐश्वर्ययोग:

There are many expositions of the Bhagavadgita and all aim at investigating into the main principle or doctrine of the Gita. This is not the place to deal with (or even to mention them). Krisna's immediate intention in giving a discourse to Arjuna was to demonstrate to Arjuna the futility of his supposedly compassion- laden inactivity, which was in

other words, the inaction against a blatant aggression. He exhorted Arjuna to perform his duty as a Ksatriya, with a sense of equanimity. The 'Samatva', which is also termed as Yoga is equanimity in temper, attitude or in prescribed duties.

As Swamy Ranganathananda has pointed out, "under the hegemony of his comprehensive philosophy of life Sri Krisna synthesizes all the aspects of spiritual life - aspects broadly known in India as the paths of work, devotion, meditation and knowledge ...If once we shift our centre of individuality to the 'Saksi' we go beyond all the dualities and struggles of life and attain universality of outlook and breadth of heart"

This is the famous Karmayoga of the Gita. The Gita has given strong base of Bhakti or willing submission to God. Devotion is said to be of nine types in the Bhagavata Puranam They are the pathways to God and indicate the methods to be adopted by a devotee to attain the final beatitude. The Gita however, has not mentioned the nine ways explicitly. But it will be seen by careful reading, that they are suggested implicitly in some verses, for example श्रवण in XIV. 25; कीर्तन IX. 149; अर्चन VII. 7, 16 वन्दन IX. 14; स्मरण VIII. 14; दास्य IX. 18; सख्य IV. 3; आत्मनिवेदनम् IX. 27; प्रपत्ति भाव VII. 14; XVIII. 61-62, 66

One should perform one's duties with equanimity, without hankering for ulterior fruit and with a sense of dedicating every action to God, having no attachment for worldly pleasures. This Yoga enables the Yogin to inculcate certain virtues making him a Sthitaprajna, Gunatita or an ideal Bhakta. The Devotion to God is the summum bonum. Devotion is comprised of the necessary wishes enumerated at various places. The Yogin thus is made competent enough to partake in the divine functions of promoting Dharma and expiating out the A dharma.

This is in brief, the main purpose of the Gita which

was 'Sung' by the lord in the din and bustle of the battle-field, so vividly described in the Bhismaparvan.

The Bhagavatgita is a part and parcel of the Bhisma-parvan of the Mahabharata. Though a large part of the parvan contains rigid, wearisome discription of the battle-field, some events like the approaching of Yudhisthira and Duryodhana to Bhisma and the Sikhandi Episode, are described with natural grace. Respected Laxmana Sastryji has translated the Parvan, with equal grace. His writings have the loftiness of Sanskrit diction and natural grace of Telugu style. His translation does not mean the retention of original Sanskrit words with Telugu terminations. He has lent the Telugu grace to the original. Generally, the translation of the classics, try to imitate the conventions, regarding form, style or expression. Though Laksmana Sastriji is steeped in tradition, his language has got the flare and flavour of modernity. He has got a perfect mastery over both the languages. As a scholar who loved and promoted Sanskrit, throughout his life, he has undertaken the translation of the Mahabharata with a missionary zeal. Laksmana Sastriji was a source of inspiration to may a student and friends, With a view to enlightening the people regarding the cultural and ethical values cherished by the Mahabharata, he undertook the rather strenuous task of rendering the magnum opus of Vyasa into Telugu.

While rendering the Bhagavadgita portion he has taken particular care to note the connotations of various terms. The same terms are used in different senses in different chapters of the Gita. This is a problem faced by many translators, including Lokamanya Tilak, Radhakrisnan, Gita Press Scholars and many others. Words like Paryapta, Avyakta, Udapana, Karmachodana, Karmasamgraha, Gunasamkhyana, Jnana, Dharma, prakriti, Buddhi, Yajna, Samkhya are popular and difficult as well. They convey various meanings in various contexts. The very word 'Yoga' is often confusing. But, Sastriji has meticulously pointed out the various shades of meaning in various contexts. Though it is good to retain the

meaning Once assigned throughout, it is not always possible to do so, especially while rendering the texts like Gita. The translator has to be careful at every occurrence of the word. Fortunately the present translator has been so,

Another difficulty which often confronts a translator, is the paraphrase or recasting the original text. While doing so, one has to take care of the fact that the rendering should not be ambiguous or harsh to a person, who is reading the translation part only. Somewhat clumsiness has crept in the translations of Belawalkar and Arjunawadkar. In the present translation, clumsiness is avoided to the best possible extent. In the Gita, there are many verses, where a translator (and the reader too) is likely to fumble.

Here are a few examples which may be called Kutas-slokas :

| | | |
|---|---|---|
| अथ चैनं नित्यजातम् | — | II. 26 |
| यावानर्थ उदपाने | — | II. 46 |
| श्रुतिविप्रतिपन्ना ते | — | II. 53 |
| या निशा सर्वभूतानाम् | — | II. 69 |
| कर्मणैव हि संसिद्धिम् | — | III. 20 |
| कर्मण्यकर्म यः पश्येद् | — | IV. 18 |
| मत्स्थानि सर्वभूतानि | — | IX. 4-6 |
| ब्रह्मसूत्रपदैश्चैव | — | XIII. 4 |
| ऊर्ध्वमूलमधश्शाखम् | — | XV. 1-2 |

The commentators unfortunately are very uncertain. The Scholars who render such lines should be well-versed in the 'Prasthanatrayi' and the later commentaries also. The meanings assigned by Laksmana Sastriji seem to be worthy of recommending for a wider acceptance.

I consider myself fortunate to write a few lines of appreciation of a voluminous work done by Sastriji. It is

difficult to gauge his scholarship by persons like me. Moreover, I take this as an opportunity to pay my respectful tributes to that great scholar. I am also glad to note that his worthy daughter Prof. K. Kamala garu has undertaken a strenuous task of going through the text and getting it printed. Iam sure that all the parvans, translated by Laksmana Sastriji will be published soon. She deserves fulsome compliments from all.

The appearance of this work, associated with a respected scholar of Andhra Pradesh, is a happy augury to forthcoming endeavours in the field of Mahabharata Scholarship.

ఆచార్య ప్రమోద్ గణేశ్ లాలేగారు ఇంగ్లీషులో వ్రాసిన

# ఉపోద్ఘాతము

(తెలుగు అనువాదము)

మహాభారతము భారతీయ తత్త్వమును ధార్మిక ప్రవృత్తులను వివరించే బృహద్గ్రంథము. అతి ప్రాచీనము భారతీయనీతి, మర్యాదలు, ఆచార వ్యవహారములు పరంపరా సిద్ధసంప్రదాయములు, ధర్మదండనలు మున్నగునవన్నీ భారతంలో ఉన్నాయి. జీవనవిధానము, గుణప్రశంసలు, కథలు-గాథలు అఖ్యానకాలు ఉపాఖ్యానాలు-ఇవన్నీకూడా తరువాతి సంస్కృత సాహిత్యములో, భారతీయ భాషలలో విలసిల్లిన సాహిత్యాలలో ఈ మూల స్రోతస్సునుండే గ్రహించబడి, వివరించబడ్డాయి, విస్తరించబడ్డాయి.

మహాభారతమంటే వైదిక సంస్కృతికి ధర్మ నిబంధనలకు పౌరాణిక రూపకల్పనమే-(దీన్నే ప్రాచీనులు ఉపబృంహణము అని అన్నారు. 'ఇతిహాస పురాణాభ్యాంవేదం సముపబృంహయేత్'అనేది ఆర్యోక్తి).

ఇది కేవలము ఇతిహాసమేకాదు. భారతీయుల చింతనము, భావ సౌకుమార్యము అంతా ఇందులోనిబిడితమైనది.

వేల సంవత్సరములనుండి భారతీయ ప్రతిభకు స్ఫూర్తిదాయకులు. మహామహులైన వేదవ్యాసుడు, భీష్ముడు, శ్రీకృష్ణుడు. వీరి ప్రభావము జీవనదీ స్రోతమువలె భారతీయాత్మలను ప్లావితముచేసినది. ('కృష్ణంనారాయణంవందే కృష్ణం వందే వ్రజప్రియం, కృష్ణం ద్వైపాయనం వందే కృష్ణం వందే పృథాసుతమ్'అనే శ్లోకము కృష్ణుడయిన నారాయణమూర్తి, శ్రీకృష్ణుడు, కృష్ణద్వైపాయనుడు, కృష్ణుడయిన పార్థునివర్ణించి, కృష్ణశబ్దము నలుగురి ఎడల వర్తిస్తుందని చెప్పుతున్నది).

వేదకాలమునుండి భారతీయ తత్త్వములో చింతనములో అవిచ్ఛిన్నమై

సంప్రదాయము నేటిదాకా కొనసాగుతూనే ఉన్నది తత్త్వము, ఆధ్యాత్మికవాదము, అనుభవ సిద్ధములైన సత్యములను క్రియాయోగములో ఉపయోగించుట మున్నగు మార్గములన్నీ ఈ సంప్రదాయములోని భాగాలే.

మహాభారతములో ఎల్లఎడల ఆత్మ అవినాశి, అమరముఅని సాధారణంగా నిరూపితమయింది. ఈ విషయాన్నే భగవద్గీత విశేషరూపంలో నిరూపించింది. (భగ-IIఅ.) ఈ ఆత్మతత్త్వ నిరూపణము వేదధ్వనికి ప్రతిధ్వనియే, ఒక ప్రసిద్ధ మైన ఋక్కును ఉదాహరించవచ్చును.

'అకామో ధీరో అమృతః స్వయంభూ రసేన తృప్తో నకుతశ్చనోనః,
తమేవ విద్వాన్న బిభాయ మృత్యోరాత్మానం ధీరమజరం
యువానమ్'. (X 8-44)

పెద్దఎత్తున జనక్షయానికి ప్రాణనష్టానికి దారితీసిన ఒక కుటుంబ కలహాన్ని వర్ణించే కథలో వైదిక సంస్కృతి, తత్త్వము అంతా ఓత ప్రోతముగా అల్లబడినది. ఇంత భీకర సంగ్రామము జరుగుతున్నప్పుడుగూడా వ్యాసుడు, ధౌమ్యుడు, వసిష్ఠుడు మున్నగు వారంతా శాంత చిత్తములలో మానవ కళ్యాణమునకై ఉపదేశాలుచేస్తూనే ఉన్నారు.

ఒక అదృశ్య అజ్ఞాతశక్తి దయతో లోకాలను కాపాడడానికి యత్నము చేస్తూనే ఉన్నదని, ఆశక్తికి నమోవాకములని వారు ఎలుగెత్తి చాటినారు. ఈ శక్తిని భగవంతుడన్నా అనవచ్చును. భాగ్యమని అన్నా అనవచ్చును అందుకే ఈ దైవాన్ని నమ్ముతూ మానవుడు నిరంతరము యత్నశీలుడై ఉండవలెనని, ఈ వ్యవసాయములో ధర్మము, నీతినియమాలకు మానవుడు బద్ధుడై ఉండవలెనని వీరు ప్రబోధించినారు. యజ్ఞయాగాదులు, తపస్సు, విధినిర్వహణములో చిత్తశుద్ధి ఈ నియమపాలనములోని అంగాలే.

శరీరాన్ని మనస్సును బాధించే ఆధి-వ్యాధులతోబాటు అహితులవల్ల కలిగే అపకారము, దుష్టశక్తులు పన్నే పన్నాగములు, వ్యూహములు ప్రతివ్యూహములు ఎత్తుకు పైఎత్తువేయడం మహాభారత కాలమునాటి సత్త్వసంపన్నులైన సజ్జనుల హృదయాలను కలచివేసింది. శాంతి పర్వములోని సంవాదాలు, ఉద్యోగ పర్వములో విదుర నీతివంటి ఉపదేశాలు, మానవునిలోని మంచి చెడు

మధ్య ఏర్పడే ఊగిసలాటాన్ని పురస్కరించుకొని ఏర్పడే సమస్యలను విపులీక రిస్తున్నాయి. అందుకే మహాభారతము ప్రాచీన భారతీయ నీతి నియమాలను, ఇంకా వ్యాపకమైన ధర్మాన్ని బోధించే ఆధారగ్రంథమయింది. ఈ ధర్మ ప్రబోధాలన్నింటిలోనూ ఆధ్యాత్మిక చింతనము, జిజ్ఞాస, తపన, అంతర్వాహినిగా ఉన్నది. ఈ తపన తపస్సు, జిజ్ఞాసలే, మానవునకు సంపూర్ణత్వాన్ని కల్పించి, అంతములో ముక్తి మార్గదర్శకము లవుతాయి.

మహాభారతములోని పదునెనిమిది పర్వాలలోనూ, వివిధ సంవాదములు, ప్రణాళికలు, వ్యూహములు, ఎత్తులు పైఎత్తులు, శత్రుదుర్భేద్యములైన కీలక స్థానకల్పనలు, ఇవన్నీకూడా చివరకు పురుషార్థ చతుష్టయ సాధకములే అవుతున్నాయి. భీష్మపర్వము భీష్మపితామహుని శౌర్య పరాక్రమాలను సాహస కృత్యాలను యుద్ధనైపుణ్యాన్ని వర్ణించే భాగము. ఇది భారతాఖ్యానములో ఆరవ పర్వము. ఇందు 122 అధ్యాయాలున్నాయి. 1-24 అధ్యాయాలు భూగోళ వర్ణ ణాత్మకములు, 25-42 అధ్యాయములలో జగత్ప్రసిద్ధమైన భగవద్గీతఉన్నది. శేషగ్రంథము యుద్ధ వర్ణనాత్మకము - పదిరోజులు నిరంతరముగా జరిగిన యుద్ధాన్ని సమగ్రంగా వర్ణించే భాగమిది.

ఆయా వీరులు శత్రువీలతో క్రోధావిష్టులై చేసిన భయంకర సంగ్రామము, అందులో వారు ప్రయోగించిన ఆయుధముల వివరణము భీష్మపర్వములో ఉన్నవి. ఒక ఉదాహరణము.

'ఋష్టిభిశ్చ ధనుర్భిశ్చ, విమలైశ్చ పరశ్వధైః.
గదాభిర్మ సలైశ్చైవ భిందిపాలైః సతోమరైః,
ఆయసైః పరిఘైశ్చైవ నిస్త్రింశైర్విమలైః సితైః'.

(భీష్మ 46, 13-14)

'శరైశ్చ నత పర్వభిః'వంటి ప్రయోగాలు అనేక స్థలాలలో కనిపిస్తాయి- విశిష్టములైన బాణాలను తయారుచేసి ఉంటారని తెలుస్తున్నది.

యుద్ధావేశము మిన్నుముట్టినది. పట్టుదల ఇరువైపుల పెరిగింది.
'ఆవిష్టా ఇవ యుధ్యంతే పాండవా కురుభిః సహ'.

భీష్మ 46-3)

రక్తసిక్తములయిన శవకళేబరములు, తెగిపడిన శిరస్సులు, మొండెములు, అంతటా యుద్ధభూమిలో పడిఉన్నవి. రక్తాక్తమయిన ఈ యుద్ధభూమిలో రక్తపు ఏరులు పారుతూఉండగా ఆ యుద్ధభూమి నదివలె కనిపించింది.

(భీష్మ 103.33.36)

భీష్మునకు కౌరవుల విజయముపై నమ్మకము సన్నగిల్లినది. మొదటినుండే వారు జయిస్తారన్న నమ్మక మావీరునికిలేదు. ఒకసారి దుర్యోధనుడే భీష్ముని ఆ విషయములో మందలించి తప్పుపట్టేవరకువచ్చింది-భీష్మ పితామహుని నమ్మి తాను యుద్ధవ్యూహములను రచించితినని, ఆ వీరుడంత చిత్తశుద్ధిలో తన బల పరాక్రమములను ప్రదర్శించి పాండవులను తరిమికొట్టడంలేదని, ఈ విషయము ముందు తెలిస్తే తాను మరొకవిధంగా కర్ణుని సహాయంతో యుద్ధ ప్రణాళికను రచించేవాడినని దుర్యోధనుడు పలుకుతాడు. (భీష్మ 58-33.40)

సంజయుడుకూడా పాండవులనే ప్రశంసిస్తాడు.

'న తే యుద్ధాన్నివర్తంతే ధర్మోపేతా మహాబలాః,
శ్రియా పరమయా యుక్తా యతో ధర్మస్తతోజయః,
తేనావధ్యా రణే పార్థా జయయుక్తాశ్చ పార్థివ'. (భీష్మ-65-18)

ధర్మోపేతులై ధర్మయుద్ధాన్ని సాగిస్తున్న ఆ మహాబలురైన పాండవులు యుద్ధమునుండి తిరిగి పోవడమనేది జరగదు - ఎక్కడ ధర్మమో అక్కడే విజయము. ఓ రాజా! జయశీలురైన పార్థులు రణమునందవధ్యులు.

భీష్ముడు పాండవులతో సంధి చేసికొనమని దుర్యోధనుని ప్రబోధించెను. (భీష్మ-65-36)

చివరి అధ్యాయములో భీష్ముడే స్వయంగా తనను చంపే ఉపాయాన్ని పాండవులకు తెలియజరచినట్లున్నది. శిఖండిని ముందుకు త్రోసి భీష్ముడు పడి పోయేటట్లు చేయడం జరిగింది.

ఇంతటి భీకర సంగ్రామాన్ని వర్ణించే ఈ సందర్భంలో చాలా మెలకులో 'భగవద్గీత' భీష్మ పర్వములో ఇమడ్చబడింది.

మహాభారతాఖ్యానములో రానురాను నీతిబోధాత్మక ఘట్టాలు పెరిగి

భగవద్గీతలో అవి పరిణత రూపాన్ని సంతరించుకున్నాయి.

భగవద్గీత వివిధభాషల లోనికి అనువదించబడి వివిధ రకములైన పాఠము లలో ప్రకాశితమయినది.

పండిత ప్రకాండులయిన బెల్ వాల్కర్, రాధాకృష్ణ పండితుడు, రైబర్, ఎ.బి రాయ్ మున్నగువారి అనువాదములు ఇప్పుడుపలబ్ధములుగా నున్నవి.

భగవద్గీత అంతరార్థమును వివరించి గ్రంథప్రచురణ చేసినవారిలో లోకమాన్య బాలగంగాధర్ తిలక్, మహాత్మాగాంధీ, వినోబాభావే, ఎస్.కె. మైత్ర (Sadhana of the Bhagavadgita) టి.ఎమ్.పి. మహాదేవన్, వి. జి. భట్, కె. యమ్. మున్షీ, డి.ఎస్. శర్మ ప్రసిద్ధులు.

నేటివరకు భారతీయ భాషలలోని వివిధ పత్రికలలో గ్రంథాలలో భగవద్గీతను గూర్చిన వ్యాసాలు అసంఖ్యాకములుగా ప్రకాశితములవుతూనే ఉన్నవి. ఇటీవల 1995 సంవత్సరములో పూనా, ఆనందాశ్రమ సీరీసునుండి ప్రకాశితమయిన మరాఠీ "గీతాదర్శనము" ఒకటి. సంపాదకుడు శ్రీ అర్జున్ వాడేకర్ గారు.

దైనందిన జీవితములో సమస్యలను పరిష్కరించుకుంటూ మోక్షమును దుఃఖ సంవలితము కానట్టి ఆనందమును పొందుట ఎట్లు అన్నదే మౌలికమయిన ప్రశ్న.

ఈ ఉపోద్ఘాతములో ఈ విషయానికి సంబంధించి ప్రచురణ నొందిన వ్యాసముల సారాంశము చెప్పుట గూడా దుస్సాధ్యము. సంక్షేపముగా నొకటి రెండు విషయములను ముచ్చటింపవచ్చును. అర్జునువాడేకర్ చెప్పినట్లు భగవద్గీత ఉపనిషత్తులకు 'వార్తిక' రూపము. ఉపనిషత్తులలోని ఉపదేశ సూత్రములు గీతలో సంక్షేపముగా చెప్పబడినది. అక్కడ ప్రత్యక్షముగా చెప్పని విషయ మిక్కడ విస్తరించబడినది. భగవద్గీతలోని ప్రతి అధ్యాయము ఒక ఉపనిషత్తుగా పరిగణింపనగును. గీతలో యోగశబ్దము పలుమార్లు ప్రయోగించబడినది. యోగ మనగా మోక్షము. పరమార్థ ప్రాప్తి సాధనము అని చెప్పవచ్చును. ఈ యోగ శబ్ద ప్రాముఖ్యము గీతాశాస్త్రము నందంతటను వ్యాప్తమైయున్నది. అక్కడక్కడ

ఈ యోగ శబ్దము యొక్క అర్థచ్ఛాయలు కొద్దిగా మార్పుచెందుతూ ఉన్నవి గాని 'యోగ' తత్త్వము ఎక్కడ కూడా పలుచబడలేదు.

యోగ శబ్దము సర్వవ్యాపకము—ఈ క్రింది అర్థములలో ఆ శబ్దము ప్రయుక్త మయినది.

1. కర్మచేయుట
'ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు' (2-39)

2. సమత్వబుద్ధితో కర్మచేయుట.
'సమత్వం యోగ ఉచ్యతే' (2-48)
'శ్రుతి విప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా
సమాధావచలా బుద్ధిస్తదా యోగ మవాప్స్యసి' (2-53)

3. కర్మఫలము నాశించక కర్మలు చేయుట
'యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ' (2-48)

4. నైపుణ్యముతో కర్మలను నిర్వహించుట. అట్టి కర్మలవలన ఎట్టి పాపమును అంటుకొనకుండుట.
'యోగః కర్మ సుకౌశలమ్' (2-50)
'సుఖ దుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి' (2-38)

5. 'మోక్షసాధనము'- యోగము మోక్ష సాధనమని భగవద్గీత ఆ అధ్యాయయముల చివరలో చెప్పబడినది.
'శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ శాస్త్రే'

6. యోగశబ్దము 'కర్మయోగ (5-1) ధ్యానయోగ (6-12, 23) భక్తియోగ (13-21), సన్న్యాసయోగ (9-28), జ్ఞానయోగ (5-24) ములుగా సమస్తరూపములో మోక్షసాధనముగా పేర్కొనబడినది.

7. శక్తి-బలము ఉదా ఐశ్వర్యయోగ (11)
భగవద్గీతకు వచ్చిన వ్యాఖ్యానలన్నీ గీతార్థాన్ని ఇందలి నిగూఢతత్త్వాన్ని ఆవిష్కరించడానికి ఉపయోగించాలి. ఇక్కడ వానిచర్చగాని కనీసము వానిని పేరుపేరున చెప్పడం కానీ, కాని పని.

ప్రధానమైన అంశము అర్జునుడు కృపతో భూతదయతో యుద్ధవిరమణము నందుద్యుక్తుడుకాగా నిరర్థకమని అట్టి అకర్మణ్యత పరమార్థదాయకము కాదని శ్రీకృష్ణుడతనిని శిష్యునిగా స్వీకరించి బోధించుటకై కార్యక్షేత్రములో ప్రవేశించుటయే. అర్జునుని అకర్మణ్యతవలన బుద్ధిపూర్వకముగా కౌరవులు చేసిన ద్రోహము అధర్మము, ఆక్రమణమునకు తలఒగ్గినట్లే యగును. అందుకే శ్రీకృష్ణుడు క్షత్రియునిగా సమత్వముతో స్వధర్మపాలనము గావింపుమని అర్జునుని ప్రబోధించెను.

సమత్వమను యోగము ప్రవర్తనలో, దర్శనములో, విధి నిర్వహణము లోనూ సాధించవలసిన మానసిక స్థితి.

భారతీయ దర్శనములో నాలుగు మార్గములు. పరమార్థ సాధకములుగా బోధింపబడినవి. అవి కర్మ, భక్తి, ధ్యానము, జ్ఞానము, అనునవి. శ్రీకృష్ణుడు ఈ నాలుగు మార్గముల సమన్వయమును చేసి భగవద్గీతను నిఖిలార్థసాధకముగా రూపొందించెనని శ్రీ రామకృష్ణ మఠాచార్యుడు రంగనాథానందస్వామి చెప్పెను. స్వామీజీ ఇంకనూ ఆణిముత్యము వంటి గీతార్థసారము నిట్లు విశదపరచెను; 'మానవుడు తన వ్యక్తిగత చైతన్యమను కేంద్రమును విడిచిపేసి 'సాక్షి' చైతన్యమును ఆశ్రయించి కర్మలను చేసినచో ద్వంద్వాతీతుడు కాగలడు. అప్పుడతని సంఘర్షణములు సమాప్తములగును, ఆతని హృదయము విశాలమై విశ్వజనీనమగును.

ఇదే భగవద్గీత ఉపదేశించిన సుప్రసిద్ధ కర్మయోగము. గీత భక్తిప్రపత్తులకు ఎంతో ప్రాముఖ్యము నిచ్చినది. భాగవత పురాణము భక్తి నవ విధములని తెలిపినది. ఈ నవవిధమార్గములే శ్రవణము, కీర్తనము, వందనము, అర్చనము స్మరణము, దాస్యము, సఖ్యము. ఆత్మనివేదనము. ప్రపత్తి. భగవంతునిచేరుకొని శాశ్వతానందనమును పొందుటకు భక్తుడవలంబించవలసిన మార్గములే యివి. గీతలో ఈ తొమ్మిది మార్గములను వాచ్యము చేయలేదు కాని గీతాచార్యుడు వానిని పాఠకునికి గ్రహింపచేసినట్లు వాచ్యముగా కాక వ్యంగ్యమర్యాదలవల వానిని తెలిపినట్లు అర్థమగుచున్నది.

1. శ్రవణము :

'అన్యేత్వేవ మజానంతః శ్రుత్వాన్యేభ్య ఉపాసతే
తేఽపి చాతితరంత్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః' (13-25).

2. కీర్తనము :

'సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః' (9-14)

3. అర్చనము :

'చతుర్విధా భజంతే మాం జనాః సుకృతినోఽర్జున
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ' (7-16)

4. వందనము :

'సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః
నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే' (9-14)

5. స్మరణము :

'అనన్యచేతాః సతతం యో మాం స్మరతి నిత్యశః
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః' (8-14)

6. దాస్యము ,

'గతిర్భర్తా ప్రభుః సాక్షీ నివాసః శరణం సుహృత్
ప్రభవః ప్రలయః స్థానం నిధానం బీజమవ్యయమ్ (9-18)

7. సఖ్యము :

'భక్తోఽసి మే సఖాచేతి రహస్యం హ్యేత దుత్తమమ్'

8. ఆత్మనివేదనము :

'యత్ కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్
యత్ తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్' (9-27)

9. ప్రపత్తిభావము :

ఎ) మామేవ యే ప్రపద్యంతే మాయామతితరంతి తే (7-14)

బి) 'తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత
తత్ప్రసాదాత్ పరాంశాంతిం స్థానం ప్రాప్స్యసిశాశ్వతమ్' (18-62)

సి) 'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మూశుచః (18-26)

సమత్వబుద్ధితో విధి నిర్వహణము చేయుట, బాహ్యములైన అకర్షకము

లైన ఫలముల నాశించకుండుట, ప్రతి పనిని భగవదర్పితము చేయుట, ఐహిక సుఖలిప్స లేకుండుట, ఈ యోగముచేత యోగి కొన్ని గుణముల నలవరచుకొని స్థిత ప్రజ్ఞ కలవాడు, గుణాతీతుడు గొప్పభక్తుడు కాగలడు. భగవద్భక్తియే సారభూతార్థము. ఎన్నియో స్థానములలో నిర్వహింపబడిన గుణసముదాయమే 'భక్తి' యగుచున్నది.

ఆ విధముగా యోగి, ధర్మపాలనము, రక్షణము అనే పవిత్ర కర్తవ్యముతో భాగస్వామ్యము నొందును. అధర్మ నాశనమునకు గూడా అతడు సహాయపడును.

గీతోపదేశ లక్ష్యము సంగ్రహము గానిదియే. ఇంతటి నిగూఢార్థమును సంకుల సమరభూమిలో నానావిధ నినాదముల మధ్య చిందరవందరగా నున్న మానసిక స్థితి నుండి అర్జునుని ఉద్ధరించుటకు భగవంతుడు గానం చేసెను. ఈ వృత్తాంతమంతా భీష్మపర్వములో విశదమయినది.

భీష్మ పర్వములోని పెద్ద భాగమంతా భీకర సంగ్రామాన్ని వర్ణించారు. యుధిష్ఠిరుడు, దుర్యోధనుడు భీష్ముని వద్దకు పోవడం, శిఖండి వృత్తాంతము వంటివి సహజ సుందరముగా వర్ణింపబడినవి. మాన్యులు శ్రీ లక్ష్మణశాస్త్రిగారు ఈ ఘట్టములను అంతే సుందరముగా అనువదించినారు. వారి రచనలో సంస్కృతములోని ఉదాత్తత, తెలుగు భాషలోని స్వాభావిక సౌందర్యము యుద్ధ వర్ణనములో ఓజోగుణము, అచ్చతెనుగు శబ్దాలసోయగము ఉన్నాయి. సంస్కృత శబ్దాలకు తెలుగు డు, ము, వు లు ప్రత్యయాలను చేర్చి చేసిన అనువాదము కాదిది. తెలుగు పలుకుబడులలోని సౌకుమార్యాన్ని సంస్కృతముతో వీరు జత పరచినారు. మహాభారతము వంటి ప్రామాణిక గ్రంథముల అనువాదములో కథా కథనరూపము, శైలి, వివరణములు ఈ మూడింటికి సంబంధించిన సంప్రదాయమును అనువాదకుడు అలవరచుకుంటాడు. శ్రీయుత లక్ష్మణశాస్త్రిగారు ప్రాచీన సంప్రదాయబద్ధులైయుండి గూడా వారిరచనలో ఆధునికత్వ సుగంధము గుబాళించుచున్నది. తెలుగు సంస్కృత భాషలు రెండింటిలోనూ వారిది అందె వేసినచేయి. జీవితమంతా సంస్కృత భాషాభివృద్ధికి ప్రచారమునకై కృషిచేసిన లక్ష్మణశాస్త్రి గారు. మహాభారతానువాదాన్ని సేవాభావంతో, చిత్తశుద్ధితో, నిష్ఠతో ఉత్సాహముతో చేసినారు. వారు ఎందరో విద్యార్థులను పండితులను

సంస్కృతాంధ్రముల అధ్యయమునకై ప్రోత్సహించి వారియెడల కల్పవృక్షమైనారు. మహాభారతములోని నీతి, సంస్కృతిని ప్రజలలో ప్రచారము చేయడానికే వారు శ్రమసాధ్యమైన భారతానువాదాన్ని చేబట్టినారు. ఈ భారతము బృహద్గ్రంథము కదా!

భగవద్గీతానువాదాన్ని చేసేటప్పుడు ఒక్కొక్క పదము ఆయా సందార్భాలలో యే యే అర్థాలలో ప్రయుక్తమయినదీ అనే విషయాన్ని సమగ్రంగా పరిశీలించి తదనుగుణంగా వీరు రచన చేసినారు. లోకమాన్య తిలక్, రాధాకృష్ణన్ గోరఖ్‌పూర్‌లోని గీతా ప్రెస్‌లో కృషి చేసిన పండితులు. గీతానువాదములో ఈ సమస్యను ఎదుర్కొన్నవారే

'పర్యాప్తము', 'అవ్యక్తము', 'ఉదపానము', 'కర్మచోదనము', 'కర్మ సంగ్రహము', 'గుణసంఖ్యానము', 'జ్ఞానము', 'ధర్మము', 'ప్రకృతి'. బుద్ధి', 'యజ్ఞము', 'సాంఖ్యము' వంటి పదములు లోక ప్రసిద్ధములయి నప్పటికిని వాని తాత్పర్యమును వివరించడం కష్టము. ఈ పదాలన్నీ ఒక్కొక్క సందర్భములో ఒక్కొక్క అర్థాన్ని చెప్పడానికీ ప్రయోగించబడినాయి. 'యోగము' అనే ఒక్క పదమే తికమకలు పెడుతుంది. శ్రీ శాస్త్రిగారు ఆయా సందర్భాలలో అర్థచ్ఛాయల నతి జాగరూకతతో విడగొట్టి అర్థ వైశద్యమును కలిగించినారు. ఒక పదానికి ఒకచోటకల్పించిన అర్థమును గ్రంథమంతటా గ్రహించడము యుక్తమే కాని అది ఎల్లఎడల సాధ్యము కావడంలేదు. భగవద్గీతవంటి గ్రంథముల అనువాదములో అది అసలే సాధ్యము కాదు. అనువాదకుడు ప్రతిచోట ప్రతిపద ప్రయోగమును జాగ్రత్తగాపరీక్షించవలసి ఉంటుంది. శ్రీ శాస్త్రి గారావిషయంలో ఎంతో మెలకువతో ప్రవర్తించినారు.

మూల పాఠాన్వయములో పదముల కూర్పులో అనువాదకుడు కొన్ని సమస్యలను ఎదుర్కొనవలసి వస్తుంది.

అనువాదాన్ని మాత్రమే చదివి ఆకళింపుచేసుకోవలసిన పాఠకుడిని, అనువాదకుడు దృష్టిలో ఉంచుకోవలసివస్తుంది. పదముల అనువాదములను ఒక వరుసలో పేర్చవలసి వచ్చినప్పుడు క్లిష్టత దూరాన్వయము లేకుండా వీలైతే ఒక వాక్యాన్ని రెండు మూడు వాక్యాలుగా విరిచి అనువాదము చేయవలసి

వస్తుంది. (ఏ భాషలోనైనా కర్మణి ప్రయోగము అగతికము. అది ఎంత విస్తృతంగా ఉన్నా కర్తరి ప్రయోగములోని సహజత్వము దానికి రాదు.

బెల్వల్కర్, అర్జుడ్వాడ్కర్ల అనువాదములలో ఈ అన్వయక్లేశము పొడచూపింది.

వాక్య నిర్మాణములో శ్రీ శాస్త్రిగారు సాధించిన సౌష్ఠవము వల్ల ఆ శ్రమ గజిబిజి తొలగిపోయినవి.

భగవద్గీతలో అనువాదకుడిని, పాఠకుడిని కూడా పల్టీలు కొట్టించే కూట శ్లోకాలు చాలా ఉన్నాయి. అందుకు కొన్ని ఉదాహరణలను చూడవచ్చును.

1. అథ చైనం నిత్యజాతమ్ 2.26
2. 'యావానర్థ ఉదపానే' 2.46
3. 'శ్రుతి విప్రతిపన్నా తే' 2-53
4. 'యా నిశా సర్వభూతానాం' 2-69
5. 'కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః' 3-20
6. 'కర్మణ్య కర్మ యః పశ్యేత్' 4.18
7. 'మత్స్థాని సర్వభూతాని' 9-4, 6
8. బ్రహ్మసూత్ర పదైశ్చైవ 8-4
9. 'ఊర్ధ్వమూలమధః శాఖం' 15-1, 2

పై శ్లోకములకు వ్యాఖ్యానాలు కొంత అస్పష్టత, క్లిష్టతతో కూడుకొని ఉన్నాయి. ప్రస్థానత్రయ 'జ్ఞానముతోబాటు తరువాత కాలంలో వచ్చిన వ్యాఖ్యా పరిచయమున్నవారే పై శ్లోక వివరణలకు న్యాయము చేకూర్చగలరు.

శ్రీ లక్ష్మణశాస్త్రి గారు చేసిన వివరణలను ఇక్కడ ఒక్కొక్క దానిని చూడవచ్చును. వీరు శ్లోకార్థ వివరణమునకు పూర్వము అవసరమున్న ప్రతి స్థానములోనూ పూర్వాపర శ్లోకసంబంధమును అవతారికా రూపములో వ్రాయుట విశేషము.

1. 'అథ చైవం నిత్యజాతమ్' 2-26 (తెలుగు అనువాదము పు-112)

సంబంధము: పై మూడు శ్లోకములలో భగవంతుడు ఆత్మ జనన రహి

3)

తము, అవినాశి కాబట్టి ఆత్మకొరకు దుఃఖించుట అనుచితమని నిరూపించి ఇప్పుడు ఆత్మకు ఔపచారికముగా జనన మరణములను అంగీకరించినప్పటికిని దానికొరకు శోకించుట అనుచితమని నిరూపించుచున్నాడు.

అక్కడే అధో జ్ఞాపికలో జన్మించుట మరణించుట మొదలగు భావము లన్నియు అజ్ఞానమువలన గలిగినవే యగును అని తెలుపబడినది.

2. 'యువానర్థ ఉదపానే' 2-46 (అనువాదము-పుట-120)

అర్థము: 'అర్జునా! అంతటనిండి పరిపూర్ణముగా నున్న జలాశయము లభించినతరువాత చిన్న జలాశయమునందు మనుష్యునకు ఎంత ప్రయోజనము ఉండునో పరబ్రహ్మమును తత్త్వపూర్వకముగా తెలిసికొను బ్రాహ్మణునకు వేదములన్నింటియందున్ను అంతటి ప్రయోజనమే ఉండును'.

ఈ భావమే అధోజ్ఞాపికలో విశదపరచబడినది.

3. 'శ్రుతి విప్రతి పన్నా తే' 2-53 (అనువాదము పుట-125)

అధో జ్ఞాపిక: 'ఈ లోకమునందలి పరలోకము నందలి భోగైశ్వర్యాదులకు వాని ప్రాప్తికిన్ని అవశ్యకములైన సాధనములకు సంబంధించి అనేక విధములైన మాటలు వినుటచేత బుద్ధిలో విక్షేపము (చంచలత్వము) కలుగును. కాబట్టి ఆ బుద్ధి ఒక నిశ్చయమునందు స్థిరముగా నిలువజాలదు. ఇప్పుడే ఆ బుద్ధి ఒక విషయము మంచిదని తెలిసికొని కొంతకాలము తరువాతనే మరియొక విషయము మంచిదని అంగీకరింపసాగును. ఇటువంటి విక్షిప్తము అనిశ్చయాత్మకము నైన బుద్ధి యొక్కడ 'శ్రుతి విప్రతి పన్నా' అను శబ్దముచేత చెప్పబడెను. ఇది బుద్ధియొక్క విక్షేప దోషమని భావించవలెను.

4. 'యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ
యస్యాం జాగ్రతి భూతాని సా నిశాపశ్యతో మునేః' (2-69)

వివరణ: 'అర్జునా! సమస్త ప్రాణులకు ఏది రాత్రివంటిదో దానియందు నిత్యజ్ఞాన స్వరూపుడు, పరమానంద ప్రాప్తియందు స్థిత ప్రజ్ఞుడైన యోగి మేల్కొనియుండును. నశించు స్వభావముగల ఏ సాంసారిక సుఖమును పొందుటకు సమస్త ప్రాణులు మేలుకొనియుండునో అది పరమాత్మ తత్త్వమును తెలిసికొను మునికి రాత్రితో సమానము.

5. 'కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః' (3-20)

వివరణ: అధోజ్ఞాపిక:- జనక మహారాజువలె మమకారము-ఆసక్తి-కామన విడిచి కేవలము పరమాత్మ ప్రాప్తికొరకే కర్మలు చేయు అశ్వపతి-ఇక్ష్వాకు-ప్రహ్లాద-అంబరీషాదులు ఎందరు గడిచిపోయిరో ఆ ప్రధాన పురుషులందరు ఆసక్తి రహిత కర్మలచేతనే పరమ సిద్ధిని పొందిరి........ ...ఇది పరమాత్మను పొందుటకు స్వతంత్రము. నిశ్చితము నైన మార్గము. (అట్లే 3-20 శ్లోకము తరువాత గీతాచార్యుడు కర్మను గూర్చి తెలిపిన ఇరువది ఉపదేశములు సంగ్రహింప బడినవి).

6. 'కర్మణ్యకర్మ యః పశ్యేదకర్మణి చ కర్మ యః' (4-18)

అధోజ్ఞాపిక: 'యజ్ఞ-దాన-తపస్సులు వర్ణాశ్రమానుసారముగా జీవితమును గడుపుట శరీర నిర్వాహణమునకు శాస్త్రవిహితకర్మలు వీటన్నిటియందు ఆసక్తి ఫలేచ్ఛ, మమకారం, అహంకారము విడుచుటచేత ఆ కర్మలు ఈ లోకమునందు పరలోకమునందున్ను, సుఖదుఃఖాది ఫలములను అనుభవించుటకు పునర్జన్మకున్ను హేతువులు కావు. తద్విపరీతముగానవి మనుష్యుడు పూర్వము చేసిన శుభాశుభకర్మలను నశింపజేసి అతనిని సంసారబంధములనుండి విముక్తుని చేయునవిగా నగును. ఈ రహస్యము తెలిసికొనుటయే కర్మయందు అకర్మ చూచుట యగును.

లోకములో మనస్సు వాక్కు, శరీరము వీనియొక్క పనులు విడుచుటకు పేరే 'అకర్మ' యని ప్రసిద్ధమై యున్నది. త్యాగరూపమైన ఈ 'అకర్మ'గూడ ఆసక్తి, ఫలేచ్ఛ, మమకారము, అహంకారము వీనితో చేసినప్పుడా కర్మ పునర్జన్మకు హేతువగును. ఇంతమాత్రమే కాదు. కర్తవ్య కర్మలను పరిహసించి చులకనగా చూచుటచేత కాని లేక దంభాచారముచేత అవే చేయబడినప్పుడు గాని మీ కర్మ వికర్మ (పాప) రూపములో మారిపోవును- ఈ రహస్యమును తెలిసికొనుటయే అకర్మయందు కర్మను దర్శించుట యగును.

7. 'మత్స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః'

వివరణ: 'సమస్త భూత ప్రాణులును నాలోనున్న సంకల్పము యొక్క ఆధారముపై నిలిచియున్నవి. కాని వాస్తవముగా నేను వానిలో లేను.

అధోజ్ఞాపిక: ఇక్కడ 'సమస్త భూతప్రాణులు' అనుమాటచేత సమస్త శరీర-ఇంద్రియ-మనస్-బుద్ధి'యనునవి వీనిని ఆకర్షించు ప్రాపంచిక విషయములలో వీని నివాస స్థానములతో సహితములైన సమస్త ప్రాణులు చెప్పబడినవి. ...........అన్నింటి స్థితి భగవంతుని ఆధీనమేయని తెలియవలెను. భూతములు భగవంతునందున్నవని చెప్పబడెను.

మేఘములలో ఆకాశమువలె భగవంతుడు ప్రపంచములో అణువణువునను వ్యాపించియున్నప్పటికి భగవంతుడా ప్రపంచము కంటే పూర్తిగా అతీతుడై యున్నాడు............... మేఘములు నశించిన తరువాత ఆకాశమువలె భగవంతుడున్నవాడున్నట్లుగనే యథాస్థితిలో నుండును. ప్రపంచనాశముతో భగవంతుని నాశము కాదు. ఎక్కడైతే ఈ జగత్తు లేశము గూడా నుండదో అక్కడగూడా భగవంతుడు తన మహిమలోనుండనే యున్నాడు.

8. 'బ్రహ్మసూత్ర పదైశ్చైవ' (8-4)

వివరణ-అధోజ్ఞాపిక: 'బ్రహ్మసూత్రపదైః' అను పదమునకు వేదాంత శాస్త్రములో 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' ఇత్యాది పదములని యర్థము.... .... శ్రుతి, స్మృత్యాదులలో వర్ణింపబడిన క్షేత్ర-క్షేత్రజ్ఞుల తత్త్వము బ్రహ్మసూత్ర పదములచేత యుక్తితో తెలుపబడినది.

9. 'ఊర్ధ్వమూల మధః శాఖమ్' (15-1, 2)

వివరణ: మూల శబ్దమునకు కారణమని యర్థము. సంసారవృక్షోత్పత్తి, విస్తారము ఆది పురుషుడగు నారాయణుని నుండియే యైనది. ఆది పురుషుడు అన్నింటి కన్న పైన నిత్యధామమునందు నివసించును గాబట్టి ఊర్ధ్వ నామముతో చెప్పబడును. సంసారవృక్షము మాయావియైన సర్వశక్తిసంపన్నుడగు పరమేశ్వరుని నుండియే ఉత్పన్నమైనది కనుక దీనిని ఊర్ధ్వమూలము అనగా మీదివైపు వేళ్లు గలదియని చెప్పెదరు.

ఇంతటి ఉద్గ్రంథమునకు ప్రశంసాత్మకమయిన తొలి పలుకులు నాలుగు వ్రాసే సదవకాశము నాకు కలిగినందులకు ధన్యుడను. నాబోటివారు ఆ పండిత ప్రకాండుని మేధాశక్తిని గ్రహించడం శాస్త్రిగారిని అందుకోవడం కొంచము కష్టమే-అట్టి విద్వాంసునికి శ్రద్ధాంజలిని ఘటించడానికి ఇదిఒక గొప్ప అవకాశం అని నేను భావిస్తున్నాను.

ఆయన పుత్రిక ఆచార్య కె. కమలగారు అనువాద గ్రంథాన్ని ఆమూలాగ్రము చదివి ముద్రింపజేయుటమనే శ్రమసాధ్యమయిన పనిని చేబట్టి నారు. శ్రీ శాస్త్రిగారు అనువదించిన పద్యములన్నీ కూడా ప్రకాశింపబడతాయని ఆశిస్తున్నాను.

ఆంధ్రదేశములో సుప్రతిష్ఠిత పండితుడు మాన్యుడయిన లక్ష్మణశాస్త్రిగారి అంతటి వారి పేరుతో ముడిపెట్టుకున్న ఈ మహాభారతానువాదము ఆంధ్రులలో ఆంధ్రదేశంలో నలుదిశల మహాభారతముపై శ్రద్ధాసక్తులను మహాభారత గ్రంథ పరిశీలనమును అధ్యయన క్షేత్రములో ఇనుమడింప జేయగలదని ఆశిస్తున్నాము.

ఇట్లు

ఆచార్య ప్రమోద్ గణేశ్ లాల్యే

పూనా.

# గీతాంజలి

ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం

"దాక్షిణ్యం స్వజనే, దయా పరిజనే, శాఠ్యం సదా దుర్జనే
ప్రీతిః సాధుజనే, నయో నృపజనే, విద్వజ్జనే చార్జవమ్
శౌర్యం శత్రుజనే, క్షమా గురుజనే, కాన్తాజనే ధృష్టతా
యే చైవం పురుషాః కలాసు కుశలాస్తేష్వేవ లోకస్థితిః"

అనే భర్తృహరి సుభాషితం (నీతిశతకంలోని విద్వజ్జనపద్ధతి-18 శ్లో) తలపులో నిలిచినప్పుడెల్లా విద్వన్మూర్తి శిరోమణి కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు స్మృతిపథంలో సాక్షాత్కరిస్తారు. తనవారు కనపడితే చాలు నోరారా పలకరించి, మనసారా మాట్లాడి మంచిచెడ్డలు విచారించి వారి శ్రేయస్సును అనవరతం అభిలషించే అభిమానం శాస్త్రిగారికి పుట్టుకతోవచ్చిన సహజ సద్గుణం. తనను నమ్ముకొన్నవా రెవరైనాసరే వారి యోగక్షేమాలు తనవిగా భావించి వారిని ఆదుకోవటంలో వెనుకాముందూ చూడకుండా స్నేహదయామృతాన్ని వర్షించే ఆర్ద్రగుణం శాస్త్రిగారి అమూల్య సద్గుణం. అధర్మాన్ని ఎదుర్కొని అదుపుచేయటంలో అచంచల ధైర్యాన్ని ప్రదర్శించే ధార్మిక తేజం వారి సహజ జీవలక్షణం. తన చుట్టూ ఉన్న సమాజంలో మంచివారిని గుర్తించటం, వారినిగురించి నిర్వ్యాజంగా తెలుసుకోవటం, వారికి తాను ఏవిధంగా సహాయపడగలదో నిర్ణయించుకోవటం, యథాశక్తి వారికి మేలుకలిగేలా తోడ్పడటం, ఏకొంచెమైనా మేలు జరిగితే తాను సంతోషించటం ఎదుటివారికి ప్రీతి కలిగించటం లక్ష్మణశాస్త్రిగారికి పుట్టుకతోవచ్చిన పుణ్య సంస్కారం. శాస్త్రిగారికి ప్రభుత్వంతో వ్యవహరించేటప్పుడు ప్రదర్శింపదగిన నీతి చాతుర్యతతో అలవడిన సహజ వివేకం. ప్రభుత్వమనే కామధేనువు పండితులనే లేగలకోసం స్నేహ క్షీరధారలు వర్షించేటట్లు శాస్త్రిగారు తమ లోకజ్ఞతను ప్రదర్శించేవారు. ప్రభుత్వానికి పండితలోకానికి నడుమ లక్ష్మణశాస్త్రిగారు సదా సేతువుగా నిల్చే

వారు. ప్రభుత్వపదవులలో శాస్త్రిగారిలాగా ఉన్నతస్థాయికిచేరిన ప్రాచ్య విద్వాంసుడు మన రాష్ట్రంలో అప్పటిలో లేరంటే ఆశ్చర్యపడవలసినఅంశం. వారి ప్రభుత్వాశ్రయం పండితసన్మానరూపంగా ప్రతిఫలాన్ని అందించేది. ఆగుణంలో ఇప్పటికీ ఎందరో వారివలన పొందిన ఉపకారాలను కృతజ్ఞతతో చెప్పుకొంటూ ఉండటం గమనిస్తాం. 'విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్'అనే న్యాయాన్ని అనుసరించి పండితుల పరిశ్రమను గుర్తించి వారిపట్ల సముచిత సదాచారాలను నడిపే సభ్య సంస్కృతికి లక్ష్మణశాస్త్రిగారు ఒక ఒరవడిగా తమ జీవితాన్ని దిద్ది తీర్చుకొన్నారు. పండితు లెవ్వరువచ్చినా శాస్త్రిగారి ఇంట షడ్రసోపేతమైన భోజనంలోపాటు అతిథిసత్కారాలు అందుకోవలసిందే. చిన్నవారైనా, పెద్దవారైనా శాస్త్రిగారు పెద్ద మనసుతో గౌరవించేవారు. మాటలతోనే ఎదుటివారి పాండిత్య ప్రతిభలను అంచెనావేసేవారు. విద్వత్తుకు తగిన గుర్తింపునిచ్చేవారు, సభలు, సమావేశాలు, చర్చలు, సన్మానాలుజరిపి సరస్వతిపూజ చేసేవారు. నిజమైన పండితునికి నిండైన గౌరవంలభిస్తే తనకు ఆ గౌరవం కలిగినట్లు ఆత్మీయంగా ఆనందపడేవారు శాస్త్రిగారు. పండిత మిత్రులంటే ప్రాణాలిచ్చే ప్రేమ వారిది. అందుకు ఎన్నో ఉదాహరణలివ్వవచ్చు. శాస్త్రిగారికీ తిరుమల రామచంద్రగారికీ ఉన్న సాహితీస్నేహం అందుకు అక్షరోదాహరణం లక్ష్మణశాస్త్రిగారూ, రామచంద్రగారూ కలసి తిరుగుతూఉంటే సంస్కృత ప్రాకృత భాషా సాహిత్య మర్యాదలు కలిసి ఆ మూర్తులతో అభినవావతారాలెత్తి వర్తిస్తున్నాయేమో అనిపించేది. విద్వాంసులకు ప్రాణమిత్రుడు లక్ష్మణశాస్త్రిగారని సమకాలీన పండితలోకంలో ప్రశస్తి బాగా ఉండేది.

విద్వాంసులముందు వినయంతో మోకరిల్లేశాస్త్రిగారు ఏదైనా వాదంవస్తే శత్రుభయంకరుడుగా విజృంభించేవారు. పాండిత్యంలోనేకాదు వ్యవహారంలో కూడా పట్టింపువస్తే గట్టిగానే పట్టిచూచేవారు. లొంగిపోవటం ఆయన స్వభావం కాదు. అట్లని పగవారిని సాధించటం, హింసించటం ఆయన నైజంకాదు. శాస్త్రిగారిది ధర్మాగ్రహం. 'ధర్మోరక్షతిరక్షితః' అన్నది ఆయన విశ్వాసం. ధర్మవిరోధియే ఆయనకు శత్రువు. ధర్మానికి హితుడైతే ఆయనకూ స్నేహితుడే. అధర్మంగా ఆయనతో పోరుకు దిగితే ధర్మవిజయం సాధించేవరకూ తిరుగులేని పోరాటమే. రంగంలోకిదిగితే ఇదం బ్రాహ్మం, ఇదం, క్షాత్రం అన్నది ఆయన ప్రవృత్తి. శత్రువులతో పోరాడటం శాస్త్రిగారి కెంతతెలుసో వారు తమ తప్పు

తెలుసుకొంటే వెంటనే వారిని క్షమించి తమ స్నేహహస్తాన్ని అందించే ఔదార్యం కూడా వారి కంతగాతెలుసు, ఆయన కోపం మిత్రులకు ఒక సత్యాగ్రహంలా అనిపించేది.

శాస్త్రిగారు మూర్తీభవించిన గార్హస్థ్యధర్మం. అతిథిసత్కారం, పండిత సన్మానం, స్నేహానురాగం వారింట నిత్యగృహస్థధర్మంలో భాగం. వారిసతీమణి 'అన్నపూర్ణకు ఉద్దియా' అమలచరిత. శాస్త్రిగారి దాంపత్య జీవితం మచ్చలేనిది. ఆ పుణ్యదంపతులు సమాజంలో పార్వతీపరమేశ్వరుల్లాగా గౌరవింపబడేవారు. అందువల్లనే వారు పుణ్యాత్ములుగా ప్రసిద్ధులు. ఒక సంప్రదాయానికి ఆదర్శ మూర్తులుగా ప్రాతఃస్మరణీయులు!

నాకు శాస్త్రిగారు దాదాపు 1952 నుండి తెలుసు. అప్పుడు నిజాం కళా శాలలో ఇంటర్ చదువుతుండేవాడిని. సంస్కృతాంధ్రాలు నా అభిమానాంశాలు, చదువు సంధ్యలలోనే కాకుండా సాంస్కృతిక కార్యకలాపాలలో విద్యార్థి సంఘ కార్యక్రమాలలో నేను చురుకుగా పాల్గొంటుండేవాణ్ణి. ఆరోజుల్లో సాహితీ సభ లలో రక్తికట్టించేటట్లు ఉపన్యసింపగల ప్రాచ్యభాషాసాహిత్య పండితులలో బ్రహ్మశ్రీ లక్ష్మణశాస్త్రిగారు అగ్రగణ్యులుగా ఉండేవారు వారు విద్యార్థులను ప్రేమతో పలకరించి, దగ్గరికితీసేవారు, హాస్యవల్లరులతో ఆకట్టుకొనేవారు, ఛలోక్తులతో ఆకర్షించేవారు, చతురవచోనైపుణ్యంతో సన్నిహితులయ్యేవారు. అంతపండితుడైనా భక్తసులభుడుగా అందుబాటులోఉండేవారు, సభకు వారువస్తే అది రక్తికట్టటంఖాయం. కలకాలం చెప్పుకోగలిగిన కొన్ని విషయాలు సభ్యులకు అందటంఖాయం. అందువలన విద్యార్థులకు ఆయన వివేకకల్పవృక్షంలా అని పించేవారు. అభిమానులపట్ల ఆయన అమృతవర్షంలాంటివారు. వెనుక ఎందరు ఎన్నిమాటలన్నా, అనుకొన్నా ఆయన నిర్భయంగా, నిస్సంకోచంగా తమ అభి ప్రాయాలను ప్రకటించేవారు. 'సత్యం మనోహారిచ దుర్లభం వచః'అని అంటారు కాని సత్యాన్ని మనోహారిగాచెప్పటం శాస్త్రిగారి సహజ వాగ్విలాసం.

నేను ఎం. ఏ. ఫైనల్‌లో ఉన్నప్పుడు ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు విద్యార్థిసంఘానికి అధ్యక్షుడినిగా ఎన్నికయ్యాను. ఆచార్య అవధానిగారి దర్శకత్వంలో మొదటిసారి భువనవిజయాన్ని హైదరాబాదులో ప్రదర్శింప జేయాలని సంకల్పించాను. 1957లో మహిళా కళాశాల (కోఠి) లోని దర్బారు

హాలులో ఆ కార్యక్రమాన్ని జరిపించాం. ఆ సాహితీరూపకంలో శ్రీ లక్ష్మణశాస్త్రి గారు శ్రీకృష్ణదేవరాయల పాత్రను పోషించారు. నేను తిమ్మరుసుగా వ్యవహరించాను. ఆచార్య లక్ష్మీరంజనం, ఆచార్య దివాకర్ల, డా॥ దాశరథివంటి దిగ్దంతులు అష్టదిగ్గజాలుగా పాల్గొన్నారు. సభ రక్తికట్టింది. విశేషమేమంటే రాయలవేషం వేసికొని శ్రీ లక్ష్మణశాస్త్రిగారు ఆసభలో అగ్రాసనంలో కూర్చున్నారు. అంటే- పండితలోకంలో రాయలుగా గౌరవించబడిన పండిత రాయలు శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారన్నమాట!

శాస్త్రిగారికి ఒంటరిగా ఉండటం ఇష్టముండేదికాదు. ఎప్పుడూ తనచుట్టూ దర్బారుగా మిత్రులుండవలసిందే. సజ్జన గోష్ఠులు సాగుతూఉండవలసిందే. అవి సత్సంగాలుగా సమ్మోదాన్ని కలిగించేవి. గంటల తరబడి తనచుట్టూ ఉన్న వారిని సుహృత్సల్లాపాలతో హృదయాహ్లాదాన్ని కలిగించే చతురవచోనిధి శాస్త్రిగారు, ప్రయాణాలలో వారి పక్కన కూర్చుండటం ఒక అదృష్టం. పాండిత్యంతోపాటు లోకజ్ఞానం వారు పంచిపెట్టేవారు.

'అందరికీ శాస్త్రిగారు తలలోనాల్క' అని మేమందరమూ అనుకొంటూ ఉండేవారం. ఎవరుచెప్పినమాటలు హితవులై తలచినప్పుడెల్లా తలలో, తనలో మాట్లాడుతున్నట్లు వినిపిస్తూఉంటాయో వారిని తలలో నాల్కవంటివారని సామాన్యంగా అంటుంటాం. శాస్త్రిగారు మిత్రమండలిలో తలలోనాల్కలా నిలిచే హితుడు, సన్నిహితుడు. భోజన ప్రియత్వం, భాషణప్రియత్వం జంటగా ఆయన జీవితంలో చెట్టపట్టాలు పట్టుకొని నడిచాయి. సహపంక్తి భోజనం ఆయన సరదా. ఆహార విషయ పరిజ్ఞానంలో ఆయన ఒక విజ్ఞానకోశం. కావ్యాలలో చెప్పబడిన భక్ష్యభోజ్యలేహ్యాదులను అనుభవజ్ఞానంగా మార్చుకొని జీవితాన్ని ఒక రసానుభవంగా పండించుకొన్న ప్రవృత్తి భోగమూర్తి బ్రహ్మశ్రీ లక్ష్మణశాస్త్రిగారు.

శాస్త్రిగారు ప్రవృత్తిలో ఎంత ప్రజ్ఞావంతులో నివృత్తిలోకూడ అంత నిష్ఠాపరులు. నియమనిష్ఠలు ఆయన జీవితంలోభాగం. ఆధ్యాత్మికచింతన ఆయన జీవుని సహజస్వభావం. క్షేత్రాలుదర్శించి, దేవతలను పూజించి, తీర్థాలు సేవించి, యజ్ఞయాగాదులలో పాల్గొని, భారతదేశ పర్యటనాన్ని యథాశక్తి కావించి భారతాత్మను దర్శించిన ఆంధ్రపండితులలో బ్రహ్మశ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారిని తప్పక పేర్కొనాలి. కాశ్మీరంనుండి కన్యాకుమారివరకు ఆయన దర్శించని

క్షేత్రంలేదు. పరిచయం చేసికొనని పండితుడులేడు. తెలుగువారి పక్షాన భారత దేశంలోని పండితులకందరికీ ఒక రాయబారిగా ఆయన వ్యవహరించారు. ఒక్క మాటలో చెప్పాలంటే - భారతీయ పండితులకు లక్ష్మణశాస్త్రిగారు సొంత చిరునామా.

లోకంలో పండితులు రెండురకాలుగా కనపడతారు. మొదటి రకం-మనిషి ముందుగా జ్ఞాపకంవచ్చి ఆ తరువాత వారి రచనలు జ్ఞాపకంవచ్చేవారు. రెండోరకం-ముందు రచనలు స్ఫురించి ఆ తరువాత మనిషి జ్ఞాపకంవచ్చేవారు. బ్రహ్మశ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు మొదటిరకానికి చెందే విద్వాంసులు. శాస్త్రిగారు కవిత్వంకూడా వ్రాసేవారు, వారి శ్లోకాలూ, పద్యాలూ కవి సమ్మేళ నాలలో వినిపించేవి. అయితే, వారు కవిగాకంటె పండితులుగానే సాహితీ లోకంలో సత్కీర్తిని గడించారు. రచనలకంటె తమ వ్యక్తిత్వం ఉన్నతంగా కనిపించే విద్వన్మూర్తి లక్ష్మణశాస్త్రిగారు.

ఈ శతాబ్ది పండిత కవులు ప్రధానంగా మూడు మార్గాలలో నడిచారు. ఒకరు సంస్కృతాంధ్ర సంప్రదాయ మార్గానుయాయులు. మరొకరు పాశ్చాత్య సాహితీ ప్రభావంతో నవ్యప్రయోగాలుచేసినవారు. మూడవవారు పాశ్చాత్య భాషా సాహిత్య సంస్కారంతో భారతీయ సాహిత్యాలను, ఆంధ్రసాహిత్యాన్నీ అభినవ ప్రయోగాలతో సుసంపన్నం చేసేవారు. ఈ మూడు బాటలవారినీ మూడు పేర్లతో వ్యవహరించటం ప్రచారంలోఉన్నది. మొదటివారు సంప్రదాయ వాదులు రెండవవారు ప్రయోగవాదులు, మూడవవారు నవ్యసంప్రదాయవాదులు. సంప్రదాయవాదులు ప్రధానంగా అనువాదాన్ని ఒక ప్రస్థానంగా పెట్టుకొన్నారు. సంస్కృత ప్రాకృతాది భారతీయభాషలలోఉన్న విశిష్ట సాహిత్యాన్ని తెలుగులో యథాతథంగా అనువదించి దేశీయ భాషా సాహిత్యాభిమానులకు దానిలోని విశే షాలను నవనీతంగా అందించటం వారి సాహితీవ్రతం. ఈ దృష్టితో పురాణేతిహా సాలను, కావ్యాదులను తెలుగు చేయటం ఒక ఉద్యమంగా సాగించారు సంప్ర దాయవాదులు, అయితే ఈ రచనలో అనువాదమే ప్రధానం. అనుసృజనం మృగ్యం.

నవ్యసంప్రదాయవాదులు అనువాదకులుకారు, కొన్ని సందర్భాలలో వారు అనుసృజనంకాని, పునఃసృష్టికానిచేస్తారు. ఎక్కువ సందర్భాలలో స్వతంత్ర

ప్రయోగాలనే నిర్వహిస్తారు. అందువలన వారి రచనలు ఒక క్రొత్త ఒరవడిని సృష్టిస్తూ ఉంటాయి. ఇక ప్రయోగవాదులు పాశ్చాత్య ప్రభావంతో రచనలు చేసేవారు. కాల్పనిక, అభ్యుదయాది మార్గాలు వారు అనుసరించే ప్రస్థానశాఖలు.

బ్రహ్మశ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు సంప్రదాయవాదులయిన కృషీవలులు. వారి అనువాద రచనలో చివరిది, చివరకు మిగిలేదీ వీరి వ్యాసభారతానువాదం. పత్రికలలో ధారావాహికంగా ప్రచురించబడిన వచన రచన యిది. ఇప్పుడు గ్రంథరూపంగా వెలువడుతున్నది. సంతోషింప తగిన విషయం.

బ్రహ్మశ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు అదృష్టవంతులు. వారు నమ్మిన సంప్రదాయాన్ని అవిచ్ఛిన్నంగా ముందుకు తీసికొని పోగలిగిన విదుషీమణిని ఆచార్య కమలగారిని-తమ సారస్వతాంశగా సాహితీలోకంలో స్థాపించగలిగారు. తండ్రిగారి వినయ వివేక విద్వత్తులకు మెగురుబెట్టిన మధురమూర్తి ఆచార్య కమలగారు. అటు పాండిత్యంలోనూ ఇటు సౌజన్యంలోనూ సమకాలిక విదుషీ మణులలో వారు తలమానికంవంటివారు. రచయిత్రిగా పరిశోధకురాలుగా, ప్రామాణిక విదుషీమణిగా పండితలోకంలో ఉదాత్త గౌరవస్థానాన్ని సంపాదించుకొన్న శ్రీమతి కమలగారు తండ్రిగారి రచనల నన్నింటిని పరిష్కరించి ప్రచురించే సాహితీయజ్ఞాన్ని సాగించటం అభినందనీయమైనఅంశం. తండ్రి నిలిపిన సంప్రదాయాన్ని పోషిస్తున్నధీమంతురాలు సాహితీతపస్విని ఆచార్య కమలగారు; వారి కృషికి సాహితీలోకంపక్షాన అభినందనలు అందజేస్తున్నాను.

మహాభారతంలో ఆది పంచకం అయిపోయిన తరువాత యుద్ధషట్కం ప్రారంభమౌతుంది. అందులో మొదటిది భీష్మపర్వం. భారత పర్వనామాలను గమనిస్తే యుద్ధషట్కానికి ఒక ప్రత్యేకత గోచరిస్తుంది. ఈ ఆరూ కౌరవుల పక్షాన ప్రవర్తిల్లే వస్తువుకు ప్రాతినిధ్యంవహించే పేర్లు. మిగిలినవి పాండవ చరిత్రకు ప్రాధాన్యాన్ని కల్పించేవి. భీష్మాదులు కౌరవ సేనాపతులు. వారు క్రమంగా పడిపోవటం భీష్మ, ద్రోణ, కర్ణ, శల్య, సౌప్తికపర్వాలలోని వస్తువు. స్త్రీ పర్వం కౌరవవనితల రోదనకు సంబంధించింది. ఎంతటి బలపరాక్రమ సమన్వితులైనా అధర్మ పక్షవర్తులైన భీష్మాదులు నేలకొరగటం యుద్ధషట్కవిశేషం. ఈ యుద్ధషట్కం పాండవ విజయాన్ని ధ్వనింపచేస్తుంది.

"యత్ర యోగేశ్వరః కృష్ణో, యత్ర పార్థో ధనుర్ధరః
తత్ర శ్రీర్విజయోభూతి, ర్ధ్రువా నీతిర్మతిర్మమ"

అన్న సత్యాన్ని గమ్యమానంచేస్తుంది. కురుపితామహుడైన భీష్ముడు స్వచ్ఛంద మరణ వరంచేత తనంతట తాను మరణించటానికి సంకల్పించుకొంటే తప్ప యుద్ధ విముఖుడు కాడు. పరశురాముణ్ణే జయించిన మహావీరుడాయన. ఆతనికి ఎదురులేరెవ్వరూ. ఆ మహావీరుని పతనం ఎలా జరిగిందని పఠితలకు ఉత్కంఠ జనిస్తుంది. పర్వమంతా ఆ ఉత్కంఠతో చదవబడుతుంది.

యుద్ధషట్కంలో ప్రథమ పర్వంగానేకాకుండా మహాభారతంలోనే అత్యుత్తమ పర్వంగా భీష్మపర్వం పరిగణింపబడటానికి అందులో భగవద్గీత ఉండటం ప్రధాన కారణం. భారతానికి భగవద్గీత ఆత్మవంటిది. భగవంతుడే ఇలా అన్నాడు-

"గీతామే హృదయం పార్థం, గీతామే సార ముత్తమమ్
గీతామే జ్ఞానమత్యగ్ర్యం, గీతామే జ్ఞానమవ్యయమ్॥

గీతామే చోత్తమం స్థానం, గీతామే పరమంపదమ్
గీతామే పరమం గుహ్యం, గీతామే పరమోగురుః"

ఇంతటి గొప్పది గీత. అంతేకాక గీత "ఏకం శాస్త్రం దేవకీ పుత్ర గీతం" 'గీతా కల్పతరుంభజే' అనీ, పంచమ వేదమని, వేదోపనిషత్సారభూతమనీ ప్రశస్తి గాంచింది. చతుర్వేద సారరూపమైన గ్రంథం పంచమవేదం. మహాభారతానికి పంచమవేదమనే ప్రసిద్ధిఉండగా, ఆ గ్రంథ భాగమైన భగవద్గీతకుకూడ అంతటి ప్రసిద్ధి ఉండటం గమనార్హం. గీత భారతకథలోని తత్త్వభూమిక. భారతం గీతాతత్త్వానికి వ్యాఖ్యానతుల్యం. అందువలన భారతానికి గీతకూ దేహ దేహి సంబంధం సంభావ్యం. మహాభారత ప్రబంధధ్వనివలన వాసుదేవతత్త్వం ప్రతీయమాన మౌతుంది. అందువలననే మహాభారతం కార్ష్ణవేదమని కీర్తికెక్కింది. ఆ కీర్తి పతాక భగవద్గీత.

భారతీయ వేదాంత సారమంతా భగవద్గీతగా నిబంధించ బడటంచేత వ్యాసమహర్షియే సాక్షాత్ నారాయణ గౌరవాన్ని పొందాడు. మానవుని భౌతిక

జీవితాన్ని నియంత్రించేది అధ్యాత్మిక ప్రవృత్తి. అది న్యాయదేవత చేతిలో ప్రేలాడుతుండే త్రాసులాంటిది. మానవజీవితంలోని ఆధ్యాత్మికతులాదండానికి అక్షరాకృతి భగవద్గీత. త్రాసులో మూడు అంశాలు ఉంటాయి. ఎడమవైపు త్రాసు తక్కెడ, కుడివైపు తక్కెడ, బరువును సూచించే నడిమిముల్లు. భగవద్గీత ఒక త్రాసైతే అందులో ఎడమ తక్కెడ 2వ అధ్యాయం 7వ శ్లోకం. మధ్య తులాభారాన్ని సూచించే ముల్లు 9వ అధ్యాయంలోని 22వ శ్లోకం. త్రాసులోని కుడి తక్కెడ 18వ అధ్యాయం 66వ శ్లోకం.

"కార్పణ్య దోషోపహత స్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః
యచ్ఛ్రేయ స్స్యాన్నిశ్చితం బ్రూహితన్మే
శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్". గీత II 7

కృపణత్వం అంటే ఆత్మజ్ఞాన రహితత్వం. గురువులూ బంధువులూ అనే మమకారం. దీనివలన మనోదౌర్బల్యం అనే దోషం ఏర్పడుతుంది. దానివలన బుద్ధి నశిస్తుంది. ఆపైన ధర్మ విషయంలో సందేహం కలుగుతుంది. అప్పుడు మనిషి మంచేదో చెడేదో తెలిసికొనలేడు. అట్టి దయనీయస్థితిలో మానవుడు దేవుణ్ణి శరణు వేడుతాడు. శిష్యుడై శ్రేయోమార్గాన్ని చెప్పుమని వేడు కొంటాడు. ఇట్టిస్థితిలో ఉన్న నరుని చిత్తవృత్తి అధ్యాత్మసాధన తులాదండంలో ఒక వైపు తక్కెడ, దోషభారంచేత నరుని మనసు విషాదమగ్నమై పోయింది. నిరాశ నిస్పృహలతో క్రిందికి క్రుంగిపోయింది. ఈ భారాన్నుండి మనసును తేలికపరిచే మరొక మానసికావస్థ-ఈ క్రింది శ్లోకంలో సూచించబడింది.

"సర్వ ధర్మా న్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః". XVIII 66

'సర్వధర్మాలను వదలిపెట్టి నన్నొక్కణ్ణిమాత్రమే శరణుపొందుము. నేను సమస్త పాపాలనుండి దోషాలనుండి నిన్ను విముక్తుణ్ణిగాచేస్తాను. విచారించకు' మనే భగవంతుని అభయముద్ర లభించిన స్థితిముక్తావస్థ. అస్థితిని పొందటానికి మానసిక సమస్థితి తులాదండ సమసూచి అయిన ముల్లు-ఈ క్రింది శ్లోకం.

"అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్" గీత 9.22

భగవద్గీత మొత్తం చదివినా, ఈ శ్లోక తాత్పర్యం ఒక్కటి మనసులో నిలిస్తే గీతాఫలం చేకూరినట్లే. అనన్యచిత్తంతో భగవంతుడిని చింతిస్తూ ఎడతెగకుండా ధ్యానిస్తూ ఎవరుఉంటారో భగవంతుడు వారి యోగక్షేమాన్ని వహిస్తూ ఉంటాడు.

మహాభారత కురుక్షేత్ర యుద్ధరంగంలో ఎడమవైపు మోహావృతమైన కౌరవసైన్యం. కుడివైపు శ్రీకృష్ణుని శరణువేడిన పాండవసైన్యం. భగవానుడైన పార్థసారథి ఆ రెంటికీ మధ్యవర్తియైన ధర్మసూచి. పాండవుల యోగక్షేమం వహించిన వాసుదేవుడు గీతద్వారా తత్త్వాన్నీ, భారత కథా తత్త్వాన్నీ వ్యాఖ్యానించి చెప్పాడు. అందుకే భగవద్గీత భారతాత్మ!

ఆధ్యాత్మికంగా అనుశీలిస్తే మహాభారతం అంతఃకరణ ప్రవృత్తుల అంతస్సంఘర్షణ స్వరూపమే. కౌరవు లాసురీ శక్తులు. పాండవులు దైవీ ప్రవృత్తులు. దైవీ ప్రవృత్తుల యోగక్షేమంచూచే పరమాత్ముడు శ్రీకృష్ణుడు. మహాభారతేతిహాసం కార్పణ్య దోషోపహత స్వభావులను భగవంతుడు ఉద్ధరించే దివ్య పస్థాన ప్రపంచనమే, ఉదాహరణకు గీతలోని ప్రతివాక్యాన్నీ భారతపరంగా వ్యాఖ్యానించవచ్చు. కాని, అది ఇప్పుడు సాధ్యంకాదు. మచ్చుగా కొన్ని అంశాన్నిగురించి పరిశీలిద్దాం.

"ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే
సంగాత్ సంజాయతే కామః కామాత్ క్రోధోఽభిజాయతే
క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతి విభ్రమః
స్మృతి భ్రంశా ద్బుద్ధినాశః బుద్ధినాశాత్ ప్రణశ్యతి" 2-62,63.

ఎప్పుడూ శబ్దాది విషయాలనుగురించి ఆలోచించే వారికి వాటిమీద ఆసక్తి బాగా పెరుగుతుంది. ఆసక్తివల్ల కోరికలుపుడతాయి. కోరికలు కోపం కలుగజేస్తాయి. కోపంమూలంగా అవివేకం కలుగుతుంది. ఆ అవివేకంవలన మరపు, మరపువలన బుద్ధినశించటం, బుద్ధినాశంవలన తానే నశించటం జరుగుతుంది అని గీతాకారుని నిర్దేశం.

ఈ గీతాసూక్తి దుర్యోధనునివట్ల స్పష్టంగా అన్వయిస్తుంది. మహాభారతం లోని దుర్యోధన ధర్మరాజులను శ్రీకృష్ణుడు వరుసగా రోషమయ మహాతరువు తోనూ, ధర్మ తరువుతోనూ పోల్చాడు. తిక్కన మాటలలో-

"రోషమయ మహాతరువు సుయోధను, డురు
స్కంధ మందులోన కర్ణు, డలరు,
కొమ్మ సౌబలుండు, కుసుమ ఫలములుదు
శ్శాసనుండు, మూలశక్తి తండ్రి".

"ధర్మజుండు ధర్మతరు, వర్జునుఁడు ఘన
స్కంధ, మనిలసుతుఁడు శాఖ, కవలు
పుష్పఫలము, లేను భూసురులును. వేద
ములుఁదదీయమైన మూలచయము".

దుర్యోధనుడు మూర్తికట్టిన క్రోధం. ఆ క్రోధానికి కారణం పాండవుల రాజ్యంపైనున్న తీవ్రమైన కాంక్ష, పాండవులను చంపిగాని, అన్యాయంగా వారిని మోసగించిగాని రాజ్యసంపదను కాజేయాలన్న దురాశ అతని క్రోధానికి బీజం. ఆ క్రోధం అనేక అధర్మ కార్యాలను అతనిచేత చేయించింది. అతని కోపం అతనిలోని వివేకాన్నీ, జ్ఞానాన్నీ మట్టుపెట్టింది. సదసద్జ్ఞానం కోల్పోయి బుద్ధి హీనుడయ్యాడు. చివరకు పాండవులతో కోరి తననూ తనవారినీ నాశనం పాలు చేసికొన్నాడు. ఇట్టి కృపణుసిస్థితి. పార్థునికి రాకుండా, పాండవులకు ఏర్పడ కుండా శ్రీకృష్ణుడు గీతా బోధవలన రక్షించాడు. రోషమయ మహాతరువైన దుర్యోధనునికి మూర్తికట్టిన మోహమైన ధృతరాష్ట్రుడు మూలం. ధర్మతరువైన ధర్మజునికి పరమాత్మునైన శ్రీకృష్ణుడు మూలం. తన జీవన ప్రస్థానానికి ధృత రాష్ట్రుణ్ణి మూలంగా ఎన్నుకోవాలా? శ్రీకృష్ణుణ్ణి మూలంగా నిలుపుకోవాలా అన్నదే మానవుని జీవిత పరమార్థ సమస్య. దానికి తగినమార్గం చూపించే జ్ఞానజ్యోతి గీత-దాని వెలుగు మహాభారతం.

వ్యాసకృత మహాభారతం శాస్త్రేతిహాసం, ఆనందవర్ధనాచార్యులవారన్నట్లు శాస్త్రరూప చ్ఛాయాన్వయి. శాస్త్రం చెప్పటమే వ్యాసతాత్పర్యం. దానికి ఇతి హాసకథను, కావ్యత్వాన్నీ ఆలంబనంగా గ్రహించాడు. కాబట్టి సంస్కృత మహా

భారతంలోని కథ జ్ఞానానికి ఉపబలకం మాత్రమే. ధ్వన్యాలోకకారుడు మహాభారతం శాంతరస ప్రధానమని ప్రతిపాదిస్తూ చెప్పిన ఈ క్రింది మాటలు అందుకు అమలోదాహరణాలు.

మహాభారతేఽపి శాస్త్రరూప కావ్యచ్ఛాయాన్వయిని వృష్ణిపాండవ విరసావసాన వైమనస్యదాయినీం సమాప్తి ముపనిబధ్నతా మహామునినా వైరాగ్యజనన తాత్పర్యం ప్రాధాన్యేన స్వప్రబంధస్య దర్శయతా మోక్షలక్షణః పురుషార్థః శాంతోరసశ్చ ముఖ్యతయా వివక్షా విషయత్వేన సూచితః. ఏతచ్చాంశేన వివృతమేవ అన్యైః వ్యాఖ్యా విధాయిభిః స్వయమేవ చైత దుద్గీర్ణం తేన ఉదీర్ణ మహా మోహమగ్న ముజ్జిహీర్షతా లోకం అతి విమల జ్ఞానాలోక దాయినా లోకనాథేన.

యథా యథా విపర్యేతి లోకతంత్ర మసారవత్
తథా తథా విరాగోఽత్ర జాయతే నాత్ర సంశయః.

ఇత్యాది బహుశః కథయతా. తతశ్చ శాంతోరసో రసాంతరై ర్మోక్ష లక్షణః పురుషార్థః పురుషార్థాంతరై రుపసర్జనత్వేనానుగమ్యమానః అంగిత్వేన వివక్షా విషయః ఇతి మహాభారత తాత్పర్యం సువ్యక్త మేవావ భాసతే"

(ధ్వన్యాలోకం. 4ఉ.)

వ్యాసభారతం శాంతమహాసాగరం, అందులో భీష్మపర్వం జ్ఞానద్వీపం.

శిరోమణి కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు మహాభారతాన్ని యథామూలంగా తెలుగు వచనంలోకి అనువాదంచేయటం ప్రశంసాపాత్రం, మా విద్యార్థి రోజుల్లో జంటనగరాలలో ముగ్గురు శిరోమణులుండేవారు. ఒకరు కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు, మరొకరు సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారు, మూడోవారు చెలమచెర్ల రంగాచార్యులుగారు. ముగ్గురూ అనువాదాలను చేపట్టి సాహితీ వ్యవసాయం సాగిస్తూ ఉండేవారు. వారిలో మహాభారతంవంటి పంచమవేదాన్ని తెలుగులోకితెచ్చిన గౌరవం శిరోమణి కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారికే దక్కింది. మిగిలిన ఇరువురూ లక్షణగ్రంథానువాదాలనూ, వ్యాఖ్యానాలనూ ఎన్నుకొన్నారు. శిరోమణి త్రయంలో శిఖరప్రాయంగా ప్రకాశించిన పండిత ప్రకాండుడు బ్రహ్మశ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు.

4)

శాస్త్రిగారి భీష్మపర్వ రచనలో కానవచ్చే కొన్ని విశేషాలు గమనింప దగినవి.

1. శబ్దానువాదంకాకుండా అర్థానువాదాన్ని స్వీకరించి అందరికీఅందుబాటులో ఉండే సరళ వచనంలో గ్రంథరచన సాగించటం.

2. శ్లోకభావాన్ని ఎన్నుకొని దానిని ఒక పేరాగా ప్రదర్శించటంవలన మూలంతో పోల్చి చూచుకోవటం సులభంకావటం.

3. భగవద్గీతాభాగం పారాయణకుకూడ వినియోగపడుతుంది కాబట్టి దానిని మూలంతోసహా ప్రచురించటం గీతా ప్రార్థన శ్లోకాలనుకూడా అనువదించటం. దీనివలన ఈ గ్రంథ వినియోగం పెరుగుతుందని గుర్తించటం.

4. శ్లోక తాత్పర్యాలను సరళమైన తెలుగులో అందించటమే కాకుండా శ్లోకంలో వివరణలకు అవసరమైన అంశాలను ఎన్నుకొని పాదసూచికలలో వాటికి సముచిత వ్యాఖ్యను సంతరించటం. దీనివలన పరిభాషకు సంబంధిన అంశాలకూ, సంప్రదాయ గతమైన అర్థవివరణలకూ చక్కని మార్గం దొరకటం.

5. శాస్త్రిగారు స్వయంగా అద్వైతి, అద్వైత దర్శనాన్ని భూమికగా చేసికొని గీతారహస్యాలను వివరించటంద్వారా గీతాతత్త్వదర్శనంగా తమ రచనను రూపొందించటం.

6. గీతకు త్రిమతాచార్యులేకాక, పండితులు, కవులు, పీఠాధిపతులు, దేశ నాయకులుకూడా ఎన్నోవ్యాఖ్యలు వ్రాశారు. శాస్త్రిగారు వాటి నన్నింటిని చదివి ఉండటంచేత వాటిల్లోని మేలిమి ని గ్రహించి తమ సమన్వయ సూత్రానికి అనువుగా అనుసంధించి విశేషాంశ వివరణానికికూడా కొన్ని చోట్ల వ్యాఖ్యాగౌరవాన్ని కలిగించటం.

7. ఎందరి అభిప్రాయాలను దృష్టిలో ఉంచుకొన్నా వ్యాఖ్యచేసేటప్పుడు లక్ష్మణశాస్త్రిగారు స్వీయశైలీ ప్రస్థాన ముద్రను రచనలో భద్రపరచటం.

8. శాస్త్రార్థాలను తెలుగు చేసేటప్పుడు విషయ ప్రసన్నతకు ప్రాధాన్య మివ్వటం.

9. భీష్మపర్వం వీరరౌద్రరస భరితాలైన యుద్ధ సన్నివేశాలకు నిలయం. కాబట్టి ఆయా రసవత్తర సన్నివేశాలను తెలుగు చేస్తున్నప్పుడు పఠితకు రసపారవశ్యం కలిగేటట్లు రచనను నిర్వహించటం.

10. శ్రీశాస్త్రిగారు సంస్కృతభాషలో ఉద్దండ పండితులు. అయినా, తెలుగు భాషలో రచన సాగించేటప్పుడు తెలుగు తియ్యందనాన్ని మరచిపోకుండా అలతి అలతి తెలుగు పదాల అందమైన పోహళింపుతో మధురమధురంగా వచనరచనను సాగించటం.

ఈ దశలక్షణాలు ఈ రచనకు దశగుణాలు. మొత్తంమీద సమగ్రగుణోపేత ఈ రచన. శాస్త్రిగారు సృష్టించారు. దానిని కమలగారి చేతులో పెట్టారు. డాక్టర్ కమలగారు సార్థక నామధేయ, లక్ష్మిచేతిలో ఇప్పుడు భారత భారతి శతపత్రంగా నిలిచింది, సహస్ర కమలంలాగా వికసించి సాహితీ సౌగంధ్యాన్ని విస్తరింపజేస్తున్నది.

తండ్రి అక్షయతపస్వి; కుమార్తె అక్షర తపస్విని. ఒకరికి శ్రద్ధాంజలి. మరొకరికి స్నేహాంజలి.

హైదరాబాదు.
5-4-1999

జి. వి. సుబ్రహ్మణ్యం

# విషయసూచిక


విషయము — పుట సంఖ్య

ఒకటవ అధ్యాయము — 1
- జంబూద్వీప నిర్మాణపర్వము
- కురుక్షేత్రమునందు సైనికుల పరిస్థితి
- యుద్ధ నియమములు

రెండవ అధ్యాయము — 4
- వేదవ్యాసుడు సంజయునకు దివ్యదృష్టి యిచ్చుట

మూడవ అధ్యాయము — 7
- వ్యాస మహాముని అమంగళములు చెప్పుట

నాల్గవ అధ్యాయము — 19
- సంజయుడు భూమి గుణములు ధృతరాష్ట్రునకు చెప్పుట

ఐదవ అధ్యాయము — 21
- సంజయుడు పంచమహాభూతములను సుదర్శన ద్వీపమును వర్ణించుట

ఆరవ అధ్యాయము — 23
- సుదర్శన భూఖండ వర్ణనము
- వర్షపర్వతమేరు గంగా శశాకృతుల వర్ణనము
- బిందు సరోవర-గంగానదుల వర్ణనము

ఏడవ అధ్యాయము — 30
- సంజయుని ఉత్తర కురువర్ష వర్ణనము
- సంజయుని భద్రాశ్వవర్ష వర్ణనము
- సంజయుని మాల్యవద్వర్ణనము

ఎనిమిదవ అధ్యాయము — 33
- సంజయుని రమణ-హిరణ్యక-శృంగవత్పర్వతముల-వర్ణనము

విషయము పుట సంఖ్య

సంజయుని యైరావత వర్షవర్ణనము

తొమ్మిదవ అధ్యాయము 36

సంజయుడు భారత వర్షనదులు-దేశములు-గ్రామముల పేర్లు వర్ణించి చెప్పుట

పదవ అధ్యాయము 41

యుగానుసారముగా భారతవర్షీయుల ఆయుస్సు

పదకొండవ అధ్యాయము 43

భూమిపర్వము-శాకద్వీప వర్ణనము

పండ్రెండవ అధ్యాయము 47

సంజయుని కుశ-క్రౌంచ-పుష్కరాది ద్వీపముల వర్ణనము

సూర్యచంద్ర రాహువుల ప్రమాణము

పదమూడవ అధ్యాయము 53

సంజయుడు భీష్ముని మృత్యువు ధృతరాష్ట్రునకు తెలుపుట

పదునాలుగవ అధ్యాయము 54

ధృతరాష్ట్రుడు విలపించుచు భీష్మవధ వృత్తాంతము చెప్పుమని సంజయుని ప్రశ్నించుట.

పదిహేనవ అధ్యాయము 62

సంజయుడు యుద్ధ వృత్తాంతము వర్ణించుటకు ప్రారంభించుట

పదహారవ అధ్యాయము 64

సంజయునిచేత దుర్యోధన సేనా వర్ణనము

పదిహేడవ అధ్యాయము 66

కౌరవయోధులు యుద్ధమునకు సాగుట

పదునెనిమిదవ అధ్యాయము 69

భీష్మరక్షకుల పరిచయము

పందొమ్మిదవ అధ్యాయము 71

భీముని నాయకత్వములో పాండవ సేనల రచన

| విషయము | పుట సంఖ్య |
| --- | --- |
| ఇరువదవ అధ్యాయము | 75 |
| ఉభయసేనల స్థితి | |
| ఇరువది ఒకటవ అధ్యాయము | 78 |
| కౌరవసేననుచూచి యుధిష్ఠిరుడు విషాదము చెందుట | |
| అర్జునుడు అతనిని ఆశ్వాసించుట | |
| ఇరువది రెండవ అధ్యాయము | 80 |
| యుధిష్ఠిరుని యుద్ధయాత్ర | |
| ఇరువది మూడవ అధ్యాయము | 82 |
| అర్జునుడు దుర్గాదేవిని స్తుతించుట | |
| శ్రీమద్భగవద్గీతయందు మొదటి అధ్యాయము | 89 |
| అర్జున విషాదయోగము | |
| ,, రెండవ అధ్యాయము | 101 |
| సాంఖ్యయోగము | |
| ,, మూడవ అధ్యాయము | 141 |
| కర్మయోగము | |
| ,, నాల్గవ అధ్యాయము | 172 |
| జ్ఞానకర్మ సన్న్యాసయోగము | |
| ,, అయిదవ అధ్యాయము | 212 |
| కర్మ సన్న్యాసయోగము | |
| ,, ఆరవ అధ్యాయము | 240 |
| ఆత్మ సంయమ యోగము | |
| ,, ఏడవ అధ్యాయము | 282 |
| జ్ఞాన విజ్ఞానయోగము | |
| ,, ఎనిమిదవ అధ్యాయము | 304 |
| అక్షర బ్రహ్మ యోగము | |

| విషయము | పుట సంఖ్య |
| --- | --- |
| శ్రీమద్భగవద్గీతయందు తొమ్మిదవ అధ్యాయము | 336 |
| రాజవిద్యా రాజగుహ్య యోగము | |
| ,, పదవ అధ్యాయము | 382 |
| విభూతియోగము | |
| ,, పదకొండవ అధ్యాయము | 436 |
| విశ్వరూప దర్శన యోగము | |
| ,, పదునెండవ అధ్యాయము | 489 |
| భక్తియోగము | |
| ,, పదమూడవ అధ్యాయము | 525 |
| క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగము | |
| ,, పదునాల్గవ అధ్యాయము | 566 |
| గుణత్రయ విభాగయోగము | |
| ,, పదునైదవ అధ్యాయము | 595 |
| పురుషోత్తమ ప్రాప్తియోగము | |
| ,, పదియారవ అధ్యాయము | 616 |
| దైవాసుర సంపద్విభాగయోగము | |
| ,, పదియేడవ అధ్యాయము | 633 |
| శ్రద్ధాత్రయ విభాగయోగము | |
| ,, పదునెనిమిదవ అధ్యాయము | 658 |
| మోక్ష సన్న్యాస యోగము | |
| భగవద్గీతా మాహాత్మ్యము | 738 |
| భీష్మపర్వము-నలుబది మూడవ అధ్యాయము | 740 |
| యుధిష్ఠిరుడు యుద్ధమునకు పెద్దల అనుమతి కోరుట | |
| నలుబది నాలుగవ అధ్యాయము | 750 |
| కౌరవ–పాండవుల ప్రథమదిన యుద్ధమారంభము | |

| విషయము | పుట సంఖ్య |
|---|---|
| నలుబది యైదవ అధ్యాయము | 752 |
| ఉభయపక్ష సైనికుల ద్వంద్వయుద్ధము | |
| నలుబది యారవ అధ్యాయము | 753 |
| కౌరవ పాండవ వీరుల తుముల (దొంబి) యుద్ధములు | |
| నలుబది యేడవ అధ్యాయము | 754 |
| భీష్మాభిమన్యుల యుద్ధము | |
| శల్యుడు ఉత్తరుని వధించుట | |
| నలుబది యెనిమిదవ అధ్యాయము | 756 |
| భీష్ముడు శ్వేతుని వధించుట | |
| నలుబది తొమ్మిదవ అధ్యాయము | 762 |
| భీష్ముని ప్రచండ యుద్ధము | |
| ఏబదవ అధ్యాయము | 762 |
| యుధిష్ఠిరుడు చింతించుట | |
| ఏబది ఒకటవ అధ్యాయము | 764 |
| కౌరవసేన వ్యూహరచన | |
| ఏబది రెండవ అధ్యాయము | 765 |
| భీమార్జున యుద్ధము | |
| ఏబది మూడవ అధ్యాయము | 768 |
| ద్రోణాచార్య-ధృష్టద్యుమ్నుల యుద్ధము | |
| ఏబది నాల్గవ అధ్యాయము | 770 |
| భీముడు కళింగసేనలను వధించుట | |
| ఏబది యైదవ అధ్యాయము | 772 |
| అర్జునాభిమన్యుల పరాక్రమము | |
| ఏబది యారవ అధ్యాయము | 774 |
| తృతీయ దివసయుద్ధము, ఉభయుల వ్యూహరచన | |

| విషయము | పుట సంఖ్య |
|---|---|
| ఏబది ఏడవ అధ్యాయము | 775 |
| తుముల యుద్ధము | |
| ఏబది ఎనిమిదవ అధ్యాయము | 777 |
| పాండవ వీరుల పరాక్రమము | |
| ఏబది తొమ్మిదవ అధ్యాయము | 779 |
| భీష్ముని పరాక్రమము | |
| అరువదవ అధ్యాయము | 787 |
| నాలుగవనాటి యుద్ధము-వ్యూహముల రచన | |
| అరువది ఒకటవ అధ్యాయము | 789 |
| అభిమన్యు పరాక్రమము | |
| అరువది రెండవ అధ్యాయము | 790 |
| ధృష్టద్యుమ్నుడు శల్యుని వధించుట | |
| అరువది మూడవ అధ్యాయము | 793 |
| భీమ-భీష్ముల యుద్ధము | |
| అరువది నాల్గవ అధ్యాయము | 795 |
| భీమ ఘటోత్కచుల పరాక్రమము | |
| అరువది యైదవ అధ్యాయము | 799 |
| ధృతరాష్ట్ర సంజయుల సంవాదము | |
| అరువది ఆరవ అధ్యాయము | 802 |
| నర-నారాయణుల మహిమ | |
| అరువది ఏడవ అధ్యాయము | 805 |
| శ్రీకృష్ణ భగవానుని మహిమ | |
| అరువది యెనిమిదవ అధ్యాయము | 807 |
| పంచభూత స్తోత్రము | |

| విషయము | పుట సంఖ్య |
|---|---|
| అరువది తొమ్మిదవ అధ్యాయము | 809 |
| పంచమ దివస యుద్ధము | |
| డెబ్బదవ అధ్యాయము | 811 |
| భీష్మ భీమసేనుల తుముల యుద్ధము | |
| డెబ్బది ఒకటవ అధ్యాయము | 813 |
| భీష్మార్జునాది వీరుల తుముల యుద్ధము | |
| డెబ్బది రెండవ అధ్యాయము | 815 |
| ఉభయ సైన్యముల పరస్పర తుముల యుద్ధము | |
| డెబ్బది మూడవ అధ్యాయము | 816 |
| ఉభయవీరుల ద్వంద్వ యుద్ధములు | |
| డెబ్బది నాల్గవ అధ్యాయము | 819 |
| సాత్యకి భూరిశ్రవుల యుద్ధము | |
| డెబ్బది అయిదవ అధ్యాయము | 821 |
| పాండవ కౌరవులు మకర క్రౌంచ వ్యూహములు నిర్మించుట | |
| డెబ్బది యారవ అధ్యాయము | 822 |
| ధృతరాష్ట్రుని చింత | |
| డెబ్బది యేడవ అధ్యాయము | 824 |
| ద్రోణ, భీమ, ధృష్టద్యుమ్నుల పరాక్రమము | |
| డెబ్బది ఎనిమిదవ అధ్యాయము | 829 |
| ఉభయ సైనికుల సంకుర సమరం | |
| డెబ్బది తొమ్మిదవ అధ్యాయము | 831 |
| భీముడు దుర్యోధనుని జయించుట | |
| ఎనుబదవ అధ్యాయము | 834 |
| సప్తమదివస యుద్ధము-భీష్ముడు | |
| దుర్యోధనుని ఓదార్చుట | |

విషయము — పుట సంఖ్య

ఎనుబది ఒకటవ అధ్యాయము — 836
ఏడవనాడు కౌరవ పాండవులు మండల వజ్రవ్యూహములు నిర్మించి పోరాడుట

ఎనుబది రెండవ అధ్యాయము — 838
కౌరవసేన పలాయనం

ఎనుబది మూడవ అధ్యాయము — 842
ఇరావతుడు విందానువిందులను, భగదత్తుడు ఘటోత్కచుని, నకుల సహదేవులు మద్రరాజును ఓడించుట.

ఎనుబది నాల్గవ అధ్యాయము — 844
ఉభయవీరుల ద్వంద్వ యుద్ధములు-విజయములు

ఎనుబది అయిదవ అధ్యాయము — 847
అర్జునుని పరాక్రమము

ఎనుబది ఆరవ అధ్యాయము — 850
భీష్మ యుధిష్ఠిరుల యుద్ధము

ఎనుబది యేడవ అధ్యాయము — 853
అష్టమ దివస యుద్ధము-ఉభయ సైనికులు

ఎనుబది ఎనిమిదవ అధ్యాయము — 854
భీష్ముని పరాక్రమము

నుబది తొమ్మిదవ అధ్యాయము — 857
ఉభయ సైనికుల తుముల యుద్ధము

తొంబదవ అధ్యాయము — 859
ఇరావంతునిచేత శకుని సోదరుల వధ

తొంబది ఒకటవ అధ్యాయము — 863
ఘటోత్కచ దుర్యోధనుల యుద్ధము

తొంబది రెండవ అధ్యాయము — 865
ఘటోత్కచునితో దుర్యోధనాది వీరుల యుద్ధము

| విషయము | పుట సంఖ్య |
|---|---|
| తొంబది మూడవ అధ్యాయము | 867 |
| భీమాదులతో పోరాడి కౌరవులు పారిపోవుట | |
| తొంబది నాలుగవ అధ్యాయము | 869 |
| భీమ-దుర్యోధనుల యుద్ధము | |
| తొంబది అయిదవ అధ్యాయము | 872 |
| భగదత్తుడు భీమ ఘటోత్కచులతో పోరాడుట | |
| తొంబది ఆరవ అధ్యాయ | 876 |
| ఇరావంతుని వధచేత అర్జునుని దుఃఖము | |
| తొంబది యేడవ అధ్యాయము | 880 |
| కర్ణునకు యుద్ధము చేయుటకు అజ్ఞ యిమ్మని దుర్యోధనుడు భీష్ముని నిర్బంధించుట | |
| తొంబది యెనిమిదవ అధ్యాయము | 883 |
| భీష్ముడు అర్జున పరాక్రమము వర్ణించుట | |
| తొంబది తొమ్మిదవ అధ్యాయము | 887 |
| వ్యూహ రచన-తుముల యుద్ధము-ఉత్పాతములు | |
| తొమ్మిదవనాటి యుద్ధము | |
| నూరవ అధ్యాయము | 889 |
| ద్రౌపదీ పుత్రులకు అభిమన్యునకు అలంబుషునితో యుద్ధము | |
| కౌరవ సేనల పలాయనము | |
| నూట ఒక్కటవ అధ్యాయము | 893 |
| అర్జునునితో భీష్మ కృపాచార్యుల యుద్ధము | |
| నూట రెండవ అధ్యాయము | 895 |
| ద్రోణ సుశర్మలతో అర్జునుని యుద్ధము | |
| నూట మూడవ అధ్యాయము | 897 |
| ఉభయ సేనల సంకుల సమరము | |

శ్రీః

# శ్రీ వేదవ్యాసమహాభారతము-భీష్మపర్వము

## ఒకటవ అధ్యాయము

## యథామూలాంధ్ర గద్యానువాదము_భగవద్గీతకు పూర్వభాగము
## జంబూద్వీప నిర్మాణ పర్వము

"వ్యాసభారత భీష్మపర్వంపునాంధ్ర
గద్యమున వ్రాయుచుంటి లక్ష్మణుడ నేను
వేంకటాధీశు నా యిలవేల్పుపాద
పద్మముఁదలంచి భక్తిభావంబుతోడ."

"నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్ ।
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్॥"

సర్వాంతర్యామి నారాయణ స్వరూపుడైన శ్రీకృష్ణభగవానుడు ఆయనకు నిత్యసఖుడు, నరస్వరూపుడు నరోత్తముడైన అర్జునుడు, ఆ నరనారాయణుల విచిత్రలీలలను ప్రకటించుభగవతియైన సరస్వతీదేవి, ఆ భగవల్లీలల సంకలనము చేయు వేదవ్యాసమహర్షి- వీరికి నమస్కారము చేసి 'జయము' అను పేరుగల మహాభారతమును పఠించవలెను.

వైశంపాయన మహాముని భారతోద్యోగపర్వకథను జనమేజయ మహారాజునకు చెప్పి యిప్పుడు భీష్మపర్వకథను చెప్పుటకు అరంభించుచున్నాడు.

### కురుక్షేత్రమునందు సైనికుల పరిస్థితి

జనమేజయుడు :- మహామునీ! కౌరవపాండవ సోమకవీరులు అనేక దేశములనుండి వచ్చిన ఇతరరాజవీరులు అక్కడ ఎట్లు యుద్ధము చేసిరి ?

జనమేజయుని ప్రశ్నమునకు వైశంపాయనుడిట్లు ఉత్తరము చెప్పెను.

మహారాజా ! తపోభూమియైన కురుక్షేత్రమునందు కురు-పాండవ-సోమక వీరులు యుద్ధముచేసిన క్రమమును గూర్చి చెప్పెద వినుము-

మహాబలశాలురైన ఆ వీరులందరు పరస్పరజయేచ్ఛచేత కురుక్షేత్రమున వచ్చినిలిచిరి. అందరు వేదాధ్యయనము చేసినారు, యుద్ధమునందు అభిమానము గలవారు యుద్ధమునందు జయము గోరుచూ ఒండొరులు ఎదుర్కొనుటకు నిలిచిరి. పాండవసైనికులు కౌరవసేనలకు ఎదురుగా పశ్చిమ దిశనుండి తూర్పుదిక్కుగా సాగుచూ ద్విధముగా నిలిచిరి. యుధిష్ఠిరుడు సమంతపంచకమునకు వెలుపలగా వేలకొలది శిబిరములు సేనానివేశమునకై యేర్పరచియుండెను.

సమస్త భూమండలమునందు నవయువకులెవ్వరుకూడా లేకుండిరి. స్త్రీబాల వృద్ధులు దప్ప అందరు యుద్ధముచేయుటకు వచ్చియుండిరి. భూమండలము నందంతటను, గజాశ్వరథయువకులు యుద్ధమునకే వచ్చియుండిరి. జంబూద్వీపము నందు సూర్యుడు ప్రకాశించునట్లు భూభాగమునందలి సేనలన్నియు నిరుపార్శ్వ ముల యందు సంగరముచేయుటకు వచ్చియుండెను.

యుద్ధభూమియందు అన్నివర్ణములవారు, అన్నిజాతులవారు ఒకచోట చేరి యుండిరి. అనేక యోజనముల విస్తీర్ణములో యుద్ధభూమియుండెను. సైనికులు అనేకప్రదేశములలో, నదీతీరములలో, అడవులలో, పర్వతప్రాంతములలో అన్ని చోట్లలోనూ చుట్టి వ్యాపించియుండిరి.

వారందరకున్ను యుధిష్ఠిరమహారాజు ఉత్తమోత్తమభోజనము, గజాశ్వము లకు మంచి ఆహారమున్ను పెట్టుటకు ఏర్పాట్లు చేసియుండెను. సైనికులకందరకు రాత్రి శయనించుటకు వివిధశయ్యలు ఏర్పరచియుండెను. యుద్ధభూమిలో తమ సైనికులను యోధులను గుర్తుపట్టుటకు అనేకచిహ్నములు-భూషణములు ప్రత్యేక ముగా వారికి ఏర్పరచెను.

అర్జునుని ధ్వజాగ్రము చూచి దుర్యోధనుడు తన సేనల వ్యూహరచనలు పాండవులకు విరుద్ధముగా చేసెను. దుర్యోధనునకు శ్వేతచ్ఛత్రము ధరింపబడి యుండెను. అతడు తన తమ్ములతో వేలకొలది యేనుగుల సైన్యమున విరాజిల్లు చుండెను.

అట్లు నిలచియున్న దుర్యోధనుని చూచి పాంచాలసైనికులు సంతోషముతో

శంఖ-భేరీధ్వనులు చేసిరి ఆవిధముగా సంతోషించుచున్న తమసైన్యమును చూచి పాండవులు శ్రీకృష్ణుడు మిక్కిలి సంతసించిరి. కృష్ణార్జునులుగూడ తమ పాంచజన్య-దేవదత్త శంఖములను ఊదిరి. ఈ రెండు శంఖధ్వనులు విని శత్రుసైనికులు భయపడి మలమూత్రములు చేసుకొనిరి. సింహము ధ్వనివిని ఇతర మృగములు భయపడునట్లు శత్రువులు బెదరిపోయిరి.

సైన్యముల తాకిడికి భూమినుండి రేగిన దుమ్ముచేత అంతటచీకట్లు క్రమ్మి ఏమియు తెలియక, సూర్యుడు అస్తమించినాడా యనునట్లుండెను. అప్పుడు మేఘములు అన్ని దిక్కులయందు సమస్త సైనికులమీద మాంసము, రక్తము వర్షించెను. అది మహాద్భుతముగానుండెను.

తరువాత భూమినుండి యిసుక, గులకరాళ్లతో వాయువు పైకి లేచి అంతట వ్యాపించెను. దానిచేత నూర్లకొలది వేలకొలది సైనికులు గాయపడిరి. ఉప్పొంగిన సముద్రమువలె రెండుసైన్యములు యుద్ధముకొరకు సంతోషముతో ఉబలాటపడుచుండెను. మహాప్రళయకాలమునందు రెండు సముద్రములు ఏకమైనట్లు కనబడుచుండెను.

## యుద్ధ నియమములు :

తరువాత కురు-పాండవ-సోమకులు ఒకచోట చేరి, కొన్ని యుద్ధనియమములు చేసుకొని, యుద్ధధర్మమర్యాదను స్థాపించిరి. ఆ నియమములిట్లుండెను-

జరుగుచున్న యుద్ధము ప్రతిదినము సాయంకాలమునందు నిలిపిన తరువాత మనమందరము పరస్పర ప్రేమతో నుండవలెను.

వాగ్యుద్ధము చేయువారు మాటలతోనే మాటకు మాట బదులు చెప్పుకోవలెను. అప్పుడు ఆయుధప్రయోగము చేయగూడదు.

సేననుండి బయటకు పోయినవారిని సంహరించకూడదు. గజము పైన కూర్చొని యుద్ధము చేయువాడు- గజసైనికునితో, కాల్బలముువాడు కాల్బలమువానితోను యుద్ధము చేయవలెనే కాని యితరునితో కూడదు.

సైనికుల యోగ్యత-ఇచ్ఛ-ఉత్సాహము-బలము వీటిననుసరించి శత్రువులకు వివరము తెలిపిన తరువాతనే అతనిపైన శస్త్రాస్త్రప్రయోగముచేయవలెను

విశ్వసించి అజాగ్రత్తతో నున్నవానిపైన, భయపడినవానిపైనను ఆయుధప్రయోగము చేయగూడదు.

ఇతరునితో పోరాడుచున్నవానిపైన, శరణుపొందినవానిపైన, వెన్నుచూపి పారిపోవువానిపైన, అస్త్రశస్త్రములు—కవచము తెగియున్నవానిపైననూ ఎప్పుడు గూడ ఆయుధము ప్రయోగించి అట్టివానిని చంపగూడదు.

గుర్రములకు సేవచేయుటకుగాను నియమింపబడిన సారథులపైనను, బరువుమోయుచు శస్త్రాస్త్రములను చేరవేయుచున్న వాహనములపైన, భేరీశంఖాదులు వాయించుచున్నవారిపైనను ఆయుధప్రయోగము చేయగూడదు.

ఈ విధముగా నియమములు చేసుకొని, కౌరవ-పాండవ—సోమకులు పరస్పరము చూచుకొనుచు ఆశ్చర్యచకితులైరి. తరువాత వారందరు సంతోషముతో తమ తమ స్థానములకు పోయి నిలిచిరి.

## రెండవ అధ్యాయము

### వేదవ్యాసుడు సంజయునకు దివ్యదృష్టి యిచ్చుట :

"జనమేజయా ! పూర్వపశ్చిమ దిక్కులయందు ఎదురెదురుగా నిలిచియున్న ఉభయపక్ష సైనికులను, త్రికాలజ్ఞుడైన వేదవ్యాసమహాముని చూచి, భవిష్యత్తులో జరుగబోవు యుద్ధముయొక్క భయంకర పరిణామమును కన్నులయెదుట చూచుచు ధృతరాష్ట్రుని వద్దకు వచ్చెను. అప్పుడా రాజు, తనపుత్రుల అన్యాయమును చింతించుచు దుఃఖములో మునిగి బాధపడుచుండెను.

అట్లున్న ధృతరాష్ట్రునితో వేదవ్యాసమహాముని యేకాంతమునందు ఇట్లనెను :-

"రాజా ! నీ పుత్రులకు ఇతరరాజులకు మృత్యుకాలము వచ్చినది వారు పరస్పరము పోరాడి చచ్చుటకు. చంపుటకు సంసిద్ధులైయున్నారు. వారు కాల (యమ) వశములో చిక్కుకొనియున్నారు. కాబట్టి వారినిగూర్చి నీవు దుఃఖింపకుము.

పుత్రా ! యుద్ధభూమిలో వారు అనుభవించు అవస్థను నీవు చూడదలచిన

యెడల, నీకు నేను దివ్యచక్షుస్సు ఇచ్చెదను. నీవిక్కడ కూర్చొనియుండియే, కురుక్షేత్రమునందు జరుగుచున్న యుద్ధమునంతయు ప్రత్యక్షముగా కన్నులకు కట్టినట్లు చూడగలవు."

ఆ మాటవిని ధృతరాష్ట్రుడు వేదవ్యాసునితో నిట్లనెను :-

"బ్రహ్మర్షిసత్తమా ! మా కుటుంబవ్యక్తుల వధను నేను ప్రత్యక్షముగా చూచుట మంచిదిగా నాకు కనబడదు. అది చూడజాలను. కానీ, నీ ప్రభావముచేత ఈ యుద్ధవృత్తాంతమునంతయు వినదలచినాను. అట్లు నన్ను అనుగ్రహింపుము."

జనమేజయా! ధృతరాష్ట్రుని మాట విని వ్యాసమహాముని సంజయునకు వరమునిచ్చుచు ధృతరాష్ట్రునితో నిట్లనెను :-

"రాజా ! ఈ సంజయుడు నీకు యుద్ధసమాచారమంతయు వినిపించగలడు యుద్ధభూమియందంతటను సంజయునకు కనపడకుండ ఉండునదియుండదు. అతనికి వరమిచ్చుచున్నాను. అతడు నేనిచ్చిన దివ్యదృష్టితో సర్వజ్ఞుడై, నీకు యుద్ధసమాచారము తాను చూచినది చూచినట్లుగా చెప్పగలడు.

సంజయుని కంటి యెదుటగాని, చాటుగాగాని, పగలు జరిగినదిగాని, రాత్రి జరిగినదిగాని, యోధులు మనసులో తలచినదిగాని, అన్నియు ఇతనికి తెలియును. ఇతనికి ఆయుధపుదెబ్బ తాకదు, అలసట కలుగదు, సంజయుడు ఈ యుద్ధములో చావక జీవించియుండును.

రాజా ! నేను ఈ కౌరవపాండవులందరి కీర్తిని మూడులోకములలో విస్తారముగా ప్రచురించెదను. నీవు దుఃఖించకుము. రాజా ! ఇది దైవవిధి. దీనినెవరు కూడా తప్పించజాలరు. కనుక నీవు శోకము చెందకుము. ఏ పక్షమునందు ధర్మము ఉండునో, ఆవైపే జయము సిద్ధించును.

మహారాజా! ఈ యుద్ధమునందు గొప్పగా మనుష్యసంహారము జరుగును. ఎందుకనగా ఇప్పుడు నాకు అతిభయంకరములైన అపశకునములు కనబడుచున్నవి. డేగలు-గ్రద్దలు-కాకులు-రాబందులు-కొంగలు చెట్లకొనలపైన కూర్చొని తమజాతి పక్షులను ఒకచోట సమూహములుగా చేర్చుకొనుచున్నవి.

రాజా ! ఈ పక్షులు మిక్కిలి ఆనందించుచు యుద్ధభూమికి సమీపముగా

వచ్చి చూచుచున్నవి. దీనిచేత, మాంసము తిను పక్షులన్నియు ఏనుగులయొక్క అశ్వములయొక్క మాంసము తినగలవు అని తెలియును. భయమును సూచించు రాబందులు కఠినముగా, క్రూరముగాను కూయుచు సైన్యము నడుమనుండి దక్షిణదిశగా పోవుచున్నవి.

రాజా! ఉదయసాయం సంధ్యలయందు ప్రతిదినము ఉదయించు, అస్తమించు సూర్యుని కబంధములు (మొండెములు) చుట్టియుండుట చూచుచున్నాను. ఉభయసంధ్యాకాలములందున్ను, మూడురంగుల పరిఘములు (సూర్యునికి అడ్డముగా పోవు మేఘపంక్తులు. ఈ మేఘపంక్తులు ఉదయసాయంకాల సంధ్యలయందు సూర్యుని అడ్డగించుచు దాటిపోవుచుండును). సూర్యుని అన్నివైపులనుండి చుట్టియున్నవి. సూర్యమండలముయొక్క రెండుకొనలకు తెలుపు ఎరుపురంగుల పరిఘములు, సూర్యమండల మధ్యమునందు నల్లరంగు పరిఘములును కనబడుచున్నవి. ఈ మేఘపంక్తులతోపాటు విద్యుత్తులుగూడ మెరయుచున్నవి. ఇదియొక పెద్ద అపశకునము.

మహారాజా! రాత్రింబగళ్ళు సూర్య-చంద్ర-నక్షత్రములు జ్వలించుచున్నట్లు నాకు తోచుచున్నవి. రాత్రి, పగళ్ళలో ఏలాటి భేదము నాకు కనబడుటలేదు. ఈ లక్షణములు భయము సూచించునవిగానున్నవి.

రాజా! కార్తీక పూర్ణమినాడు కమలమువంటి నీలాకాశమునందు చంద్రుడు ప్రభాహీనుడై కనబడుచున్నాడు. చంద్రుని కాంతిగూడ అగ్నివర్ణము గలదిగా కనబడుచున్నది.

మహారాజా! ఈ మొదలైన అపశకునముల ఫలమేమనగా మహాబాహులు బలశాలురైన అనేక రాజవీరులు సంహరింపబడి భూమండలమును కప్పుచు శయనించెదరు.

రాత్రివేళలందు ఆకాశమునందు వరాహము - పిల్లి ఈ రెండు జంతువులు ఎగిరి యెగిరి పోట్లాడుచు భయంకరముగా గర్జించుచు నాకు ప్రతిదినము కనబడుచున్నవి.

రాజా! దేవతాప్రతిమలు కంపించుచు, నవ్వుచు, నోటి నుండి నెత్తురు క్రక్కుచు ఖేదము చెందుచు క్రిందపడుచున్నవి.

రాజా ! దుందుభులు వాయింపబడకయే మ్రోగుచున్నవి. క్షత్రియుల పెద్ద పెద్ద రథములు తోలబడకయే పోవుచున్నవి.

కోకిలములు- వడ్రంగి పిట్టలు- పాలపిట్టలు- గ్రద్దలు- చిలకలు-బెగ్గరు పక్షులు- నెమళ్ళు భయంకరముగా కూయుచున్నవి.

గుర్రపురౌతులు చేతులలో డాలు-ఖడ్గము పట్టుకొని ఆక్రోశించుచున్నారు. అరుణోదయకాలమునందు మిడతలదండ్లు నూర్లకొలది అన్ని వైపుల వ్యాపించు చున్నవి.

ఉదయసాయం సంధ్యాకాలములందు దిక్కులు దహింపబడుచు కనబడు చున్నవి. రాజా! మేఘములు, దుమ్ము, మాంసము కురియుచున్నవి.

మూడు లోకములయందు గూడ పతివ్రతాశిరోమణియని ప్రఖ్యాతురాలైన అరుంధతి, తన పతియైన వసిష్ఠుని తన వెనుకభాగమునందు నిలుపుకొనియున్నది. ఆమె, ఆయన వెనుక ఉండవలెను కదా!

మహారాజా ! శనైశ్చరగ్రహము రోహిణీ నక్షత్రమును పీడించుచు నిలిచి యున్నది. చంద్రుని గురుతే కనబడకుండ మాసిపోయినది. దీని వలన భవి ష్యత్తులో గొప్ప భయము కలుగనున్నట్లు సూచితమగుచున్నది.

రాజా! ఆకాశమునందు మేఘములు లేకుండనే, అత్యంత భయంకరముగ ఉరుములు వినబడుచున్నవి. ఏడ్చుచున్న వాహనముల కన్నులనుండి అశ్రుబిందు వులు రాలిపడుచున్నవి

## మూడవ అధ్యాయము

### వ్యాసమహాముని అమంగళములు చెప్పుట:

ధృతరాష్ట్ర మహారాజా ! గోవుల గర్భము నుండి గాడిదలు పుట్టుచున్నవి. పుత్రులు తల్లులతో రమించుచున్నారు. వనములందలి వృక్షములకు అకాలము నందు పుష్పఫలములు పుట్టుచున్నవి.

గర్భవతులు పుత్రులను గాక, తమ గర్భము నుండి భయంకర జంతువు

లను కనుచున్నారు. మాంసము తిను మృగములు పక్షులతో చెలిమిచేసి ఒకేచోట ఆహారము తినుచున్నవి.

మూడు కొమ్ములు-నాలుగు కన్నులు-ఐదు కాళ్ళు-రెండు మూత్రేంద్రియములు-రెండు తలలు-రెండు తోకలు-అనేకములైన కోరలుగల అశుభములైన మృగములు పుట్టి అమంగళమును సూచించుచు నోర్లుతెరచి అరచుచున్నవి.

రాజా! గరుడపక్షుల తలలపైన జుట్టు-కొమ్ములు మొలచియున్నవి. వాటికి మూడు కాళ్ళు-నాలుగు కోరలు కనబడుచున్నవి. ఈ విధముగనే ఇతర జంతువులు కూడ కనబడుచున్నవి.

రాజా! నీ పట్టణమందలి వేదపండితులైన బ్రాహ్మణుల స్త్రీల గర్భముల నుండి గరుడపక్షులు నెమళ్ళు పుట్టుచున్నవి.

రాజా! ఆడు గుర్రములు ఆవు దూడలను, కుక్కలు నక్కలను, ఏనుగులు కుక్కలను కనుచున్నవి. చిలుకలు కూడ అశుభముగ కూయుచున్నవి.

స్త్రీలు ఒకేసారి నలుగురైదుగురు కన్యలను కనుచున్నారు. ఆ కన్యకలు పుట్టగనే నాట్యము-గానము చేయుచు నవ్వుచుందురు.

రాజా! సమస్త నీచజాతుల ఇండ్లలో పుట్టిన, అంధులు-పొట్టివారునైన బాలకులు గూడ, గొప్పభయమును సూచించుచు, బిగ్గరగా నవ్వుచు నాట్యము చేయుచు పాటలు పాడుచున్నారు.

వీరందరు కాల(యమ) ప్రేరితులై, చేతులలోని శస్త్రములతో ప్రతిమలు చిత్రించుచు వ్రాయుచున్నారు. చిన్నచిన్న పిల్లలు చేతులలో కర్రలు పట్టుకొని ఒకరిపైనొకరు దాడిచేయుచున్నారు. బాలకులు కృత్రిమనగరములు నిర్మించుకొని యుద్ధముచేయుచున్నట్లు పరస్పరనగరములను పడగొట్టుచు మట్టిలో కలుపుచున్నారు. కలువలు, కమలములు మొదలైన నీటిపూవులు వృక్షముల పైన పూచుచున్నవి.

రాజా! నలువైపుల సుడిగాలి రేగి భయంకరముగా నున్నది. పైకిలేచిన దుమ్ము అణుగుటలేదు. భూమి మాటిమాటికి కంపించుచున్నది. రాహుగ్రహము సూర్యునకు సమీపముగా పోవుచున్నది.

రాజా! కేతుగ్రహము చిత్రానక్షత్రమును అతిక్రమించి స్వాతి-నక్షత్రము పైన నిలిచియున్నది.

[రాహుకేతువులు పరస్పరము ఏడవరాశిలో నుండును. కాని ఇప్పుడు ఆ రెండు గ్రహములు ఒకే రాశిలో వచ్చియున్నవి. కాబట్టి ఈ గ్రహయోగము గొప్ప అనిష్టమును సూచించునదిగా నున్నది సూర్యుడు తులారాశిలో నున్నాడు. అతనికి సమీపముగా రాహుగ్రహము వచ్చియున్నది. తరువాత కేతుగ్రహము కూడా అక్కడకు వచ్చిచేరుట గొప్ప దుర్యోగమును సూచించుచున్నది.]

రాజా! గ్రహముల ఈ దుర్యోగము వలన కురువంశమునకు వినాశము కలుగనున్నట్లు కనపడుచున్నది. రాజా! అత్యంత భయంకరమైన ధూమకేతువు పుష్యనక్షత్రముపైన ఆక్రమించుచు అక్కడనే నిలిచియున్నది. ఈ రెండు ఉప గ్రహములు రెండు సేనలకు చాలా అమంగళము చేయగలవు.

రాజా! కుజగ్రహము వక్రగతితో మఘానక్షత్రముపైకి పోయి నిలిచి యున్నది. బృహస్పతి గ్రహము శ్రవణానక్షత్రంపైన విరాజమానమై యున్నది. సూర్యపుత్రుడైన శని పూర్వఫల్గుని (పుబ్బ) నక్షత్రము వద్దకు పోయి దానిని పీడించుచున్నాడు.

మహారాజా! శుక్రుడు పూర్వాభాద్ర నక్షత్రముపైన వచ్చి ప్రకాశించు చున్నాడు. శుక్రుడు అక్కడ అన్ని వైపుల తిరుగుచు 'పరిఘ' మను ఉపగ్రహ ముతో పాటు ఉత్తరాభాద్ర నక్షత్రము పైన దృష్టి వేసియున్నాడు.

కేతువనెడు ఉపగ్రహము ధూమముతో గూడిన అగ్నివలె జ్వలించుచు ఇంద్రదేవతా సంబంధము గల తేజస్వియైన జ్యేష్ఠానక్షత్రము పైకిపోయి నిలిచి యున్నది.

రాజా! చిత్రా స్వాతి నక్షత్రములు రెండింటి నడుమనున్న క్రూరగ్రహ మైన రాహువు సర్వదా వక్రించి రోహిణీ నక్షత్రమును, సూర్యచంద్రులను పీడించు చున్నది. అది మిక్కిలి ప్రజ్వలితమగుచు ధ్రువమునకు ఎడమవైపున పోవు చున్నది. ఆ గ్రహయోగము మిక్కిలి అనిష్టమును సూచించుచున్నది.

మహారాజా! అగ్నివలె, కాంతిమంతమైన కుజగ్రహము మఘానక్షత్ర

ములో నుండును. అది మాటిమాటికి వక్రించుచు బృహస్పతితో గూడిన నక్షత్ర మైన 'బ్రహ్మరాశి' శ్రవణమును పూర్తిగా కప్పియున్నది.

రాజా! ఈ గ్రహయోగప్రభావము పైర్లకు పంటలకు అనుకూలముగా నుండును. కాబట్టి, భూమి అన్నివిధములైన ధాన్యముల పంటపైర్లతో నిండి యున్నది. పైర్లపంక్తులచేత భూమి అలంకృతమై ఉన్నది. యవలపైర్లలో ఒక్కొక్క మొలకకు ఐదైదు రెమ్మలు- వరిమొక్కలలో ఒక్కొక్క దానికి నూరు నూరు రెమ్మలు మొలచి పెరుగుచున్నవి.

రాజా! సమస్తజగత్తుకు తల్లులవంటి గోవుల స్తనములు దూడలు కుడిచి నపుడు వాటి చన్నుల నుండి రక్తము స్రవించుచున్నది. తమ వశమునందు సమస్త ప్రపంచమును ఉంచుకొను ప్రధానవశువులైన గోవుల పరిస్థితియే యిట్లు న్నది.

రాజా! యోధుల ధనుస్సుల నుండి అగ్నిజ్వాలలు బయలు వెడలుచున్నవి. ఖడ్గములు మిక్కిలి జ్వలించుచున్నవి. ఆశస్త్రములన్నియు స్పష్టముగా యుద్ధము సంప్రాప్తమైనట్లు సూచించుచున్నవి.

రాజా! ఆయుధములు- జలము- కవచములు-ధ్వజములు, వీటి కాంతులు అగ్ని కాంతివలె ఎర్రగా కనబడుచున్నవి. అందుచేత గొప్ప జనసంహారము సంభవించుట నిశ్చయమని స్పష్టముగా తోచుచున్నది.

రాజా! పాండవులతో కౌరవులు హింసారూపమైన సంగ్రామము ఆరంభించినప్పుడు భూమిపైన రక్తనదులు ప్రవహించగలవు. ఆ నెత్తుటి సుడులు కలుగును. రథధ్వజములు ఆ నదులపైన చిన్న చిన్న పడవలు తెప్పలవలె అన్ని వైపుల వ్యాపించుచు కనబడగలవు.

రాజా! అన్ని దిక్కులయందు పశు పక్షి మృగాదులు ప్రాణనాశకరము లైన అనర్థములను కనబరచుచు భయంకరముగ అరచుచున్నవి. వాటి ముఖములు జ్వలించుచున్నట్లు కనబడుచున్నవి. అవి అరపులచేత, మహాభయంకర వినాశ మును సూచించుచున్నవి.

రాజా! రాత్రియందు, ఒక కన్ను, ఒక రెక్క, ఒక కాలు గల పక్షి

ఆకాశమునందు తిరుగుచున్నది. అది కోపముతో భయంకరముగా కూయుచున్నది. దాని కూతల వలన, అది రక్తము క్రక్కుచున్నదా యనునట్లు తోచుచున్నది.

రాజా ! ఇప్పుడు ఆయుధములన్నియు కాలుచున్నట్లు తోచుచున్నవి. మహాతేజస్వులైన సప్తర్షుల కాంతి తగ్గి తేజోహీనమైపోవుచున్నది.

రాజా ! ఒక సంవత్సరపర్యంతము ఒక రాశిలోనే యుండు ప్రకాశమానములైన బృహస్పతి శనైశ్చర గ్రహములు రెండుగూడ "తిర్యగ్వేధ" ద్వారా విశాఖానక్షత్ర సమీపమునకు వచ్చినవి.

మహారాజా ! ఈ పక్షమునందు తిధులు క్షయము చెందును. కాబట్టి త్రయోదశి తిథియందొకనాడే, పర్వదినము కాకున్నప్పటికిన్ని రాహుగ్రహము చంద్ర సూర్యులిద్దరిని మింగినది. కాబట్టి గ్రహణావస్థలో చిక్కుకొన్న సూర్య చంద్రులిరువురు గూడ ప్రజాసంహారమును కోరుచున్నారు.

రాజా ! క్రూరకర్మలే చేయునట్టి, రాహుగ్రహము చిత్రా స్వాతి నక్షత్రముల నడుమ నిలిచి "సర్వతో భద్ర చక్రము"నందున్న వేధప్రకారము కృత్తికా నక్షత్రమును పీడించుచున్నది. ధూమకేతువును ఆశ్రయించి సుడిగాలులు ఘోరముగా పైకిలేచి వీచుచున్నవి.

ఇది యంతయు విషమపరిస్థితిని యుద్ధమును కలిగించునదిగా నున్నది.

రాజా ! అశ్విన్యాదులైన యిరువదియేడు నక్షత్రములు మూడు మూడుగా విభజించినప్పుడు, ఒక్కొక్క నక్షత్ర సముదాయమునందు తొమ్మిది నక్షత్రములు ఉండును. ఆ మూడింటికి క్రమముగా అశ్వపతి-గజపతి-నరపతి ఛత్రములని పేర్లు ఉండును. ఈ మూడు ఛత్రములను పాపగ్రహములు ఆక్రమించినప్పుడు క్షత్రియుల వినాశము సూచింపబడును. ఈ మూడింటికిన్నీ నక్షత్ర-నక్షత్రములు అని పేరు గలదు. ఈ నక్షత్ర నక్షత్రములు మూడింటి శిరస్సుల పైన పాపగ్రహవేధ కలిగిన యెడల ఆ పాపగ్రహము చాలా గొప్ప భయమును కలిగించునదిగా నుండును. ఇప్పుడు అటువంటి కుయోగమే కలిగినది. కనుక ప్రజానాశము తప్పదు.

రాజా ! ఒక తిథి క్షయమైన యెడల, పదునాల్గవదినము తిథి క్షయము కానియెడల పదునైదవ దినము, ఒక తిథి అధికమైనప్పుడు పదునాలుగవదినము

అమావాస్య వచ్చుట చూచుచున్నాము. కాని, ఈ పక్షమునందు పదమూడవదినము నందే అమావాస్య వచ్చినది. ఈవిధముగా పూర్వము గూడ ఒకప్పుడు వచ్చి యుండెను. కాని దాని జ్ఞాపకము నాకు లేదు. ఈ ఒక్క నెలలోనే పదమూడు దినముల మధ్య చంద్రగ్రహణము-సూర్యగ్రహణము రెండుగూడ వచ్చియున్నవి.

రాజా ! ఈవిధముగా అప్రసిద్ధ పర్వములందు గ్రహణములు వచ్చినందు వలన ఈ సూర్యచంద్రులు ప్రజానాశము చేయగలవు. కృష్ణపక్ష చతుర్దశినాడు చాల వడిగా మాంసవర్షము కురిసెను. ఆ సమయమునందు రాక్షసుల నోర్లు రక్తముతో నిండియుండెను వారు నెత్తురు పూర్ణముగా త్రాగుచుగూడ తృప్తిచెంద కుండిరి.

రాజా ! పెద్దపెద్ద మహానదుల జలములు రక్తమువలె ఎర్రగానాయెను. ఆ రక్తప్రవాహములు క్రిందుగా పారక, ఎదురుప్రవాహములుగా పారుచున్నవి. నూతుల నుండి నురుగులు పైకెగురుచు ఎద్దులవలె కనబడుచున్నవి.

రాజా ! పిడుగుల ధ్వనితో ఇంద్రుని వజ్రాయుధము వంటి కొరవులు భూమిపైన పడుచున్నవి. ఈరాత్రి గడచిన తరువాత రేపు ఉదయము నుండియే మీకు, మీరుచేసిన అన్యాయమునకు ఫలము కలుగుటకు ఆరంభించగలదు.

రాజా ! అన్ని దిక్కులయందు చీకట్లు క్రమ్మియుండుటచేత మహర్షులు పెద్దపెద్ద దివిటీలు చేతబట్టుకొని తమ పర్ణశాలల నుండి బయలువెడలి, ఒండొరులతో ఈ భూమి వేలకొలది రాజులందరి రక్తము త్రాగునని తోచుచున్నది అని పలికిరి.

రాజా ! కైలాసమందర హిమాలయపర్వతముల నుండి అనేక ప్రకారములైన అతి భయంకరశబ్దములు వేలకొలదిగా బయలువెడలుచున్నవి. ఆ పర్వత శిఖరములు గూడ విరిగి క్రిందపడుచున్నవి. భూకంపము కలిగినందు వలన నాలుగు సముద్రములు వేరువేరుగా ఉప్పొంగి, భూమిని క్షోభింపచేయుచు తమ యెల్లలను దాటుచున్నట్లు తోచుచున్నది.

ఇసుకను, గులకరాలను లాగుచు సుడిగాలి లేచి వృక్షములను పెరికి పారవేయుచున్నది. గ్రామములయందు, నగరములయందు వృక్షములు, రచ్చ కట్టల చెట్లు (చైత్యములు) భయంకరమహావాయువులందలి పిడుగుల దెబ్బచేత విరిగిపడుచున్నవి.

బ్రాహ్మణులు హోమాలు చేసినప్పుడు జ్వలించిన అగ్ని నల్లగా, ఎర్రగా, పసుపుపచ్చగా కనబడుచున్నది. ఆ యగ్నిజ్వాలలు ఎడమవైపుగా తిరుగుచు పైకి లేచుచున్నవి. ఆ జ్వాలలనుండి దుర్గంధము వెడలుచున్నది. భయంకరముగా నవి శబ్దించుచున్నవి. రాజా! స్పర్శము-గంధము-రసము విపరీత గుణములు గలవిగా తోచుచున్నవి. (అనగా ఉష్ణవస్తువు శీతస్పర్శము గలదిగా, సుగంధవస్తువు దుర్గంధము గలదిగా, మధురవస్తువు వేరు రుచులు గలదిగాను తోచుచున్నవని భావము).

రాజా! ధ్వజములు మాటిమాటికి కంపించుచు పొగలిడుచున్నవి. తప్పెట్లు, దుందుభులు మొదలైన ద్రవ్యములు అగ్నిని వర్షించుచున్నవి.

ఫలపుష్ప సమృద్ధములైన వృక్షముల అగ్రభాగములందు ఎడమవైపుగా తిరుగుచువచ్చి కూర్చొని కాకులు కావు కావుమని భయంకరముగా కోలాహలము చేయుచున్నవి.

అనేకపక్షులు మాటిమాటికి 'పక్వా-పక్వా' అని బిగ్గరగా ఉచ్చరించుచు ధ్వజముల కొనలయందు దాగియున్నవి. ఈ లక్షణములు రాజుల వినాశమును సూచించుచున్నవి.

దుష్టగజములు వణకుచు, చింతించుచు భయముచేత నీటిని అటు ఇటు వెదజల్లుచున్నవి. అశ్వములు అతిదీనములుగానున్నవి. గజరాజములన్నియు భయముచేత నీటి మడుగులను ఆశ్రయించియున్నవి.

మహారాజా! ఇప్పుడు నేను చెప్పిన దుశ్శకునములు - అమంగళములు వింటివిగదా! వీటి పరిణామములను బాగుగా విచారించి నీవు ఈ పరిస్థితులలో ఈ సమయమునందు కలుగనున్న ప్రపంచవినాశమును నివారించుటకు తగిన ఉపాయమేదైనా అనుసరించుము.

జనమేజయా! తన తండ్రి వ్యాసభగవానుడు చెప్పిన మాటలు విని ధృతరాష్ట్రుడు ఆయనతో నిట్లనెను :-

భగవన్! ఇది దైవము పూర్వమే నిశ్చయించెనని నేను విశ్వసించెదను. అందువలన తప్పక జనసంహారము కలుగును. రాజులోకవేళ క్షత్రియధర్మము ననుసరించి సంహరింపబడిన యెడల, వీరలోకము చేరెదరు. అప్పుడు వారికి

స్వర్గాది సుఖములు లభించును. ఈ లోకమునందు కీర్తిగూడ వారికి లభించును. ఇహపరములు వారికి మంచివే యగును.

జనమేజయా! యీవిధముగా తన పుత్రుడు ధృతరాష్ట్రుడు యధార్థవిషయము చెప్పగా జ్ఞానవంతులలో శ్రేష్ఠుడైన వ్యాసమహర్షి కొంతసేపు చాలా విచారించి రెండు గడియలు చింతించి మరల ఈవిధముగా చెప్పదొడగెను.

రాజా! కాలమే (యముడు) యీ ప్రపంచసంహారము చేయుననుటలో సంశయములేదు. కాలమే మరల జగత్తునంతయు సృజించును. ఇక్కడ ఏవస్తువు గూడ శాశ్వతముగా ఉండదు.

కనుక రాజా! నీ బంధువులకు, కౌరవులకు, నీ హితముగోరు మిత్రులకు ధర్మానుకూలమైన మార్గమును ఉపదేశించుము. ఎందుకనగా నీవు వారినందరిని నియంత్రించుటకు సమర్థుడవు. తన జాతివధను ఉపేక్షించుట చాల నీచకార్యమని చెప్పబడినది. అది నాకు ఏమాత్రము ప్రియమైనది కాదు. నీవు ఈ అప్రియ కార్యము చేయకుము.

రాజా! నీకు యముడే పుత్రుడుగా పుట్టినాడు. హింస మంచిదిగాదని వేదములలో చెప్పబడినది. హింసచేత ఏవిధమైన హితముగూడ కలుగదు.

రాజా! కులధర్మము తన శరీరముతో సమానమైనది. ఎవడు ఇటువంటి కులధర్మమును నశింపచేయునో అతనిని ఆ ధర్మమే నశింపచేయును. ఎంతవరకు ధర్మమును పాలించుట సాధ్యమైయుండునో, ఎంతవరకు ఏవిధమైన సంకటము నీపైన బడకుండెనో అంతవరకు నీవు కాలప్రేరితుడై ధర్మమును నిర్లక్ష్యము చేసి చెడుమార్గములో నడచితివి. ఇప్పుడు చింతించుచున్నావు. సాధారణముగా లోకులు సంకటము ప్రాప్తించినప్పుడే యోచించెదరు.

రాజా! నీ కులనాశము కొరకు, అనేక రాజవీరుల వినాశము, నీ రాజ్యము అను అనర్థము సంప్రాప్తించినది. నీ ధర్మము లోపించిపోయినది నీ పుత్రులకు ధర్మమార్గము చూపించుము. నీకు రాజ్యములో పనియేమి? నీకు అనవసరమైన ఈ రాజ్యము కొరకు నీవు పాపమెందుకు ఒడిగట్టుకొనుచున్నావు? నీవు యశస్సును, కీర్తిని, ధర్మమును పాలించినచో స్వర్గసుఖము పొందగలవు. కనుక నామాట

వినుము. (యుద్ధాదులందు గెలుచుటవలన కలుగునది కీర్తి, విద్యవలన కలుగునది యశస్సు అని రెండింటికి భేదము.)

రాజా! పాండవులకు వారి రాజ్యము చెందుగాక! సమస్త కౌరవులు పరస్పరము సంధిచేసుకొని శాంతితో నుందురుగాక!

జనమేజయా! వ్యాసమహాముని యీ విధముగా ధృతరాష్ట్రునకు ఉపదేశము చేయుచుండగనే మధ్యలో ధృతరాష్ట్రుడు ఆయన మాటకు అడ్డము వచ్చి యిట్లనెను :-

తండ్రీ! నీవు చెప్పు విషయమే నేనుకూడా యోచించుచుందును. ఇది యంతయు నాకు తెలియును. భావాభావముల యథార్థస్వరూపము నాకుగూడ తెలియును. అయినను, ఈ ప్రపంచము తన స్వార్థసిద్ధికొరకు మోహములో పడియున్నది. ఈ ప్రపంచమునందు నన్నుగూడ ఒక వ్యక్తిగా తెలుసుకొనుము. కనుక నన్నుగూడ మోహము ఆవరించియున్నది.

మహాత్మా! నీ ప్రభావము అనమానమైనది నీవు మాకు ఆశ్రయుడవు. మార్గదర్శకుడు. మహాపండితుడవు. ధీరుడవు. నిన్ను ప్రసన్నుని చేయగోరుచున్నాను. మహర్షి! నా బుద్ధిగూడ అధర్మము వైపు పోవదు. కాని ఏమిచేయుదును? నా పుత్రులు నా వశములో లేరు. నీవే మా భరతవంశీయులకు ధర్మప్రదర్శకుడవు నీవలననే మాకు యశస్సు, కీర్తి కలుగును నీవు కౌరవపాండవులిరువురకున్ను మాననీయుడవైన పితామహుడవు.

ఆ మాట విని వ్యాసుడిట్లనెను :-

రాజా! నీ మనస్సులో కలిగిన సందేహమును నీ యిచ్ఛానుసారముగ తెలుపుము. నేను నీ సంశయము నివారించెదను.

ఆ మాటకు ధృతరాష్ట్రుడిట్లనెను :-

భగవన్! యుద్ధమునందు నిశ్చయముగా విజయము కలుగువారికి గల శుభలక్షణములేవియో తెలుపుము. వాటిని యథార్థముగా వినగోరుచున్నాను.

## వ్యాసుడు విజయసూచక శుభలక్షణములు చెప్పుట :

రాజా! "అగ్ని తేజస్సు నిర్మలముగా నుండుట- అగ్నిజ్వాలలు పై

భాగమునందు కుడివైపుగా ప్రసరించుట-పొగ యేమాత్రము లేకుండుట-అగ్నిలో హోమము చేయబడిన వస్తువులనుండి పవిత్రసుగంధము వెడలి వాయువుతో కలిసి అంతట వ్యాపించుట." ఇవి భవిష్యత్తులో కలుగబోవు విజయమును సూచించు లక్షణములని యెరుగుము.

రాజా! యేవైపున శంఖమృదంగాది వాద్యముల ధ్వనులు మిక్కిలి బిగ్గరగా కలుగుచుండునో, ఏవైపువారికి సూర్యచంద్రుల కిరణములు స్వచ్ఛముగా కనబడుచుండునో అవి వారి విజయమును సూచించు లక్షణములని తెలుసుకొనుము.

మహారాజా! యే పక్షమువారు యుద్ధమునకు ప్రయాణము చేయుచున్నప్పుడు గాని ప్రయాణము చేయుటకు పూనుకొనినప్పుడుగాని కాకులు మధురముగా కూయునో, అది వారి విజయమును సూచించును.

రాజా! వెనుక వైపు ధ్వనించు కాకులు విజయమును సూచించుచు శీఘ్రముగా ముందుకు సాగిపోవుటకు ప్రోత్సహించును. ఎదురుగా కూయుకాకులు యుద్ధయాత్రను నివారించుచున్నవని తెలియవలెను.

మహారాజా! శుభమును శ్రేయస్సును సూచించు ధ్వనులు చేయు రాజహంసలు- చిలుకలు-క్రౌంచపక్షులు. నెమళ్ళు మొదలైన పక్షులు సైనికులకు కుడివైపుగా ప్రదక్షిణము చేయుచు ఏ పక్షమునందు పోవునో, ఆ పక్షమువారికి యుద్ధమునందు నిశ్చయముగా విజయము సిద్ధించునని బ్రాహ్మణులు చెప్పెదరు.

రాజా! ఎవరి సేన అలంకారములతో, కవచములతో, ధ్వజములతో, సింహనాదములతో, గుర్రముల సకిలింపులతోను మిక్కిలి శోభాయముగా నుండునో, ఎవరి సైన్యము వైపు చూచుటగూడ శత్రువులకు అతికఠినముగా తోచునో అట్టివారు అవశ్యముగా శత్రువులపైన విజయము సాధించగలరు.

భరతభూషణా! ఏ పక్షమునందలి యోధుల మాటలు సంతోషపూర్ణము, ఉత్సాహముతోను నుండునో, ఏ యోధుల మనస్సులు ప్రసన్నములుగా నుండునో, ఏ యోధుల కంఠములందున్న పుష్పమాలికలు వాడిపోకయుండునో ఆ యోధులు యుద్ధమనెడు మహాసముద్రమును సుఖముగా దాటెదరు.

రాజా! యే పక్షమునందలి సైనికులు- యోధులు శత్రుసేనలో ప్రవేశింప

గోరుచున్నప్పుడు గాని, ప్రవేశించిన తరువాతగాని "నేను నిన్ను ఇప్పుడే కొట్టి తరిమెదను" ఈ మొదలైన శౌర్యసూచక వచనములు ఇష్టముగ చెప్పుచు తమ యుద్ధసామర్థ్యమును చూపెదరో, అట్టివారు తరువాత రాబోవు తమ విజయమును తొలుతనుండియే నిశ్చయించుకొనియుండెదరు.

దీనికి వ్యతిరేకముగా, ఎవరు శత్రుసేనలో ప్రవేశించునప్పుడు ఎదుటి పక్షమునుండి నిషేధసూచక వాక్యములు వినెదరో, వారికి అపజయము కలుగును.

రాజా ! ఏ యోధుల శబ్దములు-రూపములు-రసములు-గంధములు-స్పర్శములు మొదలైనవి, వికృతములు కాకుండా, మంగళకరములుగా నుండునో ఎవరి హృదయములందు సర్వదా హర్షోత్సాహములు నిండియుండునో వారికి విజయము కలుగును.

ఎవరికి అనుకూలముగా వాయువులు వీచునో మేఘములు-పక్షులు అనుకూలముగ నుండునో, ఎవరి వెనువెనుకగా మేఘములు గొడుగుపట్టినట్లు నీడ కలిపించునో, ఇంద్రధనుస్సుగూడ ఎవరికి అనుకూలదిక్కునందు కనబడునో అవి వారికి విజయమును సిద్ధింపజేయు శుభలక్షణములని యెరుగుము.

రాజా ! మరణమాసన్నమైనవారికి వీటికి విపరీతముగ లక్షణములు తోచును.

రాజా ! సైన్యము చిన్నదైనను పెద్దదైనను సరియే. కాని, అందలి సైనికులందరు హర్షోత్సాహములతో నిండియుండిన యెడల ఆ పక్షమునకు విజయము నిశ్చితము.

రాజా ! ఒకవేళ ఒక్క సైనికుడైనను ఉత్సాహశూన్యుడై వెనుకకు తగ్గి పారిపోయిన యెడల అతడు చూచుచుండగనే అతని పెద్దసేనయంతటిని నతడే పారగొట్టినవాడగును. సైనికులందరు పారిపోవుటకతడే కారణమగును. సేన పలాయనము చిత్తగించిన తరువాత ఆ సేనలోని పెద్దపెద్ద యోధులుగూడ విధిలేక పారిపోయెదరు.

రాజా ! ఎప్పుడు పెద్దసేన పరుగెత్తిపోవుటకారంభించునో అప్పుడు పారిపోవుచున్న మృగముల మందను వలె పల్లమునకు వడిగా ప్రవహించుచున్న నదీ

ఱలమును వలెను, ఆ సేనను తిరిగి యుద్ధభూమివైపు మరలించుట మిక్కిలి అసాధ్యమగును.

రాజా! ఆ విధముగా భయపడి పారిపోవుచున్న సైనికులను చూచి యితర యోధులకుగూడ ఎక్కువ భయము కలుగును. తరువాత సేనయంతయు హఠాత్తుగా ఉత్సాహము చచ్చి అన్నిదిక్కులకు పారిపోవజొచ్చును.

రాజా! ఆ సైన్యములోని ఉత్తమోత్తములైన అనేక యుద్ధవీరులుగూడ, పారిపోవుచున్న ఆ పెద్దసేనను, ఆపి యుద్ధభూమిలో నిలువజాలరు. అందువలన బుద్ధిమంతుడైన రాజు, ఎల్లప్పుడును జాగ్రత్తతోనుండి, యేదైన యొక యుపాయములో, ఆ విశాలమైన చతురంగ సైన్యమును, మిక్కిలి గౌరవపూర్వకముగా ఆదరించి వారు స్థిరముగ నిలుచునట్లు ప్రయత్నము చేయవలెను.

రాజా! సామోపాయముచేత, దానోపాయముచేతను సాధించు విజయమే శ్రేష్ఠమని పెద్దలు అభిప్రాయపడెదరు. భేదోపాయముచేత శత్రువులలో పరస్పర ద్వేషము కల్పించుటచేత సాధించిన విజయము మధ్యమమని చెప్పెదరు. యుద్ధములో శత్రువులను కొట్టి-చంపి ఓడించు దండోపాయము అన్నింటికంటే నీచమైనదని చెప్పెదరు. అట్టి విజయము అధమమైనది.

రాజా! యుద్ధమే మహాదోషముల పుట్ట. ఆ దోషములన్నిటిలో పెద్దది ప్రధానమైనదియు జనసంహారమని తెలిసికొనుము. ఒకవేళ ఒండొరులను తెలిసికొనగలిగినవారు, హర్షోత్సాహములు గలవారు ఏయితరవిషయమందుగూడ ఆసక్తి లేక విజయము సాధించుటకు దృఢనిశ్చయముతో నుండువారు, శౌర్యసంపన్నులైన వీరులు ఏబదిమంది యున్నప్పటికిన్ని అట్టి వీరసైనికులు, చాలాపెద్ద శత్రుసేననుగూడ నశింపజేయగలరు. ఒకవేళ అడుగు వెనుకకువేయకుండ ధైర్యములో నిలిచి పోరాడువారు ఐదారుగురు వీరులు ఆ యుద్ధము చేసినయెడల ఆ ఐదారుగురు యోధులే నిశ్చయముగా విజయము సాధించగలరు.

రాజా! వైనతేయుడైన గరుడునంతటివాడు గూడ పెద్దసైన్యము వినాశము పాలగుచుండుటను చూచి, అక్కడ పోరాడుచు చచ్చుచున్న అధిక సంఖ్యలో నున్న జనసమూహమును మెచ్చుకొనడు.

రాజా! సైనికులసంఖ్య బహుళముగా నున్నంతమాత్రమున గెలుపు గలు

గదు. యుద్ధమునందు తరచుగా విజయము నిశ్చితముకాదు. విజయమునకు దైవ బలము ఉండవలెను. అన్నింటికంటె దైవబలమే పెద్దది. యుద్ధమునందు విజయ మును సాధించినవాడే కృతకృత్యుడగును. వాడే ధన్యుడని తెలిసికొనుము.

జనమేజయా ! ఇట్లు వ్యాసభగవానుడు ధృతరాష్ట్రునకు ఉపదేశించి వెడలి పోయిన తరువాత ధృతరాష్ట్రుడు ధ్యాననిమగ్నుడై వ్యాసుని మాటలనే విచారించుచు ముహూర్తకాలము ఉండి మాటిమాటికి నిట్టూర్చుచు సంజయునితో నిట్లనెను:—

## నాల్గవ అధ్యాయము

### సంజయుడు భూమి గుణములు ధృతరాష్ట్రునకు చెప్పుట :

సంజయా ! ఈ భూమండలము నందలి రాజులందరు ఈ భూమికై తమ జీవితమును బలియిచ్చెదరు. యుద్ధమును అభినందించుచుందురు. అనేకములైన చిన్న పెద్ద ఆయుధములచేత పరస్పరము కొట్టుకొని చచ్చెదరు. ఈ భూమండ లైశ్వర్యమును తామే కోరుచు ఒండొరులను సహించక పోరాడుచుండెదరు. ఒండొరులను చంపుకొనుచు యమలోకమునందు జనసంఖ్యను పెంచుచుండెదరు. వారు ఎప్పుడుగూడ శాంతితో నుండరు. కనుక ఈ భూమిలో అనేక గుణము లున్నవని తలచెదను. సంజయా ! ఈ భూమిలోనున్న గుణములను గూర్చి నాకు వర్ణించి చెప్పుము.

సంజయా ! ఈ కురుక్షేత్రమునందు ప్రపంచమునందలి యెన్నియో వేలు లక్షలు- అర్బుదముల సంఖ్యలో వీరులు ఒకచోట చేరియున్నారు. వీరు ఏ దేశ ములనుండి వచ్చినారో, ఆ దేశముల వైశాల్యమునుగూర్చి వినదలచినాను. చెప్పుము ఎందుకనగా, నీవు మహాతేజస్వియైన వ్యాసమహాముని ప్రభావముచేత దివ్యజ్ఞాన సంపన్నుడవై యున్నావు. కనుక చెప్పుము.

ఆ మాట విని సంజయుడిట్లనెను :—

రాజా ! నాకు తెలిసినంతవరకు ఈ భూమి గుణములను గూర్చి వర్ణించి చెప్పెదను. రాజా ! నీవు శాస్త్రదృష్టిచేత ఈ విషయములను పరిశీలించి తెలిసి కొనుము.

రాజా ! ప్రపంచమునందలి భూతములు చరములు (జంగమములు) అచరములు (స్థావరములు)నని రెండువిధములుగ నున్నవి. జంగమ ప్రాణులు- అండజములు - స్వేదజములు - జరాయుజములు అని మూడు విధములుగ నుండును. (స్త్రీగర్భకోశమునకు జరాయు అని పేరు.)

రాజా! జంగమములు మూడింటిలోను జరాయుజములు శ్రేష్ఠములు. జరాయుజములలో గూడ మనుష్యులు- పశువులు నుత్తమములు. జరాయుజములనేక ఆకారములలోనుండును. రాజా! అవి పదునాల్గు విధములుగ నుండునవి వేదములలో చెప్పబడినది. జరాయుజములయందే యజ్ఞములు ప్రతిష్ఠితములైయున్నవి.

రాజా ! గ్రామమునందలి జరాయుజములలో మనుష్యులు శ్రేష్ఠులు. వనమునందలి జరాయుజములలో సింహములు ఉత్తమములు. సమస్తప్రాణుల జీవన నిర్వాహణము పరస్పర సహకారముతో జరుగును. (అండజములు పక్షులు- స్వేదజలములు- నల్లులు, పేలు మొదలగు కీటకములు).

రాజా ! స్థావరములకు 'ఉద్భిజ్జములు' అని పేరు. (అనగా భూమిని చీల్చుకొని పైకి మొలచు వృక్షములు మొదలగునవి). అవి ఐదు జాతులుగా నుండును. వృక్షములు - పొదలు-లతలు (రాతినుండి పుట్టుతీగలు) - వల్లులు (సాధారణ లతలు)—వెదుళ్ళు ఇవి తృణజాతులనబడును.

రాజా! ఈ స్థావరజంగమములన్నియును పందొమ్మిది ప్రాణులు ఉన్నవి. వీటితోపాటు పృథివి-జలము-వాయువు-అగ్ని-ఆకాశము నను నైదు మహాభూతములను చేర్చినచో మొత్తము ఇరువదినాలుగు జాతులగును. గాయత్రీ మంత్రమునకు గూడ ఇరువదినాలుగు అక్షరములు గలవు. కాబట్టి ఈ ఇరువదినాలుగు భూతములకు గూడ లోకమునందు గాయత్రి అని పేరుగలదు.

రాజా' లోకమునందుగల సర్వగుణసంపన్నమైన యీ పవిత్ర గాయత్రిని యథార్థరూపములో తెలిసికొనినవారు ఎప్పుడుగూడ నష్టపడరు.

రాజా ! పూర్వము చెప్పబడిన పదునాలుగు జరాయుజములలో వనపశుజాతులు ఏడు- గ్రామపశుజాతులు ఏడుగానుండును. సింహ-వ్యాఘ్ర-వరాహ-మహిష (అడవిదున్నలు)- గజ-భల్లూక-వానరములు ఏడు వనజాతులు.

గోవులు-మేకలు-గొఱ్ఱెలు-మనుష్యులు-గుఱ్ఱములు- కంచర గాడిదలు-

ఈ యేడున్ను గ్రామమునందుండు పశువులు. వెరసి పదునాలుగు పశుజాతు లగును.

రాజా ! అన్నియు ఈ భూమిపైననే జనించును. భూమిలోనే లీనమగును. భూమియే సర్వప్రాణులకు ప్రతిష్ఠాకారణము-ఆశ్రయముగా నున్నది.

ఈ భూమి యెవని అధికారములోనుండునో అతని అధికారములోనే సమస్త స్థావరజంగమాత్మకమైన ప్రపంచము ఉండును. కాబట్టియే, భూమిపైన ఆసక్తి సహజముగా రాజులకు కలిగి, వారు ఒండొరులను చంపి భూమిని ఆక్ర మించుకొనుటకు ప్రయత్నించుచుండెదరు.

## ఐదవ అధ్యాయము

### సంజయుడు పంచమహాభూతములను సుదర్శన ద్వీపమును వర్ణించుట :

సంజయా ! నదులు-పర్వతములు-దేశములు-భూమిని ఆశ్రయించియుండు నితరములు- ఈ మొదలైన అన్నిటిపేర్లు తెలుపుము సంజయా! నీకు అన్నింటి ప్రమాణములు (వెడల్పు-పొడవు కొలతలు) తెలియును గాబట్టి తెలుపుము. ఇక్కడి వనములనుగూర్చిగూడ వర్ణించి చెప్పుము.

జనమేజయా ! ఆ మాటకు సంజయుడు ధృతరాష్ట్రునితో నిట్లనెను :-

మహారాజా ! భూమండలమునందుగల సమస్తవస్తువులుగూడ పంచ మహా భూతముల స్వరూపము లేయని తెలిసికొనుము. అందుచేతనే పండితులు వాటికి 'సమములు' అని పేరుపెట్టినారు. అనగా సమానములని అర్థము.

ఆకాశము-వాయువు-అగ్ని-జలము-భూమి- ఈ ఐదు 'మహాభూతములు' అనబడును. ఈ ఆకాశాదులైన యైదింటిలోను వరుసగా పూర్వముకన్న తరు వాతి భూతములలో గుణములు ఒక్కొక్కటి అధికముగానుండును. ఈ ఐదు భూతములలో భూమి ప్రధానమైనది.

రాజా! శబ్ద - స్పర్శ-రూప- రస - గంధములు అను నైదుగుణములు

భూమియందుగలవని తత్త్వవేత్తలు చెప్పెదరు. జలమునందు గంధగుణముదప్ప తక్కిన నాలుగు శబ్ద-స్పర్శ-రూప-రస గుణములున్నవి. అగ్నియందు రస-గంధగుణములు దప్ప తక్కిన శబ్ద-స్పర్శ-రూప గుణములు మూడునున్నవి. వాయువునందు శబ్దస్పర్శములు రెండే గుణములు గలవు. ఆకాశమునందు శబ్దము మాత్రము ఒక్కగుణమే యున్నది.

రాజా! ఈ యైదుగుణములు అన్నిలోకములందుగల పంచమహాభూతములను ఆశ్రయించియున్నవి. గుణసహితములైన యీ పంచమహాభూతములందే సమస్తప్రాణులు ప్రతిష్ఠితములైయున్నవి. ఈ యైదుగుణములు సామ్యావస్థలో నున్నప్పుడు ఒండొంటిని కలిసికొనవు. విషమావస్థలోనున్నప్పుడే ఒండొంటిని కలిసికొనును. ఈ విషమావస్థయందే ప్రాణులకు శరీరములతో సంబంధము కలుగును. సామ్యావస్థలో కలుగదు.

రాజా! యీ భూతములన్నియు పృథివ్యాది క్రమమున లయము చెందుచు ఆకాశాదిక్రమమున మరల ఉత్పన్నములగుచుండును. ఇవియన్నియు అపరిమేయములు (కొలుచుటకు వీలుగానివి). ఈ పంచభూతముల రూపములు ఈశ్వర నిర్మితములు.

రాజా! వేర్వేరు లోకములయందు పాంచభౌతిక ధాతువులు కనబడును. మనుష్యులు తర్కవాదములచేత పంచమహాభూతముల కొలతలను నిర్ణయించెదరు. కాని, అచింత్యములైన భావములను తర్కవాదములచేత సిద్ధింపజేయుటకు ప్రయత్నము చేయగూడదు. ప్రకృతికి అతీతములైనవే అచింత్య స్వరూపములనబడును.

## సుదర్శన ద్వీప వర్ణనము :

కురురాజా! యిప్పుడు నేను సుదర్శనము అను దీవినిగూర్చి వర్ణించెదను వినుము. ఆ ద్వీపము చక్రమువలె గుండ్రముగానుండును.

రాజా! ఆ ద్వీపము అనేకవిధములైన నదీజలములతో కప్పబడియుండును మేఘములవంటి యెత్తైన పర్వతములతో నిది శోభిల్లుచుండును. అనేకవిధములైన పట్టణములతో, దేశములతో పుష్ప ఫల భరితములైన వృక్షములతోను విభూషితమై

యుండును. సుదర్శనద్వీపము వివిధ ధనసంపదలతో సంపన్నమైయుండును. ఆ ద్వీపమును అన్నివైపులనుండి లవణసముద్రము చుట్టియున్నది.

రాజా ! పురుషుని ముఖము అద్దమునందు ప్రతిబింబించి కనబడునట్లే సుదర్శనద్వీపము చంద్రమండలమునందు కనబడుచుండును.

రాజా ! సుదర్శనద్వీపములో రెండు భాగములు పిప్పలము (రావిచెట్టు), రెండు అంశములు శశము (కుందేళ్ళు) కనబడును. ఈ ద్వీపమునందు అన్నివైపుల అనేక ఓషధులు వ్యాపించియున్నవి. ఇవిగాక మిగిలిన స్థానములు జలమయములైయున్నవని తెలిసికొనవలయును. ఇవిగాక మిగిలిన స్థలము సంక్షిప్తముగా భూమండలముగా నున్నదని చెప్పబడినది. ఈ భూఖండమును గూర్చి సంక్షేపముగా వర్ణించెదను వినుము.

## ఆఱవ అధ్యాయము

### సుదర్శన భూఖండ వర్ణనము :

### వర్షపర్వత మేరు గంగాశశాకృతుల వర్ణనము

జనమేజయా ! సంజయుని మాటవిని ధృతరాష్ట్రుడు ఇట్లు ప్రశ్నించెను :-

సంజయా ! నీవు సుదర్శన ద్వీపమునుగూర్చి సంగ్రహముగా వర్ణించి చెప్పితివి. నీవు తత్త్వజ్ఞుడవు. ఈ ద్వీపమును గూర్చిన వివరములన్నియు విస్తారముగ వర్ణించి నాకు చెప్పుము.

చంద్రునిలోని శశ (కుందేలు) చిహ్నములో భూమియెంతయున్నది ? ఆ భూమి అవకాశముయొక్క కొలత యెంత ? తరువాత పిప్పల స్థానమును వర్ణింపుము.

జనమేజయా ! ధృతరాష్ట్రుడిట్లు యడుగగా సంజయుడిట్లు చెప్పుటకు అరంభించెను :-

మహారాజా ! తూర్పునుండి పశ్చిమమువరకు సుదర్శన ద్వీపమునందు ఆరు

వర్షపర్వతములు ఉన్నవి. (వర్షపర్వతమనగా, లోకమునందలి వేర్వేరు భాగము లను వేర్పరచు పర్వతపంక్తి - ఇది యా భాగమునకు ఎల్లగా నుండును.)

ఆ పర్వతములు సుదర్శనద్వీపమునందు నిరువైపులందున్ను పూర్వపశ్చిమ సముద్రములందు చొచ్చుకొనిపోయియున్నవి.

ఆ యారువర్షపర్వతములివి :- (1) హిమవంతము (2) హేమకూటము (3) పర్వతశ్రేష్ఠమైన నిషధము (4) వైఢూర్యమణిమయమైన నీలగిరి (5) చంద్రునితో సమానముగా నుజ్జ్వల కాంతిగల శ్వేతగిరి (6) అన్నిధాతు మూలిక లతో గూడి, విచిత్రశోభతో విరాజిల్లు శృంగవంతము. రాజా! ఈయారు పర్వత ములు సిద్ధులకు- చారణులకు నివాసస్థానములు.

రాజా ! ఈ వర్షపర్వతముల మధ్యదేశము అనేక సహస్రముల యోజన ముల విస్తీర్ణములోనున్నది. అక్కడ వేర్వేరు వర్షములు (భూఖండములు) ఉన్నవి ఆ వర్షములలో అనేక పవిత్రదేశములున్నవి.

మహారాజా ! ఆ వర్షములందు అన్ని ప్రాంతములలో అనేక జాతుల ప్రాణులు నివసించుచున్నారు. వాటిలో ఈ భారతవర్షమొకటి. దీని తరువాత హిమాలయమునకు ఉత్తరముగా హైమవతవర్షము ఉన్నది.

రాజా ! హేమకూటపర్వతము దాటిన తరువాత హరివర్షము ఉన్నది. రాజా ! నీలగిరికి దక్షిణముగా, నిషధపర్వతమునకు ఈశాన్యముగా పడమటివైపు వ్యాపించి మాల్యవంతము అను పర్వతము ఉన్నది. మాల్యవంతమునకు తరువాత గంధమాదన పర్వతము కలదు.

## పర్వత వర్ణనము :

రాజా ! 'మాల్యవంతము-గంధమాదనము' ఈ రెండు పర్వతముల మధ్య దేశమునందు సువర్ణమయమైన మేరుపర్వతము మండలాకారముగా నున్నది. ఆ మేరుపర్వతము ప్రాతఃకాలమునందు సూర్యునివలె ధూమములేని అగ్నివలెను కాంతిమంతముగా నున్నది.

రాజా ! మేరుపర్వతము యొక్క యెత్తు యెనుబదినాలుగు వేల యోజనము

లున్నది. దాని యడుగుభాగముగూడ యెనుబదినాలుగువేల యోజనములు గల దియే. అది భూమిలోపలి భాగమునందు వ్యాపించియున్నది.

రాజా ! మేరుపర్వతము పైన, క్రింద, పార్శ్వములందు అన్నివైపులగూడ సమస్తలోకములను ఆవరించి నిలచియున్నది.

రాజా ! మేరుపర్వత పార్శ్వభాగములలో 'భద్రాశ్వ-కేతుమాల-జంబూ ద్వీప- ఉత్తరకురు' అను నాలుగు ద్వీపములు గలవు. ఉత్తరకురు ద్వీపమునందు పుణ్యాత్ములైన పురుషులు నివసించుచుండెదరు.

మహారాజా ! పూర్వమొకప్పుడు పక్షిరాజైన గరుత్మంతుని పుత్రుడైన సుముఖుడు అనువాడు మేరుపర్వతమునందు బంగారుదేహముగల కాకులను చూచి 'యీ సుమేరు పర్వతమునందు ఉత్తమమధ్యమ- అధమజాతుల పక్షులలో ఏ మాత్రము భేదముండదు. కనుక నేను యీ పర్వతమును విడిచిపెట్టెదను.' అని తలంచి సుముఖుడు అక్కడినుండి వెడలిపోయెను.

రాజా ! ప్రకాశవంతములైన గ్రహములలో శ్రేష్ఠుడైన సూర్యుడు, నక్షత్రేశ్వరుడైన చంద్రుడు సమస్త నక్షత్రములతో, వాయుదేవుడున్ను సర్వదా మేరుపర్వతమునకు ప్రదక్షిణము చేయుచుండెదరు.

మహారాజా ! మేరుపర్వతము ఎల్లప్పుడుగూడ దివ్యఫల పుష్పభరితమై యుండును. మేరుపర్వతమునందలి భవనములన్నియు 'జాంబూనదము' (జంబూ అను నదినుండి పుట్టినది) అను పేరుగల బంగారముతో భూషితములై యున్నవి. ఆ భవనములతో మేరుపర్వతము చాల శోభిల్లుచుండును.

రాజా ! మేరుపర్వతమునందు దేవ-గంధర్వ-అసుర-రాక్షస- అప్సరసలు సర్వదా క్రీడించుచుండెదరు. అక్కడ బ్రహ్మరుద్రేంద్రాది దేవతలు ఒకచోటచేరి పరిపూర్ణ దక్షిణలిచ్చి అనేకయజ్ఞములు చేయుచుండెదరు.

రాజా ! ఆ యజ్ఞసమయములందు తుంబుర-నారద-విశ్వావసు-హాహా- హూహూ నామకులైన గంధర్వులు ఆ దేవతాధిపతుల వద్దకుపోయి నానావిధము లైన స్తోత్రములతో వారిని స్తుతించెదరు.

రాజా ! మేరుపర్వతము పైకి మహాత్ములైన సప్తర్షులు- ప్రజాపతి-కశ్య

పుడు- ప్రతీ పర్వకాలమునందు సర్వధా వచ్చెదరు.

రాజా ! మేరుపర్వత శిఖరమునందు శుక్రాచార్యుడు తన శిష్యులైన దైత్యులతో పాటు నివసించుచుండును. ఆ పర్వతమునందలి రత్నములు-ఆ రత్నమయ పర్వతము శుక్రాచార్యుని అధికారములో నున్నవి.

రాజా ! కుబేరుడు మేరుపర్వతమునుండియే ధనముయొక్క చతుర్థభాగము తీసికొని అనుభవించుచున్నాడు. ఆ ధనములలో పదియారవ భాగము కుబేరుడు మనుష్యులకు ఇచ్చుచున్నాడు.

మహారాజా ! మేరుపర్వతముయొక్క ఉత్తరభాగమునందు సమస్త ఋతు పుష్పభరితమై, దివ్యమైన కర్ణికార (గన్నేరు) వనము రమణీయముగా నున్నది. అక్కడ శిలాసమూహములు చేరియున్నవి.

కురురాజా ! అక్కడ సాక్షాత్తు దివ్యభూతములచేత పరివృతుడైన పశుపతి తన కాళ్ళవరకు వ్రేళ్ళాడుచున్న గన్నేరు పూవుల మాలికను ధరించి అట్టి మాలికనే ధరించిన ఉమాదేవితో విహరించుచుండును. ఆ పరమేశ్వరుడు ముగ్గురు సూర్యులవలె ప్రకాశించుచున్న తన మూడు నేత్రములనుండి ప్రకాశమును వ్యాపింపజేయుచుండును.

కురుపతీ ! ఆ మేరుపర్వతమునందున్న ఆ మహాదేవుని తపస్విజనము-ఉత్తమవ్రత పరిపాలకులు - సత్యవాదులునైన సిద్ధపురుషులు మాత్రమే దర్శించగలరు. దురాచారులకు ఆ మహేశ్వరుని దర్శనము లభించదు.

రాజేంద్రా ! ఆ మేరుపర్వతశిఖరము నుండి గంగానది మిక్కిలి వేగములో ప్రవహించుచు సుందరమైన చంద్రకుండమునందు పడును. ఆ గంగా ప్రవాహము, పాలవంటి తెల్లని ధారలతో, విశ్వరూపముగలదై అపరిమితశక్తి గలిగి పిడుగువంటి భయంకరశబ్దము చేయుచు, పరమపుణ్యాత్ములచేత సేవింపబడుచు మంగళరూపము గలిగి పుణ్యమయముగ నుండును.

మహారాజా ! పవిత్రమైన ఆ చంద్రకుండమును గంగయే ఉత్పన్నము చేసెను. ఆ కుండమునందు మిక్కిలి లోతైన జలముండుటచేత, అది సముద్రమువలె శోభిల్లుచుండును. అటువంటి గంగను ధరించుటకు ఏ పర్వతమునకు గూడ

శక్తి చాలకున్నప్పుడు పినాకపాణియైన శంకరభగవానుడు ఒకలక్ష సంవత్సరములవరకు తన తలపైన గంగను ధరించియుండెను.

భూపతీ ! మేరుపర్వత పశ్చిమ పార్శ్వమునందు కేతుమాలద్వీపము కలదు. అక్కడనే అతివిశాలమైన జంబూఖండము అను ప్రదేశము కలదు. అది నందన వనము వలె అతిమనోహరముగనున్నది. అక్కడ నివసించువారికి పదివేల యేండ్ల ఆయుస్సు ఉండును.

రాజా ! ఆ జంబూఖండవాసులైన పురుషులు బంగారు కాంతితో స్త్రీలు అప్సరసల వంటివారుగాను సుందరముగా నుందురు. వారికి ఎప్పుడుగూడ రోగములు, శోకములు కలుగవు. వారి మనస్సు సర్వదా ప్రసన్నముగనుండును. మేరుపర్వతమునందు మానవులు పుటము పెట్టబడిన బంగారపు తేజస్సుతో జన్మించెదరు.

కురురాజా ! గంధమాదన పర్వతశిఖరములపైన, గుహ్యకుల రాజైన కుబేరుడు రాక్షసులతో నుండును. అతడు అప్సరసలతో విహరించుచుండును. ఆ గంధమాదన పర్వత పాదప్రదేశములందు (గండికలు) నీటిబుడగలవంటి పాషాణములతోనున్న చిన్నచిన్న పర్వతములనేకములున్నవి. అక్కడ నివసించు వారికి పదకొండువేల సంవత్సరముల ఆయుస్సు ఉండును. అక్కడి పురుషులు బలవంతులుగా హర్షముతోను, స్త్రీలు కమలసమానకాంతిగలిగి మనోహారిణులుగాను నుండెదరు.

రాజా ! నీలపర్వతమునకు ఉత్తరమున శ్వేతవర్షము- దానికి ఉత్తరముగా హిరణ్యకవర్షము ఉన్నవి. హిరణ్యమునకు అవల శృంగవాన్ అను పర్వతము శృంగవంతము తరువాత ఐరావతవర్షము ఉన్నవి. ఆ ఐరవతవర్షమునందు అనేక దేశములున్నవి.

మహారాజా ! దక్షిణమునందు భారతవర్షము - ఉత్తరమునందు ఐరావత వర్షము ఉన్నవి. ఈ రెండు ధనుస్సుయొక్క రెండు అగ్రములవలెనున్నవి. ఈ రెండు వర్షముల మధ్య శ్వేత-హిరణ్యక-ఇలావృత-హరివర్ష-హైమవతములనెడు ఐదువర్షములు గలవు. ఈ యన్నిటి నడుమ ఇలావృతవర్షమున్నది.

రాజా ! భారతవర్షములో నారంభించి యీ వర్షములన్నియు, ఆయుః

ప్రమాణము-ఆరోగ్యము- ధర్మము-అర్థము-కామము ఈ యన్ని విషయముల లోను- గుణములలోను ఒకటికంటెనొకటి ఉత్తరోత్తరము మించియున్నవి.

రాజా ! ఈ వర్షములన్నింటిలోను నివసించువారు పరస్పరము కలిసి మెలిసి స్నేహభావముతో నుండెదరు. ఈ విధముగా ఈ భూమండలమంతయు పర్వతములచేత స్థిరముగా నిలువబడినది.

రాజా ! సువిశాలమైన హేమకూటపర్వతమే కైలాసమను పేరుతో ప్రసి ద్ధమైయున్నది. అక్కడ కుబేరుడు గుహ్యకులతో ఆనందపూర్వకముగా నివసించి యుండును.

మహారాజా ! కైలాసమునకు ఉత్తరమువైపు మైనాకపర్వతము కలదు. దానికి ఉత్తరముగా, దివ్యము- మణిమయమునైన హిరణ్యశృంగము అను గొప్ప పర్వతము కలదు.

## బిందుసరోవర-గంగానదుల వర్ణనము :

రాజా ! హిరణ్యశృంగ పర్వతపార్శ్వమునందే, సువిశాలము-దివ్యము- కాంతిమంతము - బంగారు ఇసుకగలది - రమణీయమునైన బిందుసరోవరము శోభిల్లుచున్నది. ఆ బిందు సరోవరమునందే పూర్వము భగీరథమహారాజు భాగీ రథీ నదీ దర్శనార్థము అనేక సంవత్సరములు నివసించియుండి గంగాదేవిని దర్శించెను.

రాజా ! బిందుసరోవర తీరమునందు మణిమయయూపస్తంభములు (యజ్ఞ పశువు కట్టబడు స్తంభము), సువర్ణమయభవనములు శోభిల్లుచున్నవి. అక్కడనే యింద్రుడు యజ్ఞములుచేసి యశస్సును-సిద్ధిని పొందెను.

కురుపతీ ! ఆ స్థానమునందే, అన్నివైపుల, సమస్త ప్రపంచజనులు, ప్రపంచ సృష్టికర్త-మహాతేజస్వి-సనాతనుడైన భూతనాథ భగవానుని ఉపాసించు చుండెదరు. అక్కడ నర-నారాయణులు, బ్రహ్మదేవుడు, మనువు, భగవంతు డైన శివుడున్ను సర్వదా ఉండెదరు.

కురురాజా ! త్రిపథగామినియైన దివ్యగంగానది బ్రహ్మలోకమునుండి

దిగి తొలుత బిందుసరోవరమునందే నిలిచెను. అక్కడనుండియే గంగ యేడు ధారలుగా ప్రవహించి వేరు వేరు నదులుగా ప్రసిద్ధిచెందెను.

రాజా ! ఆ యేడు ధారలు (1) వస్వోకసార (2) నలిని (3) పావనమైన సరస్వతి (4) జంబూనది (5) సీత (6) గంగ (7) సింధు అను నదులుగా ప్రసిద్ధములైనవి.

రాజా ! ఈ యేడు ధారల ఉత్పత్తి జగత్తు ఉపకారమునకై భగవంతుని యొక్క దివ్యము-అచింత్యము-సుందరమునైన విధానమని తెలిసికొనుము. ఈ చోట్లలో జనులు కల్పాంతము వరకు యజ్ఞానుష్ఠానముల చేత పరమాత్మను ఉపాసించుచుండెదరు.

రాజా ! ఈ యేడు నదీధారలలోను సరస్వతీనది, కొన్నిచోట్ల ప్రత్యక్షముగా కనబడును. కొన్నిచోట్ల అదృశ్యముగా నుండును. ఈయేడు దివ్యగంగలు మూడులోకములయందున్న సుప్రసిద్ధములు.

మహారాజా ! హిమాలయపర్వతముపైన రాక్షసులు- హేమకూటముపైన గుహ్యకులు- నిషధపర్వతముపైన సర్పములు, నాగులు నివసించుచుండెదరు. గోకర్ణము తపోవనముగానే భావించవలెను.

రాజా ! శ్వేతపర్వతము దేవ రాక్షసుల కందరకు నివాసస్థానము. నిషధ గిరిపైన గంధర్వులు నీలగిరిపైన బ్రహ్మర్షులు నివసించుచుండెదరు. రాజా ! శృంగవత్పర్వతమైతేనో కేవలము దేవతలకే నివాసస్థానముగా విహారస్థానముగా నున్నది.

రాజా ! ఈ విధముగానున్న యీ యేడు పర్వతములయందు స్థావర జంగమములైన సమస్త ప్రాణులు విభజింపబడి నివసించుచున్నారు. ఆ ప్రాణుల యొక్క వృద్ధి దైవమని, మానుషమని రెండు విధములుగ కనబడుచున్నది. వాటిని లెక్కపెట్టుట అసాధ్యము అసంభవము. శ్రేయస్సును గోరు మనుష్యులు ఆ వృద్ధిని నమ్మవలెను.

భరతకులభూషణా ! ఈ విధముగా నీకు సుదర్శన ద్వీప వృత్తాంత మంతయు చెప్పితిని. ఆ ద్వీపము రెండు భాగములుగా విభజింపబడి చంద్ర మండలమందు ప్రతిబింబించిన కుందేలురూపమువంటి ఆకారమ్ముతో కనబడు

చుండును. రాజా! నీవు ఈ కుందేలువంటి ఆకృతి విషయమై ప్రశ్నించితివి. అది వర్ణించి చెప్పెదను వినుము :-

రాజా! మొట్టమొదట దక్షిణోత్తర దిక్కులనుండు 'భారత-ఐరావతము' అనెడు రెండు ద్వీపములే, ఆ కుందేటి ఆకారముయొక్క రెండు పార్శ్వభాగము లని తెలిసికొనుము. 'నాగద్వీప - కాశ్యపద్వీప'ములు రెండున్ను ఆ కుందేటికి రెండు చెవులుగా కనబడుచున్నవి. రాజా! ఎరుపు వర్ణముగల వృక్షములతో ఆకులతోను శోభిల్లుచున్న మలయపర్వతమే ఆ కుందేటికి శిరస్సు. ఈ విధముగా సుదర్శనద్వీపముయొక్క రెండవభాగమే చంద్రమండలమునందలి కుందేలు ఆకారములో కనబడుచున్నది.

## ఏడవ అధ్యాయము

### సంజయుని ఉత్తర కురువర్ష వర్ణనము :-

సంజయా! మేరుపర్వతమునకు ఉత్తర-పూర్వభాగములందు ఉన్నవాటిని గూర్చి సమగ్రముగా వర్ణించి చెప్పుము. దానితోపాటే మాల్యవంతమును గూర్చి గూడ తెలిసికొనదగిన విషయములను జెప్పుము.

జనమేజయా! ఆ మాటకు సంజయుడిట్లు ధృతరాష్ట్రునకు చెప్పెను :-

రాజా! నీలగిరికి దక్షిణముగా, మేరుపర్వతమునకు ఉత్తరముగాను, పవిత్రమైన ఉత్తరకురువర్షము కలదు. అక్కడ సిద్ధపురుషులు నివసించుచుండెదరు.

రాజా! అక్కడి వృక్షములు సర్వదా పుష్పఫలసంపన్నములుగానుండును. వాటిపండ్లు మిక్కిలి మధురములుగా, రుచికరములుగా నుండును. ఆదేశము నందలి పూవులన్నియు సుగంధులుగా, ఫలములు సరసములుగాను నుండును.

రాజా! అక్కడి కొన్ని వృక్షములు మన కోరికలన్నియు తీర్చును. అక్కడ మరికొన్ని క్షీరివృక్షములున్నవి (పాలచెట్లు). అవి సర్వదా షడ్రసములు (తీపి-కారము-పులుపు-ఉప్పు-చేదు-ఒగరు) గలవిగా, అమృతోపమానములు రుచి

కరము, క్షీరములు స్రవించుచున్నదిగా నుండును. ఆ వృక్షఫలముల నుండి మనము కోరిన వస్త్రభూషణములు ఉత్పన్నములగును.

రాజా ! అక్కడ భూమియంతయు మణిమయముగా నుండును. అక్కడి చిన్న యిసుక రేణువులు సువర్ణమయములై యుండును. అక్కడి భూమియందు బురద పేరుకు గూడ నుండదు. ఆ భూమియొక్క స్పర్శ అన్ని ఋతువులలోను సుఖమయముగా నుండును. అక్కడి సుందరసరోవరములు మిక్కిలి మనోహరములుగా నుండును. ఆ సరోవరముల స్పర్శ సుఖదాయకముగా నుండును.

రాజా ! దేవలోకము నుండి పుణ్యనాశముచేత పడిన మానవులు అక్కడ పుట్టెదరు. వారందరు ఉత్తమకులములందు పుట్టి చూచుటకు ప్రియులుగా నుండెదరు.

రాజా ! అక్కడ స్త్రీ పురుషుల జంటలు గూడ పుట్టెదరు. స్త్రీలు అప్సరసల వలె సుందరులుగా నుండెదరు. ఉత్తరకురువర్షవాసులు, అక్కడ క్షీరవృక్షముల నుండి స్రవించు మధురక్షీరము త్రాగెదరు.

కురుపతీ ! అక్కడ స్త్రీ పురుషుల జంటలు ఒకటిగానే పుట్టెదరు. కలసియే పెరుగుచుండెదరు. ఆ జంటల రూప-గుణ-వేషములు సమానములుగా నుండును. ఆ జంటలు చక్రవాకీ-చక్రవాకముల వలె పరస్పరము అనుకూలురై యుండెదరు. ఉత్తరకురునివాసులు సర్వదా ఆరోగ్యముతో ప్రసన్నమనముగలవారై యుండెదరు.

రాజా ! అక్కడి దంపతులు ఒండొరులను విడువక పదకొండు వేల సంవత్సరముల వరకు జీవించియుండెదరు. అక్కడ 'భారుండములు' అను మహాబలశాలురైన పక్షులున్నవి. (వీటికి భరుండ అని గూడ పేరు. ఇవియే గండభేరుండ పక్షులేమో). వాటి చంచువులు (ముక్కులు) అతి తీక్ష్ణములుగా నుండును. ఆ పక్షులు ఉత్తరకురు దేశమునందు చచ్చిన జనుల శవములను ఎత్తుకొనిపోయి, లోయలలో, గుహలలోను పారవేయును.

రాజా ! నేను ఈవిధముగా ఉత్తరకురువర్షమును గూర్చి సంగ్రహముగా చెప్పినాను.

ఇపుడు మేరు పర్వతమునకు ఉత్తరముగానున్న భద్రాశ్వ వర్షమును గూర్చి యథావత్తుగా వర్ణించెదను వినుము :-

## సంజయుని భద్రాశ్వవర్ష వర్ణనము :-

కురురాజా ! భద్రాశ్వవర్ష శిఖరముపైన భద్రశాల నామముగల వనము ఉన్నది. ఆ వనమునందు కాలామ్ర నామకమైన పెద్దవృక్షమున్నది. ఆ చెట్టు ఒక యోజనము ఎత్తుగా అతిసుందరమై యున్నది. దానియందు సర్వదా పుష్ప ఫలములు ఉండును. సిద్ధ- చారణులు ఎల్లప్పుడు ఆ వృక్షమును సేవించుచుండె దరు.

రాజా ! భద్రాశ్వవర్షమునందలి పురుషులు తెల్లగా, తేజస్వులై మహాబల వంతులుగా నుండెదరు. అక్కడి స్త్రీలు తెల్ల కలువలవలె గౌరవర్ణముతో అతి సౌందర్యవతులుగా, ప్రియదర్శనులై యుండెదరు. వారి శరీరకాంతి- వర్ణము చంద్రునివలె నుండెను. వారి ముఖములు నిండు చంద్రునివలె మనోహరములుగా నుండును. వారి ప్రతి అవయవము చంద్రకిరణమువలె చల్లగానుండును. వారు నృత్య గానకళలలో నైపుణ్యము గలవారై యుండెదరు.

రాజా ! భద్రాశ్వవర్షమునందలి జనులు పదివేల యేండ్ల ఆయుస్సుగల వారై యుండెదరు. వారు కాలామ్రవృక్షరసము త్రాగి సర్వదా యువకులుగానే యుండెదరు.

రాజా ! నీలగిరికి దక్షిణముగా, నిషధపర్వతమునకు ఉత్తరముగాను సుదర్శనము అను పేరుగల ఒక పెద్ద నేరేడుచెట్టు ఉన్నది. అది సర్వదా అక్కడ స్థిరముగా నుండును. సమస్త వాంఛిత ఫలములను ఇచ్చు, ఆ వృక్షము అతి పవిత్రమైనది. అది సిద్ధ-చారణులకు ఆశ్రయమైయున్నది. ఆ ప్రాచీన ప్రదేశము ఆ వృక్షము పేరనే జంబూద్వీపము అని ప్రసిద్ధమైయున్నది.

భరతశ్రేష్ఠా ! ఆ జంబూ (నేరేడు) వృక్షము స్వర్గలోకమును తాకు చున్నదా ! యనునట్లు పదకొండునూర్ల యోజనముల యెత్తుగలదు. ఆ వృక్ష ఫలములు పండినప్పుడు తమంతట రాలి క్రిందపడును. ఆ నేరేడుపండ్లు ఒక్కొ క్కటి. రెండున్నరవేల 'అరత్నుల' పొడవుండును. (చేతి చిటికెనవ్రేలు చాపగా మణికట్టునుండి చిటికెనవ్రేలి కొనవరకు ఉండు చేతి మొదటిభాగపు పొడవు).

రాజా ! ఆ నేరేడు పండ్లు భూమిమీద పడునప్పుడు పెద్ద చప్పుడగును.

అది పడిన తరువాత వాటినుండి సువర్ణవర్ణము గల రసము భూమిపైన పారుచుండును. ఆ జంబూఫలరసము నదిగా ప్రవహించి మేరుపర్వతమునకు ప్రదక్షిణము చేయుచు ఉత్తరకురుపర్షము చేరును. రాజా! అక్కడివారు ఆ పండ్లరసము త్రాగి ప్రసన్నులై శాంతితో దప్పి, వృద్ధావస్థ యెప్పుడు గూడ లేకయుందురు.

మహారాజా! అక్కడ జాంబూనదము అను పేరుగల బంగారము ఆ నది నుండి పుట్టును. అది దేవతలు ఆభరణములకు ఉపయోగించుకొనెదరు. ఆ బంగారము ఆర్ద్రపురుగుల వలె ఎఱ్ఱగా మెరయుచునుండును.

రాజా! అక్కడివారు ప్రాతఃకాల సూర్యునివలె కాంతిమంతులై యుండెదరు.

## సంజయుని మాల్యవద్వర్ణనము :

రాజా! మాల్యవత్పర్వతముపైన అగ్నిదేవుడు సర్వదా జ్వలించుచుండును. అక్కడ సంవర్తకము 'కాలాగ్ని' యను పేరుతో ప్రసిద్ధమైయున్నది. మాల్యవత్పర్వతముపైన తూర్పు దిక్కుగా నీటిబుడగల వంటి తెల్లని రాళ్ళతో చిన్న చిన్న గుట్టలు (గండికలు) ఉండును.

రాజా! మాల్యవత్పర్వతము యొక్క విస్తారము అయిదారువేల యోజనములున్నది. అక్కడ బంగారువర్ణములతో కాంతిమంతులైన మనుష్యులు పుట్టెదరు. వారందరు బ్రహ్మలోకమునుండి దిగివచ్చిన పుణ్యాత్ములు. వారందరు ఒండొరులతో సాధువులుగా మెలగుచుందురు. వారందరు ఊర్ధ్వరేతస్కులైన నైష్ఠిక బ్రహ్మచర్య వ్రతనిష్ఠులుగానుండి కఠోరముగా తపస్సుచేయుచుండెదరు.

రాజా! వారిలో అరువదియారువేల మనుష్యులు సూర్యుని నలువైపుల చుట్టి, సూర్యసారథియైన అరుణునకు ముందుగా పోవుచుందురు. వారు అరువది యారువేల సంవత్సరముల వరకు సూర్యుని వేడిమితో తపించి చివరకు చంద్రమండలములో ప్రవేశించెదరు.

# యెనిమిదవ అధ్యాయము

## సంజయుని రమణక-హిరణ్యక-శృంగవత్పర్వతముల వర్ణనము:

జనమేజయా! సంజయుని మాట విని ధృతరాష్ట్రుడిట్లడిగెను: ఆ పర్వత

ముల పైన నివసించువారి పరిస్థితిని గూర్చి ఉన్నదున్నట్లు నాకు వర్ణించి చెప్పుము.

ఆ మాటకు సంజయుడిట్లు చెప్పదొడంగెను:-

రాజా! శ్వేతగిరికి దక్షిణముగాను నిషధపర్వతమునకు ఉత్తరముగాను రమణకవర్షము ఉన్నది. అక్కడ నివసించువారందరు ఉత్తమకులములకు చెందిన వారు. వారందరు చూచుటకు ప్రియముగా నుందురు. ఆ వర్షమునందలి జనులకు శత్రువులు లేరు.

రాజా! రమణకవర్షవాసులు సర్వదా ప్రసన్నచిత్తులై యుండెదరు. పదకొండున్నరవేల యేండ్లు జీవించియుండెదరు.

రాజా! నీలపర్వతమునకు దక్షిణముగా, నిషధపర్వతమునకు ఉత్తరముగాను హిరణ్మయవర్షము ఉన్నది. అక్కడ 'హైరణ్వతి' యను నది ప్రవహించుచున్నది.

మహారాజా! ఆ వర్షమునందే పక్షులలో నుత్తముడైన గరుత్మంతుడు నివసించుచున్నాడు. అక్కడి మనుష్యులందరు యక్షులను ఉపాసించువారు-ధనవంతులు-ప్రియదర్శనులు-మహాబలవంతులు-ప్రసన్నచిత్తులుగా నున్నారు.

రాజా! హిరణ్మయవర్షమునందు జనుల ఆయుస్సు పన్నెండున్నర వేల సంవత్సరములు ఉండును.

రాజా! శృంగవాన్ అను పర్వతమునకు మూడు శిఖరములు విచిత్రములుగా నున్నవి. వాటిలో ఒక శిఖరము మణిమయము రెండవది అద్భుతసువర్ణమయము. మూడవది అనేకరత్నమయ భవనములతోను విరాజిల్లుచున్నవి.

రాజా! ఆ పర్వతముపైన స్వయంప్రభ అను పేరుగల శాండిలీదేవి నివసించుచున్నది.

## సంజయుని యైరావతవర్షవర్ణనము :

రాజా! శృంగవత్పర్వతమునకు ఉత్తరముగా సముద్రసమీపమునందు ఐరావతవర్షము ఉన్నది. అనేకశిఖరములతో గూడిన యీ ఐరావతవర్షము ఇతర

వర్షములకంటే ఉత్తమమైనది. అక్కడ సూర్యుని తాపము ఉండదు. అక్కడవారికి వృద్ధాప్యమే రాదు.

రాజా ! నక్షత్రసహితుడుగా చంద్రుడచట జ్యోతిర్మయుడై అన్ని దిక్కుల వ్యాపించినట్లు కనబడును. అక్కడి మనుష్యులు కమలకాంతి-కమలవర్ణము గల వారుగా నుండెదరు. వారి విశాలనేత్రములు కమలపత్రములవలె నుండును. వారి శరీరములలో కమలసుగంధము ఉండును. వారి శరీరము చెమటబట్టదు. దాని సుగంధము ప్రియముగా నుండును. అక్కడివారికి ఆకలిదప్పులు ఉండవు. ఆహార పానీయములు వారు కోరరు. జితేంద్రియులై యుండెదరు.

రాజా ! అక్కడివారందరు స్వర్గమునుండి పుణ్యక్షీణులై జారిపడి మిగిలిన పుణ్యమును అనుభవించుటకు వచ్చినవారే. వారికి రజోగుణము ఏమాత్రము ఉండదు. వారికి పదమూడువేల సంవత్సరముల ఆయుస్సు ఉండును.

రాజా ! క్షీరసముద్రపు ఉత్తరతీరమునందు విష్ణుభగవానుడు నివసించు చుండును. ఆ భగవంతుడచ్చట సువర్ణరథముపైన విరాజిల్లుచుండెను. ఆ రథము నకు ఎనిమిది చక్రములున్నవి. ఆ రథము మనోవేగముతో పరుగెత్తును. అది సమస్తభూతములతో గూడుకొని, అగ్ని సమానకాంతిగలిగి, మిక్కిలి తేజస్విగా నుండి, జాంబూనదము అను పేరుగల బంగారముతో విభూషితమై యున్నది.

భరతవంశభూషణా ! సర్వవ్యాపి, సర్వశక్తి సంపన్నుడునైన విష్ణుభగ వానుడు సమస్తప్రాణులను విస్తరింపజేయుచు సంకోచింపచేయుచు నుండును. ఆయనయే అన్నిటికి కర్త, చేయించువాడు గూడ ఆభగవంతుడే.

రాజా ! భూమి-జలము-వాయువు-అగ్ని-ఆకాశము అను పంచమహాభూత ములు ఆ మహానుభావుని స్వరూపములేయగును. సమస్తప్రాణులకు యజ్ఞస్వరూ పుడు గూడ ఆ దేవదేవుడే. అగ్ని ఆయన ముఖము.

జనమేజయా ! సంజయుడిట్లు చెప్పిన తరువాత, ధృతరాష్ట్రుడు తన పుత్రు లను గూర్చి చింతించెను. కొంతసేపు విచారించి యోచించిన తర్వాత ధృతరాష్ట్రుడు మరల సంజయునితో నిట్లనెను :-

సంజయా ! కాలమే (యముడు) సమస్తజగత్తును హరించును. సృజించును.

ప్రపంచమునందు ఏ వస్తువు గూడ స్థిరముగా సర్వదా నిలిచియుండదు. భగవంతులైన నర–నారాయణులు సమస్తప్రాణులకు మిత్రులు. వారు సర్వజ్ఞులు. వారిని దేవతలు వైకుంఠులు అని, మనుష్యులు శక్తిమంతుడైన విష్ణువు అనియు ననెదరు.

## తొమ్మిదవ అధ్యాయము

### సంజయుడు భారతవర్షనదులు-దేశములు-గ్రామముల పేర్లు వర్ణించి చెప్పుట :

జనమేజయా! ధృతరాష్ట్రుడు సంజయునితో మరలనిట్లనెను :-

సంజయా! యే భరతవర్షమునందు, ఈ రాజుల విశాలసైన్యము యుద్ధము కొరకు ఒకచోట చేరి యున్నదో, ఏ భారతవర్షసామ్రాజ్యమును పొందుటకు నా పుత్రుడైన దుర్యోధనుడు ఆశపడుచున్నాడో, ఏ భారతవర్ష సామ్రాజ్యమును పొందుటకు పాండవుల మనస్సులో గూడ చాల యిచ్ఛయున్నదో, యే భారతవర్ష సామ్రాజ్యమునందు నా మనస్సు గూడ ఆసక్తిగలదైయున్నదో. అటువంటి భారత వర్షమును గూర్చిన యథార్థవర్ణనము చేసి చెప్పుము. ఎందుకనగా, ఆ వర్ణనము చేయుటకు నా దృష్టిలో నీవే అధికబుద్ధిగలవాడవని తోచుచున్నది

జనమేజయా! ధృతరాష్ట్రుని ప్రశ్నమునకు సంజయుడిట్లు చెప్పెను:-

రాజా! పాండవులకు భారతవర్షసామ్రాజ్యమునందు లోభము లేదు. శకుని దుర్యోధనులే ఈ సామ్రాజ్యమునందు అత్యంతలోభము గలిగియున్నారు.

రాజా! అనేకదేశముల రాజులు– వివిధ క్షత్రియులు ఈ సామ్రాజ్యము పైన అత్యాశగలవారై గ్రద్దల వలె చూచుచు ఒండొరుల శ్రేయస్సును సహించక అసూయతోనున్నారు.

రాజా! యిప్పుడు నేను భారతవర్షమును గూర్చి వర్ణించి చెప్పెదను. ఈ భారతదేశము దేవేంద్రునకు–మనువునకు అతిప్రియమైనది.

రాజా! వేనరాజపుత్రుడైన పృథుచక్రవర్తి – మహాత్ముడైన యిక్ష్వాకు

మహారాజు-యయాతి-అంబరీషుడు- మాంధాత-నహుషుడు- ముచుకుందుడు-ఉశీ నరపుత్రుడైన శిబిచక్రవర్తి-ఋషభుడు-ఇలా కుమారుడైన పురూరవుడు-

మహారాజు-కుశికరాజు-మహాత్ముడైన గాధిరాజు - సోమకుడు-దిలీపుడు-ఇంకను మహాబలపరాక్రమసంపన్నులైన అనేక రాజులు - క్షత్రియులు-ఈయం దరకు భారతవర్షము అత్యంత ప్రియమైనది.

## భారతవర్షపర్వతములు :

రాజా ! అందుచేత, అటువంటి భారతవర్షమును గూర్చియే, నేను యథా వత్తుగా వర్ణించుచున్నాను. నీవు నన్ను ఏమి అడుగుచున్నావో, నా నుండి తెలిసి కొనదలచుకొన్నావో, అదియంతయు చెప్పెదను వినుము.

రాజా ! ఈ భారతవర్షమునందు, మలయ-సహ్యా-శుక్తిమత్-ఋక్షవత్-వింధ్య-పారియాత్ర నామములు గల యేడాకుల పర్వతములున్నవి.

రాజా ! ఈ కుల పర్వతములకు యిరుగుపొరుగులలో ఇంకను నెన్నియో పర్వతములు అజ్ఞాతములై అసంఖ్యాకములుగా నున్నవి. ఆ పర్వతములందు రత్నాదులైన అనేక సారవస్తువులున్నవి. ఆ పర్వతములు అతివిశాలములుగా, విచిత్రశిఖరములతో శోభిల్లుచున్నవి.

రాజా ! ఇవియే గాక, యింకను అనేకములైన చిన్న చిన్న గిరులు అపరి చితములై యున్నవి. ఆ గిరులయందు చిన్న చిన్న ప్రాణులనేకములు ఆశ్రయ మునుగొని జీవితమును గడిపికొనుచున్నవి.

## భారత జాతులు :

రాజా ! ఈ భారతవర్షమునందు, ఆర్యులు-మ్లేచ్ఛులు-సంకర జాతులవారు నివసించుచున్నారు. భారతవర్షవాసులందరు ఏ మహానదుల నీరు త్రాగుచున్నారో, ఆ నదుల పేర్లు చెప్పెదను వినుము :-

## భారతవర్ష నదులు :

గంగ-యమున-సింధు-సరస్వతీ-గోదావరీ-నర్మదా-బాహుదా-మహానదీ-

శతద్రూ-చంద్రభాగా - దృషద్వతీ- విపాశా-విపాపా-స్థూలవాలుకా- వేత్రవతీ-కృష్ణవేణీ- ఇరావతీ- వితస్తా- పయోష్ణీ-దేవికా- వేదస్మృతా- వేదవతీ-త్రిదివా-ఇక్షులా-కృమి-కరీషిణీ-చిత్రవాహా-చిత్రసేనా అను నామములు గల మహానదులు భారతవర్షమునందు ఉన్నవి.

కురుపతీ ! యింకను నదుల పేర్లు వినుము- అవి- గోమతీ-ధూతపాపా-వందనా-కాశికీ-త్రిదివా-కృత్యా- నిచితా-లోహితారణీ- రహస్యా-శతకుంభా-వరయూ-చర్మణ్వతీ-వేత్రవతీ-హస్తిసోమా- దిక్-శరావతీ- పయోష్ణీ- వేశా-భీమరథీ-కావేరీ-చులుకా-వాణీ-శతబలా నామకనదులు.

రాజా ! యింకను వినుము- నీరవారా- అహితా- సుప్రయోగా-పవిత్రా-కుండలీ-సింధు-రాజనీ-పురమాలినీ-పూర్వాభిరామా-వీరా(నీరా)-భీమా-ఓఘవతీ-పాశాశనీ- పాపహరా-మహేంద్రా-పాటలావతీ-కరీషిణీ- అసిక్నీ-కుశచీరా-మకరీ ప్రవరా-మీనా-హేమా-ఘృతవతీ- పురావతీ-అనుష్ణా-శైబ్యా-కాపీ- సదానీరా-అధృష్యా-కుశధారా నామకములైన మహానదులున్నవి.

కురురాజా ! యింకను భారతవర్షనదులను గూర్చి వినుము-సదాకాంతా శివా-వీరమతీ-వస్త్రా-సువస్త్రా-గౌరీ-కంపనా-హిరణ్వతీ-వరా- వీరకరా-పంచమీ రథచిత్రా-జోతిరథా-విశ్వామిత్రా-కపింజలా-ఉపేంద్రా-బహుళా-కువీరా-అంబువాహినీ-వినదీ- పింజలా- వీణా-తుంగవేణా-విదిశా-కృష్ణవేణీ- తామ్రా-కపిలా-ఖలు-సువామా- వేదాశ్వా-హరిస్రావా-మహాపగా - శీఘ్రా- పిచ్ఛిలా భారద్వాజీ-కౌశికీ-శోణా బాహుదా-చంద్రమా-దుర్గా-చిత్రశిలా-బ్రహ్మవేధ్యా బృహద్వతీ-యవక్షా-రోహీ-జాంబూనదీ-నామకనదులు.

రాజా! యింకను నదుల పేర్లను వినుము-సునసా-తమసా - దాసీ-వసా-వరాణసీ-నీలా-ధృతవతీ-పర్ణాశా-మానవీ - వృషభా-బ్రహ్మమేధ్యా-బృహద్ధ్వనీ-నామక నదులేకాక అనేకనదులున్నవి.

కురురాజా! యింకను నదుల పేర్లు వినుము - సదానిరామయా -కృష్ణా-మందగా-మందవాహినీ-బ్రాహ్మణీ - మహాగౌరీ-దుర్గా- చిత్రోత్పలా-చిత్రరథా-కుంజులా-వాహినీ-మందాకినీ - వైతరణీ-కోషా-శుక్తిమంతీ - అనంగా-వృషా-లోహిత్యా-కరతోయా-వృషకా-కుమారీ-ఋషికుల్యా-మారిషా-సరస్వతీ-మందా

కినీ-సుపుణ్యా-సర్వా-గంగా-నామకములైన యీ నదుల జలము భారత వర్షవాసులు త్రాగెదరు.

కురుపతీ! పూర్వోక్తనదులన్నియు ప్రపంచమునంతటికిన్నీ తల్లులు. ఇవి యన్నియు మహాపుణ్యఫలములనిచ్చునవిగా నున్నవి. ఇవిగాక, నూర్లకొలది వేల కొలది నదులు ఇటువంటివి భారతవర్షములోనున్నవి. అవి ప్రజలకు అపరిచిత ములై యున్నవి.

రాజా! నా జ్ఞప్తిలో నున్నంతవరకు ఈ నదులపేర్లు తెలిపినాను. ఇప్పుడు నేను భారతవర్షమునందలి దేశములనుగూర్చి వర్ణించెద వినుము.

## భారతవర్షమునందలి దేశములు :

మహారాజా! యీ భారతవర్షమునందు, కురుపాంచాల-శాల్వ-మాద్రేయ జాంగల-శూరసేన-పుళింద-బోధ-మాల-మత్స్య-కుశ్యల-సౌశల్య-కుంతి-కాంతి-కోసల-చేది-కరూష-మత్స్య-భోజ-సింధు - పుళింద-ఉత్తమాశ్వ-దశార్ణ-మేకల-ఉత్కళ-పంచాల-కోసల-నైకపృష్ఠ-ధురంధర-గోధా-మద్రకళింగ-కాశి-అపరకాశి-జఠర-కుక్కుర-దశార్ణ-కుంతి - అవంతి-అవరకుంతి-గోమంత-మందక-సండ-విదర్భ-రూపవాహిక-అశ్మక-పాండురాష్ట్ర-గోపరాష్ట్ర-కరీతి-అధిరాజ్య-కుశాద్య-మల్లరాష్ట్ర నామకదేశములు గలవు.

రాజా! యింకను భారతవర్షదేశముల పేర్లు వినుము:- వారవాస్య-అయవాహ-చక్ర-చక్రాతి-శక-విదేహ-మగధ - స్వక్ష-మలజ-విజయ-అంగ-వంగ-కళింగ-యకృల్లోమా-మల్ల-సుదేష్ణ-ప్రహ్లాద- మాహిక-శశిక-బాహ్లిక-వాటధాన-ఆభీర-కాలతోయక-అపరాంత-పరాంత - పంచాల-చర్మమండల-అటవీశిఖర-మేరుభూత-ఉపావృత్త-అనుపావృత్త-స్వరాష్ట్ర-కేకయ-కుందాపరాంత-మాహేయ-కక్ష-సాముద్రనిష్కుట - అనేకాంధ్ర-అంతర్గిరి - బహిర్గిరి-అంగమలజ-మగధ-మానవర్జక-సమంతర-ప్రావృషేయ-భార్గవ నామములు గల దేశములు గలవు.

మహారాజా! యింకను ననేకదేశముల పేర్లు వినుము:- పుండ్ర-భర్గ - కిరాత-సుదృష్ట-యామున-శక-నిషాద - నిషధ-ఆనర్త-నైరృత-దుర్గాల- ప్రతిమత్స్య-కుంతల - కోసల-తీరగ్రహ - శూరసేన-ఈజిక-కన్యకాగుణ - తిలభార-మసీర-మధుమాన్-సుకందక-కాశ్మీర-సింధుసౌవీర-గాంధార-దర్శక-అభిసార-

ఉలూత-శైవాల-బాహ్లిక-దార్వీ - వానవ-దర్వ-వాతజ-అమరధ - ఉరగ-బహువాద్య-సుదామ-సుమల్లిక-వధ్ర కరీషక-కుళింద-ఉపత్యక-వనాయు-దశ-పార్శ్వరోమ-కుశబిందు-కచ్ఛగోపాలకక్ష-జాంగల కురువర్ణక-కిరాత - బర్బర-సిద్ధ-వైదేహ-తామ్రలిప్తక-ఓండ్ర-మ్లేచ్ఛ-సైసిరిధ్ర-పార్వతీయ నామకాదులైన దేశములు గలవు.

కురురాజా! దక్షిణదేశమునందలి అనేకదేశముల పేర్లు వినుము:— ద్రవిడ-కేరళ-ప్రాచ్య-భూషిక-వనవాసిక-కర్ణాటక-మహిషక-వికల్ప-మూషక-ఝల్లిక-కుంతల-సౌహృద-నభకానన-కౌకుట్టిక-చోళ-కొంకణ-మాళవ-నర-సమంగ-కరక-కుకుర-అంగార-మారిష-ధ్వజనీ-ఉత్సవసంకేత-త్రిగర్త-శాల్వసేని వ్యూక-కోకబక-ప్రోష్ఠ-సమవేగవశ-వింధ్యచులిక-పుళింద-వల్కల-మాలవ-బల్లవ అపరబల్లవ-కులింద-కాలద-కుండల-కరట-మూషక-స్తనబాల-సనీప-ఘట-సృంజయ-అఠిద-పాశివాట-తనయ - సునయ-ఋషిక-విదభ - కాక-తంగణ పరతంగణ-నామకములు-ఉత్తరము. క్రూరమునైన అపరమ్లేచ్ఛదేశము. భయంకరమ్లేచ్ఛజాతులు గల యవన-చీన-కాంబోజ దేశములున్ను గలవు.

రాజా! యింకను భారతవర్షదేశముల పేర్లు వినుము :- సకృద్గ్రహ-కుళత్థ-హూణ-పారసిక-రమణచీన-దశమాలిక-నామక దేశములు.

ఇవియేగాక క్షత్రియుల ఉపనివేశికములు- వైశ్యనివాసదేశములు- శూద్రనివాసదేశములున్ను కలవు.

అభీర-దరద-కాశ్మీర-పశు-ఖాశీర-అంతచార-పహ్లవ-గిరి - ఆత్రేయ-భరద్వాజ-స్తనపోషిక-ప్రోషక-కళింగ-కిరాత జాతుల దేశములు కలవు.

తోమర-హన్యమాన-కరభంజక ఇత్యాది దేశములుగూడ నున్నవి.

రాజా! నేను పైనచెప్పిన దేశములేగాక, యింకను పూర్వ-ఉత్తర దిక్కులందలి గ్రామములు—దేశములు సంక్షేపముగా నీకు చెప్పితిని.

కురురాజా! రాజులు తమ గుణములను, బలమును అనుసరించి ఈ భారతవర్షమును ఒకవేళ, మంచిగా పాలించినయెడల ఈ భూమి, అన్నికోరికలను కామధేనువులై ధర్మ-అర్థ-కామములు అను త్రివర్గ మహాఫలమునిచ్చును.

మహారాజా! ఈ కారణముచేతనే ధర్మార్థకార్యములందు నిపుణులైన రాజ

వీరులు ఈ భూమిని పొందుటకు అభిలషించెదరు. ధనలోభముచేత యుద్ధము చేసి ప్రాణములు విడిచెదరు.

భరతశ్రేష్ఠా ! దేవతలకు-మనుష్యులకున్ను కోరిన కోర్కెలిచ్చునది ఈ భూమియే. కాబట్టి వారికందరకు ఈ భూమి ఆశ్రయమైయున్నది.

రాజా ! మాంసపుముక్క కొరకు కుక్కలు పరస్పరము పోట్లాడునట్లుగానే రాజులు ఈ భూమండల రాజ్యమును అనుభవించు నిచ్ఛచేత, ఒండొరులు పోరాడుచు- దోచుకొనుచుండెదరు. ఇంతచేసినప్పటికిన్ని నేటిదాక ఎవరికిగూడ కోరికల యెడల తృప్తిదీరలేదు.

భరతకులభూషణా ! యీ అసంతృప్తి చేతనే కౌరవ-పాండవులు సామదాన భేదదండములను నాలుగు ఉపాయములచేత సమస్త భూమండలాధికారము సంపాదించుటకు ప్రయత్నించుచున్నారు.

రాజా ! ఒకవేళ ఈ భూమియొక్క యథార్థస్వరూపము సంపూర్ణముగా తెలిసికొనినయెడల, ఈ భూమి పరమాత్మస్వరూపము కాబట్టి, ఈ భూమియే ప్రాణులకందరికి తండ్రిగా, సోదరుడిగా, పుత్రుడుగా, ఆకాశమునందలి పుణ్యలోకములుగా స్వర్గముగాను అయి వాటివలన గలుగు సుఖములు కలిగించగలదు. కనుక భూమియొక్క యథార్థస్వరూపము తెలిసికొనుట అవశ్యకము.

## పదవ అధ్యాయము

### యుగానుసారముగా భారతవర్షీయుల ఆయుస్సు :

జనమేజయా ! సంజయుడు చెప్పిన భారతవర్షనదీజనపదముల విషయము వినిన ధృతరాష్ట్రుడు మరలనతనినిట్లు ప్రశ్నించెను :

సంజయా ! నీవు భారత-హైమవతవర్షముల ప్రజల ఆయుఃప్రమాణము, బలము- భూతభవిష్యద్వర్తమాన శుభాశుభఫలములను గూర్చి తెలిపి, దానితో పాటే, హరివర్షమునుగూర్చికూడ విస్తారముగా నాకు తెలుపుము.

జనమేజయా ! ఆ మాటలకు సంజయుడిట్లు ధృతరాష్ట్రునకు చెప్పదొడగెను :-

భరతశ్రేష్ఠా! భరతవర్షమునందు నాలుగు యుగములు కృత-త్రేతా-ద్వాపర-కలియుగములు వచ్చును. ఈ యుగములు వరుసగా ఒకటి గడచిన తరువాత మరియొకటి వచ్చుచుండును.

రాజా! కృతయుగమునందు ప్రజలకు నాలుగువేల యేండ్ల ఆయుస్సు ఉండును. త్రేతాయుగమునందు మూడువేల సంవత్సరముల ఆయువు ప్రజలకు ఉండును. ద్వాపరయుగమున ప్రజల ఆయుస్సు రెండువేలసంవత్సరముల ప్రమాణము ఉండును.

రాజా! ఈ కలియుగమునందు ప్రజల ఆయుఃప్రమాణమునకు ఒక పరిమితిలేదు. కలియుగమునందు గర్భస్థశిశువుగూడ మరణించును. పుట్టినవెంటనే పురిటిలోను శిశువులు చచ్చుటకలదు.

రాజా! కృతయుగమునందు మహాబలశాలురు, సత్వగుణ సంపన్నులు, బుద్ధిమంతులు, ధనవంతులు, సౌందర్యవంతులైన ప్రియదర్శనులు పుట్టెదరు. ఆ యుగమునందు, నూర్లు వేలు సంతతిని కనెదరు. కృతయుగమునందు తరచుగా తపోధనులైన మహర్షులు పుట్టెదరు.

రాజా! త్రేతాయుగమునందు భూమండలమునందలి క్షత్రియులు మిక్కిలి ఉత్సాహవంతులు-మహాత్ములు-ధర్మాత్ములు - సత్యవాదులు - ప్రియదర్శనులు-సుందరులు-బలపరాక్రమసంపన్నులు-వరములు గొనుటకు అర్హులు. యుద్ధశూరులు ప్రజాపాలన దక్షులుగా నుండెదరు.

మహారాజా! ద్వాపరయుగమునందు ప్రజలు అన్నివర్ణములవారు పుట్టెదరు. వారు సర్వదా, ఉత్సాహపరాక్రమములు గలిగి ఒండొరులు జయేచ్ఛతో నుండెదరు.

భరతనందనా! కలియుగమునందు ప్రజలు అల్పతేజస్సుగలవారై, క్రోధము-లోభము గలిగి అసత్యవాదులుగా నుండెదరు. రాజా! కలియుగ ప్రజలకు ప్రాణులకు ఈర్ష్య-అసూయ- అభిమానము - క్రోధము-కపటము-మాయ-దోషదృష్టి-రాగము-లోభము-ద్వేషము- ఈ దోషములన్నియు నుండును.

రాజా! యీ ద్వాపరయుగమునందు గూడ సద్గుణములు ప్రజలకు

తక్కువగానే యుండును. భారతవర్షముకంటే హైమవత-హరివర్షములందు ఉత్త రోత్తరము అధికగుణములు ఉండును.

## పదకొండవ అధ్యాయము

### భూమిపర్వము-శాకద్వీపవర్ణనము :

జనమేజయా ! సంజయుడు చెప్పిన భారతవర్షయుగముల వర్ణనము విని ధృతరాష్ట్రుడు సంజయుని మరలనిట్లు ప్రశ్నించెను :

సంజయా ! నీవు ఈ జంబూఖండమును గూర్చి వర్ణించిచెప్పితివి. ఇప్పుడీ ఖండముయొక్క వైశాల్యము-కొలతనుగూర్చి తెలుపుము. సముద్ర పరిమాణమును గూర్చిగూడ తెలుపుము. తరువాత శాకద్వీప - కుశద్వీపములగూర్చి వర్ణింపుము. సంజయా ! ఈ విధముగనే శాల్మలద్వీప-క్రౌంచద్వీపముల సమాచారమును తెలిపి సూర్యచంద్రులకు రాహువుతోగల సంబంధమునుగూర్చి వివరములుగూడ యథార్థముగా ప్రతిపాదించుము.

జనమేజయా ! ఆ మాటకు సంజయుడు ఇట్లు చెప్పదొడగెను :

రాజా ! ద్వీపములనేకములున్నవి. సమస్త ప్రపంచమునందు ద్వీపములున్నవి. ఇప్పుడు నేను నీ యాజ్ఞప్రకారము ఏడు ద్వీపములనుగూర్చి, సూర్య చంద్ర-రాహువులనుగూర్చి వర్ణించి చెప్పెదను.

రాజా ! జంబూద్వీప వైశాల్యము పదునెనిమిదివేల అరునూర్ల (18,600) యోజనముల ప్రమాణము (కొలత) కలదు. దీనికి నలువైపులనున్న లవణసముద్రము వైశాల్యము పరిమాణము జంబూద్వీపమునకంటే రెండురెట్లు అధికముగా నున్నది.

రాజా ! ఆ సముద్రతీరములందు, ఆ ప్రాంతములందు, అనేకదేశములు గ్రామములున్నవి. ఆ సముద్రమునందు నానావిధమణులు, పగడములున్నవి. వాటిచేత ఆ సముద్రము చిత్రితమైయున్నది. అక్కడ అనేక ధాతువులతో ఓషధులతోను అద్భుతములుగానున్న అనేకపర్వతములు ఆ లవణసముద్రమును

శోభింపచేయుచున్నవి. సిద్ధచారణులచే పరిపూర్ణమైన ఆ లవణసముద్రము భూమికి అన్నివైపుల మండలాకారముగా చుట్టియున్నది.

## శాకద్వీపవర్ణనము :

రాజా ! ఇప్పుడు నేను శాకద్వీపమునుగూర్చి వర్ణించెదను వినుము. శాకద్వీపము జంబూద్వీపముకంటే ద్విగుణముగా విశాలమైయున్నది. దానిని చుట్టుకొనియున్న సముద్రముగూడ జంబూద్వీప సముద్రము కంటే ద్విగుణముగనున్నది.

రాజా ! శాకద్వీపమును చుట్టియున్న సముద్రము క్షీరసాగరమనబడును. అక్కడనున్న పవిత్రదేశమునందలి ప్రజలకు మృత్యువులేదు. కరవు-కాటకములు అక్కడ ఉండుటకు అవకాశమే లేదు. అక్కడి ప్రజలకు ఓర్పు - సహనము తేజస్సు ఉండును. శాకద్వీపమునుగూర్చి సంక్షేపముగా వర్ణించి చెప్పితిని. రాజా! మరియింక నీకు ఏమి కావలెనో చెప్పుము.

జనమేజయా ! సంజయుని మాటవిని ధృతరాష్ట్రుడిట్లడిగెను :-

సంజయా! శాకద్వీపమునుగూర్చి యింకను విస్తారముగా వర్ణించి చెప్పుము

జనమేజయా ! ఆ మాటకు సంజయుడిట్లు శాకద్వీపమును గూర్చి విస్తరించెను.

రాజా ! శాకద్వీపమునందు గూడ మణివిభూషితములైన యేడు పర్వతములు గలవు. అక్కడ రత్నముల గనులు అనేకములున్నవి. నదులుగూడ అనేకములున్నవి. వాటి పేర్లు వినుము.

కురుపతీ ! శాకద్వీపమునందు ఉన్నవన్నియు పరమపవిత్రములు- మంచి గుణములు గలవిగనున్నవి. అక్కడి ప్రధానపర్వతములు యివి :

రాజా ! గంధర్వసేవితమైన మేరుపర్వతము ప్రధానముగా శాకద్వీపమునందు గలదు. పూర్వదిక్కునందు పడమటిదిక్కువరకు వ్యాపించియున్న మలయపర్వతము ఆ ద్వీపమునందే కలదు. ఆ మలయపర్వతమునుండియే మేఘములు ఉత్పన్నములై అన్నిదిక్కులు వ్యాపించి జలము వర్షించుచున్నవి.

మలయపర్వతమునకు ఆవల జలధార నామముగల మహాపర్వతము గలదు. రాజా ! ఇంద్రుడు ఆ పర్వతమునుండియే సర్వదా ఉత్తమజలము గ్రహించును. అందుచేతనే యింద్రుడు వర్షాకాలమునందు విశేషముగా జలము వర్షింప గలుగుచున్నాడు.

రాజా ! శాకద్వీపమునందే మిక్కిలి యెత్తైన రైవతక పర్వతము కలదు. అక్కడ ఆకాశమునందు రేవతీ నక్షత్రము శాశ్వతముగా ప్రతిష్ఠితమైయున్నది. ఈ విధానము బ్రహ్మదేవుడు ఏర్పరచెను.

రాజా ! రైవతక పర్వతమునకు ఉత్తరముగా శ్యామనామముగల మహాపర్వతము గలదు. అది నవీనమేఘమువలె శ్యామవర్ణముగలదై యుండును. దాని యెత్తు చాల ఉన్నది. దాని ఆకారము అత్యుజ్జ్వలముగ నుండును. అక్కడ నివసించియుండుటచేతనే అక్కడి ప్రజలు శ్యామవర్ణము గలవారై యుందురు.

జనమేజయా ! సంజయుని మాట విని ధృతరాష్ట్రుడిట్లనెను :-

సంజయా ! యిది మహాశ్చర్యకరముగా నున్నదే. నాకు సంశయాస్పదమైన విషయము చెప్పితివి. అక్కడ ఉండినంతమాత్రమున ప్రజలెట్లు శ్యామవర్ణము గలవారయ్యెదరు ?

జనమేజయా ! ధృతరాష్ట్రుని ప్రశ్నమునకు సంజయుడిట్లు బదులు చెప్పెను.

మహారాజా ! అన్ని ద్వీపములయందు తెలుపునలుపు వర్ణముల మిశ్రణము కనబడుచున్నది. ఈ శ్యామద్వీపము శ్యామమగుటకు- అందలి జనులుగూడ శ్యామవర్ణము గలవారగుటకు కారణము చెప్పెద వినుము.

రాజా ! ఈ ద్వీపమునందు శ్రీకృష్ణభగవానుడు నివసించుచుండును. కాబట్టి ఆ భగవానుని కాంతిచేతనే యీ ద్వీపము శ్యామవర్ణము గలదయ్యెను. తన సమీపమున నున్నవారికి గూడ ఈ ద్వీపము శ్యామవర్ణము సంక్రమింపజేయును.

రాజా ! శ్యామగిరికి ఆవల చాల యెత్తైన దుర్గ పర్వతము ఉన్నది దాని తరువాత కేసర పర్వతము కలదు. ఈపర్వతమునుండి వీచినగాలి కేసరి కుంకుమ పువ్వు) వాసనగలిగియుండును.

రాజా ! ఈ పర్వతములన్నింటి విస్తారము వరుసగా ఉత్తరోత్తరమును ద్విగుణీకృతమైయున్నది. ఈ పర్వతముల సమీపమునందు కుముదోత్త రవర్షము ఉన్నది. జలధార పర్వత సమీపమునందు సుకుమారవర్షము కలదని చెప్పెదరు. రైవతక పర్వతము వద్ద కుమారవర్షము, శ్యామగిరి వద్ద మణికాంచన వర్షము ఉన్నది. ఈ విధముగానే కేసరపర్వత సమీపమునందు మోదాకవర్షము దానికి ఆవల మహాపుమాన్ వర్షముకలవు.

రాజా ! అది ఆ ద్వీపము యొక్క పొడవు వెడల్పు చుట్టి యున్నది. దాని మధ్య శాక నామము గల ఒక పెద్దవృక్షము ఉన్నది శాకమనగా టేకుచెట్టు. ఆ చెట్టు జంబూద్వీపము వలెనే విశాలముగా నున్నది. ఆ ద్వీపమునందలి ప్రజలు సర్వదా ఆ శాకవృక్షమునే ఆశ్రయించియుండెదరు. అక్కడనొక అతిపవిత్రమైన దేశమున్నది. ఆ ద్వీపమునందు శంకరభగవానుని ఆరాధించుచుండెదరు.

రాజా ! ఆ శాకద్వీపమునకు సిద్ధచారణాది దేవతలు పోవుచుందురు. అక్కడి నాలుగు జాతుల ప్రజలు అత్యంతధార్మికులుగా నుండెదరు. అక్కడ అన్ని వర్ణముల ప్రజలు స్వస్వకర్మములు ఆచరించుటయందు అనక్తులై యుందురు. బ్రహ్మచర్యాదులైన నాలుగు ఆశ్రమముల ఆచారములు గూడ అక్కడి ప్రజలు పాలించుచుండెదరు. అక్కడ దొంగలు లేరు. ఆ ద్వీపమునందలి ప్రజలు జరా మరణములు లేక దీర్ఘాయువుతో నుండెదరు.

రాజా ! వర్షర్తువునందు మహానదుల వలె, ఆ ద్వీపప్రజలు సర్వదా అభి వృద్ధిచెందుచుందురు. పవిత్రజలములు గల అనేక నదులు ఆ ద్వీపమునందు ప్రవహించుచుండును. అక్కడ గంగానది గూడ అనేక ప్రవాహములుగా విభక్తమై యున్నది.

రాజా ! ఆ ద్వీపమునందు, సుకుమారీ-కుమారీ-శీతాశీ-వేణికా-మహానదీ-మణిజలా-చక్షుర్వర్ధనికా ఇత్యాది నామములు గల అనేకనదులు పవిత్రజలములతో ప్రవహించుచుండును. ఇంకను ఇట్టి మహానదులక్కడ ఎన్నియో కలవు.

రాజా ! ఆ ద్వీపమునందుగల లక్షలకొలది నదుల నుండి యింద్రుడు జలము తీసికొని వర్షము కురియుచుండును. ఆ నదుల పేర్లు కొలతలు - వాటి సంఖ్య తెలుపుట చాల కఠినము. అది అసంభవము. ఆ నదులన్నియు శ్రేష్ఠములు

పరమపవిత్రములు. ఆ ద్వీపమునందు ప్రపంచ సమ్మానితములైన నాలుగుదేశములు గలవు.

రాజా! మంగ-మశక-మానస-మందగ నామములు గలవి ఆ నాలుగు దేశములు. ఆ నాలుగింటిలోను మంగదేశమునందు అధికముగా బ్రాహ్మణులు నివసించుచుండెదరు వారందరు గూడ తమ బ్రాహ్మణత్వకర్తవ్య పాలనమునందు తత్పరులై యుందురు.

కురుపతీ! మశకదేశమునందు కోరినకోరికలనెల్ల తీర్చగల ధర్మాత్ములైన క్షత్రియులు అధికముగా నివసించుచుండెదరు. మానసదేశమునందు వైశ్యవృత్తి చేత జీవనము గడుపువారుండెదరు. వారు సర్వసుఖభోగసంపన్నులు- వీరులు- ధర్మార్థముల నెరిగినవారు, దృఢనిశ్చయములతో కార్యములను సాధించువారుగా నున్నారు. మందగ దేశమునందు ధర్మాత్ములైన శూద్రులు ఉండెదరు.

రాజేంద్రా! అక్కడ రాజుగాని, దండనముగాని దండమువిధించువారుగాని ఉండరు. అక్కడివారందరు ధర్మజ్ఞులు. వారు స్వధర్మపాలన ప్రభావముచేతనే పరస్పరము రక్షించుకొనుచుండెదరు.

మహారాజా! తేజోమయమైన ఆ గొప్పశాకద్వీపమునకు సంబంధించి యింతయే చెప్పవచ్చును. ఇంతయే వినవలసినవిషయము గూడ కలదు.

# పండ్రెండవ అధ్యాయము

## సంజయుని కుశ-క్రౌంచ-పుష్కరాది ద్వీపముల వర్ణనము:

కుశ-క్రౌంచ-పుష్కరాది ద్వీపములయొక్క, రాహు- సూర్య- చంద్రుల యొక్క వర్ణనము.

కురునందనా! శాకద్వీపము తరువాతి ద్వీపముల విషయములో నేను విన్నంతవరకు చెప్పెద వినుము.

రాజా! క్షీరోదసముద్రమునకు అవల ఘృతోదసముద్రము దాని తరువాత దధి మండోద సముద్రము ఈ రెండిటికి అవల సురోదసముద్రము తరువాత తియ్యని నీరుగల సముద్రములున్నవి.

కురురాజా ! ఈ సముద్రములతో చుట్టబడిన ద్వీపములన్నియు నొకటి కంటే నొకటి ఉత్తరోత్తర ద్విగుణితముగా విస్తారముగలవి.

రాజా ! ఈ ద్వీపములలో మధ్యమ ద్వీపమునందు మనశ్శిల (మణిసిల) యొక్క చాల గొప్ప పర్వతము కలదు. దానికి గౌరపర్వతము అని పేరు ప్రసిద్ధమైయున్నది. దీనికి పడమటిదిశయందు కృష్ణపర్వతము గలదు. అది శ్రీమన్నారాయణునకు విశేషప్రియమైనది.

రాజా ! భగవంతుడైన నారాయణమూర్తియే అక్కడ దివ్యరత్నములను ఉంచి, రక్షించుచున్నారు. ఆ భగవంతుడక్కడ ప్రజలయెడల ప్రసన్నుడై యున్నాడు గనుక, వారికి సుఖము గలిగించుటకు అన్ని యేర్పాట్లు స్వయముగా చేసినాడు.

రాజా ! కుశద్వీపమునందు దర్భలయొక్క చాల గొప్పవృక్షమొకటి గలదు. అక్కడి ప్రజలు ఆవృక్షమును పూజించు చుండెదరు. ఈ విధముగనే శాల్మలీ ద్వీపమునందు శాల్మలి వృక్షమును అక్కడివారు పూజించుచుండెదరు.

రాజా ! క్రౌంచద్వీపమునందు మహాక్రౌంచము అనునొక పెద్దపర్వతము గలదు. అది రత్నరాసులకు గని. ఆ ద్వీపమునందలి నాలుగు జాతుల ప్రజలందరు సర్వదా ఆ పర్వతమునే పూజించుచుండెదరు.

రాజా ! అక్కడనే గోమంతము అనెడు నొక మహావిశాలమైన పర్వతము ఉన్నది. అక్కడ అన్ని ధాతువులు (మూలికలు) నిండియున్నవి. అక్కడ మోక్షేచ్ఛ గల ఉపాసకుల ముఖమునుండి వెడలు తన స్తోత్రములను వినుచు ప్రపంచప్రభువైన శ్రీమన్నారాయణమూర్తి సర్వదా నివాసముచేయుచుండును.

రాజా ! కుశద్వీపమునందు సుధామ అను పేరుగల సువర్ణపర్వతము యొకటి సుప్రసిద్ధముగా నున్నది. ఆ పర్వతమునందు పగడములు నిండుగానున్నవి. అది దుర్గమమైన పర్వతము.

కౌరవరాజా ! అక్కడనే అతికాంతిమంతమైన కుముదము అను మూడవ పర్వతము గలదు. నాలుగవది పుష్పవాన్, ఐదవది కుశేశయము, ఆరవది హరిగిరి యను పేర్లుగల పర్వతములున్నవి. ఈ యారున్ను కుశద్వీపము నందలి శ్రేష్ఠ పర్వతములు.

భరతకులభూషణా! యీ పర్వతముల మధ్యగల వైశాల్యము అన్నివైపుల నుండి ఉత్తరోత్తరము ఒకటికంటెఒకటి ద్విగుణముగా నున్నది.

రాజా! కుశద్వీపము యొక్క మొదటిది 'ఉద్భిత్' అను వర్షము-రెండవది వేణుమండల వర్షము, మూడవది సురథాకార వర్షము, నాలుగవది కంబలవర్షము, ఐదవది ధృతిమాన్ వర్షము, ఆరవది ప్రభాకర వర్షము, ఏడవది కాపిలవర్షము అని ఆ వర్షముల ప్రసిద్ధనామములు.

కురురాజా! యీ యేడు వర్షములందు దేవ–గంధర్వ-మనుష్యులు ఆనం దముతో విహరించుచుండెదరు. వారిలోనెవరికి కూడ మృత్యువులేదు. అక్కడ దొంగలు, దోపిడీగాండ్రుగాని, మ్లేచ్ఛజాతివారుగాని లేరు.

రాజా! ఈ వర్షములందు నివసించువారందరు తెల్లని శరీరవర్ణము గలిగి సుకుమారులుగా నుండెదరు.

రాజా! ఇప్పుడిక నేను తక్కిన ద్వీపములన్నిటి విషయమై నాకు తెలిసి నంతవరకు చెప్పెదను. శాంతచిత్తుడవై వినుము.

మహారాజా! క్రౌంచద్వీపమునందు గల మహాక్రౌంచపర్వతమునకు ఆవల వామన పర్వతము దాని తరువాత అంధకారము, పిదప మైనాకము దానికి ఆవల నిబిదము అను శ్రేష్ఠములైన పర్వతములు గలవు.

రాజా! ఈ పర్వతముల మధ్యభాగపు వైశాల్యము క్రమముగా ఒకటి కంటెనొకటి ఉత్తరోత్తరము ద్విగుణముగా మించియున్నది.

రాజా! ఈపర్వతప్రాంతములందు గల దేశములను గూర్చి చెప్పెద వినుము.

కురుపతీ! క్రౌంచపర్వతసమీపమునందు కుశలము అను దేశము వామన పర్వతము వద్ద 'మనోనుగము' ఆ దేశమునకు ఆవల ఉష్ణము అను దేశము, దాని తరువాత ప్రావరక దేశము. ఆ పిదప అంధకారము, దానికి ఆవల ఉత్తమమైన 'ముని' దేశము, దాని తరువాతది దుందుభి స్వనదేశము అను దేశములు గలవు.

రాజా! దుందుభిస్వన దేశమునందు సిద్ధచారణులు నిండియున్నారు.

అక్కడి ప్రజలు తరచుగా తెల్లగానుండెదరు. ఈ దేశములన్నిటియందు దేవతలు-గంధర్వులు నివసించుచుండెదరు.

రాజా ! పుష్కరద్వీపమునందు పుష్కరపర్వతము కలదు. దాని యందు అనేకరత్నములు ఉన్నవి. అక్కడ భగవంతుడైన ప్రజాపతి - బ్రహ్మదేవుడు నిత్యనివాసము చేయుచుండును. దేవతలు - మహర్షులు మనస్ఫూర్తిగా స్తోత్రములు చేయుచు ప్రతిదినము బ్రహ్మదేవుని పూజించుచు, ఆ దేవుని యుపాసనలో నిమగ్నులైయుండెదరు.

మహారాజా ! జంబూద్వీపము నుండి వివిధరత్నములు, వేర్వేరు ద్వీపములకు, అక్కడి ప్రజల యుపయోగము కొరకు పంపబడుచుండును.

రాజా ! 'బ్రహ్మచర్యము-సత్యము-ఇంద్రియనిగ్రహము' వీని ప్రభావము చేత ఆ ద్వీపములందున్న ప్రజలందరి యొక్క ఆరోగ్యము-ఆయుఃప్రమాణము జంబూద్వీపవాసుల కన్న ఉత్తరోత్తరముగ ద్విగుణమైయుండును.

రాజా ! వాస్తవముగా విచారించినచో ఈ దేశములన్నింటిలోను ఒకే జనపదము ఉన్నది. ఏ ద్వీపములయందు అనేక జనపదములు చెప్పబడినవో, వాటిలో గూడ ఒకేవిధమైన ధర్మము కనబడుచున్నది.

మహారాజా ! పరమేశ్వరుడు-ప్రజాపతియునైన బ్రహ్మదేవుడు స్వయముగనే దండము ధరించి ఈ ద్వీపములన్నింటిని రక్షించుచు ఇక్కడ నిత్యనివాసము ఏర్పరచుకొనియుండును.

రాజా ! ప్రజాపతియే ఆ ద్వీపములకు రాజుగానున్నాడు. ఆ దేవుడు స్వయముగా కళ్యాణస్వరూపుడై అందరకు శ్రేయస్సు కలిగించును. రాజా ! ఆ దేవుడే వారికి పితగా, పితామహుడుగా నున్నాడు. జడవస్తువుల నుండి చేతనుల వరకు ప్రజలందరిని ఆ దేవుడే రక్షించుచున్నాడు.

రాజా ! అక్కడి ప్రజలకడకే, వండబడి సిద్ధమైన భోజనము వచ్చును. దానినే తిని అక్కడివారు ఉండెదరు.

రాజా ! దానికి అవల సమా అను పేరుగల జనపదము ప్రజల నివాసముగానున్నది. ఆ ప్రదేశము నాలుగుమూలలు (చతురస్రము)గా నున్నది. దాని యందు ముప్పదిమూడు మండలములు గలవు.

మహారాజా ! అక్కడ లోకవిఖ్యాతములైన 'వామన-ఐరావత-సుప్రతీక-అంజన' నామములు గల నాలుగు దిగ్గజములున్నవి. వాటిలో సుప్రతీకగజము యొక్క శరీరము అన్నివైపుల అపరిమితముగ వ్యాపించియున్నది గాబట్టి, దాని పరిమాణము (కొలత) ఇంతయున్నదని నేను చెప్పజాలను.

రాజా ! అక్కడ అన్నివైపుల నుండి ధారాళముగా వాయువు అడ్డులేక వీచుచుండును. ఆ వాయువును ఆ నాలుగు దిగ్గజములు గ్రహించి ఆపి ఉండును. తరువాత ఆ గజములు కమలములవంటి తమ తొండము యొక్క అగ్రభాగము నుండి ఆ వాయువును నూర్లకొలది భాగములుగా విభజించి వెంటనే అన్నిదిక్కులందు విడుచును. ఈ కార్యము ఆ గజముల నిత్యకృత్యముగానున్నది. రాజా ! ఊపిరిపీల్చుకున్న ఆ దిగ్గజముల ముఖముల నుండి విడువబడిన ఆ వాయువే సమస్తప్రజల జీవితమును ధరించుచున్నది.

జనమేజయా ! సంజయుని మాటలు విని ధృతరాష్ట్రుడు మరల సంజయునిట్లు ప్రశ్నించెను.

## సూర్యచంద్రరాహువుల ప్రమాణము:

సంజయా ! నీవు ద్వీపముల స్థితిని గూర్చి అతివిస్తారముగా చెప్పితివి. ఇప్పుడు చివరిదైన సూర్య-చంద్ర-రాహువుల ప్రమాణము (కొలత)ను గూర్చి చెప్పుము.

జనమేజయా ! ఆ మాటకు సంజయుడిట్లు చెప్పదొడగెను:–

మహారాజా ! నేను ద్వీపముల వర్ణనము చేసితిని. ఇప్పుడు గ్రహముల గూర్చిన యథార్థవర్ణనము చేసి చెప్పెదవినుము. రాహుగ్రహముయొక్క పొడవు-వెడల్పునుగూర్చి నేను వినినంతవరకు చెప్పెదను. రాహుగ్రహము మండలాకారముగా నున్నదని వినినాను.

రాజా ! రాహుగ్రహముయొక్క వ్యాసము పన్నెండువేల యోజనములు గలదు. దాని పరిధి (చుట్టుకొలత) ముప్పదియారువేల యోజనములు గలదు. ఆ గ్రహముయొక్క లావునుగూర్చి పౌరాణికులు ఆరువేల యోజనములు గలదని చెప్పెదరు.

రాజా! చంద్రునివ్యాసము పదకొండు యోజనములని చెప్పెదరు. చంద్రుని పరిధి ముప్పదిమూడువేల యోజనములు గలదు. చంద్రుని లావు ఐదువేల తొమ్మిది నూర్ల యోజనములు గలదు.

రాజా! ఈవిధముగా శీఘ్రగమనము గల సూర్యభగవానుని విస్తారము మూడువిధములుగ నున్నదని చెప్పెదరు.

రాజా! ఈ సూర్యచంద్రులకంటె రాహువు అధికవిస్తారము గలవాడు గనుక, సూర్యచంద్రులను అప్పుడప్పుడు ఆచ్ఛాదించుచుండును. (అదియే గ్రహణము).

రాజా! నీవు ప్రశ్నించిన ప్రకారము గ్రహముల విషయమై శాస్త్రదృష్టితో సంగ్రహముగా చెప్పితిని. అన్ని విషయములు యథార్థరీతిలో చెప్పితిని గాబట్టి యిక శాంతితోనుండుము.

రాజా! భూమి స్వరూపమును పూర్తిగా ఇప్పుడు నీవు తెలిసికొనినావు గాబట్టి నీ పుత్రుడు దుర్యోధనుని విషయమై నిశ్చింతగానుండి ఊరడిల్లుము.

## భూమిపర్వ ఫలశ్రుతి:

రాజా! మనస్సుపెట్టి యీ భూమిపర్వము వినిన రాజు, శ్రీమంతుడు—సఫల మనోరథుడు - శ్రేష్ఠపురుషులచేత సమ్మానితుడునగును. అతని బలము—ఆయుస్సు-కీర్తి-తేజస్సు వృద్ధిపొందగలవు.

రాజా! దృఢమైన యింద్రియనిగ్రహము గలిగి, నియమవ్రత పాలన చేయుచు, ప్రతిపర్వదినమందున్ను ఈ భూమిపర్వవిషయము విను మనుష్యుని యొక్క పితృపితామహులు పరిపూర్ణముగా సంతృప్తిచెందెదరు.

రాజా! దేనియందు మనము నివసించుచున్నామో, దేనియందు మన పూర్వులు పుణ్యకర్మములను అనుష్ఠించిరో ఆ భారతవర్షమేయిది. నీవు దీనియొక్క వర్ణనము పూర్తిగా వింటివి.

# పదమూడవ అధ్యాయము

## సంజయుడు భీష్ముని మృత్యువు ధృతరాష్ట్రునకు తెలుపుట:

వైశంపాయన మహాముని జనమేజయునకు తరువాతి కథ యిట్లు చెప్పదొడగెను.

"జనమేజయా! భూతభవిష్యద్వర్తమానములను బాగుగా ఎరిగి, సమస్త విషయములను ప్రత్యక్షముగా చూడగలిగిన సంజయుడొకనాడు యుద్ధభూమినుండి తిరిగివచ్చి హఠాత్తుగా ధృతరాష్ట్రునివద్దకుపోయి మిక్కిలి దుఃఖించుచు భరతవంశ పితామహుడయిన భీష్ముడు యుద్ధభూమిలో చంపబడెనని చెప్పుచు నిట్లనెను:-"

"రాజా! నేను సంజయుడను, నీకడకువచ్చినాను. శాంతనునందనుడైన భీష్ముడు నేడు యుద్ధమునందు సంహరింపబడెను. సమస్త యుద్ధవీరులకు ధ్వజము వలె ప్రధానుడు ధనుర్ధరులందరకు ఆశ్రయభూతుడుగనుండిన కురుకుల పితామహుడు భీష్ముడు నేడు శరతల్పగతుడై నిద్రించుచున్నాడు"

"మహారాజా! నీపుత్రుడు దుర్యోధనుడు ఏ వీరుని బాహుబలమునమ్మి జూదమాడెనో, ఆ భీష్ముడు శిఖండిచేత కొట్టబడి యుద్ధభూమియందు శయనించుచున్నాడు".

"రాజా! మహారథికుడు వీరవరుడునైన ఏ భీష్ముడు కాశీరాజు నగరమునందు చేరియున్న సమస్త రాజులను ఏకాకిగనే రథమాత్ర సహాయుడై మహాయుద్ధమునందు ఓడించియుండెనో, ఏ వీరుడు యుద్ధభూమియందు జమదగ్ని పుత్రుడైన పరశురామునితో నిర్భయముగా పోరాడియుండెనో, ఏ మహావీరుని పరశురాముడుగూడా సంహరించజాలకపోయెనో, అట్టి భీష్ముడే నేడు శిఖండిచేత సంహరించబడెను".

"మహారాజా! ఏ వీరుడు దేవేంద్రునితో సమానుడో, స్థైర్యమునందు హిమాలయమువంటివాడో, గాంభీర్యమునందు సముద్రసమానుడో, క్షమయందు భూమితోసమానుడో, ఎవడు మనుష్యులలో సింహముగానుండెనో, బాణములే ఏ వీరునకు కోరలుగానుండెనో, ఎవనికి ధనుస్సే తెరచుకొనబడిన ముఖముగానుండెనో, ఖడ్గమే ఏ మహావీరునకు నాల్కగానుండెనో, ఈ కారణములచేత

ఏ మహావీరునకుగూడా ఎవని సమీపమునకు పోవుటకు అత్యంత కఠినముగా నుండెనో, నీ తండ్రియైన ఆ భీష్ముడే నేడు పాంచాలరాజకుమారుడైన శిఖండిచే కొట్టివేయబడెను".

"రాజా! సింహమునుచూడగనే గోవులమంద భయముచేత వ్యాకులమగునట్లే. ఏవీరుడు యుద్ధమునందు ఆయుధముధరించియుండగా చూచి, పాండవుల సేన భయముచే వ్యాకులపడి గడగడవణకుచునుండెనో, శత్రుసైన్య సంహారకుడైన భీష్ముడే పదిదినములవరకు నీ సేనను పరిరక్షించుచు, అత్యంత దుష్కర పరాక్రమముచూపుచు చివరకు సూర్యునివలె, అస్తపర్వతమునకు వెడలిపోయెను".

"మహారాజా! ఏ మహావీరుడు ఇంద్రునివలె నెప్పుడుగూడ క్షోభచెందక, వేలకొలది బాణములు కురియుచు, పది దినములలో పదికోట్లమంది యోధులను సంహరించెనో, ఆ మహావీరుడైన భీష్ముడే నేడు సుడిగాలికి ఊడబెరకబడి విరిగి పడిన వృక్షమువలె కొట్టబడి యుద్ధభూమియందు నిద్రించుచున్నాడు".

"భరతవంశభూషణా! ఇదియంతయు నీదురాలోచన మూలముననే జరిగెను. దాని ఫలమేయిది. నీదురాలోచనకాకున్నఎడల భీష్ముడు నేడు ఈ దురవస్థకు లోనుకాకుండెను. ఇట్టి దుర్దశకు ఆయన అర్హుడుకాడు".

## పదునాలుగవ అధ్యాయము

జనమేజయా! ఇట్లు సంజయుడు చెప్పగావిని ధృతరాష్ట్రుడు ఇట్లనెను.

సంజయా! కురుకులశ్రేష్ఠుడు, నాకు పితృతుల్యుడునైన భీష్ముడు శిఖండి చేత ఎట్లు చంపబడెను? ఇంద్రసమాన బలపరాక్రమ సంపన్నుడైన భీష్ముడు, రథమునుండి ఎట్లు క్రిందపడిపోయెను?"

"సంజయా! యేమహాత్ముడు తన తండ్రి సంతోషముకొరకు జీవితాంతము బ్రహ్మచర్యపాలనము చేయుటకు దీక్షవహించెనో, ఏవీరుడు దేవతాసమాన బల పరాక్రమములు కలిగియుండెనో, అట్టి భీష్ముడు లేకుండ నేడు మన సైనికులు ఎట్టి దురవస్థకు గురిఅయినారు? ఈ విషయమంతయు వివరించి చెప్పుము".

"సంజయా! మహాజ్ఞాని, మహా ధనుర్ధరుడు, మహాబలశాలి, మహాధైర్యశాలి,

నరోత్తముడునైన భీష్ముడు సంహరింపబడిన తరువాత నీమనస్సునకు ఏమని పించెనో చెప్పుము-

సంజయా! మేరుధరుడై యేమాత్రము చలించని పురుషసింహుడు కురు కుల శిరోమణియునైన భీష్మపితామహుడు చంపబడినాడని నీవు చెప్పగనే నా మనస్సునకు అత్యంత బాధ కలుగుచున్నది.

సంజయా! ఆ భీష్ముడు యుద్ధమునకుగాను ముందుకుసాగి పోవుచుండి నపుడు ఆయన వెనుక సహాయకులుగా నెవరు పోయియుండిరి? ఆయనకు ముందు భాగమునందు ఎవరుయుండిరి? ఏ వీరులు ఆయనతోపాటు శత్రువులతో యుద్ధము చేయుచుండిరి? ఎవరు యుద్ధము విడిచి పారిపోయిరి? ఏ వీరులు అన్ని విధముల ఆయనను అనుసరించి తోడ్పడుచుండిరి?

సంజయా! రథికసింహుడు, అద్భుతపరాక్రమశాలి, క్షత్రియ శిరోమణియు నైన భీష్ముడు శత్రుసేనలో ప్రవేశించునపుడు ఆయనవెనుక ఆయనను ఆశ్ర యించుచు నెవరెవరు తోడ్పడుచుండిరి?

సంజయా! సూర్యుడు అంధకారమును భేదించునట్లు శత్రుహంతకుడైన భీష్ముడు శత్రుసేనను నశింపజేయుచుండెను. ఆయన తేజస్సు సహస్ర కిరణుడైన సూర్యుని తేజస్సువలెనుండును. ఆయనను చూచినవెంటనే శత్రువులు భయపడు చుండిరి.

సంజయా! యే మహావీరుడు యుద్ధమునందు పాండవులపైన దుష్కర పరాక్రమముతో దాడిచేయుచుండెనో, ఏ వీరుడు పాండవసేనను ఎడతెగక సంహరించుచుండెనో, అస్త్రవిద్యాపండితుడు దుర్జయుడునైన ఆ వీరభీష్ముని ఎవరు అడ్డగించి ఆపిరి? వారెవరు? సంజయా! నీవు ఆయనవద్దనేయుంటివిగదా! పాండవులు యుద్ధమునందు భీష్ముడు ముందుకునాగకుండ ఆయన నెట్లు నివారింప గలిగిరి?

సంజయా! ఏ వీరుడు శత్రుసేనలను నిరంతరము భేదించుచుండెనో, బాణములే యెవనికి కోరలుగా నుండెనో, ధనుస్సే యెవని తెరచిన నోరుగా నుండెనో, ఖడ్గమే యెవని నాలుకయో అట్టి భయంకరుడైన పురుషసింహుని

భీష్ముని అర్జునుడు ఎట్లు కొట్టి పడవేసెను? భీష్ముడిట్లు అపజయము పొందుటకు అర్హుడు కాడు. ఆయన సర్వదా పరాజయశూన్యుడుగానే యుండెను గదా!

సంజయా! యే ఉత్తమవీరుడు, ఉత్తమరథముపైన కూర్చొని భయంకర ధనుస్సు, బాణములు ధరించి శత్రుశిరస్సులను ఛేదించి కుప్పబోయుచుండెనో, ఏ వీరుడు ప్రళయకాలాగ్ని సమానుడై యుద్ధమునకు వచ్చుచుండుట జూచి పాండవసేనలు సర్వదా గడగడవణకుచుండెనో, అటువంటి భీష్ముడే పది దినములు యుద్ధముచేసి శత్రువులను సంహరించుచు దుష్కరపరాక్రమము ప్రదర్శించి సూర్యుని వలె అస్తమించెను గదా!

సంజయా! యే వీరుడు ఇంద్రునితో సమానుడై పదిదినములు యుద్ధము చేసి, అక్షయముగా బాణవర్షము కురిపించి, పదికోట్ల శత్రుసేనలను సంహరించెనో, అట్టి భరతవీరుడు భీష్ముడు, నా దురాలోచనము కారణముగా సుడిగాలి చేత ఊడబెరకబడిన వృక్షము వలె, యుద్ధమునందు చంపబడి, భూమిపైన శయనించుచున్నాడు. ఇట్టి దుర్దశకు ఆయన యెప్పుడు గూడ అర్హుడుకాడు. భయంకర పరాక్రమశాలియైన భీష్ముని, ఎదురుగా చూచిన పాండవసేనలు ఆయనపైన ఎట్లు బాణప్రహారము చేసిరి ?

సంజయా! పాండవులు భీష్మునితో సంగ్రామమెట్లు చేసిరి? ద్రోణాచార్యుడు బ్రతికియుండగా భీష్ముడు విజయమునెట్లు సాధించజాలక పోయెను? ఆ యుద్ధమునందు ద్రోణాచార్య-కృపాచార్యులిద్దరు భీష్ముని సమీపమునందే యుండిరి గదా! అయినను భీష్ముడెట్లు చంపబడెను? భీష్ముని దేవతలు గూడ జయింపజాలరుగదా! అతిరథియైన ఆ మహావీరుని పాంచాలరాజపుత్రుడు శిఖండి ఎట్లు చంపెను?

సంజయా! పరశురాముడంతటివాడు గూడ జయింపజాలని భీష్ముడు ఇంద్రసమాన మహావీరుడు గదా! అట్టివాడెట్లు చంపబడెను? అది విని నాకు శాంతి లేకున్నది ఆయనకు సహాయకులుగా మన పక్షపువీరులెవరు పోలేదా? దుర్యోధనుడెవరిని సహాయకులనుగా ఆయనవద్దకు పంపెను?

సంజయా! అంతటి మహావీరుడైన భీష్ముని మరణము వినికూడ నా హృదయము చీలిపోవకున్నదనగా, అది యినుమువంటిదేయని భావించెదను.

దుర్జయవీరుడైన భీష్ముని యందు సత్యము-మేధ-నీతి ఈ మహాశక్తులు మూడు ఉండెను గదా! అట్టివాడు ఎట్లు చంపబడెను ?

సంజయా! యుద్ధమునందు భీష్ముడు మహామేఘము వలె ఉన్నతుడై లేచియుండెను. ధనుష్టంకారమనెడు ఉరుములతో పిడుగు ధ్వనివంటి ధనుశ్శబ్దముతో బాణవర్షము శత్రువుల పైన కురియుచుండెను. ఇంద్రుడు రాక్షసుల పైన బాణములు ప్రయోగించునట్లు భీష్ముడు పాండవ - పాంచాల - సృంజయ వీరులపైన బాణప్రయోగము చేయుచుండెనుగదా!

ఆయన ధనుర్బాణములు అస్త్రములు భయంకరమై దుర్గమ సముద్రము వలె నుండెనుగదా! ఆసముద్రమునందు బాణములే మొసళ్ళు-ధనుస్సు అలలుగా నుండెనుగదా! ఆ సముద్రము అక్షయము-ద్వీపరహితము-చంచలము - నౌకాది సాధన శూన్యముగానుండెను. ఆ సముద్రమునందు ఖడ్గ గదాదులే మొసళ్ళు. దాని యందు అశ్వములనెడు నోటి సుళ్ళు భయంకరములుగా నుండును. కాల్బలపు సైనికులు ఆ యుద్ధసముద్రమునందున్న మత్స్యములవలె నున్నారు. శంఖ-దుందుభి ధ్వనులే ఆ సముద్రఘోష-గర్జన ధ్వనులుగా నున్నవి.

సంజయా! భీష్ముడా సముద్రమునందు శత్రువుల రథ-గజ-తురగ-పదాతి దళములు అను చతురంగబలములను ముంచుచుండెను. ఆయన, యుద్ధభూమిలో శత్రువీరుల ప్రాణములను అపహరించువాడుగా నుండెను.

సంజయా! భీష్ముడు తన క్రోధపరాక్రమములచేత తేజస్సుచేతను దహించుచు జ్వలించుచున్నట్లుండి శత్రువులను తపింపజేయుచుండునుగదా! అట్టి భీష్ముని ఉప్పొంగుచున్న సముద్రమును తీరము ఆపినట్లు, ఆయన ముందుకు సాగకుండ ఏవీరులు నివారింపగలిగిరి?

సంజయా! శత్రుహంతకుడైన భీష్ముడు దుర్యోధనుని హితముకొరకు యుద్ధమునందు చూపిన పరాక్రమము అసమానము.

అప్పుడు యేయే యోధులు ఆయనకు ముందుభాగమునందు ఉండిరి? ఆయన రథముయొక్క కుడివైపు చక్రములను ఎవరు రక్షించుచుండిరి? ఆయనకు వెనుకవైపునఉండి ఏ యే వీరులు శత్రువులను ముందుకు సాగనీయక ఆపుచుండిరి?

భీష్ముని ముందువైపునుండి ఏ యే వీరులు ఆయనను రక్షించుచుండిరి? ఏ యే వీరులు భీష్ముని రథముయొక్క యెడమవైపు చక్రములను రక్షించుచుండి స్రుంజయవంశీయులను నశింపజేయుచుండిరి? భీష్ముని యగ్రభాగమునందు నిలిచి యే యే వీరులు ఆయనను అన్నివైపులనుండి కాపాడుచుండిరి? ఆయన పార్శ్వభాగ సంరక్షణ మెవరు చేయుచుండిరి? ఆయనముందు నిలిచి యెవరు ధైర్యముతో శత్రువులతో యుద్ధము చేయుచుండిరి?

సంజయా! ఎప్పుడైతే అనేకులు మా పక్షపు వీరులు భీష్ముని రక్షించుచుండగా భీష్ముడుగూడ ఆ వీరులను రక్షించుటయందు ఆసక్తితో నుండెనో, అప్పుడుగూడ వారందరుకలిసి శత్రువీరులను ఎట్లు జయింపజాలకపోయిరి?

సంజయా! భీష్ముడు లోకపితామహుడైన బ్రహ్మదేవునివలె అజేయ పరాక్రముడుగదా! అట్లుండగా. పాండవులతనిపైన శస్త్రప్రహారమెట్లు చేయగలిగిరి? ఒక ద్వీపమువలె భీష్ముడు అందరికి ఆశ్రయదాతగా నుండెను.

అందరు వీరులు ఆయనను ఆశ్రయించి, నిర్భయులై, నిశ్చింతులై శత్రువులతో పోరాడుచుండిరిగదా! అందరికి ఆశ్రయభూతుడైన భీష్ముడు చంపబడెనని, సంజయా! చెప్పుచుంటివి. ఇది యెంత దుఃఖకారణము?

సంజయా! ఏ మహావీరుని యాశ్రయములోనుండి, మహాసేనాసంపన్నులైన నా పుత్రులు పాండవులను ఏ మాత్రము లెక్కచేయకుండిరో, అట్టి వీరాతివీరుడైన భీష్ముని శత్రువులెట్లు చంపగలిగిరి?

సంజయా! పూర్వము దానవసంహారము చేయు దేవతలు రణదుర్మదుడైన యేమాతండ్రి భీష్ముని సహాయము కోరియుండిరో, ఏ మహాపరాక్రమశాలియైన భీష్ముని పుత్రునిగా బడసి శాంతను మహారాజు మహానందభరితుడాయెనో, ఏ వీరుడు అందరకు ఆశ్రయదాతగా నుండెనో, అటువంటి బుద్ధిమంతుడు–స్వధర్మపరాయణుడు-పవిత్రుడు-వేదశాస్త్ర తత్వవేత్తయునైన భీష్ముడు చంపబడినాడని నీవెట్లు చెప్పుచుంటివి?

సంజయా! సమస్త శస్త్రాస్త్రవిద్యాసంపన్నుడు శాంతుడు. జితేంద్రియుడు మహామనీషియునైన భీష్ముడు సంహరింపబడెనని విని, మన సమస్తసేన చంపబడెనని నేను విశ్వసించుచున్నాను.

సంజయా ! ధర్మముకంటే అధర్మమే బలవత్తరమైనదని నాకు నేడు నిశ్చయముగా తెలిసెను. ఎందుకనగా, పాండవులు తమ వృద్ధగురుజనులను చంపి రాజ్యము తీసికొనదలచుచున్నారు గదా !

సంజయా ! పూర్వము అంబకొరకు త్రిలోకవీరుడైన పరశురాముడు యుద్ధముచేయుటకు వచ్చినప్పుడు, భీష్ముడతనిని ఓడించెను. అటువంటి యింద్ర సమానపరాక్రముడు-సమస్త ధనుర్ధారులలో శ్రేష్ఠుడునైన భీష్ముడు సంహరింప బడెనని నీవు చెప్పుచున్నావు. ఇంతకన్న మించిన దుఃఖకరమైన సమాచారము మరియొకటి యేది యున్నది ?

సంజయా ! శత్రుసంహారకర్త, వీరవరుడునైన పరశురాముడు క్షత్రియులను యుద్ధమునందు అనేకపర్యాయములు ఓడించియుండెను. కాని, అట్టివీరుడు గూడ ఎవనిని చంపజాలకపోయెనో, అట్టి మహాశక్తిశాలి భీష్ముడు ఎట్లు శిఖండి చేత చంపబడెను ?

అందుచేత సంజయా ! శిఖండి, మహాపరాక్రమశాలి యుద్ధకుశలుడునైన పరశురాముని కంటెగూడ బలపరాక్రమతేజస్సులలో నిశ్చయముగా అధికుడని తోచుచున్నది. అతడు, సమస్త శస్త్రాస్త్రపండితుడు శూరుడు - విద్వాంసుడు- భరతకులభూషణుడైన భీష్ముని వధించెను గదా !

సంజయా ! పాండవులతో భీష్మునకు ఎట్టి యుద్ధము జరిగెను ? నాకు తెలుపుము. ఆ వీరుని మరణము తరువాత నాసేనకు విధవాస్త్రీకివలె సహాయకుడు లేకపోయెను. రక్షకుడగు గోపాలుడు లేని గోవులు ఇటునటు చెదరిపోవునట్లు ఇప్పుడు నాసేన దిక్కుదెలియక భ్రమించుచుండును. మహాయుద్ధమునందు ఎవని యందు సమస్తప్రపంచముయొక్క పౌరుషము కనబడుచుండెనో అట్టి భీష్ముడే పరలోకగతుడాయెను. ఆ సమయమునందు మీయందరి మనసుల పరిస్థితి యెట్లుం డెను ?

సంజయా ! నేడు మేము జీవించికూడ ఏమిప్రయోజనము ? మాకు ఏమి సామర్థ్యము గలదు ? ప్రపంచప్రఖ్యాతుడు-ధర్మాత్ముడు-మహాపరాక్రమశాలి-విశేషించి మాకు తండ్రియునైన భీష్ముని, యుద్ధమునందు చంపించి నదిని దాటుటకు ఎక్కిన నావ అగాధజలములో మునుగుటను చూచి దుఃఖించుచున్న పాంథులవలె మేము శోకమగ్నులమైతిమి.

సంజయా ! భీష్ముడు చంపబడిన తరువాత, నా పుత్రులు దుఃఖములో మునిగియుందురని తలచెదను. సంజయా ! నా హృదయము నిశ్చయముగా ఇనుములో చేయబడినది. అది పురుషసింహుడైన భీష్ముడు చంపబడెనని తెలిసికూడ చీలిపోవకున్నది గదా !

సంజయా ! పురుషరత్నము-శత్రువులకు అలవికానివాడు-వీరశిరోమణియునైన యే భీష్మునకు అస్త్రములు-బుద్ధి-నీతి - అను ఈమూడు అప్రమేయశక్తులు ఉండెనో అట్టి వీరుడు యుద్ధమునందెట్లు చంపబడెను ?

సంజయా ! అస్త్ర-శస్త్ర-శౌర్య-తపస్యా-బుద్ధి ధైర్య-త్యాగములలో నేదికూడ మృత్యువును తప్పించుకొనజాలదని తోచుచున్నది. సంజయా ! కాలము (యముడు) యొక్క శక్తి చాల గొప్పది. దానిని ప్రపంచములో నెవరుగూడ దాటజాలరు. అట్టి కాలవశములో చిక్కుకొనినందున భీష్ముడు చంపబడెననుచున్నావు.

సంజయా ! భీష్మునివలన మన పక్షమునకు రక్షణము కలుగునని నేను ఆశించియుంటిని. ఇప్పుడు నేను నాపుత్రుల శోకముచేత తపించుచు మహాదుఃఖముచేత చింతించుచున్నాను.

సంజయా ! అస్తాచలగామియైన సూర్యుడు పడిపోయినట్లు భీష్ముడు పడుటను వినిన నా పుత్రులు ఏమని యోచించిరో చెప్పుము. మనసేవలోగాని, శత్రుసేనలోగాని రాజవీరులలో నెవరుగూడ ఈ యుద్ధమునందు జీవించియుండరని నా బుద్ధికి తోచుచున్నది.

సంజయా ! ఋషులు క్షత్రియధర్మము అతికఠోరమని నిశ్చయించి చెప్పినారు. ఆ క్షత్రియధర్మములో ఉండియే పాండవులు భీష్ముని సంహరించి రాజ్యము తీసుకొనగోరుచున్నారు. లేదా, మేముగూడ భీష్ముని చంపించి రాజ్యము గ్రహింపగోరుచున్నాము.

సంజయా ! క్షత్రియధర్మమందున్న పాండవుల యపరాధమేమియు లేదని తలచెదను. మహావిపత్తు సంభవించినపుడు భీష్ముడు ఇప్పుడుచేసిన పనియే ఉత్తమపురుషుడు చేయవలెను. భీష్ముడు తన శక్తికిమించిన పరాక్రమము ప్రదర్శించెను. ఇదియే ఉత్తములు చేయవలసినపని.

సంజయా ! భీష్ముడెవరికిని ఓడనివాడు. ఆయన శత్రుసేనలను సంహరించుచున్నను పెదతండ్రి భీష్ముని పాండవులెట్లు నిలువరించగలిగిరి. పాండవులు ఎట్లు సేనలను సంఘటితపరచుకొనిరి ? ఎట్లు పోరాడిరి ? భీష్ముడెట్లు చంపబడెను? ఆయన చంపబడిన తరువాత దుర్యోధన-కర్ణ-దుశ్శాశన-శకునులు ఏమేమి మాట్లాడిరి ?

సంజయా ! యుద్ధభూమిరూపమైన యే ద్యూతసభలో మనుష్యులు గజములు, అశ్వములు పరపబడియుండెనో ఎక్కడ బాణ-శక్తి-ఖడ్గ-తోమరాయుధ రూపములైన పాచికలు వేయబడుచుండెనో, ఏది యుద్ధకారణముగా దుర్గమమై మహాభయంకరముగానుండెనో యుద్ధభూమియనెడు అటువంటి ద్యూతసభయందు మూఢబుద్ధులైన యే జూదరులు ప్రవేశించియుండిరి ?

ఎక్కడ ప్రాణములు పందెముగా ఒడ్డబడుచుండెనో, అటువంటి ద్యూతక్రీడ యేయే రాజులు ఆడిరి ?

సంజయా ! భీష్ముడుకాక, ఆ యుద్ధమునందు మరియెవరు ఓడుచుండిరి ? ఎవరెవరు శత్రుబాణములకు గురియై మరణించిరి? అదియంతయు నాకు చెప్పుము.

సంజయా ! యుద్ధమునందు భయంకర పరాక్రమముచేత శోభిల్లుచున్న మా పెద్దతండ్రి భీష్ముడు చంపబడిన సంగతివిని, నా హృదయమునకు శాంతి లేకున్నది. ఆయన చంపబడుటచేత నా పుత్రులకు కలుగబోవు హానిని తలచి నా మనసుకు చాల బాధ కలుగుచున్నది.

సంజయా! నీవు నీ మాటలనెడు నేయి హోమముచేసి నాకేర్పడిన చింత-బాధయనెడు అగ్నిని యింకను అధికముగా జ్వలింపజేయుచున్నావు.

సంజయా ! సమస్త ప్రపంచవిఖ్యాతుడైన యే వీరుడు ఈ మహాయుద్ధముయొక్క భారమంతయు తన భుజములపైన భరించియుండెనో ఆ భీష్ముడే సంహరింపబడుటను చూచిన నా పుత్రులు మహాదుఃఖము అనుభవించియుందురని నా విశ్వాసము. ఆ దుఃఖమును దుర్యోధనుడెట్లు ప్రకటించెనో తెలుపుము. వినగోరుచున్నాను.

కాబట్టి సంజయా ! అక్కడి వృత్తాంతమంతయు నాకు చెప్పుము. మూర్ఖ

డైన దుర్యోధనుని అజ్ఞానము కారణముగా ఆ యుద్ధమునందు అన్యాయమునకు న్యాయమునకున్ను సంబంధించి జరిగిన విషయములన్నియు వర్ణించి నాకు చెప్పుము.

సంజయా ! అస్త్రవిద్యాపండితుడైన భీష్ముడు ఆ యుద్ధమునందు విజయేచ్ఛ చేత తన పరాక్రమమునకు తగినట్లుగా ఏ కార్యములు చేసెనో అవియన్నియు పూర్తిగా నాకు తెలుపుము.

సంజయా ! కౌరవ పాండవుల సేనలకు ఏ సమయమునందు ఏ క్రమములో ఏ రూపములో యుద్ధముజరిగెనో అదియంతయు నాకు చెప్పుము.

జనమేజయా ! ధృతరాష్ట్రుని మాటలన్నియు విని సంజయుడు ఇట్లనెను:-

## పదిహేనవ అధ్యాయము

### సంజయుడు యుద్ధవృత్తాంతము వర్ణించుటకు ప్రారంభించుట :

ధృతరాష్ట్రమహారాజా ! నీవు మాటిమాటికి చేసిన ప్రశ్నములు చాల సముచితముగ యోగ్యములుగాను నున్నవి. కాని యీ దోషమంతయు నీవు దుర్యోధనునకే అంటగట్టగూడదు. ఏ మనుష్యుడుగూడా తన దుష్కర్మల బాధ్యత యితరుల పైన మోపగూడదు.

రాజా ! ఏ మనుష్యుడు సంఘములో నింద్యమైన పనిచేయునో అతడు నిందితకార్యము చేసినందుకు అందరిచేత చంపబడదగినవాడు.

రాజా ! పాండవులు తమకు మీరుచేసిన అవమానము మీ కపటవ్యవహారము బాగుగా నెరిగియున్నప్పటికిన్నీ నీవైపే చూచుచు నీవు న్యాయముగా వ్యవహరించెదవని ఆశించుచు చాలాకాలము తమ మంత్రులతో పాటు అడవిలో నివసించి అనేకక్లేశములనుసహించి అనుభవించిరి.

రాజా ! నేను యుద్ధభూమిలో గజాశ్వసైన్యములను, రాజవీరులను చూచినాను. యోగబలముచేత అన్ని విషయములను చూచినాను. ఆ వృత్తాంతమంతయు వినిపించెదను వినుము. నీవు మనసులో దుఃఖపడకుము. దైవమే ఈ విఘాతము చేయుచున్నాడని నాకు మొదటినుండియే ప్రత్యక్షముగా తోచుచున్నది.

రాజా! యే వ్యాసభగవానుని కృపానురాగములచేత నాకు పరమోత్తమమైన జ్ఞానము ప్రాప్తించెనో ఇంద్రియములకు గోచరములుగాని విషయములుగూడ ప్రత్యక్షముగా కనుగొనగల దివ్యదృష్టి లభించెనో అన్ని విషయములుగూడ విను శక్తిగలిగెనో ఇతరుల మనస్సులలోని విషయములుగూడ తెలిసికొను సామర్థ్యము భూతభవిష్యత్తుల జ్ఞానము శాస్త్రవిరుద్ధముగా నడచు మనుష్యుల పుట్టుకను గూర్చిన యెరుక ఆకాశమునందు సంచరింపగల ఉత్తమశక్తి యుద్ధసమయమునందు నాకు ఆ యుద్ధముల దెబ్బలు తగులకయుండు అద్భుత చమత్కారము-ఈ మొదలైనవి నాకు కలిగెనో అటువంటి నీ తండ్రి పరాశరనందనునకు నమస్కారముచేసి భరతవంశీయులు చేయుచున్న అత్యద్భుతము-విచిత్రము రోమాంచకరమునైన యుద్ధమునుగూర్చి యిప్పుడు నీకు వర్ణించి చెప్పుటకు ఆరంభించెదను దానినంతయు విస్తారముగా నీవు వినుము :-

మహారాజా! యుద్ధశాస్త్రవిధిననుసరించి సమస్త సైనికులు వ్యూహములను పన్ని తమ తమ స్థానములందు యుద్ధసన్నద్ధులై నిలిచియున్నప్పుడు దుర్యోధనుడు దుశ్శాసనునితో నిట్లనెను :-

దుశ్శాసనా! నీవు భీష్ముని రక్షించుటకు ఏర్పరచిన రథములను త్వరగా సిద్ధపరచుము. ఆయనను రక్షించుటకుగాను సమస్త సైనికులు త్వరగా సంసిద్ధులై యుండుటకు ఆజ్ఞ యిమ్ము. అనేక సంవత్సరములనుండి నేను ఎదురుచూచుచు ఊహించుచున్న కౌరవ-పాండవ సంగ్రామమిప్పుడు నా యెదుట సంప్రాప్తమైనది.

కనుక తమ్ముడా! ఇప్పుడు భీష్ముని సంరక్షణముకన్న మించిన కార్యము మరియొకటి లేదని నేను తలచుచున్నాను. అన్నిటికన్న అదియే ఆవశ్యకమైన పని. ఎందుకనగా భీష్ముడు సురక్షితుడై యుండిన యెడల ఆయన పాండవ-సోమక-సృంజయ వంశీయులందరిని సంహరించగలడు.

భీష్ముడు నాతో తొలుత చెప్పిన మాటయేమనగా "శిఖండి మొదట స్త్రీగా ఉండి పిదప పురుషుడైనాడు కాబట్టి అట్టివానిని నేను చంపక వానితో పోరాడక విడిచెదను." కాబట్టి భీష్మపితామహుని ఇప్పుడు మనమందరము రక్షించవలెను. నా సైనికులందరున్ను శిఖండిని చంపుటకు ప్రయత్నించవలెను.

నలుదిక్కులనుండి వచ్చిన అస్త్రవిద్యాసమర్థులందరుగూడ భీష్ముని రక్షించవలెను. ఎందుకనగా, మహాబలము గల సింహముగూడ తనకు రక్షణములేని వైపునకు పోయినచో దానినొక సామాన్యమైన తోడేలుగూడ చంపగలదు గదా! నీచమైన ఒక నక్కవంటి శిఖండిచేత సింహసమానుడైన భీష్మపితామహుని మనము చంపించగూడదు గదా! అందుకొరకు మనమందరము ఆయన సంరక్షణమునకై జాగరూకులమై యుండవలెను.

అర్జునుని రథముయొక్క కుడిచక్రమును ఉత్తమౌజుడు, ఎడమచక్రమును యుధామన్యుడు రక్షించుటకు నియమింపబడినారు. ఈ యిరువురు రక్షించుచుండగా, అర్జునుడు శిఖండి రక్షణమును జాగరూకుడై చేయుచున్నాడు.

కనుక దుశ్శాసనా! భీష్మునిచేత నిర్లక్ష్యము చేయబడి, అర్జునునిచేత సురక్షితుడైయున్న శిఖండి, భీష్ముని సంహరించకుండునట్లు సర్వప్రయత్నములు చేయుము.

## పదహారవ అధ్యాయము

### సంజయునిచేత దుర్యోధన సేనావర్ణనము :

ధృతరాష్ట్రమహారాజా! ఆ రాత్రి గడచి తెల్లవారగనే "రథమును సిద్ధము చేయుడు. యుద్ధసన్నద్ధులు కండు." అని నలువైపుల బిగ్గరగా అరచుచున్న రాజుల కోలాహలధ్వనులు వినవచ్చెను. గజముల ఘీంకారములు- అశ్వముల సకిలింపులు- శంఖదుందుభుల ధ్వనులు యోధుల సింహనాదములు రథచక్రముల ఘరఘరనాదములు- చప్పట్ల శబ్దములు- సైనికుల అరపులు అన్ని ధ్వనులు కలిసి యేకముగా పెద్దకోలాహలము యుద్ధభూమిలో రేగెను. ఈ విధముగా సూర్యోదయమగుచుండగనే అందరుగూడ యుద్ధసన్నద్ధులై నిలిచిరి.

రాజా! కౌరవపాండవుల శస్త్రాస్త్ర కవచాదులు మెరయుచుండెను. సువర్ణభూషితములైన నీ రథములు-గజములు విద్యుత్తులతో మెరయుచున్న మేఘసమూహముల వలె భాసిల్లుచుండెను. విశాలరథసేనలు నగరములవలె కనబడుచుండెను. వాని మధ్యమునందు నీ పెదతండ్రి భీష్ముడు చంద్రునివలె ప్రకాశించు

చుండెను. మీ సైనికులు ధనుస్సులు-ఖడ్గములు - రెండంచుల కత్తులు గదలు-శక్తి యాయుధములు-తోమరములు మొదలైన శస్త్రములను ధరించి సేనలో నిలిచియుండిరి.

రాజా ! రథ-గజ-తురగ-పదాతిసైన్యములు పలుచోట్ల గుంపులు గుంపులుగా నిలిచి శత్రువులను బంధించుటకు వలలు పన్నబడినవాయనునట్లు విడివిడిగా నుండెను. మెరయుచున్న అనేక ధ్వజములు రెండు సేనలలో కనబడుచుండెను. మణి సువర్ణభూషితావయవములతో గజసైనికులు గజములపైన కూర్చొని జ్వాలలతో గూడిన అగ్నులవలె ప్రకాశించుచుండిరి.

మహారాజా ! ఇంద్రభవనముపైన మెరయుచున్న యింద్రుని ధ్వజమువలె పాండవ కౌరవసేనా ధ్వజములుగూడ ఆకాశములో ఎగురుచుండెను. ఇరుసేనల వీరులు యుద్ధాభిలాషతో కవచధారులై ఆయుధములను పైకెత్తుకొని చేతులకు అంగుళిత్రాణములను, వీపున అంబులపొదలను ధరించి సేనాముఖములందు నిలిచి శోభిల్లుచుండిరి. వారికన్నులు ఆబోతుల కన్నులవలె పెద్దపెద్దవిగా కనబడుచుండెను.

రాజా ! శకుని-శల్యుడు-సైంధవుడు- విందానువిందులు-కైకయులు-సుదక్షిణుడు-శ్రుతాయుధుడు-జయత్సేనుడు-బృహద్బలుడు-కృతవర్మ ఈ పదుగురు క్షత్రియవీరులు ఒక్కొక్క అక్షౌహిణీసేనకు అధినాయకులైయుండిరి. వారి భుజములు గడియమానులవలె లావుగా దీర్ఘముగాను కనబడుచుండెను. వారందరు పెద్ద పెద్ద యజ్ఞములను చేసినవారు.

రాజా ! వీరేకాక యింకను నితరులనేకులు మహారథికులు- రాజవీరులు-దుర్యోధనుని వశములో ఉండి తమ తమ సేనలలో కవచాయుధధారులై నిలిచియుండిరి. అందరు జింకచర్మమును కట్టుకొనియుండిరి. అందరు దీక్షతో హర్షోత్సాహములతో దుర్యోధనునకు సహాయకులై యుండిరి. పై పదిమంది సేనానాయకుల అధీనములోని పది అక్షౌహిణీ సేనలేగాక, దుర్యోధనుని నాయకత్వమునందు పదకొండవ సేన యుండెను. దానిలో చాలామంది కౌరవయోధులుండిరి. అది ఇతరసేనలకు ముందు నిలచియుండెను. ఈ సేనకంతటికి సర్వసేనాధిపతిగా శాంతనునందనుడు భీష్ముడుండెను.

రాజా! భీష్ముని తలపైన తెల్లని ఉష్ణీషము (తలపాగ) ప్రకాశించుచుండెను. ఆయన రథాశ్వములుగూడ తెల్లవే. కవచము తెల్లనిదే. ఆయన ఈ శ్వేతవేషము చేత నవోదిత చంద్రునివలె ప్రకాశించుచుండెను. ఆయన వెండి రథమునందుండెను. స్వర్ణమయతాళ (తాటిచెట్టు) ధ్వజము ఆయన రథముపైన ఎగురుచుండెను అప్పుడు కౌరవ-పాండవ-ధృష్టద్యుమ్నాదులైన పాంచాల - సృంజయవీరులందరు భీష్ముని తెల్లని మేఘమధ్యముననున్న సూర్యునివలె చూచిరి.

రాజా! నోరు తెరచుకొనియున్న సింహమునుచూచి మృగములవలె, ధృష్టద్యుమ్నాదులు భీష్మునిచూచి ఉద్వేగము చెందుచుండిరి. మీవి పదకొండు-పాండవులవి ఏడు అక్షౌహిణీసేనలు వీర పురుషశోభితములై కనబడుచుండెను.

రాజా! ఆ రెండుసేనలు, ప్రళయకాలమునందు రెండు సముద్రములు పరస్పరము కలియునట్లుండెను. అందలి వీరులందరు మదించిన మొసళ్ళవలె, సుడులవలె నుండిరి. రాజా! ఇంతపెద్ద కౌరవసేన ఒకచోట సంఘటితమై యుండుట నేనింతకు పూర్వమెపుడుగూడ చూచియుండలేదు. వినియుండలేదు. సంజయుడింకను నిట్లు చెప్పదొడగెను :-

## పదిహేడవ అధ్యాయము

### కౌరవయోధులు యుద్ధమునకు సాగుట :

రాజా! వ్యాసభగవానుడు చెప్పినట్లు రాజవీరులందరు కురుక్షేత్రమునందు యుద్ధమునకై చేరినారు. ఆనాడు చంద్రుడు మఘానక్షత్రమునందుండెను. ఆకాశమునందు ఏడుమహాగ్రహములు అగ్నివలె దీపించుచున్నట్లు కనబడుచుండెను. ఉదయకాలమునందు సూర్యుడు రెండుగా విభజింపబడినాడా యనునట్లు కనబడదొచ్చెను. సూర్యుడు మిక్కిలి జాజ్వల్యమానుడై అత్యధికజ్వాలలతో ఉదయించియుండెను. అన్నిదిక్కులలో వేడి బయలుదేరుచున్నట్లుండి రక్తము మాంసము ఆహారముగా తినికొను నక్కలు-కాకులు-మనుష్యులయొక్క పశువుల యొక్క శవములకై ఆశపడుచు అమంగళముగా కూయుచున్నవి.

రాజా! కురువృద్ధుడైన భీష్ముడు - భరద్వాజపుత్రుడైన ద్రోణాచార్యుడు

ప్రతిదినము ఉదయము మేల్కొని మనస్సును అదుపులోనుంచుకొని పాండవులకు జయము కలుగుగాక యని ఆశీర్వాదము చేయుచుందురు. కాని, వారు మీకు ప్రతిజ్ఞచేసిన ప్రకారము మీవైపే నిలచి పాండవసేనతో పోరాడుచుండిరి.

మహారాజా : సర్వధర్మవిశేషజ్ఞుడైన మీ పెదతండ్రి భీష్ముడు రాజులందరిని పిలిచి వారితో నిట్లనెను :-

క్షత్రియవీరులారా ! ఈ యుద్ధము మీకొరకు తెరవబడిన స్వర్గద్వారము. మీరీ ద్వారముగుండా ఇంద్రలోక - బ్రహ్మలోకములకు పోగలరు ఇది మీ పూర్వులు అంగీకరించిన సనాతనమార్గమని భావింపుడు. మీరందరు శాంతచిత్తులై యుద్ధమునందు మీ బలపరాక్రమములను ప్రదర్శించుచు కీర్తిప్రతిష్ఠలు సంపాదింపుడు.

"నాభాగ-యయాతి-నహుష-నృగ-మాంధాత్రాది పూర్వరాజులు ఇటువంటి యుద్ధకర్మల ద్వారా సిద్ధినొంది ఉత్తమలోకములకు పోయిరి. ఇండ్లలో రోగములతో బాధపడి చచ్చుటకంటే క్షత్రియులకు ఇటువంటి యుద్ధమరణము ధర్మసమ్మతమైనదనియు, రోగములతో చచ్చుట అధర్మమనియు తలచబడినది. క్షత్రియుడు యుద్ధమునందు ఉక్కు శస్త్రాస్త్రముల దెబ్బలతో మరణించుట కోరవలెను. అదియే అతని సనాతనధర్మము.

రాజా ! ఈవిధముగా భీష్ముడు చెప్పగా వినిన రాజవీరులు - యోధులు తమ తమ సేనలతో యుద్ధముచేయుటకు ముందుకు సాగిపోయిరి.

రాజా ! ఈ యుద్ధమునందు భీష్ముడు కర్ణునిచేత, అతని మంత్రులచేత, బంధువులచేతను యుద్ధము చేయించకుండ వారి అస్త్రశస్త్రములను క్రిందపెట్టించెను. కాబట్టి నీ పుత్రులు ఇతరరాజులు కర్ణుని విడిచి సింహనాదములు చేయుచు యుద్ధమునకు బయలుదేరిపోయిరి. శ్వేతచ్ఛత్ర- ధ్వజ-గజ-తురగ-రథధ్వనులు భూమిని వ్యాకులపరచెను.

రాజా ! సువర్ణమణికిరీటభూషితులైన వీరులు ధనుర్ధరులై అగ్నిసహిత పర్వతములవలె శోభిల్లిరి. భీష్ముడు మహాతాళధ్వజములో సుశోభితమైన రథమునందు కూర్చొనియుండెను. ఆ ధ్వజమునందు ఐదునక్షత్రముల చిహ్నము

లుండెను. అప్పుడాయన స్వచ్ఛసూర్యునివలె ప్రకాశించుచుండెను. ఆయన యాజ్ఞానుసారము రాజులందరు నడుచుకొనుచుండిరి.

రాజా ! గోవాసనదేశాధీశుడైన శైబ్యుడు తన యధీనమునందు గల రాజులతోపాటు ధ్వజాంకితము- రాజోచితమునైన గజరాజుపై కూర్చొని యుద్ధమునకు వెడలెను. కమలకాంతిశోభితుడైన అశ్వత్థామ సింహపుచ్ఛ చిహ్నితమైన ధ్వజముతో ప్రకాశించుచున్న రథముపైన కూర్చొని సర్వసేనాగ్రభాగమునందు పోవుచుండెను.

రాజా ! శ్రుతాయుధ-చిత్రసేన – పురుమిత్ర-వివింశతి-శల్య-భూరిశ్రవస్ వికర్ణులు ఏడుగురున్ను రథారూఢులై సుందర కవచధారణజేసి అశ్వత్థామను ముందిడుకొని భీష్మునకు ముందుగా పోవుచుండిరి. వీరందరి రథములపైన సువర్ణ ధ్వజములు ఎగురుచుండెను.

రాజా ! ద్రోణాచార్యుని రథధ్వజమునందు కమండులువుతో శోభితమైన సువర్ణవేదిక-ధనుస్సు చిహ్నములు ప్రకాశించుచుండెను. అనేకలక్షల సేనలతో సాగిపోవుచున్న దుర్యోధనుని మణిమయ మహాధ్వజమునందు నాగచిహ్నము ప్రకాశించుచుండెను. పౌరవుడు-కళింగరాజైన శ్రుతాయుధుడు - కాంభోజరాజైన సుదక్షిణుడు- క్షేమధన్వుడు-సుమిత్రుడు- ఈ యైదుగురు ప్రధానయోధులు దుర్యోధనునకు ముందుభాగమునందు సాగిపోవుచుండిరి.

రాజా ! వృషభచిహ్నిత ధ్వజశోభితమైన బహుమూల్యరథములో కూర్చొని యున్న కృపాచార్యుడు మగధసేనను తనతో తోడ్కొనిపోవుచుండెను. అంగరాజుచేత కృపాచార్యునిచేతను రక్షితములైన సైన్యములు శరదృతుమేఘములవలె ప్రకాశించుచుండెను. సైంధవుడు వరాహచిహ్నితమైన వెండిధ్వజముగల రథముపైన గూర్చొని సేనాగ్రభాగమునందు శోభిల్లుచుండెను. అతని యధీనమునందు ఒకలక్ష రథములు-ఎనిమిదివేల యేనుగులు-అరువదివేల అశ్వసైనికులు ఉండిరి. ఆ మహాసేన అద్భుతముగ నుండెను.

రాజా ! కళింగదేశరాజైన శ్రుతాయుధుడు తన మిత్రుడైన కేతుమంతునితోపాటు అరువదివేల రథములు- పదివేల గజములతో యుద్ధమునకు వచ్చియుండెను. యంత్ర- తోమర – తూణీర-ధ్వజములతో శోభిల్లుచున్న శ్రుతా

యుధుని మహాగజములు పర్వతములవలె ప్రకాశించుచుండెను. అతని రథధ్వజము పైన అగ్నిచిహ్నముండెను. అతడు శ్వేతచ్ఛత్ర-చామర- కంఠహారభూషితుడై ప్రకాశించుచుండెను. ఆ కేతుమంతుడు విచిత్రమైన అంకుశము ధరించి గజము పైన గూర్చొని మేఘసమూహములపైన గూర్చొనియున్న సూర్యభగవానుని వలె ప్రకాశించుచుండెను.

రాజా! ఈ విధముగనే గజరాజుపైన గూర్చొని భగదత్తుడు గూడ ఇంద్రునివలె ప్రకాశించుచు యుద్ధమునకు సాగిపోవుచుండెను. అవంతిదేశ రాజ కుమారులైన విందానువిందులుగూడ భగదత్తునివలె తేజస్వులుగా నుండిరి. ఆ యిద్దరు సోదరులు గజములపైన గూర్చొని కేతుమంతుని అనుసరించిపోవు చుండిరి.

రాజా! రథసమూహయుక్తమైన ఆ మహాసైన్యముయొక్క భయంకర వ్యూహము సర్వతోముఖముగ వ్యాపించియుండెను. ఆ రథికులు నవ్వుచున్నట్లు గనే అవలీలగా శత్రువులపై దాడిచేయుచుండిరి. ఆ వ్యూహమునకు గజములు అంగముగాను, రాజసముదాయము శిరస్సుగాను, అశ్వములు రెక్కలుగా తోచు చుండెను.

రాజా! ఆ సేనావ్యూహమును, భీష్మ-ద్రోణ-కృప-బాహ్లీక-అశ్వత్థామలు నిర్మించినారు. సంజయుడు తరువాతి కథ యిట్లు చెప్పెను :-

## పదునెనిమిదవ అధ్యాయము

### భీష్మరక్షకుల పరిచయము :

మహారాజా! ఆ తరువాత రెండు గడియలలోనే యుద్ధేచ్ఛగల యోధు లలో పెద్దకోలాహలము భయంకరముగా హృదయములను కంపింపజేయుచు విని పించెను. శంఖ - దుందుభిధ్వనులచేత గజఘీంకారములచేత రథచక్ర ఘర్ఘర ధ్వనులచేతను సమస్తభూమండలము చీలిపోవుచున్నట్లుండెను. అశ్వఘోషలచేత, యోధుల సింహనాదముచేతను భూమ్యాకాశములు నిండి దద్దరిల్లెను.

రాజా! నీ పుత్రుల సేనలు. పాండవసేనలు పరస్పరము సమీపించుటకు

భయముచేత వణకుచుండెను. ఆ రణభూమియందు సువర్ణభూషితరథములు-ఏను గులు కలిసి మెరుపులతోగూడిన మేఘముల వలెశోభిల్లుచుండెను. సైనికులందరు వివిధ ధ్వజములచేత, సువర్ణ భుజకీర్తులచేతను అగ్నులవలె ప్రకాశించుచుండిరి. రాజా! నీ సేనాధ్వజములు- పాండవసేనాధ్వజములు స్వర్గమునందలి యింద్రుని ధ్వజములవలె ప్రకాశించుచుండెను. అగ్ని - సూర్యులతో సమానములైన సువర్ణ కవచములు గల వీరసైనికులు సూర్యాగ్నులవలె తోచుచుండిరి.

రాజా! కౌరవపక్ష సైనికులు-యోధులు-విచిత్రాయుధములు, ధనుస్సులు, అంగుళిత్రాణములు ధరించి రథపతాకలతో శోభిల్లుచుండిరి. రాజా! అబోతుల కన్నులవంటి విశాలనేత్రములుగల వీరయోధులు సేనాముఖమునందు నిలిచి ధను ర్ధరులై మహాశోభతో ప్రకాశించుచుండిరి.

రాజా! భీష్ముని పృష్ఠభాగమునందు, నీ పుత్రులు- దుశ్శాసన-దుర్విషహ దుర్ముఖ-దుస్సహ-వివింశతి-చిత్రసేన-వికర్ణ-సత్యవ్రత- పురుమిత్ర-జయ-భూరి శ్రవస్-శల' నామకులు, వీరి అనుయాయులు ఇరువదివేల రథికులున్న నిలిచి భీష్ముని రక్షించుచుండిరి.

రాజా! అభీషాహ-శూరసేన-శిబి- వసాతి-శాల్వ-మత్స్య-అంబష్ఠ-త్రిగర్త-కేకయ-సౌవీర-కైతవ నామకులు, పూర్వ పశ్చిమ ఉత్తర ప్రదేశ నివాసులు, ఈ పన్నెండుదేశముల వీరులందరు తమ శరీరములను బలిగా ఒడ్డి తమ రథసైన్యము లతో భీష్ముని రక్షించుటకు సంసిద్ధులై నిలిచిరి.

రాజా! మగధరాజు పదివేల గజములసైన్యముతో, పై రథసేన వెనుక నడుచుచుండెను. ఆ మహాసేనలలో రథచక్రములను గజపాదములను రక్షించు టకు అరువదిలక్షల సైనికులుండిరి.

రాజా! అనేకలక్షల పదాతిసైనికులు, ధనుస్సులు, ఢాలులు, ఖడ్గములు ధరించి ముందుభాగమునందు నడచుచుండిరి. వారు నఖరములతో (వ్యాఘ్రనఖ ములు- పులిగోళ్ళు-పంజా), ప్రాసములతోను యుద్ధముచేయుటలో సమర్థులుగ నుండిరి. రాజా! కౌరవుల పది అక్షౌహిణుల సేన, నీ పుత్రుని వెంటనే నడచు ఒక అక్షౌహిణీ సైన్యము యమునతో గలసిన గంగానదివలె నుండెను.

# పందొమ్మిదవ అధ్యాయము

## భీముని నాయకత్వములో పాండవ సేనల రచన:

జనమేజయా! సంజయుని మాటలు విని ధృతరాష్ట్రుడిట్లు ప్రశ్నించెను:

సంజయా! పదకొండు అక్షౌహిణుల నా సేన నిలిచియుండుట చూచి, యుధిష్ఠిరుడు తన చిన్న సైన్యముతో మా సేనను ఎదుర్కొనుటకు ఎటువంటి వ్యూహరచన చేసెను? అతడు, మనుష్య-దేవతా-గంధర్వ-అసురుల సేనల వ్యూహనిర్మాణముల విధానములను తెలిసినవాడుగదా! భీష్మ పితామహుని యెదుట యుధిష్ఠిరుడు తన సేనా వ్యూహములను ఎట్లు రచియించెను?

జనమేజయా! ఆ ప్రశ్నమునకు సంజయుడిట్లు బదులు చెప్పెను:-

## పాండవుల సేనా వ్యూహరచన విధానము:

రాజా! వ్యూహాకారములో నీ సేన నిలిచియుండుట చూచి ధర్మరాజు అర్జునునితో నిట్లనెను:-

నాయనా! ఒకవేళ మనసేనకన్న శత్రుసేన చిన్నదైనయెడల, మన సేననుగూడ దానివలె చిన్న ఆకారములో కనబడునట్లు ఏర్పరచి యుద్ధము చేయవలెనని, శత్రువులసేన పెద్దదైన యెడల, మన చిన్న సేనను విశాలముగా వ్యాపింపజేసి యుద్ధము చేయవలెననియు బృహస్పతి వచనము గలదు.

అర్జునా! చిన్న సేనతో అనేక సైనికులు గల పెద్దసేనను ఎదుర్కొనవలసినప్పుడు 'సూచీముఖము' అను వ్యూహము ఉపయోగించగలదు. మనసేన శత్రుసేన కన్న చాలతక్కువ యున్నది. బృహస్పతి చెప్పిన నీతివనుసరించి నీవిప్పుడు మన సేనావ్యూహమును రచియింపుము.

ధృతరాష్ట్రరాజా! యుధిష్ఠిరుని మాటకు అర్జునుడిట్లనెను:-

రాజేంద్రా! ఇదుగో చూడుము. నేనిప్పుడు నీ కొరకు వజ్రవ్యూహమును రచించెదను. ఈ వ్యూహమును వజ్రాయుధధారియైన యింద్రుడు ఆవిష్కరించెను అందుచేత ఇది వజ్రవ్యూహమని ప్రసిద్ధమయ్యెను.

రాజా ! యుద్ధభూమియందు ప్రచండ ప్రభంజనమువలె ఉద్ధృతముగా పైకెగిరి శత్రువులకు సహింపజాలనివాడు - యోధులలో శ్రేష్ఠుడు - పూజ్యుడు నైన భీమసేనుడు మనయగ్రభాగమున నిలిచి యుద్ధముచేయును. భీమసేనుడు యుద్ధముయొక్క వివిధోపాయముల జ్ఞానము గలవాడు. ఆయన మన సేనకు అగ్రగామిగా మార్గదర్శకుడుగా నుండి శత్రుసేనల పరాక్రమములను నష్టపర చుచు యుద్ధము చేయగలడు.

రాజా ! సింహమును జూచి క్షుద్రమృగములు భయపడి పారిపోవునట్లు భీమసేనునిజూచి, దుర్యోధనాది సమస్తకౌరవులు భయపడి వెనుకకు పారిపోయె దరు. దేవతలు దేవరాజును ఆశ్రయించి నిర్భయులైనట్లు మనముగూడ యోధా గ్రేసరుడైన భీమసేనుని ఆశ్రయింతుము. ఈయన మనకందరికిన్నీ దుర్గము (కోట) వలెనుండి మనలను కాపాడగలడు. ఇక మనకెక్కడినుండి గూడ ఏలాటి భయము ఉండదు.

రాజా ! భయంకర పరాక్రమశాలి, క్రుద్ధుడునైన భీమసేనుని వైపు కన్నెత్తియైన చూడగల వాడీ ప్రపంచమునందెప్పుడుగూడ లేడు సుమా ! పిడుగు వంటి దృఢమైన ఉక్కుగదను ధరించి భీమసేనుడు మహావేగముతో సంచరించుచు సముద్రమునుగూడ శోషింప చేయగలడు. కేకయరాజకుమారులు ధృష్టకేతు- చేకితానులుగూడ అటువంటి బలపరాక్రమశాలురే రాజా ! ధార్తరాష్ట్రులు మంత్రి సహితులై నీవైపు చూచుచున్నారు.

ధృతరాష్ట్రమహారాజా ! అర్జునుడిట్లు యుధిష్ఠిరునకు చెప్పి, భీమసేనునితో నిట్లనెను :-

ఆర్యా ! ఇకనీనిప్పుడు శత్రువులకు నీ మహాబల పరాక్రమములు ప్రద ర్శింపుము.

ధృతరాష్ట్రమహారాజా ! అర్జునుడిట్లు చెప్పిన తరువాత యుద్ధభూమియందు సైనికులందరుగూడ అర్జునుని మాటకు అనుకూలముగ పలుకుచు అర్జునుని ఆద రించిరి.

రాజా ! ఇట్లుచెప్పి ధనంజయుడు తన సేనావ్యూహములను రచియించి అందరిని యుద్ధసన్నద్ధులనుచేసి. యుద్ధప్రయాణము సాగించెను. కౌరవసేనలు

తమవైపు వచ్చుచుండుట జూచి నిస్తరంగ గంగానదివలె స్థిరముగా నిలచియున్న పాండవసేనలో కదలిక కలిగి ముందుకు సాగజొచ్చెను.

రాజా ! పాండవసేనలో భీమసేనుడు అగ్రగామిగా నుండెనుగదా ! అతనితో ధృష్టద్యుమ్నుడు-నకులుడు-సహదేవుడు- చేదిరాజైన దృష్టకేతువు నుండిరి. వారివెనుక విరాటరాజు తన సోదరులతో, పుత్రులతోను, ఒక అక్షౌహిణీ సేనతోను భీమసేనుని పృష్ఠభాగమునందు అతనిని రక్షించుచు పోవుచుండును. నకుల సహదేవులు భీమసేనుని రథచక్ర రక్షకులుగను, ద్రౌపదీపుత్రులైదుగురు, అభిమన్యుడు భీమసేనుని పృష్ఠభాగరక్షకులుగాను పోవుచుండిరి.

రాజా ! ధృష్టద్యుమ్నుడు తన సేనలోని మహావీరులను కొందరిని వీరి వెంటతీసుకొని, మహారథికులైన ప్రభద్రకులతోను సర్వసేనా రక్షణము చేయుచుండెను. వీరందరి వెనుకభాగమునందు శిఖండి అర్జునుని రక్షణములో ఉండి భీష్ముని సంహరించుటకుగాను పూనుకొని ముందుకు సాగుచుండెను.

అర్జునుని వెనుక మహాబలశాలియైన సాత్యకి యుండెను. పాంచాలవీరులైన యుధామన్యుడు-ఉత్తమౌజుడు అర్జునునకు చక్రరక్షకులుగా నుండిరి.

రాజా! సంచరించుచున్న పర్వతములవలెనున్న అనేక గజముల సైన్యముతో యుధిష్ఠిరుడు సేనామధ్యమునందు ఉండెను. ద్రుపదరాజు ఒక అక్షౌహిణీసేనతో విరాటరాజు వెనుకగా కదలిపోవుచుండెను. రాజా! వారందరి రథధ్వజములు నానారత్నచిత్రితములై కనకమయములుగానుండి చంద్రసూర్యులవలె ప్రకాశించుచుండెను.

రాజా! ఆ తరువాత ధృష్టద్యుమ్నుడు ఇతరయోధులను దూరముగా జరిపి తాను స్వయముగా పంచపాండవుల రక్షణమునందు నిమగ్నుడయ్యెను.

రాజా! నీవారి రథములపైన శత్రువీరుల రథములపైనను విరాజమానములైయున్న ధ్వజములనన్నింటిని తిరస్కరించుచు అర్జునుని రథముపైన శోభాయమానముగా ఎగురుచున్న కపిధ్వజము ప్రకాశించుచుండెను.

రాజా! భీమసేనుని రక్షించుట కొరకు అతనికి ముందు ముందుగా ఖడ్గములు - శక్తియాయుధములు - రెండంచుల కత్తులు ధరించి లక్షలకొలది పదాతిదళము నడచుచుండెను.

యుధిష్ఠిరుని వెనుకగా వర్షాకాలమేఘములవంటివి, పర్వతములవంటివియు నైన ఉన్నత గజములు పదివేలు పోవుచుండెను. గజముల కుంభస్థలములనుండి మదజలము ఏకధారగా స్రవించుచుండెను. ఆ గజములపైన బంగారు అంబారులు ప్రకాశించుచుండెను. వానికికూడ పూర్తిగా శౌర్యము నిండియుండెను. అవి మద జలబిందువులను మేఘములవలె కురియుచుండెను. ఆ మదజలగంధము కమల గంధము గలదైయుండెను. ఆ గజములన్నియు బహుమూల్యము గలవై యుండెను.

రాజా! దుర్జయవీరుడైన భీమసేనుడు గడియమానువంటి భయంకరగదను ధరించి, మహాసైన్యమును వెంటదీసికొని పోవుచుండెను. అప్పుడతడు సూర్యునివలె దీపించుచుండెను. అతనివైపు చూచుటకుగూడ ఎవ్వరికిని శక్తిలేకుండెను. అతని దర్శనము నీ సేనను తపింపజేయుచుండెను. అతడు దగ్గరకురాగానే మహా యోధులుగూడ అతనిని కన్నెత్తి చూడజాలకుండిరి.

రాజా! యీ వజ్రవ్యూహము పాండవులకు దుర్గమువలె భయరహితముగా నుండి అన్నివైపుల ముఖముగలదిగా నుండెను. దాని ధ్వజముదగ్గర సువర్ణ భూషితమైన ధనుస్సు విద్యుత్తువలె మెరయుచుండెను. గాండీవధారియైన అర్జునుదే ఆ వ్యూహమును రక్షించుచుండెను.

రాజా! పాండవసైనికులు ఏవజ్రవ్యూహమును రచించుకొని నీ సేనతో ప్రతిఘటించుటకు నిలిచియుండిరో, ఆ వ్యూహమువారిచేత సురక్షితముగా నుండుట చేత ఆ వ్యూహము భూమండలమునందు అజేయముగానుండెను.

రాజా! ప్రాతఃకాలమునందు సంధ్యవార్చుచున్నపుడు యుద్ధవీరులు విడిచిన అర్ఘ్యోదకబిందువులు గాలికి నలువైపుల ప్రసరించుచు మేఘములులేని వృష్టిగా తోచెను. వారి సంధ్యావందన మంత్రోచ్చారణము మేఘగర్జనమువలె నుండెను.

రాజా! అక్కడ అన్నివైపుల ఇసుక, గులకరాలు కురియుచు వాయువు అతితీవ్రముగా వీచుచుండెను. ప్రపంచమందు పెద్దసుడిగాలి వీచినంత దుమ్ము రేగెను.

రాజా! తూర్పుదిక్కునకు ముఖముచేసి చాలపెద్ద కొరవి (ఉల్క)పడెను. అది ఉదయించు సూర్యుని తాకి పెద్ద ధ్వనితో ముక్కలై చెదరిపోయెను.

భరతభూషణా! రెండువైపుల సేనలు యుద్ధమునకై పూర్తిగా సిద్ధమై నప్పుడు సూర్యప్రభనిస్తేజస్కమై పోయెను. పెద్దధ్వనితో భూమి కంపించెను.

భరతశ్రేష్ఠా! అప్పుడు భూమండలము వికటధ్వనితో పగులుచున్నదా యనునట్లు తోచుచుండెను. రాజా! అన్ని దిక్కులందు పిడుగులు పడుచున్నట్లు అనేకపర్యాయములు పెద్దధ్వనులు వినపడెను.

మహారాజా! అతితీవ్రముగా ధూళి కురియుచుండెను. అప్పుడేమియు తోచకుండెను. హఠాత్తుగా వీచిన వాయువుయొక్క వేగముచేత ధ్వజములన్నియు ఊగుచుండెను. పతాకాలతోగూడిన ఆ ధ్వజములు సూర్యునివలె తేజస్వులుగా కనబడుచుండెను. ఆ ధ్వజములు సువర్ణహారములచేత వస్త్రములచేత అలంకరించబడియుండెను. వానికి చిన్నచిన్న గజ్జెలతో జాలములు (వలవంటితెరలు) కట్టబడియుండెను. ఆ గజ్జెల-మధురనాదము అన్నివైపుల వ్యాపించెను. ఈ విధముగా ఆ ధ్వజముల శబ్దముచేత తాటిచెట్ల వనమువలెనున్న ఆ యుద్ధభూమియందు అన్నివైపుల ఝుణఝుణధ్వని బిగ్గరగా వినవచ్చుచుండెను.

రాజా! యీవిధముగా యుద్ధానందములోనున్న పాండవులు నీ పుత్రుల సేనకు ఎదురుగా వ్యూహమువన్ని నిలిచియుండిరి. అట్లు నిలిచియున్న పాండవులు మీ యోధుల రక్తమును, మజ్జను (ఎముకలయందలి నేయివంటి రసము) ఇంకింపజేయుచుండిరి. గదాధారియైన భీమసేనుడు సేనాగ్రభాగమునందు నిలిచియుండుటనుచూచి నీ సేనయంతయు భయపడుచుండెను.

## ఇరువదవ అధ్యాయము

### ఉభయసేనల స్థితి :

జనమేజయా! సంజయునిమాటవిని ధృతరాష్ట్రుడు మరల నిట్లడిగెను:-

సంజయా! సూర్య-చంద్ర-వాయువులు ఏ పక్షమువారికి ప్రతికూలురుగా నుండిరి? ఏ పక్షమువారివైపు క్రూరమృగములు చూచి భయంకరముగా అరచుచుండెను? ఏ పక్షపు నవయువకుల ముఖకాంతులు ప్రసన్నముగా నుండెను? ఈవిషయములన్నియు ఉన్నవియున్నట్లు బాగుగానాకు చెప్పుము.

జనమేజయా! ఆ ప్రశ్నములకు సంజయుడిట్లు చెప్పదొడగెను:-

## సంజయుడు ఉభయసేనల స్థితి చెప్పుట :

రాజేంద్రా! ఇరువైపుల సేనలుగూడ సమానముగానే ముందు కనబడు చుండెను. ఇరువైపుల సైనికులుగూడ హర్షోల్లాసములతో నుండిరి. రెండు సేనలు వనపంక్తులవలె ఆశ్చర్యకరములుగా తోచుచుండెను. రెండు వైపుల రథ-గజ-తురగ సైన్యములుండెను.

భారతా! రెండు పక్షముల సేనలున్ను అతివిశాలముగానుండెను. దైవము ఆ రెండు సేనలను స్వర్గప్రాప్తికొరకు రచియించెనా యనునట్లు భయంకరముగా, దుస్సహముగాను నుండెను. రెండు సేనలయందున్ను సత్పురుషులు నిండి యుండిరి.

రాజా! నీ పుత్రుల ముఖములు, నీ సేనల ముఖములు పశ్చిమదిక్కుగా నుండెను. వారితో యుద్ధముచేయుటకు పాండవుల సేనలు పూర్వాభిముఖముగా నిలిచియుండెను. కౌరవసేన దైత్యరాజసేనవలె తోచుచుండెను. పాండవసేన దేవ రాజుసేనవలె కనబడుచుండెను.

మహారాజా! పాండవసేనకు వెనుకవైపున గాలివీచుచుండెను. నీపుత్రుల వైపు క్రూరజంతువులుచూచుచు అరచుచుండెను. నీ సేనలోని గజములు, పాండవ సేనా గజముల తీవ్రమదగంధమును సహింప జాలకుండెను.

రాజా! దుర్యోధనుడు కమలసమాన మదగజరాజుపైనగూర్చొని కౌరవ సేనా మధ్యభాగమునందు నిలిచియుండెను. ఆ గజముపైన బంగారు అంబారి, బంగారు జాలములు ఉండెను. అప్పుడతనిని వందిమాగధులు స్తుతించుచుండిరి.

మహారాజా! దుర్యోధనుని తలపైన చంద్రుని వంటి శ్వేతచ్ఛత్రము, కంఠమునందు సువర్ణహారము ప్రకాశించుచుండెను. గాంధారరాజైన శకుని, గాంధారదేశపు పర్వతీయసైనికులతో దుర్యోధనుని అన్ని వైపుల చుట్టుకొని సాగుచుండెను.

రాజా! నీ పర్వసేనల అగ్రభాగమునందు వృద్ధుడైన భీష్మపితామహుడు

ఉండెను. ఆయన తలపైన తెల్లని-తలపాగ-తెల్లని గొడుగు మెరయుచుండెను. ఆయన ధనుస్సు-ఖడ్గముగూడ తెల్లవిగానేయుండెను. శ్వేతశైలమువలె ప్రకాశించు చున్న తెల్లని అశ్వములతో, తెల్లని ధ్వజముతోను ఆయన వెండిరథము విరాజిల్లు చుండెను.

మహారాజా! భీష్ముని సేనలో అందరు ధార్తరాష్ట్రులు-బాహ్లీకసేనలోని ఒక భాగము, శల-అంబష్ఠ-సౌవీర-సింధు - పంచనదదేశముల క్షత్రియ వీరులు నుండిరి.

రాజా! భీష్ముని వెనుకభాగమునందు, సమస్తరాజులకు ఆచార్యుడు-ఉదార హృదయుడునైన ద్రోణాచార్యుడు, ధనుర్ధారియై, ఎఱ్ఱని గుఱ్ఱముల సువర్ణరథమునందు కూర్చొని రాజువలె యుద్ధమునకు పోవుచుండెను.

రాజా! వృద్ధక్షత్రునిపుత్రుడైన జయద్రథుడు - భూరిశ్రవసుడు - పురుమిత్రుడు-జయుడు-సాల్వుడు-మత్స్యదేశీయ క్షత్రియ వీరులు - కేకయ సోదరులందరు యుద్ధేచ్ఛతో గజసైన్యముతో సమస్త సేనామధ్యభాగమునందు నిలిచి యుండిరి.

రాజా! మహాధనుర్ధరుడు-విచిత్రరీతులలో యుద్ధము చేయువాడు-గౌతమ వంశీయుడు-మహామనీషియునైన కృపాచార్యుడు గురుతరయుద్ధభారమును వహించి, శక-కిరాత-యవన-పల్లవ సైనికులతో కౌరవసేనకు ఎడమవైపున పోవుచుండెను.

మహారాజా కృతవర్మచేత సురక్షితులైన సురాష్ట్ర దేశీయ, వృష్ణిభోజ వంశీయవీరులచేత పరిపాలితములైన మహాసేనలు నీ సేనకు కుడివైపున నడుచు చుండెను.

రాజా! మేము అర్జునునైనను సంహరించెదము. లేదా, అతని చేతనైనను చచ్చెదము'అని ప్రతిజ్ఞచేసి పదివేల సంశప్తకరథికులు, శస్త్రాస్త్రవిదులైన అనేక త్రిగర్తవీరులు, అర్జునునకు ఎదురుగా పోవుచుండిరి.

భరతశ్రేష్ఠా! నీ సేనలో ఒక లక్షకుమించిన గజసైన్యముఉండెను ఒక్కొక్క గజము వెంట నూరు నూరు రథములుండెను. ఒక్కొక్క రథము వెంట నూరు నూరు అశ్వికులుండిరి. ప్రతి యొక్క అశ్వికునివెంట పది పది మంది ధనుర్ధరులు-ప్రతియొక ధనుర్ధారితో నూరునూరు పదాతి దళమువారు కత్తులు,

డాలులు పట్టుకొని నిలిచియుండిరి. భరతనందనా! భీష్ముడీవిధముగా నీ సేనా వ్యూహమును రచించియుండెను.

భరతనందనా ! శాంతనునందనుడైన భీష్ముడు సర్వసేనాధిపతిగా నిలిచి యుండి, మానుష-దైవ - గాంధర్వ-అసుర ప్రణాళిక ననుసరించి, ప్రతిదిన మొక్కొక్క వ్యూహరచనచేయుచు తాను సేనాగ్ర భాగమునందు నిలుచుచుండెను. భీష్మునిచేత రచింపబడిన కౌరవ సేనావ్యూహమునందు మహారథికుల సముదాయము ఉండెను. ఆ సేన సముద్రమువలె గర్జిల్లుచుండెను. ఆ సేన ముఖము పడమటి దిక్కుగా నుండెను.

నరేంద్రా! నీ సేన అనంతరూపములతో భయంకరముగానుండెను. పాండవులసేన అట్లు లేకుండెను. కాని పాండవుల సేనయే, అతివిశాలమని, దుర్జయ మనియు నేను భావించుచున్నాను. ఎందుకనగా, పాండవులసేనకు శ్రీకృష్ణ భగవానుడు-అర్జునుడు నేతృత్వము వహించుచున్నారు.

జనమేజయా! సంజయుడు ధృతరాష్ట్రునకు తరువాతి వృత్తాంతము నిట్లు చెప్పదొడగెను:-

## ఇరువది ఒకటువ అధ్యాయము

### కౌరవసేననుచూచి యుధిష్ఠిరుడు విషాదము చెందుట-అర్జునుడు అతనిని ఆశ్వాసించుట:

ధృతరాష్ట్రమహారాజా! యుద్ధమునకు సిద్ధమైయున్న దుర్యోధనుని విశాల సైన్యమునుచూచి, యుధిష్ఠిరుని మనస్సులో దుఃఖము కలిగెను. భీష్ముడు రచించిన వ్యూహము దుర్భేద్యముగానుండెను. దానిని క్షోభింపజేయుట అసాధ్యమని తలచి యుధిష్ఠిరుడు వివర్ణముఖుడై యర్జునునితో నిట్లనెను:-

ధనంజయా ! భీష్మపితామహుడు ప్రధాన యోధుడుగానున్న ధార్తరాష్ట్రులతో మనమెట్లు యుద్ధముచేయ గలుగుదుము? మహాతేజస్వి, శత్రుహంతకుడు నైన భీష్ముడు శాస్త్రీయవిధానములో అక్షోభ్యము-అభేద్యము నైన వ్యూహమును రచించెను.

అర్జునా! మనము మన సేనతోపాటు ప్రాణసంకటస్థితిలో పడిపోయినాము. ఈ భీష్ముని వ్యూహమునుండి మనమెట్లు ఉద్ధరింపబడ గలుగుదుము?

ధృతరాష్ట్రమహారాజా! ఆ మాటకు అర్జునుడు, విషాదగ్రస్తుడైన యుధిష్ఠిరునితో నిట్లనెను:-

మహారాజా! అతిబుద్ధిశాలురు-ఉత్తమగుణ సంపన్నులు-బహుసంఖ్యాకులునైన శూరులనుగూడ తక్కువ సంఖ్యలోనున్న యోధులు ఏవిధముగా జయించగలరను విషయము చెప్పెదవినుము. రాజా! నీకు దోషదృష్టిలేదు నిష్కపటముగా నుండెదవు అందుచేత నీకు యుక్తి చెప్పెదను. ఆ యుక్తిని దేవర్షియైన నారదుడు-భీష్మపితామహుడు-ద్రోణాచార్యుడుమాత్రమే యెరుగుదురు.

రాజా! పూర్వకాలమునందు దేవాసుర సంగ్రామము జరుగుచుండెను. అప్పుడు బ్రహ్మదేవుడు ఇంద్రాదిదేవతలతో నిట్లనెను:-

"దేవతలారా! విజయేచ్ఛగల వీరులు కేవలము తమ బలపరాక్రమముల చేతనే విజయము పొందగలరు. సత్యము-సజ్జనత్వము-ధర్మము-ఉత్సాహము-ఇవియున్నవారికే జయము సిద్ధించును. అధర్మ-లోభ-మోహములను విడిచి, పురుష ప్రయత్న సహాయముతో, అహంకారము విడిచి యుద్ధము చేయుడు ధర్మము యేవైపుఉండునో ఆ వైపుననే విజయము కలుగును".

యుధిష్ఠిర మహారాజా! బ్రహ్మదేవుని యీ వచనములనుబట్టి ఆనియమము మేరకే యుద్ధమున జయము అవశ్యంభావియని నిశ్చయముగా తెలిసికొనుము. నారదమహాముని చెప్పినట్లు ఎక్కడ కృష్ణభగవానుడున్నాడో ఆ పక్షమునకు విజయము తథ్యము. విజయమనునది శ్రీకృష్ణుని సహజగుణము. అందుచేత జయము ఆయన వెనువెంటనే నడచుచుండును. విజయమువలెనే, వినయముగూడ శ్రీకృష్ణుని సహజగుణమని భావింపుము.

మహారాజా! భగవంతుడైన గోవిందుని పరాక్రమము- తేజస్సు అనంతములు. ఆయన శత్రుసముదాయమునందున్నప్పుడు గూడ వ్యథచెందడు. ఎందుకనగా, ఆయన సనాతన పురుషుడైన పరమాత్ముడు. కాబట్టి శ్రీకృష్ణుడున్న పక్షమునకే విజయము కలుగును. శ్రీకృష్ణుడెక్కడగూడ అవరోధముగాని, ప్రతిహతిగాని యెరుగనివాడు. ఈయన బాణము అమోఘము.

రాజా! ఈ శ్రీకృష్ణభగవానుడే పూర్వమొకసారి శ్రీహరిగా ప్రత్యక్షమై వజ్రగర్జనవంటి గంభీరవాణితో దేవాసురులిరువురితో "మీలో నెవరికి విజయము కావలెను?" అని అడిగెను. అప్పుడు ఆయనన్నాశ్రయించి "కృష్ణా! మాకు విజయమెట్లు కలుగును?" అని అడిగిన దేవతలకే విజయము సిద్ధించెను. ఈ విధముగా శ్రీకృష్ణుని కృపచేతనే ఇంద్రాది దేవతలకు త్రిలోక సామ్రాజ్యము లభించెను.

కాబట్టి, రాజా! నీవు ఏవిధమైన చింత చేయుటకుగూడ కారణము నాకు కనబడకున్నది. ఎందుకనగా, దేవేశ్వరుడు, విశ్వంభరుడునైన శ్రీకృష్ణభగవానుడు నీకు విజయము సిద్ధించవలెనని ఆశించుచున్నాడు.

జనమేజయా! సంజయుడు ధృతరాష్ట్రునకు తరువాతి కథ యిట్లు చెప్పెను :-

## ఇరువది రెండవ అధ్యాయము

### యుధిష్ఠిరుని యుద్ధయాత్ర :

భరతశ్రేష్ఠా! తరువాత యుధిష్ఠిరమహారాజు భీష్ముని సేనను ఎదుర్కొనను తన సేనను వ్యూహరచన చేయుచు యుద్ధమును ప్రోత్సహించెను కురుధురంధరులైన పాండవులు ఉత్తమ యుద్ధముచేసి, స్వర్గమును కోరుచు, శాస్త్రవిధిప్రకారము సేనావ్యూహమును రచించిరి.

రాజా! వ్యూహమధ్యభాగమునందు అర్జున రక్షితుడైన శిఖండి సేనముండెను. అగ్రభాగమునందు భీమసేనరక్షితుడైన ధృష్టద్యుమ్నుడు సంచరించుచుండెను. రాజా! ఆ వజ్రవ్యూహపు దక్షిణభాగమును ఇంద్రసమానుడైన సాత్యకి రక్షించుచుండెను.

మహారాజా! యుధిష్ఠిరమహారాజు గజసేనా మధ్యభాగమునందు ఒక సుందర రథమునందుండెను ఆ రథము ఇంద్రుని రథమువలె విరాజమానమగుచుండెను. ఆ రథమునందు యుద్ధమునకు ఆవశ్యకమైన సమస్తసామగ్రి యుంచబడియుండెను. వివిధ సువర్ణ - రత్నాభరణములతో భూషితమైయున్న యుధి

ష్ఠిరుని రథము అతివిచిత్రముగా శోభిల్లుచుండెను. దానిలో బంగారు నగలపెట్టె-త్రాడు ఉంచబడెను.

రాజా ! అప్పుడొక సేవకుడు గజదంతపు పుల్లలతో చేయబడిన శ్వేత ఛత్రము యుధిష్ఠిరుని పైన పట్టుకొనియుండెను. అది మిక్కిలి శోభిల్లుచుండెను. కొందరు మహర్షులు అనేకస్తోత్రములచేత యుధిష్ఠిరుని ప్రశంసించుచు, అతనికి కుడివైపుగా ప్రదక్షిణము చేయుచు పోయిరి.

రాజా ! శాస్త్రపండితులైన పురోహితులు, మహర్షులు, సిద్ధులు, జపములు-మంత్రములు- ఓషధులు వీనిచేత అన్నివైపుల యుధిష్ఠిరుని మంగళము కొరకు శత్రుసంహారము కొరకు శుభాశీర్వాదములను చేయుచుండిరి.

రాజా ! అప్పుడు ఇంద్రునివలె ప్రకాశించుచున్న యుధిష్ఠిరుడు అనేక వస్త్ర గో ఫల పుష్ప సువర్ణ భూషణములను బ్రాహ్మణులకు దానముచేయుచు ముందుకు సాగుచుండెను.

రాజా ! అర్జునుని రథము జ్వాలామాలికలతో ప్రజ్వరిల్లుచున్న అగ్నివలె తేజరిల్లుచుండెను. దానియందు సూర్యాకారము గల వేలకొలది చక్రములుండెను. నూర్లకొలది గజ్జెలు ఆ రథమునకు కట్టబడియుండెను. ఆ రథము సువర్ణభూషితమై యుండుటచేత ప్రకాశించుచుండెను. దానికి తెల్లగుఱ్ఱములు- అందమైన చక్రములు అమర్చబడెను.

రాజా ! అర్జునుడుచేత గాండీవము - బాణములు ధరించి కపిధ్వజములో విరాజిల్లుచున్న ఆ రథమునందు కూర్చొనియుండెను. శ్రీకృష్ణభగవానుడు రథ సారథ్యము చేయుచుండెను. అర్జునునకు ఈడైన ధనుర్ధరుడీ భూమండలమునందు పుట్టలేదు. ఇకపైన పుట్టబోవడు.

మహారాజా ! సుందరములు- దృఢములునైన బాహువులుగల భీమసేనుడు ఆయుధములు ధరించక, కేవలము బాహుయుద్ధము చేత రథ గజ- తురగ- పదాతి సైన్యములను చూర్ణము చేయగలవాడు. అతడు నీ పుత్రుల సేనను సంహరించుటకు అత్యంత రౌద్రరూపమును ధరించియున్నాడు.

రాజా ! భీమసేనుడు, నకులసహదేవులతో కలిసి తమ రథికాగ్రేసరుడైన

ధృష్టద్యుమ్నుని రక్షించుచుండెను. సింహములతో, ఆబోతులతో ఉన్మత్తుడై క్రీడించుచున్నట్లు పోరాడువాడు - గజరాజువంటి దర్పముగలవాడు- ప్రపంచమునందు ఇంద్రసమాన పరాక్రమశాలి–ఆక్రమింపబడుటకు సాధ్యముకానివాడునైన వీరభీమసేనుడు పాండవసేనాగ్రభాగమునందు నిలిచియుండుటజూచి, మీ సైనికులు భయముచేత దుఃఖితులై బురదలో చిక్కుకొన్న గజములవలె బాధపడుచుండిరి.

రాజా ! ఆ సమయమునందు సేనామధ్యభాగమునందు నిలుచుకొనియున్న దుర్జయవీరుడైన అర్జునునితో శ్రీకృష్ణభగవానుడిట్లనెను :-

ధనంజయా ! తన సేనామధ్యభాగమునందు ఉండి, రోషముతో తపించుచు మనసేనవైపు సింహమువలె చూచుచున్నవాడే కురుకులపతాకుడైన భీష్మపితామహుడు. ఆయన యింతవరకు మూడునూర్ల అశ్వమేధ యజ్ఞములు చేసినాడు.

అర్జునా ! మేఘములు సూర్యుని కప్పినట్లు, ఈ కౌరవసేనలన్నీ ఈ మహానుభావుడైన భీష్ముని ఆచ్ఛాదించియున్నవి అర్జునా ! నీవు తొలుత ఈ సైన్యములన్నింటిని సంహరించి, భరతకులభూషణుడైన భీష్మునితో యుద్ధము చేయుటకు అభిలషించుము.

జనమేజయా ! సంజయుడు ధృతరాష్ట్రునకిట్లు చెప్పి తరువాతి వృత్తాంతమును ఈ విధముగా చెప్పదొడగెను :-

## ఇరువది మూడవ అధ్యాయము

### అర్జునుడు దుర్గాదేవిని స్తుతించుట :

ధృతరాష్ట్రమహారాజా ! దుర్యోధనుని సేనలు యుద్ధసన్నద్ధములై యుండుటను చూచి శ్రీకృష్ణభగవానుడు అర్జునుని హితముకొరకు అతనితో నిట్లనెను:-

అర్జునా ! నీవు యుద్ధ సమ్ముఖమునందు నిలిచియున్నావు. శత్రువులను జయించుటకుగాను, పవిత్రుడవై దుర్గాదేవిని స్తుతించుము.

ధృతరాష్ట్రమహారాజా! భగవంతుడైన వాసుదేవుడు రణరంగమునందు ఈ విధముగా ఆదేశించిన వెంటనే అర్జునుడు రథము దిగి దుర్గామహాదేవిని యీ విధముగా స్తుతించుటకు ఆరంభించెను :—

నమస్తే । సిద్ధసేనాని! ఆర్యే! । మందరవాసిని! ।
కుమారి । కాళి! కాపాలి! కపిలే! కృష్ణపింగళే! ॥ 1

భద్రకాళి! నమస్తుభ్యం । మహాకాళి! నమోఽస్తుతే ।
చండి! చండే! నమస్తుభ్యం! తారిణి! వరవర్ణిని! ॥ 2

మందరపర్వతమునందు నివసించు దేవీ! సిద్ధులసేనా నాయకురాలా! ఆర్యురాలా! నీకు పలుసార్లు నమస్కారము చేసెదను. నీవే కుమారీ—కాళీ-కపాలీ—కపిలా-కృష్ణపింగళా-భద్రకాళీ-మహాకాళీ నామములతో ప్రసిద్ధురాలవు. నీకు మాటిమాటికి నమస్కారము చేయుచున్నాను. దుష్టులపైన ప్రచండకోపము చేయుటచేత నీవు 'చండి'యనియు స్తుతింపబడుచున్నావు. దేవీ! నీ శరీరము యొక్క దివ్యవర్ణము అతిసుందరముగా నున్నది గాబట్టి 'వరవర్ణిని' యని స్తుతింపబడుచున్న నీకు దేవీ! ప్రణామము చేసెదను.

కాత్యాయని! మహాభాగే! కరాళి! విజయే! జయే! ।
శిఖిపింఛ ధ్వజధరే! నానాఽఽభరణ భూషితే! ॥ 3

అట్టశూల ప్రహరణే! ఖడ్గఖేటక ధారిణి! ।
గోపేంద్రస్యానుజే! జ్యేష్ఠే! నందగోపకులోద్భవే! ॥ 4

మహిషాసృక్ప్రియే! నిత్యం । కౌశికి! పీతవాసిని! ।
అట్టహాసే! కోకముఖే! నమస్తేఽస్తు! రణప్రియే! ॥ 5

మహాభాగురాలా! దేవీ! సౌమ్య- సుందరరూపముగల నీవే పూజనీయ

---

దుర్గాస్తుతిలో 13 శ్లోకములే ఉన్నవి. ప్రతిదినము దుర్గాస్తోత్ర పారాయణము చేయువారి కొరకు ఆ శ్లోకములుగూడ వ్రాసి ఒక్కొక్క శ్లోకము క్రింద సంగ్రహముగా అర్థములుగూడ వ్రాయబడినవి. (క.ల.శాస్త్రి)

ఛాలవైన కాత్యాయనీ దేవివి. వికరాళ (భయంకర) రూపధారిణివైన కాళివి నీవే. విజయా-జయా నామములతో విఖ్యాతురాలవైన దేవివి నీవే. నీవు నెమలిధ్వజము గల దేవివి. దేవీ! అనేకవిధములైన ఆభరణములు నీ యవయవముల శోభను అభివృద్ధిపరచుచున్నవి.

దేవీ! నీవు భయంకరమైన త్రిశూలము- ఖడ్గము-డాలు ఈ మొదలైన ఆయుధములను ధరించుచున్నావు. నీవు నందగోపవంశమునందు అవతరించి యుంటివి. కాబట్టి గోపేశ్వరుడైన శ్రీకృష్ణునకు నీవు చెల్లెలవు. కాని గుణముల లోను- మహిమలలోను నీవు సర్వశ్రేష్ఠురాలవు.

దేవీ! నీవు మహిషాసురుని రక్తము ప్రవహింపజేసి మిక్కిలి ప్రసన్నురాల వైతివి. నీవు కౌశికగోత్రమునందు అవతరించియుండుటచేత కౌశికీనామముతో గూడ ప్రసిద్ధిచెందియున్నావు. దేవీ! నీవు పీతాంబరమును ధరించెదవు. నీవు శత్రువులను చూచి అట్టహాసము చేసినప్పుడు, నీ ముఖము చక్రవాకపక్షివలె ప్రకాశించుచుండును. యుద్ధము నీకు చాలప్రియము. అట్టి నీకు మాటిమాటికి ప్రణామము చేయుచున్నాను.

ఉమే। శాకంభరి। శ్వేతే। కృష్ణే। కైటభనాశిని ।
హిరణ్యాక్షి। విరూపాక్షి। సుధూమ్రాక్షి। నమోఽస్తుతే॥ 6

ఉమా- శాకంభరీ-శ్వేతా- కృష్ణా- కైటభనాశినీ - హిరణ్యాక్షీ - విరూపాక్షీ- సుధూమ్రాక్షీ- ఇత్యాది నామములను ధరించుచున్న దేవీ! నీకు అనేక పర్యాయములు నమస్కారము చేయుచున్నాను.

వేదశ్రుతి। మహాపుణ్యే। బ్రహ్మణ్యే। జాతవేదసి ।
జంబూకటకచైత్యేషు నిత్యం సన్నిహితాఽలయే ॥ 7

త్వం బ్రహ్మవిద్యా విద్యానాం మహానిద్రా చ దేహినామ్ ।
స్కందమాతర్భగవతి। దుర్గే। కాంతారవాసిని ॥ 8

స్వాహాకారః స్వధా చైవ కళా కాష్ఠా సరస్వతీ ।
సావిత్రీ వేదమాతా। చ తథా వేదాంత ఉచ్యతే ॥ 9

దేవీ! నీవు వేదములకు శ్రుతివి (నాదము), నీ స్వరూపము అత్యంత పవిత్రము, నీకు వేద-బ్రాహ్మణులు ప్రియులు, నీవే జాతవేదసుడైన అగ్ని యొక్క శక్తిస్వరూపిణివి. జంబూ (నేరేడు) కటక చైత్యములందు (నాలుగు దారుల కూడలి) నిత్యనివాసము చేయు దేవివి నీవు.

దేవీ! నీవు అన్ని విద్యలలోను బ్రహ్మవిద్యవు. దేహధారులైన ప్రాణులకు మహానిద్రవు. భగవతీ! నీవు కార్తికేయునకు (కుమారస్వామికి) తల్లివి. ప్రకాశించుటకు అశక్యములైన స్థానములలో నివసించు దుర్గాదేవివి.

సావిత్రీ-స్వాహా-స్వధా-కళా-కాష్ఠా- సరస్వతీ-వేదమాతా-వేదాంత నామములు గల దేవివి నీవే.

స్తుతాఽసి త్వం మహాదేవి। విశుద్ధేనాన్తరాత్మనా।
జయో భవతు మే నిత్యం। త్వత్ప్రసాదాత్ రణాజిరే॥ 10

మహాదేవీ! నేను పరిశుద్ధమనస్సుతో నీ స్తుతి చేసితిని. నీ కృపచేత ఈ యుద్ధభూమియందు సర్వదా నాకు జయము కలుగుగాక!

కాంతారభయదుర్గేషు భక్తానాం చాఽలయేషు చ।
నిత్యం వససి పాతాళే యుద్ధే। జయసి దానవాన్॥ 11

తల్లీ! నీవు ఘోరమైన వనమునందు, భయంకర దుర్గమ స్థానములందు, భక్తుల యిండ్లలో, పాతాళమునందు గూడ నిత్యనివాసము చేయుచున్నావు. యుద్ధమునందు దానవులను ఓడించెదవు.

త్వం జంభనీ మోహినీ చ మాయా హ్రీః శ్రీస్తథైవ చ।
సంధ్యా ప్రభావతీ చైవ సావిత్రీ జననీ తథా॥ 12

దేవీ! నీవే 'జంభనీ-మోహినీ-మాయా-హ్రీ-శ్రీ-సంధ్యా-ప్రభావతీ సావిత్రీ జననీ' నామములతో ప్రసిద్ధురాలవు.

తుష్టిః పుష్టి ర్ధృతిర్దీప్తిశ్చంద్రాదిత్య వివర్ధినీ।
భూతిర్భూతిమతాం సంఖ్యే వీక్ష్యసే సిద్ధచారణైః॥ 13

దేవీ! 'తుష్టి-పుష్టి-ధృతి-దీప్తి-సూర్యచంద్రులను వృద్ధినొందించు దేవీ' ఈ స్వరూపములు గల దేవివి నీవే. ఐశ్వర్యవంతులకు ఐశ్వర్యము నీవే. యుద్ధభూమి యందు సిద్ధులు- చారణులు నీ దర్శనము చేసెదరు.

జనమేజయా! సంజయుడు ధృతరాష్ట్రునితో నిట్లు చెప్పి, తరువాతి వృత్తాంతమును ఈ విధముగా చెప్పదొడగెను.

ధృతరాష్ట్రమహారాజా! అర్జునుని ఈ భక్తిభావమును గ్రహించి మనుష్యులపైన పరిపూర్ణవాత్సల్యము గల తల్లి దుర్గాదేవి, ఆకాశమునందు శ్రీకృష్ణ భగవానుని యెదుటవచ్చి నిలచి అర్జునునితో ఈ విధముగా ననెను :-

పాండునందనా! నీవు కొలదికాలములోనే శత్రువులపైన విజయము సాధించగలవు. వీరవరా! నీవు సాక్షాత్తు నరుడవు. సాక్షాత్తు నారాయణుడు నీకు సహాయకుడుగా నున్నాడు. యుద్ధరంగమునందు నీవు శత్రువులకు అజేయుడవు. ఇంద్రుడుగూడ నిన్ను ఓడించజాలడు.

రాజా! ఈ విధముగా వరదాయినియైన దుర్గాదేవి చెప్పి వెంటనే అక్కడి నుండి అంతర్ధానము చెందెను. ఆ వరమును పొందిన అర్జునునకు తన విజయము తథ్యమని విశ్వాసము కలిగెను. తరువాత నతడు తన రథముపై కూర్చొనెను. తరువాత కృష్ణార్జునులు తమ పాంచజన్య- దేవదత్త శంఖములను మ్రోగించిరి.

## దుర్గాస్తోత్ర ఫలశ్రుతి :

య ఇదం పఠతే స్తోత్రం కల్య ఉత్థాయ మానవః ।
యక్ష-రక్షః పిశాచేభ్యో న భయం విద్యతే సదా॥ 14

న చాపి రిపవస్తేభ్యః సర్పాద్యా యే చ దంష్ట్రిణః ।
న భయం విద్యతే తస్య సదా రాజకులాదపి ॥ 15

వివాదే జయమాప్నోతి బద్ధో ముచ్యేత బంధనాత్ ।
దుర్గం తరతి చావశ్యం తథా చోరైర్విముచ్యతే ॥ 16

సంగ్రామే విజయేన్నిత్యం లక్ష్మీం ప్రాప్నోతి కేవలామ్ ।
ఆరోగ్య బలసంపన్నో జీవేద్వర్షశతం తథా ॥ 17

ప్రాతఃకాలమునందు మేల్కొని ఈ దుర్గాస్తోత్రమును పఠించువారికి యక్ష రాక్షస-పిశాచముల వలన భయము ఎప్పుడుగూడా ఉండదు. వారికి శత్రువులు-సర్పాది విషజంతువులు, కోరలుగల క్రూరజంతువులుగూడ హాని కలిగించజాలవు రాజులనుండిగూడ భయము ఈ స్తోత్ర పాఠకులకు ఉండదు. వివాదములందు విజయము కలుగును. చెరలోనివారు విముక్తులయ్యెదరు.

ఈ దుర్గాస్తోత్రమును శ్రద్ధాభక్తులతో పఠించువారు దుర్గములైన సంకటములను అవశ్యముగా దాటగలరు. దొంగలుగూడ వారిని విడిచెదరు. అట్టివారు యుద్ధమునందు ఎల్లప్పుడు విజయము పొందగలరు. ఐశ్వర్యసంపన్నులయ్యెదరు. దుర్గాస్తోత్ర పాఠకులు ఆరోగ్యబలసంపన్నులై నూరేండ్ల ఆయుస్సు పొందగలరు.

ధృతరాష్ట్ర మహారాజా! వ్యాసభగవానుని కృపచేత ఇదియంతయు నేను ప్రత్యక్షముగా చూచితిని. రాజా! దురాత్ములైన నీ పుత్రులందరు క్రోధమునకు వశులై మోహములోపడి శ్రీకృష్ణార్జునులే నర-నారాయణ ఋషులని తెలియజాలకున్నారు.

"రాజా! నీ పుత్రులు కాలపాశబద్ధులై యుండుటచేత సమయోచితముగా చెప్పిన మంచిమాట వినకున్నారు. వ్యాస-నారద-కణ్వ-పరశురామాది మునీశ్వరులు, నీ కొడుకులకు ఎన్నియో ఉపదేశములు చేసి యుద్ధము మానుకొనుమని చెప్పిరి. కాని వారిమాటలన్నియు నీ కొడుకులు పెడచెవిని పెట్టిరి.

"రాజా! న్యాయసమ్మతమైన వ్యవహారము-పరాక్రమము-తేజస్సు-కాంతి-లజ్జ-సంపద-బుద్ధి-ధర్మము, ఈ మొదలైన గుణసంపదలు ఎక్కడ ఉండునో, అక్కడనే శ్రీకృష్ణభగవానుడు ఉండును. ఎక్కడ శ్రీకృష్ణపరమాత్ముడు ఉండునో ఆ పక్షమునకు విజయము తథ్యముగా సిద్ధించగలదు-"

"జనమేజయా! సంజయుని మాటవిని ధృతరాష్ట్రుడు సంజయునిట్లు ప్రశ్నించెను :-

"సంజయా! ఆ సమయమునందు ఏ పక్షమునందలి సైనికులు మిక్కిలి

---

* ఈ ఫలశ్రుతి శ్లోకములు దుర్గాస్తోత్ర పాఠముచేసిన తర్వాత చదువవలెను. వీటి అర్థముగూడ శ్లోకముల క్రింద వ్రాయబడినది.

హర్షోత్సాహ పరిపూర్ణులై తొలుత యుద్ధమునందు ముందుకుసాగిరి? ఎవరి మనస్సులలో ఉత్సాహము నిండియుండెను?

ఏయే మనుష్యులు దీనులుగా, అచేతనులుగాను యుండిరి? ఆ యిరుసేనలలో నెవరు ముందు శస్త్ర ప్రహారము చేసిరి? హృదయమును కంపింపజేయు ఆ యుద్ధములో, నాపుత్రులు తొలుత సంగ్రామము చేసిరా? పాండవులా? తెలుపుము. ఎవరిసేనలలో సుగంధి పుష్పమాలికలు. మొదట ప్రకటితములయ్యెను? ఏ పక్షమువారి సింహనాదము అత్యంత గంభీరముగా నుండెను. ఆ ప్రశ్నములకు సంజయుడిట్లు బదులు చెప్పెను :-

"మహారాజా! ఆ సమయమునందు రెండుపక్షముల యోధులుగూడ ఆనందోత్సాహములతో నిండియుండిరి. ఉభయపక్షములలోను సుగంధము పుష్పహారములు ఆవిర్భవించియుండెను.

భరతశ్రేష్ఠ! రెండుపక్షముల సైనికులు సంఘటితులై, వ్యూహములు పన్ని, యుద్ధోత్సాహముతో ఉబలాడుచు, తలపడినప్పుడు, పెద్దసంచలనము గలిగి శస్త్ర ప్రహారములు ఆరంభింపబడెను.

"రాజా! శంఖ-భేరీ-పటహాది వాద్యముల శబ్దములు కలిసి భయంకరముగా, యోధుల తర్జన, సింహనాదములతో కలిసినప్పుడు, రెండుసేనలలోను కోలాహలము-సంఘర్షము చాలగొప్పగా కలుగజేసెను.

"భరతభూషణా! పరస్పరము చూచుకొనుచున్న యుద్ధవీరులు- ఘీంకారములు చేయుచున్న యేనుగులు సంతోషముతో నిండినసేనల ధ్వనులు- ఈ ధ్వనులన్నియు నొకటిగా కలిసి మహాధ్వనిగా అన్నిదిక్కుల వ్యాపించెను.

జనమేజయా! సంజయుని మాటవిని ధృతరాష్ట్రుడు మరల సంజయునిట్లు ప్రశ్నించెను :-

## భగవద్గీతాధ్యానము

పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయమ్
వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యే మహాభారతమ్ ।

అద్వైతామృతవర్షిణీం భగవతీ మష్టాదశాధ్యాయినీమ్
అంబ త్వా మనుసంధధామి భగవద్గీతే । భవద్వేషిణీమ్ ॥

సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః ।
పార్థో వత్సః సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్॥[1]

భగవంతుడైన శ్రీమన్నారాయణునిచేత స్వయముగా అర్జునునకు బోధింపబడిన మాతృస్వరూపురాలవు, మహాభారత గ్రంథమధ్యమునందు ప్రాచీనమహర్షి సత్తముడైన వ్యాసమహామునిచేత కూర్చ (నిర్మింప)బడిన దేవివి, జీవబ్రహ్మైక్య మనబడు అద్వైత సిద్ధాంతమనెడు అమృతమును వర్షించుతల్లివి, పదునెనిమిది అధ్యాయములుగల మహాదేవివి. సంసారబంధములనుండి విడిపించు తల్లివియు నగు అమ్మా ! భగవద్గీతా ! నీ యనుసంధానము (ధ్యానము) చేసెదను."

ఉపనిషత్తులన్నియు గోవులు-వాని పాలు పిదుకువాడు గోపాలనందనుడైన శ్రీకృష్ణభగవానుడు ఆ పాలను చేపుదూడ అర్జునుడు. ఆ క్షీర స్వరూపమైన భగవద్గీతామృతమును పానముచేసి ఆనందించు వారు ప్రపంచమునందలి ఆత్మజ్ఞాన సంపన్నులైన పండితులు అని తెలియవలెను.

## శ్రీమద్భగవద్గీతయందు మొదటి అధ్యాయము

# అర్జున విషాదయోగము

### స్వజన వధ అను పాపమువలన భయము చెందిన అర్జునుని విషాదము

ధృతరాష్ట్ర ఉవాచ :

"ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః ।
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ ॥ 1

ధృతరాష్ట్రుడిట్లనెను- "సంజయా ! ధర్మభూమియైన కురుక్షేత్రమునందు

1. ఈ భగవద్గీతాధ్యాన శ్లోకములు భీష్మపర్వమునందు లేవు. అనువాదకుడు గీతామాతను ప్రసన్నురాలినిగా చేసికొనుటకు వీనిని చేర్చెను.

యుద్ధము చేయవలెనను నిచ్ఛతో ఒకచోట చేరియున్న నా కొడుకులు పాండు పుత్రులు ఏమిచేసిరి ?"

సంజయ ఉవాచ :

"దృష్ట్వాతు పాండవానీకం వ్యూఢం దుర్యోధనస్తదా ।
ఆచార్య ముపసంగమ్య రాజా వచన మబ్రవీత్ ॥"

సంజయుడిట్లనెను- రాజా! అప్పుడు దుర్యోధనుడు వ్యూహరచనలు చేయ బడిన పాండవుల సైన్యములను చూచి, ద్రోణాచార్యుల వద్దకుపోయి యిట్లనెను:-

"పశ్యైతాం పాండుపుత్రాణా మాచార్య! మహతీం చమూమ్ ।
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా ॥ 3

ఆచార్యవర్యా! బుద్ధిమంతుడైన నీ శిష్యుడు-ద్రుపద పుత్రుడునైన ధృష్ట ద్యుమ్నునిచేత వ్యూహాకారముగా నమర్చబడిన పాండుపుత్రుల చాలా పెద్దదైన యీ సేనను చూడుము.

"అత్ర శూరా మహేష్వాసా భీమార్జున సమాయుధి ।
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః ॥" 4

"ధృష్టకేతు శ్చేకితానః కాశిరాజశ్చ వీర్యవాన్ ।
పురుజిత్ కున్తిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః ॥" 5

"యుధామన్యుశ్చ విక్రాన్త ఉత్తమౌజాశ్చ వీర్యవాన్ ।
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః"॥ 6

ఆచార్యా! యీసేనలో పెద్దపెద్ద ధనుర్ధరులు - యుద్ధభయంకరులు అర్జునసమాన వీరులునైన సాత్యకి, విరాటరాజులు, మహారథికుడైన ద్రుపద మహా రాజు, ధృష్టకేతు, చేకితానులు, బలవంతుడైన కాశీరాజు, పురుజిత్తు, కుంతి భోజుడు, మనుష్యులలో శ్రేష్ఠుడైన శైబ్యుడు, పరాక్రమవంతుడైన యుధామన్యుడు బలవంతుడైన ఉత్తమౌజుడు, సుభద్రాపుత్రుడైన అభిమన్యుడు, ద్రౌపదీదేవి యొక్క ఐదుగురు కొడుకులు- ఈ మహావీరులు-మహారథికులు నున్నారు.
(4-5-6)

"అస్మాకంతు విశిష్టా యేతాన్ నిబోధ ద్విజోత్తమ।
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమితే ॥" 7

బ్రాహ్మణశ్రేష్ఠుడా! మన పక్షమునందున్న ప్రధానవీరులను గూర్చి కూడ నీవు తెలుసికొనుము. నీకు తెలియుటకొరకు నా సేనలో ఏయే సేనాపతులు ఉన్నారో వారిని తెలిపెదను వినుము.

"భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః।
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి స్తథైవ చ ॥ 8

గురుదేవా! మనసేనలో నీవు, భీష్మపితామహుడు, కర్ణుడు, యుద్ధమునందు విజయశీలుడైన కృపాచార్యుడు, అట్టివారే అయిన అశ్వత్థామ, వికర్ణులు, సోమదత్త పుత్రుడైన భూరిశ్రవుడు నున్నారు.

"అన్యేచ బహవః శూరా మదర్థే త్యక్తజీవితాః।
నానాశస్త్ర ప్రహరణాః సర్వే యుద్ధ విశారదాః ॥" 9

వీరేకాక నా కొరకు తమ జీవితమును విడుచుటకు సిద్ధముగానున్న యితర వీరులనేకులు వివిధ శస్త్రాస్త్రములలో సంసిద్ధులైయున్నారు. వారందరుగూడ యుద్ధమునందు అతిచతురులు.

"అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్ ।
పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితమ్॥" 10

భీష్మపితామహునిచేత రక్షింపబడిన మన యీసేన చాలినంతగా లేదు. భీమునిచేత రక్షితమైన పాండవసేన చాలినంతయున్నది.

"అయనేషు చ సర్వేషు యథాభాగమవస్థితాః।
భీష్మమేవాభిరక్షంతు భవంతః సర్వఏవ హి॥ 11

అందుచేత అన్ని సేనాస్థావరములందు, వ్యూహముఖములందున్న ఆయా చోట్లలోనుండు మీరందరు అన్నివిధముల భీష్మపితామహునే రక్షింపవలెను.

"తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః ।
సింహనాదం వినద్యోచ్చైః శంఖం దధ్మౌ ప్రతాపవాన్"॥ 12

అప్పుడు కురువృద్ధుడైన భీష్మపితామహుడు దుర్యోధనుని మనస్సులో సంతోషము కలిగించుచు బిగ్గరగా సింహనాదముచేసి శంఖము ఊదెను.

"తతః శంఖాశ్చ భేర్యశ్చ పణవానక గోముఖాః ।
సహసైవాభ్యహన్యంత సశబ్దస్తుములోఽభవత్॥" 13

తరువాత శంఖములు-నగారాలు - డోలులు- మృదంగములు- కొమ్ములు మొదలైన వాద్యములు ఒక్కసారిగా వాయించబడెను. వాని శబ్దములన్నియు నేకమై కలిసి మహాభయంకరధ్వనిగా వినిపించెను.

"తతః శ్వేతైర్హయైర్యుక్తే మహతి స్యందనే స్థితౌ ।
మాధవః పాండవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః॥ 14

తరువాత తెల్లని గుఱ్ఱములు కట్టబడిన ఉత్తమ రథమునందు కూర్చొని యున్న కృష్ణార్జునులుగూడ తమ దివ్యశంఖములను ఊదిరి.

"పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః ।
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః"॥ 15

శ్రీకృష్ణుడు పాంచజన్యమను పేరుగల శంఖమును, అర్జునుడు దేవదత్త నామక శంఖమును, భయంకర కర్మలుచేయు భీమసేనుడు పౌండ్ర శంఖమును ఊదిరి.

"అనంత విజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః ।
నకులః సహదేవశ్చ సుఘోష-మణిపుష్పకౌ॥" 16

యుధిష్ఠిరుడు అనంత విజయ నామక శంఖమును, నకుల-సహదేవులు సుఘోష-మణిపుష్పకములు అను పేర్లుగల శంఖములను ఊదిరి.

"కాశ్యశ్చ పరమేష్వాసః శిఖండీచ మహారథః ।
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకి శ్చాపరాజితః॥ 17

ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీ పతే ।
సౌభద్రశ్చ మహాబాహుః శంఖాన్ దధ్ముః పృథక్ పృథక్॥ 18

ఉత్తమ ధనుర్ధారియైన కాశిరాజు మహారథికుడైన శిఖండి. ధృష్టద్యుమ్నుడు విరాటరాజు, అజేయుడైన సాత్యకి, ద్రుపద మహారాజు, ద్రౌపదీదేవియొక్క ఐదుగురు పుత్రులు, మహాభుజ బలశాలియైన సుభద్రా పుత్రుడు అభిమన్యుడు- వీరందరుగూడ రాజా! అన్నివైపులనుండి వేరువేరుగా శంఖములను ఊదిరి.

"స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్ ।
నభశ్చ పృథివీం చైవ తుములో వ్యనునాదయన్"॥ 19

రాజా! ఆ భయంకర శబ్దము పృథివి, ఆకాశము - రెండిటినిగూడ ధ్వనింపజేయుచు ధార్తరాష్ట్రులయొక్క అనగా మీవారియొక్క హృదయములను చీల్చెను.

"అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః ।
ప్రవృత్తే శస్త్ర సంపాతే ధనురుద్యమ్య పాండవః॥" 20
హృషీకేశం తదా వాక్యమిద మాహ మహీపతే ।

అర్జున ఉవాచ :

సేన యోరుభయోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత ॥" 21

రాజా! తరువాత కపిధ్వజుడైన అర్జునుడు వ్యూహము పన్ని దృఢముగా నిలిచి ధృతరాష్ట్ర సంబంధులనుచూచి శస్త్రప్రయోగము చేయు ఆ సమయము నందు తన ధనుస్సును పైకెత్తి హృషీకేశుడైన శ్రీకృష్ణభగవానునితో నిట్లనెను.

అర్జునుడిట్లనెను- అచ్యుతా! నా రథమును రెండు సేనల నడుమ నిలుపుము.

"యావదేతాన్ నిరీక్షేఽహం యోద్ధుకామా నవస్థితాన్ ।
కైర్మయా సహ యోద్ధవ్య మస్మిన్ రణ సముద్యమే॥" 22

"యోత్స్యమానా నవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః ।
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేర్యుద్ధే ప్రియ చికీర్షవః ॥" 23

కృష్ణా! యుద్ధముకొరకు రణరంగమునందు దృఢముగా నిలిచియున్న

యీ శత్రుయోధులను చూచి ఈ యుద్ధమునందు ఎవరెవరితో నేను పోరాడ వలసి యున్నదో పరీక్షించెదనుగాక !

దుర్బుద్ధియగు దుర్యోధనునకు యుద్ధమునందు హితముగోరి యేయేరాజులు వచ్చియున్నారో యుద్ధాభిలాషతో వచ్చిన వారందరిని ఒక్కసారి చూచెదను గాక !

**సంజయ ఉవాచ :**

"ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన భారత ।
సేనయో రుభయోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్" ॥ 24
భీష్మద్రోణ ప్రముఖతః సర్వేషాంచ మహీక్షితామ్ ।
ఉవాచ పార్థ! పశ్యైతాన్ సమవేతాన్ కురూనితి॥[1] 25

సంజయుడిట్లనెను - ధృతరాష్ట్రమహారాజా ! అర్జునుడు శ్రీకృష్ణునిట్లు అడుగగానే శ్రీకృష్ణుడు రెండుసేనలమధ్య భీష్మ, ద్రోణుల యెదుట ఇతరరాజు లందరి యెదుటను ఉత్తమమైన ఆ రథమును నిలిపి, "అర్జునా ! యుద్ధమునకై నిలిచియున్న యీ కౌరవసేనలను చూడుము" అని యనెను.

తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్ ।

1. "కౌరవులను చూడుము" అను శబ్దములను ప్రయోగించి కృష్ణభగవానుడు "ఈ సేనలోనున్న వారందరు తరచుగా నీ వంశమునకు చెందినవారు, ఆత్మీయులు నైన స్వజనులు, వీరందరను నీవు బాగుగా చూచికొనుము" అను సంకేతముచేతనే అర్జునుని మనస్సులో దాగియున్న కుటుంబ స్నేహమును ప్రకటించెను. అర్జునుని కారణముగా చేసికొని, లోక కల్యాణము చేయుటకొరకు భగవానుడు స్వయముగానే యీ మాటలద్వారా అర్జునుని మనస్సునందు యుద్ధము చేయుటకు నిరాకరించు భావనను కలిగించెననియు, తత్ఫల స్వరూపముగా సాక్షాత్తు భగవంతుని ముఖార విందమునుండి త్రిలోకపావనమై అనంతకాలముదాక, అనంత జీవులకు పరమ కళ్యాణము కలిగించు గీతామృతధార వెడలెననియు తెలియు చున్నది. అందులకే భగవంతుడు అర్జునునిలో "నీవారిని చూచుకొనుము" అని అతనికి విషాదము కలిగించెను.

ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రాన్ సఖీంస్తథా ॥
శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయోరుభయోరపి ।

రాజా ! తరువాత అర్జునుడు ఆ రెండు సేనలలోనున్న పినతండ్రి-పెద తండ్రులను, తాతలను (పితామహులను) గురువులను, మేనమామలను, సోదరులను, పుత్రులను, పౌత్రులను, (కొడుకుల కొడుకులు- మనుమలు) మిత్రులను, మామలను, ఆప్తులను (మంచి హృదయముగలవారిని) చూచెను.

తాన్ సమీక్ష్య స కౌంతేయః సర్వాన్ బంధూనవస్థితాన్॥ 27
కృపయా పరయాఽఽవిష్టో విషీదన్నిద మబ్రవీత్ ।

రాజా ! రెండు సేనలలో నిలిచియున్న బంధువులనందరను చూచి అర్జునుడు వారియెడల మిక్కిలి దయగలవాడై దుఃఖించుచు నిట్లనెను.

అర్జున ఉవాచ :

దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితమ్ ॥ 28
సీదంతి మమ గాత్రాణి ముఖంచ పరిశుష్యతి।
వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే॥ 29

గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే ।
నచశక్నోమ్యవస్థాతుం భ్రమతీవ చ మేమనః ॥ 30

నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ ।
నచశ్రేయోఽను పశ్యామి హత్వా స్వజన మాహవే॥ 31

అర్జునుడిట్లనెను ;

కృష్ణా ! యుద్ధము చేయగోరుచు రణరంగమునందు నిలిచియున్న యీ స్వజన సముదాయమును చూచి నా అవయవములు శిథిలములగుచున్నవి. నానోరు ఎండిపోవుచున్నది. నా శరీరము వణకుచున్నది. నాకు రోమాంచము కలుగుచున్నది.

కృష్ణా ! నా చేతినుండి గాండీవధనుస్సు జారిపడుచున్నది. నా శరీర చర్మమంతయు తపించుచున్నది. నా మనస్సుగూడ గిరగిర తిరుగుచున్నట్లు తోచుచున్నది. దానిచేత నేను నిలువజాలకున్నాను.

కేశవా! నేను దుర్నిమిత్తములనుగూడ చూచుచున్నాను. యుద్ధమునందు స్వజనమును చంపినందువలన నాకు ఎలాటి శ్రేయస్సుగూడ కలుగునని తోచుట లేదు.

న కాంక్షే విజయం కృష్ణ! న చ రాజ్యం సుఖాని చ।
కిం నో రాజ్యేన గోవింద ! కిం భోగైర్జీవితేన వా ॥ 32

కృష్ణా ! నేను విజయముగాని, రాజ్యముగాని, సుఖములుగాని కోరను. అవి నాకు అక్కరలేదు. గోవిందా ! ఇటువంటి రాజ్యముతో నాకేమి ప్రయోజనము ? లేక ఇట్టి సుఖములతోగాని, జీవనముతోగాని యేమిలాభము ?

యేషా మర్థే కాంక్షితం నో రాజ్యం భోగాః సుఖాని చ ।
త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ॥ 33

ఆచార్యాః పితరః పుత్రా స్తథైవచ పితామహాః।
మాతులాః శ్వశురాః పౌత్రాః స్యాలాః సంబంధినస్తథా॥ 34

కృష్ణా ! ఎవరికొరకు రాజ్యము, సుఖభోగములు మొదలైనవి మనము కోరెదమో వారందరు ధన-జీవితములపైన ఆశ విడిచి యుద్ధమునందు నిలిచియున్నారు. గురుజనులు పెద్ద పినతండ్రులు, పుత్రులు, పితామహులు, మేనమామలు, మామలు, మనుమలు (కొడుకు కొడుకులు) శ్యాలకులు, (భార్య సోదరులు) ఇంకను నితర బంధువులు నిలిచియున్నారు.

ఏతాన్ న హన్తుమిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన।
అపి త్రైలోక్య రాజ్యస్య హేతోః కిం ను మహీకృతే॥ 35

నిహత్య ధార్తరాష్ట్రాన్ నః కా ప్రీతిః స్యాత్ జనార్దన।
పాపమేవాశ్రయే దస్మాన్ హత్వైతా నాతతాయినః॥ 36

వసిష్ఠస్మృతిలో ఆతతాయులు అనగా నెవరో వారి లక్షణము ఈ విధముగా చెప్పబడినది.

అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణిర్ధనాపహః ।
క్షేత్ర-దారావహర్తాచ షడేతే హ్యాతతాయినః॥ (3-19)

1) నిప్పు అంటించువాడు, 2) విషము పెట్టువాడు, 3) చేతిలో శస్త్రము ధరించి సంహరించుటకు పూనుకొనినవాడు, 4) ధనమును అపహరించువాడు, 5) భూమిని అపహరించువాడు 6) భార్యను అపహరించువాడు, ఈ యారుగురు గూడ 'ఆతతాయులు' అనబడెదరు. (ఈ ఆరు పాపములను కౌరవులుచేసి పాండవులను హింసించిరి.)

మనుష్యుడు అధర్మమునుండి తనను రక్షించుకొని ధర్మమును కాపాడి అనుష్ఠించుటకు సమర్థుడగుటకు ఈ యైదు కారణములు చెప్పబడినవి.

1) ఈశ్వరుని యందు భయము 2) శాస్త్రముల ఆవేశము 3) కులము వందలి మర్యాదలు (కట్టుబాట్లు) విచ్ఛిన్నములగునను భయము 4) రాజ్య పరిపాలనకు అనిష్టము కలుగునను భయము 5) శారీరికముగా, ఆర్థికముగాను అనిష్టము కలుగునను ఆశంక.

ఈ ఐదింటిలో ఈశ్వరుడు-శాస్త్రములు- ఈ రెండుగూడ పూర్తిగా సత్యములే అయినను ఆ రెండింటి సత్యత్వము మన శ్రద్ధపైననే సంపూర్ణముగా ఆధారపడియున్నది శ్రద్ధలేనివారికి ఆ రెండింటి సత్యత్వము గోచరించక పోవచ్చును. అంతమాత్రమున ఈశ్వరుడు-శాస్త్రములు ఎన్నటికిని అసత్యములు కాజాలవుగదా! ఈ రెండుగూడ మనకు అప్రత్యక్షములైన కారణములు గాబట్టి వెంటనే నాస్తికులకు వాటిపైన విశ్వాసము కలుగకపోవచ్చును.

రాజ్యశాసనము ప్రధానముగా ప్రజలకొరకే యేర్పరుప చేసుకొని, అధికారము చేతిలో చిక్కించుకొనినవారు శాసనము ప్రజల యుపయోగార్థమని తలచరు.

శారీరికముగా - ఆర్థికముగాను కలుగు అనిష్టముల ఆశంక విశేషముగా వ్యక్తిగతరూపములో ఆయా వ్యక్తులను ఆశ్రయించియుండును.

7)

ఒక్క కులమర్యాద (కట్టుబాటు) మాత్రమే విశిష్టమైన హేతువు. దాని సంబంధము కుటుంబమునకంతటికిని కలిగియుండును. ఏ సంఘములోనో, లేక కులములోనో పరంపరగా అనుసరింపబడుచున్న మంగళకరములు-ఉత్తమములునైన మర్యాదలు నష్టములైపోవునో, ఆ సంఘముగాని, కులముగాని కళ్లెములు లేని మదించిన గుఱ్ఱాలవలె యథేచ్ఛముగా సంచరించును. యథేచ్ఛాచారమనునది ఏలాటి నియమములనుగూడ సహించి, అనుసరించజాలదు. అది మనుష్యుని ఉచ్ఛృంఖలుని (హద్దుమీరినవానిని)గా చేయును. ఏ సమాజములోని మనుష్యులలో గాని, ఏ కులమునందలి మనుష్యులలోగాని యీ ఉచ్ఛృంఖలత్వము అలవడునో ఆ సంఘమునందుగాని, కులమునందుగాని అంతటను పాపము స్వాభావికముగా వ్యాపించును. అవి పాప భూయిష్ఠములగును.

తస్మాన్నార్హా వయం హంతుం ధార్తరాష్ట్రాన్స్వబాంధవాన్।
స్వజనం హి కథం హత్వా సుఖినస్స్యామ మాధవ॥ 37

యద్యప్యేతే న పశ్యంతి లోభోపహత చేతసః।
కులక్షయ కృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్॥ 38

కథం నజ్ఞేయమస్మాభిః పాపాదస్మాన్నివర్తితుమ్।
కులక్షయ కృతం దోషం ప్రపశ్యద్భిర్జనార్దన॥ 39

కులక్షయే ప్రణశ్యంతి కులధర్మాః సనాతనాః।
ధర్మే2 నష్టే కులం కృత్స్నమధర్మోఽభి భవత్యుత॥ 40

మధుసూదనా! నన్ను శత్రువులు చంపినను లేక నాకు త్రిలోకరాజ్యము లభించినను వీరినందరిని నేను సంహరింపను. అది నాకు ఇష్టము లేదు. ఇట్లుండగా కేవలము ఈ భూలోకరాజ్యము కొరకు వీరిని చంపగోరనని వేరుగా చెప్పనవసరము లేదు.

జనార్దనా! ధృతరాష్ట్ర పుత్రులను చంపినందువలన మనకేమి సంతోషము కలుగును? ఈ ఆతతాయులను సంహరించినచో మీదు మిక్కిలి మనకు పాపమే కలుగును.

అందుచేత మాధవా! మన బంధువులేయైన ధృతరాష్ట్ర పుత్రులను మనము

చంపదగము. ఎందుకనగా మన కుటుంబ జనమునే చంపి మనమెట్లు సుఖములో నుండగలము ?

కృష్ణా! ఒకవేళ లోభముచేత భ్రష్టచిత్తులైన వీరు కులనాశమువలన కలిగిన దోషమును, మిత్రులతో విరోధము చేసిన పాపమును గమనించకున్నప్పటికిన్ని జనార్దనా ! కులనాశము వలన కలుగు దోషము నెరిగిన మనము ఈ పాపము చేయక, దానికి దూరముగా తొలగియుండుట మంచిదని తలచవలెను.

కృష్ణా! కులము నశించుటవలన సనాతనములైన కులధర్మములు నశించగలవు. ధర్మము నశించిన తరువాత కులము నందంతటను పాపముగూడ చాల వ్యాపించును.

అధర్మాభిభవాత్ కృష్ణ! ప్రదుష్యన్తి కులస్త్రియః ।
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః॥ 41

కృష్ణా! అధికముగా పాపము పెరిగినందుచేత కులస్త్రీలు మిక్కిలి దూషితలయ్యెదరు. వారు దూషింపబడిన తరువాత వర్ణసాంకర్యము కలుగును.

సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ ।
పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదక క్రియాః ॥ 42

కృష్ణా! వర్ణసాంకర్యమనునది కులహంతకులను, కులమును నరకమునందు పడవేయును. అది తప్పదు. పిండములిచ్చువారు, తర్పణోదకమిచ్చువారు కులమునందు లేనందువలన అట్టి కులఘాతుకుల పితరులుగూడ క్రిందిలోకములందు పడిపోయెదరు.

దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః ।
ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః॥ 43

కృష్ణా! వర్ణసాంకర్యము చేయువారి దోషములవలన కులఘాతుకుల సనాతన కులధర్మములు. జాతిధర్మములు నశించిపోవును.

ఉత్సన్న కులధర్మాణాం మనుష్యాణాం జనార్దన ।
నరకే నియతం వాసో భవతీత్యను శుశ్రుమ ॥ 44

జనార్దనా! ఎవరి కులధర్మములు నశించినవో అట్టివారు చాలాకాలము వరకు నరకమునందు వసించెదరని మేము పరంపరగా వినుచున్నాము.

అహో బత మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్ ।
యద్రాజ్య సుఖలోభేన హన్తుం స్వజన ముద్యతాః॥ 45

హా! మనము బుద్ధిమంతులమైకూడ మహాపాపము చేయుటకు సంసిద్ధులమై యున్నాము. ఆ పాపము రాజ్యలోభముచేత, సుఖాశచేత స్వబంధుజనులను సంహరించుటకొరకు పూనుకొనియుండుట వలన మనకు కలుగనున్నది.

యది మా మప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః ।
ధార్తరాష్ట్రా రణే హన్యుస్తన్మే క్షేమతరం భవేత్ ॥ 46

కృష్ణా! ఒకవేళ నేను శస్త్రములను ధరించక, శత్రువులను ఎదుర్కొనకున్నవాటికిని ధృతరాష్ట్రపుత్రులు శస్త్రములను ధరించి యుద్ధమునందు నన్ను సంహరించిన యెడల అదిగూడ నాకు అత్యంత శ్రేయోదాయకము కాగలదు.

సంజయ ఉవాచ:

ఏవముక్త్వాఽర్జున స్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్ ।
విసృజ్య సశరం చాపం శోక సంవిగ్న మానసః ॥ 47

సంజయుడిట్లనెను :

ధృతరాష్ట్ర మహారాజా! యుద్ధభూమియందు దుఃఖితమైన మనస్సుతో అర్జునుడు ఈ విధముగా చెప్పి, ధనుస్సును, బాణములను విడిచి రథముయొక్క వెనుకవైపు కూర్చుండిపోయెను.

ఇతిశ్రీ మహాభారతే భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతాపర్వణి
శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే అర్జున విషాద యోగోనామ ప్రథమోఽధ్యాయః
భీష్మపర్వణి పంచవింశోఽధ్యాయః.

శ్రీ మహాభారతమునందు భీష్మపర్వాన్తర్గతమైన శ్రీమద్భగవద్గీతా పర్వము నందు శ్రీమద్భగవద్గీతోపనిషత్తులందు బ్రహ్మవిద్యయందు యోగశాస్త్రములో శ్రీకృష్ణార్జున సంవాదమునందు 'అర్జున విషాదయోగము' అనబడు మొదటి అధ్యాయము సమాప్తము.

భీష్మపర్వమునందు ఇరువదియైదవ అధ్యాయము సమాప్తము.



# భగవద్గీత రెండవ అధ్యాయము

(భీష్మపర్వము - 26వ అధ్యాయము)

## సాంఖ్యయోగము :

సంబంధము : మొదటి అధ్యాయమునందు భగవద్గీతోపదేశమునకు ఉపోద్ఘాతరూపములో ఉభయ సేనల యందలి మహారథికుల యొక్కయు, వారి శంఖధ్వనుల యొక్కయు వర్ణనము చేయబడి, అర్జునుని రథమును ఉభయ సేనల మధ్య నిలబెట్టవలసిన విషయము చెప్పబడినది. దాని తరువాత, రెండు సేనలలోనున్న స్వజన సముదాయమును చూచి శోకము- మోహము చెందిన కారణముచేత అర్జునుడు యుద్ధమును మానుకొని, శస్త్రాస్త్రములను విడచి విషాదము చెందుచు రథమునందు కూర్చొనిన విషయము గూడ చెప్పబడి, ఆ యధ్యాయము యొక్క సమాప్తి చేయబడెను. ఇట్టి పరిస్థితిలో శ్రీకృష్ణ భగవానుడు అర్జునునితో నేమనెను ? ఏ విధముగా అర్జునుని యుద్ధ సన్నద్ధుని చేసెను ? అను నీ విషయములన్నియు చెప్పుట అవశ్యకమై యుండుటచేత సంజయుడు అర్జునుని పరిస్థితిని గూర్చి వర్ణించుచు రెండవ అధ్యాయము ఆరంభించెను.

## సంజయ ఉవాచ

"తం తథా కృపయాऽऽవిష్ట మశ్రుపూర్ణాऽకులేక్షణమ్॥
విషీద న్తమిదం వాక్యమువాచ మధుసూదనః॥ 1

సంజయుడిట్లనెను:

"ధృతరాష్ట్ర మహారాజా! ఆ విధముగా దయగలవాడై కన్నీరునిండగా వ్యాకులపడిన కన్నులు కలవాడై, దుఃఖించుచున్న అర్జునుని చూచి శ్రీకృష్ణ భగవానుడు అతనితో నిట్లనెను:

## శ్రీ భగవానువాచ

కుతస్త్వా కశ్మలమిదం విషమే సముపస్థితమ్॥
అనార్య జుష్టమస్వర్గ్య మకీ ర్తికర మర్జున॥ 2

శ్రీ భగవంతుడిట్లనెను:

అర్జునా! నీకీ సమయమునందు ఈ మోహము ఏ కారణముచేత కలిగెను? ఎందుకనగా ఉత్తమ పురుషులెవ్వరు గూడ ఈ విధముగా ఆచరించి యుండ లేదు. ఇట్లు నీవు చేయుటచేత నీకు స్వర్గము కీర్తి - ఈ రెండున్ను లభించక నీవు ఇహపరములకు దూరుడవైతివి.

క్లైబ్యం మాస్మగమః పార్థ! నైతత్ త్వయ్యుపపద్యతే ।
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పర న్తప॥ 3

అర్జునా! ఈ కారణము చేత నపుంసకత్వమును పొంది అశక్తుడవు కాకుము. ఇది నీకు ఉచితము కాదని తలచెదను. శత్రు తాపనా! తుచ్ఛమైన యీ హృదయ దౌర్బల్యమును విడిచి యుద్ధము కొరకు లేచి నిలువబడుము.

## అర్జున ఉవాచ

"కథం భీష్మమహం సంఖ్యే ద్రోణంచ మధుసూదన॥
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హా వరి సూదన॥" 4

అర్జునుడిట్లనెను:

మధుసూదనా! యుద్ధభూమి యందు నేనెట్లు బాణములతో భీష్మ పితామహునకు, ద్రోణాచార్యునకు విరుద్ధముగా పోరాడుదును ? ఎందుకనగా శత్రుసూదనా! వారిద్దరున్ను నాకు పూజనీయులు గదా!

"గురూ నహత్వా హి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్ష్య మపీహ లోకే
హత్వాఽర్థకామాంస్తు గురూ నిహైవ
భుంజీయ భోగాన్ రుధిర ప్రదిగ్ధాన్॥" 5

అందుచేత కృష్ణా! మహానుభావులైన యీ గురుజనులను సంహరింపకుండ నేను ఈ లోకమునందు బిచ్చమెత్తి సంపాదించుకొనిన అన్నమైనను తినుట శ్రేయస్కరమని తలచెదను, ఎందుకనగా గురుజనులను చంపి కూడ ఈ లోకమునందు రక్తముతో తడిసిన అర్థ-కామ రూపములైన భోగములనేకదా అనుభవించెదను ?

సంబంధము:- ఈ విధముగా తన నిర్ణయమును ప్రకటించిన తరువాత గూడ అర్జునునకు సంతోషము కలుగలేదు. తన నిర్ణయమునందు సందేహము కలుగగా మరల నిట్లనెను.

"న చైతద్ విద్మః కతరన్నో గరీయో
యద్ వా జయేమ యది వా నో జయేయుః।
యానేవ హత్వా నజిజీవిషామ
స్తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః॥" 6

కృష్ణా! మా కొరకు మేము యుద్ధము చేయవలయునా? లేదా? అను నీ రెండింటిలో నేది శ్రేష్ఠము ? అని కూడ మేమెరుగము. లేదా వారిని మేము జయించెదమా? లేక వారు మమ్ము జయించెదరా ? అను నీ విషయము గూడ మేమెరుగము, ఇది గాక, ఎవరిని చంపిన తరువాత మేము బ్రతుకుటకు గూడ ఇచ్ఛయించమో అట్టి మాయాత్మీయులైన ధృతరాష్ట్రి పుత్రులే మా కెదురుగా నిప్పుడు యుద్ధమునందు నిలిచియున్నారు.

"కార్పణ్య దోషోపహత స్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మ సమ్మూఢచేతాః
యచ్ఛ్రేయః స్యాన్నిశ్చితం బ్రూహితన్మే
శిష్యస్తేఽహం శాధిమాం త్వాం ప్రపన్నమ్॥" 7

కృష్ణా! కనుక పిరికితనమను దోషము చేత నా స్వభావము నశించి పోయినది. ధర్మము (కర్తవ్యము) విషయమునందు గూడ నా చిత్తమిప్పుడు మోహము చెంది యున్నది. ఇట్టి పరిస్థితిలో నాకిప్పుడు ఏది శ్రేయస్సాధనమో ఆ విషయమును నిశ్చితముగా చెప్పుమని నిన్నడుగుచున్నాను. ఎందుకనగా నేను నీకు శిష్యుడను కాబట్టి నీ శరణుజొచ్చితిని. నేనిప్పుడు చేయవలసిన పని ఉపదేశింపుము.

నహి ప్రపశ్యామి మమాపనుద్యాత్
యచ్ఛోక ముచ్ఛోషణ మింద్రియాణామ్
అవాప్య భూమావసపత్న మృద్ధమ్
రాజ్యం సురాణామపి చాధిపత్యమ్ ॥ 8

ఎందుకనగా ఈ భూమండలమునందు శత్రురహితమైన సర్వసమృద్ధ రాజ్యము, దేవరాజ్యాధిపత్యము పొందినప్పటికిన్ని నా యింద్రియములను శుష్కింపజేయు శోకమును పోగొట్టు ఉపాయమేదియు దానిలో నాకు కనపడదు.

సంజయ ఉవాచ

ఏవముక్త్వా హృషీకేశం గుడాకేశః పరన్తప ।
నయోత్స్య ఇతి గోవిందముక్త్వా తూష్ణీం బభూవ హ ॥ 9

సంజయుడిట్లనెను

రాజా! గుడాకేశుడు (నిద్రను జయించినవాడు) ఐన అర్జునుడు అన్తర్యామియైన శ్రీకృష్ణ భగవానునితో నిట్లు చెప్పి, తరువాత "నేను యుద్ధము చేయను" అని స్పష్టముగా చెప్పి ఊరకుండెను.

తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత
సేనయో రుభయోర్మధ్యే విషీద న్తమిదం వచః ॥ 10

భరతకుల భూషణా! అన్తర్యామి యైన శ్రీకృష్ణ పరమాత్ముడు రెండు సేనల మధ్య దుఃఖించుచు కూర్చొనియున్న అర్జునునితో నవ్వుచు నిట్లనెను.

సంబంధము:

పైన జెప్పబడిన విధముగా అర్జునుడు చింతామగ్నుడై భగవంతుని శరణుజొచ్చి తనకు గలిగిన యీ మహాశోకము పోవుటకు ఉపాయ మడిగెను. ఈ లోకమునందు రాజ్యసుఖము, పరలోకమునందు స్వర్గసుఖము-ఈ రెండు గూడ ఇప్పుడు నాకు కలిగిన యీ శోకను- పోవుటకు ఉపాయములు కాజాలవు' అని అర్జునుడడిగినప్పుడు, భగవంతుడు తాను జేయబోవు ఉపదేశమునకు అర్జునుడు అధికారి అని తలచి, యతనికి కలిగిన శోక మోహములను ఎల్లప్పటికిన్ని పోగొట్టు ఉద్దేశముతో తొలుత యుద్ధము కర్తవ్యము' అని నిరూపించుచు సాంఖ్యయోగ నిష్ఠనుగూర్చి యిట్లు వర్ణించెను :-

శ్రీ భగవానువాచ :

అశోచ్యానన్వ శోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే।
గతాసూనగతా సూంశ్చ నాను శోచన్తి పండితాః ॥ 11

శ్రీ భగవంతుడిట్లనెను :-

అర్జునా! నీవు శోకింపదగని మనుష్యులకొరకు శోకించుచున్నావు. పండితుల మాటలవంటి మాటలు మాట్లాడుచున్నావు. కాని ఎవరి ప్రాణములు ఇదివరకే పోయినవో వారికొరకు, ఎవరి ప్రాణములు పోవలేదో, వారికొరకుగూడా పండితులు శోకించరు.

సంబంధము :-

తొలుత భగవంతుడు, ఆత్మనిత్యమని, నిర్వికారమనియు ప్రతిపాదించి, ఆత్మదృష్ట్యా వారికొరకు, శోకించుట అనుచితమని నిరూపించుచున్నాడు :-

నత్వేవాహం జాతునాऽసం నత్వం నేమే జనాధిపాః
నచైవ న భవిష్యామః సర్వే వయమతః పరమ్ 12

అర్జునా ! నేనేకాలమునందుగూడ ఉండలేదు అనరాదు. అట్లే నీవుగూడ ఉండలేదు అనిగాని ఈ రాజులుగూడ లేకుండిరి. అని, ఇకపైగూడ భవిష్యత్తులో మనమందరము ఉండబోము అనిగాని భావించుట తప్పు.

దేహినోఽస్మిన్ యథాదేహే కౌమారం యౌవనం జరా ।
తథా దేహాన్తర ప్రాప్తిర్ధీరస్తత్ర న ముహ్యతి॥ 13

అర్జునా! జీవాత్మయొక్క యీ దేహమునందు బాల్యము- యౌవనము- వార్ధక్యము వచ్చినట్లే జీవాత్మకు ఇతర శరీరప్రాప్తి గూడ కలుగును. ఈ విషయములో ధీరపురుషుడు (పండితుడు- ఆత్మజ్ఞానసంపన్నుడు) మోహము చెందడు. అనగా బాల్య యౌవన, వార్ధక్యావస్థలు స్థూలశరీరమునకు కలుగు వికారములు. అవి అజ్ఞానముచేత ఆత్మయందెట్లు తోచుచున్నవో అట్లే ఒక శరీరమునుండి మరి యొక శరీరమునకు సూక్ష్మరూపముతో పోవు జీవునియొక్క మార్పుగూడ అజ్ఞానముచేతనే ఆత్మయందు భాసించుచున్నది. కాబట్టి తత్త్వమును తెలిసిన ధీరపురుషుడు మరణమునుగూర్చి మోహము చెందడు.

మాత్రా స్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణ సుఖదుఃఖదాః ।
ఆగమాపాయినోఽనిత్యా స్తాంస్తితిక్షస్వ భారత ॥ 14

కుంతీపుత్రా! చలి, వేడి, సుఖము, దుఃఖము మొదలైన ద్వంద్వములను కలిగించునది, ఇంద్రియములయొక్కయు, వాని నాకర్షించు ప్రపంచ విషయముల యొక్కయు సంయోగమని తెలిసికొనుము. ఆ సంయోగము పుట్టుచు నశించు చుండును. అది అనిత్యము కాబట్టి అర్జునా ! దానిని నీవు సహించుకొని యుండుము.

యం హి న వ్యథయన్త్యేతే పురుషం పురుషర్షభ ।
సమ దుఃఖ సుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే ॥ 15

ఎందుకనగా అర్జునా ! సుఖదుఃఖములను సమానముగా చూచు ధీరపురుషుని ఈ విషయేంద్రియ సంయోగము వ్యాకులపరచజాలదు. అట్టివాడు మోక్షము పొందుటకు యోగ్యుడగును.

సంబంధము :-

పన్నెండవ, పదమూడవ శ్లోకములందు భగవంతుడు ఆత్మ నిత్యమనియు నిర్వికారమనియు ప్రతిపాదించి, పదునాల్గవ శ్లోకమునందు ఇంద్రియములతో విషయములకు గల సంయోగములు అనిత్యములని చెప్పెను. కాని 'ఆత్మ ఎందుకు నిత్యము ? విషయేంద్రియ సంయోగమెందుకు అనిత్యము ?' అను విషయము స్పష్టముగా చెప్పలేదు. కాబట్టియే యీ శ్లోకమునందు భగవంతుడు నిత్యానిత్య వస్తువుల భేదములను గూర్చిన వివేచన రీతిని చెప్పుటకు నిత్యానిత్యముల లక్షణమును చెప్పుచున్నాడు.

నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః ।
ఉభయోరపి దృష్టోఽన్త స్త్వనయో స్తత్త్వదర్శిభిః ॥[1] 16

అర్జునా ! అసత్య వస్తువుయొక్క సత్త (ఉనికి) ఉండదు. సత్యవస్తువునకు అభావము ఉండదు. ఈ విధముగా ఈ రెండింటి తత్త్వమును తత్త్వజ్ఞాన సంపన్నులైన మనుష్యులు చూచినారు.

అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్ ।
వినాశమవ్యయస్యాస్య న కశ్చిత్ కర్తుమర్హతి ॥ 17

అర్జునా ! ఈ సమస్త ప్రపంచము అనగా మనకు కనపడునది. అంతటను వ్యాపించియున్న పరమాత్మ వస్తువు నాశరహితమని తెలిసికొనుము. ఇటువంటి అవినాశి వస్తువును నశింపజేయుటకు ఏదియు సమర్థముగాదు.

---

1. తత్త్వమును తెలిసికొను మహాపురుషులు 'అసత్' మరియు 'సత్' ఈ రెండింటి వివేచనముచేసి, ఏ వస్తువునకు మార్పు, నాశము కలుగునో, ఏ వస్తువు సర్వదా ఉండదో అది 'అసత్' వస్తువు, అనగా అసద్వస్తువుయొక్క అస్తిత్వమే ఉండదు- అని నిశ్చయించుకొనవలెను. ఏ వస్తువునకు మార్పు నాశము ఎట్టి పరిస్థితిలోగూడ, ఎట్టి కారణముచేతకూడ కలుగవో ఏది సర్వదా అస్తిత్వము గలదైయుండునో అది 'సత్' వస్తువు. అనగా సద్వస్తువునకు ఎప్పుడుగూడ అభావము ఉండనే ఉండదు- తత్త్వదర్శనము చేయు పురుషులు ఆ రెంటి తత్త్వమును చూడవలెను.

అంతవంత ఇమే దేహాః నిత్యస్యోక్తాః శరీరిణః[1] ।
అనాశినో౽ప్రమేయస్య తస్మాద్ యుధ్యస్వ భారత॥ 18

'ధనంజయా! నాశరహితము, అప్రమేయము (అనంతము) నిత్య స్వరూపమునైన జీవాత్మయొక్క ఈ శరీరములన్నియు నాశవంతములని చెప్పబడినవి. కాబట్టి, నీవు యుద్ధము చేయుము.

సంబంధము :-

అర్జునుడు, నేను వీరిని చంపుటకు ఇచ్ఛయింపను. ఒకవేళ, వారు నన్ను చంపినను అట్టి మరణము నాకు మిక్కిలి క్షేమము కాగలదు అని యనియుండెను ఆ మాటకు నమాధానము చెప్పుటకు ఈ తరువాతి శ్లోకమునందు "ఆత్మ మరణించునని" గాని, దానిని చంపెదను అనికాని, అనువాడు అజ్ఞానియని భగవంతుడు చెప్పుచున్నాడు :-

య ఏనం వేత్తి హన్తారం యశ్చైనం మన్యతే హతమ్ ।
ఉభౌ తౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే॥ 19

'అర్జునా! ఈ ఆత్మను చంపువాడనని తలచువాడుగాని, ఈ ఆత్మ చచ్చె'

---

1. పూర్వ శ్లోకమునందు ఏసత్ తత్త్వము, సర్వప్రపంచమునందు వ్యాపించియున్నదని చెప్పబడెనో దానిని 'శరీరి' యని చెప్పి, దానిసంబంధము శరీరములతోగలదని చెప్పి, ఆత్మ-పరమాత్మల యైక్యము ప్రతిపాదింపబడెను. ఇందలి అభిప్రాయమేమనగా వ్యావహారిక దృష్టిలో భిన్న భిన్న శరీరములతో సంబంధము గలిగియుండుటచేత ఆత్మలుగూడ భిన్న భిన్నములుగా తోచును. వాస్తవముగా అవి భిన్నములుగావు. అన్నియు ఒకదే చేతనతత్త్వము. ఎట్లనగా నిద్రపోయినప్పుడు స్వప్నసృష్టిలో ఒక పురుషుడు దప్ప, ఇతర వస్తువేదియు నుండదు. స్వప్నమునందు కనపడు అనేకత్వము నిద్రవలన పుట్టినది. మేల్కొనిన తరువాత పురుషుడొకడే ఉండును. ఆ విధముగానే యిక్కడగూడా కనపడు అనేకత్వము. అజ్ఞానమువలవ జనించినది. జ్ఞానోదయమైన తరువాత అనేకత్వము ఉండదని తెలిసికొనవలెను.

నని తలచువాడుగాని, యేయిద్దరికిగూడ ఏమియు తెలియదు. ఎందుకనగా, ఈ ఆత్మ వాస్తవముగా, ఎవరినిగూడా చంపదు. ఎవరిచేతగూడా చంపబడదు.

న జాయతే మ్రియతే వా కదాచిత్
నాయం భూత్వా భవితా వా న భూయః ।
అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే॥ 20

అర్జునా ! ఈ యాత్మ ఏకాలమునందుగూడ పుట్టదు చావదు. ఇది పుట్టి మరల పుట్టబోవునదిగూడ కాదు. ఎందుకనగా ఈ ఆత్మ జన్మరహితము, నిత్యము సనాతనము (అతిపురాతనము) అనాది. శరీరమును నశింపజేసినను అందలి ఆత్మ చంపబడదు.[1]

వేదావినాశినం నిత్యం య ఏనమజమవ్యయమ్ ।
కథం స పురుషః పార్థ! కం ఘాతయతి హంతి కమ్ ॥ 21

పార్థా ! ఏ పురుషుడు, ఈ యాత్మ నాశరహితము- నిత్యము-జన్మరహితము- అవ్యయము అని తెలిసికొనునో, ఆ పురుషుడు ఎట్లు ఎవనిని చంపించును ? ఎట్లు ఎవనిని చంపును ?

---

1. ఈ శ్లోకమునందు ఆరు వికారముల అభావము ఇట్లు చూపబడినది. ఆత్మను 'అజుడు' (జన్మరహితుడు అని చెప్పి దానియందు ఉత్పత్తి రూప వికారాభావము చెప్పబడెను. "అయం భూత్వా భూయః న భవితా" అనగా 'ఆత్మజనించి, పిదప ఉనికి గలవాడు కాడు. అతడు సహజముగానే సత్యుడు' అని చెప్పి, అస్తిత్వమను వికారాభావము, 'పురాణః' (చిర కాలమునుండి సర్వదా ఏకవిధముగా నుండువాడు.) అని చెప్పి వృద్ధి రూప వికారాభావము, 'శాశ్వతః' (ఎల్లప్పుడు ఏకరూపములో నుండు వాడు) అని చెప్పి పరిణామ మార్పు) వికారాభావము నిత్యః (అఖండమైన అస్తిత్వము గలవాడు) అని చెప్పి 'క్షయ' (తరుగు) అను వికారాభావము. శరీరే హన్యమానే న హన్యతే శరీర నాశముచేత ఆత్మనష్టము కాదు) అని చెప్పి వినాశరూప వికారాభావము చెప్పబడెను.

సంబంధము :-

ఒక శరీర సంబంధము త్రెంచుకొని, దానినుండి విడిపోయి, యితర శరీర సంబంధము గలిగించుకొను ఆత్మకు, ఆ రెండవ శరీరమునందు అత్యంత కష్టము కలుగును. అట్టి ఆత్మకొరకు దుఃఖించుట అనుచితమెట్లగును ? అను శంక గలుగును. దానికి సమాధానముగా భగవంతుడిట్లనుచున్నాడు :-

వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి ।
తథా శరీరాణి విహాయ జీర్ణా-
న్యన్యాని సంయాతి నవాని దేహీ ॥ 22

అర్జునా ! మనుష్యుడు పాతవస్త్రమును విడిచి వేరు క్రొత్తబట్టలు ధరించినట్లే, జీవాత్మ పాత శరీరమును విడిచి, వేరు రెండవ శరీరమును పొందగలడు.[1]

సంబంధము :-

ఆత్మస్వరూపము ఎంత కష్టపడినను తెలిసికొనబడనిది గనుక మరల మూడు శ్లోకములచేత వేరు రీతిగా ఆత్మకు నిత్యత్వము- నిరాకారత్వము- నిర్వికారత్వము ప్రతిపాదించుచు ఆత్మవినాశమును పొందునను శంకచేత శోకించుట అనుచితమని భగవంతుడు ధ్రువపరచుచున్నాడు :-

---

1. వాస్తవముగా ఆత్మ అచలము- క్రియారహితము నయినందువలన, ఎట్టి పరిస్థితులలోగూడ ఆత్మకు గమనాగమనములు (రాకపోకలు) ఉండవు. ఐనను ఒకకుండను ఒక యింటినుండి మరియొక యింటికి తీసికొనిపోవుచున్నప్పుడు. ఆ ఘటములోని ఆకాశము (ఖాళీస్థలము) అనగా ఘటాకాశమునకుగూడా ఘటసంబంధముతో గమనాగమనములున్నట్లు తోచును ఆ విధముగానే సూక్ష్మశరీరమునకు గమనాగమన క్రియలు ఉండుటచేత తత్సంబంధమువలన ఆత్మకుగూడ గమనాగమనములున్నట్లు తోచును. కాబట్టి యేలోకులకు తెలియుటకుగాను, ఆత్మయందు గమనాగమనములు ఔపచారికముగా (ఒకదానియందలి ధర్మము మరియొకదానియందు ఆరోపించబడుటకు ఉపచారము అని పేరు) కల్పింపబడెను.

నైనం ఛిందన్తి శస్త్రాణి నైనం దహతి పావకః ।
నచైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః ॥ 23

అర్జునా ! యీ ఆత్మను శస్త్రము ఖండింపజాలదు; అగ్ని దహింపజాలదు జలము తడుపజాలదు; వాయువుగూడ శుష్కింపజేయజాలదు.

అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవచ।
నిత్యః సర్వగతః స్థాణుః అచలోఽయం సనాతనః॥ 24

ఎందుకనగా అర్జునా ! ఈ యాత్మ అచ్ఛేద్యము (ఛేదింపబడుటకు వీలు కానిది); అదాహ్యము (దహింపబడుటకు అలవికానిది); అక్లేద్యము (తడుపబడుటకు సాధ్యముకానిది); అశోష్యము (శుష్కింపజేయబడుటకుగూడ అసాధ్యమైనది); ఈ యాత్మ నిత్యము; సర్వత్ర వ్యాపించునది: అచంచలమైనది; స్థిరమైనది; సనాతనము (అనాదికాలము నుండి యున్నది) అయినది. ఇందులో సందేహము లేదు.

అవ్యక్తోఽయ మచింత్యోఽయ మవికార్యోఽయ ముచ్యతే ।
తస్మాదేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి ॥ 25

అర్జునా! ఈ యాత్మ అవ్యక్తము; (కనపడనిది) అచింత్యము; (ఊహింపబడజాలనిది) వికారరహితమైనది అని చెప్పబడుచున్నది. కాబట్టి అర్జునా ! ఈ యాత్మను పైన చెప్పబడిన విధముగా తెలిసికొని నీవు శోకింపదగవు. (శోకించుట నీకు ఉచితముకాదు అని భావము.)

---

1. ఆత్మ 'అవికార్యము' అని చెప్పి, అవ్యక్త ప్రకృతికంటె ఆత్మవిలక్షణమైనదని ప్రతిపాదింపబడెను. దాని అభిప్రాయమేమనగా అన్ని ఇంద్రియములు, మనస్సు ప్రకృతికి కార్యస్వరూపములు. అవి తమ జన్మమునకు కారణమైన ప్రకృతినిగూర్చి తెలిసికొనజాలవు. కాబట్టి ప్రకృతి అవ్యక్తము అచింత్యముగూడ. కాని ప్రకృతి వికారరహితముకాదు. దానియందు వికారము (మార్పు) కలుగును. ఆత్మయందు ఎప్పుడుగూడ, ఏ విధమైన పరిస్థితిలోను వికారము కలుగదు. కాబట్టి ప్రకృతికంటె ఆత్మ అత్యంత విలక్షణ (భిన్న) మైనది.

సంబంధము :-

పై మూడు శ్లోకములలో భగవంతుడు ఆత్మ జనన రహితము, అవినాశి కాబట్టి ఆత్మకొరకు దుఃఖించుట అనుచితమని నిరూపించి, ఇప్పుడు రెండు శ్లోకములచేత ఆత్మకు ఔపచారికముగా జననమరణములను అంగీకరించినప్పటికిన్ని దానికొరకు శోకించుటగూడ అనుచితమని నిరూపించుచున్నాడు.

అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్।
తథాపి త్వం మహాబాహో! నైనం శోచితు మర్హసి ॥ 26

కాని అర్జునా ! ఒకవేళ నీవు ఈ యాత్మ సర్వదా జనన, మరణములు గలదని అంగీకరించినప్పటికిన్ని నీవిట్లు శోకించుటకు యోగ్యుడవు కావు.

జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్యచ ।
తస్మాద పరిహార్యేఽర్థే నత్వం శోచితు మర్హసి॥ 27

ఎందుకనగా అర్జునా ! జననముననుసరించి మరణము నిశ్చితమనియు, మరణించినవారు జన్మించుటగూడ ధ్రువమనియు నిర్ణీతమైన విషయము. వానిని తప్పించుకొనుటకు సాధ్యముగాదు. అట్లు తప్పించుకొనుటకు ఏలాటి యుపాయము లేని విషయమునందు నీవు శోకింపదగవు. అది వ్యర్థము.

సంబంధము :-

ఇప్పుడు తరువాతి శ్లోకమునందు ప్రాణుల శరీరముల పరిస్థితినిబట్టికూడ శోకించవలసిన ఆవశ్యకత లేదు అని భగవంతుడనుచున్నాడు.

---

భగవంతుడిట్లు చెప్పుట ఏ యజ్ఞానులు 'ఆత్మ సర్వదా నిత్యముఃగా పుట్టుచు చచ్చుచునుండు' ననెదరో అట్టివారికొరకని తెలియవలెను భగవంతుని యభిప్రాయము ప్రకారము మరణధర్మముగల ప్రాణులు జన్మించుట నిశ్చితమేయగును. ఆ యభిప్రాయము మేరకు ఎవరికిగూడ ముక్తి లభించదు. ఏ వాస్తవిక సిద్ధాంతములో ముక్తి అంగీకరింపబడినదో ఆ సిద్ధాంతమునందు ఆత్మకు జననమరణములు అంగీకరింపబడలేదు జన్మించుట మరణించుట మొదలగు భావములన్నియు అజ్ఞానమువలన గలిగినవే యగును.

అవ్యక్తా దీని భూతాని వ్యక్తమధ్యాని భారత ।
అవ్యక్త నిధనాన్యేవ తత్రకా పరిదేవనా॥[1] 28

అర్జునా ! సమస్త ప్రాణులు జన్మించుటకు పూర్వము అవ్యక్తములు (అప్రకటితములు)గా నుండెను. మరణించిన పిదపగూడా అవ్యక్తములుగానే యుండగలవు. కేవలము జన్మ-మృత్యువుల మధ్య కాలమునందే ప్రాణులు వ్యక్తములు (కనపడునవి)గా నుండును. గాబట్టి యిట్టి పరిస్థితిలో ఎందుకు శోకింపవలెను?

సంబంధము :-

ఆత్మతత్త్వము ఏ మాత్రము తెలియబడనిది కాబట్టి దానిని వివరించి చెప్పుటకు భగవంతుడు పూర్వశ్లోకములద్వారా వేరువేరు విధములుగా దాని స్వరూపమును వర్ణించెను. ఇప్పుడు ఈ తరువాతి శ్లోకమునందు ఆ యాత్మతత్త్వ దర్శనము—వర్ణనము-శ్రవణము 'అలౌకికము దుర్లభము'నని నిరూపించుచున్నారు.

ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేనమ్
ఆశ్చర్యవద్వదతి తథైవ చాన్యః ।
ఆశ్చర్య వచ్చైనమన్యః శృణోతి
శ్రుత్వాఽప్యేనం వేద నచైవ కశ్చిత్ ॥ 29

అర్జునా ! ఎవడో యొక మహాపురుషుడు మాత్రమే ఈ యాత్మను ఆశ్చర్యమువలె చూచును.[1] అట్లే ఎవడో మరియొక మహాపురుషుడు మాత్రమే ఈ యాత్మతత్త్వమును ఆశ్చర్యమువలె వర్ణించును.[2] అట్లే మరియొకడెవడో ఆత్మతత్త్వమునుగూర్చి శ్రవణము చేయగల అధికారము గలవాడు మాత్రమే ఆత్మను ఆశ్చర్యమువలె వినగలడు. కొంతకొంతమంది ఆత్మనుగూర్చి వినికూడ తెలిసికొనజాలరు.[3]

---

1. ఎట్లైతే మనుష్యుడు లోకమునందు కనపడు వస్తువులను మనస్సు ఇంద్రియములు-బుద్ధి-వీనిచేత చూచునో అట్లు ఆత్మదర్శనము చేయజాలడు; ఆత్మను చూచుట అద్భుతము- అలౌకికమునగును. చేతనము మాత్రమే

దేహీ నిత్య మవధ్యోఽయం దేహే సర్వస్య భారత ।
తస్మాత్ సర్వాణి భూతాని నత్వం శోచితు మర్హసి ॥ 30

అర్జునా ! ఈ యాత్మ అందరి శరీరములలో అవధ్యము (వధింపబడజాలనిది)గా నుండును. కాబట్టి ప్రాణులందరికొరకు, వారు చచ్చిరని నీవు శోకింపకుము. అది నీకు తగదు.

---

యైన ఆత్మకంటే భిన్నమైనది యేదిగూడ ఆత్మను చూడలేదు. ఆత్మ స్వయముగా తానే తనను చూడగలుగును. ఆ చూచుటలో చూచువాడు-చూడబడు వస్తువు- చూచుటయను నీ త్రిపుటి (మూడింటి సముదాయము) ఉండదు. అన్నియు నాత్మయే అందుచేత ఆ దర్శనము ఆశ్చర్యము వంటిది.

2. ఆత్మతత్త్వమును వివరించి చెప్పు ఉదాహరణము లెన్నియైనను వానిలో ఏ యొక్క ఉదాహరణముగూడ ఆత్మతత్త్వమును సంపూర్ణముగా వివరించి చెప్పునది కాదు. ఆత్మతత్త్వముయొక్క యేదియోయొక అంశము మాత్రమే ఆ యుదాహరణముచేత తెలుపబడును. ఎందుకనగా ఆత్మకు సదృశమైన వస్తువు మరియొకటి యేదియు లేదు. ఇట్లుండగా ఏ యుదాహరణముగూడ ఆత్మకు పూర్తిగా సరిపడునది యెట్లగును ? అయినను అనేకములైన ఆశ్చర్యకర సంకేతములచేత మహాపురుషుడు ఆత్మను చూచును. ఇదియే ఆత్మదర్శనాదులు ఆశ్చర్యము వంటివి అని వర్ణనము చేయు విషయము. వాస్తవములో ఆత్మ వాక్కుచేత వర్ణింపబడుటకు సాధ్యముకానిదగుట చేత స్పష్టశబ్దములలో వాక్కుచేత ఆత్మవర్ణనము సాధ్యముకాదు.

3. ఎవని యంతఃకరణమునందు పరిపూర్ణముగా శ్రద్ధ, ఆస్తిక భావము ఉండవో ఎవని బుద్ధి పరిశుద్ధము, సూక్ష్మముకాదో అట్టి మనుష్యుడు ఈ యాత్మతత్త్వమునుగూర్చి వినినప్పటికిన్ని అతనికి సంశయము విపరీతాభిప్రాయము ఉండుటచేత ఆత్మతత్త్వముయొక్క స్వరూపమును యథార్థముగా ఉన్నదున్నట్లు తెలిసికొనజాలడు. అందుచేతనే ఈ ఆత్మ తత్త్వమును తెలిసికొనుట అనధికారి (తెలిసికొనదగిన అధికారము లేనివాడు)కి దుర్లభము.

సంబంధము :-

ఇంతదాక భగవంతుడు సాంఖ్యయోగము ననుసరించి అనేక యుక్తుల ద్వారా నిత్యము, శుద్ధము, సమము, నిర్వికారము, అకర్తయునైన ఆత్మయొక్క నిత్యత్వము, ఏకత్వము, అవినాశిత్వము— ఈ మొదలైన విషయములను ప్రతిపాదించి, శరీరములు నశించు స్వభావము గలవి యనియు చెప్పి, ఆత్మకు శరీరములకుగాని, శరీరములకు ఆత్మకుగాని వియోగము (వేరుపడుట)ను గూర్చి శోకించుట అనుచితమని సిద్ధపరచెను. దానితోపాటే సందర్భవశాత్తు ఆత్మకు జనన మరణములు గలవని అంగీకరించినప్పటికిన్ని దానినిగూర్చి శోకించుట అనుచితమనికూడ నిరూపించి, యుద్ధముచేయుము అని అర్జునుని ఆజ్ఞాపించెను. ఇకపైన ఏడు శ్లోకములద్వారా క్షాత్రధర్మము ననుసరించిగూడ నీవు శోకించుట అనుచితమని నిరూపించుచు, యుద్ధము చేయుటకు అర్జునుని ప్రోత్సహించుచున్నాడు.

స్వధర్మమపి చావేక్ష్య నవికంపితు మర్హసి ।
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య నవిద్యతే॥ 31

అర్జునా ! నీ క్షత్రియధర్మమును చూచియైనను నీవు భయపడగూడదు. ఎందుకనగా క్షత్రియ ధర్మమునకు యుక్తమైనది యుద్ధము. దానికంటె మించినది క్షత్రియునకు మరియొకటి శ్రేయస్కరమైన కర్తవ్యము లేదు, కనుక నీవు భయపడదగవు.

యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతమ్।
సుఖినః క్షత్రియాః పార్థ! లభన్తే యుద్ధ మీదృశమ్ ॥ 32

పార్థ ! యదృచ్ఛగా (తనంతట తానుగా) ప్రాప్తించిన స్వర్గద్వార రూపమైన యిటువంటి యుద్ధమును భాగ్యవంతులైన క్షత్రియులు మాత్రమే పొందెదరు.

అథ చేత్ త్వమిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి ।
తతః స్వధర్మం కీర్తించ హిత్వాపాప మవాప్స్యసి ॥ 33

కాని అర్జునా ! ఒకవేళ నీవీ ధర్మయుక్తమైన యుద్ధము చేయని యెడల

స్వధర్మమును కీర్తిని పోగొట్టుకొని వానికి దూరమై పాపము నొడిగట్టుకొనెదవు సుమా !

అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తేఽవ్యయామ్ ।
సంభావితస్య చాకీర్తిర్మరణాదతిరిచ్యతే ॥ 34

అర్జునా! అందరుగూడ చాలాకాలం వరకు నీ అపకీర్తిని చెప్పుకొను చుండెదరు. మాననీయుడైన పురుషునకు అపకీర్తి మరణముకంటె మించినదగును.

భయాత్ రణాదుపరతం మంస్యన్తే త్వాం మహారథాః ।
యేషాం చ త్వం బహుమతో భూత్వాయాస్యసి లాఘవమ్ ॥ 35

"పార్థా! ఎవరి దృష్టిలో నీవు మొదటి నుండి మిక్కిలి సమ్మానితుడవుగా భావింపబడుచు గౌరవింపబడు చుంటివో యిప్పుడు వారే నిన్ను చులకనగా చూచెదరు. ఆ మహారథికులు నీవు భయపడి యుద్ధము విడిచి పోయినావు అని తలచెదరు.

అవాచ్య వాదాంశ్చ బహూన్ వదిష్యన్తి తవాహితాః।
నిన్దన్తస్తవ సామర్థ్యం తతో దుఃఖతరంనుకిమ్ ? ॥

ధనంజయా! నీ శత్రువులు నీ సామర్థ్యమును నిందించుచు నిన్ను అనరాని మాట లనెదరు. అంతకంటె అధికదుఃఖము నీకు మరియొకటి యేమి యుండును ?

హతోవా ప్రాప్స్యసి స్వర్గం జిత్వావా భోక్ష్యసే మహీమ్ ।
తస్మాదుత్తిష్ఠ కౌన్తేయ యుద్ధాయ కృతనిశ్చయః ॥ 37

కౌంతేయా! నీవు యుద్ధమునందు చచ్చి స్వర్గమైనను పొందెదవు, లేదా యుద్ధమునందు గెలిచి భూమండల రాజ్యమునైనను ఏలగలవు (అనుభవించ గలవు) అందుచేత నీవు యుద్ధము చేయుటకు నిశ్చయించుకొని నిలువుము.

సంబంధము :

పై శ్లోకము నందు భగవంతుడు యుద్ధఫలము రాజ్యసుఖము లేదా

స్వర్గప్రాప్తి యని చెప్పెను. కాని అర్జునుడు "ఈ లోక రాజ్యమనగా నెంత? నేనైతే త్రిలోకరాజ్యము కొరకు గూడ నా కులమును నశింపజేయగోరను" అని మొదటనే చెప్పి యుండెను. కాబట్టి ఎవనికి రాజ్యసుఖము, స్వర్గేచ్ఛ-రెండు గూడ లేవో వాడు ఏ భావముతో యుద్ధము చేయవలెను? అను విషయము ఈ తరువాతి శ్లోకమునందు భగవంతుడు చెప్పుచున్నాడు.

సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ ।
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి ॥ 38

అర్జునా! జయాపజయములు లాభాలాభములు సుఖదుఃఖములు సమానములని తెలిసికొనిన తరువాత యుద్ధమునకు సన్నద్ధుడవుకమ్ము. ఈ విధముగా నీవు యుద్ధము చేసిన యెడల నీకు పాపము అంటదు.

సంబంధము :

ఇంతవరకు భగవంతుడు సాంఖ్యయోగ సిద్ధాంతములచేత, క్షాత్ర ధర్మ దృష్టి చేతను యుద్ధము చేయుటయందలి ఔచిత్యమును నిరూపించి, అర్జునునకు సమత్వ పూర్వకముగా యుద్ధము చేయుమని ఆజ్ఞాపించెను. ఇప్పుడు కర్మయోగ సిద్ధాంతము చేత యుద్ధము చేయుటయందలి ఔచిత్యమును గూర్చి చెప్పుటకుగాను కర్మయోగమును గూర్చి వర్ణించుటకు ఉపోద్ఘాతము చేయుచున్నాడు.

ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు ।
బుద్ధ్యాయుక్తో యయాపార్థ! కర్మబంధం ప్రహాస్యసి ॥[1] 39

పార్థా! ఇంతవరకు నీకు చెప్పబడిన యీ బుద్ధి జ్ఞానయోగ విషయమైనది. ఇక ఇప్పుడు నీకు కర్మయోగ బుద్ధిని గూర్చి చెప్పెదను వినుము.

I ఈ కర్మయోగ బుద్ధిని పొందిన తరువాత నీవు కర్మబంధనమును

---

1. ఈ శ్లోకమునందు "బుద్ధి" యను శబ్దమునకు "ఏషా" అని "ఇమాం" అని రెండు విశేషణములు చేర్చబడెను. దీనిచేత ఈ యధ్యాయములోని 38వ శ్లోకమునందు చెప్పబడిన సమత్వబుద్ధి సాంఖ్య యోగము ననుసరించి 11వ శ్లోకము నుండి 30వ శ్లోకము వరకు చెప్పబడినదైనది దానినే యిప్పుడు కర్మయోగము ననుసరించి చెప్పుటకు భగవంతుడు ఆరంభించుచున్నాడు.

పూర్తిగా విడిచెదవు. అనగా కర్మల బంధమును పరిపూర్ణముగా నశింపజేసికొన గలవని భావము.

సంబంధము :

ఈ విధముగా కర్మయోగ వర్ణనమును గూర్చిన ఉపోద్ఘాతము చేసి, ఇప్పుడు భగవంతుడు దాని రహస్యపూర్ణమైన మహత్త్వమును గూర్చి చెప్పుచున్నాడు.

నేహాభిక్రమ నాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే।
స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ ॥[1] 40

అర్జునా! ఈ కర్మయోగమునందు ఆరంభమునకు - అనగా బీజమునకు నాశము లేదు. దీనికి ఫలరూపమైన దోషము గూడ లేదు. మీదు మిక్కిలి ఈ కర్మయోగ రూప ధర్మము ఏ కొంచెము అనుష్ఠించినను దీని సాధనము పురుషుని జనన మరణరూప మహా భయమునుండి రక్షించగలదు.

సంబంధము :

ఈ విధముగా కర్మయోగము యొక్క మహత్త్వమును గూర్చి చెప్పి యిప్పుడు భగవంతుడు కర్మయోగమును ఆచరించు విధినిగూర్చి చెప్పుట కొరకు తొలుత ఆ కర్మయోగమునందు మిక్కిలి ఆవశ్యకమైనది, కర్మయోగి యొక్క

---

1 ఎక్కడ కామనా యుక్తమైన కర్మ ఉండునో అక్కడే మంచి, చెడు ఫలములు కలుగవచ్చునని సంభావింపబడును. ఇందులో కామన యనునది లేనే లేదు. కాబట్టి ఇందులో ప్రత్యవాయము - అనగా విపరీత ఫలము గూడ ఉండదు అను భావము చూపబడినది.

ఇందలి భావమేమనగా నిష్కామ భావమునకు ఫలము సంసారము నుండి ఉద్ధరింప బడుటయే! కాబట్టియే కామన తన పరిణామ ఫలమును సిద్ధింప జేయక నష్టము కాదు. దానికి మరియొక ఫలమేదైనగాని కలుగజాలదు. చివరకు సాధకుని పూర్తిగా నిష్కామునిని చేసి, అతని ఉద్ధారము చేసియే తీరును.

నిశ్చయాత్మకము స్థిరమునైన సమబుద్ధిని గూర్చి, కర్మయోగమునకు బాధకము లైన కామనాసహిత మనుష్యుల వేర్వేరు బుద్ధులను గూర్చియు చెప్పుచున్నాడు.

వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన ।
బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోఽ వ్యవసాయినామ్ ॥ 41

అర్జునా! ఈ కర్మయోగమునందు నిశ్చయాత్మకమైన బుద్ధి యొకటే యుండును. కాని చంచలముగా యోచించుచు, స్థిరచిత్తములేని వివేకహీనులు కామనా సహితులునైన మనుష్యుల బుద్ధులు అనేక బేదములు గలిగి అనంతములుగా నుండును. ఇది నిశ్చయము.

సంబంధము :

ఇప్పుడు తరువాతి మూడు శ్లోకములలో సకామ భావము విడువదగినది యని చెప్పుటకుగాను సకామ మనుష్యుల స్వభావములు వారి సిద్ధాంతములు ఆచార వ్యవహారములు భగవంతుడు వర్ణించుచున్నాడు.

యామిమాం పుష్పితాం వాచం ప్రవదన్త్య విపశ్చితః ।
వేదవాదరతాః పార్థ! నాన్యదస్తీతి వాదినః ॥ 42

కామాఽత్మానః స్వర్గపరా జన్మకర్మఫల ప్రదామ్ ।
క్రియా విశేష బహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి ॥ 43

భోగైశ్వర్య ప్రసక్తానాం తయాఽపహృత చేతసామ్ ।
వ్యవసాయాఽత్మికా బుద్ధిః సమాధౌన విధీయతే ॥ 44

అర్జునా! ఎవరు సుఖ భోగములలో తన్మయులైయున్నారో, ఎవరు కర్మ ఫలములను ప్రశంసించు వేద వాక్యములయందు ప్రీతి కలిగియున్నారో, ఎవరికి స్వర్గమే ముఖ్యముగా పొందదగిన పరమప్రాప్యవస్తువో, ఎవరు స్వర్గమును మించిన మరియొక వస్తువేది గూడ లేదని భావించుచున్నారో అటువంటి అవివేకులు ఇట్టి పుష్పిత వాక్కును- అనగా పైకి వినుటకు మాత్రము శోభాకరముగా నుండు వాక్కును చెప్పుచుందురు. ఆ వాక్కు జన్మమనెడు కర్మ ఫలమును ఇచ్చునటువంటిది భోగములు ఐశ్వర్యములు పొందుటకొరకు నానా విధములైన అనేక క్రియలను వర్ణించునదియునై యుండును. అట్టి వాక్కుచేత ఎవరి మనస్సు హరింపబడునో, ఎవరు భోగైశ్వర్యములలో మిక్కిలి ఆసక్తులై

యున్నారో అటువంటి పురుషులకు పరమాత్మని యందు నిశ్చయాత్మకమైన బుద్ధి ఉండదు.

త్రైగుణ్య విషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున ।
నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్ ॥[1] 45

అర్జునా! వేదములు పైన జెప్పబడిన విధముగా మూడు గుణములకు కార్యరూపములైన భోగములను, భోగసాధనములను ప్రతిపాదించునవి. అందుచేత నీవు ఆ భోగములందు వాని సాధనములయందున్న అనక్తి విడిచి, హర్ష శోకాది ద్వంద్వములు లేకుండ శాశ్వత వస్తువైన పరమాత్మయందు స్థితుడవై యోగ క్షేమములను కోరకుండ, అంతఃకరణమును వశమునందుంచుకొని యుండుము.

యావానర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే ।
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః ॥[2] 46

అర్జునా! అంతట నిండి పరిపూర్ణముగానున్న జలాశయము లభించిన తరువాత చిన్న జలాశయమునందు మనుష్యునకు ఎంత ప్రయోజనము ఉండునో పరబ్రహ్మమును తత్త్వపూర్వకముగా తెలిసికొను బ్రాహ్మణునకు వేదములన్నింటి యందున్న అంతటి ప్రయోజనమే ఉండును.

---

1. లభించని వస్తువు లభించుట యోగమనబడును. లభించిన వస్తువుయొక్క రక్షణము క్షేమమనబడును. సాంసారిక వస్తువులందు కోరిక విడిచిన తరువాతగూడ శరీర నిర్వాహము కొరకు మనుష్యునకు యోగక్షేమములందు వాసన ఉండును. కాబట్టి ఆ వాసననుగూడ పూర్తిగా విడిపించుటకుగాను ఇక్కడ అర్జునునకు "నిర్యోగక్షేముడవు కమ్ము" అని భగవంతుడు చెప్పెను.

2. ఈ దృష్టాంతముయొక్క అభిప్రాయమేమనగా ఏ మనుష్యునకు అమృతమువలె రుచికరము, గుణసంపన్నము, అగాధము, అనంతము నైన దియునైన జలమునిండిన జలాశయము లభించునో ఆ మనుష్యునకు చిన్న చిన్న వాపీ, కూప, తటాకాది జలాశయముల జలమువలన ఏలాటి ప్రయో

సంబంధము :-

ఈ విధముగా భగవంతుడు సమబుద్ధిరూపమైన కర్మయోగము యొక్క, తత్ఫలముయొక్కయు మహత్త్వమునుగూర్చి చెప్పి, ఇప్పుడు రెండు శ్లోకములలో కర్మయోగము యొక్క స్వరూపమును చెప్పుచు, అర్జునునకు కర్మయోగము నందు నిలిచియుండి కర్మచేయుటకు ఉపదేశించుచున్నాడు.

కర్మణ్యే వాధికారస్తే మాఫలేషు కదాచన ।
మాకర్మ ఫలహేతుర్భూః మాతే సంగోఽస్త్వ కర్మణి ॥ 47

అర్జునా! నీకు కర్మ చేయుటయందే అధికారము కలదు.[1] వాని ఫలము

---

జనము ఉండదో అట్లే సముద్రరూపమైన పరిపూర్ణ పరబ్రహ్మ-పరమాత్మ ప్రాప్తి కలిగినవానికి ఆనందప్రాప్తికై వేదోక్త కర్మలతో వాని ఫల స్వరూపములైన సుఖభోగములలో ఏమాత్రము ప్రయోజనము ఉండదు. అతడు పూర్ణకాముడుగా, నిత్యతృప్తుడుగాను సర్వదా అగును.

1. ఎట్లైతే ప్రభుత్వము ప్రజలకు వారి ఆత్మరక్షణముకొరకు, ప్రజారక్షణము కొరకు వారివద్ద వివిధ శస్త్రాస్త్రములను ఉంచి, వానిని ప్రయోగించుటకు వారికి అధికారమిచ్చి, దానితోపాటే ఆయుధములను ప్రయోగించుటకు విధి నియమములనుగూడ ఆ ప్రజలకు చూపించినపుడు ఆయుధములు పొందినవారు ఒకవేళ ఆ యధికారమును దుర్వినియోగము చేసినయెడల వారికి ప్రభుత్వము దండనము విధించి, వారి అధికారమునుగూడ లాగు కొనునో ఆ విధముగానే జీవునకు జననమరణ బంధనములనుండి విముక్తు డగుటకు ఇతరులకు హితము, ఉపకారము చేయుటకున్ను అతనికి మనస్సు బుద్ధి, ఇంద్రియములు- వీనితోపాటుగా మనుష్య శరీరమును ఇచ్చి, దీని చేత క్రొత్త క్రొత్త కర్మలు చేయుటకు అధికారము ఇవ్వబడినది. కాబట్టి ఎవడు ఈ యధికారమును సదుపయోగపరచునో అట్టివాడు కర్మబంధన ములనుండి విముక్తుడై పరమపదమును (మోక్షమును) పొందును. ఎవడు దురుపయోగపరచునో వాడు దండనమును అనుభవించును. అతనినుండి ఆ యధికారముగూడ లాగుకొనబడును. అనగా అతడు మరల పందిగానో, కుక్కగానో జన్మించుటకు ఆయా యోనులయందు త్రోయబడును. ఈ రహస్యము నెరిగిన మనుష్యుడు అధికార సద్వినియోగము చేయవలెను.

లందు ఎప్పుడుగూడ లేదు.[1] అందుచేత నీవు కర్మ ఫలములకు కారణము కాకుము.[2] నీవు కర్మచేయకుండుట యందుగూడ ఆసక్తిగలిగి యుండకుము.

యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ ।
సిద్ధ్యసిద్ధ్యోః సమోభూత్వా సమత్వం యోగ ఉచ్యతే ॥ 48

ధనంజయా! నీవు ఆసక్తిని విడిచి, సిద్ధి, అసిద్ధి- ఈ రెంటియందు సమాన బుద్ధిగలవాడవై, యోగమునందు స్థిరముగా నిలిచి కర్తవ్యకర్మలు చేయుము.[3] సమత్వమే యోగమనిపించుకొనును.

---

1. మనుష్యుడు కర్మఫలము పొందుటకు ఎప్పుడుగూడ ఏ విధముగగూడ స్వతంత్రుడు కాడు. అతనికి 'ఏ కర్మకు ఏ ఫలము లభించును ? ఆ ఫల మతనికి ఏజన్మలో ఏవిధముగా ప్రాప్తించును ?' అను విషయము సూచనగాగూడ ఉండదు. అతడు సకాలమునందు తన యిచ్ఛానుసారముగా దానిని పొందజాలడు. లేక ఆ కర్మఫలము నుండి తప్పించుకొనుటకు గూడ శక్తుడుకాడు. మనుష్యుడు కోరునది ఒకటైతే లభించునది మరి యొకటి యగును

2. మనస్సు, బుద్ధి, ఇంద్రియములు- వీనిచేత చేయబడిన శాస్త్ర విహిత కర్మలందు, వాని ఫలములందు మమకారము, ఆసక్తి, వాసన, ఆశ, స్పృహ, కామన- ఇవి యుంచుటయే కర్మఫలమునకు మనుష్యుడు కారణమగుట యగును. ఎందుకనగా ఏ మనుష్యుడు పైవిధముగా కర్మల యందు, వాని ఫలములందు ఆసక్తుడై యుండునో అతనికే ఆ కర్మఫలములు లభించును.

3. యోగమునందు ఉండి కర్మచేయుమని చెప్పి భగవంతుడు "కేవలము సిద్ధియందు, అసిద్ధియందు సమభావము కలిగియుండుట చేత మాత్రము ఉపయోగములేదు. మరి ప్రతియొక్క కర్మను చేయు సమయమందుగూడ నీవు ఏ పదార్థమునందుగాని, కర్మమునందుగాని, కర్మఫలమునందుగాని ఏ ప్రాణియందుగాని విషమభావము లేకుండ సమభావము సర్వదా ఉంచి యుండవలెను." అని చెప్పెను.

సంబంధము :-

ఈ విధముగా భగవంతుడు కర్మయోగప్రక్రియనుగూర్చి చెప్పి, యిప్పుడు సకామ భావమును నిందించుచు, సమభావము రూపమైన బుద్ధియోగముయొక్క మహత్త్వమును ప్రకటించుచు, అట్టి సమత్వబుద్ధిని ఆశ్రయింపుమని అర్జునుని ఆజ్ఞాపించుచున్నాడు.

> దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాత్[1] ధనంజయ ।
> బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః ॥ 49

అర్జునా! ఈ సమత్వరూపమైన బుద్ధియోగముకంటే సకామకర్మ మిక్కిలి హీనశ్రేణికి చెందినది. అందుచేత నీవు సమబుద్ధిలోనే రక్షణమునకు ఉపాయము వెతకికొనుము. అనగా బుద్ధియోగమునే ఆశ్రయింపుము. ఎందుకనగా ఫలమునకు హేతువులగు కర్మలు కృపణములు (హీనములు-దీనములు).

> బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృత దుష్కృతే ।
> తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్॥ 50

అర్జునా ! సమబుద్ధిగల పురుషుడు పుణ్యపాపములను- రెంటినిగూడ ఈ

---

1. ఏ కర్మయోగమునందు ఆసక్తి-కామనలను విడిచి, సమబుద్ధి పూర్వకమైన కర్తవ్యకర్మ అనుష్ఠింపబడునో ఆ కర్మయోగమును తెలుపుటకు ఇక్కడ 'బుద్ధియోగాత్' అను పదము గలదు, ఎందుకనగా ముప్పది తొమ్మిదవ శ్లోకమునందు 'యోగేత్విమాంశ్రుణు' అనగా 'ఇప్పుడు నీవు నానుండి యోగమునందు ఈ బుద్ధిని వినుము' అని చెప్పి భగవంతుడు కర్మయోగమును వర్ణించుటకు ఆరంభించెను. ఇంతయేకాక యీ శ్లోకమునందు ఫలము కోరువాడు కృపణుడని చెప్పబడెను. తరువాతి శ్లోకమునందు బుద్ధియుక్త పురుషుని ప్రశంసించి అర్జునుడు కర్మయోగమును ఆశ్రయించుటకు ఆజ్ఞాపింపబడెను. బుద్ధియుక్తుడైన మనుష్యుడు కర్మఫలమును విడిచి అనామయ పదమును (పరమపదమును) పొందగలడు. (గీత-2.51) ఈ కారణముచేతగూడ ఇక్కడ 'బుద్ధియోగాత్' అను పదమునకు అర్థము కర్మయోగమే యగును.

లోకమునందే విడచును. అనగా వానినుండి విముక్తుడగును.[1] దీనిచేత నీవు సమత్వ రూపమైన యోగమునందు నిమగ్నుడవగుము. ఈ సమత్వరూప యోగమే కర్మ లందు కుశలత్వము. అనగా కర్మబంధనమునుండి విముక్తి పొందుటకు ఉపాయము సుమా !

కర్మజం బుద్ధియుక్తాహి ఫలం త్యక్త్వా మనీషిణః ।
జన్మబంధ వినిర్ముక్తాః పదం గచ్ఛంత్యనామయమ్॥[2] 51

ఎందుకనగా అర్జునా ! సమబుద్ధిగల జ్ఞానులు కర్మఫలత్యాగము చేసి, జన్మబంధనమునుండి విముక్తులై నిర్వికారమైన పరమపదమును పొందగలరు.

సంబంధము :-

భగవంతుడు కర్మయోగమును ఆచరించుటద్వారా అనామయమైన పరమ పదప్రాప్తి చూపించెను. దీనిపైన అర్జునునకు 'నాకు పరమపదప్రాప్తి ఎప్పుడు, ఎట్లు కలుగును ?' అను జిజ్ఞాస కలుగవచ్చునని భగవంతుడు రెండు శ్లోకములలో సమాధానము చెప్పుచున్నాడు.

---

1. జన్మ జన్మాంతరములందు, ఈ జన్మమునందుగూడ చేయబడిన యెన్ని పుణ్యకర్మములు- పాపకర్మములు సంస్కార రూపములో అంతఃకరణము నందు సంచితములైయుండునో ఆ కర్మములన్నిటిని సమబుద్ధిగల కర్మ యోగి యీ లోకమునందే విడిచిపెట్టగలడు. అనగా ఈ జన్మమునందే అతడు ఆ సమస్త కర్మములనుండి విముక్తుడగును. అతనికి ఆ కర్మము లతో ఏలాటి సంబంధముగూడ ఉండదు. కాబట్టి అతని కర్మము పునర్జన్మ రూపమైన ఫలమును అతనికి ఈయజాలదు.

2. ఏ పరమపదమునందు రాగద్వేషాది క్లేశములు, శుభాశుభకర్మలు, హర్ష శోకాది వికారములు, సమస్త దోషములు పూర్తిగా ఉండవో, ఏ పరమ పదము ప్రకృతికి, ప్రకృతికార్యములకు పూర్తిగా అతీతమో, ఏపదము పూర్తిగా భగవంతునితో విభిన్నమో, ఏది భగవంతుని పరమధామమో, ఎక్కడికి చేరిన పిదప మనుష్యులు తిరిగిరారో ఆ పరమధామమునకు, పరమ పదమునకు 'అనామయపదము' అని పేరు.

యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి ।
తదా గంతాఽసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్యచ ॥ 52

అర్జునా! ఎప్పుడైతే నీ బుద్ధిమోహమనెడు అజ్ఞానమును పూర్తిగా దాట గలుగునో అప్పుడు నీవు వినిన, నీకు వినిపింపబడిన ఈ లోకమునకు, పరలోక మునకున్ను సంబంధించిన అన్ని సుఖభోగములను దాటి వైరాగ్యమును పొంద గలవు.[1]

శ్రుతి విప్రతి పన్నా తే[2] యదా స్థాస్యతి నిశ్చలా ।
సమాధావచలా బుద్ధిస్తదా యోగ మవాప్స్యసి ॥ 53

వివిధ వచనములను వినుటచేత చలించిన నీ బుద్ధి పరమాత్మయందు నిశ్చ లముగా నిలిచి, ఎప్పుడు స్థిరముగా నుండునో అప్పుడు నీవు యోగమును పొంద గలవు. అనగా నీకు పరమాత్మతో నిత్యసంబంధము-సంయోగము కలుగగలదు.

---

1. ఈ లోకమునందు, పరలోకములందు నున్న యే భోగైశ్వర్యాదులు నేటి దాక చూచి, విని, అనుభవింపబడెనో వాని పేరు 'శ్రుతము' అనబడును. భవిష్యత్తులో చూడబడు, వినబడు, అనుభవింపబడు భోగైశ్వర్యములు 'శ్రోతవ్యములు' అనబడును. అవియన్నియు దుఃఖహేతువులు, అనిత్య ములు అని తెలిసికొని పూర్తిగా వానియందు ఆసక్తి లేకుండుటయే ఆ భోగైశ్వర్యములనుండి వైరాగ్యము పొందుటయగును. అట్టి అనాసక్తికే వైరాగ్యమని పేరు.

2. ఈ లోకమునందలి పరలోకములందలి భోగైశ్వర్యములకు, వాని ప్రాప్తి కిన్ని ఆవశ్యకములైన సాధనములకు సంబంధించి అనేక విధములైన మాటలు వినుటచేత బుద్ధిలో విక్షేపము (చంచలత్వము) కలుగును. కాబట్టి ఆ బుద్ధి ఒక నిశ్చయమునందు స్థిరముగా నిలువజాలదు. ఇప్పుడే ఆ బుద్ధి ఒక విషయము మంచిదని తెలిసికొని కొంతకాలము తరువాతనే మరియొక విషయము మంచిదని అంగీకరింపసాగును. ఇటువంటి విక్షిప్తము, అనిశ్చ యాత్మకమునైన బుద్ధి యిక్కడ 'శ్రుతి విప్రతిపన్నా' అను శబ్దముచేత చెప్పబడెను. ఇది బుద్ధియొక్క విక్షేపదోషమని భావించవలెను

సంబంధము :-

పూర్వశ్లోకమునందు భగవంతుడు అర్జునునితో "అర్జునా ! ఎప్పుడు నీబుద్ధి పరమాత్మయందు నిశ్చలముగా నిలిచియుండునో అప్పుడు పరమాత్మను పొంద గలవు" అని చెప్పెను. దానిపైన అర్జునుడు పరమాత్మను పొందిన స్థితప్రజ్ఞుడైన సిద్ధయోగియొక్క లక్షణము, అతని ఆచరణము తెలుసుకొను నిచ్ఛతో భగ వంతుని ఇట్లడుగుచున్నాడు.

అర్జున ఉవాచ :

స్థిత ప్రజ్ఞస్య కాభాషా సమాధిస్థస్య కేశవ ! ।
స్థితధీః కిం ప్రభాషేత కి మాసీత వ్రజేత కిమ్ ॥ 54

అర్జునుడిట్లనెను :

కేశవా ! సమాధిలో ఉండి పరమాత్మను పొందిన స్థిరబుద్ధిగల పురుషుని లక్షణమేమి ? ఆ స్థిరబుద్ధి పురుషుడు ఎట్లు మాట్లాడును ? ఎట్లు నడచును ?

సంబంధము :-

పూర్వ శ్లోకమునందు అర్జునుడు పరమాత్మను పొందిన సిద్ధయోగినిగూర్చి నాలుగు ప్రశ్నలు అడిగెను. ఈ నాలుగింటికిన్ని భగవంతుడు ఈ యధ్యా యాంతము వరకు ఉత్తరములు చెప్పెను. మధ్యన ఇతర విషయములనుగూర్చి గూడ ప్రసంగవశాత్తు చెప్పెను. ఈ తరువాతి శ్లోకమునందు భగవంతుడు అర్జు నుని మొదటి ప్రశ్నమునకు ఉత్తరము సంక్షేపముగా చెప్పుచున్నాడు.

శ్రీ భగవానువాచ :

ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ! మనోగతాన్ ।
ఆత్మన్యేవాఽత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే ॥ 55

భగవంతుడిట్లు చెప్పెను :-

అర్జునా! యేకాలమునందు ఈ పురుషుడు మనస్సునందలి కామనలన్నియు పూర్తిగా విడుచునో, ఆత్మచేత ఆత్మలోనే సంతుష్టుడయి యుండునో ఆ కాలము నందు అతడు స్థితప్రజ్ఞుడని చెప్పబడును.

**సంబంధము :**

ఇప్పుడు రెండు శ్లోకములలో 'స్థితప్రజ్ఞుడెట్లు మాట్లాడును?' అను రెండవ ప్రశ్నమునకు భగవంతుడు ఉత్తరము చెప్పుచున్నాడు.

దుఃఖేష్వనుద్విగ్న మనాః సుఖేషు విగత స్పృహః ।[1]
వీతరాగ భయక్రోధః స్థితధీర్మని రుచ్యతే ॥ 56

అర్జునా! దుఃఖములు కలిగినప్పుడు ఎవని మనస్సునందు ఉద్వేగము కలుగదో, సుఖములు కలిగినప్పుడు ఎవడు సంపూర్ణముగా నిస్పృహుడై యుండునో, ఎవనికి రాగము, భయము, క్రోధము నష్టములై యుండునో[2] అటువంటి ముని స్థిరబుద్ధి గలవాడనిపించుకొనును.

---

1. శరీరము, స్త్రీ, పుత్రులు, ధనము, మానము, ప్రతిష్ఠ మొదలైన అనుకూల వస్తువులు లభించినపుడు, అవి ప్రతికూలములైనప్పుడు రాగ, ద్వేషముల వలన కలిగిన యే సూక్ష్మకామన గలదో, దేని స్వరూపము స్పష్టముగా ప్రకటితము కాదో అది 'వాసన' యనబడును. ఏదైన అనుకూలవస్తువు లభించినప్పుడు మనస్సునందు 'ఈ వస్తువు అవశ్యకమైనది, ఇది లేకుండ పని సాగదు' అను అపేక్షారూప కామన 'స్పృహ' యనబడును. ఈ స్పృహ వాసనకన్నా కామనయొక్క వికసితమైన స్వరూపము. అనుకూల వస్తువు లేనప్పుడు, అది లభించినప్పటి కామన, ప్రతికూల వస్తువు నశించినప్పుడుగాని, అది తనకు చేరనప్పుడుగాని కలుగు కామన ప్రకటితమైనప్పుడు అది 'ఇచ్ఛ' యనబడును. ఈ ఇచ్ఛ యనునది కామనయొక్క పరిపూర్ణ వికసిత స్వరూపము. స్త్రీ, పుత్రులు, ధనము మొదలైనవి యథేష్టముగా లభించినప్పటికిన్ని అవి ఇంకను అధికముగా వృద్ధిచెందవలెనను ఇచ్ఛ 'తృష్ణ' యనబడును. ఈ తృష్ణ యనునది కామనయొక్క అతి స్థూలరూపము ఈ యన్నింటిని విడుచుటయే కామనలనన్నింటిని పూర్తిగా విడుచుట యగును.

2. దీనిచేత స్థిరబుద్ధిగల యోగియొక్క అంతఃకరణము, వాక్కునందు ఆసక్తి భయక్రోధములు-దీని అభావము చెప్పబడెను. ఏ పరిస్థితిలోను, ఎట్టి సంఘటనము చేతగూడ అతని మనస్సునందు ఏ విధమైన ఆసక్తి ఉత్ప

యః సర్వత్రానభిస్నేహః తత్తత్ ప్రాప్య శుభాశుభమ్।
నాభి నందతి నద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 57

అర్జునా! ఏ పురుషుడు అన్ని వస్తువులయందు స్నేహము విడిచి, ఆయా శుభాశుభ వస్తువులుపొంది ప్రసన్నుడు కాకుండ, ద్వేషించకుండ[1] నుండునో అతని బుద్ధి స్థిరమని తెలిసికొనుము.

సంబంధము :

ఇప్పుడు భగవంతుడు 'అతడు (స్థితప్రజ్ఞుడు) ఎట్లు కూర్చొనును ?' అను అర్జునుని మూడవ ప్రశ్నమునకు ఉత్తరము చెప్పుచున్నాడు.

యదా సంహరతే చాయం కూర్మోంగా నీవ సర్వశః।
ఇంద్రియాణీంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 58

---

న్నముకాదు. ఏవిధమైన భయము కొంచెముగూడ కలుగదు. క్రోధము గూడ రాదు. కాబట్టి అతని వాక్కుగూడ అసక్తి, భయ, క్రోధరహితమై శాంతముగా, సరళముగాను నుండును అని దీని యభిప్రాయము.

1. దీనిచేత తెలుపబడిన భావమేమనగా పైన చెప్పబడిన శుభాశుభ వస్తువులలో ఏదైన శుభవస్తువు- అనగా అనుకూల వస్తువు లభించినప్పుడు స్థిర బుద్ధిగల యోగి యంతఃకరణమునందు కొంచెముగూడ హర్ష వికాసము కలుగదు. (గీత-5-20) కాబట్టి ఆ యోగి వాక్కుగూడ హర్షవికాసము పూర్తిగా లేకయుండును. అతడు ఏ యనుకూల వస్తువునుగాని, ప్రాణినిగాని సంతోషపూర్వకముగా స్తుతించదు. ఇట్లే స్థిరబుద్ధియైన యోగికి మిక్కిలి ప్రతికూలమైన వస్తువుతో సంబంధము కలిగినప్పుడుగూడ అతని యంతఃకరణమునందు కొంచెముగూడ ద్వేషభావము కలుగదు. అతని యంతఃకరణము ప్రతియొకవస్తువు ప్రాప్తించినప్పుడు సమముగా, శాంతముగా నిర్వికారముగాను నుండును. (గీత-5-20) అందుచేత స్థిరబుద్ధిగల యోగి ఏ ప్రతికూల వస్తువునుగాని, ప్రాణినిగాని ద్వేషముతో నిందించదు.

తాబేలు తన అంగములను అన్నివైపులనుండి ముడుచుకొనునట్లే ఎప్పుడీ పురుషుడు ఇంద్రియములకు ఆకర్షకములైన విషయములనుండి యింద్రియములను అన్నివిధముల ఉపసంహరించుకొని దూరముగా నుంచునో అప్పుడు అతని బుద్ధి స్థిరమైనదని యెరుగవలెను.

సంబంధము :

పూర్వ శ్లోకమునందు మూడవ ప్రశ్నమునకు ఉత్తరము చెప్పుచు, స్థితప్రజ్ఞుడు కూర్చొను విధమునుగూర్చి చెప్పి ఇప్పుడు భగవంతుడు దానిలో కలుగబోవు శంకలకు సమాధానములు చెప్పుటకుగాను వేరువిధముగా చేయబడు ఇంద్రియ నిగ్రహముకన్న స్థితప్రజ్ఞుని ఇంద్రియ నిగ్రహము భిన్నమని తెలుపుచున్నాడు.

విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః ।
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే[1] ॥ ౫౯

అర్జునా! ఇంద్రియములచేత విషయములను గ్రహించని పురుషుని నుండి కూడ కేవలము విషయములు మాత్రమే నివృత్తములైతే అగునేమో కాని వానియందున్న ఆసక్తి మాత్రము విడిపోవదు. ఈ స్థిత ప్రజ్ఞుడైన పురుషునకైతే పరమాత్మ సాక్షాత్కారమైన తరువాత ఆసక్తి గూడ నివృత్తమగును.

సంబంధము :

ఆసక్తినాశము ఇంద్రియనిగ్రహము ఈ రెండున్ను కాకుండుటచేత ఏమి

---

1. పరమాత్ముడెటువంటి అద్భుత, అలౌకిక, దివ్య ఆకర్షక వస్తువనగా ఆయనను పొందిన తరువాత పురుషుడు ఆయన యందు అత్యంతము విలీనుడై, ముగ్ధుడై, తన్మయుడగును. అప్పుడు పురుషుడు తన అస్తిత్వమునంతయు తొలగించుకొని నామ రూపములు లేకుండపోవును. అటువంటి సమయములో ఏదైన ఇతర వస్తువు యొక్క చింతనమును ఎవడు చేయును ? అందుచేత పరమాత్మ సాక్షాత్కారము కలిగిన తరువాత ఇతర వస్తువులందు పరిపూర్ణముగా ఆసక్తి తొలగిపోవునను విషయము చెప్పబడెను.

హాని కలుగును? అను ప్రశ్నయు కలుగవచ్చునని దానికి భగవంతుడిప్పుడు సమాధానము చెప్పుచున్నాడు.

యతతో హ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః ।
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః ॥ 60

అర్జునా! ఆసక్తి నశించుటచేత మనస్సును మథించు ఈ ఇంద్రియములు ప్రయత్నము చేయుచు బుద్ధిమంతుని మనస్సును గూడ బలాత్కారము చేసి హరించును.

తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః ।
వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 61

అందుచేత అర్జునా! సాధకుడు ఇంద్రియములనన్నింటిని వశమునందుంచుకొని సమాహిత (శాంత) మనస్సు కలిగి, నాయందే ఆసక్తిగలవాడై (తత్పరుడై) ధ్యానమునందు నిష్ఠతో కూర్చొనవలెను. ఎందుకనగా ఇంద్రియములు వశమునందుంచుకొనిన పురుషుని బుద్ధి స్థిరముగా నుండగలదు.

సంబంధము :

పైన చెప్పబడిన విధముగా మనస్సుతో గూడిన ఇంద్రియములను వశమునందు ఉంచుకొనజాలకుండుటచేత భగవంతునియందు మనస్సు ఆసక్తము (తత్పరము) కాకుండుట చేతను కలుగు హాని యేమి? యను నీ విషయము ఇప్పుడు రెండు శ్లోకములలో చెప్పబడుచున్నది.

ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే ।
సంగాత్ సంజాయతే కామః కామాత్ క్రోధోఽభిజాయతే ॥

అర్జునా! విషయములనే సర్వదా చింతనము చేయు పురుషునకు విషయములందే ఆసక్తి కలుగును. ఆసక్తిచేత విషయములయందు కామన ఉత్పన్నమగును. ఆ కామనలో విఘ్నములు కలుగుటచేత క్రోధము ఉత్పన్నమగును.

క్రోధాత్ భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతివిభ్రమః ।
స్మృతిభ్రంశాత్ బుద్ధినాశో బుద్ధినాశాత్ ప్రణశ్యతి ॥ 63

అర్జునా! క్రోధముచేత మిక్కిలి మూఢభావము ఉత్పన్నమగును. మూఢభావము చేత స్మరణశక్తిలో భ్రమము కలుగును. స్మృతి విభ్రమము కలుగుట చేత బుద్ధి- అనగా జ్ఞానశక్తి నశించును. బుద్ధినాశము చేత ఈ పురుషుడు తన ఉనికి నుండి పడిపోవును.

సంబంధము :

ఈ విధముగా మనస్సును, ఇంద్రియములను వశమునందుంచుకొనజాలని మనుష్యుని పతన క్రమమునుగూర్చి చెప్పి భగవంతుడు ఇప్పుడు స్థిత ప్రజ్ఞుడైన యోగి ఎట్లు నడచును ? అను నాలుగవ ప్రశ్నమునకు ఉత్తరము చెప్పుటకు ఆరంభించుచు, మొదట రెండు శ్లోకములలో ఎవని మనసు, ఇంద్రియములు వశమునందు ఉండునో అట్టి సాధకుడు విషయములయందు సంచరించు విధమును దాని ఫలమును గూర్చి చెప్పుచున్నాడు.

రాగద్వేష వియుక్తైస్తు విషయా నింద్రియైశ్చరన్ ।
ఆత్మవశ్యైర్విధేయాఽఽత్మా ప్రసాదమధి గచ్ఛతి[1] ॥ 64

కాని అర్జునా! తన వశమునందు అంతఃకరణమును ఉంచుకొనిన సాధకుడు తన అధీనమునందుంచుకొనిన రాగద్వేష రహితములైన ఇంద్రియముల

1. ఏబది తొమ్మిదవ శ్లోకమునందైతేనో రాగద్వేషములు బొత్తిగా లేవని చూపించి, భగవంతుడు ఇక్కడ రాగద్వేష రహితములైన యింద్రియములద్వారా విషయానుభవమును గూర్చి చెప్పి, రాగ ద్వేషములు పూర్తిగా లేకుండుటకు సాధనము చెప్పెను. మూడవ అధ్యాయమునందు నలువదియవ శ్లోకములో ఇంద్రియములు, మనస్సు, బుద్ధి - ఈ మూడే కామమునకు అధిష్ఠానమని చెప్పెను దీనిచేత నిరూపింపబడునదేమనగా ఇంద్రియములందు రాగ, ద్వేషములు లేకుండినప్పటికిన్ని మనస్సునందు గాని, బుద్ధియందుగాని సూక్ష్మరూపముతో రాగ ద్వేషములు ఉండును. కాని ఏబది తొమ్మిదవ శ్లోకమునందు 'అస్య' అను పదమును ప్రయోగించి, స్థిరబుద్ధి గల పురుషునియందు రాగ ద్వేషముల యొక్క సంపూర్ణాభావమును చెప్పెను, అక్కడ కేవలము ఇంద్రియములందు మాత్రమే రాగ ద్వేషముల అభావము కాదు.

ద్వారా విషయములందు సంచరించుచు [1] అంతఃకరణము యొక్క ప్రసన్నత్వ మును [2] పొందగలడు.

ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే ।
ప్రసన్న చేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే ॥ 65

---

1. బాహ్య విషయములను విడుచుట గూడ భగవత్ప్రాప్తికి సహాయక మైనప్పటికిన్ని ఎంతవరకు ఇంద్రియ నిగ్రహము, రాగద్వేష త్యాగము ఉండవో అంతవరకు కేవలము బాహ్యవిషయ త్యాగము చేత విషయ ముల నివృత్తి పూర్తిగా కాదు. ఏ విధమైన సిద్ధి కూడ కలుగదు. బాహ్య విషయ త్యాగము చేయకుండ ఇంద్రియ నిగ్రహము కానే కాదను విషయము గూడ లేదు. ఎందుకనగా భగవత్పూజ, సేవ, జపము, వివేకము, వైరాగ్యము మొదలైన యితరోపాయములచేత సహజముగానే ఇంద్రియ నిగ్రహము కాగలదు.

   ఈ విధముగనే ఇంద్రియ నిగ్రహము గూడ భగవత్ప్రాప్తికి మహాయక మగును. కాని రాగ, ద్వేషములను విడువక కేవలము ఇంద్రియ నిగ్రహము చేత మాత్రమే ఇంద్రియాకర్షకములైన విషయములు పరి పూర్ణముగా తొలగిపోయి, వాస్తవముగా పరమాత్మ ప్రాప్తి కలుగదు. బాహ్య విషయ త్యాగము, ఇంద్రియ నిగ్రహము ఈ రెండు లేక ఇంద్రియముల రాగద్వేష త్యాగము కలుగనే కలుగదను విషయము గూడ లేదు. సత్సంగము, స్వాధ్యాయము చింతనముచేత సాంసారిక భోగములు అనిత్యములని తోచుటచేత భగవత్పూజ, భజనము, ధ్యానము ఇత్యాదుల చేతను ఇంద్రియముల రాగద్వేషములు నశించిన వానికి బాహ్య విషయ త్యాగము, ఇంద్రియనిగ్రహము అనాయాసముగ తమంతటనే కలుగును. ఇంద్రియ విషయములందు రాగ ద్వేషములు లేనివాడు బాహ్యముగా విషయ త్యాగము చేయని యెడల విషయములందు సంచ రించుచునే పరమాత్మ ప్రాప్తి కలిగించుకొన గలడు. కాబట్టి ఇంద్రి యములు రాగద్వేషరహితములుగ నుండుటయే ముఖ్యము.

2. వశమునందుంచుకొనబడిన యింద్రియముల ద్వారా రాగద్వేష వ్యవ హారము చేయకుండిన సాధకుని యంతఃకరణము శుద్ధము, స్వచ్ఛము

అర్జునా! అంతఃకరణము ప్రసన్నమైన పిదప అతని దుఃఖములన్నియు లేకుండపోవును. అట్టి ప్రసన్నచిత్తుడైన కర్మయోగియొక్క బుద్ధి త్వరగానే అన్నివైపులనుండి తొలగి ఒక్క పరమాత్మయందు మాత్రమే సంపూర్ణముగా స్థిరమై నిలిచి యుండును.

సంబంధము :

ఈ విధముగా మనస్సును, ఇంద్రియములను వశమునందుంచుకొని అనాసక్త భావముచేత ఇంద్రియములద్వారా వ్యవహరించు సాధకునకు సుఖము శాంతి, స్థితప్రజ్ఞావస్థ కలుగునని చెప్పి, భగవంతుడిప్పుడు రెండు శ్లోకముల చేత దీనికి విపరీతముగా నెవని మనస్సులో ఇంద్రియములు జయింపబడక యుండునో అట్టి విషయాసక్తుడైన మనుష్యునకు సుఖ, శాంతులు ఉండవని తెలిపి విషయముల సంగముచేత అతని బుద్ధి చలించగల విధమును గూర్చి యర్జునునకు చెప్పుచున్నాడు.

నాస్తి బుద్ధి రయుక్తస్య న చా యుక్తస్య భావనా ।
నచా భావయతః శాంతిః అశాంతస్య కుతః సుఖమ్ ॥ 66

అర్జునా! మనస్సును, ఇంద్రియములను జయించని పురుషునకు నిశ్చయాత్మకమైన బుద్ధి యుండదు. అట్టి అయుక్త మనుష్యుని అంతఃకరణమునందు ఒక భావన గూడ ఉండదు. భావనాహీనుడైన మనుష్యునకు శాంతి లభించదు. [1] శాంతిరహిత మనుష్యునకు సుఖము ఎట్లు లభించగలదు?

---

నగును. కాబట్టి ఆ యంతఃకరణమునందు ఆధ్యాత్మిక సుఖ, శాంతుల యొక్క అనుభవము కలుగును. (గీత-18-37) అట్టి సుఖ శాంతులు ప్రసన్నత్వమనబడును.

1. పరమానందమునకు, శాంతికి సముద్రమైన పరమాత్ముని చింతింత కుండుట చేత అయుక్తుడైన (ఆసక్తిలేని) మనుష్యుని మనస్సు నిరంతరము విక్షిప్తమై (చంచలమై) యుండును, దానియందు రాగద్వేషములు, కామ క్రోధములు, ఈర్ష్యాలోభములు- ఈ మొదలైనవి ఉండుటచేత నిరంతరము సంతాపము, వ్యాకులత్వము ఉండును. ఆ కారణము చేతనే అట్టి మనుష్యునకు శాంతి యుండదు.

ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽను విధీయతే।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావ మి వాంభసి ॥ 67

ఎందుకనగా అర్జునా! ఏ విధముగ జలమునందు పోవు నావను వాయువు లాగుకొనిపోవునో అట్లే యింద్రియములందు సంచరించుచు మనస్సు ఏ ఇంద్రియముతో నుండునో ఆ యొక ఇంద్రియమే యీ అయుక్తపురుషుని బుద్ధిని హరించి తన వైపునకు తీసికొనిపోవును.[1]

తస్మాద్ యస్య మహాబాహో! నిగృహీతాని సర్వశః।
ఇంద్రియాణీంద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 68

---

1. ఇక్కడనౌక స్థానములందు బుద్ధియున్నది. వాయుస్థానమునందు మనస్సుతో గూడిన యింద్రియములున్నవి జలాశయ స్థానమునందు సంసార రూప సముద్రము ఉన్నది. జలస్థానమునందు శబ్ద, స్పర్శ, రూపాదులైన విషయములున్నవి. జలమునందు తాను చేరవలసిన స్థానమువైపు పోవుచున్న నౌకను ప్రబలమైన వాయువు రెండువిధములుగా సంచలింపజేయును. వాయువు నౌకకు మార్గమునుండి తప్పించి భయంకరములైన అలలలో తప్పుత్రోవకు మరలించనైనను మరలించును. లేదా లోతైన జలములో ముంచివేయును. ఈ విధముగానే ఎవని మనస్సు, ఇంద్రియములు వశమునందుండవో అట్టి మనుష్యుడు ఒకవేళ తనబుద్ధిని పరమాత్మ స్వరూపములో నిశ్చలముగా నుంచగోరినప్పటికిన్ని అతని ఇంద్రియములు అతని మనస్సును ఆకర్షించి అతనిబుద్ధిని రెండువిధములుగా సంచలింపఁజేయును. ఇంద్రియములు బుద్ధిరూప నౌకను పరమాత్మనుండి దూరముచేసి, అనేక విధ భోగములను పొందుటకు ఉపాయమును విచారించుటలో నిమగ్నము చేయుటచే భయంకర తరంగములందు త్రోవతప్పించుట యగును. పాపములందు ప్రవృత్తి కలిగించి దానిని అధఃపతనము పొందించుట యగును దానిని ముంచుట యగును. కాని ఎవడు మనస్సు, ఇంద్రియములు వశమునందుంచుకొనునో అతని బుద్ధిని అవి త్రోవ తప్పించజాలవు తద్విపరీతముగా బుద్ధియనెడు నౌకను పరమాత్మ సన్నిధికి చేర్చుటకు సహాయకములగును. అరువది నాలుగవ, అరువదియైదవ శ్లోకములందు ఈ విషయమే చేర్చబడినది.

అందుచేత మహాబాహూ ! ఏ పురుషుని ఇంద్రియములు ఇంద్రియాకర్షక విషయములచేత అన్నివిధములుగా నిగ్రహింపబడి యుండునో[1] అతని బుద్ధియే స్థిరమైనది.

యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ।
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః॥ 69

---

1. శ్రోత్రాది సమస్త ఇంద్రియములయొక్క శబ్దాది విషయములన్నింటి యందున్న ఇంద్రియములు ఏలాటి ఆటంకము లేకుండ ప్రవర్తించు స్వభావము గలవి. ఎందుకనగా అనాదికాలమునుండికూడ జీవుడు ఈ యింద్రియములద్వారా విషయములను అనుభవించుచు వచ్చుచున్నాడు. కాబట్టి ఇంద్రియములకు విషయములందు అసక్తి కలిగినది. ఇంద్రియములకు గల ఈ స్వాభావిక ప్రవృత్తిని పూర్తిగా ఆపుట, వానికిగల విషయాసక్త స్వభావమును మరలించుట, వానియందు విషయాసక్తిని లేకుండచేయుట మనస్సునకు బుద్ధిని విచలించు శక్తిని లేకుండచేయుట- ఇదియే ఇంద్రియములను ఇంద్రియ విషయములనుండి పూర్తిగా నిగ్రహించుటయగును. ఈ విధముగా ఎవని ఇంద్రియములు వశమునందుంచుకొనబడియుండునో అట్టి పురుషుడు ధ్యానకాలమునందు ఇంద్రియకార్యములను (చూచుట, వినుట మొదలైనవి) విడిచినప్పుడు అతని ఏ యింద్రియముగూడ ఏవిషయమును గూడ గ్రహింపజాలదు. ఆ యింద్రియములు తమ సూక్ష్మవృత్తుల ద్వారా మనస్సునందు విక్షేపమునే (సంచలనము) ఉత్పన్నము చేయజాలవు. ఆ సమయమునందు ఇంద్రియములు మనస్సునందు లీనమై పోవును. ధ్యానానంతరమునందు అతడు చూచుట, వినుట మొదలగు నింద్రియ కార్యములను చేయునప్పుడు ఆ యింద్రియములు ఆసక్తి రహితములై నియమసహితముగా శబ్దాది విషయములను తగినట్లు గ్రహించును. అవి మనస్సును ఏ విషయమునందుగూడ ఆకర్షింపజాలవు. తద్విపరీతముగా అవి మనస్సునే అనుసరించును. స్థితప్రజ్ఞుడైన పురుషుడు లోకసంగ్రహము (వ్యవహారము) కొఱకు ఏయింద్రియముద్వారా ఎంతకాలము వరకు ఏ శాస్త్రసమ్మత విషయమును గ్రహించుట ఉచితమని తలచునో ఆ యింద్రియమే, అంతసమయము వరకే, ఆ విషయమునే అనాసక్తి

అర్జునా సమస్త ప్రాణులకు ఏది రాత్రివంటిదో దానియందు నిత్యజ్ఞాన స్వరూపుడు, పరమానంద ప్రాప్తియందు స్థితప్రజ్ఞుడునైన యోగి మేలుకొని యుండును.[1] నశించు స్వభావముగల యే సాంసారిక సుఖమును పొందుటకు సమస్త ప్రాణులు మేలుకొనియుండునో అది పరమాత్మ తత్త్వమును తెలిసికొను మునికి రాత్రితో సమానము.[2]

---

భావముతో గ్రహించును. దానికి వ్యతిరేకముగా ఏ యింద్రియముగూడ ఏ విషయమునుగూడ గ్రహింపజాలదు. ఈ విధముగా ఇంద్రియముల పైన సంపూర్ణముగా ఆధిపత్యము కలిగియుండుట, వాని స్వాతంత్ర్యమును పూర్తిగా నష్టముచేసి వానిని తనకు అనుకూలముగా చేసికొనుట యను నిదియే ఇంద్రియములను ఇంద్రియాకర్షక విషయములనుండి అన్ని విధముల నిగ్రహించుట యగును.

1. ఏ విధముగ గుడ్లగూబ ప్రకాశముగల పగలంతయు నేత్రదోషముచేత అంధకారమయముగా చూచునో అట్లే అనాదిగా ఏర్పడిన అజ్ఞానమనెడు తెర అంతఃకరణమను నేత్రముయొక్క వివేక విజ్ఞానరూపమైన శక్తిని కప్పియుండుటచేత అవివేకియైన మనుష్యుడు స్వయంప్రకాశము, నిత్య జ్ఞానమయము పరమానందమయమునైన పరమాత్మ స్వరూపమును చూడజాలడు. ఆ పరమాత్మ ప్రాప్తిరూపుడైన సూర్యుడు ప్రకాశించియుండుటచేత ఏ పరమశాంతి, నిత్యానందముల ప్రత్యక్షానుభవము కలుగునో అది వాస్తవముగా పగటివలె ప్రకాశమయమైనప్పటికిన్ని పరమాత్మయొక్క గుణమును, ప్రభావమును, రహస్యమును, తత్త్వమును తెలిసికొనజాలని అజ్ఞానులకు రాత్రివంటిదగును. దానియందే స్థితప్రజ్ఞుడు ఆ సచ్చిదానంద ఘనరూపుడైన పరమాత్మ స్వరూపమును ప్రత్యక్షము చేసికొని నిరంతరము స్థిరముగా నుండవలెను. ఇదియే సమస్త ప్రాణులకు రాత్రిగానున్న సమయమునందు మేలుకొనియుండుట యని తెలియవలెను.

2. ఏ విధముగా స్వప్నము తరువాత మేలుకొనిన మనుష్యునకు స్వప్న జగత్తుతో ఏమాత్రము సంబంధము ఉండదో ఆ విధముగనే పరమాత్మతత్త్వమును తెలిసికొనిన జ్ఞానియొక్క అనుభవమునందు ఒక్క సచ్చిదానంద

అపూర్యమాణ మచల ప్రతిష్ఠమ్
సముద్రమాపః ప్రవిశంతి యద్వత్ ।
తద్వత్ కామా యం ప్రవిశంతి సర్వే
స శాంతి మాప్నోతి నకామకామీ ॥ 70

అర్జునా! యేవిధముగా అనేక నదుల జలము అన్నివైపులనుండి వచ్చి పరిపూర్ణము, అచంచలము, ప్రతిష్ఠితమునైన సముద్రమునందు దానిని కదలించకుండనే చేరిపోవునో ఆ విధముగనే అన్ని సుఖభోగములు ఆ స్థితప్రజ్ఞునియందు అతనికి ఏవిధమైన వికారము కలిగించకుండ లీనములైపోవును.[1] అట్టి పురుషుడే పరమశాంతిని పొందగలడు. కాని సుఖభోగములను కోరువాడు శాంతిని పొందజాలడు.

---

ఘన పరమాత్మ దప్ప ఇతర వస్తువుయొక్క సత్త (అస్తిత్వము) ఉండదు. జ్ఞాని ఈ కనపడు జగత్తు స్థానమునందు దీనికి అధిష్ఠాన రూపమైన పరమాత్మ తత్త్వమునే చూచును. కాబట్టి జ్ఞానికి సమస్త సాంసారిక భోగములు, విషయానందములు రాత్రితో సమానములే యగును.

1. ఏదైన జడ వస్తువుతో పోల్చి స్థితప్రజ్ఞుని వాస్తవస్థితి వర్ణనము పూర్తిగా చేయుట అసంభవము. అయినను ఉపమానముచేత ఆ స్థితియొక్క యేదియో యొక యంశమును చూపవచ్చును. కనుక సముద్రము అపూర్యమాణము అనగా అగాధము, అనంతమునైన జలముతో పరిపూర్ణమగునట్లు స్థితప్రజ్ఞుడు అనంతానందముచేత పరిపూర్ణుడని సముద్రము పోలికతో ఈ భావమును తెలుపవచ్చును. సముద్రమునకు జలముయొక్క అవశ్యకత లేనట్లే స్థితప్రజ్ఞునకుగూడ ఏలాటి సాంసారిక సుఖభోగముల అవశ్యకత గూడ కించిన్మాత్రమైనను లేదు. అతడు పూర్తిగా ఆప్తకాముడు. (కోరికలన్నియు పొందినవాడు) ఏ విధముగా సముద్రస్థితి అచంచలమో మహామహా ఝంఝా మారుతములు, సుడిగాలులు, ఉప్పెనలు వచ్చినను, లేక వివిధ నదీ జలప్రవాహములు దానియందు ప్రవేశించినను అది తన స్థితి నుండి చలించకుండ నుండునో, తన యెల్లను దాటిపోవదో (విడువదో) ఆ విధముగనే పరమాత్మయొక్క స్వరూపమునందున్న యోగియొక్క

సంబంధము :

'స్థితప్రజ్ఞుడెట్లు నడచును ?' అను అర్జునుని నాలుగవ ప్రశ్నము పరమాత్మను ప్రాప్తించు పురుషునిగూర్చియే చేయబడెను. కాని యీ ప్రశ్నము ఆచరణ విషయకమైనందుచేత దానికి ఉత్తరము అరువది నాలుగవ శ్లోకమునుండి యింతవరకు 'ఏవిధముగా ఆచరణముచేయు మనుష్యుడు శీఘ్రముగా స్థితప్రజ్ఞుడగును ?' ఎవడు స్థితప్రజ్ఞుడు కాడు ? ఎప్పుడు మనుష్యుడు స్థితప్రజ్ఞుడగునో ఆ సమయమునందు అతని పరిస్థితి ఎట్లుండును ? అను నీ విషయములన్నియు భగవంతుడు తెలిపెను. ఇప్పుడా నాలుగవ ప్రశ్నమునకు స్పష్టముగా ఉత్తరము చెప్పుచు స్థితప్రజ్ఞుని యాచరణముయొక్క విధమునుగూర్చి చెప్పుచున్నాడు.

విహాయ కామాన్ యః సర్వాన్ పుమాంశ్చరతి నిఃస్పృహః ।
నిర్మమో నిరహంకారః సశాంతి మధిగచ్ఛతి ॥ 71

అర్జునా ! ఏ పురుషుడు సమస్త కామనలను విడిచి మమకారభావము (ఇది నా వస్తువు అను భావము) లేనివాడై, అహంకార రహితుడై[1], స్పృహ (ఆశ) లేనివాడై యుండి సంచరించునో అతడే శాంతిని పొందగలడు. అనగా అతనిని శాంతి పొందునని భావము.

---

స్థితిగూడ సంపూర్ణముగా అచంచలమైయుండును. పెద్దపెద్ద సాంసారిక సుఖదుఃఖములు, సంయోగ, వియోగములు కలిగినను స్థితప్రజ్ఞుని స్థితిలో కొంచెముకూడ భేదము కలుగదు. అతడు సచ్చిదానంద ఘన పరమాత్మయందు నిత్యముగా, ఎడతెగక, చలించక, ఏకరసానందముతో నుండును.

1. మనస్సు, బుద్ధి, ఇంద్రియములతో గూడిన శరీరమునందు సామాన్యులు, అజ్ఞానులునైన మనుష్యులకు ఏ యాత్మాభిమానముండునో, దేని కారణము చేత వారు శరీరమే తన స్వరూపమని తలచెదరో, తాను శరీరమునకంటె వేరని తలచరో అట్టివారి దేహాభిమానమునకు అహంకారము అని పేరు. అది పూర్తిగా లేకుండుటయే 'అహంకార రహితము' అగును.

మనస్సు, బుద్ధి, ఇంద్రియములతోగూడిన శరీరమును, దానితో సంబంధము గల స్త్రీ, పుత్ర, సోదర, బంధు, గృహ, ధన, ఐశ్వర్యాది పదార్థము

సంబంధము :

ఈ విధముగా భగవంతుడు అర్జునుని నాలుగు ప్రశ్నములకు ఉత్తరములు చెప్పిన తరువాత ఇప్పుడు స్థితప్రజ్ఞగల పురుషుని స్థితినిగూర్చి చెప్పుచు ఈ యధ్యాయమును ముగించుచున్నాడు.

ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ ! నైనాం ప్రాప్య విముహ్యతి ।
స్థిత్వాఽస్యామంత కాలేఽపి బ్రహ్మ నిర్వాణ మృచ్ఛతి॥ 72

అర్జునా ! ఇది బ్రహ్మప్రాప్తి కలిగిన పురుషుని స్థితియగును. దీనిని పొందిన తరువాత యోగియైనవాడు ఎప్పుడుగూడ మోహము చెందడు.[3] తిరిగి అంత కాలమునందుగూడ ఈ బ్రహ్మీస్థితి యందుండి బ్రహ్మానందమును పొందగలడు సుమా ! ఇది ఉత్కృష్టమైన స్థితియని తెలియుము.

---

లను, తనచేత చేయబడు కర్మలను, ఆ కర్మముల ఫలములైన సమస్త సుఖభోగములను సామాన్యమానవులు తమవిగా తలచెదరు. ఈ భావము నకే మమకారము అని పేరు. ఇది పూర్తిగా లేకుండుటయే 'మమకార రహితము' అగును.

ఏదైన యిష్టవస్తువు లేనప్పుడు అదికావలెననియు, అదిలేక పని జరుగ దనియు మనస్సునందు గలుగు అపేక్షకు 'స్పృహ' అనిపేరు. అది పూర్తిగా లేకుండుటయే 'స్పృహారహితము' అగును.

పైన చెప్పబడిన విధముగా అహంకార, మమకార, స్పృహలు అను నీ మూడు లేకుండ తన వర్ణము (జాతి) ఆశ్రమము (బ్రహ్మచర్యాదులు) ప్రకృతి, పరిస్థితి- వీనిననుసరించి కేవలము లోకసంగ్రహము (వ్యవ హారము) కొరకు మాత్రమే యింద్రియాకర్షకములైన విషయములందు సంచరించుట అనగా చూచుట, వినుట, తినుట, త్రాగుట, నిద్రించుట, మేల్కొనుట మొదలైన శాస్త్రోక్త కార్యములన్నియు చేయుటయే సమస్త కామనలను విడిచి, అహంకార, మమకార, స్పృహలు లేకుండ సంచ రించుట యగును.

అర్జునుని ప్రశ్నములకు ఏబదియైదవ శ్లోకమునుండి యింతవరకు భగ

ఇతి శ్రీ మహాభారతే భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా పర్వణి
శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే సాంఖ్యయోగో నామ
ద్వితీయోఽధ్యాయః.[4]
భీష్మపర్వణి షడ్వింశోఽధ్యాయః.

శ్రీ మహాభారతము నందు భీష్మపర్వాంతర్గతమైన శ్రీ మద్భగవద్గీతా పర్వమునందు శ్రీమద్భగవద్గీతోపనిషత్తులందు, బ్రహ్మవిద్యయందు, యోగశాస్త్రములో శ్రీకృష్ణార్జున సంవాదమునందు సాంఖ్యయోగము అనబడు రెండవ అధ్యాయము సమాప్తము.

భీష్మపర్వమునందు ఇరువదియారవ అధ్యాయము సమాప్తము.

**

---

వంతుడు స్థితప్రజ్ఞుని స్థితినిగూర్చి అక్కడక్కడ వర్ణించి చెప్పెను. అట్టి స్థితియందు పూర్తిగా నిర్వికారుడై, నిశ్చలభావముతో సర్వదా ఎడతెగక నిమగ్నుడై యుండుటయే ఆ స్థితప్రజ్ఞస్థితిని పొందుటయగును.

ఈశ్వరుడనగా నేమి? ప్రపంచమనగా నేమి? మాయ యనగా నేమి? వీనికి గల పరస్పర సంబంధమేమి? నేనెవడను? ఎక్కడినుండి వచ్చితిని? నా కర్తవ్యమేమి? నేనేమి చేయుచున్నాను? ఈ మొదలైన విషయములయొక్క యథార్థజ్ఞానము లేకుండుటయే 'మోహము' అనబడును. ఈ మోహము జీవులకు అనాదికాలమునుండి ఉన్నది. ఈ కారణము చేతనే ఇక్కడ ఈ సంసారచక్రమునందు జీవుడు పరిభ్రమించుచున్నాడు. పైన చెప్పబడిన బ్రాహ్మీస్థితిని పొందిన పురుషునకు ఈ అనాది సిద్ధమైన మోహము సమూలముగా నష్టమైపోవును. మోహము మూలములతో (వ్రేళ్ళతో) గూడ నశించిపోవును. గనుక దాని ఉత్పత్తి మరల ఎప్పుడు గూడ జరుగదు.

# భగవద్గీత మూడవ అధ్యాయము

(భీష్మపర్వము 27వ అధ్యాయము)

## కర్మయోగము :

సంబంధము :

భగవద్గీత రెండవ అధ్యాయమునందు భగవంతుడు "అశోచ్యానన్వ శోచ స్త్వమ్" (గీత-2-11) అను శ్లోకము నుండి "దేహీ నిత్య మవధ్యోఽయం" (గీత-2-30) వరకు ఆత్మతత్త్వమును నిరూపించుచు సాంఖ్యయోగమును ప్రతిపాదించెను. "బుద్ధియోగే త్విమాం శృణు" (గీత-2-39) అను శ్లోకము నుండి "తదా యోగ మవాప్స్యసి" (గీత-2-53) అను శ్లోకము వరకు సమబుద్ధి రూపమైన కర్మయోగమును వర్ణించెను. దీని తరువాత ఏబది నాలుగవ శ్లోకము నుండి అధ్యాయ సమాప్తి వరకు అర్జునుని ప్రశ్నములపైన భగవంతుడు సమబుద్ధి రూప కర్మయోగము ద్వారా పరమేశ్వరుని పొందిన స్థితప్రజ్ఞుడైన సిద్ధపురుషుని లక్షణము, ఆచరణము, అతని మహత్త్వము ప్రతిపాదించెను. అక్కడ కర్మయోగ మహిమను చెప్పుచు భగవంతుడు నలువది యేడవ శ్లోకమునందు నలువది యెనిమిదవ శ్లోకమునందున్ను కర్మయోగము యొక్క స్వరూపమును తెలిపి, కర్మ చేయుమని అర్జునునకు చెప్పెను. నలువది తొమ్మిదవ శ్లోకమునందు సమబుద్ధిరూప కర్మయోగము కంటే సకామ కర్మము యొక్క స్థానము చాలా నీచమైనదని తెలిపెను. ఏబదియవ శ్లోకమునందు సమబుద్ధిగల పురుషుని ప్రశంసించి, అర్జునుని కర్మయోగమునందు ప్రవేశించుమని ప్రోత్సహించెను, ఏబది యొకటవ శ్లోకమునందు సమబుద్ధిగల జ్ఞానికి "అనామయ" స్థానము లభించుటను గూర్చి తెలిపెను. ఈ విషయమును వినిన యర్జునుడు దాని యథార్థ భావమును నిశ్చయముగా తెలిసికొనజాలక పోయెను. 'బుద్ధి' శబ్దము యొక్క అర్థము "జ్ఞానము" అని అంగీకరించుటచేత అతనికి భ్రాంతి కలిగెను. భగవంతుని మాటలలో "కర్మ" కంటె "జ్ఞానము" ప్రశస్తమైనదని తోచుచున్నదను వచనములు అర్జునునకు స్పష్టముగా తెలియక కలియగలుపుగా తెలిసెను.

అందుచేత అర్జునుడు ఆ మాటలను స్పష్టముగా తెలిసికొనుటకు తానొక నిశ్చిత మైన శ్రేయస్సాధనము తెలిసికొను నిచ్ఛచేత భగవంతుని ఇట్లు ప్రశ్నించు చున్నాడు.

**అర్జున ఉవాచ :**

జ్యాయసీ చేత్ కర్మణస్తే మతాబుద్ధిర్జనార్దన।
తత్ కిం కర్మణి ఘోరేమాం నియోజయసి కేశవ ॥

అర్జునుడిట్లనెను :

జనార్దనా! ఒకవేళ నీవు కర్మకంటె జ్ఞానమే శ్రేష్ఠమని తలచిన యెడల నన్ను భయంకరమైన కర్మమునందు ఎందుకు ప్రవేశపెట్టుచున్నావు ?

వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే ।
తదేకం వద నిశ్చిత్య యేనశ్రేయోఽహ మాప్నుయామ్ ॥ 2

భగవన్! నీవు సందేహాస్పదములైన మిశ్రిత వచనములు చెప్పి నా బుద్ధిని మోహమునందు పడగొట్టుచున్నావు [1] కాబట్టి నాకు శ్రేయస్సు కలుగు మాట యేదియో యది ఒక్కటే స్పష్టముగా, నిశ్చితముగాను చెప్పుము.

---

1. భగవంతుని మాటల భావమును తెలిసికొనజాలకుండుట చేత అర్జునునకు కూడ భగవంతుని మాటలయందు సందేహము తోచుచుండెను. ఎందుకనగా "బుద్ధియోగముకంటె కర్మ మిక్కిలి నికృష్టమైనది నీవు బుద్ధిని ఆశ్రయింపుము" (గీత-2.49) అని చెప్పుట చేతనైతే భగవంతుడు జ్ఞానమును ప్రశంసించి కర్మమును నిందించుచున్నాడు. జ్ఞానమును ఆశ్రయింపుమని నాకు చెప్పు చున్నాడు" అని అర్జునుడు తెలిసికొనెను. "బుద్ధి యుక్తుడైన పురుషుడు పుణ్య, పాపములను రెంటిని ఇక్కడనే విడిచిపెట్టును" (గీత-2-50) అను మాటచేత అర్జునునకు పుణ్య, పాపరూప సమస్త కర్మల స్వరూపమును త్యాగము చేయు వానిని భగవంతుడు 'బుద్ధియుక్తుడు" అని చెప్పుచున్నాడని తలచెను- దీనికి విపరీతముగ 'నీకు కర్మమునందు అధికారము కలదు", (గీత-2.47) 'నీవు యోగము నందుండి కర్మ చేయుము" (గీత-2-48) అను భగవంతుని మాటల చేత 'ఆయన నన్ను కర్మములందు ప్రవేశపెట్టుచున్నాడు" అని అర్జునుడు

సంబంధము :

ఇట్లు అర్జునుడు అడిగిన తరువాత భగవంతుడు అర్జునుని నిశ్చిత కర్తవ్యమైన భక్తిప్రధాన కర్మయోగమును తెలుపు నుద్దేశముతో తొలుత అతని ప్రశ్నమునకు ఉత్తరము చెప్పుచు 'నా మాట కలియగలుపుగా లేదు. అతి స్పష్టముగా, విడివిడిగా నున్నది' అని చెప్పుచున్నాడు.

శ్రీ భగవానువాచ :

లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ! ।
జ్ఞాన యోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్ ॥ 3

భగవంతుడిట్లనెను :

"అర్జునా ! ఈ లోకమునందు రెండువిధములైన నిష్ఠయున్నదని నేను తొలుత చెప్పితిని. ఆ రెంటిలో సాంఖ్యయోగులయొక్క నిష్ఠయైతే, జ్ఞానయోగము చేత,[1] యోగుల నిష్ఠ కర్మయోగముచేత కలుగును.[2]

---

తలచెను ఇంతయేకాక "నిస్త్రైగుణ్యోభవ", "ఆత్మవాన్ భవ" (గీత-2-45) ఇత్యాది వచనములచేత కర్మను విడువుమనియు "తస్మాత్ యుధ్యస్వ భారత!", (గీత-2-18) "తతో యుద్ధాయ యుజ్యస్వ, (గీత-2-38) "తస్మాత్ యోగాయ యుజ్యస్వ (గీత-2-50) ఇత్యాది వచనములచేత కర్మయొక్క ప్రేరణము అర్జునుడు తెలిసికొనెను. ఈ విధముగ పైన చెప్పబడిన మాటలయందు అర్జునునకు విరోధము కనబడెను.

1. ప్రకృతినుండి ఉత్పన్నములైన గుణములన్నియు గుణములందే ఉన్నవి. (గీత-3-28) నాకు ఈ గుణములతో ఏమాత్రము సంబంధములేదు అని తెలిసికొని మనస్సు, ఇంద్రియములు, శరీరము ఈ మూడింటిచేత చేయబడు కార్యములన్నింటిలోనూ తనకు కర్తృత్వము కలదని ఏమాత్రము అభిమానము ఉండకూడదు. అనగా ఈ పనులు నేనే చేయుచున్నానని తలచగూడదు. ఏ కార్యమునందుగాని, దాని ఫలమునందుగాని కొంచెము గూడ అహంకారము. మమకారము ఆసక్తి, కామన, ఇవియుండగూడదు. కేవలము సచ్చిదానంద ఘనమైన బ్రహ్మముతోనే తాను అభిన్నుడనని తెలిసికొని నిరంతరము పరమాత్మ స్వరూపమునందుండుట, అనగా బ్రహ్మభూతుడు, బ్రహ్మస్వరూపుడు అగుట (గీత 5-24, 6-27) అనునది మొదటినిష్ఠ. దీనికి జ్ఞాననిష్ఠ అని పేరు.
2. వర్ణము (జాతి), ఆశ్రమము (బ్రహ్మచర్యాది), స్వభావము పరిస్థితి, వీని

"న కర్మణామనారంభాత్ నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే
న చ సంన్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి 4

అర్జునా! మనుష్యుడు కర్మలుచేయక నైష్కర్మ్యమును (కర్మరాహిత్యమును) అనగా యోగనిష్ఠను పొందజాలడు. కర్మను విడుచుటమాత్రముచేత సిద్ధిని అనగా సాంఖ్యనిష్ఠను పొందజాలడు.[1]

---

ననుసరించి ఏ మనుష్యునకు శాస్త్రమునందు ఏ కర్మలు విధించబడినవో, ఏ కర్మలు అనుష్ఠించుట మనుష్యునకు అవశ్యకర్తవ్యము అని చెప్పబడినదో స్వాభావికములయిన శాస్త్రవిహిత కర్మలను న్యాయపూర్వకముగా తన కర్తవ్యము అని తలచి అనుష్ఠించుట ఆ కర్మలందు వాని ఫలములందును మమకారమును ఆసక్తిని, కామనను పూర్తిగా విడిచి ప్రతియొక కర్మ యొక్క సిద్ధియందు, అసిద్ధియందు, వాని ఫలములందు సర్వదా సమబుద్ధియుండుట గీత 2-47, 48) ఇంద్రియ సుఖములందు కర్మలయందు ఆసక్తి లేకుండుట, సమస్త సంకల్పములను విడిచి యోగారూఢుడు అగుట (గీత 6-4) ఇది కర్మయోగ నిష్ఠ అనబడును పరమేశ్వరుడు సర్వశక్తిమంతుడు, సర్వాధారుడు. సర్వవ్యాపి. అందరికి మిత్రుడు- ప్రేరకుడు అని తలచి తాను పూర్తిగ ఆయనకు అధీనుడను అని తలచి సమస్త కర్మలను, కర్మఫలములను భగవంతునకు సమర్పించుట (గీత 3-30, 9-27, 28), ఆయన ఆజ్ఞను, ప్రేరణను అనుసరించి చేయుపని ఆయన పూజగా తలంచి ఆయన చేయించినట్లే. కర్మలన్నియు చేయుచు, ఆ కర్మలయందు తత్ఫలములందు కొంచెముగూడ మమకారము. అనక్తి, కామన ఉంచకుండుట, భగవంతుని ప్రతియొక విధానమునందును, ఎల్లప్పుడున్ను సంతుష్టుడైయుండి, నిరంతరము. ఆయన నామములను, గుణములను, మహిమను, స్వరూపమును చింతించుచుండుట, (గీత 10-9, 12-6, 18-57). ఇది భక్తి ప్రధానమైన కర్మయోగ నిష్ఠ యనబడును.

1. భగవంతుడు కర్మను చేయుట విడుచుటనుగూర్చి చెప్పి, కర్మయోగి, విహితకర్మలు చేయకుండుట యోగనిష్ఠాప్రాప్తికి బాధకము, కాని సాంఖ్యయోగికర్మ పూర్తిగా విడచుట, సాంఖ్యయోగనిష్ఠా ప్రాప్తికి బాధకము కాదని విడివిడిగా తెలిపెను. కాని అంతమాత్రముననే సాంఖ్యయోగికి సిద్ధికలుగదు. సిద్ధి ప్రాప్తించుటకు అతడు కర్తృత్వమును విడిచి అతనికి సచ్చిదానందఘనబ్రహ్మమునందు అభేదభావముతొలగకుండుటఅవసరము. కనుకనే సాంఖ్యయోగి బాహ్యకర్మలు విడుచుట ముఖ్యముకాదు. మనస్సు

"న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్
కార్యతే హ్యవశః కర్మ సర్వైః ప్రకృతిజైర్గుణైః॥" 5

అర్జునా ! ఏమనుష్యుడు గూడ ఏ కాలమునందు గూడ, క్షణమాత్రమైనను కర్మ చేయకుండ నుండజాలడు. ఎందుకనగా మనుష్యులందరు ప్రకృతివల్ల పుట్టిన గుణములచేత పరవశులగుచు, కర్మ చేయుటకు బాధ్యులుగ చేయబడుదురు.[1]

సంబంధము :

పూర్వశ్లోకము నందు "ఏ మనుష్యుడు గూడ క్షణమాత్రమైనను కర్మ చేయకుండ ఉండజాలడు" అని చెప్పబడెను. ఈ మాటపైన "ఇంద్రియముల కర్మలను బలాత్కారముతో ఆపినప్పటికిన్ని మనుష్యుడు కర్మలను మానుకొనగలడు" అను శంక కలుగును. దానికి సమాధానము భగవంతుడు చెప్పుచున్నాడు.

కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్ ।
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారః స ఉచ్యతే ॥ 6

అర్జునా! మూఢ బుద్ధిగల ఏ మనుష్యుడు ఇంద్రియములన్నింటిని బలాత్కారముగా పైనుండి ఆపి మనస్సుచేత ఇంద్రియాకర్షకములైన ప్రాపంచిక

---

నందుగూడ కర్మత్యాగము చేయుట ముఖ్యము. కర్మయోగి బాహ్య కర్మలు విడువకుండుట అవసరము-

1. గుణాతీతుడయిన జ్ఞానికి, గుణములతోగాని, ఆ గుణముల కార్యములతో గాని యేలాటి బంధము ఉండదు. కనుక, జ్ఞాని గుణములవశము నందుండి కర్మలు చేయుననుట పొసగదు - అయినప్పటికిన్ని మనస్సు—బుద్ధి-ఇంద్రియములు—ఇత్యాది సమిష్టిరూపమయిన మనుష్యుని శరీరము ఉన్నది. ఇది అందరికిన్ని కనబడుచుండును. ఆ శరీరముచేత తనకు లోకులకున్ను ప్రారబ్ధానుసారముగా కర్మలుచేయుట అనివార్యమగును - ఎందుకనగా, అతడు గుణములకు కార్యరూపుడగుటచేత, గుణములకు అతీతుడు కాడు. తద్విపరీతముగా జ్ఞాని, శరీరమునుండి పూర్తిగా అతీతుడైనప్పుడే,గుణాతీతుడగును శరీరమున్నంతవరకు గుణాతీతుడు కాడు. కాబట్టి కర్మలు చేయుచుండవలెనని తాత్పర్యము-

విషయములను చింతించుచుండునో అటువంటివాడు మిథ్యాచారి (అసత్యాచరణము గలవాడు) (డంబము గలవాడు) అనబడును.

యస్త్వింద్రియాణి మనసా సంయమ్యాఽఽరభతేఽర్జున ।
కర్మేంద్రియైః కర్మయోగమసక్తః[1] స విశిష్యతే ॥ 7

కాని అర్జునా! ఏ పురుషుడు మనస్సుచేత ఇంద్రియములను వశము నందుంచుకొని, దేనియందున్ను ఆసక్తి లేనివాడై అన్ని ఇంద్రియములచేత కర్మయోగమును ఆచరించునో అతడే శ్రేష్ఠుడు.

సంబంధము :

కృష్ణా! నీవు నన్ను ఘోరకర్మలు చేయుమని ఎందుకు వానిలో ప్రవేశ పెట్టుచున్నావు ? అని అర్జునుడు అడిగియుండెను. దానికి ఉత్తరము భగవంతుడు పైపైన కర్మలు విడుచువారైన మిథ్యాచారులను నిందించి, కర్మయోగిని ప్రశంసించి, ఇప్పుడు అర్జునుని కర్మ చేయుమని ఆజ్ఞాపించుచున్నాడు.

నియతం కురు కర్మత్వం కర్మజ్యాయో హ్యకర్మణః ।
శరీరయాత్రాఽపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః ॥ 8

---

1. ఇక్కడ "కర్మేంద్రియాణి" అను పదమునకు పారిభాషికార్థములేదు. కనుక శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాది విషయములను గ్రహించు శ్రోత్ర, చర్మ, చక్షుస్, జిహ్వా, ఘ్రాణ, వాక్కు, పాణి, పాయు పాద, ఉపస్థలు అను పది యింద్రియములు బాహ్యేంద్రియములనబడును. ఎందుకనగా ఇవి బాహ్యకర్మలు చేయును. భగవద్గీతలో ఎక్కడ గూడ శ్రోత్రాది పంచేంద్రియములకు "జ్ఞానేంద్రియ" పదము చెప్పబడ లేదు. ఇదిగాక ఇక్కడ కర్మేంద్రియములకు అర్థము వాక్కు మొదలైన ఐదు ఇంద్రియములు అని అంగీకరించబడుట చేత శ్రోత్ర, నేత్రాదులైన ఇంద్రియములను నిగ్రహించు విషయము మిగిలియుండుట చేత మిథ్యాచారి కార్యము పూర్తికాదు. వాగాదులైన ఇంద్రియములను నిగ్రహించి శ్రోత్రాదులైన ఇంద్రియములచేత అతడేమి చేయునని గూడ ఇక్కడ తెలుపుట ఆవశ్యకము.

2. ఇక్కడ 'సవిశిష్యతే' అను పదము యొక్క అభిప్రాయమేమనగా కర్మయోగి పూర్వపు మిథ్యాచారికంటె శ్రేష్ఠుడుగా తెలుపవలసిన అవసరము

అర్జునా! నీవు శాస్త్ర విహితమైన కర్తవ్య కర్మ చేయుము. ఎందుకనగా కర్మ చేయకుండుట కంటె కర్మ చేయుట శ్రేష్ఠము.[1] కర్మ చేయకుండుట చేత నీ శరీర నిర్వాహము (దినకృత్యాదులు) గూడ సిద్ధించదు.

సంబంధము :

శాస్త్ర విహితములైన యజ్ఞ, దాన, తపస్సులు మొదలైన శుభ కర్మలు గూడ సంసార బంధ హేతువులుగా చెప్పబడెను. ఇట్లుండగా కర్మ చేయకుండుటకంటె కర్మ చేయుట ఎట్లు శ్రేష్ఠమగును ? అను జిజ్ఞాస కలుగుచున్నది. దానికి సమాధానము భగవంతుడిట్లు చెప్పుచున్నాడు.

యజ్ఞార్థాత్ కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః ।
తదర్థం కర్మ కౌంతేయ! ముక్తసంగః సమాచర ॥ 9

---

లేదు. అని ఎందుకనగా పూర్వ శ్లోకమునందు చెప్పబడిన మిథ్యాచారి అసుర సంపదగల దంభాచారముగలవాడు. అతనికంటెగూడ సకామ భావముతో శాస్త్రవిహితకర్మలుచేయు మనుష్యుడుగూడ చాలశ్రేష్ఠుడు. దైవసంపదగల కర్మయోగి మిథ్యాచారికంటె శ్రేష్ఠుడని చెప్పుట ఒక వేశ్య కంటె పతివ్రత శ్రేష్ఠురాలు అని చెప్పుటవలె కర్మయోగిని స్తుతించుట యయినది కనుక ఇక్కడ సవిశిష్యతే అని చెప్పుటచేత కర్మయోగి సర్వశ్రేష్ఠుడని చెప్పి అతని ప్రశంస చేయబడినదని చెప్పుటయే మంచిది.

1. ఇట్లు చెప్పుటచేత భగవంతుని మతములో కర్మచేయుటకంటె చేయకుండుట శ్రేష్ఠమని అర్జునుడు తలచియుండుటచేత అతని భ్రాంతిని భగవంతుడు నిరాకరించెనని తెలియుచున్నది. ఇందలి అభిప్రాయమేమనగా కర్తవ్యకర్మ చేయుటచేత మనుష్యుని యంతఃకరణము పరిశుద్ధమగును. కర్తవ్యకర్మలు విడుచుటచేత అతడు పాపమునుపొందును. నిద్ర, సోమరితనము, ఏమరుపాటు - వీనిలో చిక్కుకొని అధోగతి పొందును. (గీత-14-18) కనుక కర్మ చేయకుండుటకంటె కర్మచేయుట శ్రేష్ఠము.

అర్జునా! యజ్ఞాదుల కారణముగా చేయబడు కర్మలు దప్ప ఇతర కర్మలు చేయుటయందు తత్పరులైన మనుష్యులు మాత్రమే కర్మబంధనములలో చిక్కుకొనెదరు. కాబట్టి అర్జునా! నీవు ఆసక్తి రహితుడవై యజ్ఞాదుల నిమిత్తముగానే కర్తవ్య కర్మలు పరిపూర్ణముగా చేయుము.

సంబంధము :

పూర్వ శ్లోకమునందు భగవంతుడు [1]'యజ్ఞాదుల నిమిత్తమై కర్మ చేయు మనుష్యులు కర్మ బంధనములలో చిక్కుకొనరు' అని చెప్పియుండెను. కనుక యజ్ఞమనగా నేమి? అది ఎందుకు చేయవలెను? దాని కొరకు కర్మ చేయు మనుష్యులు ఎట్లు బద్ధులుకారు? అను జిజ్ఞాస కలుగును. కాబట్టి యీ విషయములను వివరించి తెలియునట్లు చెప్పుటకొరకు బ్రహ్మదేవుడు చెప్పిన మాటలను ప్రమాణములుగా చెప్పుచు భగవంతుడిట్లనుచున్నాడు.

సహ యజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః ।
అనేన ప్రసవిష్యధ్వమేష వోఽస్త్విష్ట కామధుక్ ॥ 10

అర్జునా! ప్రజాపతియైన బ్రహ్మదేవుడు కల్పాది యందు యజ్ఞములతో పాటు ప్రజలను సృజించి "మీరు ఈ యజ్ఞము చేత వృద్ధి పొందుడు. ఈ యజ్ఞము మీరు కోరిన[4] భోగములనిచ్చును." అని వారితో చెప్పెను.

"దేవాన్ భావయతాఽనేన తే దేవా భావయంతువః ।
పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ॥ 11

ప్రజలారా! మీరీ యజ్ఞముచేత దేవతలను ఉన్నతికి తెండు. ఆ దేవతలు

---

1. మనుష్యులందరికిన్ని వర్ణ, ఆశ్రమ, స్వభావ, పరిస్థితుల భేదముచేత వేర్వేరైన దానము, తపస్సు, ప్రాణాయామము, ఇంద్రియనిగ్రహము, అధ్యయనము, అధ్యాపనము, ప్రజాపాలనము, యుద్ధము, కృషి, (వ్యవసాయము) వాణిజ్యము, సేవ-ఈ మొదలైన కర్తవ్య కర్మలచేత సిద్ధించు స్వధర్మములుకలవు. అవియే యజ్ఞములనబడును.

మిమ్ము ఉన్నతికి తెత్తురుగాక. ఈ విధముగా మీరు పరస్పరము నిఃస్వార్థ భావముతో ఉన్నతులను చేసికొనుచు పరమ శ్రేయస్సును పొందగలరు.[1]

"ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః ।
తైర్దత్తా న ప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః॥" 12

యజ్ఞముచేత పెంపొందించబడిన దేవతలు మీరు అడుగకుండనే మీకు కోరిన కోరికలనిచ్చు చుండెదరు. ఇట్లు ఆదేవతలచేత ఇవ్వబడిన సుఖభోగములను ఏ పురుషుడు వారికి ఈయక అనుభవించునో అతడు దొంగ సుమా![2]

---

1. ఇట్లు చెప్పుటచే బ్రహ్మదేవుడు "ఈ విధముగా మీమీ స్వార్థము విడిచి పరస్పరము ఉన్నతులను చేసికొనుటకొరకు మీ కర్తవ్యపాలనము చేయుటచేత మీరీ ప్రాపంచికోన్నతితోపాటు పరమ కల్యాణరూపమైన మోక్షమునుగూడ పొందగలరు" అను భావమును తెలిపెను. ఇందలి అభిప్రాయమేమనగా బ్రహ్మదేవుడు దేవతలకు "మనుష్యులు మీకు సేవలు, పూజలు, యజ్ఞాదులు చేయకున్నను మీకు మీ కర్తవ్యమని తలచి మనుష్యులకు ఉన్నతి కలిగింపుడు" అని ఆజ్ఞయిచ్చెను. మనుష్యులకుగూడా "దేవతల ఉన్నతికొరకు, పుష్టికొరకున్ను మీరు స్వార్థమువిడిచి సేవలు, పూజలు, యజ్ఞాదులైన కర్మలుచేయుడు" అని ఆజ్ఞయిచ్చెను. ఇంతయేకాక "తదితరములైన కర్మలు చేయుడు" అని ఆజ్ఞయిచ్చెను. ఇంతయేకాక "తదితరులైన ఋషి, పితృ, మనుష్య, పశు, పక్షి, కీటక, పతంగాదులకుగూడ నిఃస్వార్థ భావముతో స్వధర్మ పాలనముచేత సుఖము కలిగింపుడు"అని ఆదేశించెను.

2. దేవతలు సృష్ట్యాదినుండి మనుష్యులకు సుఖమునిచ్చుటకు, వారి అవసరములను తీర్చుటకొరకు పశు, పక్షి, ఓషధి, వృక్ష, తృణాదులతోపాటు అన్నింటి పోషణముగూడ చేయుచున్నారు. అన్న, జల, పుష్ప, ఫల, ధాతు మొదలైన మానవోపయోగి సమస్త వస్తువులను మనుష్యులకిచ్చుచున్నారు. ఏ మనుష్యులు దేవతల ఋణము తీర్చక న్యాయోచితమైన వారి వస్తువును వారికి ఇవ్వకుండ వారిచ్చిన అన్నాదివస్తువులను ఉపయోగించెదరో వారు దొంగలు.

"యజ్ఞశిష్టాశినః[1] సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః ।
భుంజతే తే త్వఘం పాపా యేపచంత్యాత్మకారణాత్॥" 13

యజ్ఞమునుండి మిగిలిన అన్నము తిను శ్రేష్ఠ పురుషులు అన్ని పాపముల నుండి విముక్తులగుదురు. ఏ పాపిష్ఠులు తమ శరీర పోషణము కొరకే అన్నము వండెదరో వారు పాపమునే భుజించెదరు.

సంబంధము :

యజ్ఞము చేయనియెడల ఏమి హానికలుగును? అను ప్రశ్నమునకు సృష్టి చక్రమును సురక్షితముగా నుంచుటకొరకు యజ్ఞము ఆవశ్యకమని ఇక్కడ భగవంతుడు ప్రతిపాదించుచున్నాడు.

---

1. సృష్టికార్యము సక్రమముగా నడచుటకు సృష్టింపబడిన జీవులకు మంచి పోషణము కొరకున్ను, ఐదు తరగతుల ప్రాణులకున్ను పరస్పర సంబంధము కలదు. దేవతలు, ఋషులు, పితరులు, మనుష్యులు, ఇతర ప్రాణులు. ఈ ఐదింటి సహకారముచేతనే అన్నిటి పోషణము జరుగును. దేవతలు ప్రపంచమంతటికి ఇష్టములైన భోగములిచ్చెదరు. మహర్షులు అందరికి జ్ఞానమునిచ్చెదరు. పితరులు సంతతిని పోషించెదరు. వారి హితము కోరెదరు. మనుష్యులు కర్మలద్వారా అందరి సేవచేసెదరు. వారు పశు, పక్షి, వృక్షాదులకు సుఖసాధనములుగా తమను అర్పించెదరు. ఈ యైదుగురిలో మనుష్యునకు యోగ్యత, అధికారము, సాధనసంపత్తి ఉండుటచేత అతని పైన అందరిపోషణ బాధ్యతఉండును. దీనిచేతనే మనుష్యుడు కర్మలద్వారా అందరి సేవచేయును. ఈ పంచమహా యజ్ఞములే ప్రపంచ సేవా రూపములైన శాస్త్రీయ సత్కర్మములనబడును. ఈ దృష్టిచేతనే మనుష్యుడు సంపాదించినదానిలో ఈ యందరికి భాగమున్నదని తలచుట అతని కర్తవ్యమగును. ఎందుకనగా మనుష్యుడు అందరి సహాయ, సహయోగములచేతనే సంపాదించితినును. అందుచేతనే యజ్ఞము చేసినతరువాత మిగిలినఅన్నము– అనగా ఈ యందరికి వారి వారికి చెందదగిన భాగమునిచ్చి, మిగిలిన అన్నము తినువానిని శాస్త్రకారులు 'అమృతాశి' (అమృతము తినువాడు) అని ప్రశంసించెదరు.

"అన్నాద్ భవంతి భూతాని పర్జన్యాదన్న సంభవః।
యజ్ఞాద్ భవతి పర్జన్యో యజ్ఞః కర్మ సముద్భవః" 14

"కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షర సముద్భవమ్ ।
తస్మాత్ సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్॥" 15

అర్జునా! సమస్తప్రాణులు అన్నమునుండి పుట్టును. అన్నము వర్షమునుండి పుట్టును. వర్షము యజ్ఞముచేత కురియును. యజ్ఞము శాస్త్రోక్తకర్మలచేత ఉత్పన్నమగును. కర్మలు వేదమునుండి వేదములు అవినాశియైన పరమాత్మనుండి ఉత్పన్నములైనవని నీవు తెలిసికొనుము. దీనిచేత సర్వవ్యాపి, పరముడు, అక్షరుడునైన పరమాత్మ సర్వదా యజ్ఞమునందే ప్రతిష్ఠితుడై యున్నాడని నిరూపింప బడినది

"ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః ।
అఘాయు రింద్రియారామో మోఘం పార్థ! సజీవతి॥" 16

పార్థా! ఏ పురుషుడీ లోకమునందు ఇట్లు పరంపరగా వచ్చుచున్న సృష్టి చక్రమునకు[1] అనుకూలంగా వ్యవహరించడో అనగా తన కర్తవ్యమును నెరవేర్చడో అతడు ఇంద్రియములచేత సుఖభోగములను అనుభవించు పాపాత్ముడైన పురుషుడై వ్యర్థముగా జీవించును.

"యస్త్వాత్మరతిరేవ స్యాత్ ఆత్మతృప్తశ్చ మానవః
ఆత్మన్యేవ చ సంతుష్టః తస్యకార్యం న విద్యతే॥" 17

కాని ఏ మనుష్యుడు ఆత్మయందే రమించుచు, ఆత్మయందే తృప్తుడగుచు, ఆత్మయందే సంతుష్టుడగునో అతడు చేయవలసిన కర్తవ్యమేమియు నుండదు.

---

1. మనుష్యుడుచేయు శాస్త్రోక్త కర్మలచేత యజ్ఞము సిద్ధించును. యజ్ఞముచేత వర్షము, వర్షముచేత అన్నము, అన్నముచేత ప్రాణులు ఉత్పన్నములగును. మరల ఆ ప్రాణులలోనే యొకడైన మనుష్యునిచేత చేయబడిన కర్మలచేత యజ్ఞము, యజ్ఞముచేత వర్షముఅగును. ఈ విధముగా ఈ సృష్టి పరంపర ఎల్లప్పటికిన్ని చక్రమువలె తిరుగుచు వచ్చుచున్నది.

"నైవ తస్యకృతే నార్థో నాకృతే నేహ కశ్చన ।
న చాస్య సర్వ భూతేషు కశ్చి దర్థవ్యపాశ్రయః॥" 18

ఎందుకనగా అర్జునా! ఆ మహాపురుషునకు ఈ ప్రపంచమునందు కర్మలు చేయుటచేత ఏలాటి ప్రయోజనముఉండదు. కర్మలు అతడు చేయకుండుటచేత గూడ ఏ ప్రయోజనముఉండదు. సమస్త ప్రాణులయందు గూడ అతనికి కొంచము గూడ స్వార్థ సంబంధము ఉండదు.

ఎందుకనగా మనుష్యునికొరకు విధింపబడిన కర్తవ్యము అన్నింటి యుద్దేశమేమనగా కేవలుడు, ఏకుడు, పరముడు, కల్యాణస్వరూపుడునైన పరమాత్మని పొందుటయే యగును. అందుచేతనే పరిపూర్ణముగా అట్టి యుద్దేశము కలవాడు చేయవలసినదేమియు మిగిలియుండదు. అతని కర్తవ్యము సమాప్తి చెంది యుండును.

సంబంధము :-

"ఎంతవరకు మనుష్యునకు, పరమ కల్యాణరూపుడైన పరమాత్మని ప్రాప్తి కలుగదో, అంతవరకు అతనికి స్వధర్మపాలనము చేయుట– అనగా, వర్ణాశ్రమములననుసరించి, శాస్త్రోక్త కర్మల అనుష్ఠానము నిఃస్వార్థభావముతో చేయుట అవశ్య కర్తవ్యమగును. పరమాత్మను పొందిన పురుషునకు, ఏవిధమైన కర్తవ్యము లేకున్నను, అతని మనస్సుచేత, ఇంద్రియములచేతను లోకసంగ్రహార్థమై ప్రారబ్ధము ననుసరించి కర్మలు చేయవలసియుండును." అవి యంతవరకు భగవంతుడు అనేక హేతువులను చూపించి నిరూపించెను. ఇప్పుడు పైన చెప్పబడిన వర్ణనమును చూపుచు, భగవంతుడు అర్జునునకు అనాసక్త భావము చేత కర్తవ్యకర్మ చేయుమని యాదేశించుచున్నాడు.

"తస్మాదసక్తః సతతం కార్యం కర్మ సమాచర ।
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః॥ 19

---

1. పైన చెప్పబడిన విశేషణములతో గూడిన మహాపురుషుడు పరమాత్మని పొందినవాడు కాబట్టియే యతని కర్తవ్యములన్నియు ముగిసినవి. అతడు కృతకృత్యుడైనాడు.

ఇందుచేత అర్జునా ! నీవు నిరంతరము అనక్తిరహితుడవై సర్వదా కర్తవ్య కర్మను నిష్ఠతో చేయుచుండుము. ఎందుకనగా, అనక్తిరహితుడై కర్మ చేయు మనుష్యుడు పరమాత్మను పొందగలడు.

"కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః ।
లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి ॥ 20

అర్జునా ! జనకమహారాజాదిజ్ఞానులుగూడ, అనక్తిరహిత కర్మ చేతనే పరమ సిద్ధిని పొందియుండిరి.[1] అందుచేత లోకసంగ్రహమును చూచుచుండియైనను నీవు కర్మ చేయుటకే అర్హుడవు. అనగా కర్మ చేయుటయే నీకు తగినది అని భావము.[2]

---

1. జనకమహారాజువలె మమకారము – అనక్తి– కామన విడిచి కేవలము పరమాత్మప్రాప్తికొరకే కర్మలు చేయు "అశ్వపతి-ఇక్ష్వాకు-ప్రహ్లాద–అంబరీషాదులు ఎందరుగడిచిపోయిరో, ఆ ప్రధాన మహాపురుషులందరు అనక్తి రహిత కర్మలచేతనే పరమసిద్ధిని పొందిరి. అట్లే, అనేక మహాపురుషులు నేటిదాక, మమకార –ఆసక్తి – కామనలు విడిచి కర్మయోగము ద్వారా పరమాత్మను పొందిరి. ఇదియేమి క్రొత్తవిషయము కాదు. కనుక ఇది పరమాత్మను పొందుటకు, స్వతంత్రము – నిశ్చితము నైన మార్గము. ఇందులో ఏవిధమైన సందేహముగూడ లేదు.

ఇదిగాక, కర్మలద్వారా అంతఃకరణము పరిశుద్ధమైనవారికి, పరమాత్మ కృపచేత తత్త్వజ్ఞానము తనంతట లభించును. [గీత 4-38] కర్మయోగ యుక్తుడైన వానికి తత్క్షణమే పరమాత్మప్రాప్తి కలుగును. [గీత 5-6] ఈ మాటచేతగూడ, కర్మయోగమునకు అనాదిత్వము సిద్ధించినది.

2. సమస్తప్రాణుల పోషణ రక్షణములు చేయుట మనుష్యుని బాధ్యతయగును. కనుక తన వర్ణ–ఆశ్రమ–స్వభావ-పరిస్థితుల ననుసరించి, కర్తవ్యకర్మలు పూర్తిగా నాచరించి యితరులను తన ఆచరణముద్వారా, దుర్గుణ దురాచారములనుండి తొలగించి స్వధర్మమునందే యుంచుట. లోక సంగ్రహమనబడును.

కనుక తమ శ్రేయస్సుగోరు మనుష్యులు, పరమ శ్రేయస్స్వరూపమైన

సంబంధము :-

పూర్వశ్లోకమునందు భగవంతుడు అర్జునునకు, లోకసంగ్రహమువైపు చూచుచు, కర్మలుచేయుట ఉచితమని తెలిపెను. దానిపైన, కర్మ చేయుటచేత ఎటువంటి లోకసంగ్రహము కలుగునను జిజ్ఞాస కలుగును. అందుచేత, ఆవిషయమును వివరించి తెలుపుటకొరకు భగవంతుడిట్లు చెప్పుచున్నాడు :

యద్ యదాచరతి శ్రేష్ఠః తత్ తదేవేతరో జనః।
స యత్ ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే॥ 21

అర్జునా! శ్రేష్ఠపురుషుడు ఏ యే విధముగా కర్మలను ఆచరించునో, ఇతరులుగూడ అట్లే ఆచరించెదరు. అతడు దేనిని ప్రమాణముగా పెట్టుకొనునో[1] మనుష్యులందరు దానిననుసరించియే వ్యవహరించెదరు.

"న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషులోకేషు కించన।
నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి॥" 22

అర్జునా! నాకు ఈ మూడులోకములందు కర్తవ్యమేమియులేదు. నేను పొందదగిన వస్తువుగూడ ఏదియు పొందినదిలేదు. ఐనను, నేను కర్మ చేయుచునేయున్నాను చూడుము

యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతంద్రితః।
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ! సర్వశః॥ 23

---

పరమేశ్వరుని పొందుటకు ఆసక్తిరహితులై కర్మలు చేయుట ఉచితము. ఇది సిద్ధమైన విషయమే. ఇదిగాక లోకసంగ్రహముకొరకు గూడ, మనుష్యుడు కర్మ చేయుచుండుట ఉచితము. కర్మత్యాగము ఏవిధముగగూడ ఉచితముగాదు.

1. శ్రేష్ఠపురుషుడు, తాను ఆచరించి, యితరులకు బోధించి, యేమాట ప్రామాణికమని నిరూపించునో- అనగా, లోకుల అంతఃకరణమునందు, ఈ కర్మ ఈ మనుష్యుడు, ఇట్లు చేయవలెననిః విశ్వాసము కలిగించునో, అతని ననుసరించియే, సాధారణ జనులుగూడ వ్యవహరింపసాగెదరు.

"ఎందుకనగా, పార్థా! ఒకవేళ నేను కర్మలు జాగ్రత్తతో చేయనియెడల గొప్ప హాని కలుగును. ఎందుకనగా మనుష్యులు అన్నివిధముల నా మార్గమునే అనుసరించెదరు.[1]

"ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మ చేదహమ్।
సంకరస్య చ కర్తా స్యాముపహన్యామిమాః ప్రజాః॥ 24

అందుచేత అర్జునా! నేనొకవేళ; కర్మ చేయనియెడల, మనుష్యులందరు కర్మభ్రష్టులైపోయెదరు. నేను సాంకర్యము చేసినవాడనగుదుసు. ఈ సర్వప్రజలను నశింపజేసిన వాడనగుదును.[2]

---

1. చాలమందియైతేనో, నేను గొప్ప శక్తిమంతుడను, శ్రేష్ఠుడను అని తలచెదరు. అనేకులు నన్ను మర్యాదా పురుషోత్తముడని కూడ తలచెదరు. అందుచేత ఏ కర్మ నేను, ఏవిధముగా చేసెదనో, యితరులుగూడ నేను చూచుచుండగనే ఆ కర్మ అట్లే చేసెదరు. అనగా నన్ను అనుకరించెదరు. ఇట్టి పరిస్థితిలో ఒకవేళ నేను, కర్తవ్య కర్మలను నిర్లక్ష్యము చేసినయెడల ఆ కర్మలను జాగ్రత్తతో, విధిపూర్వకముగా, చేయని యెడలను, లోకములుగూడ ఆ విధముగనే చేయుటకు ఆరంభించి. స్వార్థమును, పరమార్థమును, రెంటిని పోగొట్టు- కొనెదరు. కనుకనే లోకులకు కర్మలు చేయు పద్ధతిని నేర్పుటకు, నేను సమస్తకర్మలు, స్వయముగా కడు జాగ్రత్తతో విధిపూర్వకముగా చేయుచుండును. ఎప్పుడుగూడ, ఎక్కడగూడ, కొంచెముగూడ అజాగ్రత్త చేయను

2. లోకులు కర్తవ్యములనుండి భ్రష్టులై, వారిలో సర్వవిధ సాంకర్యము వ్యాపించినప్పుడు, మనుష్యులు సుఖభోగాసక్తులై - స్వార్థసాధనమునందే గ్రుడ్డిగా మెలగుచు వేర్వేరు సాధనములచేత ఒండొరులను నశింపజేయుటకు పూనుకొనెదరు. అతిక్షుద్రములు - క్షణికములునైన సుఖభోగముల కొరకు, ఇతరులను నశింపజేయుటకు కొంచెముగూడ వెనుకాడరు. ఈ విధముగా లోకమునందు అత్యాచారము పెరిగిపోయిన తరువాత దానిలో పాటే, దైవికమైన విపత్తులుగూడి క్రొత్త క్రొత్తగా, సంభవించుచుండును.

"సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత।
కుర్యాద్ విద్వాంస్తథాఽసక్తశ్చి కీర్షుర్లోకసంగ్రహమ్॥ 25

అందుచేత భారతా! కర్మయందాసక్తిగల అజ్ఞానుడు ఎట్లు కర్మ చేయునో ఆసక్తి లేని విద్వాంసుడుగూడ, లోకసంగ్రహము చేయగోరువాడై ఆ విధముగనే కర్మ చేయవలెను.[1]

---

వానివలన సమస్త ప్రాణులకు ఆహారపానీయములు, జీవన నిర్వాహమునకు, సౌకర్యములు తరచుగా నశించుచుండును. నలువైపులు-మహామారి-అనావృష్టి - జలప్రళయము - కరవు - అగ్నికాలడము - భూకంపము ఉల్కలు (కొరవులు) ఆకాశమునుండి వడుట- మొదలైన ఉత్పాతములు కలుగుటకు ఆరంభించును వీనిచేత సమస్త ప్రజలకు వినాశము సంభవించును. కనుక భగవంతుడు, నేను సమస్త ప్రజలను నశింపజేయువాడనయ్యెదను. అను వాక్యముచేత 'నేనొకవేళ' శాస్త్ర విహితములైన కర్తవ్య కర్మలను విడిచినయెడల పైన చెప్పబడిన విధముగా లోకులను హద్దు మీరినవారినిగా చేసి సమస్త ప్రజానాశము చేయుటకు కారణమయ్యెదను. అను భావమును తెలిపెను.

1. స్వాభావిక స్నేహము అసక్తి-భవిష్యత్తులో వానివలన సుఖము లభించునాశ ఉండుటచేత తల్లి తనపుత్రుని, హృదయపూర్వకాసక్తి-ఉత్సాహము-తత్పరత్వము- వీనితో లాలించుచు పాలించుచున్నట్లు, ఇతరులెవ్వరుగూడ చేయరు. ఆ విధముగనే యే మనుష్యుని కర్మలలో, తత్కర్మ ప్రాప్తములగు సుఖములలోను ఆసక్తి కలుగునో, ఆ కర్మలు విధించు శాస్త్రములందు, ఎవనికి విశ్వాసముండునో, అతడేవిధముగా హృదయపూర్వక శ్రద్ధతో, తత్పరతతోను, శాస్త్రోక్త కర్మలనువిధిపూర్వకముగా, సాంగోపాంగముగా ముగించునో, ఆ విధముగా శాస్త్రములయందు శ్రద్ధ, శాస్త్ర విహిత కర్మలయందు ప్రవృత్తి లేనివారు చేయరు. కనుకనే యిక్కడ యథా! తథా! అను పదములు ప్రయోగించి భగవంతుడు, అహంకార-మమకార- ఆసక్తి-కామనలు పూర్తిగా లేకుండినప్పటికిన్ని, జ్ఞానులైన మహాత్ములు, కేవలము లోకసంగ్రహముకొరకు, కర్మాసక్తులైన మను

న బుద్ధిభేదం జనయేదజ్ఞానాం కర్మసంగినామ్ ।
జోషయేత్ సర్వకర్మాణి విద్వాన్ యుక్తః సమాచరన్॥ 26

అర్జునా ! పరమాత్మ స్వరూపమునందు స్థిరముగానున్న జ్ఞానులైన పురుషులు, శాస్త్రవిహితకర్మలయందు ఆసక్తిగల అజ్ఞానుల బుద్ధిలో భ్రాంతిని అనగా, కర్మలయందు అశ్రద్ధ కలిగించగూడదు. కాని తానుగూడ శాస్త్రవిహితములైన సమస్తకర్మలను శ్రద్ధతో బాగుగా చేయుచు, వారిచేతగూడ చేయించుచుండవలెను.[1]

---

ష్యులవలెనే, శాస్త్రవిహితకర్మలు విధిపూర్వకముగా, సాంగపాంగోముగా అనుష్ఠించవలెనను భావమును తెలుపుచున్నాడు.

1. మనుష్యునకు నిష్కామకర్మను తత్త్వజ్ఞానమును ఉపదేశించునపుడు, జ్ఞానవంతుడు, ఆ మనుష్యుని ఆచార వ్యవహారములయందు ఈ యుపదేశము చేత, అతని అంతఃకరణమునందు, కర్తవ్య కర్మలయెడలగాని, శాస్త్రాదుల యెడలగాని, యేవిధమైన అశ్రద్ధగాని, సంశయముగాని, ఉత్పన్నము కాకుండవలెనను దృష్టి పూర్తిగా నుంచుకొనవలెను. ఎందుకనగా వారు శాస్త్ర విహిత కర్మలను శ్రద్ధతో, సకామభావముతో చేయు అనుష్ఠానమును గూడ జ్ఞానము చేతగాని, నిష్కామ భావము పేరు చేతగాని విడిచెదరు. అట్లు పరిత్యాగము చేయుటచేత వారు ఉన్నతికి బదులు ప్రకృతము ఉన్న స్థితినుండిగూడ పతనము చెందెదరు. కనుకనే భగవంతుడు చెప్పినమాట కిక్కడ అజ్ఞానులకు తత్త్వజ్ఞానోపదేశము చేయగూడదనిగాని, నిష్కామ భావ తత్త్వమును వారికి వివరించగూడదని కాని ఆయన భావముకాదు. ఆయన భావమేమనగా అజ్ఞానుల మనస్సులందు, తత్త్వజ్ఞానప్రాప్తికొరకు గాని, తత్త్వజ్ఞానము కలిగిన పిదపగాని కర్మ అనవసరమను భావము గూడ కలిగించగూడదు అని. ఇంతియేకాక ఫలేచ్ఛ లేనప్పుడు కర్మ చేయవలసిన అవసరము మాత్రమేమున్నదను భావముగూడ అజ్ఞానుల మనస్సులో కలిగించగూడదు. ఫలాసక్తి పూర్వకమైన సకామ భావము చేత కర్మచేసి. స్వర్గమునకు పోవుటయే చాల గొప్ప పురుషార్థము. దీనిని మించి మనుష్యునకు మరియొక కర్తవ్యమేదిగూడ లేనేలేదను భ్రాంతితో

ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః।
అహంకార విమూఢాఽఽత్మా కర్తాఽహమితి మన్యతే ॥ 27

"అర్జునా! వాస్తవములో, సమస్త కర్మలు-అన్ని విధములుగా, ప్రకృతి గుణములచేతనే చేయబడును. అయినను, అంతఃకరణము అహంకారము చేత మోహము చెందియున్న అజ్ఞాని నేను చేసెదను" అని తలచును.[1]

తత్త్వవిత్ తు మహాబాహో గుణకర్మవిభాగయోః।
గుణా గుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే ॥ 28

"కాని మహాబాహూ! గుణవిభాగ- కర్మవిభాగముల తత్త్వము నెరిగిన జ్ఞానయోగి అన్నిగుణములు, గుణములందే ఉన్నవి." అని తలచి వానియందు ఆసక్తి గలవాడు కాడు సుమా![2]

---

అజ్ఞాని యుండునట్లుగూడ జ్ఞాని యుపదేశించగూడదు. జ్ఞాని చేయవలసిన పని యేమనగా, తన ఆచరణముచేత, ఉపదేశముచేతను, అజ్ఞానియొక్క అంతఃకరణము నుండి ఆసక్తి, కామన మొదలైన భావములను తొలగించుచు, అతడు పూర్వమువలెనే శ్రద్ధతో కర్మలు చేయుటయందు అతనిని ప్రవేశపెట్టవలెను. ఇదియే యిక్కడ భగవంతుని యభిప్రాయము. అని తెలియవలెను.

1. వాస్తవములో ఆత్మకు కర్మలతో సంబంధము లేకున్నను, అజ్ఞానియైన మనుష్యుడు ముప్పదిమూడు తత్త్వముల సముదాయముతో ఆత్మాభిమానము ఉంచి వానిద్వారా చేయబడు కర్మలతో తాను సంబంధము కలుగజేసికొని ఆ కర్మలకు తానే కర్తనని తలచును :- అనగా "నేను నిశ్చయించుచున్నాను. నేను సంకల్పించుచున్నాను. నేను వినుచున్నాను. చూచుచున్నాను. తినుచున్నాను. త్రాగుచున్నాను. నిద్రించుచున్నాను. నడచుచున్నాను. ఈ మొదలైన విధముగా ప్రతియొక కర్మగూడ తానే చేసినట్లు తలచును.

2. సత్వ-రజస్-తమస్ అను మూడు గుణముల స్వరూపమైన మాయవలన గలిగిన పృథివి. జల. అగ్ని-వాయువు-ఆకాశము లనెడు పంచమహాభూత

ప్రకృతేర్గుణ సమ్మూఢాః సజ్జంతే గుణకర్మసు ।
తానకృత్స్నవిదో మందాన్ కృత్స్నవిన్న విచాలయేత్ ॥ 29

అర్జునా ! ప్రకృతియొక్క గుణములచేత మిక్కిలి మోహము చెందిన మనుష్యుడు, గుణములందు కర్మలందున్ను ఆసక్తిగలవాడై యుండును. సమగ్రముగా తెలిసికొనజాలక మందబుద్ధులైన ఆయ జ్ఞానులను, అన్నియు తెలిసిన జ్ఞానవంతుడు చలింపజేయగూడదు.[1]

సంబంధము :-

అర్జునుని ప్రార్థనను అనుసరించి, భగవంతుడు, అతనికొక నిశ్చితమైన శ్రేయస్కర సాధనమును తెలుపునుద్దేశముతో, నాలుగవశ్లోకమునుండి యింత వరకు, మనుష్యుడెట్టి పరిస్థితిలోనైనను, తనవర్ణ-ఆశ్రమ స్వభావ పరిస్థితులకు

---

ములు, మనస్సు-బుద్ధి-అహంకారము అను మూడు తత్త్వములు చర్మము-నేత్రములు-కర్ణములు-జిహ్వా-నాసిక-అను పంచజ్ఞానేంద్రియములు, వాక్కు-హస్తములు పాదములు-గుదస్థానము-మూత్రస్థానము అను పంచకర్మేంద్రియములు, శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములు' అనెడు జ్ఞానేంద్రియ విషయములు ఐదున్ను ఈ యన్నింటి సముదాయమునకు "గుణవిభాగము" అని పేరు. వీనియొక పరస్పర కర్మ సముదాయమునకు "కర్మవిభాగము" అని పేరు. ఈ గుణవిభాగ- కర్మవిభాగములతో ఏమాత్రము సంబంధము ఆత్మకులేదని, ఆత్మ వేరనియు, అది నిర్లిప్తమనియు తెలిసికొనుటయే యాగుణకర్మల తత్త్వజ్ఞానమగును.

1. కర్మలయందు ఆసక్తులైయున్న కామ మనుష్యులకు కర్మాధికారము కలదు గాబట్టి, వారికి కర్మలు మిక్కిలి శ్రమపడి సాధించదగినవి. కర్మలలో ఉపయోగమేమున్నది. ఈ ప్రపంచమంతయు మిథ్య (అసత్యము) కర్మలు బంధమునకు కారణములు అని ఉపదేశించి, వారిని శాస్త్రవిహిత కర్మ నుండి తొలగించుటకాని, లేక వారిలో కర్మలయందు శ్రద్ధ-ఇష్టము తగ్గించుటగాని చేయుట ఉచితమైన పనిగాదు. ఎందుకనగా అట్లు చేయుటచేత వారికి పతనము సంభవించవచ్చును.

తగినట్లుగా శాస్త్రవిహితకర్మలు చేయుచునే యుండవలెను. అని నిరూపించెను. ఈ విషయమును వివరించి నిరూపించుటకు పూర్వశ్లోకములందు భగవంతుడు క్రమముగా ఈ క్రింది విషయములను చెప్పెను :-

1. కర్మలు చేయకుండ నైష్కర్మ్య సిద్ధియనెడు కర్మనిష్ఠ లభించదు. [గీ-3-4]
2. కర్మలను విడిచినంత మాత్రముచేత జ్ఞాననిష్ఠ సిద్ధించదు. [గీ-3-4]
3. మనుష్యుడొక క్షణముగూడ కర్మలు చేయకయుండజాలడు. [గీ-3-5]
4. బాహ్యముగా కర్మత్యాగముచేసి, మనస్సులో విషయచింతన చేయుట మిథ్యాచారమగును. [గీ-3-6]
5. మనస్సును ఇంద్రియములను వశమునందుంచుకొని, నిష్కామభావముతో కర్మలు చేయువాడు శ్రేష్ఠుడు. [గీ-3-7]
6. కర్మలు చేయకుండుటకంటె, కర్మలు చేయుట శ్రేష్ఠము. [గీ-3-8]
7. కర్మలు చేయకున్నయెడల శరీర నిర్వహణముగూడ సాగదు. [గీ-3-8]
8. యజ్ఞములకొరకు చేయబడు కర్మలు బంధనహేతువులుకావు. తద్విపరీతముగాన విముక్తికి కారణమగును. [గీ-3-9]
9. కర్మలు చేయుటకు ప్రజాపతి యాజ్ఞయిచ్చెను. నిస్వార్థభావముతో బ్రహ్మదేవుని యాజ్ఞను పాలించుటచేత శ్రేయస్సు కలుగును. [గీ-10-11]
10. కర్తవ్యపాలనము చేయకుండ సుఖభోగములను అనుభవించువాడు చోరుడు. [గీ-3-12]
11. కర్తవ్యములు నెరవేర్చి యజ్ఞశేషము తిని, శరీర నిర్వాహము చేసికొనువాడు సర్వపాప విముక్తుడగును. [గీ-3-13]
12. యజ్ఞాదుల చేయక శరీర పోషణమునకు మాత్రమే అన్నము వండుకొనువాడు పాపిష్ఠుడగును. [గీ-3-13]
13. కర్తవ్యకర్మల త్యాగముద్వారా సృష్టిచక్రమునందు బాధగలిగించు మనుష్యుని జీవితము వ్యర్థమై, అది పాపమయమగును [గీ-3-16]

14. అనాసక్త భావముతో కర్మలు చేయుటచేత పరమాత్మ ప్రాప్తి కలుగును. [గీ-3-19]

15. పూర్వకాలమునందు జనకాదులుగూడ కర్మలద్వారాయే, సిద్ధినిపొంది యుండిరి [గీ-3-20]

16. శ్రేష్ఠుడైన మహాపురుషుని ఇతర మనుష్యులు అనుకరించెదరు. కాబట్టి శ్రేష్ఠులైన మహాపురుషులు కర్మలు చేయవలెను [గీ-3-21]

17. భగవంతుడు చేయవలసిన కర్తవ్య కర్మ లేవియు లేవు. అయినను ఆయన లోకసంగ్రహముకొరకు కర్మలు చేయుచున్నాడు.

18. జ్ఞానికి కర్తవ్య కర్మలేవియులేవు. అయినను లోక సంగ్రహార్థము కర్మలు అతడు చేయవలెను. [గీ-3-25]

19. జ్ఞానవంతుడు శాస్త్ర విహితకర్మలను విడిచి కాని, లేక కర్మత్యాగమును గూర్చి ఉపదేశించికాని, యేవిధముగనైనను లోకుల కర్తవ్యకర్మలనుండి విముఖులను చేయగూడదు. కాని, తాను స్వయముగా కర్మలుచేసి, యితరులచేత కర్మలు చేయించుచుండవలెను. [గీ 3-26]

20. జ్ఞానియైనవాడు ఇతరులకు, విహితకర్మలు పూర్తిగా విడిచుటకు ఉపదేశించి కర్మాసక్తులైన మనుష్యులను కర్మలనుండి చలింపజేయగూడదు. [గీ-3-29]

ఈ విధముగా కర్మల ఆవశ్యకతను ప్రతిపాదించి, భగవంతుడిప్పుడు, అర్జునునకు రెండవశ్లోకమునందు చేయబడిన ప్రార్థన ననుసరించి యతనికి పరమ శ్రేయస్సు పొందుటకు సర్వశ్రేష్ఠము. అనన్యము, నిశ్చితమునైన సాధనమును తెలుపుచు, యుద్ధము చేయుటకు ఆజ్ఞాపించుచున్నాడు :.

మయి సర్వాణి కర్మాణి సంన్యస్యాఽధ్యాత్మచేతసా ।
నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః ॥ 30

అర్జునా ! అంతర్యామి ! పరమాత్మయునైన నాయందు లగ్నమైన మనస్సు చేత సమస్తకర్మలను నాయందు అర్పించి, యేయాశలు లేకుండ మమకార-సంతాపములు లేనివాడవై యుద్ధము చేయుము

యే మే మతమిదం నిత్యమనుతిష్ఠంతి మానవాః ।
శ్రద్ధావంతోఽనసూయంతో ముచ్యంతే తేఽపి కర్మభిః ॥ 31

అర్జునా! యేమనుష్యులైతే, దోషదృష్టిలేకుండ శ్రద్ధగలవారై సర్వదా, నా యీ మతము ననుసరించుదురో వారుగూడ సమస్త కర్మ బంధమునుండి విముక్తులగుదురు.

యేత్వేతదభ్య సూయంతో నాను తిష్ఠంతి మే మతమ్ ।
సర్వజ్ఞానవి మూఢాంస్తాన్ విద్ధినష్టాన చేతసః ॥ 32

కాని అర్జునా ! యే మనుష్యులు నాపై దోషారోపము చేయుచు, నాయీ

---

1. సర్వాంతర్యామియైన పరమేశ్వరుని గుణ-ప్రభావ-స్వరూపములను తెలిసికొని, ఆయనపైన విశ్వాసముంచి, నిరంతరము ఆయనను చింతించుచు మనస్సులో "భగవంతుడు సర్వశక్తిమంతుడు, సర్వాధారుడు, సర్వవ్యాపి, సర్వజ్ఞుడు, సర్వేశ్వరుడు అందరికి పొందదగినవాడు, పరమగతియైనవాడు పరమహితమును గోరువాడు, పరమప్రియుడు, పరమమిత్రుడు, పరమ దయాళుడు." అని తలచి యెవడు తమ మనస్సు, ఇంద్రియములతో గూడిన శరీరము, శారీరిక కర్మలు, ప్రపంచమునందలి సమస్త పదార్థములున్ను ఆ భగవంతునివే యని తెలిసికొని, ఆ యన్నింటియందు, మమకారము-ఆసక్తి-పూర్తిగా విడిచి "నాకు ఏమిచేయుటకుగూడ శక్తి లేదు, భగవంతుడే సర్వవిధ శక్తిని ప్రసాదించి నాచేత, తన యిచ్ఛానుసారముగా నా యోగ్యత ననుసరించి, సమస్త కార్యములు చేయించుచున్నాడు. నేను కేవలము నిమిత్తమాత్రుడనే" అని తెలిసికొని, తను పూర్తిగా భగవంతునకు అధీనుడనని తలచి, భగవదాజ్ఞానుసారము, ఆయనకొరకే ఆయన ప్రేరణచేతనే, ఆయన చేయించిన విధముగా సమస్త కర్మలను బొమ్మవలె చేయుచు, ఆకర్మలతోగాని, లేక కర్మఫలములతోగాని యేవిధమైన సంబంధముగూడ మనస్సుతో పెట్టుకొనకుండ అంతయు భగవంతునిదే యని తలచుటయే- "అధ్యాత్మ చిత్తముతో సర్వకర్మలు భగవంతునియందు సమర్పించుట" యగునని వారు తెలిసికొనవలెను.

మతము ననుసరించుచు నడవరో, అట్టి మూర్ఖులు నీవు సమస్త జ్ఞానమోహితులు-నష్టులు ఐనారని తలచుము.

సంబంధము :-

పూర్వశ్లోకమునందు-భగవన్మతానుసారము నడవనివాడు నష్టుడగును, అని చెప్పబడెను. దీనిపైన, ఒకవేళ, ఎవడైన, భగవన్మతానుసారముగా కర్మలు చేయక, పట్టుదలతో మొండిగా పూర్తిగా కర్మత్యాగముచేసినయెడల, హానియేమి? అను జిజ్ఞాస కలుగును. దానికి సమాధానముగా భాగవంతుడిట్లనుచున్నాడు.

"సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేః జ్ఞానవానపి
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతిః॥ 33

"అర్జునా! ప్రాణులందరు ప్రకృతిని చేరుదురు. అనగా తమ స్వభావమునకు లోబడి కర్మచేయుదురు.[1] జ్ఞానవంతుడుగూడ తన స్వభావముననుసరించియే, కర్మ చేయుననగా ఇందులో మొండిపట్టు ఏమున్నది?

సంబంధము :-

ఈ విధముగా అందరు కర్మలు ప్రకృతిననుసరించి చేయవలసియుండగా, మనుష్యులు కర్మబంధములనుండి విముక్తి కలుగుటకు ఏమి చేయవలెను? ఈ జిజ్ఞాసపైన భగవంతుడిట్లు చెప్పుచున్నాడు:-

---

1. దీనిచేత "స్వాభావికముగానే, సమస్త నదుల జలప్రవాహము సముద్రమువైపు పోవుచుండగా, ఆ ప్రవాహమును పట్టుదలతో ఎట్లుఆవుట సాధ్యము కాదో, అవిధముగానే, సమస్తప్రాణులు, తమ తమ ప్రకృతికి అధీనులై ప్రకృతి ప్రవాహములోపడి, ప్రకృతివైపే పోవుచున్నారు. అందుచేత ఏమనుష్యుడుగూడ పట్టుబట్టి పూర్తిగా కర్మత్యాగము చేయజాలడు" అను భావము తెలుపబడెను. ఔను, నదీ ప్రవాహమును, ఒకవైపునుండి మరియొక వైపునకు మరలింప గలుగునట్లే, మనుష్యుడు తన ఉద్దేశమును మార్చుకొని తన ప్రవాహరూపమైన నడకను మార్చగలడు. అనగా రాగ, ద్వేషములనువిడిచి, తాను చేయు కర్మలను పరమాత్మ ప్రాప్తికి సహాయకములనుగా చేయజాలును.

"ఇంద్రియ స్యేంద్రియ స్యార్థే రాగ-ద్వేషౌ వ్యవస్థితౌ ।
తయోర్న వశమాగచ్ఛేత్ తౌ హ్యస్య పరిపంథినౌ॥" 34

"అర్జునా! ప్రతియొక ఇంద్రియముయొక్క అర్థము (విషయము)నందున్న రాగ-ద్వేషములు దాగియుండును మనుష్యుడు రాగ-ద్వేష వశుడు కాకూడదు. ఎందుకనగా, ఆ రెండే అతని శ్రేయోమార్గమునందు విఘ్నములు[1] చేయునటు వంటి మహా శత్రువులుగా భావింపుము.

సంబంధము :

ఇక్కడ అర్జునుని మనస్సులో "నేను యుద్ధరూపమైన ఘోరమైన కర్మ చేయకుండ, భిక్షావృత్తితో నా జీవితమును గడుపుకొనుచు శాంతిమయ కర్మలు చేయుచున్నయెడల సహజముగనే నేను రాగద్వేషములనుండి విముక్తుడనగుదును. ఇట్లుండగా"కృష్ణా! నీవు నన్ను యుద్ధముచేయమని ఎందుకు ఆజ్ఞాపించుచున్నావు?" అను భావము కలుగపచ్చును. దానికి బదులుగా భగవంతుడిట్లనుచున్నాడు:—

---

1. ఏవిధముగ, నొకబాటసారి, తాను బోవలసిన స్థానమునకు బోవుచుండగా, త్రోవలో, విఘ్నకారులైన చోరులుకలిసి, మిత్రులవలె బాటసారితో వ్యవహరించి, యతనితోడుగానున్న బండినడుపువానితోకలిసి. వారి ద్వారా, ఆబాటసారి వివేకశక్తిలో భ్రాంతి కలిగింపజేసి, అతనికి అసత్య సుఖములందు ఆశకల్పించి, చోరులు తమ మాటలలో బాటసారిని ఇరికించి, అతనిని అతని గంతవ్యస్థానమువైపు పోకుండజేసి, దానికి విపరీతమైన అడవిమార్గము పట్టించి, అతని సర్వస్వమును అపహరించి. అతనిని లోతైనగుంతలో పడవేయుదురో, ఆవిధముగనే ఈ రాగద్వేషములుకూడ, శ్రేయస్కర మార్గమునందు బోవుచున్న సాధకునితో కలిసికొని, అతని యెడల మైత్రిచూపి, యతని మనస్సుయందు - ఇంద్రియములయందున్న ప్రవేశించి, యతని వివేకశక్తిని నశింపజేసి, యతనికి ప్రాపంచిన భోగ విషయములయందు సుఖాశను కల్పించి, ప్రలోభపరచి, పాపములను ఆచరించుటయందు అతనికి ప్రవృత్తికలిగించును. దీనిచేత ఆసాధకుని సాధనక్రమము నశించును. పాపాచరణముల ఫలముగా తనడు ఘోర నరకములందు పడి, భయంకర దుఃఖములను అనుభవించువాడుగా కావలసివచ్చును.

"శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః॥" 35

"అర్జునా! బాగుగా ఆచరించబడిన ఇతర ధర్మముకంటెగూడ, గుణహీనమైనను, తన ధర్మమే మిక్కిలి ఉత్తమమైనది.[1] తన ధర్మమునందుఉండి, మరణించుటగూడ శ్రేయస్కరము.[2] ఇతరులధర్మము భయంకరమని తెలిసికొనుము."

సంబంధము :-

"మనుష్యునకు, స్వధర్మపాలనమునందే శ్రేయస్సు కలుగును. పరధర్మ

---

1. వైశ్య-క్షత్రియాదులకంటే బ్రాహ్మణులకు అహింసాది సద్గుణములు విశేషముగా కలవు. గృహస్థునికంటే సన్యాసాశ్రమము తీసికొన్నవానికి ధర్మములలో సద్గుణముల ఆధిక్యముకలదు. ఈ విధముగా శూద్రులకన్న వైశ్య-క్షత్రియులు చేయుపనులలో నధికగుణములుగలవు. అందుచేత, ఈ విషయమునందు తెలిసికొనవలసిన భావమేమనగా-ఏకర్మలు గుణయుక్తములో, వేటి అనుష్ఠానముగూడ పరిపూర్ణముగ చేయబడియుండెనో, కాని, అవి అనుష్ఠానము చేయువారికి విహిత కర్మలుకావో, అవి ఇతరులకే విహితకర్మలో, అటువంటి ఇతర కర్మలకన్నను గుణరహితమైన స్వధర్మములే మిక్కిలి ఉత్తమములని భావించవలెను. చూచుటకు కురూపుడుగా, గుణహీనుడిగా నున్నప్పటికినీ పతిని సేవించుట ఏవిధముగా భార్యకు శ్రేయస్కరమో, ఆ విధముగనే, చూచుటకు సద్గుణహీనములైనప్పటికినీ, అనుష్ఠానమునందు కర్మాంగములలో విగుణత్వము యున్నప్పటికినీ, ఎవరికి ఏ కర్మలు శాస్త్రవిహితములో, అవియే వారికి శ్రేయస్కరములు. ఇట్లుండగా, ఏ స్వధర్మము సర్వ సద్గుణ సంపన్నమో, ఏ స్వధర్మము సాంగోపాంగముగా అనుష్ఠించబడునో, అట్టి సర్వసద్గుణ సంపన్నమైన స్వధర్మముల అనుష్ఠాన విషయములో చెప్పవలసినదేమున్నది?

2. "ఏవిధములైన ఆపదలు వచ్చిపడినను, మనుష్యులు స్వధర్మమును విడువరాదు. అట్టి స్వధర్మాచరణముచేత వారికి మరణము సంభవించినప్పటికిన్ని, అట్టి మరణముగూడ శ్రేయస్సు కలిగించునదిగానే భావించవలెను.

ములను సేవించుట. నిషిద్ధకర్మములను ఆచరించుట, ఈ రెంటిలోనూ అన్ని విధములుగ హానికలుగును. ఈ విషయమును పరిపూర్ణముగ తెలిసికొనిన తరువాత గూడ, మనుష్యుడు తన ఇచ్ఛకు, చింతనమునకు, ధర్మమునకునున్న విరుద్ధమైన పాపాచరణమునందు ఏకారణముచేత ప్రవృత్తి గలవాడగును?" ఈ విషయమును తెలుసుకొను యిచ్ఛతో నర్జునుడు ఇట్లనుచున్నాడు:—

అర్జున ఉవాచ :

"అథ కేన ప్రయుక్తోఽయం పాపంచరతి పూరుషః ।
అనిచ్ఛన్నపి వార్ష్ణేయబలాదివ నియోజితః॥" 36

అర్జునుడిట్లనెను:—

"కృష్ణా! అట్లైనయెడల, ఈ మనుష్యుడు, తాను ఇష్టపడకున్నప్పటికిన్ని, బలాత్కారముగా ప్రవేశపెట్టబడిన వానివలె, ఎవరి ప్రేరణచేత పాపములను ఆచరించును?"

శ్రీ భగవానువాచ :

"కామఏష క్రోధఏష రజోగుణ సముద్భవః ।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్॥" 37

భగవంతుడిట్లనెను:—

"అర్జునా! రజోగుణముచేత ఉత్పన్నమైన యీ కామమే క్రోధమునుమా! యీ కామము చాలా తినునట్టిది. అనగా, ఎన్ని సుఖములనుభవించినప్పటికిన్ని కామము తృప్తిచెందదు. ఇది మహాపాపి.[1] ఈ విషయమునందు కామమే మహాశత్రువని నీవు తెలిసికొనుము.

---

1. మనుష్యులు తాము కోరకుండనే, పాపములందు వారిని వియోగించునవి. వారి ప్రారబ్ధములు (పూర్వజన్మ కర్మములు) గాని, లేక యీశ్వరుడు గాని కారు. ఈ కామమే మనుష్యులకు వివిధములైన సుఖభోగములందు ఆసక్తి కలిగించి, బలాత్కారముగా వారిని పాపములలో పడద్రోయును. కాబట్టి, కామమే మహాపాపియని భావించవలెను.

సంబంధము:-

'ఈ కామము మనుష్యునకు ఏ విధముగా పాపములందు ప్రవృత్తి కలిగించును?'అని జిజ్ఞాసమిక్కడ కలుగును కాబట్టి దీని సమాధానము తరువాత మూడు శ్లోకములలో భగవంతుడు చెప్పుచున్నాడు.

"ధూమేనాఽఽవ్రియతే వహ్నిః యథాఽఽదర్శో మలేనచ ।
యథోల్బేనాఽవృతో గర్భః తథా తేనేద మావృతమ్॥" 38

"అర్జునా! యేవిధముగా, ధూమము చేత అగ్ని, మురికిచేత (దుమ్ము చేత) అద్దము, ఉల్బము (మావి) చేత గర్భమున్ను కప్పబడియుండునో, ఆ విధముగనే కామముచేత జ్ఞానము కప్పబడియుండును."[1]

---

1. ఇట్లు చెప్పుటచేత, "ఈ కామమే 'మురికి-విక్షేపము (చలనము) ఆచ్ఛాదనము' అను మూడదోషములుగా పరిణమించి, మనుష్యుల జ్ఞానమును ఆచ్ఛాదించియుండు"నని తెలుపబడినది. ఇక్కడ, ధూమస్థానమునందు 'విక్షేపము' ఉన్నదని తలచవలెను. ఏవిధముగా పొగ చంచలమైయుండి గూడ అగ్నిని కప్పుచుండునో, ఆ విధముగనే విక్షేపము చంచలముగా నుండియు జ్ఞానమును కప్పికొనియుండును. ఎందుకనగా, ఏకాగ్రత లేకుండ, అంతఃకరణమునందు జ్ఞానశక్తి ప్రకాశింపజాలదు. అది అణిగి యుండును. మురికిస్థానములో 'మలము' అను దోషమును తెలిసికొనవలెను. ఏవిధముగ అద్దమునందు మురికి - దుమ్ము వ్యాపించుటచేత, ఆ దర్పణమునందు ప్రతిబింబము కనబడదో, ఆవిధముగనే, పాపాచరణముల చేత అంతఃకరణము మిక్కిలి మలినమైనప్పుడు, దానియందు వస్తువుగాని, లేక, కర్తవ్యముయొక్క యధార్థస్వరూపముగాని, ప్రతిభాసింపదు. అందుచేత, మనుష్యులు దాని యధార్థ వివేచనము చేయజాలరు. ఈవిధముగనే, ఉల్బము (మావి) స్థానములో 'ఆవరణము' ఉండునని ఎరగవలెను. ఏవిధముగనే మావిచేత గర్భము పూర్తిగా కప్పబడియుండునో, ఆవిధముగనే ఆవరణముచేత జ్ఞానము పూర్తిగా ఆచ్ఛాదింపబడియుండును. ఎవని అంతఃకరణము అజ్ఞానముచేత మోహముచెందియుండునో, ఆ మనుష్యుడు, నిద్ర - సోమరితనము మొదలైన సుఖములలో చిక్కుకొని,

"ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో[1] నిత్యవైరిణా ।
కామరూపేణ కౌంతేయ దుష్పూరేణానలేన చ ॥ 39

అర్జునా! అగ్నివలె, ఎప్పుడుగూడ, ఎన్ని అనుభవించినను తృప్తి చెందకుండనుండు ఈ కామమే, జ్ఞానవంతులకు నిత్య శత్రువు. ఈ కామముచేతనే మనుష్యులకు జ్ఞానము కప్పబడియుండును.

ఇంద్రియాణి మనో బుద్ధిరస్యాధిష్ఠానముచ్యతే
ఏతైర్విమోహయత్యేష జ్ఞాన మావృత్య దేహినమ్ ॥ 40

అర్జునా 'ఇంద్రియములు- మనస్సు- బుద్ధి' యివన్నియు కామమునకు నివాసస్థానములని చెప్పబడుచున్నవి. కావున మనోబుద్ధీంద్రియముల చేతనే, జ్ఞానమును ఆచ్ఛాదించి జీవాత్మని మోహమునందు పడవేయుచున్నది.[2]

తస్మాత్ త్వమింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ ।
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞాన- విజ్ఞాన నాశనమ్ ॥ 41

అందుచేత, అర్జునా! నీవు మొదట, ఇంద్రియములను వశమునందుంచు

---

యేవిధమైన విచారము-చింతనము వివేచనమున్ను లేకుండపోయి, అతనికి వివేచించుటయందే ప్రవృత్తి కలుగకయుండును.

1. ఇచ్చట "జ్ఞాని" అను శబ్దము యథార్థజ్ఞాన ప్రాప్తి కొరకు సాధనము చేయు వివేకము గల సాధకులని యర్థము. ఈ కామమనే శత్రువు ఆ సాధకుల యంతఃకరణమునందు వివేక- వైరాగ్య నిష్కామ భావములను స్థిరముగా నుండనీయదు. వారి సాధనకు బాధ కలిగించును కనుక ఇది జ్ఞానులకు సదా వైరి యగును.

2. ఈ కామము మనుష్యుని బుద్ధి మనస్సు ఇంద్రియములందు ప్రవేశించి అతని వివేకశక్తిని నష్టపరుచును. సుఖ భోగములను చూపి అతనిని పావ ప్రవృత్తుని చేయును. దానిచేత మనష్యుడు అధఃపతనము చెందును. కనుక శీఘ్రముగనే అతడు జాగరూకుడు కావలెను.

కొని, ఈ జ్ఞాన - విజ్ఞానములను నశింపజేయు [1] మహాపాపియైన కామమును బలాత్కారముగ తప్పక చంపుము.

ఇంద్రియాణి పరాణ్యాహుః ఇంద్రియేభ్యః పరం మనః ।
మనసస్తు పరా బుద్ధిః యో బుద్ధేః పరతస్తు సః ॥ 42

అర్జునా! ఇంద్రియములు ఈ స్థూల శరీరముకంటె పరములు- అనగా, శ్రేష్ఠములు, బలముగలవి, సూక్ష్మములునని పెద్దలు చెప్పెదరు, ఈ యింద్రియములకంటే పరము మనస్సు. మనస్సుకంటే కూడ, పరమైనది బుద్ధి, బుద్ధికంటే పరమైనదేదియో, అదియే ఆత్మ [2] అని భావింపుము.

ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన[3] మాత్మనా ।
జహి శత్రుం మహాబాహో! కామరూపం దురాసదమ్ ॥ 43

---

1. భగవంతుని నిర్గుణ- నిరాకార తత్త్వముయొక్క ప్రభావ మాహాత్మ్య రహస్యయుక్తమైన యథార్థజ్ఞానమునకు 'జ్ఞానము' అనియు, సగుణ- నిరాకార దివ్య సాకార' తత్త్వము యొక్క లీలా రహస్య గుణ మహాత్మ్య ప్రభావములు గల జ్ఞానమునకు "విజ్ఞానము" అని చెప్పెదరు. ఈ జ్ఞాన విజ్ఞానములను యథార్థముగ పొందుటకు మనస్సునందుగలుగు ఆకాంక్షను ఈ మహాకామ శత్రువు తన మోహశక్తిద్వారా నిరంతరము అణిచివేయుచుండును. అనగా ఆయాకాంక్షయొక్క జాగృతి వలన కలిగిన జ్ఞాన విజ్ఞాన సాధనములందు బాధ కలిగించుచుండును. ఈ కారణముచేతనే జ్ఞాన విజ్ఞానములు ప్రకటితములు కావు కాబట్టి కామము జ్ఞాన విజ్ఞానలను నశింపజేయునది అని తెలుపబడెను.

2. ఆత్మ అన్నిటికీ ఆధారము- కారణము- ప్రకాశకము- ప్రేరకమేకాక, యది, సూక్ష్మము- వ్యాపకము- శ్రేష్ఠము- బలము గలది- నిత్య చేతనము గలది యగుటచేత ఆత్మ అత్యంత పరము అని చెప్పబడినది.

3. ఆత్మకు, శరీరేంద్రియ మనోబుద్ధి జీవులు అని అర్థములుకలవు. వానిలో మొట్టమొదట ఇంద్రియములను వశపరచుట కొరకు, నలుబదియొకటవ శ్లోకమునందు చెప్పబడినది. శరీరము ఇంద్రియాంతర్గమని కూడ చెప్ప

అర్జునా! యీ విధముగా, బుద్ధికంటే పరము- అనగా- సూక్ష్మము- బలముగలది మిక్కిలి శ్రేష్ఠమైనది ఆత్మయని తెలిసికొని, బుద్ధిచేత మనస్సును వశమునందుంచుకొని, [1] నీవు ఈ కామమనెడు దుర్జయ శత్రువును చంపి వేయుము.

ఇతి శ్రీ మహాభారతే భీష్మ పర్వణి శ్రీమద్భగవద్గీతాపర్వణి
శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే కర్మయోగో నామ
తృతీయోధ్యాయః 3

భీష్మపరణి సప్తవింశోధ్యాయః 27

---

బడెను. జీవాత్మయైతే. స్వయముగా మనస్సును తన శరీరములోకి తెచ్చుకొనువాడు. ఇప్పుడు మిగిలినవి మనస్సు- బుద్ధి రెండే, బుద్ధి మనస్సు కన్న బలము గలదని చెప్పబడెను. కనుక బుద్ధిచేత మనస్సును వశపరచుకొనవచ్చును. ఆ కారణము చేతనే యచ్చట "ఆత్మానం" అను శబ్దమునకు "మనస్సు" అని, "ఆత్మనా" అను శబ్దమునకు "బుద్ధి" అని అర్థము చెప్పబడినది.

1. భగవంతుడు గీతలోని ఆరవ అధ్యాయములో మనస్సును వశపరచుకొనుటకు- అభ్యాస- వైరాగ్యములు రెండు ఉపాయములు అని చెప్పెను. (గీ-6-35). ప్రతియొక యింద్రియముల విషయములో మనుష్యునకు రాగ- ద్వేషములు స్వాభావికముగ నుండును. విషయములలో నింద్రియములకు సంబంధము కలుగునప్పుడు, ఎప్పుడెప్పుడు రాగద్వేషముల యవసరము వచ్చునో అప్పుడప్పుడంతయు, మిక్కిలి జాగ్రత్తతో, బుద్ధిచేత విచారణ చేయుచు, రాగద్వేషముల వశములో చిక్కకుండునట్లు ప్రయత్నము చేయుచుండినయెడల, మెల్లమెల్లగా రాగద్వేషములు తగ్గిపోవుచుండును. ఇచ్చట బుద్ధిచేత విచారణ సలిపి, ఇంద్రియములచేత ననుభవించబడు సుఖభోగములందు దుఃఖమును, దోషములను మాటిమాటికి మనస్సునకు చూపించుచు, మనస్సునకు, సుఖ భోగములందు

శ్రీ మహాభారతమునందు భీష్మపర్వాంతర్గతమైన శ్రీ మద్భగవద్గీతా పర్వమునందు, శ్రీమద్భగవద్గీతోపనిషత్తులో, బ్రహ్మవిద్యయందు, యోగ శాస్త్రములో, శ్రీకృష్ణార్జున సంవాదమునందు "కర్మయోగము" అనబడు మూడవ అధ్యాయము 3

భీష్మ పర్వమునందు ఇరువది యేడవ అధ్యాయము 27

---

అరుచికలిగించుట 'వైరాగ్యము' అనబడును. వ్యవహార కాలమునందు స్వార్థ త్యాగమునకు, ధ్యానసమయమునందు మనస్సును పరమేశ్వర చింతయందు లగ్నముచేయుటకు ప్రయత్నించుచు, మనస్సును సుఖ భోగముల ప్రవృత్తి నుండి తొలగించి, పరమేశ్వరచింతనము నందు మాటి మాటికి ప్రవేశపెట్టుట "అభ్యాసము" అనబడును.

ఆత్మయందు అనంతబలమున్నది. అది కామమును చంపగలదు. వాస్త వములో, ఆ యాత్మబలమును పొందియే యందరున్ను బలవంతులు- క్రియాశీలురునయ్యేదరు. కాని అది తన మహాబలమును మరచియున్నది. ప్రబలశక్తి శాలియైన చక్రవర్తి యెట్లు తన అజ్ఞానముచేత తనబలమును విస్మరించి, తనకంటే పూర్తిగా బలహీనులు- క్షుద్రులుయైన సేవకులకు అధీనుడై వారుచెప్పినట్లు చేయునో, అదేవిధముగ ఆత్మగూడ తాను, మనోబుద్ధీంద్రియములకు అధీనమని తలచి, కామ ప్రేరితములైన ఆ మూడింటి కార్యములకు అడ్డులేక, వాని ఇష్టమువచ్చినట్లు, ఏమియు బదులు చెప్పక, మూగ ఉత్తరువు నిచ్చుచున్నాడు. దీని చేతనే, ఆ మనో బుద్ధీంద్రియములలో దాగియున్న కామము, జీవాత్మకు విషయులందు ప్రలోభము కలిగించి, జీవాత్మను సంసారములో ఇరికించుచుండును. కనుకనే, తన స్వరూపమును, శక్తిని గుర్తించి, మనస్సును, బుద్ధిని, ఇంద్రియములను వశమునందుంచుకొనవలెను. వానిని వశపరచుకొన్న తరువాత చివరకు కామము స్వాభావికముగనే చచ్చిపోవును. వాస్త వములో, నిష్క్రియమైన ఆత్మ, కామమును చంపుటకు ఈ పద్ధతినే అవలంబించవలెను. ఈ కారణముచేతనే, బుద్ధిచేత మనస్సును వశము నందుంచుకొని కామమును చంపవలెనని నిరూపింపబడినది.

# భగవద్గీత నాలుగవ అధ్యాయము

(భీష్మపర్వము 28 వ అధ్యాయము)

## జ్ఞానకర్మ సన్న్యాసయోగము ;

సంబంధము :-

భగవద్గీత 3వ అధ్యాయమునందు నాల్గవ శ్లోకమునుండి యిరువది తొమ్మిదవ శ్లోకమువరకు భగవంతుడు అనేక విధముల శాస్త్ర-విహితకర్మలను ఆచరించుట ఆవశ్యకమని ప్రతిపాదించి, ముప్పదియవ శ్లోకమునందు భక్తి ప్రధానమైన కర్మయోగ విధిచేత మమకార-ఆసక్తి-కామనలను పూర్తిగా విడిచి భగవదర్పణ బుద్ధితో కర్మలు చేయుటకుగాను అర్జునునకు ఆజ్ఞయిచ్చెను. ఆ తరువాత ముప్పదియొకటవ శ్లోకమునుండి ముప్పదియైదవ శ్లోకమువరకు పై సిద్ధాంతము ననుసరించి కర్మలు చేయువారిని ప్రశంసించి, అట్లు చేయనివారిని నిందించి రాగద్వేషముల వశములో చిక్కుకొనకుమని అర్జునునికి చెప్పుచు స్వధర్మ పాలనము చేయుమని గట్టిగా చెప్పెను. తరువాత ముప్పదియాఱవ శ్లోకమందు అర్జును డడిగిన ప్రశ్నమునకు ముప్పదియేడవ శ్లోకమునుండి అధ్యాయ సమాప్తి పర్యంతము కామము సర్వానర్థములకు మూలకారణము అని భగవంతుడు నిరూపించి బుద్ధిచేత ఇంద్రియములను, మనస్సును వశమునందు ఉంచుకొని కామమును చంపవలెనని యాజ్ఞాపించెను. కాని కర్మయోగము యొక్క తత్త్వము మిక్కిలి దురూహ్యము- గహనము కాబట్టి యప్పుడు భగవంతుడు మరల దానికి సంబంధించిన అనేకవిషయములను తెలుపునుద్దేశముచేత ఆ ప్రకరణమునే ఆరంభించుచు మొదటి మూడు శ్లోకములలో కర్మయోగముయొక్క పరంపరను గూర్చి తెలిపి అనాదియని నిరూపించుచు దానిని ప్రశంసించుచున్నాడు.

**శ్రీ భగవాన్ ఉవాచ :**

"ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహ మవ్యయం ।
వివస్వాన్ మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్ ॥" 1

భగవంతుడిట్లనెను :

అర్జునా ! వినాశరహితమైన ఈ యోగమును[1] నేను సూర్యునకు చెప్పియుంటిని. సూర్యుడు తన పుత్రుడైన వైవస్వతుడను మనువునకు చెప్పెను. మనువు తన పుత్రుడైన ఇక్ష్వాకు మహారాజునకు చెప్పెను.

"ఏవం పరంపరాప్రాప్త మిమం రాజర్షయో విదుః ।
సకాలే నేహ మహతా యోగో నష్టః పరంతప[2]॥ 2

పరంతపా ! ఈ విధముగా పరంపరగా వచ్చిన ఈ యోగమును మహర్షులు తెలుసుకొనినారు. కాని ఆ తరువాత ఆ యోగము చాలాకాలముగా భూమండలమునందు లోపించినట్లయ్యెను.

సఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః ।
భక్తోఽసి మేసఖా చేతిరహస్యం హ్యేత దుత్తమమ్॥ 3

---

1. భగవద్గీత 2వ అధ్యాయమందు ముప్పది తొమ్మిదవ శ్లోకమందు కర్మయోగమును వర్ణించుటకు ఆరంభించెదనని భగవంతుడు ప్రతిజ్ఞచేసి ఆ యధ్యాయము చివరిదాకా కర్మయోగమునే విశేషముగా ప్రతిపాదించెను. తరువాతకూడా మూడవ అధ్యాయము చివరిదాకా తరచుగా కర్మయోగమున అంగప్రత్యంగ పూర్వకముగా ప్రతిపాదించెను. ఇదిగాక ఈ యోగముయొక్క పరంపరను గూర్చి తెలుపుచు భగవంతుడు సూర్యుడు మనువు మొదలైనవారిని పేర్కొనెను. వారందరు గృహస్థులు, కర్మయోగులు. దీనిచేతకూడా ఇచట యోగం అను పదమునకు కర్మయోగమనియే అర్థమని అంగీకరించుట యుక్తమని తెలియుచున్నది.

2. పరమాత్మ ప్రాప్తికి కర్మయోగ - జ్ఞానయోగ - భక్తియోగాదులు యెన్ని సాధనములున్నవో యవియన్నియు నిత్యములు. అవి యెప్పుడుకూడా అభావమును పొందవు. పరమేశ్వరుడు నిత్యుడైనపుడు ఆయనను చేరుటకుగాను ఆయనచేతనే నిశ్చయింపబడిన అనాది నియమములు అనిత్యములు కాజాలవు. ప్రపంచోత్పత్తియైనప్పుడెల్ల భగవంతుని నియమములన్నియు ఆయనతోనే ప్రకటితములగును. ప్రపంచ ప్రళయమైనపుడు ఆ

అర్జునా! నువ్వు నాకు భక్తుడవు, ప్రియసఖుడవు నగుటచేత అటువంటి యాపురాతన యోగమును నేడు నీకు చెప్పితిని. యెందుకనగా యిది చాలా మహోత్తమ రహస్యము[1]. సుమా! అనగా యిది గుప్తముగా నుంచదగిన విషయమని భావము.

## అర్జున ఉవాచ

అపరం భవతో జన్మ పరంజన్మ వివస్వతః ।
కథ మేతద్విజానీయాం త్వమాదౌ ప్రోక్తవానితి ॥ 4

అర్జునుడిట్లనెను :

కృష్ణా! నీ జన్మము యిప్పటిది కదా! సూర్యుని జన్మమైతేనో చాలా పురాతనమైనది. అనగా ఈ కల్పాదియందు అది జరిగెను. అట్లుండగా నీవే కల్పాదియందు సూర్యునకీయోగము చెప్పినావనుమాట నేనెట్లు తెలిసికొనగలను?

---

నియమములుకూడా కనపడకుండా పోవును. కాని వాని అభావమే ఎప్పుడు కూడా వుండదు. ఈ విధముగా ఈ కర్మయోగముయొక్క అనాదిత్వమును నిరూపించుటకు పూర్వశ్లోకమునందు అది వినాశరహితమని చెప్పబడెను. కనుకనే ఈ శ్లోకమునందు ఆ యోగము చాలాకాలముగా నష్టమైనది అని చెప్పబడిన మాటకు చాలాకాలమునుండి ఈ భూలోకమందు ఆ యోగముయొక్క తత్త్వము తెలుసుకొన శ్రేష్ఠపురుషులు లేకపోయినారను అభిప్రాయము తెలియవలెను. ఈ కారణముచేతనే ఆ యోగము అప్రకటితముగానున్నదని, దానికి ఈ లోకమునందు తిరోభావము కల్గినదని, దానికి అభావము కలుగలేదనియు తెలుసుకొనవలెనో అది భగవంతునివలె అనాదియే. ఆయనతోనే యుగాదిని కనబడుచు ప్రళయమునందు కనబడకయుండును.

1. ఇట్లు చెప్పుటచేత భగవంతుడు "ఈ యోగము అన్నివిధముల దుఃఖమునుండి బంధనములనుండియు మనుష్యునకు విముక్తి కలిగించి పరమానంద స్వరూపుడు, పరమేశ్వరుడు అయిన నన్ను సులభముగా చేర్చునది కాబట్టి అది మిక్కిలి ఉత్తమము రహస్యమునైనది" అని తెలిపెను. ఇదియే

శ్రీ భగవాన్ ఉవాచ :

బహూని మే వ్యతీతాని జన్మాని[1] తవ చార్జున ।
తాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప ॥ 5

భగవంతుడిట్లనెను :

పరంతపా ! నాయొక్క, నీయొక్కయు జన్మలు అనేకములు గడచినవి. ఆ జన్మలన్నిటిని నీ వెఱుగవు. కాని నేనెఱుగుదును.

సంబంధము :-

'ఇంతవరకు నాకు అనేక జన్మములు గడచినవి' అను భగవంతుని మాటలు విని, 'నీ జన్మము ఏ ప్రకారము అగును ? నీ జన్మమునకు ఇతరుల జన్మములకు భేదమేమి ?' అని తెలిసికొనుటకు అర్జునునకు కోరికయుండవచ్చునను విషయము భగవంతుడు వివరించుటకు తన జన్మముయొక్క తత్త్వమును యిట్లు చెప్పు చున్నాడు :-

---

కాక భగవంతుడు తాను సూర్యాదులకు ఈ యోగమునుపదేశించినట్లు తెలిపి ఆ యోగమును నేను నీకు చెప్పియుంటిని. నీవు నాకు భక్తుడవు. అని అర్జునునకు చెప్పెను. నేను ప్రకటించిన నా యీశ్వరభావము చాలా రహస్యమను భావముకూడా వున్నది.

1. ఇక్కడ భగవంతుడు "నేను నీవు యిప్పుడే జన్మించితిమి. దీనికిపూర్వము లేకుంటిమి అను విషయములేదు". అని అర్జునునకు తెలుపుచూ మనము అనాదికాలమునుండి వున్నాము. నిత్యులము అను భావముకూడా తెలిపెను. నేను నిత్యస్వరూపుడునను విషయము స్పష్టమే. ఇంతియే కాక నేనింతకు పూర్వమనేక రూపములలో ప్రకటితుడనైతిని కాబట్టి ఈ యోగమును నేను తొలుత సూర్యునకు చెప్పితినను మాటకు 'కల్పాదియందు నేను నారాయణ స్వరూపుడనుగా నున్నపుడు సూర్యునకు ఈ యోగమును చెప్పితిని' అనుమాటకు ఇదియే అభిప్రాయము.

అజో౽పి[1] సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోపి సన్ ।
ప్రకృతిం స్వామధిష్ఠయ సంభవామ్యాత్మమాయయా ॥ 6

"అర్జునా ! నేను జన్మరహితుడనైనను, వినాశరహిత స్వరూపుడునైనను, సమస్తప్రాణములకు ఈశ్వరుడైనను, నా ప్రకృతిని అధీనములోనుంచుకొని, నా మాయచేత ప్రకటితుడగుచుందును."[2]

---

1. భగవంతుని శక్తిరూపముల ప్రకృతి వర్ణనము, గీత తొమ్మిదవ అధ్యాయమునందు ఏడవ-ఎనిమిదవ శ్లోకములయందు చెప్పబడినది. పదునాలుగవ అధ్యాయమునందు 'మహద్బ్రహ్మ' యని చెప్పబడిన 'మూలప్రకృతి'ని తెలుపు శబ్దము ఇక్కడ 'స్వాం' అను విశేషణముతో గూడిన 'ప్రకృతిం అను పదముచేత చెప్పబడినది. భగవంతుడు తన యోగశక్తిచేత, సర్వ ప్రపంచమును ధరించు అసాధారణశక్తిచేత, ఆయా వివిధములైన రూపములు ధరించి, లోకులయెదుట ప్రకటితుడగును. దేనియందు ఆయన దాగియుండుటచేత లోకులు ఆయనను గుర్తుపట్టజాలరో, దానిని బోధించు శబ్దమునకు ఇక్కడ 'ఆత్మమాయయా' అని కలదు.

2. ఒకవేళ నేను జన్మ - వినాశరహితుడను - వాస్తవములో నాకు జన్మముగాని, వినాశనముగాని యెప్పుడుగూడ కలుగనప్పటికిన్నీ, ఒక సామాన్య వ్యక్తివలె జన్మించుచు, నశించుచున్నట్లు కనపడుచుందును. ఈ విధముగనే సమస్తమైన ప్రాణులకు ఈశ్వరుడనైనను ఒక సామాన్యునివలె కనపడుచుందును. ఇందలి అభిప్రాయమేమనగా నాయవతార తత్త్వమును యెరగనివారు, నేను మత్స్య-కూర్మ-వరాహ మనుష్యాది రూపములలో అవతరించినప్పుడు నేను జన్మించినాననియు, నేను అంతర్ధానము చెందినపుడు నేను నశించినాననియు తలచెదరు. నేను ఆయా యవతారములలో దివ్యలీలలు చేసినప్పుడు, నేను తమవంటి సాధారణ వ్యక్తినని తలచి, నన్ను తిరస్కరించుచుందురు. (గీ-9-11) "ఇతడు సర్వశక్తిమంతుడు, సర్వేశ్వరుడు, నిత్య-శుద్ధ-బుద్ధ-ముక్త స్వభావుడు, సాక్షాత్తు పరిపూర్ణబ్రహ్మమైన పరమాత్ముడే జగత్కల్యాణార్థమై యీ రూపములో అవతరించి లీలలు చేయుచున్నాడు " అని అమాయకులైన

సంబంధము :

ఈ విధముగా భగవంతుని ముఖమునుండి ఆయన జన్మతత్త్వము వినిన తరువాత, "నీవు ఏయే సమయములయందు ఏయే కారణములచేత ఈ విధముగా అవతారములను ధరించెదవు?'' అని అర్జునునికి జిజ్ఞాస కలుగునని భగవంతుడు, రెండో శ్లోకములో తన యవతారముల యావశ్యకతగూర్చి, దాని కారణముల గూర్చి, ఉద్దేశ్యమునుగూర్చి యిట్లు చెప్పుచున్నాడు :-

యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।
అభ్యుత్థానమ ధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్ ॥ 7

"భారతా! ధర్మమునకు హాని అధర్మమునకు వృద్ధికలిగినప్పుడెల్ల[1] నేను నా రూపమును రచియించుకొనెదను. అనగా, సాకారరూపములో లోకుల యెదుట ప్రకటితుడగుచుందును."

పరిత్రాణాయ సాధూనాం[2] వినాశాయ చ దుష్కృతామ్ ।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥ 8

---

లోకులు తెలిసికొనజాలరు. ఎందుకనగా ఆ సమయములో నేను నా యోగమాయయను తెరలో దాగియుందును. (గీ-7-25)

1. ఋషికల్పులు- ధార్మికులు- యీశ్వరునియందు ప్రేమ గలవారు- సత్ప్రవర్తన గలవారు- నిరపరాధులు- దుర్బలులైన ప్రాణులపైన, బలవంతులు, దురాచారులునైన మనుష్యులు చేయు అత్యాచారములు ప్రబలుట, ఆ కారణముచేత లోకులలో సద్గుణములు- సత్ప్రవర్తనలు అత్యంతము లోపించి, దుర్గుణములు, అత్యాచారములు అధికముగా వ్యాపించుటయే ధర్మహాని.

2. ఏ పురుషులు 'అహింసా- సత్య-అస్తేయ- బ్రహ్మచర్యాది సామాన్య ధర్మములు అన్నియు, యజ్ఞ-దాన-తపస్- అధ్యయన- అధ్యాపన- పూజాపాల'నాది స్వస్వవర్ణాశ్రమ ధర్మాదులను పూర్తిగా పాలించెదరో, ఇతరులకు హితముచేయుట యెవరి స్వభావమో, యెవరు సద్గుణ సంప

"అర్జునా! సాధుపురుషులను ఉద్ధరించుటకు, పాపకర్ములు చేయువారిని[1] వశింపజేయుటకు, ధర్మమును బాగుగా స్థాపించుటకున్ను[2] నేను ప్రతియుగము నందున్ను అవతరించుచుందును."[3]

---

న్నులో, సత్ప్రవర్తనగలవారో, శ్రద్ధతో ప్రేమపూర్వకముగా నెవరు భగవంతుని 'నామ-రూప-గుణ-ప్రభావ లీలా'దులను శ్రవణ-కీర్తన-స్మరణాదులను చేయు పరమభక్తులో, అట్టివారిని బోధించు శబ్దమిక్కడ 'సాధు' అని యెరుగవలెను.

1. ఏ మనుష్యులు 'నిరపరాధులు-సదాచారులు - భగవద్భక్తులు'నైన వారిపై అత్యాచారము చేయుచుందురో ఎవరు 'అసత్య-చౌర్య కపట-వ్యభిచా'రాది దుర్గుణములు, దురాచారములు గలవారో, ఎవరు వివిధములైన అన్యాయములుచేసి ధనము సంపాదించెదరో, ఎవరు నాస్తికులో, భగవంతుని వేద శాస్త్రములను విరోధించుట యెవరి స్వభావమైయున్నదో, అట్టి అసుర స్వభావముగల దుష్ట పురుషులను దెలుపు శబ్దమిచ్చట 'దుష్కృతాం'అని యున్నది.

2. స్వయముగా శాస్త్రానుకూలాచరణముచేసి, వివిధ ధర్మముల మహత్త్వమును చూపి, లోకుల హృదయముల నాకర్షించు అసమానపు భావముగల వాక్కుచేత ఉపదేశములు - ఆదేశములుచేసి, అందరి యంతఃకరణములందు, వేద-శాస్త్ర పరలోక-మహాపురుష-భగవానులపై శ్రద్ధకలిగించుట, సద్గుణ - సత్ప్రవర్తనలయందు విశ్వాసముకలిగించి, లోకులయందు ఈయన్ని సద్గుణములను స్థిరత్వముతో, పూర్తిగాధరింపజేయుట ఈయన్ని విషయములు ధర్మస్థాపనలో చేరియున్నవి

3. ఒకవేళ భగవంతుడు అవతారమెత్తకుండనే అనాయాసముగ ఈయన్ని పనులు చేయగలిగినప్పటికిన్నీ, చేయుచున్నప్పటికిన్నీ లోకులయందు విశేషదయచేత ఆయన తన దర్శన-స్పర్శన-భాషణాదులచేత సులభముగా లోకులనుద్ధరించు సదవకాశమిచ్చుచున్నాడు.

ఆ యవతారములయందు భగవంతుడు ధరించు'రూప గుణ-ప్రభావ-నామ-మాహాత్మ్య-దివ్యకర్మ శ్రవణ-కీర్తన-స్మరణములు' ఛని లోకులు సహజ

జన్మ కర్మ చ మే దివ్యమేవం యో వేత్తి తత్త్వతః ।
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున ॥ 9

"అర్జునా ! నా జన్మ, కర్మ రెండున్ను దివ్యములు. అనగా, అవి నిర్మలములు, అలౌకికములు. అని ఏ మనుష్యుడు తత్త్వతః తెలిసికొనునో,[1] అతడు శరీరత్యాగము చేసిన తరువాత పునర్జన్మము పొందడు. నన్నే చేరుకొనును.

---

ముగనే సంసార సముద్రమును దాటెదరు. ఈ పనులు భగవంతుడు అవతరించకుండ జరుగవు.

1. సర్వశక్తిమంతుడు - పరిపూర్ణబ్రహ్మమునైన పరమేశ్వరుడు వాస్తవముగ జనన మరణములకు అతీతుడు ఆయన జన్మ జీవులజన్మ యటువంటిది కాదు. ఆయన తన భక్తుల ననుగ్రహించి, తన దివ్యలీలలద్వారా వారి మనస్సు తనవైపు ఆకర్షించుకొనుటకు, దర్శన-స్పర్శ - భాషణాదులచేత వారికి సుఖము కలిగించుటకు ప్రపంచమునందు తన దివ్యకీర్తిని వ్యాపింపజేసి, దాని, శ్రవణ-కీర్తన-స్మరణములద్వారా లోకుల పాపములను నశింపజేయుటకు, ప్రపంచమునందలి పాపాచారులను నశింపజేసి ధర్మస్థాపనము జేయుటకున్నూ జన్మధారణమును లీలామాత్రముగనే జేయుచుండును. ఆయన జన్మము నిర్దోషము, అలౌకికము. జగత్కల్యాణముకొరకు భగవంతుడిట్లు మనుష్యుని రూపములో లోకులయెదుట అవతరించును. ఆయన మనుష్యాది రూపములలో కేవలము లోకులయందలి దయచేతనే అవతరించును. ఈ విషయములు పూర్తిగా తెలిసికొనుటయే భగవంతుని జన్మను తాత్త్వికముగా దివ్యమని తెలిసికొనుటయగును.

భగవంతుడు సృష్టిరచన, అవతారలీలలు మున్నగు కర్మలేవి చేయుచున్నాడో వానిలో కొంచెముగూడ ఆయన స్వార్థములేదు. కేవలము లోకులననుగ్రహించుటకే ఆయన మనుష్యాద్యవతారములలో వివిధ కర్మలు చేయుచుండును. (గీ-3-22,23) భగవంతుడు తన ప్రకృతిద్వారా సమస్తమగు కర్మలు చేయుచున్నప్పటికిన్నీ, ఆ కర్మల కర్తృత్వ భావమాయనకు లేకుండుటచేత, వాస్తవముగ ఆయన ఏమియు చేయడు.

వీతరాగ భయక్రోధా మన్మయా [1] మాముపాఽశ్రితాః [2]
బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః. 10

కర్మబంధనములో చిక్కుకొనడు. భగవంతునకు ఆ కర్మలఫలితమందు కొంచెముగూడ స్పృహలేదు. (గీ-4-13,14) భగవంతుడు ఏ కర్మ నైనను లోకకల్యాణార్థమే చేయును. (4.8) ఆయనచేయు ప్రతియొక్క కర్మలో లోకులహితము నిండియుండును. అతడు అనంతకోటి బ్రహ్మాండ మునకు ప్రభువైనను, సామాన్యులతో అభిమాన రహితుడై మమకార - దయ ప్రేమలలో వ్యవహరించును. (9-29) ఎవడు ఏవిధముగా ఆయనను భజించునో ఆయనగూడ అతనిని అట్లే భజించును (గీ-4-11) ఆయన తన అనన్యభక్తుల యోగక్షేమములు తానే నడిపించును (గీ-9-22) వారికి దివ్యజ్ఞానమునిచ్చును (గీత- 10-10,14).

భక్తియనెడు నౌకలోకూర్చొనిన భక్తులను సంసార సముద్రమునుండి శీఘ్రముగానే ఉద్ధరించుటకు స్వయముగా వారికి కర్ణధారుడగున (గీ-12-7) ఈ విధముగా భగవంతుని కర్మలన్నియు అనక్తి-అహంకార-కామనాది దోషరహితములై పూర్తిగానవి నిర్మలములు - పరిశుద్ధములుగానుండి, కేవలము లోకకళ్యాణముకొరకు నీతి-ధర్మ-పరిశుద్ధ ప్రేమ భక్తి మొదలైనవి ప్రపంచమునందు ప్రచారము చేయుటకొరకు మాత్రమే యుండును. కర్మలన్ని చేయుచున్నప్పటికిన్ని, భగవంతునకు వాస్తవముగా ఆ కర్మలతో ఏమాత్రము సంబంధములేదు- ఆయన పూర్తిగా వానికి అతీతుడు అకర్తగానున్నాడు. ఈ విషయమును పూర్తిగా తెలిసికొనవలెను. దీనిలో కొంచముగూడ అసంభవము విపరీతభావనలేకుండ పరిపూర్ణ విశ్వాసము కలుగుటయే భగవంతుని కర్మములు-తాత్త్వికముగా దివ్యములని తెలిసికొనుట యగును.

1. భగవంతునియందు అనన్య ప్రేమ కలిగి యుండుటచేత, ఎవరికి అంతటను, భగవంతుడే కనపడుచుండునో వారిని గూర్చి తెలుపు శబ్దమిచట 'మన్మయా' అని ప్రయోగింపబడినది.

2. ఎవరు భగవంతుని శరణజొచ్చెదరో, పూర్తిగా భగవంతునిపైన భారము

అర్జునా మొదట యెవరి రాగ- భయ- క్రోధములు పూర్తిగా నష్టము లైనవో, యెవరు నాయందు అనన్య భావముతో స్థిరముగానున్నారో, అటువంటి నా యాశ్రితులు చాలమంది భక్తులు పైన చెప్పబడిన జ్ఞాన తపస్సుచేత పవిత్రులై నన్నుపొందినారు[1].

యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహమ్ ।
మమ వర్త్మాఽనువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః ॥ 11

అర్జునా భక్తులు నన్ను ఏ విధముగా భజించెదరో, వారిని నేను గూడ

---

వేసి యుందురో, సర్వదా ఆయనయందే యుండి సంతుష్టులై యుండెదరో ఎవరికి తమ కొరకైన కర్తవ్యమేదియునుండదో, ఎవరు- అంతయు భగవంతునిదే, యని తలచి, ఆయన యాజ్ఞను పాలించు నుద్దేశముతో, ఆయనకు చేయు సేవలుగానే తమ కర్మలన్ని చేసెదరో, అటువంటి వారిని గూర్చి మాముపాశ్రితాః, అను పదమిచట వాడబడినది.

1. ఇక్కడ సాంఖ్య యోగ ప్రసంగములేదు. ఇది భక్తి ప్రకరణము పూర్వ శ్లోకమునందు భగవంతుని జన్మ- కర్మలు దివ్యములని తెలిసికొని నందుకు ఫలము భగవత్ప్రాప్తియని తెలుపబడెను. ఆ విషయమును ధ్రువపరచుటకే యీ శ్లోకము చెప్పబడినది. కాబట్టి యిక్కడ జ్ఞాన తపసా అను పదమునందు, జ్ఞానమనగా, ఆత్మ జ్ఞానం. అని తలచకుండ భగవంతుని జన్మ- కర్మలు దివ్యములని తలచుట అను జ్ఞానమనియే తలచబడినది ఈ జ్ఞాన తపస్సు యొక్క ప్రభావముచేత, మనుష్యునకు భగవంతునియందు అనన్య ప్రేమ కలుగును. అతని సర్వపాప- తాపములు నశించును. అతని యంతఃకరణమునందు సర్వ విధ దుర్గుణములు పూర్తిగా లేకుండపోవును. అతని సర్వకర్మలు, భగవంతుని కర్మలవలె దివ్యములగును. అతడెప్పుడు గూడ భగవంతుని నుండి విడిపోవడు. అతనికి భగవంతుడు సర్వదా ప్రత్యక్షముగా కనబడును. ఇదియే భక్తులు జ్ఞాన తపస్సుచేత పవిత్రులై భగవంతుని పొందుట యగును.

అట్లే భజించెదను. [1] ఎందుకనగా, మనుష్యులందరు అన్ని విధముల నా మార్గమునే అనుసరించెదరు. [2]

సంబంధము :- ఒకవేళ, ఇట్లే అయిన యెడల, లోకులు భగవంతుని భజించక, యితర దేవతలనెందుకు ఉపాసించెదరు. దీనిపైన భగవంతుడిట్లను చున్నాడు.

---

1. దీనిచేత భగవంతుడు తెలిపిన భావమేమనగా నాభక్తులు చేయు భజన ప్రకారములు భిన్న భిన్నములు. భక్తులు తమ తమ భావనను అనుసరించి నా వేర్వేరు రూపములను తలచెదరు. తమ తమ భక్తి భావము ననుసరించి నన్ను భజించెదరు స్మరించెదరు. కనుకనే నేను గూడ వారికి వారి భావనననుసరించి ఆ యా రూపములలోనే దర్శనమిచ్చెదను. వారు ఎట్లు, ఏయే భావముతో నన్ను ఉపాసించెదరో, నేను, వారి యొక్క ఆయా విధములైన భావములనే అనుసరించెదను. నన్ను గూర్చి చింతనము చేయు వారిని గూడ గూర్చి నేను చింతించెదను. నాకొరకు వ్యాకులపడు వారి కొరకు నేను గూడ వ్యాకులము చెందెదను. నా వియోగమును సహించజాలని వారి వియోగమును నేను గూడ సహించ జాలను. తమ సర్వస్వమును నాకు అర్పించినవారికి నేను గూడ నా సర్వస్వమును అర్పించెదను. గొల్లవారువలె, బాలకులు వలెను నన్ను తమ సఖునిగా భావించి భజించువారితో పుత్రునివలె వ్యవహరించుచు వారికి శ్రేయస్సు కూర్చెదను. ఇట్లే రుక్మిణివలె నన్ను పతిగాభావించి భజించువారికి పతివలె, హనుమంతుడువలె నన్ను ప్రభువుగా తలచి సేవించు వారితో ప్రభువు వలెను గోపికలు వలె మాధుర్య భావముతో సేవించువారితో ప్రియతముని వలెను వ్యవహరించి, నేను వారికి శ్రేయస్సు చేకూర్చెదను. వారికి నాదివ్య లీలా రసమును అనుభవింప జేసెదను అని.

2. దీనిచేత భగవంతుడు తెలిపిన దేమనగా, లోకులు నన్ను అనుసరించెదరు, కనుక, నేనొక వేళ, ఇట్లు ప్రేమతో సుహృద్భావముతో వ్యవహరించిన యెడల, ఇతరులుగూడ, నాయెదుటనే యిట్టి నిస్స్వార్థభావముతో

కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః ।
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా ॥ 12

అర్జునా ఈ మనుష్య లోకమునందు కర్మ ఫలములను కోరువారు దేవతలను పూజించెదరు. ఎందుకనగా, వారికి కర్మలనుండి కలుగు సిద్ధి శీఘ్రముగా లభించును.

చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః ।
తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తారమవ్యయమ్ ॥ 13

అర్జునా బ్రాహ్మణ- క్షత్రియ- వైశ్య- శూద్రులు అను నాలుగు జాతుల వారిని గుణ- కర్మల విభాగ పూర్వకముగా నేనే సృష్టించితిని. [1] ఈ విధముగా

---

పరస్పరము, తగినట్లుగా, ప్రేమతో, మిత్రభావముతోను వ్యవహరించెదరు. కనుక, ఈ నీతిని ప్రపంచమునందు ప్రచారము చేయుటకుగూడ, ఇట్లు చేయుట నా కర్తవ్యమగును అని.

1. అనాదిగా జీవులు జన్మ- జన్మాంతరములందు ఏ కర్మలు చేసిరో, వేని ఫలానుభవము వారికి కలుగలేదో, వానిననుసరించి జీవులకు వారివారి యోగ్యతానుసారముగా, సత్వ- రజస్- తమోగుణముల హెచ్చు తగ్గులు కలుగుచుండెను. భగవంతుడు మనుష్యులను సృష్టించినపుడు, వారివారి గుణ కర్మల ననుసరించి, వారిని బ్రాహ్మణాది జాతులలో పుట్టించును. దానితో పాటే, పితరులు, తిర్యక్కులు (పశు. పక్షి, మృగాదులు) మొదలైన వేర్వేరు యోనులను గూడ భగవంతుడు జీవుల గుణ కర్మల ననుసరించి రచించునని తెలియవలెను. ఇందుచేత, ఈ సృష్టి రచనాది కర్మలందు భగవంతునకు కొంచెము గూడ వైషమ్యము లేదు. ఈ భావమును తెలుపుటకే, యిక్కడ నేను నాలుగు వర్ణములను గుణకర్మల విభాగ పూర్వకముగా రచియించితిని అనుమాట చెప్పబడెను.

ఆధునికులు "బ్రాహ్మణాదిజాతుల విభాగము జన్మచేత అంగీకరించవలెనా లేక కర్మచేతనా! అని ప్రశ్నించుచుందురు. దానికి ఉత్తరము ఇట్లు చెప్పవచ్చును." ఒకవేళ జన్మకర్మలు రెండే, వర్ణమునకు (జాతికి) అంగములగుట

ఆ సృష్టి- రచనలకు నేను కర్తయైనప్పటికిన్ని, వినాశరహితుడు పరమేశ్వరుడు నగు నన్ను అకర్తగానే తెలిసికొనుము.[1]

---

చేత వర్ణముయొక్క పరిపూర్ణత్వము ఆ రెండింటిచేతనే అయినప్పటికిన్ని ఈ రెంటిలో ప్రాధాన్యము జన్మకేకలదు. కనుక, జన్మచేతనే బ్రాహ్మణాది వర్ణముల విభాగము అంగీకరించవలెను. ఎందుకనగా, ఒకవేళ, తల్లిదండ్రులు ఒకవర్ణమువారై, ఏ విధముగగూడ జన్మలో సాంకర్యము లేనియెడల, సహజముగానే కర్మలయందుగూడ తరచుగా, సాంకర్యము రాదు. కాని, సంగదోషము. ఆహారదోషము, దూషితమైన విద్య-సంస్కారము మొదలైన కారణములచేత కర్మలయందు ఎక్కడనైన, ఏదైన వ్యతిక్రమము కలిగినప్పటికిన్ని జన్మనుబట్టియే, వర్ణమును అంగీకరించిన యెడల వర్ణరక్షణము జరుగగలదు. అయినప్పటికిన్ని, కర్మపరిశుద్ధి చేయవలసిన ఆవశ్యకత తక్కువైనదేమియుకాదు. కర్మ పూర్తిగా నష్టమైన తరువాత వర్ణ రక్షణము అతి కఠినమగును. కనుక, జీవన నిర్వాహ-వివాహాది వ్యవహారములలోనైతే జన్మప్రధానమని, శ్రేయః ప్రాప్తికికర్మప్రధానమనియు నంగీకరించవలెను. ఎందుకనగా ఒకవేళ జాతిలో బ్రాహ్మడైనను, అతని కర్మ బ్రాహ్మణోచితము కానియెడల, అతనికి శ్రేయస్సు కలుగదు. సామాన్య ధర్మమునననుసరించి, శమ-దమాది గుణములను పాలించువాడు, మంచి ఆచరణ కలవాడునైన శూద్రుడుగూడ, ఒకవేళ, బ్రాహ్మణోచితములైన యజ్ఞాదికర్మలు చేయుచు, వానితోనతడు తన జీవన నిర్వాహమును జరిపికొనుచుండిన యెడల, నతడు పాపమును చెందడు.

1. దీనిచేత భగవంతుని కర్మల దివ్యత్వభావము ప్రకటింపబడినది. ఇందలి యభిప్రాయమేమనగా, "భగవంతునకు ఏ కర్మయందుగూడ రాగద్వేషములుగాని, లేక కర్తృత్వముగాని ఉండదు. ఆయన సర్వదా, ఆ కర్మలకు పూర్తిగా అతీతుడు. అతని వద్దనున్న అతని ప్రకృతియే, సర్వకర్మలు చేయుచుండును. ఈ కారణముచేత ఆ సర్వకర్మలకు కర్త భగవంతుడని లోకవ్యవహారము కలదు. వాస్తవములో, భగవంతుడు సర్వదా ఉదాసీనుడు (దేనియందున్ను ఆసక్తిలేనివాడు) కర్మలతో ఆయనకు ఏ మాత్రముగూడ సంబంధములేదు. (గీత 9-9, 10)

న మాం కర్మాణి లింపంతి న మే కర్మఫలే స్పృహా।
ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే ॥ 14

అర్జునా! కర్మఫలములందు నాకు స్పృహలేదు. కాబట్టి నన్ను కర్మలు అంటవు. అని యీ విధంగా, నన్ను తత్త్వతః తెలిసికొనినవాడుకూడ కర్మ బంధములో చిక్కుకొనడు.[1]

ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః।
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్॥ 15

పూర్వకాలమునందలి ముముక్షువులు (మోక్షమునందిచ్ఛగలవారు) గూడ ఇట్లు తెలిసికొనియే, కర్మలు చేసిరి.[2] కాబట్టి నీవుకూడ అర్జునా! పూర్వులు సర్వదా చేసిన కర్మలనే చేయుము. (ఇది కొత్తగా యిప్పుడు ఏర్పడిందికాదు).

---

1. పైన చెప్పబడిన వర్ణననుసరించి "ప్రపంచ రచనాది సమస్తకర్మలు చేయుచున్నను భగవంతుడు వాస్తవముగా అకర్తయేయగును. ఆ కర్మలతో ఆయనకు ఏమాత్రము సంబంధములేదు. ఆయన కర్మలయందు లేశమాత్రముగూడ వైషమ్యములేదు. కర్మఫలములందు ఆయనకు కించిన్మాత్రముగూడ మమకారముగాని, ఆసక్తిగాని, కామనగానిలేదు. కనుకనే అవి ఆయనను కర్మబంధనములందు పడవేయజాలవు." అని తెలిసికొనవలెను. ఇదియె పైనజెప్పబడిన విధముగా భగవంతుని తెలిసికొనుట యగును. ఇట్లు భగవంతుని కర్మల రహస్యమును యథార్థముగా తెలిసికొనిన మహాత్ముల కర్మలుగూడ భగవంతునకు వలెనే, మమకార-ఆసక్తి ఫలేచ్ఛా-అహంకారములు లేకుండ కేవలము లోకసంగ్రహముకొరకే చేయబడును. కనుకనే వారుగూడ కర్మబద్ధులుకారు.

2. ఏ మనుష్యుడు జననమరణ రూప సంసార బంధవిముక్తుడై పరమానంద స్వరూపుడైన పరమాత్ముని పొందగోరునో, ఎవడు ప్రపంచ సుఖములు, దుఃఖమయములు- క్షణభంగురములు అని తలచి వానియందు వైరాగ్యము గలవాడగునో, ఎవనికి ఇహలోక పరలోక సుఖములందు ఇచ్ఛలేదో, అతనిని "ముముక్షువు" అనెదరు. అర్జునుడుగూడ ముముక్షువుగానే యుండెను.

కిం కర్మ కిమ కర్మేతి కవయోఽప్యత్ర మోహితాః ।
తత్ తే కర్మ ప్రవక్ష్యామి యజ్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్॥

అర్జునా ! కర్మయనగానేమి ? అకర్మయనగానేమి ? అని ఇట్లు బుద్ధిమంతులుకూడా దీని నిర్ణయము చేయుటలో మోహం చెందెదరు. కాబట్టి ఆ కర్మతత్త్వమును నేను నీకు బాగుగా వివరించి చెప్పెదను. దానిని తెలుసుకొని నీవు అశుభమునుండి అనగా- కర్మబంధమునుండి విముక్తుడయ్యెదవు.

కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః ।
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః ॥ 17

అర్జునా ! కర్మ స్వరూపమునుగూడ తెలిసికొనవలెను.[1] అకర్మముయొక్క స్వరూపమునుగూడ తెలిసికొనవలెను. అట్లే వికర్మయొక్క స్వరూపమునుగూడ తెలుసుకొనవలెను.[2]

---

అతడు కర్మబంధన భయముచేత స్వధర్మ రూపకర్తవ్యత్యాగము చేయగోరుచుండెను. కనుకనే భగవంతుడు ఈ శ్లోకమునందు పూర్వపు ముముక్షువుల ఉదాహరణమిచ్చి కర్మలు విడిచినంత మాత్రముచేత మనుష్యుడు కర్మబంధములనుండి విముక్తుడుకాడు అని తెలిపి ఉదాహరణముగా పూర్వపు ముముక్షువులుగూడ, నా కర్మల దివ్య తత్త్వమును తెలిసికొని నావలెనే కర్మలయందు మమకార - ఆసక్తి ఫలేచ్ఛ- అహంకారములు విడిచి నిష్కామభావంతో తమ తమ వర్ణాశ్రమముల ననుసరించి, కర్మలనే ఆచరించిరి. అని తెలిపెను.

1. సాధారణంగా, మనుష్యులు శాస్త్రవిహిత కర్తవ్య కర్మలపేరే కర్మయని తలచెదరు. కాని, అట్లు తెలిసినంత మాత్రముచేతనే, కర్మస్వరూపం తెలిసికొనబడజాలదు. ఎందుకనగా దాని యాచరణమునందు భావభేదము యుండుటచేత, దాని స్వరూపమునందుగూడ భేదము కలుగును. కనుక తన అధికారము ననుసరించి, వర్ణాశ్రమోచిత కర్తవ్యకర్మల యాచరణము కొరకు, కర్మల తత్త్వమును తెలిసికొనవలెను.

2. సాధారణంగా మనుష్యులు మనస్సు-వాక్కు- శరీరము వీనిచేత చేయబడు.

సంబంధము :-

ఈ విధముగా శ్రోతయొక్క అంతఃకరణమునందు రుచి కలిగించుటకు, కర్మ తత్త్వము దురూహ్యమనియు దానిని తెలిసికొనుట అవశ్యకమనియు తెలిపి, యిప్పుడు తాను ప్రతిజ్ఞచేసిన చొప్పున భగవంతుడు కర్మతత్త్వమునుగూర్చి అర్జునునకు వివరించి చెప్పుచున్నాడు.

కర్మణ్యకర్మ యః పశ్యేదకర్మణి చ కర్మ యః ।
స బుద్ధిమాన్ మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్ ॥18

అర్జునా ! యేమనుష్యుడు కర్మయందు అకర్మచూచునో, ఎవడు అకర్మ

---

కర్మలను త్యజించుటయే, 'అకర్మ' అనగా కర్మరహితుడగుట, అని తలచెదరు. కాని ఈ విషయము తెలిసికొనినంత మాత్రముననే అకర్మ యొక్క వాస్తవ స్వరూపము తెలుసుకొనబడజాలదు. ఎందుకనగా భావ భేదముచేత ఇట్టి అకర్మకూడ కర్మగాగాని వికర్మగాగాని మారును. కనుక ఏభావంచేత, ఏవిధంగా చేయబడిన, ఏకర్మగాని, లేక కర్మ త్యాగముగాని, ఆయా భావభేదముచేతనే అకర్మయనబడును. ఈ విధంగా ఏ పరిస్థితులలో, ఏ మనుష్యుడు ఏ విధంగా కర్మాచరణము చేయవలెనను విషయముగూడ బాగుగా తెలిసికొని సాధనము చేయవలెను.

సాధారణంగా అసత్య-కపట- చౌర్య- వ్యభిచార- హింసాది, పాపకర్మల పేరే వికర్మయని, ప్రసిద్ధము కాని, ఇంతమాత్రము తెలిసినంతనే వికర్మ స్వరూపము యధార్థముగా తెలిసికొనబడజాలదు. ఎందుకనగా శాస్త్రతత్త్వముల నెరుగని యజ్ఞాని, పుణ్యముగూడ పాపమనుకొనును. పాపముకూడ పుణ్యమనుకొనును. 'వర్ణములు - ఆశ్రమములు - అధికారములు' వీని భేదముచేత ఒకనికొరకు విధింపబడు, ఏకర్మ కర్తవ్య కర్మయో అదియే యితరునికొరకు విషిద్ధకర్మయగుటచేత, పాపము (వికర్మ) అగును. ఎట్లైతే అన్నివర్ణములవారికి సేవచేసి జీవితము గడుపుట శూద్రునకు విహిత కర్మమైయుండగా అదియే బ్రాహ్మణునకు విషిద్ధ కర్మమగునో, దానము తీసికొని, వేదంనేర్పి యజ్ఞము చేయించి, జీవితం

యందు కర్మచూచునో, అతడు మనుష్యులలో బుద్ధిమంతుడు, ఆ యోగి అన్ని కర్మలను చేయువాడు.[1]

---

గడుపుట బ్రాహ్మణునకు కర్తవ్య కర్మమైయుండగా, అది ఇతర వర్ణముల వారికి నిషిద్ధమో, గృహస్థునకు న్యాయార్జిత ద్రవ్యమును కూర్చుకొని, ఋతుకాలమునందు స్వపత్నీ సంగమము ధర్మమైయుండగా, సన్యాసికి కాంచనమును కామినిని చూచుట స్పృశించుటగూడ పాపమగునో అట్లే వికర్మ విషయముగూడ గ్రహించవలెను. కనుక అసత్య-కపట-చౌర్య-వ్యభిచార-హింసాదులు సర్వసాధారణంగా నిషిద్ధములైనట్లే, అధికార భేదముచేత వేర్వేరు వ్యక్తులకు నిషిద్ధములైన కర్మలన్నియు విడుచుట కొరకు, వికర్మ స్వరూపం బాగుగా తెలుసుకొనవలెను.

1. యజ్ఞ దాన-తపస్సులు, వర్ణాశ్రమానుసారముగా జీవితము గడపుట శరీర నిర్వహణమునకు సంబంధించిన శాస్త్రవిహిత కర్మలు. వీటన్నింటియందు ఆసక్తి, ఫలేచ్ఛ, మమకారం, అహంకారము, విడుచుటచేత అకర్మలు ఈ లోకమునందు, పరలోకమునందున్ను, సుఖదుఃఖాది ఫలములను అనుభవించుటకు, పునర్జన్మకున్న హేతువులుకావు. తద్విపరీతముగానవి, మనుష్యుడు పూర్వము చేసిన శుభాశుభ కర్మలను నశింపచేసి అతనిని సంసార బంధములనుండి విముక్తుని చేయునవిగానగును. ఈ రహస్యము తెలిసికొనుటయే, కర్మయందు అకర్మ చూచుట యగును. ఈ విధంగా కర్మయందు అకర్మను చూచు మనుష్యుడు, ఆసక్తి-ఫలేచ్ఛ-మమకారము వీనిని విడిచియే యోగ్యతానుసారముగా, విహితకర్మలను ఆచరించును. కనుక అతడు కర్మచేయుచుగూడ, వాని సంబంధంలేని వాడగును. కాబట్టి అతడు మనుష్యులలో బుద్ధిమంతుడగును. అతడు కృత కృత్యుడైనాడు. కనుక అతడు సమస్త కర్మలు చేయుచుండువాడగును.

లోకములో, మనస్సు-వాక్కు, శరీరము, వీనియొక్క పనులు విడుచుటకు పేరే 'అకర్మ' అని ప్రసిద్ధమైయున్నది. త్యాగరూపమైన యీఅకర్మగూడ, ఆసక్తి, ఫలేచ్ఛ, మమకారము అహంకారము వీనితో చేసినప్పుడా కర్మ పునర్జన్మకు హేతువగును. ఇంతమాత్రమేకాదు, కర్తవ్య కర్మలను

సంబంధము :

ఈ విధముగా కర్మయందు అకర్మను అకర్మయందు కర్మను దర్శించుట యందలి మహత్త్వమును తెలిపి, యిప్పుడు ఐదు శ్లోకములలో, వేర్వేరు శైలులతో పైన చెప్పబడిన కర్మయందు అకర్మను, అకర్మయందు కర్మను దర్శించుచు కర్మచేయు సిద్ధులు - సాధకులునైన పురుషులయొక్క అసంగత్వమునుగూర్చి వర్ణించి, ఆ విషయమును భగవంతుడు స్పష్టపరచుచున్నాడు :-

యస్య సర్వే సమారంభాః కామ సంకల్పవర్జితాః ।
జ్ఞానాగ్నిదగ్ధ కర్మాణం తమాహుః పండితం బుధాః ॥ 19

అర్జునా ! యే పురుషుని శాస్త్రసమ్మత కర్మలన్నియు కామసంకల్పములు లేకయుండునో[1], ఎవని కర్మలన్నియు జ్ఞానము అనెడు అగ్నిచేత దహింపబడినవో[2], ఆ మహాపురుషులను, జ్ఞానులుగూడా పండితులని చెప్పెదరు.

---

పరిహసించి చులకనగా చూచుట చేతకాని లేక దంభాచారముచేత అవే చేయబడినప్పుడుగాని, యీ కర్మ వికర్మ (పాప) రూపములో మారిపోవును. ఈ రహస్యమును తెలుసుకొనుటయే అకర్మయందు కర్మను దర్శించుటయగును.

1. భార్యా- పుత్ర- ధన- గృహ, అభిమాన- గౌరవ- ప్రతిష్ఠా- స్వర్గ సుఖాదులు ఈ లోకమునందు, పరలోకమునందున్న ఎన్ని పదార్థములున్నవో వానియందు దేనిలోగూడ, కొంచెము అయినను కోరికయుండుట 'కామన' యనబడును. ఏవిషయమునైనను 'మమకార-అహంకార- రాగ- ద్వేష- రమణీయబుద్ధి' వీనితో స్మరించుటకు 'సంకల్పము' అని పేరు.

2. ఏవిధముగా అగ్నిలో వేగిన విత్తనములు కేవలము పేరునకే విత్తనములుగా నుండునో, వానియందు మొలకలు మొలచుశక్తి నశించిపోవునో అట్లే జ్ఞానమనెడు అగ్నిచేత సర్వ కర్మలయందు ఫలములు పుట్టించు శక్తి పూర్తిగా నశించిపోవలెను. ఇదియే ఆకర్మలు జ్ఞానాగ్నిచేత భస్మమగుట యనబడును.

త్యక్త్వా కర్మఫలాసఙ్గం నిత్యతృప్తో నిరాశ్రయః ।
కర్మణ్యభిప్రవృత్తోఽపి[1] నైవ కించిత్ కరోతి సః ॥" 20

అర్జునా! యే పురుషుడు సమస్త కర్మలయందు, కర్మఫలములందు ఆసక్తిని పూర్తిగా విడిచి, ప్రపంచము నాశ్రయింపకయుండునో, పరమాత్మయందు సర్వదా తృప్తుడైయుండునో[2], అతడు కర్మలయందు పూర్తిగా వ్యవహరించుచున్నప్పటికిని, వాస్తవములో ఏమియుచేయడు.

నిరాశీర్యత చిత్తాఽత్మా త్యక్త సర్వపరిగ్రహః[3] ।
శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥ 21

---

1. "మమకార-అహంకార-ఫలాసక్తులు"గల మనుష్యుడు, కర్మలను పూర్తిగా విడిచినప్పటికినీ కర్మబంధనములనుండి విముక్తుడు కాజాలడు. ఈ నిత్యతృప్తుడైన పురుషుడు సర్వకర్మలు చేయుచు గూడ వాని బంధనములందు చిక్కుకొనడు అను భావము ఇక్కడ "అపి"యను అవ్యయముచేత తెలుపబడెను.

2. ఆసక్తిని పూర్తిగావిడిచి, శరీరమునందు అహంకార–మమకార రహితుడై యుండుట, ఏ ప్రపంచ వస్తువునుగాని, మనుష్యునిగాని ఆశ్రయింపకుండుట అనగా, ఈ వస్తువుచేత, లేక మనుష్యునిచేతనే నా పని సాగును. ఇవియే నాకు ఆధారములు, ఇవి లేకుండ నా పనులు సాగవు అను భావములు పూర్తిగా లేకుండుటయే, 'నిరాశ్రయుడు'గా నుండుట యనబడును. ఇట్లైనపిదప, మనుష్యునకు ఏ ప్రాపంచిక పదార్థములందైనను కొంచెము గూడ ఆవశ్యకత యుండదు అతడు పూర్ణకాముడైపోవును. అతడు పరమానందస్వరూపుడైన పరమాత్మను పొంది నందు౯త, నిరంతరము ఆనందమునందు నిమగ్నుడై యుండును. అతని పరిస్థితిలో ఏ సంఘటనము చేతగూడ, ఎప్పుడుగూడ, కొంచెమైనను భేదము కలుగదు. అతడు "నిత్యతృప్తుడు" అగుట యనగానిదియె.

3. ఏ మనుష్యునకు ఏ ప్రాపంచిక వస్తువుల యవసరము కొంచెము గూడ నుండదో, ఎవడు, ఏ మనుష్యునినుండి, లేక కర్మనుండి ఏవిధమైన సుఖ

అర్జునా ! ఇంద్రియములతో, అంతఃకరణముతోగూడిన యెవని శరీరము జయింపబడియుండునో, ఎవడు సమస్త సుఖసామగ్రిని విడిచెనో, ఆశలేని అట్టి పురుషుడు, శరీరసంబంధ కర్మలు చేయుచుగూడ పాపము పొందడు[1].

యదృచ్ఛాలాభసంతుష్టో[2] ద్వంద్వాతీతో విమత్సరః ।
సమస్సిద్ధావసిద్ధౌచ కృత్వాఽపి న నిబధ్యతే ॥ 22

---

భోగములు కలుగునను ఆశ, లేక ఇచ్ఛ కొంచెముగూడ కలిగియుండదో ఎవడు. అన్ని విధములైన ఇచ్ఛా-కామనా వాసనాదులను పూర్తిగా విడిచి యుండునో, అట్టివాడు 'నిరాశి' యనబడును ఎవడు అంతఃకరణమును సర్వేంద్రియ సహిత శరీరమును తనవశములో నుంచుకొనునో, అనగా, ఎవనిమనస్సు ఇంద్రియములు రాగద్వేషరహితములై యుండుటచేత, వాని పైన శబ్దాది విషయముల ప్రభావము కొంచెముగూడ పడజాలదో, ఎవని శరీరముగూడ అతడు ఉంచుకొనగోరినట్లుండునో అతడు గృహస్థుడైనను, సన్న్యాసియైనను సరియే "యతచిత్తాత్ముడు" అగును, ఎవనికి, ఏ వస్తువు నందున్ను మమకారముండదో, ఎవడు సమస్త సుఖభోగ సామగ్రిని కూర్చుకొనుటను పూర్తిగా విడిచియుండునో, అట్టి సన్న్యాసి పరిపూర్ణముగా త్యక్త 'సర్వపరిగ్రహుడు' అనబడును. ఇతడేకాక యెవడైన 'ఇతరాశ్రమి' యైనను ఒకవేళ పైనచెప్పబడిన విధముగా సామగ్రి సంగ్రహమును పూర్తిగా విడుచునో, అతడుగూడ త్యక్త సర్వపరిగ్రహుడగునన బడును.

1. పైన చెప్పబడిన పురుషునకు యజ్ఞాదులు చేయనందుచేత కలుగు ప్రత్యవాయురూప పాపముగాని, శరీర నిర్వాహముకొరకు చేయబడు కర్మలలో కలుగు పాపముల సంబంధముగాని యుండదు. ఇదియే అతనికి పాపము అంటదు అనుమాటకు అభిప్రాయము.

2. తాను కోరికలేక యితరుల యిచ్ఛచేతగాని తన ప్రారబ్ధానుసారముగా గాని తనకు అనుకూలమైనదో ప్రతికూలమైనదో ఏదైన వస్తువు ప్రాప్తించి నప్పుడు. అది "యదృచ్ఛాలాభము" అనబడును. ఈ యదృచ్ఛాలాభము నందు ఎల్లప్పుడు ఆనందించుచు, ఏదైన అనుకూల వస్తువు లభించి

అర్జునా! ఎవడు తను కోరకయే తనంతట ప్రాప్తించు పదార్థములచేతనే సర్వదా సంతుష్టుడైయుండునో, యెవనియందు ఈర్ష్య పూర్తిగా లేకుండునో, ఎవడు హర్షశోకాది ద్వంద్వములకు పూర్తిగా అతీతుడైయున్నాడో, సిద్ధి అసిద్ధి యీ రెండింటియందు సమబుద్ధిగలఅటువంటి పురుషుడు[1], కర్మయోగియై కర్మలు చేయుచుకూడా వానిచేత బద్ధుడుకాడు.[2]

గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థిత చేతసః ।
యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే॥ 23

---

నప్పుడు దానియందు రాగముఉంచి, అది సర్వదా ఉండవలెనని గాని, అది వృద్ధిపొందవలెననిగాని కోరుచుండుట, ప్రతికూల వస్తువు ప్రాప్తించినపుడు దాని ద్వేషించుట, అది నశించవలెనను నిచ్ఛ గలిగి యుండుట విడిచి, ఈ రెండున్నూ భగవంతుని విధానమని, ప్రారబ్ధమని తలచి, సర్వదా శాంతుడై ప్రసన్నచిత్తముతో నుండుటయె "యదృచ్ఛాలాభము" నందు సర్వదా సంతుష్టుడై యుండుట యనబడును.

1. "యజ్ఞం, దానము, తపస్సు మొదలైన కర్తవ్య కర్మలేవైనను నిర్విఘ్నముగా నెరవేరుట. వాని సిద్ధి యనబడును. ఏవైన విఘ్నములు బాధలు– వీనిచేత అవి పూర్తిగా నెరవేరకుండుటయె "అసిద్ధి" యనబడును. ఈ విధముగనే ఏ ఉద్దేశముతో కర్మ చేయబడునో, ఆ ఉద్దేశము నెరవేరుట "సిద్ధి" నెరవేరకుండుట "అసిద్ధి" యనబడును ఇట్లు సిద్ధి, అసిద్ధి రెంటిలోను భేదబుద్ధి లేకుండుట, అనగా సిద్ధిలోహర్షము—ఆసక్తి మొదలైనవి లేకుండుట అసిద్ధిలో ద్వేషశోకాది వికారములు లేకుండుట, రెంటియందుగూడ ఒకేవిధమైన భావము ఉండుటయె "సిద్ధి అసిద్ధి" సమభావమగును.

2. ఏవిధముగ కేవలము శరీరసంబంధముగల కర్మలుచేయుచు. పరిగ్రహ [వస్తువులు కూర్చుకొనుట] రహితుడైన సాంఖ్యయోగి, యితరకర్మలు ఆచరించకున్నను కర్మచేయనందువలన కలుగు పాపము అతనికి అంటదో ఆ విధముగానే కర్మయోగి, విహితకర్మలు చేయుకున్నను, వాని బంధనములో చిక్కుకొనడు

అర్జునా ! యెవనికి ఆసక్తి పూర్తిగా నష్టమైపోయెనో, యెవడు దేహాభిమానము- మమకారము లేకయుండునో, యెవని చిత్తము నిరంతరము పరమాత్మజ్ఞానమునందు స్థిరముగా నిలిచియుండునో, కేవలము యజ్ఞ సంపాదనకొరకు మాత్రమే కర్మలుచేయు అటువంటి మనుష్యుని సర్వకర్మలు పూర్తిగా విలీనములై పోవును.[1]

సంబంధము :

పూర్వశ్లోకమునందు యజ్ఞముకొరకు కర్మలుచేయు పురుషుల సర్వకర్మలు విలీనములై పోవును. అని చెప్పబడెను. అక్కడ కేవలము అగ్నియందు హవిస్సును హుతము చేయుటయే యజ్ఞము, దానిని నెరవేర్చుటకు సలుపబడు క్రియలే, యజ్ఞముకొరకు కర్మలు చేయుటయగును. ఇంతియేకాదు ఈ భావమునే స్పష్టము చేయుటకు ఇప్పుడు భగవంతుడు ఏడు శ్లోకములలో వేర్వేరు యోగులచేత చేయబడు. పరమాత్మ ప్రాప్తికైన సాధనరూప కర్తవ్యకర్మల వివిధ యజ్ఞములను పేర్లతో వర్ణించుచున్నాడు.

---

1. తన వర్ణాశ్రమ పరిస్థితుల ననుసరించియె మనుష్యునకు ఏ శాస్త్రవిహిత కర్మలు కర్తవ్యములో అవియే అతనికొరకు యజ్ఞములు, శాస్త్రవిహిత కర్మలు చేయునుద్దేశముతోనే, ఏ కర్మలు చేయవలెనో, అనగా ఏ విధమైన స్వార్థ సంబంధము పెట్టుకొనక కేవలము లోకసంగ్రహరూప యజ్ఞముయొక్క పరంపరను సురక్షితముగా కాపాడుటకొరకే యే కర్మలను ఆచరించవలెనో, ఆకర్మలే యజ్ఞములకొరకు చేయబడు కర్మాచరణ మనబడును.

   పైన చెప్పబడిన విధముగా కవులుచేయు పురుషుని కర్మలు బంధకములు కావు. ఇంతమాత్రమేకాదు, మరి యెట్లైతే యేదైన గడ్డివామిలో అగ్నియంటిన గడ్డిని పడవేసినచో, అది తాను కాలినశించుటయేగాక, ఆ గడ్డివామినిగూడా కాల్చి భస్మముచేయునో, అట్లే 'ఆసక్తి-ఫలేచ్ఛ-మమకారము-అభిమానము' ఇవి విడుచుటయనెడు సగ్నియందు కాల్చి వేయబడిన కర్మలుగూడ పూర్వజన్మ సంచిత సమస్త కర్మలతోపాటు లయము చెందును. ఆ తరువాత అతడుచేసిన యే కర్మయందుగూడ ఏవిధమైన ఫలమునిచ్చు శక్తిగూడ ఉండదు.

"బ్రహ్మార్పణం బ్రహ్మహవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్ ।
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మ సమాధినా॥" 24

"ఏ యజ్ఞమునందు అర్పణము - అనగా హోమ సాధనములైన స్రుక్ స్రువాదులు గూడ బ్రహ్మమే. హోమద్రవ్యము (నేయి మొదలైనవి) గూడ బ్రహ్మమే. బ్రహ్మరూపుడైన కర్తచేత, బ్రహ్మరూపమైన అగ్నియందు, ఆహుతి యిచ్చుటయను క్రియ గూడ బ్రహ్మమే యగునో.[1] ఆ బ్రహ్మకర్మమునందు స్థిరముగా నున్న యోగిచేత పొందదగిన ఫలముకూడా బ్రహ్మమే యగును "

"దైవమేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే ।
బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి॥" 25

"అర్జునా ! యితర యోగిజనులు దేవతాపూజరూపమైన యజ్ఞమునే విశేషముగా అనుష్ఠించెదరు.[2] మరికొందరు యోగిజనులు పరబ్రహ్మ - పరమాత్మ

---

1. యజ్ఞమునందు స్రుక్ స్రవములు, హవిర్ద్రవ్యము, హోమము చేయువాడు, హోమ కర్మాదులు వేర్వేరు వస్తువులుగానుండవు ఇట్టి యజ్ఞములన్ని యు యోగిదృష్టిలో బ్రహ్మమేయగును. ఎందుకనగా ఏ మనస్సు బుద్ధి మున్నగువానిచేత సర్వప్రపంచము బ్రహ్మమేయని తలచుటకు అలవాటు చేసికొనునో, వానిని, తనను, ఈ అభ్యాసకర్మను లేక, యితర వస్తువును దేనినిగూడ బ్రహ్మముకన్న వేరుగ తలచడు అన్నిటిని అతడు బ్రహ్మస్వరూపముగానే చూచును. కనుక, అతనికి వానియందు ఏవిధమైన భేదబుద్ధి యుండదు.

2. శాస్త్ర సమ్మతులైన బ్రహ్మ-శివ-శక్తి-గణపతి-సూర్య-చంద్ర-ఇంద్ర వరుణాది దేవతలకొరకు హోమముచేయుట వారిని పూజించుట, వారి మంత్ర జపము చేయుట, వారినుద్దేశించి దానముచేయుట బ్రాహ్మణ భోజనము చేయించుట మొదలైన సమస్త కర్మలను తన కర్తవ్యములని భావించి, మమకార-ఆసక్తి-ఫలేచ్ఛలు లేకుండా కేవలం పరమాత్మ ప్రాప్తిని ఉద్దేశించి, శ్రద్ధా, భక్తి పూర్వకముగా శాస్త్ర విధానము ననుసరించి, పరి

రూపాగ్ని యందు జీవబ్రహ్మ భేదరూపమైన యజ్ఞహోమము చేసెదరు."[1]

"శ్రోత్రాదీనింద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి,
శబ్దాదీన్ విషయానన్య ఇంద్రియాగ్నిషు జుహ్వతి॥" 26

"అన్య యోగిజనులు శ్రోత్రాది సర్వేంద్రియములను సంయమ రూపమైన అగ్నియందు హోమము చేసెదరు.[2] తదితర యోగిజనులు శబ్దాది

---

పూర్ణముగా అనుష్ఠానము చేయుటయే, దేవతా పూజారూపయజ్ఞము బాగుగా అనుష్ఠించుట యగును.

1. అనాదికాలమునుండి యేర్పడిన అజ్ఞానము కారణముగా శరీరమును ఉపాధి (ఆధారము)గా చేసికొని ఆత్మ పరమాత్మల భేదము అనాదికాలము నుండి తోచుచున్నది. ఈ యజ్ఞానమువలన గలిగిన భేద ప్రతీతిని, జ్ఞానాభ్యాసముచేత తుడిచివేయుట-అనగా శాస్త్రముయొక్క గురువుయొక్కయు ఉపదేశముచే తెలిసిన తత్త్వజ్ఞానమును నిరంతరము, మననము-నిధిధ్యాసనము చేయగా చేయగా నిత్య విజ్ఞానానందఘనుడు గుణాతీతుడు పరబ్రహ్మమునైన పరమాత్మయందు అభేదభావముచేత, ఆత్మను ఏకము చేయుచు లయముచేయుటయే, బ్రహ్మమనెడు అగ్నియందు యజ్ఞముచేత యజ్ఞమును వేల్చుటయగును.

2. 'శ్రోత్ర, నేత్ర నాసికా జిహ్వాచర్మ'ములు అను పంచజ్ఞానేంద్రియములను వశపరచుకొని, వానిని అంతఃకరణమునందు ఉపసంహరించుకొని శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములు మున్నగు బాహ్యములు అంతరములునగు విషయములనుండి వివేకముతో ఆ యింద్రియములను తొలగించి, శాంతుడై యుండుటయే యింద్రియ సంయమరూపమైన అగ్నులయందు హోమము చేయుటయగును. దీని స్పష్టభావము, గీత రెండవ అధ్యాయమున, ఏబది యెనిమిదవ శ్లోకమున, కూర్మోదాహరణముతో తెలుపబడెను.

చెవులతో నిందాస్తుతులు అనుకూల ప్రతికూలములైన యితర శబ్దములను వినుచు, కన్నులతో, మంచిచెడు దృశ్యములనుచూచుచు, నాలుకచేత అనుకూల రూపరుచులను గ్రహించుచు. ఇట్లే అన్యేంద్రియములన్నిటిచేతగూడ. ప్రారబ్ధానుసారముగా అజ్ఞాత ప్రకారము ప్రాప్తించిన సమస్త

నమస్త విషయములను ఇంద్రియములనెడు అగ్నియందు హోమము చేసెదరు.[1]

"సర్వాణీంద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే ।
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే " 27

అర్జునా ! ఇతర యోగులు ఇంద్రియముల కర్మలన్నియు, ప్రాణముల క్రియలన్నియు జ్ఞానముచేత ప్రకాశించిన ఆత్మసంయమ యోగరూపమైన అగ్నియందు హోమము చేయుదురు.

"ద్రవ్యయజ్ఞాస్తపోయజ్ఞా యోగయజ్ఞాస్తథాఽపరే।
స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాశ్చ యతయః సంశితవ్రతాః॥" 28

చాలామంది ద్రవ్యసంబంధమైన యజ్ఞమును చేయువారుందురు.[2] ఎందరో

---

విషయములను అనాసక్తిచేత సేవించుచు అంతఃకరణమునందు సమభావము ఉంచుట, భేదబుద్ధివలన కలిగిన రాగద్వేష హర్షశోకాది వికారములు కలుగనీయకుండుట అను అవిషయములందు మనస్సునకు ఇంద్రియములకు గల విక్షేప (చలన)ము కలిగించు శక్తిని నశింపజేసి, ఆ విషయములను ఇంద్రియములందు లయింపజేయుచుండుటయే శబ్దాది విషయములను ఇంద్రియములనెడు అగ్నులయందు వేల్చుటయగును.

1. ఈవిధముగా "చూచుట-వినుట-ఆఘ్రాణించుట, స్పృశించుట, రుచిచూచుట-గ్రహించుట-విడుచుట-పలుకుట-చలించుట మొదలైన యింద్రియక్రియలు, ఊపిరిపీల్చుట విడుచుట, కదులుట పొరలుట మొదలైన ప్రాణసంబంధ క్రియలన్నియు, మనోనిగ్రహ పూర్వకముగా ధ్యానయోగమునందు విలయింపజేసి సమాధిస్థుడుకావలెను. ఇదియే ఆత్మసంయమయోగాగ్నియందు ఇంద్రియ ప్రాణ సర్వక్రియలను వేల్చుటయనబడును.

2. తమ వర్ణధర్మములననుసరించి, న్యాయముగా లభించిన ద్రవ్యములు, మమకార-ఆసక్తి-ఫలేచ్ఛలువిడిచి, అర్హత ననుసరించి, లోకసేవయందు ఉపయోగించుట అనగా, పైన చెప్పబడిన భావముచేత, బావులను-నూతులను-ధర్మశాలాదులను నిర్మించుట, ఆకలిగొన్నవారు-దిక్కులేనివారు-

తపస్స్వరూపమైన యజ్ఞము చేయువారున్నారు.[1] ఇతరులెందరో యోగమనెడు[2]

రోగులు-దుఃఖితులు అశక్తులు భిక్షుకులు మొదలైనవారికి, వారి అవసరమునుబట్టి, అన్న-వస్త్ర-జల-ఔషధ-పుస్తకాది వస్తువులిచ్చి వారిని సేవించుట, విద్వాంసులు తపస్వులు వేదపాఠకులు సత్ప్రవర్తకులు బ్రాహ్మణులు వీరికి గో-భూ-వస్త్ర భూషణాది పదార్థములను, వారి అర్హతను-తన శక్తి ననుసరించి దానముచేయుట, ఈ విధముగానే, ఇతర ప్రాణుల సుఖముకొరకుగూడా, యోగ్యతానుసారముగా ద్రవ్యవ్యయము చేయుట, ఇవి యన్నియు ద్రవ్యయజ్ఞమనబడును.

1. పరమాత్మను పొందునుద్దేశ్యముతో. అంతఃకరణమును, ఇంద్రియములను పవిత్రముచేయుటకు మమకార - ఆసక్తి-ఫలేచ్ఛా త్యాగపూర్వకముగా మాసోపవాసాదులుచేయుట ధర్మ పరిపాలనమునకు కష్టములను సహించుట, మౌనమును వహించుట, అగ్ని-సూర్యుల వేడిమి-వాయువును సహించుట ఒకటి రెండు వస్త్రములకంటే అధికము వదిలివేయుట, అన్నము విడుచుట, కేవలము పండ్లు పాలు గ్రహించి శరీర నిర్వహణముచేయుట, వనవాసముచేయుట ఇత్యాదులు, శాస్త్రవిధి ననుసరించి ఓర్పునకు సంబంధించిన కార్యములన్నింటిని తెలుపు పదమిక్కడ 'తపోయజ్ఞము'ని చెప్పబడినది.

2. చాలామంది సాధకులు పరమాత్మను పొందు నుద్దేశ్యముతో, ఆసక్తి - ఫలేచ్ఛా మమకారములను విడిచి, అష్టాంగ యోగ యజ్ఞమునే అనుష్ఠించెదరు యమ-నియమ ఆసన-ప్రాణాయామ-ప్రత్యాహార-ధారణా-ధ్యాన-సమాధులు, యోగముయొక్క యెనిమిది అంగములు. ఏ ప్రాణికైనను ఏవిధమైన కష్టము కొంచెమైనను, ఎప్పుడుగూడ కలిగించకుండుట "అహింస"యగును. హితభావనతో, కపటరహితముగా, ప్రియమైన, మాటలు ఉన్నదున్నట్లు పలుకుట 'సత్యము' అనబడును. ఏవిధముగ గూడ ఎవరి యొక్కగూడ స్వత్వము (హక్కు) లాగుకొనకుండుట 'అస్తేయము' అనబడును. మనస్సు-వాక్కు శరీరము ఈ మూడింటితో, అన్ని వయసులలోను సర్వదా మైథునమును విడుచుట 'బ్రహ్మచర్య'అనబడును. శరీర నిర్వాహణకుమించి, భోగ్య సామగ్రినెప్పుడుగూడ కూర్చుకొనక

యజ్ఞము చేయువారున్నారు. మరి యెందరో అహింసాది కఠిన వ్రత నియమము

యుండుట "అపరిగ్రహము" అనబడును. అహింసా, సత్యము, అస్తే యము-బ్రహ్మచర్యము, అపరిగ్రహము అను ఈ అయిదు "యమములు" అనబడును.

సర్వవిధములుగా, బాహ్య-ఆంతర పవిత్రతను నిలుపుకొనుట 'శౌచము' అనబడును. ప్రియాప్రియములు సుఖదుఃఖాదులు కలిగినపుడుకూడా సంతుష్టుడై యుండుట 'సంతోషము' అనబడును. ఏకాదశీ మొదలగు దిన ములలో ఉపవాసముచేయుట 'తపము' అనబడును. శ్రేయోదాయకము లైన శాస్త్రములను అధ్యయనముచేయుట, ఈశ్వరుని నామములను గుణ ములను కీర్తించుటయు, 'స్వాధ్యాయము' అనబడును. తన సర్వస్వమును ఈశ్వరునకై విడచి ఆయన యాజ్ఞను పాలించుట "ఈశ్వరప్రణిధానము" అనబడును. ఈ అయిదింటికిని 'నియమములు' అని పేరు.

సుఖ పూర్వకముగా స్థైర్యముతో కూర్చొనుట 'ఆసనము' అనబడును. ఆసనములు అనేక విధములుగనున్నవి. ఆత్మసంయమమును కోరు పురుషు లకు 'సిద్ధాసన-పద్మాసన - స్వస్తికాసనములు' మూడు చాలా ఉపయోగ కరములని తలచబడినవి. ఈ మూడింటిలో ఏ యాసనమునైననూ సరియే, కాని, "మేరుదండమువెన్నెముక-మస్తకము-మెడ ఈ మూడు అవశ్యముగా చక్కగా నిలిపి యుంచుకొని దృష్టి నాసికాగ్రమునందుంచుకొనవలెను. లేదా కనుబొమలమధ్యనైనను నుంచుకొనవలెను. ఈ విధముగా కూర్చొను టకు సోమరితనముచేత ఓపిక లేకున్న యెడల, కన్నులు మూసుకొనియైనను కూర్చొనవచ్చును. ఏ పురుషుడు ఏ యాసనమునందు చాలా సుఖముగా కూర్చొనగలడో అతనికి ఆ యాసనమే ఉత్తమమైనది.

బాహ్యవాయువు లోపలికి ప్రవేశించుట 'శ్వాసము' అనబడును. లోపలి వాయువు బయటకు వెడలుట 'ప్రశ్వాసనమ'నబడును. ఈ రెండు వాయు వులను ఆపియుంచుట 'ప్రాణాయమము' అనబడును.

దేశ-కాల-సంఖ్యా (మాత్ర-కొలత) సంబంధముచేత బాహ్య అభ్యన్తర స్తంభ వృత్తులుగల యీ మూడు ప్రాణాయామములు దీర్ఘములుగాను సూక్ష్మములుగానుండును.

లతో, ప్రయత్నములు చేయువారై స్వాధ్యాయమనెడు జ్ఞానయజ్ఞము చేయువారున్నారు.[1]

"అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాఽపరే ।
ప్రాణాపాన గతీ రుద్ధ్వా ప్రాణాయామ పరాయణాః॥ 29

అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి ।
సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః"॥ 30

"అర్జునా యితరులెందరో యోగులు అపాన వాయువునందు ప్రాణ

---

ఇంద్రియములకు బాహ్యవిషయములైన శబ్ద-స్పర్శ-రూప-రస గంధములు, అంతఃకరణవిషయ రూపములైన సంకల్ప - వికల్పాదులు, ఈ యన్నింటిని విడిచి - వానిని ఉపేక్షించినపుడు అనగా, విషయముల చింతనము చేయనప్పుడు, స్వయముగానే అవరోధము చెందు ప్రాణవాయుగమనము 'చతుర్థ ప్రాణాయామము' అనబడును.

తమ తమ విషయములతో సంయోగము చెందునపుడు, ఇంద్రియము చిత్తముయొక్క రూపములో నిలిచియుండుట 'ప్రత్యాహారము' అనబడును. సూక్ష్మము-స్థూలము లేక, బాహ్యము-ఆభ్యంతరము అనబడు నేదోయొక ధ్యేయ స్థానమునందు చిత్తము బంధించియుంచుట. దానిని స్థిరముగా నుంచుట, లేక ఆస్థానమునందు నిమగ్నము చేయుట 'ధారణ' యనబడును. చిత్తవృత్తిని గంగాప్రవాహమువలెగాని, లేక తైలధారవలెగాని అవిచ్ఛిన్నముగా (ఎడతెగక) ధ్యేయవస్తువునందు లగ్నముచేయుట 'ధ్యానము' అనబడును. ఎనిమిదవ అంగమైన సమాధి రెండు రకములు. సంప్రజ్ఞాతము-అసంప్రజ్ఞాతమూ అని. అష్టాంగములలో నొకటియగు సంప్రజ్ఞాతము-అసంప్రజ్ఞాత సమాధికి అంగమగుచున్నది.

1. ఏ శాస్త్రములందు 'భగవంతుని తత్త్వము-ఆయన గుణములు ప్రభావము-ప్రవర్తన ఆయన సాకార నిరాకారములు, సగుణ నిర్గుణములు' వర్ణింపబడియున్నవో అట్టి శాస్త్రములను అధ్యయనముచేయుట భగవంతుని స్తోత్రములను పఠించుట, ఆయన నామములను గుణములను కీర్తించుట. వేద వేదాంగముల అధ్యయనము చేయుట 'స్వాధ్యాయము' అనబడును. ఇట్టి

వాయువును హోమము చేసెదరు[1]. అట్లే యితర యోగులు ప్రాణవాయువు నందు అపానవాయువును హుతము చేసెదరు[2]. నియమితాహారము తినువా

---

స్వాధ్యాయము అర్థజ్ఞానముతో చేసినచో మమకార-అసక్తి-ఫలేచ్ఛలు లేకుండ చేసినచో 'స్వాధ్యాయ జ్ఞానయజ్ఞము' అనబడును. ఈ పదము నందు 'స్వాధ్యాయ' శబ్దముతో జ్ఞానశబ్దమును చేర్చి చెప్పి, స్వాధ్యాయ రూప కర్మ గూడ జ్ఞానయజ్ఞమే. కాబట్టి భగవద్గీతను అధ్యయనముచేయుట గూడ 'జ్ఞానయజ్ఞమే' యని భగవంతుడు పేరుపెట్టెనని భావము తెలిపెను. (గీ. 18-70)

1. పైన చెప్పబడిన ప్రాణాయామయజ్ఞమునందు అగ్నిస్థానమునందు అపాన వాయువు-హవిర్ద్రవ్యస్థానములో ప్రాణవాయువునున్నవి. కనుకనే, దేనిని 'పూరక ప్రాణాయామము' అని చెప్పెదరో, అదియే ఇక్కడ ప్రాణ వాయువునందు అపానవాయువును వేల్చుటయని తెలియవలెను. ఎందు కనగా, ఎప్పుడు సాధకుడు పూరక ప్రాణాయామమును చేసి, బాహ్య వాయువును నాసికద్వారా శరీరము లోపలికి తీసుకొని పోవునో, అప్పుడు ఆ బాహ్యవాయువు హృదయములోనున్న ప్రాణవాయువును తనతో తీసి కొని నాభినుండి పోవుచు అపానమందు నిలీనమగును ఈ సాధనమునందు మాటిమాటికి వెలుపలి వాయువులోపల తీసికొనిపోయి అక్కడనే ఆపి యుంచబడును. ఆ కారణముచేత దీనిని 'అభ్యంతర కుంభకము' అనియు యనెదరు.

2. ఈ రెండవ ప్రాణాయామ యజ్ఞమునందు అగ్నిస్థానములో ప్రాణవాయువు ఉన్నది హవిర్ద్రవ్యస్థానములో అపానవాయువు ఉన్నది. కనుక దేనిని 'రేచక ప్రాణాయామము' అని చెప్పెదరో అదియే యిక్కడ ప్రాణ వాయువులో అపానవాయువును హోమము చేయుటయని తెలిసికొనవలెను. ఎందుకనగా ఎప్పుడు సాధకుడు రేచక ప్రాణాయామముచేసి బాహ్యవాయు వును నాసికద్వారా శరీరమునుండి బయటకు తీసి నిలుపునో, అప్పుడు మొదట హృదయమునందున్న ప్రాణవాయువు బయటకు వచ్చి నిలిచి యుండిపోవును. వెనుకనుండి అపానవాయువు వచ్చి ఆ ప్రాణవాయువుతో విలీనమగును. ఈ సాధనమునందు సాధకుడు మాటిమాటికి లోపలివాయు

రెండరో ప్రాణాయమమునందు ఆసక్తిగలవారు ప్రాణవాయువుయొక్క, అపాన వాయువు యొక్కయు గమనమును అరికట్టి ప్రాణవాయువులను ప్రాణవాయువు లందే వేల్చెదరు[1] . ఈ సాధకులందరు యజ్ఞములద్వారా పాపము నశింపచేయు వారుగా, యజ్ఞముల నెరుగువారుగా నున్నారు. (29-30)

సంబంధము :-

ఈ విధముగా యజ్ఞములు చేయు సాధకుల ప్రశంసచేసి యిప్పుడు ఆ యజ్ఞము చేయుటచేత కలుగబోవు లాభములను, చేయనందువలన కలుగబోవు హానిని తెలిపి భగవంతుడు పైన చెప్పబడిన విధముగా యజ్ఞమును చేయవలసిన యావశ్యకతనుగూర్చి అర్జునునకు ప్రతిపాదించుచున్నాడు.[2]

---

వును బయటకుతీసి అక్కడనే నిలుపును. ఈ కారణముచేత దీనిని 'బాహ్యకుంభకము' అనికూడా ననెదరు.

1. ఏ ప్రాణాయామమునందు ప్రాణ అపాన వాయువులు రెంటియొక్క గతి ఆపియుంచబడునో- అనగా, పూరక ప్రాణాయామముగాని లేక రేచక ప్రాణాయామముగాని చేయబడదు కాని శ్వాస ప్రశ్వాసములను రెంటిని ఆపి ప్రాణాపానాది సమస్త వాయుభేదములను వానివాని స్థానములందే నిలిపియుంచబడునో, అదియే యిక్కడ ప్రాణ అపానవాయువుల గతిని ఆపి ప్రాణములలో ప్రాణములను హోమము చేయుటయగును. ఈ సాధనమునందు బాహ్యవాయువు లోపలికి తీసికొనిపోయి ఆపబడదు. లోపలి వాయువు బయటకు తెచ్చి నిలుపబడదు. కాని వాని వాని స్థానములందున్న పంచవాయు భేదములు ఆయా స్థానములందే ఆపియుంచబడును. ఇందు చేత దీనిని 'కేవలకుంభకము' అని యనెదరు.

2. ఈ యధ్యాయమునందు ఇరువది నాలుగవ శ్లోకమునుండి ఇక్కడివరకు యజ్ఞములు చేయు సాధకుల వర్ణనము చేయబడెను. వారందరు మమకార ఆసక్తి ఫలేచ్ఛా రహితులై, పైన చెప్పబడిన యజ్ఞరూప సాధనములను అనుష్ఠించి, వానిద్వారా పూర్వజన్మ సంచితములైన కర్మ సంస్కార రూప సమస్త శుభాశుభకర్మలను నశింపజేసికొనెదరు. ఈ కారణముచేత వారు యజ్ఞముయొక్క తత్త్వము నెరిగినవారని తెలియవలెను.

యజ్ఞశిష్టామృతభుజో యాన్తి బ్రహ్మ సనాతనమ్ ।
నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ! ॥ 31

కురుశ్రేష్ఠా ! యజ్ఞములో మిగిలిన అమృతమును అనుభవించు యోగి జనులు సనాతన పరబ్రహ్మ పరమాత్మను పొందెదరు.[1] యజ్ఞమును చేయని పురుషులైతేనో, ఈ మనుష్యలోకమునందుకూడా సుఖము పొందరు. ఇట్లుండగా, పరలోకము ఎట్లు వారికి సుఖప్రదమగును ?[2]

---

1. ఇక్కడ భగవంతుడు పైనచెప్పబడిన యజ్ఞముయొక్క రూపకము (పోలిక) లో, పరమాత్మ ప్రాప్తికి సాధనములైన జ్ఞాన సంయమ-తపస్-యోగ-స్వాధ్యాయ ప్రాణాయామాదులను గూడ వర్ణించి చెప్పెను. వానియందు అన్న సంబంధములేదు. కనుక, ఇక్కడ పైనచెప్పబడిన సాధనములను అనుష్ఠించుటచేత సాధకుల అంతఃకరణము పరిశుద్ధమై దానియందు ఏ ప్రసన్నత్వము లభించునో (గీత 2-64, 65; 18-36, 37) అదియే యజ్ఞములో మిగిలిన అమృతము. ఎందుకనగా, అది, అమృత-స్వరూపుడైన పరమాత్మను పొందుటకు హేతువగును. ఆ విశుద్ధభావముచేత కలిగిన సుఖమునందు నిత్యతృప్తుడుగా నుండుటయే, యిక్కడ ఆ యమృతమును అనుభవించుటయగును.

2. ఏ మనుష్యుడు పైన చెప్పబడిన యజ్ఞములనుండి కాని, లేక యివిగాక ఇంకను అనేకవిధ సాధనరూపములైన యేయజ్ఞములు శాస్త్రములలో వర్ణింపబడినవో, వానినుండికాని, యేదైన నొక యజ్ఞము ఏవిధముగగూడ చేయడో, అట్టి మనుష్యునకు ఈ లోకమునందుగూడ సుఖము కలుగదనగా, పరలోకమెట్లు అతనికి సుఖదాయకమగును ? ఇట్లు చెప్పుటచేత పైన చెప్పబడిన సాధనములందు అధికారము పొందికూడా, వానిలో నిమగ్నుడై యుండకుండుటచేత, అతనికి ఏలాగునైనగూడ ముక్తియైతే లభించనే లభించదు. సరికదా, స్వర్గముకూడ అతనికి లభించదు. ముక్తికి ద్వారముగానున్న యీ మనుష్య శరీరమునందుగూడ, ఎప్పుడుగూడ శాంతి లభించదను భావము తెలుపబడినది.

సంబంధము :

పదియారవ శ్లోకమునందు భగవంతుడు అర్జునునకు నీకు ఆ కర్మతత్త్వమును తెలిపెదను. దానిని తెలిసికొని నీవు అశుభములనుండి విముక్తుడవయ్యెదవు అని చెప్పియుండెను. ఆ ప్రతిజ్ఞానుసారముగా, పదునెనిమిదవ శ్లోకమునుండి యింతవరకు ఆ కర్మతత్త్వమును వర్ణించి, యిప్పుడు దాని ఉపసంహారము చేయుచున్నాడు :

ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే ।
కర్మజాన్ విద్ధి తాన్ సర్వానేవం జ్ఞాత్వా విమోక్ష్యసే ॥ 32

అర్జునా ! యీ విధముగా ఎన్నియో యజ్ఞములు, ఎన్నియో విధములుగ వేదములందు విస్తారముగా చెప్పబడినవి. అవియన్నియు, మనస్సు-ఇంద్రియములు శరీరము వీని క్రియలచేత నెరవేరునవిగా నీవు తెలుసికొనుము.[1] ఇట్లు తత్త్వపూర్వకముగా తెలిసికొని వానిని అనుష్ఠించుటచేత నీవు కర్మబంధములనుండి పరిపూర్ణముగా విముక్తుడయ్యెదవు.

---

1. ఇక్కడ సాధనరూపములైన ఏ యజ్ఞముల వర్ణనము చేయబడెనో, ఇదియే కాక, యింకను కర్తవ్య కర్మరూపములైన యెన్ని యజ్ఞములు శాస్త్రములలో చెప్పబడెనో, అవియన్నియు మనస్సుయొక్క, ఇంద్రియములయొక్క, శరీరముయొక్కయు కర్మలచేతనే నెరవేరును. ఆ యజ్ఞములో కొన్నింటి సంబంధము మనస్సుతోనున్నది. మరికొన్నింటి సంబంధము మనస్సుతో- ఇంద్రియములతోనున్నది. ఇట్లే, ఏవియోకొన్ని యజ్ఞముల సంబంధము మనస్సు- ఇంద్రియములు-శరీరము. ఈ యన్నింటితోను కలదు. ఈ మూడింటిలోను ఏదో యొకదానితో సంబంధము లేనటువంటి యజ్ఞము ఏదిగూడలేదు. కనుక సాధకుడు, ఏ సాధనమునందు శరీరము-ఇంద్రియములు-ప్రాణములు. వీని క్రియలుగాని లేక సంకల్ప వికల్పాదులైన మనస్సుయొక్క క్రియలుగాని విడుచునో, అట్టి త్యాగరూప సాధనముగూడ కర్మయేయని తెలిసికొని, దానినిగూడ మమకార-ఆసక్తి ఫలేచ్ఛలు లేనివాడగుచు అనుష్ఠించవలెను. అట్లు చేయనియెడల, ఆ యజ్ఞకర్మగూడ బంధనమునకు కారణమగును.

సంబంధము :

'ఆ యజ్ఞములలో ఏ యజ్ఞము శ్రేష్ఠమైనది.' అను జిజ్ఞాస యిక్కడ కలుగును. దానిపైన భగవంతుడిట్లనుచున్నాడు :-

శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరన్తప ।
సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే ॥ 33

పరంతపా ! ద్రవ్యమయ యజ్ఞముకన్న, జ్ఞానయజ్ఞము అత్యంత శ్రేష్ఠము[1] ఎన్ని యజ్ఞములున్నవో అవియన్నియు జ్ఞానయజ్ఞమునందు సమాప్తి చెందుచున్నవి.[2]

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః ॥ 34

---

1. ఏ యజ్ఞమునందు ప్రాపంచిక ద్రవ్యములకు ప్రాధాన్యముగలదో, అది 'ద్రవ్యయజ్ఞము' అనబడును. కనుక అగ్నిలో, నేయి, చక్కెర, పెరుగు పాలు, నువ్వులు, యవలు, బియ్యము, పండ్లు, చందనము, కర్పూరము, ధూపము, సుగంధము గల ఓషధులు, ఈ మొదలైన హవిర్ద్రవ్యములను విధిపూర్వకముగా వేల్చుట, దానము చేయుట. పరోపకారార్థము చేదబావి, చెరువు, ధర్మశాలాదులు నిర్మించుట, బలివైశ్వదేవములు చేయుట, ఈ మొదలైన ప్రాపంచిక పదార్థములతో సంబంధముగల శాస్త్రవిహిత కర్మలన్నియు ద్రవ్యయజ్ఞములో చేరియున్నవి. ఏ సాధనములు, వివేకముతో విచారముతో, ఆధ్యాత్మిక జ్ఞానముతోను సంబంధము కలిగియున్నవో, అవియన్నియు జ్ఞానయజ్ఞములో చేరును.

2. పైన చెప్పబడిన ప్రకరణమునందు, ఎన్నివిధములైన సాధనరూప కర్మలు తెలుపబడెనో, అవిగాక యింకను ఎన్ని శుభకర్మరూప యజ్ఞములు వేద శాస్త్రములందు వర్ణింపబడెనో (గీత 4-32) అవియన్ని కర్మలున్ను జ్ఞానమునందు సమాప్తి చెందుచున్నవి. ఇట్లు చెప్పుటచేత భగవంతుడు సమస్తసాధనములయొక్క సర్వోత్కృష్టఫలము, పరమాత్మయొక్క యథార్థజ్ఞానమును పొందింపజేయుటయే యను భావమును తెలిపెను.

అర్జునా ! నీవు అజ్ఞానమును తత్త్వదర్శనులైన జ్ఞానులకడకు పోయి తెలిసికొనుము. వారికి నీవు శ్రద్ధాభక్తులతో బాగుగా దండప్రణామముచేసి, వారి సేవ చేసి, కపటము లేకుండా సరళముగా ప్రశ్నించినయెడల,[1] వారు పరమాత్మతత్త్వమును బాగుగా తెలిసికొనిన జ్ఞానులు మహాత్ములు కాబట్టి, నీకు తత్త్వ జ్ఞానమును ఉపదేశించెదరు.

యద్ జ్ఞాత్వా నపునర్మోహమేనం యాస్యసి పాండవ।
యేన భూతాన్య శేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథో మయి॥ 35

అర్జునా ! దానిని తెలిసికొనిన తరువాత నీకు ఈ విధము అయిన మోహము మరల కలుగదు. అజ్ఞానముచేత నీవు సమస్తభూత ప్రపంచమును నిశ్శేషముగా, తొలుత నీయందు[2] తరువాత సచ్చిదానంద పరమాత్ముడైన నాయందున్ను చూడగలవు.[3]

---

1. పరమాత్మతత్త్వమును తెలిసికొను నిచ్ఛతో శ్రద్ధా భక్తిపూర్వకముగా, ఏ విషయమును గూర్చియైన ప్రశ్నించుట 'పరిప్రశ్నము' అనబడును.

"శ్రద్ధా భక్తిపూర్వకముగా, మహాపురుషులకడ నివసించుట, వారి యాజ్ఞను పాలించుట, వారి మానసిక భావములను తెలిసికొని, అన్నివిధముల వారికి సుఖము కలిగించుటకు ప్రయత్నించుట" ఇవియన్నియు సేవలో చేరును.

2. మహాపురుషులనుండి తత్త్వజ్ఞానోపదేశమును పొంది, ఆత్మసర్వవ్యాపి, అనంతస్వరూపుడని తలచుట, సర్వప్రాణులందున్ను భేదబుద్ధిలేకుండ, అంతట ఆత్మభావము కలుగుట, అనగా ఎట్లైతే స్వప్నమునుండి మేలుకొనిన మనుష్యుడు స్వప్నజగత్తును తనలోపల స్మృతిమాత్రముగాచూచునో వాస్తవములో తనకంటే వేరైన యన్యవస్తువుయొక్క అస్తిత్వమును చూడడో, ఆ విధముగనే సర్వప్రపంచమును తనకంటే వేరుగాకాక, తనలోనే అంతర్గతముగా తలచుట, సమస్తభూతప్రపంచమును నిశ్శేషముగా ఆత్మలో అంతర్గతముగా చూచుట యనబడును. (గీత 6-29)

3. సమస్త భూతప్రపంచమును సచ్చిదానంద ఘన పరమాత్మయందు చూచుట.

అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః ।
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి॥[1] 36

అర్జునా ! ఒకవేళ నీవు ఇతరపాపులకన్నను అధికపాపము చేయువాడ వైన యెడలగూడ, నీవు జ్ఞానమనెడు నౌకద్వారా, సంపూర్ణ పాప సముద్రమును బాగుగా తరించగలవు. ఇందులో ఏమాత్రము సందేహము వలదు.

యథైధాంసి సమిద్ధోఽగ్నిః భస్మసాత్కురుతేఽర్జున ।
జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥ 37

ఎందుకనగా, అర్జునా ! ఏ విధముగా ప్రజ్వలితమైన అగ్ని యింధనములను భస్మము చేయునో, ఆ విధముగనే జ్ఞానమనెడు అగ్ని అన్నికర్మలను భస్మమయము చేయును.[2]

---

పూర్వోక్తమైన ఆత్మదర్శన రూపస్థితికి ఫలము. దీనినే పరమపదప్రాప్తి, నిర్వాణ బ్రహ్మప్రాప్తి. పరమాత్మలో ప్రవేశించుటగూడ యని యనెదరు.

1. ఇక్కడ, భగవంతుడు అర్జునునితో "నీవు వాస్తవముగా పాపివికావు. నీవు దైవసంపదయొక్క లక్షణాలతో కూడియుండి (గీత-16-5) నాకు ప్రియభక్తుడవు - సఖుడవుగాను నున్నావు (గీత-4-3). నీలో పాపము ఎట్లు ఉండగలదు. కాని, ఒకవేళ నీవు అధికాధిక పాపకర్మలు చేసియుండి నప్పటికిన్ని నీవు ఈ జ్ఞానరూప నౌకసహాయముతో, అగాధము-అనంతము నైన సముద్రమువంటి పాపములనుగూడ అనాయాసముగా తరింపజాలుదువు. పెద్దపెద్ద పాపములుగూడ నిన్ను అడ్డుపెట్టజాలవు" అను విషయము చెప్పెను.

2. ఈ జన్మమునందు, జన్మాంతరములందు చేయబడిన సమస్తకర్మలు సంస్కారరూపముతో మనుష్యుని యంతఃకరణమునందు ఏకత్రితములై చేరియుండును వాని పేరు 'సంచితకర్మ' అనబడును. వానిలో ఏది యీ జన్మమునందు ఫలమునిచ్చుటకు చేయబడునో, దాని పేరు 'ప్రారబ్ధకర్మము అనబడును. ఈ కాలమునందు చేయబడు కర్మలు 'క్రియమాణకర్మలు' అనబడును. పైన చెప్పబడిన తత్త్వజ్ఞాన రూపము ప్రకటితము కాగానే,

నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే ।
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాఽఽత్మని విందతి ॥ 38

అర్జునా! యీ ప్రపంచమునందు జ్ఞానముతో సమానముగా పవిత్రము చేయగలది మరియొకటి యేదియులేదు. ఇందులో సందేహములేదు. అజ్ఞానమును ఎంతకాలమునుండియో కర్మయోగముద్వారా పరిశుద్ధమైన అంతఃకరణముగల మనుష్యుడు తనకుతానే ఆత్మలో చేర్చుకొనును.[1]

శ్రద్ధావాన్[2] లభతే జ్ఞానం తత్పరస్సంయతేంద్రియః ।
జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తిమచిరేణాధి గచ్ఛతి ॥ 39

అర్జునా! జితేంద్రియుడు, సాధనము చేయుటయందు ఆసక్తిగలవాడు, శ్రద్ధావంతుడునైన మనుష్యుడు జ్ఞానమును పొందగలడు. జ్ఞానము పొందిన తరు

---

సమస్త పూర్వ సంచిత సంస్కారములు లేకుండపోవును. 'మనస్సు-బుద్ధి శరీరము' వీనితో ఆత్మకు సంబంధము లేదని తెలిసికొనుటచేత ఆ మనస్సుతో, ఇంద్రియములతో, శరీరాదులతోను, ప్రారబ్ధకర్మానుభవముల సంబంధమున్నప్పటికిన్నీ, ఆ సుఖదుఃఖానుభవకారణముచేత, సాధకుని యంతఃకరణమునందు హర్షశోకాదివికారములు ఉండజాలవు. ఈ కారణము చేత అవిగూడ అతనికి నశించును. ఇప్పుడు చేయబడు కర్మలందు అతనికి కర్తృత్వాభిమానము-మమకారము-ఆసక్తి-వాసన యివిలేని కారణముచేత వాని సంస్కారము ఏర్పడదు కావున ఆకర్మలు వాస్తవముగా కర్మలే కావు. ఈ విధముగా అతని కర్మలన్నియు నశించిపోవును.

1. ఎంతకాలముగానో కర్మయోగమును ఆచరించి-ఆచరించుచు రాగ-ద్వేషములు నశించుటచేత ఎవని యంతఃకరణము స్వచ్ఛమైనదో, ఎవడు కర్మయోగమునందు పరిపూర్ణముగా సిద్ధిపొందినాడో, ఎవని కర్మలన్నియు మమకార-ఆసక్తి ఫలేచ్ఛలు లేకుండ భగవదాజ్ఞానుసారముగా భగవంతుని కొరకే యగునో. అటువంటి యోగసిద్ధుడైన పురుషుని యంతఃకరణము నందు పరమేశ్వరానుగ్రహముచేత స్వయముగానే జ్ఞానము ప్రకాశించును.

2. వేద-శాస్త్ర- పరమేశ్వర- మహాపురుషుల వచనములందు, పరలోకము

వాత, అతడు విలంబము లేకుండ, తత్క్షణమే భగవత్ప్రాప్తి రూపమైన పరమ శాంతిని పొందగలడు.

అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాऽత్మా వినశ్యతి ।
నాయం లోకోऽస్తి న పరో న సుఖం సంశయాత్మనః ॥ 40

అర్జునా! వివేకహీనుడు, శ్రద్ధారహితుడు, సంశయయుక్తుడునైన మనుష్యుడు, పరమార్థమునుండి అవశ్యముగా భ్రష్టుడగును [1] ఇట్లు సంశయయుక్తుడైన

---

నందు, ఏది ప్రత్యక్షముగా కనపడుచున్నట్లు విశ్వాసము కలదో, ఆ యన్నిటి యందున్న పరమ పూజ్యభావన శ్రేష్ఠభావన ఉన్నదో, అది 'శ్రద్ధ'యన బడును. ఇటువంటి శ్రద్ధ యెవనికి గలదో వానిని "శ్రద్ధావంతుడు" అనెదరు.

ఎంతవరకు, మనస్సు–ఇంద్రియములు తన వశములో రావో, అంతవరకున్ను, శ్రద్ధాపూర్వకముగా నడుముగట్టుకొని, ఉత్తరోత్తరాభ్యాసమును అతి తీవ్రముగా చేయుచుండవలెను. ఎందుకనగా శ్రద్ధాపూర్వకముగా చేయు తీవ్రాభ్యసనమునకు ఇంద్రియనిగ్రహమే ఒక రాయివంటిదగును. ఎంత యెంత తీవ్రాభ్యాసము చేయబడునో, అంత యంతగా ఉత్తరోత్తరము ఇంద్రియనిగ్రహము కలుగుచుండును కనుకనే యింద్రియనిగ్రహము ఎంత తగ్గునో, సాధనములో అంత తగ్గుదల కలదని తెలిసికొనవలెను. సాదనము ఎంత తగ్గునో, అంత తగ్గుదలలోపము శ్రద్ధలోనున్నదని భావింపవలెను.

1. వేదశాస్త్ర మహాపురుషుల వచనములను అవి చూపించిన సాధనములను సరిగా ఉన్నదున్నట్లు తెలిసికొనజాలని కారణముచేత తనకు తెలిసినంత వరకు, ఆ వచనములందు విశ్వాసములేని కారణముచేతను, ఎవనికి ప్రతి యొక విషయమునందున్న సంశయము కలుగుచుండునో ఎవడు ఏ విధముగ గూడ తన కర్తవ్యమును నిశ్చయించుకొనడో, ప్రతియొక పరిస్థితి లోను ఎవడు సంశయయుక్తుడై యుండునో, అట్టి మనుష్యుడు తన మనుష్య జీవనమును వ్యర్థముగా పోగొట్టుకొనగలడు.

మనుష్యునకు ఈ లోకములేదు, పరలోకమున్ను లేదు. అతనికి సుఖముగూడ లేదు.[1]

"యోగసన్న్యస్త కర్మాణం జ్ఞానసంఛిన్న సంశయమ్।
ఆత్మవన్తం న కర్మాణి నిబధ్నంతి ధనంజయ॥" 41

కాని, అర్జునా! ఎవడు కర్మయోగ విధిచేత సమస్తకర్మలను పరమాత్మ యందు సమర్పించెనో,[2] ఎవడు వివేకముచేత సమస్త సంశయములను నశింప

---

ఎవనికి స్వయముగా వివేచనచేయుశక్తి లేదో అట్టి అజ్ఞుడైన మనుష్యుడు గూడ శ్రద్ధాళువైనయెడ, అతని శ్రద్ధకారణముగా మహాపురుషులు చెప్పినట్లు సంశయరహితుడై, సాధనములందు తత్పరుడు కాగలడు. మహాపురుషుల కృపచేత అతనికిగూడ శ్రేయస్సు కలుగును (గీత- 13-25). కాని, యే సంశయ యుక్తపురుషునకు వివేచనశక్తి శ్రద్ధ యీ రెండున్ను లేవో, అతని సంశయము నశించుటకు ఏ యుపాయముగూడ లేదు. కనుక శ్రద్ధా వివేకములు రానంతవరకు పురుషునకు పతనము తప్పక కలుగును.

1. సంశయము గల మనుష్యుడు పరమార్థమునుండి మాత్రమే భ్రష్టముకాక, యెంతవరకు ఆ మనుష్యునకు సంశయము ఉండునో, ఎంతవరకు తాను సంశయమును నశింపజేయడో, అంతవరకు ఈ లోకమునందు అనగా మనుష్య శరీరమునందు ధనము - ఐశ్వర్యము- కీర్తి అతనికి లభించవు. పరలోకమునందు - అనగా మరణించిన తరువాత స్వర్గాదిలోకములు గూడ లభించవు. ఏ విధములైన ప్రాపంచిక సుఖములు గూడ అనుభవించుటకు అతనికి వీలుపడదు.

2. ఇక్కడ 'యోగ సన్న్యస్త కర్మాణమ్' అను పదమునకు అర్థమును పూర్తిగా కర్మలను విడిచినవాడు త్యాగి అని అంగీకరించక, కర్మయోగముచేత సమస్త కర్మలయందు వాని ఫలములందు, మమకారము ఆసక్తి-కామనలు పూర్తిగా త్యజించి, ఆ యన్నింటిని పరమాత్మయందు అర్పించువాడే త్యాగి (గీత- 3-30; 5-10) అని అంగీకరించుట ఉచితముగనుండును.

జేసెనో,[1] ఈ విధముగా అంతఃకరణమును వశమునందుంచుకొనిన పురుషుని కర్మలు బంధించవు.[2]

తస్మాదజ్ఞాన సంభూతం హృత్స్థం జ్ఞానాసినాఽఽత్మనః ।
ఛిత్త్వైనం సంశయం యోగమాతిష్ఠోత్తిష్ఠ భారత ॥ 42

ఈ కారణముచేత అర్జునా! నీవు హృదయమునందున్న ఈ యజ్ఞాన

---

1. "ఈశ్వరుడు ఉన్నాడా? లేడా? ఉండినయెడల ఆయన యెట్లున్నాడు? పరలోకము ఉన్నదా? లేదా? ఒకవేళ అది ఉండిన యెడల ఎట్లున్నది? ఎక్కడనున్నది? శరీరము, ఇంద్రియములు, మనస్సు బుద్ధి యివి యన్నియు ఆత్మయా? లేక ఆత్మకంటే భిన్నములా? ఇవి జడములా? లేక చేతనములా? ఇవి వ్యాపకములా? లేక ఏకదేశీయులా? కర్త-భోక్త ఈ యిరువురు జీవాత్మయా? లేక ప్రకృతియా? ఆత్మ ఏకమా లేక అనేకమా? ఒకవేళ, అది యేకమైన యెడల అది యెట్లున్నది? అనేకమైన యెడల ఎట్లున్నది? జీవుడు స్వతంత్రుడా? లేక, పరతంత్రుడా? ఒకవేళ నతడు పరతంత్రుడైన యెడల ఎట్లున్నాడు? ఎవరికి పరతంత్రుడు? కర్మబంధన విముక్తి కొరకు కర్మలను పూర్తిగా విడుచుట మంచిదా? లేక. కర్మయోగముననుసరించి. కర్మలు చేయుట మంచిదా? లేక సాంఖ్యయోగముననుసరించి సాధన చేయుట మంచిదా?" ఈ మొదలైన అనేక ప్రశ్నములు సందేహములు విమర్శశీలురైన మనుష్యుల అంతఃకరణమునందు కలుగును. ఈ శంకలన్నింటిని వివేకజ్ఞానముచేత వివేచనచేసి ఒక నిశ్చయము చేసికొనుట అనగా ఏ విషయమునందుగూడ సంశయముతో నుండక తన కర్తవ్యమును ఇదమిత్థముగా నిర్ధారించుకొనుట యగును. ఇదియే వివేకజ్ఞానము ద్వారా సమస్త సంశయములను నశింపజేయుట యనబడును.

2. ఎవని మనస్సు-ఇంద్రియములు వశమునందు ఉంచుకొనబడియున్నవో, ఆ మనుష్యునికి శాస్త్రవిహితకర్మలు ఆసక్తి-మమకార-కామనలు ఏమాత్రము లేనివైయుండును. ఈ కారణముచేత, ఆ కర్మలయందు బంధించు శక్తి వానికి (మనస్సు-ఇంద్రియము) ఉండదు.

జనితమైన నీ సంశయమును వివేకజ్ఞానమనెడు ఖడ్గముచేత ఛేదించి[1], సత్యమనెడు కర్మయోగమునందు స్థిరముగా నిలిచిపొమ్ము. యుద్ధముకొరకు లేచి నిలుచు కొనుము.

ఇతి శ్రీ మహాభారతే భీష్మ పర్వణి శ్రీమద్భగవద్గీతాపర్వణి
శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే జ్ఞానకర్మ సంన్యాసయోగో నామ
చతుర్థోఽధ్యాయః[2] 4
భీష్మపర్వణి అష్టావింశోఽధ్యాయః 28

శ్రీ మహాభారతమునందు భీష్మపర్వాంతర్గతమైన శ్రీమద్భగవద్గీతా పర్వము నందు శ్రీమద్భగవద్గీతోపనిషత్తులయందు బ్రహ్మవిద్యయందు యోగశాస్త్రము నందు శ్రీకృష్ణార్జున సంవాదమునందు జ్ఞానకర్మ సంన్యాసయోగమనెడు నాలు గవ అధ్యాయము సమాప్తము.

భీష్మపర్వమునందు ఇరువది యెనిమిదవ అధ్యాయము సమాప్తము.

---

1. సంశయమునకు కారణము అవివేకము. కాబట్టి వివేకముచేత అవివేకము నశించగానే, దానితోపాటే సంశయముగూడ నశించిపోవును. దీనిస్థానము హృదయము-అనగా అంతఃకరణము కాబట్టి, యెవడు తన యంతఃకరణ మును తన వశమునందుంచుకొనునో, అతడు సంశయమును సహజముగా నశింపజేయగలడు.

   అర్జునుని అంతఃకరణమునందు సంశయముండెను. అతని వివేకశక్తి మోహము కారణముగా కొంచెము అణగి మరుగున పడియుండెను. ఈ కారణముచేతనే యర్జునుడు తన కర్తవ్య నిశ్చయమును చేసికొనజాల కుండెను. అతడు స్వధర్మరూపమైన యుద్ధమును విడుచుటకు సంసిద్ధుడై యుండెను. అందుచేత, భగవంతుడు ఇక్కడ అర్జునుని హృదయము నందున్న సంశయమును వివేకముచేత ఛేదించుటకు అతనికి ఉపదేశించు చున్నాడు.

2. దీని తరువాతి విషయము భగవద్గీత మొదటి అధ్యాయము చివర * ఈ గుర్తుగల అధోజ్ఞాపికలో ఉన్నట్లు గ్రహింపవలెను.

# భగవద్గీత అయిదవ అధ్యాయము

(భీష్మపర్వము 29 వ అధ్యాయము)

## కర్మ సన్న్యాసయోగము ;

సంబంధము :-

భగవద్గీత మూడవ నాలుగవ అధ్యాయములలో అర్జునుడు భగవంతుని ముఖమునుండి, 'అనేక విధములుగా కర్మయోగ ప్రశంసను విని, దానిని అనుష్ఠించుటకు ప్రోత్సాహమునుగూడ పొందెను. దానితోపాటే అతడు భగవంతుని ముఖమునుండి, 'కర్మయోగముద్వారా భగవత్స్వరూపముయొక్క తత్త్వజ్ఞానము తనంతటనే కలుగును (గీత-4-38) అనికూడ వినెను. గీత నాలుగవ యధ్యాయముయొక్క చివరలోగూడ అర్జునునకు భగవంతుడు కర్మయోగము అనుష్ఠించుటకు ఆజ్ఞయిచ్చెను. కాని, నడుమ-నడుమ అర్జునుడు భగవన్ముఖ కమలము నుండియే, "బ్రహ్మార్పణం బ్రహ్మహవిః" (గీత-4-24) 'బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి' (గీత 4-25), 'తద్విద్ధి ప్రణిపాతేన' (గీత 4-34) ఈ మొదలైనవచనములద్వారా జ్ఞానయోగము అనగా,కర్మసంన్యాసముయొక్క ప్రశంసగూడ వినెను. పై మాటలచేత అర్జునుడు, 'ఈ రెండింటిలో నాకొరకు ఏ సాధనము శ్రేష్ఠమైనది ? అను నిర్ణయము చేయజాలకపోయెను. అందుచేతనే, ఇప్పుడు భగవంతుని ముఖమునుండియే, దాని నిర్ణయము చేయించుకొను నుద్దేశముతో అర్జునుడు ప్రశ్నించుచున్నాడు-

అర్జున ఉవాచ :

సన్న్యాసం కర్మణాం కృష్ణ పునర్యోగఞ్చ శంససి।
యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్ ॥ 1

అర్జునుడిట్లనెను :

కృష్ణా! నీవు కర్మసన్న్యాసమును, కర్మయోగమును రెంటిని ప్రశంసించు చున్నావు. అందుచేత, ఈ రెండింటిలో నేదో యొకటి, నాకు బాగుగా నిశ్చయముగాను శ్రేయస్సాధన మేదియో దానినిగూర్చి చెప్పుము.[1]

శ్రీ భగవానువాచ :

సన్న్యాసః[2] కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరావుభౌ ।
తయోస్తు కర్మసన్న్యాసాత్ కర్మయోగో విశిష్యతే ॥ 2

భగవంతుడిట్లు వలికెను:—

"అర్జునా! కర్మ సన్న్యాసము- కర్మయోగము. ఈ రెండే పరమశ్రేయస్సును కలిగించునవి. కాని, ఆ రెండింటిలోగూడ కర్మసన్న్యాసముకంటే, సాధనమునందు కర్మయోగము సుగమము కనుక, కర్మయోగమే శ్రేష్ఠమైనది.[3]

---

1. అన్నికర్మలందు కర్తృత్వాభిమానరహితుడై గుణములే గుణములందున్నవి అని భావించుట (గీత 3-28); నిరంతరము పరమాత్మ స్వరూపమునందు ఏకీభావముచేత స్థిరముగా నిలిచియుండుట; సర్వదా- సర్వత్ర బ్రహ్మదృష్టియుంచుట (గీత 4-21) యే, జ్ఞానయోగము కర్మయోగము రెండునగును. గీత నాల్గవ యధ్యాయమునందీ విధమైన జ్ఞానయోగమే ప్రశంసింప బడినది. దానిని ఆధారముగా జేసికొనియే అర్జునుడిట్లు ప్రశ్నించెను

2. మనస్సు-వాక్కు-శరీరము వీనిచేత నెరవేరవలసిన సమస్తకర్మల కర్తృత్వాభిమానమును, సర్వ ప్రాపంచిక విషయములందు, అహంకార-మమకారములన్ను పూర్తిగా త్యజించుటయే, 'సన్న్యాస' శబ్దమునకు అర్థము. నాలుగవ-ఐదవ శ్లోకములందు 'సన్న్యాసమే' సాంఖ్యము అని చెప్పి విశేషముగా గూడా స్పష్టీకరించెను. కనుకనే, యిక్కడ 'సన్న్యాస' శబ్దము యొక్క అర్థము 'సాంఖ్యయోగము' అనియే గ్రహింపవలెను.

3. కర్మయోగి కర్మచేయుచుగూడ, సర్వదా సన్న్యాసియే. అతడు సుఖముగా

జ్ఞేయస్స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి ।
నిర్ద్వంద్వో హి మహాబాహో సుఖం బంధాత్ప్రముచ్యతే ॥ 3

"అర్జునా ! యే పురుషుడు దేనినిగూడ ద్వేషించడో, దేనినిగూడ కాంక్షించడో, అట్టి కర్మయోగి సర్వదా సంన్యాసిగానే తెలిసికొనదగినవాడు[1]; ఎందుకనగా రాగద్వేషాది ద్వంద్వరహితుడై ఆ పురుషుడు సుఖముగా సంసారబంధము నుండి విముక్తుడగును

సాంఖ్యయోగౌ పృథక్ బాలాః ప్రవదన్తి న పండితాః ।
ఏకమప్యాస్థితః సమ్యక్ ఉభయోర్విందతే ఫలమ్ ॥ 4

---

అనాయాసముగానే, సంసారబంధమునుండి విముక్తుడగును. (గీత 5-3) అతనికి శీఘ్రముగనే పరమాత్మప్రాప్తి సిద్ధించును. (గీత 5-6) ప్రతియొకదశ (వయస్సు)లోను భగవంతుడతనిని రక్షించును. (గీత 9.22) కర్మయోగముయొక్క యే స్వల్పసాధనమైనను జనన మరణ రూప మహా భయమునుండి యతనిని ఉద్ధరించును. గీత 2-40) కాని, జ్ఞాన యోగ సాధనము క్లేశకరమైనది (గీత 12-5) మొదట కర్మయోగ సాధనము చేయకుండ, జ్ఞానయోగము సాధించుటకూడా చాలా కఠినము. (గీత 5-6 ఈ కారణములన్నింటిచేత జ్ఞానయోగముకన్న కర్మయోగము శ్రేష్ఠమని తెలుపబడెను.

1. కర్మయోగి దేనినిగూడ ద్వేషించడు. ఏ వస్తువునుగూడ కాంక్షించడు. అతడు పూర్తిగా ద్వంద్వాతీతుడగును. వాస్తవములో ఈ స్థితికి సన్న్యాసము అనికూడ పేరు. రాగద్వేష రహితుడే నిక్కమైన సన్న్యాసి, ఎందుకనగా, అతనికి సన్న్యాసాశ్రమము గ్రహించవలసిన యావశ్యకతగాని, సాంఖ్య యోగావశ్యకతగాని లేదు. కనుకనే, యిక్కడ కర్మయోగిని 'నిత్యసన్న్యాసి' అని చెప్పి భగవంతుడతని మహత్త్వమును ప్రకటించెను. ఎట్లనగా సమస్త కర్మలు చేయుచున్నను, అతడు సర్వదా సన్న్యాసియే, సుఖముగా, అనాయాసముగానే యతడు కర్మబంధమునుండి విముక్తుడగును.

"అర్జునా! పైన చెప్పబడిన సన్న్యాసము- కర్మయోగము వేర్వేరు ఫలములిచ్చునవి యని మూర్ఖులు చెప్పెదరు. పండితులు (ఆత్మ జ్ఞాన సంపన్నులు) అట్లు చెప్పరు. ఎందుకనగా, ఆ రెండింటిలోను, ఏ యొకదానియందైనను మంచిగా సరియైన విధముతో, స్థిరముగా నిలిచియున్న పురుషుడు, ఆ రెంటికిన్ని ఫలస్వరూపుడైన పరమాత్మను పొందగలడు.[1]

యత్ సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్ యోగైరపి గమ్యతే ।
ఏకం సాంఖ్యం చ యోగం చ యఃపశ్యతి స పశ్యతి ॥ 5

అర్జునా! జ్ఞానయోగులు ఏ పరంధామము పొందెదరో, కర్మయోగులు గూడ దానినే పొందెదరు.[2] అందుచేత, ఏ పురుషుడు జ్ఞానయోగ కర్మయోగము లను ఫలరూపమునందు ఒకటిగా చూచునో, అతడే యథార్థముగా చూచువాడని తెలియుము.

---

1. సాంఖ్యయోగ-కర్మయోగములు రెండే పరమార్థ తత్త్వజ్ఞానముద్వారా, పరమపదరూప శ్రేయస్సు పొందుటకు హేతువులు. ఇట్లు ఆ రెంటి ఫల మొకటైనను, కర్మయోగ సాంఖ్యయోగ ఫలములు వేర్వేరని తలచువారు ఫలభేదమును కల్పించి దాని రెంటి సాధనములు వేర్వేరని భావించు వారున్ను బాలకులనబడుదురు. అనగా అజ్ఞానులని భావము. ఎందుకనగా కర్మ జ్ఞానయోగముల సాధన పద్ధతి వేర్వేరుగా నున్నను, వాని ఫల మొకటే. కనుకనే, ఒక యోగమునందు పరిపూర్ణముగా స్థైర్యముతో నిలిచిన పురుషుడు రెండింటి ఫలములనుగూడ పొందగలడని చెపుట ఉచితము. గీత పదమూడవ అధ్యాయములో ఇరువది నాలుగవ శ్లోకమునందుగూడ భగవంతుడు ఈ రెండు మాత్రమే ఆత్మసాక్షాత్కారమునకు స్వతంత్ర సాధనములని అంగీకరించెను.

2. ఎట్లైతే, యెవడైన మనుష్యుడు భారతదేశమునుండి అమెరికా దేశమునకు పోవలసినపుడు, అతడొకవేళ, సరియైన త్రోవనుబట్టి యిక్కడనుండి తూర్పుదిక్కునందే పోవుచుండిన యెడలగూడ అమెరికాదేశమునే చేరునో, పడమటి దిక్కునందే పోవుచుండినను అమెరికా చేరగలడో ఆ విధము

సన్న్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తుమ యోగతః ।
యోగయుక్తో మునిర్బ్రహ్మ న చిరేణాధిగచ్ఛతి ॥ 6

కాని అర్జునా! కర్మయోగము లేకుండ సన్న్యాసము అనగా 'మనస్సు ఇంద్రియములు శరీరము' వీనిచేత నెరవేరు సమస్తకర్మలకర్తృత్వ త్యాగమును పొందుట చాలా కఠినము.[1] భగవత్స్వరూపమననము చేయు కర్మయోగి పరబ్రహ్మ-పరమాత్మను శీఘ్రముగా పొందగలడు.[2]

---

గానే సాంఖ్యయోగ-కర్మయోగముల సాధన పద్ధతిలో పరస్పర భేద మున్నప్పటికిన్నీ, ఏదోయొక సాధనమునందు దృఢముగా నిమగ్నుడై యున్న మనుష్యుడు, రెండు యోగములకున్ను ఒకటే పరమలక్ష్యమైన పరమాత్మనే చేరగలడు.

1. ముముక్షువైన పురుషుడు 'మనకు కనబడు సమస్త ప్రపంచము స్వప్నము వలె మిథ్య (అసత్యము), పరబ్రహ్మ యొక్కడే సత్యము; ఈ ప్రపంచ మంతయూ ఆ పరబ్రహ్మమందే మాయచేత ఆరోపింపబడినది. వాస్తవ ముగా ఇతర సత్త (అస్తిత్వముగల వస్తువు) లేదు' అని యంగీకరించును గాని, అతని యంతఃకరణము పరిశుద్ధముగాదు. దానియందు రాగ, ద్వేష కామ-క్రోధాది దోషములున్నవి. ఆ పురుషుడొకవేళ అంతఃకరణ పరి శుద్ధికొరకే, కర్మయోగము నాచరించక కేవలము, తన పెద్దతనపు విశ్వా సముపైననే, సాంఖ్యయోగ సాధనమందు నిమగ్నుడై యుండగోరిన యెడల, అతనికి 'సాంఖ్యనిష్ఠ' సహజముగానే ప్రాప్తించజాలదు.

2. ఎవడు అంతయు భగవంతునిదే యని తలచి, 'సిద్ధి - అసిద్ధి' ఈ రెంటిని సమభావముతో ఉంచుచు, ఆసక్తి ఫలేచ్ఛలను విడిచి భగవ దాజ్ఞానుసారము, సమస్త కర్తవ్యకర్మలను ఆచరించునో, శ్రద్ధా భక్తి పూర్వకముగా నామ గుణ ప్రభావ సహిత పరమాత్మ నిజస్వరూపచింత నము చేయునో, భక్తియుక్తుడై కర్మయోగ సాధకుడైన ఆ ముని భగ వంతుని దయచేత పరమార్థ జ్ఞానముద్వారా శీఘ్రముగనే పరబ్రహ్మ-పర మాత్మను పొందగలడు.

యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః ।
సర్వభూతాత్మ భూతాత్మా కుర్వన్నపి న లిప్యతే ॥ 7

అర్జునా! యెవడు మనస్సు వశమునందుంచుకొనునో, ఎవడు జితేంద్రియుడో, యెవడు విశుద్ధమైన యంతఃకరణము గలవాడో,[1] యెవని యాత్మ సమస్త ప్రాణులకు ఆత్మస్వరూపుడైన పరమాత్మయేయగునో, అట్టి కర్మయోగి, కర్మలు చేయుచుండిననూ, అతనికి కర్మలు అంటవు.

నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్ ।
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్ ॥ 8

ప్రలపన్విసృజన్ గృహ్ణన్నున్మిషన్నిమిషన్నపి ।
ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్ ॥ 9

అర్జునా! తత్త్వమును తెలిసికొను సాంఖ్యయోగి[2] యెవ్వడో, చూచుచు,

---

1. ఒకవేళ, మనస్సు-ఇంద్రియములు సాధకుని వశమునందు లేకున్నయెడల అతనికి స్వాభావికముగానే విషయములందు ప్రవృత్తి కలుగును. అంతఃకరణమునందు ఎంతవరకు రాగద్వేషాది మలము ఉండునో, అంతవరకు సిద్ధియందు అసిద్ధియందు సమభావముండుట కఠినమగును. కనుకనే, ఎంతవరకు మనస్సు-ఇంద్రియములు పరిపూర్తిగా వశమునందుండవో, అంతఃకరణము పూర్ణముగా పరిశుద్ధముకాదో, అంతవరకు సాధకుడు వాస్తవ కర్మయోగియని చెప్పబడజాలడు ఇందుచేతనే, యెవనియందు ఈ విషయములన్నియు నుండునో, అతడే పరిపూర్ణ కర్మయోగియని, అతనికే శీఘ్రముగా బ్రహ్మప్రాప్తి కలుగుననియు చెప్పబడెను.

2. ఈ కనబడు ప్రపంచమంతయు క్షణభంగురము, అనిత్యమునగుటవలన, ఎండమావిలోని జలము, లేక స్వప్నప్రపంచమువలె మాయామయము. కేవలము సచ్చిదానంద ఘనబ్రహ్మమొక్కటే సత్యము. ఆ బ్రహ్మమునందే ఈ ప్రపంచము అంతయు మాయచేత ఆరోపింపబడినది. అని యీ

వినుచు, తాకుచు, ఆఘ్రాణించుచు, భుజించుచు, నడుచుచు, నిద్రించుచు, ఊపిరి పీల్చుచు, మాట్లాడుచు, విడుచుచు, గ్రహించుచు, కన్నులు తెరచుచు, మూసి కొనుచున్నప్పటికిన్ని, ఆయా యింద్రియములన్నియు తమ తమ ప్రాపంచిక విషయములందు (ఇంద్రియార్థములందు) వ్యవహరించుచున్నవి' అని తలచి, 'నేనేమియు చేయుటలేదు.[1] అని భావించవలెను.

సంబంధము :

ఈ విధముగా సాంఖ్యయోగి యొక్క సాధన స్వరూపమును తెలిపి, భగవంతుడిప్పుడు పదవ-పదకొండవ శ్లోకములయందు కర్మయోగియొక్క సాధనముల ఫలసహిత స్వరూపమును చెప్పుచున్నాడు.

బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః ।
లిప్యతే న స పాపేన పద్మపత్ర మివాంభసా ॥ 10

---

విధముగా నిత్యానిత్యవస్తువుల తత్త్వమును తెలిసికొనువాడు సాంఖ్యయోగి యనబడును.

1. ఎట్లైతే, స్వప్నమునుండి మేల్కొనిన మనుష్యుడు, స్వప్న కాలమునందు స్వాప్నిక శరీరము- మనస్సు- ప్రాణములు. ఇంద్రియములు వీనిద్వారా, నేను ఏకర్మలు చేసినట్లు తోచుచుండునో ఆ కర్మలు వాస్తవమైన జాగ్రదవస్థలో జరుగలేదు. నాకు వానితో ఏమాత్రము సంబంధము లేకుండెను అని తలచునో, ఆ విధముగానే, తత్త్వమును తెలిసికొని నిర్వికారుడు నిష్క్రియుడునైన పరమాత్మయందు అభిన్నభావముతో స్థిరముగా నిలిచియున్న సాంఖ్యయోగిగూడ, 'జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ ప్రాణ మనస్సులు మొదలైనవానిచేత ప్రపంచదృష్టితో చేయబడు దర్శన శ్రవణాదులైన సమస్త క్రియలను చేయుచున్న సమయములందు' ఇవియన్నియు మాయామయములు, 'మనస్సు-ప్రాణములు-ఇంద్రియములు' ఇవియే తమ తమ మాయామయ విషయములయందు సంచరించుచున్నవి; వాస్తవముగా ఏమియు అగుటలేదని, వీనితో నాకు ఏలాంటి సంబంధముగూడా లేదనియు తలంచవలెను.

అర్జునా! యే పురుషుడు అన్నికర్మలను, పరమాత్మయందు అర్పించి,[1] ఆసక్తిని విడిచి, కర్మలు చేయునో, అతనికి తామరాకునకు నీటిబొట్టు అంటనట్టువలె, పాపము అంటదు.

కాయేన మనసా బుద్ధ్యా కేవలైరింద్రియైరపి ।
యోగినః కర్మకుర్వన్తి సంగం త్యక్త్వాఽఽత్మ శుద్ధయే॥ 11

అర్జునా! కర్మయోగి సమత్వ బుద్ధిరహితుడై, కేవలము, ఇంద్రియములు-మనస్సు-శరీరము వీనిచేతగూడ ఆసక్తిని విడిచి, అంతఃకరణ పరిశుద్ధికొరకు కర్మలు చేయును.[2]

యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతిమాప్నోతి నైష్ఠికీమ్।
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే॥ 12

అర్జునా! కర్మయోగి కర్మఫలత్యాగము చేసి, భగవత్ప్రాప్తి రూపశాన్తిని పొందగలడు. సకామపురుషుడు కామనయొక్క ప్రేరణచేత, ఫలాసక్తి గలవాడై కర్మబద్ధుడగును.[3]

---

1. భగవద్భక్తి-దేవతాపూజ-మాతాపిత్రాది గురుజనసేవ-యజ్ఞము. దానము, తపస్సు వర్ణాశ్రమములకు అనుకూలమైన ధన సంపాదన సంబంధము, అన్నపానాదులైన శరీర నిర్వహణ సంబంధమున్ను గల శాస్త్ర విహిత కర్మలన్నింటిని, మమకారమును పూర్తిగా విడిచి, అంతయూ భగవంతునిదే యని తలచి, ఆయనకొరకే, ఆయన యాజ్ఞను, ఇచ్ఛను అనుసరించియే, ఆయన చేయించినట్లుగానే, బొమ్మవలె కర్మలు చేయుట—పరమాత్మయందు సర్వకర్మలు అర్పించుట యనబడును.

2. కర్మప్రధానుడైన కర్మయోగి మనస్సు-బుద్ధి-శరీరము-ఇంద్రియములు-వీనియందు మమకారము ఉంచక, లౌకిక స్వార్థరహితుడై నిష్కామ భావముతోనే సమస్త కర్తవ్య కర్మలు చేయుచుండును.

3. సకామభావముతో చేయు కర్మఫలముగా మాటిమాటికి దేవ మనుష్యాది యోనులలో తిరుగుచుండుటయే బంధము అనబడును.

సర్వకర్మాణి మనసా సంన్యస్యాస్తే సుఖం వశీ ।
నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్ న కారయన్ ॥ 13

అర్జునా ! యెవని వశమునందు అంతఃకరణమున్నదో, సాంఖ్యయోగమును ఆచరించు ఆ పురుషుడు, ఏమియు చేయకుండ, చేయించకుండనే,తొమ్మిది ద్వారములు గల శరీరమను గృహమునందు, మనసా కర్మలన్నియు త్యజించి,[1] ఆనందపూర్వకముగా, సచ్చిదానంద ఘన-పరమాత్మ స్వరూపమునందు స్థిరముగా నిలిచి యుండును.

సంబంధము :

"ఎవ్వడైతే ఆత్మవాస్తవముగా, కర్మలు చేయువాడు గూడ కాడో, ఇంద్రియాదుల చేత చేయించువాడుగూడ కాడో, అట్లున్నప్పుడు మనుష్యులందరుగూడ తాము కర్మలు చేయుచున్నామని యెందుకు అనుకొనెదరు ? వారు కర్మఫల భోక్తలు ఎందుకు అగుదురు?" ఈ సందేహమునకు సమాధానముగా భగవంతుడిట్లు అనుచున్నాడు-

న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః ।
న కర్మఫలసంయోగః స్వభావస్తు ప్రవర్తతే॥ 14

అర్జునా! పరమేశ్వరుడు, మనుష్యుల కర్తృత్వమును గాని, వారి కర్మలు గాని, కర్మఫల సంబంధముగాని వారికి నిర్మించడు.[2] కాని స్వభావమే ప్రవర్తిం

1. పూర్తిగా అన్నికర్మలు విడిచిన తరువాత మనుష్యుని శరీరయాత్రగూడ జరుగజాలదు. కాబట్టి మనస్సుచేత-వివేక బుద్ధిద్వారా చేయుట, చేయించుట అను రెంటిని విడచుటయే సాంఖ్యయోగి చేయు త్యాగమనబడును.

2. మనుష్యునకు కర్మలయందుగల కర్తృత్వము భగవంతుడు ఏర్పరచినది కాదు. అజ్ఞానియైన మనుష్యుడు అహంకారమునకు వశుడై, తాను అకర్మలకు కర్తనని భావించుచున్నాడు (గీత. 3-21), మనుష్యులయొక్క కర్మలను భగవంతుడు నిర్మించడు. అని చెప్పుటలో భావమేమనగా, ఈ శుభా - శుభ కర్మలు మనుష్యుడు చేయవలసియుండును అని ఇటువంటి

చును,[1]

సంబంధము :

"ఏ సాధకుడు, సమస్తకర్మలను, కర్మఫలములను భగవంతునికి అర్పించి, కర్మఫలముతో తన సంబంధము ఛేదించుకొనునో, అటువంటివారి శుభా శుభ కర్మల ఫల భోక్త భగవంతుడు అగునా?" అను జిజ్ఞాసపైన భగవంతుడు అర్జునునితో నిట్లనుచున్నాడు:—

---

రచన భగవంతుడు చేయడు. ఎందుకనగా, ఇట్టి రచన ఒకవేళ భగవంతుడు చేసినచో, విధి నిషేధ శాస్త్రములే వ్యర్థమగును. వానికి సార్థకత్వమే లేకుండ బోవును. కర్మఫల సంబంధ నిర్మాణము గూడా భగవంతుడు చేయడు. ఇట్లు చెప్పుటలో భావమేమనగా, కర్మసంబంధము మనుష్యులకే అజ్ఞానముచేత అంటగట్టబడియుండును. కొందరు ఆసక్తితో కర్మలకు కర్తలై, మరికొందరు కర్మఫలములందాసక్తి గలవారై కర్మలతో తమ సంబంధము పెట్టుకొనెదరు.

ఒకవేళ ఈ మూడింటి రచన భగవంతుడే చేసియుండినచో, మనుష్యుడు కర్మబంధమునుండి విముక్తుడే కాజాలడు. అట్టి వానిని ఉద్ధరించుటకు ఏ ఉపాయము గూడ ఉండదు. కనుక సాధకుడు కర్మలయొక్క కర్మత్వమును పూర్వోక్తప్రకారముగా ప్రకృతికి అర్పించి (గీత 5-8,9) లేక, భగవంతునికి అర్పించి (గీత 5-10) లేక కర్మఫలమును, కర్మాసక్తిని పూర్తిగా విడిచి (గీత 5-12) కర్మతో తన సంబంధమును త్రెంచుకొనవలెను (గీత 4-20). ఈ భావములన్నియు తెలుపుటకు, 'పరమేశ్వరుడు, మనుష్యుల యొక్క కర్తృత్వమును, కర్మఫలమును రచియించడ'ని చెప్పబడినది.

1. ఇట్లు చెప్పుటలో అభిప్రాయమేమనగా, 'సత్త్వ-రజస్-తమస్' అను మూడు గుణములు, రాగ-ద్వేషాది సమస్తవికారములు, శుభాశుభ కర్మలు, వాని సంస్కారములు, ఈ యన్ని రూపములలో పరిణమించి, ప్రకృతి అనగా స్వభావమే అంతయు చేయును. ప్రకృతికి లోబడిన జీవులతో, ప్రకృతికి అనాదిగా సంబంధము ఏర్పడియున్నది. ఈ కారణముచేతనే

"నాఽఽదత్తే కస్యచిత్ పాపం న చైవసుకృతంవిభుః।
అజ్ఞానేనాఽవృతం జ్ఞానం తేన ముహ్యన్తిజన్తవః॥" 15

అర్జునా సర్వవ్యాపియైనను భగవంతుడు, ఎవరియొక్క పాప-పుణ్యకర్మలు గూడ గ్రహింపడు,[1] కాని అజ్ఞానముచేత జ్ఞానము కప్పబడియున్నది. ఆ కారణము చేతనే, అజ్ఞానులందరు మోహము చెందుచున్నారు.[2]

"జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః।
తేషామాదిత్యవద్ జ్ఞానం ప్రకాశయతితత్పరమ్"॥ 16

కాని, అర్జునా! ఎవరియొక్క ఆ యజ్ఞానము పరమాత్మ తత్త్వజ్ఞానముచేత

---

ప్రాకృత జనులలో కర్తృత్వభావమేర్పడుచున్నది. అనగా అహంకారము చేత మోహము చెందినవారై, వారు ఆ కర్మలకు తామే కర్తలమని తల చెదరు. (గీత 3-27) దీని చేత వారికి, కర్మలతో కర్మఫలములతోగూడ సంబంధము గలిగి, వారు కర్మబంధనమునందు చిక్కుకొని పోయెదరు. వాస్తవముగా, ఆత్మకు ఈ మూడింటితో ఏలాటి సంబంధము గూడ లేదు.

1. అందరి హృదయములందున్న (గీత-13-17,15-15,18-61)ట్టి సమస్త జగత్తును తన సంకల ముచేత నడుపుచున్నట్టి సర్వశక్తి సంపన్నుడు, సగుణుడు నిరాకారుడునైన పరమేశ్వరుడు ఎవరి పుణ్యపాపములనుగూడ గ్రహింపడు. ఒకవేళ సర్వకర్మలుగూడ ఆయన శక్తిచేతనే మనుష్యుల ద్వారా చేయుబడుచున్నవి, అందరికిన్ని శక్తి-బుద్ధి-ఇంద్రియములు మొదలైనవి వారి వారి కర్మానుసారముగా, పరమేశ్వరుడే ఇచ్చుచున్నప్పటికిన్ని, ఆయన, వారిచేత చేయబడిన కర్మలు గ్రహింపడు. అనగా ఆయన స్వయముగా ఆ కర్మలకు భోక్తకాడు.

2. ఒకవేళ, వాస్తవముగా కర్మలతో, కర్మఫలములతోను, మనుష్యులకుగాని, పరమేశ్వరునకుగాని సంబంధము లేనియెడల, ప్రపంచమునందు మనుష్యుడు ఈ కర్మ నేను చేసితిని, 'ఇది నాకర్మ', "నాకు ఈ కర్మఫలము లభించును". అను మాట యెట్లు పొసుగును? అను శంక కలుగును. ఆ శంకను నివారించుటకుగాను 'అనాది కాలమునుండి యేర్పడిన అజ్ఞా

నష్టము చేయబడినదో, వారియొక్క జ్ఞానము సూర్యునివలె, ఆ సచ్చిదానంద ఘన పరమాత్మను ప్రకాశింప జేయును.[1]

సంబంధము :

యదార్థజ్ఞానముచేత పరమాత్మ ప్రాప్తి కలుగును అను విషయమును సంగ్రహముగా చెప్పి యిప్పుడు, ఇరువదిఆరవ శ్లోకముపరకు, జ్ఞానయోగముచేత పరమాత్మ ప్రాప్తికి సాధనములను, పరమాత్మని పొందిన సిద్ధ పురుషుల లక్షణమును, వారి యాచరణములను, మహత్త్వమును, స్థితినిగూర్చియు వర్ణించునుద్దేశ్యముతో, భగవంతుడు, మొదట ఇక్కడ జ్ఞానయోగము మాత్రమే సాధించుటచేత గలుగు పరమాత్మప్రాప్తినిగూర్చి తెలుపుచున్నాడు:—

తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠాస్తత్పరాయణాః ।
గచ్ఛ న్త్య పునరావృత్తిం జ్ఞాన నిర్ధూత కల్మషాః॥ 17

అర్జునా! యెవరి మనస్సు పరమాత్మ రూపమగుచున్నదో,[2] యెవరిబుద్ధి

---

నము చేత జీవులందరి యథార్థజ్ఞానము కప్పబడియున్నది.' అని చెప్పెదరు. ఈ కారణముచేతనే వారు తమ స్వరూపమును పరమేశ్వరుని స్వరూపమును, కర్మ తత్త్వమును తెలిసికొనని కారణముగా, తమ యందు ఈశ్వరుని యందున్న 'కర్తృత్వము-కర్మము-కర్మఫలము'వీని సంబంధమును కల్పించి మోహము చెందుచున్నారు.

1. ఏవిధముగా సూర్యుడు అందకారమును వశింపజేసి, ప్రపంచమును ప్రకాశింపచేయునో, ఆ విధముగానే యథార్థజ్ఞానముగూడ, అజ్ఞానమును పూర్తిగా నశింపజేసి, పరమాత్మయొక్క స్వరూపమును అతిస్పష్టముగా ప్రకాశింపజేయును. ఎవరికి యథార్థ జ్ఞానము ప్రాప్తించునో, వారు ఎప్పుడుగూడ, ఎటువంటి పరిస్థితిలోగూడ మోహము చెందరు.

2. సాంఖ్య యోగము (జ్ఞానయోగము)ను అభ్యసించువారు ఆచార్యునియొక్క శాస్త్రములయొక్కయు నుపదేశముచేత సమస్త ప్రపంచము మాయామయమని, ఒక సచ్చిదానంద ఘన పరమాత్మ మాత్రమే సత్యవస్తువనియు

తద్రూపమగుచున్నదో,[1] ఎవరిస్థితి, నిరంతరము ఏకీభావములో, సచ్చిదానంద ఘన పరమాత్మయందే యుండునో,[2] అటువంటి తదాసక్తులైన పురుషులు,[3] పాప

---

తెలిసికొని అనాత్మ వస్తువుల చింతనమును పూర్తిగావిడిచి, మనసును పరమాత్మ స్వరూపమునందు నిశ్చలముగా నిలుపుటకొరకు, ఆ పరమాత్మ యొక్క ఆనందమయ స్వరూపచింతనము చేయవలెను. మాటిమాటికి ఆ యానందమును మనస్సులో అనుభవించుచుండవలెను, 'పూర్ణానందము-అపారానందము-శాంతానందము-ఘనానందము - అచలానందము-ధ్రువానందము-నిత్యానందము-బోధస్వరూపానందము -జ్ఞానస్వరూపానందము-పరమానందము-మహానందము-అనంతానందము-సమానందము-అచింత్యానందము - చిన్మయానందము- ఇవి అన్నియుకలిసి ఏకమాత్రానందమే; అదియే ఆనంద పరిపూర్ణమనబడును. ఆనందముకంటే వేరైనవస్తువు మరి యొకటి యేదియు లేదని దృఢముగా మనస్సునందు తలచవలెను. ఈ విధముగా నిరంతరము చింతనచేయుచు - చేయుచు- సచ్చిదానంద ఘన పరమాత్మయందు, అభిన్నభావముతో మనస్సు నిశ్చలమగుటయే మనస్సు తద్రూపమగుట యనబడును.

1. పైన చెప్పబడిన విధముగా మనస్సు తద్రూపమైన తరువాత, బుద్ధియందు పరమానంద ఘన పరమాత్మ స్వరూపము ప్రత్యక్షమైనట్లు నిశ్చయమగును. ఆ నిశ్చయము ననుసరించి నిధిధ్యాసనము (ధ్యానము) చేయుచు-చేయుచు-బుద్ధికి వేరైన అస్తిత్వము లేక అది సచ్చిదానంద ఘన పరమాత్మయందు ఏకాకారరూపస్సై ఉండుటయే, బుద్ధి, తద్రూపమగుట యనబడును.

2. మనస్సు-బుద్ధి-ఈ రెండున్ను పరమాత్మయందు ఏకాకారమైన తరువాత, సాధకుని దృష్టిలో, ఆత్మ-పరమాత్మలకు గల భేద భ్రాన్తి నశించిపోవుట, ధ్యానము చేయువాడు-ధ్యానము - ధ్యేయము-చేయబడునది ఈ త్రిపుటి (మూడింటి సముదాయము) లేకుండ పోయి, కేవలము ఏకమాత్ర వస్తువైన సచ్చిదానంద ఘన పరమాత్మయే యుండుట, 'తన్నిష్ఠుడు' అగుట-అనగా - పరమాత్మయందు ఏకీభావముతో స్థిరముగా నిలిచి యుండుట యనబడును.

3. పైన చెప్పబడిన విధముగా ఆత్మ-పరమాత్మలకు గల భేద భ్రాన్తి నశించి

శహితులై,[1] పునర్జన్మలేని పరమగతిని (మోక్షమును) పొందెదరు [2]

"విద్యా వినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని।
శుని చైవ శ్వపాకేచ పండితాః సమదర్శినః॥" 18

అర్జునా ! అటువంటి జ్ఞానవంతులైనవారు, విద్య-వినయము గల బ్రాహ్మణునిగాని, గోవునుగాని, యేనుగునుగాని, కుక్కనుగాని, చండాలునిగాని సమానముగా చూచెదరు [3]

---

పోయిన తరువాత, పరమాత్మ దప్ప ఇతరవస్తువు దేనియొక్క అస్తిత్వము గూడ లేనప్పుడు, 'మనస్సు-బుద్ధి-ప్రాణములు' ఇవి యన్నియు పరమాత్మ రూపములే యగును. ఈ విధముగా, సచ్చిదానంద ఘన పరమాత్మ యొక్క సాక్షాత్తు అపరోక్ష జ్ఞానముద్వారా, పరమాత్మయందు ఏకత్వము పొందుటయే 'తత్పరాయణత'యనబడును.

1. పైన చెప్పబడిన విధముగా, సాధనముచేత ప్రాప్తించిన యథార్థ జ్ఞానముద్వారా, ఎవరి మల-విక్షేప-ఆవరణ రూపమైన సమస్త పాపములు పూర్తిగా నశించిపోయినవో, ఎవరియందు ఆ పాపము లేశమాత్రముగూడ నుండవో, యెవరు పరిపూర్తిగా పాపరహితులైరో, అటువంటివారు, 'జ్ఞానముచేత పాపరహితులైన పురుషులు' అనబడెదరు.

2. ఏ స్థానము చేరిన తరువాత యోగి తిరిగి యీ లోకమునకు తిరిగిరాడో, దేనిని గూర్చి పదియారవ శ్లోకమునందు 'తత్పరం' అను పేరుతో చెప్పబడెనో, దేని వర్ణనము గీతలో కొన్నిచోట్ల, 'అక్షయ సుఖము' అని కొన్నిచోట్ల 'నిర్వాణ బ్రహ్మము' అని కొన్నిచోట్ల, 'ఉత్తమ సుఖము' అని, కొన్నిచోట్ల, 'పరమగతి' అని, కొన్నిచోట్ల 'పరమధామము' అని, కొన్నిచోట్ల 'అవ్యయపదము' అని, మరికొన్నిచోట్ల, 'దివ్య-పరమపురుషుడు' అనియు వేరు వేరు పేర్లతో చెప్పబడెనో, ఆ యథార్థ జ్ఞానమునకు ఫలస్వరూపుడైన పరమాత్ముని పొందుటయే; 'అపునరావృత్తిని పొందుట' యనబడును.

3. తత్త్వజ్ఞానులైన పురుషులకు విషమభావము పూర్తిగా నష్టమగును. వారి

"ఇహైవ తైర్జితః సర్గో యేషాం సామ్యేస్థితం మనః।
నిర్దుష్టం హి సమం బ్రహ్మ తస్మాద్ బ్రహ్మణి తే స్థితాః॥ 19

అర్జునా! ఎవరి మనస్సు సమభావముతో నుండునో, వారు జీవించియుండ

---

దృష్టిలో ఒక సచ్చిదానంద పరబ్రహ్మ-పరమాత్మ దప్ప ఇతర వస్తువు దేని యొక్క అస్తిత్వము (సత్త) గూడ ఉండదు. గాబట్టి వారికి సర్వత్ర సమభావముండును. ఈ విషయము వివరించుటకే మనుష్యులలో నుత్తమోత్తముడైన శ్రేష్ఠబ్రాహ్మణుడిని, నీచాతి నీచ చండాలుని, పశువులలో నుత్తమమైన శ్రేష్ఠ గోవును, మధ్యమశ్రేణికి చెందిన యేనుగును, నీచాతి నీచమైన కుక్కను ఉదాహరణముగా చెప్పి, ఆ తత్త్వజ్ఞానులైన సిద్ధ పురుషుల సమభావము దిగ్దర్శనముగా చూపింపబడెను ఈ యైదు ప్రాణుల యెడల వ్యవహార కాలమునందు వైషమ్యభావము చూపవలసియుండును. ఏ విధముగా ఆవుపాలు అందరున్ను త్రాగుదురో. కాని కుక్కపాలు ఎవరు గూడ త్రాగరో, ఆ విధముగానే ఏనుగునెక్కి తిరిగెదరు. కాని కుక్క నెక్కి తిరుగరు ఏ వస్తువు శరీర నిర్వాహముకొరకు పశువులకు ఉపయోగ పడునో, అది మనుష్యులకు ఉపయోగపడదు. శాస్త్రములు శ్రేష్ఠబ్రాహ్మణునికి పూజించి, సత్కారాదులను చేయుటకు ఆజ్ఞాపించినది కాని చండాలునకు చెప్పలేదు కాబట్టి వీని యుదాహరణముల నిచ్చి భగవంతుడు, 'ఎవరి యెడల వ్యావహారికముగా విషమభావము అనివార్యమో, వారి యెడల గూడ జ్ఞానులకు సమభావమే ఉండును; ఎప్పుడు గూడ ఏ కారణము చేతగూడ, ఎక్కడగూడ ఆ ప్రాణుల యెడ విషమభావము ఉండదు. ఏ విధముగా మనుష్యుడు తన శిరస్సు-హస్తములు-పాదములు మొదలైన అవయవములతో వ్యవహరించుచున్నపుడు గూడ, బ్రాహ్మణ-క్షత్రియ-వైశ్య-శూద్రాదులతో సమానముగా భేదము చూపునో, శిరస్సుతో, ముఖముతో చేయు పని హస్తములతో, పాదములతో చేయడో, హస్తపాదాదుల పని శిరస్సుతో చేయడో, అన్ని యవయవములకు ఇచ్చు ఆదరము, గౌరవము, శౌచాదులలో గూడ భేదము చూపునో, అట్లున్నను, అవయవములన్నింటి యెడలగూడ ఆత్మ భావము—తనవియనుకొను తలంపు సమా

గానే యీ సమస్త ప్రపంచమును జయించి నారని అనగా, వారు ఎల్లప్పుడు గూడ జనన - మరణరూప సంసారమునుండి విముక్తులైనారని తెలిసికొనుము. ఎందుకనగా, సచ్చిదానందఘన పరమాత్ముడు దోషరహితుడు - సముడునై యుండును. జీవన్ముక్తులు ఇక్కడనుండి పోయి సచ్చిదానంద ఘన పరమాత్మ యందే స్థిరముగా నిలిచియున్నారు.[1]

"న ప్రహృష్యేత్ ప్రియం ప్రాప్య నోద్విజేత్ ప్రాప్య చాప్రియమ్ ।
స్థిరబుద్ధి రసమ్మూఢో బ్రహ్మవిద్ బ్రహ్మణి స్థితః॥" 20

"అర్జునా ! యే పురుషులు ప్రియమును పొంది సంతసించరో, అప్రియ మును పొంది దుఃఖము చెందరో,[2] అటువంటి స్థిరబుద్ధిగల సంశయరహితులైన

---

నముగా గలిగియుండుటచేత, అతడు అన్ని యవయవముల సుఖదుఃఖ భావమును సమాన భావములోనే యనుభవించుచనే శరీరమునందంతటను అతడి ప్రేమ ఒకటే విధముగా నుండునో, ప్రేమ - ఆత్మభావముల దృష్టిలో ఎక్కడగూడ విషమభావము ఉండదో, ఆ విధముగనే, తత్త్వ జ్ఞానముగల మహాపురుషునకు, అంతటను సమదృష్టి యుండుట చేత, ప్రపంచదృష్టిలో వ్యవహారమునందు, వారి వారి అర్హతలను బట్టి భేద భావము ఉన్నప్పటికిన్నీ, ఆ మహాపురుషుని ప్రేమ-ఆత్మభావము అంతటను సమానముగా ఉండును.

1. తత్త్వ జ్ఞాన సంపన్నుడు 'సత్త్వ-రజస్, తమస్' అను మూడుగుణాలకు యతీతుడుగా యుండును కాబట్టి, యతని యొక్క రాగ-ద్వేష-మోహ-అహంకార - మమకారములు మొదలైన సమస్త దుర్గుణములు - విషమ భావము పూర్తిగా నశించి, అతని స్థితి సమభావములో ఉండును. సమ భావము బ్రహ్మస్వరూపమే కనుక, ఎవరి మనస్సు సమభావములో ఉండునో, వారు బ్రహ్మమునందే స్థిరముగా నిలిచియున్నారని తెలియ వలెను.

2. ఏ వస్తువు మనో-బుద్ధి-శరీర-ఇంద్రియములకు అనుకూలముగా నుండునో, దానిని లోకులు 'ప్రియము' అనెదరు. ఆ యనుకూల వస్తువులు లభించి

బ్రహ్మవేత్తలైన పురుషులు సచ్చిదానంద ఘన-పరబ్రహ్మ-పరమాత్మ యందు ఐక్యము చెంది సర్వదా నిలిచియుందురు.

"బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విందత్యాత్మని యత్సుఖమ్।
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే ॥" 21

అర్జునా! బాహ్య విషయములందు ఆసక్తి లేని యంతఃకరణముగల సాధకుడు,[1] ఆత్మయందున్న ధ్యానజనిత సాత్త్వికానందమును పొందగలడు.[2] ఆ తరువాత సచ్చిదానంద ఘన- పరమాత్మ యొక్క ధ్యానరూప — యోగమునందు

---

నను సమత్వము గలవానికి సంతోషము కలుగదు. ఈ విధముగానే ఏ వస్తువు మనో-బుద్ధి-శరీర-ఇంద్రియములకు ప్రతికూలమగునో ఆ వస్తువును లోకులు 'అప్రియములు' అనెదరు. అట్టి ప్రతికూల వస్తువు ప్రాప్తించినప్పటికిన్ని, జ్ఞాని దుఃఖము చెందడు. రెంటిని సమముగా చూచును.

1. శబ్ద-స్పర్శ-రూప-రస-గంధాది, ఇంద్రియ విషయములు "బాహ్య స్పర్శములు" అనబడును. ఏ మనుష్యుడు తన మనస్సులో ఆ యింద్రియముల యందలి ఆసక్తిని పూర్తిగా నశింపజేయునో, ఎవనికి సమస్తసుఖ భోగములందు పూర్తిగా వైరాగ్యము కలదో, నిర్లక్ష్యభావము గలదో, ఆ పురుషుడు, బాహ్యవిషయాసక్తి లేని అంతఃకరణము కలవాడు అని అనబడును.

2. ఇంద్రియ భోగములే సుఖములని తలచువానికి ధ్యానజనిత సుఖము లభించజాలదు. వాస్తవముగా, బాహ్యభోగములందు సుఖము లేనే లేదు. వానియందు సుఖాభాసము (సుఖమున్నట్లు - ఎండమావి జలమువలె తోచుట) మాత్రము ఉండును. దానికంటే వైరాగ్య సుఖము ఎన్నియో రెట్లు అధికముగ నుండును. వైరాగ్య సుఖము కంటే గూడ ఉపరతి (నిర్లక్ష్య భావము)యందు గల సుఖము అత్యంతము ఉన్నతమైనది. కాని పరమాత్మ ధ్యానమందు అచంచలస్థితిని పొందిన తరువాత కలుగు సుఖమేదేనో, అన్ని సుఖములకన్న మిన్నయైనది. ఇట్టి సుఖమును పొందుటయే 'ఆత్మానందప్రాప్తి' యనబడును.

అభిన్న భావముతో స్థిరముగా నిలిచియున్న[1] పురుషుడు అక్షయానందమును అనుభవించగలడు.[2]

"యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే।
ఆద్యంతవంతః కౌంతేయ న తేషు రమతే బుధః॥" 22

అర్జునా! యింద్రియములకు విషయములతో కలిగిన సంబంధము వలన గలుగు సుఖభోగములన్నియు, విషయాసక్తులైన పురుషులకు సుఖములుగా భాసించు (తోచు)చున్నప్పటికిన్నీ అవి దుఃఖహేతువులే యగును.[3] అవి ఆద్యంత

---

1. పైన చెప్పబడిన విధముగా, ఇంద్రియముల సమస్త విషయములందు అనాసక్తిరహితుడై, ఉపరతిని పొంది, పరమాత్మ ధ్యానమనెడు అచంచల-స్థితి యందుగల మహాసుఖమును అనుభవించు పురుషుని పరబ్రహ్మ-పరమాత్మయొక్క ధ్యానరూప యోగమునందు అభిన్నభావముతో నున్న వారని చెప్పెదరు.

2. సర్వదా ఏకరసమునందే యుండు పరమానంద - స్వరూపుడు - వినాశ రహితుడైన పరమాత్మయే, 'అక్షయ సుఖము' అనబడును. నిత్యము నిరంతరమున్ను ధ్యానము చేయుచు చేయుచు ఆ పరమాత్మను అభిన్న భావముతో ప్రత్యక్షము చేసికొనుటయే 'అక్షయసుఖమును అనుభవించుట' యనబడును

3. ఎట్లైతే మిడత అజ్ఞానము చేత పరిణామమును యోచించక ప్రకాశము సుఖహేతువుగా తలచుచు, దాని వద్దకు పోవుటకుగాను ఎగిరి యెగిరి, దాని వైపునకు పోయి, అందులో పడిపోయి, భయంకర తాపము సహించి, తనను దగ్ధము చేసికొనునో. ఆ విధముగానే అజ్ఞానియైన మనుష్యుడు, భోగములు సుఖహేతువులని తలచి, వాని యందాసక్తి గలవాడై, వానిని అనుభవించుటకు ప్రయత్నము చేసి, పరిణామమునందు మహాదుఃఖములను పొందును. విషయములు సుఖకారణములని తలచి, వానిని అనుభవించుట చేత వానియందు ఆసక్తి వృద్ధి చెందును. అది పెరుగుటచేత, కామ క్రోధాదులైన అనర్థములు ఉత్పన్నములగును. తరువాత, వానినుండి

సహితములు-అనగా అనిత్యములు. ఈ కారణముచేత బుద్ధిమంతులు, వివేకము గలవారు విషయ సుఖములందు రమించరు.[1]

---

వివిధములైన దుర్గుణములు - దురాచారములు వారిలో ప్రవేశించి, వారిని నలువైపుల ఆక్రమించి చుట్టియుండును. దాని చేత వారి జీవితములు పాపమయములై తత్ఫలితముగా, వారికి ఈ లోకమునందు, పరలోకము నందున్ను, అనేక విధములైన తాపములు యాతనలు అనుభవింపవలసి యుండును. ఇదియే వాని వలన కలుగు పరిణామమని భావింపవలెను.

విషయములను అనుభవించు సమయమునందు మనుష్యుడు భ్రాన్తిచేత, ఏ స్త్రీ పుంసంగాది భోగములు సుఖహేతువులని తలుచునో, అవియే పరిణామమునందు అతని వీర్యము-ఆయుస్సు-మనస్సు-బుద్ధి-ప్రాణములు-ఇంద్రియములు-వీని శక్తిని నశింపజేసి, అవి శాస్త్ర విరుద్ధములైనపుడు-పరలోకమునందు భయంకర నరకయాతనలను అనుభవింపజేసి మహా దుఃఖకారణములగును. కనుక శాస్త్రవిరుద్ధ విషయసంగము ఇహపరలోకములందు దుఃఖప్రదము.

ఇంతమాత్రమే కాక, అజ్ఞానుడైన మనుష్యుడు, ఇతరులకడ, తన కంటే అధిక సుఖ సామగ్రిని చూచినపుడు అతని మనస్సులో అసూయాగ్ని మండుచుండును.

సుఖములని తలచి అనుభవింపబడిన విషయములు ఒకవేళ, ప్రారబ్ధ వశముచేత నష్టములైనయెడల, అతని సంస్కారము మాటిమాటికి అతని స్మరణమునకు ఆ విషయములను తెచ్చుచుండును. మనుష్యుడు వానిని జ్ఞప్తికి తెచ్చుకొని, దుఃఖమగ్నుడగును. ఏడ్చుచు, మూల్గుచు, పశ్చాత్తాప పడుచుండును. ఈ విషయములన్నియు విచారించుటచేత, విషయ సంబంధము చేత ప్రాప్తించు భోగములు, వాస్తవముగా సంపూర్ణ దుఃఖమునకే కారణములని తెలియవలెను. వానిలో సుఖము లేశమాత్రము గూడ లేదు. అజ్ఞాన వశమున కలిగిన భ్రాన్తి చేతనే అవి సుఖములని తోచును.

1. విషయ భోగములు వాస్తవముగా అనిత్యములు-క్షణభంగురములు-దుఃఖ రూపములే యగును. కాని, వివేకహీనుడైన అజ్ఞానపురుషుడు, ఈ విషయ

"శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్శరీర విమోక్షణాత్ ।
కామక్రోధోద్భవం వేగం సయుక్తః స సుఖీ నరః ॥" 23

అర్జునా ! యే సాధకుడు ఈ మనుష్య శరీరమునందు, ఈ శరీరనాశము వకు పూర్వమే,[1] కామ క్రోధముల వలన గలుగు వేగమును సహించుటకు సమర్థుడగునో[2] ఆ పురుషుడే యోగి, అతడే సుఖి యని యెరుగుము.

---

మును తెలియక-అంగీకరించక-వానియందు రమించును. వివిధ క్లేశములు అనుభవించును. కాని. బుద్ధిమంతుడు వివేకవంతుడైన పురుషుడు, ఆ విషయముల అనిత్యత్వమును, క్షణభంగురత్వమును విచారించి, అవి కామ-క్రోధ పాప తాపాదులైన అనర్థాలకు హేతువులని తలుచును. వాని యందలి ఆసక్తిని విడచుట, అక్షయ సుఖ ప్రాప్తికి కారణమని తలచును, కాబట్టి యతడు వానియందు రమించడు.

1. దీనిచేత, "శరీరము నశించునది, ఇది వియోగము చెందుట నిశ్చితమైన విషయము, ఇదియే క్షణమునందు నష్టమగునను సూచనగూడ తెలియదు. అందువలన, మరణకాలము సమీపించుటకు చాల పూర్వమే కామ క్రోధాదులను జయించవలెనను విషయుముగూడ తెలియుచున్నది.

2. పురుషుని కొరకు స్త్రీ. స్త్రీ కొరకు పురుషుడు ఆ యిరువురి కొరకు పుత్రులు, ధనము, ఇల్లు-స్వర్గాదులునైనవి యేవైతే చూచిన వినిన ఇంద్రియ-మనో విషయములున్నవో, వానియందు ఆసక్తి కలుటచేత, వానిని పొందుటకు గాను కలుగు ఇచ్ఛ 'కామము' అనబడును. ఆ కామముచేత అంతఃకరణము నందు కలుగు వివిధ సంకల్ప వికల్పముల ప్రవాహము, కామమువలన ఉత్పన్నమగు 'వేగము'అనబడును. ఈ విధముగానే 'మనస్సు-బుద్ధి-ఇంద్రియములు' వీనికి ప్రతికూలములైన విషయములు ప్రాప్తించినపుడుగాని, లేక ఇష్టములైన వస్తువులను పొందుటకు గలుగు ఇచ్ఛ నెరవేరుటలో బాధలు, ఆటంకములు గలిగినప్పుడుగాని, అటువంటి పరిస్థితికి కారణభూతములైన పదార్థములయందుగాని, జీవులయందుగాని ద్వేషభావము ఉత్పన్నమై, అంతఃకరణమునందు గలుగు ఉత్తేజనా (ప్రేరణ) భావము యొక్క పేరు 'క్రోధము' అనబడును. ఆ క్రోధము కారణముగా, కలుగు

సంబంధము :

పైన చెప్పబడిన విధముగా. బాహ్య విషయముల వలన కలుగు సుఖ భోగములు క్షణికములు దుఃఖకారణములు నని తెలిసికొని, ఆసక్తినివిడిచి, కామ క్రోధములను జయించిన సాంఖ్య యోగియొక్క అంతిమస్థితిని గూర్చి యిప్పుడు భగవంతుడు, తత్ఫల సహితముగా వర్ణించుచున్నాడు :

యోఽన్తస్సుఖోఽన్తరారామ స్తథాఽన్తర్జ్యోతిరేవ యః ।
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మ భూయోఽధిగచ్ఛతి ॥ 24

అర్జునా! యే పురుషుడు అంతరాత్మలోనే సుఖమనుభవించువాడో,[1] ఆత్మ యందే రమించువాడో,[2] ఆత్మయందే జ్ఞానము గలవాడో,[3] ఆ పురుషుడు, సచ్చి

---

వివిధ సంకల్ప వికల్పములయొక్క ప్రవాహము. క్రోధమువలన కలుగు 'వేగము' అనబడును. ఈ వేగములను శాంతి పూర్వకముగా సహించు శక్తి అనగా, వీనిని కార్యరూపము ధరించకుండ జేయుశక్తి సంపాదించు టయే "వీనిని సహించుటలో సమర్థుడగుట యనబడును".

1. ఇక్కడ 'అంతః' అను శబ్దమునకు సమస్త జగత్తుయొక్క లోపల ఉన్న పరమాత్మయని అర్థము. అంతఃకరణమని యర్థముకాదు. ఏ పురుషుడు బాహ్యవిషయ భోగరూపమైన సాంసారిక సుఖము స్వప్నమువలె అనిత్యము లని తెలిసికొనుటచేత, వానిని సుఖములని తలచడో. మరి, ఈ యంతట లోపలనున్న ఆనంద స్వరూపుడైన పరమాత్మయందలి సుఖమే సుఖమని యంగీకరించునో, యతడు అంతఃసుఖుడు అనగా, అంతరాత్మయందే సుఖము పొందునని భావము.

2. ఎవడు బాహ్య విషయ భోగములందు అస్తిత్వము - సుఖబుద్ధిలేని కారణ ముగా, వానియందు రమించక ఈ యన్నిటియందున్న అసక్తి రహితుడై, కేవలము పరమాత్మయందే రమించునో అనగా, పరమానంద స్వరూపు డైన పరమాత్మయొక్క చింతనముచేసి నిరంతరము అభిన్న భావముతో చేయుచుండునో, ఆతడు 'అంతరారాముడు' అనగా ఆత్మయందే రమించు వాడగును.

3. పరమాత్ముడు సర్వజ్యోతులకు జ్యోతిస్స్వరూపుడు (గీత 13-17). సమస్త

దానంద ఘన పరబ్రహ్మ పరమాత్మతోపాటు ఐక్యమును పొందిన సాంఖ్యయోగి,[1] శాంతమైన పరబ్రహ్మమును పొందగలడు.[2] (24)

లభన్తే బ్రహ్మనిర్వాణమృషయః క్షీణకల్మషాః ।
ఛిన్నద్వైధా యతాఽత్మానః సర్వభూత హితేరతాః॥ 25

అర్జునా! ఎవరి పాపములన్నియు నశించినవో[3] ఎవరి సంశయములు,

---

జగత్తు ఆయన ప్రకాశముచేతనే ప్రకాశించుచున్నది. ఏ పురుషుడు నిరంతరము అభిన్న భావముతో ఇటువంటి పరమజ్ఞాన స్వరూపుడైన పరమాత్మను అనుభవించుచు ఆయనయందే స్థిరముగా నిలిచియుండునో, యెవని దృష్టిలో, ఒక్క విజ్ఞానానంద స్వరూపుడైన పరమాత్మదప్ప ఇతరమైన యే బాహ్యవస్తువుయొక్క అస్తిత్వము వేరుగా లేనేలేదో, అతడే, 'అంతర్జ్యోతి' అనగా ఆత్మయందే జ్ఞానముగలవాడవి భావింపపడెను.

1. సాంఖ్యయోగ సాధనము చేయుయోగి 'అహంకార-మమకార-కామ-క్రోధాది' సమస్త దుర్గుణములను విడిచి, నిరంతరము అభిన్న భావముతో, పరమాత్మ చింతనము చేయుచు చేయుచు ఎపుడు పరబ్రహ్మరూపుడై యతనికి బ్రహ్మతో కించిన్మాత్రముగూడ భేదముఉండదో, అపుడు ఈ విధముగా అంతిమ స్థితిని పొందిన సాంఖ్యయోగి 'బ్రహ్మభూతుడు' అనగా, సచ్చిదానంద ఘన పరమాత్మ పరబ్రహ్మలో ఐక్యము పొందిన వాడనబడును.

2. శాంతబ్రహ్మ (పరమనిర్వాణ)ము అనగా సచ్చిదానంద ఘన నిర్గుణ నిరాకార నిర్వికల్ప శాంతస్వరూపుడైన పరమాత్మయని అర్థము. ఆయన అభిన్న భావముతో ప్రత్యక్షమగుటయే, ఆయనను పొందుట యగును. సాంఖ్యయోగియొక్క ఏ అంతిమస్థితి 'బ్రహ్మభూత' శబ్దముతో నిర్దేశింపబడెనో, యది దాని ఫలమే. వేదమునందుగూడ బ్రహ్మైవసన్ బ్రహ్మాఽప్నోతి (బృహదారణ్యకోపనిషత్ 4-4-6) అనగా అతడు బ్రహ్మగానే అయి, బ్రహ్మను పొందును అని యర్థము దీనినే పరమశాంతి ప్రాప్తి-అక్షయ సుఖప్రాప్తి-బ్రహ్మప్రాప్తి మోక్షప్రాప్తి పరమాత్మగతిప్రాప్తి యని యనెదరు.

3. మనుష్యుని అంతఃకరణమునందు చేరియున్న, "ఇహజన్మ-జన్మాంతరము

జ్ఞానముచేత తొలిగిపోయినవో, ఎవరు సమస్త ప్రాణుల హితమునందు తత్పరులై యుందురో, యెవరి వశమునందున్న మనస్సు నిశ్చల భావముతో పరమాత్మ యందు స్థిరముగా నిలిచియున్నదో, అటువంటి బ్రహ్మవేత్తలైన పురుషులు శాంత బ్రహ్మమును పొందగలరు. (25)

కామక్రోధ వియుక్తానాం యతీనాం[1] యతచేతసామ్ ।
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్॥ 26

అర్జునా! కామ క్రోధ రహితులై, మనస్సును జయించినవారై, పరమాత్మ సాక్షాత్కారము చేసికొనిన జ్ఞానులకు అన్ని వైపులలోను శాంతుడు-పరబ్రహ్మ యునైన పరమాత్ముడు పరిపూర్ణుడై నిలిచియుండును.[2] (26)

---

లందు చేయబడిన కర్మల సంస్కారము - రాగద్వేషాది దోషములు, వాని వృత్తుల సమూహము"ఇవి యన్నియు బంధన హేతువులగుటచేత, కల్మషములు పాపములేయగును. పరమాత్మ సాక్షాత్కారమైన తరువాత ఇవి యన్నియు నశించిపోవును. తరువాత ఆ పురుషుని యంతఃకరణమునందు దోషములు లేశమాత్రముగూడ నుండవు.

1. ఇక్కడ 'కామక్రోధ వియుక్తానాం'అను పదముచేత మలదోషము, 'యతచేతసాం' అను పదముచేత విక్షేపదోషము, 'విదితాత్మనాం' అను పదముచేత ఆవరణదోషము-ఈ మూడు దోషములు పూర్తిగా లేనట్లు చెప్పి, పరమాత్మ యొక్క పరిపూర్ణ జ్ఞానప్రాప్తి తెలుపబడెను. అందుచేత 'యతి' యను శబ్దముయొక్క అర్థము ఇక్కడ సాంఖ్యయోగముద్వారా, పరమాత్మను పొంది ఆత్మసంయమముగల తత్త్వజ్ఞాని యని యంగీకరించుట ఉచితము.

2. పరమాత్మను పొందిన జ్ఞానులైన మహాపురుషుల యనుభవములో, 'మీద-క్రింద' 'బయట-లోపల' అంతటగూడ నిత్య నిరంతరుడైన ఏకైక విజ్ఞాన ఘన పరబ్రహ్మ పరమాత్మ మాత్రమే యున్నాడు-ఏకుడు-అద్వితీయుడునైన పరమాత్మదప్ప ఇతరపదార్థము దేనియొక్క అస్తిత్వముగూడా(సత్త) లేదు".అను నభిప్రాయముచేత, అతనికి అన్నివైపులను పరమాత్మయే పరిపూర్ణముగా నున్నాడని చెప్పబడినది.

సంబంధము :-

కర్మయోగ-సాంఖ్యయోగములు ఈ రెండు సాధనముల ద్వారా. పరమాత్మ ప్రాప్తినిగూర్చి పరమాత్మను పొందిన మహాపురుషుల లక్షణములను గూర్చియు చెప్పబడెను. ఈ రెండు విధములైన సాధకులు, వైరాగ్య పూర్వకముగా, మనస్సును, ఇంద్రియములను వశమునందుంచుకొని, ధ్యానయోగమును సాధించుట ఉపయోగకరమగును. అందువలన, ఇప్పుడు భగవంతుడు సంగ్రహముగా, ఫల సహిత ధ్యానయోగమును వర్ణించుచున్నాడు:-

స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాంశ్చక్షుశ్చైవాంతరే భ్రువోః ।
ప్రాణాపానౌ సమౌకృత్వా నాసాభ్యంతర చారిణౌ ॥ 27

యతేంద్రియ మనోబుద్ధి ర్మునిర్మోక్ష పరాయణః ।
విగతేచ్ఛా భయక్రోధో యస్సదా ముక్తఏవసః ॥ 28

"అర్జునా! బాహ్యవిషయ భోగములను చింతించకుండ, వానిని బయటనే తొలగించి,[1] నేత్రదృష్టిని కనుబొమ్మలమధ్య ఉంచి,[2] నాసికయందు సంచరించు ప్రాణాపానవాయువులను రెంటిని సమముచేసి[3] యెవని ఇంద్రియములు మనస్సు-

---

1 వివేక వైరాగ్యముల బలముచేత సమస్త బాహ్యవిషయములు క్షణభంగురములు- అనిత్యములు దుఃఖమయములు దుఃఖకారణములు" అని తెలిసికొని, వానియొక్క సంస్కార రూపములైన సమస్త చిత్రములను అంతఃకరణము నుండి తొలగించవలెను. వాని స్మృతిని పూర్తిగా నశింపజేయుటయే 'బాహ్య విషయములను బయటనే తొలగించివేయుట'యనబడును.

2. కన్నులలో నలువైపుల చూచుచుండుట చేతనైతే, ధ్యానమునందు స్వాభావికముగానే, విఘ్నములు- విక్షేపములు(సంచలనములు)కలుగును. కన్నులు మూసికొనుటచేత 'సోమరితనము-నిద్ర' ఈ రెండింటికి వశుడగునని భయమున్నది కాబట్టి, నేత్రములదృష్టిని కనుబొమ్మలనడుమ స్థిరముగా నిలుపవలెనని చెప్పబడెను.

3. ప్రాణాపానవాయువులు రెండింటి స్వాభావిక గతి విషమముగానుండును. ఒకప్పుడవి యెడమ నాసికలో సంచరించును. మరియొకప్పుడు కుడి

బుద్ధి-యవి జయించబడియున్నవో,[1] అటువంటి యే మోక్షాసక్తిగల ముని,[2] ఇచ్ఛా-భయ-క్రోధ రహితుడైనాడో, అతడు సదా ముక్తుడే యగును. (27,28)

---

ముక్కులో సంచరించును. ఎడమ ముక్కులో సంచరించు వానిని 'ఇడా నాడి'లో సంచరించుటయని, కుడిముక్కులో సంచరించు వాయువులను 'పింగళానాడి'లో సంచరించుట యనియు చెప్పెదరు. ఇటువంటి పరిస్థితిలో మనుష్యునిచిత్తము చంచలముగానుండును. ఈ విధముగా విషమ భావములో సంచరించు ప్రాణాపానవాయువుల గతి రెండు నాసికలలో సమానముగా సంచరించునట్లు చేయుట, వానిని సమానముగా చేయుట యనబడును. ఇదియే, అవి 'సుషుమ్నానాడి'లో సంచరించుట యగును. సుషుమ్నానాడిలో సంచరించునపుడు ప్రాణాపానవాయువులగతి, మిక్కిలి సూక్ష్మముగా, శాంతముగాను నుండును. అప్పుడు మనస్సుయొక్క చంచలత్వము, అశాంతి తమంతట నశించిపోవును. ఆ పురుషుడు సహజముగానే, పరమాత్మ ధ్యానమునందు నిమగ్నుడగును.

1. ఇంద్రియములు, కోరినప్పుడంతయు, తాము కోరిన విషయములన్నింటిలోను, స్వేచ్ఛగా తిరుగుచు పోవును మనస్సు సర్వదా చంచలముగా నుండును. అది తన అలవాట్లు విడువవలెనని యెప్పుడుగూడ కోరనే, కోరదు. ఇట్లే, బుద్ధిగూడ, ఒకటే నిశ్చయముపైన స్థిరముగానుండదు. ఇది, స్వతంత్రము, అడ్డులేకుండ ఉచ్ఛృంఖలమునగుట యనగా నిదియే. వివేక వైరాగ్య పూర్వకముగా అభ్యాసము చేయుటద్వారా, వీనిని అదుపులో, ఆజ్ఞలోఉంచి అంతర్ముఖములనుగాచేసి భగవంతునియందు నిష్ఠగలవిగా చేయుటయే వీనిని జయించుట యనబడును.

2. మనన శీలము గలవానిని 'ముని' యనెదరు ఏ పురుషుడు ధ్యాన కాలము నందువలె, వ్యవహార కాలమునందుకూడా పరమాత్ముడు సర్వవ్యాపకుడు అను దృఢనిశ్చయము గలవాడగుటచేత సర్వదా పరమాత్మ మననమే చేయుచుండునో, అతడే 'ముని' యనబడును.

3. ఏ మహాపురుషుడు, పైన చెప్పబడిన సాధనములద్వారా, పూర్తిగా ఇచ్ఛా భయ-క్రోధ రహితుడైనాడో, అతడు ధ్యానకాలమందుగాని, లేక వ్యవహార

సంబంధము :

ఏ మనుష్యుడు ఈ విధముగా మనస్సును-ఇంద్రియములను జయించి, కర్మయోగముకాని, సాంఖ్యయోగముకాని, లేక ధ్యానయోగమునుగాని సాధన చేయుటకు తాను సమర్థుడు కానని తెలుసుకొనునో, అటువంటి సాధకునకు సులభముగా పరమపదప్రాప్తి కలిగించు భక్తియోగమునుగూర్చి భగవంతుడు సంగ్రహముగా వర్ణించుచున్నాడు:—

"భోక్తారం యజ్ఞతపసాం సర్వలోక మహేశ్వరమ్ ।
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి॥" 29

అర్జునా! నా భక్తులు నన్ను, సర్వయజ్ఞములకు తపస్సులకు భోక్తనని,[1] సమస్త లోకేశ్వరులకుకూడా ఈశ్వరుడనని,[2] సమస్త భూత ప్రాణులకు మిత్రుడ

---

కాలమందుగాని, శరీరము ఉన్నప్పుడుగాని లేక, శరీరము విడినపుడుగాని, అన్ని పరిస్థితులలోను సర్వదా ముక్తుడేయగును. ప్రాపంచిక బంధనముల నుండి యెల్లప్పటికిన్ని పూర్తిగా విముక్తుడై పరమాత్మనుపొందెనని తెలియవలెను. ఇందులో సందేహము లేదు.

1. అహింసా-సత్యాది ధర్మముల పాలనము, దేవతా - బ్రాహ్మణ - మాతాపిత్రాది గురుజనముల సేవాపూజలు, దీన-దుఃఖిత-దరిద్ర-పీడిత జీవుల యెడల స్నేహము, వారినందరిని ఆదర పూర్వకముగా సేవించుట, వారి దుఃఖ నాశముకొరకు చేయబడు-పైన చెప్పబడిన సాధనములు, యజ్ఞ దానాది శుభకర్మలన్నియు, కలిసి, 'యజ్ఞము. తపస్సు'అను శబ్దములతో చెప్పబడినవని తెలిసికొనవలెను. భగవంతుడు అందరికి ఆత్మయగును. (గీత 10-20) కనుకనే, 'దేవతా-బ్రాహ్మణ దీన దుఃఖితాది' రూపములో ఉండి, భగవంతుడే సమస్త సేవా-పూజాదులను గ్రహించుచున్నా. ఈ కారణముచేత ఆయనయే, సమస్త యజ్ఞ తపస్సులకు భోక్త యగును. (గీత 9-24) ఈ విధముగా తలచుటయే 'భగవంతుడు యజ్ఞతపస్సులను అనుభవించువాడ'ని తెలిసికొనుట యగునని భావించవలెను.

2. ఇన్ద్ర-వరుణ-కుబేర-యమరాజాది లోకపాలకులకు, వేరు వేరు బ్రహ్మాం

నని,[1] అనగా స్వార్థరహితుడైన దయాళువు - ప్రేమగలవాడనియు తత్త్వముతో తెలిసికొని శాంతిని పొందగరు.[2] (29)

---

దములందు తమ తమ బ్రహ్మాండములను అదుపులో పెట్టుకొను ప్రభువు లందరికిన్ని, భగవంతుడు ప్రభువు-మహేశ్వరుడునై యున్నాడు. ఇందు చేతనే వేదములలో "తమీశ్వరాణాం పరమం మహేశ్వరమ్" అనగా ఈశ్వరులందరి కిన్ని పరముడైన ఆ మహేశ్వరుని (శ్వేతాశ్వతరోపనిషత్తు 6-7) అని చెప్పబడినది. తన అనిర్వచనీయ (వివరించుటకు వీలు కానట్టి) మాయాశక్తిచేత భగవంతుడు తన లీలావిలాసము చేతనే సమస్త అనంతకోటి బ్రహ్మాండముల యుత్పత్తి-స్థితి-సంహారములను చేయుచు, అందరకున్ను వారి వారి అర్హతల ప్రకారము అదుపు (నియంత్రణ)లో నుంచియున్నాడు. ఇట్లు చేయుచుండికూడ భగవంతుడు అందరికంటె పైకే ఉన్నాడు. ఈవిధముగా, భగవంతుడు 'సర్వశక్తిసంపన్నుడు-సర్వనియంత-సర్వాధ్యక్షుడు-సర్వేశ్వరుడు నని తలచుటయే యాయనను 'సర్వలోకమహేశ్వరుడు'అని తెలిసికొనుట యని భావించవలెను.

1. భగవంతుడు స్వాభావికముగానే యందరిపైన యనుగ్రహము చూపి, అందరి హితము కొరకు ఏర్పాట్లు చేయును మాటిమాటికి అవతారములెత్తి ఈ ప్రపంచ విచిత్రచరిత్రను అనేకములుగా చేయును. ఆ చరిత్రలను పాడుచు - పాడుచు లోకులు ఆనందంచెదరు. భగవంతుడు చేయు ప్రతియొక్క పనిలోను ప్రపంచహితము నిండియుండును. భగవంతుడు ఎవరిని సంహరించునో, దండించునో వారిపైనగూడ దయనే చూపును. ఆయన చేయు ఏ పని గూడా దయా-ప్రేమరహితముగా నుండదు. అందు చేతనే భగవంతుడు అన్ని భూతప్రాణములకు మిత్రుడగునని చెప్పబడినది.

2. "భగవంతుడు నాయందు నిష్కారణ ప్రేమగలవాడు; ఆయన ఏ పని చేసినప్పటికిన్ని, అది నా శ్రేయస్సుకొరకే చేయుననియు" ఏ పురుషుడు తెలిసికొని, ఆయనయందు విశ్వాసము ఉంచునో, అట్టివాడు ప్రతియొక దశలోను, జరిగిన విషయము, దయామయుడైన పరమేశ్వరుని ప్రేమగా,

ఇతి శ్రీ మహాభారతే భీష్మ పర్వణి శ్రీమద్భగవద్గీతాపర్వణి
శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే కర్మ సన్న్యాసయోగో నామ
పంచమోఽధ్యాయః 5

భీష్మపర్వణి ఏకోన త్రింశోఽధ్యాయః (29)

శ్రీ మహాభారతమునందు భీష్మ పర్వాంతర్గతమైన శ్రీమద్భగవద్గీతా పర్వము నందు శ్రీమద్భగవద్గీతోపనిషత్తులయందు బ్రహ్మవిద్యయందు యోగశాస్త్రమునందు శ్రీకృష్ణార్జున సంవాదమందు కర్మసన్న్యాయోగ మనబడు ఐదవ అధ్యాయము సమాప్తము.[5]

భీష్మపర్వమునందు ఇరువది తొమ్మిద అధ్యాయము సమాప్తము. 29



ఆయన దయలో ఓతప్రోతముగా (పడుగు పేకలవలె అన్నివైపుల) నిండిన మంగళమయ విధానమని తెలిసికొని సర్వదా ప్రసన్నుడై యుండును. ఇందుచేత, అతనికి అచంచలమైన శాంతి లభించును. అతనికి గలిగిన శాంతిలో ఏవిధమైన బాధగూడ కలుగుటకు ఏ విధమైన కారణమే యుండజాలదని భావింపవలెను.

*5. దీని తరువాతి విషయము భగవద్గీత మొదట అధ్యాయము చివర * ఈ గుర్తుగల అధో జ్ఞాపికలో నున్నట్లు గ్రహింపవలెను.

# భగవద్గీత ఆరవ అధ్యాయము

(భీష్మపర్వము 30వ అధ్యాయము)

## ఆత్మసంయమ యోగము :

సంబంధము :-

అయిదవ అధ్యాయము ఆరంభమునందు అర్జునుడు "కర్మసంన్యాస యోగము" (సాంఖ్య యోగము) 'కర్మయోగము' ఈ రెండింటిలో ఏదో యొక సాధనము నాకు నిశ్చితముగ శ్రేయస్కరమైనది ఏదియో అది తెలుపుమని భగవంతుని ప్రార్థించియుండెను. దానికి సమాధానముగ భగవంతుడు ఆ రెండు సాధనములు వాని ఫలములు శ్రేయస్సు సమానముగా కలిగించునవియే అని తెలిపి ఆ రెండింటిలో కర్మసంన్యాసముకంటే కర్మయోగము సులభము కాబట్టి, ఆ సాధనము శ్రేష్ఠమని ప్రతిపాదించెను. తరువాత ఆ రెండు సాధనముల స్వరూపము, వాని విధానము, వాని ఫలమును గూర్చి గూడ పరిపూర్ణముగ నిరూపించి ఆ రెంటికిన్ని మిక్కిలి ఉపయోగపడునది, పరమాత్మ ప్రాప్తికి ప్రధానోపాయమైనది ధ్యానయోగమని తలచి సంగ్రహముగ దానిని కూడా వర్ణించెను. కాని ఆ రెండింటిలో ఏ సాధనము అనుష్ఠించవలెను అను విషయమును అర్జునునకు స్పష్టములైన మాటలలో ఆజ్ఞాపించలేదు. ధ్యానయోగము యొక్క అంగప్రత్యంగ సహితమైన వర్ణననే భగవంతుడు విస్తారముగ చేయలేదు. ఈ కారణముచేత ఇప్పుడు ధ్యానయోగమును అంగసహితముగ విస్తరించి వర్ణించుటకుగాను ఆరవ అధ్యాయమును ఆరంభించుచు భగవంతుడు అన్నింటికంటే తొలుత అర్జునునకు భక్తిసహితమైన కర్మయోగమునందు ప్రవృత్తి కలిగించు నుద్దేశ్యముతో కర్మయోగమును ఇప్పుడు ప్రశంసించుచున్నాడు :-

భగవానువాచ :-

అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః ।
స సన్న్యాసీ చయోగీ చ న నిరగ్నిర్నచాక్రియః ॥ (1)

భగవంతుడిట్లన్నాడు :-

ఏ పురుషుడు అర్జునా! కర్మఫలమును ఆశ్రయించక,[1] చేయదగినకర్మలు చేయునో,[2] అతడు సన్న్యాసి యోగి యనబడును.[3] కేవలము అగ్నిని మాత్రమే త్యజించువాడు సన్న్యాసికాడు,[4] కేవలము కర్మలను మాత్రమే విడుచువాడు

1. ఈ లోకమునందు, పరలోకమునందున్ను గలుగు భార్యా-పుత్ర-ధన-మాన-గౌరవాదులన్నియు భోగములనబడును. ఆ యన్నిటి సమావేశము నందు చేసికొనవలెను. సామాన్య మనుష్యుడు, ఏ కర్మ చేసినను, ఏదో యొక ఫలమును గోరియే చేయును. కాబట్టి, అతని కర్మలు, అతనిని మాటి మాటికి జనన మరణ చక్రమునందు పడవేయునవియగును. కనుకనే ఈ లోకమునందు, పరలోకము నందున్ను గలుగు సమస్తభోగములు, అనిత్యములు-క్షణభంగురములు దుఃఖ హేతువులుఅని తెలిసికొని, సర్వకర్మ లందు, 'మమకార- ఆసక్తి - ఫలేచ్ఛా రహితుడై' వానిని పూర్తిగా విడుచుటయే 'కర్మఫలాశ్రయమును విడుచుట' యనబడును.

2. తమ తమ వర్ణములను అనుసరించి, శాస్త్ర విహితములైన నిత్య-నైమిత్తికములగు 'యజ్ఞ-దాన-తపస్సులు', శరీర నిర్వాహమున కవసరమగు కర్మలు. ప్రజాసేవకొరకు చేయబడు శుభకర్మలు, ఇవన్నియు చేయదగిన కర్మలే యగును. ఆకర్మలన్నియు యథావిధిగా, యథా యోగ్యముగా, సోమరితనమువిడిచి, తన శక్తిననుసరించి, కర్తవ్యబుద్ధిలో, ఉత్సాహ పూర్వకముగా సదా చేయుటయే 'కర్మలు చేయుట' యనబడును.

3. ఇటువంటి కర్మయోగియైన పురుషుడు, సర్వ సంకల్పములను త్యజించిన వాడగుచు సాంఖ్యయోగ కర్మయోగములకు అంతిమ ఫలమైన యథార్థ జ్ఞానమునుగూడ పొందగలడు. ఈ కారణముచేత, అతడు'సన్న్యాసిత్వము' 'యోగిత్వము' నను రెండుగుణములున్ను గలవాడని తలచబడును.

4. ఎవడు అగ్నిని త్యజించి, సన్న్యాసాశ్రమమునైతే గ్రహించెనో, కాని, యెవడు, జ్ఞానయోగ(సాంఖ్యయోగ)లక్షణములు గలవాడు కాడో, అతడు వాస్తవముగా, సన్న్యాసి కాడు. ఎందుకనగా, అతడు కేవలము అగ్నిని

యోగికాడు.[1]

సంబంధము :-

మొదటి శ్లోకమునందు భగవంతుడు, కర్మఫలము నాశ్రయింపక కర్మ చేయువాడు సన్న్యాసియని యోగి యనియు తెలిపెను. దానిపైన, 'సన్న్యాసము-యోగము రెండును వేర్వేరు స్థితిగలవైన యెడల పైన చెప్పబడిన యిద్దరు సాధకులచేత ఆ రెండున్ను ఎట్లు అనుష్ఠింపబడును', అను శంక కలుగవచ్చును. కనుక ఈ శంకను నిరాకరించుటకు రెండవ శ్లోకమునందు 'సన్న్యాసము యోగము ఈ రెండున్ను ఒకటి యని భగవంతుడు అర్జునునకు ప్రతిపాదించుచున్నాడు :-

యం సన్న్యాసమితి ప్రాహుర్యోగం తం విద్ధి పాండవ ।
న హ్యసన్న్యస్త సంకల్పో యోగీ భవతి కశ్చన ॥ 2

అర్జునా! దేనిని సన్న్యాసమని చెప్పెదరో, అదియే యోగమని తెలియుము.[2] ఎందుకనగా, సంకల్పములను విడువనివాడెవడుగూడ యోగి కాజాలడు. (2)

---

మాత్రమే విడిచెను. కాని, సమస్త క్రియలయందు కర్తృత్వాభిమానము, మమకార-ఆసక్తి-దేహాభిమానములను విడువలేదు.

1. ఎవడు అన్ని కర్మలను త్యజించి, ధ్యానమునందైతే నిమగ్నుడై కూర్చున్నాడో, కాని, యెవని అంతఃకరణమునందు అహంకార-మమకార-రాగద్వేష కామనాది దోషములు ఉన్నవో, అతడు గూడా వాస్తవముగా యోగి కాడు. ఎందుకనగా, అతడు గూడ కేవలము బాహ్యేంద్రియములను మాత్రమే విడిచెను. మమకార-అభిమాన-ఆసక్తి-కామనా-క్రోధాదులను విడువలేదు.

2. ఇక్కడ సన్న్యాస శబ్దమునకు, శరీరేంద్రియ మనస్సులచేత జరుగు సర్వ క్రియల కర్తృత్వము పోగొట్టి, కేవలము పరమాత్మయందే అభిన్న భావములో స్థిరముగా నిలిచియుండుట యని యర్థము. ఇది సాంఖ్య యోగము యొక్క అంతిమదశ. యోగ శబ్దమునకు, మమకార- ఆసక్తి-

ఆరురుక్షోర్మునేర్యోగం కర్మ కారణముచ్యతే ।
యోగారూఢస్య తస్యైవ శమః కారణముచ్యతే ॥ 3

అర్జునా! యోగమునందు ఆరూఢుడు కాగోరు మనన శీలుడైన పురుషునకు యోగప్రాప్తికి నిష్కామ భావముతో కర్మ చేయుటయే హేతువుగా చెప్పబడినది.[1] యోగారూఢుడు అయిన తరువాత, ఆ యోగారూఢ పురుషునకు గల సర్వ సంకల్పాభావమే[2] శ్రేయస్సు కలుగుటకు హేతువని చెప్పబడుచున్నది. (3)

యదా హి నేంద్రియార్థేషు న కర్మస్వనుషజ్జతే ।
సర్వ సంకల్ప సన్న్యాసీ యోగారూఢస్తదోచ్యతే ॥ 4

అర్జునా! ఎప్పుడైతే, యింద్రియభోగములందు, కర్మములందున్ను

---

కామనల త్యాగము ద్వారా యేర్పడు కర్మయోగము యొక్క అంతిమదశ యైన 'నైష్కర్మ్య సిద్ధి' యని యర్థము. ఈ రెండింటి యందున్ను పూర్తిగా సంకల్పాభావము కలుగును. సాంఖ్యయోగి- ఏ పరబ్రహ్మ ఏ పరమాత్మను పొందునో, కర్మయోగి గూడ ఆ పరమాత్మనే పొంద గలడు, ఈ విధముగా ఈ రెంటికిన్ని సంకల్పత్యాగము- ఫలప్రాప్తియు సమానములే. ఈ కారణముచేత ఈ రెండింటికిన్ని ఐక్యము చెప్పబడినది.

1. తన వర్ణాశ్రమాధికారమునకు, స్థితికిన్ని అనుకూలముగా, ఏ సమయము నందు కర్తవ్యకర్మ ఉండునో, దానిని ఫలాసక్తి రహితముగా, నాచ రించుట, యోగారూఢావస్థా ప్రాప్తికి హేతువగును. కనుకనే, గీత మూడవ అధ్యాయము 4వ శ్లోకమునందు గూడ, 'కర్మలు చేయక, మనుష్యుడు- నైష్కర్మ్యము అనగా, యోగారూఢావస్థను పొందజాలడు అని చెప్పబడెను.

2. మనస్సు వశపరచుకొని శాంతుడైన పిదపనే, సంకల్పము పూర్తిగా లేకుండపోవును ఇది గాక, కర్మలు పూర్తిగా, స్వరూపముతో విడువబడ జాలవు. కనుకనే యిక్కడ 'శమః' అను పదమునకు అర్థము సంకల్పా భావమని తలచబడెను.

అనక్తుడు కాడో, అప్పుడు సర్వ సంకల్పములను విడిచిన [1] పురుషుడు యోగా రూఢుడు యనబడును. 4

సంబంధము :-

పరమ పదమునకు హేతువులైన యోగారూఢావస్థను వర్ణించి భగవంతు డిప్పుడు, దానిని పొందుటకు అర్జునుని ప్రోత్సాహించుచు, మనుష్యుని కర్తవ్య మును తెలుపుచున్నాడు.

ఉద్ధరే దాత్మనాऽऽత్మానం నాऽత్మాన మవ సాదయేత్ ।
ఆత్మైవ హ్యాత్మనో బంధురాత్మైవ రిపురాత్మనః ॥ 5

అర్జునా! తానే తనను సంసార సముద్రమునుండి ఉద్ధరించుకొనవలెను.[2]

---

1. ఇక్కడ, 'సంకల్పత్యాగము' అను దాని యర్థము, కాని స్ఫురణను విడుచుట యని కాదు. అట్లైనచో యోగారూఢావస్థా వర్ణనమే అసంభవ మగును. ఇదిగాక, గీత 4వ అధ్యాయము 19వ శ్లోకమునందు, ఏ మహా పురుషుని సర్వ కర్మలు కామనా- సంకల్పములు లేకుండా పూర్తిగా నెరవేరునో, అతనిని పండితుడనెదరు అని చెప్పబడెను. అక్కడ ఇట్లు ప్రశంసించబడిన మహాపురుషుడు యోగా రూఢుడు కాడు." అని చెప్పు టకు వీలు పడదు. ఇట్టి పరిస్థితిలో, సంకల్పరహిత పురుషుడు కర్మ చేయడని యంగీకరింప బడజాలదు. సంకల్పత్యాగమునకు అర్థము, స్ఫురించుటను లేక, వృత్తి మాత్రము విడచుట యని కాదు. మమకార- ఆసక్తి- ద్వేషములతో 'ప్రాపంచిక విషయ చింతనము' చేయుటను 'సంకల్పము' అనెదరు. ఇట్టి సంకల్పములను పూర్తిగావించుటయే సర్వ సంకల్ప సన్న్యాస మనబడును.

2. దుర్లభమైన మానసిక జీవనము వ్యర్థము చేయక, కర్మ, సాంఖ్య-భక్తి యోగములలో నేదో యొకదానిని సాధించుటయందు నిమగ్నుడై. తన జన్మసఫలము చేసుకొనుటయే. 'తనను-తాను ఉద్ధరించుకొనుట, యన బడును.

తనను అధోగతిలో పడవేసుకొనగూడదు. ఎందుకనగా, ఈ మనుష్యుడు, తనకు తానే మిత్రుడుగదా! తానే కదా తనకు శత్రువగును. [1]

"బంధురాత్మాఽఽత్మనస్తస్య యేనాత్మైవాఽత్మనా జితః ।
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాఽఽత్మైవ శత్రువత్ ॥ 6

అర్జునా! యే జీవాత్మునిచేత మనస్సు- ఇంద్రియములు- వీనితో గూడిన శరీరము జయింపబడెనో, [2] ఆ జీవాత్మునకైతే, ఆ యాత్మయే మిత్రము.

---

రాగ-ద్వేష కామ-క్రోధ-లోభ-మోహాది దోషములలో ఇరుకుకొని, వివిధ దుష్కర్మలు చేయుట తత్ఫలముగా మనుష్య శరీరమునకు ఉత్తమ ఫలమైన భగవత్ప్రాప్తినుండి వంచితుడై మరల పంది కుక్కల యోనులలో జన్మించుటకు కారణమగుట యనునది, అధోగతికి ఆ మనుష్య శరీరమును తీసికొనిపోవుట యగును.

మనుష్యుడు "ప్రారబ్ధము చెడ్డది కనుక, నాకు ఉన్నతి కలుగనే కలుగదు, అని తలచగూడదు. మనుష్యుని ఉన్నతి- పతనములు ప్రారబ్ధాధీనములు కావు. అతని చేతిలో అది యున్నది. అతడు- తన స్వభావమునందు- కర్మములందును ఎంత యెక్కువ సంస్కారము (దిద్దుబాటు) చేయునో, అంత గొప్ప ఉన్నతిని పొందును. స్వభావము యొక్క- కర్మలయొక్క దిద్దుబాటు, తన ఉన్నతికి - ఉద్ధారమునకున్ను హేతువగును. స్వభావము నందు- కర్మలయందున్న దోషములు వృద్ధిచెందుటయే, తన అవనతికి పతనమునకు హేతువగును.

1. తన ఉద్ధారముకొరకు ప్రయత్నించువాడు, తనకు తానే మిత్రుడు. దీనికి విపరీతముగా వ్యవహరించువాడు, తనకు తానే, శత్రువగును. కనుక తనకంటే వేరుగాని, తన మిత్రుడు గాని, శత్రువుగాని లేదు.

2. పరమాత్మ ప్రాప్తికి మనుష్యుడు, తన శరీరేంద్రియ మనస్సులను సాధనములుగా చేయును. అవి అనాయాసముగానే, భగవత్ప్రాప్తికి, పూనుకొని, తమ లక్ష్యము విడిచి అపమార్గమునందు పోవకుండనప్పుడు; అవి వశమునందున్నవని తలచవలెను.

ఎవడైతె మనసునందు ఇంద్రియ సహితమైన శరీరమును జయించలేదో, అతని ఆ యాత్మయే శత్రువువలెనగును.[1]

సంబంధము :-

మనస్సు-ఇంద్రియసహిత శరీరమును జయించినవాడు-తనకు తానే మిత్రుడెందుకగును? ఈ విషయము స్పష్టము చేయుటకు భగవంతుడిప్పుడు, శరీరేంద్రియ మనస్స్వరూపము అగు నాత్మను వశమునందుంచుకొనినందుకు ఫలమునుగూర్చి అర్జునునకు తెలుపుచున్నాడు.

జితాత్మనః ప్రశాంతస్య! పరమాత్మా సమాహితః
శీతోష్ణ సుఖదుఃఖేషు । తథా! మానావమానయోః ॥ 7

"అర్జునా! శీతోష్ణ-సుఖదుఃఖ-మానావమానాది ద్వంద్వములలో, అంతఃకరణ వృత్తులు పూర్తిగా శాంతించియుడిన స్వాధీనాత్మగల మనుష్యుని జ్ఞానమునందు సచ్చిదానందఘన-పరమాత్ముడు బాగుగా, స్థిరముగాను నిలిచియున్నాడు-అనగా, అతని జ్ఞానములో పరమాత్మదప్ప మరియేదియు లేనేలేదు.

"జ్ఞాన విజ్ఞాన తృప్తాఽత్మా! కూటస్థో[2] విజితేంద్రియః ।
యుక్త ఇత్యుచ్యతే! యోగీ సమలోష్టాశ్మకాంచనః ।." 8

---

1. ఇంద్రియ నిగ్రహము లేని మనుష్యుడు స్వయముగా, మనస్సు ఇంద్రియములు మొదలైనవానికి వశుడై, అపథ్యముచేయు రోగివలె, తన శ్రేయస్సునకే విపరీతముగా ఆచరణచేయును. అతడు అహంకార-మమకార- రాగ- ద్వేష- కామ-క్రోధ-లోభ-మోహాదుల-కారణము చేత ఏమరుపాటు- సోమరితనము, విషయభోగములు, వీనిలో ఇరుకుకొని, పాపకర్మల యొక్క కఠిన బంధనములందు పడిపోవును. ఇట్లే తనను తానే మాటిమాటికిన్ని నరకాదులలో పడవేసి, వివిధ యోనులందు భ్రమింపచేసి, అనంతకాలమువరకు భయంకర దుఃఖములను అనుభవించుటకు బాధ్యుని చేసికొనును ఇదియే, శత్రువువలె శత్రుత్వము ఆచరించుట యనబడును.

2. వివిధ మహాదుఃఖములు సంభవించినపుడుకూడ, తన స్థితినుండి కొంచెము

అర్జునా! యెవని అంతఃకరణము జ్ఞాన విజ్ఞానములచేత తృప్తిచెంది యెవనికి; పట్టిపెడ్డ, రాయి, బంగారము సమానములో అటువంటియోగి, 'యుక్తుడు'అనగా భగవంతుని పొందినవాడు, అని చెప్పబడును-కంసాలెవాడు నగలు చేయుటకు యుంచుకున్న ఇనుప 'డాకలి'కి కూటమని పేరు. అట్టివాడే పరబ్రహ్మ దానిపై చేయబడిన నగల సంబంధము దానికి లేనట్లు, ప్రపంచోత్పత్తి బ్రహ్మనుండి కలిగినను, ప్రపంచ సంబంధము బ్రహ్మకుండదు-కనుక 'కూటస్థుడని'పేరు.

"సుహృన్మిత్రార్యు దాసీన మధ్య స్థద్వేషబంధుషు ।
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే ॥" 9

"అర్జునా! సుహృత్ (తన యెడల మంచి మనస్సు ప్రేమగల వ్యక్తి) మిత్రుడు (రక్తసంబంధము గల హితుడు[1], వైరి, ఉదాసీనుడు) (శతృత్వ, మిత్రత్వము లందు ప్రవర్తించక ఊరకుండువాడు)మధ్యస్థుడు, ద్వేష్యుడు[2], వీరియెడల,

---

కూడా చలించక, అంతఃకరణమునందు కొంచెముగూడ వికారము కలుగక, ఎల్లప్పుడుసు అచంచల భావముతో పరమాత్మ స్వరూపమునందు స్థిరముగా నిలిచియున్న పురుషుడు 'కూటస్థుడు' అనబడును.

1. సాధారణముగా మిత్రుడు-సుహృత్తు, ఈ రెండు శబ్దములు ఏకార్థమునందే ప్రయోగింపబడునుగాబట్టి యిక్కడ ఈ రెండు శబ్దముల విశేషార్థములు విడివిడిగా తెల్పబడినవి.
2. బంధుత్వము-ఉపకారాదులు ఏవియూ దృష్టియందుంచుకొనక ఏ పరిచయాదులు లేకున్నను, కారణము లేకున్నను, స్వభావముతోనే ప్రేమ చూపుచు, ఇతరులకు హితముచేయువారు సహృత్తులు, అనబడును. పరస్పర ప్రేమను, పరస్పర హితము చేయువారు 'మిత్రులు' అనబడును. స్వభావము చేతనే, ఏకారణములేకుండా ఇతరులకు కీడుచేయువాడు 'ద్వేష్యుడు' అనబడును. ఏదోకారణముచేత కీడుచేయుకోరికలేక, ప్రయత్నము చేయువాడు 'వైరి' అనబడును-పరస్పరము జగడమాడువారినికలిపి, వారి స్నేహము, కాపాడుట, కలుపు ప్రయత్నించువారిని పక్షపాతములేకుండ, వారి హితము కొరకు వ్యాయముచేయువారిని, 'మధ్యస్థులు' అనియెదరు. వారిలో ఎలాటి సంబంధములేకుండ, ఊరకుండువాడు 'ఉదాసీనుడు' అనబడును.

బంధుగణములయందు, ధర్మాత్ములయందు, పాపిష్ఠులయందున్ను సమాన భావము గలవాడు.[1] అత్యంత్య శ్రేష్ఠుడనబడును.

సంబంధము :-

ఇక్కడ "జితాత్ముడైన పురుషుడు పరమాత్మప్రాప్తికి ఏమి చేయవలెను. అతడు, ఏసాధనములచేత పరమాత్మను శీఘ్రముగా పొందగలడు" అను జిజ్ఞాస కల్గును. దానికి సమాధానముగా భగవంతుడిప్పుడు ధ్యానయోగ ప్రకరణము నారంభించి అర్జునునకు వివరించుచున్నాడు :

''యోగీ! యుంజీత సతతమాత్మానం రహసి స్థితః ।
ఏకాకీ యతచిత్తాఽత్మా నిరాశీర పరిగ్రహః॥''[2] 10

అర్జునా! యింద్రియ-మనస్సహిత శరీరమును వశపరచుకొని ఆశలేనివాడై, జీవికా నిర్వహణముకైన వస్తుసామగ్రిని కూర్చుకొననివాడు (అపరిగ్రహుడు)నైన యోగి, యొక్కడు ఏకాంత స్థానమునందుండి ఆత్మకు పరమాత్మయందు నిరంతరము నిమగ్నము చేయవలెను.

---

1. పైన చెప్పడిన అత్యంత విలక్షణ స్వభావముగల 'మిత్ర-వైరి-సాధు పాపి మొదలైనవారి ఆచరణము, స్వభావము -వ్యవహారము-వీని భేదముల ప్రభావము కొంచెముగూడ ఎవనిపైనపడదో, ఎవని బుద్ధియందు, ఎప్పుడు గూడా, ఎట్టి పరిస్థితిలోగూడ ఏకారణము చేతనైననూ, రాగ-ద్వేష పూర్వకమైన భేదభావము కలుగదో, అట్టివాడే 'సమబుద్ధిగల పురుషుడు' అనబడును.

2. ప్రాపంచిక సుఖ-భోగ సామగ్రిని చేకూర్చి పెట్టుకొనుట 'పరిగ్రహము' అనబడును. అట్టి పరిగ్రహము లేనివాడు 'అపరిగ్రహుడు' అనబడును. అతడొక వేళ గృహస్థుడైనయెడల, ఏవస్తువునుగూడ మమకారముతో కూర్చి పెట్టుకొనగూడదు. బ్రహ్మచారి, వానప్రస్థుడు, సన్న్యాసియైనయెడల శాస్త్ర ప్రతికూలముగా, ఏవస్తువునుగూడ ఏమాత్రము సంగ్రహించి కూర్చుకొనగూడదు. అటువంటి పురుషుడు ఏయాశ్రమమునందున్న వాడైననుసరియే 'అపరిగ్రహుడు' అనియే అనబడును.

"శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః ।
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చైలాజినకుశోత్తరామ్॥" 11

అర్జునా! పరిశుద్ధమైనభూమిపైన[1], క్రమముగా, దర్భలు, మృగచర్మము, వస్త్రముగాని పరచబడియుండి, మిక్కిలి ఎత్తుగాను తగ్గుగాను ఉండునట్టి, తన ఆసనమును, స్థిరమైన స్థానమునందు స్థాపించి–"

తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః ।
ఉపవిశ్యాఽసనే యుంజ్యాత్ యోగమాత్మవిశుద్ధయే ॥ 12

ఆ యాసనముపైన కూర్చొని, ఇంద్రియ-మనస్సుల-కర్మలు వశపరచుకొనుచు, మనస్సును ఏకాగ్రముచేసి, అంతఃకరణ పరిశుద్ధికొరకు యోగమును అభ్యసించవలెను.

"సమం కాయ-శిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః
సంప్రేక్ష్య నాసికాఽగ్రం స్వం దిశశ్చానవలోకయిన్ ॥ 13

"అర్జునా! శరీరము - శిరస్సు - మెడ - ఇవి సమానముగా, అచంచలముగా ధరించి, స్థిరముగా కూర్చొని [2] తన నాసికాఽగ్రభాగమునందు దృష్టి నిలిపి, ఇతర దిక్కులు చూడక

---

1. ధ్యానయోగ సాధనము చేయుటకుగాను, అవసరమైన ఆసనము వేయబడు చోట, స్వభావముచేతనే, పరిశుద్ధముగా, దుమ్ము చెత్తలేనిదిగా, ఊడ్చి అలుకబడినదిగా, లేక, కడిగి తుడవబడినదిగాను, స్వచ్ఛముగాను, నిర్మలముగాను ఉంచబడియుండవలెను. 'గంగా-యమునాది పవిత్ర నదీ తీరములు-పర్వతగుహలు, దేవాలయములు - పుణ్యక్షేత్రములు లేక తోటలు, పవిత్ర వాతావరణముగల స్థానములు, వీనిలో ఏస్థలము సులువుగా లభ్యమగునో అటువంటి పవిత్ర-స్వచ్ఛ-ఏకాంత స్థలముగాని, లేక ధ్యానయోగ సాధనమునకు అనువైన యటువంటి పవిత్ర-స్వచ్ఛ-ఏకాంతస్థలముగాని, మరియొకస్థలము ఏదైనగాని వెతికి, ఎన్నుకొని, అక్కడ ధ్యానయోగ సాధనము చేయవలెను.

2. ఇక్కడ పిక్కలకు గొంతుకు మధ్యనున్న భాగము శరీరమని గ్రహించ

"ప్రశాంతాత్మా విగతభీర్బ్రహ్మ చారివ్రతే స్థితః
మనః సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః 14

"అర్జునా బ్రహ్మచారివ్రతము నందుండి[1], భయరహితుడై[2], శాంతమైన

---

వలెను. మెడకు పై భాగము శిరస్సు, కడుపు, వెనుకకు, ముందుకు, కుడికి, ఎడమకు వంచగూడదు. అనగా వెన్నెముక చక్కగా నిలిపి ఉంచవలెను. మెడగూడ ఏవైపునకు వంచగూడదు. శిరస్సుగూడ ఇటునటు త్రిప్పగూడదు. ఈ విధముగా ఆ మూడు చక్కగా నిలువున నిలిపి, ఏ అవయవము గూడ కొంచెము గూడ చలించకుండ వుంచుటయే శరీర - శిరోగ్రహణము - విక్షేపము (చంచలత్వము) శీతోష్ణాది ద్వంద్వములున్ను విఘ్నకారులని చెప్పబడినది. ఈ విక్షేపములు పోగొట్టుకొనుటకు, పైన చెప్పబడిన విధముగా నాచరించుట పరిశ్రమమున మంచి ఉపాయము. శరీరము- శిరస్సు, మెడ- చక్కగా నిలువున నిలిపి కన్నులు తెరచియుంచుకొనుటచేత సోమరితనము. నిద్ర- ఆలసత్వము వుండవు ముక్కుకొనపైన చూపు నిలిపి ఇటునిటు ఉన్న ఇతర వస్తువులను చూడకుండుటచేత, బాహ్యములైన దృష్టి విక్షేపములు కలుగుటకు అవకాశము ఉండదు. ఆసనము దృఢముగా వుండుటచేత, శీతోష్ణాది ద్వంద్వములనుండి బాధకలుగునను భయము ఉండదు. అందుచేత, ధ్యానయోగ సాధనము చేసినప్పుడు ఈ విధముగా ఆసనము వేసికొని కూర్చొనుట చాల ఉపయోగకరముగా నుండును.

1. బ్రహ్మచర్యము యొక్క తాత్త్వికమైన యర్థము వేరైనప్పటికిన్ని, వీర్యమును నిలుపుట యను ప్రధాన యర్థమునే ఇక్కడ ప్రసంగానుకూలముగా గ్రహించవలెను. మనుష్యుని శరీరమునందు వీర్యమే అమూల్య వస్తువు, దానిని మిక్కిలి బాగుగా సంరక్షణము చేసికొనని యెడల, శారీరకముగా, మానసికముగా, ఆధ్యాత్మికముగాను ఏ విధమైన బలము గూడ లభించదు. వీర్య సంచయ (కూర్చుకొనుట) మేకారణము. కనుక, యోగి బ్రహ్మచర్య వ్రతములో నుండవలెనని చెప్పబడెను.

2. ధ్యానము చేయునప్పుడు సాధకుడు నిర్భయముగా నుండవలెను. మనస్సు

అంతఃకరణము కలిగి[1], సావధానుడై (హెచ్చరికతో నుండి)[2] యుండి, యోగి మనస్సును నిగ్రహించుకొని, నాయందు చిత్తము నిలిపినవాడై[3], నాయందే ఆసక్తి గలవాడై స్థిరముగా నుండవలెను. (14)

---

నందు కొంచెమైనను భయమున్నచో, ఏకాంతము నిర్జనమునైన స్థానము నందు, స్వాభావికముగానే, చిత్తమునందు విక్షేపము కలుగును కనుక సాధకుడు అప్పుడు మనస్సునందు- పరమాత్మ- సర్వశక్తిసంపన్నుడు- సర్వవ్యాపి కనుక ఆయన ఇక్కడగూడ నున్నాడు. ఆయనయుండగా, ఏ భయము గూడ నుండదు. ఒకవేళ ప్రారబ్ధవశమున ధ్యానము చేయు చుండగా మరణము కలిగినను, దానిచేత, పరిణామమున శ్రేయస్సే కలుగును అని నిశ్చయించుకొనవలెను.

1. ధ్యానము చేయునప్పుడు, రాగ- ద్వేష- హర్ష, శోక, కామ- క్రోధాదులగు చెడ్డవృత్తులను, ప్రాపంచికములైన సంకల్ప వికల్పములను మనస్సు నుండి పూర్తిగా దూరముచేసి, వైరాగ్యముచేత మనస్సును పూర్తిగా నిర్మలముగా, శాంతముగా నుంచుకొనుటయే "ప్రశాంతాత్మా"యనబడునని తెలియవలెను.

2. ధ్యాన సమయమునందు, సాధకుడు, నిద్ర, సోమరితనము, ఏమరుపాటు, ఈ మొదలైన విఘ్నములు లేకుండుటకు, మిక్కిలి జాగరూకతతో నుండవలెను. అట్లు చేయకున్నచో మనస్సు- ఇంద్రియములును సాధకుని మోసగించి, ధ్యానమునందు విఘ్నములు కలిగించును, ఈ విషయము తెలుపుటకే "యుక్త" పదము వాడబడినది.

3. ఒకచోటనిలువక, నిలిపినను బలవంతముగానితర విషయములవైపు పోవుట మనస్సునకు స్వభావము. పూర్తిగా నిలుపక, ధ్యానయోగ సాధనమేర్పడ జాలదు. కనుక ధ్యానయోగియైనవాడు, ధ్యానము చేసినప్పుడు, మనస్సును బాహ్య విషయముల నుండి పూర్తిగా తొలగించి, పరమ హితమును గోరువాడు సుహృత్తు- పరమ ప్రేమాస్పదుడు నైన పర మేశ్వరుని 'గుణ- ప్రభావ- తత్త్వ రహస్యము తెలిసికొని, సమస్త ప్రపంచమునందలి ప్రేమ విడిచి, ఆ పరమేశ్వరునొకనినే తన ధ్యేయ

"యుంజన్నేవం సదాఽత్మానం యోగీ నియతమానసః
శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి ॥ 15

అర్జునా మనస్సును వశపరచుకొనిన యోగి[1] ఈ విధముగా ఆత్మను పరమేశ్వరుడైన నా స్వరూపమునందు లగ్నము చేయుచు[2], నాయందే యున్న పరమానందము యొక్క అంతిమదశ రూపమైన శాంతిని పొందగలడు[3]

"నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాంతమనశ్నతః
న చాతి స్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున ॥ 16

---

నిగా చేసి అనన్య భావముతో చిత్తమును ఆ పరమేశ్వరునియందే లగ్నము చేయుటకు అభ్యాసము చేయవలెను.

1. ఇట్లు చెప్పుట చేత, భగవంతుడు 'నన్నే' పరమగతిగా, పరమ ధ్యేయునిగా, పరమాశ్రయునిగా, పరమ మహేశ్వరునిగా, అన్నిటికి మించి ప్రేమాస్పదునిగాను తలచి, నిరంతరము నన్ను ఆశ్రయించి నన్నే పరమరక్షకునిగా, సహాయకునిగా, ప్రభువుగా, జీవనముగా, ప్రాణముగా, సర్వస్వముగాను తలచి, నా ప్రతియొక విధానములోను సంతుష్టుడైయుండుట ఇదియే నాయెడల తత్పరుడై యుండుట అనబడును' అను భావమును తెలిపెను.

2. పైన చెప్పబడిన విధముగా, మనస్సుచేత. బుద్ధిచేతను నిరంతర తైలధార వలె ఎడతెగకుండ అవిచ్ఛిన్నుడై భగవంతుని స్వరూపమును చింతించుట, భగవంతుని యందు అచంచల భావముతో తన్మయుడై వుండుటయే, "ఆత్మను పరమేశ్వరస్వరూపము నందు లగ్నముచేయుట"యనబడును.

3. దీనికి "నైష్ఠికశాంతి (గీత-5-12), శాశ్వతశాంతి (గీత 1-31), పరా శాంతి (గీత-18-62)" అని చెప్పబడినది. పరమేశ్వర ప్రాప్తి, పరమదివ్య పురుషప్రాప్తి, పరమగతిప్రాప్తి, ఈ మొదలైన నామములతో వర్ణించ బడునో, ఆ శాంతి సాటిలేనిది, అనంతమైనదియునగు ఆనందమునకు అంతిమ అవధిగాయగును. పరమదయాళువు, పరమసుహృత్తు, ఆనందనిధి, ఆనందస్వరూపుడైన భగవంతుని యందు, నిత్యము- నిరంతరము- అచం

'అర్జునా ఈ యోగము[1], అధికముగా ఆహారము తినువారికి, పూర్తిగా తిననివారికి. అధికముగా నిద్రించు స్వభావము గలవారికి[2], సర్వదా మేల్కొని యుండువారికిన్ని సిద్ధించదు.

"యుక్తాఽహార విహారస్య యుక్తచేష్టస్య కర్మసు
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా 17

అర్జునా దుఃఖమును నశింపజేయు యోగమైతేనో, తగినంతగా ఆహారములు గ్రహించువారికి [3] కర్మములందు తగినంత ప్రయత్నము చేయు

---

చలము-స్థిరముగాను ఆ శాంతి నివసించియున్నది. ధ్యానయోగసాధకుడు, ఆశాంతినే పొందగలడు.

1. సమస్త దుఃఖములను పూర్తిగా నశింపజేసి, పరమానందస్వరూపుడు, పరమశాంతి సముద్రుడునైన పరమేశ్వరుని పొందుయోగ మార్గమగు శబ్దమునకు 'ధ్యానయోగము' అని అర్థము అని తెలియవలెను.

2. తగు మాత్రమె నిద్రించిన యెడల. దానిచేత అలసటపోయి శరీరములో చురుకుదనము, నూతనత్వము కలుగును. కాని అవసరము కన్న అధికముగా నిద్రించినయెడల, దానిచేత తమోగుణము పెరుగును. దానిచేత అతినిద్ర వలన కష్టముగా తోచును. ఇదిగాక, అతినిద్రవలన మనుష్య జీవితములో అమూల్యమైన సమయముగూడ నష్టమగును. ఈవిధముగనే సర్వదా మేల్కొని, నిద్రించకయుండుటచేత శరీరమునందు అలసట కలుగును. ఎప్పుడుగూడ నూతనత్వము—చురుకుదనము రాదు. శరీరము ఇంద్రియములు-ప్రాణములు శిథిలములై నడలిపోవును. శరీరమునందు వివిధ రోగములుగూడ ఉత్పన్నములగును.

3. ఏ వస్తువులు తమ వర్ణాశ్రమధర్మానుసారము సత్యముగాను, న్యాయముగాను లభించియుండునో, శాస్త్రప్రకారము సాత్వికములుగా నుండునో (గీత 17-8) రజోగుణ — తమోగుణములను పెంచునవిగానుండవో, పవిత్రములైనవో, ఏ వస్తువులు తమ ప్రకృతికి, పరిస్థితికి, రుచికిన్ని ప్రతికూలములుకావో, యోగసాధనమునకు సహాయకములుగా నుండునో,

వారికి తగినంత మాత్రమే నిద్రించుచు, మెల్కొనుచునుండు వారికిన్ని ఏర్ప
డును[2]

"యదా వినియతం చిత్తమాత్మన్యేవావతిష్ఠతే।
నిస్స్పృహః సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా॥ 18

---

అటువంటివే యైన ఆహార పానీయ వస్తువులను గ్రహించవలెను. అవి గ్రహించుటవలన కలుగు పరిణామముగూడ, తమశక్తికి, తమ యారోగ్యమునకు, యోగసాధనమునకున్నూ ఎంత హితకరములో, ఆవశ్యకములో, అంతపరిమాణము (కొలత)లోనే గ్రహించవలెను.

1. వర్ణాశ్రమములు-వయస్సు-పరిస్థితి-వాతావరణము- ఇత్యాదులననుసరించి, ఎవనికి శాస్త్రములలో, ఏకర్తవ్య కర్మలు తెలుపబడినవో, వాని పేరే 'కర్మలు' అనబడును. ఆ కర్మలను, తగిన స్వరూపములో, తగినంత మాత్రము తన యోగ్యతానుసారముగా ననుష్ఠించుటయే 'కర్మలయొక్క యుక్తచేష్ట' యనబడును- పరమేశ్వరభక్తి-దేవపూజ- దుఃఖితులను, దీనులను సేవించుట మాతృ, పితృ ఆచార్యాది గురుజన పూజ- యజ్ఞ, దాన, పఠన, పాఠన, వ్యాపార, శౌచ-స్నానాది కర్మలు- ఈ కర్మలన్నిగూడ, శాస్త్రవిహితములు, సాధు సమ్మతములు- ఎవరికిగూడ అహితము చేయనివి- స్వయంపోషణమునకు హాయకములుగా ధ్యానయోగమునకు సహాయకములుగా నుండునవిగాను నుండవలెను - ఈ కర్మల పరిణామము (అంతిమఫలము) గూడ, ఎవని కెంతయావశ్యకమో, దేనిచేత న్యాయపూర్వకముగా శరీరనిర్వాహములు జరుగుచుండునో, ధ్యానయోగము కొరకు గూడ ఆవశ్యకతను అనుసరించి పూర్తిగా, సకాలములో లభించునో, అంతమాత్రమే కావలెను. ఇట్లు చేయుటచేత, శరీరము- ఇంద్రియములు- మనస్సు-ఇవి స్వస్థము (ఆరోగ్యము)లుగా నుండును. ఇట్టి కర్మాచరణముచేత ధ్యానయోగముగూడ సులభముగా సిద్ధించునని తెలియవలెను.

2. పగటివేళల యందు మేల్కొనియుండుట - రాత్రివేళయందు మొదటి జాములో, చివరిజాములోను మేల్కొనియుండి నడుమనున్న రెండు

"అర్జునా పూర్తిగా వశపరచుకొనబడిన చిత్తము, పరమాత్మ యందు సంపూర్ణముగా నిలిచిపోయినపుడు, సర్వ సుఖ భోగములందు ఆశలేని పురుషుడు 'యోగయుక్తుడు' అనబడును.

'యథా దీపో నివాతస్థో నేంగతె సోపమా స్మృతా
యోగినో యత చిత్తస్య యుంజతో యోగమాత్మనః ॥ 19

అర్జునా వాయురహిత స్థలము నందున్న దీపము కదలాడనట్లుగనే, ధ్యాన నిమగ్నుడైన యోగి జయించిన చిత్తము కదలక ఉండునని ఉపమానము చెప్పబడినది. [1]

సంబంధము - ఈ విధముగా ధ్యాన యోగము యొక్క అంతిమస్థితిని పొందిన పురుషుని యొక్క, అతడు జయించిన చిత్తము యొక్క లక్షణము తెలిపిన పిదప, ఇప్పుడు మూడు శ్లోకములలో భగవంతుడు, ధ్యానయోగము ద్వారా సచ్చిదానంద- పరమాత్మను పొందిన పురుషుని స్థితిని వర్ణించుచున్నాడు-

"యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా 20
యత్ర చైవాఽత్మనాఽత్మానం పశ్యన్నాత్మని తుష్యతి

అర్జునా యోగాభ్యాసముచేత నిరోధింపబడిన చిత్తము, ఏ పరిస్థితిలో

---

జాములలో అనగా రాత్రి తొమ్మిది గంటలనుండి, వేకువజాములో మూడు గంటలవరకు ఈ యారుగంటలకాలము నిద్రించుట- దీనినే సాధారణముగా 'తగినంత నిద్ర' అని అందురు.

1. ఇక్కడ దీపశబ్దమునుకు- ప్రకాశమాన 'దీపశిఖ'అని అర్థము. దీపజ్వాల, చిత్తమువలే ప్రకాశమానము – చంచలము నగును. కాబట్టి, దానితోనే మనస్సు పోలిక చెప్పబడినది. వాయుస్పర్శ లేనందుచేత దీపశిఖ కదలాడని విధముగా వశపరచుకొనబడిన మనస్సుగూడ, ధ్యానకాలమునందు సర్వ విధములను రక్షితయై చలించదు- ఆ చిత్తము, చలనములేని దీపశిఖవలె సమభావములో ప్రకాశించుచుండును.

ఉపరమము (ఊరట) చెందునో[1], ఏ యవస్థలో పరమాత్మ ధ్యానముచేత, పరిశుద్ధమైన సూక్ష్మబుద్ధి ద్వారా పరమాత్మను సాక్షాత్కరించుకొనుచు[2] సచ్చిదానంద ఘన పరమాత్మయందే సంతుష్టుడైయుండునో.

---

1. యోగి చిత్తము పరమాత్మ స్వరూపము నందు, సర్వవిధముల నిరోధింపబడియున్నపుడు, ప్రపంచముతో పూర్తిగా సంబంధము లేకయుండును. ఆ తరువాత అతని మనస్సు నందు ప్రపంచమునకు ఏలాంటి స్థానము గూడ వుండదు.

2. విజ్ఞానానంద ఘన-పూర్ణబ్రహ్మ-పరమాత్మ ఒక్కడే సత్యముగానున్నాడు. ఆయనదప్ప ఇతర వస్తులేదియు లేనేలేదు. కేవలము ఆయన ఒక్కడే పరిపూర్ణుడు-ఆయన యొక్క జ్ఞానముకూడా ఆయనకేవున్నది. ఎందుకు అనగా, ఆయనయే జ్ఞానస్వరూపుడు-ఆయన సనాతనుడు-నిర్వికారుడు అనంతుడు-అపారుడు-అసీముడు (ఎల్లలులేనివాడు) - అకలుడు (కాల పరిమితి లేనివాడు) అనవద్యుడు (అనింద్యుడు)నైయున్నాడు. మనస్సు-బుద్ధి-అహంకారము-ద్రష్ట (చూచువాడు)-దర్శనము-దృశ్యము (చూడబడునది)-ఇత్యాదులన్నియు బ్రహ్మమునందే ఆరోపింపబడినవి. వాస్తవముగా అవి అన్నియు బ్రహ్మస్వరూపములే యగును. ఆయన ఆనందమయుడు-వర్ణించుటకు అలవిగానివాడు ఆయన యొక్క ఆయానందము స్వరూపము గూడ ఆనందమయమేయగును. ఆయానందస్వరూపము-పూర్ణము-నిత్యము-సనాతనము-జన్మరహితము - నాశరహితము-ఉత్కృష్టము అంతిమము-అచలము ధ్రువము - అనామయము (రోగములేనిది, బోధమయము (జ్ఞానమయము) అనంతము శాంతమునైయున్నది. ఈ విధముగా, ఆ పరమాత్మ యొక్క ఆనందస్వరూప చింతనముచేయుచు, ఆయానంద స్వరూపముకంటే వేరైనది మరియొకటిలేదని మాటిమాటికి, సుదృఢముగా నిశ్చయించుకొనుచుండవలెను. ఒకవేళ ఏదైన సంకల్పము కల్గినచో, అదిగూడ ఆనందము నుండియే కల్గినదని, వెడలినదనియు, అది ఆనందమయమనియే తలచుచూ, దానిని ఆనందమయమునందే లీనము చేయవలెను ఈ విధమైన నిశ్చయముచేయుచు ఎప్పుడైతే ఆనంద-ఘన-పరమాత్మకంటే వేరుగా ఏలాటి సంకల్పమునకుగూడ అస్తిత్వము ఉండదో అపుడు, సాధకునిస్థితి,

"సుఖమాత్యంతికం యత్తద్ బుద్ధిగ్రాహ్యమతీంద్రియం ।
వేత్తి యత్ర న చైవాయం స్థితశ్చలతి తత్త్వతః॥" 21

ఇంద్రియాతీతమైన బుద్ధిగ్రాహ్యమైన అనంతమయిన ఆనందమును[1] ఎట్టి పరిస్థితిలో అనుభవించునో, ఏ యవస్థయందున్న యోగి పరమాత్మ స్వరూపము చేత చలించనే చలించడో.

యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః ।
యస్మిన్స్థితో న దుఃఖేన గురుణాఽపి విచాల్యతే॥ 22

"పరమాత్మ ప్రాప్తిరూపమైన యే లాభమునొంది, దానికంటే అధికమైనది, మరియొక లాభమేదియు లేదని తలచునో[2], పరమాత్మ ప్రాప్తిరూపమైన, యే పరి

---

ఆనందమయుడైన పరమాత్మయందు అచంచలమైపోవును. ఈ విధముగా, సాధకుడు నిత్యము, నియమితముగా ధ్యానముచేయుచు, తన సత్త (అస్తిత్వము) సర్వప్రపంచ సత్తయు, ఎపుడు బ్రహ్మముతో అభిన్నమగునో, ఎపుడైతే, అంతయు, పరమానందము, పరమశాంతి స్వరూపమునైన పరబ్రహ్మముగా అగునో అపుడు సాధకునకు పరమాత్మయొక్క వాస్తవిక సాక్షాత్కారము సహజముగానే అయిపోవునని తెలియవలెను.

1. పరమాత్మధ్యానముచేత గలుగు సాత్త్విక సుఖముగూడ ఇంద్రియాతీతము-బుద్ధి గ్రాహ్యమునైన అక్షయ సుఖమునకు కారణమగుటచేత, ఇది, ఇతర ప్రాపంచిక సుఖములకంటే అత్యంత విలక్షణమైనది, కాని ఆ సాత్త్విక సుఖము, కేవలము ధ్యానకాలమునందే యుండును సర్వదా ఏకరస స్వరూపమై యుండదు. అది చిత్తము యొక్క ఒక అవస్థా విశేషమగును. కనుక అది 'ఆత్యంతిక సుఖము' అథవా 'అక్షయసుఖము'అని చెప్పుటకు వీలుపడదు. పరమాత్మస్వరూప భూతమైననూ అక్షయ సుఖము, ఆధ్యాన జనిత సుఖమునకు ఫలము కనుక, ఇది, దానికన్న మిక్కిలి విలక్షణము.

2. ఈ స్థితియందు యోగికి పరమానందము-పరమశాంతి నిధానమునైన పరమాత్మ ప్రాప్తి కలుగుటచేత, అతడు పూర్ణకాముడగును. అతని దృష్టిలో, ఇహలోక పరలోక సమస్త సుఖభోగములు - త్రైలోక్య రాజ్యము-ఐశ్వ

స్థితిలోనున్న యోగి, అత్యంత మహాదుఃఖము కలిగనను చలించకయుండునో.[1]

సంబంధము :-

ఇరువదవ - ఇరువది ఒకటవ ఇరువది రెండవ శ్లోకములందు పరమాత్మ ప్రాప్తి రూపమైన, స్థితియొక్క మహత్త్వము, లక్షణము వర్ణింపబడెనో, అట్టి స్థితి పేరు 'యోగము'అని యప్పుడు తెలుపుచు భగవంతుడు, దానిని పొందుటకుగాను అర్జునుని ప్రోత్సహించుచున్నాడు.

"తం విద్యాత్ దుఃఖసంయోగ వియోగం యోగసంజ్ఞితం
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽ నిర్విణ్ణచేతసా॥" 23

"అర్జునా దుఃఖమయ ప్రపంచముతో సంబంధములేనిదై 'యోగము' అను

---

ర్యము-ప్రపంచ వ్యాప్త కీర్తి ప్రతిష్ఠలు - గొప్పతనము (గౌరవము)-ఈ మొదలైన ప్రాపంచిక సాధనములన్నిగూడ, క్షణభంగురములు-అనిత్యములు-రసహీనములు-హేయములు (విడువదగినవి, తుచ్ఛములు (లెక్కపెట్ట దగనివిగాను అయిపోవును. కాబట్టి, అతడు, ప్రపంచమునందలి యేవస్తువుగూడ పొందుటకు యోగ్యము కాదని తలచును, ఇట్లుండగా అవి గొప్పవని తలచుటకు అవకాశ మెక్కడిది?

1. శస్త్రముచేత శరీరము ఛేదింపబడుట-మిక్కిలి ఓర్వజాలనిచలి-వేడి-వర్షము-పిడుగు-మొదలైనవానిచేత శరీరమునకు గలుగు పీడ అత్యంతమైన రోగమువలన కలిగినబాధ-ప్రియాతి ప్రియమైన వస్తువు హఠాత్తుగా నశించుట, లేక, వియోగముచెందుట - ప్రపంచమునందు నిష్కారణముగానే గొప్ప అవమానము-తిరస్కారము నింద-మొదలైన మహాదుఃఖములకు కారణము లెన్నియైతేవున్నవో, అవి యన్నిగూడ ఒకటిగాచేరి ఒకసారైవచ్చి పడినప్పటికిన్ని, ఆ పరమయోగి పరబ్రహ్మానందానుభవస్థితిలో నున్నప్పుడు ఆస్థితినుండి, ఏకొంచముగూడ అతనిని చలింపజేయజాలవు. అతడు ఏమాత్రముగూడ, తొణకక, బెణకక, తన బ్రహ్మానందమును అనుభవించుచునే యుండును. అట్టి స్థితి దుర్లభము-అది అనేక జన్మార్జిత-పుణ్యముచేత కర్మయోగ-ధ్యానయోగములచేతనే ప్రాప్తించును-అదియే అపవర్గము-మోక్షము.

పేరుగల దానిని తెలిసికొనవలెను.[1] ఆయోగమును ధైర్యము ఉత్సాహముగల మనస్సుతో[2] నిశ్చయ పూర్వకముగా చేయవలెను.[3]

సంబంధము :-

ఇప్పుడు రెండు శ్లోకములలో అట్టి స్థితిని పొందుటకు అభేద రూపముతో పరమాత్మ ధ్యానముచేయు రీతిని భగవంతుడు అర్జునునకు తెలుపుచున్నాడు—

"సంకల్ప ప్రభవాన్ కామాం స్త్యక్త్వా సర్వానశేషతః ।
మనసై వేంద్రియగ్రామం వినియమ్య సమంతతః॥" 24

---

1. చూచువాడు-చూడబడునది-అనగా ఈ కనపడు ప్రపంచముతో ఆత్మకు అజ్ఞానమువలన కలిగిన అనాది సంబంధమే జనన-మరణ రూప దుఃఖ ప్రాప్తికి మూలకారణమగును. ఈ యోగముచేత అసంబంధములేకుండ పోయిన తరువాతనే, దుఃఖములుగూడ ఎల్లప్పటికిన్ని తొలిగిపోవును. కాబట్టి, 'యత్రోపరమతేచిత్తం' గీత (6-20) అను శ్లోకమునుండి ఇంత వరకు వర్ణింపబడిన స్థితిని పొందుటకుగాను, సిద్ధులు - మహాత్ములునైన పురుషుల కడకుపోయి, శాస్త్రమును అభ్యసించి, ఆస్థితియొక్క స్వరూపమును, మహత్త్వమును సాధనముచేయు విధినిన్ని బాగుగా తెలిసికొనవలెను.

2. సాధనము యొక్క ఫలము ప్రత్యక్షముకాదు. కనుక, కొంచెము సాధనము చేసిన తరువాత మనస్సునందు ఈ పని యెప్పటికి పూర్తిగా ముగియును. నాచేత అగునో లేక కాదో అని యావిధమైన భావము కలుగవచ్చును. ఆభావము 'నిర్విణ్ణత' అనగా సాధనముచేత వేసరికవచ్చుట యనబడును. ఇటువంటి భావములేకుండ, ధైర్యములో, ఉత్సాహముతోనుగూడిన చిత్తమును 'అనిర్విణ్ణచిత్తము' అని యనెదరు. కనుక సాధకుడు, తన చిత్తముచేత నిర్విణ్ణతయను దోషమును పూర్తిగా దూరము చేయవలెను.

3. ఇక్కడ 'నిశ్చయము'అను శబ్దమునకు విశ్వాసములేక శ్రద్ధఅని యర్థము. యోగసాధనమునందు యోగి, ఆయోగ సాధనమును విధించు శాస్త్రము లందు, ఆచార్యులందు, యోగసాధన ఫలమునందున్ను పరిపూర్ణముగా శ్రద్ధ-విశ్వాసము ఉంచవలెను.

శనైఃశనైరుపరమేత్ బుద్ధ్యా ధృతిగృహీతయా ।
ఆత్మసంస్థం మనః కృత్వా నకించిదపి చింతయేత్॥" 25

"అర్జునా! సంకల్పముచేత ఉత్పన్నములగు సమస్తకామనలను నిశ్శేషముగా విడిచి[1] మనస్సుచేత ఇంద్రియ సముదాయమును పూర్తిగా వశములో తెచ్చుకొని[2], క్రమక్రమముగా అభ్యాసముచేయుచు ఉపరతిని (ఊరటను) పొందవలెను.[3]. ఆ విధముగా ధైర్యయుక్తమైన బుద్ధిచేత మనస్సును పరమాత్మయందు

1. ఏవిధమైన సుఖమునందు, భోగమునందుగూడ, ఏవిధముగకూడ కొంచెముగూడ వాసన-ఆసక్తి-స్పృహ-ఇచ్ఛ-లాలస-ఆశ-తృష్ణగాని కలుగనీయకుండ నుండుటయే 'సమస్తకామనలను నిశ్శేషముగా విడుచుట' అనుదాని యర్థము. పాత్రమునుండి నేయితీసిన తరువాతగూడ ఆపాత్రములో నేతియొక్క జిడ్డు మిగిలియున్నట్లు, లేక భరణినుండికర్పూరము కుంకుమపువ్వు-కస్తూరితీసిన తరువాతగూడ ఆభరణిలో వాని గంధము వున్నట్లున్ను-కామనలను విడిచిన తరువాతగూడ వానియొక్క సూక్ష్మ అంశ మిగిలి యుండును. అదియేవాసనయనబడును. ఆ మిగిలియున్న అంశమును గూడ విడుచుట 'కామనయొక్క నిశ్శేషత్యాగము' అనబడును.

2. పదకొండవ శ్లోకము నుండి పదమూడవ శ్లోకము వరకు చేయబడిన వర్ణనము ననుసరించి ధ్యానయోగ సాధనమునకు ఆసనముమీద కూర్చొని యోగి, వివేక వైరాగ్యముల సహాయముచేత మనస్సుద్వారా. అన్ని ఇంద్రియములను బాహ్యవిషయములనుండి పూర్తిగా తొలగించవలెను. ఏ ఇంద్రియమును గూడ, ఏ విషయమునందున్ను కొంచెముగూడ పోనీయక, ఇంద్రియములను పరిపూర్ణముగా అంతర్ముఖములను చేయవలెను. ఇదియే 'మనస్సుచేత ఇంద్రియములను పూర్తిగా అరికట్టుట యనబడును.

3. చిన్నపిల్లవాడు చేతిలో కత్తెరగాని, చాకుగాని పట్టుకొన్నపుడు తల్లి, వానికి మంచిమాటలు చెప్పిగాని, అవసరమైతే గద్దించి, బెదిరించిగాని, మెల్ల మెల్లగా, వాని చేతినుండి ఆ కత్తెరనుగాని, చాకునిగాని లాగుకొనినట్లే, వైరాగ్యము, వివేకముగల బుద్ధిచేత మనస్సునకు ప్రాపంచిక సుఖ భోగములు అనిత్యములు, క్షణభంగురములు అని వివరించి (తెలిపి), ఆ సుఖ

స్థిరముగానిలిపి, పరమాత్మునిదప్ప ఇతరమును దేనినిగూడ చింతించక యుండ వలెను.[1]

---

భోగమువలన కలుగబోవు బంధనమువలన, నరకాదియాతనలవలన కలుగు భయమును తెలిపి, ఆ మనస్సునకు విషయ చింతనము పూర్తిగా లేకుండ జేసి, అది ఆ సుఖభోగములలో ఇరుకుకొనకుండ దానిని కాపాడవలెను. ఇదియే మెల్లమెల్లగా 'ఉపరతి (ఊరట) పొందుట' యనబడును.

1. సాధకుడు ఎప్పుడు ధ్యానముచేయుటకు కూర్చొనునో, ఎప్పుడు అభ్యాసము చేత అతని మనస్సు పరమాత్మయందు స్థిరమైవుండునో అపుడు మరల ఆమనస్సు ఒకక్షణముగూడ పరమాత్మను విడిచి ఇతర విషయములందు పోవకుండునట్లు జాగ్రత్తవహించవలెను. సాధకుని జాగరూకత, అతని అభ్యాసము యొక్క దృఢత్వమునందు మిక్కిలి సహాయకముగానుండును. ప్రతిదినము ధ్యానముచేయుచు ఎట్లెట్లు అభ్యాసము వృద్ధిచెందుచుండునో, అట్లట్లే మనస్సును మరింత జాగ్రత్తతో ఎక్కడకున్ను పోవనీయక విశేష రూపముతో, చాలాకాలమువరకు పరమాత్మయందు స్థిరముగానుంచవలెను. ఆ తరువాత, మనస్సులో ఏదైన ఒక వస్తువుతోచినచో, అది కల్పన మాత్రమేయని తెలిసికొని దానిని, వెంటనే విడువవలెను. ఇట్లు చిత్తము నందు స్ఫురించిన వస్తువునువిడిచి క్రమముగా శరీరము-ఇంద్రియములు-మనస్సు-బుద్ధి-వీని అస్తిత్వమునుగూడ విడువవలెను. అన్నిటిని లేకుండ జేసికొనుచుండగా సమస్తదృశ్యపదార్థములు చిత్తమునుండి తొలిగినప్పుడు, ఏవియులేవని నిశ్చయముచేసికొను ఒకవృత్తిమాత్రము ఉండిపోవును. ఈవృత్తి శుభము-శుభ్రమునైనది. కాని దృఢమైన ధారణ (నిశ్చయము) చేత ఈవృత్తినిగూడ తొలగించి వేయవలెను లేదా సమస్తదృశ్య ప్రపంచము లేకుండపోయిన తరువాత, ఈవృత్తి తనంతటనే శాంతించిపోవును ఆ తరువాత మిగులునదేదైన వున్నదనగా, అది అచింత్యమైన పరతత్త్వమే యగును. అది ఒక్కటే అద్వితీయము, సర్వోపాధి రహితము. ఒక్కటిగా వుండి దృశ్యప్రపంచము-శరీరము-ఇంద్రియములు మనస్సు-బుద్ధి-అహంకారము-ఈయన్నింటిని లేకుండజేసికొని, ఇవిలేకుండజేయు వృత్తినిగూడ లేకుండజేసికొని, అచింత్యమైన తత్త్వమునందు స్థిరముగా నిలిచియుండు

సంబంధము :

ఒక వేళ, ఏసాధకుని చిత్తవృత్తియైన పూర్వపు అలవాటువలన, బలాత్కారముగా, విషయములవైపు పోయినఎడల, అతడేమి చేయవలెను అను జిజ్ఞాసపైన భగవంతుడిట్లు చెప్పుచున్నాడు—

"యతో యతో నిశ్చరతి మనశ్చంచలమస్థిరమ్।
తతస్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్॥" 26

"అర్జునా! స్థిరముగానుండక చంచలమైన ఈ మనస్సు, ఏయేశబ్ద-స్పర్శాది విషయములు కారణముగా ప్రపంచమునందు సంచరించునో, అయా విషయముల నుండి మనస్సును నివారించి మాటి మాటికి పరమాత్మయందే నిరోధించి యుంచవలెను.[1]

"ప్రశాంతమనసం[2] హ్యేనం యోగినం సుఖముత్తమమ్ ।
ఉపైతి శాంతరజసం[3] బ్రహ్మభూత[4] మకల్మషమ్॥" 27

---

టమే 'పరమాత్మయందు మనస్సు స్థిరముగాచూచి అచింత్యుడగుట' అనబడునని తెలియవలెను.

1. ధ్యాన సమయమందు తన మనస్సు ఇతర విషయములవైపు పోయినదని తెలిసినవెంటనే సాధకుడు, మిక్కిలిజాగ్రత్తతో, దృఢముగా ఆమనస్సును ఆపి వెంటనే పరమాత్మయందు లగ్నముచేయవలెను. ఇట్లు మాటి,మాటికి మనస్సును విషయములనుండి తొలగించుచునే. పరమాత్మయందు లగ్నము చేయుటను అలవాటు చేసుకొనవలెను.

2. వివేక-వైరాగ్యముల ప్రభావముచేత విషయచింతనమువీడి, చంచలత్వము-విక్షేపము (చెదరుట) లేకుండ, సర్వవిధముల స్థిరము-సుప్రసన్నమునైన మనస్సుగల యోగి ప్రశాంత మనస్సుగలవాడనబడును.

3. ఆసక్తి-స్పృహ-కామన-లోభము-తృష్ణ-సకామకర్మ-ఇవి యన్నియు రజోగుణము నుండి పుట్టును. (గీత 14-7,12) ఇవియే రజోగుణమును వృద్ధి చెందించునవిగూడ నగును. ఆకారణముచేతనే యేపురుషుడు, ఇవన్నియు లేకనుండునో, అతనినే 'శాంతరజసం'అను పదం చెప్పుచున్నది.

4. నేను దేహముకాను – సచ్చిదానంద ఘన బ్రహ్మము, అని ఈవిధముగా

ఎందుకనగా అర్జునా! ఎవనిమనస్సు పూర్తిగా శాంతమైయున్నదో, ఎవడు పాపరహితుడో, యెవని రజోగుణము శాంతించిపోవునో, సచ్చిదానంద ఘన - బ్రహ్మతో ఐక్యమునుచెందిన, అటువంటి యోగికి ఉత్తమమైన ఆనందము ప్రాప్తించును.

"యుంజేన్నేవం సదాఽత్మానం యోగీ విగతకల్మషః ।
సుఖేన బ్రహ్మసంస్పర్శమత్యంతం సుఖమశ్నుతే॥" 28

అర్జునా! పాపరహితుడైన యోగి, ఈ విధముగా నిరంతరము ఆత్మను పరమాత్మ యందు లగ్నముచేయుచు సుఖముగా[1] పరబ్రహ్మ పరమాత్మ ప్రాప్తి రూపమైన అనంతానందమును[2] అనుభవించగలడు.

సంబంధము :-

ఈ విధముగా అభేదభావము చేత, సాధనము చేయు సాంఖ్య యోగము యొక్క ధ్యానమును తత్ఫలమును వివరించి, ఇప్పుడు భగవంతుడు అసాధకుని వ్యవహారకాల స్థితిని గూర్చి వర్ణించుచున్నాడు-

"సర్వ భూతస్థ మాత్మానం సర్వభూతాని చాఽత్మని ।
ఈక్షతే యోగయుక్తాఽత్మా సర్వత్ర సమదర్శనః ॥ 29

"అర్జునా సర్వవ్యాపి- అనంతమునైన చేతనము నందు ఐక్యముచేత స్థితి

---

అభ్యాసముచేయగా చేయగా, సాధకుని స్థితి చిదానంద ఘన పరమాత్మ యందు దృఢమైపోవును. ఈ విధముగా అభిన్న భావముతో బ్రహ్మము నందున్న పురుషుడు 'బ్రహ్మభూతుడు' అనబడును.

1. ఎప్పుడు సాధకునకు దేహాభిమానముఉండదో, అతనిస్థితి, బ్రహ్మస్వరూపము నందు అభేదరూపముతో నుండునో, అప్పుడు అతనికి బ్రహ్మప్రాప్తి సుఖముగా నగను.

2. ఈ అనంతానందమునే ఈ యధ్యాయములో ఇరువదియొకటవ శ్లోకము నందు 'ఆత్యంతిక సుఖము'అని, గీతయైదవ అధ్యాయములో నిరువది యొకటవ శ్లోకమునందు 'అక్షయసుఖము' అని తెలుపబడెను.

రూప యోగముతో గూడుకొనిన ఆత్మగలవాడు[1], అన్నిటిని సమభావముతో చూచువాడు[2] నైన యోగి, సమస్త భూతములందు ఆత్మ వున్నట్లుగా, సమస్త భూతములు ఆత్మయందు వున్నట్లుగాను కల్పించుకొని, సర్వము ఆత్మమయమే యని చూచును.[3]

---

1. సచ్చిదానంద- నిర్గుణ- నిరాకార బ్రహ్మమునందు, ఎవని స్థితి అభిన్న భావము పొందెనో, అట్టి బ్రహ్మభూతుడైన యోగి యిక్కడ 'యోగ యుక్తాఒత్మా' అను పదము చేత చెప్పబడెను. ఈ యోగియే, గీత యైదవ అధ్యాయమునందు ఇరువది యొకటవ శ్లోకములో 'బ్రహ్మ యోగయుక్తాత్మా' అను పేరుతో, ఆ యధ్యాయముననే ఇరువది నాల్గవ శ్లోకములో, ఆరవ అధ్యాయమునందు ఇరువదియేడవ శ్లోకములో పదు నెనిమిదవ అధ్యాయమునందు ఏబది నాల్గవ శ్లోకములోను 'బ్రహ్మ భూతుడు' అను పేరుతో వర్ణింపబడెను.

2. గీత అయిదవ అధ్యాయమునందు పదునెనిమిదవ శ్లోకమునందు, ఈ యధ్యాయము ముప్పది రెండవ శ్లోకమునందున్న జ్ఞానియైన మహాత్ముని సమదర్శనమును గూర్చి వర్ణింపబడెను. ఈ విధముగనే, ఈ యోగి, అందరితోను మంచిగా శాస్త్రానుకూలముగా యోగ్యతననుసరించి వ్యవహ రించుచు, నిత్యము, నిరంతరము అందరియందున్న తన స్వరూపమైన ఏకము- అఖండము- చేతనమునైన ఆత్మను చూచును.
ఇదియే, 'అతడు అందరిని సమభావముతో చూచుట' అనబడును.

3. ఏకము- అద్వితీయము- సచ్చిదానందఘనము- పరబ్రహ్మమునైన పర మాత్మయే సత్యమైన తత్త్వము ఆయనకంటె వేరైనది ఈ సమస్త ప్రపంచ మేదియు కాదు. ఈ రహస్యమును బాగుగా తెలిసికొని, ఆ పరమాత్మ యందు అభిన్న భావముతో స్థిరముగా నిలిచియుండి, స్వప్నము నందలి దృశ్యములందు స్వప్న ద్రష్టవలె, చరాచరములైన సమస్త భూతప్రాణు లందు, అద్వితీయుడైన పరమాత్మనొక్కనినే అధిష్ఠాన రూపమునందు పరిపూర్ణముగా చూచుటయగును- అనగా 'అద్వితీయుడైన ఆత్మ యొక్కడే, ఈ యన్నింటి యందున్న కనపడుచున్నాడు- వాస్తవముగా

సంబంధము -:

ఈ విధముగా, సాంఖ్య యోగ సాధనము చేయు యోగిని అతని యొక్క 'సర్వత్ర సమదర్శన' రూప స్థితిని వర్ణించిన తర్వాత, ఇపుడు భగవంతుడు భక్తియోగ సాధనము చేయు యోగి యొక్క అంతిమస్థితిని, అతని యొక్క 'సర్వత్ర భగవద్దర్శనము' సున్ను వర్ణించుచున్నాడు.

యో మాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి ।
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి ॥ 30

"అర్జునా! అందరకున్ను ఆత్మ స్వరూపుడనైన నన్ను వాసుదేవుని ఎవడు సర్వభూతములందును వ్యాపించిన వానినిగా చూచునో, సమస్త భూతములను వాసుదేవుడనైన నాయందు చూచునో[1], అతనికి నేను కనపడకుండ ఉండను.

---

ఆయనదప్ప వేరేదియు లేదు' అను ఈ విషయమును పరిపూర్ణముగా అనుభవించుటయగును. ఇదియే 'సమస్త భూతములందు ఆత్మను చూచుట యనబడును. ఈ విధముగనే, సమస్త చరాచర భూత ప్రాణులను ఆత్మయందు కల్పితముగా చూచుటయగును- అనగా, ఎట్లైతే స్వప్నము నుండి మేల్కొనిన మనుష్యుడు స్వప్నజగత్తునుగాని, లేక, వివిధ కల్పనలు చేయు మనుష్యుడు కల్పించిన దృశ్యములనుగాని, తన సంకల్పము యొక్క ఆధారముపైననే తనలో చూచునో, ఆ విధముగనే, చూచుట, సమస్త భూతములను ఆత్మలో 'కల్పితముగా చూచుట' యనబడును. ఈ యభిప్రాయమునే,స్పష్టముగా తెలుపుటకొరకు, భగవంతుడు ఆత్మకు 'సర్వభూతస్థ' అను విశేషణమును చెప్పి, ఆత్మ భూతములందు ఉండి చూచుట' అను విషయము చెప్పెను- కాని 'భూతములు ఆత్మయందు ఉండి చూచుట' అను విషయము చెప్పక కేవలము చూచుట కొరకే అని చెప్పెను.

1. మేఘమునందు ఆకాశము- ఆకాశమునందు మేఘము ఉన్నట్లే, సమస్త భూతములందు వాసుదేవుడైన భగవంతుడున్నాడు- వాసుదేవునియందు సర్వ భూతములున్నవి- ఇట్లు అనుభవపూర్వకముగా తలచుటయే,

నాకున్ను అతడు కనపడకుండ యుండడు.[1]

"సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వ మాస్థితః ।
సర్వదా వర్తమానో౽పి స యోగీ మయి వర్తతే ॥" 31

"అర్జునా! ఏ పురుషుడు ఐక్యమునందుండి[2], సమస్త భూతములందు ఆత్మ

---

పరస్పరము ఒకరియందొకరున్నట్లు చూచుటయని తెలియవలెను. ఎందుకనగా, సమస్త చరాచర జగత్తు ఆ పరమాత్మనుండియె ఉత్పన్నమగును. కనుకనే, ఆయనయే ఈ జగత్తుకు మహాకారణము. మేఘములకు ఆకాశము ఆధారము. ఆకాశములేకుండ మేఘములు ఎక్కడ వుండ గలవు ? మేఘములు మాత్రమే యేల- వాయు- తేజస్- జలాది వస్తువులు, ఏ భూతములయినను ఆకాశము నాశ్రయించక నిలువజాలవు. ఆ విధముగనే, యీ సమస్త చరాచర విశ్వమున ఆ పరమాత్ముడొక్కడే పరమాధార భూతుడుగా నున్నాడు (గీత- 10-42)

అందుచేతనే, చతురుడైన బహురూపి యొక్కడే వివిధవేషములు ధరించవచ్చును అని ఎట్లు గుర్తించవచ్చునో, అట్లే, సర్వ ప్రపంచమునందున్నగల రూపములన్నియు ఆ భగవంతుని వేషములే. ఈ విధముగా, సమస్త ప్రపంచము నందలి ప్రాణులలో భగవంతుని గుర్తింపవచ్చును- ఆయన వేషభేదముల కారణముగా, బాహ్య వ్యవహారములో నెట్లున్నను, అయన అందరి హృదయములో నున్నాడు గనుక జనులతనిని పూజించెదరు.

1. సౌందర్య- మాధుర్య- ఐశ్వర్య- ఔదార్యాదులకు, అనంత సముద్రుడు రసమయుడు ఆనందమయుడునైన భగవంతునిదైన దుర్లభ- సచ్చిదానంద స్వరూపము యొక్క ప్రత్యక్ష దర్శనమైన పిదప, భక్తునియొక్క, భగవంతుని యొక్కయు పరస్పర సంయోగము ఎల్లప్పటికిన్ని ఎడతెగనిదిగా అవిచ్ఛిన్నముగా నుండునని యభిప్రాయము.

2. సాధకుడు సర్వదా సర్వత్ర తన ఏకైక ఇష్టదైవమైన భగవంతుని ధ్యానించుచు తన భిన్నస్థితిని పూర్తిగా మరల మరల అతని జ్ఞానములో భగవంతుని దప్ప మరియొక వస్తువేది యుండనంతగా తన్మయుడై

రూపముతో నున్న నన్ను సచ్చిదానంద ఘన వాసుదేవుని సేవించునో[1], ఆ యోగి, అన్ని విధముల ప్రాణులతో వ్యవహరించుచుగూడ, నాయందే యుండును[2]

సంబంధము :-

ఈ విధముగా భక్తియోగము ద్వారా భగవంతుని పొందిన పురుషుని మహత్త్వమును ప్రతిపాదించి, ఇప్పుడు భగవంతుడు సాంఖ్య యోగము ద్వారా పరమాత్మని పొందిన పురుషుని సమదర్శనమును- మహత్త్వమును అర్జునునకు ప్రతిపాదించుచున్నాడు.

"ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ।
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః ॥ 32

---

పోవును. భగవత్ప్రాప్తి రూపమైన యా స్థితికి 'భగవంతునిలో ఏకీభావముతో స్థిరముగా నిలిచి యుండుట' అని అర్థము.

1. ఆవిరి- మేఘము- పొగమంచు- బిందువు- మంచు- ఈ యన్నింటిలోను అంతటను జలమే నిండి యుండునని- సమస్త చరాచర విశ్వమునందు భగవంతుడొక్కడే పరిపూర్ణుడై యున్నాడని తెలిసికొనుట- ప్రత్యక్షముగా ఆయనను చూచుటయే, సర్వ భూతములందున్న భగవంతుని భజించుట యగునని తెలియవలెను.

2. భగవంతుడైన శ్రీవాసుదేవుని ప్రాప్తించిన పురుషునకు, ప్రత్యక్షముగా, అంతయు వాసుదేవుడుగానే కనపడును - ఇట్టి దశలో నున్న భక్తుని శరీర- వాక్- మనస్సులచేత జరుగు క్రియలన్నియు, ఆ భక్తుని దృష్టిలో ఆ భగవంతునితోనే జరుగును. ఆ భక్తుడు చేతులలో ఎవరికైన సేవ చేసినచో అది భగవత్సేవగా చేయును- ఎవరితోనైన మధురముగా మాట్లాడి వారికి సుఖము కలిగించినచో, అది భగవంతునకు సుఖము గలిగించు నట్లుగానే తలంచును. ఎవరినైన చూచినచో, అతడు భగవంతుని చూచినట్లుగానే భావించును- ఎవరితోనైన ఎక్కడికైన పోయినచో తాను భగవంతునిలో భగవత్సన్నిధికి పోవుచున్నట్లుగానే తలచును. ఈ

"అర్జునా! ఏయోగి సమస్త భూతములను, తనతోనే సమముగా చూచునో[1], సుఖదుఃఖములను గూడ అన్నిటియందును సమానముగా చూచునో[2] ఆయోగి పరమశ్రేష్ఠుడని తలచబడెను.

అర్జున ఉవాచ :

యోఽయం యోగస్త్వయాప్రోక్తః సామ్యేన మధుసూదన
ఏతస్యాహం న పశ్యామి చంచలత్వాత్ స్థితిం స్థిరామ్ ॥ 33

---

విధముగా భక్తుడు ఏది చేసినను అదియంతయు భగవంతునికే, భగవంతునిలో పాటే చేయుచున్నానని భావించును- ఇందుచేతనే ఆ భక్తుడు అన్ని పనులు చేయుచు గూడ, ఆ పనులన్నియు భగవంతునికే చేయుచున్నానని భావించవలెను-

1. మనుష్యుడు సర్వావయవములందున్న తన ఆత్మను సమభావముతో చూచునట్లే, సమస్త చరాచర ప్రపంచము గూడ తనను తాను సమ భావముతో చూచుట, 'తనను వలె, సర్వభూతములను సమముగా చూచుట యనబడును-

2. యోగికి సర్వత్ర ఆత్మదృష్టి కలుగుటచేత, సర్వ విశ్వమున్ను అతని స్వరూపమేయగును- భగవంతునితో అతనికి రెండవ వస్తువే లేదు. అందుచేత ఏ విధముగా మనుష్యుడు తనకు తానుగా ఎప్పుడుగూడ, ఏ విధముగ గూడ, కొంచెము గూడ, దుఃఖము కలిగించుకొన గోరడో, స్వాభావికముగానే, నిరంతరము సుఖము పొందుటకే, శ్రమకోర్చి ప్రయత్నించుచుండునో, ఇట్లుచేసి తనయెడల తాను దయచూపుచున్నానని తలచి కృతజ్ఞతతో నుండడో, ఎలా మేలు చేయడో, తాను కర్తవ్య పరాయణుడనని అభిమానపడడో, తాను సుఖముకొరకు ప్రయత్నించక ఉండజాలడు కాబట్టి ప్రయత్నించుచుండుట యెట్లు అతని సహజమైన స్వభావమో, సరిగా అదే విధముగ ఆ యోగి సర్వప్రపంచమునకు ఎప్పుడు గూడ, ఏ విధమైన దుఃఖమును కొంచెము గూడ కలిగించక, సర్వదా, ప్రపంచసుఖమునకు పాటుపడుచు సహజముగ, స్వాభావికము గను ప్రయత్నము చేయుచుండును-

అర్జునుడిట్లనెను -

"మధుసూదనా! నీవు సమభావముచేత యోగమును [1] గూర్చి చెప్పితివి నేను. మనస్సు చంచలమగుటచేత ఆ యోగము యొక్క స్థితిని గూడ చూడ జాలకున్నాను. [2]

"చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్ దృఢం ।
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్ ॥ 34

"ఎందుకనగా, కృష్ణా! ఈ మనస్సు చాల చంచలమైనది. మనుష్యుని మథించు స్వభావముగలది [3] చాల దృఢమైనది[4], మిక్కిలి బలముగలది. కాబట్టి దానిని వశపరచుకొనుట వాయువును అపుటవలే, మిక్కిలి దుష్కరమని[5] నేను

---

1. కర్మయోగ, భక్తియోగ- జ్ఞానయోగ- ధ్యాన యోగాది సాధనముల అంతిమదశ రూపమైన 'సమత్వమేయిచట 'యోగమని' చెప్పబడెను.

2. చిత్త విక్షేపమును చంచలత్వమనెదరు. విక్షేపమునకు రాగ- ద్వేషములు ప్రధాన కారణములు. రాగద్వేషములున్నచోట 'సమత్వస్థితికి' మనస్సు యొక్క చంచలత్వము బాధకమని తలచబడినదని తెలియవలెను.

3. మనస్సు దీపశిఖవలె చంచలముగా నుండుట స్పష్టమే కాని, అది చంచలమే కాక కవ్వమువలె మథించు స్వభావముగలది గూడ నగును. పెరుగును కవ్వము చిలికినట్లే మనస్సు శరీరేంద్రియములను పూర్తిగా క్షోభపెట్టును.

4. చంచలము- మథించునది - బలము గలదియునైన మనస్సు 'తంతునాగము' (సర్పమువలె నుండు జల జంతువు) వలె మిక్కిలి ధృడమైనదిగానున్నది. ఈ మనస్సు ఏ విషయమునందు రమించునో, ఆ విషయములో లీనమై. తదాకారమైనంత దృఢముగా పట్టుకొనును. మనస్సు ఇక్కడ 'దృఢము' అని చెప్పుటలో అభిప్రాయమిది-

5. మహా పరాక్రమశాలియైన యేనుగుపైన మాటిమాటికి అంకుశములో పొడిచినప్పటికిన్ని ఆ యేనుగుపై ఏలాటి ప్రభావము పడక, అది, తన ఇష్టము వచ్చినట్లు చేయుచునే యుండునో, ఆ విధముగనే, వివేకమను నంకుశము చేత మాటిమాటికి పొడుచున్నప్పటికిన్ని, మహాబలశాలియైన

తలచుచున్నాను.[1]

శ్రీ భగవానువాచ-

"అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలం
అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే ॥" 35

భగవంతుడిట్లనెను:-

మహాబాహో! మనస్సు చంచలమైనదనుటలో సందేహమేలేదు. అది కఠినముగానే వశపడును కాని, అది అభ్యాస-వైరాగ్యములచేత వశపడును [2]

---

యీ మనస్సు ప్రాపంచిక విషయములనెడు గహనమైన వనము నుండి బయలు వెడులుటకు ఇష్టపడదు.

1. ఎట్లైతే, శరీరమునందు నిరంతరము తిరుగుచున్న శ్వాసోచ్ఛ్వాస వాయువుల యొక్క ప్రవాహమును- హఠము (పట్టుదల) విచారము వివేకము- బలము- ఈ మొదలైన సాధనముల చేత ఆపుట అత్యంత కఠినమెట్లో ఆ విధముగానే, ప్రాపంచిక విషయములందు నిరంతరము సంచరించునట్టిది, చంచలము- మధించు స్వభావము గలది- బలము గలది- దృఢమునైన మనస్సును ఆపియుంచుట గూడ అత్యంత కఠినము.

మనస్సును, ఏదోయొక లక్ష్యమునందు లీనమై తదాకారము చేయుటకు, దానిని ఇతర విషయముల నుండి లాగుచు లాగుచు మాటిమాటికి ఒక విషయము నందు లగ్నము చేయుటకుగాను చేయబడు ప్రయత్నమే 'అభ్యాసము అనబడును. ఈ ప్రసంగము- పరమాత్మయందు మనస్సును లగ్నము చేయుటకు చెప్పబడినది కనుకనే పరమాత్మను లక్ష్యముగా చేసికొని చిత్తవృత్తుల యొక్క ప్రవాహమును మాటిమాటికి ఆ పరమాత్మ వైపే లగ్నము చేయుటకు ప్రయత్నించుటయే యిక్కడ 'అభ్యాసము' అగును. దీనికి సంబంధించిన విషయము గీతలో 12వ అధ్యాయమునందు తొమ్మిదవ శ్లోకములో చూడవలెను.

2. ఇహలోక- పరలోకముల సమస్త పదార్థములందు ఆసక్తి- సర్వ కామ

సంబంధము :-

ఇక్కడ 'మనస్సును వశపరచుకొనిన యెడల కలుగు హానియేమి ? అను జిజ్ఞాస కలుగును. దానికి సమాధానముగా భగవంతుడు అర్జునునితో నిట్లను చున్నాడు.

అసంయతాఽత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః ।
వశ్యాఽత్మనా తు యతతా శక్యోఽ వాప్తుముపాయతః ॥ 36

---

నలు పూర్తిగా నశించినప్పుడు అది 'వైరాగ్యము' అనబడును, వైరాగ్య ప్రాప్తికి అనేక సాధనములు గలవు వానిలో కొన్ని యీ క్రింద చూప బడినవి.

అ. ప్రపంచ పదార్థములలో రమణీయత్వము - ప్రేమ - సుఖము ఇవి లేవని విమర్శ చేసి వానిని విడుచుట.

ఆ. అవి జన్మ, మృత్యు- జరా- వ్యాధులు మొదలైన దోషసహితములని, అనిత్యములని, భయదాయకములనియు తెలిసికొనుట.

ఇ. ప్రపంచము యొక్కయు, భగవంతుని యొక్కయు యధార్థతత్త్వము నిరూపించు సత్ శాస్త్రముల అధ్యయనము చేయుట.

ఈ. పరమ వైరాగ్యవంతుల సంగము చేయుట, అది లభించినప్పుడు, వారి వైరాగ్యపూర్ణ చిత్రములను, చరిత్రలను స్మరించి మననము చేయుట.

ఉ. లోకమునందలి పడిపోయిన భవనములు, నిర్జనములైన నగరములు, గ్రామములు, చూచి, జగత్తు క్షణభంగురమని తలచుట.

ఊ. ఏకైక బ్రహ్మయొక్క అఖండ- అద్వితీయ సత్తను తెలిసికొని, ఇతర వస్తువు లన్నిటి యస్తిత్వము లేదని తలచుట.

ఋ. అధికారులైన పురుషులద్వారా, భగవంతుని అనిర్వచనీయ గుణ- ప్రభావ- తత్త్వ- ప్రేమ- రహస్యములను, ఆయన లీలావిలాసములను చరిత్రలను దివ్యసౌందర్య మాధుర్యములను మాటిమాటికి వినుట- తెలిసికొనుట- వానియెడల పరిపూర్ణ శ్రద్ధతో ముగ్ధుడగుట-

"అర్జునా! మనస్సు వశపరచుకొనని పురుషునకు యోగము దుష్ప్రాప్యము (పొందుటకు వీలుకానిది)[1]. మనస్సును వశపరచుకొనినవాడు[2], ప్రయత్నము చేయు స్వభావము గలవాడునైన పురుషుడు[3], సాధనముచేత ఆ యోగమును సాధించుట అతి సహజమని నాయభిప్రాయము.

సంబంధము :-

యోగ సిద్ధికొరకు, మనస్సును వశము నందుంచుకొనుట మిక్కిలి యావశ్యకమని తెలుపబడెను- దీనిపైన ఎవని మనస్సు వశమునందు లేదో, కాని, యోగమునందు శ్రద్ధయుండుటచేత, ఎవడు భగవత్ప్రాప్తికొరకు సాధనము చేయునో, అతడు మరణించిన పిదప అతని గతి యేమగును ? అను జిజ్ఞాస కలుగును. అందుకొరకే అర్జునుడు భగవంతుని ఇట్లడుగుచున్నాడు.

---

1. అభ్యాస - వైరాగ్యములచేత మనస్సు వశపరచుకొనని వారి మనస్సుపైన రాగ ద్వేషముల అధికారముండును - వాని ప్రేరణచేత, మనస్సు కోతివలె ప్రపంచమునందు ఇటునటు తిరుగుచు- ఎగురుచు, దుముకుచు నుండును- మనస్సు సుఖ భోగములందింతగా ఆసక్తమైయున్నపుడు, అతని బుద్ధిగూడ అనేకశాఖలుగలదై అస్థిరముగా అగును (గీత2-41-44) ఇట్టి దశలో 'సత్త్వయోగము' ప్రాప్తించదు.

2. వశములో వచ్చిన తర్వాత చిత్తము యొక్క చంచలత్వము- మథించు స్వభావము- బలము- కఠినత్వము- పట్టుదల దూరమైపోవును. అది సరళముగా- చక్కగా- శాంతముగానగును- ఆ తరువాత దానిని ఎక్కడ- ఎంతసేపు లగ్నము చేసినను, ఏ చాంచల్యము లేకుండ ఊరక వుండిపోవును- ఇదియే మనస్సు వశములోనికి వచ్చినట్లు గుర్తు" అగునని భావించవలెను-కి మనస్సు వశమైన పిదప గూడ, ఒకవేళ ప్రయత్నము చేయనిచో, ఆ మనస్సును పూర్తిగా పరమాత్మయందు లగ్నముచేయుటకు.

3. తీవ్రముగా సాధన చేయకుండినచో, దానివలన సమత్వ యోగప్రాప్తి తనంతట కలుగదు కాబట్టి ప్రయత్నము చేయుట ఆవశ్యకమని నిర్ణయించుటకే, ప్రయత్నశీలుడు, సాధనము ద్వారా యోగమును సహజముగా పొందునని తెలుపబడెను.

అర్జున ఉవాచ :

"అయతిః[1] శ్రద్ధయోపేతో యోగాచ్చలిత మానసః
అప్రాప్య యోగసంసిద్ధిం[2] కాం గతిం కృష్ణ గచ్ఛతి ? 37

అర్జునుడిట్లనెను:— "కృష్ణా! ఎవడు యోగమునందు శ్రద్ధగలవాడైనను సంయమము (ఇంద్రియ నిగ్రహము) లేనివాడో, ఈ కారణముచేత ఎవని మనస్సు అంతకాలములో యోగము నుండి చలించి పోయినదో[3], అటువంటి యోగభ్రష్టుడైన సాధకుడు యోగసిద్ధిని— అనగా భగవత్సాక్షాత్కారమును పొందక, చివరకు ఎట్టిగతిని పొందగలడు ?

కచ్చిన్నోభయ విభ్రష్టశ్ఛిన్నాభ్రమివ నశ్యతి ।
అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రాహ్మణః పథి ॥ 38

మహాబాహూ! భగవత్ప్రాప్తి మార్గమునందు మోహముచెంది, ఆశ్రయ రహితుడైన ఆయోగభ్రష్టుడు చెదరి భిన్న భిన్నమైన మేఘమువలె, రెండు గతుల నుండి భ్రష్టుడై నశించడుగదా?[4]

---

1. ఆ విషయమే అర్జునుని ఈ ప్రశ్నకు కారణము కనుక (జయించబడని మనస్సు గల సాధకుని దృష్ట్వా 'అయతిః' అను పదము 'అసంయమము' అని చెప్పబడినది.

2. సర్వవిధ యోగముల పరిణామమైన సమత్వపు ఫలము పరమాత్మప్రాప్తి అది 'యోగ సంసిద్ధి' అను పదమునకు అర్థమగును.

3. ఇక్కడ 'యోగ' శబ్దమునకు పరమాత్మ ప్రాప్తికొరకు చేయబడు 'సాంఖ్య— భక్తి- ధ్యాన- కర్మ యోగాదులన్ని సాధనములచేత కలుగు సమభావము అని అర్థము- శరీరము నుండి ప్రాణములు విడిచిపోవు నప్పుడు, సమత్వము నుండి లేక పరమాత్మ స్వరూపము నుండి మనస్సు చలించుటయే, మనస్సు యోగము నుండి చలించుటయనబడును. ఇట్లు మనస్సు చలించుటకు, మనశ్చాంచల్యము- ఆసక్తి- కామన- శరీరపీడ- మూర్ఛ మొదలైనవి కారణములు కాజాలును.

4. జీవితమంతయు ఫలేచ్ఛవీడి కర్మలు చేయుటచేత స్వర్గాదిసుఖభోగములైతే

"ఏతన్మే సంశయం కృష్ణ ఛేత్తుమర్హస్యశేషతః ।
త్వదన్యః సంశయస్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే॥" 39

"కష్ణా! నాయీ సంశయము పూర్తిగా ఛేదించుటకు నీవే యోగ్యుడవు. ఎందుకనగా, నీవు దప్ప ఇతరుడెవడుగూడ ఈ నాసంశయమును ఛేదించువాడు లభించుట అసంభవము.[1]

---

కలుగవు సరిగదా! అంత్యకాలములో పరమాత్మప్రాప్తి సాధనమునుండి మనస్సు విచలితమగు కారణముగా, భగవత్ప్రాప్తిగూడ సిద్ధించదు. కనుకనే మేఘముయొక్క ఒక ఖండము మేఘము నుండి విడిపోయి, ఇతర మేఘములలో మరల కలియనప్పుడు అఖండము నష్టమై భ్రష్టమై పోవునట్లే, ఆసాధకుడుగూడ, స్వర్గాదిలోకములు, పరమాత్మ, ఈ రెంటిని గూడ పొందజాలక నశించిపోవడాని అనగా, అతనికి అధోగతి కలుగదు కదా? అని అచట అర్జునుని యభిప్రాయమని తెలియవలెను.

1. ఇక్కడ అర్జునుడు భగవంతునియందు తన విశ్వాసమును ప్రకటించుచు ఆయనను 'నీవు సర్వాంతర్యామివి; సర్వజ్ఞుడవు; సర్వశక్తి సంపన్నుడవు' సమస్త మర్యాద (పరిమితి)లను నిర్మించువాడవు. అంతటిని నియంత్రణము (అదుపు)లో పెట్టువాడవు పరమేశ్వరుడవునైయున్నావు. నీకు అనంతకోటి బ్రహ్మాండములయందలి అనంతకోటి జీవులయొక్క, సమస్త గతులయొక్క రహస్యము బాగుగా తెలియును. సర్వలోకములలో లోకాంతరములందు భూత-వర్తమాన-భవిష్యత్కాలములు మూడింటిలోను జరుగు సమస్త సంఘటనములు నీకు సర్వదా ప్రత్యక్షములైయున్నవి. ఇట్టిస్థితిలో యోగభ్రష్టుడైన పురుషులగతిని వర్ణించుట నీకు మిక్కిలి సులభమైన విషయముగదా! నీవు స్వయముగా నిక్కడ విరాజమానుడవైయున్నప్పుడు, నేను మరి యెవరిని, ఈ విషయము అడుగుదును? వాస్తవములో ఈ రహస్యము నీవు దప్ప మరియొకడెవడు తెలుపగలడు? అందుకే, నాయందు దయాపూర్వకముగా నీవే యీ రహస్యమును వెల్లడిచేసి, నా సంశయమనెడు వలను భేదించుము"అని ప్రార్థించుచున్నాడు.

"పార్థనైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే ।
న హి కల్యాణకృత్ కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి॥" 40

"పార్థా! ఆ యోగభ్రష్ట పురుషునకు ఈలోకమునందుగాని, పరలోకము నందుగాని, నాశనములేదు. ఎందుకనగా ఆత్మోద్ధారముకొరకు అనగా భగవత్ప్రాప్తి కొరకు కర్మచేయునట్టి పురుషుడెవడుగూడ దుర్గతినొందడుసుమా.[1]

"ప్రాప్య పుణ్యకృతాం లోకానుషిత్వా శాశ్వతీః సమాః ।
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే॥" 41

అర్జునా! యోగభ్రష్టుడైన పురుషుడు[2], పుణ్యవంతులలోకమునకు, అనగా స్వర్గాది శ్రేష్ఠలోకములకు పోవగలడు. అక్కడ అనేక సంవత్సరములు నివసించి, తరువాత, పరిశుద్ధమైన ఆచారములుగల శ్రీమంతుల ఇంటిలో జన్మించగలడు.

సంబంధము :

సామాన్య యోగభ్రష్టుల గతినిగూర్చి తెలిపి భగవంతుడిప్పుడు ఆసక్తి రహితులైన ఉన్నతశ్రేణికిచెందిన యోగభ్రష్ట పురుషుల[3] విశిష్టగతినిగూర్చి వర్ణించుచున్నాడు—

---

1. ఏసాధకుడు తన శక్తి ననుసరించి శ్రద్ధాపూర్వకముగా శ్రేయస్సును సాధించునో, అతనికి ఏకారణముచేతనైనను, ఎప్పుడుగూడ పంది-కుక్క-పురుగు - పక్షి - ఇత్యాది నీచయోనులను పొందుట లేక 'కుంభపాకము' మొదలైన నరకమును పొందుటయనెడు దుర్గతి కలుగజాలదు.

2. జ్ఞాన-భక్తి-ధ్యాన-కర్మ-యోగాది సాధనములు చేయు పురుషుని మనస్సు విక్షేపాది దోషము, విషయాసక్తి, రోగాదులు ఈ మొదలైన కారణములలో దేనివలనగాని అంత కాలమునందు, లక్ష్యమునుండి చలించినచో అట్టి వాడు 'యోగభ్రష్టుడు' అనబడును.

3. యోగభ్రష్ట పురుషులలో, ఎవరిమనస్సునందు విషయాసక్తికలుగునో, వారు స్వర్గాదిలోకములకు పోయెదరు. పవిత్రులైన ధనికుల ఇండ్లలో జన్మించెదరు. కాని యెవరు వైరాగ్యవంతులో, వారైతేనో, ఏలోకమునకు

"అథవా యోగినామేవ కులేభవతి ధీమతాం।
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్॥" 42

అట్టివాడు జ్ఞానవంతులైన యోగుల కులమునందే జన్మించును. కాని ఈ విధముగా గలుగు జన్మమేదైతేఉన్నదో ప్రపంచమునందు అత్యంత దుర్లభము. ఇందులో సందేహములేదు.[1]

"తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదేహికం।
యతతే చ తతో భూయః సంసిద్ధౌ కురునందన॥" 43

అర్జునా! జ్ఞానులైన యోగుల కులమునందు, అతడు పూర్వజన్మమునందు సంపాదించిన బుద్ధి సంయోగమును-అనగా సమబుద్ధి రూపములైన యోగాభ్యాస సంస్కారములను అనాయాసముగానే పొందగలడు. కురునందనా! దాని ప్రభావము చేతనతడు మరల పరమాత్మ ప్రాప్తియనెడు సిద్ధికొరకు, పూర్వముకన్న అధికముగా ప్రయత్నించగలడు.

---

పోవరు, ధనికులయిండ్లలో గూడ జన్మించవలసియుండదు. వారైతే, నేరుగా జ్ఞానవంతులు సిద్ధులునైన యోగుల ఇండ్లలోనే జన్మించెదరు. పూర్వము వర్ణింపబడిన యోగభ్రష్టులనుండి వీరిని వేరుపరచుటకే 'అథవా' అను శబ్దము ఇచట వాడబడినది అని తెలియవలెను.

1. పరమార్థ సాధనమునకు (యోగసాధనమునకు) ఎంతటి సౌకర్యము యోగుల కులమునందు జన్మించినపిదప లభించునో, అంతటి సౌకర్యము స్వర్గమునందుగాని, శ్రీమంతులయిండ్లలోగాని, వేరెక్కడగాని, అతనికి లభించజాలదు. యోగుల కులములందు దానికి అనుకూలమైన వాతావరణ ప్రభావముచేత, మనష్యుడు, ప్రారంభజీవనమునందే, యోగసాధనమునందు లగ్నుడగును. ఇంతయేకాక, జ్ఞానవంతుల కులములో జన్మించువాడు ఎప్పుడుగూడ అజ్ఞానిగానుండడు. ఈ సిద్ధాంతము వేదవాక్యములలో గూడ ప్రమాణితమైనది. ఈ కారణముచేతనే ఇటువంటి జన్మము మిక్కిలి దుర్లభమని చెప్పబడినది.

సంబంధము :

ఇప్పుడు భగవంతుడు, పవిత్రమైన శ్రీమంతుల గృహమునందు జన్మించిన యోగభ్రష్ట పరిస్థితిని వర్ణించుచు, యోగమును తెలిసికొను నిచ్ఛ యొక్క మహత్త్వముతెలుపుచున్నాడు.

"పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః ।
జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే॥" 44

అర్జునా! శ్రీమంతుల యింటిలో జన్మించు ఈ యోగభ్రష్టుడు పరాధీనుడై యుండికూడ, పూర్వాభ్యాసముచేతనే భగవంతునివైపు ఆకర్షింపబడి సమబుద్ధి రూప యోగమును తెలుసుకొన గోరువాడునై, వేదోక్తములైన సకామ కర్మముల ఫలమునుగూడ ఉల్లంఘించగలడు. ఇందులో సందేహములేదు.[1]

"ప్రయత్నాత్ యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః ।
అనేకజన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్॥" 45

"కాని అర్జునా! ప్రయత్నపూర్వకముగా అభ్యాసము చేయు యోగి[2] యైతేనో, కడచిన అనేక జన్మల సంస్కారబలముచేత ఈ జన్మమునందే సిద్ధిని

---

1. ఎవరు యోగమునందు జిజ్ఞాసగలవాడో, యోగమునందు శ్రద్ధగలవాడో, దానిని పొందుటకు ప్రయత్నించునో, ఆ మనుష్యుడుగూడ వేదోక్త సకామ కర్మఫలమైన ఇహ-పరలోకముల సుఖము పొందగలడనగా జన్మ-జన్మాంతరములనుండి యోగాభ్యాసముచేయు యోగభ్రష్టులైన పురుషుల విషయములలోనైతే, యిక చెప్పవలసినదేమున్నది?

2. నలువదిమూడవ శ్లోకములో, యోగుల కులములో జన్మించు యోగభ్రష్ట పురుషుడు ఆజన్మమునందు యోగసిద్ధిప్రాప్తికై అధిక ప్రయత్నము చేయును అని చెప్పబడెను. ఈ శ్లోకములో, ఆయోగికే కలుగు పరమగతి ప్రాప్తినిగూర్చి చెప్పబడినది. ఈ విషయమునే స్పష్టపరచుటకు ఇక్కడ 'యోగి'యనగా ప్రయత్నపూర్వకముగా అభ్యాసము చేయువాడు అని తెలుపబడినది. ఎందుకనగా, అతని ప్రయత్నఫలమా శ్లోకమునందు చెప్పబడలేదు. కనుక ఈ శ్లోకమునందు ఆ విషయము తెలుపబడెను.

పొంది[1] సమస్త పాపములనుండి విముక్తినిపొంది, తత్ క్షణమే పరమగతిని-మోక్షమును పొందగలడు.

"తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః ।
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్ యోగీ భవార్జున॥" 46

అర్జున! యోగి, తపస్వి జనముకన్నను, శాస్త్రజ్ఞానులకన్నను, సకామ కర్మలు చేయువారికంటెను శ్రేష్ఠుడని అంగీకరించబడినాడు. ఈ కారణముచేత గూడ నీవు యోగివికమ్ము.

సంబంధము :-

పూర్వ శ్లోకమునందు 'యోగి సర్వశ్రేష్ఠుడు' అని భగవంతుడు తెలిపి అర్జునునకు 'నీవు యోగివికమ్ము' అని చెప్పెను. కాని జ్ఞానయోగ-భక్తియోగ-ధ్యానయోగ-కర్మయోగ సాధనములలో అర్జునుడు ఏసాధనము చేయవలెను, అను విషయము స్పష్టముచేయలేదు కనుక భగవంతుడిప్పుడు తనయందు అనన్యప్రేమ చూపించు భక్తుడైన యోగిని ప్రశంసించుచు, అర్జునుని తన వైపునకు ఆకర్షించుకొనుచున్నాడు-

1. కడచిన అనేక జన్మలందు, ఈ జన్మయందు-ఈరెంటిలోను చేయబడిన అభ్యాసములే యోగసిద్ధిని పొందించుటలో - అనగా సాధనము యొక్క అంతిమదశను పొందించుటలో కారణములుకాగలవు. ఎందుకనగా పూర్వ సంస్కారముల బలముచేతనే, అతడు విశేషముగా ప్రయత్నించి, ఈ జన్మలో సాధనమును అభ్యసించి, సాధన యొక్క అంతిమదశను పొందగలడు.

2. సకామ భావముచేత యజ్ఞ-దానాది శాస్త్ర విహిత కర్మలు చేయువానిపేరు 'కర్మి' యనబడును దీనిలో క్రియాబాహుళ్యము ఉండును. తపస్వికి క్రియా ప్రాధాన్యములేదు. మనస్సుయొక్క, ఇంద్రియములయొక్కయు సంయమమునకు ప్రాధాన్యముకలదు. శాస్త్రజ్ఞానముగలవానికి శాస్త్రీయము, బౌద్ధికమునైన యాలోచనమునకు ప్రాధాన్యముగలదు. ఈ విలక్షణత్వమునే దృష్టినుంచుకొని కర్మి-తపస్వి-శాస్త్రజ్ఞాని, ఈ ముగ్గురు వేర్వేరుగా నిర్దేశింపబడినారు.

యోగినామపి సర్వేషాం[1] మద్గతేనాన్తరాత్మనా[2]
శ్రద్ధావాన్[3] భజతే[4] యో మాం[5] స మే యుక్తతమో మతః 47

---

1. గీత నాల్గవ అధ్యాయములో ఇరువదినాల్గవ శ్లోకమునుండి ముప్పదియవ శ్లోకమువరకు భగవత్ప్రాప్తికి సాధనములు ఎన్నియైతే యజ్ఞముపేరుతో తెలుపబడెనో, అవియన్నిటికంటేగూడ అధికముగా, భగవత్ప్రాప్తికి ఏయే సాధనములు ఇంతవరకు తెలుపబడెనో, అవియన్నిటి పరాకాష్ఠ పేరు 'యోగము' అనబడుటచేత వేర్వేరు సాధనములు చేయు ననేక విధ 'యోగులు' ఉండెదరు. ఆ సర్వవిధయోగులను సూచించుటకొరకు ఇక్కడ 'యోగినాం' అను పదముతోపాటు 'అపి' యను పదము ప్రయోగించి 'సర్వేషాం' అను విశేషణము 'యోగినాం' అను పదమునకు ఇవ్వబడినది.

2. దీనిచేత భగవంతుడు నన్నే సర్వశ్రేష్ఠునిగ. సర్వగుణధారునిగ, సర్వశక్తి సంపన్నునిగ, అత్యంత ప్రియతమునిగను తెలిసికొనుటచేత, ఎవనికి నాయందు అనన్య ప్రేమ కలిగినదో, అట్లు ప్రేమ కలిగియుండుటచేత ఎవనియొక్క మనో-బుద్ధి-రూపాంతఃకరణము అచంచలము స్థిరము-అనన్య భావముతో నాయందే స్థిరముగా నిలిచియున్నదో అతడు'మద్గతాంతరాత్మ'-నాయందు లగ్నమైన అంతరాత్మ గలవాడు-అని యనెదరు"అని తెలుపుచున్నాడు.

3. భగవంతునిసత్త (అస్తిత్వము), అవతారము, ఆయనమాటలు, అచింత్యములు, అనంతములు – దివ్యములునైన ఆయన గుణములు, నామములు, లీలావిలాసములు, ఆయన మహిమ, శక్తి, ప్రభావము, ఐశ్వర్యము, ఈ మొదలైనవానియందు ప్రత్యక్ష్యముగా తాను చూచుచున్నట్లు, అచంచల పరిపూర్ణ విశ్వాసముగలవానిని 'శ్రద్ధావంతుడు' అనెదరు.

4. అన్నివిధముల – అన్నివైపుల తన మనో-బుద్ధులను భగవంతునియందు లగ్నముచేసి పరమశ్రద్ధా-ప్రేమలతోగూడ, ఇటునటు తిరుగుచు–నడచి పోవుచు–కూర్చొనుచు–లేచుచు–తినుచు–త్రాగుచు–నిద్రించుచు–మేల్కొని యుండి–ఇటువంటి ప్రతియొకపని చేయుచు, అథవా ఏకాంతమునందుండి

"అర్జునా! యోగులందరిలోను, శ్రద్ధగల యే యోగి నాయందు లగ్నమైన అంతరాత్మతో నన్ను నిరంతరము భజించునో, ఆ యోగియే నాకు పరమ శ్రేష్ఠుడు.[2]

---

నప్పుడు నిరంతరముగూడ భగవంతుని భజించుట-ధ్యానించుట యనునది 'భజతే' అను శబ్దముయొక్క అర్థమని తెలియవలెను.

1. ఇక్కడ 'మాం' అను పదమునకు నిరతిశయ జ్ఞాన-శక్తి-ఐశ్వర్య-తేజస్సే-వీర్యాదులకు' పరమాశ్రయుడని సౌందర్య - ఔదార్యాది గుణములకు అనంతమైన అపార సముద్రుడని. పరమదయాళువు-పరమమిత్రుడు-పరమ ప్రేమి, దివ్యాచింత్యానంద స్వరూపుడు - నిత్యుడు - సత్యుడు, వినాశ రహితుడు, సర్వాంతర్యామి, సర్వజ్ఞుడు, సర్వశక్తిసంపన్నుడు, సర్వగుణా లంకృతుడు, సాకారి, లీలామాత్రమున సమస్త ప్రపంచ సృష్టి-స్థితి-సంహారములను ప్రకృతిద్వారా చేయువాడు, రససముద్రుడు రస మయుడు ఆనందకందుడు, సగుణ-నిర్గుణరూపుడు - పరిపూర్ణ బ్రహ్మము సర్వోత్తముడు"నని యర్థము.

2. భగవంతుడిక్కడ, తనయందు ప్రేమగల భక్తుల మహిమను వర్ణించుచు నర్జునునితో, ఒకవేళ నాకు, తపస్వులు-జ్ఞానులు - కర్ములు - మొదలైన వారంచరుగూడ ప్రియులైనప్పటికిన్ని, వీరందరిలోను, ఎవరునన్ను పొందుటకే సాధనములు చేయుచుందురో, వారందరునాకు అధిక ప్రియులు. కాని, ఎవరు నా సమగ్రరూపము తెలిసికొని నాయందు అనన్య ప్రేమ గలిగియుందురో, ఎవరు కేవలము నన్ను మాత్రమే పరమ ప్రేమాస్పదు నిగా తలిచి, యే విషయమునందుగూడ కోరిక, ఆకాంక్ష లేకుండ, దేనిని లెక్కచేయక వానిని, నిర్లక్ష్యముచేసి, తమ అంతరాత్మలను రాత్రింబగళ్ళు నాయందే లగ్నము చేసియుండెదరో, అటువంటివారు నాకు ఆత్మీయులు-నావారు, వారిని మించి, నాకు అత్యంత ప్రియతములు మరియెవరున్నారు? ఎవరు నాకు ప్రియతములో వారే శ్రేష్ఠులుగదా! ఇందుచేత, నామనస్సులో, అతడే సర్వోత్తమ భక్తుడు-అతడే సర్వోత్తమ యోగియని తెలిసికొన వలెను.

ఇతి శ్రీ మహాభారతే భీష్మ పర్వణి శ్రీమద్భగవద్గీతాపర్వణి
శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే ఆత్మ సంయమయోగో నామ
షష్ఠోఽధ్యాయః[6] 6

భీష్మపర్వణి త్రింశోఽధ్యాయః (30)

శ్రీ మహాభారతమునందు భీష్మపర్వాంతర్గతమైన శ్రీమద్భగవద్గీతా పర్వము నందు శ్రీమద్భగవద్గీతోపనిషత్తులయందు బ్రహ్మవిద్యయందు యోగశాస్త్రమునందు ఆత్మసంయోగమనబడు ఆరవ అధ్యాయము సమాప్తము.[6]

భీష్మపర్వమునందు ముప్పదవ అధ్యాయము సమాప్తము. 30



8. దీని తరువాత విషయము, భగవద్గీత మొదటియధ్యాయము చివర * గుర్తు

# భగవద్గీత యేడవ అధ్యాయము

(భీష్మపర్వము 31 వ అధ్యాయము)

## జ్ఞాన విజ్ఞానయోగము :

సంబంధము—

అరవ అధ్యాయము చివరి శ్లోకములో భగవంతుడు 'అంతరాత్మను నా యందు లగ్నముచేసి, యెవడు శ్రద్ధా-ప్రేమలతో నన్ను భజించునో, అతడు సర్వవిధ యోగులలో శ్రేష్ఠుడు' అని చెప్పెను. కాని భగవంతుని స్వరూపము-గుణములు-స్వభావము, మనుష్యుడెంతవరకు తెలిసికొనడో, అంతవరకు అతని అంతరాత్మలో * నిరంతరము భగవద్భజనము జరుగుట అతి కఠినము దానితో పాటే భజనముచేయు విధమునుగూడ తెలిసికొనుగూడ అవశ్యకము. ఇందుచేతనే, యిప్పుడు భగవంతుడు, తన గుణ-ప్రభావములతోపాటు, తన సమగ్ర స్వరూపమును, అనేక భక్తి యోగమును వర్ణించుటకొరకు, ఏడవ అధ్యాయమును, ఆరంభించు చున్నాడు. అన్నిటికంటే మొదటి, రెండు శ్లోకములలో శ్రద్ధతో వినుమని అర్జునుని ప్రోత్సహించి, జ్ఞాన విజ్ఞానములనుగూర్చి చెప్పుటకు భగవంతుడు ప్రతిజ్ఞ చేయుచున్నాడు.

### శ్రీ భగవానువాచ :

"మయ్యాసక్తమనాః[1] పార్థ యోగం యుంజన్ మదాశ్రయః[1] ।
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు॥" 1

---

1. ఇహలోక, పరలోక, సుఖభోగములయందు కొంచెమయినను ఆసక్తి ఎవనికి ఉండదో, ఎవని మనస్సు అన్నిటినుండి విరమించుకొని, పరమాస్పదుడు, సర్వగుణ సంపన్నుడైన పరమేశ్వరుని యందొక్కనియందు మాత్రమే, జలమునుండి కొంచెమునేపైనను వియోగము కలిగినప్పుడు మిక్కిలి

భగవంతుడిట్లనెను–

"పార్థా! అనన్యప్రేమచేత నాయందు ఆసక్తిగల మనస్సుగలవాడై, అనన్య భావముచేత నాయందు తత్పరుడవై, యోగమునందు లగ్నుడవైయున్న[1] నీవు, ఏవిధముగా, విభూతి (వైభవము)-బల-ఐశ్వర్యాదులుగల నన్ను అందరికి ఆత్మ స్వరూపునిగా సంశయరహితుడవై తెలిసికొనగలవో[2], అది వినుము

---

వ్యాకులమైపోవు చేపవలె, అధికాసక్తుడు కావలెను. భగవంతుని వియోగ మునుగాని, లేక, మరుపునుగాని, ఒక్క క్షణమాత్రమైనను సహింపజాలని వక్తి 'మయ్యాసక్తమనాః'అని యనబడును ఏపురుషుడు, ప్రపంచము నందలి ఆశ్రయములన్నింటిని విడి, అన్నియాశలకు, విశ్వాసములకున్ను విముఖుడై, భగవంతునియందొక్కనియందు మాత్రమే, పూర్తిగా, తన భారమంతయు వేసియుండునో, యెవడు, సర్వ శక్తి సంపన్నుడైన భగ వంతుడొక్కడే తనకు పరమాశ్రయుడని పరమగతియని తెలిసికొని, భగవంతునియందలి విశ్వాసముతోనే. ఆయనయందు సర్వదా, నిశ్చింతుడై యుండునో, అతడు 'మదాశ్రయః'అని అనబడును.

1. మనస్సు-బుద్ధి అచంచలభావముతో భగవంతునియందు స్థిరముగావుంచి, నిరంతరము, శ్రద్ధా-ప్రేమలతో భగవంతుని చింతనము చేయుటయే 'యోగమునందు లగ్నమగుట' అనెదరు.

2. భగవంతుడు నిత్యుడు, సత్యుడు, సనాతనుడు, ఆయన సర్వగుణ సంప న్నుడు, సర్వశక్తిసంపన్నుడు-సర్వజ్ఞుడు-సర్వవ్యాపి-సర్వాధారుడు-సర్వ రూపుడు, భగవంతుడు స్వయముగానే, తన యోగమాయచేత ప్రపంచ రూపములో ప్రకటితుడగుచుండును. వాస్తవముగా, ఆయనకంటే వేరై నది మరియొకటి యేదియు లేనేలేదు. వ్యక్తుడు-అవ్యక్తుడు – సగుణుడు –నిర్గుణుడుగూడ భగవంతుడే. ఈవిధముగా భగవంతుని స్వరూపమును భ్రాంతిరహితుడై, ఏమాత్రము సందేహములేక తెలిసికొనుటయే, పరి పూర్ణుడైన భగవంతునిసంశయ రహితముగా తెలిసికొనుట యనబడును.

"జ్ఞానం తేఽహం సవిజ్ఞానమిదం వక్ష్యామ్యశేషతః ।
యద్జ్ఞాత్వా నేహ భూయోఽన్యద్జ్ఞాతవ్యమవశిష్యతే॥" 2

అర్జునా! నేనిప్పుడు నీకు విజ్ఞాన సహితమైన తత్త్వజ్ఞానమును[1] సంపూర్ణముగా చెప్పెదను. దానిని తెలిసికొని ప్రపంచమునందు, మరల నేదియు తెలిసికొన దగినది నీకు మిగిలియుండదు.[2]

మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్ యతతి సిద్ధయే ।
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః॥ 3

"అర్జునా! వేలకొలది మనుష్యులలో నెవడో యొకడు మాత్రమే నన్ను పొందుటకు ప్రయత్నించును.[3] అట్లు ప్రయత్నముచేయు యోగులలోగూడ నెవడో

---

1. భగవంతుని నిర్గుణ-నిరాకారతత్త్వముయొక్క 'ప్రభావ-మాహాత్మ్యరహస్య సహితమైన దివ్య-సాకారమునైన తత్త్వముయొక్క లీలావిలాస-గుణ-రహస్య - మహత్త్వ-ప్రభావ' సహితమైన యథార్థజ్ఞానము 'విజ్ఞానము' అనబడును.

2. జ్ఞాన-విజ్ఞానములచేత భగవంతుని సమగ్ర స్వరూపము పూర్తిగాలభించును. ఈ ప్రపంచము-బ్రహ్మాండముఅంతయు భగవంతుని సమగ్ర రూపము యొక్క అత్యల్పము-అతిక్షుద్రమైన ఒక అంశముమాత్రమేయని తెలియవలెను. ఎప్పుడు మనుష్యుడు, భగవంతుని సమగ్ర రూపమును తెలిసికొనునో, అప్పుడు, ఆ మనుష్యునకు తెలిసికొనదగినది యేదియుగూడ మిగిలియుండదు.

3. భగవత్కృపకు ఫలముగా మానవశరీరము లభించినను, జన్మజన్మాంతరముల సంస్కారమువలన సుఖభోగములందు రతి ఆసక్తి, భగవంతుని యందు శ్రద్ధా ప్రేమలు లేకుండుట - అథవా, తక్కువగా నుండుట కారణముగా, చాలామంది మానవులైతే, యీవైపు ముఖముగూడ పెట్టరు. ఎవరి పూర్వజన్మ సంస్కారములు శుభములో, భగవంతునియందు, మహాపురుషులయందు, శాస్త్రములందున్ను ఎవరికి కొంచెము శ్రద్ధా-భక్తులు వుండునో, పూర్వజన్మపుణ్యములచేత, భగవత్కృపచేతను, ఎవరికి సత్సు

యొకడు మాత్రమే నాయందు ఆసక్తిగలవాడై నన్ను తత్త్వముతో అనగా యథార్థ రూపములో తెలిసికొనగలడు.[1]

"భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవచ ।
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా॥ 4

అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్ ।
జీవభూతాం మహాబాహో మయేదం ధార్యతే జగత్ ॥ 5

"అర్జునా! పృథివీ జల-అగ్ని-వాయు ఆకాశ-మనస్-బుద్ధి అహంకారము"లు అని వేర్వేరుగా విభజించబడిన యీ ఎనిమిదిగూడ నాప్రకృతియే ఈయష్ట విధ భేదములుగలది అపరా[2] అనగా జడ ప్రకృతియని తెలిసికొనుము. దీనికంటే

---

రుషుల సాంగత్యములభించునో వేలకొలది మనుష్యులలో నటువంటివాడు, ఏయొక్కడో విరళముగానే యీమార్గమునందు ప్రవృత్తిగలవాడై ప్రయత్నము చేయగలడు.

1. ప్రయత్న తారతమ్యముచేత అందరి సాధనములు ఒకే విధముగ నుండవు అహంకార-మమకార-కామనా-ఆసక్తి-సంగదోషములు మొదలైన కారణములచేత వివిధ విఘ్నములు సంభవించుచునే యుండును. కనుక సాధకులలో కూడ శ్రద్ధా-భక్తులు ఏకొందరికో సాధన పూర్ణములు గలుగును. దానికి ఫలముగా ఆకొలదిమంది మాత్రమే యీ జన్మమునందే భగవంతుని సాక్షాత్కారము చేసికొనెదరు.

2. భగవద్గీత పదమూడవ అధ్యాయనందు భగవంతుడు తెలిపిన అవ్యక్త-మూల ప్రకృతియొక్క యిరువదిమూడు కార్యములే యిక్కడ ఎనిమిదిగా విభజింపబడినట్లు తెలుపబడినది. ఈ 'అపరాప్రకృతి', జ్ఞేయము(తెలిసికొదగినది) జడమునైన కారణముచేత, 'జ్ఞాత'(తెలిసికొనువాడు), చేతనుఁనైన జీవ 'రూప' 'పరాప్రకృతి'కంటే పూర్తిగా భిన్నము-నికృష్టమైనది ఈ అపరాప్రకృతియే ప్రపంచోత్పత్తి - సంహారములకు కారణమగును. దీని చేతనే, జీవునకు బంధనము కలుగును. ఈ కారణముచేతనే దీనిపేరు 'అపరాప్రకృతి'యని చెప్పబడినది.

రెండవది నా జీవరూప 'పరా' ప్రకృతిచేతనే, సర్వజగత్తు ధరింపబడును.[1]

"ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ ।
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయస్తథా॥ 6

"అర్జునా! సమస్త భూతములుగూడ, ఈ నా రెండు ప్రకృతులనుండియే ఉత్పన్నములగుననియు[2], నేను సర్వప్రపంచమును పుట్టించి-సంహరించువాడను-అనగా, సర్వజగత్తునకు మూలకారణుడనని తెలిసికొనుము.[3]

మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ ।
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ॥ 7

---

1. సమస్తజీవుల 'శరీర-ఇంద్రియ-ప్రాణ-భోగ్యవస్తు-భోగస్థాన' స్వరూపమైన యీ సమగ్ర 'వ్యక్త' (కనపడు) ప్రకృతియే 'జగత్తు'అను పేరుతో వ్యవహరింప బడుచున్నది. ఈ విధముగా ఈ జగత్తు అనెడు జడతత్త్వము, చేతన తత్త్వముచేత వ్యాపింపబడియున్నది. కాబట్టి, ఆచేతన తత్త్వమే ఈ జగత్తును ధరించియున్నది.

2. 'అచరములు - చరములు' అనబడు చిన్న - పెద్ద సజీవ ప్రాణులన్నింటి యొక్క 'ఉత్పత్తి-స్థితి-వృద్ధి'అను ఈమూడు కార్యములుగూడ ఈ'అపరా' (జడము) 'పరా'(చేతనము) ప్రకృతులయొక్క కలయికచేతనే కలుగును. కాబట్టి జగత్తుయొక్క ఉత్పత్తికి ఈ 'అపరా-పరా' ప్రకృతులు రెండే కారణములగును. ఈ విషయమే భగవద్గీత పదమూడవ అధ్యాయమునందు ఇరువదియారవ శ్లోకములో 'క్షేత్రజ్ఞా' నామములచేత చెప్పబడినది.

3. ఎట్లైతే మేఘములు, ఆకాశమునుండిపుట్టి, ఆకాశమునందుఉండి, ఆకాశమునందే విలీనములైయుండి, ఆకాశయొక్కటే మేఘముల ఉత్పత్తికిని, స్థితి-వినాశములకు కారణము, ఆధారముగానున్నదో ఆవిధముగానే, ఈ ప్రపంచమంతయు భగవంతునినుండి ఉత్పన్నమై, భగవంతునియందేఉండి భగవంతుని యందే విలీనమగును భగవంతుడొక్కడే యీ సమస్త ప్రపంచమునకు మహా కారణము.

"ధనంజయా! నాకంటే వేరేదిగూడ జగత్తునకు పరమ కారణము లేదు. సమస్త ప్రపంచముగూడ, దారమునందు మణులవలే నాయందు కూర్చ బడినది.[1]

రసోఽహమప్సు కౌంతేయ ప్రభాఽస్మి శశిసూర్యయోః ।
ప్రణవః సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు॥ 8

"అర్జునా! నేను జలమునందు రసము (రుచి-ద్రవము)గా, సూర్యచంద్రుల యందు ప్రకాశముగా, సర్వవేదములందు ప్రణవము (ఓంకారము)గా ఆకాశము నందు శబ్దముగా, పురుషులయందు పౌరుషముగా నున్నానని తెలిసికొనుము.

"పుణ్యో గంధః పృథివ్యాం చ తేజశ్చాస్మి విభావసౌ ।
జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు॥" 9

"అర్జునా! నేను పృథివియందు పవిత్ర[2] గంధముగా, అగ్నియందు తేజస్సుగా, సర్వభూతములందు వారి జీవనముగా, తపస్వులందు తపస్సుగాను న్నాను.

బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్ ।
బుద్ధిర్బుద్ధిమతామస్మి తేజస్తేజస్వినామహమ్॥ 10

---

1. ఒకేదారమునందు మణులను గ్రుచ్చిహారముగా అల్లినప్పుడు అంతటగూడ కేవలము దారమొక్కటే వ్యాపించియుండునట్లు, సమస్త ప్రపంచము గూడ భగవంతునియందే కూర్చబడియున్నది - భగవంతుడే అన్నింటి యందున్ను ఒతప్రోతముగా (పడుగుపేకవలే) వ్యాపించియున్నాడని మణులలో దారమువలె వ్యాపించియున్నాడని తెలియవలెను.

2. ఈ సందర్భములో 'శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములనగా వీనికి కారణము లైన 'తన్మాత్రలు' శబ్దాదులు పుట్టుటకు మూలకారణములైన సూక్ష్మములు-నిత్యములునైన పరమాణువులు అని గ్రహింపవలెను. ఈ విషయమును స్పష్టపరచుటకే ఇక్కడ శబ్దాదులకు 'పవిత్ర' అను విశేషణము చేర్చబడినది-

అర్జునా! సర్వభూతములకు సనాతన బీజము నేనేయని నీవు తెలిసి కొనుము[1] నేను బుద్ధిమంతులకు బుద్ధిగా, తపస్వులకు తేజస్సుగాను పరమా[2] ధార భూతుడనైయున్నాను.

"బలంబలవతాం చాహం కామరాగవివర్జితమ్ ।
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ॥" 11

"అర్జునా! నేను బలవంతుల ఆసక్తి-కామనారహిత బలము (సామర్థ్యముగ నున్నాను అన్ని భూతప్రాణులయందున్న ధర్మానుకూలము. అనగా శాస్త్రాను కూలముగానున్నాను.[3]

---

1. ఏది సర్వదా ఉండునో, ఏది యెప్పుడుగూడ నష్టముగాదో అది 'సనాతనము' అనబడును. భగవంతుడొక్కడే సమస్త చరాచరభూత ప్రాణులకు పరమా ధారభూతుడు. ఆయననుండియే అన్నింటి ఉత్పత్తి జరుగును. అందువలననే ఆయన, అన్నింటికిన్ని, 'సనాతనకారణుడు' అని చెప్పబడినాడు.

2. సమస్త పదార్థముల జ్ఞానమును నిశ్చయించునది, మనస్సును-ఇంద్రియము లను తన యాజ్ఞలోనుంచుకొని వానిని నడుపునదియునగు-పరిశుద్ధ జ్ఞాన మయిమగు అంతఃకరణశక్తి 'బుద్ధి'యనబడును. ఎవనికి అటువంటి బుద్ధి అధికముగానుండునో, అతనిని 'బుద్ధిమంతుడు' అని యనెదరు. ఈ బుద్ధి శక్తియందు ప్రభావముచేయు శక్తి విశేషము 'తేజస్సు' అనబడును. ఈ తేజస్తత్త్వము ఎవనియందు అధికముగానుండునో, అతనిని 'తేజస్వి' యని అనెదరు. ఈ తేజస్సుగూడ భగవంతుని 'అపరాప్రకృతి' యొక్క ఒక అంశమేయగును. ఆ కారణముచేత, ఈ రెండుగూత తన స్వరూప ములేయని భగవంతుడు చెప్పెను.

3. ఏబలమునందు 'కామనా-రాగ-అహకార-క్రోదాదుల సంబంధముకలదో, ఆ బలముయొక్క వర్ణనము ఆసురీసంపదయందు చేయబడినది (గీత-16-18) అందుచేత ఆ బలము 'అసురబలము' అనబడును. దానిని విడువ వలెనని చెప్పబడినది (గీత-18-53) ఈ విధముగనే, ధర్మ విరుద్ధమైన కామముగూడ ఆసురీసంపదయొక్క ప్రదాన గుణమగుటచేత, అది సర్వా

"యే చైవ సాత్వికా భావా రాజసాస్తామసాశ్చ యే।
మత్త ఏవేతి తాన్ విద్ధి న త్వహం తేషు తే మయి॥" 12

'అర్జునా! ఇంకను సత్త్వగుణమునుండి ఉత్పన్నములగు భావములు, రజోగుణము నుండి తమోగుణము నుండియు గలుగు భావములన్నియు' నానుండియే ఉత్పన్నములగును[1] అని తెలిసికొనుము. కాని, వాస్తవముగా నేను, వానియందు గాని లేక, నాయందు అవిగాని లేవని తెలిసికొనుము.[2]

---

1. 'మనస్సు-బుద్ధి-అహంకారము - ఇంద్రియములు-ఇంద్రియాకర్షకములైన ప్రాపంచిక విషయములు-తన్మాత్రలు - మహాభూతములు-సమస్త సద్గుణములు-దుర్గుణములు-కర్మలు' ఈ మొదలైన భావములన్నియు 'సాత్విక-రాజస-తామస, వృద్ధి-విస్తారము' భగవంతుని 'అపరాప్రకృతి'నుండి కలుగుచున్నవి. ఆ ప్రకృతి భగవంతునిదేయగును. అందుచేత అది భగవంతుని కంటే వేరైనదికాదు, భగవంతుని లీలా-విలాసములకు సంకేతము చేతనే ప్రకృతిచేత, ఈ యన్నింటియొక్క 'సృష్టి-స్థితి-అభివృద్ధి-వికాస-విస్తారము, ఉపసంహారములు జరుగును. ఈ విధముగా తెలిసికొనుటయే 'అవి యన్నియు భగవంతుని నుండియే జరుగునవి'యని తెలిసికొనుట యనబడును.

2. ఆకాశమునందు ఉత్పన్నములగు మేఘములకు జన్మకారణము-వానికి ఆధారము ఆకాశమే అయినప్పటికిన్ని, ఆకాశము ఆ మేఘములయొక్క సంబంధమేమాత్రములేక నిర్లిప్తముగానుండును. మేఘములు ఆకాశమునందు సర్వదా ఉండవు. అవి అనిత్యములగుటచేత, వాని అస్తిత్వముగూడ స్థిరముగా నుండదు. కాని, మేఘములు లేకున్నను ఆకాశము సర్వదా నిత్యమై యుండును. మేఘములు లేనిచోట్లలోగూడ ఆకాశముండునుగదా! అది మేఘములకు ఆశ్రయముకాదు. వాస్తవముగా మేఘములుగూడ ఆకాశముకన్న వేరుగాదు. అవి ఆకాశమునందే, ఆకాశమునుండియే ఉత్పన్నములు అగునుగదా! ఇందుచేతనే, యథార్థముగా, మేఘములకు వేరైన అస్తిత్వము (సత్త)లేదు. అందుచేత. ఆకాశము ఎప్పుడుగూడ మేఘములలోనుండదు. అదియైతే, సర్వదా, తాను తనయందేయున్నది. ఈ విధముగానే భగవం

సంబంధము :-

భగవంతుడు: 'సమస్త ప్రపంచము నా స్వరూపమే, అది నానుండి వ్యాప్తమైయున్నది' అని యిక్కడ తెలిపెను. ఈ సందర్భములో, 'ఈ విధముగా, అత్యంత పరిపూర్ణము-అతి సమీపమున నున్నదియునైనను, జనులు భగవంతు నెందుకు గుర్తించరు' అని జిజ్ఞాస కలుగును. దానికి, భగవంతుడిట్లనుచున్నాడు—

"త్రిభిర్గుణమయైర్భావైరేభిః సర్వమిదం జగత్ ।
మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయమ్॥" 13

"అర్జునా! గుణములకు కార్యరూపములైన, 'సాత్త్విక-రాజస-తామసములు అను మూడు భావములచేత ఈ సమస్త ప్రపంచము-ప్రాణి సముదాయము మోహముచెందుచున్నది. ఈ కారణముచేతనే ఈ మూడు గుణములకంటే(వేరుగా) పరునిగా నేను వినాశరహితుడనుగానున్నానని జనులు తెలిసికొనజాలరు.[1]

---

తుడు గూడ సమస్త త్రిగుణాత్మక భావములకు ఉత్పత్తి కారణము-ఆధారముగా నున్నప్పటికిన్ని, వాస్తవముగా, ఆగుణములు భగవంతుని యందు లేవు. భగవంతుడు ఆగుణములలోలేడు. భగవంతుడు ఎల్లప్పుడున్ను అన్ని విధములగూడ గుణములకు అతీతుడు-నిత్యుడు-తనయందే తాను ఉన్నాడు అని తెలిసికొనవలెను.

1. దేహాభిమానముగల మనుష్యాది సమస్త ప్రాణులు, తమ తమ స్వభావ ప్రకృతి, చింతనములననుకరించి, అనిత్యములు - దుఃఖమయములునైన యా దుఃఖమయ త్రిగుణాత్మక భావములే నిత్యములు-సుఖహేతువులునని తలచి, వానిచేత కల్పితములైన కృత్రిమ-మరణీయత్వమును-సుఖ రూపమును, కేవలము పైపైననే కనపడువాని మెరపులనుచూచి, వానిలో నిమగ్నులై, జీవితమునకు ముఖ్యమైన పరమ లక్ష్యమును మరచి, భగవంతుని 'గుణ-ప్రభావ-తత్త్వ - స్వరూప-రహస్యముల చింతనమునుండి, జ్ఞానమునుండియు విముఖులగుచున్నారు. ఈ కారణముచేత, వారు ప్రాపంచిక విషయాలను కూర్చుకొనుట-వానిని అనుభవించుటదప్ప, జీవితమునకు సంబంధించిన యితర కర్తవ్యములనుగాని, లేక, లక్ష్యముఅనుగాని తెలిసి

"దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।
మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే॥ 14

"అర్జునా! యెందుకనగా, ఈయలౌకికము-అనగా, అద్భుతము త్రిగుణాత్మకమైన నామాయను దాటుట చాలా కష్టము. కాని, నన్నే నిరంతరము భజించు పురుషులు మాత్రమే యీ మాయను ఉల్లంఘించగలరు-అనగా, ప్రపంచము నుండి తరించెదరు.[1]

సంబంధము:

భగవంతుడు మాయ దుస్తరమని తెలిపి, తనను భజించుటయే, మాయను తరించుటకు ఉపాయమనియు తెలిపెను. దీనిపైన ఇట్లైనయెడల, లోకులందరు నిరంతరము నిన్ను ఎందుకు భజించరు? అను ప్రశ్న కలుగును. దానికి సమాధానముగా భగవంతుడిట్లనుచున్నారు—

"న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః।
మాయయాఽపహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితాః॥ 15

---

కొన జాలనంతగా, వారి వివేకదృష్టి అతిస్థూలమైపోయినది. ఈ కారణము చేత, వారు ప్రాపంచిక సర్వవస్తువులకంటే అతీతుడు - నాశరహితుడునైన పరమాత్మని తెలియలేరు.

1. ఏ భక్తులు—భగవంతుడొక్కడే తమకు పరమాశ్రయుడు-పరమగతి పరమప్రియుడు - పరమప్రాప్యుడని తలచెదరో, ఇదియంతయు భగవంతునిదే, లేక, భగవంతుని కొరకేయని తలచి, శరీర-భార్యా-పుత్ర-ధన-గృహ-భృత్యాదులయందు మమకార-ఆసక్తులను విడిచి వానినన్నిటిని భగవంతుని పూజా సామాగ్రులనుగాచేసి, భగవంతుడు నిర్మించిన విధానమునందు సర్వదా సంతుష్టులైయుండి, భగవదాజ్ఞా పాలనమునందు తత్పరులై భగవంతుని ధ్యానమునందు ఆసక్తిగలవారై, తమను అన్నివిధముల, నిరంతరము భగవంతునియందే లగ్నమైనవారినిగా భావించుచు, శరణాగతులైన వారు మాయను తరించెదరు.

"అర్జునా! మాయచేత ఎవరి మనస్సు హరింపబడినదో, అటువంటి అసుర స్వభావముగల మనుష్యులలో, నీచులు-దుష్టకర్మలు చేయువారు మూఢులు నన్ను భజించరు.

"చతుర్విధా భజంతే మాం జనాః సుకృతినోఽర్జున[1]
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ॥ 16

"అర్జునా! అయినను, ఉత్తమ కర్మచేయు అర్థార్థి[2], ఆర్తుడు[3], జిజ్ఞాసువు[4],

---

1. ఎవని స్వభావము జన్మ జన్మాంతరములనుండి శుభకర్మలు సర్వదా చేయుచు, సంస్కరించబడి, పూర్వజన్మ సంస్కారముల బలముచేత, లేక, మహాత్ముల సాంగత్య ప్రభావముచేత ఎవడు ఈ జన్మమునందుగూడ భగవదాజ్ఞానుసారముగా శుభకర్మలను చేయునో, అట్టిశుభకర్మలు చేయు వారిని 'సుకృతులు'అని యనెదరు.

2. భార్యా-పుత్ర-ధన-మాన-గౌరవ - ప్రతిష్ఠ-ఇహలోక-స్వర్గాది-పరలోక సుఖభోగములు వీనిలో ఏ యొక్క దానియందు కామనగాని. అనేకము లందు కామనగాని ఉండినవాడై, ఆకామనా పూర్తికిగాను ఎవడు కేవలము భగవంతునియందే భారము వేసి, దానికొరకు శ్రద్ధా-విశ్వాసములతో భగవంతుని భజనచేయునో. అతడు 'అర్థార్థి' యను భక్తుడు. సుగ్రీవ-విభీషణాదులు 'అర్థార్థి' భక్తులనబడెదరు. వారిలో ప్రధానముగా ధ్రువుని పేరు చెప్పవచ్చును.

3. శారీరక-మానసిక సంతాపములు, విపత్తులు-శత్రుభయము - రోగములు వీని నుండి అవమానములు-చోరుల - దోపిడిగాండ్ల ఆతతాయుల- క్రూర జంతువుల ఆక్రమణాదులచేత, బెదరుకొని, వారినుండియు విముక్తి పొందుటకు పరిపూర్ణ విశ్వాసముతో-అచంచలమైన హార్దిక శ్రద్ధతో భగవంతుని భజన చేయువాడు "ఆర్తుడు' అనబడు భక్తుడు అగును. ఆర్త భక్తులలో గజేంద్రుడు జరాసంధునిచేత బంధింపబడిన రాజులు మొదలైన వారెందరో వున్నారు. కాని, వారిలో ద్రౌపదీదేవి పేరు ముఖ్యముగా చెప్పవచ్చును.

4. ధన-భార్యా-పుత్ర-గృహాది వస్తులను-రోగ సంకటాదులను లెక్కచేయక,

జ్ఞాని[1], యీనలుగురు భక్తులు నన్ను భజించెదరు.

"తేషాం జ్ఞానీ నిత్యయుక్తః ఏకభక్తిర్విశిష్యతే
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమహం స చ మమ ప్రియః 17

"అర్జునా! యీనలుగురిలోను నిరంతరము నాయందు ఐక్యములో ఉండే, అనన్యప్రేమ భక్తులుగల 'జ్ఞాని' యనబడు భక్తుడు ఉత్తముడు[2] ఎందుకనగా,

---

వానిని నిర్లక్ష్యముచేసి, పరమాత్మ నొక్కనిమాత్రమే తాత్త్వికముగా తెలిసికొను నిచ్ఛచేతనే, ఎవడు ఏనిష్ఠతో భగవంతుని భక్తితో సేవించునో (గీత 14-26) శ్రేయస్సు కోరుకొను అభక్తుని 'జిజ్ఞాసువు'అని అనెదరు. ఆజిజ్ఞాసు భక్తులలో పరీక్షిత్తు మొదలైన అనేకభక్తులు ఉన్నారు. కాని, వారిలో ఉద్ధవుని పేరు ప్రధానముగా చెప్పవచ్చును.

1. పరమాత్ముడుదప్ప మరియొకవస్తు వేదియు నెవనికి లేనేలేదో, పరమాత్మని పొందుటచేత, ఎవని సమస్త కామనలు నిశ్శేషముగా సమాప్తి చెందినవో, యటువంటిస్థితిలో నెవడు సహజభావములోనే పరమాత్మ భజన చేయునో అతడు 'జ్ఞాని' యనబడు భక్తుడు (గీత 12-13,19). భగవద్గీత తొమ్మిదవ అధ్యాయములో పదమూడు, పదనాలుగవ శ్లోకములలో, పదవ అధ్యాయములో మూడవ శ్లోకమునంటు, పదనైదవ అధ్యాయములో పందొమ్మిదవ శ్లోకమునందున్ను వర్ణించబడిన నిష్కాములు అనన్య ప్రేమగలవారు సాధకులునైన భక్తులుగూడ జ్ఞానులైన భక్తులలో అంతర్గతులగుదురు. జ్ఞానులలో శుకమహర్షి సనకాదులు నారదముని భీష్ముడు మొదలైనవారు ప్రసిద్ధులుగనున్నారు. వారిలో బాలకుడైన ప్రహ్లాదుడు ముఖ్యుడని చెప్పవచ్చును.

2. ప్రపంచమును, శరీరమును, తననుగూడా పూర్తిగా మరచి, అనన్య భావములో, నిత్యము నిరంతరము భగవంతునియందే స్థిరముగా నిలచియున్నవాడు 'నిత్యయుక్తుడు' అనబడును. భగవంతునియందే విశ్లేతుకముగా ఎడతెగని, ప్రేమగలవాడు 'ఏకభక్తి' యనబడును. ఇట్లు భగవత్తత్త్వమును తెలిసికొను జ్ఞానియైన భక్తుడందరికన్న నుత్తముడు.

నన్ను తాత్త్వికముగా తెలిసికొను జ్ఞానికి నేను అత్యంత ప్రియుడను నాకు ఆజ్ఞాని గూడ మిక్కిలి ప్రియుడని తెలిసికొనుము[1].

సంబంధము :

భగవంతుడు, జ్ఞానియైన భక్తుడు అందరికంటే శ్రేష్ఠుడు తనకు అత్యంత ప్రియుడునని తెలిపెను. దీనిపైన, 'ఇతర భక్తులు. శ్రేష్ఠలు ప్రియులు కారా?' యను శంకకలుగవచ్చును' దానిపైన భగవంతుడు, అర్జునునితో నిట్లనుచున్నాడు-

"ఉదారాః సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతం
ఆస్థితః స హి యుక్తాఽత్మా మామేవానుత్తమాం గతిమ్॥ 18

"అర్జునా! తక్కిన ముగ్గురుగూడా ఉదారులే[2] యగుదురు. కాని జ్ఞాని

---

1. ఇహ-పరలోకములందు అతిప్రియములు, సుఖప్రదములు, మనుష్యుని దృష్టిలో నతి దుర్లభములునైన ప్రాపంచిక సుఖభోగములందు అభిలాష లన్నియు, భగవంతునికొరకు విడిచిన వారిదృష్టిలో, భగవంతుని మహత్త్వ మెంత గొప్పదో, వారికి భగవంతు డెంత ప్రియుడో యను విషయ మితరు లెవ్వరికిన్ని ఊహింప శక్యముగాదు. ఇందుచేతనే, భగవంతుడు, జ్ఞానికి అత్యంత ప్రియుడను అని చెప్పెను. ఎవడు భగవంతుని కతిప్రియుడో, ఆతడాయనకు అతిశయప్రియుడుగానే యుండునుగదా! ఇందులో సందేహము లేదు.

2. భక్తులు భగవంతుడు సర్వశక్తి సంపన్నుడు సర్వజ్ఞుడు, సర్వేశ్వరుడు పరమదయాళువు, పరమమిత్రుడు, మా ఆశలు-కోర్కెలు ఆయనయొక్కని వలననే తీరును. అని పూర్తిగా నిశ్చయించుకొన్నారు. ఇట్లు తెలిసికొని వారు, ఇతరాశ్రయములన్నియు విడిచి, తమ జీవితమును, భగవంతుని భజన-స్మరణ-పూజన - సేవనాదులయందు లగ్నముచేసి యుంచెదరు. భగవంతునియందు వారికి గల విశ్వాసములో కొంచెముగూడ లోపము గలుగించు ప్రయత్నమొక్కటిగూడ వారు చేయరు. ఇందుచేత వారందరు 'ఉదారులే' యని చెప్పబడినది.

యైతేనే, నాస్వరూపుడే యగును[1] అని నా యభిప్రాయము. ఎందుకనగా నా యందు నిలిపిన మనస్సు బుద్ధిగలవాడైన జ్ఞానియైన భక్తుడు.[2]అత్యుత్తమ గతియగు నా యందే స్థిరముగా నిలిచియుండును.

> బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్[3] మాం ప్రపద్యతే
> వాసుదేవః సర్వమితి స మహాత్మా సుదుర్లభః ॥ 19

"అర్జునా! అనేక జన్మల తరువాత చివరి జన్మలో, తత్త్వజ్ఞానమును పొందిన పురుషుడు, 'అంతయు వాసుదేవుడే' యని నన్ను భజించును.[4] ఆ మహాత్ముడతి దుర్లభుడు.

---

1. ఇట్లు చెప్పుట చేత భగవంతుడు 'జ్ఞానియైన భక్తునకు- నాకు ఏ మాత్రము భేదములేదు 'అను భావము తెలిపెను. 'భక్తుడేనేను, నేనే భక్తుడు' అని స్పష్టముగా భగవంతుడీ వాక్యము చేత తెలిపెను.

2. ఏ జన్మమునందు మనుష్యుడు భగవంతునకు జ్ఞానియగు భక్తుడగునో, ఆ జన్మమే అతని జన్మలన్నింటికి కడపటి జన్మమగును. ఎందుకనగా, భగవంతుని ఈ విధముగా తత్త్వముతో తెలిసికొనిన పిదప అతనికి పునర్జన్మ లేదు- అదియే చివరి జన్మయగును.

3. భగవంతుడీ యధ్యాయపు రెండవ శ్లోకములో, విజ్ఞాన సహితజ్ఞానమును తెలిసికొనుటను ప్రశంసించి, ఆ విజ్ఞానసహిత జ్ఞానమును పొందిన ప్రేమి యైన భక్తుని గూర్చి మూడవశ్లోకములో, ఎవడో యొకడే నన్ను తాత్త్విక దృష్టితో చూచును. వానినే యచట 'జ్ఞానవంతుడు' అని భగవంతుడు చెప్పెను. కనుకనే పదునెనిమిదవ శ్లోకములో భగవంతుడు, అతడు తన స్వరూపమనియే చెప్పెను.

4. సర్వ ప్రపంచము భగవంతుడైన వాసుదేవుని స్వరూపమే యగును. వాసుదేవుడు దప్ప మరియొకటి యేదియు లేనేలేదు. ఈ తత్త్వము ప్రత్యక్షముగా, స్థిరముగాను అనుభవమునకు రావలెను, ఆ తత్త్వము

'కామైస్తై స్తైర్హృతజ్ఞానాః ప్రపద్యంతేఽన్య దేవతాః
తం తం నియమమాస్థాయ ప్రకృత్యా నియతాః స్వయా. 20

'అర్జునా! ఆయా సుఖభోగముల యందలి కామనచేత వంచింపబడిన జ్ఞానము గలవారు, 'తమ స్వభావము చేత ప్రేరితులై[1], ఆయా నియమముల ననుసరించి, అన్యదేవతలను భజించెదరు- అనగా పూజించెదరు.[2]

"యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితు మిచ్ఛతి
తస్య తస్యాచలాం శ్రద్ధాం తా మే వ విదధామ్యహమ్ । 21

'అర్జునా! ఏయే సకామభక్తుడు, ఏయే దేవతా స్వరూపమును శ్రద్ధతో

---

నందే సర్వదా స్థిరముగా నుండవలెను. అను భావమే 'అంతయు వాసు దేవుడే' యని భగవంతుని భజించుటయని తెలియవలెను.

1. జన్మ జన్మాంతరములందు చేయబడిన కర్మల వలన సంస్కారములు ప్రోగగును. ఆ సంస్కారముల సమూహము చేత కలిగిన ప్రకృతి 'స్వభావము' అనబడును. ఈ స్వభావము ప్రతిజీవునకు భిన్నభిన్నముగా నుండును. ఆ స్వభావము ననుసరించి, అంతఃకరణమునందు వేర్వేరు దేవతల పూజలు చేయుటకు వేర్వేరు దేవతల పూజలు చేయుటకు వేర్వేరు ఇచ్ఛలు కలుగుట 'ఆ స్వభావమును ప్రోత్సహించుట' యన బడును.

2. శాస్త్రములలో చెప్పబడిన 'సూర్య- చంద్ర- అగ్ని- ఇంద్ర- వాయు- యమ- వరుణాది 'దేవతలు భగవంతునికన్న వేరని తలిచి, ఏ దేవత యొక్క 'జప - ధ్యాన- పూజన- నమస్కార - న్యాస. హోమ- వ్రత- ఉపవాసాది భిన్న భిన్న నియమములు చేయబడునో, ఆ నియమములు పాటించి, మిక్కిలి జాగరూకతతో వానిని పాలించుచు ఆ దేవతలను ఆరాధించుటయే 'ఆయా నియమములను పాటించి మిక్కిలి జాగరూక తతో వానిని పాలించుచు ఆ దేవతలను ఆరాధించుటయే 'ఆయా నియ మములను పాటించి, యితర దేవతలను భజించుట యనబడునని తెలియ వలెను.

పూజింపగోరునో[1], ఆయా భక్తుని శ్రద్ధను, నేను, ఆ దేవతపైననే స్థిర పరచెదను.

'స తయా శ్రద్ధయా యుక్తస్తస్యాఽఽ రాధన మీహతే ।
లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హి తాన్ ॥ 22

"అర్జునా ఆ పురుషుడు, ఆశ్రద్ధ గలవాడయతే, ఆ దేవతను పూజించును- ఆ దేవత నుండి, నేనాచేతనే విధింపబడిన ఆ కోరికలను, భోగములను, తన కోరిక ప్రకారమే పొందగలడు ఇందులో సందేహములేదు.

'అంతవత్తు ఫలం తేషాం తద్ భవత్యల్ప మేధసామ్ ।
దేవాన్ దేవయజో యాంతి మద్భక్తా యాంతి మామపి 23

"కాని అర్జునా అల్పబుద్ధిగల ఆ భక్తుల [2]కు లభించు ఆ ఫలము నశించు

---

1. దేవతల యొక్క 'సత్త (అస్తిత్వము) - వారి ప్రభావము- గుణములు- పూజా ప్రకారము- దాని ఫలము' వీనియందు పూర్తిగా విశ్వాసము ఉంచి, శ్రద్ధతో, ఆ దేవతలను పూజించవలెను. శాస్త్రమునందు ఏ దేవతామూర్తిని ఏ విధముగ నిర్మింపవలెనని యున్నదో ఆ మూర్తిని, ఆ విధముగానే 'లోహము- కొయ్య- మన్ను- రాయి- చిత్రపటము' మొదలైన వానితో నిర్మించి కాని, భక్తుడు తన మనస్సులో ఒక మూర్తి స్వరూపమును ఊహించుకొని, దాని ప్రకారమే మూర్తి నిర్మాణము చేయించి స్థాపించ వలెను. ఆ సామగ్రులలోనే, ఆ విధానముచేతనే ఆ దేవతను పూజించ వలెను. దేవతల నిమిత్తమై అగ్నియందు హోమములు చేసి యజ్ఞాదులను చేయవలెను. ఆ దేవతల ధ్యానము చేయవలెను, సూర్య-చంద్ర - అగ్ని మొదలైన ప్రత్యక్ష స్వరూపములను శ్రద్ధతో పూజించుట యనబడును.

2. దేవతోపాసకులు, కోరికలకు వశులై, యితర దేవతలు భగవంతునికంటే వేరని భావించి, ప్రాపంచిక సుఖభోగ వస్తువుల కొరకు ఆ దేవతలను ఉపాసించెదరు. ఇందుచేత, అట్టివారు భక్తులకంటే తక్కువ తరగతికి చెందినవారు అటువంటివారు 'అల్పబుద్ధులు' అనబడుదురు.

నది యగును వారు పూజించు దేవతలను వారు పొందెదరు. నా భక్తులు ఏ విధముగ పూజించినను, భజించినను సరియే, చివరకు నన్నే పొందెదరు[1].

సంబంధము-

భగవంతుడు, తనను భజించువారికి, ఏదోయొక విధముగా తన స్వరూప ప్రాప్తి కలిగించునంతటి ప్రేమ పాత్రుడు- దయానముద్రుడునై యుండగా అందరు గూడ ఆ భగవంతుని ఎందుకు భజించరు ? అను శంక గలుగును. ఆ జిజ్ఞాసకు బదులుగా భగవంతుడిట్లనుచున్నాడు.

'అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యంతే మామ బుద్ధయః ।
పరం భావమజానంతో మమావ్యయమనుత్తమమ్ ॥ 24

'అర్జునా బుద్ధిహీనులు, అత్యుత్తమము- వినాశరహితమునైన పరమ భావమును తెలియకుండ[2], మనస్సుకు- ఇంద్రియములకు అతీతుడు- సచ్చిదానంద ఘన పరమాత్ముడు నైన నన్ను, మనుష్యునివలె జన్మించి, వ్యక్తి ప్రకటిత భావమును పొందినవానినిగా తలచెదరు[3]

1. శాశ్వతము- దివ్యమునైన భగవంతుని పరమధామమునందు నిరంతరము నివాసము చేయుట లేక అభేద భావముతో భగవంతుని యందు ఐక్యమును పొందుట- ఈ రెండింటి పేర్లు 'భగవత్ప్రాప్తి' యనబడును.

2. భగవంతుడు అనంతమైన తన దయా శక్త్వము- శరణాగతవత్సలత్వముల కారణముగా ప్రపంచ ప్రాణులకు తన శరణాగతిని ఆశ్రయముగా నిచ్చుటకే తన జనన- వినాశ రహితములగు- స్వభావ- సామర్థ్య సహితములైన వివిధ స్వరూపములందే ప్రకటితుడై, తన అలౌకిక లీలా విలాసములచేత, ప్రపంచ ప్రాణులందరిని పరమానంద మహా సాగరము నందు నిమగ్నులను చేయును. ఇదియే భగవంతుని నిత్యము- ఉత్తమోత్తమమునైన పరమభావము- ఈ భావమును తెలిసికొనకుండుటయే 'ఆయన యొక్క ఉత్తమోత్తమ- వినాశరహిత పరమభావమును తెలిసికొనకుండుట' యనబడును-

3. భగవంతుని నిర్గుణ- సగుణ రూపములు రెండున్ను నిత్యములు- దివ్య

"నాహం ప్రకాశః సర్వస్య యోగమాయా సమావృతః ।
మూఢోఽయం నాభిజానాతి లోకో[1] మామజ మవ్యయమ్ 25

"ఎందుకనగా, అర్జునా నా యోగమాయచేత కప్పబడియున్న[2] నేను,

---

ములు. మనుష్యాది రూపములలో నాయన అంతరించుటయే యాయన జన్మమని, అంతర్ధానము చెందుటయే యాయన పరమధామమునకు పోవుట యనియు భావించనగును. ఇతర ప్రాణులకు వలె ఆయనకు శరీర సంయోగ- వియోగ రూపములగు జనన- మరణములు కలుగవు. ఈ రహస్యము తెలిసికొనకుండుటచేత, బుద్ధిహీనులు ఇతర ప్రాణులు జన్మకు పూర్వము అవ్యక్తము (కనపడకయుండుట) ఉండేది అనగా వారికి సత్త (అస్తిత్వము)యే లేకుండెను, ఇప్పుడుపుట్టి వ్యక్తులైనారు. ఈ విధముగనే యా శ్రీకృష్ణుడు గూడ జన్మమునకు ముందు లేకుండెను. ఇప్పుడు వసుదేవుని యింటిలో జన్మించి వ్యక్తుడైనాడు ఇతర మనుష్యులలో, ఇతనిలోను భేదమేమున్నది?- అసగా ఏలాటి భేదము గూడలేదు- అని తలచెదరు, ఇదియే, బుద్ధిహీనులు 'భగవంతుడు అవ్యక్తము నుండి వ్యక్తుడైనాడని తలచుట యనబడును.

1. ఇక్కడ 'లోకః' యను పదము, భగవద్భక్తులుదప్ప, పాపాత్ములు- పుణ్యాత్ములునగు అన్ని యితర శ్రేణులకు చెందిన సాధారణాజ్ఞానము గల మనుష్యులు అను భావము కొరకు ప్రయోగింపబడినది.

2. గీత నాలుగవ అధ్యాయము ఆరవ శ్లోకమునందు భగవంతుడు దేనిని 'ఆత్మమాయ' యని చెప్పెనో, ఏ యోగశక్తి చేత భగవంతుడాదివ్యగుణ సహితుడై స్వయముగా మనుష్యాది రూపములలో నవతరించు చున్నప్పటి కిన్ని, ప్రపంచదృష్టిలో, సాధారణముగా జన్మించు మనుష్యునివలె తోచుచున్నాడో, ఆ మాయా శక్తిపేరు యోగమాయ యనబడును- వాస్తవముగా భగవంతుడా మాయచేత కప్పబడకున్నను, ఎట్లైతే, జనుల దృష్టి మేఘములచేత కప్పబడుటచేత, సూర్యుని మేఘములు కప్పి యున్నవి.' అని చెప్పబడుచున్నదో, అట్లే యిక్కడగూడ 'భగవంతుడు తన యోగమాయచేత కప్పబడియుండుటను, తెలియవతెను.

అందరికి ప్రత్యక్షముగా కనపడను గనుక, అజ్ఞానియైన యీ జనసముదాయము, జన్మ రహితుడు- వినాశరహితుడు- పరమేశ్వరుడైన నన్ను తెలిసికొనరు- అనగా, నేను జనన- మరణములు గలవాడనని తలచెదరు.

"వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున
భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన ॥ 26

"అర్జునా పూర్వము గడిచిన, ఇప్పుడున్న, భవిష్యత్తులో కలగబోవు భూతములన్నింటిని నేనెరుగుదును[1]. కాని నాయందు శ్రద్ధాభక్తులు లేని వారెవరు గూడ నన్ను తెలిసికొనజాలరు.

ఇచ్ఛా ద్వేష సముత్థేన ద్వంద్వ మోహేన భారత ।
సర్వభూతాని సమ్మోహం సర్గే యాంతి పరంతప ॥ 27

"ఎందుకనగా అర్జునా ప్రపంచమునందు, ఇచ్ఛా ద్వేషములవలన పుట్టిన సుఖదుఃఖాది ద్వంద్వ రూప మోహము చేత[2], సమస్త ప్రాణులు మిక్కిలి అజ్ఞానము పొందుచున్నారు.

---

1. ఇక్కడ భగవంతుడు 'దేవ- మనుష్య- పశు- పక్షి- కీటకాదులైన చరాచర భూత ప్రాణులన్నియు, ఈ జన్మమునకు పూర్వము- అనంతకల్ప- కల్పాంతరములందు, ఎప్పుడు ఏయే యోనులలో ఏ విధముగ పుట్టి, యేమి చేయుచున్నాడు? భవిష్యత్కల్పములలో, ఎవడు, ఎక్కడ ఏ విధముగ నుండబోవును ? అను ఈ విషయములన్నియును బాగుగా తెలియును. వాస్తవముగా, భగవంతునకు భూత భవిష్య ద్వర్తమాన కాలముల భేదము లేదు. ఆయన యఖండ జ్ఞాన స్వరూపమునందు అన్నియు ఆయనకు సర్వదా ప్రత్యక్షముగా నుండును.

2. మనుష్యుని శ్రేయోమార్గమునందు విఘ్నములుకల్పించు శత్రువుగాను, వేనిని భగవంతుడు తెలిపెనో(గీత 23-34),కామక్రోధముల పేరుతో(గీత 3-37) ఏవి పాప హేతువులని, మనుష్యుని, శత్రువులనియు చెప్పెనో, ఆ రాగ ద్వేషములనే యిక్కడ - ఇచ్ఛా-ద్వేషములు' అను పేరుతో భగవంతుడు వర్ణించెను. ఈ ద్వంద్వములు, ఈ జీవుని యజ్ఞానమును గట్టి

యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణాం ।
యే ద్వంద్వమోహ నిర్ముక్తా భజంతే మాం దృఢవ్రతాః॥ 28

"కాని, అర్జునా నిష్కామభావముతో, శ్రేష్ఠకర్మలు ఆచరించు ఏ పురుషుల పాపములు నశించునో, రాగద్వేష జనితములైన ద్వంద్వరూప మోహముల నుండి విముక్తులై, దృఢ నిశ్చయము గల ఆ భక్తులు నన్ను అన్ని విధములుగ భజించెదరు.[1]

"జరా—మరణమోక్షాయ మామాశ్రిత్య యతంతి యే ।
తే బ్రహ్మ తద్ విదుః కృత్స్నమధ్యాత్మం కర్మ చాఖిలమ్॥ 29

"అర్జునా! యెవరు నన్ను శరణుజొచ్చి - జరా-మరణ దుఃఖములనుండి విముక్తులగుటకు ప్రయత్నించెదరో[2], వారు ఆబ్రహ్మమును, పరిపూర్ణమైన ఆధ్యాత్మమును, అఖిల కర్మలను తెలిసికొనెదరు.

---

పరచుటకు కారణములగును. కనుకనే, వీనిపేరు 'ద్వంద్వ రూప మోహము' అనబడును.

1. భగవంతుడే, సర్వవ్యాపి- సర్వాధారుడు- సర్వశక్తి సంపన్నుడు- సర్వాత్మ- పరమ పురుషోత్తముడు అని తలచి బుద్ధిచేత అతని లీలా విలాస రహస్యములను చింతించుట వాక్కుచేత అతని నామ గుణములను కీర్తించుట. శిరస్సుచేత అతనికి ఆ నమస్కారము చేయ్యలచేత పూజాదీనుల దుఃఖితాదుల రూపములలో అతనిసేవ- నేత్రముల చేత అతని విగ్రహ దర్శనమును చేయుట, పాదములచేత భగవన్మందిరములకు పుణ్య తీర్థములకు పోవుట, తన సమస్త వస్తువులను నిశ్శేషముగా బగవంతునకు మాత్రమే అర్పించి, అన్నివిధములుగా కేవలము భగవంతుని వాడుగానే యగుటయే' అన్ని విధములుగా భగవంతుని భజించుట యనబడును.

2. ఇక్కడ భగవంతుడు 'ఎవరు ప్రాపంచిక విషయములన్నింటి యాశ్రయము విడిచి, దృఢవిశ్వాసముతో నన్నొక్కనినే ఆశ్రయించి, నిరంతరము నాయందే, తన మనోబుద్ధులను లగ్నముచేయుదురో, వారు నన్ను శరణుజొచ్చి ప్రయత్నించువారు అనబడెదరు.

సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః ।
ప్రయాణకాలేఽపి చ మాం తే విదుర్యుక్తచేతసః॥ 30

"అర్జునా యీ విధముగా, ఏపురుషులు-అధిదేవ-అధిభూత-అధియజ్ఞ సహితునిగా (సర్వమునకు ఆత్మస్వరూపుడు) నన్ను తెలిసికొనెదరో, యుక్తచిత్తులైన అటువంటి పురుషులు, అంతకాలములో నన్ను తెలిసికొనెదరు[1]. అనగా పొందెదరు.

ఇతి శ్రీమహాభారతే భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతాపర్వణి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే.

---

1. ఇరువది తొమ్మిదవ శ్లోకములో వర్ణింపబడిన 'బ్రహ్మము' జీవసముదాయ రూప 'అధ్యాత్మము' భగవంతుని ఆది సంకల్పరూప 'కర్మము' పైన చెప్పబడి జడవర్గరూప అధిభూతము-హిరణ్యగర్భరూప -'అధిదైవము' అంతర్యామిరూప 'అధియజ్ఞము' ఇవన్నియు భగవంతుని స్వరూపములే యగును. ఇదియే భగవంతుని సమగ్రరూపము. అధ్యాయారంభమునందు భగవంతుడు ఈ సమగ్రరూపమును తెలుపుటకే ప్రతిజ్ఞచేసియుండెను. మరల ఏడవ శ్లోకమునందు నాకన్న వేరు మరియొకటి యేదియు పరమ కారణములేదు అవి పన్నెండవ శ్లోకములో 'సాత్విక రాజస తామస భావములన్నియు నాయందియే కలుగును'అని పందొమ్మిదవ శ్లోకములో, 'ఈ ప్రపంచమంతయు వాసుదేవుడే' అనియు చెప్పి, యానమగ్ర రూపమునే వర్ణించెను. ఇక్కడగూడ పైమాటలుచెప్పి ఆసమగ్ర రూపమునే వర్ణించిచెప్పి, అధ్యాయ పరిసమాప్తిచేసెను. ఈ సమగ్ర రూపమును తెలిసికొనుట అనగా ఎట్లైతే జలమునందు పరమాణువు ఆవిరి మేఘము పొగ మంచు ఇవియన్నియు జలస్వరూపములే యగునో, అట్లే బ్రహ్మము అధ్యాత్మము కర్మము అధిభూతము అధిదైవము అధియజ్ఞము ఇవన్నియు వాసుదేవుడే యని యథార్థముగా అనుభవమునకు తెచ్చుకొనుటయే సమగ్రబ్రహ్మమును అథవా భగవంతుని తెలిసికొనుట యనబడును.

జ్ఞానవిజ్ఞానయోగో నామ సప్తమోఽధ్యాయః. భీష్మపర్వణి తు ఏకత్రింశోఽధ్యాయః॥ శ్రీమహాభారతమునందు భీష్మపర్వాంతర్గతమైన, శ్రీమద్భగవద్గీతా పర్వమునందు, శ్రీమద్భగవద్గీతోపనిషత్తులందు, బ్రహ్మవిద్యయందు, యోగ శాస్త్రమునందు, జ్ఞాన విజ్ఞాన యోగమనబడు ఏడవ అధ్యాయము సమాప్తము.

సమాప్తము

:~:

1. దీని తరువాత విషయము భగవద్గీత మొదటి అధ్యాయము చివర * ఈ గుర్తుగల అధోజ్ఞాపికలో నున్నట్లు గ్రహింవవలెను.

# భగవద్గీత యెనిమిదవ అధ్యాయము

(భీష్మపర్వము 31వ అధ్యాయము)

## అక్షరబ్రహ్మ యోగము :

సంబంధము :-

భగవద్గీత యేడవఅధ్యాయము మొదటి మూడు శ్లోకములలో భగవంతుడు తన సమగ్రరూపముయొక్క తత్త్వము వినుమని అర్జునునకు చెప్పుటకు ప్రతిజ్ఞ చేసి, ఇది వినువారిని ప్రశంసించెను, ఆ తరువాత ఇరువదియేడవ శ్లోకమువరకు ఆతత్త్వమును అనేకవిధములుగా వర్ణించి, దానిని తెలిసికొనకుండుటకుకారణము గూడ బాగుగా తెలిపి, చివరకు బ్రహ్మ-అధ్యాత్మ-కర్మ-అధిభూత-అధిదైవ-అధియజ్ఞ సహితుడైన భగవంతుని సమగ్ర రూపమును తెలిసికొను భక్తుని మహిమను వర్ణించుచు ఆయధ్యాయము పరిసమాప్తిచేసెను. కాని యిరువదితొమ్మిదవ శ్లోకములో ముప్పదవ శ్లోకములోను వర్ణింపబడిన 'బ్రహ్మ-అధ్యాత్మ-కర్మ-అధిభూత అధిదైవ-అధియజ్ఞములారున్ను, ప్రయాణకాలమునందు భగవంతుని తెలిసికొను విషయముయొక్క రహస్యము పూర్తిగా తెలిసికొనకపోవుటకు కారణమున్ను, ఈ యెనిమిదవ అధ్యాయము ప్రారంభములో మొదటి రెండు శ్లోకములలో అర్జునుడు పైన చెప్పబడిన యేడు విషయములనుగూడ గెలిసికొనగోరుచు భగవంతుని అర్జునుడు ఏడు ప్రశ్నలడుగు చున్నాడు.

అర్జున ఉవాచ :-

"కిం తద్ బ్రహ్మ కిమధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ ।
అధిభూతం చ కిం ప్రోక్తమధిదైవం కిముచ్యతే॥ 1

అర్జునుడిట్లు చెప్పెను-

పురుషోత్తమా ఆ బ్రహ్మమనగానేమి? అధ్యాత్మము ఏది? కర్మ ఏది? అధిభూతమను పేరులోనేది చెప్పబడెను? అధిదైవమని దేనిని చెప్పెదరు?

"అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మిన్ మధుసూదన ।
ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాఽత్మభిః॥ 2

మధుసూదనా! యిక్కడ అధియజ్ఞమేది ? అదియీశరీరమునందు ఎట్లు ఉన్నది? యుక్తమైన మనస్సుగల పురుషునకు అంతకాలమునందు నీవు ఏవిధముగ తెలియబడుదువు?

భగవానువాచ :–

"అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మముచ్యతే ।
భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః॥ 3

భగవంతుడిట్లనెను–

"అర్జునా! పరమమైన అక్షరమే 'బ్రహ్మ[1], తనస్వరూపము- అనగా జీవాత్మయే 'అధ్యాత్మ[2] నామముచేత చెప్పబడుచున్నది. భూతముల భావమును

---

1. 'అక్షర' శబ్దమునకు 'పరమం' అను విశేషణముచేర్చి భగవంతుడు 'గీత యేడవ అధ్యాయము ఇరువది తొమ్మిదవ శ్లోకములో ప్రయుక్తమైన బ్రహ్మ శబ్దమునకు నిర్గుణ నిరాకార–సచ్చిదానందఘన–పరమాత్మయని యర్థము. కాని, ఆ బహ్మశబ్దమునకు 'వేదము- ప్రకృతి' యీ మొదలైన అర్థములుకావు'అని తెలిపెను.

2. స్వో భావః స్వభావః అను వ్యుత్పత్తిచేత తన భావము పేరే స్వభావ మనబడును. జీవరూపమైన భగవంతునిచేతన పరాప్రకృతి రూపమైన ఆత్మతత్త్వమే ఆత్మశబ్ద వాచ్యమైన శరీర-ఇంద్రియ-మనో-బుద్ధ్యాది రూపమైన అపరాప్రకృతికి అధిష్ఠాతయైనప్పుడు దానిని 'అధ్యాత్మము'అనె దరు. కనుకనే, గీత యేడవ అధ్యాయము ఇరువది తొమ్మిదవ శ్లోకములో భగవంతుడు 'కృత్స్న' అను విశేషణము చేర్చి ఏ యధ్యాత్మ శబ్దమును ప్రయోగించెనో, దాని యర్థము 'చేతన జీవసముదాయము'అని తెలియవలెను.

ఉత్పన్నముచేయు త్యాగమే[1] 'కర్మ' అను పేరుచేత చెప్పబడినది.

అధిభూతం క్షరో భావః[2] పురుషశ్చాధిదైవతమ్ ।
అధియజ్ఞోఽహమేవాత్ర దేహే దేహభృతాం వర॥ 4

అర్జునా! ఉత్పత్తి వినాశధర్మములుగల సమస్త పదార్థములు 'అదిభూతము' అనబడును. హిరణ్మయ పురుషుడు "అధిదైవము[3] అనబడును. ఈ శరీరమునందు నేను వాసుదేవుడను అంతర్యామిరూపముచేత 'అధియజ్ఞము' గా

---

1. 'భూత' శబ్దమునకు చరాచర ప్రాణులు అని యర్థము. ఈ భూతముల భావముయొక్క ఉత్పత్తి-అభ్యుదయము ఏ త్యాగముచేత అగునో యేది సృష్టి-స్థితులకు ఆధారమో, అట్టి త్యాగముపేరే 'కర్మ' యనబడును. మహా ప్రపంచమునందలి సమస్త ప్రాణులు, తమ తమ కర్మ సంస్కారములతోపాటు భగవంతునిలో విలీనములగును. మరల సృష్ట్యాదియందు భగవంతుడు'నేనొక్కడనే బహువిధములుగ నయ్యెదను'అని సంకల్పించినప్పుడు, మరల వాని యుత్పత్తియగును. భగవంతునియా'ఆదిసంకల్పమే' అచేతనప్రకృతి రూపయోనియందు, చేతనరూప బీజమునుస్థాపించుట యనబడును. ఇదియే మహాత్యాగము ఈత్యాగముపేరే 'విసర్గము' అనెదరు.

2. అపరాపకృతి-దాని పరిణామములనుండి ఉత్పన్నమైన యే వినాశ శీలము గల తత్త్వముగలదో, ఏది ప్రతిక్షణము క్షయము చెందుచుండునో దాని పేరు 'క్షరభావము'అని యనబడును. ఇదియే గీత పదమూడవ అధ్యాయములో 'క్షేత్రము' (శరీరము) అను పేరుతో, పదునైదవ అధ్యాయమునందు 'క్షర'శబ్దము పురుషుని పేరుతో చెప్పబడును.

3. 'పురుష' శబ్దమునకు ఇక్కడ 'ప్రథమపురుషుడు' అని యర్థము. దీనినే 'సూత్రాత్మ హిరణ్యగర్భ ప్రజాపతిలేక బ్రహ్మ'యని చెప్పెదరు. ఇదియే జడచేతనోభయరూపములోగల సమస్త ప్రపంచమునకు 'ప్రాణపురుషుడు' అగును. సమస్త దేవతలు దీనియంగములే. ఇదియేఅన్నిటికిని అధిష్ఠాత-అధిపతి ఉత్పాదకముగానునున్నది. ఇందుచేతనే దీని పేరు 'అధిదైవము' అనబడును.

నాన్నాను.[1]

> "అంతకాలే చ మామేవ స్మరన్ ముక్త్వా కళేబరం ।
> యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః"॥ 5

"అర్జునా! యేపురుషుడు అంతకాలమునందుగూడ నన్నే స్మరించుచు శరీరము త్యాగముచేయునో, అతడు సాక్షాత్తుగా నాస్వరూపమునే పొందగలడు.[2] సందేహమే లేదు.[3]

సంబంధము—

భగవంతుని స్మరించుచు మరణించినవాడు భగవంతునే పొందగలడని

---

1. అర్జునుడు అధి యజ్ఞమేది? అది యా శరీరమునందెట్లున్నది? అని చేసిన రెండు ప్రశ్నలకు భగవంతుడు ఒకే ఉత్తరమిచ్చెను. భగవంతుడే అన్ని యజ్ఞములకు 'భోక్త'గా, ప్రభువుగాను నున్నాడు (గీత 5-29, 9-24) సమస్త ఫలములను ఆయనయే విధించుచున్నాడు. ఇందుచేత భగవంతుడు, ఈ శరీరములో అంతర్యామి రూపముచేత అందరిలో వ్యాపకుడై యున్నాడు; ఇందుచేత భగవంతుడు, 'ఈశరీరములో అంతర్యామి రూపములో అధి యజ్ఞముగా నేను స్వయముగానే యున్నాను' అని చెప్పెను.

2. ఇక్కడ అంతకాల మహత్త్వము విశేషమని ప్రకటింపబడెను. గనుక భగవంతుడు ఎవడు సర్వదా నాఅనన్య చింతనముచేయునో, అతనిని గూర్చి చెప్పవలసినదేమున్నది? ఎవడైతే, ఈ మనుష్య జన్మాంతమువరకు గూడ నన్ను చింతించుచు శరీరత్యాగముచేయునో, అతనికిగూడ నాప్రాప్తి కలుగును. ఇట్లుండగా, నన్నే సర్వదా అనన్యభావముతో చింతించు వాడు తప్పక నన్నే పొందునని విడిగా చెప్పవలసిన యవసరములేదని, ఇక్కడ తన యభిప్రాయము తెలిపెను.

3. అంతకాలమునందు భగవంతుని స్మరించు మనుష్యుడు, ఏదేశములోగాని, ఏకాలమునందుగాని మరణించినను, అతని పూర్వపుఆచరణ మెట్లున్నను, అతనికి భగవత్ప్రాప్తి నిస్సందేహముగా కలుగును. ఇందులో కొంచెము గూడ సందేహములేదు.

యిక్కడ చెప్పబడినది. దీనిపైన కేవలము భగవంతుని స్మరణముల విషయము లోనే యావిశేష నియమముగలదా? లేక, ఎవరి విషయములోనైనను కలదా? అను జిజ్ఞాసకలుగును. దీనికి ఉత్తరము భగవంతుడిట్లు చెప్పుచున్నాడు.

"యం యం వాఽపి స్మరన్ భావం త్యజత్యంతే[1] కళేబరమ్ ।
తం తమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః"॥ 6

"కుంతీపుత్రా! యీమనుష్యుడు ఏయేభావమునైతే[1] స్మరించుచు శరీర త్యాగము చేయునో ఆయాభావమునే పొందగలడు. ఎందుకనగా, అతడు సర్వదా ఆభావమును చింతించునుగదా.[2]

---

1. పరమేశ్వర-దేవ-మనుష్య-పశు-పక్షి-కీటక-శలభ-వృక్ష-భూమి-గృహాదు లగు జడ-చేతన వస్తువులన్నియు 'భావనములు' అనబడును. అంతకాల ములో వీనిలో దేనిని చింతించినను ఆభావమును స్మరించుటయగును. అంతకాలమునందు తరచుగా, తాను సర్వదా తలచుచున్న భావమే స్మర ణకు వచ్చును. పూర్వ సంస్కార-సంగ-వాతావరణ-ఆసక్తి-కామనా-భయ-అధ్యయ నాదుల ప్రభావముచేత మనుష్యుడు మాటిమాటికి చింతన చేయు భావముచేతనే భావితుడై, మరణించిన తరువాత, సూక్ష్మరూపము చేత అంతఃకరణమునందు అంకితమైన ఆభావముచేత ప్రభావితుడగుచు సమయము వచ్చినప్పుడా భావమును పూర్తిగా పొందును - ఛాయా చిత్రము (ఫోటో) తీసికొనునప్పుడే క్షణములో చిత్రము తీయబడునో ఆక్షణమునందు మనుష్యుడేవిధముగనుండునో, అట్లే అతని చిత్రము పడునుగదా! ఆ విధముగనే అంతకాలమునందు మనుష్యుడే భావమును చింతించునో, ఆ భావపు చిత్రమే అతని అంతఃకరణమునందు అంకిత మగును. ఆ తరువాత ఫోటోవలెనే, ఇతర సహాయక వస్తువుల సహకార ములో, ఆ భావముచేత భావితుడగుచు సకాలములో స్థూల వరూమును పొందగలడు.

2. ఇక్కడ అంతఃకరణమే 'కెమెరా'యొక్క 'ప్లేట్'అని, దానియందు పడ బోవు స్మరణ ప్రతిబింబము అని ఇతర సూక్ష్మ శరీరప్రాప్తియే ఫోటో తీయుటయనియు తెలిసికొనవలెను. కమక నే, చిత్రము తీయువాడెట్లు

తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ ।
మయ్యర్పిత మనోబుద్ధి ర్మామేవైష్యస్య సంశయమ్॥ 7

"కనుక, అర్జునా! నీవెల్లప్పుడు నాస్మరణము చేయుము. యుద్ధముగూడ చేయుము.[1] ఈ విధముగా నాయందు అర్పించబడిన మనస్సు, బుద్ధిగల

---

మనుష్యులను జాగ్రత్తగా నుండుమనిచెప్పునో, అతనిమాట పాటించక, ఇటునటుకదలినయెడల, ఎట్లు చిత్రము చెడిపోవునో, అట్లే, సమస్త ప్రాణుల చిత్రములను చిత్రించు భగవంతుడు, మనుష్యుని జాగ్రత్తపరిచి నీ ఫోటో తీయు సమయమాసన్నమైనది. ఆ చివరిక్షణ మెప్పుడువచ్చునో తెలియదు. కనుక నీవు జాగరూకుడవుకమ్ము లేని యెడల, నీచిత్రము చెడిపోవును అని చెప్పును. ఇక్కడ, నిరంతరము పరమాత్మ ధ్యానము చేయుటయే జాగ్రత్తగాసుండుట పరమాత్మనువిడిచి ఇతర వస్తువులను చింతించుటయే తన చిత్రమును చెడగొట్టుకొనుట.

1. ఎవరు భగవంతుని గుణప్రభావములను బాగుగా తెలిసికొను అనన్య ప్రేమగల భక్తుడో, ఎవరు సర్వప్రపంచము భగవంతుని చేతనే నిర్మింపబడినది అని వాస్తవముగానిది భగవంతుని అభిన్నరూపము అని, ఇది భగవంతుని క్రీడాస్థలము అనియు తలంచునో, అతనికి ప్రహ్లాదునకువలె, గోపికులకువలెను ప్రతియొక పరమాణువులోను భగవద్దర్శనము ప్రత్యక్షముగానగును. కనుకనే, అట్టివానికి భగవంతుని స్మరణతోపాటే, వేర్వేరుపనులు చేయుటగూడ మిక్కిలి సులభమగును. ఎవనికి ప్రాపంచిక విషయానుభవములందు వైరాగ్యముగలిగి, భగవంతునియందు ముఖ్య ప్రేమ గలిగినదో ఎవరు నిష్కామభావముచేత, కేవలము భగవదాజ్ఞగా తలచి, భగవంతునికొరకే, వర్ణధర్మముల ననుసరించి, కర్మలుచేయునో, వాడు ధన్యుడు. నటి ఎట్లైతే తన పాదముల దరువులను గుర్తించుకొనుచు, వెదురుగడపై నెక్కి వేర్వేరు ఆటలు ఆడునో, మోటారుబండి నడుపువాడు, తానుపట్టుకొనిన చక్రమునందు దృష్టియుంచి, ఇతరులతో మాట్లాడుచుగూడ, ఆపదలనుండి తప్పుకొనుటకు, మార్గమునుగూడ జాగ్రత్తతో చూచుచుండునో, ఆవిధముగానే, నిరంతరము భగవంతుని స్మరించు

వాడై[1] నీవు నన్నే పొందెదవు. ఇందులో సందేహములేదు.

"అభ్యాసయోగయుక్తేన[2] చేతసా నాన్యగామినా ।
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్ ॥ 8

"పార్థా! పరమేశ్వర ధ్యానము యొక్క అభ్యాసరూపమైన యోగము గలవాడై, రెండవవైపు చిత్తము పోనీయక నిరంతరము నన్నే చింతించుచున్న మనుష్యుడు, పరమ ప్రకాశరూపుడైన దివ్యపురుషుని-అనగా పరమేశ్వరునే పొందగలడను నియమము గలదు.[3]

---

చునే, భక్తుడు తన వర్ణాశ్రమాచారముల ననుసరించి అన్నిపనులు చాలా బాగుగా నాచరించుచుండగలడు.

1. బుద్ధితో, భగవంతుని 'గుణ-ప్రభావ-స్వరూప-రహస్య-తత్త్వ'ములను తెలిసికొని, పరమశ్రద్ధచేత, స్థిరనిశ్చయము చేసికొనుట, మనస్సుచేత, అనన్య శ్రద్ధా-ప్రేమ-పూర్వకముగా, భగవంతుని ప్రభావముల చింతనము నిరంతరము చేయుచుండుటయే, మనోబుద్ధులను భగవంతుని యందు సమర్పించుట యనబడును.

2. 'యమ-నియమ-ఆసన-ప్రాణాయామ-ప్రత్యాహార-ధారణా-ధ్యాన'ములన బడు అష్టాంగ యోగముల అభ్యాసము పేరే 'అభ్యాసయోగము' అనబడును. ఈ యభ్యాసముచేత, ఏచిత్తము పూర్తిగా వశము నందు ఉండి అభ్యాసమునందే లగ్నమైయుండునో, అట్టి చిత్తము 'అభ్యాస యోగ యుక్తము' అనబడును.

3. ఈ యధ్యాయమునందే నాలుగవ శ్లోకములో, 'అధియజ్ఞము'అని యిరువది రెండవ శ్లోకమునందు 'పరమపురుషుడు' అనియు ఏది చెప్పబడెనో, భగవంతుని ఆ 'సృష్టి-స్థితి-సంహార'ములు చేయు సగుణ-నిరాకార-సర్వవ్యాపి-అవ్యక్త జ్ఞానస్వరూపమే యిక్కడ 'దివ్య పరమపురుష'శబ్దముచేత చెప్పబడెను. దాని చింతనముచేయుచు-చేయుచు, దానిని యథార్థ రూపములో తెలిసికొని దానిలో తన్మయుడై తద్రూపుడగుటయే 'దానిని పొందు'ట యనబడునని తెలియవలెను.

కవిం పురాణమనుశాసితారమ్
అణోరణీయాంసమనుస్మరేద్యః
సర్వస్య ధాతారమచింత్యరూపం
ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్ 9

ప్రయాణకాలే మనసాఽచలేన
భక్త్యా యుక్తో యోగబలేన చైవ
భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్
స తం పరం పురుషముపైతి దివ్యమ్ 10

'అర్జునా! ఏ పురుషుడు సర్వజ్ఞుడు-అనాది-సర్వనియంత[1] సూక్ష్మము కంటె నతిసూక్ష్ముడు - సమస్త ప్రపంచస్థితి-పోషణకర్త-అచింత్యసరూపుడు-సూర్యునివలె నిత్యచేతన ప్రకాశరూపుడు-అవిద్య (అజ్ఞానమున)కు అత్యంతము అతీతుడు-శుద్ధ-సచ్చిదానందఘనుడునైన పరమేశ్వరుని స్మరణము చేయునో, అటువంటి భక్తియుక్త మనుష్యుడు అంతకాలములోగూడ యోగబలముచేత కనుబొమ్మల నడుమ ప్రాణమును స్థిరముగానిలిపి, స్థిర మనస్సుచేత స్మరణము చేయుచు దివ్యస్వరూపుడు-పరమపురుషుడునైన ఆ పరమాత్మనే పొందగలడు.

సంబంధము-

ఐదవ శ్లోకములో భగవంతుని చింతనచేయుచు - చేయుచు మరణించు సాధారణ మనుష్యునిగతినిగూర్చి సంగ్రహముగా వర్ణింపబడెను. తరువాత ఎనిమిదవ, తొమ్మిదవ, పదవ శ్లోకములలో భగవంతుని 'అధియజ్ఞము' అనబడు సగుణ-నిరాకార-దివ్య-అవ్యక్త-స్వరూప చింతనముచేయు యోగులయొక్క అంతకాలిక గతి విషయమై తెలుపబడెను. ఇప్పుడు పదకొండవ శ్లోకమునుండి పదమూడవ శ్లోకమువరకు పరమ-అక్షర-నిర్గుణ-నిరాకార పరబ్రహ్మను ఉపాసించు

---

1. పరమేశ్వరుడు అంతర్యామి రూపముచేత, సమస్త ప్రాణులను, వారి వారి శుభాశుభ కర్మలను అనుసరించి శాసనము చేయువాడు కాబట్టి, పరమేశ్వరుడు అందరికి 'నియంత' యనబడునని తెలియవలెను.

యోగులయొక్క అంతకాలిక గతినిగూర్చి వర్ణించుటకొరకు, మొదట ఆ అక్షర బ్రహ్మను ప్రశంసించి, దానినిగూర్చి తెలుపుచున్నాడు—

"యదక్షరం వేదవిదో వదంతి
విశంతి యద్యతయో వీతరాగాః
యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి
తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే. 11

"అర్జునా! వేదజ్ఞులైన విద్వాంసులు, ఏ సచ్చిదానంద ఘన రూప పరమ పదము 'అవినాశియని చెప్పెదరో[1] ప్రపంచము నందా సక్తి లేక ప్రయత్న శీలు రైన సన్యాసులు మహాత్ములు దేనిలో ప్రవేశించెదరో, దేనిని కోరు బ్రహ్మ చారులు బ్రహ్మచర్య వ్రతమును ఆచరించెదరో, ఆపరమపదమునుగూర్చి నేను నీకు సంగ్రహముగా చెప్పెదను.[2]

---

1. వేద విదుల - జ్ఞానులు - మహాత్ములునైన పురుషులు, ఇది 'అక్షరము- అనగా, ఇది యెట్టి పరిస్థితిలోను, ఎప్పుడును, ఏ రూపములోను క్షయము చెందనిదని యర్థముచెప్పిరి ఇది సర్వదా వినాశ రహితముగా, ఏకరస ముగా, ఏకరూపముగా నుండును. భగవద్గీత పన్నెండవ అధ్యాయము మూడవశ్లోకములో, ఏ అవ్యక్తముయొక్క, అక్షరము యొక్కయు ఉపాస ననుగూర్చి వర్ణింపబడెనో, యిక్కడగూడ దాని విషయమే వర్ణింపబడినది. ప్రసంగమిదియని తెలియవలెను. బ్రహ్మమునందు లేక, బ్రహ్మమార్గము నందు సంచారము చేయుటయే, బ్రహ్మచర్యముయొక్క వాస్తవమైన అర్థము.

2. ఏసాధనములచేత బ్రహ్మప్రాప్తి మార్గమునందు అగ్రగామియై పోగలుగు చుండునో దానిని ఆచరించుటగూడ బ్రహ్మచర్యమనబడును ఆసాధనమే బ్రహ్మచారి వ్రతమనబడును. అన్ని విధముల వీర్యమును రక్షించుకొనుట గూడ బ్రహ్మచర్య వ్రతములలో నొకటి. ఈ బ్రహ్మచర్యాశ్రమము ఆశ్రమ ధర్మరూపములో అవశ్యముగా పాలింపదగినది. సాధారణముగా నైతే, వయోభేదము ననుసరించి అందరు సాధకులు యథాశక్తిగా ఆ బ్రహ్మ చర్య పాలనము తప్పక చేయవలెను.

"సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ
మూర్ధ్న్యాధాయాఽఽత్మనః ప్రాణమాస్థితో యోగధారణాం" 12

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్[1] మామనుస్మరన్
యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిమ్ 13

"అర్జునా! అన్ని యింద్రియముల ద్వారములను మూసి[2], మనస్సును హృదయ దేశమునందు నిరోధించియుంచి, తరువాత, జయింపబడిన మనస్సు చేత ప్రాణమును మస్తకమునందు స్థాపించి, పరమాత్మకు సంబంధించిన యోగ ధారణము నందు స్థిరముగా నిలిచియుండి, యే మనుష్యుడు 'ఓం'అను ఈ యేకాక్షర రూపమైన బ్రహ్మమును ఉచ్చరించుచు, ఆ బ్రహ్మమునకు అర్థస్వరూపుడైన నిర్గుణ పరబ్రహ్మమగు నన్ను చింతించుచు శరీర త్యాగముచేయునో, అట్టి పురు

---

ఇక్కడ భగవంతుడు, "పైన చెప్పబడిన వాక్యములందు నిర్దేశింపబడిన పరబ్రహ్మ-పరమాత్మ యనబడు బ్రహ్మమనగనేది? అంత్యకాలములో ఎట్టి సాధనముచేయు మనుష్యుడు ఆబ్రహ్మమును పొందగలడు? అను నీవిషయమిప్పుడు నీకు నేను సంక్షేపముగా చెప్పెదను అను ప్రతిజ్ఞ చేసెను.

1. ఇక్కడ జ్ఞానముయొక్క అంతకాల సందర్భము కాబట్టి 'మాం'అను పదమునకు, సచ్చిదానంద ఘన-నిర్గుణ-నిరాకార బ్రహ్మమని యర్థము.

2. శ్రోత్రాది పంచజ్ఞానేంద్రియములు - పాదాది పంచకర్మేంద్రియములు ఈ పది యింద్రియములచేత, ప్రాపంచిక విషయములు గ్రహింపబడును. కనుక ఈ దశేంద్రియములు ద్వారములనబడును. ఇవియేకాక, యివి యుండు స్థానములు (గోళములుగూడ) ద్వారములే యనబడును. ఈ యింద్రియములను బాహ్యవిషయములనుండి తొలగించి - అనగా చూచుట, వినుట మొదలగు సమస్త క్రియాలనుఆపి, దానిలోపాటే యింద్రియ గోళములనుగూడ మూసియింద్రియ వృత్తులను అంతర్ముఖము

షుడు పరమగతిని నొందగలడు.[1]

"అనన్యచేతాః[2] సతతం యో మాం[3] స్మరతి నిత్యశః
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః" 14

---

గలవిగా చేసికొనుటయే, అన్ని ద్వారముల సంయమము అనబడును. ఇదియే యోగశాస్త్రమునందు 'ప్రత్యాహారము అనబడును.

హృదయ కమలమనబడు నాభి-కంఠముల మధ్యప్రదేశము, ఏదికలదో, ఏది మనస్సునకు ప్రాణములకు నివాసస్థానమని అంగీకరింపబడినదో, అదిహృద్దేశమనబడును. ఇటునటు అపమార్గమునందు చెదరిపోవుమనస్సునకు, సంకల్ప వికల్పములు లేకుండజేసి దానిని హృదయమునందు నిరోధించి యుంచుటయే 'దీనిని హృద్దేశమునందు స్థిరపరచుట' యనబడునని తెలియవలెను.

1. 'నిర్గుణ-నిరాకార బ్రహ్మమును అభేద భావముతో పొందుట 'పరమగతిని పొందుట' యనబడును. దీనినే 'అగమనాగమనములనుండి విముక్తుడగుట-ముక్తిలభింప జేసికొనుట - మోక్షమును పొందు'ట లేక నిర్వాణ బ్రహ్మమును పొందుట'యని చెప్పెదరు.

2. ఎవని మనస్సు ఇతర వస్తువు దేనియందుగూడ లగ్నముగాకుండ, నిరంతరము అనన్య ప్రేమచేత కేవలము పరమప్రేమా స్పదుడైన పరమేశ్వరునియందే లగ్నమైయుండునో, అట్టి మనస్సుగలవానిని 'అనన్యచేతాః' అనియనెదరు.

3. ఇక్కడ 'మాం'అను పదమునకు 'సగుణుడు-సాకారుడు-పురుషోత్తముడు-భగవంతుడునైన శ్రీకృష్ణుడు అని యర్థము. కాని యెవరైతే శ్రీవిష్ణువుని లేక శ్రీరామునికాని లేక భగవంతుని యితర రూపములుగాని తమ యిష్టదైవములుగా అంగీకరించెదరో, వారికి, అరూపములుగూడ 'మాం' అను పదమునకు అర్థములు కాగలవు. పరమ శ్రద్ధా-ప్రేమలతో నిరంతరము భగవత్స్వరూప చింతనముగాని, లేక, భగవంతుని 'నామ - గుణ-

"అర్జునా యే పురుషుడు నాయందు అనన్య చిత్తము గలవాడై సర్వదా, నిరంతరము పురుషోత్తముడైన నా స్మరణము చేయునో, నిత్య నిరంతరుడైన నాయందు లగ్నముచేసిన మనస్సుగల ఆ యోగికి నేను సులభుడనయ్యెదను.. అనగా, అతడు సహజముగానే నన్ను పొందగలడు.[1]

మాముపేత్య పునర్జన్మ దుఃఖాఽలయమశాశ్వతమ్ ।
నాప్నువంతి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః॥ 15

అర్జునా ! పరమసిద్ధిని పొందిన మహాత్ములు[2] నన్ను పొంది, దుఃఖములకు ఆలయము ఇట్లు క్షణభంగురమునైన పునర్జన్మను పొందరు.

---

ప్రభావ-లీలా-విలాసాదుల చింతనముగాని చేయుచుండుటయే 'ఆయన స్మరణము చేయుట' యనబడును.

1. అనన్య భావముచేత భగవంతుని చింతనము చేయు ప్రేమగల భక్తుడు, భగవంతుని వియోగమును సహింపజాలనప్పుడు, 'యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహమ్, (గీత 4-11) అనుమాట ప్రకారము, భగవంతునకు గూడ ఆ భక్తుని వియోగము సహింపరానిదేయగును. ఎప్పుడైతే, భగవంతుడు స్వయముగానే భక్తునితో కలిసికొనుటకు ఇచ్ఛయించునో, అప్పుడిక భగవంతుని సాంగత్యమునకు కఠినత్వమేయుండదు గదా ! ఈ కారణముచేతనే, ఇటువంటి భక్తునకు భగవంతుడు సులభుడని అనగా, సుఖముగా లభించువాడని తెలుపబడెనని భావింపవలెను.

2. అత్యంత శ్రద్ధా-ప్రేమలతో నిత్యము నిరంతరము భజనసాధనము ధ్యాన సాధనము చేయుచు ఎప్పుడైతే ఏ సాధనముయొక్క పరాకాష్ఠ చెందిన తర్వాత మరల ఏ కొంచెము సాధనముగూడ చేయవలసిన యవసరము ఉండదో, సాధకునకు తక్షణమే భగవంతుని సాక్షాత్కారము కలుగునో, అటువంటి పరాకాష్ఠా స్థితిని 'పరమసిద్ధి' యనెదరు. ఈ పరమసిద్ధిని పొందిన మహాజ్ఞాన సంపన్నుడైన భగవద్భక్తుడు 'మహాత్ముడు' అని చెప్పబడినాడు.

మరణించిన తరువాత కర్మవశుడై, దేవ-మనుష్య-పశు-పక్ష్యాది యోను

సంబంధము :

'భగవంతుని పొందిన మహాత్ములైన పురుషులకు పునర్జన్మ కలుగదు' అని చెప్పుటచేత, ఇతర జీవులకు తిరిగి రావలసియుండును. అను విషయము తెలిసికొనుటకు ఇచ్ఛ కలుగును. కాబట్టి, దీనిపైన భగవంతుడిట్లనుచున్నాడు-

ఆ బ్రహ్మభువ నాల్లోకాః పునరావర్తినోఽర్జున।
మాముపేత్య తు కౌంతేయ పునర్జన్మ న విద్యతే ॥ 16

అర్జునా! బ్రహ్మలోక పర్యంతము[1] అన్నిలోకములు పునరావర్తులే (తిరిగి రావలసినవే) యగును.[2] కాని, నన్నుపొందిన వానికి పునర్జన్మ కలుగదు. ఎందుకనగా, నేను కాలాతీతుడను. ఈ బ్రహ్మదిలోకములన్నియు, కాలముచేత నిర్మింపబడినవి. గనుక, అవి అనిత్యములని తెలిసికొనుము.

---

లలో పుట్టుటయే 'పునర్జన్మ' యనబడును. దుఃఖ పరిపూర్ణము కానిది, అనిత్యము కానిదియునగు యోని యేదియు లేదు. కనుక పునర్జన్మలో గర్భములో ప్రవేశించినప్పటినుండి మృత్యుపర్యంతము గూడ దుఃఖమే. దుఃఖము కలుగుటచేత పునర్జన్మ 'దుఃఖాలయము' (దుఃఖముల యిల్లు) అని చెప్పబడినది. ఏ యోనిగాని, లేక ఆ యోనియందు అనుభవింపబడు సుఖభోగముల సంయోగము గాని సర్వదా ఉండునదికాదు కాబట్టి అది అశాశ్వతము (క్షణభంగురము) అని చెప్పబడినది.

1. ఏ చతుర్ముఖ బ్రహ్మమైతే, సృష్ట్యాదిలో భగవంతుని నాభి కమలము నుండి ఉత్పన్నుడై సమస్త ప్రపంచ సృష్టిచేయునో, ఎవనికి ప్రజాపతి-హిరణ్యగర్భ సూత్రాత్మ నామములు గలవో, ఎవరు ఈ యధ్యాయము నందే అధిదైవము అని చెప్పబడెనో (గీత-8-4) ఆ చతుర్ముఖ బ్రహ్మ ఏ ఊర్ధ్వలోకము నందు నివాసము సేయునో, ఆ లోకము పేరు 'బ్రహ్మ లోకము' అనబడును. ఈ బ్రహ్మలోకము దాని క్రింది లోకములన్నియు పునరావర్తి (పునర్జన్మ గలవి) లోకములని తెలియవలెను.

2. మాటిమాటికి వశించుచు (పుట్టుచునుండు) స్వభావముగల లోకములు పునరావర్తులు అనబడును.

సహస్రయుగ పర్యంతమహర్యద్ బ్రహ్మణో విదుః ।
రాత్రిం యుగసహస్రాంతాం తేఽహోరాత్రవిదో జనాః ॥ 17

అర్జునా! బ్రహ్మయొక్క ఒకదినము (పగలు) ఒక వేయి మహాయుగములు (నాలుగువేల యుగములు) కాలావధిగలది. ఇంత సంఖ్యగల కాలమే బ్రహ్మకు ఒకరాత్రియగును. ఈ విషయమును ఏ పురుషులు తాత్వికముగా తెలిసికొనెదరో[1], ఆ యోగులు, కాలతత్త్వము నెరిగినవారు.

---

1. ఇక్కడ 'యుగ' శబ్దము 'దివ్యయుగము' అని తెలియవలెను. కృత-త్రేతా-ద్వాపర-కలి యుగములు నాలుగు కలిసి ఒక దివ్యయుగమగును. ఇది దేవతల యుగము కనుక దీనికి దివ్యయుగము అనిపేరు. ఈ దేవతా యుగ సమయము మన సమయ పరిమాణము కంటే మూడునూర్ల అరువదిరెట్లు అధికమని తెలియవలెను. అనగా మన ఒక సంవత్సరము దేవతలకు ఒకదినము (రాత్రింబగళ్ళు). మన ముప్పదియేండ్లు దేవతలకు ఒక నెల, మన మూడునూర్ల అరువదియేండ్లు దేవతలకు ఒక దివ్యసంవత్సరము అగును. ఇటువంటి పన్నెండువేల దివ్యసంవత్సరములు దేవతలకు ఒక దివ్య యుగము అగును. దీనిని 'మహాయుగము అని చతుర్యుగి' అనియు ననెదరు. ఈ సంఖ్యలను కూడగా మనకు నలువదిమూడు లక్షల ఇరువది వేలు (43,20,000) సంవత్సరములగును. ఇటువంటి దివ్య సంవత్సరముల లెక్కలో పన్నెండునూర్ల (1200) దివ్యసంవత్సరములు మన కలి యుగము ఇరువదినాలుగు నూర్ల (2,400) దివ్యవర్షముల కాలము మన కొక ద్వాపరయుగము ముప్పదియారునూర్ల (3600) దివ్యవర్షముల కాలము మనకొక త్రేతాయుగము, నలువది యెనిమిది నూర్ల (4800) దివ్యవర్షములు మనకొక కృత (సత్య) యుగమునగును. అన్ని కలిసి వెరసి 12000 దివ్యవర్షములగును. ఇదియే మరియొక విధముగా గూ తెలిసికొనవచ్చును.

కలియుగము 4,32.000 సంవత్సరములు

ద్వాపరయుగము 8,64,000 సంవత్సరములు (కలియుగము కన్న రెండు రెట్లు అధికము)

అవ్యక్తాద్ వ్యక్తయః సర్వాః ప్రభవంత్యహరాగమే ।
రాత్ర్యాగమే ప్రతీయంతే తత్రైవావ్యక్తసంజ్ఞకే ॥ 18

అర్జునా! సమస్త చరాచర భూతములు బ్రహ్మయొక్క దినము (పగలు)

---

| | | | |
|---|---|---|---|
| త్రేతాయుగము | 12,96,000 | సంవత్సరములు | (కలియుగము కన్నా మూడురెట్లు అధికము |
| కృత (సత్య) యుగము | 17,28,000 | సంవత్సరములు | (కలియుగము కన్నా నాలుగురెట్లు అధికము |
| మెరసి | 43,20,000 | సంవత్సరములు | |

ఈ విధముగా నిది ఒక దివ్యయుగమైనది. ఈ దివ్యయుగములు అనగా నాలుగు అర్బుదముల ముప్పదిరెండుకోట్ల (4,32,00,00,000) సంవత్సరముల కాలము బ్రహ్మకు ఒక దినము (పగలు)గును. బ్రహ్మకు రాత్రి గూడ ఇన్నిసంవత్సరముల కాలమే. అనగా (8,64,00,00,000) సంవత్సరములు రాత్రింబగళ్ళు కలిసి యగును.

ఈ విషయము మనుస్మృతిలో, మొదటి అధ్యాయములో, అరువది నాలుగవ శ్లోకమునుండి డెబ్బదిమూడవ (73) శ్లోకమువరకు విశదముగా వర్ణింపబడినది. బ్రహ్మయొక్క దినము (పగలు)నకు 'కల్పము' లేక 'సర్గము' అని రాత్రికి 'ప్రళయము' అని యనెదరు. ఇటువంటి రాత్రింబగళ్ళు ముప్పదియైనచో బ్రహ్మకు ఒక మాసమగును. ఇట్టి పన్నెండు నెలలు ఆయనకు ఒక సంవత్సరము అగును. ఇటువంటివి నూరు దివ్య వర్షముల కాలము బ్రహ్మకు 'పూర్ణాయుస్సు' అగును. బ్రహ్మయొక్క రాత్రింబగళ్ళ కాలము తెలిపి భగవంతుడు ఈ విధముగా బ్రహ్మదేవుని జీవితము- ఆయన లోకముగూడ ఒక కాలపరిమితిలో సీమితమైయున్నది కాబట్టి, ఆయనగూడ అనిత్యుడేయని, ఆయనయే అనిత్యుడైనప్పుడు, ఆ బ్రహ్మలోకముకన్నను క్రిందిలోకములు- వానిలో నివసించు ప్రాణుల శరీరములు అనిత్యములని వేరుగా చెప్పవలసిన యవసరమేమున్నది? అనియు సర్వదా అనిత్యములేయగునని తాత్పర్యము.

ప్రవేశించినప్పుడు అవ్యక్తమునుండి– అనగా, బ్రహ్మయొక్క సూక్ష్మశరీరము నుండి ఉత్పన్నములగును.[1] బ్రహ్మరాత్రియందు ప్రవేశించినప్పుడు, ఆ అవ్యక్తమను పేరుగల బ్రహ్మయొక్క సూక్ష్మశరీరము నందు విలీనములైపోవును.[2]

భూతగ్రామః స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే ।
రాత్ర్యాగమేఽవశః పార్థ ప్రభవత్యహరాగమే ॥ 19

---

1. దేవ–మనుష్య–పితృ–పశు–పక్ష్యాది యోనులందు దేహధారులై వ్యక్తరూపములో నున్న చరాచర జంతువులన్నియు 'వ్యక్తి' యను పేరుతో వ్యవహరింపబడును.

ప్రకృతియొక్క ఏ సూక్ష్మ పరిణామమున్నదో, దేనిని బ్రహ్మయొక్క సూక్ష్మశరీరమని కూడననెదరో, స్థూలములైన పంచభూతములుదీనినుండి ఉత్పన్నములగుటచేత, ఏ పూర్వ స్థితియున్నదో, సూక్ష్మమైన 'అపరా ప్రకృతి' పేరు. ఇక్కడ 'అవ్యక్తము' అనబడును.

బ్రహ్మయొక్క దినము (పగలు) వచ్చినప్పుడు– అనగా, బ్రహ్మ, తన సుషుప్తి యవస్థనుండి, జాగ్రదవస్థను స్వీకరించినప్పుడు ఆ సూక్ష్మ ప్రకృతియందు వికారము ఉత్పన్నమగును. అప్పుడది స్థూలరూపములో పరిణతమగును. అట్లు పరిణమించిన ప్రకృతితోపాటు, సమస్త ప్రాణులు తమ తమ కర్మానుసారముగా వేర్వేరు రూపములతో సంబంధించి కలిసిపోవును. ఇదియే అవ్యక్తమునుండి వ్యక్తులు ఉత్పన్నములగుట యనబడును.

2. ఒకవేయి దివ్యసంవత్సరములు గడచిన తరువాత, ఏక్షణమునందు బ్రహ్మ జాగ్రదవస్థను విడిచి, సుషుప్తి యవస్థను స్వీకరించునో, ఆ ప్రథమ క్షణముయొక్క పేరు బ్రహ్మరాత్రి ప్రవేశకాలమనబడును.

ఆ సమయమునందు, స్థూలరూపములో పరిణమించియుండిన ప్రకృతి సూక్ష్మావస్థను పొందును. దేహధారులైన సర్వప్రాణులు, వేర్వేరు స్థూల శరీరములు లేకుండపోయి ప్రకృతియొక్క సూక్ష్మావస్థలో చేరియుండిపోవును. ఇదియే ఆ అవ్యక్తమునందు సమస్తవ్యక్తులు లయము చెందుట యనబడును.

పార్థా ! ఆ భూతములే పుట్టుచు, పుట్టుచు, ప్రకృతికి వశములై రాత్రి ప్రవేశించినప్పుడు విలీనములగును. మరల పగలు రాగానే పుట్టుచుండును.[1]

---

1. అవ్యక్తమునందు లీనమగుటచేత భూతప్రాణులకు విముక్తి కలుగదు. వేరుగానున్న ఆ ప్రాణుల అస్తిత్వము (సత్త) తొలగిపోవదు. ఈ కారణము చేతనే, బ్రహ్మయొక్క రాత్రిసమయము సమాప్తము కాగానే సమస్తప్రాణులు మరల తమ తమ గుణ కర్మానుసారముగా తమకు యోగ్యమైన స్థూలశరీరములను పొంది ప్రకటితములగును.

ఈ విధముగా, ఈ భూతప్రాణుల సముదాయము అనాదికాలమునుండి పుట్టుచు లయము చెందుచున్నవి. నూరువర్షముల బ్రహ్మయువు పరిపూర్ణమైన తరువాత, ఎప్పుడైతే బ్రహ్మశరీరము గూడ మూల ప్రకృతిలో లీనమైపోవునో, దానితోపాటే సమస్త భూత సముదాయముగూడ, ఆ మూల ప్రకృతిలో లీనమైపోవును. (గీత 9-7), అప్పుడుగూడ ఈ జనన మరణ చక్రము అంతము చెందదు. ఇది ఆ తరువాతగూడ, ఆ విధముగనే, మరల, మరల ఉత్పన్నమగుచుండును. (గీత 9-8) ఎంతవరకైతే, ప్రాణికి పరమాత్మ ప్రాప్తి కలుగనో అంతవరకు ఆ ప్రాణి మాటిమాటికి ఈ విధముగనే పుట్టుచు, మూలప్రకృతిలో విలీనమైపోవుచుండును.

ఇక్కడ బ్రహ్మ రాత్రింబగళ్ళ ప్రసక్తి వచ్చినందుచేత 'బ్రహ్మదేవుడే సమస్త ప్రాణులను, వారి గుణకర్మానుసారముగా ఆయాశరీరములతో వారి సంబంధము కలిగించి, మాటిమాటికి వారిని పుట్టించుచున్నాడు. మహాప్రళయము తరువాత, బ్రహ్మయొక్క ఉత్పత్తి జరుగనప్పుడు, భగవంతుడు స్వయముగానే సృష్టి రచన చేయును. కాని బ్రహ్మపుట్టిన తరువాత, ప్రపంచ సృష్టి రచనమంతయు బ్రహ్మదేవుడే చేయును.

భగవద్గీత తొమ్మిదవ అధ్యాయము (శ్లోకములు 7-10 వరకు) పదునాల్గవ అధ్యాయములో శ్లోకములు-3,4)లో సృష్టి రచన ప్రసక్తి యున్నది. అది మహాప్రళయము (ప్రళయము) తరువాత బ్రహ్మయొక్క దినము సృష్టి)నకు అరంభ సమయము అని తెలియవలెను.

సంబంధము :

బ్రహ్మయొక్క రాత్రియారంభము నందు ఏ అవ్యక్తమునందు సర్వ భూతములు విలీనములై, పగటి యారంభము కాగనే ఏ అవ్యక్తము నుండి పుట్టునో, ఆ అవ్యక్తమే అన్నిటికన్న శ్రేష్ఠమైనదా! లేక, దానిని మించి వేరే దైన శ్రేష్ఠమైనది ఉన్నదా? అను ప్రశ్నమునకు భగవంతుడిట్లు బదులు చెప్పు చున్నాడు :-

పరస్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్ సనాతనః।
యః స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి ॥ 20

"అర్జునా! ఆ అవ్యక్తముకంటె గూడ పైన మరియొకటి విలక్షణమైన అవ్యక్తభావముగలదు. అది పరమ-దివ్య పురుషభావము-అన్ని భూతములు నశిం చిన తరువాతగూడ అది నశించదు.[1]

సంబంధము-

ఎనిమిదవ-పదవ శ్లోకములందు, అధి యజ్ఞోపాసనకు ఫలము . పరమ

---

1. పదునెనిమిదవ శ్లోకములో. ఏ 'అవ్యక్తము'నందు సమస్త భూత ప్రాణుల లయమగుట తెలుపబడెనో, అదియేయిక్కడ 'అవ్యక్తాత్'అను పదమునకు అర్థము. పూర్వోక్తమైన 'అవ్యక్తము' కంటే యా 'అవ్యక్తము' పరము, 'అనన్యము' అని తెలిపి, దానికన్న ఇది మిక్కిలి శ్రేష్ఠము-విలక్షణమైన దని నిరూపింపబడినది. ఇందలి యభిప్రాయ మేమనగా, ఆ రెండింటి స్వరూపములు 'అవ్యక్త'మైనను, ఆ రెండు ఏకజాతి వస్తువులుకావు అని ఆ మొదటి 'అవ్యక్తము' 'జడము, నాశవంతము, జ్ఞేయము' (తెలిసికొన దగినది) నైనది. కాని రెండవ 'అవ్యక్తము' చేతనము, అవినాశి-జ్ఞాత యగును. ఈ అవ్యక్తము ఆ అవ్యక్తమునకు ప్రభువు-నడపునది-అధిష్ఠాత యునగును. కనుకనే, యిది, దానికంటే మిక్కిలి శ్రేష్ఠము-విలక్షణము నైనది. ఈ అవ్యక్తము అనాది-అనంతము నగుటచేత దీనిని 'సనాతనము' అని యనెదరు. కనుక, తక్కినవన్నియు నష్టమైనను ఇది మాత్రము నశించదు.

దివ్య పురుష ప్రాప్తియని, పదమూడవ శ్లోకములో పరమాక్షర-నిర్గుణ ప్రకృతి యొక్క ఉపాసనకు ఫలము పరమగతి ప్రాప్తియని, పదునాలుగవ శ్లోకములో సగుణ-సాకార-భగవంతుడైన శ్రీకృష్ణుని ఉపాసనకు ఫలము భగవత్ప్రాప్తియనియు తెలుపబడెను. ఇట్లు చెప్పుటచేత ఈ మూడింటిలో ఏవిధమైన బేధభ్రాంతి కలుగ కూడదను నుద్దేశములో ఇప్పుడు భగవంతుడు, ఆ మూడింటి యేకత్వమును ప్రతిపాదించుచు, అవి పొందిన తరువాత పునర్జన్మము ఉండబోదని తెలుపుచున్నాడు.

"అవ్యక్తోఽక్షర ఇత్యుక్తస్తమాహుః పరమాం గతిమ్
యం ప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ" 21

"అర్జునా! యే అవ్యక్తము అక్షరము[1] అను పేరుతో చెప్పబడెనో, ఆ అక్షర నామముగల అవ్యక్త భావమును పరమగతి[2] అని చెప్పెదరు. ఏ సనాతన అవ్యక్తభావమును పొంది మనుష్యుడు తిరిగి రాడో-పునర్జన్మ ఉండదో, అది నా పరమధామము.[3]

---

1. పదునెనిమిదవ శ్లోకములో 'సనాతన అవ్యక్తభావ' నామములో, ఎనిమిదవ-పదవ శ్లోకములో 'పరమదివ్యపురుష' నామముతోను చెప్పబడిన, 'అధియజ్ఞ' పురుషుడు ఇక్కడ 'అవ్యక్త' 'అక్షర' నామములలో చెప్పబడెను.

2. ఏముక్తియైతే, సర్వశ్రేష్ఠమైన పొందదగినవస్తువో, దేనిని పొందిన తరువాత, మరి యొకటి యేదియు పొందవలసినది మిగిలియుండవో, దాని పేరు 'పరమగతి' యనెదరు. ఇందుచేత, 'ఏనిర్గుణ - నిరాకార పరమాత్మను పరమ అక్షరము' 'బ్రహ్మము' అని చెప్పదరో, ఆ సచ్చిదానంద ఘనబ్రహ్మ 'పరమగతి' యనబడెను. (గీత 8-13)

3. అభిప్రాయ మేమనగా, భగవంతుని శాశ్వతధామమును, భగవద్భావమును, భగవంతుని స్వరూపమును పొందుటలో ఏలాటి వాస్తవిక బేదము లేదు. ఇట్లే అవ్యక్త అక్షర ప్రాప్తిలో, పరమగతి ప్రాప్తిలో, భగవంతుని పొందుటలోగూడ వాస్తవముగా భేదములేదు. సాధన భేదముచేత సాధకుల దృష్టిలో ఫల భేదముఉన్నది. ఈకారణముచేతనే, దాని వర్ణనము

"పురుషః స పరః పార్థ భక్త్యా లభ్యస్త్వనన్యయా
యస్యాంతఃస్థాని భూతాని యేన సర్వమిదం తతమ్" 22

"పార్థా! ఏ పరమాత్మునిలోపల సర్వభూతములున్నవో, ఏ సచ్చిదానంద ఘన పరమాత్మునిచేత ఈ సర్వప్రపంచము పరిపూర్ణమై యున్నదో[1], ఆ సనాతన-అవ్యక్త-పరమ పురుషుడు-అనన్యభక్తిచేతనే పొందబడుటకు యోగ్యుడు.[2]

---

వేర్వేరు నామములతో చేయబడెను. యథార్థముగా, వస్తుగతమైన భేద మేమియు లేనందుచేత ఇక్కడ ఆయన్నింటికిన్ని ఏకత్వము చూపబడెను.

1. ఎట్లైతే 'వాయువు - తేజస్సు (అగ్ని) జలము-భూమి' ఈ నాలుగు భూతములు ఆకాశములో అంతర్గతములో, ఆకాశమే ఆ భూతములకు ఏకమాత్ర కారణమైన-ఆధారమో, ఆవిధముగనే, సమస్త చరాచర ప్రాణులు-అనగా, సమస్త ప్రపంచము పరమేశ్వరునిలోనే అంతర్గతములైయున్నవి. అవి పరమేశ్వరుని నుండియే ఉత్పన్నములైనవి. పరమేశ్వరుని ఆధారముపైననే నిలిచియున్నవి. ఎట్లైతే, 'వాయు-అగ్ని (తేజస్సు)-జల-భూములన్నిటి యందు ఆకాశము - వ్యాపించియున్నదో, ఆవిధముగానే, యీ సమస్త ప్రపంచము అవ్యక్తుడైన పరమేశ్వరునిచేత వ్యాపింపబడియున్నది. ఈ విషయమే భగవద్గీతలో తొమ్మిదవ అధ్యాయమునందలి నాలుగవ-ఐదవ-ఆరవ శ్లోకములలో విస్తార పూర్వకముగా తెలుపబడినది.

2. సర్వాధారుడు-సర్వాంతర్యామి-సర్వశక్తి సంపన్నుడు-పరమ పురుషుడునైన పరమేశ్వరునకే సమస్తము సమర్పించి, ఆయన విధానములో సర్వదా పరమ సంతుష్టుడై యుండుట, అన్నివిధముల, అనన్య ప్రేమ పూర్వకముగా,నిత్యము నిరంతరము ఆయన స్మరణముచేయుటయే.'అనన్య భక్తి' యనబడును. ఈ అనన్య భక్తిచేత సాధకుడు తన ఉపాస్య దేవతయైన పరమేశ్వరుని 'గుణ-స్వభావ-తత్త్వ'ములను బాగుగా తెలిసికొని, ఆయన యందు తన్మయుడైపోవును. శీఘ్రమే ఆ పరమేశ్వరుని సాక్షాత్కారము చేసికొని కృతకృత్యుడగును. ఇదియే 'సాధకుడు ఆ పరమేశ్వరుని పొందుట' యనబడును.

అర్జునా! ఏకాలమునందు[1] శరీరత్యాగముచేసిన యోగిజనులు[2], తిరిగి పున ర్జన్మమును పొందనిగతిని, ఏకాలములో పోయినవారు తిరిగి పునర్జన్మమును పొందుగతిని పొందెదరో, ఆకాలమును - అనగా, రెండు మార్గములనుగూర్చి చెప్పెదను.

---

1. ఇక్కడ 'కాల'శబ్దమునకు 'కాలాభిమానులైన వేర్వేరు దేవతలు తమతమ పరిమితివరకు అధికారము కలిగియుండు కాలము' అని యర్థము. ఎందు కనగా, ఈ యధ్యాయమునందలి ఇరువదియారవ శ్లోకమునందు 'శుక్ల - కృష్ణ' నామములుగల రెండు మార్గములు 'గతి' యను పేరుచేత, ఇరు వది యేడవ శ్లోకములో 'సృతి'యను పేరుచేతను చెప్పబడినవి. ఆరెండు శబ్దముల యర్థము 'మార్గము'అనియే-ఇదిగాక, 'అగ్నిః, జ్యోతిః ధూమః' అను పదములుగూడ కాలమును తెలుపునవికావు. కనుకనే, యిరువది నాలుగవ-ఇరువదియైదవ శ్లోకములందు చెప్పబడిన 'తత్ర'అను శబ్దమునకు అర్థము 'సమయమునందు' అని యంగీకరించుట ఉచితముగాదు. ఈ కారణముచేతనే యిక్కడ 'కాల'అను శబ్దమునకు అర్థము కాలాభిమాని దేవతలతో సంబంధముగల 'మార్గము' అని యంగీకరించుట మంచిది. ప్రపంచ జనులు, ఏదినమైతే, శుక్లపక్షము-ఉత్తరాయణములందు మరణిం చుట మంచిదని తలచెదరో, అట్లు తలచుటగూడ మంచిదేయగును. ఎందు కనగా, ఆసమయము ఆయా కాలాభిమాని దేవతలతో సంబంధము గలది యగును. కనుక ఆ సమయమునందు మరణించుయోగి, గంతవ్య (పోవల సిన) స్థానమువరకు, శీఘ్రముగాను, సులభముగాను పోవును. కాని, దీని చేత, రాత్రియందు, కృష్ణపక్షమునందు, దక్షిణాయనము ఆరు మాసము లందున్న మరణించువాడు అర్చి మార్గముకుండా పోవడు అని తలచ కూడదు. మరి అతడు ఎప్పుడు మరణించినను ఏమార్గముగుండా పోవు టకు అధికారము గలవాడో, ఆ మార్గములోనే పోవును.

2. 'యోగిజనము'అనగా 'ఏసామాన్య మనుష్యులు ఈ లోకమునందే ఒక యోనినుండి రెండవ యోనికి మారువారో, లేక, ఎవరు నరకాదులకు పోవు వారో వారి గతియొక్క వర్ణనము ఇక్కడలేదు'అని తలచవలెను.

సంబంధము-

అర్జునుని యేడవ ప్రశ్నకు ఉత్తరము చెప్పుచు భగవంతుడు అంత్యకాలము నందు ఏవిధముగ మనుష్యుడు పరమాత్ముని పొందగలడు అను విషయము బాగుగా తెలిపెను. ఈ సందర్భములోనే భగవంతుడు 'భగవత్ప్రాప్తి కాకున్న పుడు బ్రహ్మలోకమువరకు పోయికూడ జీవుడు గమనాగమన చక్రము నుండి విముక్తి పొందడు' అను విషయముగూడా చెప్పెను. కాని ఎవరు తిరిగిరాని స్థాన మును పొందెదరో, వారు ఆ ఏమార్గముగుండా పోయెదరు? అని అక్కడ చెప్ప లేదు. కనుక ఆ రెండు మార్గముల వర్ణనము చేయుటకు భగవంతుడు ఉపోద్ఘాత ముగా ఇట్లు చెప్పుచున్నాడు:-

"యత్ర కాలే త్వనావృత్తిమావృత్తిం చైవ యోగినః
ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ" 23

"అగ్ని[1] ర్జ్యోతిరహః[2] శుక్లః[3] షణ్మాసా ఉత్తరాయణం[4]
తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః" 24

---

1. ఇక్కడ 'జ్యోతిః' అను పదము 'అగ్నిః' అను పదమునకు విశేషణము. 'అగ్నిః' అను పదమునకు అగ్ని యభిమాని దేవతయని అర్థము. ఉపని షత్తులలో ఈ అగ్న్యభిమానిదేవతయే 'అర్చిః' అని చెప్పబడినది. దీని స్వరూపము దివ్య ప్రకాశమయము. భూమిపైనున్న సముద్రముతోపాటు సమస్త దేశములందున్ను దీని యధికారముగలదు. ఉత్తరాయణ మార్గము నందు పోవు అధికారులకు పగటి అభిమాని దేవతతో సంబంధము కలి గించుటయే యీ 'అర్చి' యొక్కపని. ఉత్తరాయణ మార్గముగుండా పోవు ఏ ఉపాసకులు రాత్రియందు శరీరము త్యాగము చేసెదరో వారిని, ఆరాత్రియంతయు తన అధికారములో నుంచుకొని, యది ప్రొద్దుపొడవ గనే పగటి యభిమాని దేవత యధీనము చేయును. పగలు మరణించిన వారిని తక్షణమే యీ అర్చి, దినాభిమాని దేవతవశముచేయును.

2. 'అహః' అను పదమునకు 'దినాభిమాన దేవత' అని యర్థము. దీని స్వరూ పము అగ్న్యభిమాన దేవతకన్న మిక్కిలి ఎక్కువ దివ్యప్రకాశమయమై

"అర్జునా! యే మార్గమునందు జ్యోతిర్మయుడైన అగ్నికి అభిమాని దేవత యున్నదో, దినము (పగలు) నకు అభిమాని దేవతయున్నదో, శుక్లపక్షాభిమాని దేవతయున్నదో, ఉత్తరాయణము ఆరు మాసముల అభిమాని దేవతయున్నదో,

---

యుండును. ఎంతవరకైతె భూలోకపు టెల్లకలదో, అనగా, ఎంతదూరము వరకు ఆకాశముతో భూమియొక్క వాతావరణమునకు సంబంధముకలదో, అంత మేరకు ఈ పగటి యభిమాని దేవతయొక్క అధికారము కలదు. ఉత్తరాయణ మార్గమునందు పోవు ఉపాసకునకు శుక్ల పక్షాభిమాని దేవతలో సంబంధము కలిగించుటయేపని. ఇందలి యభిప్రాయమేమనగా, ఉపాసకుడొక వేళ కృష్ణపక్షమునందు మరణించినచో, శుక్లపక్షము వచ్చు వరకు, ఆ ఉపాసకుని ఈ దేవత తన వశమునందుంచుకొనియు ఒకవేళ శుక్లపక్షమునందే యతడు మరణించినచో, వెంటనే తన యెల్లవరకు ఆ ఉపాసకుని తీసుకొనిపోయి, అతనిని శుక్లపక్షాభిమాని దేవతకు వశ పరచును.

3. 'శుక్లః' అను పదమునకు 'శుక్లపక్షాభిమానిదేవత' యని యర్థము. దీని స్వరూపము దినాభిమాని దేవతకన్న మిక్కిలి ఎక్కువ దివ్యప్రకాశ మయమై యుండును. భూలోకసీమ వెలుపల అంతరిక్షలోకములో-ఏపితృ దేవతల లోకములో పదునైదు దినముల పగలు-పదునైదు దినముల రాత్రి యుండునో, ఆసీమవరకు ఈదేవతయొక్క అధికారమున్నది. ఉత్త రాయణ మార్గముగుండా పోవు అధికారిని, తన సీమను దాటించి, ఉత్త రాయణాభిమాని దేవతకు వశపరచుట ఈ శుక్ల పక్షాభిమాని దేవతపని. ఈ దేవతగూడ, పూర్వ దేవతలవలెనే సాధకుడొకవేళ దక్షిణాయనములో తన యధికారములోనికి వచ్చినచో, ఉత్తరాయణము వచ్చువరకు, అతనిని తన యధికారమునందుంచుకొనియు, ఉత్తరాయణములో వచ్చి నచో, వెంటనే తన యెల్లను దాటించి, సాధకుని, ఉత్తరాయణాభిమాని దేవత యధీనము చేయును.

4. ఏ యారు నెలలు సూర్యుడు, ఉత్తరదిక్కు వైపు పోవునో, ఆ యారునెలల కాలము 'ఉత్తరాయణము' అనబడును. ఆ ఉత్తరాయణాభిమాని దేవతయే

మరణించిన తరువాత ఆమార్గములో పోయిన బ్రహ్మవేత్తలైన[1] యోగిజనులు

---

యిక్కడ 'షణ్మాసా ఉత్తరాయణం' అను పదమునకు అర్థమగును. దీని స్వరూపము శుక్ల పక్షాభిమాని దేవతకన్న అధిక దివ్యప్రకాశమయమై యుండును. అంతరిక్ష లోకమునకు పైన, ఏ దేవలోకములందు, ఆరు నెలలు పగలు, ఆరునెలలు రాత్రి కాలముండునో, అంతవరకు, ఈ దేవతకు అధికారముండును. ఈ దేవత ఉత్తరాయణ మార్గముగుండా పరమ ధామమునకు పోవు అధికారిని, తన సీమనుదాటించి, ఉపనిషత్తులలో వర్ణింపబడిన-(ఛాందోగ్యోపనిషత్తు-4-15-5-5-10-1-2: బృహదారణ్యకోపనిత్తు 6-2-15) సంవత్సరాభిమాని దేవతవద్దకు తీసికొనిపోయి చేర్చును. అక్కడినుండి ముందుకు సంవత్సరాభిమాని దేవత, ఆసాధకుని సూర్యలోకము చేర్చును. అక్కడినుండి క్రమముగా, ఆదిత్యాభిమాని దేవత, చంద్రాభిమాని దేవత అధికారములో అది విద్యుత్తు అభిమాని దేవతాధికారములో చేర్చును. ఆ తరువాత అక్కడికి భగవంతుని పరమధామమునుండి భగవంతుని (పార్షదులు)(భగవంతుని సేవకులు సహచరులు) వచ్చి ఆసాధకుని, పరమధామమునకు తీసికొనిపోయెదరు. అప్పుడతడు భగవంతునితో కలిసికొనును.

ఈ వర్ణనమునందు చెప్పబడిన 'చంద్ర శబ్దమునకు, మనకు కనపడు చంద్రలోకమని కాని, లేక, చంద్రలోకాభిమాని దేవతయనికాని, అర్థము కాదని గుర్తు ఉంచుకొనవలెను.

1. ఈ శ్లోకములో 'బ్రహ్మవిదః' అను పదమునకు, నిర్గుణ బ్రహ్మతత్త్వమును గాని, సగుణ పరమేశ్వరుని గుణ-ప్రభావ-తత్త్వ-స్వరూపములనుగాని, శాస్త్రముయొక్క, ఆచార్యులయొక్కయు ఉపదేశానుసారముగా శ్రద్ధా పూర్వకముగా పరోక్షభావముతో తెలిసికొను ఉపాసకులని, గాని నిష్కామ భావముచేత కర్మలుచేయు కర్మయోగులనియు, అర్థముకాదు. ఎందుకనగా, అట్టివారు, ఒకచోటినుండి మరియొక స్థానమునకు పోయినారని వర్ణించుట ఉపయోగకరము కాదు.

వేదములోగూడ, 'న తస్య ప్రాణా హ్యుత్క్రామంతి' (బృహదారణ్యకోప

దేవతలచేత తీసికొనిపోబడి బ్రహ్మమును[1] పొందెదరు.

"ధూమో[2] రాత్రి[3] స్తథా కృష్ణః[4] షణ్మాసా దక్షిణాయనమ్[5]
తత్ర చాంద్రమసం జ్యోతిర్యోగీ ప్రాప్య నివర్తతే" ౨౫

---

నిషత్తు4-4-6) అత్రైవ సమవలీయింతే', బృహదారణ్యకోపనిషత్తు-3-2-11) 'బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్నోతి' (బృహదారణ్యకోపనిషత్తు-4-4-6) అనగా 'ఎందుకనగా అతని ప్రాణములు ఉత్క్రాంతిని పొందవు శరీరమునుండి వెడలి వేరు చోటికిపోవు" ఇక్కడనే లీనమైపోవును', 'అతడుబ్రహ్మమేయై బ్రహ్మమును పొందును' అని యర్థము.

1. ఇక్కడ 'బ్రహ్మ' శబ్దమునకు సగుణ పరమేశ్వరుడని యర్థము. ఎప్పుడు గూడ నశించని స్థానములైన ఆ పరమేశ్వరునిధామములు 'సత్యలోక-పరమధామ-సాకేతలోక-గోలోక-వైకుంఠలోకములు' అను మొదలైన నామముల చేత చెప్పబడెను. అటువంటి లోకములను ఉపాసకుడు చేరి భగవంతుని ప్రత్యక్షము చేసికొనుటయే 'సగుణ బ్రహ్మమును పొందుట' యనబడును.

2. ఇక్కడ 'ధూమః' అను పదమునకు 'ధూమాభిమాని దేవత' అనగా అంధకారాభిమాని దేవతయని యర్థము. దాని స్వరూపము అంధకారమయమై యుండును. ఇదిగూడ అగ్న్యభిమాని దేవతవలెనే భూమిపైన సముద్రసహిత సమస్త దేశములయందున్న అధికారము గలదైయుండును. దక్షిణాయన కాలములో మరణించి ఆ మార్గముగుండాపోవు సాధకులను రాత్ర్యభిమాని దేవత కడకు తీసికొనిపోవుట దీనిపని. దక్షిణాయన మార్గము గుండా పోవు సాధకులు పగలు మరణించినచో వారిని, ఈ ధూమాభిమాని దేవత పగలంతయు తన అధికారములో నుంచుకొని, రాత్రి ఆరంభించగనే రాత్ర్యభిమాని దేవతకు ఒప్పజెప్పును. రాత్రి మరణించిన వారిని వెంటనే రాత్రియభిమాని దేవతకు వశపరచును.

3. ఇక్కడ 'రాత్రిః' అను పదమునకుగూడ 'రాత్రియభిమానిదేవత' యని యర్థము. దీని స్వరూపముగూడ అంధకారముగానే యుండును. పగటి యభిమాని దేవతవలె ఈ దేవత యధికారముగూడ, భూలోకసీమ ఉన్నంత

"అర్జునా! యేమార్గమునందు ధూమాభిమాని దేవత యుండునో, రాత్ర్యభిమాని దేవత యుండునో, కృష్ణపక్షాభిమాని దేవత యుండునో, దక్షిణాయనము

---

వరకు వున్నది. ఆ రెంటిలో భేదమేమనగా, భూమిపైన దినాభిమాని దేవత యధికారము పగలేయుండును. రాత్రియందు రాత్రి యభిమాని దేవత యధికారముండును. దక్షిణాయన మార్గముగుండా పోవు సాధకుని భూలోకసీమ దాటించి అంతరిక్షమునందున్న కృష్ణ పక్షాభిమాని దేవతకు ఒప్పగించుట యీ దేవతపని. సాధకుడొకవేళ శుక్లపక్షములో మరణించినచో, అతనిని కృష్ణపక్షము వచ్చువరకు తన యధికారములో నుంచుకొనియు, ఒకవేళ అతడు కృష్ణ పక్షములోనే మరణించినచో వెంటనే తన యధికారమునుండి తీసికొనిపోయి యారాత్రిదేవత కృష్ణ పక్షాభిమాని దేవతకు ఒప్పగించును.

4. ఇక్కడ 'కృష్ణః'అను పదమునకు'కృష్ణపక్షాభిమానిదేవత'యని యర్థము. దీని స్వరూపముగూడ అంధకారమయముగా నుండును. భూమండలసీమకు బయలు అంతరిక్షలోకమునందు పదునైదుదినములు పగలు అంతకాలమే రాత్రి గల పితృలోకములవరకు ఈ దేవత యధికారముగూడ గలదు. ఈ రెంటికి భేదమేమనగా, ఆలోకములలో శుక్లపక్షాభిమాని దేవత యధికారము శుక్లపక్షములో నుండును. కృష్ణపక్షపు దినములలో కృష్ణపక్షాభిమాని యధికారముండును. దక్షిణాయన మార్గముగుండా స్వర్గమునకు పోవు సాధకుని దక్షిణాయనాభిమాని దేవతకు వశపరచుట ఆదేవతపని. దక్షిణాయన మార్గములో పోవలసిన యధికారము గల సాధకుడొకవేళ ఉత్తరాయణ కాలములో ఈ కృష్ణపక్షాభిమాని దేవత యధికారములో వచ్చినయెడల అతనిని దక్షిణాయనకాలము వచ్చువరకు తన యధికారములో నుంచుకొనియు, దక్షిణాయనములోనే వచ్చినవానికి వెంటనే తన యధికారమునుండి తీసుకొనిపోయి యీ దక్షిణాయనాభిమాని దేవత కడకు చేర్చును.

5. సూర్యుడు దక్షిణదిక్కు వైపుగాపోవు ఆరునెలలకాలము 'దక్షిణాయన', మనబడును. ఇక్కడ 'దక్షిణాయన' అను పదమునకు, దాని యభిమాని

యొక్క ఆరుమాసములకు అభిమాని యుండునో, సకామకర్మలుచేయు యోగులు[1] మరణించిన తరువాత మార్గమునందు పోయినచో, పైన చెప్పబడిన అభిమాన

---

దేవతయని యర్థము. దీని స్వరూపముగూడ అంధకారమయముగానే యుండును. అంతరిక్షలోకముపైన, ఆరునెలలు పగలు-ఆరునెలలు రాత్రి గల దేవతల లోకములవరకు ఈ దేవత యధికారముండును. ఈ రెంటికి భేదమేమనగా ఉత్తరాయణకాలపు ఆరునెలలు, అయభిమాని దేవత యధికారము దక్షిణాయనకాలపు ఆరునెలలు దీని యధికారముఉండును. దక్షిణాయన మార్గముగుండా స్వర్గమునకుపోవు సాధకులను తన యధికారము నుండి తీసికొనిపోయి, ఉపనిషత్తులలో వర్ణింపబడిన పితృలోకాభిమాని దేవత యధికారములో చేర్చుట యీ దేవతపని. అక్కడినుండి పితృలోకాభిమాని దేవత ఆసాధకుని ఆకాశాభిమాని దేవతకడకు, ఆకాశాభిమాని దేవత చంద్రలోకమునకు చేర్చును. (ఛాందోగ్యోపనిషత్తు 5-10-4, బృహదారణ్యకోపనిషత్తు 6-2-16) ఇక్కడ చంద్రలోకము ఉపలక్షణము మాత్రమేయని తెలియవలెను. (ఉపలక్షణమనగా, సామాన్యముగా ఒకటి చెప్పి దానిచేత, అటువంటి యర్థములుగూడ గ్రహింపవలెనని యర్థము) అందుచేత చంద్రలోకమునుండి బ్రహ్మలోకమువరకు పునారాగమనము గల లోకములన్నియునని చంద్రలోక పదముచేత గ్రహింపవలెను.

ఉపనిషత్తులలో వర్ణింపబడిన పితృలోకము, అంతరిక్షములోనున్నది. అది పదునైదు దినముల పగలు-అంతయే రాత్రి గలదియునగు ఈ పితృలోకము కాదని గుర్తుంచుకొనవలెను.

1. స్వర్గాములకొరకు పుణ్య కర్మలుచేయు పురుషులుగూడ, తమ ఐహిక సుఖముల ప్రవృత్తిని నిరోధించెదరు. ఈ దృష్టిలో వారుగూడ యోగులని చెప్పదగినవారు. ఇదిగాక యోగభ్రష్ట పురుషులుగూడ, ఈ ధూమాది మార్గములగుండా స్వర్గమునకుపోయి, అక్కడ కొంతకాలము నివసించి, తిరిగివచ్చెదరు. వారుగూడ ఈ మార్గముగుండా పోవువారిలో చేరెదరు. కనుక వారిని 'యోగులు' అనుట ఉచితమేయగును. ఇక్కడ 'యోగి' శబ్దమును ప్రయోగించి, 'ఈ మార్గము సాఫల్యకర్మలుచేయు కామన మను

దేవతలచేత క్రమముగా తీసికొనపోబడి చంద్రుని జ్యోతిని[1] చేరి, స్వర్గమునందు, తమ తమ శుభకర్మములను అనుభవించి తిరిగి వచ్చెదరు.[2]

శుక్ల-కృష్ణే గతీ హ్యేతే జగతః శాశ్వతీ మతే
ఏకయా యాత్యనావృత్తిమన్యయాఽవర్తతే పునః 26

---

ష్యుల కొరకుకాదు, ఉన్నత లోకములను పొందుటకు అధికారముగల-శాస్త్రీయ కర్మలుచేయు పురుషులకొరకే ఉన్నది. (గీత 2.42, 43, 44-9-20, 21 మొదలైన శ్లోకములు)'అని కూడా తెలుపబడినది

1. చంద్రలోకమునందు, చంద్రాభిమాని దేవత స్వరూపము శీతల ప్రకాశమయముగా నుండును. దాని వంటి ప్రకాశమయ స్వరూపము పేరు 'జ్యోతి' యనబడును. అటువంటి స్వరూపమునే పొందుట-చంద్రజ్యోతిని పొందుట' యనబడును, అక్కడికిపోవు సాధకుడు ఆలోకమునందు, శీతల ప్రకాశమయ-దివ్య-దేవ శరీరమునుపొంది, తన పుణ్య కర్మల ఫలముగా దివ్యభోగముల ననుభవించును.

2. చంద్రజ్యోతి లోకమునకుపోయి, అక్కడ వుండవలసిననియతసమయము సమాప్తమైన తరువాత, ఈ మృత్యులోకమునకు తిరిగివచ్చుటయే,'అక్కడ నుండి మరలివచ్చుట'యనబడును. ఏకర్మలఫలముగా,ప్రాణులుస్వర్గమును-అక్కడి భోగములను పొందెదరో,ఆకర్మల భోగానుభవము సమాప్తమైన తరువాత, ఆకర్మలు క్షీణించినప్పుడు వారు అక్కడినుండి తిరిగి వచ్చుట వారి బాధ్యతయైయుండును. ఆ ప్రాణులయొక్క పుణ్య కర్మలు క్షీణించిన తరువాత, చేరి, వారు చంద్రలోకమునుండి క్రిందకు దిగజారుచు వరుసగా, ఆకాశమును, అక్కడినుండి వాయువునుచేరి, తరువాత ధూమముయొక్క ఆకారములో మారిపోయెదరు. ధూమమునుండి మేఘమండలము చేరెదరు. మేఘమండలమునుండి మేఘముగా మారిపోయెదరు. ఆ తరువాత మేఘమునుండి జలరూపములో భూమిపైన కురిసెదరు. భూమియందు వారు, 'గోధుమలు-యవలు-నువ్వులు-మినుములు మొదలైన ధాన్యపు గింజలలోగాని, లేక, వనస్పతులలోగాని ప్రవేశించెదరు.

"ఎందుకనగా: అర్జునా! ప్రపంచములో శుక్ల-కృష్ణ మార్గములు అనగా దేవయాన, పితృయాన మార్గములు రెండు సనాతనములని యంగీకరింపబడినది.[1] ఈ రెండింటిలో ఒకదాని ద్వారా పోయిన[2] వారు, తిరిగి రావలసియుండని పరమ గతిని పొందెదరు. రెండవమార్గముగుండా పోయినవారు[3], మరల తిరిగివచ్చెదరు-

---

వానిద్వారా, పురుషుల వీర్యమునందు ప్రవేశించెదరు. ఆ పురుష వీర్యము ద్వారా వారు స్త్రీ యోనులలో వారి వారి కర్మానుసారముగా ప్రవేశించి, జన్మించెదరు. (ఛాందోగ్యోపనిషత్తు 5-10-5,6,7. బృహదారణ్యకోపనిషత్తు 6-2-16.

1. ఎనుబది నాలుగు లక్షల యోనులలో తిరుగుచు తిరుగుచున్న ప్రాణి యెడల ఎప్పుడో యొకప్పుడు భగవంతుడు దయదలచి జీవునకు మనుష్య శరీరమిచ్చి తన కడకు, దేవతల లోకములకున్ను పోవుటకు సదవకాశమిచ్చును. అట్టి సమయమునందు ఒకవేళ, ఆ జీవుడు తన జీవితమును సదుపయోగము చేసికొనినయెడల శుక్ల కృష్ణ మార్గములలో నేదోయొక మార్గము ననుసరించి తద్వారా గంతవ్య స్థానమును తప్పక చేరుకొనగలడు. ఈ కారణముచేతనే ప్రకారాంతరముచేత ప్రాణి మాత్రమునకు ఈ రెండు మార్గముల సంబంధముగలదు. ఈ మార్గములు సమస్త ప్రాణులకొరకున్నవి, ఎల్లప్పటికిన్ని ఉండగలవు. ఇందుచేత ఈ రెండు మార్గములు శాశ్వతములని చెప్పబడెను. ఒకవేళ, మహాప్రళయకాలమునందు ఎప్పుడైతే, సమస్తలోకములు భగవంతునియందు లీనములైపోవునో, ఆసమయమునందు, ఈ మార్గములు, వీనిదేవతలుగూడ లీనములైనప్పటికిన్ని, ఎప్పుడైతే, ప్రపంచముయొక్క పునః సృష్టి జరుగునో, ఆ సమయము నందు పూర్వమువలెనే, ఈ మార్గములకు పునర్నిర్మాణముగూడ జరుగును. కాబట్టి, ఈ మార్గములు శాశ్వతములనుటలో ఏ మాత్రము దోషములేదు.

2. అనగా, ఈ అధ్యాయమునందే యిరువది నాలుగవ శ్లోకము ననుసరించి, 'అర్చి' మార్గములో పోయిన యోగియని భావము-

3. అనగా, ఈ అధ్యాయమునందే యిరువది యైదవ శ్లోకము ననుసరించి, 'ధూమ' మార్గముగుండా పోయిన సకామకర్మయోగియని తాత్పర్యము.

అనగా, జనన మరణములను పొందెదరు.

"నైతే సృతీ పార్థ జానన్ యోగీ ముహ్యతి కశ్చన
తస్మాత్ సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున" 27

పార్థా! ఈవిధముగా ఈ రెండు మార్గములను తాత్త్వికముగా తెలిసికొనిన యే యోగియైనను మోహముచెందదు.[1] ఈ కారణముచేత, నీవు అన్ని కాలము లందున్ను సమబుద్ధి రూపయోగముగల వాడవై[2] అనగా, నిరంతరము నాప్రాప్తి కొరకు సాధనము చేయువాడవు కమ్ము.

---

1. మనుష్యుడు యోగసాధనమునందు లగ్నుడైనప్పటికిన్ని, ఈ మార్గము తత్త్వము తెలియని కారణముచేత, ప్రకృతికి (స్వభావమునకు) వశుడై, యీ లోకముయొక్కగాని, పరలోకముయొక్కగాని భోగములందు ఆసక్తి గలవాడై, తాను చేయు సాధనమునుండి భ్రష్టుడగును. ఇదియే, అతడు మోహము చెందుటయగును. కాని, ఎవడు ఈ రెండుమార్గముల తత్త్వము నెరుగునో, యతడు మరల బ్రహ్మలోక పర్యంతమునున్న సమస్త లోక ముల సుఖభోగములన్నియు నశించునవి. తుచ్ఛములని తెలిసికొనుటచేత, ఏవిధములైన భోగములందు, సుఖములందున్ను ఆసక్తుడు కాకుండును. పరమేశ్వర ప్రాప్తికే నిరంతరము సాధనమునందు లగ్నుడై యుండును. ఈ కారణముచేతనే, మనుష్యుడు భగవత్ప్రాప్తి సాధనమునందు నిత్యము-నిరంతరము లగ్నుడయి యుండవలెనని తెలియవలెను ఇదియే అతడు మోహము చెందక యుండుట యగును.

2. ఇక్కడ భగవంతుడు అర్జునునకు సర్వకాలములందున్ను యోగయుక్తుడవై యుండుమని చెప్పుటలో భావమేమనగా, మనుష్యుని జీవితము చాల కొద్ది దినములవరకే యుండునది, మృత్యువెప్పుడు సంప్రాప్తమగునదియు నెవనికి గూడ తెలియదు. అని ఒకవేళ తన జీవితముయొక్క ప్రతియొక్క క్షణ మును సాధనమునందు లగ్నముచేసి యుంచుటకు ప్రయత్నము చేయని యెడల, నడుమ నడుమ సాధనము విచ్ఛిన్నమగుచుండును. ఒకవేళ సాధ నము చేయని పరిస్థితిలో మరణము సంభవించినయెడల, యోగభ్రష్టుడై

"వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ
దానేషు యత్ పుణ్యఫలం ప్రదిష్టమ్
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా
యోగీ పరం స్థానముపైతి చాఽద్యమ్" 28

అర్జునా! యోగియైన పురుషుడు ఈ రహస్యమును తత్త్వముతో తెలిసికొని[1] వేదములను చదువుటయందు, తపోదానాదులను చేయుటయందున్ను ఏ పుణ్యఫలమైతే చెప్పబడినదో, ఆ పుణ్యఫలము నంతటిని నిస్సందేహముగా ఉల్లంఘించును.[2] అతడు తప్పక సనాతనమైన పరమ పదమును పొందును.

---

పునర్జన్మ పొందవలిసియుండును. ఈ కారణముచేతనే మనుష్యుడు భగవత్ప్రాప్తి సాధనమునందు నిత్యము-నిరంతరము లగ్నుడయ్యే యుండవలెనని తెలియవలెను.

1. ఈ యధ్యాయమునందు వర్ణింపబడిన విద్యకు-అనగా'భగవంతుని సగుణ-నిర్గుణ సాకార-నిరాకార స్వరూపమును ఉపాసించుట, భగవంతుని గుణ-ప్రభావ-మాహాత్మ్యములు, ఏ విధముగ సాధన చేయుటచేత మనుష్యుడు పరమాత్ముని పొందగలడు? ఎక్కడికిపోయి మనుష్యుడు తిరిగి రావలసియుండును? ఎక్కడచేరిన తరువాత పునర్జన్మ కలుగదు? ఈ మొదలైన విషయము లెన్నియైతే యీ అధ్యాయములో తెలుపబడినవో, అవి యన్నియు బాగుగా తెలిసికొనుటయే 'దానిని తత్త్వముతో తెలియుట' యగును.

2. ఇక్కడ 'వేద' శబ్దమునకు షడంగ సహిత చతుర్వేదములు, వానికి అనుకూలమైన సమస్తశాస్త్రములునని యర్థము. 'యజ్ఞశబ్దమునకు'శాస్త్రవిహితమైన పూజ, హోమములు మొదలైన సర్వవిధ యజ్ఞములు అని యర్థము. 'తపస్'అను శబ్దమునకు, ప్రతోపవాసము-ఇంద్రియవిగ్రహము-స్వధర్మపాలనము మొదలైన సకలవిధ శాస్త్రవిహిత తపస్సులు' అని యర్థము. 'దాన' శబ్దమునకు, అన్నదాన-విద్యాదాన - భూదానాదులైన సర్వవిధ శాస్త్రవిహిత దానములు, పరోపకారమే' అనియర్థము - పుణ్యఫలమనగా,

ఇతి శ్రీ మహాభారతే భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతాపర్వణి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే అక్షరబ్రహ్మ యోగో నామ అష్టమోఽధ్యాయః సమాప్తః

శ్రీమహాభారతమునందు, భీష్మపర్వాంతర్గతమైన శ్రీమద్భగవద్గీతా పర్వమునందు శ్రీమద్భగవద్గీతోపనిషత్తులందు, బ్రహ్మవిద్యయందు, యోగశాస్త్రమునందు, 'అక్షర బ్రహ్మయోగము' అనబడు ఎనిమిదవ అధ్యాయము సమాప్తము

భీష్మపర్వమునందు ముప్పది రెండవ అధ్యాయము సమాప్తము.

---

'శ్రద్ధా భక్తి పూర్వకంగా సకామ భావముతోనే వేదశాస్త్రాధ్యయనము చేయుటచేత, యజ్ఞ-దాన-తపస్సులు-ఈ మొదలైన శుభకర్మలు అనుష్ఠించుట చేతను ఏ పుణ్య సంచయము కలుగునో, ఆ పుణ్య సంచయము. ఫలముగా, బ్రహ్మలోక పర్యంతమున్న భిన్నభిన్న దేవలోకములను, అక్కడి సుఖభోగములను, పొందుటయను ఫలమేదైతే వేదశాస్త్రములందు తెలుపబడెనో, అదియే 'పుణ్యఫలము' అనబడును. ఇట్లు, ఆ సమస్త లోకములు-వానియందు గలుగు సుఖభోగములున్ను క్షణభంగురములు-అనిత్యములు ననితలచి, వానియందు ఆసక్తుడు కాకుండుటయే వానినుండి పూర్తిగా ఉపరతుడు (ఉడిగివాడు) అగుట' యనబడును. ఇదియే వానిని ఉల్లంఘించుట యనబడును.

# శ్రీభగవద్గీత తొమ్మిదవ అధ్యాయము

## రాజ విద్యా రాజగుహ్యయోగము :

సంబంధము-

భగవద్గీత సప్తమాధ్యాయారంభమునందు భగవంతుడు విజ్ఞానసహిత జ్ఞాన వర్ణనము చేయుటకు ప్రతిజ్ఞ చేసియుండెను. దాని ప్రకారమే ఆ విషయమును వర్ణించుచు, చివరకు, బ్రహ్మ-అధ్యాత్మ-కర్మ - అధిభూత-అధిదైవ - అధియజ్ఞ సహితుడైన భగవంతుని తెలిసికొనుటను, అంతకాలమునందు భగవచ్చింతనము చేయుటను గూర్చిన విషయము చెప్పబడెను. దానిపైన, ఎనిమిదవ అధ్యాయము నందు అర్జునుడు, ఆ తత్త్వమును, అంతకాలమునందు చేయవలసిన ఉపాసన విషయమునున్ను తెలిసికొనుటకుగాను, ఏడు ప్రశ్నలుచేసెను. ఆ ప్రశ్నలలో ఆరింటికి ఉత్తరములైతే భగవంతుడు సంక్షేపముగా మూడవ - నాల్గవ శ్లోకము లలో చెప్పెను. కాని, యేడవ ప్రశ్నకు ఉత్తరమునందు భగవంతుడు ఏయుప దేశము చేయుటకు ఆరంభించెనో, ఆయుపదేశములోనే యెనిమిదవ అధ్యాయము సమగ్రముగా ముగిసెను. ఈ విధముగా ఏడవ అధ్యాయమునందు ఆరంభింప బడిన విజ్ఞానసహిత జ్ఞానవర్ణనము సాంగోపాంగముగా ముగియకుండుటచేత, భగవంతుడిప్పుడా విషయమునే పూర్తిగా వివరించి తెలుపుటకు ఉద్దేశించి, యీ తొమ్మిదవ అధ్యాయమును ఆరంభించుచున్నాడు. ఏడవ అధ్యాయములో వర్ణింప బడిన ఉపదేశములో దీనికి గల సంబంధమును తెలుపుటకై మొదటి శ్లోకము నందు మరల, ఆ విజ్ఞాన సహిత జ్ఞాన వర్ణనము చేయుటకు ప్రతిజ్ఞ చేయు చున్నాడు.

శ్రీ భగవానువాచ :

"ఇదం తు గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే
జ్ఞానం విజ్ఞానసహితం యజ్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్" 1

భగవంతుడిట్లను:-

అర్జునా! దోషదృష్టి లేని భక్తుడవైన నీకు, పరమరహస్యమైన[1] &[2], విజ్ఞాన సహితమైన జ్ఞానమును మరల బాగుగా చెప్పెదను. దీనిని తెలిసికొని నీవు దుఃఖ రూపమైన సంసారమునుండి[3] విముక్తుడవయ్యెదవు.

"రాజవిద్యా[4] రాజగుహ్యం[5] పవిత్రమిదముత్తమమ్

---

1. ప్రపంచమునందు, శాస్త్రములందున్ను, రహస్యముగా నుంచదగిన విషయ యము లన్నిటియందున్ను, సమగ్రరూపుడై, భగవంతుడైన పురుషోత్త ముని తత్త్వ-ప్రేమ-గుణ-ప్రభావ-విభూతి-మహాత్మ్యాదులతోపాటు, భగ వంతుని శరణాగతి స్వరూపము, అన్నిటికన్న మించి గుప్తముగా నుంచ దగినదను భావము తెలుపుటకు 'గుహ్యతముడు'అని చెప్పబడెను.

2. గుణవంతుల గుణములను అంగీకరించకుండుట-గుణములందు దోషదర్శ నము-వారిని నిందించుట వారిపై అసత్య దోషముల నారోపించుట 'అసూయ'అనబడును. ఈ అసూయ దోషమేమాత్రము లేనివాడు 'అనసూ యువు'అనబడును.

3. ఈ శ్లోకములోని 'అశుభ'శబ్దమునకు, సమస్త దుఃఖములు-వానికి హేతువు లైన కర్మలు దుర్గుణములు-జననమరణ రూప సంసారబంధనము - ఈ యన్నిటికి కారణరూపమైన అజ్ఞానము'అనియర్థము. ఈ దుర్గుణములన్నిటి నుండి పూర్తిగా ఎల్లప్పటికిన్ని దూరముగానుండుట-పరమానందస్వరూప పరమేశ్వరప్రాప్తి ఇదియే 'అశుభములనుండి విముక్తుడగుట'యనబడును.

4. ప్రపంచమునందున్న అజ్ఞాత - జ్ఞాత విద్యలన్నిటిలోను ఈ విద్య చాలా పెద్దది. ఈ విద్యయొక్క యథార్థానుభవముగల వానికి మరి యొకటి యేదియు తెలిసికొనదగినది కొంచెముగూడ మిగిలియుండదు. అందుకే యిది 'రాజవిద్య'యనబడినది.

5. దీనిలో భగవంతుని 'సగుణ-నిర్గుణ, సాకార-నిరాకార స్వరూపముయొక్క తత్త్వము ఆ స్వరూప గుణ-ప్రభావ-మహత్త్వములు, వాని ఉపాసనా విధా

ప్రత్యాక్షవగమం[1] ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్[2]" 2

అర్జునా! విజ్ఞాన సహిత జ్ఞానము, అన్ని విద్యలకురాజు, అన్ని రహస్యములకు రాజు, అతిపవిత్రము, అతి శ్రేష్ఠము, ప్రత్యక్షఫలమిచ్చునది, ధర్మ

---

నము, ధాని ఫలము ఇవియన్నియు పూర్తిగా నిర్దేశింపబడినవి. ఇదిగాక, దీనియందు భగవంతుడు తన సమస్త రహస్యమును వెల్లడిచేసి, శ్రీకృష్ణ రూపములో నీ యెదుట నిలబడియున్న నేను, ఈ సమస్త ప్రపంచమునకు కర్త-హర్త-సర్వాధార-సర్వశక్తిసంపన్న-పరబ్రహ్మ-పరమేశ్వర-సాక్షాత్తు పురుషోత్తముడనని తెలిసికొను'మని తన వాస్తవతత్త్వమును వివరించి అర్జునునకు తెలిపెను. నీవు సర్వవిధముల నాకు శరణాగతుడవుకమ్ము- ఈ విధముగా భగవంతుడు పరమరహస్య విషయము అర్జునునివంటి దోష దృష్టిలేని పరమ శ్రద్ధాళువైన భక్తుని యెదుట చెప్పవలసినదే కాని, ప్రతి యొక్కని యెదుట చెప్పవలసిన విషయముకాదు. ఈ కారణముచేతనే యిది 'రాజగుహ్యము'అని చెప్పబడెను.

ఈ యుపదేశము నెవరైనను శ్రద్ధాపూర్వకముగా, శ్రవణ మననములుచేసి, దీని ప్రకారము ఆచరించునో, యిది, అతని సమస్త పాపములను-అవగుణములను పూర్తిగా నశింపజేసి, అతనిని సర్వదా పరిశుద్ధునిచేయును-కనుకనే, యిది 'పవిత్రము' అని చెప్పబడినది. ఇది అంతగా సాధకుని పవిత్రుని చేయునదియని తెలియవలెను.

1. విజ్ఞాన సహితమైన యీ జ్ఞానమునకు ఫలము శ్రాద్ధాది కర్మలకువలె అదృష్టఫలముగాదు. సాధకుడు దీనివైపు ముందుకు సాగుచున్నట్లెల్ల, అతని దుర్గుణములు-దురాచారములు దుఃఖములునశించి, యతనికి, పరమశాంతి, పరమ సుఖములయొక్క ప్రత్యక్షానుభవము కలుగుచుండును. ఇది పూర్తిగా లభించినవాడు వెంటనే పరమసుఖ - పరమశాంతి సముద్రుడు, పరమ ప్రేమాస్పదుడు, పరమ దయాళువు, సర్వప్రాణి మిత్రుడనైన సాక్షాత్తుభగవంతునే పొందగలడు. ఇందుచేతనే, యిది 'ప్రత్యక్షావగమము' అనబడును.

2. ఎట్లు సకామకర్మ. తన ఫలమునిచ్చి సమాప్తమగునో, ప్రాపంచిక విద్య

యుక్తము, సాధనచేయుటకు సులభము[1] వినాశరహితమునైనదిసుమా!

సంబంధము—

ఈ విజ్ఞాన సహిత జ్ఞానముయొక్క మహిమ యంతగొప్పది. దీని సాధనము గూడ ఇంత సులభమునైనప్పుడు, మనుష్యులంచరు దీనినే యెందుకు సాధింపరు? అను జిజ్ఞాసపైన, దీనికి ప్రధాన కారణము అశ్రద్ధయేయని తెలుపుటకు భగవంతుడు ఇప్పుడు, దీనిపైన శ్రద్ధలేని మనుష్యులను నిందించుచున్నాడు.

"అశ్రద్ధధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప
అప్రాప్య మాం నివర్తంతే మృత్యుసంసారవర్త్మని" 3

పరంతపా! యీ ఉపర్యుక్త ధర్మమునందు శ్రద్ధలేని పురుషులు[2], నన్ను

---

ఒకసారి చదివిన తరువాత, దానిని మాటి మాటికి అభ్యాసము చేయని యెడల అది నష్టమగునో - అట్లు భగవంతుని యాజ్ఞాన - విజ్ఞాన విద్య నష్టము కాజాలదు. ఇదికాక, దీని ఫలముగూడ నశించునదికాదు. ఈ కారణము చేతనే యిది 'అవ్యయము'అని చెప్పబడెను.

1. దీని కొరకు, బాహ్యమైన ప్రయత్నములు చేయవలసిన యావశ్యకత, ఆయాసపడవలసిన అవసరములేదు. సాధనముయొక్క ఆరంభములోనే, సాధకునకు దీనియందు సుఖ-శాంతుల యనుభవము గలుగుచుండును. కనుక, దీనిని సాధనము చేయుట మిక్కిలి సులభమని చెప్పబడెను.

2. పూర్వ శ్లోకమునందు ఏ విజ్ఞాన సహిత జ్ఞానముయొక్క మాహాత్మ్యము తెలుపబడెనో, దీని తరువాత అధ్యాయము నందంతటను దేని వర్ణనము చేయబడెనో, అదియే యిక్కడ 'అస్య' అను విశేషణ సహితమైన 'ధర్మస్య' అను పదమునకు అర్థము. ఈ సందర్భములో వర్ణింపబడిన భగవంతుని స్వరూపము-ప్రభావము-గుణము-మహత్త్వము-భగవత్ప్రాప్తికి ఉపాయము-దాని ఫలము సత్యమని తలచక దానియందు అవిశ్వాసము-విపరీత భావనచేయుట, అది కేవలము అర్థవాదమువంటి ప్రోత్సాహక వచనమని తలచుట- ఈ మొదలైన విశ్వాసరోధి భావనలెవరియందున్నవో, వారే శ్రద్ధారహితులైన పురుషులని తెలియవలెను.

పొందక, మృత్యురూపమైన సంసార చక్రమునందు తిరుగుచునుండెదరు.

సంబంధము—

పూర్వ శ్లోకమునందు భగవంతుడు ఏ విజ్ఞాన సహిత జ్ఞానమును ఉపదేశించుటకు ప్రతిజ్ఞ చేసియుండెనో, దేనిమాహాత్మ్యవర్ణనము చేసియుండెనో, ఇప్పుడు దానియారంభము చేయుచు మొదట ప్రభావ సహితమైన తన నిరాకార స్వరూపము యొక్క తత్త్వమును వర్ణించుచున్నాడు:-

మయా తతమిదం సర్వం జగదవ్యక్త[1] మూర్తినా
మత్స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః 4

"అర్జునా! నిరాకార - పరమాత్ముడగు నాచేత ఈ సమస్త ప్రపంచము[2], (జలముచేత మంచుగడ్డవలె)పరిపూర్ణమైయున్నది.[3] సమస్తభూతప్రాణులు, నాలో

---

1. భగవద్గీత ఎనిమిదవ అధ్యాయమునందు నాలుగవ శ్లోకములో ఏది 'అధియజ్ఞము'అని, ఎనిమిదవ పదవ శ్లోకములలో 'పరమదివ్యపురుషుడు 'అని తొమ్మిదవ శ్లోకములో'కవి','పురాణుడు'అని,ఇరువదవ-ఇరువదియొకటవ శ్లోకములలో 'అవ్యక్త అక్షరుడు' అని ఇరువది రెండవ శ్లోకములో భక్తిచేత పొందదగు 'పరమపురుషుడు'అనియు తెలుపబడెనో, ఆ సర్వవ్యాపి-సగుణ-నిరాకార స్వరూపమును లక్ష్యమునందు ఉంచుకొనియే యిక్కడ 'అవ్యక్తమూర్తినా'అను పదము ప్రయోగింపబడినది.

2. 'ఈ సమస్తప్రపంచము' అనుటచేత ఇక్కడ సమస్త జడ-చేతన పదార్థ సహితమైన సమస్త బ్రహ్మాండమని తెలియవలెను.

3. ఎట్లైతే ఆకాశముచేత వాయువు - అగ్ని-జలము-భూమి, సువర్ణముచేత నగలు, మట్టిచేత దానిచే చేయబడు పాత్రలు వ్యాపింపబడియుండునో, అట్లే, యీసమస్త ప్రపంచము. దానిని రచియించు సగుణ పరమేశ్వరుని నిరాకార రూపముచేత వ్యాపింప బడియున్నది వేదమిట్లు చెప్పుచున్నది—

మున్న సంకల్పముయొక్క ఆధారముపైన నిలిచియున్నవి[1], కాని, వాస్తవముగా, నేను వానిలో లేను.[2]

---

ఈశావాస్యమిదగ్ం సర్వం యత్కించ జగత్యాంజగత్ (ఈశోపనిషత్తు-1) అనగా ఈ ప్రపంచమునందున్న సమస్త-జడ-చేతన పదార్థములు ఈశ్వరునిచేత వ్యాప్తములైయున్నవి.

1. ఇక్కడ 'సమస్త భూత ప్రాణులు'అను మాటచేత 'సమస్త'శరీర-ఇంద్రియ-మనస్-బుద్ధి'యనునవి-వీనిని ఆకర్షించు ప్రాపంచిక విషయములలో, వీని, నివాస స్థానములతో సహితములైన సమస్త ప్రాణులు చెప్పబడినవి. భగవంతుడే తన ప్రకృతిని, స్వీకరించి, సమస్తప్రపంచముయొక్క ఉత్పత్తి-స్థితి-ప్రళయములు చేయును. ఆయనయే, ఈ సర్వప్రపంచమును తన యేదోయొక అంశముచేత ధరించియున్నాడు (గీత 10-42) ఆయన యొక్కడే, అన్నిటికి గతి (ప్రాప్యస్థానము), భర్త, నివాసస్థానము ఆశ్రయుడు, ప్రభవు (ఉత్పత్తిచేయువాడు), ప్రళయము, స్థానము, నిధానమునై యున్నాడు (గీత 9-18) ఈవిధముగా, అన్నింటిస్థితి భగవంతుని ఆధీనమేయని తెలియవలెను. కనుకనే, సర్వభూతములు భగవంతునందున్నవని చెప్పబడెను.

2. మేఘములలో ఆకాశమువలె భగవంతుడు ప్రపంచములో అణువణువునను వ్యాపించి యున్నప్పటికిన్ని భగవంతుడా ప్రపంచముకంటే పూర్తిగా అతీతుడైయున్నాడు. దానితో ఆయనకు ఏమాత్రముగూడ సంబంధము లేదు. సర్వప్రపంచము నశించినప్పటికిన్ని, మేఘములు నశించిన తరువాత ఆకాశమువలె, భగవంతుడు ఉన్నవాడునట్లుగనే యథాస్థితిలో నుండును. ప్రపంచ నాశముతో భగవంతుని నాశముకాదు. ఎక్కడైతే యీ జగత్తు లేశముగూడ నుండదో, అక్కడగూడ భగవంతుడు తన మహిమలో నుండనేయున్నాడు. ఆభావము తెలుపుటకే భగవంతుడు "వాస్తవముగా నేను భూతములలో లేను. అనగా, నేను నాలోనే సర్వదా ఉన్నాను"అని తెలిపెను.

"న చ మత్స్థాని భూతాని పశ్య మే యోగమైశ్వరమ్[1]
భూతభృన్న చ భూతస్థో మమాఽత్మా భూతభావనః" 5

"అర్జునా! ఆభూతములన్నియు నాయందులేవు. కాని, నా యీశ్వరీయ శక్తిని చూడుము.[2] భూతముల ధారణ-పోషణములు చేయునటువంటిది. భూతములను పుట్టించునదిగూడ నైన నాఆత్మ వాస్తవముగా భూతములలో నుండదు.

---

1. సర్వ ప్రపంచ సృష్టిచేసి, అంతట వ్యాపించియుండి, అన్నిటిని ధరించి పోషించుచు అన్నిటినుండి నిర్లిప్తమైయుండు నతని శక్తి ప్రభావము ఈశ్వరునియందుదప్ప ఇతర వస్తువునందు దేనియందుగూడ నుండదు. ఈ శక్తియే యిక్కడ ఐశ్వర్యం యోగం అను పదములచేత ప్రతిపాదింపబడినవి. ఈ రెండు శ్లోకములలో చెప్పబడిన విషయములన్నియు దృష్టియందుంచుకొని భగవంతుడు అర్జునునకు తన 'ఈశ్వరీయయోగమును' చూడమని చెప్పెను–

2. ఇక్కడ భగవంతుడు 'అర్జునా! నీవు నా అసాధారణ యోగశక్తిని చూడుము. ఆకాశమునందు మేఘమువలె సర్వప్రపంచము నాయందున్నది లేదుగూడ. ఇది యెట్టి చమత్కారము-ఆశ్చర్యము. మేఘములకు ఆధారము ఆకాశము–కాని, మేఘము ఆకాశము నందెల్లప్పటికినుండదు. వాస్తవముగా మేఘము అనిత్యము. కాబట్టి, దానికి స్థిరమైన సత్త (అస్తిత్వము) గూడలేదు. కనుక మేఘములు ఆకాశమునందులేవు. ఈ విధముగనే, యీ సర్వప్రపంచము పుట్టినది యోగశక్తిచేతనే నేనే దీనికి ఆధారము. కనుకనే, సర్వభూతములు నాయందున్నవి. కాని, ప్రపంచము పుట్టినది నా యోగశక్తిచేతనే. నేనే దీనికి ఆధారము. కనుకనే సర్వభూతములు నాయందున్నవి. కాని యిట్లుండియు నేను ఈ ప్రపంచముకంటె పూర్తిగా అతీతుడను. ఇది నాయందు సర్వదాయుండదు. కనుకనే, యెంతవరకు మనుష్యుని దృష్టిలో ప్రపంచమున్నదో అంతవరకు, ఇదియంతయు నాయందేయున్నది. నేను దప్ప ఈ ప్రపంచమునకు ఆధారములేదు. నా సాక్షాత్కారమైనప్పుడు, మనుష్యుని దృష్టిలో నాకన్న వేరైనవస్తువు మరి యొకటి యేదియునుండదు. అప్పుడు నాయందు ఈ జగత్తు ఉండదు'అను భావము తెలిపెను.

"యథాఽఽకాశస్థితో నిత్యం వాయుః సర్వత్రగో మహాన్
తథా సర్వాణి భూతాని మత్స్థానీత్యుపధారయ" 6

"అర్జునా! యెట్లైతే, ఆకాశమునుండి పుట్టి, అంతట సంచరించు మహావాయువు, సర్వదా ఆకాశమునందే యుండునో, అట్లే, నా సంకల్పముచేత ఉత్పన్నములగుటచేత సమస్త భూతములు నాయందున్నవని తెలిసికొనుము.[1]

సంబంధము-

విజ్ఞాన సహిత జ్ఞానమును వర్ణించుచు భగవంతుడు, ఇంతవరకు ప్రభావ సహితమైన తన నిరాకార స్వరూప తత్త్వము వివరించిచెప్పుటకు, తాను అన్నింటి యందు వ్యాపకుడై యున్నానని, అన్నిటికి ఆధారభూతుడనని, అన్నిటిని పుట్టించు వాడనని అసంగుడనని, నిర్వికారుడననియు తెలిపెను. ఇప్పుడు తన భూతభావనా స్వరూపమును స్పష్టీకరించుచు సృష్టి నిర్మాణాది కర్మల తత్త్వము తెలుపుచున్నాడు.

---

1. ఆకాశమువలె భగవంతుడు 'సముడు-నిరాకారుడు-అకర్త-అనంతుడు-అసంగుడుఅని నిర్వికారుడుఅని, ఆకాశమునుండి వాయువువలె సమస్త చరాచర భూతములు భగవంతునినుండియే ఉత్పన్నములై, ఆయనయందే నిలిచియుండి, ఆయనలోనే లీనములగునట్టివియు' నని తెలుపుటకు ఇట్లు చెప్పబడెను. వాయువుయొక్క ఉత్పత్తి-స్థితి-లయములు ఆకాశమునందే యుండుటచేత, వాయువు ఎప్పుడున్ను, ఎట్టి పరిస్థితిలోను, ఆకాశమునుండి వేరుగానుండక సర్వదా ఆకాశమునందే యుండును. ఇట్లున్నప్పటికిన్ని, ఆకాశమునకు వాయువుతో, వాయువుయొక్క గమనాగమనాది వికారములతోను ఏమాత్రము సంబంధములేదు. ఆకాశము వాయువుకంటే ఎల్లప్పటికిన్ని అతీతమై యుండును. ఆ విధముగానే, సర్వప్రాణుల ఉత్పత్తి-స్థితి-లయములు భగవంతుని సంకల్పమును ఆధారముగానే చేసికొనియుండుటచేత సమస్త భూత సముదాయము సర్వదా భగవంతునియందే నిలిచి యుండును. అయినప్పటికిన్ని, భగవంతుడు ఆ భూతములన్నిటికంటే పూర్తిగా అతీతుడై యున్నాడు. భగవంతునకు ఎల్లప్పటికిన్ని, అన్ని విధములైన వికారములు పూర్తిగా నుండనేయుండవని తెలియవలెను.

సర్వభూతాని[1] కౌంతేయ ప్రకృతిం యాంతి మామికామ్
కల్పక్షయే[2] పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్ 7

"అర్జునా! కల్పముల అంతమందు సర్వభూతములు నా ప్రకృతిని పొందును.[3] అనగా, ప్రకృతిలో లీనమైపోవును. కల్పముల ఆదియందు వానిని నేను మరల రచియించెదను.[4]

---

1. శరీరము-ఇంద్రియములు-మనస్సు-బుద్ధి-ఇవి సమస్త సుఖభోగ వస్తువులు. వానిస్థానములతో గూడిన చరాచర ప్రాణులు 'సర్వభూతాని' అను పదమునకు అర్థములు.

2. బ్రహ్మయొక్క ఒకదినము 'కల్పము' అనబడును. ఆయనకు రాత్రిగూడ అంత పెద్దదిగానే యుండును. ఈ అహోరాత్రముల లెక్కప్రకారము, బ్రహ్మకు ఒక నూరు సంవత్సరములు నిండినప్పుడు ఆయన యాయుస్సు సమాప్తమగును. ఈ కాలము ఇక్కడ 'కల్పక్షయము' అను పదమునకు అర్థము. అదియే 'కల్పాంతమ'నబడును. దీనినే 'మహాప్రళయము' అనెదరు.

3. సమస్త ప్రపంచమునకు కారణభూతమైన ఏమూలప్రకృతి, భగవద్గీత పదునాల్గవ అధ్యాయములో మూడవ-నాల్గవ శ్లోకములలో 'మహద్బ్రహ్మ' అని చెప్పబడెనో, దేనిని 'అవ్యాకృతము' అని, 'ప్రధానము' అనియు చెప్పెదరో, అది యిక్కడ 'ప్రకృతి' అను పదమునకు అర్థము. ఆ ప్రకృతి, భగవంతుని శక్తి. ఈ విషయము తెలుపుటకే 'భగవంతుడు' అది నా ప్రకృతి' యని చెప్పెను. కల్పముల అంతమునందు శరీరము-ఇంద్రియములు-మనస్సు-బుద్ధి, యివి, సుఖభోగ సామగ్రి, లోకములతోపాటు సర్వప్రాణులున్ను, ప్రకృతిలో లయమగుట-అనగా, వాని గుణకర్మల సంస్కారముల సముదాయరూపమగు కారణ శరీర సహితముగా, వాని మూలప్రకృతిలో విలీనమగుటయే 'సర్వభూతములు ప్రకృతిని పొందుట' యనబడును.

4. కల్పములు అంతమైనపిదప, అనగా, బ్రహ్మయొక్క నూరు వర్షముల కాలము ముగిసిన తరువాత జీవుల కర్మ ఫలమును అనుభవింపజేయుటకు

ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః
భూతగ్రామ మిమం కృత్స్నమవశం ప్రకృతేర్వశాత్ 8

అర్జునా! నా ప్రకృతిని అంగీకరించి[1], స్వభావబలముచేత పరతంత్రమై యున్న యీ సమస్త భూత సముదాయమును, పలుసార్లు, వాని వాని కర్మాను సారము రచియించెదను.[2]

సంబంధము—

ఈ విధముగా జగద్రచనాది సమస్త కర్మలు చేయుచుగూడ, భగవంతుడా కర్మల బంధనములో నెందుకు చిక్కుకొనడు? అను నీతత్త్వమునే యిప్పుడు వివరించుటకు భగవంతుడిట్లనుచున్నాడు.

---

గాను భగవంతునకు, ప్రపంచమును విస్తరింపజేయుటకుగాను స్ఫురించిన కాలము 'కల్పాది'శబ్దమునకు అర్థమగును. దీనిని 'మహాసృష్టికి ఆది'యనెదరు. అప్పుడు, సర్వభూతముల ఉత్పత్తికిగాను, భగవానుడు తన సంకల్పము ద్వారా హిరణ్యగర్భుడైన బ్రహ్మను అతని లోకముతోపాటు ఉత్పన్నము చేయుటయే 'భగవంతుడు సర్వభూతముల రచన చేయుట' అనబడును.

1. సృష్టిరచనాది కార్యములకొరకు భగవంతుడు శక్తిరూపముచేత తనలో నున్న ప్రకృతిని స్మరించుటయే 'దానిని అంగీకరించుట' యనబడును.

2. వేర్వేరు ప్రాణుల యొక్క వారి వారి గుణకర్మానుసారముగా నేర్పడిన స్వభావమే 'వారిప్రకృతి' యనబడును. భగవంతుని ప్రకృతి సమిష్టి ప్రకృతియని, జీవుల ప్రకృతి భగవంతునియొక్క ఒక అంశమే యాయన వ్యష్టి ప్రకృతి యనబడును. వ్యష్టిప్రకృతి బంధములో పడియుండుటయే, దాని బలముచేత పరతంత్రుడగుట యనబడును. ఇక్కడ భగవంతుడు ఆ జీవులను పలుసార్లు రచించెదననిచెప్పి, జీవులు తమ అంశ భూతమైన ప్రకృతి వశములో నున్నంతవరకు, నేను జీవులను మాటి మాటికి ఈ విధముగానే ప్రతి కల్పమునందున్న కల్పాదిలో ఆజీవుల గుణకర్మాను సారముగా వివిధ యోనులలో ఉత్పన్నము చేయుదునని తెలిపెను.

న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ
ఉదాసీనవదాసీనమసక్తం తేషు కర్మసు 9

"అర్జునా! ఆ కర్మలయందు ఆసక్తిరహితుడనై, ఉదాసీనునివలెనున్న పరమాత్ముడనైన నన్ను ఆకర్మలు బంధింపజాలవు.[1]

"మయాఽధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్
హేతునాఽనేన కౌంతేయ జగద్ విపరివర్తతే" 10

"అర్జునా! అధిష్ఠాతనైన నా సమీపమునందుండి ప్రకృతి చరాచర సహితమైన సర్వజగత్తును నిర్మించును.[2] ఈ కారణముచేతనే ఈ సంసారచక్రము తిరుగుచున్నది.

సంబంధము-

తన ప్రతిజ్ఞానుసారము భగవంతుడు విజ్ఞాన సహిత జ్ఞానమును వర్ణించుచు నాలుగవ శ్లోకమునుండి, ఆరవ శ్లోకమువరకు ప్రభావ సహిత సగుణ-నిరాకార

---

1. సమస్త ప్రపంచోత్పత్తి-పాలన-సంహారాదులకొరకు, భగవంతుడు చేయు పనులందుగాని, వాని ఫలమునందుగాని ఆయనకు ఏలాటి ఆసక్తి లేకుండుట, 'ఆసక్తి రహితుడైయుండుట'యనబడును. కేవలము అధ్యక్షుడుగానుండి ప్రకృతిద్వారా ప్రాణుల గుణకర్మానుసారముగా వారి ఉత్పత్త్యాదులకొరకు చేయబడు ప్రయత్నములో కర్తృత్వాభిమానము పక్షపాతము లేకుండా నిర్లిప్తుడై యుండుట ఆకర్మలయందు ఉదాసీనునివలె నుండుట యనబడును.

2. కర్షకుడు తన అధ్యక్షతలో భూమిలో విత్తనము నాటినపిదప, భూమి ఆయా విత్తనముల నుండి వివిధములైన మొలకలను పుట్టించునట్లు, భగవంతుడు, తన యధ్యక్షతలో చేతన సమూహ రూపమైన బీజ సముదాయమును ప్రకృతి రూపమైన భూమిలో నాటును. (గీత 14-3) ఇట్లు జడ-చేతనముల సంబంధము కలిగించిన పిమ్మట, ప్రకృతి సమస్త చరాచర ప్రపంచమును, తత్తత్కర్మానుసారముగా వేర్వేరు యోనులలో ఉత్పన్నము చేయును.

స్వరూపతత్త్వమును తెలిపెను. తరువాత ఏడవశ్లోకమునుండి పదవశ్లోకమువరకు సృష్టి రచనాది సమస్త కర్మలందు తన అసంగత్వమును నిర్వికారత్వమును వివరించిచెప్పి, ఆ కర్మల దివ్యత్వముయొక్క తత్త్వమునుగూర్చి తెలిపెను. ఇప్పుడు తన సగుణ-సాకార రూపముయొక్క తత్త్వమును దానిని గూర్చిన భక్తి ప్రకారమును, గుణ-ప్రభావముల తత్త్వమునుగూర్చి వివరించుటకు మొదటి రెండు శ్లోకములలో, దాని ప్రభావమును తెలిసికొనని, అసుర ప్రకృతి గల మనుష్యులను నిందించుచున్నాడు.

భగవంతుడు జగద్రచయితనని చెప్పికొనినాడు. ఈ సందర్భములో భగవంతుడు వాస్తవముగా, స్వయముగా ఏమియుచేయడు. తన శక్తియైన ప్రకృతిని స్వీకరించి, దాని ద్వారా జగద్రచన చేయునని తలచవలెను. ప్రకృతి సృష్టి రచనాది కార్యములు చేయునను సందర్భములో ప్రకృతి, భగవంతుని యధ్యక్షతలో ఆ సత్తనుండి స్ఫూర్తినిపొందియే అంతయు చేయునని తలచవలెను. 'భగవంతుని సహాయము లభించనంతవరకు జడమైన ప్రకృతి యేమియుచేయజాలదు. కనుకనే భగవంతుడు ఎనిమిదవ శ్లోకములో, 'నేను నా ప్రకృతిని స్వీకరించి జగద్రచన చేసెదను'అని చెప్పెను. ఈ శ్లోకములో నాయధ్యక్షతలో ప్రకృతి జగద్రచన చేయును' అని చెప్పెను. వాస్తవముగా, ఈ రెండు విధములైన యుక్తులచేత తెలుపడిన తత్త్వమొకటేయని తెలియవలెను.

"అవజానన్తి మాం మూఢా మానుషీంతనుమాశ్రితమ్
పరం భావమజానన్తో మమ భూతమహేశ్వరమ్" 11

అర్జునా![1] నా పరమభావమును తెలిసికొనజాలని[2] మూఢులైన మనుష్యులు

---

1. భగవద్గీత పదియారవ అధ్యాయములో నాలుగవశ్లోకములో, ఏడవశ్లోకము నుండి ఇరువదవ శ్లోకమువరకు దేనియొక్క వివిధ లక్షణములు తెలుపబడెనో, అట్టి అసురీ సంపదగల మనుష్యులకొరకు 'మూఢాః'అను పదము వాడబడినది.

2. ఈ అధ్యాయములో నాలుగునుండి ఆరవశ్లోకమువరకు భగవంతునియొక్క ఏ సర్వవ్యాపకత్వము మొదలైన ప్రభావములు వర్ణింపబడెనో ఏది ఐశ్వర్యము

సర్వభూతములకుగూడ గొప్ప యీశ్వరుడనైన నేను మనుష్య రూప మును ధరించియుండగా, నేను తుచ్ఛుడనని తలచెదరు. అనగా నాయోగమాయ చేత, ప్రపంచోద్ధారము కొరకు మనుష్య రూపములో సంచరించుచున్న పరమే శ్వరుడనైన నన్ను సాధారణ మనుష్యునిగా భావించెదరు.[3]

---

అని చెప్పబడెనో గీత యేడవ అధ్యాయములో ఇరువదినాలుగవ శ్లోకము నందు ఏ పరమభావము తెలిసికొనబడజాలదని చెప్పబడెనో భగవంతుని ఆ సర్వోత్తమ ప్రభావమును తెలుపునది యేయిక్కడ పరమవిశేషణములో పాటు 'భావ'శబ్దము వాడబడినది. సర్వాధారుడు సర్వవ్యాపి సర్వశక్తి సంపన్నుడు సర్వసృష్టి సంహారకారుడునైన పరమేశ్వరుడే సమస్త జీవు లను అనుగ్రహించి అందరికిన్ని తన శరణమిచ్చుటకు ధర్మసంస్థాపనము భక్తోద్ధరణము మొదలైన అనేక లీలా విలాసకార్యములు చేయుటకున్న తన యోగమాయచేత మనుష్యుడుగా అవతరించెను (గీత 4-6,7,8) ఈ రహస్యము తెలిసికొనకుండుట దీనిపైన విశ్వాసము ఉండకుండుటయే 'ఆ పరమభావమును' తెలియకుండుట అనబడును.

3. మహాభారతము భీష్మపర్వము అరువదియారవఅధ్యాయములో ఇట్లు తెలుప బడెను:- సర్వలోక మహేశ్వరుడు-భగవంతుడునైన వాసుదేవుడు అందరి కిన్ని పూజనీయుడు. ఆ మహావీర్యసంపన్నుడు శంఖచక్ర గదాధారియైన వాసుదేవుడు మనుష్యుడని తలచి యెప్పుడుగూడ ఆయనని అవమానపరచ గూడదు. ఆయనయే పరమగుహ్య-పరమపద-పరబ్రహ్మ-పరమయశస్స్వ రూపుడని తెలిసుకొనవలెను. ఆయనయే అక్షరుడు-అవ్యక్తుడు-సనాతనుడు- పరమ తేజస్సంపన్నుడు-పరమ సుఖస్వరూపుడు-పరమ సత్యస్వరూపుడు నని తెలియవలెను. దేవతలు-ఇంద్రుడు-మనుష్యులు ఎవరుగూడ అపరిమిత పరాక్రమశాలియైన వాసుదేవ ప్రభువు మనుష్యుడని తలచి ఆయనకు అనాదరము చేయగూడదు. ఆ హృషీకేశుడు, మనుష్యుడనిచెప్పు మూర్ఖులు ఇది తెలిసికొనవలెను. ఏమనుష్యులైతే, మహాత్ములైన యీయోగేశ్వరుడు మనుష్యదేహధారియని తలచి యాయనకు అనాదరముచేసెదరో, ఎవరైతే ఈచరాచర ప్రపంచమునకు ఆత్మభూతుడు శ్రీవత్సశోభితవక్షఃస్థలుడు మహాతేజశ్శాలి పద్మనాభుడునైన భగవంతుని గుర్తింపరో, అట్టివారు

మోఘాఽశా[1] మోఘకర్మాణో[2] మోఘజ్ఞానా[3] విచేతసః
రాక్షసీమాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః 12

అర్జునా! వ్యర్థమైన ఆశ, వ్యర్థకర్మలు, వ్యర్థజ్ఞానము, చంచల చిత్తము గల ఆయా జ్ఞానులు రాక్షసీ ఆసుర, మోహినీ, ప్రకృతినే ధరించియుండెదరు.[4]

---

తామసీ ప్రకృతి గలవారని తెలియవలెను. ఎవరైతే కౌస్తుభకిరీటధారి మిత్రులకు అభయ ప్రదాతయునైన భగవంతుని అవమాన పరచెదరో వారు అతిభయంకర నరకములో పడెదరని తెలియవలెను.

1. భగవంతుని ప్రభావము నెరుగని ఆసుర ప్రవృత్తిగల మనుష్యులు ఎప్పుడు గూడ నెరవేరని నిరర్థకములైన ఆశలు గలవారు (గీత 16-10,11,12) ఇందుచేతనే అట్టివారు మోఘాఽశాః అని యనబడెదరు.

2. భగవంతునియందు శాస్త్రములందున్న విశ్వాసములేక విషయాసక్తులైన పామర జనులు శాస్త్రోక్తవిధిని విడిచి, శ్రద్ధారహితులై ఇష్టము వచ్చినట్లు చేయు యజ్ఞాదికర్మకు ఈలోకమునందుగాని పరలోకము నందుగాని కొంచెంకూడా ఫలము లభించదు. (గీత 16-17, 23-17-28) ఇందు చేతనే వారు 'మోఘకర్మాణః' అనబడెదరు.

3. ఎవరి జ్ఞానము వ్యర్థమో, తాత్త్వికార్థరహితమో, యుక్తి యుక్తముకాదో (గీత 18-22) అట్టివారు 'మోఘజ్ఞానాః' అని యనబడెదరు.

4. రాక్షసులవలె నిష్కారణముగా ద్వేషించి యితరులకు కీడు కష్టము కలిగించు నట్టి స్వభావము రాక్షస ప్రకృతి యనబడును. కామ-లోభములకు వశమై, తన స్వార్థసిద్ధి కొరకు ఇతరులకు క్లేశముకలిగించునట్టి హరించు నట్టి స్వభావమునకు 'ఆసురీప్రకృతి' యని పేరు. ఏమరుపాటు మోహము కారణముగా, ఏప్రాణికైనను దుఃఖము కలిగించు స్వభావము 'మోహినీ ప్రకృతి' యనబడును. ఇటువంటి దుష్టస్వభావములను విధించుటకు ప్రయత్నము చేయకుండుటమాని, అదియే ఉత్తమమని తలచి దానినే గట్టిగా పట్టుకొని యుండుటయే ఆ స్వభావమును ధరించుట యనబడును.

సంబంధము—

భగవంతుని ప్రభావమును తెలిసికొనజాలని ఆసురీప్రకృతిగల మనుష్యులను నిందించి యిప్పుడు భగవంతుడు సగుణభక్తిని తెలుపుటకు భగవంతుని ప్రభావమును తెలిసికొని దైవప్రకృతిని ఆశ్రయించి ఉన్నతశ్రేణికిచెందిన అనన్య భక్తుల లక్షణమునుగూర్చి తెలుపుచున్నాడు:-

"మహాత్మానస్తు[1] మాం పార్థ దైవీం ప్రకృతిమాశ్రితాః
భజంత్యనన్యమనసో జ్ఞాత్వా భూతాదిమవ్యయమ్ 13

కాని అర్జునా! దైవ ప్రకృతిని ఆశ్రయించిన[2] మహాత్ములు నన్ను సర్వ

---

భగవంతుని ప్రభావమును తెలియని మనుష్యుడు తరచుగా ఇట్లే చేయును. కనుకనే అతడు ఆదుష్టప్రకృతి నాశ్రయించి యుండునని తెలుపబడినది.

1. ఇక్కడ "మహాత్మానః" అను పదము నిష్కాములు-అనన్య ప్రేమగల వారు-భగవద్భక్తులు అనునర్థములో ప్రయోగింపబడినది. వారు భగవత్ప్రేమలో సర్వదా తేలియాడుచునుండెదరు. వారు భగవత్ప్రాప్తికి సర్వదా యోగ్యులు.

2. దేవుడు అనగా భగవంతుడు. ఆయనతో సంబంధముగలిగి భగవత్ప్రాప్తి కలిగించునదియునగు ఏ సాత్త్వికగుణము సాత్త్వికాచరణముగలదో, భగవద్గీత పదియారవ అధ్యాయములో మొదటి మూడు శ్లోకములలో ఏది అభయము మొదలగు నిరువదియారు పేర్లతో వర్ణింపబడెనో ఆయన్నిటిని పూర్తిగా కలిగి దైవీ ప్రకృతిని ఆశ్రయించియుండుట'యని యనబడును.

భూతములకు సనాతన కారణుడనని వినాశరహితుడైన అక్షర స్వరూపుడననియు తెలిసికొని[1] అనన్య చిత్తములో నిరంతరము నన్ను భజించెదరు.[2]

"సతతం[3] కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః
నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే" 14

---

1 ఇక్కడ 'మాం'అను పదమునకు భగవంతుని సగుణ-పురుషోత్తమ రూపమని యర్థము. ఆ సగుణ పరమేశ్వరునినుండియే శరీర-ఇంద్రియ-మనస్-బుద్ధి-సుఖభోగసామాగ్రి-సమస్తలోకములతోపాటు సర్వచరాచరప్రాణులు ఈయన్నిటియొక్క ఉత్పత్తి-పాలన-సంహారములు కలుగును. (గీత 7-6, 9-18; 10-2,4,5.6,8) ఈ తత్త్వమును బాగుగా తెలిసికొనుటయే, భగవంతుడు సర్వభూతములకు ఆదియని తెలిసికొనుట యనబడును. భగవంతుడు జన్మరహితుడు-వినాశరహితుడు, కేవలము లోకులను అనుగ్రహించుటకే లీలావిలాసములచేత మనుష్యాది రూపములలో నవతరించి అంతర్ధానము చెందుచుండును. ఆయనయే అక్షరుడు-అవినాశి-పరబ్రహ్మము పరమాత్ముడునని చెప్పుచుండెదరు. సమస్త భూతప్రాణులు నశించినను భగవంతునకు నాశములేదు. (గీత 8-20) అని యథార్థముగా తెలిసికొనుటయే భగవంతుడు అవినాశియని తెలిసికొనుట యనబడును.

2. ఎవని మనస్సు భగవంతునియందు తప్ప ఇతర వస్తువు దేనియందును. రమింపదో ఎవనికి క్షణమాత్రముగూడ భగవంతుని వియోగము సహింపరానిదో, భగవంతుని అనన్య ప్రేమియైన అటువంటి భక్తుడు నిరంతరము భగవంతుని భజించుచుండును.

3. ఇక్కడ సతతంఅను పదమునకు నిత్య నిరంతర, సమయమని యర్థము. దీనికి ఉపాసనతో ముఖ్య సంబంధముగలదు. కీర్తన-నమస్కారాదులు, ఉపాసనాంగములే కనుక మరియొక విధముగా ఆయన్నిటితోను దీనికి సంబంధముగలదు. భగవంతునకు ప్రేమాస్పదుడైన భక్తుడు ఒకప్పుడు కీర్తనము చేయుచు నమస్కారముచేయుచు మరియొక్కప్పుడు భగవత్సేవాదులు చేయుచు, ఎల్లప్పుడు భగవంతుని చింతనము

అర్జునా! అటువంటి దృఢనిశ్చయముగల భక్తజనులు నాయొక్క నామమును గుణములను నిరంతరము కీర్తించుచు[1] నన్ను పొందుటకు యత్నము చేయుచు, నాకు మాటిమాటికిన్ని ప్రణామము చేయుచు[2] ఎల్లప్పుడున్ను నాధ్యా

---

చేయుచు నిరంతరము ఆయన ఉపాసన చేయుచుండును అని యభిప్రాయము.

యతంతః అను పదమునకు ప్రేమగల భక్తులు, భగవత్పూజ, అందరున్ను భగవత్స్వరూపులుగానే భావించి వారిసేవ, భగవద్భక్తులచేత చెప్పబడు భగవద్గుణ ప్రభావ-చరిత్రాదుల-శ్రవణాదులను ఉత్సాహముతో ఆసక్తితోను చేయుచుందురు అని భావము.

భగవంతునియందు ప్రేమగల భక్తుల నిశ్చయము-శ్రద్ధ-చింతనము-నియమములు అన్నియు మిక్కిలి దృఢములై యుండును. ఎంత పెద్ద విపత్తులు-విఘ్నములు ఎన్నివచ్చినను, ఆ భక్తులను వారి సాధన-చింతనములనుండి చలింపజేయజాలవు. ఈ కారణముచేతనే వారు 'దృఢవ్రతాః' (దృఢనిశ్చయము గలవారు) అని యనబడెదరు.

ఎవరైతే నడచుచూ-తిరుగుచు-కూర్చునుచు - నిద్రించుచు-మేల్కొనుచు అన్నిపనులు చేయుచున్నప్పుడు ఏకాంతమునందు ధ్యానము చేయుచున్నప్పుడు ఎల్లప్పుడుగూడ భగవచ్చింతనము చేయుచుండెదరో వారు నిత్యయుక్తులు.

1. పురాణ-ఉపన్యాసాదులచేత భక్తులయెదుట భగవద్గుణ-ప్రభావ-మహిమ-చరిత్రాదుల వర్ణనముచేయుట ఒంటరిగాగాని, పదుగురితో కలిసిగాని భగవంతుని పవిత్రనామము జపముగాని బిగ్గరగా కీర్తనముగాని భగవంతుడు తన సమక్షంలోనున్నట్లు తలచుచు, చేయుట దివ్యస్తోత్రముచేత మనోహర గానముచేత భగవంతుని స్తుతి ప్రార్థన చేయుట ఈ మొదలైన భగవన్నామ గుణగానములకు సంబంధించిన ప్రయత్నములన్నియు 'కీర్తనములో' చేరును.

2. భగవంతుని మందిరమునకుపోయి అర్చావతారుడైన భగవంతుని విగ్రహ

వము నందే నిమగ్నులైయుండి అనన్యప్రేమతో నా ఉపాసన చేసెదరు.[1]

సందర్భము:-

భగవంతుని గుణప్రభావాదులను తెలిసికొనినవారై అనన్యప్రేమగల భక్తులు చేయు భజన ప్రకారమునుగూర్చి చెప్పి యిప్పుడు భగవంతుడు, వారికంటే భిన్నశ్రేణికి చెందిన ఉపాసకుల ఉపాసన విధమునుగూర్చి తెలుపుచున్నాడు.

"జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజంతో మాముపాసతే
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్" 15

అర్జునా! యితర జ్ఞానయోగులు నిర్గుణ నిరాకార బ్రహ్మమును జ్ఞాన యజ్ఞముద్వారా అభిన్న భావముతో పూజించుచుగూడ నా ఉపాసన చేసెదరు.[2]

---

మునకు తన యింటిలోనున్న భగవంతుని ప్రతిమకు చిత్రమునకు భగవన్నామములకు భగవంతుని చరణములకు పాదుకలకు అందరూ భగవత్స్వరూపులని తలచికాని, లేక అందరి హృదయములో భగవంతుడున్నాడని కాని తెలిసికొని సమస్తప్రాణులకు యోగ్యతానుసారముగా, వినయపూర్వకముగా శ్రద్ధాభక్తులతో వాక్కుచేత శరీరముచేత నమస్కారము చేయుటయే భగవంతునకు ప్రణామము చేయుటయనబడును.

1. శ్రద్ధచేత అనన్యప్రేమచేత పైన చెప్పబడిన సాధనములను నిరంతరము చేయుచుండుటయే ప్రేమతో భగవదుపాసన చేయుటయగును.

2. భగవద్గీత మూడవ అధ్యాయము మూడవ శ్లోకములో వర్ణింపబడిన జ్ఞానయోగము ఇక్కడగూడ చెప్పబడిన జ్ఞాన యజ్ఞముయొక్క స్వరూపమే. దాని ప్రకారము శరీరేంద్రియ మనస్సులచేత చేయబడు సమస్త కర్మలందు మాయామయగుణములే గుణములుగా వ్యవహరింపబడునని తలచి కర్తృత్వాభిమాన రహితుడైయుండుట కనపడు వస్తుసముదాయమంతయు ఎండమావిలోని జలమువలె లేక స్వప్నప్రపంచమువలె అనిత్యములని తలచుట సచ్చిదానంద ఘన-నిర్గుణ-నిరాకార - పరబ్రహ్మ - పరమాత్మ యొక్కడుదప్ప ఇతరవస్తువేదియు సత్తా (అస్తిత్వము) లేనిదని తెలిసికొని

మరి కొందరు మనుష్యులు అనేక విధములుగనున్న-విరాట్ స్వరూపుడు-పరమే శ్వరుడునైన నన్ను వేరుభావముచేత ఉపాసించెదరు.[1]

సంబంధము :

సమస్త ప్రపంచోపాసన భగవదుపాసనయే యెట్లగును అను విషయము స్పష్టముచేయుటకు ఇప్పుడు భగవంతుడు నాలుగుశ్లోకములచేత సర్వప్రపంచము నా స్వభావమేయని ప్రతిపాదించుచున్నాడు:-

"అహం క్రతు[2] రహం యజ్ఞః[3] స్వధా[4] ఽహమహమౌషధమ్
మంత్రోఽహమహ మేవాఽజ్యమహమగ్ని[5] రహం హుతమ్"

---

నిరంతరము ఆ పరమాత్మని శ్రవణ-మనన-నిదిధ్యాసనములు చేయుచు ఆ సచ్చిదానంద ఘన బ్రహ్మమునందు సర్వదాభిన్నభావముచేత స్థిరముగా నిలిచియుండుటకు అభ్యాసము చేయుచుండుటయే జ్ఞాన యజ్ఞముచేత భగవంతుని పూజచేయుచు ఆయన ఉపాసన చేయుటయని యనబడును.

1. సమస్త ప్రపంచము భగవంతునినుండియే ఉత్పన్నమైనది. ఆయనయే సర్వత్రవ్యాపించియున్నాడు. కనుక భగవంతుడు స్వయముగానే విశ్వరూపుడైయున్నాడు కనుక సూర్య-చంద్ర-అగ్ని-ఇంద్ర-వరుణాది విభిన్న దేవతలు ఇంకను సమస్త ప్రాణులుగూడ భగవత్స్వరూపములేయని తలచి అయన్నిటికిన్ని తన యోగ్యతానుసారముగా నిష్కామ భావముచేత సేవ-పూజ చేయుటయే (గీత 18-46) బహువిధములుగ భగవంతుని విరాట్ స్వరూపము పృథగ్భావముతో ఉపాసించుటయగును.

2. శ్రౌతకర్మ 'క్రతువు'అని యనబడును.

3. ప్రపంచ మహాయజ్ఞాది స్మార్తకర్మ 'యజ్ఞము'అని యనబడును.

4. పితృదేవతల కొరకు ఇవబడు అన్నము 'స్వధా'యనబడును.

5. అగ్నియనగా నిక్కడ గార్హపత్యము, ఆహవనీయము, దక్షిణాగ్ని మొదలగునన్ని విధములైన అగ్నియని తెలియవలెను.

అర్జునా! క్రతువు-యజ్ఞము-స్వధా-ఓషధి - మంత్రము-ఘృతము-అగ్ని - హోమక్రియ" ఇవన్నియుగూడ నేనేయని తెలిసికొనుము.[1]

"పితాఽహమస్య జగతో మాతా ధాతా పితామహః ।
వేద్యం పవిత్రమోంకార ఋక్ సామ యజురేవ చ॥" 17

"అర్జునా! ఈ సర్వజగత్తుకు ధాత-అనగా ధరించువాడను, కర్మఫలదాతను, పితను[2] పితామహుడను[3] తెలియదగినవాడను పవిత్రుడను[4], ఓంకారమను[5],

---

1. యజ్ఞ శ్రాద్ధాదిశాస్త్రీయశుభకర్మలందు వాడబడు సమస్తవస్తువులు తత్సంబంధములైన మంత్రములు వేనియందు యజ్ఞాదులు చేయబడునో ఆ యధిష్ఠానములు మనోవాక్ శరీరములచేత చేయబడు యజ్ఞ సంబంధి సమస్త ప్రయత్నములు - ఇవన్నియు భగవంతుని స్వరూపములే యని భావింపవలెను.

2. ఈ చరాచర ప్రాణులతోగూడిన సమస్త ప్రపంచము భగవంతునినుండియే ఉత్పన్నమైనది. దీనికంతటికిన్ని మహాకారణము భగవంతుడే కనుక భగవంతుడు తానే యీ ప్రపంచమునకు తల్లి-తండ్రియునగును.

3. ప్రపంచసృష్టిచేయు బ్రహ్మాది ప్రజాపతులనుగూడ పుట్టించువాడు భగవంతుడే కనుక, ఆయన తానీ ప్రపంచమునకు పితామహుడను (తండ్రికి తండ్రి) అని చెప్పెను.

4. స్వయముగా పరిశుద్ధుడై యితరుల పాపములను సహజముగానే నశింపజేసి వారినిగూడ పరిశుద్ధులనుగచేయువాడు 'పవిత్రుడు' అనబడును. భగవంతుడు పరమపవిత్రుడు భగవంతునియొక్క దర్శన భాషణ-స్మరణముల చేత మనుష్యుడు పరమ పవిత్రుడగును

5. ఓం అనునది భగవంతుని నామము. దీనిని ప్రణవమనియనెదరు. గీత యెనిమిదవ అధ్యాయము పదమూడవ శ్లోకములో ఓంకారము బ్రహ్మమని చెప్పబడెను. దీనినే ఉచ్చరించవలెనని చెప్పబడెను. పేరు-పేరు గలది. ఈ రెంటియభేదమును ప్రతిపాదించుటకే యిక్కడ భగవంతుడు తాను ఓంకారము అని తెలిపెను.

ఋగ్వేద-సామవేద-యజుర్వేద స్వరూపుడనుగానున్న[1] నేనేయున్నానని తెలిసికొనుము.

"[2]గతిర్భర్తా ప్రభుః సాక్షీ నివాసః శరణం[3] సుహృత్[4] ।
ప్రభవః ప్రళయః స్థానం నిధానం బీజమవ్యయమ్[5]॥" 18

---

1. ఋక్-సామ - యజుస్ అను మూడు పదములకు మూడు వేదములని యర్థము. భగవంతునినుండి వేదములు ప్రకటితములయ్యెను. సర్వ వేదములచేత భగవంతుని జ్ఞానము కలుగును. కనుకనే అన్ని వేదములు నా స్వరూపములేయని భగవంతుడు తెలిపెను.

2. పొందవలసిన వస్తువు 'గతియనబడును. అన్నిటికంటె మించి పొందవలసిన వస్తువు భగవంతుడొక్కడే. కనుకనే ఆయన తనను 'గతి' అని చెప్పికొనెను. పరాగతి పరమాగతి అవినాశి పదము మున్నగు పేర్లుగూడ గతికే కలవు.

3. ఎవని శరణము పొందబడునో అతడు 'శరణం' అనబడును. భగవంతుని వంటి శరణాగతవత్సలుడు-నమస్కరించిన వారిని పాలించువాడు శరణాగతుని దుఃఖములను నశింపజేయువాడున్ను మఱియొకడులేడు. వాల్మీకిముని

"సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే,
అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్ వ్రతం మమ" (6-18-13)

అని రామాయణములో చెప్పెను. అనగా-ఒక్కసారైనను 'నేను నీవాడను' అని చెప్పి నా శరణుజొచ్చి నానుండి అభయము కోరువానికి, అన్ని భూతములనుండిగూడ నిర్భయము కలిగించెదను. ఇది నా వ్రతము" అని యర్థము. కనుకనే భగవంతుడు తాను 'శరణము' అని చెప్పెను.

4. భగవంతుడు సర్వప్రాణులకు అకారణముగానే ఉపకారముచేయుచు, వారి హితమును కోరువాడు, అందరియందు మిక్కిలి ప్రేమచూపు పరమబంధువు కనుక ఆయన తాను 'సుహృత్' అని చెప్పెను.

5. ఎప్పుడుగూడ నశించనిది అవ్యయమనబడును. భగవంతుడు సమస్త చరా

అర్జునా! పొందదగిన పరమధామము-భరణ-పోషణములు చేయువాడను, సమస్తమునకు ప్రభువును[1], శుభాశుభములను గమనించుచుండువాడను, అంతటికి నివాసస్థానమును శరణము నొందబడుటకు యోగ్యుడను, ప్రత్యుపకారమును కోరకుండా హితముచేయువాడను, సమస్త జగత్తుయొక్క ఉత్పత్తి-వినాశములకు కారణభూతుడను ప్రపంచస్థితికి ఆధారభూతుడను, ప్రపంచమునకు నిధానమును[2] వినాశరహితమైన కారణముగాగూడ నేనే యున్నానని తెలిసికొనుము[3].

"తపామ్యహమహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామిచ ।
అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహమర్జున॥" 19

అర్జునా! నేనే సూర్య స్వరూపుడనై తపింపజేయుచుందును. వర్షమును

---

చర భూత ప్రాణములకు అవినాశియైన జన్మకారణుడు. ఆయనయే అన్నిటికి ఉత్పత్తి-స్థితికారకుడు కనుకనే ఆయన 'అవ్యయబీజము' అనబడెను. గీత యేడవ అధ్యాయము పదవ శ్లోకములో ఆయనయే 'సనాతనబీజము' అని పదవ అధ్యాయము ముప్పది తొమ్మిదవ శ్లోకములో అన్ని భూతములకు 'బీజము'అనియు భగవంతునిగూర్చి చెప్పబడెను.

1. భగవంతుడే అందరు ఈశ్వరులకు మహేశ్వరుడు. దేవతల కందరికి పరమ దైవతము పశులకందరకు పరమపతి. ఆయన సర్వ ప్రపంచములకు స్వామి పరమపూజ్యుడు పరమదేవుడు (శ్వేతాశ్వతరోపనిషత్తు 6-7)

2. దేనిలో చాలాకాలము ఏదైన వస్తువు ఉంచబడునో, దానిని నిధానము అనెదరు మహాప్రళయ కాలములో సమస్త ప్రాణులలోగూడ అవ్యక్త ప్రకృతి భగవంతుని యేదోయొక అంశమునందే న్యాసము (ఇల్లడ) వలె చాలాకాలమువరకు నిష్క్రియావస్థలోనుండును. కనుక భగవంతుడు తాను 'నిధానము' అని యనెను.

3. ఈ శ్లోకములో చెప్పబడిన పదములన్నియు భగవంతునకు విశేషణములు. కనుక ఈ శ్లోకములో పూర్వ శ్లోకములలోవలె 'అహం' అను పదము ప్రయోగింపబడెను.

ఆకర్షించుచుందును. వర్షము కురియుచుందును[1] నేనే అమృతస్వరూపుడను[2] మృత్యువును[3] సత్తు-అసత్తుగూడ నేనే[4] యనికూడ తెలిసికొనుము.

సంబంధము—

పదమూడవ - పదునాలుగవ - పదునైదవ శ్లోకములలో భగవంతుడు తన సగుణ-నిర్గుణ-విరాట్ రూపముల ఉపాసనను గూర్చి వర్ణించి పందొమ్మిదవ శ్లోకం వరకు సర్వప్రపంచము తన స్వరూపమని తెలిపెను. "సర్వప్రపంచము నా స్వరూపమే యగుటచేత ఇంద్రాదులైన యితర దేవతల ఉపాసనగూడ, ప్రకారాం

---

1. ఇట్లు చెప్పుటచేత భగవంతుడు తన కిరణములచేత సమస్త ప్రపంచమునకు వేడిమి వెలుతురు ఇచ్చువాడు సముద్రాది జలాశయములనుండి జలమును ఎత్తి ఆ జలమును ప్రపంచ హితముకొరకు మేఘములద్వారా సకాలములో తగినట్లుగా నిచ్చువాడునైన సూర్యుడుగూడ నా స్వరూపమే అను భావమును తెలిపెను.

2. వాస్తవముగా అమృతమైతే భగవంతుడే. ఆయనను పొందిన తర్వాత మనుష్యుడు ఎల్లప్పటికిన్ని, మృత్యుపాశమునుండి విముక్తుడగును. ఈ కారణముచేతనే భగవంతుడు తాను 'అమృతుడు'అని చెప్పెను. ముక్తిని గూడ 'అమృతము'అని చెప్పెను.

3. అన్నింటినాశముచేయు 'కాలము'ను మృత్యువు అనెదరు. భగవంతుడే కాలానుసారముగా లోకములను నశింపజేయుటకు 'మహాకాల'రూపమును ధరించును. ఆయన కాలమునకుగూడ కాలుడు (కాలకాలుడు)ఈ కారణంచేతనే భగవంతుడు తానుమృత్యువునని తన స్వరూపంను తెలిపెను.

4. ఎప్పుడుగూడ దేని అభావము ఉండనేయుండదో అట్టి అవినాశియైన ఆత్మను సత్ అని యనెదరు. నాశముగలిగి అనిత్యమైన వస్తువు సముదాయము 'అసత్'అని యనబడును. ఈ రెండువిధములైనవారే భగవద్గీత పదునైదవ అధ్యాయములో అక్షర పురుషుడు క్షర పురుషుడు అను పేర్లతో చెప్పబడిరి. ఈ యిరువురే భగవంతునికి అభిన్నులు అందుచేత భగవంతుడు 'సత్ అసత్' అనబడు రెండున్ను నా స్వరూపములే యని చెప్పెను.

తరముచేత నా ఉపాసన చేయువారికి నా ప్రాప్తి కలుగును కాని యిట్లు తెలియక ఫలాసక్తి పూర్వకముగా, వేర్వేరు భావములతో ఉపాసనచేయువారికి నా ప్రాప్తి కలుగక వినశ్వరమై అశాశ్వతమైన ఫలమేలభించును. అను నీ విషయమును తెలుపుటకే యిప్పుడు రెండు శ్లోకములలో భగవంతుడు ఫలసహితమైన ఆ ఉపాసనను వర్ణించుచున్నాడు.

"త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే
తే పుణ్యమాసాద్య సురేంద్రలోకమ్
అశ్నంతి దివ్యాన్ దివి దేవభోగాన్. 20

అర్జునా! మూడు వేదములందున్న విధింపబడిన సకామకర్మలు చేయువారు సోమరసపానముచేయువారు-పాపరహితులునైన పురుషులు[1] నన్ను యజ్ఞముల ద్వారా పూజించి, స్వర్గప్రాప్తిని కోరెదరు. ఈ పురుషులు, తమ ఫల రూపమైన స్వర్గలోకమును[2] పొంది స్వర్గములో దివ్యములైన దేవ భోగముల ననుభవించెదరు.

---

1. ఋక్-యజుస్-సామములు అను మూడు వేదములకు 'వేదత్రయి' లేక త్రివిద్యః అని పేరు. ఈ మూడు వేదములలో వర్ణితములైన వివిధ యజ్ఞముల విధులందు, వాని ఫలములందు శ్రద్ధాప్రేమగలవారు, వాని ప్రకారము సకామకర్మలు చేయు మనుష్యులు 'త్రైవిద్యులు' అనబడెదరు. యజ్ఞములలో సోమరసపానము విధి తెలుపబడెను. ఆ విధిచేత సోమలతారసపానము చేయువారిని 'సోమపులు' అని యనెదరు. పైన చెప్పబడిన వేదోక్తకర్మలు విధిపూర్వకముగా అనుష్ఠించుటచేత, ఎవరికి స్వర్గప్రాప్తిలో ప్రతిబంధకముగానున్న పాపము నష్టము అయ్యెనో వారిని 'పూతపాపులు' అని యనెదరు. ఈ మూడు విశేషణములు భగవంతుని సర్వరూపుడని తెలిసికొనక శ్రద్ధా ప్రేమలతో పాపకర్మలనుండి తప్పించుకొనుచు సకామభావముతో యజ్ఞాది కర్మలు విధిపూర్వకముగా అనుష్ఠానము చేయువారినిగూర్చి చెప్పబడినవి.

2. యజ్ఞాది పుణ్యకర్మల ఫలముగా ప్రాప్తించు స్వర్గలోకమునుండి బ్రహ్మ

"తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలమ్
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి
ఏవం త్రయీధర్మమను ప్రపన్నా
గతాగతం కామకామా లభంతే." 21

అర్జునా! వారు ఆ విశాలమైన[1] స్వర్గలోక సుఖము ననుభవించి వారి పుణ్యము క్షీణించిన తర్వాత మృత్యులోకమును పొందెదరు. ఈ విధముగా స్వర్గ సాధన రూపమైన వేదత్రయోక్త సకామకర్మలను ఆశ్రయించి భోగేచ్ఛాసక్తులైన పురుషులు మాటిమాటికి గమనాగమనములు చేయుచుందురు. అనగా పుణ్య ప్రభావముచేత స్వర్గమునకు పోవుచుందురు. పుణ్యము క్షీణించిన పిదప మృత్యులోకమునకు వచ్చెదరు.[2]

---

లోకము వరకు నున్న లోకములన్నింటిని దృష్టిలోనుంచుకొని ఈ శ్లోకములో 'పుణ్య' అను విశేషణముతోగూడ 'సురేంద్రలోకం' అను పదము ప్రయోగింపబడినది. కనుక 'సురేంద్రలోకం' అను పదము 'ఇంద్రలోకము' అనునర్థమును తెలుపుచున్నప్పటికిన్ని పైన చెప్పబడినది అన్నిలోకములను గూడ తెలుపుచున్నదని గ్రహించవలెను.

1. స్వర్గాదిలోకముల వైశాల్యము అక్కడి భోగ్యవస్తువులు—ఆ వస్తువుల అనుభవించు విధము ఆ వస్తువుల సుఖస్వరూపము-దానిని అనుభవించుటకు తగిన శారీరక, మానసికశక్తి దానికొరకు అవసరమైన పరమాయుస్సు ఈ మొదలైనవాని అన్నింటియొక్క అనేక విధములైన పరిమాణములు మృత్యులోకపు పరిమాణములకన్న ఎంతయో స్పష్టముగా గొప్పవిగా నుండును. ఈ కారణముచేతనే అది 'విశాలము' అని చెప్పబడెను.

2. భగవంతుని స్వరూపతత్త్వము నెరుగని సకామమనుష్యులు అనన్య భావములో భగవంతుని శరణము నొందరు. భోగకామములకు వశులై వారు పైన చెప్పబడినన సకామధర్మముల నాశ్రయించెదరు. ఇందుచేతనే, కర్మ ఫలము అనిత్యము గనుకనే కర్మఫలము నాశ్రయించినవారు తిరిగి మర్త్య లోకముకు వచ్చిపడెదరు.

"అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥" 22

కాని అర్జునా! అనన్య ప్రేమగల యే భక్తులు పరమేశ్వరుడనైన నన్ను నిరంతరము చింతించుచు నిష్కామ భావముతో భజించెదరో[2] నిత్యము-నిరంతరము నా చింతనము చేయునట్టి ఆ పురుషుల యోగక్షేమములు నేను స్వయముగా చేకూర్చెదను[3].

---

1. ఎవరికి ప్రాపంచిక సమస్త భోగములందు ప్రేమ తొలగిపోయి ఒక్క భగవంతునియందు మాత్రమే అచంచలము-స్థిరమునైన ప్రేమకలిగినదో ఎవరికి భగవంతుని వియోగము సహింపరానిదో, ఎవరికి భగవంతుడుదప్ప ఉపాస్యదేవత మరియొకడు ఎవడుగూడలేడో, ఎవరు భగవంతుడొక్కడే పరమాశ్రయుడు-పరమగతి-పరప్రేమాస్పదుడు అని భావించెదరో, అటువంటి అనన్యప్రేమ-ఏకనిష్ఠయుగల భక్తులకు విశేషణముగా 'అనన్యాః' అను పదము వాడబడినది.

2. సగుణుడైన భగవంతుని గుణ-ప్రభావ-తత్త్వ-రహస్యములను తెలిసికొని, నడచుచు, తిరుగుచు, కూర్చొనుచూ, లేచుచు, నిద్రించుచు, మేల్కొనుచు, ఏకాంతమునందు సాధనచేయుచు, అన్నివేళల నిరంతరము ఎడతెగక ప్రయత్నము చేయుచుండుటయే ఆయన చింతనచేయుచు 'భజనము చేయుట' యనబడును,

3. పొందనిదానిని పొందుట యోగము అని పొందినదానిని రక్షించుట 'క్షేమము' అనియు పేర్లు గలవు కనుక భగవంతుని పొందుటకొరకు చేయబడిన సాధనములు 'ప్రాప్తము'లగునో వానిని అన్ని విధములైన విఘ్నములనుండి-బాధలనుండియు తొలగించి రక్షించుటకు ఏదైన సాధనము లోపించినచో దానిని సమకూర్చుకొని దానిని స్వయముగా సంపాదింపజేయుటయే ఆ ప్రేమగల భక్తుల యోగక్షేమములను జరుపుటయనబడును. దీనికి భక్త ప్రహ్లాదుని యుదాహరణము మంచిగానున్నది. హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని సాధనములలో అనేకవిఘ్నములు, బాధలు కలిగించినప్పటికిన్ని,

"యేఽప్యన్యదేవతా భక్తా యజంతే శ్రద్ధయాఽన్వితాః।
తేఽపి మామేవ కౌంతేయ యజంత్యవిధి పూర్వకమ్॥" 23

"అర్జునా! ఒకవేళ శ్రద్ధతో[1] ఇతర దేవతలను సకామ భక్తులు పూజించి నప్పటికిన్ని, వారుగూడ నన్నే పూజించినవారగుదురు. కాని వారు చేయు ఆ పూజ విధి పూర్వకముకాదు. అనగా అజ్ఞానపూర్వకమైన పూజయేయగును[2].

---

ఆ పెద్దపెద్దవిఘ్నముల నన్నిటిని భగవంతుడు తొలగించి అన్నివిధముల ప్రహ్లాదునిరక్షించి చివరకు అతనికి తనయాశ్రయమిచ్చి కాపాడెను.

ఏ పురుషుడైతే భగవంతునియందే తత్పరుడై అనన్యభావముతో భగవంతుని దేహపూర్వకముగా చింతించుచునే సర్వకార్యములు చేయుచు ఇతర విషయములేవియు కోరక యతనినిగూర్చిన అపేక్ష-చింతచేయకుండునో అతని జీవిత నిర్వహణ భారమంతయు భగవంతుని యందేయుండును. కనుక ఆ సర్వశక్తి సంపన్నుడు సర్వజ్ఞుడు-పరమమిత్రుడునైన భగవంతుడే తన భక్తుని లౌకిక-పారమార్థిక యోగక్షేమములన్నియు నడుపును.

1. వేదశాస్త్రములందు వర్ణింపబడిన దేవతలు వారియుపాసనను దాని ఫలమైన స్వర్గాదిప్రాప్తి-వీనియందు ఆదరపూర్వక విశ్వాసమున్నవారిక్కడ 'శ్రద్ధతో' గూడినవారు అనబడెదరు. ఈ విశేషణమువాడి, శ్రద్ధలేక దంభముతో యజ్ఞాది కర్మలద్వారా దేవతలను పూజించినవారు ఈ తరగతిలో చేరరు. వారి గణనము ఆసురీప్రకృతిగల మనుష్యులలో చేయబడును. అను భావము చూపబడినది.

2. ఏకోరిక సిద్ధించుటకు ఏ దేవతపూజ శాస్త్రములో విధింపబడెనో, ఆ దేవత పూజ, శాస్త్రోక్తములైన యజ్ఞాది కర్మలద్వారా శ్రద్ధతోచేయుట ఇతర దేవతల పూజలు చేయుట యనబడును. దేవతలందరుగూడ భగవంతునకే అంగభూతములు. భగవంతుడే అందరకుగూడ ప్రభువు - వాస్తవముగా భగవంతుడే ఆ దేవతల రూపములలో ప్రకటితుడగును. ఈ తత్త్వము నెరుగక, ఆ దేవతలు భగవంతునికంటే వేరని తలచి సకామ భావముతో, ఆ దేవతలను పూజించుటయే భగవంతుని అవిధిపూర్వకముగా పూజించుట, యనబడునని తెలియవలెను.

"అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ ।
న తు మామభిజానంతి తత్త్వేనాతశ్చ్యవంతి తే ॥" 24

"ఎందుకనగా అర్జునా! సర్వయజ్ఞభోక్త, యజ్ఞప్రభువుగూడ నేనే[1] కాని వారు పరమేశ్వరుడనైననన్ను తాత్త్వికముగా నెరుగరు కనుకనే వారు అధః పతనము చెందెదరు. అనగా వారికి పునర్జన్మ ప్రాప్తించునని భావము.

సంబంధము—

భగవద్భక్తులకు గమనాగమనములు (జననమరణములు) ఉండవు. ఇతర దేవతలను ఉపాసించువారికి గమనాగమనములుండును. ఇట్లుండుటకు కారణ మేమి? ఈ జిజ్ఞాసకు ఉత్తరముగా భగవంతుడు ఉపాసింపబడు దేవతల స్వరూపములో ఉపాసించువానిచేత చేయబడు ఉపాసన ఫలములోను భేదముగల నియమముల నిప్పుడు తెలుపుచున్నాడు—

"యాంతి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాంతి పితృవ్రతాః ।
భూతాని యాంతి భూతేజ్యా యాంతి మద్యాజినోఽపి మామ్" ॥

అర్జునా! దేవతలను పూజించువారు దేవతలను, పితరులను పూజించువారు

---

1. ఈ సమస్త ప్రపంచము భగవంతుని విరాట్ స్వరూపమే యగుటచేత భిన్న భిన్న యజ్ఞ పూజాది కర్మల భోక్తరూపములో తలచబడు దేవత లెందరైతే యున్నారో వారందరుగూడ భగవంతునకే అంగములుగానున్నారు. భగవంతుడే ఆ దేవతలందరకున్ను ఆత్మస్వరూపుడు (గీత 10-20) కాబట్టి ఆ దేవతల రూపములో భగవంతుడే సమస్త యజ్ఞాది కర్మల భోక్తగానున్నాడు. భగవంతుడే తన యోగశక్తిచేత సమస్త ప్రపంచముయొక్క సృష్టి-స్థితి-లయములనుచేయుచు, అందరిని వారివారి యోగ్యతానుసారములైన నియమములతో నడుపుచుండును. భగవంతుడే ఇంద్ర-వరుణ-యమ-ప్రజాపత్యాది లోకపాలకులను, దేవతలను అందరినిగూడ నడుపుచు వారందరికిని నియంతయైయున్నాడు. ఈ కారణముచేత ఆభగవంతుడే అందరకున్ను ప్రభువు-అనగా మహేశ్వరుడగును. (గీత-5-29)

పితృదేవతలను[1] భూతములను పూజించువారు భూతములను[2] నా పూజచేయు భక్తులు నన్ను పొందెదరు[3] ఈ కారణముచేతనే నా భక్తులకు పునర్జన్మ ఉండదు.

---

1. ఇట్లు చెప్పుట ఇక్కడ దేవతల పూజలను-పితరుల పూజలను నిషేధించుట యని తలచగూడదు. దేవ-పితృ పూజలను యథావిధిగా తమ తమ వర్ణాశ్రమముల అధికారము ప్రకారము అందరున్ను తప్పక చేయవలెను. కాని ఆ పూజలొకవేళ సకామ భావముతో చేయబడిన యెడల అవిపూర్తిగా అధికాధిక ఫలమునిచ్చి నష్టములగును. ఒకవేళ, ఆ పూజలు కర్తవ్య బుద్ధిలో భగవదాజ్ఞయని తలచి, లేక భగత్పూజయనితలచి చేయబడిన యెడల, అది భగవత్ప్రాప్తి రూపమైన మహాఫలము కలిగించగలవు. కనుక దేవ-పితృకర్మలు అవశ్యముగా చేయవలెను. కాని వానియందు నిష్కామభావము ఉంచుటకు ప్రయత్నము చేయవలెను. అని యీ సందర్భములో తెలిసికొనవలెను.

2. భూత-ప్రేతగణముల పూజానియమములను పాలించుటకు ఆ భూతప్రేతముల కొరకు హోమదానాది కర్మలు చేయు మనుష్యులు, ఆయా భూతప్రేతములకు సమానమైన రూపము సుఖభోగములు పొందుటయే ఆ భూతప్రేతములను పొందుట యనబడును. భూతప్రేతముల పూజ తామసము-అనిష్ట ఫలమునిచ్చునది కాబట్టి అట్టి పూజ చేయగూడదు.

3. ఏ పురుషులు, భగవంతుని సగుణ - నిరాకార, సాకార నిరూపములలో దేనినైన సేవించుట, పూజించుట-భజించుట-ధ్యానించుట మొదలైనవి చేసెదరో, సర్వకర్మలను భగవంతునకు సమర్పించెరో భగవన్నామమును జపించెదరో, ఆయన గుణకీర్తనము వినెదరో, గానముచేసెదరో ఇటువంటిదేయైన భగవద్భక్తికి సంబంధించిన అనేక విధసాధనములుచేసెదరో వారు భగవంతుని పూజించు భక్తులనబడెదరు. వారు భగవంతుని దివ్య లోకమునకు పోవుట భగవంతుని సమీపమునందుండుట, భగవంతునివంటి దివ్యరూపమునే పొందుట లేక భగవంతునిలో లీనులగుట, ఇదియే భగవంతుని పొందుట యనబడును.

సంబంధము-

భగవద్భక్తికి కలుగు మహాఫలము భగవత్ప్రాప్తి యైనప్పటికిన్ని ఆ భగవద్భక్తిని సాధించుటలో ఏమాత్రము కష్టములేదు. వాని సాధనము అతి సుగమముగా నుండును. ఈ విషయము తెలుపుటకే భగవంతుడిట్లనుచున్నాడు-

"పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।
తదహం భక్త్యుపహృతం[1] అశ్నామి[2] ప్రయతాఽఽత్మనః॥" 26

అర్జునా! యేభక్తుడైనను[3] నాకొరకు ప్రేమతో పత్రము-పుష్పము-ఫలము-

---

1. పత్రపుష్పాది వస్తువులేవైనను ప్రేమపూర్వకముగా భగవంతునకు సమర్పించుట 'భక్త్యుపహృత' మనబడును. ఈ పదప్రయోగముచేత భగవంతుడు ప్రేమరహితముగా నీయబడిన వస్తువును నేను స్వీకరింపను. నాకు వస్తువును సమర్పించుటలో ఎక్కడ ప్రేమయుండునో నేను ఆ వస్తువును స్వీకరించుటలో ఎవనికి నిక్కమైన ఆనందము కలుగునో ఆ భక్తుడు సమర్పించినది మిక్కిలి ప్రేమతో స్వీకరించెదను. అను భావము కనబరచెను.

2. దీనిచేత భగవంతుడు ఈ విధముగా పరిశుద్ధ భావముతో ప్రేమ పూర్వకముగా సమర్పింపబడు వస్తువులను నేను స్వయముగా ఆ భక్తుని యెదుట ప్రత్యక్షముగా ప్రకటితుడనై భుజించెదను. అనగా, నేను మనుష్యాది రూపములలో నవతరించి ప్రపంచమునందు సంచరించినప్పుడైతేనో, ఆ రూపముతో అక్కడికిపోయి ఇతర సమయములలో ఆ భక్తుని యిచ్ఛానుసారమైన రూపములలో ప్రకటితుడనై, అతడిచ్చిన వస్తువును భుజించి యతనిని కృతార్థుని చేసెదను. అను భావమును కనబరచెను.

3. దీనిచేత భగవంతుడు, ఏ వర్ణమునకు ఏ ఆశ్రమమునకు ఏ జాతికి చెందినవాడైననుసరియే, పత్ర-పుష్ప-ఫల-జలాదులు, నాకు సమర్పింపగలుగును, అను భావమును కనబరచెను. నాకు ఎవని యెడలగూడ అతని బలరూప-ధన-వయస్-జాతి-గుణ-విద్యలు ఈ మొదలైనవేవియు కారణ

ఫలము-జలము ఇత్యాది వస్తువులు సమర్పించునో[1] పరిశుద్ధమైన బుద్ధిగల అటువంటి నిష్కామ ప్రేమగల భక్తునిచేత సమర్పింపబడిన ఆ పత్ర పుష్పాది వస్తువులను, నేను సగుణ బ్రహ్మరూపములో ప్రకటితుడనై ప్రీతితో గ్రహించి భక్షించెదను.[2]

సంబంధము-

ఒకవేళ అట్లేయైనచో నేనేమిచేయవలెనను జిజ్ఞాసపై భగవంతుడు అర్జునునకు అతని కర్తవ్యమునుగూర్చి చెప్పుచున్నాడు:-

"యత్ కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ ।
యత్తపస్యసి కౌంతేయ తత్ కురుష్వ మదర్పణమ్ " 27

అర్జునా! నీవు ఏకర్మచేసెదవో, ఏమితినెదవో, ఏహోమము చేసెదవో,

---

ముగా, భేదబుద్ధిలేదు. నాకు సమర్పించువాని భావము విదుర శబర్యాదుల భావములవలె పూర్తిగా పరిశుద్ధమై ప్రేమపూర్ణముగా నుండవలెను

1 ఇక్కడ పత్ర-పుష్ప ఫల-జల-నామములను గ్రహించుటచేత ఏవస్తువు సామాన్య మనుష్యునకు ఏ పరిశ్రమ, హింస వ్యయములేకుండ అనాయాసముగా లభించునో అట్టి యేవస్తువైనను భగవంతునకు అర్పించవచ్చును భగవంతుడు పూర్ణకాముడగుటచేత వస్తువులందు ఆయనకు ఆశలేదు. ఆయనకు కేవలము ప్రేమ అవశ్యకమైనది అను భావము ప్రకటితమయ్యెను నావంటి సాధారణ మనుష్యుడు సమర్పించిన అతిస్వల్ప వస్తువునుగూడ భగవంతుడు హర్షముతో స్వీకరించును. ఆయన మహత్త్వమే అటువంటి ప్రశంసనీయమైనది అను భావముతో మనుష్యుడు ప్రేమార్ద్ర హృదయుడై యేవస్తువునైనను భగవంతునకు సమర్పించుట భక్తిపూర్వకంగా భగవంతునకు అర్పించుట యనబడును.

2. పరిశుద్ధమైన అంతఃకరణముగలవానిని శుద్ధబుద్ధి యనెదరు ఈ పదమును ప్రయోగించి భగవంతుడు ఒకవేళ సమర్పించువాని భావము పరిశుద్ధము కాని యెడల అతడు ఎంతయో శిష్టాచారముతో, ఉత్తమోత్తమ వస్తుసామగ్రిని నాకు అర్పించినను నేను దాని నెప్పుడుగూడ స్వీకరించను.

ఏ దానముచేసెదవో. ఏ తపస్సుచేసెదవో[1] అవియన్నియు నాకు సమర్పించుము[2] దేవతల పూజలు ఆ పూజలకొరకు తెలుపబడిన నియమముల పాలనము-దాని కొరకు యజ్ఞాదుల అనుష్ఠానము- ఆమంత్రముల జపము-దానికొరకు బ్రాహ్మణ భోజనము ఈ మొదలైనవి చేయుట దేవతలవ్రతము అనబడును. వీనిపాలనము చేయు మనుష్యులు తమ ఉపాసనకు ఫలముగా ఆ దేవతల లోకములు-వానికి సమానములైన సుఖ భోగములు - లేక వానివంటి రూపమేదైతే ప్రాప్తించునో అదియే దేవతలను పొందుట యనబడును.

పితరులకొరకు యథావిధిగా శ్రాద్ధ తర్పణాదులు-దానికొరకు, బ్రాహ్మణ భోజనము హోమము-జపము-పారాయణము-పూజ ఇత్యాదులు చేయుట వాని కొరకు శాస్త్రములలో తెలుపబడిన వ్రతనియమాదులను సమగ్రముగా పాటించుట. ఇవన్నియు పితరుల వ్రతము అనబడును. సకామ భావములో ఈ వ్రతములను పాలించువారు మరణించిన తరువాత పితృలోకమునకు పోయెదరు అక్కడ పితృ దేవతలవంటి రూపములనుపొంది వారివంటి సుఖభోగముల ననుభవించెదరు చివ రకు వారికిన్ని పునర్జన్మ కలుగును.

---

అను భావము కనబరచెను. నేను దుర్యోధనుని ఆహ్వానమును స్వీకరింపక విదురునియింటికి అతని భావము పరిశుద్ధముగాబట్టి పోయి ప్రేమతో భుజించితిని. కుచేలుని అటుకులను మిక్కిలి రుచితో భుజించితిని. ద్రౌపది పాత్రలో మిగిలి పత్రముతిని ప్రపంచమును తృప్తిపరచితిని. గజేంద్రుడిచ్చిన పుష్పమును స్వయముగా నతని కడకుపోయి స్వీకరించి తిని. శబరి గుడిసెలోపోయి ఆమె యిచ్చిన ఫలములు భుజించితిని. రంతి దేవుడిచ్చిన జలము స్వీకరించి అతనిని కృతార్థునిచేసితిని అట్లే ప్రతి యొక్క భక్తుడు ప్రేమతోనిచ్చిన దానిని హర్షముతో స్వీకరించెదను.

1. దీనితో భగవంతుడు సర్వవిధ కర్తవ్యకర్మలను గూర్చిచెప్పెను. ఇందలి యభిప్రాయమేమనగా యజ్ఞ - దాన తపస్సులేగాక జీవన నిర్వాహాదుల కొరకు చేయబడు వర్ణాశ్రమాది లోకవ్యవహారకర్మలు. భగవత్పూజన - ధ్యానాది శాస్త్రీయ కర్మలన్నింటి సమావేశము 'యత్కరోషి' అను దానిలో శరీరపాలనముకొరకు చేయబడు ఆహారపానీయాదికర్మలు 'యదశ్నాసి'

అను దానిలో పూజలు - హోమములు మొదలైన సమస్త కర్మలు 'యజ్ఞ హోషి' అను దానిలో నియమ - తపస్సులకు సంబంధించిన కర్మలు 'యత్తపస్యసి'అను దానిలోను సమావేశ పరచబడెను. (భగవద్గీత 17-14,15,16,17)

2. సాధారణ మనుష్యునకు ఆ కర్మలందు మమకారము ఆసక్తి కలుగును. అతడు వానియందు ఫలేచ్ఛ గలిగియుండును. కనుకనే సమస్త కర్మల యందు మమకారము-ఆసక్తి-ఫలేచ్ఛ విడువవలెను. సర్వజగత్తు భగవంతునిదే యగును. నామనో-బుద్ధి - శరీరేంద్రియములుగూడ భగవంతునికే. నేనుగూడ భగవంతునివాడనే కనుక నేను చేయు యజ్ఞాది కర్మలన్నియు భగవంతునికేయని తలచవలెను. బొమ్మను ఆడించు సూత్రధారునివలె భగవంతుడే నాచేత ఈ పనులన్నియుచేయించుచున్నాడు. నేనైతే కేవలము నిమిత్తమాత్రుడనే అని తలచి భగవదాజ్ఞానుసారముగా భగవంతుని సంతోషముకొరకే నిష్కామభావముతో పైనచెప్పబడిన కర్మలు భక్తుడు చేయవలెను. ఇదియే ఆకర్మలను భగవంతునకు సమర్పించుట యనబడును.

మొదట యేదో మరియొక యుద్దేశముతో చేయేబడిన కర్మలను తరువాత భగవంతునకు సమర్పించుటకర్మలుచేయుచు చేయుచు నడుమనే భగవంతునకు సమర్పించుట, కర్మ సమాప్తితోపాటే వానిని భగవంతునకు సమర్పించుట లేక కర్మఫలమునే భగవంతునకు అర్పించుట ఈ విధముగా సమర్పణము చేయుటగూడ భగవంతునకే సమర్పించుటయగును. ఈ విధంగా చేయుచు చేయుచునే పైన చెప్పబడిన ప్రకారముగా, ఆ కర్మలు పరిపూర్ణంగా భగవదర్పితములగునని తెలియవలెను.

సంబంధము—

ఈ ప్రకారము సర్వకర్మలు నీకు సమరించుటచేత ఏమగును? ఈ యర్జునుని ప్రశ్నకు భగవంతుడిట్లు బదులు చెప్పుచున్నాడు:-

"శుభాశుభఫలైరేవం మోక్ష్యసే కర్మబంధనైః ।
సంన్యాసయోగయుక్తాఽత్మా[1] విముక్తో-మాముపైష్యసి॥" 28

"అర్జునా! ఈ విధంగా సమస్త కర్మలు భగవంతుడనైన నాకు సమర్పించుట సంన్యాసయోగము[1] గల మనస్సుగల నీవు శుభాశుభ కర్మఫల రూపములైన కర్మల నుండి విముక్తుడవై నన్నే చేరగలవు.[2]

సంబంధము—

పైన చెప్పబడిన విధముగా భగవద్భక్తిగలవానికి భగవత్ప్రాప్తిగలుగును. ఇతరులకు గలుగదు. అని చెప్పటచేత భగవంతునకు వైషమ్యభావము ఉన్నదను శంక కలుగును. కనుకనే ఆ శంక నివారించుచు భగవంతుడు అర్జునితో ఇట్లను చున్నాడు:-

"సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః।
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్॥" 29

అర్జునా! నేను సర్వభూతములందు సమభావముతో వ్యాపకుడనై యుండె

1. ఇక్కడ సంన్యాసయోగ పదమునకు సాంఖ్య యోగము అనగా జ్ఞాన యోగము అని యర్థము. కాని పూర్వ శ్లోకము ప్రకారము సర్వ కర్మలు భగవంతునకు సమర్పించుటయే యిక్కడ సంన్యాస యోగము అనబడును. కనుక ఇటువంటి సంన్యాస యోగము ఎవనియాత్మలోనున్నదో ఎవని మనోబుద్ధులలో ఈ శ్లోకమునందు చెప్పబడిన సర్వకర్మలు భగవదర్ప ణముచేయు భావము సుదృఢమై యున్నవో అతడు సంన్యాస యోగ యుక్తాఽత్మ యనబడునని తెలియవలెను.

2. భిన్న భిన్న శుభాశుభ కర్మల ననుసరించి, స్వర్గ-నరక-పశు-పక్షి-మను ష్యాది లోకములలో వివిధ యోనులందు జన్మించుట సుఖ-దుఃఖముల నను భవించుటయే శుభాశుభ ఫలమనబడును. దీనినే కర్మబంధన మనెదరు. ఎందుకనగా కర్మల ఫలము ననుభవించుటయే కర్మ బంధన మునందు చిక్కుకొనుటయగును. పైన చెప్పబడిన విధముగా సర్వకర్మలు భగవం తునకు అర్పించు మనుష్యుడు కర్మఫల రూప పునర్జన్మ నుండి సుఖ దుఃఖానుభవములనుండియు విముక్తుడగును. ఇదియే శుభాశుభ ఫల రూప కర్మ బంధనమునుండి విముక్తుడగుట యనబడును. మరణించిన తరువాత

భను. నా కెవడుగూడ అప్రియుడుగాని, ప్రియుడుగాని లేడు[1] కాని యే భక్తులైతే నన్ను ప్రేమతో భజించునో అతడు నాయందున్నాడు నేనుగూడ అతనికి ప్రత్యక్షముగా ప్రకటితుడనైయుందును.[2]

---

భగవంతుని పరమధామమునకు పోవుటగాని, లేక యీ జన్మమునందే భగవంతుని ప్రత్యక్షముగా పొందుటగాని ఆ కర్మబంధనమునుండి ముక్తుడై భగవంతుని పొందుట యవబడును.

1. ఇట్లు చెప్పుటచేత భగవంతుడు నేను బ్రహ్మనుండి స్తంబ (పరిగెన్ను) పర్యంతము సమస్త ప్రాణులందు అంతర్యామి రూపములో సమానముగా మన్నాను. కనుకనే నాకు సర్వసమభావముగలదు. దేనియందుగూడ నాకు రాగద్వేషములులేవు. కనుక వాస్తవముగా నాకెవడుగూడ అప్రియుడు గాని, ప్రియుడుగాని లేడు. అను భావము తెలిపెను.

2. భగవంతుని సాకార నిరాకార రూపములలో దేనినైనను శ్రద్ధా-ప్రేమలలో నిరంతరము చింతించుట ఆయన నామ-గుణ-ప్రభావ-మహిమ-లీలా-విలాస శ్రవణ-మనన-కీర్తనములను చేయుట, పత్ర-పుష్పాదులేవైనను ఇష్టమువచ్చిన సామాగ్రిచేత ఆయనను ప్రేమపూర్వకముగా పూజించుట తన సమస్త కర్మలు ఆయనకు సమర్పించుట ఇత్యాదులైన సమస్తకర్మలు భక్తి పూర్వకముగా భగవంతుని భజించుటయగును.

ఏ పురుషులీవిధముగా భగవంతుని భజించెదరో వారిని భగవంతుడుగూడ అట్లే భజించును. వారెట్లైతే భగవంతుని మరచిపోవరో అట్లే భగవంతుడు గూడ వారిని మరవజాలడు అను బావము తెలుపుటకే భగవంతుడు ఆ భక్తులు నాలోనున్నారు అని తెలిపెను. అటువంటి భక్తుల విశుద్ధాంతఃకరణము భగవత్ప్రేమచేత నిండిపోవును. దీనిచేత ఆ భక్తుల హృదయములో భగవంతుడు సర్వదా ప్రత్యక్షముగా కనపడుచుండును అను భావము తెలుపుటకే భగవంతుడు వారిలో తానున్నాను అని తెలిపెను.

ఎట్లైతే సమభావములో అన్నిచోట్ల ప్రకాశమునిచ్చు సూర్యుడు దర్పణాదులందు ప్రతిబింబితుడై కట్టెలు మొదలైనవానియందు ప్రతిబింబితుడు కాకున్నప్పటికిన్ని సూర్యునకు వైషమ్యభావము లేదో అట్లే భగవంతుడు

"అపి[1] చేత్[2] సుదురాచారో భజతే మామనన్యభాక్ ।
సాధురేవ స మంతవ్యః సమ్యగ్వ్యవసితో హి సః ॥" 30

అర్జునా! ఒకవేళ ఎవడైన మిక్కిలి దుష్ప్రవర్తన గలవాడైనను, అనన్య భావముచేత నాకు భక్తుడై నన్ను భజించు[3] నెడల అతడు సాధువనియే తలచ బడును. ఎందుకనగా అతడు యథార్థమైన నిశ్చయజ్ఞానము గలవాడని తెలియ

---

గూడ భక్తులలో కలియును. ఇతరులలో కలియదు అనుటలో ఆయనకు విషమ భావములేదు. ఇదియే భక్తియొక్క మహిమయని తెలియవలెను.

1. ఇక్కడ అపి యను పదమునకు సదాచారులు-సాధారణపాపులు నా భజనము చేత ఉద్ధరింపబడుదురనుటగూర్చి చెప్పవలసినదేమున్నది నన్ను భజించుట చేత అత్యధిక దురాచారుడుగూడ ఉద్ధరింపబడునుగదా! అను నభిప్రాయము తెలుపబడినది.

2. ఇక్కడ చేత్ అనగా 'యది' యనునర్థముగల పదము ప్రయోగించి భగవంతుడు ఒకవేళ దురాచారులగు మనుష్యులు పాపములందు ఆసక్తిగలవారై నన్ను ప్రేమించకున్నను భజింపకున్నను వారికి ఏదైన పూర్వపుణ్యము యొక్క సంస్కారము జాగరూకమై భగవద్భావమయమైన వాతావరణము-శాస్త్రాధ్యయనము మహాత్ముల సత్సంగము-నాయొక్క గుణ-ప్రభావ మహత్త్వ-రహస్యములు వినుటచేత ఒకప్పుడైన నాయందు శ్రద్ధా-భక్తులు గలిగి వారు నన్ను భజించుచుండిన యెడల వారుగూడ ఉద్ధరింపబడెదరు అను భావమును తెలిపెను.

3. ఎవరి యాచరణము మిక్కిలి దూషితమైయున్నదో ఎవరి ఆహార-పానీయములు ప్రవర్తనలు భ్రష్టములైనవో ఎవరు తమ స్వభావము ఆసక్తి అలవాట్లు వీనికి వశులైయుండుటచేత దురాచారములను విడువజాలక యుండెదరో అట్టి మనుష్యులు అత్యంత దురాచారులని తలచవలెను. ఇటువంటి మనుష్యులు భగవంతుని గుణప్రభావాదులను వినుటచేత వానిని చదువుట చేత లేక ఇతర కారణములు వేనిచేతనైనను భగవంతుడు సర్వోత్తముడని తలచుట ఒక్క భగవంతుని మాత్రమే ఆశ్రయించి మిక్కిలి శ్రద్ధా-భక్తి

వలెను. అనగా అతడు పరమేశ్వర భజనముతో సమానమైనది యితర మేదియు లేదు.[1] అని పూర్తిగా నిశ్చయము చేసికొనినాడని తెలియవలెను.

> "క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి ।
> కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి॥" ౩౧

అర్జునా! అతడు శీఘ్రముగనే ధర్మాత్ముడగును. శాశ్వతమైన శాంతిని పొందగలడు[2] నా భక్తుడెప్పుడుగూడ నశించడు అను నీ సత్యము నిశ్చయమని

---

పూర్వకముగా ఆయనయే తమ యిష్టదైవమని తలచుటయని యనబడును. ఇదియే వారు అనన్యభాక్కులు అగుటయని తెలియవలెను. ఈ విధముగా భగవంతునకు భక్తులై ఎవరైతే భగవంతుని స్వరూపచింతనము ఆయన యొక్క నామ-గుణ-మహిమ - ప్రభావముల శ్రవణ మనన-కీర్తనములు ఆయనకు నమస్కారముచేయుట తమకు ఇష్టమువచ్చిన పత్ర-పుష్పాదులు ఆయనకు అర్పించి ఆయన పూజచేయుటయే తాము చేసిన శుభకర్మలు భగవంతునకు సమర్పించుటయగును. ఇదియే అనన్య భాక్కులై భగవంతుని భజించుట యగును.

1. ఎవరైతే భగవంతుడు పతితపావనుడు అందరికి మిత్రుడు సర్వశక్తి సంపన్నుడు పరమదయాళువు, సర్వజ్ఞుడు అందరికి ప్రభువు సర్వోత్తముడు ననితలచి ఆయనను భజించుటయే జీవిత ముఖ్యకర్తవ్యము, దీనిచే సర్వ పాపములు-పాపవాసనలు సమూలంగా నశించి భగవత్ కృపచేత తన భగవత్ప్రాప్తి కలుగును అను నిశ్చయముగలవాడో అతడు నా భక్తుడు, నా భక్తి ప్రతాపముచేత నతడు శీఘ్రముగానే సంపూర్ణ ధర్మాత్ముడగును. కనుకనే అతనిని పాపియనిగాని దుష్టుడనిగాని తలచక సాధువనియే తలచుట ఉచితము అని చెప్పెను.

2. ఈ జన్మమునందే చాలా మంది శీఘ్రముగనే సర్వ దుర్గుణ - దురాచార రహితులై గీత పదునారవ అధ్యాయము తొలి మూడు శ్లోకములలో వర్ణితమైన దైవ సంపదగలవారగుట అనగా భగవత్ప్రాప్తికి పాత్రులగుటయే త్వరగా ధర్మాత్ములగుట యనబడుదురు. శాంతియైతే ఒకసారి లభిం

తెలిసికొనుము.[1]

సంబంధము:-

ఇప్పుడు రెండు శ్లోకములలో భగవంతుడు మంచి చెడ్డ జాతులు కారణముగా కలుగు వైషమ్య భావము తనయందులేదని తెలుపుచు, శరణాగతి రూపమైన భక్తి యొక్క మహత్త్వమును ప్రతిపాదించి అర్జునుని భజించుమని ఆజ్ఞాపించుచున్నాడు.

మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి[1] స్యుః పాపయోనయః ।
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి[2] యాంతి పరాం గతిమ్॥ 32

---

చిన తరువాత ఎప్పుడుగూడ లేకుండపోవదో దేనిని నైష్ఠికశాంతి (గీత 5.12) నిర్వాణపరమశాంతి (గీత 6-15) పరమ శాంతి (గీత 18-62) అని యనెదరో పరమేశ్వరప్రాప్తి రూపమైన శాంతిని పొందుటయే శాశ్వత పరమశాంతిని పొందుట యనబడును.

1. ఇక్కడ ఇట్లు చెప్పుటచేత భగవంతుడు అర్జునా! నేను నీకు ఏనాభక్తి యొక్క నా భక్తునియొక్కయు ఈ మహత్త్వమును తెలిపితినో దాని విషయములో నీవు కొంచెముగూడ సందేహముంచక అది సర్వదా సత్యమని తలచి దానిని దృఢముగా అనుసరించవలెను సుమా! అని తెలిపెను.

ఇట్లు భగవంతుడు చెప్పుటలో అభిప్రాయమేమనగా అర్జునా! నా భక్తులకు క్రమముగా ఉత్థానమే (ఉత్తరోత్తరాభివృద్ధి) కలుగును. ఎప్పుడుగూడ వారికి పతనము సంభవించదు-అనగా వారు తమ స్థానము నుండి యెప్పుడుగూడ క్రిందపడిపోవరు. వారు నీచయోనులుగాని లేక నరకాదిప్రాప్తి రూపమైన దుర్గతినిగాని పొందుట సంభవింపదు. పూర్వము చెప్పబడిన ప్రకారముగా వారు క్రమముగా దుర్గుణ - దురాచారములు లేకుండ ధర్మాత్ములయ్యెదరు. వారు పరమశాంతిని పొందగలరు. అని తెలియవలెను:

1.2. ఇక్కడ 'అపి' యను శబ్దము రెండుసార్లు ప్రయోగించి భగవంతుడు ఉచ్చ నీచ జాతుల కారణముగా గలుగు వైషమ్యము నాయందు పూర్తిగా లేదని

అర్జునా! స్త్రీలు-వైశ్యులు-శూద్రులు-పాపయోనులైన[1] చండాలాదులు ఎవ రైనను సరియే వారుగూడ నా శరణుజొచ్చి పరమగతినే పొందెదరు.

---

తెలిపెను. భగవంతుడిట్లు చెప్పుటచేత ఇక్కడ "బ్రాహ్మణ క్షత్రియుల కన్న హీనులని తలచబడు స్త్రీ-వైశ్య-శూద్రులు వారికంటెను హీనులని తలచబడు చండాలాదులందరు వీరిలో నెవరియందుగూడ నాకు భేదబుద్ధి లేదు. నన్ను శరణుజొచ్చిన వారెవరైనను సరియే నన్ను పూజించినవారికి పరమగతి లభించును. అని భగవంతుని యభిప్రాయము స్పష్టమగు చున్నది.

1. పూర్వజన్మల పాపకారణముగా చండాలాది యోనులలో పుట్టిన ప్రాణులు పాప యోనులు అనబడెదరు. వీరేకాక శాస్త్రములలో చెప్పబడిన హూణ-భిల్ల-యవనాది మ్లేచ్ఛజాతి మనుష్యులుగూడ పాపయోనులనియే చెప్ప బడెదరు. ఇక్కడ పాపయోని శబ్దమునకు వీరందరు అని యర్థము. భగవ ద్భక్తిని ఏ జాతివారుగాని వర్ణముగాని కలిగియుండవచ్చును. ఎవరికిన్ని ఏలాటి ఆటంకముగూడలేదు. అక్కడ శుద్ధప్రేమఆవశ్యకము అని గూడ చెప్పబడినది.

శ్రీమద్భాగవతములోగూడ ఇట్లు చెప్పబడింది.

"భక్త్యాఽహమేకయా గ్రాహ్యః శ్రద్ధయాఽఽత్మా ప్రియః సతామ్।
భక్తిః పునాతి మన్నిష్ఠా శ్వపాకానపి సంభవాత్ ॥ 11-14-21)

అనగా ఉద్ధవా! సత్పురుషులకు పరమ ప్రియుడను ఆత్మ స్వరూపుడనైన నేనొక్కడనుమాత్రమే శ్రద్ధా-భక్తులకు వశీభూతుడనయ్యెదను. నాయందలి భక్తి జన్మముచేత చండాలునినైనను పవిత్రుని జేయును.

ఇక్కడ పాపయోనయః అనుపదములో స్త్రీ-వైశ్య-శూద్రులకు విశేషణమని తలచగూడదు. ఎందుకనగా వైశ్యుల గణనము ద్విజులలో చేయబడినది. వారికి వేదము చదువుటకు యజ్ఞాది వైదికకర్మలు చేయుటకున్ను శాస్త్రమునందు పరి పూర్ణాధికారమీయబడినది. కనుక ద్విజాతులగుటచేత వైశ్యులను పాపయోనులు అని చెప్పుట సరిపడదు. ఇదిగాక ఛాందోగ్యోపనిషత్తులో జీవుల కర్మానురూపగతిని వర్ణించు సందర్భములో ఈ విషయము స్పష్టముగా నిట్లు చెప్పబడిన్నది.

"తద్య ఇహ రమణీయచరణా అభ్యాశో హ యత్తే రమణీయాం యోనిమాపద్యేరన్,

బ్రాహ్మణయోనిం వా క్షత్రియయోనిం వా వైశ్యయోనిం వాఽథ య ఇహ కపూయ-

చరణా అభ్యాశో హ యత్తే కపూయాం యోనిమాపద్యేరన్ శ్వయోనిం వా సూకర-

యోనిం వా చండాలయోనిం వా॥" (అధ్యాయము 5-ఖండము-10-మండలము-7)

అనగా ఆ జీవులలో ఎవరీలోకమునందు రమణీయమైన ఆచరణము గల వారు అనగా, పుణ్యాత్ములో వారు శీఘ్రముగానే ఉత్తమయోని. అనగా బ్రాహ్మణ యోని, క్షత్రియయోని లేక వైశ్యయోని నొందగలరు. ఎవరీలోకమునందు కపూయ (అధమ)మైన ఆచరణముగలవారు-అనగా, పాపకర్మలు చేయువారో, వారు అధమయోని అనగా కుక్క--పంది-లేక చండాలయోని నొందగలరు.

దీనిచేత వైశ్యుల గణనము పాపయోనిలో చేయబడజాలదు. ఇక స్త్రీల విషయముతోనైతే-బ్రాహ్మణ-క్షత్రియ-వైశ్యస్త్రీలకు వారి పతులతోగూడ యజ్ఞాది వైదిక కర్మలలో అధికారము అంగీకరించబడినది. ఈ కారణముచేత వారుగూడ పాపయోనులు అనుటకు వీలుపడదు. అని సిద్ధమైనది అన్నిటికన్న ప్రతిబంధకము భగవద్భక్తిచేత చండాలాదులకుగూడ పరమగతి లభించునను విషయములో గలుగును. దీనిచేత భక్తియొక్క మహత్త్వము ప్రకటితమగుచున్నది. అది శాస్త్ర సమ్మతముకాని యది యెట్లగును? అను విషయమిక్కడ సమన్వయ పరచుటకే పాపయోనయః అను విశేషణము స్త్రీ-వైశ్య-శూద్రులకని యంగీకరించక, శూద్రుల కన్నను హీనజాతి మనుష్యులు అని ఆ విశేషణమునకు అర్థమని యంగీకరించు టయే, మంచిదని స్పష్టమగుచున్నది. ఎందుకనగా శ్రీమద్భాగవతమునందు:-

"కిరాత-హూణాంధ్ర-పులింద-పుల్కసా
అభీరకంకా యవనాః ఖసాఽదయః ।

కిం పున[1] ర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా[2] రాజర్షయ స్తథా।
అనిత్యమసుఖం లోకమిమం[3] ప్రాప్య భజస్వ మామ్॥ ३३

ఇట్లుండగా అర్జునా! పుణ్యాత్ములైన బ్రాహ్మణులు - రాజర్షులునైన భక్తజనులు నా శరణముజొచ్చి పరమగతిని పొందెదరను విషయములో నిక చెప్పవలసినదేమున్నది? కనుక నీవు సుఖరహితము-క్షణభంగురమునైన యీ మనుష్య

---

యేఽన్యే చ పాపా యదుపాశ్రయాశ్రయాః
శుధ్యంతి తస్మై ప్రభవిష్ణవే నమః॥"

అనగా ఏ జగత్ప్రభువును ఆశ్రయించిన భక్తులను ఆశ్రయించి, కిరాత హూణ-ఆంధ్ర-పుళింద! పుల్కస-ఆభీర-కంక-యవన-ఖసాఽదులైన అధమ జాతి ప్రాణులు ఇంకను అతి మహా పాపులైన మనుష్యులుగూడ పరిశుద్ధులయ్యె దరో ఆ భగవంతుడైన విష్ణువునకు నమస్కారము.

భగవంతునిపై పూర్తిగా విశ్వాసముంచి యిరువది నాలుగవ శ్లోకములో చెప్పబడినట్లు ప్రేమపూర్వకముగా అన్ని విధముల భగవంతుని శరణజొచ్చుట అనగా భగవంతుని ప్రతియొక విధానమునందున్ను సంతుష్టుడై సర్వదాఉండుట. ఆయన నామ-గుణ-రూప-లీలా-విలాసాదాల శ్రవణ-కీర్తన-చింతనములు నిరంతరము చేయుచుండుట ఆయనయే తన గతి - భర్త-ప్రభువు మొదలైనవారినిగా తలచుట-శ్రద్ధా-భక్తి పూర్వకముగా ఆయన పూజచేయుట ఆయనకు నమస్కారముచేయుట ఆయన యాజ్ఞా పాలనముచేయుట - సమస్త కర్మలు ఆయనకే సమర్పించుట ఈ మొదలైనవి చేయుటయే భగవంతుని శరణుజొచ్చుట యనబడును.

1. కిం పునః అను రెండు పదములు ప్రయోగించి భగవంతుడు ఎప్పుడైతే పైన చెప్పబడిన అత్యంత దురాచారుడు (గీత 9-30) చండాలాది నీచ జాతి మనుష్యులుగూడ (గీత 9-32) నా భజనముచేసి పరమగతిని పొందెదరనగా మరి ఉత్తమములైన ఆచార - వ్యవహారములు - వర్ణముగల నా భక్తులు-పుణ్యాత్ములైన బ్రాహ్మణులు రాజర్షులు నా శరణుజొచ్చి పరమగతిని పొందెదరను విషయములో చెప్పవలసినదేమున్నది అను భావము తెలిపెను.

శరీరమును పొంది నిరంతరము నా భజనమే చేయుచుందుము.

సంబంధము—

పూర్వ శ్లోకములో భగవంతుడు తన భజనముయొక్క మహత్త్వమును

---

2. భక్తాః అను పదములో సంబంధము బ్రాహ్మణులు-రాజర్షులు ఈ యిరువురకే గలదు. ఎందుకనగా పరమగతి భక్తివలననే కలుగుట చెప్పబడినది.

3. మనుష్య దేహము చాల దుర్లభము ఇది మహా పుణ్యబలముచేత ముఖ్యముగా భగవత్కృపచేతనే లభించును. ఇది కేవలము భగవత్ప్రాప్తికొరకే లభించును. ఈ మనుష్య శరీరమునుపొంది యెవరైతే భగవత్ప్రాప్తికొరకు సాధనముచేయునో, అతని మనుష్య జీవితమే సఫలమగును ఎవరైతే ఈ మనుష్య జీవనములో ఐహిక సుఖము కొరకు వెదకుచుండునో అతడు ముఖ్యలాభమునుండి వంచింపబడును ఎందుకనగా ప్రపంచము సర్వథా సుఖరహితము. ఇందులో నెక్కడగూడను సుఖలేశముగూడ నుండదు. ఏ విషయ భోగముల సంబంధమును మనుష్యుడు సుఖరూపమని తలచునో, అవి మనుష్యుని మాటిమాటికి జనన-మరణ చక్రములో పడవేయునవి గనుక వాస్తవముగా నవి దుఃఖరూపములే యగును. కనుకనే ఈ ప్రాపంచిక విషయ భోగముల సంబంధము సుఖరూపమని తలచక మనుష్య శరీరము ఏఉద్దేశము సిద్ధించుటకొరకై లభించునో ఆ యుద్దేశమును శీఘ్రాతిశీఘ్రముగా సిద్ధింపజేసికొనవలెను. అనగా భగవత్ప్రాప్తికొరకే సాధనచేయవలెను. ఎందుకనగా ఈ శరీరము క్షణభంగురము. ఏ క్షణమునందు ఇది నశించునో తెలియదు. కనుక జాగరూకుడై యుండవలెను. ఇది సుఖరూపమనితలచి ప్రాపంచిక విషయ సుఖములందు ఇరుకగూడదు. ఇది నిత్యమనికూడ తలచి భగవద్భజనము చేయుటలో జాగు చేయగూడదు. మన అజాగ్రత్తవలన నొకవేళ ఈ శరీరము నష్టమైన యెడల ఆ తరువాత పశ్చాత్తాప పడుటకంటె మరి యితరోపాయమేదియు మనచేతిలో నుండదు. వేదములో—

"ఇహచేదవేదథ సత్యమస్తి నచేదిహావేదిన్మహతీ వినష్టిః (కేనోపనిషత్

తెలిపి చివరకు అర్జునునకు భజనముచేయుమని చెప్పెను. కనుకనే యిప్పుడు భగవంతుడు తన భజనము-అనగా శరణాగతి చేయువిధమును తెలుపుచు అధ్యాయము సమాప్తి చేయుచున్నారు.

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం[1] నమస్కురు ।
మామేవైష్యసి యుక్త్వైవమాత్మానం మత్పరాయణః॥ 34

"అర్జునా! నాయందు మనస్సు గలవాడవుకమ్ము[2] నాభక్తుడవుకమ్ము

---

2.5) అనగా ఒకవేళ మనుష్యుడు ఈ జన్మములో పరమాత్ముని తెలిసికొనిన యెడల మంచిది. తెలిసికొననియెడల చాలా గొప్ప హానికలుగును అని భావము.

ఈ కారణముచేతనే భగవంతుడు 'ఇటువంటి శరీరమునుపొంది నిత్యము నిరంతరము నా భజనముచేయుము. క్షణకాలముగూడ నన్ను మరవకుము" అని అర్జునునకు చెప్పుచున్నారు.

1. ఇక్కడ 'మాం' అను పదమునకు అర్థమేమనగా ఏ పరమేశ్వరుని-సగుణ-నిర్గుణ-నిరాకార-సాకారాదులైన అనేక రూపములున్నవో ఏ పరమేశ్వరుడు విష్ణురూపములో ప్రపంచ రక్షణము-బ్రహ్మరూపముతో ప్రపంచ సృష్టి-రుద్రరూపములో సర్వప్రపంచ సంహారముచేయునో ఏ భగవంతుడు యుగయుగములలో మత్స్య-కూర్మ-వరాహ-నృసింహ-శ్రీరామ-శ్రీకృష్ణాది దివ్యరూపములలో నవతరించి ప్రపంచమునందు తన విచిత్రలీలలు ఆభక్తులకు తన శరణమును అనుగ్రహించునో అటువంటి సర్వజగత్తునకు కర్త-హర్త-విధాత-సర్వాధారుడు-సర్వశక్తిసంపన్నుడు-సర్వవ్యాపి సర్వజ్ఞుడు-సర్వసుహృత్తు-సర్వగుణసంపన్నుడు-పరమపురుషోత్తముడునైన సమగ్ర భగవంతుడు" అని తెలియవలెను.

2. భగవంతుడే సర్వశక్తిసంపన్నుడు, సర్వజ్ఞుడు, సర్వలోక మహేశ్వరుడు, సర్వాతీతుడు సర్వమయుడు, నిర్గుణ సగుణ-నిరాకార-సౌందర్య-మాధుర్య ఐశ్వర్యమునకు సముద్రుడు, ప్రేమస్వరూపుడు నని యావిధముగా భగవంతుని గుణ - ప్రభావతత్త్వ - రహస్యములను, యథార్థముగా తెలిసికొనుటచేత; ఎప్పుడైతే సాధకునకు భగవంతునొక్కడు మాత్రమే నాకు

నాపూజ చేయువాడవుకమ్ము[1] నాకు నమస్కారము చేయుము ఈవిధంగా

---

పరమ ప్రేమాస్పదుడు అను నిశ్చయజ్ఞానము కలుగునో, అప్పుడు ఆ సాధకునకు, సమస్త ప్రపంచమునందలి ఏవస్తువునందుగూడ కొంచెంగూడ రమణీయబుద్ధి యుండజాలదు. ఇటువంటి పరిస్థితిలో ప్రపంచమునందు అత్యంత దుర్లభములైన యే సుఖభోగములందుగూడ ఆ సాధకునకు ఆకర్షణముఉండదు. ఇటువంటి స్థితియేర్పడినప్పుడు, స్వాభావికముగానే ఆ సాధకుని మనస్సు ఇహలోక-పరలోకములందున్న సమస్త వస్తువుల నుండి పూర్తిగా తొలగిపోవును. అప్పుడతడు అనన్యమైన పరమప్రేమతో శ్రద్ధతోను భగవంతుని చింతనమునే నిరంతరము చేయుచుండును. భగవంతునియెడల భక్తునకు కలిగిన యీ ప్రేమ పరిపూర్ణ చింతనయే ఆ భక్తుని ప్రాణములకు ఆధారమగును. ఆ భక్తుడొక్క క్షణమాత్రమైనను భగవంతుని మరచుట సహింపజాలడు. ఎవని మనస్సైతే యీవిధంగానగునో ఆభక్తుడే భగవంతునందు మనస్సుగలవాడు అనబడును.

"భగవంతుడే పరమగతి, ఆయన యొక్కడుమాత్రమే భర్త ప్రభువు ఆయనయే పరమాశ్రయుడు, పరమ ఆత్మీయుడు, పరమసంరక్షకుడు"నని తలచి ఆభగవంతునిపైననే భారముపైచియుండుట ఆయన ప్రతియొక్క విధానమునందున్ను సంతుష్టుడైయుండుట ఆయన యాజ్ఞనే యనుసరించుట ఆభగవంతుని నామ-రూప-గుణప్రభావ-లీలా-విలాసాదుల యొక్క శ్రవణ కీర్తన-స్మరణాదులలో మనస్సు-బుద్ధిఇంద్రియములను నిమగ్నము చేసి యుండుట ఆయన ప్రీతికొరకే ప్రతియొక పనిచేయుట వీని పేరే భగవంతునకు భక్తుడైయుండుట యనబడును.

1. భగవంతుని మందిరమునకుపోయి ఆయన మంగళమయమూర్తిని యథావిధిగా పూజించుట తమ తమ సౌకర్యము ననుసరించి తమ తమ యిండ్లలో తమ తమ యిష్టదైవ రూపమైన భగవంతుని మూర్తిని స్థాపించి ఆ భగవద్విగ్రహమునకు యథావిధిగా శ్రద్ధా-ప్రేమలతో పూజచేయుట, తమ హృదయములందుగాని లేక అంతరిక్షమునందుగాని భగవంతుని మానసికమూర్తిని తమ యెదుట నిలిపికొని ఆ మూర్తికి మానసిక పూజ చేయుట భగవంతుని వచనములను ఆయన లీలా విలాస భూమిని ఆయన

ఆత్మను నాయందు నియోగించి[1] నాయందు తత్పరుడవై[2] యున్న యెడల నీవు

---

చిత్రపటాదులనున్ను ఆదరించి సత్కరించుట ఆయన సేవాకార్యములందు తాము నిమగ్నులైయుండుట నిష్కామభావములు-సాధువులు-మహాత్ములు-గురుజనులు-తదితర సమస్త ప్రాణులున్ను భగవత్స్వరూపులేయని తలచి కాని లేక అంతర్యామి రూపములో భగవంతుడు అందరియందు వ్యాపించి యున్నాడని తెలిసికొని అందరిని వారి వారికి తగినట్లు పూజించి ఆదరించి సత్కరించుట తమ శరీరములతో మనస్సులతో-ధనములతోను అందరి కిన్ని వారి వారి యోగ్యతననుసరించి సుఖము కలిగించి-అందరకున్ను హితము చేయుటకు యథార్థముగా ప్రయత్నించుట ఇవి యన్ని కార్యములే భగవత్పూజయని చెప్పబడును.

భగవంతుని సాకార రూపముగాని-నిరాకారముగాని ఆయన మూర్తి చిత్ర పటము పాదములు పాదుకలు లేక పాదచిహ్నములు, ఆయన యొక్క తత్త్వ రహస్య ప్రేమ-ప్రభావములనుగూర్చి ఆయన మధుర లీలా విలాస ములనుగూర్చియు వ్యాఖ్యానముచేయు సత్ శాస్త్రములు, మాతృ పితృ-బ్రాహ్మణ-గురు-సాధు-మహాత్మ సత్పురుష-మహాపురుషులేకాక సమస్త ప్రపంచప్రాణులుగూడ భగవత్స్వరూపులేయని తలచి లేక భగవంతు డందరియందున్ను వ్యాపించియున్నాడని తెలిసికొని శ్రద్ధా భక్తులతో, మనో-వాక్-శరీరములచేత తమ యోగ్యతప్రకారము ప్రణామము చేయు టయే భగవంతునకు నమస్కారము చేయుట యనబడునని భావించ వలెను.

1. ఇక్కడ 'ఆత్మ' అను శబ్దమునకు మనో-బుద్ధీంద్రియ సహితమైన శరీర మని యర్థము. ఈ యన్నింటిని పైన చెప్పబడినవిధముగా భగవంతుని యందు లగ్నముచేసి యుండుటయే ఆత్మను భగవంతునియందు నియోగించుట యనబడును.

2. ఈ విధముగా, అన్నియు భగవంతునకు సమర్పించుట, భగవంతుడే అందరి కిన్ని పొందదగినవాడు పరమగతి పరమాశ్రయుడు-తమ సర్వస్వమువని తలచుటయే భగవంతునియందు తత్పరుడైయుండుట యనబడునని తెలిసి కొనవలెను.

---

నన్నే పొందగలవు.[1]

ఇతి శ్రీ మహాభారతే భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా పర్వణి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే రాజవిద్యా రాజగుహ్యయోగో నామ నవమోఽధ్యాయః
భీష్మపర్వణి తు త్రయస్త్రింశోఽధ్యాయః

శ్రీమహాభారతమునందు, భీష్మపర్వమునందు శ్రీమద్భగవద్గీతా పర్వమునందు శ్రీమద్భగవద్గీతోపనిషత్తులందు, బ్రహ్మవిద్యయందు, యోగశాస్త్రమునందు, శ్రీకృష్ణార్జున సంవాదమునందు, రాజవిద్యా రాజగుహ్యయోగమనబడు తొమ్మిదవ అధ్యాయము సమాప్తము (9) భీష్మపర్వమునందు ముప్పదిమూడవ అధ్యాయము సమాప్తము.

***

1. ఈ మనుష్య శరీరమునందే భగవంతుని ప్రత్యక్షముగా సాక్షాత్కరింప జేసికొనుట, భగవంతుని తాత్త్వికముగా తెలిసికొని ఆయనలో ప్రవేశించుట లేక భగవంతుని దివ్యలోకమునకు పోవుట ఆయన సమీపమునందుండుట లేక ఆయనవంటి రూపాదులను పొందుట ఇవియన్నియే. భగవత్ప్రాప్తి యనబడునని తెలిసికొనవలెను.

# శ్రీభగవద్గీతయందు పదవ అధ్యాయము

(భీష్మపర్వమునందు 34 వ అధ్యాయము)

## విభూతియోగము :

సంబంధము :

భగవద్గీత యేడవ అధ్యాయమునుండి తొమ్మిదవ అధ్యాయము వరకు వర్ణింపబడినవి. విజ్ఞానసహిత జ్ఞానము అంతిగంభీరమై-సులభగ్రాహ్యము కాకుండుటచేత ఇప్పుడు భగవంతుడు మరల ఆ విషయమునే ప్రకారాంతరముచేత బాగుగా పూర్తిగాను వివరించి తెలుపుటకుగాను పదవ అధ్యాయమును ఆరంభించి ఆ విషయము చెప్పుచున్నాడు. ఇక్కడ మొదటి శ్లోకములో భగవంతుడు పూర్వోక్తవిషయమునే మరల వర్ణించుటకు ప్రతిజ్ఞచేయుచున్నాడు :-

శ్రీ భగవానువాచ :

భూయఏవ మహాబాహో శృణు మే పరమం వచః ।
యత్తేఽహం ప్రీయమాణాయ[1] వక్ష్యామి హితకామ్యయా ॥

భగవంతుడిట్లనెను :

అర్జునా! పరమరహస్యము-ప్రభావశాలియునైన నా మాటను మరలగూడ

---

1. ఇక్కడ "ప్రీయమాణాయ" అను విశేషణము ప్రయోగించి భగవంతుడు అర్జునా! నాయందు మిక్కిలి ప్రేమయున్నది. నా మాటలను నీవు అమృతమయములని తలచి మిక్కిలి శ్రద్ధా ప్రేమలతో వినుచున్నావు ఈ కారణముచేతనే నేను ఏ విధమైన సంకోచములేక, నీవు అడుగకయే. నీకు, పరమ రహస్యములైన నా గుణ ప్రభావ తత్త్వ రహస్యములను మాటి

చెప్పెదవినుము[1] నాయందు అతిప్రేమగల నీ హితము కోరి చెప్పెదను.

సంబంధము :

మొదటి శ్లోకములో భగవంతుడు ఏ విషయమును చెప్పుటకు ప్రతిజ్ఞ చేసెనో, దాని వర్ణనమును ఆరంభించుచు, ఆయన యైదు శ్లోకములలో నిక్కడి నుండి యోగశబ్దమునకు అర్థమైన ప్రభావమునుగూర్చి తన విభూతినిగూర్చియు సంగ్రహముగా చెప్పుచున్నాడు.

> న మే విదుః సురగణాః[2] ప్రభవం న మహర్షయః[3] ।
> అహమాదిర్హి భూతానాం మహర్షీణాం చ సర్వశః ॥

అర్జునా ! నా ఉత్పత్తిని అనగా లీలచేత నేను ప్రకటితుడగుటను దేవత లెరుగరు. మహర్షులుగూడ నెరుగరు[4] ఎందుకనగా నేను అన్నివిధముల దేవత

---

మాటికి వెల్లడి చేయుచున్నాను. దీనికి నీయందు నాకు ప్రేమయే హేతువు అని తెలిపెను.

1. ఈ యధ్యాయమునందు భగవంతుడు తన గుణ ప్రభావ-తత్త్వ-రహస్యములను వివరించి తెలుపుటకు చేసిన ఉపదేశమే పరమవచనము అనబడును. అది మరల వినుమనిచెప్పి భగవంతుడు, నాభక్తి తత్త్వము చాల గహనమైనది. అందుచేత దానిని మాటిమాటికి వినుట మిక్కిలి ఆవశ్యకమని తలచి మిక్కిలి జాగ్రత్తతో శ్రద్ధా-ప్రేమ పూర్వకముగా వినవలెను అని తెలిపెను.

2. "సురగణాః" అను పదమునకు ఏకాదశరుద్రులు-అష్టవసువులు-ద్వాదశాదిత్యులు ప్రజాపతి- నలువది తొమ్మండుగురు మరుద్గణములు ఇం దాది శాస్త్రీయ దేవతా సముదాయము ఈ యందరు యని యర్థము.

3. "మహర్షయః" అను పదముచేత ఇక్కడ ఏడుగురు మహర్షులు సప్త ఋషులు) అని యెరుగవలెను.

4. భగవంతుడు తన సమాన ప్రభావముచేత ప్రపంచముయొక్క సృష్టి స్థితి లయములను చేయుటకు బ్రహ్మ-విష్ణు-మహేశ్వరుల రూపములలో

లకు, మహర్షులకున్ను ఆదికారణుడను.[1]

యో మామజమనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్ ।
అసమ్మూఢః స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే ॥ 3

అర్జునా! యెవడైతే నన్ను అజన్మునిగా- అనగా జన్మరహితునిగా, అనాదిలోకములకు గొప్ప ఈశ్వరుడనని తత్త్వముతో తెలిసికొనునో[2] మనుష్యులలో జ్ఞానవంతుడైన ఆ పురుషుడు పాపములనుండి విముక్తుడును.

---

దుష్ట సంహార ధర్మ సంస్థాపనములు చేయుటకు వివిధలీలలతో ప్రపంచ ప్రాణులను ఉద్ధరించుటకు శ్రీకృష్ణ - శ్రీరామాది దివ్యావతారములలో భక్తులకు దర్శనమిచ్చి వారిని కృతార్థులను చేయుటకు వారి యిచ్ఛాను సారముగా వివిధరూపములలో, లీలా విచిత్రములను ప్రవాహరూపములో సాగింపజేయుటకు సర్వ ప్రపంచ రూపములోను ప్రకటితుడగుటయే యిక్కడ 'ప్రభవ' అను శబ్దమునకు అర్థము. దానిని దేవతలు మహర్షులు నెరుగరు. ఇట్లు చెప్పుటచేత, భగవంతుడు, నేను ఏయే సమయములలో ఏయే రూపములలో ఏయే కారణములచేత ఏ విధముగా ప్రకటితుడ నయ్యెదనను రహస్యమును అతీంద్రియ విషయములను గూడ గ్రహించు సామర్థ్యముగల దేవతలు-మహర్షులుగూడ యథార్థముగా తెలిసికొనజాల రనగా, ఇక సాధారణుల విషయమై చెప్పవలసిన అవసరమేమున్నది ? అను భావమును తెలిపెను.

1. ఇట్లు చెప్పుటచేత భగవంతుడు ఈ సర్వజగదుత్పత్తి చేసిన దేవతలు-మహర్షులందరున్ను నానుండియే ఉత్పన్నులైనారు. వారికి ఉపాదానకారణము (నగలకు బంగారం వంటిది) నిమిత్త కారణము (నగలు చేయు కంసాలి సుత్తి మున్నగునవి) గూడ నేనే. వారికిగల విద్యా-బుద్ధి-శక్తి తేజస్సు మున్నగు ప్రభావములుగూడ వారికి నా వలననే లభించును. అను భావము తెలిపెను.

2. భగవంతుడు తన యోగమాయచే వివిధ రూపములలో నవతరించుచుగూడ జన్మరహితుడు (గీత-4-6) అన్యజీవులవలె ఆయనకు జన్మయుండదు.

బుద్ధిః[1] జ్ఞాన[2]మసమ్మోహః[3] క్షమా సత్యం దమః శమః
సుఖం దుఃఖం భవోఽభావో భయం చాభయమేవ చ ॥ 4

ఆయన తన భక్తులకు సుఖము కలిగించుటకు ధర్మసంస్థానము చేయుటకు మాత్రమే లీలతో జన్మము ధరించును అను విషయము శ్రద్ధా విశ్వాసములతో యథార్థముగా గ్రహించుట, ఇందులో కొంచెముగూడా సందేహము లేకుండుటయే భగవంతుడు జన్మరహితుడు, అని యన బడును. భగవంతుడే సమస్త భూతప్రపంచమునకు ఆది- అనగా మహా కారణము. ఆయనకంటే పూర్వము 'ఆది' ఎవడున్నులేడు. ఆయన నిత్యుడు ఎల్లప్పటికి నుండువాడు. ఇతర వస్తువులకు వలె భగవంతునకు ఒక కాలమునందు ఆరంభముకాలేదు అను విషయమును శ్రద్ధా విశ్వా సములతో యథార్థముగా తెలుసుకొనుటయే భగవంతుడు అనాదియని తెలిసికొనుట యనబడును. ఈ విధముగనే ఈశ్వరుల వర్గములలో చేరిన ఇంద్ర, యమ వరుణ-ప్రజాపత్యాది లోకపాలకులందరికిన్ని భగవంతుడే మహేశ్వరుడు ఆయనయే అందరికి నియంత ప్రేరకుడు- కర్త- భర్త- హర్త అందరిని అన్నివిధముల పాలన పోషణములు రక్షణము చేయు వాడు- సర్వశక్తి సంపన్నుడు పరమేశ్వరుడే యగును. అను విషయము శ్రద్ధా పూర్వకముగా సంశయరహితంగా యథార్థముగాను తెలిసికొను టయే భగవంతుడు సర్వలోకములకు మహేశ్వరుడని తెలిసికొనుట, అన బడును అని తెలియవలెను.

1. కర్తవ్యాకర్తవ్యములు గ్రాహ్యాగ్రాహ్యములు మంచి చెడ్డలు ఈ మొదలైన వానిని నిర్ణయించి నిశ్చయించునటువంటి యేమనోవృత్తిగలదో అదియే బుద్ధి యనబడును.

2. ఏ వస్తువునైనను యథార్థముగా తెలుసుకొనుట 'జ్ఞాన' మనబడును. ఇక్కడ జ్ఞాన శబ్దమునకు సాధారణజ్ఞానము నుండి భగవత్స్వరూప జ్ఞానము వరకుగల సర్వవిధ జ్ఞానములు అని యర్థము.

3 సుఖభోగాసక్తిగల మనుష్యులకు సర్వదా సుఖము గలిగించునవిగాతోచు సమస్త ప్రాపంచిక సుఖభోగములు అనిత్యములు క్షణికములు-దుఃఖమూల

అహింసా[1] సమతా[2] తుష్టిః[3] తపో దానం యశోఽయశః।
భవంతి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః ॥ 5

అర్జునా! నిశ్చయించగలశక్తి, యథార్థజ్ఞానము, మోహము చెందకుండుట క్షమ[4]

---

కములునని తలచి వానియందు మోహము లేకుండుటయే 'అసమ్మోహము' అనబడును.

1. ఏ ప్రాణికైనను ఏ సమయమందైనను ఏవిధముననైనను మనో-వాక్-శరీరములచేత కొంచెముగూడ కష్టము కలిగించకుండు భావము 'అహింస' యనబడును.

2. సుఖ-దుఃఖములు, లాభాలాభములు, జయాపజయములు, నిందాస్తుతులు, మానాపమానములు, మిత్రశత్రులు ఈ మొదలైన క్రియలు-పదార్థములు ఘటనములు మొదలైనవి వైషమ్యమునకు కారణములుగా తలచబడుచున్న అన్నిటియందున్ను నిరంతరము రాగద్వేషరహిత సమబుద్ధిగలభావము 'సమత్వము' అనబడును.

3. ఏది లభించినను అది ప్రారబ్ధ (పూర్వజన్మప్రాప్తి) భాగములేక దైవ విధానము అని తలచి సర్వదా సంతుష్టుడైయుండు భావము 'తుష్టి' యనబడును.

4. చెడుకోరుట చెడుచేయుట ధనాదివస్తువులను అపహరించుట అవమానపరచుట బాధకలిగించుట కటువచనములు పలుకుట లేక తిట్టుట నింద మోపుట కొండెములు చెప్పుట నిప్పు అంటించుట విషముపెట్టుట చంపుట ప్రత్యక్షముగాగాని అప్రత్యక్షముగాగాని హానికలిగించుట ఈ మొదలైన అపరాధములలో ఒకటిగాని అనేకముగాని అపరాధములు చేయునటువంటి ప్రాణియెవడైనను సరియె తనకు ప్రతీకారము చేయు సామర్థ్యము పూర్తిగా నున్నప్పటికిన్ని ఆ యపరాధికి ఏవిధమైన ప్రతీకారముచేయు నిచ్ఛను పూర్తిగా విడుచుట ఆ యపరాధికి ఆ యపరాధము కారణముగా ఈ లోకమునందుగాని పరలోకమునందుగాని ఏ విధమైన దండనము కలుగకుండుగాక యనుభావము కలిగియుండుట 'క్షమ' యనబడును.

సత్యము[1] ఇంద్రియములను వశపరచుకొనుట, మనోనిగ్రహము సుఖ దుఃఖములు[2] ఉత్పత్తి ప్రళయములు భయాభయములు[3] అహింస సమత్వము,

---

1. ఇంద్రియములచేత అంతఃకరణముచేతను ఏ విషయమైనను ఏరూపములో నైనను విని అనుభవింపబడినదో సరిగ్గా దానిని ఆ రూపములోనే యితరు లకు తెలుపు నుద్దేశముతో హితకరమైన ప్రియవచనములతో దానిని తెలుపుట సత్యమనబడును.

2. ఇక్కడ సుఖ శబ్దమునకు ప్రియ (అనుకూల) వస్తువులు లభించినప్పుడు అప్రియ (ప్రతికూల) వస్తువులు తొలగిపోయినప్పుడున్ను కలుగు సర్వ విధ సుఖములనియర్థము. ఇట్లే ప్రియవస్తువు దొరకనప్పుడు అప్రియ వస్తువు ప్రాప్తించినప్పుడున్ను కలుగు అధిభౌతికములు అధిదైవికములు ఆధ్యాత్మికములునగు సర్వవిధ దుఃఖములు ఇక్కడ దుఃఖశబ్దమునకు అర్థము. మనుష్య పశు-పక్షి-కీటక శలభాది ప్రాణులవలన గలుగు కష్టములు అధి భౌతికములు (పృథివ్యాది భూతములవలన గలుగునవి) అని అతివృష్టి అనావృష్టి భూకంపములు పిడుగులుపడుట కరువు మొదలగు దైవికము లైన కష్టములు అధిదైవికములు అనియు ఈ త్రివిధ దుఃఖములు చెప్ప బడును.

3. సృష్టికాలమందు జరుగు చరాచర ప్రపంచోత్పత్తియగుట 'భావము' అని ప్రళయకాలమందు ఆ ప్రపంచము లీనమగుట 'అభావము' అనియు చెప్పబడును. ఏదైనహానిగాని మృత్యువుగాని కలిగించు కారణముచూచి అంతఃకరణమునందు గలుగు భావము 'భయము' అని అంతటను పర మేశ్వరుడొక్కడే వ్యాపించియున్నాడని తలచుటచేతగాని మరియే యితర కారణములచేతగాని భయము పూర్తిగా లేకుండుట 'అభయం' అని అన బడును.

సంతోషము తపస్సు[1] దానము[2] కీర్తి అపకీర్తి ఈ మొదలైన ప్రాణుల వివిధ భావములన్నియు నానుండియే కలుగును.[3]

"మహర్షయః సప్త పూర్వే చత్వారో[4] మనవస్తథా ।
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః ॥" 6

---

1. స్వధర్మపాలనము కొరకు కష్టములను సహించుకొనుట 'తపస్సు' అనబడును.

2. తన వస్తువును (స్వత్వమును) ఇతరుల హితముకొరకు ఇచ్చుట 'దానము' అనబడును.

3. ఇట్లు చెప్పుటచేత భగవంతుడు వేర్వేరు ప్రాణులకు వారివారి ప్రకృతి ననుసరించి పైన చెప్పబడిన వేర్వేరు భావములన్నియు నానుండియే కలుగును. అనగా అవియన్నియు నా సహాయశక్తి సత్తలతోనే కలుగును అను భావమును తెలిపెను.

4. చత్వార పూర్వే అను పదములచేత అందరికన్న మొదట ఉత్పన్నులగు సనక- సనందన సనాతన- సనత్కుమార నామములుగల నలుగురు అని గ్రహించవలెను. ఈ నలుగురుగూడ భగవత్స్వరూపులే యగుదురు.

బ్రహ్మదేవుడు తపస్సు చేసిన తరువాత స్వేచ్ఛగా ఈ నలుగురు ప్రకటితులైరి. ఈ విషయం బ్రహ్మదేవుడే-

తప్తం తపో వివిధలోకసిసృక్షయా మే
ఆదౌ సనాత్ స్వతపసః స చతుః సనోఽభూత్
ప్రాక్కల్పసంప్లవ వినష్ట మిహాఽత్మ తత్త్వమ్
సమ్యగ్ జగాద మునయో యదచక్షతాఽత్మన్ ॥
(శ్రీమద్భాగవతము 2.7.5)

అని స్వయముగా చెప్పెను. అనగా,

నేను వివిధలోకముల యుత్పత్తి చేయుటకు మొట్టమొదట తపస్సు చేసి

అర్జునా! యేడుగురు మహర్షులు[1] వారికంటే పూర్వమే ప్రకటితులగు

---

తిని. ఆయఖండమైన నా తపస్సుచేతనే భగవంతుడు స్వయముగా సనక సనందన- సనాతన- సనత్సుజాతులు నలుగురు 'సన' నామముగల రూపములలో ప్రకటితులైరి. (సన యనగా అతిప్రాచీనము. శాశ్వతముగ నుండువారు అని యర్థము. ఈ నలుగురి పేర్లలో సనయున్నది గాబట్టి యీ బ్రహ్మ మానసపుత్రులు విష్ణుస్వరూపులై అతి ప్రాచీన కాలమునుండి ఉన్నారు. శాశ్వతముగా వీరు ఉండువారు. మహర్షులు) పూర్వకల్పము నందు ప్రళయకాలములో ఆత్మ తత్త్వజ్ఞానముయొక్క ప్రచారము ఈ ప్రపంచమునందు నష్టమైపోగా ఈ నలుగురు మహర్షులకు బాగుగా ఆత్మ తత్త్వ జ్ఞానోపదేశము నేను చేసితిని. ఆ నాయుపదేశముచేత ఈ నలుగురు మునులు తమ హృదయములందు ఆత్మ తత్త్వ సాక్షాత్కారము చేసి కొనిరి.

1. సప్తర్షుల లక్షణము వాయు పురాణములో నిట్లు చెప్పబడినది :

ఏతాన్ భావాన ధీయానా యే చైత ఋషయో మతాః ।
సప్తైతే సప్త భిశ్చైవ గుణైః సప్తర్షయః స్మృతాః ॥
దీర్ఘాఽయుషో మంత్రకృత ఈశ్వరా దివ్యచక్షుషః
వృద్ధాః ప్రత్యక్షధర్మాణో యేచ గోత్రప్రవర్తకాః ॥
వాయుపురాణము 61.93.94)

అనగా ఆ విధముగా దేవర్షులయొక్క పైన చెప్పబడిన భావములను అధ్యయనము (స్మరణము) చేయువారు 'ఋషులు' అనబడెదరు. ఈ ఋషులలో నెవరైతే దీర్ఘాయువులు మంత్రకర్తలు - ఐశ్వర్యవంతులు - దివ్య దృష్టి గలవారు. గుణములలో విద్యలలో ఆయువులోను వృద్ధులైనవారు ధర్మమును ప్రత్యక్షము (సాక్షాత్కారము) చేసికొనగలవారు- గోత్రములను నడుపువారుగా నున్నారో ఈ యేడు గుణములుగల యేడుగురు ఋషులను సప్తర్షులు అనెదరు. వీరినుండి యే ప్రజావిస్తారము ధర్మ వ్యవస్థ ప్రపంచములో సాగుచుండును.

నలుగురు సనకాదులు స్వాయంభువు మొదలైన పదునాలుగురు మనువులు[1] వీరం తరుగూడ నాయందు తమభావము ఉనికి గలవారు. వీరందరుగూడ నా వంశ

---

వాయుపురాణంలో వర్ణింపబడిన సప్తర్షులే 'మహర్షులు' అని భగవంతుడీ శ్లోకములో చెప్పెను ఈ సప్తర్షులు బ్రహ్మదేవుని సంకల్పమునుండి ఉత్పన్నులైనారని చెప్పెను. అందుచేత ఇక్కడ ఆ సప్తర్షులే సూచింపబడినారు. వీరు ఋషులందరికన్నను ఉన్నతులు ఈ సప్తర్షులనుగూర్చి మహాభారతములో చెప్పబడినది.

వీరి విషయమై సాక్షాత్తు పరమపురుషుడైన పరమేశ్వరుడు దేవతా సహితుడైన బ్రహ్మదేవునితో నిట్లనెను.

మరీచిరంగిరాశ్చాత్రిః పులస్త్యః పులహః క్రతుః ।
వసిష్ఠ ఇతి సప్తైతే మానసా నిర్మితా హి తే ॥
ఏతే వేదవిదో ముఖ్యా వేదాచార్యాశ్చ కల్పితాః ।
ప్రవృత్తి ధర్మిణశ్చైవ ప్రాజాపత్యే చ కల్పితాః॥
మ-భా-శాంతి–340–69, 70

మరీచి, అంగిరుడు, అత్రి, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, వసిష్ఠుడు అను నీ యేడుగురు మహర్షులు నీచేతనే (బ్రహ్మ) నీ మనస్సుచేత రచియింపబడినారు. ఈ యేడుగురున్ను వేదము తెలిసినవారు, నేను వీరిని ముఖ్య వేదాచార్యులనుగా చేసితిని. వీరు ప్రవృత్తి మార్గమున నడుచువారు. నేనే వీరిని ప్రజాపతియొక్క కర్మలు నిర్వహించుటకుగాను నియోగించితిని.

ఈ కల్పమునందు మొట్టమొదట స్వాయంభువ మన్వంతరమునందలి సప్తర్షులు వీరేయగుదురు. (హరివంశం 7, 8, 9) కనుక ఇక్కడ సప్తర్షులనగా వీరేయని గ్రహించవలెను.

1. బ్రహ్మదేవుని ఒక్కదినమునందు పదునాలుగురు మనువులుంతెదరు. ప్రతియొక్క మనువుయొక్క కాలమునకు 'మన్వంతరము' అని పేరు. డెబ్బదియొక్క చతుర్యుగములకన్న కొంచమధికమైన కాలము ఒక

మన్వంతరమగును. మనుష్యుల సంవత్సరముల లెక్క ప్రకారము, ఒక మన్వంతరమునకు ముప్పదికోట్ల అరువదియారు లక్షల యిరువదివేల సంవత్సరములు - దివ్యవర్షముల లెక్క ప్రకారము, ఎనిమిది లక్షల యేబదిరెండు వేల సంవత్సరములకన్న కొంచెమధికమగును (విష్ణుపురాణము 1-3)

సూర్య సిద్ధాంతమునందు చెప్పబడిన మన్వంతరాదుల వర్ణనము ఈ విధంగాఉంది:-

సౌరమానము ప్రకారము ఒక చతుర్యుగి (మహాయుగము) నలువదిమూడు లక్షల యిరువదివేల సంవత్సరములు - దేవమానము ప్రకారము ఒక పన్నెండు వేల సంవత్సరములు గలదియగును. దీనినే మహాయుగమనెదరు. ఇటువంటి డెబ్బదియొక్క యుగములు ఒక్క మన్వంతరమగును. ప్రతి మన్వంతరము చివరకు కృతయుగ ప్రమాణము ప్రకారము అనగా 17,28000 సంవత్సరములకు సంధ్యాకాలము అగును. మన్వంతరము గడచిన తరువాత సంధ్యాకాలమైనప్పుడు భూమి జలములో మునిగిపోవును. ప్రతియొక్క కల్పమునందు (బ్రహ్మ ఒక దినము) పదునాలుగు మన్వంతరములు వానివాని సంధ్యాకాలపు ప్రమాణముతోపాటు అగును. ఇదిగాక కల్పారంభమునందుగూడ కృతయుగముయొక్క ఒక ప్రమాణ కాలపు సంధ్యయగును. 71 మహాయుగముల ప్రమాణము ప్రకారము 14 మనువులకు 994 మహాయుగములగును. కృతయుగపు ప్రమాణము ప్రకారము 15 సంధ్యల కాలము 6 మహాయుగములకు సమానమైనవి పూర్తిగానగును. ఈ రెండింటి కాలప్రమాణముల కూడిక ప్రకారము పూర్తిగా ఒక వేయి మహాయుగములు లేక దివ్యయుగములు గడచిపోవును.

ఈ లెక్క ప్రకారము ఈ క్రింది అంకెలతో తెలిసికొనవలెను

| ఒక చతుర్యుగిమహాయుగం లేక దివ్యయుగము | సౌరమానము లేక మనుష్య సంవత్సరములు | దేవమానం లేకదివ్య వర్షములు |
|---|---|---|
| 1. | - 43,20,000 - | 12,000 |

| | | | |
|---|---|---|---|
| 2. | డెబ్బదియొక్క చతుర్యుగులు | - 30,67,20,000 - | 8,52,000 |
| 3. | కల్పసంధి | - 17,28,000 - | 4,800 |
| 4. | మన్వంతరంయొక్క పదునాలుగు సంధ్యలు | - 20,41,92,000 - | 67,200 |
| 5. | సంధిసహితమైన ఒక మన్వంతరము | - 30,84.48,000 - | 8,56,800 |
| 6. | పదునాలుగు సంధ్యలతోగూడిన పదునాలుగుమన్వంతరంలు | -4,31,82,72 000 - | 1,19,96 200 |
| 7. | కల్పసంధులతోగూడినపదునాలుగు మన్వంతరములులేక ఒకకల్పము | - 4,32,00,00,00 | - 1.20,00,000 |

బ్రహ్మదినమే కల్పమనబడును. ఇంత పెద్దదియే అయన రాత్రియగును. ఈ అహోరాత్రముల ప్రమాణముప్రకారము బ్రహ్మదేవుని పూర్ణాయువు ఒక నూరు వర్షముల కాలమగును. దీనిని 'పరము' అనెదరు. ఇప్పుడు బ్రహ్మ తన ఆయుస్సులో సగము భాగము అనగా ఒక పరార్థము గడిపి, రెండవ పరార్థమునందు నడచుచున్నాడు. ఇది అతని 51వ సంవత్సరములో మొదటి దినము లేక కల్పము, ఇప్పటి కల్పారంభము నుండి ఇంతవరకు స్వాయంభువాదులైన ఆరు మన్వంతరములు వాని వాని సంధ్యలతోపాటు గడచినవి. సంధ్యాసహితములైనయేడు కల్పముల సంధ్యలు గడచిపోయినవి. ఇప్పటికి యేడవ మన్వంతరముయొక్క 27 చతుర్యుగములు గడచిపోయినవి. ఇప్పుడు ఇరువదియెనిమిదవ చతుర్యుగియందలి కలియుగముయొక్క సంధ్యా కాలము నడచుచున్నది. (సూర్య సిద్ధాంతము-మధ్యమాధికారము-శ్లోకములు 15 నుండి 24 వరకు చూడుడు.)

ఇప్పటి విక్రమశకము 2013 సంవత్సరములవరకు 5057 సంవత్సరము కాలముగడచెను. కలియుగారంభమునందు 36,000 సంవత్సరములు సంధ్యా కాల ప్రమాణము. ఈ లెక్కప్రకారము ఇంకను కలియుగ సంధ్యకుగాను 30,943 సంవత్సరముల కాలము గడవవలసియున్నది. విక్రమశకము 2013 సంవత్సరములకు శాలివాహనశక 978వ వర్షము ఆరంభించును.

ల్పముచేత ఉత్పన్నులైనారు[1]. ఈ ప్రపంచమునందలి ప్రజలందరు వారి ప్రజలే యని తెలుసుకొనుము.

ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః ।
సోఽవికంపేన యోగేన[2] యుజ్యతే నాత్ర సంశయః ॥ 7

---

ప్రతిమన్వంతరంలోను ధర్మ వ్యవస్థకొరకు - లోకరక్షణము కొరకున్న సప్తర్షులు వేర్వేరుగా నుండెదరు. ఒక మన్వంతరము గడచిన తరువాత మనువు మారినప్పుడు ఆయనతోపాటే సప్తర్షులు-దేవతలు-ఇంద్రుడు-మనుపుత్రులుగూడ మారిపోవుదురు ఈ కల్పమునందు మనువులు-స్వాయంభువ-స్వారోచిష-ఉత్తమ-తామస-రైవత-చాక్షుష-వైవస్వత-సావర్ణి-దక్షసావర్ణి-బ్రహ్మసావర్ణి-ధర్మసావర్ణి-రుద్రసావర్ణి-దేవసావర్ణి-ఇంద్రసావర్ణి అను పేర్లు గలవారు ఉన్నారు.

శ్రీమద్భాగవతము ఎనిమిదవస్కంధము మొదటిది-ఐదవది-పదమూడవది యగు నధ్యాయములందు ఈ విషయము విస్తారముగా చెప్పబడినది. అది చదువుడు వేర్వేరు పురాణములలో వీరి వేర్వేరుపేర్లు చెప్పబడినవి. ఇక్కడ ఈ పేర్లు శ్రీమద్భాగవతము ననుసరించి వ్రాయబడినవి.

పదునాలుగు మనువుల ఒక కల్పము గడచిన తరువాత మనువులందరు మారిపోయెదరు.

1. వీరందరుగూడ భగవంతునియందు శ్రద్ధా-ప్రేమలు గలవారే. ఈ భావము తెలుపుటకే, వీరికి నాయందు భావముగలవారని తెలుపబడెను. బ్రహ్మదేవుని నుండి కలుగు వీరి యుత్పత్తి, వాస్తవముగా భగవంతునినుండియే కలుగునని తెలియవలెను. ఎందుకనగా స్వయముగా భగవంతుడే ప్రపంచ రచనము కొరకు బ్రహ్మదేవుని రూపమును ధరించును. కనుకనే బ్రహ్మ మనస్సునుండి పుట్టువారిని, భగవంతుడు 'వీరు తన మనస్సునుండి ఉత్పన్నులైనారు' అనుటలో విరోధమేమియులేదు.

2. ఏదైతే భగవంతుని యెడల అనన్య భక్తి గలదో (గీత 11-55) దేనిని 'అవ్యభిచారిణీభక్తి'(గీత 13-10)అవ్యభిచారిభక్తి యోగము(గీత 14-26)

అర్జునా! యేపురుషుడైతే, యీ నా పరమైశ్వర్యరూప విభూతిని[1], యోగ శక్తిని[2] తెలిసికొనునో అతడు నిశ్చలభక్తి యోగముతో గూడినవాడగును. ఇందులో సందేహంలేదు.

---

అనికూడ అనెదరో అటువంటి 'అవిచలభక్తియోగము' అనునది యిక్కడ 'అవికంపేన' అను విశేషణముతోగూడిన 'యోగేన' అను పదమునకు అర్థమని తెలియవలెను. ఆ భక్తి యోగమునందు నిమగ్నులైయుండుటయే దానితోగూడియుండుట'యనబడునని తెలియవలెను.

1. ఈ యధ్యాయమునందే నాలుగవ-ఐదవ-ఆరవ శ్లోకములలో భగవంతుడు ఏ బుద్ధ్యాది భావములు-మహర్ష్యాదులు తన నుండియే ఉత్పన్నులైనట్లు చెప్పెనో, గీత యేడవ అధ్యాయములో జలమునందు నేను రసముగా నున్నాను(7-8)అని తొమ్మిదవ యధ్యాయములో నేను క్రతువును, నేను యజ్ఞమును, 9-10)ఇత్యాది వాక్యములచేత,ఏయే పదార్థములు భావములు దేవతాదులు వర్ణింపబడెనో, అవియన్నియు 'విభూతి' శబ్దమునకు అర్థము.

2. భగవంతునియొక్క ఏ యలౌకిక శక్తియున్నదో, ఏ శక్తిని దేవతలు-మహర్షులుగూడ పూర్తిగా తెలిసికొనరో (10-2, 3) దేనికారణమైనతాను సాత్త్విక, రాజస-తామస భావములకు భిన్నములైన నిమిత్తోపాదానకారణములుగా నున్నప్పటికిన్ని, భగవంతుడు వానితో సంబంధము లేకుండ నుండునో, ఆ భావములు భగవంతునిలోలేవు. భగవంతుడు వానిలోలేడు (గీత-7-12) అని చెప్పబడెనో, ఏ శక్తిచేత సమస్త ప్రపంచముయొక్క ఉత్పత్తి-స్థితి-సంహారాది సమస్తకర్మలు చేయుచునే భగవంతుడు సమస్త ప్రపంచమును నియమముతో నడుపుచున్నాడో, దేనికారణముచేత భగవంతుడు సర్వప్రపంచమునకు మహేశ్వరుడు- సమస్త భూతప్రాణులకు మిత్రుడు- సమస్త యజ్ఞాదులకు భర్త సర్వాధారుడు సర్వశక్తి సంపన్నుడుగామన్నాడో, ఏ శక్తిచేత భగవంతుడు సర్వజగత్తును తన ఒక్క అంశములో ధరించియున్నాడో (గీత 10-42) యుగ-యుగములందు తన యిచ్ఛానుసారముగా భగవంతుడు వేర్వేరు కార్యములకొరకు అనేక రూపములను ధరించుచున్నాడో, అన్ని చేయుచున్నప్పటికిన్ని, సర్వ

సంబంధము–

అచంచలభక్తి యోగప్రాప్తినిగూర్చి భగవంతుని ప్రభావ-విభూతుల జ్ఞాన ఫలమును గూర్చిచెప్పి యిప్పుడు భగవంతుడు ఆ భక్తియోగప్రాప్తి క్రమమును గూర్చి అర్జునునకు చెప్పుచున్నాడు.

"అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే ।
ఇతి మత్వా భజంతే మాం బుధా భావసమన్వితాః॥" 8

"అర్జునా! వాసుదేవుడనైన నేనే సర్వ ప్రపంచోత్పత్తికి కారణభూతుడను. నా సర్వజగత్తు చలించుచున్నది"అని తలచి[1] శ్రద్ధా-భక్తియుక్తులై బుద్ధిమంతులైన

---

కర్మలు-సర్వజగత్తు జన్మాది సర్వవికారములు మున్నగువానిచేత పూర్తిగా నిర్లిప్తుడైయున్నాడో, భగవద్గీత తొమ్మిదవ అధ్యాయము ఐదవ శ్లోకములో ఏశక్తియైతే 'ఐశ్వర్యయోగము' అని చెప్పబడెనో ఆ యద్భుతశక్తి ప్రభావము 'యోగ' శబ్దమునకు అర్థము.

ఈ విధముగా సర్వజగత్తు భగవంతుడు రచించినదే. జగమంతయు ఆయన యొక యంశమునందే నిలిచియున్నది కనుక జగమునందు శక్తిసంపన్నములై ఏ వస్తువులన్నియు నున్నవో ఎక్కడనైనను విశేషము కనపడుచున్నదో అది-లేక సర్వజగత్తునే భగవద్విభూతిగా అనగా ఆయన స్వరూపముగానే తలచుట పైనచెప్పబడిన విధముగా భగవంతుడు సమస్త ప్రపంచమునకు కర్త-హర్త-సర్వశక్తి సంపన్నుడు సర్వేశ్వరుడు సర్వాధారుడు పరమదయాళువు- సర్వమిత్రుడు- సర్వాంతర్యామి అని తలచుటయే భగవద్విభూతిని యోగమును తాత్త్వికముగా తెలియుట యనబడును.

1. భగవంతుని యోగబలముచేతనే యీ సృష్టిచక్రము నడచుచున్నది. ఆయనయాజ్ఞాశక్తిచేతనే సూర్య-చంద్ర-నక్షత్ర భూమ్యాదులు నియమపూర్వకముగా తిరుగుచున్నది, ఆయన యాజ్ఞాశక్తిచేతనే సర్వప్రాణులు వారి వారి కర్మానుసారము ఉత్తమ నీచయోనులందు జన్మించి తాతివారి కర్మ ఫలములను ననుభవించుచున్నారు. ఈ విధంగా భగవంతుడే అందరికి

భక్తజనులు పరమేశ్వరుడనైన నన్నే నిరంతరము భజించెదరు.[1]

"మచ్చిత్తా[2] మద్గతప్రాణా[3] బోధయంతః పరస్పరమ్ ।
కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ ॥" 9

---

నియంత, నడుపువాడు అని తలచుటయే సర్వజగత్తు భగవంతునిచేతనే చలించుటయే అని యనబడును.

1. పైన చెప్పబడినవిధముగా భగవంతుడు సర్వజగత్తుకు కర్త- హర్త- ప్రవర్తకుడునని తెలిసికొని ఈ తరువాతి శ్లోకములో చెప్పబడినట్లు మిక్కిలి శ్రద్ధా ప్రేమపూర్వకముగా మనోబుద్ధీంద్రియములచేత నిరంతరము భగవంతుని స్మరణము సేవచేయుటయే భగవంతుని నిరంతరము భజించుట యనబడును.

2. భగవంతుడే తమకు పరమ ప్రేమపాత్రుడు పరమమిత్రుడు పరమాత్మీయుడు పరమగతి పరమప్రియుడునని తలచుటచేత ఎవరిచిత్తము అనన్యభావముతో భగవంతుని యందు లగ్నమైనదో (గీత 8.12 : 9-22) ఎవరిప్రేమ ఆసక్తి- లేక రమణీయబుద్ధి భగవంతునియందుదప్ప ఇతరులెవ్వరియందును ఏ వస్తువునందున్ను లేదో, ఎవరైతే సర్వదా ఎడతెగక, భగవంతుని నామ గుణ ప్రభావ లీలా విలాస స్వరూపముల చింతనము చేయుచుందురో ఎవరు శాస్త్రవిధానం ప్రకారం కర్మలు చేయుచు కూర్చొనుచు లేచుచు నిద్రించుచు మేల్కొనుచు చలించుచు నడచుచు తినుచు త్రాగుచు వ్యవహారకాలమందు ధ్యానకాలమునందున్ను ఒక్కక్షణము మాత్రంగూడ భగవంతుని మరవక యుండెదరో నిరంతరము సర్వదా భగవచ్చింతనము చేయుదురో అట్టి భక్తులకే యిక్కడ భగవంతుడు 'మచ్చిత్తాః' అను విశేషణము చేర్చి ప్రయోగించెను.

3. ఎవని జీవితము- ఇంద్రియ క్రియలన్నియు కేవలము భగవంతుని కొరకే యున్నవో ఎవరికి భగవద్వియోగము క్షణకాలమైనను సంహింపరానిదో ఎవడు భగవంతునికొరకే బ్రతికియున్నారో తినుట, త్రాగుట, కదలుట, నడచుట, నిద్రించుట, మేల్కొనుట ఇత్యాది క్రియలన్నిటియందున్ను

"అర్జునా"! నిరంతరము నాయందు మనస్సు లగ్నముచేయువారు నాయందే ప్రాణములను సమర్పించువారునైన భక్తజనులు నాభక్తినిగూర్చి పరస్పరము చర్చించుకొని నాప్రభావమును తెలిసికొనుచు, గుణప్రభావములతోగూడిన నా చరిత్రను కీర్తించుచునే[1] నిరంతరము సంతుష్టులయ్యెదరు[2] వాసుదేవుడనైన నా యందేవారు రమించుచునుందురు.[3]

---

ఎవరికి తన ప్రయోజన మేమాత్రముగూడ లేదో ఎవరు ఈ అన్నియు భగవంతుని కొరకే చేయుదురో అట్టివారినిగూర్చి భగవంతుడు 'మద్గత ప్రాణాః' అని చెప్పెను.

భగవంతునియందు శ్రద్ధాభక్తులు ఉంచి ప్రేమగల భక్తులు, వారివారి అనుభవములననుసరించి భగవంతునియొక్క గుణ ప్రభావ తత్త్వ లీలా విలాస మాహాత్మ్య రహస్యములను అనేకయుక్తులచేత ఒండొరులు తెలిసికొనుటకు ప్రయత్నము చేయుటయే పరస్పరము భగవంతుని తెలిసికొనుట యనబడునని తెలియవలెను,

1. శ్రద్ధా భక్తిపూర్వకముగా భగవంతుని నామ గుణ ప్రభావ లీలా స్వరూపముల కీర్తనము గానముచేయుట కథోపన్యాసాదులు చెప్పుటద్వారా ప్రజలలో వాని ప్రచారముచేయుట భగవంతుని స్తోత్రముచేయుట ఇత్యాదులన్నియు భగవంతునిగూర్చి చెప్పుట (కథనము) అనబడును.

2. ప్రతియొక్క పనిచేయుచు నిరంతరము పరమానందమనుభవించుటయే "నిత్యసంతుష్టుడైయుండుట" యనబడును. ఈ విధముగా సంతుష్టుడైయుండు భక్తునకు శాంతి, ఆనందము, సంతోషము కలుగుటకు కారణము కేవలము భగవంతుని నామ గుణ ప్రభావ లీలా స్వరూపాదులయొక్క శ్రవణ మనన కీర్తన పఠన పాఠనాదులేయగును. ప్రాపంచిక వస్తువులతో అతనికి ఆనంద సంతోషముల సంబంధమేమాత్రమునుండదు.

3. భగవంతుని నామ గుణ ప్రభావ లీలా స్వరూప తత్త్వ రహస్యముల శ్రవణ మనన కీర్తనములను తగినట్లుగా చేయుచు, భగవంతుని యిష్టము ఆజ్ఞ సంకేతము వీని ప్రకారము, కేవలము ఆయనయందు ప్రేమ కలుగుటకే ప్రతిపని చేయుచు మనస్సుచేత ఆయన సర్వదా తనకు ప్రత్యక్ష

సంబంధము-

పైన చెప్పబడిన విధముగా భజించు భక్తులకు భగవంతుడేమి చేయునని యీ పైన రెండు శ్లోకములలో చెప్పుచున్నాడు.

"తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే ॥" 10

"అర్జునా"! నిరంతరము నా ధ్యానాదులలో నిమగ్నులై ప్రేమపూర్వకముగా నన్ను భజించు[1] ఆ భక్తులకు నేను, వారు దేని చేతనైతే నన్ను పొందెదరో, ఆ తత్త్వ జ్ఞాన రూప యోగము నిచ్చెదను.[2]

"తేషామేవాను కంపార్థమహమజ్ఞానజం తమః ।
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥[3]" 11

---

ముగా నున్నట్లు తలచుచు నిరంతరము ప్రేమపూర్వకముగా ఆయన యొక్క దర్శన స్పర్శములు ఆయనతో మాట్లాడుట మొదలైన క్రీడలు సలుపుటయే భగవంతునియందు నిరంతరము రమించుట యనబడును.

1. దీనిచేత భగవంతుడు "పూర్వ శ్లోకములో ఏ భక్తులను భగవంతుడు వర్ణించెనో వారు భోగముల కామనకొరకు భగవంతుని భజించువారు కారు కాని యేవిధమైన ఫలమును కోరక కేవలము నిష్కామముగా, అనన్య ప్రేమపూర్వకముగానే భగవంతుని ఆ శ్లోకములో చెప్పబడిన ప్రకారముగా నిరంతరము భజించువారు అను భావమును తెలిపెను.

2. భగవంతుడు ఏ భక్తులయంతఃకరణమునందు తన ప్రభావమును మహత్త్వాది రహస్యములతో గూడిన నిర్గుణ నిరాకార తత్త్వము లీలా రహస్య మహత్త్వ ప్రభావాది సహితమైన సగుణ నిరాకార సాకార తత్త్వములను యథార్థరూపముతో వివరించి తెలుపు శక్తిని ఇచ్చుటయే బుద్ధి (తత్త్వ జ్ఞానరూప) యోగమును ఇచ్చుట యనబడును.

3. పూర్వ శ్లోకములో ఏ బుద్ధియోగమని చెప్పబడెనో దేనిద్వారా ప్రభావ మహిమాది సహితమైన నిర్గుణ నిరాకార తత్త్వముయొక్క లీలా రహస్య

"అర్జునా"! వారిని అనుగ్రహించుటకుగాను, వారి యంతః కరణము నందున్న నేను స్వయముగానే, వారి యజ్ఞాన జనితాంధకారమును, ప్రకాశ మయమైన తత్త్వ జ్ఞాన రూపముచేత నష్టము చేసెదను.[1]

సంబంధము :

భగవద్గీత ఏడవ అధ్యాయము మొదటి శ్లోకములో భగవంతుడు తన సమగ్రరూప జ్ఞానమును గ్రహించునట్టి ఏ విషయము వినుటకు అర్జునుని అజ్ఞా పించెనో, రెండవ శ్లోకమునందు, విజ్ఞానసహిత జ్ఞానమునుగూర్చి పరిపూర్ణముగా చెప్పెదనని దేనిని గూర్చి ప్రతిజ్ఞచేసియుండెనో, దాని వర్ణనము

---

మహత్త్వ ప్రభావాది సహితమైన సగుణ నిరాకార సాకారతత్త్వము యొక్క స్వరూపము బాగుగా తెలియబడెనో సంశయ విపర్యయ (వ్యత్యా సము)ములు మొదలగు దోషములేవియు లేకుండ 'దివ్యబోధము' అను నర్థమును తెలుపు 'భాస్వతా' అను విశేషణముతో గూడిన 'జ్ఞానదీపేన' అనుపదము ప్రయోగింపబడినది.

1. అనాది కాలమునుండి యేర్పడిన అజ్ఞానముచేత ఉత్పన్నమైన 'యే ఆవ రణశక్తి' యున్నదో దేనికారణముగా మనుష్యుడు భగవంతునియొక్క గుణ ప్రభావ స్వరూపములను యథార్థరూపములో తెలిసికొనడో అది యిక్కడ 'అజ్ఞాన జనితమైన అంధకారము' అని చెప్పబడినది. ఆ యంధ కారమును నేను భక్తుల హృదయములో ఉండి నశింపజేసెదను. అని యిట్లు భగవంతుడు చెప్పుటకు అభిప్రాయమేమనగా నేను అందరి యంతఃకరణములందు అంతర్యామి రూపముతో సర్వదా నిలిచియుండి నప్పటికిన్ని లోకములో నేను వారిలోనున్నట్లు తలచరు. ఈ కారణము చేతనే నేను వారియొక్క అజ్ఞాన జనితాంధకారమును నశింపజేయ జాలను. కాని నాయందు ప్రేమగల భక్తులు నేను వారి అంతర్యామినై యున్నానని తలచుచు, పూర్వశ్లోకమునందు చెప్పబడిన ప్రకారము నిరం తరం నా భజనము చేసెదరు. ఈ కారణముచేత నేను వారి అజ్ఞాన జనితాంధకార నాశమును సహజముగానే చేసెదను. అని తెలిసికొన వలెను.

భగవంతుడు ఏడవ అధ్యాయమునందు చేసెను. ఆ తరువాత ఎనిమిదవ అధ్యాయములో, అర్జునుడు చేసిన ఏడు ప్రశ్నములకు ఉత్తరము చెప్పుచూ గూడ భగవంతుడు ఆ విషయమునే స్పష్టముగా తెలిపెను. కాని అక్కడ చెప్పిన శైలి వేరుగా నుండెను. కనుక తొమ్మిదవ అధ్యాయములో ఆరంభమునందే మరల విజ్ఞాన సహితజ్ఞానమును వర్ణించుటకు భగవంతుడు ప్రతిజ్ఞచేసి, ఆ విషయమునే అంగ-ప్రత్యంగ సహితముగా చాలా బాగుగా వివరించి తెలిపెను. ఆ తరువాత వేరు శబ్దము చేత మరలదానిని స్పష్టముగా తెలుపుటకు గాను భగవంతుడు పదవ అధ్యాయము మొదటి శ్లోకములో మరల చెప్పుటకు ప్రతిజ్ఞ చేసెను. రెండవ శ్లోకము నుండి ఐదు శ్లోకముల చేత తన యోగశక్తిని విభూతులను వర్ణించి ఏడవ శ్లోకములో అవి తెలిసికొనినందు వలన గలుగు ఫలమును గూర్చి చంచల భక్తియోగ ప్రాప్తినిగూర్చియుభగవంతుడు తెలిపెను. మరల ఎనిమిదవ తొమ్మిదవ శ్లోకములలో భక్తియోగము ద్వారా భగవద్భజనమునందు నిమగ్నులైన భక్తుల భావమును గూర్చి ఆచారమును గూర్చియు వర్ణించెను. పదవ-పదకొండవ శ్లోకములలో దానికి ఫలముగా "అజ్ఞానముువలన గలిగిన అంధకారము నశించుట భగవంతుని ప్రాప్తింపజేయు బుద్ధియోగప్రాప్తియనిచెప్పి భగవంతుడు ఆ విషయమును సమాప్తముచేసెను. దీనిపైన అర్జునుడు భగవంతుని విభూతిని' యోగమునున్ను తాత్వికముగా తెలిసికొనుటయే భగవత్ప్రాప్తికి పరమ సహాయకము అను విషయమును తెలిసికొని యిప్పుడు ఏడు శ్లోకములతో అర్జునుడు మొదట భగవంతుని స్తోత్రము చెసి భగవంతుని యోగశక్తిని గూర్చి విభూతులను గూర్చియు విస్తారముగా వర్ణనము చేయుటకు భగవంతుని ప్రార్థించుచున్నాడు.

అర్జున ఉవాచ:

"పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్ ।
పురుషం శాశ్వతం దివ్యమాదిదేవమజం విభుమ్ ॥" 12

ఆహుస్త్వామృషయః¹ సర్వే దేవర్షిర్నారదస్తథా ।
అసితో దేవలో వ్యాసః స్వయం చైవ బ్రవీషి మే ॥" 13

---

1. ఋషీతే ష గీతౌ ధాతు శ్రుతౌ నతే తపస్యథ

అర్జునుడిట్లనెను :

శ్రీకృష్ణా! నీవు పరబ్రహ్మవు, పరమధాముడవు, పరమపవిత్రుడవు[1] ఎందుకనగా, నీవు సనాతనుడవు, దివ్య పురుషుడవు దేవాదిదేవుడవు, జన్మరహితుడవు సర్వవ్యాపివి, అని అందరూ మహర్షులు[2] చెప్పెదరు. అట్లే దేవర్షులు[3] నారద

---

ఏతత్ సంనియతం యస్మిన్ బ్రహ్మణా స ఋషిః స్మృతః॥
గత్యర్థాదృషతేర్ధాతోర్నామనిర్వృత్తిరాదితః ।
యస్మాదేష స్వయంభూతస్తస్మాచ్చ ఋషితా స్మృతా ॥
(వాయుపురాణం 59–79–81)

అనగా ఋష్ ధాతువు గమనము (జ్ఞానము) శ్రవణము-సత్యము-తపస్సు అనునర్థములలో ప్రయోగింపబడును. ఈ విషయములన్నియు నెవనిలో నొకటిగా చేరియున్నవో అతనికే ఋషియని పేరును బ్రహ్మదేవుడు పెట్టినాడు. గత్యర్థములో నున్న 'ఋష్' ధాతువునుండియే 'ఋషి' శబ్దము నిష్పన్నమైనది. ఆదికాలమునందు ఈ ఋషులు స్వయముగా నుత్పన్నులగుదురు కాబట్టి వారికి 'ఋషులు' అని పేరు.

1. ఇట్లు చెప్పుటచేత అర్జునుడు తెలిపిన భావమేమనగా 'ఏ నిర్గుణ పరమాత్మను పరబ్రహ్మ మనెదరో అయన నీ స్వరూపములోనేయున్నాడు. నీ విశ్వధామము శాశ్వతస్థానము) గూడ సచ్చిదానంద దివ్యమైనది. అది నీ కన్న అభిన్నము కాబట్టి నీ స్వరూపమే నీ గుణ నామ ప్రభావ లీలా విలాస స్వరూపములయొక్క శ్రవణ మనన కీర్తనాదులు అందరి నిన్ని పరమపవిత్రులను చేయునవి కనుక నీవు పరమపవిత్రుడవు అని.

2. ఇక్కడ 'ఋషిగణము' చేత మార్కండేయుడు అంగిరసుడు మొదలైన సమస్త ఋషులు అని తెలియవలెను. అర్జునుడు తాను చెప్పినమాట తనదిమాత్రమే కాదు. మహర్షులు గూడ చెప్పినారని ప్రమాణము చూపినాడు. ఇందలి యభిప్రాయమేమనగా నీవు సనాతనుడవు నిత్యుడవు ఏకరసుడవు క్షయవినాశరహితుడవు. దివ్యుడవు స్వతః ప్రకాశుడవు జ్ఞానస్వరూపుడవు అందరికి ఆదిదేవుడవు జన్మరహితుడవు ఉత్పత్త్యాదులైన

అరువికారములు లేనివాడవు సర్వవ్యాపివి అని ఆ మహర్షులు చెప్పెదరు. కనుక నీవు పరబ్రహ్మము పరమధామము పరమపవిత్రుడవు అనుటలో ఏమాత్రము సందేహములేదు.

పరమ సత్యవాది ధర్మమూర్తి పితామహుడునైన భీష్ముడు దుర్యోధనునకు శ్రీకృష్ణ భగవానుని ప్రభావమును గూర్చి తెలుపుచు నిట్లనెను:

"భగవంతుడైన వాసుదేవుడు సర్వదేవతలకు దేవత. అందరికన్న శ్రేష్ఠుడు. ఈయనయే ధర్మజ్ఞుడు, వరదుడు సమస్త కామములను పూర్ణముచేయువాడు. ఈయనయే కర్త కర్మ స్వయంభువు, భూతభవిష్యత్ వర్తమాన సంధ్యాదిక్ ఆకాశ సర్వనియమములను ఈ జనార్దనుడే రచించెను. మహాత్ముడు అవినాశియునైన యీ ప్రభువే ఋషి తపస్ ప్రపంచములను సృజించిన ప్రజాపతిని సృజించెను. సమస్త ప్రాణులకు అగ్రజుడైన సంకర్షణుని గూడ ఈయనయే సృజించెను. అనంతుడు అని చెప్పబడునట్టి గిరికాననసహితమైన సమస్తభూమి భారమును మోయుచున్న-ఆదిశేషుడు గూడ ఈయననుండియే ఉత్పన్నుడైనాడు. ఈయనయే వరాహ-నారసింహ వామనాద్యవతారములను ధరించువాడు. ఈయనయే అందరికి తల్లి తండ్రులుగా నున్నవాడు. ఈయనకన్న శ్రేష్ఠుడు మరియొకడు లేడు. ఈ కేశవుడే పరమ తేజస్స్వరూపుడు. సర్వలోకపితామహుడు మునిగణములు ఈయనను హృషీకేశుడని చెప్పెదరు. ఈయనయే ఆచార్యుడు తండ్రి గురువు, శ్రీకృష్ణుడు ఎవరియెడల ప్రసన్నుడగునో వారికి అక్షయలోకము ప్రాప్తించును. ఎవడైతే భయముచెంది భగవంతుడైన యీ కేశవుని శరణుజొచ్చునో ఇతనిని స్తుతించునో ఆ మనుష్యుడు పరమ సుఖము పొందగలడు. ఎవరు భగవంతుడైన శ్రీకృష్ణుని శరణుజొచ్చెదరో వారు ఎప్పుడు గూడ మోసం చెందరు, మహాభయం (సంకటం) నందు మునిగిన లోకులను గూడ భగవంతుడైన జనార్దనుడు రక్షించును. (మహాభారతం భీష్మపర్వం అధ్యా-67)

4. దేవర్షుల లక్షణము ఇట్లు చెప్పబడినది.

దేవలోకప్రతిష్ఠాశ్చ జ్ఞేయా దేవర్షయః శుభాః

దేవర్షయస్తథాఽన్యే చ తేషాం వక్ష్యామి లక్షణమ్
భూతభవ్యభవజ్ జ్ఞానం సత్యాభివ్యాహృతం తథా
సంబుద్ధాస్తు స్వయం యే తు సంబద్ధా యే చ వై స్వయమ్
తపసేహ ప్రసిద్ధా యే గర్భే యైశ్చ ప్రణోదితమ్
మంత్రవ్యాహారిణో యే చ ఐశ్వర్యాత్ సర్వగాశ్చ యే
ఇత్యాతే ఋషిభిర్యుక్తా దేవద్విజనృపాస్తు యే
(వాయుపురాణం 61, 88, 90, 91, 92)

అనగా దేవలోకములో నివసించు ఋషులు దేవర్షులు అని తెలియవలెను. వీరేకాక ఇట్టివారేయైన యితరులుకూడ దేవర్షులున్నారు. వారి లక్షణము చెప్పెద: భూత భవిష్యత్ వర్తమానకాలజ్ఞానము ఉండుట అన్ని విధముల సత్యము చెప్పుట దేవర్షుల లక్షణము. ఎవరు స్వయముగా పూర్తిగా జ్ఞానము పొందినారో స్వయము తమ యిచ్ఛతోనే ప్రపంచసంబంధము గలిగియున్నారో తమ తపస్సు కారణముగా ప్రపంచవిఖ్యాతులో ఎవరు ప్రహ్లాదాదులకు గర్భమునందే ఉపదేశము చేసిరో మంత్ర ప్రవక్తలో ఐశ్వర్య (సిద్ధి) బలముచేత, అంతట అన్ని లోకములయందున్న ఏ యాటంకము బాధలేకుండ రాక పోకలు చేయగలరో సర్వదా ఋషులతో చుట్టబడియుందురో అటువంటి దేవతలు బ్రాహ్మణులు రాజులు వీరందరు గూడ దేవర్షులు 'అనబడుదురు' అని శ్లోకముల తాత్పర్యము.

దేవర్షులు అనేకులు. వారిలో కొందరి పేర్లు ఇవి:

దేవర్షీ ధర్మపుత్రౌ తు నరనారాయణావుభౌ
వాలఖిల్యాః క్రతోః పుత్రాః కర్దమః పులహస్య తు
పర్వతో నారదశ్చైవ కశ్యపస్యాఽత్మజావుభౌ
ఋషంతి దేవాన్ యస్మాత్తే తస్మాత్ దేవర్షయః స్మృతాః ॥
(వాయుపురాణం 61, 83, 84, 85)

అనగా "ధర్మపుత్రులిరువురు నర నారాయణులు, క్రతువు కొడుకులు వాలఖిల్య ఋషులు పులహుని పుత్రుడు కర్దముడు. పర్వతుడు నారదుడు,

అసిత-దేవల వ్యాసులు గూడ చెప్పెదరు[1] నీవు గూడ నిన్ను గూర్చి అట్లే నాకు చెప్పితివి[2] (12-13)

సర్వమేతదృతం మన్యే యన్మాం వదసి కేశవ।
న హి తే భగవన్ వ్యక్తిం విదుర్దేవా న దానవాః ॥ 14

కేశవా[3] నీవు నాకు చెప్పిన మాటలన్నియు సత్యములని విశ్వసించెదను.

---

బ్రహ్మవాదులైన కశ్యపుని ఇరువురు పుత్రులు. అసితుడు వత్సలుడు ఈ మొదలైనవారు దేవతలను తమ అధీనంలోనుంచుకొనువారు కాబట్టి 'దేవర్షులు' అనబడెదరు.

1. దేవర్షులైన నారద అసిత దేవల వ్యాసులు నలుగురు భగవంతుని యథార్థ తత్త్వము నెరిగినవారు భగవంతునియందు మహాప్రేమగల భక్తులు. వీరు పరమజ్ఞానసంపన్నులైన మహర్షులు. వీరికాలములో వీరు పరమసమ్మాన్యులు మహాసత్యవాదులు మహాపురుషులని తలచబడినారు. ఇందుచేతనే వీరి పేర్లు ముఖ్యముగా చెప్పబడినవి. వీరు భగవంతుని మహిమనుసర్వదా పాడుకొనుచుందురు. భగవంతుని మహిమను విస్తారముగా ప్రచారము చేయుటయే వీరి జీవితములో ప్రధానకార్యము. మహాభారతంలో వీరు ఇతర ఋషి మహర్షులనేకులు భగవన్మహిమ పాడుకొను ప్రసంగములు చాల కలవు.

2. ఇట్లు చెప్పుటచేత అర్జునుడు తెలిపిన భావమేమనగా కేవలము పైన చెప్పబడిన ఋషులు మాత్రమే యీ విషయము చెప్పుటలేదు మరి నీవు కూడ నాతో నీ యసమాన ప్రభావవిషయములను గూర్చి యిప్పుడుకూడ చెప్పుచున్నావు (గీత 4-6నుండి 9 శ్లోకమువరకు; 5-29 7-7నుండి 12 శ్లోకములవరకు, 9-4నుండి 11 శ్లోకములవరకు 16నుండి 19 శ్లోకముల వరకు 10-2, 3. 8 శ్లోకములు (కనుక నీవు సాక్షాత్తు పరమేశ్వరుడవని నేను తలచుట బాగుగనేయున్నది అని

3. 'కేశ' అను పదములో 'క' 'అ' ఈశ అను మూడు పదములు సంధిలో కలిసియున్నవి ఈ మూడు వరుసగా బ్రహ్మ విష్ణు మహేశ్వరులు అను

*భగవాన్[1] నీ లీలామయ స్వరూపమును దేవతలుగాని దానవులుగాని తెలిసికొన

త్రిమూర్తులను తెలుపుచున్నవి. వ అనగా వపుస్ శరీరం అని భావము. ఆ త్రిమూర్తుల వపువులే అనగా స్వరూపమే 'కేశవ'శబ్దము యొక్క అర్థము అని పెద్దలు చెప్పెదరు అని భావము.

1. భగవద్గీత నాలుగవ అధ్యాయం ఆరంభమునుండి యీ అధ్యాయము పదకొండవ శ్లోకము వరకు భగవంతుడు చెప్పిన తన-గుణ-ప్రభావ స్వరూప-మహిమ-ఐశ్వర్యాది విషయములు శ్రీకృషుడు తాను సాక్షాత్తు పరమేశ్వరుడనని యంగీకరించుటయు నిరూపింపబడినవి. ఆ మాటలన్నిటిని సూచించు 'ఏతత్' యత్ అను నీ రెండు పదములు వాడబడినవి. భగవంతుడైన శ్రీకృష్ణుడే సమస్త ప్రపంచమునకు హర్త కర్త సర్వాధారుడు సర్వవ్యాపి సర్వశక్తి సంపన్నుడు సర్వమునకు ఆది సర్వనియంత సర్వాంతర్యామి దేవాదేవుడు సచ్చిదానందఘనుడు సాక్షాత్తు పూర్ణ బ్రహ్మము పరమాత్మయని తలచుట ఆయన యుపదేశము సత్యమని యంగీకరించుట దానియందు కొంచెము కూడ సందేహము చేయకుండుటయే ఈయన్ని మాటలు సత్యములని తలచుట యని పై గీత భాగములలో నిరూపింపబడినది.

ఐశ్వర్యస్య సమగ్రస్య ధర్మస్య యశసః శ్రియః
జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీరణా
(విష్ణుపురాణం 6-5-74)

"సంపూర్ణైశ్వర్య సమగ్రధర్మ సంపూర్ణకీర్తి సమగ్రశ్రీ సంపూర్ణజ్ఞాన సంపూర్ణ వైరాగ్యములు అని నీ ఆరింటికి భగములు అని పేరు. ఇవన్ని కలవాడు భగవంతుడు విష్ణుపురాణమందే యింకను నిట్లు చెప్పబడినది.

ఉత్పత్తిం ప్రళయం చైవ భూతానామాగతిం గతిమ్।
వేత్తి విద్యామవిద్యాం చ స వాచ్యో భగవానితి॥ (6-5-78)

"ఉత్పత్తి ప్రళయములు భూతములు గమనాఽగమనములు, విద్య-అవిద్య

జాలరు [1]

స్వయమేవాఽఽత్మనాఽఽత్మానం వేత్థ త్వం పురుషోత్తమ ।
భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే ॥ 15

సర్వభూతముల యుత్పత్తి చేయువాడా! భూతేశ్వరా! దేవదేవా! జగత్పతీ! పురుషోత్తమా[2] నిన్ను నీవే తెలిసికొనెదవు.[3]

---

ఈ యారింటిని తెలిసినవానిని భగవంతుడని యనవలెను. కనుకనే యిక్కడ అర్జునుడు శ్రీకృష్ణుని భగవన్! అని సంబోధించి నీవు సర్వైశ్వర్య సంపన్నుడవు, సర్వజ్ఞుడవు, సాక్షాత్తు పరమేశ్వరుడవు, ఇందులో సందేహము లేదు అను భావము తెలుపుచున్నాడు.

1. జగత్తుయొక్క ఉత్పత్తి స్థితి సంహారము చేయుటకు ధర్మస్థాపనకొరకు భక్తులకు దర్శనమిచ్చి వారిని ఉద్ధరించుటకు దేవతల రక్షణ రాక్షసుల సంహారముల కొరకు అనేక కారణములచేతను భగవంతుడు భిన్న భిన్న లీలామయ స్వరూపములను ధరించుచుండును. ఆ స్వరూపములనన్నింటిని దేవతలు దానవులు నెరుగరు అని చెప్పి అర్జునుడు 'మాయచేత నానా రూప ధారణము చేయుశక్తిగల దానవులు, ఇంద్రియములకు అతీతులైన విషయములను ప్రత్యక్షము చేసికొనశక్తిగల దేవతలు గూడ నీయొక్క ఆ లీలామయరూపములను వానిని దరించు దివ్యశక్తిని యుక్తిని వాని నిమిత్తములను వాని లీలలయొక్క రహస్యములను తెలిసికొనజాలరు. దేవదానవులకే యిట్లుండగా నిక సాధారణ మనుష్యులు తెలిసికొనజాలరని చెప్పవలసిన యవసరమేమున్నది. యను భావము తెలిసెను.

2. ఇక్కడ అర్జునుడీయైదు సంబోధనలను ప్రయోగించి నీవు సమస్త జగత్తును ఉత్పన్నము చేయువాడవు. అన్నిటికి నియంతవు అందరికి పూజ్యుడవు అందరిని పాలించి పోషించువాడవు. 'అపరా' 'పరా' నామములుగల 'క్షర' 'అక్షర' పురుషుల కన్ననుత్తముడవు సాక్షాత్తు పురుషోత్తముడవైన భగవంతుడవు." అను భావము తెలిపెను.

3. ఇట్లు చెప్పుటచేత అర్జునుడు నీవు సమస్త జగత్తునకు ఆదివి. నీగుణ—

వక్తుమర్హస్యశేషేణ దివ్యా హ్యాత్మవిభూతయః ।
యాభిర్విభూతిభిర్లోకాన్ ఇమాంస్త్వం వ్యాప్య తిష్ఠసి ॥ 16

శ్రీకృష్ణా! ఈ కారణముచేత నీవే ఆ నీ దివ్యవిభూతులను చెప్పుటకు సమర్థుడవు. ఆ విభూతులద్వారాయే కదా నీవు ఈ సమస్తలోకములందు వ్యాపించియున్నావు. కనుక అది నీవే చెప్పగలవు.

కథం విద్యామహం యోగింస్త్వాం సదా పరిచింతయన్ ।
తేషు కేషు చ భూతేషు చింత్యోఽసి భగవన్ మయా ॥ 17

యోగీశ్వరా! నేను ఏ విధముగా, నిరంతరము నీ చింతనము చేయుచు నిన్ను తెలిసికొనగలను. నీవు ఏయేభావములలో నిన్ను నేను చింతనము చేయుటకు యోగ్యుడవుగానున్నావు.[1]

విస్తరేణాఽత్మనో యోగం విభూతిం చ జనార్దన ।
భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్ ॥

జనార్దనా[2] నీ యోగశక్తిని, విభూతిని మరల విస్తారముగా చెప్పుము. ఎందుకనగా నీ యమృతమయు వచనములు వినుచు నాకు తృప్తిచాలకున్నది[3]

ప్రభావ లీలా మాహాత్మ్య రూపాదులు అపరిమితములు కాబట్టి నీగుణ ప్రభావ లీలా మాహాత్మ్య రహస్య స్వరూపాదులను ఎవరుగూడ నితర పురుషులు పూర్తిగా తెలిసికొనజాలరు. నీ ప్రభావాదులను నీవే స్వయముగా తెలిసికొనెదవు. అనుభావం తెలిపెను.

1. ఏయే పదార్థములలో ఏ విధముగా నిరంతరము చింతనముచేసి సహజముగానే భగవంతుని గుణ ప్రభావ తత్వరహస్యములు తెలిసికొనబడగలవు అను విషయమునుగూర్చి అర్జునుడు అడుగుచున్నాడు.

2. మనుష్యులందరు తమ తమ యిష్టవస్తువులకొరకు ఎవనిని యాచించెదరో ఆయన జనార్దనుడు అనబడును.

3. దీనిచేత అర్జునుడు 'నీవచనములందు నిండిన మాధుర్యమెట్టిదనగా దాని

అనగా వినవలెనను ఉత్కంఠ తీరకుండనుండునని భావము.

సంబంధము :

అర్జునుడిట్లు భగవద్విభూతులనుగూర్చి విస్తారపూర్వకముగా సంపూర్ణ రూపముతో వర్ణింపుమని ప్రార్థించినమీదట భగవంతుడు మొదట తన విస్తారము యొక్క అనంతత్వమును తెలిపి ప్రధానముగా తన విభూతుల వర్ణనము చేయుటకు ప్రతిజ్ఞ చేయుచున్నాడు.

శ్రీభగవానువాచ :

హంత తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః ।
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నాస్త్యంతో విస్తరస్య మే ॥

భగవంతుడిట్లనెను :

కురుశ్రేష్ఠా ! యిప్పుడు నేను నా దివ్యవిభూతులను గూర్చి ప్రధానముగా నీకు చెప్పెదను. ఎందుకనగా నా విస్తారమునకు అంతము (ముగింపు) లేదు[1].

---

నుండి ఆనందామృతధార ప్రవహించుచున్నది. ఆ యమృతపానము చేయగా మనస్సునకు ఎప్పుడుగూడ తృప్తియే కలుగదు. ఆ దివ్యా మృతమును త్రాగుకొలది దప్పి వృద్ధిచెందుచునేయుండును. ఈ యమృత మును నిరంతరము త్రాగుచుండవలెనను కోరిక ఎడతెగక కలుగు చుండును. అను భావము కనబడ చెను.

1. సర్వప్రపంచము భగవత్స్వరూపమైనప్పుడు, సాధారణముగానైతే, అన్ని వస్తువులు ఆయన విభూతులేకాని అవియన్నియు దివ్య విభూతులుకావు. భగవంతుని తేజోబల విద్యా- ఐశ్వర్య- కాంతి- శక్తులు మొదలైన వాని యొక్క విశేషవికాసముగల వస్తువులు ప్రాణులు మాత్రమే దివ్య విభూతులు అని తెలిసికొనవలెను. ఇక్కడ భగవంతుడు నా యీ విభూతులే అనంతములు కనుకనే అన్ని విభూతుల వర్ణనము చేయుటకు వీలుకానే కాజాలదు. నాలో నతిప్రధానములను మాత్రమే యిక్కడ నేను వర్ణించె దను. అని చెప్పి అట్టి విభూతులను గూర్చియే చెప్పుచున్నాడు.

సంబంధము-

ఇప్పుడు భగవంతుడు తన ప్రతిజ్ఞ ప్రకారము ఇరువదవశ్లోకమునుండి ముప్పది తొమ్మిదవశ్లోకము వరకు మొదట తన విభూతులను గూర్చి వర్ణించుచున్నాడు.

అహమాత్మా గుడాకేశ[1] సర్వభూతాऽశయస్థితః ।
అహమాదిశ్చ మధ్యం చ భూతానామంత ఏవ చ ॥ 20

---

ప్రపంచమునందు అనంతములుగా పదార్థములు - భావములు-విభిన్న జాతీయ ప్రాణులు విస్తారముగానున్నవి. ఈ యన్నిటియొక్క నియంత్రణము-సంచాలనము యథావిధిగా చేయుటకు ప్రపంచ సృష్టికర్తయైన భగవంతుని స్థిర నియమములచేత విభిన్న జాతీయ పదార్థములు భావములు, జీవులు, భిన్న భిన్న వర్గములుగా విభజింపబడినవి. ఆయన్నింటి సృష్టి-పాలన-సంహారకారణములు బాగుగా నియమానుసారముగాను సాగుటకొఱకుగాను ప్రతియొక సమిష్టివర్గ విభాగమునకు అధికారులు నియమింపబడినారు. రుద్ర-వసు-ఆదిత్య-ఇంద్ర-సాధ్య-విశ్వేదేవ-మరుత్-పితృ-మనుష్య-సప్తర్ష్యాదులే యాశ్వేర్వరు అధికారుల నామములు ఈ దేవతలయొక్క రూపములు మూర్తిమంతములు (సాకారములు) అమూర్తిమంతములు (నిరాకారములు) నని రెండు విధములుగా తెలుపబడినవి ఇవియన్నియు భగవద్విభూతులే.

"సర్వే చ దేవా మనవః సమస్తాః
సప్తర్షయో యే మనుసూనవశ్చ
ఇంద్రశ్చ యోऽయం త్రిదశేశభూతో
విష్ణోరశేషాస్తు విభూతయస్తాః విష్ణుపురాణం 3-1-46)

అనగా సమస్త దేవతలు-సర్వమనువులు - సప్తర్షులు-మనుపుత్రులు-దేవాధిపతి యింద్రుడు వీరందరుగూడ భగవంతుడైన విష్ణువుయొక్క విభూతులేయని తెలియవలెను.

1. 'గుడాకా' యనగా నిద్రయనియర్థము. వానికి ప్రభువు 'గుడాకేశుడు' అనబడును. భగవంతుడు అర్జునుని 'గుడాకేశా' యని సంబోధించి నీలో

అర్జునా ! నేను అన్ని భూతముల హృదయములోనున్న అందరి ఆత్మ భూతుడను.[1] సర్వభూతములకు ఆదియైనవాడను. మధ్యుడను అంతుడను గూడ నేనే.[2]

"ఆదిత్యానామహం విష్ణుర్జ్యోతిషాం రవిరంశుమాన్ ।
మరీచిర్మరుతామస్మి నక్షత్రాణామహం శశీ ॥"

అర్జునా ! నేను అదితియొక్క పన్నెండుగురు పుత్రులలోను విష్ణువును[3]

---

జ్ఞానమును నిలిపికొని, అజ్ఞాననిద్రను గూడ నీవు జయించగలవు అను భావమును భగవంతుడు తెలిపెను.

1. సమస్త ప్రాణుల హృదయములలోనున్న 'చేతనమును' పరాప్రకృతియని 'క్షేత్రజ్ఞుడు' అని కూడననెదరు (గీత 7 5, 13 1) దానినే యిక్కడ భగవంతుడు 'సర్వభూతముల హృదయములందున్న అందరియాత్మ'యని చెప్పెను. అది భగవంతుని యంశమే యగుటచేత (గీత 15 1) వ్యస్త ముగా భగవత్స్వరూపమేయగును. (గీత 13 2) ఈ కారణముచేతనే భగవంతుడు 'ఆయాత్మ నేనే' యని చెప్పెను.

2. ఇక్కడ భూత శబ్దముచేత సమస్త చరాచర ప్రాణులని తెలియవలెను. ఈ ప్రాణులన్నియు భగవంతునినుండియే ఉత్పన్నములగును. అవి ఆయన యందే ఉండి ప్రళయ కాలమునందుగూడ ఆయనలోనే లీనములగును. భగవంతుడే అన్నిటికి మూలకారణము ఆధారముగనున్నాడు. ఈ భావ మును తెలుపుటకే భగవంతుడు 'తాను ఆయన్నింటికిన్ని ఆది-మధ్యాంత-స్వరూపుడను'అని చెప్పెను.

3. 'అదితీదేవికి' ధాతృ-మిత్ర-అర్యమా-శక్ర-వరుణ-అంశ-భగ-వివస్వత్ పూషా-సవితా-త్వష్టా-విష్ణు నామములుగల పన్నెండుగురు పుత్రులు జన్మిం చిరి. వారికి ద్వాదశాదిత్యులు (పన్నెండుగురు సూర్యులు)అనిపేరు:—

ధాతా మిత్రోఽర్యమా శక్రో వరుణస్త్వంశ ఏవ చ ।
భగో వివస్వాన్ పూషా చ సవితా దశమస్తథా ॥

జ్యోతిష్యులలో కిరణములుగల సూర్యుడను.[1] నేను నలువది తొమ్మిది వాయు దేవతలకు తేజస్సును[2]. నక్షత్రములకు అధిపతియైన చంద్రుడను.

---

ఏకాదశ స్తథా త్వష్టా ద్వాదశో విష్ణురుచ్యతే ।
జఘన్యజస్తు సర్వేషామాదిత్యానాం గుణాధికః॥
(మహాభారత ఆది 65-15,16

ఈ పన్నెండుగురిలో కడపటివాడైన విష్ణువు తక్కిన పదకొండుగురికి రాజు. వారికన్న శ్రేష్ఠుడు. ఈ కారణంచేతనే, భగవంతుడు 'విష్ణు' వను నాదిత్యుడు తన స్వరూపమేయని తెలియజేసెను.

1. సూర్యుడు చంద్రుడు-నక్షత్రములు- విద్యుత్తు-అగ్ని ఇత్యాది ప్రకాశమాన వస్తువులన్నింటిలోను సూర్యుడు ప్రధానుడు. కనుక భగవంతుడు సమస్త జ్యోతులలో సూర్యుడు తన స్వరూపమని తెలిపెను.

2. నలువది తొమ్మిది మరుత్తుల పేర్లు ఇవి:-సత్త్వజ్యోతి ఆదిత్య-సత్యజ్యోతి తిర్యక్‌జ్యోతి-సజ్యోతి-జ్యోతిష్మాన్ హరిత-ఋతజిత్ సత్యజిత్ సుషేణ సేనజిత్-సత్యమిత్ర-అభిమిత్ర-హరిమిత్ర-కృత-సత్య-ధ్రువ-ధర్తా విధర్తా విధారయ-ధ్వాంత-ధుని-ఉగ్ర-భీమ అభియు-సాక్షిప-ఈదృక్-అన్యాదృక్ యాదృక్ ప్రతికృత్-ఋక్-సమితి-సంరంభ-ఈదృక్ష-పురుష-అన్యాదృక్ష చేతన-సమితా-సమదృక్ష-ప్రతిదృక్ష-మరుతి-సరత-దేవ-దిశ-యజుః-అనుదృక్-సామ-మానుష-విశ్ (వాయు పురాణము (67,123 నుండి 130) గరుడపురాణమునందు ఇతర పురాణములందున్న కొన్ని నామ భేదములు గలవు. 'కాని' 'మరీచి' యను శబ్దము ఎందులోగూడలేదు. ఈ కారణము చేతనే మరీచి యనునది మరుత్తు అని తలచక అది సమస్త మరుద్గణములకు తేజస్సు లేక కిరణములు అని యంగీకరింపబడినది.

దక్షప్రజాపతి కన్యకయైన మరుత్వతినుండి పుట్టిన పుత్రులనుగూడ మరుద్గణము అని యనెదరు. (హరివంశము) భిన్న భిన్న మన్వంతరములలో వేర్వేరు పేర్లతో వేర్వేరు విధములలో ఈ మరుద్గణముల ఉత్పత్తిని గూర్చి వర్ణింపబడినట్లు పురాణములలో చెప్పబడినది.

వేదానాం సామవేదోఽస్మి దేవానామస్మి వాసవః ।
ఇంద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మి చేతనా ॥ 22

"అర్జునా ! నేను వేదములలో సామవేదమను[1] దేవతలలో ఇంద్రుడను. ఇంద్రియములలో మనస్సును భూతప్రాణులలో చేతనమును అనగా జీవనశక్తిగా వున్నాను.[2]

---

దితీదేవి పుత్రులైన నలువదిలొమ్మండుగురు మరుద్గణములు దితీదేవియొక్క భగవద్ధ్యానరూప వ్రతముయొక్క తేజస్సునుండి ఉత్పన్నులైరి ఆ తేజస్సు కారణముచేతనే గర్భమునందు ఈ మరుద్గణములయొక్క వినాశము కాజాలకపోయెను. అందుచేత భగవంతుడు ఈ తేజస్సు తన స్వరూపమని చెప్పెను.

అశ్వని, భరణి, కృత్తిక ఇత్యాది నక్షత్రములు ఇరువది ఏడింటికిన్ని ప్రభువు సంపూర్ణ నక్షత్రమండలమునకు రాజు కాబట్టి చంద్రుడుకూడ భగవంతునియొక్క విభూతియే అగును. ఇందు చేత భగవంతుడు చంద్రుడు తన స్వరూపమని తెలిపెను.

1. ఋక్ - యజుస్ - సామ అథర్వములు అను నాలుగు వేదములలో అతిమధుర సంగీతమయము పరమేశ్వరుని యొక్క అత్యంత రమణీయ స్తోత్రయుక్తమైనది సామవేదము కనుక వేదములలో సామవేదమునకు ప్రాధాన్యముగలదు. కాబట్టి భగవంతుడు సామవేదము తన స్వరూపమని చెప్పెను.

2. సమస్త ప్రాణులయొక్క ఏ జ్ఞానశక్తి గలదో దేనిచేత ఆ ప్రాణులకు సుఖ దుఃఖములయొక్క సమస్త పదార్థముల యొక్కయు అనుభవము కలుగునో ఏది అంతఃకరణము యొక్క వృత్తి విశేషమో దేనిగణనము భగవద్గీత పదమూడవ అధ్యాయములో ఆరవ శ్లోకమునందు క్షేత్ర వికారములలో (వికృతులు) చేయబడెనో, ఆ జ్ఞానశక్తి 'చేతన' యని అగును. అది ప్రాణులయొక్క సర్వానుభవములకు హేతుభూతమైన

రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్ ।
వసూనాం పావకశ్చాస్మి మేరుః శిఖరిణామహమ్ ॥ 23

"అర్జునా! నేను ఏకాదశ రుద్రులలో శంకరుడను.[1] యక్షరాక్షసులలో ధనాధిపతియైన కుబేరుడను. అష్టవసువులలో అగ్నిని[2] పర్వతములలో మేరు

---

ప్రధానశక్తి యగును. కాబట్టి భగవంతుడు ఈ చేతనము (ప్రాణశక్తి)తన స్వరూపమని చెప్పెను.

1. హర-బహురూప-త్ర్యంబక-అపరాజిత-వృషాకపి-శంభు-కపర్ది-రైవత మృగవ్యాధ-శర్వ-కపాలి యను పదకొండుగురు. ఏకాదశరుద్రులు అనబడుదురు :

హరశ్చ బహురూపశ్చ త్ర్యంబకశ్చాపరాజితః ।
వృషాకపిశ్చ శంభుశ్చ కపర్దీ రైవతస్తథా ॥
మృగవ్యాధశ్చ శర్వశ్చ కపాలీ చ విశాంపతే ।
ఏకాదశైతే కథితాః రుద్రాస్త్రిభువనేశ్వరాః ॥
(హరివంశము 1-3-51-52)

ఈ పదకొండుగురు రుద్రులలో 'శంభు' అనగా శంకరుడు తక్కిన పదుగురు రుద్రులకు అధీశ్వరుడు (రాజు) మంగళములను శ్రేయస్సులను ఇచ్చువాడు కల్యాణస్వరూపుడు కాబట్టి ఆ శంకరుడు నా స్వరూపమని భగవంతుడు చెప్పెను.

2. ధర-ధ్రువ-సోమ-అహః-అనిల-అనల-ప్రత్యూష-ప్రభాస నామములు గలవారు అష్టవసువులనబడెదరు.

ధరో ధ్రువశ్చ సోమశ్చ అహశ్చైవానిలోఽనలః ।
ప్రత్యూషశ్చ ప్రభాసశ్చ వసవోఽష్టౌ ప్రకీర్తితాః ॥
(మ. భా ఆది. 66-18

ఈ యష్టవసువులలో అనలుడు (అగ్ని) తక్కిన వసువులకు రాజు. ఈ

పర్వతమను.[1]

పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిమ్ ।
సేనానీనామహం స్కందః సరసామస్మి సాగరః ॥ 24

అర్జునా! పురోహితులలో ముఖ్యుడైన బృహస్పతిగా నన్ను తెలిసికొనుము[2] నేను సేనాపతులలో స్కందుడను[3] జలాశయములలో సముద్రమును.

---

యగ్ని దేవతలకు హవిస్సును గొనిపోయి యిచ్చువాడు. ఇదిగాక ఆయన భగవంతునకు ముఖమనికూడ చెప్పబడినాడు. ఈ కారణముచేతనే అగ్ని (పావకుడు) తన స్వరూపమని భగవంతుడు చెప్పెను.

1. సర్వ నక్షత్రములు సుమేరుపర్వతమునకు ప్రదక్షిణము చేయును. సుమేరు పర్వతము నక్షత్రములకు ద్వీపములకు కేంద్రము. అది బంగారమునకు రత్నములకు భండారమని తలచబడినది. దాని శిఖరము ఇతర పర్వతముల శిఖరములకన్నను ఎత్తైనది. ఈ విధముగానిది పర్వతములలో ప్రధానమైనది గాబట్టి సుమేరుపర్వతము తన స్వరూపమని భగవంతుడు చెప్పెను.

2. బృహస్పతి దేవరాజైన యింద్రునకు గురువు. దేవతలకాయన కులపురోహితుడు. విద్యాబుద్ధులలో సర్వశ్రేష్ఠుడు. ప్రపంచమునందలి సర్వ పురోహితులలో ముఖ్యుడు ఆయన ఆంగిరసులకు రాజు. కాబట్టి బృహస్పతి తన స్వరూపమని భగవంతుడు చెప్పెను.

3. స్కందుని రెండవపేరు కార్తికేయుడు. ఇతనికి ఆరుముఖములు పన్నెండు చేతులు నున్నవి. ఇతడు పరమశివుని పుత్రుడు. దేవతలసేనకితడు అధిపతి. ఇతడు అగ్ని తేజస్సుచేత, దక్షప్రజాపతి కూతురైన స్వాహాదేవి నుండి పుట్టినాడు. (మహాభారతము. అరణ్యపర్వము 22.3) ఇతనికి సంబంధించిన కథలు మహాభారతంలో పురాణములలోను చిత్రవిచిత్రములుగా కలవు. ప్రపంచమునందలి సమస్త సేనాపతులలో స్కందుడు ప్రధానుడు కాబట్టి యితడు తన స్వరూపమని భగవంతుడు చెప్పెను.

మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేక మక్షరమ్ ।
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః ॥ 25

అర్జునా! నేను మహర్షులలో భృగుమహర్షిని[1] శబ్దములలో ఏకాక్షరమును

---

1. మహర్షులు అనేకులున్నారు. వారి లక్షణము వారిలో ముఖ్యులైన పదుగురి పేర్లు ఇవి :

ఈశ్వరాః స్వయముద్భూతా మానసా బ్రహ్మణః సుతాః
యస్మాన్న హన్యతే మానైః మహాన్ పరిగతః పురః
యస్మాదృషంతి యే ధీరా మహాంతం సర్వతో గుణైః
తస్మాన్మహర్షయః ప్రోక్తా బుద్ధేః పరమదర్శినః
భృగుర్మరీచిరత్రిశ్చ అంగిరాః పులహః క్రతుః
మనుర్దక్షో వసిష్ఠశ్చ పులస్త్యశ్చేతి తే దశ
బ్రహ్మణో మానసా హ్యేతే ఉద్భూతాః స్వయమీశ్వరాః
ప్రవర్తత ఋషేర్యస్మాన్మహాంస్తస్మాన్మహర్షయః ॥

వాయుపురాణం 59-82.83, 89, 90)

ఈ మహర్షులు బ్రహ్మయొక్క మానసపుత్రులు. వీరు ఐశ్వర్యవంతులు. (సర్వసిద్ధులు గలవారు) స్వయముగా జన్మించినవారు. ఎవరి పరిమాణము (కొలత) యింతయని చెప్పుటకు వీలుకాదో వారు అపరిమేయులు ఎవరు అంతటా వ్యాపించినవారుగా నున్నను ఎదుట (ప్రత్యక్షము)గా నుందురో వారు మహాగొప్పవారు. ఎవరు (భగవంతుని పొందినవారు) విజ్ఞులో గుణములద్వారా మహాపురుషుని (పరమేశ్వరుని) అన్నివైపుల అవలంబించి యుండెదరో వారు మహర్షులు అని, పై కారణములచేతనే అనబడెదరు. 'మహాంతం ఋషంతీతి మహర్షయః' అను వ్యుత్పత్తిచేత అనగా మహాపురుషుని (పరమేశ్వరుని) పొందువారు మహర్షులనబడిరి. భృగు-మరీచి అత్రి-అంగిరా-పులహ-క్రతు-మను-దక్ష-వసిష్ఠ- పులస్త్య - నామములు గల యీ పదుగురు మహర్షులు బ్రహ్మదేవుని మనస్సునుండి స్వయ

అనగా ఓంకారమును[1]. సర్వవిధ యజ్ఞములలో నేను జపయజ్ఞమును[2] చలనము

---

ముగా పుట్టినవారు. అందరు ఐశ్వర్యవంతులు పరమసిద్ధి సంపన్నులు) ఎందుకనగా బ్రహ్మదేవుని (ఋషి) నుండి యీ ఋషుల రూపములో స్వయముగా మహాన్ (పరమేశ్వరుడు) అయినవాడే ప్రకటితుడయ్యెను. గాబట్టియే వీరు 'మహర్షు'లనబడిరి.

ఈ మహర్షులలో భృగుమహర్షి ముఖ్యుడు. ఇతడు భగవద్భక్తుడు, జ్ఞాని, మహాతేజస్వి కనుకనే భృగుమహర్షి తన స్వరూపమని భగవంతుడు చెప్పెను.

ఏవో యొక అర్థజ్ఞానము కలిగించు పదమును గీః వాక్కు అని యనెదరు. ఓంకారము (ప్రణవము) నకు ఏకాక్షరము అని పేరు (గీత 8-13) గలదు. ఎన్నైతే అర్థజ్ఞానము కలిగించు శబ్దములున్నవో ఆ యన్నింటిలోను ప్రణవము (ఓంకారము) ప్రధానమైనది. ఎందుకనగా 'ప్రణవము' భగవంతుని నామము (గీత 17-23). ప్రణవమును జపించుటచేత భగవత్ప్రాప్తి కలుగును. ఇక్కడ పేరు (ప్రణవము) పేరుగలవాడు (భగవంతుడు) ఈ రెంటికి అభేదము అంగీకరింపబడినది. కనుక ప్రణవము తన స్వరూపమని భగవంతుడు చెప్పినాడు.

1. జపయజ్ఞమునందు హింస ఉండనేయుండదు. జపయజ్ఞము భగవంతుని ప్రత్యక్షము చేయించునది. మనుస్మృతిలోగూడ జపయజ్ఞము మిక్కిలి ప్రశంసించబడింది.

విధియజ్ఞాజ్జపయజ్ఞో విశిష్టో దశభిర్గుణైః ।
ఉపాంశుః స్యాచ్ఛతగుణః సాహస్రో మానసః స్మృతః ॥
2-85)

అనగా విధియజ్ఞముకన్న జపయజ్ఞము పదిరెట్లు. ఉపాంశు జపము నూరురెట్లు మానస జపము వేయిరెట్లు శ్రేష్ఠమని చెప్పబడినది. అని తాత్పర్యము.

లేక స్థిరముగా నుండువానిలో హిమాలయ పర్వతమును[1].

> అశ్వత్థః సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః ।
> గంధర్వాణాం చిత్రరథః సిద్ధానాం కపిలో మునిః ॥ 26

అర్జునా! నేను వృక్షములన్నింటిలో రావిచెట్టును[2] దేవర్షులలో నారదుడను

---

ఈ కారణముచేత సమస్త యజ్ఞములలో జపయజ్ఞము ప్రధానమైనది. ఈ భావము తెలుపుటకు భగవంతుడు జపయజ్ఞము తన స్వరూపమని చెప్పెను

1. స్థిరముగా చలించక నిలిచియున్నవి స్థావరములనబడును. పర్వతములన్నియు చలించనివి కనుక అవి స్థావరములు వానిలో హిమాలయ పర్వతము సర్వోత్తమమైనది. అది పరమ పవిత్ర తపోభూమి. అది ముక్తికి సహాయకము. భగవంతులైన నర-నారాయణులు ఆ హిమాలయమునందే తపస్సుచేసిరి. ఇంతియేకాక హిమాలయము సమస్త పర్వతములకు రాజుగా గూడనున్నది. ఈ కారణముచేతనే భగవంతుడు హిమాలయము తన స్వరూపమని చెప్పెను.

2. అశ్వత్థవృక్షము (రావిచెట్టు) అన్ని వనస్పతులలోను శ్రేష్ఠమైనది. అది వనస్పతులకు రాజు- పూజనీయమునని తలచబడినది. పురాణములలో అశ్వత్థ మహాత్మ్యము గొప్పగా వర్ణింపబడినది. వాయుపురాణములో నిట్లు చెప్పబడినది :-

> స ఏవ విష్ణుర్ద్రుమ ఏష మూర్తో
> మహాత్మభిః సేవిత పుణ్యమూలః ।
> యస్యాఽఽశ్రయః పాప సహస్ర హంతా
> భవేన్నృణాం కామదుఘో గుణాఽఢ్యః ॥

నాగర 247-44

అనగా ఈ వృక్షము మూర్తిమంతమైన శ్రీ మహావిష్ణు స్వరూపమే. మహాత్ములైన పురుషులు పుణ్యమయమైన యీ వృక్షపు మూలమును సేవించెదరు. సకల గుణ సంపన్నము. సమస్త కామనా ప్రదమునైన

[3]గంధర్వులలో చిత్రరథుడను[1] సిద్ధులలో కపిల మునీశ్వరుడను[2].

---

అశ్వత్థ వృక్షమూలము తన నాశ్రయించిన మనుష్యులయొక్క వేలకొలది పాపములను నశింపజేయును. ఈ కారణంచేత భగవంతుడే యశ్వత్థ వృక్షము తన స్వరూపమని చెప్పెను.

దేవర్షి లక్షణము ఈ యధ్యాయములోనే పన్నెండవ పదమూడవ శ్లోకముల టిప్పణి (అధోజ్ఞాపిక)లో చెప్పబడినది. అది యిక్కడగూడ చదువు కొనవలెను. అటువంటి దేవర్షులలో నారదుడు సర్వశ్రేష్ఠుడు. ఇందు చేతనే నారదుడు తన స్వరూపమని భగవంతుడు చెప్పెను.

1. గంధర్వలోక దేవయోని విశేషమునకు చెందినవారు. వీరు దేవలోకము నందు గాన-వాద్య- నాట్య-అభినయములు చేసెదరు. స్వర్గవాసులలో గంధర్వులు అతిసుందరులు, రూపవంతులు. గుహ్యకలోకమునకు పైభాగము నందు విద్యాధరలోకమునకు క్రింది భాగమునందు గంధర్వ లోకము కలదు. దేవతలు పితరులవలె గంధర్వులుగూడ రెండు తెగలవారు మర్త్యులు-దివ్యులు కలరు. ఇక్కడ మరణించి పుణ్యబలముచేత గంధర్వ లోకమునకు పోయిన మనుష్యులు 'మర్త్యులు' అని కల్పారంభమునుండియె గంధర్వులుగా నున్నవారు. 'దివ్యులు' అని ఆ యిరుతెగలవారి పేర్లు గలవు. ఈ దివ్య గంధర్వులలోగూడ రెండు తరగతులు గలవు. అవి మానేయులు ప్రాధేయులు అని యనబడును. కశ్యపమహాముని కి ముని ప్రాధా యని యిద్దరు భార్యలు ఉండిరి. వారి సంతతి యీ యిరు తెగల వారు. యీ యిరువురినుండియే చాలవరకు అప్సరసలు గంధర్వులు జన్మించిరి. చిత్రరథుడను గంధర్వుడు దేవలోక సంగీత విద్యా పారంగతుడు అతి నిపుణుడు. ఈ కారణముచేతనే యతడు తన స్వరూపమని భగవంతుడు చెప్పెను.

2. సర్వవిధములైన స్థూల-సూక్ష్మ ప్రపంచ సిద్ధులను పొందినవారు. ధర్మ జ్ఞానైశ్వర్య వైరాగ్యాదులైన ఉత్తమ గుణములు పరిపూర్ణముగా గలవారు 'సిద్ధపురుషులు' అనబడెదరు. ఇటువంటి సిద్ధులు వేలకొలదిగ నున్నారు.

ఉచ్చైః శ్రవసమశ్వానాం విద్ధి మామమృతోద్భవమ్ ।
ఐరావతం గజేంద్రాణాం నరాణాం చ నరాధిపమ్ ॥ 27

అర్జునా! అశ్వములలో నేను అమృతముతోపాటు పుట్టిన ఉచ్చైః శ్రవము అను పేరుగల అశ్వమను. ఉత్తమగజములలో 'ఐరావత' నామముగల యేనుగను[1] మనుష్యులలో రాజునుగా నన్ను తెలిసికొనుము.[2]

"ఆయుధానామహం వజ్రం ధేనూనామస్మి కామధుక్ ।
ప్రజనశ్చాస్మి కందర్పః సర్పాణామస్మి వాసుకిః॥" 28

---

వారిలో భగవంతుడైన 'కపిల మహర్షి శ్రేష్ఠుడు' ప్రధానుడు. కపిల భగ వానుడు సాక్షాత్తు భగవదవతారము. ఈ కారణముచేతనే ఆ మహర్షి తన స్వరూపమని భగవంతుడు చెప్పినాడు.

1. అనేక గజములలో శ్రేష్ఠమైనది 'గజేంద్రము' అనబడును. ఇటువంటి గజేంద్రములలోగూడ 'ఐరావతము' అను గజం శ్రేష్ఠమైనది. ఇది యింద్రుని వాహనము. ఇది సర్వగజశ్రేష్ఠమేకాక గజజాతి కంతటికిన్ని 'రాజు' అని అంగీకరించబడినది. ఈ యైరావత గజోత్పత్తిగూడ ఉచ్చైః శ్రవస్సు అను గుఱ్ఱమునకువలె సముద్ర మంథనకాలమునందు సముద్రము నుండియే కలిగినది. కనుక ఈ గజము తన స్వరూపమని భగవంతుడు చెప్పెను.

2. శాస్త్రోక్త సర్వలక్షణ సంపన్నుడు - ధర్మపరాయణుడు నైనరాజు తన రాజ్య ప్రజలను సమస్త పాపములనుండి తొలగించి ధర్మమునందు ప్రవృత్తిగల వారినిగా చేయును. అందరిని రక్షించును. ఈ కారణముచేత రాజు ఇతర మనుష్యులకంటే శ్రేష్ఠుడని తలచబడెను. ఇటువంటి రాజులలో భగవంతుని శక్తి సాధారణ మనుష్యులలో కంటే అధికముగా నుండును.

ఈ కారణంచేతనే రాజు తన స్వరూపమని భగవంతుడు చెప్పెను.

అర్జునా! నేను శస్త్రములలో వజ్రాయుధమను[1] గోవులలో కామధేనువను[2] శాస్త్రోక్త రీతిచేత సంతానోత్పత్తికి హేతువైన కామదేవుడను(మన్మథుడు)[3] సర్పములలో సర్పరాజైన వాసుకిని[4].

"అనంతశ్చాస్మి నాగానాం వరుణో యాదసామహమ్ ।
పితౄణామర్యమా చాస్మి యమః సంయమతామహమ్ ॥" 29

అర్జునా! నేను నాగులలో ఆదిశేషుడను[5] జలచరజంతువులకు అధిపతి

---

1. ఆయుధములన్నింటిలో వజ్రాయుధము శ్రేష్ఠము. ఎందుకనగా ఈ ఆయుధము నందు దధీచి మహాముని తపస్సు భగవంతుని తేజస్సు విరాజిల్లుచున్నవి. అత్యంత శ్రేష్ఠమైన వజ్రాయుధము అమోఘమైనది (వ్యర్థము కానిది) (శ్రీమద్భాగవతము 6-11-19, 20) ఇందుచేత ఈ శస్త్రము నా స్వరూపమే యని భగవంతుడనెను.

2. కామధేనువు గోవులన్నిటిలో శ్రేష్ఠమైన దేవలోక గోవు. ఇది దేవతలకు మనుష్యులకు అన్ని కోరికలు తీర్చునది. దీని యుత్పత్తి గూడ సముద్ర మథనము చేత కలిగినది. కనుక నిది భగవత్స్వరూపమని చెప్పబడెను.

3. సర్వదా ఇంద్రియములందు రమించు మనుష్యులు విషయ సుఖముకొరకు ఉపభోగించు కామము నికృష్టమైనది. అట్టి కామము ధర్మానుకూలమైనది కాదు. కాని శాస్త్ర విధిప్రకారము సంతానోత్పత్తి కొరకు, ఇంద్రియ విజ్ఞానము గల పురుషులు ఉపభోగించుకామమే ధర్మానుకూలమైనది కాబట్టి అది శ్రేష్ఠమైనది అందుచేత ధర్మానుసారమైన కామము భగవంతుని విభూతులలో పరిగణింపబడినది.

4. వాసుకి సమస్త సర్పములకు రాజు. అతడు భగవద్భక్తుడగుట చేత సర్పశ్రేష్ఠుడని తలచబడెను. ఇందుచేత భగవంతుడు వాసుకి తన స్వరూపమని చెప్పెను

5. ఆదిశేషుడు నాగులకు రాజు. అతనికి వేయి పడగలున్నవి. అతడు భగవంతునకు శయ్యగానుండి సర్వదా భగవత్సేవతో నిమగ్నుడై, భగవంతునకు సుఖము కలిగించుచు, భగవంతునకు అనన్య భక్తుడుగా నుండి

యైన వరుణదేవుడను[1] పితరులలో 'అర్యమా' యనబడు పితరుడను[2] శాసనకర్తలలో నేను యమరాజు[3] నని తెలిసికొనుము.

"ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః[4] కలయతామహమ్।
మృగాణాం చ మృగేంద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్॥"30

---

అనేక పర్యాయములు భగవంతునితో పాటు అవతరించి భగవల్లీలలలో సమ్మిళితులైయున్నారు. ఆదిశేషుని యుత్పత్తి గూడ భగవంతుని నుండియే అయినదని తలచబడెను. ఈ కారణముచేత భగవంతుడు ఆదిశేషుడు తస్వరూపమని చెప్పెను.

1. వరుణుడు సమస్త జలచర జంతువులకు జలదేవతలకు అధిపతి. అతడు. లోకపాలకుడు (పశ్చిమదిక్పాలకుడు) అతడు దేవత. భగవంతునకు భక్తుడగుటచేత వరుణుడు అందరిలో శ్రేష్ఠుడు అని తలచబడినాడు. ఈ కారణము చేత వరుణదేవుడు తన స్వరూపమని భగవంతుడు చెప్పెను.

2. కావ్యవాహ-అనల-సోమ-యమ-అర్యమన్-అగ్నిష్వాత్త-బర్హిష్మద్ నామములు గల ఏడుగురు దివ్య పితృగణము (శివపురాణం ధర్మ. 63-2) వీరిలో 'అర్యమన్' అను పితరుడు సమస్త పితరులలో ప్రధానుడైనందుచేత నితడు శ్రేష్ఠుడని పిలుచబడెను. ఇందుచేత నితడు తన స్వరూపమని భగవంతుడనెను.

3. మనుష్యలోక దేవలోకములలో నియమనము చేయు నధికారులందరిలో యముడు ప్రధానుడు. ఇతడు విధించుదండనములన్నియు న్యాయ-ధర్మయుక్తములు, హిత పూర్ణములు పాపనాశకములునైయుండును. యముడు భగవంతునకు జ్ఞానియైన భక్తుడు లోకపాలకుడు దక్షిణదిక్పాలకుడు)గా గూడ నున్నాడు. ఈ కారణముచేతనే, యముడు తన స్వరూపమని భగవంతుడు చెప్పెను.

4. ఇక్కడ 'కాల' శబ్దమునకు క్షణము ఘడియ దినము పక్షము మాసము సంవత్సరము ఇత్యాది నామములతో పేర్కొనబడు సమయము అని

"అర్జునా నేను దైత్యులలో ప్రహ్లాదుడను[1]. గణనము చేయువారికి కాలముగా నున్నాను. మృగములలో మృగరాజైన సింహమును[2]. పక్షులలో గరుడుడను[3].

"పవనః పవతామస్మి రామః శస్త్రభృతామహమ్।
ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ॥" 31

"అర్జునా! పవిత్రము చేయువారిలో నేను వాయుదేవుడను. శస్త్రధారులలో శ్రీరామచంద్రుడను[4] మత్స్యములలో మొసలిని[5] నదులలో పవిత్రభాగీరథి

---

యర్థము. ఇది గణిత విద్య నెరిగిన వారి గణనమునకు ఆధారము ఇందుచేత కాలము తన స్వరూపమని భగవంతుడనెను.

1. దితీదేవి వంశజాతులకు దైత్యులని పేరు. వారందరిలో ప్రహ్లాదుడు ఉత్తముడని తలచబడెను. ఎందుకనగా అతడు సర్వ సద్గుణ సంపన్నుడు పరమధర్మాత్ముడు భగవంతుని మిక్కిలి శ్రద్ధా నిష్కామ అనన్యప్రేమలతో సేవించు పరమభక్తుడు. అతడు దైత్యులకు రాజు కనుక అతడు తన స్వరూపమని భగవంతుడనెను.

2. సింహము సర్వమృగము (పశువు)లకు రాజు. అన్నిటికన్న అధిక బలముగలది. తేజస్వి శౌర్యవీర్య సాహసములుగలది. ఈ కారణంచేతనే దానిని భగవంతుడు తన విభూతులలో చేర్చినాడు.

3. వినత కొడుకు గరుడుడు పక్షులకు రాజు. పక్షులన్నిటిలోని కతడు పెద్దయగుటచేత నతడు శ్రేష్ఠుడనబడెను. అంతయేగాక గరుడుడు భగవంతునకు వాహనము పరమభక్తుడు-మిక్కిలి పరాక్రమవంతుడగుటచేత భగవత్స్వరూపుడు,

4. 'రామ' శబ్దమున కిక్కడ దశరథపుత్రరాముడని యర్థము. శ్రీరాముడు నా స్వరూపమేయని తెలిపి భగవంతుడు వేర్వేరుయుగములందు వేర్వేరు లీలలు చేయుటకు నేనే వేర్వేరు రూపములను ధరించెదను. శ్రీరామునకు నాకు ఏమాత్రము భేదములేదు. స్వయముగా నేనుకూడా శ్రీరాముని రూపములో అవతరించితిని అను భావమును తెలిపెను.

5. సర్వవిధ మత్స్యములలో మకరము మిక్కిలి పెద్దది. బలము కలది. ఈ

గంగా నదిని[1]

"సర్గాణామాదిరంతశ్చ మధ్యం చైవాహమర్జున।
అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతామహమ్ ॥" 32

"అర్జునా! ప్రపంచ సృష్టియొక్క ఆది అంతము మధ్యము గూడ నేనే, నేను విద్యలన్నింటిలోను ఆధ్యాత్మవిద్యను.[2] బ్రహ్మవిద్యలో పరస్పరము వాద

---

విశేషము చేతనే చేపలలో మకరము తన స్వరూపమని భగవంతుడు చెప్పెను.

1. గంగానది సర్వనదులలో పరమశ్రేష్ఠము. ఇది భగవంతుని చరణముల నుండి పుట్టినది. ఇది పరమపవిత్రము. పురాణేతిహాసములలో దీని మహిమ చాల గొప్పగా వర్ణింపబడినది. శ్రీమద్భాగవతములో నిట్లు గంగ వర్ణింప బడినది

"ధాతుః కమండలుజలం తదురుక్రమస్య
పాదావనేజన పవిత్రతయా నరేంద్ర ।
స్వర్ధున్యభూన్నభసి సా పతతీ నిమార్ష్టి
లోకత్రయం భగవతో విశదేవ కీర్తిః (8—21

అనగా "రాజా! బ్రహ్మదేవుని కమండల జలము భగవంతుని పాదములను కడుగుటచేత పవిత్రతమమైన స్వర్గంగ యైనది. ఆ గంగ ఆకాశమునుండి భూమిపైనపడి మూడులోకములను భగవంతుని నిర్మలకీర్తివలె పవిత్రము చేయుచున్నది. అని తాత్పర్యము.

ఇంతయే కాక ఒకసారి విష్ణుభగవానుడు స్వయముగానే ద్రవరూపము ధరించి ప్రవహించుచు బ్రహ్మదేవుని కమండలములోనికి పోయెను. ఆ జలము గంగయయ్యెను. ఇట్లు సాక్షాత్తు బ్రహ్మద్రవమగుటచేత గూడ గంగ అత్యంత మాహాత్మ్యము గలదియైనది. ఇందుచేతనే గంగ తన స్వరూపమని భగవంతుడు చెప్పెను.

2. దేనికి ఆత్మతత్త్వములో సంబంధము గలదో పేది ఆత్మతత్త్వమును ప్రకా

వివాదములు చేయువారిలో తత్వనిర్ణయమునకై చేయబడువాదముగా[1] నున్నాను.

"అక్షరాణామకారోఽస్మి ద్వంద్వః సామాసికస్య చ।
అహమేవాక్షయః కాలో ధాతాఽహం విశ్వతోముఖః ॥" 33

"అర్జునా! నేను అక్షరములలో అకారముగా నున్నాను[2] సమాసములలో

---

శింప జేయుచున్నదో, దేని ప్రభావముచేత అనాయాసముగానే బ్రహ్మ సాక్షాత్కారము కలుగునో అట్టి విద్యను 'అధ్యాత్మ విద్య' లేక బ్రహ్మ విద్య అని యనెదరు. జగత్తులో జ్ఞాతములు-అజ్ఞాతములు నైన విద్య లన్నియు ఈ బ్రహ్మవిద్యకన్న నికృష్టములు. ఎందుకనగా ఆ విద్యల వలన అజ్ఞానచ్ఛేదము కలుగదు. దీనికి వ్యతిరేకముగా ఆ యజ్ఞాన సంబంధము ఇంకను దృఢతరమగును. కాని బ్రహ్మ విద్యచేత, అజ్ఞాన బంధనము ఎల్లప్పటికిన్ని విడిపోయి పరమాత్మ స్వరూప సాక్షాత్కారము యథార్థముగా కలుగును. ఇందుచేతనే యిది అన్ని విద్యలకన్న శ్రేష్ఠ మైనది. కనుక భగవంతుడు తన స్వరూపము ఇది యని చెప్పెను.

1. శాస్త్రార్థ వాదమునకు మూడు స్వరూపములు జల్పము, వితండా, వాదము అని యున్నవి. ఉచితానుచిత విచారమువిడిచి తన పక్షమును సమర్థించుచు ఇతరుల పక్షమును అనుచితముగా ఖండించుటకు చేయబడు వివాదము 'జల్ప'మనబడును. కేవలము ఎదుటిపక్షమును ఖండించుటకొరకుమాత్రమే చేయబడు వివాదము 'వితండ' మనబడును తత్త్వ నిర్ణయము చేయు నుద్దేశముతో మాత్రమే పరిశుద్ధమైన రీతిలో చేయబడునది 'వాదము'. జల్ప-వితండములచేత ద్వేష- క్రోధ - హింసాఽభిమానాది దోషములు కలుగును. వాదము చేతనైతేనో సత్యము నిర్ణయించుటయందు శ్రేయ స్సాధనము నందున్ను సహాయము కలుగును. కనుక జల్ప-వితండములు విడువదగినవి. ఆవశ్యకత యున్నప్పుడు వాదము గ్రహింపదగినది. ఈ విశేషముచేత భగవంతుడు వాదమును తన విభూతులలో చేర్చి చూపించెను.

2. అచ్చులు-హల్లులు మొదలైన అక్షరములన్నింటిలో 'అ'కారము మొదటిది

ద్వంద్వ సమాసమును[1] నేను అక్షయమైన కాలము[2] అనగా కాలమునకు గూడ మహాకాలముగానున్నాను. అన్నివైపుల ముఖములు గలిగియుండు విరాట్స్వరూపుడను. అందరిని ధరించి పోషించువాడను గూడ (ధాత) నేనేయని తెలిసికొనుము.

"మృత్యుః సర్వహరశ్చాహముద్భవశ్చ భవిష్యతామ్ ।
కీర్తిః శ్రీర్వాక్ చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా॥" 34

"అర్జునా! నేను సర్వమును నశింపజేయు మృత్యువును. జన్మించువారికి

---

అదియే అన్ని యక్షరములందు వ్యాపించియున్నది. ఈ కారణముచేతనే భగవంతుడు అకారము తన స్వరూపమని చెప్పెను.

1. సంస్కృత వ్యాకరణము ప్రకారము సమాసములు 1. అవ్యయీభావము 2. తత్పురుష 3. బహువ్రీహి 4. ద్వంద్వము అని నాలుగు విధములు గలవు. కర్మధారయ-ద్విగువులు రెండు తత్పురుషలో నంతర్గతములు. అవ్యయీభావములో పూర్వపదము ముఖ్యము. తత్పురుషములో ఉత్తరపదము ప్రధానము. బహువ్రీహి సమాసములో అన్యపదము ముఖ్యము. మొదటి రెంటిలో నొకపదము అముఖ్యము. మూడవ దానిలోను అన్ని పదములు అముఖ్యములే ఒక్క ద్వంద్వ సమాసములో మాత్రము అన్నిపదములు ముఖ్యములేయగును. గాబట్టి యది సమాసములో నుత్తమమని చెప్పబడినది. కాబట్టి భగవంతుడు ద్వంద్వమును తన విభూతులతో చేర్చి చెప్పెను.

2. కాలమునకు మూడు భేదములు కలవు.

   1. 'సమయము'ను తెలుపునట్టి కాలము.

   2. 'ప్రకృతి' రూపకాలము. మహాప్రళయము తరువాత ఎంత సమయము వరకు ప్రకృతియొక్క సామ్యావస్థయుండునో అదియే ప్రకృతిరూపకాలమనబడును.

   3. "నిత్యము-శాశ్వతము-విజ్ఞానానందఘనమునై నపరమాత్మరూపకాలము" సమయమును తెలుపునట్టి స్థూలమైన కాలముకన్న బుద్ధికి గోచరము కానట్టి ప్రకృతి రూపకాలము సూక్ష్మము-పరమునైయుండును. ఈ ప్రకృతి రూపకాలము కన్న గూడ పరమాత్మరూపకాలము అత్యంత

ఉత్పత్తి హేతువును[1] స్త్రీలలో కీర్తి శ్రీ వాక్ స్మృతి మేధా ధృతి క్షమ గూడ నేనే[2]

"బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసామహమ్ ।
మాసానాం మార్గశీర్షోఽహమృతూనాం కుసుమాకరః ॥" 35

"అర్జునా! గానము చేయుటకు యోగ్యములైన శ్రుతులలో నేను 'బృహ

---

సూక్ష్మము. అది 'పరాతిపర' మనబడును. అది పరమశ్రేష్ఠము. వాస్తవముగా విచారించినయెడల పూర్తిగా దేశకాలరహితుడు. కాని యెక్కడైతే ప్రకృతి వర్ణనము ప్రకృతి కార్యరూపమైన ప్రపంచము యొక్క వర్ణనము చేయబడునో అక్కడ పరమాత్మ అందరికి సత్తను-స్ఫూర్తిని ఇచ్చువాడగుటచేత ఆయందరికి అధిష్ఠానరూపుడై విజ్ఞానానందఘనుడైన పరమాత్ముడే వాస్తవముగా 'కాల' స్వరూపుడు. ఆయనయే 'అక్షయ' (నాశరహిత) కాలము.

1. ఏ విధముగా భగవంతుడు మృత్యురూపుడై అందరినాశముచేయునో అనగా అందరిని శరీరమునుండి వేరుపరచునో ఆ విధముగానే భగవంతుడే ఆ యందరికి మరల ఇతర శరీరములతో సంబంధము కలిగించి, వారిని పుట్టించును. ఈ భావమును తెలుపుటకే భగవంతుడు 'తాను' ఉత్పన్నులగువారికి ఉత్పత్తికారణమని చెప్పెను.

2. స్వాయంభువమనువు కూతురు 'ప్రసూత' యనునామె దక్షప్రజాపతికిచ్చి పెండ్లిచేయబడెను. ఆ దంపతులకు ఇరువది నలుగురు కన్యలు పుట్టిరి. వారిలో కీర్తి-మేధా-ధృతి-స్మృతి-క్షమా నామములుగల కన్యకలైదుగురిలో కీర్తి మేధా-ధృతి యనబడు ముగ్గురి వివాహము ధర్మునితో చేయబడెను. స్మృతికి అంగీరసునితో క్షమకు పులహమహర్షితోను వివాహము జరిగెను. భృగుమహర్షి కూతురుపేరు 'శ్రీ' యనునామె. దక్షప్రజాపతి కూతురైన 'ఖ్యాతి' గర్భమునుండి పుట్టినది. ఈ శ్రీ యనబడు ఖ్యాతి కూతురి వివాహము భగవంతుడైన విష్ణువుతో జరిగెను. 'వాక్' అనబడునది బ్రహ్మదేవుని కూతురు. ఈ ఏడుగురు కన్యకల నామములు ఏ గుణ

ములను నిర్దేశించుచున్నవో ఆ గుణములు ఏడింటికిన్ని ఆ ఏడుగురు స్త్రీలు అధిష్ఠాతృదేవతలు. ఆ ఏడుగురు ప్రపంచములోని స్త్రీలందరికన్నను శ్రేష్ఠురాండ్రు అని తలచబడినారు. ఈ కారణముచేతనే భగవంతుడు ఈ ఏడున్ను తన విభూతులు అని తెలిపెను.

1. సామవేదమునందు 'బృహత్సామ' యనబడునది యొక గీత విశేషము. దీనిచేత పరమేశ్వరుడు ఇంద్రరూపుడుగాబడెను. 'అతిరాత్రి' యాగమునందు ఈ బృహత్సామమే 'పృష్ఠస్తోత్రము' అగును. (పృష్ఠస్తోత్రమనగా సామవేదములో నొక విశేషపద్ధతిలో నేర్పబడిన ఒక స్తుతి మాత్రము) సామవేదములోని 'రథంతర' ఇత్యాది సామములలో బృహత్సామ (బృహత్సామ అను పేరుగల సామము) ప్రధానమగుటచేత బృహత్సామ అన్ని సామములలో శ్రేష్ఠమైనది. ఈ కారణముచేతనే యిక్కడ భగవంతుడు బృహత్సామము తన స్వరూపమని చెప్పెను.

2. వేదములలోని ఛందోబద్ధముక్కులన్నింటిలోను 'గాయత్రి' యనబడు ఛందమే ప్రధానమైనది. శ్రుతి-స్మృతి-ఇతిహాస పురాణములు మొదలైన శాస్త్రములలో అనేక స్థలములందు గాయత్రీ మహిమ చెప్పబడియున్నది.

"అభీష్టం కామమాప్నోతి ప్రాప్నుయాత్ కామమీప్సితమ్।
గాయత్రీ వేదజననీ గాయత్రీ పాపనాశనీ॥

గాయత్ర్యాః పరమం నాస్తి దివి చేహ చ పావనమ్।
హస్తత్రాణప్రదా దేవీ పతతాం నరకార్ణవే.-(శంఖస్మృతి)
(12-24-25

అనగా గాయత్రి ఉపాసన చేయు ద్విజుడు తాను కోరిన లోకమును పొందగలడు. గాయత్రి సర్వవేదములకు జనని. సర్వపాపములను నశింపజేయునది. గాయత్రి కన్న మించి పవిత్రము చేయగల మరియొక వస్తువేదియు స్వర్గమునందుగాని, భూలోకమునందుగాని లేదు. గాయత్రీదేవి,

ములలో మార్గశీర్ష మాసమును[1] ఋతువులలో వసంత ఋతువును.[2]

---

నరక సముద్రములో పడిపోవుచున్నవారికి, తన హస్తమును ఆశ్రయముగా నిచ్చి పైకి ఎత్తి రక్షించును అని భావము

"నాస్తి గంగాసమం తీర్థం న దేవః కేశవాత్ పరః
గాయత్ర్యాస్తు పరం జప్యం న భూతం న భవిష్యతి॥"

(బృహద్యోగ యాజ్ఞవల్క్యం 10-10)

అనగా గంగానదితో సమానమైన తీర్థము, శ్రీ విష్ణు భగవానుని కన్న మించిన దేవత, గాయత్రి కంటె మించి జపించదగిన మంత్రము, ఇంతవరకు పుట్టలేదు- ఇకపైన పుట్టబోవదు అని భావము.

గాయత్రికి ఈ శ్రేష్ఠత్వమున్నది కాబట్టియే భగవంతుడు గాయత్రి నా స్వరూపమని చెప్పెను.

1. మహాభారతకాలములో నెలలసంఖ్య మార్గశీర్ష మాసమునుండియే మొదలగుచుండెను. (మ.భా అను-106, 109) కనుక ఇది అన్ని మాసములలో మొదటిది. ఈ నెలలో చేయబడు వ్రతోపాసనాదుల వలన లభించు ఫలము చాల గొప్పదని శాస్త్రములలో చెప్పబడినది. క్రొత్తగా పండిన అన్నము (ఆహారధాన్యము) యొక్క ఇష్టి (యజ్ఞము) గూడ ఈ మార్గశీర్ష మాసమునందే విధింపబడినది. వాల్మీకి రామాయణము నందీమాసము సంవత్సరమువంతటికి భూషణమని చెప్పబడినది. ఈ విధముగా ఇతర మాసములకన్న దీనిలో నెన్నియో విశేషములు గలవు. ఇందుచేత భగవంతుడీ మార్గశీర్షరూపము తన స్వరూపముగా పేర్కొనెను.

2. అన్ని ఋతువులలో వసంతము శ్రేష్ఠము. ఇది ఋతువులన్నిటికివి రాజా. ఈ ఋతువునందు జలములు లేకున్నప్పటికిని వనస్పతులు (వృక్ష జాతులు) అన్నియు పచ్చగా చిగురించి కొత్త ఆకులతో పుష్పములతోను నిండియుండును. ఈ వసంతఋతువులో అధికముగా ఉష్ణముగాని చలిగాని యుండదు. ఈ ఋతువునందు సమస్త ప్రాణులకు

"ద్యూతం ఛలయతామస్మి తేజస్తేజస్వినామహమ్।
జయో ఽస్మి వ్యవసాయో ఽస్మి సత్త్వం సత్త్వవతామహమ్॥" 36

"అర్జునా! కపటము చేయువారిలో జూదము నేను.[1] ప్రభావంతులైన పురుషులలో ప్రభావమును. జయించువారిలో విజయమును. నిశ్చయం చేయు వారిలో నిశ్చయమును. సాత్త్విక పురుషులయొక్క సాత్త్విక భావమును[1].

---

ఆనందము కలుగును. ఈ కారణముచేతనే భగవంతుడీ ఋతువు తన స్వరూపమని చెప్పెను.

1. ప్రపంచమునందు ఉత్తమ- మధ్యమ- నీచములైన జీవములు పదార్థము లన్నింటి యందు భగవంతుడు వ్యాపించి యున్నాడు. భగవంతుని సత్త చేత స్ఫూర్తి చేతనే సమస్త చరాచరములు చలించిసాగుచున్నవి. భగవం తుని సత్త, శక్తిలేని పదార్థమొక్కటి గూడలేదు. ఇట్లు అన్నివిధములైన సాత్త్విక-రాజస-తామస జీవములందు పదార్థములందున్న ఏ విశేష గుణములు- విశేష ప్రభావములు-విశేషచమత్కారములు గలవియున్నవో వానియందే భగవంతుని సత్త (అస్తిత్వము) శక్తి విశేషముగా వికాసము పొందియుండును.

ఈ విశేషకారణముగా ఏయే వ్యక్తి.పదార్థము-భావము-లేక క్రియ వీని చింతనము మనస్సులో కలుగుచుండునో ఆదానియందంతటను భగవంతుని చింతనమే చేయవలెను. ఈ యభిప్రాయముచేతనే భగవంతుడు కపట ములో క్రీడించువారిలో తాను 'జూదము' అని తన స్వరూపము అందులో నున్నదని చెప్పెను కాని జూదము శ్రేష్ఠమని దానిలో ప్రవృత్తి కలుగ వలెనని చెప్పలేదు. ఎందుకనగా భగవంతుడైతే, మహాక్రూరము-హింసిం చునదియునైన సింహము మకరము (మొసలి సహజముగనే నశింపజేయు స్వభావముగల అగ్ని సర్వమును సంహరించు మృత్యువు గూడ తన స్వరూపమని చెప్పెను. ఇట్లు చెప్పుటచేత ఏ మనుష్యుడైనను పోయి సింహముతోగాని, మకరముతోగాని ఆడుకొనవలెను. అగ్నిలో దూక వలెను. తెలిసి తెలిసి మృత్యువు ముఖములో దూరవలెను. అని భగ

"వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం ధనంజయః।
మునీనామప్యహం వ్యాసః కవీనాముశనా కవిః॥" 37

"అర్జునా! నేను వృష్ణివంశీయులలో వాసుదేవుడను[1] అనగా, నేనే నీ మిత్రుడను. పాండవులలో ధనంజయుడను[2]. నీవు మునులలో వేదవ్యాసు

---

వంతుని యభిప్రాయమని తలచవచ్చునా! ఈ పనులు చేయుటలో గల అసక్తి జూదమాడుటలోను కలదుగదా!

ఈ నాలుగుగుణములే భగవత్ప్రాప్తికి సహాయకములుగాబట్టి భగవంతుడివి తన స్వరూపములని తెలిపెను. భగవంతుడీ నాలుగు గుణములు తన స్వరూపమనిచెప్పి. తేజస్వులలో గల తేజస్సు ప్రభావము వాస్తవముగా నాకు సంబంధించినదే. ఏ మనుష్యుడవి తనవేయని అభిమానముచూపునో అది యతనిపొరపాటు ఇట్లే విజయము సాధించినవారి విజయము నిశ్చయము చేయువారి నిశ్చయము సాత్వికుల సాత్విక భావము ఈ గుణము లన్నియు నావిగానే భావించవలెను. దీని కొరకు అభిమానము చూపువారు గూడ తప్పుచేయుచున్నారు. వారు మూర్ఖులు అను భావముగూడ తెలిపెను. ఇదిగాక, ఇట్లు చెప్పుటలో పైన చెప్పబడిన గుణములు గలవా రందరిలోను భగవంతునితేజస్సు అధికముగానున్నదని తెలిసికొనినవారు శ్రేష్ఠులని తలచవలెనను భావముగూడ నున్నది.

1. ఇట్లు చెప్పుటచేత భగవంతుడు-అవతారము-అవతారమెత్తునారు-ఈ యిరువురి యేకత్వము తెలిపెను. ఇందలి యభిప్రాయమేమనగా అవినాశిని జన్మరహితుడను. సర్వభూత మహేశ్వరుడను, సర్వశక్తి సంపన్నుడను, పూర్ణబ్రహ్మ పురుషోత్తముడను, అను నేనే వసుదేవపుత్రుని రూపములో లీలతో అవతరించితిని, అని (గీత 4-6)

2. అర్జునుడే పాండవులలో శ్రేష్ఠుడు. కారణమేమనగా నర-నారాయణుల అవతారములో అర్జునుడు నరరూపములో భగవంతునితోపాటు ఉండెను. ఇదిగాక అతడు భగవంతునకు ప్రియమిత్రుడు. ఆయనయందు అనన్య ప్రేమగల భక్తుడు. కాబట్టి అర్జునుడు తన స్వరూపమని భగవంతుడు స్వయంగా నిట్లనెను:-

డను కవులలో శుక్రాచార్యకవి గూడ[1] నేనేయని తెలిసికొనుము.

"దండో దమయతామస్మి నీతిరస్మి జిగీషతామ్।
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతామహమ్॥"[2] 38

"అర్జునా! నేను దమనము చేయువారికి దండమును- అనగా అణచి వేయు శక్తిగా నున్నాను[3] జయించు నిచ్ఛగలవారి నీతిని నేను[4] రహస్యముగా

---

"నరస్త్వమసి దుర్ధర్షో హరిర్నారాయణో హ్యహమ్।
కాలే లోకమిమంప్రాప్తౌ నర-నారాయణావృషీ॥"
అనన్యః పార్థ మత్తస్త్వం త్వత్తశ్చాహం తథైవ చ
(మహా.అరణ్య 12-46-47)

అనగా "అర్జునా! నీవు భగవంతుడైన నరుడవు. నేను స్వయముగా శ్రీహరియైన నారాయణుడను. మనమిద్దరము ఒకప్పుడు నర-నారాయణ రూపములలో ఈ లోకమునకు వచ్చియుంటిమి కనుక అర్జునా నీవు నాకంటే వేరుకావు అట్లే నేను గూడ నీకంటే వేరుగాను"అని భావము.

1. పండితుని బుద్ధిశాలిని 'కవి' యనెదరు. శుక్రాచార్యుడు భార్గవులకు అధిపతి. సకల విద్యా విశారదుడు. నీతిశాస్త్ర రచయిత సంజీవనీ విద్యనెరిగినవాడు. కవులలో ముఖ్యుడు. కనుక అతడు నా స్వరూపమని భగవంతుడు చెప్పెను.

2. 'జ్ఞానవతాం' అను పదమునకు పరబ్రహ్మమైన పరమాత్మ స్వరూపమును సాక్షాత్కారము చేసికొన్న యథార్థ జ్ఞాన సంపన్నులని యర్థము. వారి జ్ఞానమే సర్వోత్తమ జ్ఞానము. కనుక వారు నాస్వరూపమని భగవంతుడు చెప్పెను.

3,4. దండనము(అణచుశక్తి)ధర్మత్యాగముచేసి, అధర్మ ప్రవృత్తులై, ఉచ్ఛృంఖలము(అడ్డులేక)గాతిరుగు మనుష్యులను పాపాచరణమునుండి నివారించి సత్కర్మలయందు ప్రవృత్తిగల వారినిగాచేయును. మనుష్యుల మనస్సు ఇంద్రియాదులుగూడ ఈ దమనశక్తిచేతనే వశములై భగవత్ప్రాప్తికి సహా

మంచరగిన భావములను రక్షించు 'మౌనము'[1] జ్ఞానవంతుల తత్త్వజ్ఞానము గూడ నేనే.

"యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున ।
న తదస్తి వినా యత్ స్యాన్మయా భూతం చరాచరమ్ ॥" 39

అర్జునా! సమస్త భూతప్రాణుల ఉత్పత్తి కారణముగూడ నేనే[2]. ఎందు

---

యకములగును. దమనశక్తిచేత సమస్త ప్రాణులు వారి వారి ధర్మములను పాలించుకొనెదరు. కనుక దేవతలు-రాజులు శాసనకర్తలు మొదలైన న్యాయపూర్వక దండనమువిధించు వారందరి యొక్క దమనశక్తి తన స్వరూపమని భగవంతుడు చెప్పెను.

'నీతి' శబ్దమునకిక్కడ న్యాయమని యర్థము. న్యాయముచేతనే మనుష్యునకు సత్యమైన విజయము కలుగును. నీతిలేకుండ ఏ రాజ్యమునందు అవినీతి వ్యవహారము జరుగుచుండునో, ఆ రాజ్యముగూడ శీఘ్రముగా నష్టమేగును. కనుకనే, నీతి అనగా న్యాయము విజయము సాధించుటకు ప్రధానోపాయము. కాబట్టి విజయము కాంక్షించువారి నీతి (న్యాయము) తన స్వరూపమేయని భగవంతుడు చెప్పెను.

1. రహస్యముగా నుంచదగిన భావములన్నియు మౌనము(మాట్లాడకుండుట) చేతనే, రహస్యముగా నుండజాలును. మాట్లాడుటను ఆపకుండ రహస్య భావములయొక్క రహస్య రక్షణము కఠినమగును. ఈ విధముగా గోపనీయ భావములను రక్షించు మౌనము ప్రధానమైనది కాబట్టి మౌనము తన స్వరూపమని భగవంతుడు చెప్పెను.

2. భగవంతుడే సమస్త చరాచర భూతప్రాణులకు పరమాధారభూతుడు. ఆయననుండియే అన్నిటి యుత్పత్తి జరుగును. కనుక ఆయనయే, అన్నిటికి బీజభూతుడు లేక మహాకారణభూతుడు. ఈ కారణముచేతనే, భగవద్గీత యేడవ అధ్యాయము పదవశ్లోకములో భగవంతుడు అన్ని భూతప్రాణులకున్ను 'సనాతన బీజము' అని తొమ్మిదవ అధ్యాయము పదునెని

కనగా నేను లేనట్టి[1] చరాచర భూతప్రాణులేవియు లేవు.

"నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప।
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతేర్విస్తరో మయా ॥ 40

పరంతపా! నా దివ్యవిభూతులకు అంతము (ముగింపు) లేదు. నేను, నా విభూతులయొక్క విస్తారమునైతే, నీకొరకు కొంతయే, అనగా సంగ్రహముగా చెప్పితిని.

సంబంధము-

పదునెనిమిదవ శ్లోకములో అర్జునుడు భగవంతునితో ఆయన విభూతులను యోగశక్తిని వర్ణించి చెప్పుమని ప్రార్థన చేసియుండెను. ఆ ప్రార్థనను అనుసరించియే, భగవంతుడు తన దివ్యవిభూతులయొక్క వర్ణనము ముగించియిప్పుడు సంక్షేపముగా తన యోగశక్తినిగూర్చి వర్ణించుచున్నాడు.

"యద్ యద్ విభూతిమత్ సత్త్వం శ్రీమదూర్జితమేవ వా।
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోంఽశ సంభవమ్ ॥" 41

అర్జునా! విభూతి యుక్తము అనగా ఐశ్వర్య యుక్తము- కాంతిమంతము, శక్తిమంతమునైన యేయేవస్తువు జగత్తులో నున్నదో ఆయా వస్తువులన్నియు నా తేజస్సుయొక్క అంశముయొక్క అభివ్యక్తియనియే నీవు తెలిసికొనుము.[2]

---

మిదవ శ్లోకములో 'అవినాశిబీజము' అనియు చెప్పబడెను. ఈ కారణం చేతనే జగదుత్పత్తి కారణము తానేయని భగవంతుడు చెప్పెను.

2. దీనిచేత భగవంతుడు "చరాచర ప్రాణులన్నిటియందున్న నేను వ్యాపించియున్నాను. ఏ ప్రాణిగూడ నేను లేకుండనుండదు. కనుకనే సమస్త ప్రాణులు 'నా స్వరూపమని తలచి, నేను ఆ ప్రాణులలో వ్యాపించియున్నాననియు తలచి నీ మనస్సుతో పోయినచోట్లగూడ నీవు నా చింతనమే చేయుచుండుము." అను భావము తెలిపెను. ఈ ప్రకారముగా అర్జునుడు అడిగిన నిన్ను ఏయే భావములలో చింతించవలెను ? (గీత-10-17) అను ప్రశ్నకుగూడ దీనిచేత ఉత్తరము లభించును.

3. ఏ ప్రాణియందుగాని, లేక జడవస్తువునందుగాని పైన చెప్పబడిన ఐశ్వర్య

౪౨. "అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున ।
విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్ ॥" 42

అథవా, అర్జునా ! యివియన్నియు తెలిసికొనుటచేత నీకు ప్రయోజన మేమియున్నది[1] వేయేల ? ఈ సమస్త ప్రపంచమును నేను నా యోగశక్తి

---

శోభా కాంతి-శక్తి-బల-తేజస్-పరాక్రమములు గాని లేక యితర శక్త్యాదులుగాని లేక వానిలో నేదోయొక యంశమైనను గాని కనపడినచో అటువంటి ప్రతియొక్క ప్రాణి, ప్రతియొక వస్తువున్ను భగవంతుని అంశమని తలచుటయే భగవంతుని తేజస్సుయొక్క అంశముయొక్క అభివ్యక్తి యని తలచుట యనబడును.

ఇందలి యభిప్రాయమేమనగా ఎట్లైతే విద్యుచ్ఛక్తిచేత ఒకచోట వెలుతురు వ్యాపించుచున్నదో మరియొకచోట పంఖాలు (విద్యుత్తుచే తిరుగు వీవనలు) నడచుచున్నవో ఒకచోట నీరు ప్రవహించుచున్నదో మరియొకచోట రేడియో (దూరశ్రవణయంత్రము)లో దూరదూరములందు పాడబడు గానములు వినబడుచున్నవో ఆ విధముగానే, అనేక భిన్నస్థానములందు అనేక కార్యములు విద్యుచ్ఛక్తి వలన జరుగుచున్నవో, ఆ కార్యములన్నియు ఆయాచోట్ల విద్యుచ్ఛక్తి ప్రభావముచేతనే జరుగుచున్నవి. వాస్తవముగా అది విద్యుచ్ఛక్తి యంశముయొక్క అభివ్యక్తియేయగును. ఈ విధంగానే ఏ ప్రాణిలేక, ఏ వస్తువు ఏవోయొక విశేషముగలదిగా కనపడునో దాని యందును భగవంతుని తేజస్సుయొక్క అంశంయొక్క అభివ్యక్తియే గలదని తెలియవలెను.

1. ఇట్లు చెప్పుటచేత భగవంతుడు తెలిపిన భావమేమనగా నీవు అడుగగా నేను అతిముఖ్యమైన నా విభూతులు వర్ణనమైతే చేసితినిగాని యింత మాత్రమే తెలిసికొనుటచేత నీ కోరికతీరదు. ఇప్పుడు నీకు తెల్పుచున్న సారభూత విషయములు నీవు బాగుగా తెలిసికొనిన తరువాత అన్ని విషయములు నీకు తమంతట తెలియగలవు. తరువాత తెలిసికొనవలసిన విషయమేదియు నీకు మిగిలియుండదు అని.

యొక్క ఒక అంశముచేత మాత్రమే ధరించి స్థిరముగా నిలిచియున్నాను[1].

ఇతి శ్రీ మహాభారతే భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతాపర్వణి
శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణా
ర్జున సంవాదే విభూతియోగో నామ దశమోఽధ్యాయః
భీష్మపర్వణి చతుస్త్రింశోఽధ్యాయః

శ్రీమహాభారతమునందు, భీష్మపర్వమునందు శ్రీమద్భగవద్గీతా పర్వమునందు
శ్రీమద్భగవద్గీతోపనిషత్తులందు, బ్రహ్మవిద్యయందు, యోగశాస్త్రమునందు,
శ్రీకృష్ణార్జున సంవాదమునందు, విభూతియోగమనబడు
పదవ అధ్యాయము సమాప్తము (10) భీష్మపర్వమునందు
ముప్పదినాలుగవ అధ్యాయము సమాప్తము.

---

1. మనస్సు-ఇంద్రియములు-శరీరముగల సమస్త చరాచరప్రాణులు సుఖ-భోగసామాగ్రి- భోగస్థానము సర్వలోక సహితమైన యీ బ్రహ్మాండము ముత్తు భగవంతునియొక్క యేదోయొక యంశమునందు ఆయన యోగశక్తి చేతనే ధరింపబడియున్నది. ఈ భావము తెలుపుటకే భగవంతుడు, ఈ విశాలప్రపంచమంతయు, తన యోగశక్తి యొక్క ఒక అంశముచేతనే ధరింపబడియున్నదని తెలిపెను.

6. దీని తరువాతి విషయము భగవద్గీత మొదటి అధ్యాయము చివర * ఈ గుర్తు పెట్టబడిన అధోజ్ఞాపికలో నున్నట్లు గ్రహింపవలెను.

# శ్రీ భగవద్గీతయందు పదకొండవ అధ్యాయము

(భీష్మపర్వమునందు 35 వ అధ్యాయము)

## విశ్వరూప దర్శన యోగము :

**సంబంధము :**

భగవద్గీత పదవ అధ్యాయము మొదటి యేడు శ్లోకముల వరకు భగవంతుడు తన విభూతిని యోగశక్తిని, వానిని తెలిసికొనుట వలన మహాత్మ్యమును సంక్షేపముగ వర్ణించి, పదకొండవ శ్లోకమువరకు భక్తియోగమును, దాని ఫలమును నిరూపించెను. తరువాత పన్నెండునుండి పదునెనిమిదవ శ్లోకము వరకు అర్జునుడు భగవంతుని స్తోత్రముచేసి ఆయన దివ్య విభూతులను, యోగశక్తి నిగూర్చి విస్తారముగ వర్ణించుమని ప్రార్థించెను అప్పుడు భగవంతుడు నలువదవ శ్లోకమువరకు తన విభూతుల వర్ణనము ముగించి చివరకు యోగశక్తి ప్రభావము తెలుపుచు సమస్త బ్రహ్మాండము తన ఒక అంశములో ధరింపబడిన దని చెప్పి అధ్యాయమును ఉపసంహరించెను. ఈ విషయము వినిన అర్జునుని మనస్సులో భగవంతుని ఒక అంశములో సమస్త ప్రపంచముగల ఆ మహాస్వరూపమును ప్రత్యక్షముగా చూచు నిచ్ఛకలిగెను. ఇందుచేతనే యీ అధ్యాయము మొదటి నాలుగు శ్లోకములలో భగవంతుని ఆయన యుపదేశమును ప్రశంసించుచు అర్జునుడు, విశ్వరూపదర్శనము చేయించుమని భగవంతుని ప్రార్థించుచున్నాడు :-

### అర్జున ఉవాచ :

మదనుగ్రహాయ పరమం[1] గుహ్యమధ్యాత్మ సంజ్ఞితమ్ ।
యత్ త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ ॥ 1

---

1. భగవద్గీత పదవ అధ్యాయము అరంభమునందు ప్రేమ సముద్రుడైన భగ

అర్జునుడిట్లనెను :

భగవన్ ! నాపై ననుగ్రహముంచి నీవు పరమ రహస్యమైన అధ్యాత్మ విషయకమైన ఉపదేశము[1] చేసితివి. దానిచేత నా యీ యజ్ఞానము నష్ట

---

వంతుడు 'అర్జునా ! నీకు నాయెడ మిక్కిలి ప్రేమగలదు గనుక, నేనీ విషయములన్నియు నీ హితముకొరకు చెప్పుచున్నాను' అని చెప్పి తన యలౌకిక ప్రభావమును గూర్చి వినిపించెను. అది విని అర్జునునకు మహర్షులు చెప్పినమాటలు స్మరణకు వచ్చెను. అర్జునుని హృదయమునందు భగవద్రూప ముద్రపడెను. అతడు భగవద్రూపముయొక్క అపూర్వమైన దర్శనముచేసి ఆనందముచేత ముగ్ధుడయ్యెను. ఎందుకనగా, సాధకునకు తన పురుషార్థము, సాధనము లేక తన యోగ్యత ఇవి స్మరణమునకు వచ్చువరకు, అతడు భగవత్కృపనుండి లాభము పొందజాలకయే యుండును. భగవత్కృపయొక్క ప్రభావముచేత నతడు సహజముగనే సాధనముయొక్క ఉన్నతస్థాయికి చేరుకొనజాలును. కాని, యెప్పుడయితే సాధకునకు భగవత్కృపచేతనే, భగవత్కృప తెలియునో, ఇప్పుడు జరుగునదంతయు భగవదనుగ్రహముచేతనే జరుగుచున్నదని ప్రత్యక్షముగా చూచుచున్నట్లు తలచునో, అప్పుడు అతని హృదయము కృతజ్ఞతా బద్ధమగును. భగవన్ ! నేను దేనికిగూడ యోగ్యుడను గాను, నాకు ఏమాత్రము అధికారములేదు. ఇది అంతయు నీ యనుగ్రహ విలాసమే. అని యతడు మొరపెట్టుకొనును. ఇటువంటి కృతజ్ఞతా పూర్ణ హృదయముతోనే అర్జునుడు "భగవన్ ! నీ మాహాత్మ్య ప్రభావములను గూర్చి నీవు చెప్పిన దానికంతటికిన్ని నేను పాత్రుడనుగాను. నీవు నన్ను అనుగ్రహించుటకే, పరమ గోపనీయమైన నీ రహస్యమును నాకు చెప్పితివి" అని యనుచున్నాడు. 'మదనుగ్రహాయ' పదమున కదియే యభిప్రాయము.

1. భగవద్గీత యేడునుండి పదవ అధ్యాయము వరకు, భగవంతుడు విజ్ఞాన సహిత జ్ఞానమునుగూర్చి చెప్పుటకు ప్రతిజ్ఞచేసి, తన గుణ-ప్రభావ-ఐశ్వర్య స్వరూపముల తత్త్వమును, వాని రహస్యమును తెలిపెను. ఆ యుపదేశమంతయు నిక్కడ "పరమ రహస్యాధ్యాత్మ విషయక వచనము

మయ్యెను[1].

"భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా ।
త్వత్తః కమల పత్రాక్ష! మాహాత్మ్యమపి చావ్యయమ్ ॥" ౨

ఎందుకనగా, కమలనయనా! నేనిప్పుడు నీనుండి భూతముల ఉత్పత్తి ప్రళయములు విస్తార పూర్వకముగా వింటిని. నీయొక్క అవినాశ్యమైన మహిమ గూడ వింటిని.[2]

"ఏవమేతత్ యథాఽఽత్థ త్వం ఆత్మానం పరమేశ్వర ।
ద్రష్టుమిచ్ఛామి తే రూపమైశ్వర్యం పురుషోత్తమం ॥ ౩

---

అను పద సముదాయము యొక్క తాత్పర్యమని తెలియవలెను. ఏయే ప్రకరణములలో నైతే భగవంతుడు "నీయెదుట విరాజమానుడనై శ్రీకృష్ణుడనుగా నున్న నేనే సర్వప్రపంచమునకు 'కర్త-హర్త-నిర్గుణ, నిరాకార సాకార-మాయాతీత-సర్వశక్తిసంపన్న - సర్వాధార - పరమేశ్వరుడను సుమా! యని స్పష్టముగా తెలిపెనో, ఆయా ప్రకరణములను భగవంతుడు 'పరమ రహస్యములు' అని తెలిపెను. కనుకనే, యిక్కడ అర్జునుడు ఆ విశేషణములనే సూచించుచు 'నీవు చేసిన యీ ఉపదేశము పరమ రహస్యము, సందేహము లేదు' అను భావమును తెలుపుచున్నాడు.

౩. అర్జునుడు భగవంతుని గుణ-ప్రభావ-ఐశ్వర్య- స్వరూపములను పరిపూర్ణముగా తెలిసికొనకుండుటయే, అతనికి కలిగిన మోహము. ఇప్పుడు పైన చెప్పబడిన యుపదేశముచేత భగవంతుని గుణ-ప్రభావ-ఐశ్వర్య-స్వరూపములను కొంచముగా తెలిసికొని అర్జునుడు 'శ్రీకృష్ణుడే సాక్షాత్తు పరమేశ్వరుడు' అని తెలిసికొనెను. ఇదియే అతని మోహము నష్టమగుట యనబడును.

4. దీనిచేత అర్జునుడు నేను నీనుండి కేవలము భూతప్రాణుల ఉత్పత్తి ప్రళయములు మాత్రమే వినలేదు, మరి నీయొక్క వినాశ రహితమైన మహిమను- అనగా, నీవు సమస్త ప్రపంచముయొక్క సృష్టి-స్థితి-సంహారాదులను చేయుచుండియు వాస్తవముగా అకర్తవు; అందరిని అదుపులో

పరమేశ్వరా![1] నిన్నుగూర్చి నీవు చెప్పినమాట పూర్తిగా సత్యమే. కాని, జ్ఞానము, ఐశ్వర్యము, శక్తి, బలము, వీర్యము, తేజస్సు వీనితోగూడిన నీ యైశ్వర్య స్వరూపమును నేను ప్రత్యక్షముగా చూడగోరుచున్నాను.[2]

"మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టుమితి ప్రభో।।
యోగీశ్వర ! తతో మే త్వం దర్శయాత్మాన మవ్యయమ్ ॥ 4

---

నుంచుచుగూడ ఉదాసీనుడవు; సర్వవ్యాపకుడవైనప్పటికిన్ని, ఆయా వస్తువుల గుణ దోష సంబంధమేమాత్రము లేనివాడవు; శుభాశుభ కర్మల యొక్క సుఖ దుఃఖరూప ఫలములనిచ్చుచుగూడ నిర్దయత్వ-విషమత్వ దోషరహితుడవు; ప్రకృతి, కాలము సమస్తలోకపాలకులు- ఈ యన్నిటి రూపములలో ప్రకటితుడవై, అందరిని అదుపులో పెట్టుచున్న సర్వశక్తి సంపన్నుడవైన భగవంతుడవు- ఈ విధమైన నీ మాహాత్మ్యము గూర అయా ప్రకరణములలో మాటిమాటికి నేను వింటిని అను అభిప్రాయ మును కనవరచెను.

1. పరమేశ్వరా! అను సంబోధనచేత అర్జునుడిక్కడ "నీవు ఈశ్వరులందరి కన్న గొప్ప యీశ్వరుడవు. సర్వ సమర్థుడవు. కనుకనే నేను దర్శింప గోరుచున్న నీ యైశ్వర్యరూపము, నీవు సహజముగనే నాకనుగ్రహింప గలవు". అను భావమును వ్యక్తము చేయుచున్నాడు.

2. అసీమములు (ఎల్లలులేనివి) అనంతములు నైన జ్ఞానము-శక్తి-బలము-వీర్యము-తేజస్సు ఈ మొదలైన యీశ్వరీయ గుణ-ప్రభావములు దేని యందు ప్రత్యక్షముగా కనబడునో సర్వప్రపంచము దేనియొక్క ఒక అంశమునందున్నదో అటువంటి రూపమును ఇక్కడ 'ఐశ్వరరూపము' అని చెప్పెను. ఆ రూపమును నేను చూడగోరుచున్నాను. అని చెప్పుట చేత అర్జునుడు ఇట్టి అద్భుతరూపమును నేనెప్పుడుగూడ చూడలేదు. నీ ముఖమునుండి దాని వర్ణనమును విని (గీత 10-42) దానిని చూచుటకు గాను నా మనస్సునందు అత్యధికమైన యిచ్ఛ కలిగెను. ఆ రూపమును చూచి నేను కృతకృత్యుడనయ్యెదనని తలచుచున్నాను. అను భావము తెలిపెను.

ప్రభూ![1] ఒకవేళ నాకు నీయొక్క ఆ రూపము చూచుటకు సాధ్యమగునని నీవు తలచిన యెడల, అవినాశియైన ఆ నీ స్వరూపమును నాకు చూపింపుము.[2]

సంబంధము—

పరమ శ్రద్ధాళువు, పరమ ప్రేమియునైన అర్జునుడు ఇట్లు ప్రార్థించిన తరువాత, భగవంతుడు మూడు శ్లోకములలో తన విశ్వరూప వర్ణనము చేయుచు, దానిని చూడుమని అర్జునుని ఆజ్ఞాపించుచున్నాడు :-

## శ్రీ భగవానువాచ :

"పశ్య మే పార్థ ! రూపాణి శతశోఽథ సహస్రశః ।

---

1. 'ప్రభూ !' అని సంబోధించి అర్జునుడు "నీవు అన్నిటి ఉత్పత్తి-స్థితి-ప్రళయములను అంతర్యామివిగానుండి అన్నింటి శాసనమును చేయువాడవగుటచేత సర్వసమర్థుడవు కాబట్టి ఒకవేళ నేను నీయొక్క ఆ రూపమును దర్శించుటకు సుయోగ్యుడైన అధికారిని కాకున్నను నీవు దయతో నీ సామర్థ్యముచేత నన్ను సుయోగ్యుడైన అధికారిగా చేయగలవు" అను భావమును వ్యక్తముచేసెను.

2. ఇట్లు చెప్పుటచేత అర్జునుడు "నా మనస్సులో నీయొక్క ఆ యద్భుత రూపమును చూచుటకు మిక్కిలి ఆశగలదు. నీవు అంతర్యామివి గనుక నా మనస్సులోని లాలస, సత్యమైనది, ప్రబలమైనదియునగునా కాదా? యని చూచుకొనుము. ఒకవేళ నా లాలస సత్యమైనదని నీకు తోచినయెడల ప్రభూ! నేను ఆ రూపమును దర్శించుటకు అధికారి నయ్యెదను ఎందుకనగా నీవు భక్త వాంఛా కల్పతరువువని ప్రసిద్ధిపొందినవాడవు. నీవు భక్తుని మనస్సులోని యిచ్ఛనుమాత్రమే చూచెదవు కాని యితర యోగ్యతలను చూడవు. కాబట్టి ఒకవేళ ఉచితమని నీవు తలచిన యెడల నాయందు దయయుంచి నీయొక్క ఆ స్వరూప దర్శనము నాకు చేయించుము" అను భావము ప్రకటించెను.

నానా విధాని[1] దివ్యాని[2] నానావర్ణా[3]౽కృతీని చ ॥ 5

భగవంతుడిట్లనెను :

పార్థా ! యిప్పుడు నీవు నూర్లకొలది వేలకొలదిగా అనేక విధములు-అనేక రూపములు అనేకాకృతులుగలనా యలౌకిక రూపమును చూడుము

పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రానశ్వినౌ మరుతస్తథా ।
బహూన్యదృష్ట పూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత ! ॥ 6

అర్జునా! నాలో అదితి పుత్రులైన పన్నెండుగురు ఆదిత్యులను, ఎనమండుగురు వసువులను, పదకొండుగురు రుద్రులను, ఇద్దరు అశ్వినీకుమారు

---

1. "నానావిధాని"అను పదము అనేక భేదములను సూచించుచున్నది. దీనిని ప్రయోగించి భగవంతుడు, విశ్వరూపములో కనపడు రూపముల జాతుల యొక్క భేదములలో అనేకత్వమును ప్రకటించినాడు. అనగా దేవ-మనుష్య-తిర్యగాది సమస్త చరాచర జీవులయొక్క నానాభేదములను తనలో చూడమని చెప్పెను.

2. అలౌకికము, ఆశ్చర్య జనకము నైన వస్తువు "దివ్యము"అనబడును. ఇక్కడ 'దివ్యాని' అను పదమును ప్రయోగించి భగవంతుడు, నాశరీరములో కనబడు భిన్నభిన్నములైన. లెక్కలేనన్ని రూపములు దివ్యములని చెప్పెను.

3. ఇక్కడ 'వర్ణ'శబ్దమునకు ఎరుపు-నలుపు-పసుపు మొదలైన వేర్వేరు రంగులని; 'ఆకృతి' శబ్దమునకు అవయవముల పొందిక అనియు వర్థములు. ఆ యంగములు వర్ణములు వేర్వేరుగా అనేక విధములుగా, అసంఖ్యాకములుగా నున్నవని 'నానావర్ణా౽కృతీని'అను పదము తెలుపుచున్నది.

4. భగవంతుడు ఈ యందరి పేర్లు చెప్పి 'తన విరాట్ రూపములో సమస్త దేవతలను చూడుమని అర్జునునకు ఆజ్ఞయిచ్చెను. వీరిలో, ఆదిత్యుల యొక్క, మరుద్గణములయొక్కయు వ్యాఖ్యానము భగవద్గీత పదవ అధ్యాయము ఇరువదియొక్కటవ శ్లోకములో, వసువులయొక్క, రుద్రుల

లను, వలుబది తొమ్మండుగురు మరుద్గణములను చూడుము. ఇంకను నీవు ఇంతకు పూర్వము చూడని ఆశ్చర్యకర రూపముల ననేకములను చూడుము.

ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్ ।
మమ దేహే గుడాకేశ[1] ! యచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి ॥ 7

అర్జునా! ఇప్పుడు[2] ఈ నా శరీరమునందు ఒకచోటనే యున్న చరాచర సహితమైన సమస్త వస్తుప్రపంచమును చూడుము.[3] ఇంకను చూడవలసిన దేదైన

---

యొక్కయు వ్యాఖ్య యిరువది మూడవ శ్లోకములోను చేయబడినది. కాబట్టి యిక్కడ వారినిగూర్చి విస్తారముగా చెప్పలేదు. అశ్వినీ కుమారు లిద్దరు సోదరులు దేవ వైద్యులు. వీరిద్దరు సూర్యుని భార్య 'సంజ్ఞ'యను నామెకుపుత్రులని చెప్పబడినది. (విష్ణు పురాణము 3-2-7; అగ్నిపురాణము 273-4) ఒక చోట వీరు కశ్యపునకు అదితి గర్భమునుండి పుట్టినట్లు (వాల్మీకి రామాయణము-అరణ్యకాండము 14-14) మరియొకచోట ఈ అశ్వినీ కుమారులు బ్రహ్మదేవుని కర్ణములనుండి పుట్టినట్లును్ను (వాయు పురాణము 65-57) చెప్పబడినది. కల్పభేదముచేత ఈ వర్ణనములన్నియు యథార్థములే యగును.

1. ఇక్కడ అర్జునుని 'గుడాకేశ' అను పేరుతో భగవంతుడు సంబోధించి, 'నీవునిద్రకు స్వామివి-(నిద్రనుజయించి అదుపులోనుంచుకొనిన వాడవు.) కాబట్టి జాగరూకతతో నారూపమును బాగుగా, సమగ్రముగానుచూడుము. ఏ విధమైన సందేహము, భ్రమ నీకు కలుగకుండ చూడుము" అని తెలిపెను.

2. దీనిచేత భగవంతుడు "నాయొక్క యేరూపమునైతే నీవు చూడగోరితివో, దానిని చూపుటకు నేను కొంచముకూడ జాగుచేయుటలేదు. నీవు కోరిన వెంటనే చూపుచున్నాను."అను భావమును తెలిపెను.

3. పశు-పక్షి-కీటక-శలభ-దేవ- మనుష్యాదులైన కదలుచు - నడచుచున్న ప్రాణులన్నియు 'చరములు' అనబడును - ఒకచోట స్థిరముగానుండు పర్వత వృక్షాదులన్నియు 'అచరములు' అనబడును. ఇట్టి సమస్త చరాచర

ఉన్నచో చూడుము[1].

సంబంధము—

ఈ విధముగా, మూడు శ్లోకములలో మాటిమాటికి తన అద్భుత రూపమును చూచుటకుగాను ఆజ్ఞాపించినను, అర్జునుడు భగవంతుని రూపమును చూడజాలనప్పుడు, అతడు చూడజాలని కారణమును తెలిసికొనునట్టి అంతర్యామియైన భగవంతుడు అర్జునునకు దివ్యదృష్టి నీయదలచి యిట్లనుచున్నాడు:-

"న తు మాం శక్యసే ద్రష్టుమనేనైవ స్వచక్షుషా ।
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్॥" 8

"కాని, అర్జునా! నీవు నన్నీ ప్రాకృత నేత్రములతో, ఏమాత్రముచూడజాలవు. ఈ కారణముచేతనే, నేను నీకు దివ్యములు అనగా అలౌకికములైన నేత్రముల నిచ్చెదను. వానిచేత నీవు నాయీశ్వరీయమైన యోగశక్తిని చూడుము.[2]

---

ప్రాణులతో, వాని శరీరేంద్రియ భోగస్థాన-భోగసామాగ్రితోనుగూడిన సమస్త బ్రహ్మాండము, 'చరాచర సహిత సమస్త జగత్తునకు' అర్థము. దీనిచేత భగవంతుడు అర్జునునకు ఈ నా శరీరముయొక్క ఒక భాగమునందే ఉన్న సమస్త ప్రపంచమును నీవు చూడుము. అని తెలిపెను. అర్జునునకు భగవంతుడు పదవ అధ్యాయము చివరి శ్లోకములో 'నేను' ఈ సమస్త జగత్తును ఒక భాగమునందే ధరించియున్నాను" అను విషయమునే యిక్కడ ప్రత్యక్షముగా చూపించెను.

1. ఇట్లు చెప్పుటచేత భగవంతుడు 'ఇప్పటి సర్వజగత్తును చూచుటయేకాక, యింకను నీవు నాయొక్క గుణ-ప్రభావాదులను ప్రకటించునట్టి ఏదృశ్యమైనను, ఇతరులయొక్క, నీయొక్కయు జయాపజయ దృశ్యములను, లేక, భూత-భవిష్యత్-వర్తమాన కాలములందలి సంఘటనము లేవైనను నీవు చూడగోరినచో, వాని నన్నింటినిగూడ నీవు ఇప్పుడు నా శరీరముయొక్క ఒక అంశమునందు ప్రత్యక్షముగా చూడగలవు"అను భావమును తెలిపెను.

2. భగవంతుడు అర్జునునకు విశ్వరూప దర్శనము చేయుటకుగాను, తన

సంబంధము :

అర్జునునకు దివ్యదృష్టినిచ్చి భగవంతుడు, తన దివ్య విరాట్ స్వరూప మును ప్రదర్శించిన విధము నిప్పుడు ఐదు శ్లోకములలో సంజయుడు ధృతరాష్ట్రు నకు వర్ణించి చెప్పుచున్నాడు.

సంజయఉవాచ :

"ఏవముక్త్వా తతో రాజన్ మహాయోగేశ్వరో హరిః ।
దర్శయామాస పార్థాయ పరమం రూపమైశ్వరమ్॥" 9

సంజయుడిట్లనెను:—

రాజా! మహాయోగేశ్వరుడు[1], సర్వపాప హరుడునైన భగవంతుడు ఇట్లు చెప్పి, అర్జునునకు పరమైశ్వర్య యుక్తమైన తన దివ్యస్వరూపమును[2] చూపించెను.

---

యోగబలముచేత ఒక విధమైన యోగశక్తిని ఇచ్చియుండెను. దాని ప్రభా వముచేత అర్జునునిలో అలౌకిక సామర్థ్యము ఆవిర్భవించెను. ఆ దివ్య రూపమును చూడగల యోగ్యత అతనికిలభించెను. ఈ యోగశక్తియే 'దివ్యదృష్టి' యనబడును. ఇటువంటి దివ్యదృష్టినే శ్రీ వేదవ్యాస మహా ముని సంజయునకుగూడ ఇచ్చియుండెను. అర్జునునకు దర్శనమిచ్చిన రూపము దివ్యము. దానిని భగవంతుడు అద్భుతమైన తన యోగశక్తిచేతనే ప్రకటించి అర్జునునకు చూపియుండెను. కనుక ఆ దివ్య రూపమును చూచుటచేతనే, భగవంతునియొక్క అద్భుతమైన యోగశక్తి దర్శనము తనంతట అర్జునునకు కలిగెను.

1. సంజయుడిట్లు చెప్పుటలో భావమేమనగా, శ్రీకృష్ణుడొక సాధారణ వ్యక్తి కాదు ఆయన మహా యోగేశ్వరుడు. సర్వపాపములను దుఃఖములను నశింపజేయు సాక్షాత్తు పరమేశ్వరుడు. ఆయన అర్జునునకు తన విశ్వ రూపమేదైతే చూపెనో దేనినైతే యిప్పుడు నేను నీకు వర్ణించెదనో, ఆ దివ్య విశ్వరూపమును మహాయోగులుకూడ చూపించజాలరు. దానిని పర మేశ్వరుడొక్కడు మాత్రమే చూపించగలడు" అని తెలియవలెను.

2. భగవంతుడు తన విరాట్ స్వరూపమేదైతే, అర్జునునను చూపించియుం

"అనేక వక్త్రనయన మనేకాద్భుతదర్శనమ్ ।
అనేక దివ్యాభరణం దివ్యా నేకోద్యతాయుధమ్॥" 10

దివ్యమాల్యాంబరధరం దివ్యగంధాను[1] లేపనమ్ ।
సర్వాశ్చర్యమయం[2] దేవమనంతం[3] విశ్వతోముఖమ్॥ 11

రాజా! అనేక ముఖములు నేత్రములు కలిగి[4], అనేకాద్భుత దర్శనములు

---

డెనో, అది యలౌకిక దివ్య సర్వశ్రేష్ఠ-తేజోమయముగా నుండెను-అది సాధారణమైన ప్రపంచమువలె పంచభూతములతో చేయబడినది కాదు. భగవంతుడు తనకు పరమప్రియభక్తుడైన అర్జునునిపైన అనుగ్రహము గలవాడై తన యద్భుత ప్రభావమును అర్జునునకు తెలుపుటకు గానే తన అద్భుత యోగశక్తి చేత, ఆ రూపమును ప్రకటించి చూపించెను.

1. చందనాది లౌకిక గంధములకన్న విలక్షణమైన అలౌకిక పరిమళము "దివ్యగంధము" అనబడును. ఇట్టి దివ్య గంధమును ప్రాకృత ఘ్రాణేంద్రియము అనుభవింపజాలదు. దివ్యేంద్రియముచేతనే అది అనుభవింపబడ జాలును. ఎవని సర్వాంగములందు ఇటువంటి అతి మనోహర దివ్య గంధము అలదబడునో అది 'దివ్యగంధాను లేపన' మనబడును.

2. భగవంతుని విరాట్ స్వరూపములో పైన చెప్పబడిన 'ముఖ-నేత్ర-భూషణ-శస్త్ర-మాలిక-వస్త్ర-గంధాదులన్నియు ఆశ్చర్య జనకములుగా నుండెను గాబటి ఆయన "ఆశ్చర్యమయుడు" అనబడెను.

3. ప్రకాశమయుడు, పూజ్యుడునైనవాడు 'దేవుడు' అనబడును.

4. అర్జునుడు చూచిన రూపమునకు సూర్యచంద్రుల నేత్రములు (గీత 11-19)కాని ఆ విశ్వరూపమునందు కనబడునట్టివి ఇంకను అసంఖ్యాకములైన ముఖములు, నేత్రములు నుండెను. ఇందుచేతనే భగవంతుడు అనేక ముఖనేత్రములు గలవాడు అనబడెను.

గలవాడు[1] అనేక దివ్య భూషణాలంకృతుడు[2] చేతులలో ననేక దివ్య శస్త్రములను ధరించినవాడై[3], దివ్యమాలికలను, వస్త్రములను ధరించినవాడై[4] దివ్యగంధమును శరీరమంతటను అలదుకొనినవాడై, సర్వవిధాశ్చర్యయుక్తుడై అసీముడై, అన్ని వైపుల ముఖములు గలవాడైయున్న విరాట్ స్వరూపుడైన పరమ దేవుని, పరమేశ్వరుని అర్జునుడు చూచెను.

"దివి సూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా ।
యది భాః సదృశీ సా స్యాత్ భాసస్తస్య మహాత్మనః ।" 12

"రాజా! ఒకవేళ ఆకాశమునందు ఒక్కసారిగా వేయి సూర్యులు పుట్టుటచేత మహాప్రకాశము కలిగినయెడల, అది, విశ్వరూపధారియైన పరమాత్ముని ప్రకాశములో సమానము కావచ్చునేమో[5], అంతటి గొప్పది ఆ విశ్వరూప ప్రకాశము.

---

1. భగవంతుని విరాట్ రూపమునందు అర్జునుడిట్టివే, అసంఖ్యాకములైన అలౌకిక-విచిత్ర దృశ్యములు చూచి యుండెను. కనుకనే భగవంతునకు ఈ విశేషణమీయబడినది.

2. లౌకిక భూషణముల కంటె విలక్షణములు, తేజోమయములు, అలౌకికములునగు భూషణములు 'దివ్యము' లనబడును. ఇటువంటి అనంఖ్య దివ్య భూషణములచేత నలంకృతుడైనవాడు 'అనేక దివ్యాఽభరణుడు' అనబడును.

3. అలౌకిక-తేజోమయాయుధములు 'దివ్యము' లనబడును. విష్ణు భగవానుని చక్ర-గదా-ధనుస్సులు దివ్యములు ఇటువంటి అసంఖ్య-దివ్య-శస్త్రములను భగవంతుడు తన చేతులలో ధరించియుండెను.

4. విశ్వరూపుడైన భగవంతుడు తన కంఠములో అనేక సుందరాతిసుందర తేజోమయాలౌకిక మాలికలు ధరించియుండెను. ఆయన అనేక విధ ఉత్తమ-తేజోమయ అలౌకిక వస్త్రములను ధరించియుండెను. కనుక ఈ విశేషణమీయబడినది.

5. దీనిచేత విరాట్ స్వరూపుడైన భగవంతుని దివ్యప్రకాశము నిరూపమాన

"తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్తమనేకధా।
అపశ్యద్దేవదేవస్య శరీరే పాండవస్తదా॥" 13

రాజా! అర్జునుడు అప్పుడు, అనేక విధములుగా విభజింపబడిన అనగా, వేర్వేరుగా ఒక చోట నున్న సమస్త జగత్తును దేవదేవుడైన శ్రీకృష్ణుని శరీరము నందు చూచెను[1].

"తతః స విస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః।
ప్రణమ్య శిరసా దేవం కృతాంజలిరభాషత॥" 14

"రాజా! ఆ తరువాత ఆశ్చర్యచకితుడై, పులకిత శరీరుడైన అర్జునుడు[2]

---

మైనదని తెలుపబడెను. ఇందలి అభిప్రాయమేమనగా వేలకొలది నక్షత్రములు ఒకటిగా ఉదయించినను సూర్యునితో సమానములు కానట్లే, వేలకొలది సూర్యులు ఒకటిగా ఆకాశమునందు ఉదయించిన యెడల, ఆ సూర్యుల ప్రకాశము గూడ విరాట్ స్వరూపుడైన భగవంతుని ప్రకాశమునకు సమానము కాజాలదు. దీనికి కారణమేమనగా సూర్యుల ప్రకాశము అనిత్యము. అది భౌతికము- సీమితము. కాని విరాట్ స్వరూపుడైన భగవంతుని ప్రకాశము నిత్యము-దివ్యము-అలౌకికము అపరిమితము అని యెరుగవలెను.

1. దేవ మనుష్య పశు పక్షి కీటక శలభ వృక్షాది భోక్తలు భూమి అంతరిక్ష స్వర్గ పాతాళాది భోగ్య స్థానములు, ఆ ప్రాణులు అనుభవించుటకు యోగ్యములైన సామగ్రులు, ఈ యన్నింటియొక్క భేదముచేత విభజింపబడిన సమస్త బ్రహ్మాండమును అర్జునుడు భగవంతుని యొక్క శరీరమునందలి ఒక భాగములో చూచెను. భగవద్గీత పదవ అధ్యాయము చివరకు భగవంతుడు 'ఈ సమస్త జగత్తును నేను నాయొక్క ఒక అంశమునందు ధరించి ఉన్నాను' అని చెప్పిన విషయమిక్కడ అర్జునుడు ప్రత్యక్షముగా చూచెను.

2. ఇట్లు చెప్పుటలో అభిప్రాయమేమనగా భగవంతుని విశ్వరూపమును చూచిన అర్జునునకు ఎంత సంతోషమును-ఆశ్చర్యమును కలిగిన దనగా

ప్రకాశమయ విశ్వరూపుడైన పరమాత్మునకు శ్రద్ధాభక్తి సహితముగా, శిరస్సుతో ప్రణామముచేసి అంజలిబద్ధుడై యిట్లనెను[1].

అర్జున ఉవాచ:

"పశ్యామి దేవాంస్తవ దేవ! దేహే
సర్వాంస్తథా భూత విశేషసంఘాన్।
బ్రహ్మాణమీశం కమలాఽసనస్థమ్
ఋషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్॥" 15

అర్జునుడిట్లనెను:

"దేవా! నేను నీ శరీరములో సమస్త దేవతలను- భూత ప్రాణుల సముదాయమును- కమలాఽసనముపైన విరాజిల్లుచున్న బ్రహ్మదేవుని పరమశివుని, సమస్త ఋషులను దివ్య సర్పములను చూచుచున్నాను.

---

వానిచేత ఆ క్షణములో నతని శరీరము నందంతటను పులకలు పొడమెను. అతడింతకు పూర్వము, ఐశ్వర్య పరిపూర్ణమైన భగవంతుని ఈ స్వరూపము నెప్పుడు గూడ చూచి యుండలేదు. ఈ కారణము చేతనే ఈ యలౌకిక రూపమును చూడగానే అర్జునుని హృదయ ఫలకమునందు హఠాత్తుగా భగవంతుని యపరిమిత ప్రభావముయొక్క కొంత అంశము అంకితమయ్యెను. భగవంతుని ప్రభావము కొంతవరకు అతనికి తెలిసెను దీనిచేత అతని హర్షాశ్చర్యములకు అవధులు లేకపోయెను.

1. అర్జునుడు ఇటువంటి అనంతాశ్చర్యమయ దృశ్యములు గల పరమ ప్రకాశమయము. అసీమము ఐశ్వర్య సమన్వితమునైన భగవంతుని మహాస్వరూపమును చూచినపుడు దానిచేత నతడెంత ప్రభావితుడైనాడనగా అతని జీవితములో పూర్వముండిన మైత్రీభావమంతయు హఠాత్తుగా తొలగిపోయినట్లయ్యెను, భగవంతుని మహిమముందు తానుమిక్కిలి తుచ్ఛుడనని భావింపజొచ్చెను. భగవంతునియెడల అతని మనస్సులో అత్యంతపూజ్యభావము జాగృతమయ్యెను. ఆ పూజ్యభావము విద్యుత్తువంటి గమనముగలదై వెంటనే అతని మస్తకమును భగవంతుని చరణములందు లగ్నము చేసెను. అతడు చేతులు జోడించి మిక్కిలి వినమ్రభావములో శ్రద్ధాభక్తి పూర్వముగా భగవంతుని స్తుతింపసాగెను.

"అనేక బాహూదరవక్త్రనేత్రం
పశ్యామి త్వాం సర్వతోఽనంతరూపమ్।
నాంతం న మధ్యం న పునస్తవాఽదిమ్
పశ్యామి విశ్వేశ్వర। విశ్వరూప।"[3] 16

"విశ్వేశ్వరా! నిన్ను అనేక భుజములు, ఉదరములు, ముఖములు, నేత్రములు గల వానినిగా, అన్నివైపుల వ్యాపించిన అనంతరూపములు గలవానినిగాను చూచున్నాను- నేను నీయొక్క చివర-మధ్య-ఆది భాగములను చూడజాలకున్నాను.

"కిరీటినం గదినం చక్రిణం చ
తేజోరాశిం సర్వతో దీప్తిమంతం।

---

1. బ్రహ్మదేవుడు-శివుడు వీరిద్దరు దేవతలకు గూడ దేవతలు. ఈశ్వర కోటిలో చేరినవారు-కనుక ఆ యిరువురి పేర్లు ఇక్కడ, విశిష్టముగా పేర్కొనబడినవి. ఇట్లు బ్రహ్మదేవుడు కమలమునందు కూర్చొనిన వాడుగా చెప్పి అర్జునుడు, "నేను" విష్ణు భగవానుని నాభినుండి వెడలిన కమలము పైన విరాజిల్లుచున్న బ్రహ్మదేవుని చూచుచున్నాను. అనగా ఆయనతో పాటే, నీ విష్ణురూపమును గూడ నీ శరీరమునందు చూచుచున్నాను" అను భావమును తెలిపెను.

2. ఇక్కడ- స్వర్గ-మర్త్య-పాతాళలోకములలోని ప్రధానవ్యక్తుల సముదాయమును లెక్కించి అర్జునుడు 'నేను త్రిభువనాత్మక సమస్త ప్రపంచమును నీ శరీరములో చూచుచున్నాను' అను భావమును ప్రకటించెను.

3. ఇక్కడ అర్జునుడు నీవే ఈ జగత్తునకు కర్తవు-హర్తవు, అందరినీ వారి వారి కార్యములందు నియోగించువాడవు, అంతటికి అధీశ్వరుడవుగా నున్నావు. ఈ సర్వప్రపంచము వాస్తవముగా నీ స్వరూపమే యగును. నీవే ఈ సమస్త ప్రపంచమునకున్ను నిమిత్త కారణము ఉపాదాన కారణమునై యున్నావు. అను భావమును ప్రకటించెను.

పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం[1] సమంతాత్
దీప్తానలార్కద్యుతి మప్రమేయమ్[2] ॥ 17

"భగవన్! నేను నిన్ను కిరీట-గదా-చక్ర సహితునిగా, అన్నివైపుల ప్రకాశించుచున్న తేజస్సమూహము గలవానినిగా, ప్రజ్వలించుచున్న అగ్ని-సూర్యుల జ్యోతితో సమానమైన జ్యోతి గలవానినిగా అతి కఠినముగా చూడదగిన వానినిగా, అన్నిదిక్కుల అప్రమేయ స్వరూపము గలవానినిగాను చూచుచున్నాను.

"త్వమక్షరం పరమం వేదితవ్యమ్[3]
త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।
త్వమవ్యయః శాశ్వత[4] ధర్మ గోప్తా
సనాతనస్త్వం పురుషో మతో మే ॥ 18

---

1. అర్జునునకు భగవంతుడు ఆ రూపమును చూచుటకే దివ్యదృష్టి యిచ్చి యుండెను. ఆ దివ్యదృష్టితోనే అతడు భగవద్రూపమును చూచుచుండెను. కనుక అది యితరులకు చూడజాలనిదైనను, అతనికి మాత్రము దుర్నిరీక్ష్యము కాదు.

2. దీని చేత అర్జునుడు 'నీ గుణ-ప్రభావ-శక్తి స్వరూపములు అప్రమేయములు కనుక ఆ గుణాదులను ఇతర ప్రాణులేవియు, ఏ ఉపాయముచేత గూడ పూర్తిగా తెలిసికొన జాలవు' అను భావమును తెలిపెను.

3. తెలిసికొనదగిన ఏ పరమతత్త్వమును ముముక్షువులైన పురుషులు తెలిసికొనగోరుదురో, దేనిని తెలిసికొనుటకు జిజ్ఞాసువులైన సాధకులు అనేక విధములైన సాధనములు చేసెదరో, భగవద్గీత యెనిమిదవ అధ్యాయము మూడవ శ్లోకములో ఏ పరమాక్షరము పరబ్రహ్మమని తెలుపబడెనో ఆ పరమతత్త్వ స్వరూప సచ్చిదానంద ఘన నిర్గుణ-నిరాకార-పరబ్రహ్మ పరమాత్మయే యిక్కడ 'వేదితవ్యం' 'పరం' అను విశేషణములతో గూడిన 'అక్షరం' అను పదమునకు అర్థము అని తెలియవలెను.

4. సర్వదా చలించుచు సర్వదా స్థిరముగా నిలుచుచున్న సనాతన వైదిక

"దేవా! తెలిసికొనదగిన పరమమైన అక్షరం-అనగా, పరబ్రహ్మ పరమాత్ముడవు నీవే, నీవే ఈ ప్రపంచమునకు ముఖ్యమైన ఆశ్రయభూతుడవు, నీవే అనాదియైన ధర్మమునకు రక్షకుడవు; వినాశరహిత సనాతన పురుషుడవుగూడ నీవే" అని నా యభిప్రాయము.[1]

"అనాది మధ్యాంత[2] మనంత వీర్యమ్[3]
అనంత బాహుం శశి సూర్యనేత్రమ్।
పశ్యామి త్వాం దీప్త హుతాశ వక్త్రమ్
స్వతేజసా విశ్వమిదం తపంతమ్ ॥ 19

---

ధర్మము 'శాశ్వత ధర్మము' అనబడును-భగవంతుడు మాటిమాటికి అవతారములెత్తి ఆ ధర్మమునే రక్షించును. కాబట్టి అర్జునుడు భగవంతుని 'శాశ్వత ధర్మ గోప్తా' అని యనెను.

1. ఇక్కడ అర్జునుడు 'సమస్త జగత్తునకు హర్త-కర్త-సర్వశక్తి సంపన్నుడు సర్వవికారరహితుడు-సనాతనుడు-పరమపురుషుడు సర్వదా అవినాశియునైన పరమేశ్వరుడివి నీవే అను నభిప్రాయమును తెలిపెను.

2. ఈ యధ్యాయము పదియారవ శ్లోకమునందు అర్జునుడు భగవంతుని విరాట్ స్వరూపము 'అసీమము' అని తెలిపెను. ఇప్పుడిక్కడనైతే "అనాది మధ్యాంతుడు"అని చెప్పుటలో భావమేమనగా, ఆ భగవంతుడు 'ఉత్పత్తి' మొదలైన ఆరు వికారములు లేనివాడు, నిత్యుడుఅని ఇక్కడ 'ఆది' శబ్దము ఉత్పత్తిని, 'మధ్య' శబ్దము-ఉత్పత్తి వినాశముల మధ్య కాలములోనుండు స్థితి- వృద్ధి-క్షయ-పరిణామములు అను నాలుగు భావ వికారములను, 'అంత' శబ్దము వినాశరూప వికారమును తెలుపుచున్నవి. ఈ ఉత్పత్తి-స్థితి-వినాశములు మూడును ఎవనికిలేవో, అతడు 'ఆదిమధ్యాంత రహితుడు'అనబడును.

3. ఇక్కడ అర్జునుడు భగవంతుని 'అనంత వీర్యుడు' అని చెప్పిన బలవీర్య సామర్థ్య తేజస్సులకు ఏ సీమయులేదు అను భావమును తెలిపెను.

"భగవన్! నేను నిన్ను ఆది-మధ్యము-అంతమున్ను లేనివానినిగా, అనంతమైన సామర్థ్యము గలవానినిగా, అనంతభుజములు గలవానినిగా[1] చంద్ర సూర్య రూప నేత్రములు గలవానినిగా,[2] ప్రజ్వలించుచున్న అగ్ని రూప ముఖములు గల వానినిగా నీ తేజస్సుచేత ఈ ప్రపంచమును తపింపజేయు వానినిగాను చూచుచున్నాను.

"ద్యావా పృథివ్యో రిద మంతరం హి
వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః ।
దృష్ట్వాఽద్భుతం రూపముగ్రం తవేదమ్[1]
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్॥"[3] 20

"మహాత్మా! భూమ్యాకాశముల మధ్యనున్న సమస్తాఽంతరాళము, దిక్కులు నీ యొక్కనిచేతనే పరిపూర్ణములైయున్నవి నీ యీ యలౌకిక భయంకర రూపమును చూచి, మూడు లోకములు వ్యథ చెందుచున్నవి.

"అమీ* హి త్వాం సుర సంఘా విశంతి
కేచిద్ భీతాః ప్రాంజలయో గృణంతి ।

1. దీనిచేత అర్జునుడు 'నీ యీ విరాట్ రూపమునందు నేనేవైపు చూచిననూ, ఆవైపునకు అసంఖ్యాక భుజములు కనపడుచున్నవి' అను భావమును తెలిపెను.

2. దీనితరువాత అర్జునుడు 'నీవిరాట్ స్వరూపమునందు నాకు అన్ని వైపుల నీయొక్క అసంఖ్యాకములైన ముఖములు కనపడుచున్నవి. వానిలో నీ యొక్క ప్రధాన ముఖముపైన నేత్రముల స్థానమునందు చంద్ర సూర్యులను చూచుచున్నాను' అను నభిప్రాయమును వ్యక్తపరచుచున్నాడు

3. సమస్త ప్రపంచమునకు చాల గొప్ప ఆత్మగాబట్టి భగవంతుని 'మహాత్మన్' అని అర్జునుడన్నాడు.

*"సురసంఘాః' అను పదమునకు అప్రత్యక్షార్థమును తెలుపు 'అమీ' అను పదము విశేషణముగాఁర్చి అర్జునుడు. 'నేను స్వర్గలోకమునకు పోయి నప్పుడు అక్కడ ఏయే దేవ సంఘములను చూచితినో, వారే యిప్పుడు

స్వస్తీ త్యుక్త్వా మహర్షి సిద్ధ సంఘాః
స్తువంతి త్వాం స్తుతిభిః పుష్కలాభిః॥" 21

భగవన్! ఈ దేవతా సంఘములన్నియు నీలో ప్రవేశించుచున్నవి. కొందరు భయపడి చేతులుజోడించి, నీయొక్క గుణ-నామములను ఉచ్చరించుచున్నారు.[1] మహర్షి-సిద్ధ సమూహములు 'నీకు మంగళములు గలుగుగాక'యని చెప్పుచు నుత్తమోత్తమ స్తోత్రములచేత నిన్ను స్తుతించుచున్నారు.

"రుద్రాఽదిత్యా వసవో యే చ సాధ్యాః
విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ[2]।

---

ఈ నీ విరాట్ స్వరూపమునందు ప్రవేశించుచున్నట్లు చూచుచున్నాను". అను నభిప్రాయమును తెలిపెను.

*దీనిచేత అర్జునుడు, 'మిగిలిన చాల మంది దేవతలు, తాము చాలకాలము మిగిలి యుండెదరని తెలియక, భయముతో చేతులు జోడించుకొని, నీ యొక్క గుణ నామములు కీర్తించుచు నిన్ను ప్రసన్ను నిచేయుటకు ప్రయత్నము చేయుచున్నారు'అను నభిప్రాయమును తెలిపెను.

1. దీనిచేత అర్జునుడు, 'మరీచి-అంగిరసుడు-భృగువు మొదలైన మహర్షుల యొక్క, యింకను జ్ఞాతాజ్ఞాత సిద్ధజనుల యొక్కయు వేర్వేరు సంఘములన్నియు, నీ తత్త్వముయొక్క యథార్థమైన రహస్యమును తెలిసినవారగుట చేత, నీ యీ ఉగ్రరూపమునుచూచి, భయపడకున్నారు. కానీ, సర్వ ప్రపంచ శ్రేయస్సు కొరకు ప్రార్థనలు చేయుచు వివిధ-సుందర భావముల చేత శ్రద్ధా-ప్రేమ పూర్వకముగా నిన్ను స్తుతించు చున్నట్లుగా నేను చూచుచున్నాను'అను నభిప్రాయమును వ్యక్తీకరించెను.

2. వేడి అన్నమును తినువారు 'ఊష్మపులు' అనబడుదురు. మనుస్మృతి మూడవ అధ్యాయము ఇన్నూట ముప్పదియేడవ శ్లోకములో పితరులు వేడి అన్నమునే తినెదరు'అని చెప్పబడినది. గనుకనే యిక్కడ 'ఊష్మపాః' అను పదము పితృ సంఘములను తెలుపు దానినిగా తెలియవలెను.

గంధర్వ యక్షాసుర సిద్ధ సంఘాః[1]
వీక్షంతే త్వాం విస్మితాశ్చైవ సర్వే॥" 22

"మహాత్మా! ఏకాదశ రుద్రులు-ద్వాదశాదిత్యులు - అష్టవసువులు - సాధ్య గణములు-విశ్వేదేవతలు-అశ్వినీ కుమారులు - మరుద్గణములు - పితృదేవతల సముదాయము-గంధర్వులు-యక్షులు-రాక్షసులు, సిద్ధుల సముదాయము-ఈ యందరున్ను విస్మయముతో నిన్ను చూచుచున్నారు.

"రూపం మహత్ తే బహు వక్త్రనేత్రమ్
మహాబాహో! బహు బాహూరుపాదమ్ ।
బహూదరమ్ బహు దంష్ట్రాకరాలమ్
దృష్ట్వా లోకాః ప్రవ్యథితా స్తథాఽహమ్॥" 23

"మహాబాహూ! బహు ముఖములు-బహు నేత్రములు-అనేక హస్తములు ఎన్నియో తొడలు-బహు పాదములు-అనేకములైన ఉదరములు ఎన్నియోకోరలు-ఇవన్నియు కలిగి యుండుటచేత మిక్కిలి భయంకరముగా నున్న నీ మహారూప

---

భగవద్గీత పదవ అధ్యాయము ఇరువదితొమ్మిదవ శ్లోకముయొక్క టిప్పణి (అధోజ్ఞాపిక)లో పితరుల పేర్లు చెప్పబడినవి.

1. కశ్యపుని భార్యలైన ముని-ప్రధా-అరిష్టా అను వారినుండి గంధర్వులు పుట్టినారు. వారు గాన నాట్యాదులలో నిపుణులు. వారు దేవలోకము నందలి వాద్య-నృత్య కళలందు కుశలురు. కశ్యప మహాముని యొక్క 'స్వసా'యను పత్నినుండి యక్షులు పుట్టినారు. శంకర భగవానుని గణములలోకూడ యక్షులున్నారు. యక్షులకు, ఉత్తమ రాక్షసులకున్ను రాజు కుబేరుడు. దేవతల శత్రువులైన దైత్య-దానవ-రాక్షసులను 'అసురులు'అని యనెదరు. కశ్యపునికి దితినుండి దైత్యులు, దనువునుండి దానవులు పుట్టినారు. రాక్షసులపుట్టుక వేరేవిధముగా నైనది. కపిలాదిసిద్ధజనములు'సిద్ధులు' అనబడెదరు. ఈ యందరు ఇక్కడ గంధర్వ యక్షాసుర సిద్ధ సంఘాః అను పదముచేత తెలుపబడినారు.

మును చూచి, అందరు వ్యాకులము చెందియున్నారు. నేనున్ను వ్యాకులము చెంది యున్నాను.

"నభః స్పృశం దీప్తమనేక వర్ణమ్
వ్యాత్తాఽననం దీప్త విశాల నేత్రమ్ ।
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాంతరాఽత్మా
ధృతిం న విందామి శమం చ విష్ణో॥" 24

"ఎందుకనగా, మహావిష్ణూ! ఆకాశమును స్పృశించునట్టిది, దేదీప్య మానము అనేక వర్ణయుక్తము- విశాలముగా తెరచుకొనబడిన నోరు-ప్రకాశమానములైన విశాల నేత్రములు-వీనితోగూడిన నిన్నుచూచి, భయపడిన మనస్సుగలవాడనై నేను ధైర్యమును-శాంతిని పొందజాలకున్నాను.

"దంష్ట్రా కరాళానిచ తే ముఖాని
దృష్ట్వైవ కాలానల సన్నిభాని ।
దిశో న జానే న లభే చ శర్మ
ప్రసీద। దేవేశ। జగన్నివాస॥" 25

"మహాత్మా! దంష్ట్రలచేత అతి భయంకరములుగా అగ్నివలె ప్రజ్వలించుచున్న నీ ముఖములనుచూచి నేను దిక్కులు తెలియకయున్నాను. నాకు సుఖము లేకున్నది కనుక దేవా! నీవు ప్రసన్నుడవగుము.

"అమీ చ త్వాం ధృత రాష్ట్రస్య పుత్రాః
సర్వే సహైవావనిపాలసంఘైః ।
భీష్మో ద్రోణః సూతపుత్ర స్తథాఽసౌ
సహాస్మదీయైరపి యోధ ముఖ్యైః॥" 26

వక్త్రాణి తే త్వరమాణా విశంతి
దంష్ట్రా కరాళాని భయానకాని ।
కేచిద్ విలగ్నా దశనాంతరేషు
సందృశ్యంతే చూర్ణితైరుత్తమాంగైః॥" 27

"దేవా! యీ ధృతరాష్ట్ర పుత్రులందరు సమస్త రాజులతోపాటు నీలో ప్రవేశించుచున్నారు. భీష్మ పితామహుడు, ద్రోణాచార్యుడు, కర్ణుడు, మా పక్షమునకు చెందిన ప్రధాన యోధులతోపాటు అందరుగూడ, కోరలచేత అత్యంత భయంకరములైన నీ ముఖములలో మిక్కిలి వేగముగా పరుగెత్తుచు ప్రవేశించుచున్నారు. ఎందరి శిరస్సులో నుగ్గునుగ్గై, నీ దంతముల మధ్య ఇరికి కనబడుచున్నారు. (26,27)

"యథా నదీనాం బహవోఽమ్బువేగాః
సముద్ర మేవా భిముఖా ద్రవంతి ।
తథా తవామీ నరలోక వీరా
విశంతి వక్త్రాణ్యభి విజ్వలంతి॥" 28

"మహాత్మా! నదుల యనేక జల ప్రవాహములు, స్వాభావికముగానే, సముద్రమువైపు పరిగెత్తుచు పోవునట్లే-అనగా, సముద్రములో ప్రవేశించునట్లే, ఈ నరలోక వీరంతాగూడ ప్రజలించుచున్న నీ ముఖములలో ప్రవేశించుచున్నారు[1].

---

1. ఈ శ్లోకములో, భీష్మ ద్రోణాది వీరవరులు భగవంతుని ముఖములలో ప్రవేశించినారని వర్ణింపబడెను. వారు భగవత్ప్రాప్తికొరకు సాధనచేయుచుండిరి. వారి యిచ్ఛ లేకుండనే, యుద్ధము చేయుటకు పూనుకొన వలసి వచ్చెను. వారు యుద్ధములో మరణించి, భగవంతుని పొందువారుగా నుండిరి. ఇందుచేతనే వారు "నరలోకవీరులు"అనబడిరి. ఆ భీష్మ ద్రోణాదులు ఎట్లు భౌతిక యుద్ధమునందు మహావీరులుగా నుండిరో, అట్లే భగవత్ప్రాప్తి సాధనరూపమైన ఆధ్యాత్మిక యుద్ధమునందుగూడ కామ-క్రోధాది శత్రువులతో మహా శౌర్యముతో పోరాడువారుగనుండిరి. వారు భగవంతుని ముఖములలో ప్రవేశించు సందర్భములో నదీ-సముద్ర దృష్టాంతము నిచ్చి అర్జునుడు 'నదీజలము లెట్లైతే సహజముగానే, సముద్రమువైపు పరిగెత్తునో, చివరకు అవి తమ నామరూపములనువిడిచి, సముద్రముగానే యగునో, అట్లే యీ వీరులైన భక్తులు అందరుగూడ, నీ కెదురుగ ఉరుకుచు, నీయందు అభిన్నభావముతో ప్రవేశించుచున్నారు.' అను భావము

యథా ప్రదీప్తం జ్వలనం పతంగా
విశంతి నాశాయ సమృద్ధవేగాః ।
తథైవ నాశాయ విశంతి లోకాః
తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః ॥" 29

"భగవన్! మిడుతలు మోహముచేత, నష్టమగుటకు, జ్వలించుచున్న అగ్నిలో అతి శీఘ్రముగా పరిగెత్తుచు ప్రవేశించునట్లే వీరందరుగూడ, తమ నాశముకొరకే నీ ముఖములలో అతి వేగముతో పరుగెత్తుచు ప్రవేశించుచున్నారు[1].

"లేలిహ్యసే గ్రసమానస్సమంతాత్
లోకాన్ సమగ్రాన్ వదనైర్జ్వలద్భిః ।

---

ప్రకటించెను. ఇక్కడ భగవంతుని ముఖములకు 'ప్రజ్వలిత'అను విశేషణము చేర్చి ఎట్లైతే సముద్రములో అన్నివైపుల జలముమాత్రమే నిండియుండునో, నదీ జలములుగూడ దానిలో ప్రవేశించి సముద్రములో ఏకమైపోవునో అట్లే నీ ముఖములన్నియు అన్నివైపుల మిక్కిలి జ్యోతిర్మయములుగానున్నవి. వారిలో ప్రవేశించు వీరులైన భక్తులుగూడ, నీ ముఖముల యొక్క మహాజ్యోతిలో, తమ బాహ్యరూపములను దహించి, తాము గూడ జ్యోతిర్మయులై నీలో ఐక్యము చెందెదరు అను నభిప్రాయమును తెలిపెను.

1. ఈ శ్లోకములో దీనికి పూర్వ శ్లోకములోను భక్తులు కానట్టి సాధారణ వ్యక్తులు ప్రవేశించుటనుగూర్చి వర్ణించబడెను. వారు యిష్టపూర్తిగా యుద్ధము చేయుటకు వచ్చియుండిరి. కాబట్టియే వారికి ప్రజ్వలితాగ్ని-మిడుతల దృష్టాంతముచెప్పి అర్జునుడు మోహములోపడిన మిడుతలు నశించుటకే యిష్టపూర్తిగా అతి వేగముగ ఎగురుచు అగ్నిలో ప్రవేశించునట్లే, వీరందరుగూడ నీ ప్రభావము తెలియని కారణముచేత మోహములో పడినారు: తమ నాశముకొరకే మిడుతలవలె పరిగెత్తుచు నీ ముఖములలో ప్రవేశించుచున్నారు"అను భావము తెలిపెను.

తేజోభిరాపూర్య జగత్ సమగ్రం
భాసస్తవోగ్రాః ప్రతపంతి విష్ణో!" 30

"పరమాత్మా! నీవు నీ జ్వలించుచున్న ముఖములలో దూరుచున్న వీరందరిని మ్రింగుచు, అన్ని వైపుల మాటి మాటికి నాకుచున్నావు. నీ యొక్క ఉగ్రమైన ప్రకాశము సమస్త జగత్తునుముంచి తపింప జేయుచున్నది.

సంబంధము-

అర్జునుడు మూడవ-నాలుగవ శ్లోకములలో భగవంతుని, ఆయన యైశ్వర్యమయ రూప దర్శనము చేయించుమని ప్రార్థించియుండెను. తదనుసారముగనే, భగవంతుడు తన విశ్వరూపమును అర్జునునకు చూపించెను. కాని భగవంతుని యొక్క భయంకరమైన ఈ ఉగ్రరూపమునుచూచి అర్జునుడు మిక్కిలి భయపడెను. అతని మనస్సులో "ఈ శ్రీకృష్ణుడు వాస్తవముగా నెవరు? ఈ మహోగ్ర రూపములో ఇప్పుడీయన యేమి చేయగోరుచున్నాడు"? అను జిజ్ఞాస కలిగెను. ఈ కారణముచేతనే భగవంతుని అర్జునుడిట్లు ప్రశ్నించుచున్నాడు.

"ఆఖ్యాహి నో కో భవానుగ్రరూపో
నమోఽస్తుతే దేవవర! ప్రసీద ।
విజ్ఞాతు మిచ్ఛామి భవంత మాద్యమ్
నహి ప్రజానామి తవ ప్రవృత్తిమ్॥" 31

"భగవన్! ఉగ్రరూపముగల నీవెవరవు? నీకు నమస్కారము. నీవు ప్రసన్నుడవగుము. ఆది పురుషుడవైన నిన్ను విశేషముగా నేను తెలిసికొన గోరుచున్నాను. తెలుపుము. ఎందుకనగా, నేను నీ సమాచారము ఎరుగను[1].

---

1. దీనిచేత అర్జునుడు, కౌరవ పక్షీయులు - మా వారు తరచుగా అందరు యోధులు నష్టమగుచుండుట ప్రత్యక్షముగా కనపడుచున్నారు. ఇంతటి భయంకరమైన రూపమును నీవు నాకెందుకు చూపించుచున్నావు? ఇప్పుడు త్వరలోనే నీవు ఏమి చేయగోరుచున్నది నేనెరుగను. కనుకనే, ఇప్పుడు నీవు దయయుంచి యీ రహస్యమును వ్యక్తపరచి చెప్పుము" అను నభిప్రాయమును తెలిపెను.

సంబంధము–

ఈ విధముగా అర్జునుడడిగిన మీదట భగవంతుడు, తాను ఉగ్రరూపమును ధరించిన కారణము తెలుపుచు, అర్జునుని ప్రశ్నమునకు ఉత్తరము చెప్పుచున్నాడు:–

శ్రీ భగవానువాచ:

"కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః।
ఋతేఽపి త్వాం న భవిష్యంతి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః॥" 32

భగవంతుడిట్లనెను:–

"అర్జునా! నేను లోకములను నశింపజేయుటకు అభివృద్ధి పొందిన మహాకాలుడనుసుమా![1] ఇప్పుడీ లోకములను నశింపజేయుటకు పూనుకొని యున్నాను[2]. ఇందుచేత ప్రతిపక్షుల సేనలోనున్న యోధులందరు, నీవు లేకున్నను, నుందరు-

---

1. ఇట్లు చెప్పుటచేత, భగవంతుడు అర్జునుని మొదటి ప్రశ్నమునకు ఉత్తరముచెప్పెను. ఆ ప్రశ్నములో అర్జునుడు 'నీ వెవరు?'అని తెలిసికొనగోరుచుండెను. భగవంతుడిట్లు చెప్పుటలో అభిప్రాయమేమనగా 'నేను సమస్త ప్రపంచము యొక్క సృష్టి స్థితి-సంహారములనుచేయు సాక్షాత్తు-పరమేశ్వరుడను-కనుకనే ఇప్పుడు నేను, ఈ యందరిని సంహరించు సాక్షాత్తుకాలుడనని నీవు తెలిసికొనుము."అని

2. ఇట్లు చెప్పుటచేత భగవంతుడు అర్జునునియొక్క 'నేను నీసమాచారము నెరుగను'అను ప్రశ్నమునకు ఉత్తరముచెప్పెను. భగవంతుడిట్లు చెప్పుటలో నభిప్రాయమేమనగా, 'ఇప్పుడు నేను చేయు పనులన్నియు వీరందరిని నశింప జేయుటకేయని తెలుపుటకొరకు నేను ఈ నా విరాట్ రూపములోపల నీకు అందరి నాశముయొక్క భయంకర దృశ్యమును చూపితిని! అని తెలియవలెను.

అనగా, నీవు యుద్ధము చేయుకున్నప్పటికిన్ని ఈ యందరి వినాశము జరుగును తప్పదు[1].

సంబంధము–

ఈ విధముగా అర్జునుని ప్రశ్నమునకు ఉత్తరముచెప్పి భగవంతుడు, రెండు శ్లోకములచేత యుద్ధము చేయుటలో లాభమున్నదనిచెప్పి, అర్జునుని యుద్ధమునకు ఉత్సాహపరచుచు అజ్ఞాపించుచున్నాడు.

"తస్మాత్ త్వముత్తిష్ఠ[2] యశో లభస్వ
జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్ ।

---

1. ఈ మాటచేత భగవంతుడు "గురువులు-పెద తండ్రులు-పినతండ్రులు-మేనమామలు–సోదరులు మొదలైన ఆత్మీయ బంధుజనములు యుద్ధ సన్నద్ధులై యుండుటచూచి, నీమనస్సులో కలిగిన పిరికితనము కారణముగ, నీవు యుద్ధమునుండి విరమించుకొనుట ఉచితముకాదు. ఎందుకనగా, నీ వొకవేళ యుద్ధముచేసి, వీరందరిని చంపకున్నప్పటికిన్ని వీరు బ్రతుకువారుకారు. వీరి మరణము నిశ్చితమైయున్నది. నేను స్వయముగనే వీరి నాశమునకు పూనుకొనినప్పుడు వీరి రక్షణమునకు మరియొక యుపాయమేదియులేదు. కాబట్టి నీవు యుద్ధము మానుకొనగూడదు. నా యాజ్ఞానుసారము నీవు యుద్ధము చేయుటయే, నీకు హితకరము" అని తెలిపెను.

అర్జునుడు అతని పక్షమునందలి వీరులను, యోధులను చంపుట అసంభవము గాబట్టి భగవంతుడు 'నీవు వీరిని చంపకున్నప్పటికిన్ని ఎలాగైనను వీరు చచ్చిపోయెదరు అని చెప్పిన మాటలు అర్జునునకు సరిపడలేదు. కాబట్టి, భగవంతుడిక్కడ కేవలము కౌరవపక్షవీరుల విషయమేచెప్పెను. ఇదిగాక, అర్జునుని ఉత్సాహపరచుటకుగూడ భగవంతుడిట్లు చెప్పుట యుక్తి యుక్తముగానున్నది. భగవంతుడు శత్రుపక్షమునందలి యోధులందరు, ఒక విధముగా చచ్చియేయున్నారు–వారిని చంపుటకు నీకు ఏమాత్రము పరిశ్రమచేయవలసిన యవసరముఉండదు" అని తెలుపుచున్నాడనికూడ తలచవచ్చును.

2. ఇక్కడ 'తస్మాత్' అను పదముతో 'ఉత్తిష్ఠ' అను క్రియాపదమును

మయైవేతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్ ।." 33

"కనుకనే, అర్జునా! కీర్తిని సంపాదించుము. శత్రువులను జయించి ధన ధాన్యసమృద్ధమైన రాజ్యమును అనుభవించుము[1]. ఈ వీర యోధులందరు మొదలే నాచేత చంపబడినారు. సవ్యసాచీ! నీవైతే కేవలము వీరిని చంపుటలో నిమిత్త మాత్రుడవుకమ్ము[2].

"ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ
కర్ణం తథాఽన్యానపి యోధ వీరాన్ ।

---

ప్రయోగించి భగవంతుడు 'నీవు యుద్ధము చేయకున్నను వీరందరు బ్రతుకరు. తప్పక చచ్చెదరు కదా! ఇట్లున్నప్పుడు నీవు యుద్ధము చేయుటయే అన్ని విధముల లాభప్రదముగా నుండును. కాబట్టి నీవు ఎట్టైనను యుద్ధము మానవద్దు. ఉత్సాహముతో స్థిరముగా నిలువుము" అను నభిప్రాయమును అర్జునునకు తెలిపెను. (శ్లో. 33)

1. దీనిచేత భగవంతుడు 'ఈ యుద్ధమునందు నీ విజయము నిశ్చితమైనది. కనుకనే శత్రువులను జయించి ధన ధాన్య సంపన్నమైన మహాసామ్రాజ్యమును అనుభవించుము. దుర్లభమైన కీర్తి పొందుము. ఈ సదవకాశమును చేతులార జార విడుచుకొనకుము అని తెలిపెను.

2. ఎడమచేతగూడ బాణప్రయోగము చేయగలవాడు 'సవ్యసాచి' యనబడును. ఇక్కడ భగవంతుడు 'నీవైతే రెండు చేతులతో బాణము వేయుటలో మిక్కిలి నిపుణుడవు. కనుక ఈ వీరయోధులను జయించుట నీకు అసాధ్యమేమియు కాదు. ఇదిగాక వీరినందరిని ఇదివరకే నేను చంపినాను కాబట్టి నీవు వీరిని చంపవలసిన అవసరము విశేషముగా నుండదు. కేవలము నిమిత్తమాత్రుడవై పేరు ప్రతిష్ఠలు సంపాదించుకొనుము. కనుకనే నీవు వీరిని సంహరించుటకు కొంచముకూడ వెనుదీయకుము" అను అభిప్రాయమును తెలిపెను.

మయా హతాం స్త్వం జహి మా వ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాఽసి రణే సపత్నాన్॥" 34

"అర్జునా! ద్రోణాచార్యుడు, భీష్మ పితామహుడు, జయద్రథుడు (సైంధవుడు), కర్ణుడు, ఇంకను ననేక వీరులు, యోధులు, వీరందరిని ఇదివరకే నేను సంహరించినాను. అట్టివీరిని నీవిప్పుడు చంపుము[1]. భయపడకుము. నీవు శత్రు

---

నిమిత్తమాత్రుడని చెప్పుటలో మరియొక అభిప్రాయము గూడ కలదు. ఏమనగా "వీరిని చంపుటచేత నీకేవిధమైన పాపము కలుగదు. ఎందుకనగా నీవైతే క్షాత్ర ధర్మము ప్రకారము కర్తవ్య రూపములో ప్రాప్తించిన యుద్ధమునందు వీరందరిని చంపుటలో నిమిత్తమాత్రమే యగుదువు. ఇట్లుండగా నీకు ఇక పాపమెక్కడిది? అది యంటనే యంటదు. ఇది కాక నీవు క్షాత్ర ధర్మమును పాలించిన వాడవయ్యెదవు. కనుక నీ మనస్సులో ఏ విధమైన సందేహము లేకుండ, అహంకార-మమకార రహితుడవై, ఉత్సాహముతో యుద్ధమునకే పూనుకొనవలెను" అని తెలియవలెను.

1. ద్రోణాచార్యుడు ధనుర్వేదము నందు, శస్త్రాస్త్రము లనేకములు ప్రయోగించు విద్యలందున్న పారంగతుడు. యుద్ధవేళ యందు అత్యంత నిపుణుడుగా నుండెను. 'ఆయన చేతిలో నాయుధమున్నంతవరకు ఆయన నెవరుగూడ సంహరింపజాలరు అను విషయము సుప్రసిద్ధము. కనుక ఆయన అజేయుడని అర్జునుడు తలచుచుండెను. అంతియే కాక ఆయన గురువగుటచేత ఆయనను చంపుట పాపమని అర్జునుడు తలచుచుండెను. భీష్మ పితామహుని శౌర్యము జగత్ప్రసిద్ధముగ నుండెను. పరశురాముని వంటి అజేయవీరుని గూడ భీష్ముడు ఓడించి యుండెను. ఇవిగాక ఆయన తండ్రి శాంతనుడు భీష్ముని యిచ్ఛలేక మృత్యువు గూడ అతనిని చంపజాలదు అని వరమిచ్చియుండెను. ఈ కారణము లన్నింటి చేత 'భీష్మ పితామహుని జయించుట సామాన్యము కాదు అని అర్జునుడు నిశ్చయించుకొని యుండెను. ఈ యభిప్రాయముతో పాటే, భీష్మ పితామహుని చంపుట మహాపాపమని కూడా అర్జునుడు తలచియుండెను. 'నేను భీష్ముని

చంపగోరను' అని అర్జునెన్నియో సార్లు చెప్పియుండెను. జయద్రథుడు స్వయముగనే చాలా గొప్పవీరుడు. అతడు పరమశివునకు భక్తుడగుట చేత ఆ దేవునినుండి దుర్లభ వరములను బడసి అత్యధిక దుర్జయుడై నాడు. అతడు దుర్యోధనుని చెల్లెలు 'దుశ్శలకు' భర్తయగుట చేత పాండవులకు గూడ బావమరది యగును. అర్జునుడు స్వాభావికముగానే, సౌజన్యము ఆత్మీయ భావము గలవాడు కాబట్టి సైంధవుని చంపుటకు వెనుదీయుచుండెను. కర్ణుడు గూడ ఎందులోను తనకన్న తక్కువ వీరుడు కాదని అర్జునుడు తలచుచుండెను. ప్రపంచమంతటను అర్జునునకు తగిన ప్రతిద్వంద్వి కర్ణుడే కర్ణుడు చాల గొప్ప వీరుడే కాక. పరశు రాముని కడ దుర్లభమైన అస్త్రవిద్యను గూడ నేర్చియుండెను.

పై కారణముల చేతనే. ఈ నలుగురి పేర్లు వేరువేరుగా చెప్పి వీతే కాక, భగదత్త, - భూరిశ్రవస్ శల్య ప్రభృతి వీరుల నెవరినైతే అర్జునుడు గొప్ప యోధులని తలచుచుండెనో, ఎవరిని జయించుట సులభముగాదని తలచుచుండెనో, వారినందరినీ దృష్టిలోనుంచుకొని, వారి నందరిని తాను చంపినానని తెలిపి భగవంతుడు, వారిని చంపుమని యాజ్ఞాపించి, నీవు ఎవరినిగూడ జయించుటకు ఏమాత్రము సందేహింప గూడదను భావమును ప్రకటించెను. వీరి నందరినీ నేనిదివరకే చంపినా నని కూడ భగవంతుడు తెలిపెను. ఇంతయేకాక, "నీవు ఈ గురుజనంబు లను చంపుటచేత పాపము కలుగునని శంకించుటగూడ మంచిదిగాదు. ఎందుకనగా, క్షత్రియ ధర్మము ప్రకారము నీవు వీరిని చంపుటకు కేవలము నిమిత్తమాత్రుడివయ్యెదవు. కనుక నిందులో నీకు ఏలాటి పాపముగూడ అంటదు. మీదు మిక్కిలి ధర్మపాలనయేయగును కనుకనే. లెమ్ము, వీరిని జయింపుము"అను విషయముగూడ సూచించెను. దీనిచేత భగవంతుడు అర్జునునకు 'నా భయంకర రూపమునుచూచి, నీ వింతగా భయపడుట, బాధపడుట మంచిదిగాదు. నేను నీ మిత్రుడనైన కృష్ణుడనే, కనుక నీవు కొంచముగూడ భయపడకుము-పరితపించకుము' అని చెప్పెను.

లేదు-కనుక యుద్ధము చేయుము[1].

సంబంధము—

ఇట్లు భగవంతుని మాటలన్నియు వినిన తరువాత అర్జునుని పరిస్థితి యెట్లుండెను? అప్పుడతడు యేమి చేసెను? ఈ జిజ్ఞాస మీద సంజయుడు ధృతరాష్ట్రునితో నిట్లనుచున్నాడు.

సంజయ ఉవాచ:

"ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య
కృతాంజలిర్వేపమానః కిరీటీ।
నమస్కృత్వా భూయ ఏవాఽహ[2] కృష్ణమ్
సగద్గదం భీతభీతః ప్రణమ్య ॥ 35

సంజయు డిట్లనెను:

రాజా! శ్రీకృష్ణ భగవానుడు చెప్పిన ఈ మాటలు విని అర్జునుడు చేతులు

---

1. అర్జునుని మనస్సులో 'యుద్ధములో మేము జయము పొందెదమో, లేక శత్రువులే మమ్ము జయించెదరో (గీత 2-6), అని కల్గిన శంకను నివారించుటకు భగవంతుడిట్లు చెప్పెను. ఆయన యిట్లు చెప్పుటలో అభిప్రాయమేమనగా "యుద్ధమునందు నిశ్చయముగా నీకు విజయము కలుగును. కనుక నీవు ఉత్సాహముతో యుద్ధము చేయవలయును" అని

2. అర్జునుని శిరస్సుపైన ఇంద్రుడిచ్చిన సూర్య సమాన ప్రకాశ మానమైన దివ్య కిరీటము సర్వదాయుండెను. అందుచేత అతని కొక పేరు 'కిరీటి' యని కూడ ప్రసిద్ధమాయెను.

అర్జునుడు స్వయముగా విరాటరాజు పుత్రుడైన ఉత్తర కుమారునితో యిట్లనెను:—

"పురా శక్రేణ మే దత్తం యుధ్యతో దానవర్షభైః।
కిరీటం మూర్ధ్ని సూర్యాభం తేనాఽహుర్మాం కిరీటినమ్"
(మ.భా. విరా 44-17)

జోడించి వణకుచు[1], నమస్కారము చేసి, మిక్కిలి భయపడుచు మాటిమాటికి నమస్కారము చేసి[2] శ్రీకృష్ణ భగవానునితో డగ్గుత్తికతో నిట్లనెను[3]–

సంబంధము–

ఇప్పుడు ముప్పది యారవ శ్లోకమునుండి నలుపదియారవ శ్లోకమువరకు అర్జునుడు భగవంతుని స్తుతించి ఆయనకు నమస్కరించి, తనను క్షమించుమని ప్రార్థించుచున్నాడు.

అర్జున ఉవాచ:

"స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా
జగత్ ప్రహృష్యత్యను రజ్యతే చ ।
రక్షాంసి భీతాని దిశో ద్రవంతి
సర్వే నమస్యంతి చ సిద్ధ సంఘాః ॥ 36

---

1. దీనిచేత సంజయుడు "శ్రీకృష్ణునియొక్క ఆ ఘోర రూపమునుచూచిన అర్జునుడు, భగవంతుడింతగా ఊరడించినప్పటికీ, అతని భయము పోవలేదను నంతగా వ్యాకులపడెను. అందుచేత అర్జునుడు భయముతో వణకుచునే, భగవంతునితో, ఆ రూపమును ఉపసంహరించుకొనుమని ప్రార్థించెను" అను నభిప్రాయమును ప్రకటించెను.

2. దీని యభిప్రాయమేమనగా 'అర్జునుడు భగవంతుని స్తోత్రము చేయుచున్నపుడు భయాశ్చర్యములు కారణముగా అతని గుండె నీరయ్యెను. కన్నులలో నీరుండెను, కంఠములో మాటరాలేదు కనుక, అతని వాక్కు గద్గదము (డగ్గుత్తుక) కాజొచ్చెను. అందువలన, అతని ఉచ్చారణము అస్పష్టముగా, దుఃఖ పూరితముగా నయ్యెను.'

3. దీనిచేత సంజయుడు 'భగవంతుని అనంతైశ్వర్య స్వరూపమును చూచి, ఆ స్వరూపమువట్ల అర్జునునకు మిక్కిలి పూజ్య దృష్టి కలిగెను అతడైతే భయపడియేయుండెనుకదా! ఇందుచేతనే, అతడు చేతులు జోడించుకొని

అర్జును డిట్లనెను:

అంతర్యామీ! నీ యొక్క నామ-గుణ-ప్రభావముల సంకీర్తనము చేత ప్రపంచమంతయు మిక్కిలి సంతసించుచున్నది. నీ యెడల ననురాగము చూపు చున్నది. రాక్షసులు భయపడి దిక్కులకు పారిపోవుచున్నారు. సిద్ధ గణ సంఘము లన్నియు నీకు నమస్కారములు చేయుచున్నవి. ఇది బాగుగనే యున్నది[1].

"కస్మాచ్చ తే న నమేరన్ మహాత్మన్ ।
గరీయసే బ్రహ్మణో ఽప్యాది కర్త్రే ।
అనంత దేవేశ జగన్నివాస
త్వమక్షరం సదసత్తత్పరం యత్ ॥" 37

"మహాత్మా! బ్రహ్మదేవునకు గూడ ఆదికర్తవు. అందరికన్నను పెద్ద వాడవునైన నీకు వారు ఎట్లు నమస్కారము చేయకుండెదరు? ఎందుకనగా, జగన్నివాసా![2] అనంతా! దేవేశా! సత్తు-అసత్తుల కన్న పరుడవు. అక్షరుడవు.

---

భగవంతునకు ప్రణామము మాటిమాటికి చేయుచు ఆయనను స్తుతించ మొదలిడెను'అని చెప్పెను.

1. భగవంతుడు ప్రసాదించిన దివ్యదృష్టిచేత అర్జునుడు మాత్రమే యిది యంతయు చూడగలుగుచుండెను. జగత్తులో నితరులా స్వరూపమును చూడజాలకుండిరి. ప్రపంచము సంతసించుట-అనురక్తమగుట-రాక్షసులు భయపడి పారిపోవుట - సిద్ధ సాధ్యులు నమస్కరించుట"యివి యన్నియు ఆ విరాట్ స్వరూపము యొక్క అంగముతేయగును. ఇందలి అభిప్రాయ మేమనగా "ఈ వర్ణనము అర్జునునకు చూపించునది, విరాట్ స్వరూపము యొక్క అంగమే కాని, బాహ్య ప్రపంచముకాదు. అర్జునునకు కనపడు చుండిన విరాట్ స్వరూపములోనే. యీ దృశ్యములన్నియు కనపడు చుండెను. ఇందుచేతనే అర్జునుడు ఇట్లనెను"అని తెలియవలెను.

2. ఇక్కడ అర్జునుడు 'మహాత్మన్!', 'అనంత!', 'దేవేశ', 'జగన్నివాస', అను నాలుగు సంబోధనములను ప్రయోగించి "నీవు సమస్త చరాచర ప్రాణులకు గొప్ప ఆత్మవు-అంతరహితుడవు అనగా నీ యొక్క రూప,

సచ్చిదానంద ఘనుడవైన బ్రహ్మము నీవే కదా[1]

''త్వమాది దేవః పురుషః పురాణః
త్వమస్య విశ్వస్య పరంనిధానమ్ ।
వేత్తాసి వేద్యం చ పరం చ ధామ
త్వయా తతం విశ్వమనంత రూపమ్ ॥" 38

"భగవన్ ! నీవు ఆదిదేవుడవు. సనాతన పురుషుడవు. నీవు ఈ ప్రపంచమునకు పరమాఽశ్రయ భూతుడవు. నీవు తెలుసుకొనదగినవాడవు[2]. పరమ

గుణ, ప్రభావాదులకు ఒక సీమ (ఎల్ల-అంతు) లేదు-నీవు దేవతలకుగూడ స్వామివి. సమస్త ప్రపంచమునకు నీ వొక్కడవు మాత్రమే వరమమైన ఆధార భూతుడవు. ఈ ప్రపంచమంతయు నీ యందే స్థిరముగా నిలచి యున్నది. నీవు ఈ ప్రపంచమంతటను వ్యాపించి యున్నావు. కనుకనే వీరందరు నీకు నమస్కారముచేయుట అన్ని విధముల ఉచితముగా నున్నది."అను నభిప్రాయమును ప్రకటించెను.

1. దేనికైతే ఎప్పుడుగూడ అభావమనునది యుండదో, అటువంటి అవినాశియైన ఆత్మ 'సత్', అని, ఏదియైతే నాశముగలదో, అనిత్యమో, అటువంటి వస్తువు 'అసత్'ఆనియు అనబడును. ఈ సదసత్తులను గూర్చియే భగవద్గీత యేడవ అధ్యాయములో 'పరా-అపరా' ప్రకృతులని, పదునైదవ అధ్యాయములో 'అక్షర పురుషుడు - క్షర పురుషుడు, అనియు చెప్పబడెను. వీనికిపైన "పరమాక్షర-సచ్చిదానందఘన-పరమాత్మ తత్త్వము" ఉన్నది. అర్జునుడు భగవంతునకు నమస్కారాదులు చేయుటలో ఔచిత్యమును నిరూపించుచు "భగవన్! ఇది యంతయు నీ స్వరూపమే కనుకనే, నీకు నమస్కారాదులు చేయుట అన్ని విధముల ఉచితముగానున్నది." అని చెప్పుచున్నాడు.

2. దీనిచేత అర్జునుడు "భగవన్! ఈ భూత-వర్తమాన-భవిష్యత్ కాలములలోని సమస్త ప్రపంచమును యథార్థరూపములలో సంపూర్ణముగా తెలిసికొనువాడవు, అన్నిటిని సర్వదా చూచువాడవు, కనుక నీవు సర్వజ్ఞుడవు.

రాముడు.[1] అనంతరూపుడవు[2] నీచేతనే ఈ సమస్త ప్రపంచము వ్యాపింపబడి యున్నది. అనగా- నీవు పరిపూర్ణుడవు.[3]

"వాయుర్యమోఽగ్ని ర్వరుణః శశాంకః
ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ[4]।
నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః
పునశ్చ భూయోఽపి నమో నమస్తే ॥" 39

"మహాత్మా ! నీవు వాయు- యమ- వరుణ- చంద్ర- ప్రజాపతి బ్రహ్మల స్వరూపుడవే కాక, బ్రహ్మకుగూడ తండ్రివి. గాబట్టి ప్రపితామహుడవు. ముత్తా

---

నీవంటి సర్వజ్ఞుడు ఇతరుడెవడుగూడ లేడు. (గీత-7-26)" అను నభిప్రాయమును తెలిపెను.

దీనిచేత అర్జునుడు "మహాత్మా ! ఎవడు తెలిసికొనదగినవాడో, ఎవనిని తెలిసికొనుట మనుష్య జన్మముయొక్క పరమోద్దేశమో, భగవద్గీత పదమూడవ అధ్యాయము పన్నెండవ శ్లోకమునుండి పదియేడవ శ్లోకమువరకు ఏ జ్ఞేయ (తెలిసికొనదగిన) తత్త్వము వర్ణింపబడినదో, ఆ సాక్షాత్తు పరబ్రహ్మ పరమేశ్వరుడవు నీవే" యను నభిప్రాయమును ప్రకటించెను.

1. దీనిచేత అర్జునుడు "శ్రీకృష్ణా! ఎవడు ముక్తులైన పురుషులకు పరమ గతియో, ఎవనిని పొందిన తరువాత మనుష్యుడు తిరిగిరాడో, అట్టి సాక్షాత్తు పరమధామ స్వరూపుడవు నీవే (గీత-8-21)" యని తెలిపెను.

2. దీనిచేత అర్జునుడు "భగవన్ ! నీ రూపము అనంతము-అగణితము. దాని యంతము నెవరున్ను పొందజాలరు" అని తెలిపెను.

3. దీనిచేత అర్జునుడు "సమస్త ప్రపంచమునందలి ప్రతియొక పరమాణువునందు భగవన్! నీవు వ్యాపించియున్నావు. ఈ ప్రపంచములో ఏచోటు గూడ నీవు లేనిది లేదు. అను అభిప్రాయమును తెలిపెను.

4. ఇట్లు చెప్పుటచేత అర్జునుడు "సమస్త ప్రపంచమును పుట్టించు కశ్యప-దక్ష ప్రజాపతి-సప్తర్షులు, మొదలైనవారికి. మహాత్మా! నీవు తండ్రివగుట

తవు) నీకు సహస్రాది నమస్కారములు చేయుచున్నాను[1]. మాటిమాటికి మరల గూడ నమస్కారములు చేయుచున్నాను.

"నమః పురస్తాదథ పృష్ఠతస్తే
నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ[2]।
అనంత వీర్యామితవిక్రమస్త్వమ్
సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః ॥" 40

అనంతా! నీకు వెనుకనుండి, ముందునుండిగూడ నమస్కారము చేయుచున్నాను. సర్వాత్మా ! నీకు అన్నివైపులనుండియు నమస్కారములు చేయుచున్నాను. ఎందుకనగా, అనంత పరాక్రమశాలివైన నీవు సమస్త ప్రపంచమునందు వ్యాపించియున్నావు. నీవే సర్వ స్వరూపుడవుగానున్నావు[3].

---

చేత, బ్రహ్మదేవుడు అందరికి పితామహు (తాత-తండ్రికి తండ్రి) డైతే, ఆ బ్రహ్మనుగూడ పుట్టించిన వాడవు నీవు. కాబట్టి, నీవు అందరికిన్ని ప్రపితామహుడవు (ముత్తాత) ఇందుచేతగూడ నీకు నమస్కారముచేయుట అన్నివిధముల ఉచితము." అను నభిప్రాయమును తెలిపెను.

1. "సహస్ర కృత్వః" అను పదముతో మాటిమాటికి 'నమః' అను పదము ప్రయోగించుటచేత, అర్జునుడు భగవంతునిపట్ల సమ్మానముతో, భయము కారణముగా, వేయిసార్లు నమస్కారములు చేయుచుగూడ అలసిపోవలేదు ఇంకను భగవంతునకు నమస్కారములే చేయగోరుచున్నాడు." అను నభిప్రాయమని తెలియవలెను.

2. 'సర్వ' అను పేరుతో సంబోధించి అర్జునుడు, భగవన్! నీవు అందరి యాత్మస్వరూపుడవు. సర్వవ్యాపివి. సర్వరూపుడవు. కనుక నేను నీకు "వెనుక-ముందు-పైన-క్రింద కుడి ఎడమ పార్శ్వములు, ఈ అన్ని వైపులనుండి నమస్కారము చేసెదను." అను నభిప్రాయమును తెలిపెను.

3. అర్జునుడిట్లు చెప్పుటచేత భగవంతునియొక్క సర్వభావమును నిరూపించుచున్నారు. ఇందలి యభిప్రాయమేమనగా "భగవన్! ఈ సమస్త

సంబంధము-

ఈ విధముగా అర్జునుడు భగవంతుని స్తుతించి, ఆయనకు ప్రణామములు చేసి, ఇప్పుడు భగవంతునియొక్క గుణ-రహస్య-మాహాత్మ్యములను యథార్థముగా తెలిసికొనకుండుటచేత, అర్జునుడు, తన వాక్కుచేత, క్రియలచేతను చేసిన యపరాధములను క్షమింపుమని భగవంతుని ప్రార్థించుచున్నాడు-

"సఖేతి మత్వా ప్రసభం యదుక్తమ్
హే కృష్ణ! హే యాదవ! హే సఖేతి ।
అజానతా మహిమానం తవేదమ్
మయా ప్రమాదాత్ ప్రణయేన వాఽపి ॥ 41

యచ్చావహాసార్థమసత్కృతోఽసి[1]
విహారశయ్యాఽఽసనభోజనేషు ।

---

ప్రపంచమునందు అతి క్షుద్రము - అణుమాత్రమునైన వస్తువేదియు నెక్కడగూడ, నీవు లేని చోటుగాని, వస్తువుగాని లేదు. కనుకనే, అంతయు నీవే. వాస్తవముగా, నీకంటే వేరైనది ప్రపంచములో ఏ వస్తువులేదు. ఇదియే నా నిశ్చయము" అని తెలియజేసెను.

1. సాధారణముగా లోకమునందు ప్రేమ-పొరపాటు-వినోదము ఈ మూడు కారణములచేత మనుష్యుడితరులతో వ్యవహరించునప్పుడు, ఎవరియొక్క మానావమానములనుగూడ దృష్టిలో నుంచుకొనడు. ప్రేమలో నియమములు పాటింపబడవు. పొరపాట్లలో మరపు కలుగును. వినోదముగా మాట్లాడునపుడు యథార్థములు మాట్లాడుట కఠినమగును. పూజ్యులయొక్క అవమానములో ఈ మూడుగాని, లేక వేర్వేరుగా ఒక్కటొక్కటేగాని కారణములగును. ఈ మూడింటిలో ప్రేమ- ప్రమాదముల విషయమై యర్జునుడు పూర్వ శ్లోకములో చెప్పెను. ఇక్కడ 'అవహాసార్థం' అను పదముచేత మూడవ కారణమైన నవ్వులాట-పరిహాసమును గూర్చి అర్జునుడు చెప్పుచున్నాడు.

ఏకో౽థవా౽ప్యచ్యుత[1] తత్సమక్షమ్
తత్ క్షామయే త్వామహమప్రమేయమ్ ॥ 42

భగవన్ ! ఈ నీ ప్రభావ మెరుగక, నీవు నా సఖుడవని తలచి, ప్రేమ తోనో, లేక పొరపాటుచేతనో, నేను నిన్ను 'కృష్ణా! యాదవా! సఖుడా!' యని నోటికి వచ్చినట్లెల్ల ఏమాత్రము యోచించక, హఠాత్తుగా అంటిని. అచ్యుతా ! నిన్ను నేను వాహ్యాళి-శయ్యా-ఆసన-భోజనాదులలో ఒంటిగానున్న పుడుగాని, లేక మిత్రుల యెదుటగాని, అవమాన పరచితిని. ఆ యపరాధములన్నింటిని, అప్రమేయ స్వరూపుడవైన అనగా, అచింత్య ప్రభావముగల వాడవైన నీవు నన్ను క్షమింపుమని ప్రార్థించుచున్నాను.

"పితాసి లోకస్య చరాచరస్య
త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్ ।
న త్వత్సమో౽స్త్యభ్యధికః కుతో౽న్యో
లోకత్రయే౽ప్యప్రతిమ ప్రభావ ॥" 43

భగవన్! నీవే చరాచర ప్రపంచమునకు తండ్రివి. అందరకన్న పెద్ద గురువవు, పూజనీయుడవు.[2] అసమాన ప్రతిభా సంపన్నుడవు. మూడు లోకముల లోను నీ సమానుడు మరియొక్కడు లేడు. అనగా నీకన్న అధికుడెట్లుండును?

---

1. తన మహత్త్వం నుండి, స్వరూపంనుండియు నెప్పుడుగూడ పతనము చెందనివాడు 'అచ్యుతుడు' అనబడును. (శ్లో. 42)

2. ఇట్లు చెప్పుటచేత అర్జునుడు తన యపరాధములను క్షమింపుమని భగ వంతుని ప్రార్థించుటలో ఔచిత్యమును నిరూపించెను. అతడే మనుచున్నా డనగా, "భగవన్! ఈ సమస్త ప్రపంచము నీనుండియే జన్మించినది. కనుకనే నీవే దీనికి తండ్రివి. ప్రపంచములోనున్న పెద్దపెద్ద దేవతలు, మహర్షులు, సమర్థులైన అనేక మహాపురుషులందరిలో అందరికన్న పెద్ద బ్రహ్మదేవుడు. ఎందుకనగా, అందరికన్నను తొలుత ఆయనే యుత్ప త్తియే యగును. ఆయనయే నీ శాశ్వత జ్ఞానముద్వారా అందరికిన్ని, వారి వారి యోగ్యత ననుసరించి, జ్ఞానోపదేశము చేయును. కాని, ప్రభూ !

"తస్మాత్[1] ప్రణమ్య ప్రణిధాయ కాయమ్
ప్రసాదయే త్వామహ మీశమీడ్యమ్ ।
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్ ॥ 44

కనుకనే ప్రభూ ! నా శరీరమును పూర్తిగా నీ చరణములందు సమర్పించి ప్రణామముచేసి స్తుతింపబడుటకు యోగ్యుడవు. పరమేశ్వరుడవునైన నీవు ప్రసన్నుడవగుటకు ప్రార్థించుచున్నాను.[2] దేవా! తండ్రి పుత్రునియొక్క, మిత్రుడు

---

ఆ బ్రహ్మదేవుడుగూడ నీనుండియే ఉత్పన్నుడగును. ఆయనకు జ్ఞానము గూడ నీనుండియే లభించును. కనుకనే, సర్వేశ్వరా! అందరికన్న పెద్దవు, పెద్దలందరిలో పెద్దవు. అందరికిన్ని మహాగురుపవు నీవొక్కడవే కదా! సమస్త ప్రపంచము ఏ దేవతలను, మహర్షులను పూజించునో, ఆ దేవతలకును, మహర్షులకున్ను పరమపూజ్యులు, ఎల్లప్పటికిన్ని వందనీయులునైన బ్రహ్మాది దేవతలు-వశిష్ఠాది మహర్షులున్ను ఒక్క క్షణమాత్ర కాలము నిన్ను ప్రత్యక్షముగా పూజించుటకుగాని, స్తుతించుటకుగాని, సదవకాశము లభించిన యెడల తాము భాగ్యవంతులమని తలచెదరు. కనుకనే పూజనీయులందరికిన్ని నీవే పూజనీయుడవు. కనుక, క్షుద్రుడనైన నా యపరాధములను క్షమించుట నీకు సర్వవిధముల ఉచితమైనది.

1. ఇక్కడ 'తస్మాత్' అను పదమును ప్రయోగించి, అర్జునుడు 'భగవన్! నీవు ఇట్టి మహత్త్వ-ప్రభావములు గలవాడవు. కనుకనే దీనుడు-శరణాగతుడునైన నావంటి వానిపై దయదలచి నీవు ప్రసన్నుడవగుట నీ స్వభావమని నేను తలచెదను " అను నభిప్రాయమును తెలిపెను. (శ్లో 42)

2. అందరిని నియమించు ప్రభువు 'ఈశుడు' అనబడును. స్తుతింపబడుటకు యోగ్యుడైనవాడు 'ఈడ్యుడు' అనబడును. అర్జునుడు ఈ రెండు శబ్దములను ప్రయోగించి, "ప్రభూ! ఈ సమస్త ప్రపంచమును నియమించు ఇంద్ర-ఆదిత్య-వరుణ-కుబేర-యమాది లోక నియంతలైన దేవతలను గూడ నీయదుపునందుంచుకొనిన నీ వొక్కడవే మహేశ్వరుడవు. సమస్త ప్రపంచము సర్వదా నీ స్తుతి చేయుచున్నప్పటికిన్ని, నీగుణ గౌరవము

మిత్రునియొక్క, పతి పత్ని యొక్కయు అపరాధములను సహించినట్లే, నీవు గూడ నా యపరాధములను సహింపదగుదువు.[1]

సంబంధము :

ఇట్లు తన యపరాధములను క్షమింపుమని యర్జునుడు భగవంతుని ప్రార్థించి యిప్పుడు రెండు శ్లోకములలో భగవంతునియొక్క చతుర్భుజ రూప దర్శనము చేయింపుమని ప్రార్థించుచున్నాడు.

"అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే ।

---

లను మహత్త్వమునున్ను పూర్తిగా స్తుతింపజాలనంతగా నవి అతి విస్తారమైనవి. ఇందుచేత నీవే వాస్తవముగా స్తుతియోగ్యుడవు. నిన్ను స్తుతించి ప్రసన్నుని చేసికొనగలిగినంత జ్ఞానము- వాక్కులలో శక్తి నాకు లేదు. అజ్ఞానుడనైన నేను నీస్తుతి యెట్లు చేయగలను. నేను నీ ప్రభావమును ప్రకటించుటకు ఏదైన చెప్పినను, అది నీ ప్రభావముయొక్క నీడనుగూడ తాకజాలదు కాబట్టి ఆ నా స్తుతి నీ ప్రభావమును తగ్గించునదియేయగును. కనుక నేనైతే, ఈ నా శరీరమునొక కట్టెను వలె నీ చరణములపైన వేసి పొరలించి, నా సర్వావయవములచేత నీకు ప్రణామముచేసి నీ చరణ ధూళి యనుగ్రహము చేతనే, నిన్ను ప్రసన్నుని చేయగోరుచున్నాను. నీవు దయచేసి నా యపరాధములన్నియు మరచిపొమ్ము. దీనుడనైన నా యెడల ప్రసన్నుడవు కమ్ము." అను నభిప్రాయమును ప్రకటించెను.

1. ఇక్కడ అర్జునుడు, 'భగవన్! ఎట్లైతే అజ్ఞానముచేత, పొరపాటున చేసిన పుత్రుని యపరాధములను తండ్రి క్షమించునో; నవ్వులాటలో, పరిహాసములోను చేసిన మిత్రుని యపరాధములను మిత్రుడు సహించునో, ప్రేమచేత చేసిన ప్రియురాలి యపరాధములను ప్రియుడు క్షమించునో అట్లే, నేను పైన చెప్పబడిన మూడు కారణములచేత చేసిన యపరాధములను అన్నిటిని గూడ నీవు దయతో క్షమింపుము." అని ప్రార్థించెను.

తదేవ మే దర్శయ దేవ రూపమ్[1]
ప్రసీద దేవేశ ! జగన్నివాస ! ॥ 45

"దేవా! నేను పూర్వమెప్పుడుగూడ చూడని యీ నీ యాశ్చర్యకర రూపమును చూచి మిక్కిలి హర్షించుచున్నాను. నా మనస్సు భయముచేత అతి వ్యాకులముగా నున్నది[2]. కనుక ఇప్పుడు నీవు నీ చతుర్భుజ విష్ణురూపమునే నాకు చూపించుము. దేవేశా! ప్రసన్నుడవు కమ్ము.

"కిరీటినం గదినం చక్రహస్తమ్
ఇచ్ఛామి త్వాం ద్రష్టుమహం తథైవ ।
తేనైవ రూపేణ చతుర్భుజేన
సహస్ర బాహో! భవ విశ్వమూర్తే ॥[3] 46

---

1. దీనిచేత అర్జునుడు, 'దేవా! వైకుంఠమునందు నివసించు, నీ చతుర్భుజ విష్ణురూప దర్శనము నాకు చేయించుము. అను నభిప్రాయమును ప్రకటించెను. ఇక్కడ కేవలము "తత్" అను పదము మాత్రము ప్రయోగించుట చేతనైతే, 'భగవంతుని మనుష్యావతారమునే చూపింపుమని అర్జునుడు ప్రార్థించెను.' అను విషయము అంగీకరింపవచ్చును. కాని, ఆ రూపముతోపాటు 'దేవా' అను పదముగూడ ప్రయోగించుటచేత అది మనుష్యరూపము కన్న వేరైన దేవ సంబంధి రూపమును తెలుపుచున్నదని స్పష్టమగుచున్నది.

2. దీనిచేత అర్జునుడు, దేవా ! నీ యీ యలౌకిక రూపమునందలి నీ గుణ-ప్రభావ-ఐశ్వర్యములను చూచి విచారించుచున్నప్పుడు "ఆహా ! నేను మహా సౌభాగ్య సంపన్నుడనుగదా ! సాక్షాత్తు పరమేశ్వరునకు తుచ్ఛుడనైన నాపట్ల ఇంతగా అనంత దయ-అసమాన ప్రేమలు గలిగి నాకు, తన యలౌకిక రూపమును చూపించెను గదా! యని నాకు మహా సంతోషము కలుగును. కాని దీనితోపాటే, నీ భయంకరమూర్తిని నేను చూచినప్పుడు, నా మనస్సు భయముచేత కంపించును. అత్యంత వ్యాకులుడనయ్యెదను." అను నభిప్రాయమును ప్రకటించెను.

3. అర్జునునకు భగవంతుడు సహస్ర బాహువులు-విరాట్ స్వరూపము గల

భగవన్ ! కిరీటము ధరించి, గదా చక్రములను చేతులలో ధరించియున్న నీ రూపమును చూడగోరుచున్నాను.[1] కనుక విశ్వరూపా ! నీవు ఆ చతుర్భుజ రూపముతో కనపడుముII.

సంబంధము-

అర్జునుని ప్రార్థనపైన ఇప్పుడు, తరువాతి రెండు శ్లోకములలో భగవంతుడు తన విశ్వరూపముయొక్క మహిమను దుర్లభత్వమును వర్ణించుచు, నలువది తొమ్మిదవ శ్లోకములో అర్జునుని ఊరడించి, తన చతుర్భుజ రూపమును చూడుమని అర్జునునితో చెప్పుచున్నాడు.

---

వాడుగా నగుటకుగాను, సహస్ర బాహూ! విశ్వమూర్తి! అను పేర్లతో సంబోధించి భగవంతుని అర్జునుడు ప్రార్థించెను.

1. మహాభారత యుద్ధమునందు భగవంతుడు ఆయుధము పట్టనని ప్రతిజ్ఞ చేసి యుండెను. అర్జునుని రథముపైన భగవంతుడు చేతిలో చబుకు (చెర్నకోల) గుఱ్ఱముల కళ్ళెములు పట్టుకొనియుండెను. కాని, యిప్పుడు అర్జునుడు, భగవంతునియొక్క యీ ద్విభుజ రూపమును చూచుటకు ముందు చేతులలో గదా చక్రములు గల భగవంతునియొక్క ఆ చతుర్భుజ రూపమును చూడగోరుచున్నాడు.

II. 1) ఒకవేళ శ్రీకృష్ణుని స్వాభావిక రూపము చతుర్భుజములు కలిగి యుండినయెడల 'గదినం', 'చక్రహస్తం' అని చెప్పవలసిన యావశ్యకత ఏమియు నుండి యుండదు. ఎందుకనగా, అటువంటి రూపము అర్జునుడు సర్వదా చూచుచునేయుండెను. ఇదిగాక 'చతుర్భుజ' అని చెప్పుటగూడ నిష్ప్రయోజనమే అయియుండెను. అర్జునుడు 'నేను ఇప్పుడే కొంతకాలము ముందు చూచిన రూపమునే చూపింపుము అని మాత్రమే చెప్పి యుండినచో చాలియుండెడిది.

2) పూర్వ శ్లోకమునందు 'దేవరూపం' అనుపదము వాడబడియుండెను. ఆ పదమునకు ఈ తరువాత ఏబది యొకటవ శ్లోకములో చెప్పబడిన 'మానుషం రూపం' అను పదముకంటె పూర్తిగా విలక్షణమైన

అర్థము కలదు. దీనిచేతగూడ, దేవ రూపుడనగా శ్రీ మహావిష్ణువే యని చెప్పబడినదని సిద్ధమైనది.

3) ఈ తరువాత ఏబదవ శ్లోకములోనున్న 'స్వకం రూపం' అను పదముతో పాటు 'భూయః' అను పదమును, 'సౌమ్యవపుః' అను పదముతో 'పునః' అను పదమున్ను చేర్చుటచేతగూడ ఇక్కడ మొదట 'చతుర్భుజ' అని తరువాత 'ద్విభుజ' మానుషరూపమును చూపింపబడుట సిద్ధమగును.

4) ఈ తరువాతి యేబదిరెండవ శ్లోకములో "సుదుర్దర్శం" అనుపదము వాడి ఆ తరువాత, 'దేవతలుగూడ ఈ రూపమును చూచుటకు సర్వదా కాంక్షించెదరు' అనియు చెప్పి 'యీ రూపము అతి దుర్లభము అని తెలిపెను. ఒకవేళ శ్రీకృష్ణునకు చతుర్భుజ రూపము స్వాభావికమైన యెడల, అది మనుష్యులుగూడ చూచియుండెడివారు. మరి దేవతలు సర్వదా దానినెందుకు కాంక్షించెదరు ? ఒకవేళ విశ్వరూపము విషయములోనే యిట్లు చెప్పబడినచో, ఇటువంటి ఘోరమైన విశ్వరూపముయొక్క ఊహయే దేవతలకెందుకు కలుగును ? ఎందుకనగా, ఆ విశ్వరూపములోని కోరలలో భీష్మద్రోణాదులు ఇరుకుకొని నలిగి చూర్ణమగుచున్నారుగదా ! అట్టిరూపము దేవతలెందుకు కోరెదరు ? కనుకనే, దేవతా గణములు వైకుంఠవాసియైన శ్రీ మహావిష్ణువుయొక్క రూపమును దర్శించుటకే కాంక్షించెదరని స్పష్టమగుచున్నది.

5) విరాట్ స్వరూపముయొక్క మహిమ, ముందు నలువది యెనిమిదవ శ్లోకములో 'న వేద యజ్ఞాధ్యయనైః' ఇత్యాది ప్రయోగములచేత గానము చేయబడెను. పిదపగూడ ఏబదిమూడవ శ్లోకంలో 'నాహం వేదైర్న తపసా' ప్రయోగముల యందుగూడ ఆ విషయమే చెప్పబడెను. ఒకవేళ ఆ రెండుచోట్లగూడ ఒకే విరాట్ స్వరూపము యొక్క మహిమయే ఉన్నచో, అందులో పునరుక్తి దోషము కలుగును. దీనిచేతగూడ మానుషరూపము చూపించుటకు పూర్వము

శ్రీభగవానువాచ :

"మయా ప్రసన్నేన తవార్జునేదమ్
రూపం పరం దర్శితమాత్మయోగాత్ ।
తేజోమయం విశ్వమనంత మాద మ్
యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్॥" 47

భగవంతుడిట్లనెను:-

అర్జునా! నీయందు అనుగ్రహముచేత నేను నాయొక్క ప్రభావముచేత[1], పరమ తేజోమయము-అన్నిటికి మొదటిది అసీమమునైన యీ విరాట్ రూపమును నీకు చూపించినాను. దీనిని, నీవు దప్ప, ఇంతకుపూర్వ మెవరుగూడ చూచి

---

భగవంతుడు అర్జునునకు చతుర్భుజ దేవరూపము చూపించెను, దాని మహిమలోనే ఏబదిమూడవ శ్లోకముగూడ చెప్పబడెను. అను పునరుక్తి దోషము సిద్ధమగును.

6) ఈ యధ్యాయమునందే యిరువది నాల్గవ-ముప్పదవ శ్లోకములలో అర్జునుడు 'విష్ణో!' అను పదముచేత భగవంతుని సంబోధించెను. దీనిచేతగూడ అర్జునునకు విష్ణురూపము చూచుటకు ఇచ్ఛ యున్న దని తెలిసినది.

పైన చెప్పబడిన కారణములచేత ఇక్కడ అర్జునుడు శ్రీకృష్ణ భగవానునితో, చతుర్భుజ విష్ణురూపమును చూపుమని ప్రార్థించుచున్నాడు అను విషయము నిరూపింపబడినది.

1. దీనిచేత భగవంతుడు 'నా యీ విరాట్ రూపదర్శనము అన్ని వేళలలో, అందరకును లభించదు. నా యోగశక్తిచేత దీని దర్శనము నేను చేయించినప్పుడే యిది లభించును. అదిగూడ దివ్యదృష్టి గలవారికి మాత్రమే దొరకును గాని యితరులకు దొరకదు అందుకే, ఈ రూపదర్శనము లభించుట అతి సౌభాగ్యము అని తలచవలెను'అని తెలిపెను.

యుండలేదు[1].

"నవేద యజ్ఞాధ్యయ నైర్నదానైః
న చ క్రియాభిర్న తపోభిరుగ్రైః ।
ఏవం రూపః శక్య అహం నృలోకే[2]
ద్రష్టుం త్వదన్యేన కురు ప్రవీర॥" 48

"అర్జునా ! యిటువంటి విశ్వరూపము గల నన్ను, నీవు దప్ప, ఇతరులు వేదాధ్యయనము-యజ్ఞాధ్యయనాదులు-దానములు-ధర్మ క్రియలు - తపస్సులు

---

1. తల్లి యశోదకు తన ముఖమునందు, భీష్మాది వీరులకు కౌరవసభలోను ఈ విరాట్ రూపమునుచూపించి యుండినప్పటికిన్ని భగవంతుడా రెండు సమయములలో చూపిన విరాట్ రూపములో, ఇప్పుడు అర్జునునకు చూపిన విరాట్ రూపములోను చాలా భేదము కలదు. ఈ మూడు రూపముల వర్ణనము వేర్వేరుగానున్నది. భగవంతుడు అర్జునునకు చూపించిన విరాట్ రూపములో, భీష్మ ద్రోణాది వీరులు ప్రజ్వలించుచున్న విరాట్ రూప ముఖములో దూరుచున్నట్లు కనపడెను. ఇట్టి విరాట్ రూపమును భగవంతు డింతకుపూర్వ మెప్పుడుగూడ నెవరికిగూడ చూపించి యుండలేదు.

2. వేదా ధ్యయనము యజ్ఞాధ్యయనాదులు-దాన-తపస్సులు-ఇంకను ననేక విధ క్రియలు చేయుటకు అధికారము గల మనుష్యలోకము నందే యున్నది. మనుష్య శరీరమునందే, జీవులు వేర్వేరు విధములైన క్రొత్త క్రొత్త కర్మలుచేసి, వివిధములైన అధికారములను పొందగలరు. ఇతర లోకములన్నియు ప్రధానముగా భోగస్థానములేయగును. మనుష్యలోకము యొక్క ఈ మహత్త్వమునుగూర్చి చెప్పుటకే, యిక్కడ 'నృలోకే'యను పదము ప్రయోగింప బడినది ఇందలి యభిప్రాయమేమనగా, 'మనుష్య లోకములోగూడ, పైన చెప్పబడిన సాధనములద్వారా ఎవడైనను భగవం తుని యొక్క యీ విరాట్ రూపమును చూడజాలనప్పుడు, అనేకములైన యితర లోకములందు, ఏ సాధనములు చేయకుండ ఎవడుగూడ చూడ జాలడనుటలో చెప్పవలసినదేమున్నది?

మున్నగునవి చేసినవారుగూడ చూడజాలరు[1].

"మా తే వ్యథా మా చ విమూఢ భావో
దృష్ట్వా రూపం ఘోర మీదృఙ్మమేదమ్ ।
వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వమ్
తదేవ మే రూప మిదం ప్రపశ్య॥" 49

"అర్జునా! యీ విధముగా నున్న నా భయంకర రూపమునుచూచి, నీవు వ్యాకులుడవు కాకూడదు. మూర్ఖత్వము గలవాడవుగూడ కాకూడదు. నీవు భయ రహితుడవై, ప్రీతి యుక్తమైన మనస్సు గలవాడవై, శంఖ-చక్ర-గదా-పద్మ యుక్తమైన, ఆ నా చతుర్భుజ రూపమునే మరల చూడుము.

సంజయఉవాచ:

"ఇత్యర్జునం వాసుదేవ స్తథోక్త్వా
స్వకం రూపం దర్శయామాస భూయః ।
ఆశ్వాసయామాస చ భీతమేనమ్
భూత్వా పునః సౌమ్యవపుర్మహాత్మా॥" 50

---

1. వేదవేత్తయైన ఆచార్యునినుండి అంగోపాంగ సహితములైన వేదములను చదివి, వానిని బాగుగా తెలిసికొనుటయే 'వేదాధ్యయనము' అనబడును. యజ్ఞ క్రియలలో, నిపుణుడైన యాజ్ఞిక పురుషుని సన్నిధిలోఉండి, ఆయన నుండి యజ్ఞ విధులనుగూర్చి చదువుట, ఆయన అధ్యక్షతలోనే, విధి పూర్వకముగా చేయబడు యజ్ఞములను ప్రత్యక్షముగాచూచి, యజ్ఞ సంబంధులైన సమస్త క్రియలను బాగుగా తెలిసికొనుటయే, యజ్ఞాధ్యయ నము చేయుట'యనబడును.

ధన-సంపత్తి-అన్న-జల-విద్యా-గో-భూమ్యాదులైన స్వకీయ వస్తువులు ఇతరుల సుఖ-హితములకొరకు ప్రసన్న హృదయములతో యోగ్యతాను సారముగా నిచ్చుట 'దానము'అనబడును.

శ్రౌత-స్మార్త యజ్ఞాదులయనుష్ఠానము-తన వర్ణాశ్రమ ధర్మ పాలనము

చేయుటకొరకు చేయబడు సమస్త శాస్త్ర విహితకర్మలు 'క్రియలు' అనబడును.

చాంద్రాయణాది వ్రతములు (మూడు పగళ్ళు, తరువాత మూడు రాత్రులు మాత్రము భుజించి, తరువాత మూడు దినములు అయాచితముగ లభించిన వస్తువులు తిని, పిదప మూడు దినములు నిర్జలోపవాసము చేయుట. 'సాంతపన వ్రతము'అని యందురు. అదియే కృచ్ఛ్ర మనబడును. ఇక చాంద్రాయణ మనగా, తాను సాధారణముగా ప్రతిదినము తిను 32 అన్న కబళములలో, చంద్రుని క్షయ వృద్ధుల ప్రకారము శుక్లపాడ్యమినాడు అన్నపు ముద్ద యొకటి తిని ఈ విధముగానే, మొదటి దినపు ముద్ద ప్రమాణములోనే ఒక్కొక్కటిగా దినమునకు పెంచుచు, కృష్ణపక్షములో ఒక్కొక్క ముద్ద తగ్గించుచు అమావాస్యనాడు ఉపవాసము చేసియుండుట అని భావము.)

వేర్వేరు విధములైన కఠిన వ్రతములు - నియమములు పాలించుట, మనస్సును. ఇంద్రియములను వివేకముతో అణచియుంచుట ధర్మముకొరకు శారీరక మానసిక కఠిన క్లేశములను సహించుట, లేక, శాస్త్ర విధానము ప్రకారము చేయబడు నితర భిన్న భిన్న విధములైన తపస్సులు ఇవియే 'ఉగ్రతపస్సులు' అనబడును.

ఈ యన్ని సాధనములచేతగూడ, తన విరాట్ స్వరూప దర్శనము అసంభవమని తెలిపి భగవంతుడు, ఆ రూపముయొక్క గొప్పతనమును ప్రకటించుచు, ఇట్లు మహా ప్రయత్నములచేతగూడ లభించనట్టి ఆ రూప దర్శనము నా యనుగ్రహము చేత, కృపచేతను నీకు ప్రత్యక్షముగా లభించుచున్నది. ఇది నీ మహా సౌభాగ్యమని భావింపుము"అని చెప్పెను. ఇప్పుడు నీవు భయ దుఃఖ మోహములు చెందుట నీకు ఉచితముగాదు సుమా! అని కూడ అర్జునునకు చెప్పెను.

'స్వ్రంకంరూపం' అను దానికి తన రూపమని యర్థము విశ్వరూపముగూడ శ్రీకృష్ణభగవానుని రూపమేయగును. అదిగూడ ఆయన స్వీయమే. భగవంతుడు అందరి యెదుట కనబరచు మనుష్య రూపములో నున్న

సంజయుడిట్లనెను:—

ధృతరాష్ట్ర మహారాజా! వాసుదేవుడైన[1] భగవంతుడు, అర్జునునితో ఈ విధముగాచెప్పి తరువాత, తన చతుర్భుజ రూపమును చూపించెను. తరువాత శ్రీకృష్ణపరమాత్ముడు సౌమ్యస్వరూపము గలవాడై, భయపడియున్న అర్జునునకు

---

శ్రీకృష్ణుని రూపముగూడ ఆయనయొక్క స్వకీయ రూపమే యగును. కాని, యిక్కడ 'రూపం' అను దానికి 'స్వకం' అను విశేషణము ఇచ్చుటలో అభిప్రాయమేమనగా, "ఇక్కడ చెప్పబడిన రెండు రూపముల కన్న వేరైన మూడవరూపము అర్జునుడు చూచుటకొరకని తెలియవలెను. ఎందుకనగా, విశ్వరూపమైతే, అర్జునుని యెదుట ఉండనేయున్నది దానిని చూచి యతడు భయపడియున్నాడు. కనుకనే, ఆ విశ్వమును చూపించుట యనునదియే యిక్కడ అసంగతము. మనుష్య రూపమును భగవంతుడు చూపియే యున్నాడు కాబట్టి, అది చూపించినాడని చెప్పుట యనవసరము. ఎందుకనగా, విశ్వరూపము నుపసంహరించుకొనిన తర్వాత, భగవంతుని స్వాభావికమైన మనుష్యావతార రూపము, యథా తథముగా అర్జునుని యెదుట ఉండనేయున్నది. కనుక, దానిని చూపించుట యనునదిగూడ పొసగనే పొసగదు. దానిని అర్జునుడు స్వయముగానేచూచును. చూపవలసిన యవసరమేమున్నది? కనుకనే యిక్కడ 'స్వకం'అను విశేషణము 'దర్శయామాస'అను క్రియ ఈ రెండింటి ప్రయోగముచేత, "మనుష్య లీల కొరకు ప్రకటించి, అందరి యెదుట నున్న మనుష్యరూపముకన్న, తన యోగశక్తిచేత ప్రకటించి చూపించిన విశ్వరూపముకన్నను వేరైనది శాశ్వతముగా వైకుంఠమునందు ఉన్నదియునగు – భగవంతుని దివ్య చతుర్భుజ స్వరూపమేయగును. దానిని చూచుటకే అర్జునుడు ప్రార్థించెను. ఆ రూపమునే భగవంతుడు అర్జునునకు చూపించెను."అను నీ యభిప్రాయమే స్పష్టమగుచున్నది.

1. శ్రీకృష్ణ భగవానుడు వసుదేవపుత్రుని రూపములో నవతరించెను. అందరిలోను ఆత్మరూపుడై నివసించెను. ఆ కారణములచేత ఆయన పేరు 'వాసుదేవు'డనబడును. ఆ పదమునకు రెండర్థములు.

ధైర్యము కలిగించెను[1].

సంబంధము:—

ఈ విధముగా శ్రీకృష్ణ భగవానుడు తన విశ్వరూపమును ఉపసంహరించుకొని, చతుర్భుజ రూపదర్శనమిచ్చిన తరువాత, స్వాభావిక మనుష్యరూపము గలవాడై అర్జునుని ఊరడించినప్పుడు అర్జునుడు శాంతించి, ఆందోళన లేనివాడై భగవంతునితో నిట్లనుచున్నాడు:—

అర్జునఉవాచ :

"దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం[2] జనార్దన!
ఇదానీమస్మి సంవృత్తః సచేతాః ప్రకృతిం గతః॥" 51

అర్జునుడిట్లనెను:—

జనార్దనా! అతి శాంతమైన నీ యీ మనుష్య రూపమునుచూచి, యిప్పుడు నేను స్థిరచిత్తుడనైతిని. నా స్వాభావికస్థితిని పొందితిని[3].

---

1. ఎవని యాత్మ - అనగా, స్వరూపము పెద్దదో, అతడు 'మహాత్ముడు' అనబడును. శ్రీకృష్ణ భగవానుడు అందరికిన్ని ఆత్మ రూపుడు కనుక, ఆయన మహాత్ముడగును. ఇందలి యభిప్రాయ మేమనగా "అర్జునునకు తన చతుర్భుజ రూపమును చూపించిన తరువాత, మహాత్ముడైన శ్రీకృష్ణుడు సౌమ్యరూపమును - అనగా పరమ శాంతము, శ్యామ సుందరమునైన మనుష్యరూపము ధరించి, భయపడియున్న అర్జునునకు ధైర్యము కలిగించెను" అని తెలియవలెను.

2. భగవంతునకు ఉన్న మనుష్య రూపము అతి మధుర-సుందర శాంతముగ నుండెను. పూర్వ శ్లోకములలో చెప్పబడిన, భగవంతుడు సౌమ్యశరీరము గలవాడు అను మాటగూడ మనుష్యరూపమును సూచించుటకే యగును. ఈ విషయము స్పష్టపరచుటకై యిక్కడ 'రూపం' అను పదముతో 'సౌమ్యం' 'మానుషం'అను రెండు విశేషణములు ప్రయోగింపబడెను.

3. దీనిచేత అర్జునుడు 'నా మోహము-భయము-భ్రమము తొలగిపోయినవి.

సంబంధము:-

ఈ విధముగా అర్జునుని మాటవిని యిప్పుడు భగవంతుడు రెండు శ్లోకము లలో తన చతుర్భుజ దేవరూప దర్శనము దుర్లభమైనదని. దాని మహిమను వర్ణించు చున్నాడు:-

శ్రీ భగవానువాచ :

"సుదుర్దర్శమిదం రూపం దృష్టవానసి యన్మమ ।
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శన కాంక్షిణః॥" 52

భగవంతుడిట్లనెను:-

అర్జునా! నీవు చూచిన యీ నా చతుర్భుజరూపము చూచుటకు అసాధ్య మైనది సుమా-అనగా దీని దర్శనము చాలా దుర్లభము. దేవతలుగూడ ఈ రూపము చూచుటకు సర్వదా కోరుచుండెదరు.

---

ఇప్పుడు వాస్తవ పరిస్థితికి వచ్చినాను'-అనగా, భయ-వ్యాకులత్వ-కంపాదు లైన అనేక విధ వికారములు, నా మనస్సు-ఇంద్రియములు-శరీరము వీని యందు ఏర్పడియుండెను. అవి యన్నియు నిప్పుడు తొలగిపోవుటచేత, నేను పూర్వమువలె స్వస్థుడనైతిని' అని చెప్పెను.

1. 'సుదుర్దర్శం'అను విశేషణముచేత భగవంతుడు తన చతుర్భుజ దివ్యరూప దర్శనము దుర్లభమనియు దాని మహత్త్వమునున్ను తెలిపెను. 'ఇదం' అను పదము - సమీపమునందున్న వస్తువును నిర్దేశించునది యగుటచేత, దీనిచేత, విశ్వరూపము తరువాత, చూపించబడు చతుర్భుజ రూపము సూచింపబడెను. దీనిచేత భగవంతుడు, 'అర్జునా! నీ విప్పుడు దర్శించిన, నా చతుర్భుజ-మాయాతీత-దివ్య గుణ యుక్త-శాశ్వత రూపమును దర్శిం చుట మిక్కిలి దుర్లభమే యగునుసుమా! ఈ రూపముయొక్క దర్శనము, ఎవడైతే నాకు అనన్య భక్తుడో, యెవనియందు నా పరిపూర్ణ కృప విలసిల్లు చుండునో, అటువంటి వానికి మాత్రమే లభించగలదు" అను నభిప్రాయ మును తెలిపెను.

నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా ।
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా ॥ 53

అర్జునా ! నీవిప్పుడు నన్నుచూచిన విధముగా, నా చతుర్భుజ రూపమును వేదాధ్యయనము-తపస్సు-దానము-యజ్ఞములు చేసినవారుగూడ చూడజాలరు [1]

---

1. భగవద్గీత తొమ్మిదవ అధ్యాయము ఇరువది యేడవ-ఇరువది యెనిమిదవ శ్లోకములలో 'అర్జునా ! నీవు చేయు యజ్ఞ-దాన-తపస్సులన్నియు నాకు అర్పింపుము. ఇట్లు చేయుటచేత నీవు సర్వకర్మలనుండి విముక్తుడవయ్యెదవు. నన్ను పొందెదవు ' అని, భగవద్గీత పదియేడవ అధ్యాయము ఇరువది యైదవ శ్లోకములో 'మోక్షేచ్ఛ గల పురుషులచేత యజ్ఞ దాన-తపస్సులు అను కర్మలు ఫలేచ్ఛ రహితముగా చేయబడును. అనియు చెప్పబడెను. దీనివలన తెలియునభిప్రాయమేమనగా, యజ్ఞ దాన, తపస్సులు ముక్తికి, భగవత్ప్రాప్తికిన్ని తప్పక కారణములగును కాని, ఈ శ్లోకములో భగవంతుడు, నా చతుర్భుజ రూప దర్శనము వేదాధ్యయనాధ్యాపనముల చేతనే కలుగును గాని, యజ్ఞ-దాన-తపస్సులచేత కలుగజాలదు' అని చెప్పెను.

కాని, యిందులో విరోధమేమియులేదు. ఎందుకనగా, కర్మలను భగవంతునకు అర్పించుట అనన్య భక్తిలో ఒక యంగము. ఈ యధ్యాయము ఏబదియైదవ శ్లోకములో అనన్య భక్తినిగూర్చి వర్ణించుచు భగవంతుడు స్వయముగా 'మత్కర్మకృత్' (నాకొరకు కర్మలు చేయువాడు) అనుపదము ప్రయోగించెను ఏబది నాలుగవ శ్లోకములోగూడ 'అనన్య' భక్తి చేత నా యీ స్వరూపమును దర్శించుట- తెలిసికొనుట, పొందుట సంభవమగును. అని భగవంతుడు స్పష్టముగా ప్రకటించెను. కనుకనే యిక్కడ నిష్కామ భావముతో భగవంతునికొరకు భగవదర్పణ బుద్ధిచేత చేయబడు యజ్ఞ-దాన-తపస్సులు ఈ మొదలైనకర్మలు భక్తికే అంగములగుటచేత, ఇవి భగవత్ప్రాప్తికి హేతువులగును. సకామ భావముతో చేయబడు కర్మలు హేతువులుకావు' అని తెలిసికొనవలెను. ఇందులో అభిప్రాయమేమనగా, యజ్ఞాది కర్మలు భగవద్దర్శనము చేయిం

సంబంధము :

ఒకవేళ పైన చెప్పబడిన ఉపాయములచేత నీదర్శనము కాజాలనియెడల ఏ యుపాయముచేత అది సాధ్యమగును ? ఈ జిజ్ఞాస పైన భగవంతుడిట్లను చున్నాడు.

"భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప॥" 54

కాని, అర్జునా ! అనన్య భక్తిచేత ఇట్టి చతుర్భుజ రూపముగల నన్ను, ప్రత్యక్షముగా చూచుటకు[2] తాత్త్వికముగా తెలిసికొనుటకు, ప్రవేశించుటకు- అనగా, నాలో ఐక్యము చెందుటకున్ను సాధ్యపడును.

---

చుటకు స్వాభావికముగా సమర్థములుకావు. భగవద్దర్శనమైతేనో, ప్రేమ పూర్వకముగా భగవంతుని శరణుజొచ్చి నిష్కామభావముతో కర్మలు చేసినమీదట, అప్పుడు భగవత్కృపగలిగి దానిచేత భక్తునకు కలుగును.

2. భగవంతునియందే అనన్య ప్రేమ గలిగియుండుట- తన మనస్సు-ఇంద్రియములు-శరీరము- ధనము-జనము- ఈ మొదలైన సర్వస్వము భగవంతునివే యని భావించి, భగవంతునికొరకే, భగవత్సేవలో నిమగ్నము చేయుటయే 'అనన్యభక్తి' యనబడును. ఈ యనన్యభక్తియే భగవద్దర్శనాదులకు హేతువని చెప్పబడెను.

సాంఖ్యయోగముద్వారా గూడ నిర్గుణ పరబ్రహ్మప్రాప్తి చెప్పబడెను. అది సత్యమే ఐనప్పటికిన్ని, సాంఖ్యయోగముద్వారా సగుణ-సాకార భగవంతుని దివ్య చతుర్భుజ రూప దర్శనముగూడ జరుగవచ్చునని చెప్పగూడదు ఎందుకనగా, సాంఖ్యయోగముద్వారా, సాకారరూప దర్శనము ఇచ్చుటకు భగవంతుడు బాధ్యుడుకాడు. ఈ ప్రకరణముగూడ సగుణ భగవద్దర్శనమునకు సంబంధించినదే- కనుకనే యిక్కడ కేవలము అనన్య భక్తి మాత్రమే భగవద్దర్శనాదులందు హేతువని చెప్పుట ఉచితముగ నుండును.

సంబంధము :

అనన్య భక్తిచేత భగవంతుని చూచుట, తెలిసికొనుట, ఐక్యము చెందుట సులభమని చెప్పుటకు కారణమైన ఆ యనన్య భక్తియొక్క స్వరూపమును తెలిసికొనుటకు ఆకాంక్ష కలిగినమీదట, ఇప్పుడు అనన్యభక్తుని లక్షణమునుగూర్చి భగవంతుడు వర్ణించుచున్నాడు.

మత్కర్మ [1]కృన్మత్పరమో[2] మద్భక్తః[3] సంగ వర్జితః ।
నిర్వైర స్సర్వ భూతేషు యః స మామేతి పాండవ॥ 55

---

1. ఏ మనుష్యుడైతే ఆసక్తి-స్వార్థ-మమకారములను విడిచి, అంతయు భగవంతునిదే యని భావించి, తాను కేవలము నిమిత్త మాత్రుడనే యని తలచుచు యజ్ఞ-దాన-తపస్సులు, ఆహార-పానీయ వ్యవహారాదులైన సమస్త శాస్త్ర విహిత కర్తవ్య కర్మలు నిష్కామ భావముతో, భగవంతుని సంతోషము కొరకే, భగవదాజ్ఞానుసారముగా చేయునో, అతడు 'మత్కర్మ కృత్' అనగా భగవంతునికొరకు, భగవత్కర్మలు చేయువాడు అనబడును.

2. ఎవడైతే, భగవంతుడే పరమాశ్రయుడు- పరమగతి- ఆయన యొకడే సర్వోత్తముడు-సర్వాధారుడు-సర్వశక్తి సంపన్నుడు-సర్వులకు మిత్రుడు పరమాత్మీయుడు-తన సర్వస్వము' అని తలచునో, భగవంతుడు చేయు ప్రతియొక విధానమునందున్ను సర్వదా సంతుష్టుడైయుండునో, అతడు 'మత్పరమః' అనగా, భగవంతునియందు తత్పరుడు- ఆసక్తుడు అనబడును.

3. భగవంతునియందు అనన్యప్రేమ గలిగియుండుటచేత, ఎవడైతే, భగవంతునియందే తన్మయుడై, నిత్యము నిరంతరమున్ను భగవంతుని యొక్క నామ-రూప-గుణ-ప్రభావ లీలాదులయొక్క శ్రవణ-మనన-కీర్తనాదులను చేయునో, ఈ శ్రవణాదులు లేనిచో క్షణముగూడ శాంతి యెవనికి ఉండదో, ఎవడు భగవద్దర్శనము కొరకు మిక్కిలి యుత్కం

అర్జునా ! యే పురుషుడైతే కేవలము నా కొరకే సర్వ కర్తవ్యకర్మలు చేయునో, నాయెడల తత్పరుడై ఆసక్తితోనుండునో, నాకు భక్తుడో, ఫలాసక్తి రహితుడో,[1] సమస్త భూత ప్రాణులయందు వైరము లేకున్నవాడో[2]. అట్టి అనన్య భక్తిగల పురుషుడు నన్నే పొందగలడు.[3]

ఇతి శ్రీ మహాభారతే భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా పర్వణి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే విశ్వరూప దర్శనయోగో నామ ఏకాదశోఽధ్యాయః భీష్మపర్వణి పంచత్రింశోఽధ్యాయః

---

తతో ఆశించుచుండునో, అతడు 'మద్భక్తః' అనగా, భగవద్భక్తుడు అనబడును.

1. ఇహలోక- పరలోకములందున్న అనుభవించదగిన - శరీర-భార్యా-పుత్ర-గృహ- ధన- కుటుంబ- గౌరవ- మహత్త్వాది సమస్త జడ-చేతన-పదార్థములన్నింటియందుగూడ ఎవనికైతే, కొంచెముగూడ ఆసక్తి లేదో, యెవనికి భగవంతునియందు దప్ప మరి దేనియందుగూడ ప్రేమలేదో, అతడు 'సంగవర్జితః'- అనగా ఆసక్తి రహితుడు అనబడును.

2. సమస్త ప్రాణులు భగవత్స్వరూపులని తలచుటచేత, లేదా అన్నిటియందు భగవంతుడొక్కడే వ్యాపించియున్నాడు అని తలచుటచేతను, ఎవరు ఎంత విపరీతముగా వ్యవహరించినప్పటికిన్ని ఎవని మనస్సులో ఎలాంటి వికారము కలుగదో ఏ ప్రాణియందుగూడ కొంచెముగూడ ద్వేషముగాని, వైరభావముగాని, యెవనికి లేకుండునో, అతడు సర్వభూతేషు నిర్వైరః అనగా సమస్త ప్రాణులందు వైరభావము లేనివాడు అనబడును.

3. ఈ చెప్పబడిన దానిభావము పూర్వపు ఏబదినాలుగవ శ్లోకములో చెప్పబడిన దానిప్రకారము సగుణ భగవంతుని ప్రత్యక్ష దర్శనముచేయుట, ఆ భగవంతుని బాగుగా తాత్త్వికముగా తెలిసికొనుటయే 'ఆయనలో ప్రవేశించుట' యనబడును.

శ్రీమహాభారతమునందు, భీష్మపర్వమునందు శ్రీమద్భగవద్గీతా పర్వమునందు
శ్రీమద్భగవద్గీతోపనిషత్తులందు, బ్రహ్మవిద్యయందు, యోగశాస్త్రమునందు,
శ్రీకృష్ణార్జున సంవాదమునందు, విశ్వరూప దర్శనయోగ మనబడు
పదకొండవ అధ్యాయము సమాప్తము (11) భీష్మపర్వమునందు
ముప్పదియైదవ అధ్యాయము సమాప్తము.



1. దీని తరువాతి విషయము భగవద్గీత మొదటి అధ్యాయము చివర * ఈ గుర్తు పెట్టబడిన అధోజ్ఞాపికలో నున్నట్లు గ్రహింపవలెను.

# శ్రీ భగవద్గీతయందు పదునెండవ అధ్యాయము

(భీష్మపర్వమునందు 36 వ అధ్యాయము)

## భక్తియోగము :

సంబంధము :

భగవద్గీత రెండవ అధ్యాయమునుండి, ఆరవ అధ్యాయము వరకు భగవంతుడు అక్కడక్కడ నిర్గుణోపాసననుగూర్చి, సగుణ పరమేశ్వరోపాసనను గూర్చియు ప్రశంసించెను. ఏడవ అధ్యాయమునుండి పదకొండవ అధ్యాయము వరకు, విశేషించి సగుణ భగవంతుని ఉపాసన మహత్త్వమును తెలిపెను. దీనితో పాటే, ఐదవ అధ్యాయములో పదియేడవ శ్లోకమునుండి ఇరువది ఆరవ శ్లోకము వరకు, ఆరవ అధ్యాయములో ఇరువదినాల్గవ శ్లోకమునుండి ఇరువది తొమ్మిదవ శ్లోకమువరకు ఎనిమిదవ అధ్యాయములో పదకొండవ-పన్నెండవ-పదమూడవ శ్లోకములోనూ ఇదిగాక ఇంకనూ ఎన్నియోచోట్ల నిర్గుణ పరబ్రహ్మోపాసన మహత్త్వమునుగూర్చి కూడా తెలిపెను. చివరకు పదకొండవ అధ్యాయముయొక్క అంతమునందు సగుణ సాకార భగవంతుని అనన్యభక్తికి ఫలము భగవత్ప్రాప్తి యని తెలిపి "మత్కర్మకృత్" నుండి ఆరంభింపబడు ఆ చివరి శ్లోకమునందు సగుణ-సాకార స్వరూపుడైన భగవంతుని భక్తియొక్క అధిక్యమును గూర్చి చెప్పెను. దీనిపైన అర్జునుని మనస్సులో నిర్గుణ-నిరాకార బ్రహ్మోపాసనను, సగుణ-సాకార బ్రహ్మోపాసన చేయునట్టి ఉభయ విధోపాసకులలో, ఉత్తమోపాసకుడెవడు అన్న జిజ్ఞాస కలిగి అర్జునుడు భగవంతుని ఇట్లు ప్రశ్నించుచున్నాడు.

అర్జున ఉవాచ :

"ఏవం సతతయుక్తాయే భక్తాస్త్వాం పర్యుపాసతే"[1] ।

---

1. ఇక్కడ "త్వాం" అనుపదమునకు శ్రీకృష్ణభగవానుడని అర్థమైనప్పటి

యేచాప్యక్షరమవ్యక్తం[1] తేషాం కే యోగవిత్తమాః ॥ 1

అర్జునుడిట్లనెను :

శ్రీకృష్ణా ! అనన్యప్రేమగల యే భక్తజనులు పూర్వోక్తప్రకారముగా నిరంతరము నీ భజన-ధ్యానమందు నిమగ్నులై సగుణరూప పరమేశ్వరుడైన నిన్ను భజించెదరో, తదితరులెవరైతే, కేవలము అవినాశమైన సచ్చిదానంద ఘన నిరాకార బ్రహ్మనుమాత్రమే అతిశ్రేష్ఠభావముతో భజించెదరో, ఆ ఉభయ విధములైనట్టి ఉపాసనము చేయువారిలో అత్యుత్తమ యోగవేత్త ఎవరు ?

---

కిన్నీ, వేరువేరు అవతారములందు భగవంతుడు ఎన్ని సగుణరూపములను ధరించెనో, దివ్య వైకుంఠధామమునందు భగవంతునియొక్క యే సగుణ రూపము విరాజిల్లుచున్నదో, యే రూపమును లోకులు తమతమ పూజ్య భావ ప్రకారము అనేక నామరూపములతో వర్ణించుచు చెప్పెదరో, ఆ రూపములన్నియు 'ఇక్కడ' "త్వాం" అను పదమున కర్థమనియు అంగీకరించవలెను. ఎందుకనగా ఆ రూపములన్నియు శ్రీకృష్ణ భగవానుని కన్న భిన్నములుకావు. ఆ సగుణ భగవంతుని నిరంతరము చింతించుచు పరమశ్రద్ధా, ప్రేమపూర్వకముగా నిష్కామభావముతో సర్వేంద్రియములను ఆయనసేవలో లగ్నముచేయుటలో, నిరంతర భజన ధ్యానములందు నిమగ్నులైయుండి; ఉత్తమమైన భగవదుపాసన చేయుట యనబడును.

1. ఇక్కడ "అక్షరం" అను విశేషణంతోగూడిన "అవ్యక్తం" అను పదము నకు నిర్గుణ-నిరాకార-సచ్చిదానంద ఘన బ్రహ్మయని యర్థము. జీవాత్మనుగూడ, అక్షరము-అవ్యక్తమని చెప్పవచ్చును. అయినను అర్జునుని ప్రశ్నమునకు ఉపాసనీయమని అభిప్రాయముకాదు. ఎందుకనగా జీవాత్మో పాసకుడు సగుణ పరమేశ్వరోపాసనకన్న ఉత్తమమగుట అసంభవము. ఇదిగాక, పూర్వ ప్రసక్తిలో ఎక్కడగూడ జీవాత్మోపాసన విధానమును గూర్చి భగవంతుడు చెప్పలేదు.

**శ్రీ భగవానువాచ :**

"మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే ।
శ్రద్ధయా పరయోపేతాస్తే మే యుక్తతమా మతాః ॥" 2

భగవంతుడిట్లనెను :

అర్జునా ! నాయందు మనస్సు ఏకాగ్రముచేసి నిరంతరము నా భజన ధ్యానములందు నిమగ్నులైయున్న ఏ భక్తులు మిక్కిలి శ్రేష్ఠమైన శ్రద్ధ కలవారై సగుణరూప పరమేశ్వరుడనైన నన్ను భజించెదరో[2], వారు యోగులలో సత్త్యుత్తమయోగులు నాకు పూజ్యులు.

సంబంధము-

పూర్వశ్లోకమందు సగుణ-సాకార పరమేశ్వరోపాసకులు ఉత్తమయోగవేత్తలని భగవంతుడు చెప్పెను. దీనిపైన నిర్గుణ-నిరాకార బ్రహ్మోపాసకులు ఉత్తమ బ్రహ్మవేత్తలు కారా ? అను జిజ్ఞాస కలుగవచ్చును. దానిపైన భగవంతుడిట్లనుచున్నాడు.

---

1. భగవంతునియొక్క "సత్త" (అస్తిత్వం) యందు, ఆయన అవతారములందు, రూపములందు,శక్తియందు, గుణ-ప్రభావ-ఐశ్వర్య-ఇత్యాదులందు ప్రత్యక్షదర్శనముకన్న అధిక గౌరవ పూర్వకమైనది విశ్వాసము ఉండుటయే అతిశయ శ్రద్ధ అనబడును. భక్తప్రహ్లాదునివలె, అన్నివిధముల భగవంతునియందు తన భారము వైచియుండుటయే పైన చెప్పబడిన శ్రద్ధలోగూడిన వాడనబడును.

2. గోపికలవలె సమస్త కర్మములు చేయునప్పుడుగూడ, పరమప్రేమాస్పదుడు - సర్వశక్తి సంపన్నుడు-సర్వాంతర్యామి-సర్వ సద్గుణ సముద్రుడు అయిన భగవంతునియందు ఉండి మనస్సు తన్మయము చెంది ఆయనయొక్క గుణము గుణ-ప్రభావ స్వరూపములను సర్వదా ప్రేమ పూర్వకముగా ధ్యానించుచుండుటయే, మనస్సును ఏకాగ్రముచేసి నిరంతరము భగవద్ధ్యానమునందు ఉండి భగవంతుని భజించుట యనబడును.

"యేత్వక్షర మనిర్దేశ్య[1] మవ్యక్తం[2] పర్యుపాసతే ।
సర్వత్ర గమచింత్యంచ కూటస్థ మచలం[3] ధ్రువమ్[4] ॥ 3

---

యా దోహనేఽవహననే మథనోపలేప
ప్రేంఖేంఖనార్భ రుదితోక్షణ మార్జనాదౌ ।
గాయంతి చైన మనురక్తధియోఽశ్రుకంఠ్యో
ధన్యావ్రజస్త్రియ ఉరుక్రమచిత్తయానాః ॥

శ్రీమద్భాగవతము 10-44-15

ఏ గోపికలు గోవుల పాలు పిదుకునపుడు, ధాన్యాదులు దంచునపుడు, పెరుగు చిలుకునపుడు, ముంగిలి అలుకునపుడు, పిల్లలను తొట్లెలో ఊచునపుడు, ఏడ్చుచున్న పిల్లలను సమాధాన పరచునప్పుడు, ఇండ్లలో నీరు చల్లునపుడు, ఊడ్చుచున్నపుడు ఈ మొదలైన పనులు చేయుచున్నప్పుడు ప్రేమభరిత చిత్తముతో కన్నుల నీరునింపుకొని గద్గద వాక్కులతో శ్రీకృష్ణభగవానుని గానము చేయుచుందురో, ఈ విధముగా ఎల్లప్పుడు గూడ శ్రీకృష్ణునియందే మనస్సు లగ్నము చేసియుండు వ్రజవాసినులైన ఆ గోపికలు ధన్యులు గదా!

1. దేని నిర్దేశము చేయబడజాలదో, ఏ యుక్తితోగాని, ఉపాయముతోగాని, దేని స్వరూపముగూర్చి వర్ణించుటగాని, తెలుపుటగాని అసాధ్యమో అది "అనిర్దేశ్యము" అనబడును.

2. ఏది ఏ ఇంద్రియమునకుగూడ గోచరముకాదో, అనగా ఏది యింద్రియములచేత తెలిసికొనబడజాలదో దేనికి రూపముగాని, ఆకారముగాని లేదో అది "అవ్యక్త" మనబడును.

3. ఏది పూర్తిగా కదలక మెదలక యుండునో అది "అచలము" అనబడును

4. ఏది నిత్యమై నిశ్చితమైనదో, దేని అస్తిత్వము (దత్తా) నందు ఏవిధమైన సంశయము లేదో, దేని అభావమునెప్పుడుగూడ వుండదో, అది 'ధ్రువము' అనబడును.

సన్నియమ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః[1] ।
తే ప్రాప్నువంతి మామేవ సర్వభూత హితే రతాః ॥ 4

కాని అర్జునా! యే పురుషులైతే, ఇంద్రియములను వశపరచుకొని, మనస్సునకు బుద్ధికిని అవలనున్న సర్వవ్యాపి : వర్ణించుటకు వీలుగానివాడు- సర్వదా యేకవర్గమందున్నవాడు- నిత్యుడు - అచలుడు- నిరాకారుడు- అవినాశి- సచ్చిదానంద- ఘనుడగు బ్రహ్మను నిరంతరము ఏకీభావముతో (అభిన్నభావముతో) ధ్యానించుచుందురో. సమస్త భూతప్రాణుల హితమునందు అసక్తిగలవారై[2] అందరియందు సమానభావముగలిగి యోగులైన ఆ పురుషులు నన్నే పొందెదరు.[3] (3-4)

సంబంధము—

ఈ విధముగా. నిర్గుణోపాసనమును దాని ఫలమునుగూర్చి ప్రతిపాదించిన తరువాత, ఇప్పుడు భగవంతుడు, దేహాభిమానులు అవ్యక్తగతిని పొందుట కఠినమని తెలుపుచున్నాడు :

"క్లేశోఽధికతరస్తేషా మవ్యక్తాఽసక్త చేతసామ్ ।
అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే ॥ 5

అర్జునా! సచ్చిదానంద ఘనమైన ఆ నిరాకార బ్రహ్మయందు ఆసక్తిగల మనస్సుగల పురుషులు సాధనమునందు విశేషముగా పరిశ్రమ చేయవలసి

---

1. దీనిచేత పైన చెప్పబడిన విధముగా, నిర్గుణ-నిరాకార బ్రహ్మోపాసకులకు భేదబుద్ధి ఎక్కడకూడ వుండదు సమస్త విశ్వమునందు బ్రహ్మతప్ప వేరు సత్త లేనందుచేత వారికి అన్నిచోట్ల సమబుద్ధియే యుండును. అను అభిప్రాయము కనబరచెను.

2. అవివేకి తన హితమే కోరునట్లు ఆ నిర్గుణ బ్రహ్మోపాసకులకు సర్వప్రాణులందు, ఆత్మభావము ఉండుటచేత, వారు సమభావముతో అందరి హితమును కోరుచుందురు.

3. ఇట్లు చెప్పుటచేత భగవంతుడు తనకన్నా బ్రహ్మ అభిన్నము అని తెలు

యుండును.[1] ఎందుకనగా, దేహాభిమానముగలవాడు, అవ్యక్త విషయమైన గతిని కష్టముగానే పొందెదరు.[2]

---

పుచూ పైన చెప్పబడిన ఉపాసనకు ఫలితముగా ఏ నిర్గుణ బ్రహ్మప్రాప్తి కలుగునో, అది నా ప్రాప్తిగానే తలంచవలెను. ఎందుకనగా ! బ్రహ్మ నాకన్నా వేరేకాదు. నేను బ్రహ్మకన్నా వేరుకాను. అని చెప్పెను. "ఆ బ్రహ్మ నేనే" అను భావము భగవంతుడు భగవద్గీత పదునాల్గవ అధ్యాయము ఇరువది ఏడవ శ్లోకములో "బ్రహ్మణో హి ప్రతిష్ఠానం'' అనగా నేను బ్రహ్మకు ప్రతిష్ఠ (నిలుచుస్థానము) అను మాటచే తెలిపెను.

1. పూర్వశ్లోకమునందు వర్ణింపబడిన, నిర్గుణ-నిరాకార-సచ్చిదానంద ఘన బ్రహ్మయందు ఆసక్తచిత్తులైన నిర్గుణోపాసకులు ఎక్కువ పరిశ్రమ చేయ వలసి యుండునని చెప్పి భగవంతుడు, "నిర్గుణ బ్రహ్మతత్త్వము అతి గహనము" కనక ''పరిశుద్ధము-స్థిరము సూక్ష్మమునైన బుద్ధిగలిగి శరీర అభిమానము లేకున్నవారు మాత్రమే. ఆ నిర్గుణ బ్రహ్మను తెలుసుకొన జాలుదురు. సాధారణ మనుష్యులు తెలిసికొనజాలరు. కనుక, నిర్గుణ బ్రహ్మోపాసన సాధనారంభకాలమందు మిక్కిలి పరిశ్రమయగును. అని తెలిపెను.

2. పైన చెప్పబడిన మాటచేత భగవంతుడు, ఈ శ్లోకము పూర్వార్ధమునందు చెప్పబడిన పరిశ్రమకు కారణము తెలిపెను. ఇందలి అభిప్రాయమేమనగా దేహాభిమానము గలవాడు, నిర్గుణ బ్రహ్మతత్త్వమును తెలిసికొనుట చాలా కఠినము. కనుక శరీరాభిమానముగలవానికి అట్టి స్థితి అతి పరిశ్రమచేత ప్రాప్తించును.

కాని ఏమాటయైతే భగవద్గీత ఆరవ అధ్యాయము ఇరువది నాల్గవ శ్లోకము నుండి ఇరువది యేడవ శ్లోకమువరకు నిర్గుణ బ్రహ్మోపాసన ప్రకారమును తెలిపి, ఇరువది ఎనిమిదవ శ్లోకములో, ఆ ఉపాసనా ప్రకారము సాధనము చేయగా చేయగా సుఖముగా పరమాత్మ ప్రాప్తిరూపమైన అత్యంతానంద లాభము కలుగునని చెప్పబడెనో, ఆమాట ఎవని స్వరూపములో రజోగుణము తమోగుణము శాంతించినవో, యెవడు "బ్రహ్మభూతుడు''

"యేతు సర్వాణి కర్మాణి । మయి సంన్యస్య మత్పరాః ।
అనన్యేనైవ యోగేన । మాం ధ్యాయంత ఉపాసతే ॥" 6

కాని అర్జునా! ఎవరైతే నాయందే ఆసక్తిగలవారై[1] ఉన్న భక్తజనులు సర్వకర్మలు నాకు సమర్పించి[2] సగుణరూప పరమేశ్వరుడైన నన్నే అనన్య భక్తియోగముచేత, నిరంతరము ధ్యానించుచు భజించుచుందురో[3].

---

అయినాడో, అనగా-బ్రహ్మమునందు అభిన్నభావముతో స్థిరముగా నిలిచి యున్నాడో, అటువంటి పురుషునకు మాత్రమే ఆ పరమాత్మ ప్రాప్తిరూప మైన అత్యంతానంద లాభము కలుగును గాని, దేహాభిమానము గలవారికి అది లభించదు. అని తెలుపుటకే ఆ మాట చెప్పబడినది.

1. వివిధ దుఃఖములు ప్రాప్తించినప్పుడు కూడా భక్త ప్రహ్లాదునివలె భగవంతుని పైన భారము వేసి వికారరహితుడై ఉండుటకూడా ఆ దుఃఖములు భగవంతుడు ఇచ్చిన బహుమతులుగా భావించి అవి సుఖరూపములు అని తలచుట, భగవంతుడే పరమప్రేమ గలవాడో పరమగతి పరమమిత్రుడు అన్ని విధముల శరణు చెందుటకు యోగ్యుడు అని తలచినను తానే భగవదర్పణము చేయుటయే భగవంతుని యందు ఆసక్తి గలవాడై యుండుట అనబడును.

2. కర్మలు చేయుటలో తాను పరాధీనుడనని తలచి, భగవంతుని యాజ్ఞను సూచనను అనుసరించి అన్ని శాస్త్రోక్త కర్మలు చేయుచుండుట ఆ కర్మల యందు మమకారము ఆసక్తి లేకుండుట ఆ కర్మఫల సంబంధమే మాత్రము లేకుండుట "నేను కేవలం నిమిత్తమాత్రుడను. నాకు ఏ పని చేయుటకు కూడా శక్తిలేదు. భగవంతుడే తన యిచ్ఛానుసారముగా నా చేత బొమ్మవలె సర్వకర్మలు చేయించుచున్నాడు. అని ప్రతియొక్క పనిలోను ఇట్టి భావము ఉంచుటయే "సర్వకర్మలు భగవదర్పితములు చేయుట" అగును.

3. ఒక్క పరమేశ్వరుడు తప్ప నావాడు ఎవ్వడును లేడు- ఆయనయే నా సర్వస్వము. అని తలచి భగవంతునియెడల స్వార్థరహితముగా మిక్కిలి

"తేషామహం సముద్ధర్తా । మృత్యు సంసార సాగరాత్ ।
భవామి నచిరాత్ పార్థ। । మయ్యావేశిత చేతసామ్ ॥" 7

"అర్జునా! అట్టి నాయందు చిత్తము లగ్నముచేసిన, ప్రేమగల భక్తులను నేను శీఘ్రముగానే, మృత్యురూపమైన సంసార సముద్రమునుండి ఉద్ధరించెదను.'

సంబంధము :

ఈ విధముగా పూర్వ శ్లోకములలో నిర్గుణ బ్రహ్మోపాసనముకన్న సగుణ

---

శ్రద్ధాయుక్తమైన అనన్యప్రేమ చూపవలెను. ఆ ప్రేమలో స్వార్థము, స్వాభిమానము, ఇతరత్ర తొలగిపోవుట మొదలైనదోషములు ఉండకూడదు. అది పరిపూర్ణము. స్థిరమైనదిగా ఉండవలెను. ఆ ప్రేమలో ఏ కొంచెము భావముకూడా భగవంతుని కన్న ఇతర వస్తువునందు ఉంచకూడదు. ఆ ప్రేమ ఉండుటచేత కూడా భగవంతుని మరచుట ఒక్కక్షణం కూడా సహింపరానిదగును. అటువంటి అనన్యప్రేమ "అనన్య భక్తియోగము" అనబడును. అటువంటి భక్తియోగముచేత నిరంతరము భగవంతుని చింతించుచు ఆయనయొక్క గుణ, ప్రభావ-లీలలను వినుచు-కీర్తించుచు ఆయన నామోచ్చారణ జపాదులు చేయుచు ఉండవలెను. ఇదియే అనన్య భక్తియోగము చేత భగవంతుని నిరంతరము చింతించుచుండుట ఆయనను సేవించుట అనబడును.

1. ప్రపంచమునందు ఉన్నది అంతయు మృత్యుమయమే అగును. ప్రపంచములో జన్మించు వస్తువేది గూడ క్షణకాలమైనను మృత్యువును తప్పించుకొనజాలునది లేదు సముద్రములో అసంఖ్యాకములైన అలలు లేచుచుండునట్లే ఈ అపార సంసారసాగరమునందు అనవరతము జనన మరణ తరంగములు లేచుచుండును. సముద్రతరంగములు అయినను లెక్కపెట్టవచ్చును కాని, పరమేశ్వర ప్రాప్తి కలుగునప్పటివరకు భవిష్యత్తులో జీవుడు ఎన్నిసార్లు జన్మించి మరణించ వలసియుండునది లెక్కబెట్టుట సాధ్యము కాదు. కనుకనే ఇది "మృత్యురూప సంసారసాగరము" అనబడును.

బ్రహ్మోపాసనము సులభమని నిరూపించబడెను ఇందుచేత ఇప్పుడు భగవంతుడు అర్జునుని ఆవిధముగానే, మనస్సు-బుద్ధి లగ్నముచేసి సుగుణ బ్రహ్మోపాసనము చేయమని ఆజ్ఞాపించుచున్నాడు:-

"మయ్యేవ మన ఆధత్స్వ । మయిబుద్ధిం నివేశయ ।
నివసిష్యసి మయ్యేవ । అత ఊర్ధ్వం న సంశయః" ॥ 8

"అర్జునా! నాయందే మనస్సు లగ్నముచేయుము:. నాయందే బుద్ధిగూడ లగ్నముచేయుము ఆ తరువాత నీవు నాయందే నివసించగలవు.[1] ఇందులో కొంచెమైననూ సందేహము లేదు.

---

ఏ భక్తుడు మనస్సు బుద్ధి భగవంతుని యందు లగ్నముచేసి నిరంతరము భగవంతుని ఉపాసించునో అతనిని భగవంతుడు తత్క్షణమే జనన మరణ ములనుండి ఎల్లప్పటికి విముక్తునిచేసి ఇక్కడనే తన ప్రాప్తి కలిగించును. లేదా అతడు మరణించిన తరువాత అతనిని తన పరమధామమునకు తీసు కొని పోవును. అనగా ఎట్లైతే నావికుడు ఏపరినైన తన నావలో కూర్చొనబెట్టుకొని నదిని దాటించునో అట్లే భక్తిఅనే నౌకలోనున్న భక్తుని కొరకు భగవంతుడు స్వయముగా పడవ నడుపువాడై ఆ భక్తుని సమస్త ఆపదలనుండి చిక్కులనుండి దూరముచేసి అతిత్వరగా అతనిని భయంకర సంసార సాగరం యొక్క అవలి ఒడ్డును తన పరమధామ మును చేర్చును. ఇదియే భగవంతునిచే చెప్పబడిన తన భక్తుని మృత్యు రూపసంసారమునుండి దాటించుట యనబడును.

1. ఏ భగవంతుడైతే సమస్త చరాచర ప్రపంచమంతయు వ్యాపించియుండి. అందరి హృదయములోనుండి దయాళుత్వ సర్వజ్ఞత్వ- సుశీలత్వ సహృదయత్వాదులైన అనంత గుణములకు సముద్రుడో, ఆ పరమదివ్య ప్రేమమయ ఆనందమయ, సర్వశక్తి సంపన్న సర్వోత్తమ శరణాగతి యోగ్యుడైన పరమేశ్వరుని యొక్క గుణ-ప్రభావ-లీలా తత్త్వరహస్య ములను పూర్తిగా తెలిసికొని ఆయన యెడల నిశ్చయ జ్ఞానము సర్వదా అచంచలముగా నుంచుటయే బుద్ధిని భగవంతునియందు లగ్నముచేయుట యనబడును. ఇట్లు తనకు పరమప్రేమాస్పదుడు పురుషోత్తముడునైనభగ

"అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయిస్థిరమ్ ।
అభ్యాస యోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ ॥ 9

"అర్జునా! ఒకవేళ నీవు మనస్సును నాయందు నిశ్చలముగా స్థాపించుటకు సమర్థుడవు కాని యెడల అభ్యాస రూపయోగము చేత నన్ను పొందుటకు యిచ్ఛయింపుము.[1]

---

వంతునియందు తప్ప ఇతర సమస్త విషయములందు ఆసక్తిని విడిచి మనస్సు కేవలము ఆయనయందు మాత్రమే వుంచి తన్మయము చేయుట సర్వదా నిరంతరము పైన చెప్పబడిన విధముగా భగవంతుని చింతనము చేయుచుండుటయే మనస్సును భగవంతునియందు లగ్నము చేయుట యనబడును. ఇట్లు తన మనస్సును బుద్ధిని భగవంతునియందు లగ్నము చేసిన వారు శీఘ్రముగనే భగవంతుని పొందగలరు.

కాబట్టి భగవంతుని గుణ ప్రభావ-లీలా తత్త్వ-రహస్యములను తెలిసికొన్న మహాపురుషుల సంగం చేసి వారి గుణములను ఆచరణములను అనుకరించి సుఖములను సోమరితనమును ఏమరుపాటును విడిచి ఆ మహాపురుషులు చూపిన మార్గమును విశ్వాసపూర్వకముగా ఆసక్తితో అనుసరించవలెను.

1. భగవత్ప్రాప్తికి గాను అనేక యుక్తుల చేత చిత్తమును భగవంతునియందు నిలుపుటకు మాటిమాటికి చేయబడు ప్రయత్నము అభ్యాసయోగము అనబడును. కనుక భగవంతుని యొక్క నామ-రూప-గుణ లీలాదులలో దేనియందు సాధకునకు శ్రద్ధ ప్రేమయున్నవో, దానియందే కేవలము భగవత్ప్రాప్తి ఉద్దేశములోనే మాటిమాటికి మనస్సు మలచుటకు ప్రయత్నించుటయే అభ్యాసయోగము చేత భగవంతుని పొందుటకు ఇచ్ఛయించుట యగును.

భగవంతునియందు మనస్సు లగ్నము చేయుటకు సాధనములు శాస్త్రములలో అనేక విధములైనవి చూపబడినవి. వానిలో కొన్ని సాధనములను గూర్చి ఈ క్రింద చూపబడినది.

ఇవి సర్వ సాధారణముగా ఎక్కువ ఉపయోగపడును.

(అ) సూర్యునియెదుట కన్నులు మూసికొనినప్పుడు మనస్సునకు సర్వత్ర సమభావ రూపమైన ఒక ప్రకాశ పుంజము యేదైతే తోచునో, దాని కన్న వేయిరేట్లు అధికమైన ప్రకాశ సమూహము భగవత్స్వరూపములో కలదు అని నిశ్చయముచేసికొని పరమాత్మని యొక్క ఆ తేజోమయ జ్యోతి రూపమునందు చిత్తము లగ్నము చేయుటకు మాటిమాటికి ప్రయత్నము చేయుట.

(ఆ) ఏట్లైతే అగ్గిపుల్లలో అగ్ని వ్యాపించియున్నదో, అట్లే భగవంతుడు సర్వత్ర వ్యాపించియుండును అని తెలిసికొని యెక్కడెక్కడైతే, మనస్సుపోవునో అక్కడక్కడంతయు గుణ-ప్రభావ సహితుడు సర్వశక్తి సంపన్నుడు-పరమప్రేమాస్పదుడు నైన పరమేశ్వరుని స్వరూపమును మాటిమాటికిన్ని చింతించుచుండుట.

(ఇ) ఎక్కడెక్కడైతే మనస్సుపోవునో అక్కడక్కడనుండి దానిని తొలగించి భగవంతులైన శివ-విష్ణు-కృష్ణ-రామాదులలో తన యిష్ట దైవమైన యొక దేవుని మానసికముగా గాని, లేక లోహాదులతో నిర్మించబడిన మూర్తియందు గాని, చిత్రపటమునందు గాని, ఆ దేవుని నామ రూపమునందు గాని శ్రద్ధా ప్రేమలతో మాటిమాటికి తన మనస్సును లగ్నము చేయుటకు ప్రయత్నించుట.

(ఈ) భ్రమరముల ఝుంకార ధ్వని వంటి ఏకతార(వాద్యము)తో ఓంకార ధ్వని చేయుచు ఆ ధ్వనిలో పరమేశ్వరుని స్వరూపమును పలుసార్లు ధ్యానించుట.

(ఉ) స్వాభావికముగానే ఉచ్ఛ్వాస నిశ్వాసములతో పాటు భగవన్నామమును సర్వదా నిరంతరము జపించుటకు గాను ప్రయత్నము చేయుచుండుట.

(ఊ) భగవంతునియొక్క నామ-రూప-గుణ-చరిత్ర-ప్రభావ రహస్యములను తెలిసికొనుటకుగాను వానిని తెలుపు శాస్త్రములను మాటిమాటికి అభ్యసించుట.

"అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ।
మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధిమవాప్స్యసి॥" 10

"అర్జునా! నీకొక వేళ పైన చెప్పబడిన అభ్యాసమునందు గూడ అసమర్థుడవైన యెడల, కేవలము నా కొరకు మాత్రమే కర్మలు చేయుటకు ఆసక్తుడవు కమ్ము.[2] ఈ విధముగా నాకొరకు కర్మలు చేయుటకు గూడ నా ప్రాప్తి

---

(ఋ) భగవద్గీత నాలుగవ అధ్యాయము ఇరువది తొమ్మిదవ శ్లోకములో చెప్పబడిన ప్రకారము ప్రాణాయామము అభ్యసించుట.

పైన చెప్పబడిన సాధనములలోనే ఏదైన నొక సాధనమును శ్రద్ధా విశ్వాస-ఆసక్తులతో చేసిన యెడల క్రమముగా అన్ని పాపములు విఘ్నములు నశించి చివరకు భగవత్ప్రాప్తి కలుగును. కనుకనే శీఘ్రముగా ఫలము లభించనప్పుడు అది కఠినమని తలచి నిరుత్సాహపడి సోమరితనముతో అభ్యాసము చేయుట విడువకూడదు. అభ్యాసములో లోపము రానీయగూడదు. విశేషించి దానిని పెంచుచుండవలెను.

1. ఈ శ్లోకమునందు చెప్పబడిన 'మత్కర్మ' అను పదముచేత, కేవలము భగవంతుని కొరకే చేయబడినవి గాని భగవంతుని పూజలకు సంబంధించి గాని ఆ కర్మలని భావించవలెను. ఆ కర్మలతో తన స్వార్థము ఏ మాత్రము నుండదు. వానితో మమకారాసక్తుల సంబంధము గూడ యుండదు. భగవద్గీత పదకొండవ అధ్యాయము చివరి శ్లోకములోగూడ 'మత్కర్మకృత్' అను పదము నందలి 'మత్కర్మ' అను శబ్దము గూడ దీని అభ్యాసమును వివరించును.

ఒక భగవంతుడు మాత్రమే తనకు పరమాశ్రయుడు-పరమగతి అని తలచుట, భగవంతుని సంతోషము కొరకు మాత్రమే. పరమశ్రద్ధతో అనన్యప్రేమతో మనో-వాక్ శరీరములచేత-భగవత్సేవా పూజలు యజ్ఞ-దాన-తపశ్చర్యాదులైన శాస్త్రవిహిత కర్మలు తన కర్తవ్యములని తలచి నిరంతరము చేయుచుండుటయే కర్మతత్పరుడగుట యనబడును.

రూపమైన సిద్ధినే పొందెదవు.[1]

"అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః।
సర్వకర్మ ఫలత్యాగం తతః కురు యతాత్మవాన్॥"[2] 11

---

1. దీనిచేత భగవంతుడు ఇట్లు కర్మలు చేయుట గూడ, నన్ను పొందుట కొక సులభ-స్వతంత్ర సాధనము అని తెలిపెను.

భజనము-ధ్యానము అను సాధనములు చేయువారికి నా ప్రాప్తి కలుగు నట్లే, నాకొరకు కర్మలు చేయువారుగూడ నన్ను చేరగలరు కనుకనే, నాకొరకు కర్మలు చేయుట పూర్వోక్త సాధనముల కన్న తక్కువ శ్రేణికి చెందినది ఏ మాత్రము కాదు.

2. ఈ అధ్యాయము తొమ్మిదవ శ్లోకములో అభ్యాసయోగము తెలుప బడెను. భంవంతునియందు మనోబుద్ధులు లగ్నములు చేయుటకు అనువైన సాధనము లన్నియు అభ్యాసయోగమున అంతర్గతములైయుండును. ఈ కారణముచేత అక్కడ యతాత్ముడగుటకు గాను వేరుగా చెప్పవలసిన ఆవశ్యకత లేదు. పదవ శ్లోకములో భక్తి యుక్తమైన కర్మయోగము వర్ణింపబడినది. దానిలో భగవంతుని ఆశ్రయము కలదు. సాధకుని సమస్త కర్మలు గూడ భగవద్భక్తియే యగును. కనుకనే, దానితోగూడ "యతాత్మవంతు" డగుటకు వేరుగా చెప్పుట ప్రయోజనము కాదు కాని, ఈ శ్లోకములో తెలుపబడిన "సర్వ కర్మ ఫల త్యాగరూప కర్మయోగ సాధనము నందు మనోబుద్ధులు వశమునందుంచుకొనకుండ వనిసాగదు. ఎందుకనగా వర్ణాశ్రమోచితములైన సమస్త వ్యవహార కర్మలుచేయుచు నొకవేళ మనోబుద్ధీంద్రియ శరీరాదులు వశములో లేకున్నయెడల, వాని సుఖానుభవమందు మమకారాసక్తి కామానలు కలుగుట మిక్కిలి సహజము. ఇట్లు సంభవించిన మీదట 'సర్వకర్మఫల త్యాగరూప సాధనము జరగదు.

ఇందుచేతనే యిక్కడ "యతాత్మవాన్" అనుపదమును ప్రయోగించి, మనో బుద్ధ్యాదులను వశములో నుంచుకొనుటకుగాను సాధకుడు మిక్కిలి జాగ్రత్త పరచబడినాడు.

"అర్జునా! ఒకవేళ నా ప్రాప్తి రూపమైన యోగమును ఆశ్రయించినవాడై పైన చెప్పబడిన సాధనములను చేయుటలో గూడ నీవు అసమర్థుడవైన యెడల మనోబుద్ధ్యాదులను జయించినవాడవై సర్వకర్మల ఫలము త్యజించుము.[1]

---

1. యజ్ఞ-దాన-తపస్-సేవలు వర్ణాశ్రమానుసారమైన జీవనము. శరీర నిర్వహణము కొరకు చేయబడు శాస్త్ర సమ్మతములైన సర్వకర్మలు ఇవి యన్నియు అర్హత ప్రకారము చేయుచు ఇహలోకపరలోకములందు సుఖప్రాప్తిరూపమైన ఫలమునందు మమకారాసక్తి కామనలను పూర్తిగా విడుచుటయే సర్వకర్మల ఫలమును విడుచుట యనబడును.

ఈ యధ్యాయము ఆరవ శ్లోకములో చెప్పబడినట్లు సర్వకర్మలు భగవంతునకు అర్పించుట, పదవ శ్లోకములో చెప్పబడినట్లు భగవంతుని కొరకు భగవత్కర్మలు చేయుట. ఈ శ్లోకములో చెప్పబడినట్లు సర్వ కర్మ ఫలత్యాగము చేయుట, ఈ మూడు కర్మయోగమనబడును.

ఈ మూడింటి ఫలము పరమేశ్వర ప్రాప్తియే యగును. కనుకనే ఫలములో ఏ విధమైన భేదము లేదు. కేవలము సాధకుల ప్రకృతి-భావన-వారి సాధన ప్రణాళిక వీని భేదముచేత ఆ మూడింటి భేదము గూడ చేయబడినది. సర్వకర్మలు భగవంతునకు అర్పించుట భగవంతునికొరకు సర్వ కర్మలు చేయుట ఈ రెండింటిలో నైతే భక్తికి ప్రాధాన్యము గలదు. సర్వకర్మఫలత్యాగము నందు కేవలము ఫలత్యాగమునకు ప్రాధాన్యము గలదు. ఇదియే వీనిలో ముఖ్యమైన భేదమని తెలియవలెను.

సర్వకర్మలు భగవంతునకు అర్పించువాడు నేను భగవంతుని చేతిలో ఆటబొమ్మను, నాకు ఏ పని చేయుటకు గూడ సామర్థ్యము లేదు. నా మనో బుద్ధీంద్రియాదులన్నియు భగవంతునివే యగును. వీని చేత భగవంతుడే తన యిచ్ఛానుసారము పనులు చేయించును. ఆ కర్మలతోవాని ఫలములోను నాకు ఏలాటి సంబంధము గూడా లేదు, అని తలచును. ఇట్టి భావముచేత ఆ సాధకునకు కర్మలలో గాని, తత్ఫలమునందు గాని కొంచెము గూడ రాగద్వేషములు ఉండవు. అతనికి సుఖదుఃఖములు ప్రారబ్ధానుసారముగా లభించినచో, వాని నన్నింటిని అతడు భగవదను

గ్రహమని భావించి సర్వదా ప్రసన్నుడై యుండును. కనుకనే అతనికి అన్నిటియందున్ను సమభావము గలిగి త్వరగానే భగవత్ప్రాప్తి సిద్ధించ గలదు.

భగవదర్థము కర్మలు చేయు మనుష్యుడు పూర్వోక్తసాధకునివలె నేనే మియు చేయను. భగవంతుడే నా చేత అన్నియు చేయించుకొనును అని తలచడు. అతడు 'భగవంతుడు నాకు పరమపూజ్యుడు. పరమప్రేమా స్పదుడు పరమమిత్రుడు. ఆయన సేవచేయుట ఆయన యాజ్ఞపాలించు నా పరమకర్తవ్యము' అని తలచును. కనుకనే భగవంతుడు సమస్త ప్రపంచమునందు వ్యాపించినాడని అతడు తలచి ఆయన సేవచేయు నుద్దేశముతో శాస్త్రోక్తమైన ఆయన యాజ్ఞ ననుసరించి యజ్ఞ-దాన-తప స్సులు. వర్ణాశ్రమానుకూలమైన జీవనము శరీర నిర్వాహణ కర్మలు భగవత్పూజా సేవాదికర్మలు వీనియందు నిమగ్నుడైయుండును. అతడు చేయు ప్రతియొక క్రియగూడ, భగవదాజ్ఞానుసారముగా భగవంతుని సేవించు నుద్దేశముతోనే చేయబడును. (గీత-11.55) కాబట్టి ఆ సర్వ కర్మలందు తత్ఫలమునందు అతనికి ఆసక్తి కామానలు లేకుండ త్వరగా భగవత్ప్రాప్తియగును.

కేవలము సర్వ కర్మఫల త్యాగముచేయు పురుషుడు నాచేత భగవంతుడు కర్మలు చేయించును అని తలంచడు సరికదా నేను భగవంతునికొరకు సర్వకర్మలు చేసెదను. అని కూడ తలచడు. అతడు కర్మలు చేయుట యందే మనుష్యునకు అధికారము కలదుగాని, వాని ఫలమునందు లేదు. (గీత 2.42 నుండి 51 కొంకు) కనుక ఏ ఫలము గూడ కోరకుండా, యజ్ఞ-దాన-తపస్ సేవలు వర్ణాశ్రమమే నా కర్తవ్యము? అని భావించును. కనుకనే అతడు సర్వకర్మ ఫలరూపములైన ఇహ-పరలోకములందలి సుఖభోగములందు మమకారాసక్తి కామనలు పూర్తిగా త్యజించును దీని చేత అతనికి రాగద్వేషములు పూర్తిగా నశించి త్వరగానే పరమాత్మ ప్రాప్తి కలుగును.

ఇట్లు పై మూడు సాధనముల లోనూ భగవత్ప్రాప్తిరూప ఫలము ఒకటే యైనను సాధకులయొక్క పూజ్య, స్వభావ సాధన ప్రణాళులలో భేదము ఉండుటచేత మూడు సాధనములు వేర్వేరుగా చూపింపబడినది.

ఇక్కడ "అసత్య-కపట-వ్యభిచార-చౌర్య హింసాదులైన నిషిద్ధకర్మలు సర్వకర్మ శబ్దములోచేరలేదు. సుఖభోగములందు ఆసక్తి కామనలుండుట చేత అవి చేయవలసి వచ్చును కాబట్టి ఆ పాపకర్మలు చేయబడును. వాని కారణముచేత మనుష్యునకు సర్వవిధ పతనమున్ను కలుగును. ఈ కారణ చేతనే ఆ పాప కర్మలు పూర్తిగా విడువవలెనని చెప్పబడినది. అట్టి కర్మలే పూర్తిగా నిషేధింపబడినపుడు వాని ఫలత్యాగమును గూర్చి చెప్పవలసిన దేమున్నది అను విషయము స్మరణమునందు ఉంచుకొన కొనవలెను.

తనయందు మనోబుద్ధులు లగ్నము చేయవలెనని భగవంతుడు మొదట చెప్పెను. తరువాత అభ్యాసయోగము తెలిపెను. ఆ పిదప నా కొరకు కర్మలు చేయుమని చెప్పెను. చివరకు సర్వకర్మ ఫలత్యాగము చేయ మని యాజ్ఞ యిచ్చెను. ఈ కర్మలలో ఒకటి చేయుటకు అసమర్థుడైన ప్పుడు రెండవ కర్మచేయుమని చెప్పెను. భగవంతుడు ఫలభేద దృష్టితో నిట్లు చెప్పలేదు. ఎందుకనగా అన్నిటికన్న భగవత్ప్రాప్తి యొక్కటియే ఫలము కలదనియే కాని, ఒకదానికంటే రెండవది సులభమని తెలుపు టకు గాదు. ఎందుకనగా పైన చెప్పబడిన సాధనములు ఒకటికన్న మరియొకటి ఉత్తరోత్తరము సులభముగాదు. ఒకదానికి సులభమైన సాధనము. మరియొక దానికి కఠినము కావచ్చును. ఈ వివరణము చేత "ఈ నాలుగు సాధనముల వర్ణనము కేవలము అధికారి భేదముచేతనే చేయబడెను అని తెలియుచున్నది.

ఏ పురుషునకు సగుణ భగవంతుని ప్రేమ ప్రధానమో ఎవనికి భగ వంతుని యెడల స్వాభావికమైన శ్రద్ధ గలదో ఎవనికి భగవంతుని గుణ ప్రభావ రహస్య విషయములు. అయన లీలావర్ణనమున్ను స్వాభావికముగా గానే ప్రియములో అట్టి పురుషునికొరకు ఈ యధ్యాయము ఎనిమిదవ శ్లోకములో చెప్పబడిన సాధనము సుగమము ప్రయోజనకరమగును.

సంబంధము—

ఆరవ-ఏడవ-ఎనిమిదవ శ్లోకములలో ఫలసహితమైన అనన్య ధ్యానమును గూర్చి వర్ణించి తొమ్మిదవ పదకొండవ శ్లోకములలో, ఒక సాధనము చేయుటకు సమర్థుడైనప్పుడు రెండవ సాధనము చేయుటకు అసమర్థుడైనప్పుడు రెండవ సాధనము చేయుము అని తెలిపి చివరకు సర్వ కర్మ ఫల త్యాగ రూపసాధనము వర్ణింపబడెను. దీనిచేత కర్మ ఫల త్యాగ ఫల సాధనము పూర్వోక్త సాధనముల కన్న తక్కువ తరగతికి చెందినది అను శంక కలుగవచ్చును. ఆ శంకా నివారణార్థమై కర్మ ఫలత్యాగము యొక్క మహత్త్వము ఈ తరువాత శ్లోకములో తెలుపబడుచున్నది.

---

ఏ పురుషునకు భగవంతుని యందు స్వాభావిక ప్రేమలేదో, ఐనను, శ్రద్ధయుండుటచేత ఎవడైతే మొండి పట్టుదలతో సాధనము చేసి, భగవంతుని యందు మనస్సు లగ్నము చేయగోరునో, అట్టి స్వభావముగల పురుషునకు ఆ యధ్యాయము తొమ్మిదవ శ్లోకములో తెలుపబడిన సాధనము సుగమము-ఉపయోగకరమగును.

ఏ పురుషునకు సగుణ పరమేశ్వరుని యందు శ్రద్ధగలదో, యెవనికి యజ్ఞము-దానము తపస్సు మొదలైన కర్మయందు స్వాభావికమైన ప్రేమకలదో, ఎవనికి భగవంతునియొక్క ప్రతిమాదులకు సేవలు పూజలు చేయుటయందు శ్రద్ధయున్నదో అటువంటి పురుషునికొరకు ఈ యధ్యాయము పదవ శ్లోకములో చెప్పబడిన సాధనము సులభము-ఉపయోగకరమునగును.

ఏ పురుషునకు సగుణ.సాకార భగవంతునియందు స్వాభావిక ప్రేమ శ్రద్ధలు లేవో, ఎవడైతే ఈశ్వరుని స్వరూపము కేవలము సర్వవ్యాపి నిరాకారమునని తలచునో ఎవనికి వ్యావహారికములు లోకహితకరములు నైన కర్మలు చేయుటయందు మాత్రమే స్వాభావికమైన ప్రేమగలదో, అటువంటి పురుషుని కొరకు ఈ పదకొండవ శ్లోకమునందు తెలుపబడిన సాధనము సుగమము. ఉపయోగకరమునగును.

"శ్రేయో హి జ్ఞానమభ్యాసాద్ జ్ఞానాద్ ధ్యానం విశిష్యతే।
ధ్యానాత్ కర్మఫల త్యాగస్త్యాగా చ్ఛాంతిర నంతరమ్॥" 12

"అర్జునా! కర్మమును తెలిసికొనకుండ చేయబడు అభ్యాసమున కన్న జ్ఞానము శ్రేష్ఠమైనది.[1] జ్ఞానముకన్న పరమేశ్వరుడనైన నా స్వరూప ధ్యానము

---

1. ఇక్కడ 'అభ్యాస' శబ్దమునకు ఈ అధ్యాయము తొమ్మిదవ శ్లోకమునందే తెలుపబడిన అభ్యాసయోగములోని అభ్యాసము మాత్రము అర్థము. అనగా, సకామ భావముచేత ప్రాణాయామ మనోనిగ్రహ, స్తోత్ర పాఠ, వేదాధ్యయన భగవన్నామాదుల కొరకు మాటి మాటికి చేయబడు ఈ ప్రయత్నముల పేరు "అభ్యాసము" అనబడును. దానియందు వివేక జ్ఞానము, ధ్యానము, కర్మఫల త్యాగములేవు. ఇందులో అభిప్రాయమేమనగా, ఏ యోగము అనగా, నిష్కామభావముయొక్క, వివేకజ్ఞానముయొక్కయు ఫలము భగవత్ప్రాప్తియందలి యిచ్చునో, ఆ యోగ మిక్కడలేదుఎందుకనగా, ఈరెంటిలో అంతర్గతములైయున్న అభ్యాసముతో జ్ఞానముయొక్క పోలిక చెప్పుటయే, కాని దానికన్న అభ్యాసరహిత జ్ఞానము శ్రేష్ఠమని తెలుపుటకు వీలుపడదు.

ఈ విధముగనే, యెక్కడ "జ్ఞాన" శబ్దమునకుగూడ సత్సంగము-శాస్త్రము వలన గలిగిన వివేక జ్ఞానము అర్థమగును. అజ్ఞానముచేత, మనుష్యుడు, ఆత్మ-పరమాత్మలో స్వరూపమును, భగవంతునియొక్క గుణ, ప్రభావ-లీలాదులను తెలిసికొనగలడు. సంసారము, సుఖ భోగములు అనిత్యములు అను మొదలైన ఇతర ఆధ్యాత్మిక విషయములనుగూడ తెలిసికొనగలడు. అభ్యాసము-ధ్యానము-కర్మఫలేచ్ఛాత్యాగము, ఇవి యన్నియు దేనిలో నంతర్భూతములో అట్టి జ్ఞానములో, అభ్యాస-ధ్యానములను, కర్మఫల త్యాగమును పోల్చి వివేచనచేయబడినది. దానికన్న ధ్యానము-కర్మఫల త్యాగము శ్రేష్ఠములని చెప్పుట సరిగాదు.

పైన చెప్పబడిన అభ్యాస-జ్ఞానములు రెండే. వేర్వేరుగా భగవత్ప్రాప్తికి సహాయకములు. ఈ రెండింటికి గల శ్రద్ధా-భక్తి నిష్కామ భావ సంబంధము చేత ఈ రెంటిచేతనే మనుష్యుడు పరమాత్మను పొందగలుగును.

అయినను, ఈ రెండింటిని పోల్చిచూచినప్పుడు అభ్యాసముకన్న జ్ఞానమే శ్రేష్ఠమని సిద్ధించును. అభ్యాస హీనమైన వివేక జ్ఞానము భగవత్ప్రాప్తికి ఎంత సహాయకమగునో, అంత సహాయకము, వివేక హీనమైన అభ్యాసము కాజాలదు. ఎందుకనగా, అభ్యాసము భగవత్ప్రాప్తియొక్క ఇచ్ఛిక కారణమగును. ఈ విషయమును తెలుపుటకే యక్కడ అభ్యాసముకన్న జ్ఞానము శ్రేష్ఠమని భగవంతుడు చెప్పెను.

2. 3. ఇక్కడ "ధ్యాన" శబ్దమునకుగూడ, అరవ, ఏడవ, ఎనిమిదవ శ్లోకములలో తెలుపబడిన ధ్యానయోగములోని "ధ్యానము" మాత్రము అర్థమగును. అనగా, భగవంతుని సాకార, నిరాకార స్వరూపములలో నేదోయొక స్వరూపము ఉపాస్య దైవమనితలచి, దానియందు, సకామ భావముతో కేవలం మనోబుద్ధులను మాత్రము స్థిరముగా నిలిపియుంచుటకు ఇక్కడ "ధ్యానము"అని చెప్పబడెను. ఇందులో పూర్వోక్తమైన వివేక జ్ఞానము, సుఖ భోగముల కామనము త్యజించుటయను నిష్కామ భావమున్నులేదు. ఇందులో అభిప్రాయమేమనగా, ఆ ధ్యానయోగములో - సర్వకర్మలు భగవంతునకు సమర్పించుట, భగవంతుడే పరమ ప్రాప్యుడని తలచుట, అనన్య ప్రేమతో భగవంతుని ధ్యానించుట, ఈ భావములన్నియు చేరి యున్నవి. కాని, అవియధ్యానములోలేవు. ఎందుకనగా, భగవంతుడు సర్వ శ్రేష్ఠుడని తలచి అనన్య ప్రేమపూర్వక నిష్కామ భావముచేత, చేయబడు ధ్యానయోగమునందు, వివేక జ్ఞాన-కర్మఫలములయొక్క త్యాగముగలదు. కనుక, దానితో వివేక జ్ఞానమును పోల్చుట. దానికన్న కర్మఫలత్యాగము శ్రేష్ఠమని చెప్పుటగూడ సరికాదు.

పైన చెప్పబడిన వివేక జ్ఞాన-ధ్యానములు రెండే శ్రద్ధా, ప్రేమ, నిష్కామ భావముల సంబంధముచేత పరమాత్మప్రాప్తి కలిగించును. కనుక ఈ రెండే పరమాత్మ ప్రాప్తికి సహాయకములుకాని, ఈ రెంటిని పోల్చి చూచినప్పుడు, ధ్యానాభ్యాస రహిత జ్ఞానముకన్న వివేక రహిత ధ్యానమే శ్రేష్ఠమని సిద్ధించును. ఎందుకనగా, వివేక జ్ఞాన రహితమైన కేవల

ఎందుకనగా త్యాగము చేత తక్షణమే శాంతి కలుగును.[1]

సంబంధము:-

పై శ్లోకములందు భగవత్ప్రాప్తి కొరకు వేర్వేరు సాధనములు తెలిపి వాని ఫలము పరమేశ్వర ప్రాప్తియనియు తెలుపబడెను. కనుకనే భగవత్ప్రాప్తి సిద్ధించిన సిద్ధపురుషులైన భక్తుల లక్షణము తెలిసికొనుటకు ఇచ్ఛ కలిగిన మీదట ఇప్పుడు ఏడు శ్లోకములలో భగవంతుని పొందిన భక్తుల లక్షణము తెలుపబడుచున్నది.

"అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ।
నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖఃక్షమీ ॥" 13

---

ధ్యానము భగవత్ప్రాప్తికిగాను ఎంతతోడ్పడునో, అంతగా, ధ్యానాభ్యాసములు లేని వివేక జ్ఞానమొక్కటియే సహాయకము కాజాలదు. ధ్యానముచేత చిత్తము స్థిరమైనప్పుడు చిత్తముయొక్క మాలిన్యము చంచలత్వమున్ను నశించిపోవును. కాని, కేవలము జ్ఞానముచేత అట్లుకాదు. ఈ భావము తెలుపుటకే భగవంతుడు జ్ఞానముకన్న ధ్యానము శ్రేష్ఠమని చెప్పెను.

పదకొండవ శ్లోకమునందు 'సర్వకర్మల త్యాగస్వరూపము చెప్పబడెను. కర్మఫల త్యాగము, అను మాటకు అర్థము పైన తెలుపబడిన ధ్యానముగూడ, పరమాత్మప్రాప్తికి సహాయకము కాని, మనుష్యునియొక్క కామన ఆసక్తి ఈ రెండు నశించనంతవరకు, అతనికి పరమాత్మప్రాప్తి సహజముగానేకాదు. కాబట్టి, ధ్యానములేకుండగూడ సమస్త కర్మముల ఫలమును ఆసక్తిని విడుచుట పరమాత్మప్రాప్తికి ఎంతలాభప్రదమో, అంతలాభము ఫలాసక్తి త్యాగములేకుండ కేవల ధ్యానమువలన కలుగదు.

1. ఈ శ్లోకమునందు 'అభ్యాస', జ్ఞాన-ధ్యాన, కర్మ - యోగముల పరస్పర తారతమ్య వివేచనము చేయబడలేదు. ఎందుకనగా, ఈ సాధనము లన్నింటియందున్ను కర్మ ఫలరూప సుఖాసక్తిని విడుచుట యనెడు విశిష్టమభావము అంతర్గతమై యున్నది. కనుక, వానియొక్క తుల

"సంతుష్టః సతతం యోగీ యతాఽఽత్మా దృఢ నిశ్చయః।
మయ్యర్పిత మనోబుద్ధిర్యో మద్భక్తః స మేప్రియః॥ 14

"అర్జునా! యే పురుషుడైతే సర్వభూతములందు ద్వేషభావము లేనివాడై స్వార్థరహితుడై అందరియెడల ప్రేమగలవాడై నిర్హేతుక దయగలవాడై [1] అహంకార-మమకార రహితుడై సుఖదుఃఖ ప్రాప్తియందు సమభావము గలవాడై [2]

---

నాత్మక వివేచనము చేయుటకు వీలుపడదు. ఇక్కడనైతే. కర్మఫల త్యాగముయొక్క మహత్త్వమును తెలుపుటకు "అభ్యాస" జ్ఞాన, ధ్యాన రూప సాధనములు శ్రేష్ఠములని చెప్పబడినవి. అవి ప్రాపంచిక వ్యవహారముల నుండి చిక్కులనుండి దూరముగా వేరైపోయిచేయబడును. క్రియా దృష్టితో చూచినచో అవి ఒకదానికన్న వేరొకటి అత్యధిక సాత్వికము, నివృత్తిపరము నగుటచేత క్రయముగా శ్రేష్ఠము అని తలచబడుచున్నది. దానికన్నను కర్మఫలత్యాగము భావప్రధానముగాబట్టి శ్రేష్ఠముగా చెప్పబడినది. ఇందలి యభిప్రాయమేమనగా, ఆధ్యాత్మికోన్నతికి క్రియకంటే భావమునకే అధిక మహత్త్వముగలదు వర్ణాశ్రమముల ప్రకారము యజ్ఞ, దాన, యుద్ధ, వాణిజ్య-సేవాదులు. శరీర నిర్వాహకర్మలు, ప్రాణాయామ, స్తోత్రపాఠ, వేదపాఠ, నామజపాదులైనవి అభ్యాసక్రియలు.

1. భక్త సాధకునిలో మొదటినుండియే మైత్రీ-దయాభావములు విశిష్టముగా నుండును గనుక, సిద్ధి చెందిన దశలోగూడ, అతని స్వభావములో, వ్యవహారములోను అవి సహజముగా కనబడును. భగవంతునిలో నిర్హేతుకములైన అపార దయా ప్రేమలుండునట్లే సిద్ధి పొందిన భగవద్భక్తులలో గూడ ఆ గుణములుండుట ఉచితము.

2. ఇక్కడ సుఖదుఃఖములకు, హర్ష, శోక హేతువులని యర్థము. ఎందుకనగా, సుఖదుఃఖములనుండి ఉత్పన్నములగు వికారములు హర్ష శోకములనబడును. అజ్ఞానులకు సుఖమునందు ఆసక్తికలుగును కనుక సుఖప్రాప్తియందు వారికి హర్షము దుఃఖమునందు ద్వేషముకలుగును. కనుక వారికి దుఃఖ సంకటములు కలిగినప్పుడు శోకము కలుగును.

ఓర్పుగలవాడై[1] అనగా అపరాధము చేసినవారికి గూడ అభయమిచ్చువాడై, ఏ యోగి నిరంతరము సంతుష్టుడై ఉండునో,[2] ఇంద్రియములను మనస్సును శరీరమును వశములో నుంచుకొనినవాడై[3] నాయందు దృఢ నిశ్చయము గల

---

కాని, జ్ఞానవంతులైన భక్తులకు సుఖ దుఃఖమునందు సమభావముండుట చేత ఎట్టి దశలోనూ వారి యంతః కరణములందు హర్ష శోకములను పూర్తిగా త్యజించెదరు. అని యర్థము. పూర్వజన్మ కర్మలను అనుసరించి, కలుగు సుఖ భోగములు, దుఃఖములు కలిగినప్పుడు, శరీర రోగాదులు కలిగినప్పుడు, బాధారూప దుఃఖ జ్ఞానము కలుగును, శరీరము ఆరోగ్యముతో నున్నపుడు, బాధయుండదు కాని, రాగ ద్వేషముల యభావము కారణముగా, అతనికి హర్ష శోకములుండవు. అట్లే, ఏదైన అనుకూల పదార్థ లాభముగాని, సంఘటనముగాని కలిగినప్పుడు హర్షము ప్రతికూలములు కలిగినప్పుడు దుఃఖముగాని ఏవిధమైనది కలుగదు. ఇదియే జ్ఞానికి గల సుఖ దుఃఖ సమభావమని తెలిసికొనవలెను.

1. తనకు అపకారము చేసినవానికి ఏవిధమైన దండనము ఇవ్వగోరక, అతనికి అభయమిచ్చువాడు "క్షమావంతుడు" అనబడును. జ్ఞానులైన భగవద్భక్తులకు క్షమాగుణము అనంతముగానుండును. క్షమయొక్క వ్యాఖ్య గీత పదవ అధ్యాయము నాలుగవ శ్లోకము టిప్పణిలో బాగుగా నున్నది.

2. భక్తి యోగముద్వారా, భగవంతుని పొందిన జ్ఞానులైన భగవద్భక్తులు ఇక్కడ యోగులు అనబడుదురు. అటువంటి భక్తులు పరమానందమునకు అక్షయము, అనంతమునైన గనిగానున్న భగవంతుని, ప్రత్యక్షము చేసికొనెదరు. కనుక వారు సర్వదా సంతుష్టులయియుందురు. అట్టి వారికి ఏసమయమందుగాని, ఏదశలోకాని, యెట్టి సంఘటనము కలిగినప్పుడుగాని, ప్రపంచమునందలి, ఏవస్తువుగూడ లభించినప్పుడుగాని అసంతుష్టి కలుగదు. ఎందుకనగా, వారు పూర్ణకాములు. 'ఇదియే'వారు నిరంతరము సంతుష్టులై యుండుట యగును.

3. దీనిచేత 'జ్ఞానులైన భగవద్భక్తుల మనస్సు ఇంద్రియములు, శరీరము

వాడై యుండునో[1] నాయందు మనోబుద్ధులు అర్పించిన ఆ పురుషుడు[2] నాకు భక్తుడు. నాకు ప్రియుడు అని తెలిసికొనుము[3].

"యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః ।
హర్షామర్ష భయోద్వేగై[1] ర్ముక్తో యఃస చ మే ప్రియః"॥ 15

---

సర్వదా వారి వశములోనుండును. వారెప్పుడుగూడ, ఇంద్రియ మనస్సుల వశములోనుండరు. కనుకనే, వారికి ఏవిధమైన దుర్గుణ దురాచారములు సంభవించునని ఊహించుటకుగూడ వీలుపడదు'. అని భగవంతుడు చెప్పెను.

1. ఎవడు తన బుద్ధిలో పరమేశ్వరుని స్వరూపముయొక్క నిశ్చయ జ్ఞానము కలిగియున్నాడో, యెవనికి అంతటను భగవంతునియొక్క ప్రత్యక్షానుభవము కలుగునో, ఎవనియొక్క బుద్ధి, గుణ, కర్మ దుఃఖాదులు కారణముగా పరమాత్మ స్వరూపమునుండి చలించక యుండునో, అతడు 'దృఢ నిశ్చయము గలవాడు"అనబడును.

2. సర్వదా నిరంతరము, మనస్సుచేత భగవత్స్వరూప చింతనము, బుద్ధిచేత భగవత్స్వరూప నిశ్చయము చేయుటచేత, మనస్సు, బుద్ధి భగవత్స్వరూపమునందు తన్మయములు అగుటయే, మనోబుద్ధులను భగవంతుని యందు అర్పించుట యనబడును.

3. ఎవడు పైన చెప్పబడిన లక్షణములు గలవాడో, ఎవనికి భగవంతుని యందు నిష్కారణమైన అనన్య ప్రేమగలదో, ఎవడు భగవత్స్వరూపమునందు అచంచలముగా నిలిచియున్నాడో. ఎవనికి భగవంతునినుండి యెడబాటు ఎప్పుడుగూడ గలుగదో, ఎవనియొక్క మనోబుద్ధులు భగవంతునకు అర్పింపబడియున్నవో, ఎవనికైతే జీవన, ధన ప్రాణ సర్వస్వములు గూడ భగవంతుడేయగునో. ఎవడు భగవంతుని యిచ్ఛానుసారముగా, భగవంతునిచేత ఆడింపబడు బొమ్మగానున్నడో, అటువంటి సిద్ధిపొందిన భక్తుడు తనకు ప్రియుడని భగవంతుడు చెప్పెను.

4. ఈ శ్లోకము పూర్వార్ధమునందు, ఇతర ప్రాణులనుండి భక్తునకు దుఃఖము

"అర్జునా' యే పురుషునివలన ఏ జీవునకుగూడ భయము కలుగదో[1] ఎవనికి "హర్షము[2], అయర్థము (క్రోధము) భయము, ఉద్వేగము (ఉబలాట) ఇత్యాదులు ఉండవో[3], ఆ భక్తుడు నాకు ప్రియుడు.

---

కలుగదు అని మాత్రమే చెప్పబడెను. దీనిచేత ఇతరులయిచ్ఛచేత కలిగింప బడిన దుఃఖమైతే నివర్తింపబడెను. కాని అనిచ్ఛచేతగాని, స్వేచ్ఛగాగాని కలిగిన సంఘటనముచేత లభించినవస్తువు వలనగూడ మనుష్యునకు ఉద్వే గము కలుగునుగనుక, ఉత్తరార్ధములో, భక్తునకు ఎప్పుడుగూడ, ఏ విధమైన ఉద్వేగముగూడ కలుగదని భక్తుడు సంపూర్ణముగా ఉద్వేగ విముక్తుడని మరల భగవంతుడు నిరూపించెను.

1. భక్తునకు అంతటను భగవద్బుద్ధి యుండుటచేత, అతడు తెలిసి తెలిసి, యెవరికిగూడ 'దుఃఖ, సంతాప, భయ, క్షోభములను, కలిగించనే కలి గించ జాలడు, మీదు మిక్కిలి, అతడు సహజముగానే, అందరికి సేవ చేయును. హితమునుగూర్చును. కనుకనే అతనివైపునుండి యెవరికిగూడ ఎప్పుడుగూడ దుఃఖము కలుగగూడదు ఒకవేళ పొరపాటుచేత ఎవరికైన ఉద్వేగము గలిగినయెడల దానికి ఆ వ్యక్తియొక్క అజ్ఞాన జనిత రాగ, ద్వేష ఈర్ష్యాది దోషములే కారణములుగాని, భగవద్భక్తుడుకాదు. ఎందు కనగా, ఎవడైతే, దయా, ప్రేమమూర్తియో యెవని స్వభావము ఇతరు లకు హితముచేయుటయందే ప్రవర్తిల్లుచుండునో పరమదయాళువు. ప్రేమా స్పదుడు భగవంతుని పొందినవాడునైన భక్తుడు. ఎవరికైనను, ఉద్వేగ కారణము, కానే కాజాలడు.

2. జ్ఞానియైన భక్తునకుగూడ పూర్వజన్మ కర్మప్రకారముగాని, ఇతరుల యిచ్ఛ చేతగాని, దుఃఖ కారణములు కలుగవచ్చును. కాని, అతనికి పూర్తిగా రాగ ద్వేషములు లేనందుచేత, ఎంతగొప్ప మహా దుఃఖములు ప్రాప్తించి నను, ఆ భక్తుడు చలించడు (గీత 6 12) కనుకనే జ్ఞానియైన భక్తునకు ఏ ప్రాణినుండియు దుఃఖము కలుగదు.

3. ఇందలి యభిప్రాయమేమనగా, వాస్తమున, మనుష్యుడు అతడు కోరిన గౌరవము, గొప్పదనము, ధనాదులు లభించినప్పుడు ఎట్లు హర్షించునో,

"అనపేక్షః శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః ।
సర్వారంభ పరిత్యాగీ యో మద్భక్తః స మే ప్రియః॥" 16

అర్జునా! యే పురుషుడు దేనియందుగూడ కాంక్ష లేనివాడై[1], అంతరంగములో, బయటగూడ పరిశుద్ధుడై[2], చతురుడై, పక్షపాత రహితుడై, దుఃఖము

---

అట్లే: తన సమానులకుగాని, తనకన్న అధికులకుగాని, ఆ గౌరవాదులు లభించినప్పుడుగూడ, దానినిచూచి సంతోషం కలుగవలెను. కాని, తరచుగా, ఇట్లుకాదు. అజ్ఞానము కారణముగా, లోకులకు, దానికి వ్యతిరేకముగా, ఇతరుల గౌరవాదులనుచూచి, అసూయ ఓర్పులేనితనము క్రోధము అమర్షము కలుగును. ఈ అమర్షాదులు వివేకుల మనస్సులోగూడ కలుగుట చూచుచున్నాము. అట్లే ఇచ్ఛా, నీతి ధర్మములకు విరుద్ధములైన వస్తువులు ప్రాప్తించినప్పుడు దుఃఖము, నీతిధర్మములకు అనుకూలములైన వస్తువులైనప్పటికిన్ని, అవి తనకు దుఃఖ ప్రదములైనప్పుడుగాని, అవి దుఃఖము కలిగించునవి యను సంశయము కలిగినప్పుడుగాని, మనుష్యునకు భయము కలుగుట చూచుచున్నాము. మృత్యువువలన భయము వివేకవంతులకుగూడ కలుగుచుండగా, ఇతరులమాట చెప్పవలసినదేమున్నది. కాని, జ్ఞానియైన భగవద్భక్తునకు అంతటను భగవద్బుద్ధియగును. అతడు సమస్త కర్మలు భగవల్లీలుగా తలచును. ఇందుచేత, జ్ఞానియైన భక్తునకు అమర్షము భయమున్ను కలుగవు, ఈ యభిప్రాయము తెలుపుటకే యట్లు చెప్పబడెను.

1. పరమాత్మప్రాప్తి కలిగిన భక్తునకు, ఏవస్తువునందున్ను, కొంచెముగూడ ప్రయోజనముండదు. కనుకనే, అతనికి ఏమియైన యిచ్ఛ స్పృహ, వాసన కొంచెముగూడనుండవు. అతడు పూర్ణకాముడు. ఈ యభిప్రాయము తెలుపుటకే ఆ భక్తునకు కాంక్షలు ఏమాత్రము నుండవని చెప్పబడెను.

2. భగవద్భక్తునకు అత్యంతమైన పవిత్రత్వము ఉండును. అతని యొక్క బుద్ధింద్రియములు, ఆచరణము, శరీరాదులుగూడ, ఎంత పవిత్రములగువనగా, ఇతరులు, అతని దర్శన స్పర్శమాత్రముచేతనే, పవిత్రులగుదురనగా, అతనితో మాట్లాడుటవలన గలుగు పవిత్రతనుగూర్చి చెప్ప

నుండి విముక్తుడై[1] యుండునో, సర్వప్రయత్నములనుగూడ త్యజించిన ఆ పురుషుడు[2] నాకు ప్రియుడు.

"యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి ।
శుభా శుభ పరిత్యాగీ భక్తిమాన్ యః స మే ప్రియః॥" 17

"అర్జునా!" యెవడైతే, యెప్పుడుగూడ హర్షముచెందడో[3], ఎవరినిగూడ

---

వలసినదే మున్నది? ఇటువంటి భక్తుడెక్కడ నుండునో, ఆ స్థానము పవిత్రమగును. అతని సంబంధముచేత అక్కడ వాతావరణము జలము స్థలమూ పవిత్రములగును.

ఏ యుద్దేశ సాఫల్యమునకు మనుష్య శరీరము లభించినవో, ఆ యుద్దేశ పూర్తిచేసికొనుటయే యథార్థమైన చాతుర్య మనబడును.

1. శరీరములో రోగములు గలుగుట, భార్యా పుత్రాదుల వియోగము గలుగుట, ధన, గృహాదులకు హానిగలుగుట, ఇత్యాదులు దుఃఖకారణములు ప్రారబ్ధ కర్మముచే కలుగును. కాని ఇవి యున్నను భక్తుని మనస్సులో ఏలాటి శోకము కలుగదు.

2. ప్రపంచములో జరుగు వ్యవహారములన్నియు భగవల్లీలలు, అంతయు నతని మాయాశక్తి యొక్క క్రీడలు ఆయన దీని నెట్లు ఎప్పుడు చేయించ దలచునో, అట్లే చేయించును. మనుష్యుడు 'ఈపని నేను చేసెదను. నాకు ఇట్టి శక్తియున్నది. ఈ మొదలైన మిథ్యాభిమానములు గల వాడగును. కాని భగవద్భక్తుడు, ఈ రహస్యమును పూర్తిగా తెలిసినవాడుగా బట్టి యతడు, తానెప్పటికిన్ని భగవంతుని చేతిలోని బొమ్మనని తలచి, ఆయన ఆడించినట్లు సంతోష పూర్వకముగా ఆడుచుండును. కొంచెము గూడ నతనికి ఆత్మాభిమానము ఉండదు. తాను స్వయముగా ఏమియు చేయడు కనుక నతడు లోకదృష్టిలో అన్ని పనులు చేయుచుండినను, వాస్తవముగా, కర్తృత్వాభిమానము లేనివాడుగాబట్టి, సర్వారంభములను విడుచువాడు అని అనబడును.

3. భక్తునకు, సర్వశక్తిసంపన్న, సర్వాధార, పరమదయాళువు, భగవంతుడే

ద్వేషించడో[1], శోకము చెందడో[2] దేనినిగూడ కోరడో[3], ఎవడైతే, సమస్త శుభాశుభ కర్మలను త్యజించువాడో[4] భక్తియుక్తుడైన ఆ పురుషుడు నాకు ప్రియుడు.

---

పరమ ప్రియుడు అతడు భగవంతుని, సర్వదా పొందియున్నాడు. కను కనే అతడెల్లప్పుడు పరమానంద భరితుడై యుండును. ఏ ప్రాపంచిక వస్తువులందుగూడ నతనికి కొంచెముగూడ రాగ ద్వేషములులేవు కనుక లోక దృష్టిలో అతనికి ఒక ప్రియ వస్తువు లభించినప్పుడుగాని, అప్రియ వస్తువు దూరమైనప్పుడుగాని, అతని యంతఃకరణములో ఎప్పుడుగూడ కొంచెముగూడ హర్షము గలుగదు.

1. భగవద్భక్తుడు సమస్త ప్రపంచము భగవత్స్వరూపమని తలచును కనుక, నతనికి, ఎప్పుడును ఏవస్తువు నందైనను, ఏకారణముచేతగూడ ద్వేషము గలుగదు. అతని మనస్సులో ఎప్పుడుగూడ ద్వేషభావము ఉండదు.

2. అనిష్టవస్తు ప్రాప్తియందు, ఇష్టవస్తు వియోగమునందున్ను ప్రాణులకు శోకము కలుగును, భగవద్భక్తునకు, లీలామయుడు, పరమ దయాళువు నైన పరమేశ్వరుని దయచేత సంపన్నమైన యే ధ్యానమునందున్ను ఎప్పుడుగూడ ప్రతికూల భావము కలుగదు. కాబట్టి, ఆ భగవద్భక్తునకు శోక మెట్లు కలగజాలును?

3. భక్తుడు సాక్షాత్తు భగవత్ప్రాప్తిగలవాడు అగుటచేత ఎల్లప్పటికిన్ని, పరమానందమునందు, పరమశాంతి యందుఉండి పూర్ణ కాముడగును. అతని మనస్సులో నెప్పుడుగూడ, ఏవస్తువైనను లేదనుభావముగాని, అనుభవము గాని కలుగనే కలుగదు కనుక, అతని యంతఃకరణమునందు, ప్రాపంచిక వస్తు కాంక్ష, కలుగుటకు కారణము ఏదియు ఉండనే ఉండదు.

4. యజ్ఞ, దాన, తపస్సులు వర్ణాశ్రమానుసారముగా జీవికా నిర్వాహణము, శరీరనిర్వాహణముకొరకు చేయబడు శాస్త్రవిహిత కర్మలు ఇక్కడ "శుభ" శబ్దమునకు అసత్య, కపట, చౌర్య, హింసా, వ్యభిచారాదులు అశుభశబ్దమునకు

"సమః శత్రౌ చ మిత్రే చ తథా మానాప మానయోః ।
శీతోష్ణ సుఖదుఃఖేషు సమః సంగ వివర్జితః[1]॥" 18

"అర్జునా! యెవడైతే శత్రు, మిత్రులయందు[2], మానాప మానములందు

---

అర్థము జ్ఞానియైన భగవద్భక్తుడు ఈ రెండు విధములైన కర్మలు విడుచును. ఎందుకనగా, అతని శరీరేంద్రియ మనస్సులచేత చేయ బడు సమస్త శుభా శుభ కర్మల నతడు భగవంతునకు అర్పించును. వానియందతనికి కొంచెముగూడ. మమకారాసక్తి ఫలేచ్ఛలు ఉండవు. కనుకనే, అటువంటి కర్మలు కర్మలనియే తలచడు. (గీత 4-20) రాగ ద్వేషములు లేకుండుటచేత అతడు పాపకర్మలు చేయనేచేయడు. కనుక నతడు 'శుభాశుభ కర్మత్యాగి', యనబడెను.

1. ప్రపంచములో మనష్యునకున్న ఆసక్తి (స్నేహము)యే. సర్వానర్థము లకు మూలము. బాహ్యముగా నతడు సంసార సంబంధము విడిచినను, మనస్సులో ఆసక్తి యుండినచో, ఇట్టి త్యాగముచేత నతనికి విశేషలాభము గలుగదు. మరియొక పక్షమునందు. మనస్సుయొక్క ఆసక్తి నష్టమైన పిదపగూడ. బాహ్యముగా, జనక మహారాజునకు వలె నతనికి, అందరి తోను మమకారాసక్తిరహితమైన సంబంధము ఉన్నప్పటికిన్ని, ఏహానియు నుండదు. ఇటువంటి ఆసక్తి త్యాగియే (ఆసక్తిని త్యజించినవాడు) వాస్త ముగా యథార్థ 'సంగవర్జితు' డనబడును.

2. ఒకవేళ భక్తుని దృష్టిలో నతనికి శత్రు మిత్రులెవరుగూడ లేకున్నను, లోకము తమ తమ భావము ననుసరించి, మూర్ఖత్వముచేత, భక్తునిచేత తమకు అనిష్టము కలుగుచున్నదని తలచి, లేదా భక్తుని స్వభావము తమకు అనుకూలముగా కనపడకుండుటచేత, అథవా ఈర్ష్యచేత భక్తునందు శత్రుత్వమునుగూడ ఆరోపించెదరు. ఇటువంటివారేయైన ఇతరులుగూడ తమ భావన ననుసరించి, భక్తునియందు మిత్రత్వమును ఆరోపించెదరు. కాని ప్రపంచము నందంతటను భగవంతునే దర్శించు భక్తునకు అన్నిటి యందున్ను సమభావమే యుండును. అతని దృష్టిలో శత్రు మిత్రుల భేదమేమాత్రమునుండదు. అతడైతేనో సర్వదా అందరితోను పరమప్రేమ

సమానముగా వ్యవహరించునో, శీతోష్ణములు, సుఖదుఃఖాదులైన ద్వంద్వము అందున్ను సమానముగా నుండునో[1] ఆసక్తి రహితుడో.

"తుల్యనిందా స్తుతిర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్ ।
అనికేతః[2] స్థిరమతిర్భక్తిమాన్ మే ప్రియో నరః"॥ 19

---

పూర్వకముగానే వవ్యహరించుచుండును. అందరున్ను భగవత్స్వరూపులే యని తలచి, సమభావముతో, అందరి సేవచేయుటయే యతనికి స్వభావమగును. వృక్షమెట్లైతే, తనను నరకువానికి, నీరుపోసి పెంచువానికి ఇద్దరికిగూడ, తన నీడను, ఫలపుష్పాదులను ఇచ్చి వారిని సేవించుటలో ఏవిధమైన భేదముచేయదో, అట్లే భక్తునకుగూడ ఏవిధమైన భేదభావము ఉండదు. భక్తుని సమత్వము వృక్షముకన్నను అధిక మహత్త్వముగలదిగా నుండును.

అతని దృష్టిలో పరమేశ్వరునకన్నను వేరేదియు లేకుండుటచేత, అతనికి భేదభావమను శంకయే కలుగదు. కనుకనే, అతడు 'శత్రు మిత్రులందు, సముడు'అని అనబడెను.

1. మానావమానములు శీతోష్ణములు, సుఖ దుఃఖములు మొదలైన అనుకూల ప్రతికూల ద్వంద్వములకు శరీరేంద్రియ మనస్సులతో సంబంధము కలిగియుండుటచేత, ఆ ద్వంద్వముల అనుభవము కలుగుచున్నను, భగవద్భక్తుని అంతఃకరణమునందు, రాగద్వేషములు, లేదా హర్షశోకములు మొదలగు వికారములేవియు కొంచెముగూడ కలుగవు. అతడు ఎల్లప్పుడు గూడ సమభావముతో నుండును.

2. ఏ భక్తుడు తన సర్వస్వమును భగవంతునకు అర్పించెనో, యెవనియిల్లు, వాకిలి, శరీరము, విద్య, బుద్ధి ఇత్యాదులన్నియు, భగవంతునివే యగునో, అప్పుడా భక్తుడు, బ్రహ్మచారియైనను, గృహస్థుడైనను, వానప్రస్థుడైనను సరియే, అతడుగూడ, ఇల్లు లేనివానివలె అనికేతనుడేయగును. ఎట్లైతే, శరీరమునందు, అహంకారం మమకార అసక్తులులేనప్పుడు శరీరమున్నప్పటికిన్ని జ్ఞానియైనవానిని "విదేహి" యని అనెదరో, అట్లే ఎవనికైతే

అర్జునా! యెవడు నిందాస్తుతులను సమానముగా తలచువాడో[1], మనవ

యింటి యందు అహంకార, మమకార అసక్తులులేవో, అతడు ఇంటి యందు నివసించుచున్నప్పటికిన్ని ఇల్లు లేనివాడు "అనికేతనుడు" యగు నని భావము.

1. భగవద్భక్తునకు తన పేరుమీద, శరీరముమీద కొంచెముగూడ అభిమానము మమకారము ఉండదు. కనుక, అతనిని స్తుతించినందువలన హర్షముగాని, నిందించుటవలన శోకముగాని ఏలాటిది కలుగదు. అతనికి హర్ష శోకములు రెంటియందున్ను సమభావము ఉండును. అంతటమ అతనికి భగవద్భక్తి కలుగుటచేత, అతనిని స్తుతించువారిపైనను, నిందించువారిపైనను ఏలాంటి భేదబుద్ధియుండదు. ఇదియే యతనికి గల నిందాస్తుతి సమత్వమనబడును. మనుష్యుడు కేవలము వాక్కుతోనే మాట్లాడడు మనస్సుతో గూడ మాట్లాడుచుండును. నిరంతరము విషయచింతనయే మనస్సుతో మాట్లాడుట యనబడును. భక్తుని మనస్సు భగవంతునియందు ఎంతగా లగ్నమగుననగా, ఆ చిత్తమునందు భగవంతుడు దప్ప ఇతరములో స్మృతియే యుండదు. సర్వదా భగవంతుని మననము నందే లగ్నమై యుండును. ఇదియే వాస్తవికమైన మౌనమనబడును. మాట్లాడుట మాను కొని, మనస్సులో విషయ చింతనము జరుగుచుండుట బాహ్యమౌనమన బడును. మనస్సును విషయములందు పారనీయక, వాక్కును పరిశుద్ధముగాను, నియమబద్ధముగాను ఉంచు నుద్దేశముతో చేయబడు బాహ్య మౌనముగూడ లాభదాయకమే యగును. కాని యిక్కడ భగవంతునకు ప్రియుడైన భక్తుని లక్షణములు వర్ణింపబడినవి. అతని వాక్కు స్వాభావికముగానే, పరిశుద్ధము నియమబద్ధముగానే యుండును. దీనిచేత భక్తుని వాక్కు మాత్రమే మౌనము వహించియుండును అని చెప్పుట వీలులేదు. ఆ వాక్కు సర్వదా తరచుగా, భగవన్నామమును గుణములనే కీర్తించుచుండును. దానిచేత ప్రపంచమునకు పరమోపకారము కలుగును. ఇదిగాక, భగవంతుడు తన భక్తులచేత, తన భక్తి ప్రచారము చేయించుచుండును కనుక, వాక్కు మౌనములో నుంచుకొనిన భక్తుడు, భగవంతునకు ప్రియుడగును. అతిగా మాట్లాడువాడు భగవంతునకు ప్రియు

శీలుడో[1], ఏ విధముగనైన, శరీర నిర్వాహమైనప్పుడు సర్వదా సంతుష్టుడై[2] యుండునో, ఒకచోట నివసించుచున్నప్పటికిన్ని, ఆ స్థానమునందు అహంకార,

---

భక్తుడుగాడు అని తలచుటకు వీలుపడదు. భగవద్గీత పదునెనిమిదవ అధ్యాయము, అరువది యెనిమిదవ శ్లోకములో అరువది తొమ్మిదవ శ్లోకములోను భగవంతుడు, భగవద్గీతా ప్రచారము చేయువారు, ఇతరు లందరి కన్నను తనకు ప్రియమైన కార్యము చేయువారని చెప్పెను.

1. ఈ మహాకార్యము వాక్కును మౌనముతో నుంచుకొనిన భక్తునివలన కాజాలదు ఇదిగాక భగవద్గీత పదియేడవ అధ్యాయము. పదిమూడవ శ్లోకమునందు మానసిక తపస్సుయొక్క లక్షణములలో మౌన, శబ్దము గూడ చెప్పబడినది. ఒకవేళ భగవంతునకు "మౌన" శబ్దముయొక్క అర్థము వాక్కుయొక్క మౌనమే యని యిష్టమైనయెడల, ఆయన దానిని వాక్కుయొక్క తపస్సుయొక్క ప్రసంగములో చెప్పియుండును. కాని ఆయన అట్లు చేయలేదు. దీనిచేతగూడ, పీదని భావముయొక్క పేరు "మౌన" మని ఈ ముని భావము గలవాడే "మౌని" లేక "మననశీలుడు" అనియు నిరూపింపబడినది. వాక్కుయొక్క మౌనము మనష్యుడు మొండిగా పట్టుదలతో హఠ పూర్వకముగాగూడ చేయగలడు. కనుక వాఙ్మౌనం ఏమంత గొప్ప విషయముగాదు. కనుక, ఇక్కడ 'మౌన' శబ్దముయొక్క అర్థము, వాఙ్మౌనము అని తలచక, మనస్సుయొక్క మననశీలత్వమే యని తలచుట ఉచితము. అప్పుడు వాఙ్మౌనము తనంతట దీనిలో చేరును.

2. భక్తుడు తనకు మిక్కిలి యిష్టుడైన భగవంతుని పొంది, యెల్లప్పటికిన్ని సంతుష్టుడైయుండును. బాహ్య వస్తువుల రాకపోకలచేత, అతని సంతోష ములో ఏ విధమైన భేదముకలుగదు. పూర్వజన్మ కర్మానుసారముగా సుఖదుఃఖాది హేతువులైన వస్తువు లేవైనను తనకు లభించినప్పుడు, వానితో సంతుష్టుడై యుండును. భక్తునకు భగవంతుని ప్రత్యక్ష దర్శన మగుటచేత అతని సంశయములన్నియు సమూలముగా నశించును. అతని నిశ్చయము అచంచలమై స్థిరముగానుండును. కనుక అతడు సాధారణ

మమకార, ఆసక్తులు లేకయుండునో, అటువంటి స్థిరబుద్ధిగల[1] భక్తిమంతుడైన పురుషుడు నాకు ప్రియుడు.

---

మనుష్యులవలె కామ, క్రోధ, లోభ, మోహ, భయాది వికారములకు వశుడై, ధర్మమునుండి కాని, భగవత్స్వరూపము నుండికాని చలించడు.

1. పైన చెప్పబడిన వన్నియు భగవద్భక్తుని లక్షణములు. అవియన్నియు శాస్త్రానుకూలముగా శ్రేష్ఠములుగాను నున్నవి. కాని, భక్తుల స్వభావాదుల భేదముచేత, వారిగుణములందు, ఆచరణములందున్ను ఏ కొంచెము గొప్పయో భేదము ఉండుట స్వాభావికమగును. అందరియందు అన్ని లక్షణములు సమానములుగా నుండవు. కాని సమత్వ, శాంతి గుణములు అందరియందు నుండును. రాగ ద్వేషములు, హర్ష శోకములు మొదలైన వికారములు ఎవరియందున్ను ఉండవు అనునది మాత్రము తథ్యము ఈ కారణముచేతనే, ఈ శ్లోకములందు పునరుక్తియుండును. యోచించి చూచిన యెడల ఈ యైదు విభాగములందు ఒకచోట, భావములో మరి యొకచోట శబ్దములోను, రాగ, ద్వేష, హర్ష, శోకములు లేకుండుట అన్నిటిలోను నున్నది అను విషయము గమనించవలెను. మొదటి విభాగములో 'అద్వేష్టా' యను శబ్దముచేత ద్వేషముయొక్క 'నిర్మమః' అను శబ్దముచేత రాగముయొక్క 'సమ దుఃఖసుఖః' అను శబ్దముచేత హర్ష శోకములయొక్కయు అభావము తెలుపబడెను. రెండవ విభాగములో హర్ష, అమర్ష, భయ, ఉద్వేగముల అభావము తెలుపబడెను. దీనిలో రాగ ద్వేషములు, హర్ష శోకములు వీని యభావము తనంతట సిద్ధించును. మూడవ విభాగములో 'అనపేక్షః' అను శబ్దముచేత రాగముయొక్క 'ఉదాసీనః' అను పదముచేత ద్వేషముయొక్క 'గతవ్యథః' అను శబ్దము చేత హర్ష శోకములయొక్కయు అభావము తెలుపబడినది. నాలుగవ విభాగములో "నకాంక్షతి" అను దానిచేత రాగముయొక్క, "నద్వేష్టి" యను దానిచేత ద్వేషముయొక్క "నహృష్యతి" అనుటచేత, న శోచతి అనుదానిచేత హర్ష, శోకములయొక్కయు అభావము తెలుపబడినది. ఇట్లే ఐదవ విభాగములోను సంగవర్జితః" అను పదముచేత సంతుష్ట పదము చేత, రాగద్వేషములయొక్క శీతోష్ణ సుఖదుఃఖేషు సమః అను దానిచేత

హర్ష, శోకములయొక్కయు అభావము తెలువబడినది ఈ ప్రకరణములో "సంతుష్టః" అను పదముగూడ రెండుసార్లు చెప్పబడినది. దీనిచేత అన్నింటి యందున్న రాగ, ద్వేష, హర్ష, శోకాది వికారములయొక్క అభావము, సమత్వ శాంతి గుణములయొక్క కొంత భేదముగూడ నుండజాలును. ఈ భేదము కారణముగానే, భగవంతుడు, భక్తుల లక్షణములను వేర్వేరు తరగతులలో విభజించి యక్కడ ఐదుసార్లు వేర్వేరుగా తెలుపెను. వీనిలో ఏదోయొక విభాగము ప్రకారముగూడ అన్నిలక్షణములు పరిపూర్ణ ముగా గలవాడీ భగవంతునకు ప్రియభక్తుడనబడును.

ఇదిగాక కర్మయోగ-భక్తియోగ. జ్ఞానయోగాదులలో ఏదోయొక మార్గము ద్వారా పరమసిద్ధిని పొందిన తరువాతగూడ, అతని వాస్తవ స్థితిలోగాని, తానుపొందిన పరమ తత్త్వములోగాని, ఏలాంటి బేదములేదు. కాని, స్వభావ బేదముచేత, ఆచరణములో కొంతబేదము ఉండవచ్చును.

"సదృశం చేష్టతే స్వస్యాః । ప్రకృతేః జ్ఞానవానపి ॥

(గీత-3-33)

ఇట్లు చెప్పుటచేత గూడ, జ్ఞానవంతులందరి ఆచరణములో, స్వభావము లోను, జ్ఞానము ప్రాప్తించిన తరువాతగూడ బేదము ఉండును అను విష యమే సిద్ధించెను.

అజ్ఞాన జనితములైన అహంకార, మమకార, రాగ, ద్వేష, హర్ష, శోక, కామ క్రోధాది వికారములు లేకుండుట, నమత్వము, శాంతి ఈ లక్ష ములు భక్తులందరియందున్న సమానముగా నుండును. కాని మైత్రి, దయ యీ రెండు భక్తిమార్గములో భగవంతుని పొందిన మహాపురుషులలో విశేష ముగానుండును. ప్రపంచము, శరీరము, కర్మలు వీనియందు వైరాగ్యము జ్ఞాన మార్గములో పరమపదమును పొందిన మహాత్ములలో విశేషముగా నుండును. ఇట్లే, మనస్సును ఇంద్రియములను వశములో నుంచుకొని, అనాసక్త భావములో కర్మలందు తత్పరుడగుట యను లక్షణము విశేష ముగా, కర్మయోగముచేత భగవంతుని పొందిన పురుషులందు ఉండును.

సంబంధము :

పరమాత్మని పొందిన సిద్ధులైన భక్తుల లక్షణములను తెలిపి యప్పుడు, ఆ లక్షణములు ఆదర్శముగా పెట్టుకొని, మిక్కిలి ప్రయత్నముతో, ఆ ధర్మము లను అనుసరించువారు పరమ శ్రద్ధాళువులు, శరణాగతులు నైన భక్తులను ప్రశంసించుటకు, వారు తనకు అత్యంత ప్రియులని తెలిపి భగవంతుడు ఈ యధ్యాయ పరిసమాప్తి చేయుచున్నాడు.

యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే ।
శ్రద్దధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః ॥ 20

కాని అర్జునా! శ్రద్ధాయుక్తులైన యే భక్తులు నాయందు ఆసక్తిగలవారై! ఈ పైన చెప్పబడిన ధర్మమయామృతము నిష్కామ ప్రేమ భావముతో

---

భగవద్గీత రెండవ అధ్యాయము ఏబదియైదవ శ్లోకమునుండి డెబ్బది రెండవ శ్లోకమువరకు అనేక శ్లోకములలో కర్మయోగముద్వారా భగ వంతుని పొందిన పురుషుని యొక్క పదునాలుగవ అధ్యాయము ఇరువది రెండవ శ్లోకమునుండి యరువదియైదవ శ్లోకమువరకు జ్ఞానయోగము ద్వారా పరమాత్మప్రాప్తి కలిసిన గుణాతీత పురుషుని యొక్క-యు లక్షణములు చెప్పబడెను. ఇక్కడ పదమూడవ శ్లోకమునుండి పందొమ్మి దవ శ్లోకమువరకు భక్తియోగముద్వారా భగవంతుని పొందిన పురుషుని లక్షణములు చెప్పబడినవి.

1. సర్వవ్యాపి, సర్వశక్తి సంపన్నుడునైన భగవంతుని అవతారములలో, మాటలలో, గుణములలో, ప్రభావములో, ఐశ్వర్యములో, చరిత్రాదుల లోను సమ్మాన పూర్వకమైన విశ్వాసము ప్రత్యక్షముగా కలవాడు శ్రద్ధా వంతుడు అనబడును. పరమ ప్రేమాస్పదుడు, పరమ దయాళువునైన భగవంతుడే తనకు పరమగతి, పరమాశ్రయుడు, ప్రాణాధారుడు, సర్వ స్వభూతుడునని తలచి. ఆయనపైననే తన భారముమైచి, ఆయన విధా నములందు ప్రసన్నుడై యుండువాడు భగవత్పరాయణ పురుషుడు అన బడును.

సేవించెదరో ఆ భక్తులు నాకు మిక్కిలి ప్రియులు.[1]

ఇతి శ్రీ మహాభారతే భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా పర్వణి
శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణా
ర్జున సంవాదే భక్తియోగో నామ ద్వాదశోఽధ్యాయః
భీష్మపర్వణి తు షట్త్రింశోఽధ్యాయః

---

1. పైన చెప్పబడిన భగవద్భక్తుల లక్షణములే వాస్తవముగా మానవధర్మము యొక్క యధార్థ స్వరూపము. ఈ మానవ ధర్మపాలనము నందే మనుష్య జన్మకు సార్థకత యున్నది ఎందుకనగా, ఈ భగవద్భక్తుల లక్షణముల పాలనముచేత, సాధకుడు ఎల్లప్పటికిన్ని, మృత్యు ముఖమునుండి విముక్తి పొందును. అతనికి అమృత స్వరూప భగవత్ప్రాప్తి సిద్ధించును. ఈ యభి ప్రాయమును వివరించుటకు ఇక్కడ ఈ లక్షణ సమూహముయొక్క పేరు "ధర్మమయా మృతమని" అని చెప్పబడెను.

సిద్ధులైన భగవత్ప్రాప్తి కలిగిన భక్తులకు, పైనచెప్పబడిన లక్షణములు స్వాభావికముగానే యుండును కాబట్టి వారికి ఈ గుణములుండుట గొప్ప విశేషమేమియుకాదు. కాని, సాధకులుగా నుండి, భగవంతుని ప్రత్యక్ష దర్శనముకాని భక్తులుగూడ, భగవంతుని యందు విశ్వాసముంచి మిక్కిలి శ్రద్ధతో, వారి తనువు, మనస్సు, ధనము, సర్వస్వమున్ను భగవంతు నకు సమర్పించి ఆయన యందే తత్పరులై యెవరు ఉందురో, భగవద్దర్శ నము కొరకు నిరంతరము ఆయననే నిష్కామ భావముతో, ప్రేమ పూర్వ కముగా నెవరు చింతించుచుండెదరో, సంతతము ప్రయత్నించుచు. పైన చెప్పబడిన లక్షణముల ప్రకారమే తమ జీవనము నెవరు గడపదల చెదరో, అట్టివారు ప్రత్యక్ష దర్శనము కాకున్నను కేవలము విశ్వాసము పైననే ఆధారపడి భగవంతుని యందే తమ సర్వభారము వైచియుండుట చాల గొప్ప విషయము. అటువంటి ప్రేమగల భక్తులను సిద్ధిపొందిన భక్తులకన్నను భగవంతునకు "అతిశయ ప్రియులు" అని చెప్పుట ఉచి తము.

శ్రీమహాభారతమునందు, భీష్మపర్వమునందు శ్రీమద్భగవద్గీతా పర్వమునందు
శ్రీమద్భగవద్గీతోపనిషత్తులందు, బ్రహ్మవిద్యయందు, యోగశాస్త్రమునందు,
శ్రీకృష్ణార్జున సంవాదమునందు, విశ్వరూప దర్శనయోగ మనబడు
పన్నెండవ అధ్యాయము సమాప్తము (12) భీష్మపర్వమునందు
ముప్పదియారవ అధ్యాయము సమాప్తము.



9. దీని తరువాతి విషయము భగవద్గీత మొదటి అధ్యాయము చివర * ఈ గుర్తు పెట్టబడిన అధోజ్ఞాపికలో నున్నట్లు గ్రహింపవలెను.

# శ్రీ భగవద్గీతయందు పదమూడవ అధ్యాయము

(భీష్మపర్వమునందు 37 వ అధ్యాయము)

## క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగము :

సంబంధము :

భగవద్గీత 12వ అధ్యాయము ఆరంభములో అర్జునుడు సగుణ-నిర్గుణ పరమాత్మోపాసకుల శ్రేష్ఠత్వము విషయములో ప్రశ్నముచేసియుండెను. దానికి ఉత్తరము చెప్పుచు భగవంతుడు రెండవశ్లోకములో సంక్షేపముగా సగుణోపాసకుల శ్రేష్ఠత్వమునుగూర్చి ప్రతిపాదించి దాని ఫలమునుగూర్చి దానిని అనుష్ఠించుటలో దేహాభిమానులకు గలుగు కష్టములనుగూర్చియు నిరూపించెను. తరువాత ఆరవ శ్లోకమునుండి ఇరువదవ శ్లోకమువరకు సగుణోపాసనా మహత్త్వము—తత్ఫలము దానిప్రకారము భగవద్భక్తుల లక్షణములు. వీనినిగూర్చి వర్ణించుచునే అధ్యాయ సమాప్తి చేసెను. నిర్గుణ పరబ్రహ్మతత్త్వము—మహిమ—తత్ప్రాప్తి సాధనములు, వీనినిగూర్చి విస్తారముగా తెలుపబడలేదు. కనుకనే నిర్గుణ - నిరాకారతత్త్వము—అనగా, జ్ఞానయోగవిషయము బాగుగా వివరించి తెలుపుటకు పదమూడవ అధ్యాయము ఆరంభింపబడుచున్నది. ఇందులో మొదట భగవంతుడు క్షేత్ర (శరీరము) క్షేత్రజ్ఞ (ఆత్మ)ల లక్షణము తెలుపుచున్నాడు-

### శ్రీ భగవానువాచ :

"ఇదం శరీరం కౌంతేయ । క్షేత్ర మిత్యభి ధీయతే ।
ఏతద్ యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥ 1

**భగవంతుడిట్లనెను:—**

**అర్జునా! ఈ శరీరమునకు క్షేత్రము[1] అని పేరు. దీనిని తెలుసుకొను**

---

1. పొలములో నాటిన విత్తనములకు తగినట్లు పంటలు పండినట్లే ఈ శరీ

వానికి "క్షేత్రజ్ఞుడు"[1] అని పేరు అని వాని తత్త్వములు తెలిసిన జ్ఞానులనెదరు.

"క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత ।"
క్షేత్ర క్షేత్రజ్ఞయోః జ్ఞానం యత్ తజ్ జ్ఞానం మతం మమ॥ 2

అర్జునా! నీవు అన్ని క్షేత్రములలోనున్న క్షేత్రజ్ఞుడు-అనగా జీవాత్మ గూడా

---

రమునందు నాటబడిన కర్మ సంస్కారములనెడు బీజముల ఫలములు గూడా నకాలములో ప్రకటితములగుచుండును. ఇదిగాక ఆ ఫలము ప్రతి క్షణము నాశము చెందుచుండును. అందుచేతగూడ ఈ శరీరమును క్షేత్ర మవి చెప్పెదరు. ఈ కారణముచేతనే భగవద్గీత పదునైదవ అధ్యాయము పదియారవ శ్లోకములో ఇతడక్షర పురుషుడనబడెను.

1. దీనిని భగవంతుడు "అంతరాత్మ ద్రష్ట" యని సూచించెను. మనోబుద్ధీంద్రియములు, పృథివ్యాది మహాభూతములు ఇంద్రియ విషయాదులు ఈ జ్ఞేయములు (తెలుసికొనవదగినవి) అన్నియు "దృశ్యవర్గము" అనబడును. ఇవన్నియు జడములు నశించునవి మార్పుచెందునవి. చేతనుడైన ఆత్మ, జడములైన దృశ్యవర్గములకన్న పూర్తిగా విలక్షణముగానుండును. ఈ యాత్మ అదృశ్యవర్గముయొక్క "జ్ఞాత" తెలుసుకొనువాడగును ఆ వర్గములో కలిసియుండి దానికి అధిపతిగా నుండును. ఈ కారణముచేతనే ఆత్మ "క్షేత్రజ్ఞ"డనబడును. జ్ఞాతయైన యీ చేతనాత్మయే, భగవద్గీత ఏడవ అధ్యాయములో "పరాప్రకృతి" (7-5) ఎనిమిదవ అధ్యాయములో "అధ్యాత్మ" (8-3) అని పదునైదవ అధ్యాయములో "అక్షరపురుష" (15-16) అనియు చెప్పబడెను. ఈ ఆత్మ తత్త్వము మిక్కిలి గహన (తెలియజాలనిది) మైనది. ఇందుచేతనే భగవంతుడు ఈ ఆత్మ తత్త్వమును వేర్వేరు ప్రకరణములలో ఒకచోట స్త్రీ వాచకము, ఒకచోట నపుంసక వాచకముగా మరియొకచోట పురుషవాచకమునైన పేర్లతో వర్ణించిచెప్పెను. వాస్తవికముగా ఆత్మ వికార-లింగధర్మరహితుడు-నిత్యుడు-చేతనుడు-జ్ఞానస్వరూపుడు నగును.

నేనే అని తెలిసికొనుము.[1] క్షేత్ర క్షేత్రజ్ఞులయొక్క అనగా వికార సహిత ప్రకృతి పురుషులను తాత్త్వికముగా తెలిసికొనుటయే "జ్ఞానము" అని నా యభిప్రాయము.

సంబంధము :

క్షేత్ర క్షేత్రజ్ఞుల సమగ్ర జ్ఞానము గలిగిన తరువాత సంసార భ్రాంతి నశించును. అప్పుడు పరమాత్మప్రాప్తి సిద్ధించును. కనుకనే, క్షేత్ర క్షేత్రజ్ఞుల స్వరూపాదులను బాగుగా విభాగములతో వివరించి తెలుపుటకు భగవంతుడిట్లనుచున్నాడు.

"తత్ క్షేత్రం[2] యచ్చ యాదృక్[3] చ యద్వికారి[4] యతశ్చయత్[5]

---

1. దీనిచేత ఆత్మ-పరమాత్మల యైక్యము చెప్పబడినది. ఈ రెండింటిలో వాస్తవముగా ఏమాత్రం బేదములేదు. ప్రకృతి సంబంధముచేత ఆ రెంటికీ బేదమున్నట్లు తోచును. ఈ కారణముచేతనే భగవద్గీత రెండవ అధ్యాయము ఇరువది నాలుగు, ఇరువది యైదవ శ్లోకములలో ఆత్మ స్వరూపమును వర్ణించుచు భగవంతుడు ఏ శబ్దములను వాడెనో పన్నెండవ అధ్యాయము మూడవ శ్లోకమునందు నిర్గుణ, నిరాకార, పరమాత్మ లక్షణములను వర్ణించునప్పుడుకూడా ఆ భావము సూచించు శబ్దములే వాడెను.
2. "యత్" అను పదముచేత భగవంతుడు క్షేత్రస్వరూపమును సూచించి దానిని ఐదవ శ్లోకములో తెలిపెను.
3. "యాదృక్" అను శబ్దముచేత భగవంతుడు క్షేత్ర స్వభావమును సూచించి దానిని ఇరువది యారవ, ఇరువది యేడవ శ్లోకములలో సమస్త భూతములు ఉత్పత్తి-వినాశములు గలవియవి తెలిపి వర్ణించెను.
4. "యద్వికారి" అను పదముచేత క్షేత్ర వికార వర్ణనమును సూచించి ఆ వర్ణనము ఆరవ శ్లోకములో చేసెను.
5. "ఏ వస్తు సముదాయము పేరు "క్షేత్రము" అని యున్నదో వానిలో "ఏ వస్తువు దేనినుండి పుట్టినది" అను విషయము "యతః చ యత్" అను

స[1] చ యో యత్ప్ర[2]భావశ్చ తత్ సమాసేన మే శృణు॥" 3

అర్జునా! ఆ క్షేత్రమేది ? అది ఎట్లున్నది ? అది యే యే వికారములు కలిగియున్నది ? అది యే కారణములచేత కలిగినది ? ఆ క్షేత్రజ్ఞుడు గూడా ఎవడు ? అతడెట్టి ప్రభావము గలవాడు ? ఇవన్నియు సంక్షేపముగా చెప్పెదను వినుము.

సంబంధము :

మూడవ శ్లోకములో భగవంతుడు అర్జునునకు సంక్షేపముగా వినుమని చెప్పిన క్షేత్ర క్షేత్రజ్ఞుల తత్త్వముల విషయములో ఇప్పుడు ఋషులు- వేదములు- బ్రహ్మసూత్రములు- వీని సూక్తులను ప్రమాణముగా చెప్పి భగవంతుడు ఋషులను, వేదములను బ్రహ్మసూత్రములను గౌరవించుచున్నాడు.

---

పదములచేత సూచించెను. దాని వర్ణనము భగవంతుడు పందొమ్మిదవ శ్లోకము ఉత్తరార్థములో ఇరువదవ శ్లోకము పూర్వార్థములోను చేసెను.

1. "సః" అను పదమునకు "క్షేత్రజ్ఞుడు" అని యర్థము. "యః" అను పదముచేత దాని స్వరూపము తెలుపుటకు సూచన చేయబడెను. ఈ తరువాత ఆ క్షేత్రజ్ఞునియొక్క ప్రకృతిస్థ వాస్తవిక స్వరూపములను రెంటిని వర్ణించెను. పందొమ్మిదవ శ్లోకములో అతడు "అనాది" అని ఇరువదవ దానిలో "సుఖదుఃఖ భోక్త" యని ఇరువది యొకటవ శ్లోకములో మంచి-చెడ్డ యోనులలో జన్మించువానినిగూర్చియు వర్ణించి తెలిపియు ప్రకృతి-పురుషుని స్వరూపమును తెలిపెను ఇరువది రెండవ శ్లోకములో ఇరువది యేడవ శ్లోకము నుండి ముప్పదవ శ్లోకమువరకు పరమాత్మతో ఐక్యము చేసి ఆ క్షేత్రజ్ఞునియొక్క వాస్తవికమైన స్వరూపమును నిరూపించెను.

2. "యత్ప్రభావః" అను పదముచేత క్షేత్రజ్ఞుని ప్రభావమును తెలుపుటకు సూచించి అది ముప్పది యొకటవ శ్లోకమునుండి ముప్పదిమూడవ శ్లోకము వరకు భగవంతుడు తెలిపెను.

"ఋషిభిర్బహుధా గీతం [1]ఛందోభిర్వివిధైః పృథక్ ।
బ్రహ్మసూత్ర[2] పదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః ॥ 4

అర్జునా! ఈ క్షేత్ర క్షేత్రజ్ఞులనుగూర్చి ఋషులు[3] అనేక విధములుగా చెప్పిరి. వివిధ వేదమంత్రములచేతగూడా విభాగ పూర్వకముగా ఆ విషయమే చెప్పబడెను యుక్తియుక్తములగు బ్రహ్మసూత్ర పదములచేతగూడా ఈ విషయమే తెలుపబడెను.

"మహాభూతా[4]న్యహంకారో బుద్ధిరవ్యక్త మేవచ ।
ఇంద్రియాణి దశైకం చ పంచచేంద్రియ గోచరాః ॥ 5

---

1. "వివిధైః" అను విశేషణముతోగూడిన "ఛందోభిః" అను పదమునకు "ఋక్, యజుస్, సామ, అథర్వములు" అను నాలుగువేదముల సంహితా బ్రాహ్మణములు రెండు భాగములు అని యర్థము. అన్ని ఉపనిషత్తులు వేర్వేరు శాఖలుగూడా ఈ వేద సంహితా బ్రాహ్మణములలో అంతర్గత ములు అని భావించవలెను.

2. 'బ్రహ్మసూత్రపదైః' అను పదమునకు వేదాంత శాస్త్రములో 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా" ఇత్యాది పదములని యర్థము. ఎందుకనగా పైన చెప్ప బడిన లక్షణములన్నియు వానిలోనున్నవి. ఇట్లు ఇక్కడ చెప్పటలో అభి ప్రాయమేమనగా శృతి స్మృత్యాదులలో వర్ణింపబడిన క్షేత్ర-క్షేత్రజ్ఞుల తత్త్వము బ్రహ్మసూత్ర పదములచేత యుక్తితో తెలుపబడినది.

3. మంత్రద్రష్టలు శాస్త్ర-స్మృతుల రచయితలునైన ఋషి గణములు క్షేత్ర క్షేత్రజ్ఞుల స్వరూపము వానికి సంబంధించిన విషయములన్నియు, వారి వారి గ్రంథములలో పురాణేతిహాసములలోను అనేక విధములుగా వర్ణించి విస్తారముగా తెలిపిరి. ఆ గ్రంథములలోని సారమునే యిక్కడ కొన్ని శబ్దములచేత భగవంతుడు చెప్పుచున్నాడు.

4. ఇక్కడ "మహాభూతాని" అను శబ్దమునకు స్థూలభూతములకు శబ్దాది విషయములకు కారణములైన పంచతన్మాత్రలు. అనగా భగవద్గీత యేడవ అధ్యాయములో నాల్గవ శ్లోకములో వర్ణింపబడిన "భూమిః", 'అపః',

అనలః, వాయుః, ఖం" అను పేర్లుగల ఐదు అని అర్థము. ఇటువంటి వర్ణనమే సాంఖ్య కారికలో, యోగదర్శనములోను ఇట్లు చేయబడినది.

''మూలప్రకృతి రవికృతిః మహదాద్యాః ప్రకృతి వికృతయః సప్త"
షోడశకస్తు వికారోన ప్రకృతిర్న వికృతిః పురుషః ॥

(సాంఖ్యకారిక-3)

అనగా మూలప్రకృతి యొకటి- అది దేనికిన్ని వికృతి (వికారము)కాదు. మహత్తత్త్వము-అహంకారము- పంచతన్మాత్రలు (శబ్ద-స్పర్శ-రూప-రస-గంధ తన్మాత్రలు) ఈ యేడున్ను ప్రకృతి-వికృతులనబడును. అనగా ఈ యేడున్ను పంచభూతాదులకు కారణములగుటచేత "ప్రకృతులు'' అగును. మూలప్రకృతికి కార్యరూపములగుటచేత వికృతులుగా కూడా నగును. పంచ జ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు మనస్సు- ఈ పదకొండు ఇంద్రియములు, పంచమహాభూతములు, ఈ పదియారున్ను కేవలము వికృతులు (వికారములు) మాత్రమే యగును. ఇవి వేనికిగూడా ప్రకృతులు అనగా కారణములుకావు. వీనిలో పదకొండు ఇంద్రియములు. అహంకారమునకు ఐదు మహాభూతములు పంచతన్మాత్రలకు కార్యములగును. కాని పురుషుడు దేనికిన్ని కారణముగాని కార్యముగాని కాడు. అతడు పూర్తిగా అసంగతుడు.

యోగదర్శనమునందు ఇట్లు చెప్పబడెను :-

విశేషా విశేష లింగ మాత్రాలింగాని గుణపర్వాణి ॥ (2-19)

విశేషములనగా పంచ జ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు-మనస్సు ఒకటి. పంచస్థూల మహాభూతములు అని భావము. అవిశేషములనగా "అహంకారము - పంచతన్మాత్రలు- లింగమాత్రము అనగా "మహతత్త్వము", అలింగము అనగామూలప్రకృతి. ఈ ఇరువది నాలుగు తత్త్వములు గుణముల యవస్థా విశేషములు. ఇవియే "దృశ్యములు" అనబడును.

అర్జునా! పృథివ్యాది పంచమహాభూతములు, అహంకారము,[1] బుద్ధి[2], మూల ప్రకృతి[3], దశేంద్రియములు,[4] మనస్సు[5], ఐదు ఇంద్రియ విషయములు

---

యోగదర్శనములో చెప్పబడిన దృశ్యములే భగవద్గీతలో క్షేత్రము అని చెప్పబడెను.

1. ఇది సమష్టి అంతఃకరణముయొక్క ఒక భేదము. అహంకారమే పంచ తన్మాత్రలకు మనస్సునకు, ఇంద్రియములకున్న కారణము. మహత్తత్త్వమునకు కార్యమునగును. ఇదియే అహంభావము అనికూడనబడును. ఇక్కడ "అహంకార" శబ్దమునకు అర్థము అదియే యగును.

2. మహతత్త్వము (పెద్దది) సమష్టిబుద్ధి యనియు చెప్పబడునది. సమష్టి యంతఃకరణముయొక్క యొక భేదము, అదియే యిక్కడ బుద్ధి యనబడెను.

3. ఇక్కడ అవ్యక్తమనగా మూలప్రకృతి యని తెలియవలెను. అది మహత్త్వాది సమస్త పదార్థములకు కారణరూపము. సాంఖ్య శాస్త్రములో దానికి ప్రధానమని పేరు. భగవంతుడు భగవద్గీత పదునాల్గవ అధ్యాయం మూడవ శ్లోకములో అది మహద్బ్రహ్మ అని చెప్పెను. ఈ యధ్యాయము పందొమ్మిదవ శ్లోకములో అదియే "ప్రకృతి" యని చెప్పెను.

4. వాక్కు-హస్త-పాద ఉపస్థ (ప్రజననేంద్రియము) పాయు (గుదస్థానము) ఈ యైదు కర్మేంద్రియములు త్వక్ (చర్మము)- చక్షుస్. శ్రోత్ర - జిహ్వా- ఘ్రాణ (ముక్కు)ములు ఐదు జ్ఞానేంద్రియములు ఈ పది యింద్రియములకున్న కారణము అహంకారమగును.

5. ఇక్కడ "ఏక" శబ్దముచేత సమష్టి యంతఃకరణముయొక్క మననము చేయగలుగు శక్తి విశేషము సంకల్ప- వికల్పములే స్వరూపముగా గలదియునైన మనస్సు మాత్రమే తెలుపబడినది. కాని సాధారణ మనస్సు కాదు. ఈ మనస్సుగూడ అహంకారమునకు కార్యమే యగును. అనగా అహంకారమునుండి పుట్టినదేయగును.

అనగా శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు[1అ].

"ఇచ్ఛాద్వేషః సుఖం దుఃఖం సంఘాతశ్చేతనా ధృతిః।
ఏతత్ క్షేత్రం సమాసేన సవికారముదాహృతమ్ ॥ 6

అర్జునా! ఇచ్ఛా[1], ద్వేషము[2], సుఖము[3], దుఃఖము[4]. స్థూలదేహ సమష్టి రూపము, చేతనము[5], ధైర్యము[6] ఈ విధములైన వికారములతో గూడిన యీ

---

1అ. ఇక్కడ "పంచ ఇంద్రియగోచరాః" అను పదములకు శబ్ద-స్పర్శ-రూప రస-గంధములు యని యర్థము. అవియైదు ఇంద్రియములకు గూడ స్థూల విషయములు అవి సూక్ష్మ భూతములయొక్క కార్యములు. వానినుండి పుట్టినవి.

1. మనుష్యుడు ఏ పదార్థములు సుఖహేతువులు దుఃఖనాశకములునని తలచుచు వానిని పొందుటకు కోరునో వాసనా-తృష్ణా ఆశా లాలసా-స్పృహా ఇత్యాద్యనేక బేదముగల ఆ ఆసక్తిసహిత కామనయే ఇక్కడ "ఇచ్ఛా" అను శబ్దమునకు అర్థము.

2. మనుష్యుడు ఏ పదార్థములు దుఃఖహేతువులు సుఖసాధకములు నని తలచునో వానియందుగల విరోధబుద్ధి ద్వేషము అనబడును. దాని స్థూల రూపము వైరము-ఈర్ష్య-అసహ్యాభావము-క్రోధము ఇత్యాదులగును.

3. అనుకూల వస్తుప్రాప్తి. ప్రతికూల వస్తు నివృత్తి కలిగినప్పుడు అంతఃకరణము నందు కలిగిన ప్రసన్నత్వ వృత్తి సుఖము అనబడును.

4. ప్రతికూల వస్తుప్రాప్తి- అనుకూల వస్తు వినాశనము కలిగినపుడు అంతఃకరణమునందు కలుగు వ్యాకులత్వము అనగా వ్యథ బాధ దుఃఖము అనబడును.

5. 6. ప్రాణులు దేనిద్వారా సుఖ దుఃఖములను సమస్త పదార్థములను అనుభవించెదరో భగవద్గీత పదవ అధ్యాయము ఇరువది రెండవ శ్లోకములో ఏది చేతనా అని చెప్పబడెనో, ఆ అంతఃకరణమునందలి జ్ఞానశక్తియే యిక్కడ చేతనా యను శబ్దమునకు అర్థము. ఇదిగూడ అంతఃకరణము

క్షేత్రమునుగూర్చి సంక్షేపముగా చెప్పబడినది[1].

సంబంధము :

ఈ విధముగా క్షేత్ర స్వరూపమును, క్షేత్ర వికారములనుగూర్చి వర్ణించిన తరువాత ఇప్పుడు భగవంతుడు రెండవ శ్లోకములో చెప్పబడిన క్షేత్ర-క్షేత్రజ్ఞ జ్ఞానమే నా యభిప్రాయములో "జ్ఞానము" అని చెప్పి ఆ జ్ఞానమును పొందుటకు కావలిసిన సాధనముల "జ్ఞానము"నే ఐదు శ్లోకములలో వర్ణించుచున్నాడు.

"అమానిత్వ[2] మదంభిత్వ[3] మహింసా క్షాంతిరార్జవమ్ ।
ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మవినిగ్రహః ॥" 7

---

యొక్క వృత్తి విశేషమేయగును. కనుకనే దీని గణనముగూడ క్షేత్ర వికారములలో చెప్పబడినది.

భగవద్గీత పదునెనిమిదవ అధ్యాయము ముప్పదిమూడవ ముప్పది నాలుగవ ముప్పదియైదవ శ్లోకములలో చెప్పబడిన సాధారణశక్తి యొక్క సాత్విక-రాజస-తామస భేదములే యిక్కడ ధృతి యను శబ్దమునకు అర్థము. ఇది అంతఃకరణ వికారము కాబట్టి దీని గణనముగూడ క్షేత్ర వికారములలో చేయబడినది.

1. ఇంతవరకు వికారసహిత క్షేత్రము సంక్షేపముగా వర్ణించబడినది. అనగా ఐదవ శ్లోకములో క్షేత్రస్వరూపము సంక్షేపముగా చెప్పబడినది. ఆరవ శ్లోకములో క్షేత్రవికారములు సంగ్రహముగా వర్ణింపబడినవి.

2. తాను శ్రేష్ఠుడను- సమ్మాన్యుడను- పూజ్యుడను అథవా చాలా గొప్పవాడను అని తలచుట గౌరవ మహనీయత్వములు పూజా-ప్రతిష్ఠలు ఇత్యాదులు తానుకోరుట అథవా తాను కోరకయే యివియన్నియు లభించినప్పుడు సంతుష్టుడైయుండుట ఇవన్నియు గలిగియుండుట మానిత్వము అనబడును. ఇది లేకుండుటయే అమానిత్వము.

3. గౌరవ-మహత్వ-ప్రతిష్ఠలు పూజాదులకొరకు ధన లోభముచేత లేదా,

"అర్జునా! తాను శ్రేష్ఠుడనను నభిమానము-దంభాచారము లేకుండుట ఏ ప్రాణి కోటిని గూడా ఏ విధముగా గూడా బాధింపకుండుట[1] ఓర్పు గలిగి యుండుట[2] మనస్సులో, వాక్కులోను, సరళత్వము గలిగియుండుట[3] శ్రద్ధా

---

ఇతరుల మోసగించుట మున్నగు అభిప్రాయములచేత, తాను ధర్మాత్ముడు-దానశీలుడు-భగవద్భక్తుడు-జ్ఞాని-అథవా-మహాత్ముడు'నని తన ప్రఖ్యాతి పొందుట, ధర్మ పాలనము-ఔదార్యము-దాతృత్వము భక్తి యోగ సాధనము వ్రతోపవాసాదులు-అథవా, ఇతర గుణములేవియు లేకుండనే, దంబముతో వ్యవహరించుట 'దంభిత్వము' అనబడును. ఈ దంబాచారము పూర్తిగా లేకుండుట 'అదంభిత్వము' అనబడును.

1. మనస్సుచేత ఎవరికైనను చెడు తలచుట, వాక్కుచేత ఎవరినైనా నిందించుట, కఠినముగా మాట్లాడుట, దుఃఖము కలిగించు అహితమైన మాట మాట్లాడుట, శరీరము చేత ఎవరినైనా కొట్టుట, కష్టపెట్టుట, హాని కలిగించుట మొదలైన హింసాకార్యములు మనోవాక్కాయముల చేత తలపెట్టు హింసాభావములేవియు లేకుండుట "అహింస" అనగా ఏ ప్రాణిని గూడా ఏ విధముగ గూడా బాధపెట్టకుండుట యనబడును.

2. తనకు అపరాధము చేసిన వారికి ఎలాంటి దండనను విధించు భావము మనస్సులో నుంచుకొండుట అతనికి ప్రతీకారము గాని అతనికి ఈ లోకములో పరలోకములోను దండనము విధించబడుగాక యని కోరకుండుట అతడు చేసిన అపరాధములు, అపరాధములనియే తలచకుండ వానిని పూర్తిగా మరచియుండుట గాని, క్షమాభావము అనబడును. భగవద్గీత పదవ అధ్యాయము నాలుగవ శ్లోకములో ఇది విస్తృతముగా చెప్పబడినది.

3. మనోవాక్కాయములందు పూర్తిగా సరళభావముగల సాధకుడు అందరి పట్ల సరళముగానే వ్యవహరించును. అతనికి కుటిలత్వమే యుండదు. అనగా అతని వ్యవహారములో చిక్కులు, కపటములు, కుట్రలు కొంచము గూడ ఉండవు. అతడు అంతరంగములోను బాహ్యముగాను ఎల్లప్పుడూ సమానముగా సరళముగా నుండును.

భక్తులతో గురువుల సేవచేయుట[1] అంతరంగములో బాహ్యము గాను పరిశుద్ధముగా నుండుట[2] అంతఃకరణము యొక్క స్థైర్యము[3] మనస్సును, ఇంద్రియములను, శరీరమును నిగ్రహించి యుంచికొనుట.[4]

---

1. విద్య నేర్పి నదుపదేశము చేయు గురువు "ఆచార్యుడు" అనబడును. అట్టి గురువు కడ శ్రద్ధాభక్తులతో మనోవాక్కాయములచేత సర్వవిధముల ఆ గురువునకు సుఖము కలిగించుటకు ప్రయత్నించుట, నమస్కరించుట ఆయన యాజ్ఞను పాలించుట, ఆయనకు అనుకూలములైన ఆచరణములు చేయుట ఇత్యాదులు "ఆచార్యోపాసనములు"- అనగా గురుసేవ అనబడును.

2. సత్యముగా పరిశుద్ధమైన వ్యవహారము ద్వారా సంపాదింపబడిన ద్రవ్యము "పరిశుద్ధ ద్రవ్య మనబడును. ఆ ద్రవ్యము చేత సంపాదింపబడిన ఆహారవస్తువులు గూడా పరిశుద్ధములై యుండును. అది పరిశుద్ధాహారము సద్వ్యవహారముచేత చేయబడిన ఆచరణము గూడ పరిశుద్ధములగును. జలముచేత, మట్టిచేత, శరీరము పరిశుద్ధమగును. వానిచేత శరీర క్షాళనము చేయవలెను అని భావము. ఇదంతయు బాహ్యశుద్ధమగును.

3. రాగద్వేషములు, కపట కల్మషములు మొదలైన వికారములు నశించి అంతఃకరణము స్వచ్ఛమగుట. "ఆంతరంగిక పరిశుద్ధి" యనబడును. ఈ రెండు విధములైన పరిశుద్ధములు "శౌచము" అనబడును.

4. పెద్ద పెద్ద కష్టములు-విపత్తులు-భయములు-దుఃఖములు సంభవించినపుడు గూడా చలింపకుండుట కామ-క్రోధ-భయ లోభాదులచేత తన ధర్మమును-కర్తవ్యమును కొంచెము గూడ విడువకుండుట, మనోబుద్ధులందు ఎలాటి చంచలత్వము లేకుండుటయే "అంతఃకరణముయొక్క స్థిరత్వమనబడును. ఇక్కడ ఆత్మ యనగా ఇంద్రియ మనస్సహిత శరీరమని గ్రహించవలెను. కనుక వీటిని వశపరచుకొనుటయే వీని నిగ్రహమనబడును.

"ఇంద్రియార్థేషు వైరాగ్య[1] మనహంకార[2] ఏవచ ।
జన్మమృత్యు జరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్ ॥" 8

"అర్జునా! ఇహలోక-పరలోకముల యొక్క సుఖభోగములయందు ఆసక్తి లేకుండుట అహంకారము గూడా లేకుండుట, జన్మ-మృత్యు-జరారోగాదులందు దుఃఖములు, దోషములునున్నవని మాటిమాటికి విచారణ చేయుట[3]

---

1. ఇహ పరలోకములందు ఎన్నియైతే శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములనెడు విషయ పదార్థములున్నవో ఏవి యింద్రియములచేత అనుభవించబడునో వేనిని మనుష్యుడు అజ్ఞానముచేత సుఖహేతువులని తలచునో కాని వాస్తవముగా ఏవి దుఃఖహేతువులో ఆ యన్నిటియందు ప్రేమ లేకుండుట "ఇంద్రియార్థేషు వైరాగ్యం" అనబడును.

2. మనోబుద్ధీంద్రియ శరీరములు అనాత్మ వస్తువులు. వీనియందు అజ్ఞానముచేత "ఆత్మ బుద్ధి" అనగా "అహం" (నేను) అని బుద్ధి కలుగుచున్నది. ఈ దేహాభిమానము పూర్తిగాలేకుండుట "అహంకారం" మనబడును.

3. జనన కష్టము సామాన్యమైనది కాదు. మొదట అసహాయుడైన జీవునకు తల్లి గర్భములో వివిధ క్లేశములు కలుగును. పిదప జన్మసమయమందు యోనిద్వారము నుండి బయలువెడలునప్పుడు అలవికాని యంత్రణము (ఒత్తిడి) కలుగును. ఆ దుఃఖమనుభవించవలెను. అనేక యోనులలో మాటిమాటికి ఈ జన్మించుటలో ఈ జన్మ దుఃఖములు కలుగుచుండును. మరణకాలమందు గూడ మహా కష్టము గలుగును. జీవితాంతము మమకారము గల శరీరము ఇట్లు బలవంతముగా విడువవలసి వచ్చును. మరణకాలము నందు నిరాశ గల నేత్రములు-శారీరక బాధలు చూచి ఆ సమయమందు అతడనుభవించు బాధ చాలావరకు ఊహించవచ్చును వార్ధక్యములోని బాధలుగూడ తక్కువైనవి కావు. ఇంద్రియములు శిథిలములై శక్తిహీనములగును. శరీరము జర్జర(శిథిల)మగును. మనస్సులో సర్వదా ఆశాతరంగములు లేచుచుండును. వృద్ధాప్య దశ అసహాయమగును. ఈ మనస్సులోని కష్టములు మిక్కిలి భయంకరములుగా నుండును. ఇట్లే జబ్బుపడినప్పటి బాధలు

"అనస క్తి[1] రనభిష్వంగః[2] పుత్రదార గృహాదిషు।
నిత్యంచ సమచిత్త్వం ఇష్టానిష్టోపపత్తిషు[3] ॥" 9

అర్జునా! భార్యా పుత్ర ధన గృహాదులందు అనస క్తి లేకుండుట, మమ కారము లేకుండుట ప్రియాప్రియములు కలిగినప్పుడు సర్వదా చిత్తము సమ ముగా నుండుట

---

కూడా మిక్కిలి దుఃఖకరములు. శరీరము క్షీణించి ఓర్వజాలని వివిధ కష్టములు గలిగి పరాధీనమగును. అది నిరుపాయస్థితిలో నుండును. ఇవన్నియే "జన్మ-మృత్య-జరా-వ్యాధి దుఃఖములనబడును. ఈ దుఃఖము లను మాటిమాటికి స్మరించుట, వానిని గూర్చి విచారించుటయే వీనియందు దుఃఖములను చూచుటయగును. జీవులకు వారి పాపకర్మల పరిణామముగా ఈ జన్మ-మృత్యు-జరా-వ్యాధులు కలుగును. కనుకనే ఈ నాలుగున్ను దోషమయములు. ఈ విషయమునే మాటిమాటికి విచారించుట వీనిలో దోషములు చూచుటయగును.

1. ఎనిమిదవ శ్లోకములో ఇంద్రియార్థములందు, వైరాగ్యమును గూర్చి చెప్ప బడినప్పటికిని, భార్యా-పుత్ర-గృహ-ధన శరీరాదిపదార్థములతో మనుష్యు నకు విశేష సంబంధముండుటచేత తరచుగా ఈ పదార్థమునందు అతనికి విశేషాసక్తి యుండును. ఇందుచేతనే వీనియందు పూర్తిగా అనస క్తి లేకుండుటను గూర్చి వేరుగా విశేషించి చెప్పబడినది.

2. అహంకారభావ విషయము పూర్వ శ్లోకము నందలి "అనహంకారః" అను పదములో స్పష్టముగా చెప్పబడినది. ఇందుచేతనే యిక్కడ "అన భిష్వంగ" శబ్దము యొక్క అర్థము మమకారాభావము అని చెప్పబడినది.

3. అనుకూల వస్తువు లభించుటచేత ప్రతికూలవస్తువు వియోగము చేత మన స్సులో హర్షాదులు కలుగకుండుట ప్రతికూల వస్తువు సంబంధము చేత అనుకూల వస్తువు వియోగముచేత శోక, భయ, క్రోధాదులు కలుగ కుండుట సర్వదా నిర్వికారముగా ఏక రసముగా సమముగా నుండుట ప్రియాప్రియములు కలిగినపుడు సమచిత్త్వ మనబడును.

“మయి చానన్య యోగేన భక్తిరవ్యభిచారిణీ ।
వివిక్త[1] దేశ సేవిత్వమ[2] రతిర్జనసంసది ॥” 10

“అర్జునా! పరమేశ్వరుడనైన నాయందు అనన్యయోగము చేత చెదరని అచంచల భక్తి[3] ఏకాంతము పరిశుద్ధమైన ప్రదేశము నందుండు స్వభావము విషయాసక్తులైన జనుల సముదాయములో ప్రేమ లేకుండుట.

---

1. ఎక్కడైతే ఏ విధమైన అల్లరి సందడి యుండదో ఇతరులెవ్వరు ఉండరో ఎక్కడ ఉండుటచేత ఎవరికి గూడ అభ్యంతరము క్షోభ ఉండవో ఏ విధమైన మురికి యుండదో ముండ్లు పాషాణములు నుండవో కుష్ఠు మొదలైన రోగములు గలవారుండరో, ఎక్కడ పకృతి సుందరముగా నుండునో జలము,వాయువు,వాతావరణము, నిర్మలములు పవిత్రములుగా నుండునో ఏ విధమైన రోగములు ఉండవో క్రూర జంతువుల హింసలు ఉండవో, ఎక్కడ స్వాభావికము గానే సాత్త్వికభావము నిండియుండునో అటువంటి దేవాలయ-తపోభూమి-గంగాది పవిత్ర నదీతీర-పవిత్రవన గిరి గుహాది నిర్జన ఏకాంత పరిశుద్ధ ప్రదేశము వివిక్త దేశ మనబడును. జ్ఞాన ప్రాప్తి సాధనకొరకు ఇటువంటి స్థానమునందు నివసించుటయే దానిని సేవించుట అనబడును.

2. ఇక్కడ ‘జనసంసది’- అను పదమునకు ఎమరుపాటు కలిగించునది, విషయాసక్తులైన సాంసారిక మనుష్య సముదాయమని యర్థము. ఇట్టివారి సంగము, సాధనమునందు సర్వవిధబాధకమని తలచి దానినుండి విరక్తుడై యుండుటయే, ఆ సంగమును ప్రేమించకుండుట యనబడును. సత్పురుషులు-మహాత్ములు-సాధకులు నైన పురుషుల సంగము సాధనములో సహాయకమగును. గనుక ఇక్కడ ‘జనసంసది’ పదార్థము అట్టివారని తెలియవలెను.

3. భగవంతుడే సర్వశ్రేష్ఠుడు-ఆయనయే మన ప్రభువు, శరణము చెందదగిన వాడు, పరమగతి-పరమాశ్రయుడు, తల్లి, తండ్రి, సోదరుడు, బంధువు, పరమహితకరుడు, పరమాత్మీయుడు సర్వస్వముగా నున్నాడు. ఆయన దప్ప మరియొకడెవ్వడును లేడు. అను అభిప్రాయము చేత భగవంతు

"అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వం తత్త్వజ్ఞానార్థ దర్శనమ్ ।
యేతజ్ జ్ఞాన మితి ప్రోక్త మజ్ఞానం యదతో౽న్యథా ॥" 11

"అర్జునా! అధ్యాత్మ జ్ఞానము నందు సర్వదా యుండుట[1] తత్త్వజ్ఞానము యొక్క అర్థమైన పరమాత్మనే చూచుట[2] ఇవన్నియు జ్ఞానము[3] అనబడును. దీనికి

---

నితో అనన్య సంబంధము గలిగియుండుటయే- 'అనన్యయోగ' మన బడును. ఇట్టి సంబంధముచేత కేవలము భగవంతునియందు మాత్రమే, అచంచలము, పరిపూర్ణము విశుద్ధమునైన ప్రేమగలిగియుండి నిరంతరము భగవద్భజన, ధ్యానములు చేయుచుండుటయే అనన్యయోగము చేత భగ వంతునియందు చెదరని భక్తి కలిగియుండుట యనబడును.

1. ఆత్మనిత్యుడు చేతనుడు నిర్వికారుడు అనివాని ఆత్మకన్న వేరైన నాశ వంతములు జడములు వికారము చెందునవి. మార్పు చెందునవియు నైన వస్తువులన్నియు అనాత్మవస్తువులని తెలియవలెను. వానిలో ఆత్మకు ఎలాంటి సంబంధము లేదు అని బోధించు శాస్త్రములయొక్క ఆచార్యుల యొక్క నుపదేశముచేత ఇట్టి ఆత్మతత్త్వమును బాగుగా తెలిసికొనుటయే "అధ్యాత్మజ్ఞానమనబడును" బుద్ధిలో అట్లే దృఢ నిశ్చయము గలిగి యుండి మనస్సుచేత ఆత్మతత్త్వమును నిరంతరము మననము చేయు చుండుట అధ్యాత్మ జ్ఞానములో సర్వదా ఉండుట యనబడును.

2. ఆత్మజ్ఞానమనగా 'సచ్చిదానంద ఘన' పరిపూర్ణ బ్రహ్మ, పరమాత్మ యని యర్థము. ఎందుకనగా తత్త్వజ్ఞానముచేత ఆయన ప్రాప్తియే సిద్ధించును. ఆ సచ్చిదానందఘన, గుణాతీత-పరమాత్మను అంతట సమ భావములో సర్వదానిరంతరము అనుభవించుచుండుటయే 'ఆ తత్త్వజ్ఞాన మునకు అర్థమైన పరమాత్మను దర్శించుట యనబడును.

3. అమానిత్వం నుండి 'తత్త్వజ్ఞానార్థ దర్శనం'వరకు వర్ణింపబడినవన్నియు జ్ఞానప్రాప్తి సాధనములగును గనుక వాని పేరుగూడ 'జ్ఞానమనియే పెట్టబడెను. ఇందలి అభిప్రాయమేమనగా రెండవ శ్లోకమునందు భగ వంతుడు 'క్షేత్రక్షేత్రజ్ఞుల జ్ఞానమే నా యభిప్రాయములో జ్ఞానమగును

వివరీతముగా నున్నది అజ్ఞానము[1] అనబడును.

సంబంధము—

ఈ విధముగా జ్ఞాన సాధనములు "జ్ఞానము" అను పేరుతో చేయబడిన వర్ణనము వినిన తరువాత ఈ సాధనముల ద్వారా పొందిన జ్ఞానము చేత తెలుసుకొనదగిన వస్తువు ఏది! దీనిని తెలిసికొనుటచేత ఏమగును? అను జిజ్ఞాస కలుగ వచ్చును. దీనికి ఉత్తరమిచ్చుటకు భగవంతుడిప్పుడు తెలిసికొనదగిన వస్తువు యొక్క స్వరూపమును వర్ణించుటకు ప్రతిజ్ఞచేయుచు దీనిని తెలిసికొనుటవలన గలుగు ఫలము "అమరత్వప్రాప్తి" యని తెలిపి ఆరుశ్లోకములలో అందరికిన్ని తెలిసికొనదగిన పరమాత్మ యొక్క స్వరూపమును వర్ణించుచున్నాడు.

---

యని చెప్పియుండెను. ఆ కథనముచేత శరీరము పేరు క్షేత్రముదానిలో నుండు జ్ఞాతయైన ఆత్మ పేరు క్షేత్రజ్ఞుడు అని తెలిసినది వాస్తవముగా పైన చెప్పవడిన యిరువది సాధనముల ద్వారా క్షేత్రక్షేత్రజ్ఞ స్వరూప మును యథార్థరూపములో తెలుసికొనిన తరువాత గలిగిన జ్ఞానమే సత్య మైనది. ఈ విషయమును తెలుపుటకే యిక్కడ ఈసాధనములు 'జ్ఞానము' అను పేరులో చెప్పబడినవి. కనుకనే జ్ఞానవంతునిలో పైన చెప్పబడిన గుణముల యీ సమావేశము మొదటినుండియే యుండుట ఆవశ్యకము కాని ఈగుణములన్నియు సాధకులందరియందున్ను ఒకేసారి ఉండవలసిన యావశ్యకతలేదు. ఈ గుణములలో 'అమానిత్వ' అదంభిత్వాది గుణము లనేకములు అందరికిన్ని ఉపయోగకరములు కనుక అవి అందరిలోను ఉండనే యుండును. ఇవిగాక 'అవ్యభిచారిణీ భక్తి' ఏకాంతదేశసేవిత్వ అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వ-తత్త్వజ్ఞానార్థ దర్శనములన బడు గుణములలో వారి వారి సాధన పద్ధతి ననుసరించి భిన్నములు (వికల్పముగా) గూడ నుండవచ్చును.

1. పైన చెప్పబడిన అమానిత్వాది గుణములకు వ్యతిరేకములైన గౌరవ ప్రతిష్ఠలు కోరుట, దంభాచారము, హింస, క్రోధము, కపటము కుటిల త్వము, ద్రోహము అపవిత్రత్వము, అస్థిరత్వము, లోలుపత్వము (ఆశ)

"జ్ఞేయం[1] యత్ తత్ప్రవక్ష్యామి యజ్ జ్ఞాత్వాఽమృతమశ్నుతే।
అనాదిమత్ పరం బ్రహ్మ[2] నసత్ తన్నాసదుచ్యతే॥" 12

"అర్జునా! ఏది తెలిసికొనదగినదో దేనిని తెలుసుకొని మనుష్యుడు పరమానందము పొందునో దానిని గూర్చి బాగుగా తెలిపెదను. అది అనాది పరబ్రహ్మము అది 'సత్తు' అని కాని 'అసత్తు' అని చెప్పుటకు వీలుపడదు.[3]

---

ఆసక్తి అహంకారము, మమకారము, వైషమ్యము (అసమభావము), అశ్రద్ధ, దుస్సంగాది దోషములన్నియు జననమరణహేతువైన అజ్ఞానము వృద్ధిపొందించునవి, జీవుని పతనమునకు హేతువులైనవి కాబట్టి అవన్నియు అజ్ఞానములే యగును. కనుకనే ఆయన్ని దుర్గుణములను విడువవలెను.

1. ఇక్కడ జ్ఞేయం అను పదమునకు సచ్చిదానంద ఘన-నిర్గుణ-సగుణ బ్రహ్మమని యర్థము. ఎందుకనగా ఈ ప్రకరణము నందే భగవంతుడు స్వయముగా ఆ బ్రహ్మము నిర్గుణము గుణభోక్తయనియు తెలిపెను.

2. ఇక్కడ "పరం" అను విశేషణముతో గూడిన "బ్రహ్మ" పదము అజ్ఞేయ తత్త్వమే నిర్గుణ-నిరాకార- సచ్చిదానంద-ఘన-పరబ్రహ్మ- పరమాత్మ అను విషయము తెలుపునుద్దేశ్యముతో ప్రయోగింపబడినది. "బ్రహ్మ" పదమునకు వేదము-బ్రహ్మదేవుడు ప్రకృతి యను అర్థము గూడ గలదు. కనుకనే జ్ఞేయ తత్త్వము యొక్క స్వరూపము. వానికన్న వేరని తెలుపుటకే బ్రహ్మ పదముతో "పరం" విశేషణము చేర్చబడినది.

3. ప్రమాణముల చేత నిరూపింపబడు వస్తువు "సత్" అనబడును. స్వతః ప్రమాణము-నిత్యము. అవినాశియునైన పరమాత్మ ఏ ప్రమాణముచేత గూడ నిరూపింపబడ జాలడు. ఎందుకనగా అన్నింటి నిరూపణము పరమాత్మ చేతనే యగును. ఏ ప్రమాణము గూడ పరమాత్మ వరకు పోవదు. ఆయన ప్రమాణములచే తెలిసికొనబడు వస్తువులకన్న మిక్కిలి విలక్షణమైనవాడు గనుక పరమాత్మ "సత్" అని చెప్పబడజాలడు. వాస్తవముగా అస్తిత్వము లేని వస్తువు "అసత్" అనబడును. కాని పరబ్రహ్మ

పరమాత్మకు అస్తిత్వము లేదని చెప్పుటకు వీలుకాదు. ఆయన అవశ్య ముగా ఉన్నాడు. సందేహములేదు. ఆయననుండియే ఇతరవస్తువులన్నియు సిద్ధించును గనుక ఆయనను "అసత్" అని చెప్పుటకు గూడ వీలుపడదు. ఇందుచేతనే పరమాత్మ సత్-అసత్ ఈ రెంటికి అతీతుడు.

భగవద్గీత తొమ్మిదవ అధ్యాయము పందొమ్మిదవ శ్లోకము నందైతేనో భగవంతుడు "సత్తు" నేనే "అసత్తు" గూడ నేనేయని చెప్పెను. ఇక్కడ జ్ఞేయ పరమాత్మ "సత్" అనుటకు "అసత్" అనుటకున్ను వీలుపడదు. అని ఆయనయే చెప్పెను. కాని అక్కడ "నేనే" అని విధిపూర్వకముగా చెప్పెను గాబట్టి పరమాత్మ సదసత్స్వరూపుడనుట యుచితము. కాని యిక్కడ నిషేధరూపములో చెప్పబడెను. వాస్తవముగా విచారించినచో ఆ పరబ్రహ్మ పరమాత్మ స్వరూపము వాక్కుచేత విధిరూపంలో నిషేధ రూపములోను చెప్పుటకువీలుపడదు. ఆయన విషయము కేవలము "శాఖా చంద్ర న్యాయము" చేతనే చెప్పి ఆ స్వరూపము తెలుపవచ్చును. (సర్వత్ర వ్యాపించియున్న చంద్రుడు చెట్టుకొమ్మపైన ఉన్నాడు అని చూపుట (శాఖాచంద్ర న్యాయము) అంతయే కాని పరమాత్మయొక్క సాక్షాత్ స్వరూపమును వాక్కుచేత చెప్పుటకు సాధ్యం కానేకాదు. ఈ విషయమే వేదముకూడా చెప్పుచున్నది. "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" (తైత్తిరీయోపనిషత్తు 2-9) అనగా మనస్సుతో కూడినవాక్కు దేనిని పొందజాలక తిరిగివచ్చునో (అది బ్రహ్మము) అని ఈవిషయము స్పష్టము చేయుటకే యిక్కడ భగవంతుడు ఆ పరమాత్మ "సత్" అని "అసత్" అనియు చెప్పబడదు అని నిషేధ ముఖమున చెప్పెను- అనగా నేను ఏ జ్ఞేయ వస్తువును వర్ణింప గోరుదునో దేని వాస్తవ స్వరూపమును మనస్సునకు, వాక్కునకును గోచరము గాదో. దాని వర్ణనము చేయవలసినయెడల ఆ పరమాత్మను "తటస్థ లక్షణ ముతో అనగా శాఖాచంద్ర న్యాయము వలె తెలుపవలెను. ఏ విధముగ తెలిపినను అది తటస్థ లక్షణమేయగును.

"సర్వతః పాణిపాదం యత్ సర్వతోఽక్షి శిరోముఖమ్ ।
సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి[1] ॥" 13

అర్జునా! అది అన్ని వైపుల చేతులు కాళ్ళుగలది. అన్ని దిక్కుల నేత్ర ముఖశిరస్సులు గలది, అన్నిదిశల కర్ణములుగలది.[2] ఎందుకనగా నది ప్రపంచ మంతటా వ్యాపించియున్నది.[3]

"సర్వేంద్రియ గుణాభాసం సర్వేన్ద్రియ వివర్జితమ్ ।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ ॥" 14

---

1. ఈ శ్లోకము శ్వేతాశ్వతరోపనిషత్తు (3-16)లో ఇక్కడ ఉన్నట్లు అక్షరశ ఉన్నది.

2 ఈ పరబ్రహ్మ-పరమాత్మ అన్ని వైపుల చేతులు గలవాడు.

ఆయనకు ఏ వస్తువు ఏ వైపునుండి సమర్పించినను అక్కడినుండియే గ్రహించుట కాయన సమర్థుడు. ఇట్లే ఆయన అన్ని వైపుల కాళ్ళు కల వాడు. ఏ భక్తుడు ఎక్కడ నుండి ఆయన చరణములకు నమస్కరించిన నను అక్కడి నుండియే స్వీకరించును. అన్నిచోట్ల కన్నులు గలవాడు గనుక ఆయనకుకనబడకుండా ఏ పని చేయుటకుగూడా వీలుపడదు. ఆయన శిరస్సు అన్ని యెడలనుండును. కనుక ఎక్కడినుండి భక్తులు ఆయనకు పూజాపుష్పములు సమర్పించినను ఆయన తలపైననే పడును. ఆయన ముఖము గూడ అన్ని దిక్కుల నుండును గనుక ఆయనకు భక్తులు ఏ దిక్కునుండి ఆహారము పెట్టినను ఆయన నైవేద్యము స్వీకరించును అనగా ఆయన జ్ఞేయ స్వరూపుడైన పరమాత్ముడు, అందరికి సాక్షి భూతుడు అన్నిటిని చూచువాడు అందరి పూజ స్వీకరించువాడు, నైవే ద్యము గైకొనువాడు, ఆయన అన్నియెడల వినుశక్తి గలవాడు, భక్తు డెక్కడినుండి ఆయనను స్తుతి చేసినను ప్రార్థన చేసినను యాచించినను అన్ని వినును.

3. పృథివీ-జల-వాయు-అగ్నులకు కారణమగుటచేత ఆకాశము యన్నింటిలో వ్యాపించియున్నట్లు జ్ఞేయ స్వరూపుడైన పరమాత్మ గూడ చరాచర జీవ సహిత సర్వ జగత్తుకు కారణభూతుడగుట చేత అన్నిటియందు వ్యాపించి యున్నాడు. కనుక సర్వత్ర నిండియున్నాడు.

"అర్జునా! అది ఇంద్రియ విషయములన్నిటిని తెలిసికొనునది. కానీ వాస్తవముగా ఏ యింద్రియములు దానికి లేవు[1] దానికి ఏ యాసక్తియు లేకున్నను అది అన్నిటిని ధరించి పోషించునది. అది నిర్గుణమైనప్పటికిన్ని గుణములను అనుభవించునదిగా నున్నది.[2]

"బహిరంతశ్చ భూతానామచరం చరమేవచ ।
సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాంతికేచతత్[3]॥" 15

---

1. ఇందలి అభిప్రాయమేమనగా పరమాత్మ హస్త పాదా ద్యవయవములు ఇంద్రియములు సర్వత్ర వ్యాపించి యున్నాడని పదమూడవ శ్లోకములో చెప్పబడెను. గాబట్టి ఆ జ్ఞేయ స్వరూపుడు ఇతర జీవుల వలె కర-చరణా ద్యవయవములు గలవాడని తలచగూడదు. పరమాత్మకు ఇవి ఏవియు లేకున్నప్పటికిని అంతట ఆయా యింద్రియ విషయములను గ్రహించుటలో సమర్థుడగును కనుక పరమాత్మ అంతటను అన్ని ఇంద్రియములతో నున్నాడని ఇంద్రియరహితుడని చెప్పబడెను. శృతిలో గూడ "అపాణి పాదో జవనో గ్రహీతా పశ్యత్యచక్షుః స శృణోత్యకర్ణః" (శ్వేతాశ్వతరోపనిషత్తు) (3-19)

   అనగా, ఆ పరమాత్మ హస్త పాదములు లేకున్నను వేగముగా పోవును. పట్టుకొనును. నేత్రములు లేకున్నను చూడగలడు. కర్ణములు లేకున్నను వినగలడు అని చెప్పబడినది కనుకనే పరమాత్మ స్వరూపము అలౌకికమని ఈ వర్ణనములో తెలుపబడినది.

2. ఇందలి అభిప్రాయమేమనగా పరమాత్మ అన్ని గుణముల భోక్తయైనను ఇతర జీవుల వలె ప్రకృతి గుణ సంబంధమతనికి లేదు. ఆయన వాస్తవముగా గుణాతీతుడైనను ప్రకృతి సంబంధముచేత అన్ని గుణములకు భోక్త. ఇదియే అతని యలౌకికత్వము.

3. శృతిలో గూడ "తదేజతి తన్నైజతి తద్ దూరే తదంతికే తదంతరస్య సర్వస్య తత్ సర్వస్యాస్య బాహ్యతః" (ఈశో.5)

   అనగా అతడు నడుచును. నడుపడు గూడ అతడు దూరమందున్న

"అర్జునా! అది చరాచర భూతములన్నింటిలోను[1] లోపల బయట సంపూర్ణముగా వ్యాపించియున్నది. చరాచర భూత స్వరూపము గూడ అదియే. అది సూక్ష్మము గాబట్టి అవిజ్ఞేయము (తెలిసికొనుటకు వీలుకానిది)[2] మిక్కిలి సమీపము నందు- అతిదూరమునందు గూడ ఉన్నది అదియే.[3]

"అవిభక్తంచ భూతేషు విభక్త మివచస్థితమ్ ।
భూతభర్తృచ తజ్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణుచ ॥" 16

---

సమీపమందును ఉన్నాడు. అతడీ సమస్త ప్రపంచంలోపలను బయటను నున్నాడని యర్థము.

1. పరమాత్మ చరాచర భూతములలోపల బయట గూడ ఉన్నాడు అను మాటచేత చరాచర భూతము లతనికన్న వేరు అని యెవరు గూడ తలచరాదు. దీనిని స్పష్టపరచుటకే అతడే చరాచర "భూత స్వరూపుడు అని చెప్పబడెను. అనగా మంచుగడ్డ లోపల బయట నీరున్నట్లు ఆ గడ్డకూడా జలమే అయినట్లు దానిలో జలము తప్ప మరి యేదీయు లేనట్లు ఈ సమస్త చరాచర జగత్తు పరమాత్మ స్వరూపమే. ఆయనకన్నా భిన్నము కాదు అని తెలియవలెను.

2. సూర్యుని కిరణములలో పరమాణు రూపములోనున్న జలములు మనుష్యులకు దుర్విజ్ఞేయములు (తెలియబడజాలనివి) అయినట్లే సర్వవ్యాపియైన పరబ్రహ్మ పరమాత్మ గూడ ఆ పరమాణు రూప జలము కన్నను అత్యంత సూక్ష్మముగా నుండుటచేత సాధారణ మనుష్యులకు తెలియబడజాలదు.

3. సర్వ జగత్తు లోపట, బయట గూడ పరమాత్మ లేనిచోటు ఏదియు లేదు. కనుక ఆయన మిక్కిలి సమీపమునందు దూరమునందున్ను ఉన్నవాడు. ఎందుకనగా మనుష్యుడు దేనిని దూరము అని సమీపము అని తలచునో ఆ చోట్లలో నంతటను ఆవిజ్ఞానానంద ఘన పరమాత్మ సర్వదా పరిపూర్ణుడుగా విరాజమానుడై యున్నాడు. కనుక ఈ తత్త్వమును తెలిసికొను జీవులు శ్రద్ధాళువులైన మనుష్యులకు ఆ పరమాత్మ అతి సమీపమునందు శ్రద్ధారహితులకు అతి దూరములోను నున్నాడు.

అర్జునా! ఆ పరమాత్ముడు విభాగ రహితుడై ఆకాశమువలె ఏకరూపుడై పరిపూర్ణుడుగా నున్నప్పటికిని సమస్త చరాచర భూతములందు విభక్తుడై ఉన్నట్లు కనపడుచున్నాడు.[1] "జ్ఞేయ" (తెలియదగిన) మగు ఆ పరమాత్ముడు విష్ణురూపముతో అందరిని పుట్టించువాడు సుమా!

"జ్యోతిషామపి తజ్జ్యోతి స్తమసః[2] పరముచ్యతే।
జ్ఞానం జ్ఞేయం[3] జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్॥" 17

---

1. ఈ వాక్యముచేత జ్ఞేయ స్వరూపుడైన పరమాత్మ యేకత్వము ప్రతిపాదింపబడినది. ఇందలి అభిప్రాయమేమనగా మహాకాశము వాస్తవముగా విభాగరహితమైనను వేర్వేరు కడవల సంబంధముచేత అది విభజింప బడినట్లు తోచిన విధముగానే పరమాత్మ వాస్తవముగా విభాగ రహితుడైనను సమస్త చరాచర ప్రాణులందు క్షేత్రజ్ఞ రూపముచేత వేర్వేరుగా నున్నట్లు తోచును. కాని యాభిన్నత్వము కేవలము ప్రతీతి (తోచుట) మాత్రమే. వాస్తవముగా పరమాత్మ ఒక్కడే సర్వత్ర పరిపూర్ణుడు.

2. "తమసః" అను పదమునకు అంధకారము, అజ్ఞానము అనగా 'మాయ' యని యర్థము. పరమాత్మస్వయంజ్యోతి జ్ఞానస్వరూపుడు అంధకారము. అజ్ఞానము ఆయనవద్దకు కూడా చేరజాలదు. కనుక ఆయన మాయకంటే మిక్కిలి దూరముగా మాయాతీతుడుగా మాయ యేమాత్రము లేనివాడుగాను తెలుపబడెను.

3. ఆ పరంజ్యోతిని మరల "జ్ఞేయము" అని చెప్పి పన్నెండవ శ్లోకములో ఏ జ్ఞేయము ఆరంభింపబడెనో ఆ పరమాత్మ జ్ఞానము పొందుటయే ఈ ప్రపంచమునందు మనుష్య శరీరము యొక్క పరమ కర్తవ్యము. ప్రపంచమునందు తెలిసికొనదగినవి పరమాత్మస్వరూప మొక్కటియే. కనుకనే ఆ తత్త్వమును తెలిసికొనుటకు అందరుగూడ పూర్తిగా ప్రయత్నించవలెను. తమ అమూల్య జీవితమును సాంసారిక సుఖభోగములందు లగ్నముచేసి నష్టము చేయగూడదు.

"అర్జునా! ఆ పరబ్రహ్మ అన్ని జ్యోతులకు గూడ జ్యోతి యగును.[1] మాయాతీతుడు, జ్ఞాన స్వరూపుడు "జ్ఞేయ" (తెలిసికొనదగిన) స్వరూపుడు. తత్త్వ జ్ఞానము చేత పొందదగినవాడు[2] అందరి హృదయములో విశిష్ట రూపములో నున్నవాడు.[3]

"ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః।
మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావాయోపపద్యతే॥" 18

"అర్జునా! ఈ విధముగా క్షేత్రము-జ్ఞానము-జ్ఞేయమైన పరమాత్మ స్వరూపమును గూర్చి సంగ్రహముగా చెప్పితిని.[4] నా భక్తుడు దీనిని తాత్త్విక

---

1. చంద్రసూర్య విద్యుత్ నక్షత్రాది బాహ్యజ్యోతులన్నియు మనోబుద్ధీంద్రియాదులైన ఆధ్యాత్మిక జ్యోతులన్నియు వేర్వేరు లోకములకు వస్తువులకున్ను అధిష్ఠితులైన దేవతల రూపములోనున్న దేవ జ్యోతులన్నియు ఈయన్ని జ్యోతులన్నిటిని ప్రకాశింపజేయువాడు పరమాత్మయే ప్రకాశశక్తి గలవన్నియు పరమాత్మయొక్క ఒక అంశము మాత్రమే.

2. ఇందలి అభిప్రాయమేమనగా పూర్వోక్తములైన "అమానిత్వాది" జ్ఞాన సాధనములచేత పొందబడిన తత్త్వ జ్ఞానము చేతనే ఆ పరమాత్మ తెలియబడ జాలును.

3. పరమాత్మ అన్ని యెడల సమానముగా నిండియుండును. హృదయమునందాయనయభివ్యక్తి అధికముగా నున్నది. సూర్యుని ప్రకాశమెట్లైతే అన్నిచోట్ల సమానముగా విస్తరించి యున్నను దర్పణాదులలో సూర్యుని ప్రతిబింబము విశేషముగా అభివ్యక్తమగునో సూర్యకాంత మణియందు సూర్యతేజము ప్రత్యక్షముగా ప్రకటితమై ఆ మణినుండి అగ్నిపుట్టునో ఇతర వస్తువులయందు సూర్యతేజస్సు ఆ విధముగా అభివ్యక్తము కాదో ఆ విధముగానే హృదయము పరమాత్మ యొక్క ఉపలబ్ధికి సాధనమగును.

4. జ్ఞానుల హృదయమందైతేనో పరమాత్మ ప్రకాశము ప్రత్యక్షముగా ప్రకటితమగును. ఈ విషయమును వివరించి తెలుపుటకే పరమాత్మ

ముగా తెలిసికొని నా స్వరూపమును పొందగలడు[1].

సంబంధము-

ఈ యధ్యాయము మూడవ శ్లోకములో భగవంతుడు క్షేత్రమును గూర్చి నాలుగు విషయములు క్షేత్రజ్ఞుని గూర్చి రెండు విషయములు వినుమని అర్జును నకు సంగ్రహముగా చెప్పియుండెను. తరువాత ఆ విషయము ఆరంభించగనే క్షేత్రస్వరూప వికారములను వర్ణించిన తరువాత క్షేత్రక్షేత్రజ్ఞుల తత్త్వమును పూర్తిగా తెలిసికొనుటకు ఉపాయభూతములైన సాధనములను తెలియదగిన (జ్ఞేయ) పరమాత్మ స్వరూపమును ప్రసంగవశాత్తు వర్ణించి చెప్పెను. కనుక ఇప్పుడు ఆ అన్నింటిని వర్ణించుటకు భగవంతుడు మరల ప్రకృతి-పురుషుల పేరుతో ప్రకరణమారంభించుచున్నాడు.

"ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి ।
వికారాంశ్చ గుణాం[2] శ్చైవ విద్ధి ప్రకృతి సంభవాన్ ।" 19

---

అందరి హృదయములో విశేషరూపములో నిలిచియున్నాడని తెలుప బడినది.

ఈ అధ్యాయములో ఐదవ, ఆరవ శ్లోకములలో వికారములలో గూడిన క్షేత్ర స్వరూపము వర్ణింపబడినది. ఏడవ శ్లోకమునుండి పద కొండవ శ్లోకము వరకు "జ్ఞానము" అను పేరుగల యిరువది జ్ఞానసాధన ములు పన్నెండవ శ్లోకమునుండి పదియేడవ శ్లోకమువరకు "జ్ఞేయ" స్వరూపుడైన (తెలిసికొనదగిన) పరమాత్మ స్వరూపము వర్ణింపబడెను.

1. క్షేత్రము ప్రకృతికి కార్యము ప్రకృతినుండి పుట్టినది. అది జడము. వికారి అనిత్యము నాశవంతము అని తెలియుట. జ్ఞాన సాధనములను బాగుగా అవలంబించుట వానిచేత భగవంతుని సగుణ-నిర్గుణ రూపములను బాగుగా తెలిసికొనుట ఇవియే క్షేత్రమును, జ్ఞానమును, జ్ఞేయమును గూర్చి తెలిసి కొనుట యగును. జ్ఞేయ స్వరూపుడైన పరమాత్మను పొందుటయే భగ వంతుని స్వరూపమును పొందుట యనబడునని తెలియవలెను.

2. ఈ అధ్యాయము ఆరవశ్లోకములో వర్ణింపబడిన ఇచ్ఛాద్వేష సుఖదుఃఖాది వికారములన్నియు "వికారవాన్" అను పదము యొక్క అర్థము.

"అర్జునా! ప్రకృతి[1] పురుషుడు-ఈ రెండే అనాదులు అని నీవు తెలిసికొనుము.[2] రాగద్వేషాది వికారములు త్రిగుణాత్మకములైన సమస్త పదార్థములు గూడ ప్రకృతినుండియే పుట్టినవని తెలియుము".

---

"గుణాన్" అను పదమునకు సత్త్వము-రజస్సు-తమస్సు అను మూడు గుణములు వానినుండి ఉత్పన్నములైన జడపదార్థములు నని యర్థము. ఇవి రెండున్ను ప్రకృతినుండి ఉత్పన్నములైనవని తెలియవలెనని చెప్పి భగవంతుడు సత్త్వ-రజస్-తమోగుణముల పేరు ప్రకృతి కాదని ప్రకృతి అనాదియనియు ఆ మూడు గుణములు సృష్ట్యాది ప్రకృతినుండి ఉత్పన్నములగును (భాగవతము 2-5-22, 11-24-5) అను నభిప్రాయము తెలిపెను. ఈ విషయమునే స్పష్టముచేయుటకు భగవంతుడు భగవద్గీత పదునాలుగవ అధ్యాయము ఐదవ శ్లోకములో మూడుగుణములకు సత్త్వము రజస్సు-తమస్సు అను పేర్లు పెట్టి ఈ మూడు గుణములు ప్రకృతినుండి పుట్టినవని తెలిపెను.

1. ఇక్కడ ప్రకృతియను శబ్దమునకు అనాది సిద్ధమైన ఈశ్వరుని మూల ప్రకృతియని అర్థము భగవద్గీత పదునాలుగవ అధ్యాయము మూడవ శ్లోకములో ఈ మూల ప్రకృతియే "మహద్బ్రహ్మ" యను పేరుతో చెప్పబడెను. భగవద్గీత యేడవ అధ్యాయము నాల్గవ ఐదవ శ్లోకములలోగూడ ఈ ప్రకృతియే "అపరాప్రకృతి" అను పేరుతో ఈ అధ్యాయము ఐదవ శ్లోకములో "క్షేత్రము" అను పేరుతోను వర్ణింపబడినది. ఈ రెంటిలో భేదమేమనగా అక్కడ ఏడవ అధ్యాయములో మనోబుద్ధ్యహంకారములు, పంచమహాభూతములతో గూడిన ప్రకృతి వర్ణింప బడెను. ఇక్కడ కేవలము మూల ప్రకృతిమాత్రమే అవ్యక్త పదముచే వర్ణింప బడెను. (భగవ.13-5)

2. జీవునియొక్క జీవత్వము అనగా ప్రకృతితో జీవునకుగల సంబంధము ఏదోయొక కారణముగా వచ్చిన ఆగంతుకముగాదు. అది అనాదిసిద్ధము. ఇట్లే ఈశ్వరీయశక్తి యైన యా ప్రకృతిగూడ అనాది సిద్ధమేయని యెరుగవలెను.

సంబంధము-

ఈ అధ్యాయము మూడవ శ్లోకములో దేనినుండి యేది ఉత్పన్నమైనది. అను విషయము వినుమని అర్జునునకు భగవంతుడు చెప్పియుండెనో దాని వర్ణనము పూర్వశ్లోక ఉత్తరార్ధములో కొంచెము చెప్పబడెను. ఇప్పుడు దానికి సంబంధించిన విషయమే యీ శ్లోక పూర్వార్ధమునందు చెప్పుచు దీని ఉత్తరార్ధములో ఇరువదియొకటవ శ్లోకములో ప్రకృతియందలి పురుషుని వర్ణనము చేయబడుచున్నది.

"కార్యకారణ కర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే ।
పురుషస్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే ॥" 20

"అర్జునా! కార్య కారణములను ఉత్పన్నము చేయుటలో ప్రకృతి హేతువని చెప్పబడును[1] సుఖదుఃఖములను అనుభవించుటలో జీవాత్మ హేతువని చెప్ప

---

1. ఇక్కడ కార్యశబ్దమునకు పృథివీ, జల, వాయు, అగ్ని, ఆకాశములు అను నైదు సూక్ష్మ మహాభూతములు. శబ్ద, స్పర్శ రూప, రస, గంధములు అను నైదు ఇంద్రియ విషయములు ఈ పది యని యర్థము బుద్ధి, అహంకారము, మనస్సు. ఈ మూడింటి సముదాయము అంతఃకరణము త్వక్, (చర్మము) చక్షుస్ శ్రోత్ర, జిహ్వ ఘ్రాణములైదు జ్ఞానేంద్రియములు వాక్, పాణి, పాద, పాయు (గుదము-మూత్రస్థానము) ఉపస్థములు అనబడు ఐదు కర్మేంద్రియములు, వెరసి ఈ పదమూడున్ను కరణ శబ్దముయొక్క అర్థము. ఈ యిరువదిమూడు తత్త్వములుగూడ ప్రకృతినుండియే ఉత్పన్నములగును వీనికి ఉపాదాన కారణము (కంకణమునకు బంగారమువలె) గూడ ప్రకృతియే. ఎందుకనగా ప్రకృతినుండి మహత్తత్త్వము - మహత్తత్త్వమునుండి అహంకారము అహంకారమునుండి యైదు సూక్ష్మ మహాభూతములు, మనస్సు, దశేంద్రియములు, ఐదు సూక్ష్మ మహా భూతములనుండి పంచ జ్ఞానేంద్రియములయొక్క స్థూల విషయములైన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములైదున్ను ఉత్పన్నములగునని తలచబడెను (సాంఖ్యకారికలో)-

బడును".[1]

"పురుష ప్రకృతిస్థో హి భుంక్తే ప్రకృతిజాన్గుణాన్।
కారణం గుణసంగోఽస్య సదసద్యోని జన్మసు॥" 21

"అర్జునా! ప్రకృతిలో ఉండియే పురుషుడు ప్రకృతినుండి పుట్టిన త్రిగుణాత్మక పదార్థములను అనుభవించును.[2] ఈ గుణముల సంబంధమే జీవుడు ఉత్త

---

శ్లో॥ "ప్రకృతేర్మహాం స్తతోఽహంకార స్తస్మాద్ గణశ్చ షోడశకః।
తస్మాదపి షోడశకాత్ పంచభ్యః పంచభూతాని॥"

(సాంఖ్యకారిక-22)

అనగా ప్రకృతినుండి మహత్తత్త్వము (సమిష్టిబుద్ధి) అనగా బుద్ధితత్త్వము, మహత్తత్త్వమునుండి అహంకారము, అహంకారమునుండి పంచతన్మాత్రలు మనస్సు, దశేంద్రియములు, ఈ పదియారు ఉత్పన్నములైనవి. ఈ పదియారింటిలోని పంచతన్మాత్రలనుండి యైదు స్థూల భూతములు, (పృథివ్యాదులు) పుట్టినవి అని యర్థము. భగవద్గీతలోని వర్ణనములో పంచతన్మాత్రలకు బదులు పంచసూక్ష్మ మహాభూతముల పేర్లు చెప్పబడినవి. పంచస్థూల భూతములకు బదులు పంచేంద్రియ విషయముల పేర్లు చెప్పబడెను. ఇదియే భేదము.

1. ప్రకృతి జడముగాబట్టి దానికి భోక్తృత్వమున్న దనుటకు వీలుపడదు. పురుషుడు అసంగుడు గనుక అతనికిగూడా వాస్తవముగా భోక్తృత్వము లేదు. ప్రకృతి సంబంధము చేతనే పురుషునకు భోక్తృత్వమున్నదిగా తోచును. ఈ ప్రకృతి-పురుష సంబంధము అనాదిగనుక ఇక్కడ సుఖదుఃఖముల భోక్తృత్వమునకు పురుషుడు హేతువు. అనగా, నిమిత్తమని తలచబడినది.

2. ప్రకృతినుండి ఉత్పన్నములైన స్థూల సూక్ష్మ కారణ శరీరములు మూడింటిలోను ఏయొక్క శరీరముతోగూడ ఈ జీవాత్మకు సంబంధ మున్నంత వరకు ఆ శరీరము ప్రకృతిలోనున్నది. (ప్రకృతిస్థము) అని చెప్పబడును.

మాధమ యోనులలో జన్మించుటకు కారణమగును."[1]

సంబంధము—

ఇట్లు ప్రకృతిలోనున్న పురుషుని వర్ణనము చేసిన తరువాత ఇప్పుడు జీవాత్మ పరమాత్మల యేకత్వము చెప్పుచు ఆత్మ గుణాతీత స్వరూపుడని భగవంతుడు వర్ణించుచున్నాడు.

"ఉపద్రష్టాఽనుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః ।
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః ॥" 22

"అర్జునా! ఈ దేహమునందున్న యాత్మ వాస్తవముగా పరమాత్మయే[2]

---

కనుకనే ఆత్మకు ప్రకృతితో సంబంధమున్నంతవరకున్న ఆత్మ ప్రకృతి జనిత గుణముల భోక్త యనబడును.

1. మనుష్యునినుండి పైనున్న దేవాది యోనులన్నియు "సత్ యోనులు" అని మనుష్యునినుండి క్రిందనున్న పశు, పక్షి, వృక్ష, లతాది యోనులన్నియు "అసత్ యోనులు" అనియు ననబడును. జీవునకు సత్త్వ-రజస్-తమో గుణములతో నున్న అనాది సిద్ధ సంబంధము ఆ గుణములకు కార్యరూపములైన ప్రాపంచిక పదార్థములందు ఆసక్తి. "గుణసంగము" అనబడును. ఏ మనుష్యునకు, ఏ గుణమందు లేదా దాని కార్యరూప పదార్థమునందు ఆసక్తియుండునో అతనికి ఆ వాసనయే కలుగును. ఆ వాసననను సరించియే అతనికి అంతకాలమునందు స్మృతి కలుగును. దాని ననుసరించియే పునర్జన్మ కలుగును. కనుకనే యిక్కడ ఉత్తమ నీచ యోనులలో జన్మించుటకు గుణసంగము కారణమని తెలుపబడెను.

2. ప్రకృతినుండి పుట్టిన శరీరమును ఉపాధి (ఆధారము)గాచేసుకొని చేతనమైన ఆత్మ అజ్ఞానము కారణముగా జీవభావమును పొందినట్లుగా తోచును. క్షేత్రజ్ఞుడు వాస్తవముగా ప్రకృతికి పూర్తిగా అతీతుడైన పరమాత్మ యగును. ఎందుకనగా పరబ్రహ్మ పరమాత్మకు క్షేత్రజ్ఞునకును వాస్తవముగా ఏవిధమైన భేదముగూడలేదు. కేవలము శరీరరూపమైన ఉపాధి చేతనే భేదమున్నట్లు తోచుచున్నది.

ఆయనయే సాక్షి భూతుడగుటచేత ఉపద్రష్టయగుదు. యథార్థమైన సమ్మతి యిచ్చువాడగుటచేత భోక్త యగును. బ్రహ్మాదులకు గూడ ప్రభువగుట చేత మహేశ్వరుడగును. శుద్ధ సచ్చిదానంద ఘనుడగుటచేత పరమాత్మ యగుననియు చెప్పబడెను."[1]

"య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ।
సర్వథా వర్తమానోఽపి నసభూయోఽభి జాయతే॥" 23

"అర్జునా! యీ విధముగా పురుషుని గుణసహిత ప్రకృతిని తాత్త్విక ముగా తెలిసికొనిన[2] మనుష్యుడు అన్ని విధములైన కర్తవ్యకర్మలు చేయుచు గూడ[3] మరల జన్మించడు."

---

1. ఇట్లు చెప్పుటచేత భిన్న భిన్న నిమిత్తములచేత ఒకే పరబ్రహ్మ పరమాత్మ వేర్వేరు పేర్లతో పిలువబడుచుండును. వాస్తవముగా బ్రహ్మములో ఏ విధమైన భేదమున్ను లేదు అను విషయము ప్రతిపాదింప బడెను.

2. వేర్వేరుగా కనబడుచున్న క్షేత్రజ్ఞులందరున్ను ఏకముగా నున్న ఆ పర బ్రహ్మ పరమాత్మకు అభిన్న స్వరూపులే యగుదురు. ప్రకృతి సంబం ధము చేత వారిలో భేదమున్నట్లు తోచును. వాస్తవముగా ఎలాటి బేదము గూడ ఆ రెంటిలో లేదు. పరమాత్మ నిత్యుడు, శుద్ధుడు, బుద్ధుడు, ముక్తుడు, అవినాశి, పూర్తిగా ప్రకృతికి అతీతుడుఅను విషయము నిస్సందేహముగా యథార్థముగాను తలచుట ఏకీభావముతో ఆ సచ్చిదానంద ఘనపరమాత్మ యందు సర్వదా స్థిరముగా నిలిచియుండుటయే పురుషుని తాత్త్వికముగా తెలిసికొనుట యనబడును. ఈ మూడు గుణములు ప్రకృతినుండి ఉత్ప న్నములైనవి. ప్రకృతి సమస్త ప్రపంచమునందు వ్యాపించియున్నది. అది నాశవంతము, జడము, క్షణభంగురము, అనిత్యము, అని యీ రహ స్యము తెలిసికొనుటయే గుణసహిత ప్రకృతిని తాత్త్వికముగా తెలియుట యనబడును.

3. ఆతడు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులలో ఏ జాతివాడైనను బ్రహ్మ చర్యాది చతురాశ్రమములలో ఏ యాశ్రమమువాడైనను, గాత్రములో విధింప

సంబంధము:-

ఈ విధముగా గుణ సహిత ప్రకృతి యొక్క పురుషునియొక్కయు జ్ఞానము యొక్క మహత్త్వమును వినిన తరువాత ఇట్టి జ్ఞానమెట్లు లభించును. అను నిచ్ఛ కలుగ వచ్చునని యిప్పుడు రెండు శ్లోకముల చేత వేర్వేరు అధికారులకు వేర్వేరు తత్త్వజ్ఞాన సాధనములను భగవంతుడు ప్రతిపాదించుచున్నాడు.

"ధ్యానేనాఽఽత్మాని పశ్యంతి కేచిదాత్మానమాత్మనా ।
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే ॥" 24

---

బడిన తన వర్ణాశ్రమ కర్తవ్యకర్మలన్నియు తగినట్లుగా అనుష్ఠించుచునే వాస్తవముగా ఏకర్మకూడా చేయడు.

ఇక్కడ "సర్వథా వర్తమానః" అను పదముల యర్థము నిషిద్ధ కర్మలు. చేయుచుండుట యని తలచగూడదు. ఎందుకనగా ఆత్మతత్త్వము నెరిగిన జ్ఞానులకు కామ, క్రోధాది దోషములు ఏమాత్రముగూడ లేకుండుట చేత (గీత 15-26) వారు నిషిద్ధ కర్మలుచేయుట అసంభవము. అందుచేతనే వారి యాచరణము ప్రపంచములో నితరులకు ప్రమాణములుగా, ఆదర్శములుగాను తలచబడును. (గీత 3-21)

కామ క్రోధాది దుర్గుణముల కారణముచేతనే మనుష్యునకు పాపములందు ప్రవృత్తికలుగును. అర్జునుడు ప్రశ్నించినమీదట భగవంతుడు మూడవ అధ్యాయము ముప్పదియేడవ శ్లోకములో ఈ విషయము స్పష్టముగా చెప్పెను.

ప్రకృతి-పురుషుల తత్త్వమును తెలిసికొనుటతోపాటే పురుషునకు ప్రకృతితో సంబంధము తెగిపోవును. ఎందుకనగా ఈ సంబంధము అవాస్తవికము. అది కేవలము అజ్ఞాన జనితమని తలచబడినది. ప్రకృతి-పురుషుల యొక్క పరిపూర్ణజ్ఞానము కలుగునంతవరకే పురుషునకు ప్రకృతితో దాని గుణములతోను సంబంధము ఉండునో అంతవరకే పురుషునకు అనేక యోనులలో జన్మము గలుగును. (గీత 13-21) అందుకే ప్రకృతి-పురుషుల తత్త్వము తెలిసికొనిన తరువాత పునర్జన్మ ఉండదు.

"అర్జునా! ఆ పరమాత్మను ఎందరో మనుష్యులు పరిశుద్ధమైన సూక్ష్మ బుద్ధిచేత ధ్యానము ద్వారా హృదయము నందు చూచెదరు [1] తదితరులెందరో జ్ఞానయోగము ద్వారా[2] మరికొందరు కర్మయోగము ద్వారా[3] చూచెదరు, అనగా పొందెదరు.

---

1. భగవద్గీత ఆరవ అధ్యాయము పదకొండవ, పన్నెండవ, పదమూడవ శ్లోకములతో తెలుపబడిన విధి ప్రకారము పరిశుద్ధము ఏకాంతమునైన స్థలము నందు అనువైన ఆసనమునందు నిశ్చల భావముతోకూర్చొని, ఇంద్రియములను విషయములనుండి తొలగించి మనస్సు వశపరచుకొని పరమాత్మని ఒక్కనిదప్ప దృశ్య వస్తువులన్నిటిని మరిచి నిరంతరం పరమాత్మ చింతనముచేయుట ధ్యానమనబడును. ఇట్లు ధ్యానము చేయుచుండుటచేత బుద్ధి పరిశుద్ధమగును. విశుద్ధ సూక్ష్మబుద్ధిచేత హృదయమునందు సచ్చిదానంద ఘన పరబ్రహ్మ పరమాత్మయొక్క సాక్షాత్కారము చేసికొనుటయే ధ్యానముద్వారా ఆత్మచేత ఆత్మను ఆత్మలో చూచుట యనబడును.

కాని భేదభావముచేత సగుణ నిరాకారముయొక్క సగుణ సాకారముయొక్కయు ధ్యానముచేయు సాధకుడుగూడ ఇట్టి ఫలము కోరినయెడల అతనికిగూడ అభేద భావముతో నిర్గుణ నిరాకార సచ్చిదానంద ఘనబ్రహ్మ ప్రాప్తించును.

2-3. సమస్త పదార్థములు ఎండమావి జలమువలె స్వాప్నిక సృష్టివలె మాయామాత్రములే యగును. గనుక ప్రకృతి కార్యరూపములైన సమస్త గుణములే గుణములందున్నవని తలచి శరీరేంద్రియ మనస్సులచేత జరుగు కర్మలన్నింటియందున్న కర్తృత్వాభిమాన రహితుడగుట సర్వవ్యాపి సచ్చిదానంద ఘన పరమాత్మయందు ఏకీభావముచేత సర్వదా స్థిరముగా నిలిచియుండుచు సచ్చిదానంద ఘన పరమాత్మనొక్కనిదప్ప ఇతరవస్తువు దేనియందుగూడ వేరుగా అస్తిత్వమున్నదని తలంచకుండుటయే "సాంఖ్యయోగ"మనబడు సాధనము. దీని ద్వారా ఆత్మ-పరమాత్మల అభేదము ప్రత్యక్షమై సచ్చిదానంద ఘన బ్రహ్మమును అభిన్నభావముతో పొందుటయే సాంఖ్యయోగముద్వారా ఆత్మను పరమాత్మలో చూచుట యనబడును.

"అన్యే త్వేవ మజానంతః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే ।[1]
తేఽపి చాతితరంత్యేవ[2] మృత్యుం శ్రుతిపరాయణాః॥" 25

"కాని అర్జునా! వీరికన్న నితరులు అనగా మందబుద్ధిగల పురుషులు ఈ విధముగా తెలిసికొనక యితరులనుండి అనగా తత్త్వమును తెలిపిన పురుషుల నుండి వినియే ఆ ప్రకారమే ఉపాసన చేసెదరు. శ్రవణమునందు ఆసక్తిగల ఆ పురుషులు గూడ మృత్యు సంసార సముద్రమును తప్పక తరించెదరు.

---

ఈ సాధనము సాధనచతుష్టయసంపన్నుడైన అధికారిచేతనే సులభముగా సాధింపబడును. దీని విషయము ఇతరత్ర చూడవలెను.

ఇక్కడ కర్మయోగము అను పదమునకు భగవద్గీత రెండవ అధ్యాయము నలువది శ్లోకమునుండి ఆ యధ్యాయ సమాప్తి వరకు వర్ణింపబడిన ఫల రహిత సాధనమని యర్థము. అనగా ఆసక్తి కర్మ ఫలములను పూర్తిగా విడిచి సిద్ధ్యసిద్ధులయందు సమత్వ బుద్ధి ఉంచుచూ శాస్త్రానుసారముగా "నిష్కామ భావముతో తమతమ వర్ణాశ్రమముల ననుసరించి సర్వవిధ విహిత కర్మల ననుష్ఠించుట కర్మయోగమనబడును. దీనిద్వారా సచ్చిదా నంద ఘన పరబ్రహ్మ పరమాత్మను అభిన్నభావముతో పొందుటయే కర్మయోగము ద్వారా ఆత్మలో ఆత్మను చూచుట యనబడును.

1. బుద్ధి మందమగుటచేత పూర్వోక్త ధ్యాన యోగ, సాంఖ్య యోగ కర్మ యోగములలో ఏదియో యొకటి గూడ సాధనమునకు మంచిది కాదని తలచు సాధకులు ఇక్కడ "ఏవం అజానంతః" అను విశేషణ సహిత "అన్యే" పదమునకు అర్థము. తత్త్వమును తెలిసిన జ్ఞానపురుషుల యాదేశము పొంది అత్యంత శ్రద్ధాప్రేమలతో 'జబాల' పుత్రుడైన సత్యకాముని వలె ఆ యాజ్ఞానుసారముగా ఆచరించుటయే ఇతరులనుండి విని ఆచరించుట యనబడును.

2. ఇరువది మూడవ శ్లోకములో "నసభూయోఽభి జాయతే" అను వాక్యము చేత యిరువది నాలుగవ శ్లోకములో "ఆత్మని ఆత్మానం పశ్యంతి" అను వాక్యము చేతను చెప్పబడిన విషయమే యిచ్చట "మృత్యుం అతి తరంతి అను వాక్యముచేత చెప్పబడినది.

**సంబంధము—**

ఈ విధముగా పరమాత్మకు సంబంధించిన తత్త్వజ్ఞానము యొక్క వేర్వేరు సాధనములను ప్రతిపాదించి భగవంతుడిప్పుడు మూడవ శ్లోకములో "యాదృక్" అను పదము చేత క్షేత్రముయొక్క స్వరూపమును గూర్చి చెప్పిన ప్రకారము రెండు శ్లోకముల చేత ఆ క్షేత్రము ఉత్పత్తి వినాశములు గలదియని తెలిపి క్షేత్రస్వభావమును వర్ణించుచు ఆత్మయొక్క యథార్థ తత్త్వమును తెలిసి కొనిన వారిని ప్రశంసించుచున్నాడు.

"యావత్సంజాయతే కించిత్ సత్త్వం స్థావరజంగమమ్।
క్షేత్ర క్షేత్రజ్ఞ సంయోగాత్ తద్విద్ధి భరతర్షభ ॥" 26

"అర్జునా! యెన్నియైతే స్థావర జంగమ ప్రాణులు ఉత్పన్నమగుచున్నవో అవి యన్నియు క్షేత్రక్షేత్రజ్ఞుల సంయోగము చేతనే పుట్టినవని తెలిసికొనుము.'

"సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్।
వినశ్యత్స్వవినశ్యంతం యః పశ్యతి సపశ్యతి ॥" 27

"అర్జునా! ఏ పురుషుడైతే నశించుచున్న సమస్త చరాచర భూతములందు పరమేశ్వరుడు నాశరహితుడుగా సమభావముతో నున్నాడని చూచునో అతడే

---

1. ఈ అధ్యాయము ఐదవ శ్లోకములో ఏ యిరువది నాలుగు తత్త్వముల సముదాయము క్షేత్ర స్వరూపమని తెలుపబడెనో భగవద్గీత యేడవ అధ్యాయము నాలుగవ ఐదవ శ్లోకములలో ఏది అపరాప్రకృతి యని చెప్పబడెనో అదియే క్షేత్రమనబడును. దాని నెవడు తెలిసికొనునో ఏది భగవద్గీత యేడవ అధ్యాయము ఐదవ శ్లోకములో పరాప్రకృతి యని చెప్పబడెనో ఆ చేతనతత్త్వమే క్షేత్రజ్ఞుడనబడును. అతనికి అనగా ప్రకృతిస్థ పురుషునకు ప్రకృతితో నేర్పడిన భిన్నభిన్న సూక్ష్మ స్థూల శరీరముల సంబంధము కలిగియుండుటయే క్షేత్రక్షేత్రజ్ఞుల సంయోగ మనబడును. ఈ సంయోగము కలిగిన వెంటనే భిన్న భిన్న యోనుల ద్వారా వేర్వేరు ఆకృతులందు ప్రాణులు జన్మించుటయే వాని జననము అనబడును.

యథార్థముగా చూచువాడు.[1]

"సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్।
సహినస్త్యాత్మ నాత్మానం తతోయాతి పరాంగతిమ్॥ 28

"అర్జునా! ఏ పురుషుడైతే అన్ని భూతములందు సమభావములోనున్న పరమేశ్వరుని సమానముగా చూచుచు తనను తాను నశింపచేసికొనకయుండునో అట్లుండుట చేత నతడు పరమగతిని పొందగలడు.

సంబంధము-

ఈ విధముగా నిత్యము విజ్ఞానానంద ఘనమునైన ఆత్మ తత్త్వమును అన్నిటి యందున్న సమభావముతో చూచుట లోని మహత్త్వమును తత్ఫలమును తెలిపి భగవంతుడిప్పుడు ఈ తరువాతి శ్లోకములో పరమాత్మ "అకర్త" అని చూచువాని మహిమను గూర్చి తెలుపుచున్నాడు.

---

1. ఇక్కడ పరమేశ్వర శబ్దమునకు ప్రకృతికంటే పూర్తిగా అతీతమైన నిర్వికార చేతన తత్త్వమని యర్థము. అది క్షేత్రజ్ఞునితో ఏకము చేయ బడుచు ఈ అధ్యాయము ఇరువది రెండవ శ్లోకములో ఉపద్రష్టా-అను మంతా భర్తా-భోక్తా-మహేశ్వర పరమాత్మనామములతో వర్ణింపబడెను. సమస్త ప్రాణులకు యెన్ని శరీరములైతే ఉన్నవో శరీరసంబంధము చేత క్షేత్రజ్ఞుడు నశించువాడని చెప్పబడెనో అట్టి సమస్త శరీరములందు అతని వాస్తవిక స్వరూపమైన 'వినాశరహిత నిర్వికార చేతన తత్త్వ పరమాత్మ ఒక్కడే వినాశము పొందు మేఘములలో ఆకాశము వలె సమభావముతో ఉన్న శాశ్వతునిగా నుండునని ఆ పరమేశ్వరుడు సమస్త ప్రాణులలో వినాశరహితుడై సమ భావములో నున్నాడని చూచుట అనబడును.

2. సచ్చిదానంద ఘన పరమాత్మ యొక్కడే అంతట సమభావములో నున్నాడు. అజ్ఞానము వలననే వేర్వేరు శరీరములయందు ఆయన భేదము తోచుచున్నది. వాస్తవముగా ఆయనలో ఏ విధమైన భేదముగూడ లేదు. అను తత్త్వమును బాగుగా తెలిసికొని ప్రత్యక్షము చేసుకొనుటయే అంతట సమభావములో నున్న పరమేశ్వరుని సమముగా చూచుట యనబడును.

ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః।
యః పశ్యతి తథాఽఽత్మాన మకర్తారం స పశ్యతి॥ 29

అర్జునా! సమస్త కర్మలు అన్ని విధముల ప్రకృతి చేతనే చేయబడు చున్నట్లు ఆత్మ అకర్తయనియు చూచు పురుషుడే యదార్థముగా చూచువాడు.[1]

---

ఈ తత్త్వమును తెలియనివారు చూచుట యనునది సమముగా చూచుట కాదు. ఎందుకనగా వారికి అన్నిటియందు విషమబుద్ధియుండును. వారు కొందరిని తమకు ప్రియులు, తమ హితము కోరువారు అని మరికొందరిని తమకు అప్రియులు తమకు అహితము చేయువారు అని తలచుచుందురు. తాము ఇతరులకన్న వేరు అని, తాము శిష్టులము అని తలచుదురు. కనుకనే వారు శరీరముల జనన-మరణములు తమ జనన మరణములని తలచుట చేత మాటిమాటికి వివిధ యోనులందు జన్మించుచు చచ్చుచుందురు. ఇది వారు తమచేత తమనే నష్టపరచుకొనుట యనబడును. కాని పైన చెప్పబడిన విధముగా పరమేశ్వరుడొక్కడే సమభావముతో నున్నాడని చూచువాడు తాను ఆ పరమేశ్వరునికంటే భిన్నుడని కాని ఈ శరీరముతో తనకు ఏ విధమైన సంబంధం ఉన్నదని కాని తలచడు. ఈ కారణముచేత శరీరముల వినాశము తన వినాశనమని తలచడు. కనుకనే అతడు తనచేత తనను నష్టపరచుకొనడు. ఇందలి అభిప్రాయమేమనగా అతనిస్థితి(ఉనికి)సర్వజ్ఞుడు,అవినాశి,సచ్చిదానంద ఘన పరబ్రహ్మయునైన పరమాత్మయందు అభిన్నభావము చెందిపోవును. కాబట్టియే అటువంటి వాడు ఎల్లప్పటికిన్ని జనన మరణములనుండి విముక్తి చెందును.

1. భగవద్గీత మూడవ అధ్యాయము ఇరువది యేడవ శ్లోకములో ఇరువది యెనిమిదవ శ్లోకములోను సర్వకర్మలు గుణములచేత చేయబడునని తెలుపబడెను. ఐదవ అధ్యాయము ఎనిమిదవ తొమ్మిదవ శ్లోకములలో సర్వేంద్రియములు ఇంద్రియవిషయమందు వ్యవహరించుట చెప్పబడెను. ఇక్కడ సర్వకర్మలు ప్రకృతిచేత చేయబడుచుండుట చూడుమని చెప్పెను. ఈ విధముగా మూడు ప్రకారముల వర్ణనము యొక్క భావమే యగును. ఎందుకనగా సత్త్వ-రజస్-తమో గుణములు ప్రకృతి కార్య

యదా భూతపృథగ్భావమేకస్థ మనుపశ్యతి ।
తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా ॥ 30

అర్జునా! యే క్షణమందైతే ఈ పురుషుడు భూతముల వేర్వేరు భావములు ఒక పరమాత్మయందే యున్నవని ఆ పరమాత్మనుండియే సమస్త భూతముల విస్తారము జరిగినదనియు చూచునో[1] ఆ క్షణమందే అతడు సచ్చిదానంద ఘన బ్రహ్మను పొందును.

---

మగును. సర్వేంద్రియములు మనోబుద్ధులు-ఇంద్రియ విషయములు ఇవన్నియు గుణముల విస్తారమే యగును. కనుకనే ఇంద్రియములు ఇంద్రియములందు వ్యవహరించుట, గుణములు గుణములందు వ్యవహరించుట గుణములచేత కర్మలన్నియు చేయఁబడుచుండుట, ఇవన్నియు తెలుపుట గూడ సర్వకర్మలు ప్రకృతిచేతనే చేయబడునని తెలుపుట యనబడును. అన్నిచోట్ల చెప్పబడినవాని యభిప్రాయము. ఆత్మకు కర్తృత్వము లేదని తెలుపుటయే!

ఆత్మ నిత్య-శుద్ధ-బుద్ధ ముక్త స్వభావుడు, సర్వ వికారరహితుడు ఆత్మకు ప్రకృతితో ఏ మాత్రము సంబంధము లేదు. కనుకనే ఆత్మ ఏ కర్మయు చేయడు. కర్మఫలము ననుభవించడు. అను ఈ విషయమును అపరోక్ష భావముచేత అనుభవించుట "ఆత్మ అకర్త యని తెలియుట" యనబడును చూచువాడగును.

1. ఎట్లయితే స్వప్నము నుండి మేల్కొనిన తరువాత మనుష్యుడు స్వప్న కాలములో కనబడిన సర్వప్రాణుల లోకత్వమును తనయందే చూచునో స్వప్నవివరములన్నియు తననుండియే కలిగినవనికూడతలుచునో వాస్తవముగా స్వప్న ప్రపంచములో తనకంటే వేరుగా ఏదియూ లేకుండెను "నేనొక్కడినే నన్ను నేనే" అనేక రూపములలో చూచుచుంటినని తలచునో ఆ విధముగానే ఎవడు సర్వప్రాణులు కేవలమొక్క పరమాత్మయందే ఉన్నవి. ఆయననుండియే అన్నియు విస్తరించినవి అని చూచునో అతడే బాగుగాచూచును. ఇట్లు చూచుటయేఅన్నియు ఒకదానియందున్నవి. ఆ ఒక్కదానినుండే అన్నియు విస్తరించినవని చూచుట యనబడును.

సంబంధము :

ఈ విధముగా సర్వప్రాణులందు పరమాత్మ సమభావముతో నున్నాడని, నిర్వికారుడని అకర్తయనియు తెలిపిన తర్వాత సమస్త శరీరములందున్నప్పటి కిన్ని ఆత్మ ఆ శరీరదోషములు అంటకుండ అకర్తగా ఎట్లుండగలదు అను శంక కలుగును. ఆ శంకను నివారించుటకు ఇప్పుడు భగవంతుడు ఈ యధ్యాయము మూడవశ్లోకములో "యత్ప్రభావశ్చ" అను పదముచేత క్షేత్రజ్ఞుని ప్రభావము వినుటకు సూచించబడినట్లు మూడు శ్లోకములలో ఆత్మయొక్క ప్రభావమును వర్ణించుచున్నాడు.

అనాదిత్వాన్నిర్గుణత్వాత్ పరమాత్మాఽ[1]యవ్యయః।
శరీరస్థోఽపి కౌంతేయ న కరోతి న లిప్యతే ॥ 31

అర్జునా ! అవినాశియైన పరమాత్మ[2] శరీరమునందున్నప్పటికిన్ని అనాది

1. ఈ యధ్యాయము ఇరువదియేడవ శ్లోకములో ఎవడు "పరమేశ్వరుడు" అని ఇరువది యెనిమిదవ శ్లోకములో ఈశ్వరుడు అని ఇరువదితొమ్మిదవ శ్లోకములో "ఆత్మ" యని ముప్పదవ శ్లోకములో "బ్రహ్మ" మనియు చెప్పబడెనో అతడే యిక్కడ "పరమాత్మ" యని తెలుపబడెను. అనగా ఈ యన్నిటి అభేదము ఏకత్వము చూపుటకు ఇక్కడ "అయం" అను పదము ప్రయోగింపబడినది.

2. దేనికి ఆది-అనగా కారణమేదియు లేదో, ఏది ఏకకాలము నందున్న క్రొత్తగా ఉత్పన్నము కాదో ఏది సర్వదా ఉండునో దానిని అనాది యనెదరు. ఏది ప్రకృతికంటే, ప్రకృతి గుణములకంటే పూర్తిగా అతీతమో గుణములతో గుణకార్యములతోను దేనికి ఏ కాలంలో గూడ ఎట్టి పరిస్థితితో గూడ సంబంధము ఉండదో దానిని నిర్గుణము అనెదరు. కనుకనే ఇక్కడ "అనాదిః-నిర్గుణ"అను రెండు శబ్దములను ప్రయోగించి తెలుపబడినదేమనగా ఈ సందర్భములో చెప్పబడిన ఆత్మ అనాది నిర్గుణుడు అని ఈ కారణముచేత ఆత్మ అకర్త నిర్లిప్తుడు అవ్యయుడు జనన మరణాది షడ్వికారాతీతుడని తెలియవలెను.

నిర్గుణుడగుటచేత వాస్తవముగా ఏమియు చేయదు. దేని సంబంధము గూడ కలిగియుండదు.[1]

సంబంధము:-

శరీరము నందున్నప్పటికిన్ని ఆత్మ ఎందుకు ఇవ్వడు? అను ప్రశ్నమునకు ఉత్తరమిట్లు భగవంతుడు చెప్పుచున్నాడు.

యథా సర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే ।
సర్వత్రావస్థితో దేహే తథాత్మా నోపలిప్యతే ॥ 32

అర్జునా! ఎట్లైతే సర్వత్ర వ్యాపించిన ఆకాశము సూక్ష్మ మగుటచేత దేనికి సంబంధించకయుండునో అట్లే దేహమునందు అంతటను వ్యాపించియున్న ఆత్మ గూడ నిర్గుణుడగుటచేత శరీర గుణములలో సంబంధము లేకుండ నుండును.[2]

సంబంధము :

శరీరమందున్నప్పటికిన్ని ఆత్మ కర్త యెందుకు గాదు? అను ప్రశ్నమునకు ఉత్తరము భగవంతుడిట్లు చెప్పుచున్నాడు.

యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోక మిమం రవిః ।
క్షేత్రం క్షేత్రీ తథాకృత్స్నం ప్రకాశయతి భారత ॥ 33

---

1. ఆకాశము మేఘములలో నున్నప్పటికిన్ని వానికి కర్త కానట్లు వాని సంబంధమును లేనట్లే ఆత్మ ఏ కర్మలకు కూడా కర్త కాదు. ఈ శరీరముతో సంబంధము లేక యుండును.

2. ఆకాశ దృష్టాంతములో ఆత్మ నిర్లేపుడని నిరూపింపబడినది. ఇందలి అభిప్రాయమేమనగా ఎట్లైతే ఆకాశం-పృథివీ జలవహ్ని-వాయువులు అన్నిటిలో సమానముగా వ్యాపించి యున్నప్పటికిన్ని ఆ పృథివ్యాది గుణ దోషములలో ఏ విధమైన సంబంధము ఆకాశమునకు లేదో అట్లే ఆత్మ గూడ ఈ శరీరము నందంతట వ్యాపించియున్ననూ అత్యంత సూక్ష్మము గుణాతీతమగుటచేత ఆత్మకు మనోబుద్ధీంద్రియ శరీరముల గుణదోషముల సంబంధము కొంచెము గూడ ఉండదు.

అర్జునా! ఏ విధముగా ఒకే సూర్యుడు ఈ సమస్త బ్రహ్మాండమును ప్రకాశింపజేయునో ఆ విధముగానే ఒక ఆత్మ సమస్త క్షేత్రములను ప్రకాశింప జేయును.[1]

సంబంధము :-

మూడవ శ్లోకమునందు భగవంతుడు చెప్పుటకు సూచించిన ఆరు విషయము లను వర్ణించి ఇప్పుడు ఈ అధ్యాయమునందు వర్ణింపడిన ఉపదేశమంతయు బాగుగా తెలిసికొనినందుకు ఫలము పరబ్రహ్మ పరమాత్మ ప్రాప్తియే యని తెలుపుచు అధ్యాయ సమాప్తి చేయుచున్నాడు.

క్షేత్ర క్షేత్రజ్ఞయో రేవ మంతరం జ్ఞానచక్షుషా ।
భూతప్రకృతి మోక్షంచ యే విదుర్యాంతి తే పరమ్ ॥ 34

అర్జునా! ఈ విధముగా క్షేత్ర క్షేత్రజ్ఞుల భేదమును కార్యసహిత ప్రకృతి నుండి క్షేత్ర క్షేత్రజ్ఞుల విముక్తిని ఏ పురుషులు జ్ఞాననేత్రము ద్వారా తాత్త్విక

---

1. ఈ శ్లోకములో రవి (సూర్యుడు) యొక్క దృష్టాంతము నిచ్చి ఆత్మకు అకర్తృత్వము రవి అను పదముతో "ఏకః" అను విశేషణము చేర్చి ఆత్మకు అద్వైత భావమును నిరూపింపబడినవి. ఇందలి అభిప్రాయ మేమనగా ఏ విధముగా ఒక్కడే సూర్యుడు సమస్త బ్రహ్మాండమును ప్రకాశింపచేయునో అట్లే ఒక్కడేయైన ఆత్మ సమస్త క్షేత్రమును అనగా ఈ అధ్యాయమునందే ఐదవ ఆరవ శ్లోకములలో వికార సహిత క్షేత్రము యొక్క పేరుతో వర్ణింపబడిన సమస్త జడవర్గము యొక్క స్వరూపము సర్వజగత్తును ప్రకాశింపజేయును. అంతటికి సత్త్వవికాసము ఇచ్చును. వేర్వేరు అంతఃకరణముల సంబంధముచేత భిన్నభిన్న శరీరములందు ఆ జడ వర్గ స్వరూపము వివిధముగా ప్రకటితమయినట్లుగా కనపడును. ఇట్లయినప్పటికిన్ని ఆత్మ సూర్యునివలె కర్మలు చేయువాడు చేయించు వాడున్ను కానేకాదు. ద్వైతభావము వైషమ్యాది దోషములున్ను ఉండవు. అవినాశియైన యాత్మ ప్రతియొక పరిస్థితిలోను సర్వదా శుద్ధ విజ్ఞాన స్వరూప అకర్త-నిర్వికార-సమ-నిరంజన స్వరూపుడుగానే యుండును.

ముగా నెరుగుదురో,[1] ఆ మహాత్ములు పరమబ్రహ్మ పరమాత్మను పొందెదరు.

---

1. ఈ యధ్యాయము రెండవశ్లోకములో భగవంతుడు తన యభిప్రాయములో దేనినైతే "జ్ఞానము" అని చెప్పెనో భగవద్గీత పదవ అధ్యాయము పదియారవ శ్లోకములో ఏది అజ్ఞాన నాశమునకు కారణమని తెలిపెనో, దేని ప్రాప్తి అమానిత్వాది సాధనములచేత కలుగునో, ఆ తత్త్వజ్ఞానమే ఈ శ్లోకమునందలి "జ్ఞాన చక్షుషా" అను పదమునందున్న "జ్ఞాన" శబ్దమునకు అర్థమని తెలియవలెను.

ఆ జ్ఞానము ద్వారా "మహాభూతాది చతుర్వింశతి తత్త్వముల సముదాయ రూపమైన సమష్టి శరీరముయొక్క పేరు క్షేత్రమని అది తెలియబడునది. మారు స్వభావము గలది, వినాశము చెందునది, వికారము కలది, జడము పరిణామశీలము, అనిత్యము అని "క్షేత్రజ్ఞుడు" ఆ క్షేత్రమును తెలిసికొను వాడు, చేతనుడు, నిర్వికారుడు, అకర్త, నిత్యుడు, అవినాశి, అసంగుడు, శుద్ధుడు, జ్ఞానస్వరూపుడు, ఒక్కడే యనియు బాగుగా తాత్త్వికముగాను తెలిసికొనవలెను. ఈ విధముగా ఆ రెండింటిలోను విలక్షణత్వము ఉండుటచేత క్షేత్రజ్ఞుడు క్షేత్రమునకంటే సర్వథాభిన్నుడగును. క్షేత్రములో తోచునట్టి అతని యేకత్వము అజ్ఞానమూలకమని తెలియవలెను. వాస్తవముగా విచారించినచో క్షేత్రజ్ఞునకు క్షేత్రముతో ఏ విధమైన సంబంధముగూడ లేదు. ఇదియే "జ్ఞానచక్షుస్సుచేత-క్షేత్ర-క్షేత్రజ్ఞుల భేదము తెలిసికొనుట యనబడును.

ఈ శ్లోకమునందలి "భూత" శబ్దమునకు ప్రకృతి కార్యరూపమైన సమస్త దృశ్యవర్గము అని ఆ దృశ్యమునకు ప్రకృతి కారణమనియు నర్థము. కనుక కార్యసహిత ప్రకృతినుండి పూర్తిగా విముక్తి చెందుటయే "భూత ప్రకృతి మోక్షము" అనబడును. పైన చెప్పబడిన విధముగా క్షేత్ర-క్షేత్రజ్ఞుల భేదమును తెలిసికొనుటతో పాటు క్షేత్రజ్ఞుడు ప్రకృతితో వేరై వాస్తవికమైన తన పరమాత్మ స్వరూపమునందు అభిన్నభావముతో ప్రతిష్ఠితుడై యుండుటయే" కార్యసహిత ప్రకృతినుండి విముక్తి చెందుటను తెలిసికొనుట యనబడును.

ఇతి శ్రీ మహాభారతే భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా పర్వణి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే క్షేత్ర క్షేత్రజ్ఞవిభాగయోగో నామ త్రయోదశోఽధ్యాయః భీష్మపర్వణి తు షట్త్రింశోఽధ్యాయః

శ్రీమహాభారతమునందు, భీష్మపర్వమునందు శ్రీమద్భగవద్గీతా పర్వమునందు శ్రీమద్భగవద్గీలోపనిషత్తులందు, బ్రహ్మవిద్యయందు, యోగశాస్త్రమునందు, శ్రీకృష్ణార్జున సంవాదమునందు, క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగ మనబడు పదమూడవ అధ్యాయము సమాప్తము (12) భీష్మపర్వమునందు ముప్పదిఏడవ అధ్యాయము సమాప్తము.

---

ఇందలి అభిప్రాయమేమనగా ఎట్లైతే స్వప్నమునందు మనుష్యుడు, ఏదో కారణముచేత తన జాగ్రదవస్థయొక్క స్మరణము గలుగుటచేత ఇది స్వప్నము గనుక వాస్తవ శరీరములో మేల్కొనుటయే యీ స్వాప్నిక దుఃఖములనుండి విడిపోవుటకు ఉపాయము అని తెలిసికొనును. ఈ భావము కలిగి వెంటనే అతడు మేల్కొనును గదా! ఆ విధముగనే జ్ఞాన యోగి, క్షేత్ర-క్షేత్రజ్ఞుల బేదమును తెలిసికొని దానితో పాటే అజ్ఞాన వశుడనై క్షేత్రమునసత్యవస్తువని భావించుటచేతనే, దీనితో నాకు సంబంధ మున్నట్లుగా తోచుచున్నది. కనుక వాస్తవికమైన సచ్చిదానంద ఘన పరమాత్మ స్వరూపమునందు స్థిరముగా నిలిచియుండుటయే ఈ క్షేత్రము నుండి విముక్తి కలుగును, అని తెలిసికొనుటయే క్షేత్రజ్ఞుడు కార్యసహిత ప్రకృతినుండి విముక్తి పొందుటను తెలిసికొనుట యనబడును.

దీని తరువాత విషయము భగవద్గీత మొదటి అధ్యాయము చివర ఈ గుర్తుగల అధో జ్ఞాపికలో నున్నట్లు గ్రహించవలెను.

# శ్రీ భగవద్గీత పదునాలుగవ అధ్యాయము

## గుణత్రయ విభాగయోగము

సంబంధము—

భగవద్గీత పదమూడవ అధ్యాయములో క్షేత్రక్షేత్రజ్ఞుల లక్షణములను తెలిపి ఆ రెండింటి జ్ఞానమే జ్ఞానమని నిరూపించి దాని ప్రకారమే క్షేత్రము యొక్క స్వరూప-స్వభావ - వికారములను దాని తత్త్వములయొక్క ఉత్పత్తి క్రమాదులను, క్షేత్రజ్ఞుని స్వరూప.స్వభావములను వర్ణించి భగవంతుడు చెప్పెను. ఇక్కడ పందొమ్మిదవ శ్లోకమునుండి ప్రకృతి పురుషుల పేర్లతో ప్రకరణమును ఆరంభించి గుణములు ప్రకృతినుండి పుట్టినవని చెప్పెను. ఇరువదియొకటవ శ్లోకములో పురుషుడు మాటిమాటికి ఉత్తమాధమ యోనులలో జన్మించుటకు గుణముల సంబంధమే కారణము. అని కూడ చెప్పెను. దీనిచేత గుణములయొక్క వేర్వేరు స్వరూపములువేవి? అవి జీవాత్మనెట్లు శరీరమునందు బంధించును? ఏగుణము యొక్క సంబంధముచేత ఏయోనిలో జననముకలుగును గుణములనుండి ముక్తి పొందుటకు ఉపాయమేమి? గుణములనుండి విముక్తులైన పురుషుల లక్షణము ఆచరణము నెట్లుండును? అనబడు నీ మొదలైన విషయములను తెలిసికొనవలెనను యిచ్ఛ సహజముగా కలుగును. కనుకనే ఈ విషయములన్నింటిని స్పష్టీకరించుట కొరకే ఈ పదునాలుగవ అధ్యాయము ఆరంభింపబడినది. పదమూడవ అధ్యాయములో వర్ణింపబడిన జ్ఞానమునే స్పష్టపరచి భగవంతుడు పదునాలుగవ అధ్యాయములో విస్తారముగా తెలుపుచున్నాడు.

శ్రీ భగవానువాచ :

పరం భూయః ప్రవక్ష్యామి[1] జ్ఞానానాం జ్ఞానముత్తమమ్ ।

---

1. శ్రుతి-స్మృతి పురాణాదులలో వేర్వేరు విషయములను వివరించి తెలుపు

యజ్ జ్ఞాత్వా మునయః సర్వే పరాం సిద్ధిమితోగతాః॥" 1

భగవంతుడిట్లనెను:—

అర్జునా! జ్ఞానములలోగూడ అత్యుత్తమమైన ఆ పరమజ్ఞానమునుగూర్చి నేను మరల చెప్పెదను. దానిని తెలిసికొనిన మునిజనులందరు[1], సంసార విముక్తులై పరమసిద్ధిని పొందిరి[2].

ఇదం జ్ఞానముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః।
సర్గేఽపి నోపజాయంతే ప్రళయే న వ్యథంతి చ॥ 2

---

టకుగాను వివిధములైన అనేకోపదేశములు "జ్ఞానానాం" అను పదమునకు అర్థములని తెలియవలెను. వానినుండి ప్రకృతి పురుషుల స్వరూప వివేచనము చేసి పురుషుని వాస్తవిక స్వరూపమును ప్రత్యక్షముచేయు తత్త్వజ్ఞాన వర్ణనమునే చేయుట కిక్కడ భగవంతుడు ప్రతిజ్ఞ చేయుచున్నాడు. ఆజ్ఞానము పరమాత్మ స్వరూపమును ప్రత్యక్షము చేయించును. అట్లే అది జీవాత్మను ప్రకృతి బంధనమునుండి విడిపించి యెల్లప్పటికిన్ని అతనికి ముక్తి నిచ్చునది. కనుక అజ్ఞానము ఇతర వివిధ జ్ఞానములకన్నను ఉత్తమము-పరము (అత్యంత ఉత్కృష్టము) నని తెలుపబడెను.

1. ఇక్కడ మునిజన శబ్దముచేత జ్ఞానయోగ సాధనముద్వారా పరమగతి పొందిన జ్ఞానులు అని తెలియవలెను. దేనిని పరబ్రహ్మ ప్రాప్తియనెదరో దేనివర్ణనము పరమశాంతి ఆత్యంతికసుఖము అపునరావృత్తి ఈ మొదలైన అనేక నామములతో చేయబడెనో, ఏచోటికిపోయిన పిదప ఎవడుగూడ మరల తిరిగిరాడో-అదియే యిక్కడగూడ మునిజనులచేత పొందబడిన పరమ సిద్ధియని తెలియవలెను.

2. పూర్వ శ్లోకమునందలి పరాం-సిద్ధిం-గతాః అనువాక్యముచేత చెప్పబడిన విషయమే యీ శ్లోకమునందుకూడ "మమసాధర్మ్య మాగతాః" అను వాక్యముచేత చెప్పబడినది. ఇందలి యభిప్రాయమేమనగా భగవంతుని నిర్గుణ స్వరూపమును అభేద భావముతో పొందుటయే, భగవంతుని సాధర్మ్యము పొందుట యనబడును.

అర్జునా! యీ జ్ఞానము నాశ్రయించి[1] అనగా దీనిని పొంది నా స్వరూప మును పొందిన పురుషులు, సృష్ట్యాదియందు మరల జన్మించరు ప్రళయ కాలములో గూడ వ్యాకుల పడరు[2].

మమ! యోనిర్మహద్ బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్ ।
సంభవః సర్వభూతానాం తతో భవతి భారత॥ ౩

అర్జునా! మహాబ్రహ్మరూపమైన నా మూల ప్రకృతి సమస్త భూతములకు యోనియగును. అనగా గర్భధారణ స్థానము.[3] నేను ఆయోనిలో చేతనసముదాయ రూపమైన గర్భమును స్థాపించెదను[4]. ఆ జడచేతనముల సంయోగముచేత అన్ని

1. ఈ ప్రకరణమునందు వర్ణింపబడిన జ్ఞానమునను సరించి ప్రకృతి-పురుషుల స్వరూపమును తెలిసికొని గుణసహిత ప్రకృతికన్న పూర్తిగా అతీతు డగు నిర్గుణ-నిరాకార-సచ్చిదానంద ఘన-పరమాత్మ స్వరూపమునందు అభిన్న భావముతో స్థిరముగా నిలిచియుండుటయే "ఈజ్ఞానమును ఆశ్ర యించుట" యనబడును.

2. దీనిచేత భగవంతుడు ఈ అధ్యాయమునందు తెలుపబడిన 'జ్ఞానము నాశ్ర యించి దాని ప్రకారము సాధనముచేసి పరబ్రహ్మ-పరమాత్మ స్వరూప మును అభేదభావముతో పొందిన ముక్తపురుషులు, ప్రపంచ మహాసృష్ట్యాది యందు మరల జన్మించరు. మహా ప్రళయకాలమునందు పీడితులుగూడ కారు వాస్తవముగా వారికి సృష్టి-ప్రళయములతో ఏవిధమైన సంబంధము గూడ ఉండనేయుండదు'అని తెలిపెను.

3. 'అవ్యక్తము' ప్రధానము అనికూడ చెప్పబడునట్టిది. సమస్త ప్రపంచ కారణభూతమైన మూల ప్రకృతియే యిక్కడ 'మహత్' అను విశేషణ సహిత 'బ్రహ్మ' శబ్దమునకు అర్థమని తెలియవలెను. ఇక్కడ దానికి భగవంతుడు 'యోనియని'పేరుపెట్టి సమస్త ప్రాణుల వేర్వేరు శరీరము లకు ఇదియే ఉపాదాన కారణము (కుండకు మన్నువలె) ఇదియే గర్భ ధారణమునకు ఆధారము'అను నభిప్రాయము తెలిపెను.

4. మహా ప్రళయ కాలమునందు తమ తమ సంస్కారములతో పరమేశ్వరుని

భూతములు జన్మించును[1].

> సర్వయోనిషు కౌంతేయ మూర్తయః సంభవంతి యాః ।
> తాసాం బ్రహ్మ మహద్యోనిరహం బీజప్రదః పితా॥ 4

అర్జునా! వివిధములైన సర్వయోనులయందు శరీరధారులైన మూర్తులు[2] (ప్రాణులు) అన్నిటికి గర్భధారణముచేయు తల్లిగా ప్రకృతియుండును. నేను ఆ ప్రకృతిలో బీజస్థాపనముచేయు తండ్రిగానుండెదను[3].

సంబంధము:-

జీవులు అనేకవిధ యోనులలో జన్మించు విషయమైతే నాలుగవ శ్లోకము వరకు చెప్పబడెను. కాని అక్కడ గుణముల విషయమై యేమియు చెప్పబడలేదు.

---

యందున్న జీవ సముదాయమునకు మహా సృష్ట్యాదిలో ప్రకృతితో విశేష సంబంధము కలిగించుటయే చేతన సముదాయ మనబడు గర్భమును ప్రకృతియను యోనిలో స్థాపించుట యనబడును.

1. పైన చెప్పబడిన జడ చేతనముల సంయోగముచేత వేర్వేరు ఆకృతులలో ప్రాణులన్నియు సూక్ష్మరూపములో ప్రకటితములగుటయే ఆ ప్రాణుల యొక్క ఉత్పత్తి యనబడును.

2. ఇక్కడ 'మూర్తి' శబ్దమునకు దేవ-మనుష్య-రాక్షస-పశు-పక్ష్యాది నానా విధములైన వేర్వేరు వర్ణములు (రంగులు) ఆకృతులుగల శరీరములతో గూడిన సమస్త ప్రాణులు అని యర్థము. ఆ ప్రాణులు స్థూలరూపములో జన్మించుటయే అవి ఉత్పన్నములగుట యనబడును.

3. దీనిచేత భగవంతుడు "సూక్ష్మ-స్థూల-శరీరములుగల ఆ మూర్తులన్నియు ప్రకృతి యొక్క అంశమునుండి పుట్టినవి. ఆ మూర్తులన్నిటియందున్న చేతనుడైన ఆత్మ నా యంశమనియే తెలియవలెను. ఆ రెండింటి సంబంధము చేత సమస్త మూర్తులు-అనగా శరీరధారులైన ప్రాణులు జన్మించును. ఈ కారణముచేతనే ప్రకృతి "ఆ ప్రాణులకు తల్లి-నేను తండ్రి" యను నభిప్రాయమును తెలిపెను.

కనుక ఇప్పుడు "ఆగుణములేవి? వాని సంబంధమువేమి? ఏగుణముయొక్క సంబంధముచేత ఉత్తమ యోనిలో, మరియే గుణసంబంధముచేత నీచయోనిలో ప్రాణి జన్మించును. అను నీ విషయములన్నియు స్పష్టముగా తెలుపుటకు ఈ ప్రకరణము నారంభించుచు భగవంతుడు తొలుత ఆ మూడు గుణములయుత్పత్తి ప్రకృతినుండి కలుగుననిచెప్పి, వాని వేర్వేరుపేర్లను తెలిపి పిదప వాని స్వరూపము వానిద్వారా జీవాత్మకు గలుగు బంధన ప్రకారమున్ను క్రమముగా, విడి విడిగా వర్ణించుచున్నాడు.

"సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతి సంభవాః ।
న బధ్నంతి మహా బాహో దేహే దేహిన మవ్యయమ్॥" 5

అర్జునా! సత్త్వగుణము-రజోగుణము-తమోగుణము-అను నీ మూడున్ను ప్రకృతినుండి ఉత్పన్నములైన గుణములు[1] వినాశరహితుడైన జీవాత్మను ఇవి శరీరములో బంధించును[2].

తత్ర సత్త్వం నిర్మలత్వాత్ ప్రకాశక మనామయమ్ ।
సుఖసంగేన బధ్నాతి జ్ఞాన సంగేన చానఘ । 6

నిష్పాపా! ఆ మూడు గుణములలో సత్త్వగుణము నిర్మలమగుటచేత ప్రకాశము కలిగించునది, వికార సహితమునైనది[3] ఆ గుణము సుఖ సంబంధముచేత

---

1. గుణములు మూడు సత్త్వ-రజస్ - తమస్ అని వాని పేర్లు. మూడున్ను పరస్పరము భిన్నములు ఈ మూడు గుణములు ప్రకృతికి కార్యములు. సమస్త జడపదార్థములు ఈ మూడింటి విస్తారములేయని యభిప్రాయము.

2. శరీరాభిమానము గలవాని పైననే ఈ గుణముల ప్రభావము పడును. వాస్తవముగా నతడు సర్వవికార రహితుడు అవినాశి కనుకనే, అతనికి బంధనము కలుగనే కలుగదు. అనాదిసిద్ధమైన జ్ఞాన కారణముగా అతనికి బంధనము ఏర్పడినది. ఈ మూడు గుణములు తమకు అనురూపములైన సుఖభోగములందు. శరీరములందున్ను, అతనికి మమకారము-ఆసక్తి అభిమానము కలిగించుటయే త్రిగుణములు అతనిని శరీరములో బంధించుట యనబడును.

3. సత్త్వగుణ స్వరూపము పూర్తిగా నిర్మలము. దానిలో ఏ విధమైన దోషము

జ్ఞాన సంబంధముచేతను-అనగా దాని అభిమానముచేత బంధించును[1].

రజో రాగాత్మకం విద్ధి తృష్ణా సంగ సముద్భవమ్ ।
తన్నిబధ్నాతి కౌంతేయ కర్మ సంగేన దేహినమ్॥ 7

అర్జునా! రాగరూపమైన రజోగుణము ఆసక్తి-కామనలచేత ఉత్పన్నమగు వని తెలిసికొనుము[2]. ఆ గుణము ఈ జీవాత్ముని, కర్మల సంబంధముచేత. కర్మ

---

గూడలేదు. కనుకనే అది ప్రకాశకము, అనామయమునైయున్నది. సత్త్వ గుణముచేత, అంతఃకరణమునందు ఇంద్రియములందున్న ప్రకాశము వృద్ధిచెందును. అప్పుడు దుఃఖములు విక్షేపములు (మనశ్చాంచల్యములు) దుర్గుణములు దురాచారములు నశించి శాంతి కలుగును.

1. ఇక్కడ "సుఖ" శబ్దమునకు భగవద్గీత పదునెనిమిదవ అధ్యాయము ముప్పది యారవ-ముప్పదియేడవ శ్లోకములలో దేనిలక్షణము చెప్పబడినదో ఆ సాత్త్విక సుఖము అని యర్థము. ఆ సుఖప్రాప్తి కాలమునందు నేను సుఖిని అని, యే యభిమానమైతే కలుగునో అట్లే 'జ్ఞానము' అనగా బోధ శక్తియని యర్థము. అజ్ఞానము కలిగినప్పుడు నేను జ్ఞానిని అనియే అభి మానము కలుగునో ఆ రెండు విధములైన (సుఖ-జ్ఞాన) అభిమానము అతనిని గుణాతీత దిశనుండి దూరముచేయును. కనుక ఇదియే సత్త్వ గుణము జీవాత్మను సుఖముయొక్క జ్ఞానముయొక్కయు, సంబంధము చేత బంధించుట యనబడును.

2. ఆసక్తి కామనలచేత రజోగుణము వృద్ధిచెందును. రజోగుణముచేత ఆసక్తి కామనలు వృద్ధిచెందును. వీనికి పరస్పరము బీజవృక్షములకువలె అన్యో న్యాశ్రయ (దీనిని అది దానిని ఇది ఆశ్రయించియుండు) సంబంధము కలదు. వీనిలో రజోగుణము బీజముగాను, ఆసక్తి కామనలు వృక్షము గాను నున్నవి. బీజము వృక్షమునుండియే ఉత్పన్నమగును. అయినను వృక్షమునకు కారణముగూడ బీజమేయగును. ఈ విషయమును స్పష్ట పరచుటకే ఒకచోట రజోగుణముచేత కామాదుల ఉత్పత్తి, మరి యొక చోట కామాదులచేత రజోగుణోత్పత్తి చెప్పబడినది.

ఫల బంధముచేతను బంధించును[1].

తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్ ।
ప్రమాదాఽలస్య నిద్రాభిస్తన్నిబధ్నాతి భారత ॥ 8

అర్జునా! దేహాభిమానులందరిని మోహింపజేయు[2] తమోగుణము అజ్ఞానము చేత ఉత్పన్నమగునని తెలియుము[3]. అది జీవాత్మని ఏమరుపాటు-సోమరితనము నిద్రలచే బంధించును.[4]

---

1. కర్మలన్నియు నేను చేయుచున్నాను అని కర్మలయందు కర్తృత్వాభిమాన పూర్వకముగా నాకు ఈ కర్మవలన ఈ ఫలములభించును. అని తలచి కర్మలతో తత్ఫలములతో సంబంధము గలిగించుకొనుట "కర్మసంగము" అనబడును. రజోగుణము జీవాత్మను జనన-మరణ రూప సంసారము నందు ఇరికించి యుంచుటయే అదికర్మసంగముద్వారా జీవాత్మను బంధించుట యనబడును.

2. అంతః కరణమునందు ఇంద్రియములందున్న జ్ఞాన శక్తి లేకుండజేసి వానియందు మోహము కలిగించుటయే, తమోగుణము దేహాభిమానులందరిని మోహింపజేయుట యనబడును.

3. ఈ యధ్యాయము పదియేడవ శ్లోకమునందు అజ్ఞానము తమోగుణము వలన గలుగునని తెలుపబడెను. ఇక్కడ తమోగుణము అజ్ఞానమునుండి పుట్టినదని చెప్పబడెను దీని యభిప్రాయమేమనగా తమోగుణము చేత అజ్ఞానము వృద్ధి చెందును. అజ్ఞానముచేత తమోగుణము పెరుగును. ఈ రెండింటికి గూడ బీజ వృక్షములకు వలె-అన్యోన్యాశ్రయ సంబంధము గలదు. అజ్ఞానము బీజము గాను, తమోగుణము వృక్షముగాను నున్నవని తెలియవలెను.

4. ప్రమాదము అనగా 'అంతఃకరణము ఇంద్రియములు" వ్యర్థ ప్రయత్నము చేయుట, శాస్త్ర విహిత కర్తవ్య కర్మలు పాలించుటయందు వెక్కిరింపు అవమానము కలిగియుండుట యని భావము. ఆలస్యము అనగా కర్తవ్య కర్మలయందు ప్రవృత్తి ప్రయత్నము లేకుండుట యని భావము. నిద్ర

సంబంధము-

ఈ విధముగా సత్త్వ-రజస్-తమోగుణములలో మూడింటి స్వరూపమును, వానిచేత జీవాత్మకు బంధనము గలుగు విధమును తెలిపి, యిప్పుడు భగవంతుడు ఆగుణముల సహజ వ్యాపారమునుగూర్చి తెలుపుచున్నాడు.

సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత। ।
జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సంజయత్యుత॥ 9

అర్జునా! సత్త్వగుణము సుఖము గలిగించును[1]. రజోగుణము కర్మము నందు[2] తమోగుణము జ్ఞానమునుకప్పి ప్రమాదము (ఏమరుపాటు) నందుగూడ లగ్నము చేయును[3].

---

యనగా కునుకుపాటు, తాగుట-స్వప్నము-సుషుప్తి (గాఢనిద్రయని) భావము. ఈ యన్నిటి ద్వారా ముక్తిసాధనమునుండి జీవాత్మను దూరముచేసి తమోగుణము జనన మరణ రూపసంసారమునందు ఇరికించియుంచుటయే తమోగుణము ప్రమాద-ఆలస్య-నిద్రలచేత-జీవాత్మను బంధించుట యన బడును.

1. "సుఖ" శబ్దమున కిక్కడ సాత్త్వికసుఖమని యర్థము (గీత 18-36, 37) సత్త్వగుణము మనుష్యుని సాంసారిక భోగములనుండి ప్రయత్నముల నుండి ప్రమాద-ఆలస్య నిద్రలనుండియు తొలగించి ఆత్మచింతనాదుల ద్వారా అతనికి సాత్త్విక సుఖముతో సంబంధము కలిగించుటయే అతనిని సుఖములో లగ్నముచేయుట యనబడును.

2. "కర్మశబ్దమున" కిక్కడ ఇహలోక-పరలోక-సుఖభోగరూప ఫలముల నిచ్చు శాస్త్ర విహితములైన కామకర్మలని యర్థము. వివిధ భోగముల యందు ఇచ్ఛ కలిగించి వాని ప్రాప్తికొరకు ఆ కర్మలయందు మనుష్యు నకు ప్రవృత్తి కలిగించుటయే "రజోగుణము" మనుష్యుని ఆ కర్మల యందు లగ్నము చేయుట యనబడును.

3. తమోగుణము వృద్ధి చెందినపుడు అది ఒకప్పుడు మనుష్యునియొక్క,

సంబంధము:-

సత్త్వాది త్రిగుణములు తమ తమ కార్యములందు జీవుని నియోగించు సమయమునందు అవి అట్లు చేయుటకు ఏ విధముగ సమర్థములగు నను విషయమును భగవంతుడు ఈ తరువాతి శ్లోకమునందు వివరించుచున్నాడు.

రజస్తమ శ్చాభిభూయ సత్త్వం భవతి భారత। ।
రజః సత్త్వం తమశ్చైవ తమః సత్త్వం రజస్తథా॥ 10

అర్జునా! రజోగుణమును, తమోగుణమును అణచి సత్త్వమగును[1] సత్త్వగుణమును తమోగుణమును అణచి రజోగుణము[2] అట్లే సత్త్వగుణమును, రజో

---

కర్తవ్యా కర్తవ్యములు నిర్ణయించు వివేకశక్తిని నష్టపరచును. మరియొకప్పుడు అతని అంతఃకరణముయొక్కయు ఇంద్రియముయొక్కయు చైతన్యమును నష్టముచేసి అతనికి నిద్రావృత్తిని కలిగించును. తమోగుణము మనుష్యుని జ్ఞానమును కప్పిపుచ్చి కర్తవ్యపాలనమునందు వెక్కిరింపు అవమానము అతనికి కలిగించుచు యాతనిని పనికిమాలిన ప్రయత్నములు చేయుటకు పూనుకొన జేయుటయే అతనిని ప్రమాదములో లగ్నము చేయుట యనబడును.

1. రజో గుణమునుండి లోభము-ప్రవృత్తి-సుఖ-భోగ వాసనాదులు, తమోగుణమునుండి నిద్ర-సోమరితనము ఏమరుపాటు మొదలగునవి పుట్టును. వానిని అణచి సత్త్వగుణముయొక్క జ్ఞాన ప్రకాశ-సుఖాదులు ఉత్పత్తి చేయుచూ రజస్తమో గుణములను అణచి సత్త్వగుణముయొక్క జ్ఞాన ప్రకాశ-సుఖాదులు ఉత్పత్తి చేయుటయే రజస్తమో గుణములను అణచి సత్త్వగుణము అభివృద్ధి చెందుట యనబడును.

2. రజోగుణము-సత్త్వ-తమోగుణముల ప్రవృత్తిని నివారించి తన కార్యమును ఆరంభించు సమయమందు శరీర-ఇంద్రియ-అంతఃకరణములందు చంచలత్వ-అశాంతి-లోభ-భోగ వాసనలు వివిధ కర్మలందు ప్రవృత్తి కలిగించు తీవ్రమైన యిచ్ఛయు ఉత్పన్నములగును. ఇదియే సత్త్వ-తమో గుణములను అణచి రజోగుణము వృద్ధి చెందుట యనబడును.

గుణమును అణచి తమోగుణము[1] కలుగును-అనగా అభివృద్ధి చెందును.[2]

సంబంధము:—

ఈ విధముగా ఇతర గుణములను రెండింటిని అణచి ప్రతియొక గుణము వృద్ధిచెందునను విషయము చెప్పబడెను. ఇప్పుడు ప్రతియొక గుణముయొక్క వృద్ధిలక్షణము తెలిసికొను కోరిక కలిగినమీదట క్రమముగా సత్త్వగుణ-రజోగుణ తమోగుణముల వృద్ధి లక్షణములనుగూర్చి భగవంతుడు తెలుపుచున్నాడు.

"సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే।
జ్ఞానం యదా తదా విద్యాద్ వివృద్ధం సత్త్వమిత్యుత॥ 11

"అర్జునా! యీ దేహమునందు[3] అంతఃకరణమునందు, ఇంద్రియములం

---

1. సత్త్వ-రజోగుణముల ప్రవృత్తిని నివారించి తమోగుణము తన కార్యము ఆరంభించినప్పుడు శరీరేంద్రియాంతఃకరణములందు మోహాదులు పెరుగును. ప్రమాదము (ఏమరుపాటు) నందు ప్రవృత్తి కలుగును. ఇంద్రియవృత్తులు వివేకశూన్యములగును. ఇదియే సత్త్వ రజో-గుణము లను అణచి తమో గుణము వృద్ధిచెందుట యనబడును.

2. గుణముల అభివృద్ధిని గూర్చి శ్రీ మద్భాగవతములో ఈ క్రింది విధముగా పది కారణములు తెలుపబడినవి. ఆగమోఽపః ప్రజా దేశః కాలః కర్మచ జన్మచ ధ్యానం మంత్రోఽథ సంస్కారో దశైతే గుణహేతవః (11-13-10) అనగా "శాస్త్రము-జలము-సంతానము-దేశము-కాలము-కర్మ జన్మ (యోని)- ధ్యానము (చింతనము) మంత్రము సంస్కారము గుణము లను ఈ పదియు హేతువులగును. ఇవి గుణములను పెంపొందించును. ఇందలి యభిప్రాయమేమనగా పైన చెప్పబడిన పదార్థములు ఏ గుణ ముతో చేరునో దాని సంబంధము ఆ గుణమును వృద్ధి పొందించును అని భావము.

3. ఇందలి యభిప్రాయమేమనగా సత్త్వగుణము వృద్ధిచెందుటకు అవకాశము ఈ మనుష్య శరీరముచే లభించును. మనుష్యుడి శరీరమునందే సత్త్వగుణ

దున్న చైతన్యము-వివేకశక్తి ఉత్పన్నములైనప్పుడు సత్త్వగుణము వృద్ధి పొందినదని[1] తెలిసికొనవలెను.

"లోభః ప్రవృత్తిరారంభః కర్మణామశమః స్పృహా।
రజస్యేతాని జాయంతే వివృద్ధే భరతర్షభ ॥" 12

అర్జునా! రజోగుణము వృద్ధి చెందినప్పుడు, లోభ-ప్రవృత్తి స్వార్థముల వృద్ధిచేత సకామభావముచేత, కర్మముల ఆరంభము, అశాంతి విషయభోగము లందు ఆసక్తి పుట్టును.[2]

అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ।
తమస్యేతాని జాయంతే వివృద్ధే కురునందన॥ 13

---

సహాయముతో ముక్తి లాభము అనుభవించగలడు. ఇతర యోనులందా యధికారమాతనికి లేదు.

1. శరీరమునందు చైతన్యము-తేలికదనము, ఇంద్రియములందు-అంతఃకరణమునందున్న నిర్మలత్వము చైతన్యాధిక్యమున్న కలుగుటయే ప్రకాశము ఉత్పన్నమగుట యనబడును. ఇట్లే సత్యాసత్య-కర్తవ్యాకర్తవ్యముల నిర్ణయముచేయు వివేకశక్తి జాగృతమగుటయే జ్ఞానము ఉత్పన్నమగుట యనబడును. ఈ ప్రకాశ-జ్ఞానములు రెండున్ను ప్రాదుర్భవించినప్పుడు, సంసారమునందు వైరాగ్యము గలిగి, మనస్సునందు ఉపరతి (నిశ్చింత-ఉడుకువ) సుఖశాంతులు, ప్రవాహమువలె వచ్చును. రాగద్వేష దుఃఖ-శోక-చింతా-భయ-చంచలత్వ-నిద్ర-అలస్య ప్రమాదాదులు లేనట్లుగా అనుభవము కలుగును. అప్పుడు మనుష్యుడు జాగరూకుడై, తన మనస్సును భగవద్భజన-ధ్యానాదులందు లగ్నము చేయుటకు ప్రయత్నించవలెను. అప్పుడే సత్త్వగుణప్రవృత్తి చాలసేపు నిలిచియుండగలదు అట్లుగాక దానిని నిర్లక్ష్యము చేసినచో త్వరలో దానిని రజోగుణమో, తమోగుణమో అణచివేసి, తమకార్యములు చేయుటకు ఆరంభించును.

2. దీనిచేత మనుష్యుడు ప్రతిక్షణము ధనవృద్ధికి ఉపాయములు యోచించు

అర్జునా! తమో-గుణము పెరిగినప్పుడు అంతఃకరణము నందు ఇంద్రియములందున్న, అప్రకాశము-కర్తవ్య కర్మలందు అప్రవృత్తి-ప్రమాదము అనగా, వ్యర్థముగా ప్రయత్నములు చేష్టలు చేయుట, అంతఃకరణమును మోహింపజేయు నిద్రాది వృత్తులు ఇవి యన్నియు పుట్టును.[1]

సంబంధము :-

ఈ విధముగా త్రిగుణములవృద్ధికి సంబంధించిన వేర్వేరు లక్షణములు చెప్పి భగవంతుడు ఇప్పుడు రెండు శ్లోకములలో, ఆ గుణములలో ఏ గుణము వృద్ధి చెందినప్పుడు మరణించిన మనుష్యుడు ఏ గతిని పొందునను విషయము చూపుచున్నాడు.

---

చుండునో, ధనవ్యయము చేయుటకు సముచితమైన అవసరము ప్రాప్తించినను ధన-త్యాగము చేయడో, ధనసంపాదన సమయమందు కర్తవ్యాకర్తవ్యముల వివేచనము విడిచి యితరుల ధనమునందు గూడ అధికారము వహించుటకు ఇచ్ఛ-గాపి ప్రయత్నముగాని చేయునో, అట్టి ధనాశ లోభ మనబడును. అనేక విధ కర్మలు చేయుటకు మనోభావములు జాగృతములై యుండుట "ప్రవృత్తి"యనబడును. ఆ కర్మలోన కామభావముతో చేయబూనుట ఆ కర్మల "ఆరంభ" మనబడును. మనస్సు యొక్క చంచలత్వము "అశాంతి" యనబడును. ప్రాపంచిక వస్తువులు తనకు ఆవశ్యములని కోరుట (తలచుట) స్పృహ యనబడును. రజోగుణముల వృద్ధి చెందినప్పుడు ఈ లోభాదులు జనించుటయే అవి ఉత్పన్నములగుట యనబడును.

1. మనుష్యుని యింద్రియములలో అంతఃకరణములోను దీప్తి లేకుండుట అప్రకాశముఉత్పన్నమగుట యనబడును ఏకర్మ గూడ మంచిదనిఎంచక ఊరకపడియుండి కాలము గడుపుటకు ఇచ్ఛయుంచుట "అప్రవృత్తి కలుగుట యనబడును. శరీరేంద్రియములచేత వ్యర్థ కార్యములు చేయుట, కర్తవ్యకర్మలను నిర్లక్ష్యము చేయుట, ప్రమాదము కలుగుట-యగును. మనస్సు మోహము చెందుట, ఏ విషయము గూడ జ్ఞప్తికి రాకుండుట. తంద్ర (కునికిపాటు) స్వప్నము-సుషుప్తి (గాఢనిద్ర) ఈ దశలు పొందుట

యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రళయం యాతి దేహభృత్।
తదోత్తమవిదాం లోకానమలాన్ ప్రతిపద్యతే ॥[1] 14

"అర్జునా! మనుష్యుడు సత్త్వగుణము వృద్ధి దశలోనుండగా మరణించి నపుడు ఉత్తమ కర్మలు చేయువారు పొందునట్టి నిర్మల-దివ్య-స్వర్గాది లోకము లను పొందును.[2]

రజసి ప్రళయం గత్వా కర్మసంగిషు జాయతే।
తథా ప్రలీనస్తమసి మూఢయోనిషు జాయతే॥ 15

---

వివేకశక్తి లేకుండుట ఏ విషయము గూడ తెలిసికొను శక్తి లేకుండుట ఇవి యన్నియే-మోహము ఉతన్నమగుట యనబడును. ఈ లక్షణము లన్నియు తమోగుణమువృద్ధి చెందినప్పుడు ఉత్పన్నములగును. కను కనే వీనిలో ఏ లక్షణమైనను తన యందున్నప్పుడు మనుష్యుడు తనకు తమోగుణము పెరిగినదని తలచవలెను.

1. 'దేహభృత్' అను పదము ప్రయోగించి 'శరీరమునందు' అహంకార మమకారములు గలిగిన దేహధారికే పునర్జన్మ రూపములైన వేర్వేరు గతులు గలుగును, దేహాభిమానము లేని జీవన్ముక్తులైన మహాత్ములకు పునర్జన్మ కలుగదు అనుభావము తెలిపెను.

2. ఈ ప్రకరణములో స్వాభావిక స్థితి యితర గుణములందు ఉండి కూడ సాత్త్వక గుణాభివృద్ధి దశలో మరణించిన మనుష్యుని గూర్చి నిరూపింప బడును.

పూర్వ సంస్కారాదికారణములచేత మనుష్యునకు సత్త్వగుణము వృద్ధి చెందినప్పుడు అనగా పదకొండవ శ్లోకములో వర్ణింపబడినట్లుగా మను ష్యుని శరీరేంద్రియాంతఃకరణములందు 'ప్రకాశము' జ్ఞానము ఉత్పన్న ముతైనప్పుడు స్థూల శరీరమునుండి ప్రాణేంద్రియములతో మనస్సుతో గూడిన జీవాత్మ యొక్క సంబంధము విచ్ఛిన్నమగుటయే "సత్త్వగుణాభి వృద్ధి దశలో మరణించుట యనబడును.

"అర్జునా! రజోగుణము పెరిగినప్పుడు మరణించిన[1] మనుష్యుడు కర్మాసక్తులైన మనుష్యులలో ఉత్పన్నుడగును. తమోగుణము వృద్ధి చెందినపుడు చచ్చిన[2] మనుష్యుడు, పశుకీటకాది మూఢ యోనులలో తన్నుడగును.

సంబంధము:-

సత్వ-రజస్-తమోగుణముల వృద్ధి దశలలో మరణమునకు వేర్వేరు ఫలములు చూపబడెను. దీనిచేత ఈ విధముగా ఒకప్పుడొక గుణమునకు తగ్గుదల, ఒక గుణమునకు అధిక్యము (వృద్ధి) ఎందుకు అగును? అను ప్రశ్న కలుగవచ్చును. కనుక దానికి ఉత్తరము భగవంతుడిట్లనుచున్నాడు.

కర్మణః[3] సుకృతస్యాఽహుః సాత్త్వికం నిర్మలం ఫలమ్।
రజసస్తు ఫలం దుఃఖమజ్ఞానం తమసః ఫలమ్ ॥ 16

---

1. సాత్విక-తామస పురుషుల హృదయములో గూడ, పన్నెండవ శ్లోకములో చెప్పిన విధముగా లోభము ప్రవృత్తి మొదలైన రాజసభావములు వృద్ధి చెందినప్పుడు స్థూల శరీరమునుండి ప్రాణేంద్రియ మనస్సహిత జీవాత్మ యొక్క సంబంధము విచ్ఛిన్నమగుటయె, రజోగుణాభివృద్ధి దశలో మరణించుట యగును.

2. సాత్త్విక-రాజస పురుషుల హృదయమునందు గూడ, పదమూడవ శ్లోకములో చెప్పబడినట్లు "అప్రకాశము" అప్రవృత్తి 'ప్రమాదము ఇత్యాది తామస భావములు పెంపొందినపుడు, స్థూల శరీరమునుండి ప్రాణములు ఇంద్రియములు-మనస్సు" వీనితో గూడిన జీవాత్మ సంబంధము తెగిపోవుటయె తమోగుణాభివృద్ధి దశలో మరణించుట యగును.

3. ప్రతియొక మనుష్యుని అంతఃకరణమునందు సాత్త్విక రాజస-తామసము లనబడు త్రివిధ కర్మ సంస్కారములు సంచితములై యుండును. వానిలో ఎప్పుడు ఎటువంటిసంస్కారములు పుట్టునో అపుడు అటువంటివే యగు సాత్త్వికాది భావములు వృద్ధి చెందును. వాని ననుసరించియే క్రొత్త కర్మలు కలుగును. కర్మలనుండి సంస్కారములు సంస్కారములనుండి సాత్త్వికాది గుణములవృద్ధి అట్లే దానినుండి స్మృతి, స్మృతిననుసరించి

అర్జునా! ఉత్తమ కర్మకు సాత్త్వికము అనగా సుఖ-జ్ఞాన, వైరాగ్యాది నిర్మలఫలము కలుగునని చెప్పబడినది.[1] రాజసకర్మకు ఫలము దుఃఖము[2] గలుగుట. తామసకర్మకు ఫలము అజ్ఞానము[3] కలుగుటనియు చెప్పబడినది.

---

పునర్జన్మ ఆ తరువాత మరల కర్మలు ఆరంభము కలుగును. ఈ విధముగా సంసారచక్రము తిరుగుచుండును.

1. శాస్త్ర విహితములైన కర్తవ్య కర్మలు నిష్కామ భావముతో చేయబడిన సాత్త్విక కర్మల సంస్కారములచేత అంతఃకరణము నందు, జ్ఞాన వైరాగ్యాది నిర్మల భావములు మాటిమాటికి పుట్టుచుండుట, మరణించిన తరువాత, దుఃఖదోష రహితములైన దివ్య - ప్రకాశమయ లోకములను పొందుట ఇవియే వానియొక్క 'సాత్త్విక' నిర్మల ఫలము లనబడును.

2. సుఖ-భోగముల ప్రాప్తికొరకు, అహంకార పూర్వకముగా అధిక పరిశ్రమతో చేయబడు కర్మలు (గీత-18-24) రాజసము లనబడును. ఇట్టి కర్మలు చేయబడునపుడైతే, పరిశ్రమ రూప దుఃఖము తప్పక కలుగును అంతటితో నిలువక, ఆ తరువాతగూడ అవి దుఃఖమే కలగించుచుండును. వాని సంస్కారములచేత అంతఃకరణము నందు మాటిమాటికి భోగ-కామనా-ప్రవృత్తి లోభాదులైన రాజస భావములు స్ఫురించును-వానిచేత మనస్సు చెదరిపోయి అశాంతితో దుఃఖములతోను నిండిబోవును. ఆ కర్మల ఫలముగా ప్రాప్తించిన భోగములు గూడ అజ్ఞానముచేత సుఖ రూపములుగా కనబడినప్పటికి, వాస్తవముగా నవి దుఃఖరూపములే యగును. ఫలములనుభవించుటకు మాటిమాటికి జనన మరణముల చక్రములో పడుట మహాదుఃఖకరమగును.

3. ఏ మాత్రము యోచించక మూర్ఖత్వముతో చేయబడు హింసాది దోష భరిత కర్మలు (గీత 18-25) "తామసము" లనబడును. ఆ కర్మల సంస్కారములచేత అంతఃకరణమునందు మోహము వృద్ధిచెందును. వారు మరణించిన తరువాత తమోగుణము అధికముగాగల జడయోనులందు జన్మించెదరు. దాని ఫలమే 'అజ్ఞానము' అనబడును.

సంబంధము:-

పదకొండవ–పన్నెండవ. పదుమూడవ శ్లోకములలో సత్త్వ-రజస్-తమో గుణముల వృద్ధిలక్షణములు క్రమముగాచెప్పబడెదు. దీనిపైన "జ్ఞానాదులఉత్పత్తికి సత్త్వాది గుణముల వృద్ధి లక్షణము లెందుకు అంగీకరించబడినవి? అను విషమము తెలిసికొనుటకు ఇచ్ఛ కలుగును. కనుక కార్యోత్పత్తికి కారణ సత్తాను తెలిసికొనుటకు జ్ఞానాదుల ఉత్పత్తికి, సత్త్వాది గుణములు కారణములని భగవంతుడు తెలుపుచున్నాడు.

సత్త్వాత్ సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ ।
ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞానమేవ చ ॥ 17

అర్జునా! సత్త్వగుణమునుండి జ్ఞానము[1] జనించును. రజోగుణము నుండి లోభము[2] తమోగుణమునుండి ప్రమాద-మోహములు అజ్ఞానము గూడ పుట్టును.

ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థా మధ్యే తిష్ఠంతి రాజసాః ।
జఘన్యగుణవృత్తిస్థా అధో గచ్ఛంతి తామసాః ॥[3]

"అర్జునా! సత్త్వగుణమునందున్న పురుషులు ఉన్నతములైన స్వర్గాది లోకములకు పోవుదురు. రజోగుణమునందున్న పురుషులు మధ్యమలోకమునందు అనగా మనుష్యలోకమునందే యుండెదరు తమోగుణము యొక్క కార్యము

---

1. ఇక్కడ 'జ్ఞాన' శబ్దముచేత "జ్ఞాన-ప్రకాశ-సుఖ-శాంత్యాదులైన సాత్త్వికభావములన్నింటి యుత్పత్తి-సత్త్వగుణముచేత కలుగును. అని తెలిసికొనవలను.

2. ఇక్కడ "లోభ" శబ్దముచేత గూడ లోభ-ప్రవృత్తి ఆసక్తి-కామనలు స్వార్థ పూర్వకముగా కర్మలు ఆరంభించుట, ఈ మొదలైన రాజస భావములన్నింటి యుత్పత్తి గూడ రజో గుణముచేతనే కలుగును అని తెలిసికొనవలెను.

3. మహాభారతము, అశ్వమేధపర్వము, ముప్పది తొమ్మిదవ అధ్యాయము, పదవశ్లోకము గూడ దీనికి ఇంచుమించు సమముగా నున్నది.

లైన నిద్రా-ప్రమాద-ఆలస్యాదులందున్న తామస పురుషులు అధోగతిని అనగా పశుకీటకాది నీచయోనులను, నరకములనున్ను పొందెదరు.[1]

సంబంధము :

భగవద్గీత పదమూడవ అధ్యాయము ఇరువది యొకటవ శ్లోకములో "గుణముల సంబంధమే" మనుష్యుడు ఉత్తమ నీచయోనులను పొందుట యనెడు పునర్జన్మకు కారణమగునని చెప్పబడిన విషయము ప్రకారము ఈ యధ్యాయము ఐదవ శ్లోకమునుండి పదునెనిమిదవ శ్లోకమువరకు గుణముల స్వరూపముచేత, కార్యములచేతను బంధింపబడిన మనుష్యులగతి మొదలగు విషయములు విస్తారముగా ప్రతిపాదింపబడెను. ఈ వర్ణనముచేత మనుష్యుడు తొలుత రజస్తమో గుణములను విడచి, సత్త్వగుణమునందు తన స్థితిని ఏర్పరచుకొనవలెను. తరువాత సత్త్వగుణమునుగూడ విడచి గుణాతీతుడు కావలెను. అను విషయము వివరించిన భగవంతుడిప్పుడు మనుష్యుడు గుణాతీతుడగుటకు ఉపాయములను, గుణాతీతుని దశలో గలుగు ఫలములను గూర్చి ఈ తరువాత రెండు శ్లోకములచేత తెలుపుచున్నాడు.

నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాఽనుపశ్యతి ।
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి ॥ 19

అర్జునా! ఎప్పుడైతే ద్రష్ట[2] మూడు గుణములకన్న వేరుగా నేదియు కర్త

---

1. పదునాలుగవ - పదునైదవ శ్లోకములలోనైతే, ఇతరగుణములలో స్వాభావిక స్థితియున్నప్పటికిన్ని ఏ గుణమువృద్ధి చెందియున్నప్పుడు మృత్యువు గలుగునో, ఆ గుణము ప్రకారమే, ఆ జీవునకు గతి గలుగునని చెప్పబడెను. ఇక్కడ స్వాభావిక స్థితి సత్త్వాది గుణములలో నున్నప్పటికిన్ని అతని గతి భిన్నమని వర్ణింపబడెను. ఇందుచేతనే యిక్కడ సర్వదా తమోగుణ కార్యములందున్న తామస మనుష్యునకు నరకాదులు కలుగునవి కూడ చెప్పబడెను.

2. మనుష్యుడు స్వాభావికముగానైతే తాను దేహధారినని తలచి కర్త భోక్త యగును, కాని ఎప్పుడైతే శాస్త్రముయొక్క ఆచార్యునియొక్కయు సహ

యని చూడడో! త్రిగుణములకన్న పూర్తిగా అతీతుడైన పరుడను సచ్చిదానంద ఘన స్వరూపడను-పరమాత్ముడనునగు నన్ను తాత్త్వికముగా తెలిసికొనునో, ఆ సమయమునందు అతడు నా స్వరూపమునే పొందును.[2]

గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్ ।
జన్మమృత్యుజరాదుఃఖైర్విముక్తోఽమృతమశ్నుతే ॥ 20

అర్జునా! పురుషుడు శరీరోత్పత్తికి కారణములైన త్రిగుణములను ఉల్లంఘించి[3] జన్మ-మృత్యు-వృద్ధావస్థలనుండి-సర్వవిధ దుఃఖములనుండియు విముక్తుడై

---

దేశముచేత, వివేకముపొందునో యతడు తాను ద్రష్టయని తలచుచుండును ఆ వర్ణనము ఇక్కడ చేయబడెను.

1. ఇంద్రియములు-అంతఃకరణము-ప్రాణములు ఇత్యాదులయొక్క శ్రవణ దర్శన-ఆహార-పానీయ-చింతన-మనన-శయన-ఆసన-వ్యవహారాదులన్నియు స్వాభావికముగా జరుగుచున్నప్పుడు, సర్వదాతాను నిర్గుణ, నిరాకార సచ్చిదానంద ఘన-బ్రహ్మమునందు అభిన్నభావముతో నుండుటను చూచుచు గుణములకన్నా వేరైన మరియొక కర్త లేదు. గుణములు కార్యములైన బుద్ధీంద్రియ మనఃప్రాణాదులే గుణకార్యరూపములైన యింద్రియాదుల విషయములందున్నవి (గీత-5.8,9) కనుక గుణములే గుణములందున్నవి (గీత-2-28) నాకు వీనితో ఏపాటి సంబంధము లేదు అని తలచుటయే గుణములు తప్ప మరియొక కర్త లేదని తలచుట యనబడును.

2. తాను నిర్గుణ నిరాకార బ్రహ్మముతో అభిన్నుడనని తలచి, తరువాత ఆ సచ్చిదానంద ఘన బ్రహ్మముకన్న మరియొక సత్త యేదియు లేకుండుట అంతట ఇట్లే సర్వదా కేవల పరమాత్మ ప్రత్యక్షమగుట ఇవియే పరమాత్మను తాత్త్వికముగా తెలిసికొనుట యనబడును. ఇట్టి స్థితి యేర్పడిన తరువాత సాధకుడు 'సచ్చిదానంద ఘనబ్రహ్మమును అభిన్న భావముతో సాక్షాత్తుగా పొందగలడు. అదియే భగవద్భావము అనగా భగవత్స్వరూపమును పొందుట యనబడును.

3. రజస్తమస్సుల సంబంధము విడిపోయిన తరువాత సత్త్వగుణ సంబంధము

పరమానందము పొందును.

సంబంధము :-

ఈ విధముగా జీవితావస్థలోనే త్రిగుణాతీతుడై, మనుష్యుడు అమృతత్వము[1] పొందును అనురహస్య విషయము విని అర్జునుడు గుణాతీతపురుషుని లక్షణము ఆచరణము గుణాతీతుడగుటకు అవలంబించవలసిన ఉపాయములు తెలిసికొనగోరి భగవంతుని ఇట్లడుగుచున్నాడు.

అర్జున ఉవాచ:

కైర్లింగైస్త్రీన్ గుణానేతానతీతో భవతి ప్రభో ।
కిమాచారః కథం చైతాంస్త్రీన్ గుణానతివర్తతే ॥ 21

అర్జును డిట్లనెను :-

ప్రభూ! త్రిగుణాతీత పురుషుడు ఏయే లక్షణములు గలవాడగును? ఏ విధములైన ఆచరణములు గలవాడగును. మనుష్యుడు ఏ యుపాయములచేత త్రిగుణాతీతుడగును?

---

ఉండినచో అదిగూడ ముక్తికిబాధకమై పునర్జన్మ కారణమగును కనుక నే సత్త్వగుణ సంబంధము గూడ విడువవలెను ఆత్మ వాస్తవముగా అసంగము. దానికి గుణములతో ఏ విధమైన సంబంధము గూడ లేదు. అయినను అనాది సిద్ధమైన అజ్ఞానముతో ఆత్మకుగల సంబంధమును జ్ఞానముచేత ఛేదించి తాను నిర్గుణ-నిరాకారా-సచ్చిదానంద-ఘన-బ్రహ్మముతో అభిన్నుడనని, గుణములతో ఏ మాత్రము సంబంధము లేనివాడనియు తలచి, అనగా ప్రత్యక్షానుభవము కలిగించుకొనుటయే గుణాతీతుడగుటయగును.

1. జనన-మరణములు బాల్య-యౌవన-వృద్ధావస్థలు శరీరమునకు గలుగును. మనోవ్యాధి-శరీరవ్యాధి మొదలైన అన్నివిధములైన దుఃఖములుగూడ ప్రాణేంద్రియముల సముదాయ రూపమైన శరీరమునందే వ్యాపించియుండును. కనుక తత్త్వజ్ఞానముచేత, శరీరముతో పూర్తిగా సంబంధము

సంబంధము :

ఏ విధముగా అర్జునుడు అడిగినప్పుడు భగవంతుడు అతడు చేసిన ప్రశ్నములలో లక్షణములు 'ఆచరణములు' వీనికి సంబంధించిన రెండు ప్రశ్నములకు ఉత్తరము నాలుగు శ్లోకములలో చెప్పుచున్నాడు.

శ్రీ భగవానువాచ :

ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాండవ ।
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి ॥ 22

భగవంతుడిట్లనెను:—

అర్జునా! ఏ పురుషుడైతే, సత్త్వగుణకార్యమైన ప్రకాశము[1] రజోగుణకార్యమైన ప్రవృత్తి[2] తమోగుణకార్యరూపమైన మోహము[3] ఈ మూడును

---

లేకుండటయే జనన-మరణ- జరాదుఃఖములనుండి పూర్తిగా విముక్తి పొందుట యనబడును. అమృత స్వరూప-సచ్చిదానంద ఘనబ్రహ్మను అభిన్న భావముతో ప్రత్యక్షము చేసికొనుటయే (ఈ విషయము పందొమ్మిదవ శ్లోకములో భగవద్భావప్రాప్తి పేరుతో చెప్పబడెను) ఇక్కడ 'అమృతత్త్వము' అనుమాటచే చెప్పబడెను.

1. గుణాతీత పురుషునిలో శాంతి జ్ఞానానందములు శాశ్వతముగా నుండును. అవి యెప్పుడు గూడ లేకయుండవు. కనుకనే యిక్కడ సత్త్వగుణ కార్యములలో కేవలము ప్రకాశమునుగూర్చి తెలుపుచు గుణాతీతపురుషుని శరీరము ఇంద్రియములు-అంతఃకరణము వీని యందొకవేళ తనంతట సత్త్వగుణ ప్రకాశము కలిగినయెడల, నతడు దాని ద్వేషించడు. ఆ ప్రకాశము తిరోభావము చెందినప్పుడు మరలదాని కొరకు కాంక్షించడు దాని ప్రాదుర్భావ-తిరోభావములందు సర్వదా అతడు సమానస్థితిలోనే యుండును. అని చెప్పబడెను.

2,3 వివిధకర్మలు చేయవలెనను స్ఫురించుట 'ప్రవృత్తి' యనబడును. ఇదియే కాక కామ-లోభ-స్పృహా-ఆసక్తి ప్రభృతులు రజోగుణకార్యములగును.

కలిగినప్పుడు ద్వేషము అవి తొలగిపోయినప్పుడు వానియందు కాంక్షగాని చేయడో.

[1]ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే ।
గుణా వర్తంత ఇత్యేవ యోఽవతిష్ఠతి నేంగతే॥ 23

---

అవి గుణాతీతునిలో నుండవు. కర్మలు గుణాతీతుని శరీరేంద్రియముల చేత చేయబడును. అది 'ప్రవృత్తి' లోనే చేరును. కనుకనే యిక్కడ రజో గుణకార్యములలో ప్రవృత్తిలో మాత్రమే రాగద్వేషములుండవు, ఏదైనను స్ఫురించుట-క్రియ ప్రాదుర్భవించుట తిరోభవించుట వీనియందు సర్వదా ఒకేవిధముగా సమభావముతో నతదుండును అని భావముగలదు.

ఏది అంతఃకరణమును మోహింపజేయు వృత్తియో దేనిచేత మనుష్యునకు కునికిపాటు-తూగుట-స్వప్నము-గాఢనిద్ర మొదలైన పరిస్థితులు కలుగునో శరీరేంద్రియాంతఃకరణములందు దేనిచేత సత్త్వగుణప్రకాశము లేకుండాపోవునో అది "మోహము" అనబడును. ఇదియేకాక తమోగుణ కార్యములైన అజ్ఞాన ప్రమాదాదులు గుణాతీతుని యందుండవు. ఎందు కనగా అజ్ఞానము జ్ఞానము దగ్గరకు గూడ రాజాలదు. ఏ పనియుచేయని అకర్తకు ప్రమాదదోష మెట్లు కలుగును? కనుక నిక్కడ తమోగుణ కార్యములలో కేవలము 'మోహము' మాత్రమే సూచించి దాని ప్రాదుర్భావ-తిరోభావములందు రాగద్వేషముల అభావము తెలుపబడెను. ఇందలి యభిప్రాయమేమనగా గుణాతీత పురుషుని శరీరమునందు తంద్రా-స్వప్న, నిద్రాది తమోగుణవృత్తులు వ్యాపించినప్పుడైతే, గుణాతీతుడు వానిని ద్వేషించడు అని తొలగిపోయినప్పుడు గూడ అవి కావలెనని కాంక్షించడు. ఈ రెండు దశలలోను అతని స్థితి ఒకటిగానే సమమై యుండును.

1. గుణాతీతునకు, త్రిగుణములతో వాని కార్యములైన శరీరేంద్రియాంతః కరణములతో ఇతర సర్వవస్తువులతో సంఘటనములతోను, ఏ విధమైన సంబంధము గూడ నుండదు. కనుక అతడు "ఉదాసీనుడు"గా నుండునని చెప్పబడుచున్నది.

అర్జునా! యెవడైతే, సాక్షివలె ఉండి గుణములచేత చలించకుండునో[1] గుణములే గుణములందుండునని తలచుచు నెవడు, సచ్చిదానంద ఘనపరమాత్మ యందు ఏకీభావముతో నుండునో[2] ఆ స్థితినుండి యెప్పుడు గూడ చలించక యుండునో.[3]

సమదుఃఖసుఖః స్వస్థః సమలోష్టాశ్మకాంచనః ।
తుల్యప్రియాప్రియో ధీరస్తుల్యనిందాఽఽత్మ సంస్తుతిః॥ 24

అర్జునా! యెవనైతే నిరంతరము ఆత్మభావమునందు ఉండి సుఖదుఃఖము

---

1. గుణ సంబంధము గల జీవులను ఈ గుణములు మూడున్ను అతని యిచ్ఛ లేకున్నను, బలాత్కారముగా వివిధ కర్మలందు వాని ఫలానుభవము లందును లగ్నముచేసి అతనికి సుఖదుఃఖములు మనశ్చాంచల్యము కలి గించి అతనిని అనేక యోనులలో త్రిప్పుచుండును. కాని ఈ గుణ సంబంధములేని వానిపై గుణముల ప్రభావముపడదు. గుణకార్యములైన శరీరేంద్రియాంతఃకరణములు అవస్థలు పరివర్తనము వివిధ ప్రాపంచిక వస్తువుల సంయోగ వియోగములు కలుగుచున్నను అతడు తన స్థితిలో సర్వదా నిర్వికారుడై యేకరసములో నుండును. ఇదియే అతడు గుణముల చేత విచలితుడు కాకుండుట యనబడును.

2. మనో - బుద్ధి - ప్రాణాది సర్వేంద్రియములు శబ్ద-స్పర్శాది సమస్త విషయములు ఇవన్నియు గుణముల విస్తారములే యగును. కనుకనే, మనోబుద్ధ్యాదులు తమతమ విషయములందు సంచరించుట యనగా గుణములందే గుణములుండుటయని భావము. ఆత్మకు వీనిలో ఏమాత్రము సంబంధము లేదు. ఆత్మ—నిత్యము-ఏకము-పూర్తిగా అసంగము-సర్వ దాయేకరసము-సచ్చిదానంద ఘన-స్వరూపము అని తెలిసికొని నిర్గుణ నిరాకార సచ్చిదానంద-ఘన-పూర్ణ బ్రహ్మము పరమాత్మయందు అభిన్న భావముతో సర్వదా నిత్యముగా నుండుటయే గుణములు గుణములందున్న వనుకొని పరమాత్మయందు ఉండుట యగును.

3. గుణాతీతుని గుణములు చలింపనివి మాత్రమే కాదు. అతడు స్వయ ముగా గూడ తనస్థితినుండి యెప్పుడున్ను చలితుడు కాడు.

లను సమానభావముతో తలచునో[1] మన్ను-రాయి-బంగారము ఈ మూడింటి యందు సమానభావముతో నుండునో జ్ఞాని, ప్రియుడు, అప్రియుడు, ఈ ముగ్గురి యెడల సమభావము కలిగియుండునో[2] తనకు ఇతరులు చేసిన నిందాస్తుతుల యందు సమభావము గలిగియుండునో.[3]

---

1. సాధారణుల స్థితి, మూడు విధములైన స్థూల-సూక్ష్మ-కారణ శరీరము లలో నొకదాని యందుండును. ఆ మూడు ప్రకృతికార్యములు అవి తమ యందుండునవి (స్వస్థములు) కావు. ప్రకృతిస్థములు. అట్టివారే ప్రాకృతిక గుణములనుభవించువారు (గీత-13-21) కనుక వారు సుఖదుఃఖము లందు సమముగా నుండరు. గుణాతీతునకు ప్రకృతితో దాని కార్యము లతో ఏలాటి సంబంధముండదు. కనుక అతడు స్వస్థుడు అనబడును. అతడు తన సచ్చిదానందరూపములోనుండును. కనుక శరీరేంద్రియాంతః కరణములందు సుఖదుఃఖముల ప్రాదుర్భావ తిరోభావములు కలుగు చుండినను గుణాతీతునకు వానితో సంబంధము ఏమాత్రము లేనందుచేత అతడు వానిచేత సుఖదుఃఖములనుభవించడు. అతని స్థితి సర్వదా సమ ముగా నుండును. ఇదియే యతడు సుఖదుఃఖములందు సమముగనుండు వాడని తెలియవలెను.

2. శరీరేంద్రియ మనోబుద్ధులకు అనుకూలములై వానికి పోషకములు-సహా యకములు సుఖప్రదములుగా నుండు పదార్థములు లోకదృష్టిలో 'ప్రియము' లనబడును. శరీరాదులకు ప్రతికూలములై వానికి నాశము విరోధము సంతాపమున్ను కలిగించు వస్తువులు లోకదృష్టిలో అప్రియ ములనబడును. సాధారణులకు ప్రియాప్రియముల సంయోగము వియో గములందు ద్వేష శోకములు కలుగును. కాని గుణాతీతునకిట్లు కాదు. అతడు సర్వదా పూర్తిగా రాగద్వేషహర్ష శోకాతీతుడు.

3. ఇతరుల సత్యాసత్య దోషవర్ణనము నిందయనబడును. గుణముల పొగడ్త స్తుతియనబడును. వీనికి పేరుతో శరీరముతోను విశేషసంబంధముండును. గుణాతీతునకు తన పేరు శరీరములతో ఏమాత్రము సంబంధముండదు కనుక అతనికి నిందాస్తుతులవలన హర్షశోకములు ఏ మాత్రమునుండవు.

మానావమానయోస్తుల్యస్తుల్యో మిత్రా రిపక్షయోః।
సర్వాఽరంభ[1]పరిత్యాగీ గుణాతీతః స ఉచ్యతే॥ 25

అర్జునా! యెవడు మానావమానములు తనకు గలిగినప్పుడు సమభావముతోనూ[2] శత్రు-మిత్ర-పక్షములందు గూడ సముడో[3] అన్ని కర్మలందు

---

1. గుణాతీతుని శరీరేంద్రియమనో బుద్ధులచేత, శాస్త్రవిహిత కర్మలు, ప్రారబ్ధానుసారముగా లోక సంగ్రహముకొరకు అనగా లోకులను చెడుత్రోవపండి తొలగించి సన్మార్గములో నుంచు నుద్దేశముచేత జరుగుచుండును. అ కర్మల కర్తృత్వము అతనికి ఏ యాగములోను నుండదు. ఈ భావమును తెలుపుటచే, గుణాతీతుడు "సర్వారంభ పరిత్యాగీ" అనబడును.

2. మానావమానముల సంబంధము అధికముగా శరీరములో నుండును. కనుక శరీరాభిమానముగల సంసారులకు మానమందు రాగము అవమానమందు ద్వేషము ఉండును. వానివలన హర్ష శోకములు వారికి కలుగును. గౌరవించువారిని ప్రేమించుచు అవమానించువారిని ద్వేషించుచుందురు. కాని గుణాతీతుడు శరీర సంబంధమేమాత్రము లేనివాడగుటచేత శరీరమునకు గలుగు మానావమానములవలన హర్షశోకములు పొందడు. అతని దృష్టిలో మానావమానములు అవి చేయువాడు-సమస్తము మాయికములు స్వాప్నికములు కనుకనే మానావమానములచేత అతనికి కొంచెముగూడ రాగద్వేష హర్షశోకములు కలుగవు. ఇదియే అతనికి గల మానావమానములందు సమత్వ మనబడును.

3. గుణాతీతునకు శత్రుమిత్రులుండరు కనుక ఎవరియందు గూడ శత్రుమిత్ర-భావములుండకున్నను, లోకులు తమ భావము ననుసరించి యతని కవియున్నట్లు తలంచెదరు. కాని యతడా యిరుపక్షములవారి యెడలగూడ సమభావముతోనే యుండును. అందరియెడలను రాగ్వదేషరహితుడుగా వ్యవహరించును, సమముగా నుండును. ఎవరికిన్ని కీడు చేయడు. భేద బుద్ధియుండదు. ఇదియే అతడు శత్రుమిత్రులందు సమముగా నుండుట యనబడును.

కర్తృత్వాభిమానరహితుడై యుండునో అట్టిపురుషుడు గుణాతీతుడని చెప్పబడును[1]

సంబంధము:-

ఈ విధముగా భగవంతుడు అర్జునుని రెండు ప్రశ్నములకు ఉత్తరము చెప్పి యిప్పుడు గుణాతీతుడగుటకు తగిన ఉపాయమునకు సంబంధించిన మూడవ ప్రశ్నమునకు ఉత్తరము చెప్పుచున్నాడు. ఈ అధ్యాయము పందొమ్మిదవ శ్లోకములో తాను కర్తగానని తెలిసికొని నిర్గుణ-నిరాకార-సచ్చిదానంద ఘనబ్రహ్మమునందు నిత్యము నిరంతరము స్థిరముగా నిలిచియుండుటయే గుణాతీతుడగుటకు ఉపాయమని భగవంతుడు చెప్పియుండెను. పై నాలుగు శ్లోకములలో వర్ణింపబడిన గుణాతీత లక్షణములు ఆచరణములు ఆదర్శములని తలచి వానిని అవలంబించుటకు చేయబడు అభ్యాసము గూడ గుణాతీతుడగుటకు ఉపాయమని తలచబడినప్పటికిన్ని అర్జునుడు ఈ ఉపాయములకన్న వేరైన యితర సరళోపాయములు తెలిసికొను నిచ్ఛచేత ప్రశ్నించియుండెను గనుక ఆ ప్రశ్నమునకు అనుకూలమైన ఉత్తరముగా భగవంతుడు ఇతర సరళోపాయమును చెప్పుచున్నాడు.

మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే।
సగుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే॥ 26

అర్జునా! అనన్యభక్తిలో, నన్ను నిరంతరము సేవించు[2] పురుషుడుగూడ

---

1. ఈ యధ్యాయమునందు ఇరువది రెండునుండి యిరువదియైదవ శ్లోకము వరకు వర్ణింపబడిన లక్షణములు గలవారు "గుణాతీతులు" అనబడుదురు. ఇది గుణాతీతపురుషుని గుర్తించుటకు చిహ్నము. ఇదియే యతని ఆచార వ్యవహారము. కనుకనే యెంతవరకైతే అంతఃకరణమునందు 'రాగ-ద్వేషములు - విషమభావము- హర్షశోకములు- అవిద్య- అభిమానము, ఇవి లేశమాత్రమైన నుండునో, అంతవరకు సాధకుడు, తనకింకను గుణాతీతావస్థ ప్రాప్తించలేదని తలచవలెను.

2. కేవలము పరమేశ్వరు డొక్కడే సర్వశ్రేష్ఠుడు. ఆయనయే మాప్రభువు. శరణుపొందదగినవాడు పరమగతి పరమాశ్రయుడు తల్లి, తండ్రి, సోదరుడు, బంధువు పరమహితకరుడు మాకు సర్వస్వము ఆయనయే. ఆయన

ఈ మూడు గుణములను పూర్తిగా దాటి సచ్చిదానందఘన బ్రహ్మమును పొందుటకు అర్హుడగును.[1]

సంబంధము :

పైన చెప్పబడిన శ్లోకమునందు సగుణపరమేశ్వరోపాసనమునకు ఫలము నిర్గుణ-నిరాకార బ్రహ్మ ప్రాప్తి యని చెప్పబడెను. ఈ యధ్యాయము పందొమ్మిదవ శ్లోకములో గుణాతీతావస్థకు ఫలము భగవద్భావప్రాప్తి యని యిరువదవ శ్లోకములో అమృతప్రాప్తి యనియు చెప్పబడెను. కనుకనే ఫలములో వైషమ్య శంకా నిరాకరణము కొరకు అన్నిటి యేకత్వ ప్రతిపాదనము చేయుచు ఈ యధ్యాయోప సంహారము చేయుచున్నాడు.

---

దప్పమాకు మరియొకడెవడు గూడ లేడు. అని తెలిసికొని ఆ భగవంతుని యందు స్వార్థరహితముగా అతిశయశ్రద్ధా పూర్వకముగా అనన్యప్రేమ అనగా ఏ ప్రేమయందు స్వార్థము-స్వాభిమానము-ఇతరత్ర చెదరియుండుట ఈ దోషములు కొంచెముగూడ ఉండవో ఏది పూర్తిగా ఎల్లప్పుడును పరిపూర్ణముగా అచంచలముగాను నుండునో దేని యే కొంచము అంశమైనను భగవంతున్ని కన్న వేరే వస్తువునందు ఉండదో, ఏది క్షణమాత్రము గూడ భగవంతుని మరపును సహించకుండునో అటువంటి అనన్యప్రేమ అవ్యభిచారి భక్తియోగమని అనబడును.

ఇటువంటి భక్తియోగముచేత నిరంతరము భగవంతుని గుణ-ప్రభావ లీలా-విలాసములయొక్క శ్రవణ-మనన-కీర్తనములు-భగవన్నామోచ్చారణము-జపము-స్వరూపచింతనము ఈ మొదలైనవి చేయుట, మనోబుద్ధి శరీరాదులు-సమస్తపదార్థములున్ను భగవంతునివేయని తలచి నిష్కామ భావముచేత తాను కేవలము నిమిత్త మాత్రుడనని తలచుచు ఆయన యాజ్ఞానుసారము ఆయన సేవా రూపముగానే సర్వకార్యములు ఆయన కొరక చేయకుండుటయే అవ్యభిచారి భక్తియోగము ద్వారా భగవంతుని నిరంతరము సేవించుట యనబడును.

1. గుణాతీతుడగుటతోపాటే మనుష్యుడు ఏది నిర్గుణ-నిరాకార-సచ్చిదానంద ఘన-పరిపూర్ణబ్రహ్మ స్వరూపమో దేనిని పొందిన తరువాత, ఇతర

బ్రహ్మణో[1] హి ప్రతిష్ఠాఽహమమృత[2]స్యావ్యయస్యచ।
శాశ్వతస్య చ ధర్మస్య[3] సుఖస్యైకాంతికస్య చ॥ 27

---

మేమియు పొందవలసినది మిగిలి యుండదో అట్టి బ్రహ్మ భావమును పొందుటకు యోగ్యుడగును. వెంటనే అతనికి బ్రహ్మ ప్రాప్తి సిద్ధించును.

1. బ్రహ్మకు ప్రతిష్ఠ (నిలుచు స్థానము) నేనేయని చెప్పుటచేత భగవంతుడు ఇక్కడ బ్రహ్మనగుణ పరమేశ్వరుడైన నానుండి వేరుకాదు, నేనుగూడ ఆ బ్రహ్మకన్న వేరుకాను. అనగా నేను, బ్రహ్మము రెండు వస్తువులము కాము. ఒక్కటే యని యెరుగుము. కనుకనే పూర్వశ్లోకములో తెలుప బడిన బ్రహ్మప్రాప్తి నా ప్రాప్తియే అను నభిప్రాయము వ్యక్తపరచెను. ఎందుకనగా వాస్తవముగా ఒక పరబ్రహ్మ పరమాత్మయే అధికారిభేదము చేత ఉపాసనము కొరకు వేర్వేరు రూపములలో తెలుపబడెను. వానిలో పరమాత్మయొక్క మాయాతీతము అచింత్యము మనోవాక్కులకు అగోచ రము, నిర్గుణస్వరూపము ఒక్కటేయగును. కాని సగుణరూపముయొక్క సాకార-నిరాకార రూపములు రెండున్నవి. ఈ ప్రపంచమంతయు ఏ స్వరూపము వ్యాపించియున్నదో, ఏది అన్నిటికిన్ని ఆశ్రయమో తన అచింత్యశక్తిచేత సర్వస్వము ధరించి పోషించునో అది భగవంతుని సగుణ-అవ్యక్త నిరాకార స్వరూపము శివ-విష్ణు-రామ-కృష్ణాదులైన భగవంతుని సాకార రూపమగును. ఈ సర్వప్రపంచము భగవంతుని సాకార విరాట్ స్వరూపము.

2. "అమృతస్య" అనుపదమునకు గూడ దేనిని పొంది మనుష్యుడు అమరు డగునో అనగా జనన-మరణ-రూప సంసారమునుండి యెల్లప్పటికిన్ని విముక్తినిపొందునో ఆ బ్రహ్మయని యర్థము. తాను ఆ బ్రహ్మ మునిలుచు స్థానము (ప్రతిష్ఠ)గా తెలిపి భగవంతుడు ఆ "అమృతము" గూడ నెనే యని తెలిపెను. కనుకనే యీ అధ్యాయము ఇరువదవ శ్లోకములో భగవ ద్గీత పదమూడవ అధ్యాయము పన్నెండవ శ్లోకములోను తెలుపబడిన అమృతప్రాప్తియే. ఈ 'అమృతస్య' పదమునకు తాత్పర్యము.

3. ఏది సత్య ధర్మమో ఏ ధర్మము భగవద్గీత తొమ్మిదవ అధ్యాయము

అర్జునా! యెందుకనగా ఆ అవినాశి పరబ్రహ్మకు అమృతమునకు నిత్య ధర్మమునకు అఖండ ఏకరస ఆనందమున్ను ఆశ్రయుడను నేనేయని తెలిసి కొనుము.[1]

ఇతి శ్రీ మహాభారతే భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా పర్వణి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే గుణత్రయ విభాగయోగో నామ చతుర్దశోఽధ్యాయః భీష్మపర్వణి తు అష్టాత్రింశోఽధ్యాయః

శ్రీమహాభారతమునందు, భీష్మపర్వమునందు శ్రీమద్భగవద్గీతా పర్వమునందు

---

రెండవ శ్లోకములో ధర్మము అని చెప్పబడెనో పన్నెండవ అధ్యాయము చివరి శ్లోకములో దేనికి ధర్మ్యామృతము అను పేరుపెట్టబడెనో ఏది యీ ప్రకరణమునందు గుణాతీతుని లక్షణములలో వర్ణింపబడెనో అది యిక్కడ "శాశ్వతస్య" అను విశేషణముతో గూడిన ధర్మస్య అను పదమునకు అర్థము. ఇట్టి ధర్మమునకు తానే ప్రతిష్ఠ (నిలుచుస్థానము) అని భగవంతుడు తెలిపి అది నాప్రాప్తికి సాధనమగుటచేతనా స్వరూపమే యగును. ఎందుకనగా ఈ ధర్మము నాచరించువాడు ఏ యితర ఫలముగూడ పొందక నన్నే పొందగలడు అను నభిప్రాయమును తెలిపెను.

1. భగవద్గీత ఐదవ అధ్యాయము ఇరువదియొకటవ శ్లోకములో ఏది "అక్షయ సుఖము" అను పేరుతో ఆరవ అధ్యాయము ఇరువదియొకటవ శ్లోకములో "ఆత్యంతిక సుఖము" అను పేరుతో ఇరువది యెనిమిదవ శ్లోకములో అత్యంత సుఖము" అనుపేరుతోను చెప్పబడెనో. ఆనిత్యపరమానంద సుఖమే యిక్కడ "ఐకాంతిక సుఖము అనగా అఖండ ఏక రసానందము అని చెప్పబడినది. ఆ సుఖమునకు ఆశ్రయము (ప్రతిష్ఠ) తానే యని తెలిపి భగవంతుడు ఆనిత్యపరమానందము నా స్వరూపమే నాకంటె వేరు అన్యవస్తువేదియు లేదు. గనుక దాని ప్రాప్తి "నా ప్రాప్తియే" యను నభిప్రాయము తెలిపెను.

శ్రీమద్భగవద్గీతోపనిషత్తులందు, బ్రహ్మవిద్యయందు, యోగశాస్త్రమునందు, శ్రీకృష్ణార్జున సంవాదమునందు, గుణత్రయ విభాగయోగ మనబడు పదునాల్గవ అధ్యాయము సమాప్తము (12) భీష్మపర్వమునందు ముప్పదిఎనిమిదవ అధ్యాయము సమాప్తము.

---

దీని తరువాత విషయము భగవద్గీత మొదటి అధ్యాయము చివర * ఈ గుర్తుగల అధోజ్ఞాపికలో నున్నట్లు గ్రహించవలెను.

(భీష్మపర్వము 39వ అధ్యాయము)

# శ్రీ మద్భగవద్గీత పదునైదవ అధ్యాయము

## పురుషోత్తమ ప్రాప్తియోగము :-

సంబంధము:-

భగవద్గీత పదునాలుగవ అధ్యాయము "ఏదవ శ్లోకము నుండి పదునెనిమిదవ శ్లోకము వరకు త్రిగుణముల స్వరూపము. కార్యములు బంధన కారిత్వము బంధిత మనుష్యుల ఉత్తమాధమమధ్యమగతులు ఇత్యాదులు విస్తారముగా వర్ణించి, పందొమ్మిదవ, యిరువదవ శ్లోకములలో ఆ గుణములకన్న అతీతుడగుటకు అవసరమైన ఉపాయములు దాని ఫలము వీనిని గూర్చి తెలుపబడెను. ఆ తరువాత అర్జునుడు ప్రశ్నించిన మీద భగవంతుడు ఇరువది రెండవ శ్లోకము నుండి ఇరువది ఐదవ శ్లోకమువరకు గుణాతీత పురుషుని లక్షణములను ఆచరణములనుగూర్చి వర్ణించి ఇరువదియారవ శ్లోకములో సగుణ పరమేశ్వరునియందు అవ్యభిచారి భక్తి యోగమునకు గుణాతీతుడై బ్రహ్మప్రాప్తికొరకు యోగ్యుడగుటకు సరళోపాయము చూపబడెను. కనుకనే భగవంతునియందు అవ్యభిచారి భక్తి యోగరూపమైన అనన్య ప్రేమ కలిగించు ఉద్దేశముతో ఇప్పుడు, ఆ సగుణ పరమేశ్వరుడు-పురుషోత్తముడునైన భగవంతుని గుణ ప్రభావ-స్వరూపములను గుణాతీతుడగుటకు సాధనమైన వైరాగ్యమును భగవంతుని శరణాగతిని వర్ణించుట కొరకు పదునైదవ అధ్యాయము ఆరంభింపబడుచున్నది. ఇక్కడ మొదట సంసారమునందు వైరాగ్యము కలిగించు నుద్దేశముతో మూడు శ్లోకములచేత సంసారవర్ణనము వృక్షరూపములో చేయుచు వైరాగ్యమనెడు శాస్త్రముచేత దానిని ఛేదించుటకు భగవంతుడు చెప్పుచున్నాడు.

శ్రీభగవానువాచ :

ఊర్ధ్వమూల[1]మధశ్శాఖ[2]మశ్వత్థం ప్రాహురవ్యయమ్ ।

---

182. మూల శబ్దమునకు కారణమని యర్థము. సంసార వృక్షోత్పత్తి. దాని

ఛందాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్ ॥ 1

భగవంతు డిట్లనెను :-

"అర్జునా! ఆదిపురుషుడైన పరమేశ్వర రూపమైన మూలము (వేరు) చతుర్ముఖ[1] బ్రహ్మరూపములైన ముఖ్యశాఖలున్ను గల సంసార రూపమైన ఏ అశ్వత్థ (రావి) వృక్షము అవినాశియని చెప్పెదరో[2] దేని పత్రములు వేదములని

---

విస్తారము ఆదిపురుషుడగు నారాయణుని నుండియేయైనది. ఈ విషయము ఇచట నాలుగవ శ్లోకములో ఇతరత్ర అనేక స్థలములలో చెప్పబడినది. ఆదిపురుష పరమేశ్వరుడు నిత్యనిరంతరుడు, సర్వాధారుడు, సగుణ రూపములో అన్నిటికన్నా పైన నిత్యధామమునందు నివసించునుగాబట్టి "ఊర్ధ్వ" నామముతో చెప్పబడును. సంసార వృక్షము మాయాపతియైన సర్వశక్తి సంపన్నుడగు పరమేశ్వరునినుండియే ఉత్పన్నమైనది కనుక దీనిని "ఊర్ధ్వమూలము" అనగా మీదివైపు వేళ్ళుగలదని చెప్పెదరు. ఇతర సాధారణ వృక్షముల మూలములు క్రింద భూమిలోపలనుండును. కాని సంసార వృక్ష మూలము మాత్రము మీది వైపున నుండును ఇది మిక్కిలి అలౌకికమైన విషయము అని దీని యభిప్రాయము.

1. సంసార వృక్షోత్పత్తి సమయమందు మొదటి చతుర్ముఖ బ్రహోత్పత్తి యగును. కారణబ్రహ్మయే యీ వృక్షమునకు శాఖలుగా నున్నాడు. ఈ బ్రహ్మలోకము ఆదిపురుషుడైన నారాయణుని నిత్యధామము కన్న క్రిందుగా నున్నది. బ్రహ్మదేవుని అధికారము గూడ భగవంతునకు లోబడియే యుండును. బ్రహ్మదేవుడు ఆదిపురుష నారాయణునినుండియే జన్మించును. ఆయన యధికారమునకు లోబడియే యుండును. గనుక సంసారవృక్షము క్రింది భాగములో శాఖలు గలది అని చెప్పబడనది.

2. సంసార వృక్షము మారునది గాబట్టి నాశవంతము. అనిత్యము క్షణ భంగురమైనప్పటికిన్ని దీని ప్రవాహము అనాది కాలమునుండి సాగుచున్నది. దీనికి అంతము గూడా కనబడదు కనుక ఇది "అవ్యయము" అనగా వినాశరహితమనెదరు ఎందుకనగా ఈ వృక్షమూలము సర్వశక్తిశాలి అవినాశియునైన పరమేశ్వరుడు కాన వాస్తవముగా సంసార

చెప్పబడెనో[1] అట్టి సంసార వృక్షమును మూల సహితతత్త్వముతో తెలిసికొను పురుషుడు వేద తాత్పర్యమును తెలిసికొనువాడగును.[2]

"అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్య శాఖా
గుణప్రవృద్ధా విషయ ప్రవాళాః।
అధశ్చ మూలాన్యనుసన్తతాని
కర్మానుబన్ధీని మనుష్యలోకే"[3] 2

---

వృక్షము అవినాశికాదు. అవినాశియైయుండిన యెడల ఇక్కడ మూడవ శ్లోకములో చెప్పబడిన స్వరూపము దీనికి ఉనికియుండదు. దృఢమైన వైరాగ్యశస్త్రముచేత ఇది ఛేదింపబడునను విషయముగూడ పొసగదు.

1. ఆకులు చెట్టుకొమ్మలనుండి పుట్టి చెట్టును రక్షించుచు పెంచుచుండును. వేదములు గూడ సంసారవృక్షమునకు ముఖ్యశాఖల రూపమైన బ్రహ్మదేవునినుండి ప్రకటితములగును. వేదవిహిత కర్మాచరణము చేతనే సంసారవృద్ధి-రక్షణములు జరుగును. కనుక వేదములు ప్రపంచ వృక్షము యొక్క ఆకులని చెప్పబడినవి.

2. దీనిచేత తెలుపబడిన యభిప్రాయ మేమనగా ఏ మనుష్యుడైతే మూల సహిత సంసారము సర్వ శక్తిశాలి పరమేశ్వరుని మాయచేత ఉత్పన్నమైన సంసార వృక్షమువలె ఉత్పత్తి-వినాశ స్వభావము కలది. క్షణికము కనుకనే ప్రాపంచిక సుఖభోగములందు, పై పై మెరుగులను చూచి ఇరుకుకొనకుండ దీనిని పుట్టించు మాయాపతి యైన పరమేశ్వరుని శరణు పొందవలెనని తాత్త్వికముగా తెలిసికొని సంసారమునందు వైరాగ్యము గలిగి నిశ్చింతుడై భగవంతుని శరణుజొచ్చునో అట్టి పురుషుడే వాస్తవముగా వేదములను తెలిసినవాడనబడును. ఎందుకనగా పదునైదవ శ్లోకములో సర్వవేదములచేత తెలిసికొనదగినవాడు భగవంతుడే యని చెప్పబడినది.

3. మనుష్య శరీరమునకు కర్మలు చేయునధికారము కలదు. మనుష్య శరీరముచేత అహంకార-మమకార-వాసనా పూర్వకముగాచేయబడు కర్మలు

"అర్జునా! ఆ సంసార వృక్షమునకు త్రిగుణములనెడు జలముచేత పెరిగినట్టివి[2]. విషయ సుఖభోగములనెడు చిగురుటాకులు గలవి[1] దేవ-మనుష్య-తిర్యగాది యోనులనెడు శాఖలు క్రింద మీద సర్వత్ర వ్యాపించియున్నవి. మనుష్యలోకములో కర్మానుసారముగా జీవులను బంధించు అహంకార మమకార-వాసనలనెడు వేళ్ళుగూడ క్రింద మీద అన్నిలోకములలో వ్యాపించుచున్నవి.

"న రూపమస్యేహ తథోపలభ్యతే
నాన్తో న చాదిర్న చ సంప్రతిష్ఠా ।
అశ్వత్థమేనం సువిరూఢమూల
మసఙ్గశస్త్రేణ దృఢేన ఛిత్త్వా" ॥ 3

"అర్జునా! ఏ విధముగా సంసార వృక్షము యొక్క స్వరూపము వర్ణింపబడినదో యిచట మనము విచారించు సమయమునందు ఆ విధముగా నుండదు. ఎందుకనగా దీనికి ఆదిలేదు అంతమున్ను లేదు. దీనికి మంచి స్థితియులేదు[3].

---

బంధహేతువులని తలచబడినవి కనుకనే ఈ మూలములు మనుష్యలోకమునందు లోకులను కర్మానుసారముగా బంధించును. దేవాదులైన యితర యోనులన్నిటికిన్ని కర్మాధికారములేదు గనుక అక్కడ అహంకార-మమకారవాసనారూపములున్నప్పటికిన్ని అవి కర్మానుసారముగా బంధములు కలిగించునవి కావు.

1. ఉత్తమాధమ యోనులందు జన్మప్రాప్తి గుణసంబంధముచేత గలుగును. (గీత-13-21) సమస్తలోకముల యొక్క, ప్రాణులయొక్కయు శరీరములు త్రిగుణముల పరిణామములేయగును. అను భావమును తెలుపుటకే ఆ శాఖలు గుణములచేతనే వృద్ధిపొందినవని చెప్పబడినవి. ఆ శాఖలుగా నున్న దేవ-మనుష్య-తిర్యగాది యోనులయొక్క శబ్ద స్పర్శ-రూప-రస గంధము లనెడు ఐదు విషయముల రసోపభోగమే యిక్కడ చిగురుటాకులని చెప్పబడినది.

2,3. బ్రహ్మలోకమునుండి పాతాళలోకము వరకునున్న లోకములు వానిలో నివసించు యోనులన్నియు సంసారవృక్షమునకు గల బహుశాఖలని తెలియవలెను.

కనుక ఈ అహంకార-వాసనారూపములైన అతి దృఢమూలములు గల సంసార రూపమైన అశ్వత్థవృక్షమును దృఢమైన వైరాగ్యమనెడు ఖడ్గముచేత నరికి[1]

"తతః పదం తత్పరిమార్గితవ్యం
యస్మిన్ గతా న నివర్తన్తి భూయః।
తమేవ చాద్యం పురుషం ప్రపద్యే
యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ ॥" 4

"అర్జునా! ఆ తరువాత పరమపద రూపుడైన ఆ పరమేశ్వరుని బాగుగా అన్వేషించవలెను. ఏ పరమేశ్వరునిలో చేరిపోయిన పురుషుడు తిరిగి యీ సంసారములోనికి రాడో ఏ పరమేశ్వరునిచేత అతి పురాతనమైన యీ సంసార వృక్షము ప్రవర్తిల్లి వ్యాపించియున్నదో ఆది పురుషుడైన ఆ నారాయణునే

---

ఈ సంసార వృక్షముక్క ఉత్పత్తి ప్రళయముల పరంపర యెప్పటినుండి ఆరంభించి యెప్పటివరకు సాగునను విషయము తెలియదు. స్థితి కాలము కూడా నిరంతరము మారుచుండును. దీనికి మొదటి క్షణములోనున్న రూపము ద్వితీయ క్షణములో నుండదు ఇట్లు సంసార వృక్షమునకు ఉత్పతి స్థితి-లయములు మూడును గోచరించవు.

1. ఈ సంసార వృక్షమునకు గల అవిద్యామూలకములైన అహంకార-మమకార-వాసనరూపములు అనాది కాలమునుండి పోషింపబడుచుండినందు వలన మిక్కిలి దృఢముగా పాతుకొని లోతుగా పోయినవి. కనుకనే ఆ వృక్షమునకు అత్యంత దృఢమూలములు గలవని చెప్పబడినది. వివేకము చేత సమస్త ప్రపంచము నాశవంతము-క్షణికము నని తలచి ఈ లోకము నందు పరలోకమునందున్న భార్యా-పుత్ర-ధన-గృహ-అభిమాన-గౌరవ ప్రతిష్ఠ స్వర్గాది సమస్త సుఖభోగములు-సుఖములు రమణీయములునని భావించకుండుట వానియందు పూర్తిగా ఆసక్తి లేకుండుటయే దృఢ వైరాగ్యమనబడును. దానిపేరే యిక్కడ 'అసంగశస్త్ర' మని చెప్పబడెను. ఈ అసంగశస్త్రము చేత సమస్త చరాచర ప్రపంచమును విడుచుటయే దానినుండి ఉపరతి (ఉడుగర) పొందుటయగును. అహంకార

నేను శరణుజొచ్చెదను" అని యీ విధముగా దృఢ నిశ్చయము చేసికొని ఆ పరమేశ్వరుని యొక్క మనన నిదిధ్యాసనములు చేయవలెను.[1]

సంబంధము :-

ఇప్పుడు పైన చెప్పబడిన విధముగా ఆది పురుషుడు పరమ పద స్వరూపుడునైన పరమేశ్వరుని శరణుజొచ్చి ఆయనను పొందు పురుషుల లక్షణములను లను గూర్చి భగవంతుడు చెప్పుచున్నాడు.

---

మమకార-వాసనారూప మూలములను ఛేదించుటయే సంసారవృక్షమును దృఢవైరాగ్య రూపశస్త్రము చేత సమూలముగా నరకుట యనబడును.

1. ఈ యధ్యాయము మొదటి శ్లోకములో ఏది "ఊర్ధ్వము" అని చెప్పబడెనో భగవద్గీత పదునాలుగవ అధ్యాయము ఇరువదియారవ శ్లోకములో ఏది "మాం" అను పదముచేత ఇరువది ఏడవ శ్లోకములో 'అహం' అను పదముచేతను చెప్పడిడెనో ఎన్నియో యితర స్థలములలో గూడ కొన్నిచోట్ల ఇది 'పరమపద' మని కొన్నిచోట్ల అవ్యయపదమని కొన్నియెడల 'పరమగతి' యని మరికొన్ని స్థలములలో 'పరమధామ' మనియు వివిధ నామములచేత చెప్పబడెనో అదియే ఇక్కడ 'పరమపద' మను పేరుతో చెప్పబడినది. సర్వశక్తి సంపన్న సర్వాధారుడైన ఆ పరమేశ్వరుని పొందవలెనను నిచ్చచేత మాటిమాటికి ఆయన యొక్క గుణ-ప్రభావ సహిత స్వరూపమును మనన-నిధిధ్యాసనములచేత అనుసంధానము చేయుచుండుటయే ఆ పరమపదమును అన్వేషించుట యనబడును. కనుక పైన చెప్పబడిన విధముగా ఆ స్వరూపానుసంధానము చేయుటకొరకు, తన అంతఃకరణములోపల కొంచెము గూడ అభిమానము రానీయక అన్ని విధముల ఆ పరమేశ్వరునే శరణుజొచ్చి ఆయన యొక్క అనన్యమైన ఆశ్రయమును పొంది పరిపూర్ణవిశ్వాస పూర్వకముగా ఆయనయందే తన సర్వభారము వైచియుండవలెను.

నిర్మానమోహా[1] జితసంగ[2] దోషా
అధ్యాత్మనిత్యా[3] వినివృత్తకామాః[4] ।
ద్వంద్వైర్విముక్తాః సుఖదుఃఖ సంజ్ఞైః
గచ్ఛంత్యమూఢాః పదమవ్యయం తత్॥ 5

"అర్జునా! యెవరి యభిమానము-మోహము నష్టమైనవో, యెవరు విషయాసక్తి రూపమైన దోషమును జయించినారో, ఎవరు పరమాత్మ స్వరూపమునందు శాశ్వతముగా స్థితిని గలిగియున్నారో, ఎవరి కామనలు పూర్తిగా నష్టమైనవో అట్టిసుఖదుఃఖ నామక ద్వంద్వములనుండి విముక్తులైన[5] జ్ఞానులు అవినాశియైన ఆపరమ పదము పొందెదరు."

---

1. ఎవరు జాతి-గుణ-ఐశ్వర్య విద్యాదుల సంబంధముచేత తమలో కొంచెము గూడ గొప్పదనము భావించరో ఎవరి గౌరవము పెద్దతనము ప్రతిష్ఠ వీనిచేత అవివేక-భ్రమాదిత మోగుణభావములచేతను లేశమాత్రముగూడ సంబంధము లేదో. అట్టి పురుషులు 'నిర్మానమోహాః' అనబడుదురు.

2. ఎవరికి ఇహలోక పరలోక సుఖభోగములందు కొంచెముగూడ ఆసక్తి యుండదో విషయ సంబంధమున్నప్పటికిన్ని ఎవరి అంతఃకరణమునందు ఏ విధమైన వికారము కలగదో, అట్టి పురుషులు 'జితసంగదోషాః' అనబడెదరు.

3. ఇక్కడ అధ్యాత్మ శబ్దమునకు పరమాత్మ స్వరూపమని యర్థము. కనుకనే పరమాత్మ స్వరూపములో ఎవరు శాశ్వతముగా నిలిచియున్నారో ఎవరికి క్షణమాత్రముకూడా, పరమాత్మ వియోగముకాదో, ఎవరి స్థితి సర్వదా అచంచలముగానుండునో అట్టి పురుషులు 'అధ్యాత్మనిత్యాః' అనబడెదరు.

4. ఎవరికి అన్నివిధములైన కామనలు పూర్తిగా నశించినవో, ఎవరికి ఇచ్ఛా-కామనా-తృష్ణా-వాసనాదులు, లేశమాత్రముగూడ లేవో అట్టి పురుషులు 'వినివృత్తకామాః' అనబడెదరు.

5. శీతోష్ణములు-ప్రియాప్రియములు-మానాపమానములు స్తుతినిందలు, ఇత్యాది

"న తద్ భాసయతే సూర్యో న శశాంకో న పావకః ।
యద్ గత్వా న నివర్తంతే తద్ ధామ పరమం మమ"॥ 6

"అర్జునా! యే పరమపదమును పొంది మనుష్యుడు తిరిగి సంసారమునకు రాడో యే పరమపదము స్వయంప్రకాశమో దేనిని సూర్యుడు-చంద్రుడు అగ్నియు[1] ప్రకాశింపజేయజాలరో అదియే నా "పరమధామము[2].

---

ద్వంద్వములు సుఖదుఃఖ హేతువులగుటచేత అవి 'సుఖదుఃఖసంజ్ఞకములు' అని చెప్పబడెను ఈ యన్నిటితో కొంచెముగూడ సంబంధము పెట్టుకొనకుండుట అనగా ఏ ద్వంద్వముల సంయోగ వియోగములందు కొంచమైనను రాగ-ద్వేష, హర్షశోకాది వికారములు కలుగకుండుటయే అద్వంద్వముల నుండి పూర్తిగా విముక్తుడగుట యనబడును.

1. సమస్త ప్రపంచమును ప్రకాశింపజేయు సూర్య-చంద్ర-అగ్నులు వీరు దేవతలుగా గల చక్షస్సు-మనస్సు-వాక్కు ఇవియేవిగూడ ఆ పరమ పదమును ప్రకాశింపచేయజాలవు. ఇవియేకాక లోకములో ప్రకాశము లనబడు తత్త్వములలో ఏ యొక్కటిగాని అన్నిగాని ఆ పరమపదమును ప్రకాశింపజేయజాలవు. ఎందుకనగా ఇవియన్నియు ఆ పరమాత్మ ప్రకాశముచేతనే ఆయనయొక్క సత్తా-స్ఫూర్తుల అంశముచేతనే ప్రకాశితము లగును. (గీ 15-12)

2. ఎక్కడికి చేరినతరువాత ఈ ప్రపంచములో ఎప్పుడుగూడ ఎట్టి పరిస్థితిలో గూడ మరల సంబంధము ఉండదో అదియే నా పరమధామము-అనగా మాయాతీతధామము. అక్కడనే నా భావము-స్వరూపముగూడా నున్నవి. దీనినే అవ్యక్తము, అక్షరము, పరమగతియనికూడా ననెదరు (గీత 8-21) దీనినే వర్ణించుచు శ్రుతి యిట్లు చెప్పుచున్నది.

"యత్ర న సూర్యస్తపతి యత్ర న వాయుర్వాతి యత్ర న చంద్రమా భాతి యత్ర న నక్షత్రాణి భాంతి, యత్ర నాగ్నిర్దహతి యత్రన మృత్యుః ప్రవిశతి యత్ర న దుఃఖాని ప్రవిశంతి, సదానందం పరమానందం శాంతం శాశ్వతం సదాశివం బ్రహ్మాదివందితం, యోగిధ్యేయం, పరం పదం యత్ర గత్వా న నివర్తంతే యోగినః" (బృహజ్జాబాలో పనిషత్తు 8-6)

సంబంధము :

మొదటినుండి మూడవ శ్లోకమువరకు సంసార వృక్షనామముతో 'క్షర' పురుష వర్ణనము చేయబడెను. దానిలో జీవరూప 'అక్షర' పురుషుని బంధన కారణము, దానిచేత మనుష్య యోనిలో అహంకార మమకారములతో ఆసక్తి పూర్వకముగాను చేయబడిన కర్మలనుగూర్చి చెప్పి ఆ బంధనమునుండి విముక్తికి ఉపాయము, సృష్టికర్త-ఆదిపురుషుడునైన పురుషోత్తముని శరణుపేడుటను భగవంతుడు తెలిపెను దీనిపైన, పైనచెప్పబడిన విధముగా బంధితుడైన జీవుని స్వరూపమేది? అతని వాసన స్వరూపమేది? దాని నెవడెట్లు తెలిసికొనును, అను జిజ్ఞాసకలుగును. కనుక ఈ విషయములన్నియు స్పష్టము చేయుటకు తొలుతజీవుని స్వరూపము భగవంతుడు తెలుపుచున్నాడు.

"మమైవాంశో జీవలోకే[1] జీవభూతః సనాతనః ।
మనః షష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి॥" 7

"అర్జునా! ఈ దేహమునందున్న సనాతనుడైన జీవాత్మ నా యంశమే అదియే[2] యీ ప్రకృతియందున్న మనస్సును, పంచేంద్రియములను[3] ఆకర్షించును.

---

అనగా "ఎక్కడ సూర్యుడు తపించదో, యెక్కడ వాయువు వీచదో, ఎక్కడ చంద్రుడు ప్రకాశించదో ఎక్కడ నక్షత్రాలు వెరయవో ఎక్కడ అగ్నిదహించదో, ఎక్కడ మృత్యువు ప్రవేశించదో, యెచ్చట దుఃఖము ప్రవేశించదో, యేస్థానమునకుపోయి తిరిగిరారో అది సదానంద-పరమానంద-శాంత-సనాతన-సదామంగళరూప, బ్రహ్మదిదేవ వందిత-యోగి ధ్యేయ-పరమపదము".

1. ఇక్కడ 'జీవలోకే' అను పదమునకు జీవాత్మయొక్క నివాస స్థానము శరీరమని యర్థము దీనిలో స్థూల-సూక్ష్మ-కారణ శరీరములు మూడున్ను చేరియున్నవి. ఇందులోయున్న జీవాత్మ సనాతనుడు-తన అంశమునని భగవంతుడు చెప్పెను.

2-3. ఎట్లైతే అంతట సమభావములోనున్న విభాగరహిత మహాకాశము ఘట-

సంబంధము-

జీవాత్మ మనస్సును, పంచేంద్రియములను ఎప్పుడు ఏ విధముగా, ఎందు కొరకు ఆకర్షించును? ఆ మనస్సహిత షడింద్రియములేవి? అను జిజ్ఞాసకలుగును. దానికి భగవంతుడు రెండు శ్లోకములలో బదులు చెప్పుచున్నాడు.

"శరీరం యదవాఽప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః[1] ।
గృహీత్వైతాని[2] సంయాతి వాయుర్గన్ధా నివాశయాత్॥" 8

---

గృహాదుల సంబంధముచేత వేర్వేరు భాగములుగా నున్నట్లు తోచునో, ఆ ఘటాదులలోనున్న ఆకాశము మహాకాశముయొక్క అంశమేయని భావింపబడునో అట్లే నేను, విభాగరహిత సమభావముతో సంతత వ్యాపించి యున్నప్పటికిన్ని, వేర్వేరు శరీర సంబంధముచేత వేర్వేరుగా విభక్తుడ నైనట్లు తోచుచుండెదను. (గీత 13-16) ఆ శరీరములలోనున్న జీవుడు నా యంశమేయని తలచబడును. ఇటువంటి యీ విభాగము అనాది, క్రొత్తగా ఏర్పడినదికాదు. ఈ భావము తెలుపుటకే భగవంతుడు జీవాత్మ తనయొక్క సనాతనమైన అంశమని తెలిపెను.

మనస్సహిత షడింద్రియములకు అన్ని విషయములను అనుభవించుటలో ప్రాధాన్యముగలదు. కర్మేంద్రియ కార్యములుగూడా జ్ఞానేంద్రియములు లేకుండా జరుగవు. కనుక ఇక్కడ మనస్సహిత ఇంద్రియముల సంఖ్య ఆరు అని చెప్పబడినది. ఈ కారణముచేతనే పంచకర్మేంద్రియముల యంతర్భావము ఈ జ్ఞానేంద్రియములలోనేయని తలచవలెను.

1. జీవాత్మ ఈశ్వరుడనిచెప్పి భగవంతుడు "జీవాత్మ, మనోబుద్ధి సహిత సర్వేంద్రియములకు శాసకుడు ప్రభువు కాబట్టియే ఆ ఇంద్రియాదులను ఆకర్షించుటకు సమర్థుడయియున్నాడు"అను నభిప్రాయమును తెలిపెను.

2. మనస్సు అంతఃకరణమునకు ఉపలక్షణము (ఇతర విషయములనుగూడ చెప్పునట్టి సామాన్య ధర్మము) అగుటచేత బుద్ధి అందులోచేరినది పంచ కర్మేంద్రియములు - పంచప్రాణములున్ను జ్ఞానేంద్రియములలో చేరి

అర్జునా! వాయువు గంధముండుచోటునుండి గంధమును గ్రహించితీసికొనుపోవునట్లే దేహాదులకు అధిపతియైన జీవాత్మగూడ తాను విడుచు శరీరమునుండి మరణ సమయమందు మనస్సహిత షడింద్రియములను తీసికొనిపోయి తరువాత తాను చేరు శరీరమునకు కొనిపోవును[1].

"శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణమేవ చ ।
అధిష్ఠాయ మనశ్చాయం విషయానుపసేవతే॥" 9

"అర్జునా! జీవాత్మ శ్రోత్రము - చక్షుస్స-చర్మము-జిహ్వా-ఘ్రాణము మనస్సు ఈ యారు ఇంద్రియముల నాశ్రయించి అనగా వీని సహాయముచేతనే విషయములను సేవించుచుండును.[2]

---

యున్నవి. కనుక ఇక్కడ 'ఏతాని' అను పదము పదియేడు తత్త్వముల సముదాయ రూపమైన సూక్ష్మశరీరమును బోధించుచున్నది.

1. ఇక్కడ ఆధారస్థానములో స్థూల శరీరము, గంధస్థానములో సూక్ష్మ శరీరము వాయుస్థానమునందు జీవాత్మయున్నవి. వాయువు గంధము నొకచోట నుండి మరియొకచోటికి తీసికొని పోవునట్లు, జీవాత్మగూడ ఇంద్రియ, మనో-బుద్ధి-ప్రాణసముదాయ రూపమైన సూక్ష్మశరీరమును, ఒక స్థూల శరీరమునుండి తొలగించి మరియొక స్థూలశరీరమునకు తీసుకొని పోవును. జీవాత్మ పరమాత్మయొక్క అంశమే యగుటచేత అది నిత్యము అచలము ఎక్కడకిన్ని రాకపోకలుచేయుట వొసగనప్పటికి సూక్ష్మశరీరముతో దీనికి సంబంధము ఉండుటచేత సూక్ష్మశరీరముద్వారా ఒక స్థూలశరీరము నుండి మరియొక స్థూలమునకు జీవాత్మపోయినట్లుగా భాసించును. ఈ కారణముచే ఇక్కడ 'సంయాతి' యను క్రియాపదము ప్రయోగించి జీవాత్మ ఒక శరీరమునుండి మరియొక శరీరమునకు పోవుట తెలుపబడెను. భగవద్గీత రెండవ అధ్యాయము 22వ శ్లోకములోకూడ ఈ విషయమే చెప్పబడెను.

2. వాస్తవముగా ఆత్మ కర్మలు చేయువాడు గాని తత్పల విషయములు సుఖదుఃఖములున్ను అనుభవించువాడు గాని కాదు. కాని ప్రకృతి

"ఉత్క్రామంతం స్థితం వాఽపి భుంజానం వా గుణాన్వితమ్ ।
విమూఢా నానుపశ్యంతి పశ్యంతి జ్ఞాన చక్షుషః ॥" 10

"అర్జునా! శరీరమును విడిచిపోవునట్టివి. లేక శరీరములోనున్నట్టివి. లేక విషయములను అనుభవించునట్టి త్రిగుణములు గల శరీరమును అజ్ఞానులు కనుగొనజాలరు. కేవలము జ్ఞాననేత్రముగల జ్ఞానులు మాత్రమే తాత్వికముగా తెలిసికొనగలరు.[1]

"యతంతో యోగినశ్చైనం పశ్యంత్యాత్మన్యవస్థితమ్ ।
యతంతోఽప్యకృతాఽత్మానో నైనం పశ్యంత్యచేతనః " 11

"అర్జునా! ప్రయత్నించు యోగులే తమ హృదయము నందున్న యీ యాత్మను తాత్త్వికముగా తెలిసికొన గలరు [2] కాని అంతఃకరణమును పరిశుద్ధ

---

కార్యములతోపాటు, అతనికి అనాదిగానుండిన అజ్ఞానసంబంధము వలన అతడు కర్తయని, భోక్తయనియు తలచబడును. (గీత 13-21) శ్రుతిలో గూడ 'ఆత్మేంద్రియమనోయుక్తం భోక్తేత్యాహుర్మనీషిణః' (కఠోపనిషత్తు-1-3-4) అనగా 'మనోబుద్ధీంద్రియయుక్తమైన ఆత్మయే భోక్తయని జ్ఞానులు చెప్పెదరు. అని చెప్పబడినది.

1. ఆత్మ శరీరమును విడిచిపోవునపుడు శరీరమునందున్నపుడు విషయము ననుభవించునపుడున్ను ప్రతియొక దశలోను వాస్తవముగా ప్రకృతికన్నా పూర్తిగా అతీతుడు. అతడు జ్ఞానస్వరూపుడు-శుద్ధుడు-అసంగుడు మాత్రమే యగును. అని జ్ఞానులు చెప్పెదరు.

2. అంతఃకరణము పరిశుద్ధమై తమ వశమునందుంచుకొని ఆత్మ స్వరూపమును తెలిసికొనుటకు నిరంతరము శ్రవణ-మనన-నిదిధ్యాసనాది ప్రయత్నములు చేయుచున్న ఉన్నతస్థాయికి చెందిన సాధకులు మాత్రమే ప్రయత్నించు యోగులు అనబడెదరు. ఏ జీవాత్మయొక్క ప్రకరణము నడుచుచున్నదో ఏ జీవాత్మ శరీర సంబంధముచేత హృదయమునందున్నాడని చెప్పబడుచున్నాడో అతనియొక్క నిత్య-శుద్ధ-విజ్ఞానానందమయ వాస్తవిక స్వరూపమును యథార్థముగా తెలిసికొనుటయే అతడు ఈ యాత్మను తాత్త్వికముగా తెలిసికొనుట యగును

ముగా నుంచుకొనిన యజ్ఞానులైతే నో యత్నము చేయుచున్నప్పటికిన్ని ఆత్మను కనుగొనజాలరు.[1]

సంబంధము—

ఆరవ శ్లోకముపైన రెండు శంకలు గలుగును. మొదటిది అన్నిటిని ప్రకాశింపజేయు సూర్యుడు-చంద్రుడు అగ్ని మొదలైన తేజోమయ పదార్థములు పరమాత్మను ఏందుకు ప్రకాశింపజేయజాలవు అని రెండవది పరమధామమును పొందిన తరువాత పురుషుడు ఎందుకు తిరిగిరాడు? అని రెండవ శంకకు ఉత్తరము ఏడవ శ్లోకములో జీవాత్మ పరమాత్మలయొక్క అంశమని తెలిసి పదకొండవ శ్లోకమువరకు జీవాత్మ స్వరూప-స్వభావ వ్యవహారములను వర్ణించుచు దాని యథార్థ స్వరూపమును తెలిసికొనువారి మహిమ చెప్పబడెను. ఇప్పుడు మొదట శంకకు ఉత్తరము చెప్పుటకు భగవంతుడు పన్నెండవ శ్లోకమునుండి పదునైదవ శ్లోకమువరకు గుణ-ప్రభావ-ఐశ్వర్య సహితమైన తన స్వరూపమును వర్ణించుచున్నాడు.

"యదాదిత్యగతం తేజో జగద్ భాసయతేఽఖిలమ్ ।
యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్ తేజో విద్ధిమామకమ్ ॥" 12

"అర్జునా! సమస్త ప్రపంచమును ప్రకాశింపజేయు సూర్యుని తేజస్సు చంద్రాగ్నుల తేజస్సులు నా తేజస్సనియే తెలిసికొనుము."[2]

---

1. నిష్కామ కర్మాదులచేత అంతఃకరణమునందలి మలము పూర్తిగాకడుగ బడక భక్త్యాదులచేత చిత్తమును స్థిరపరుచుకొను నభ్యాసమెప్పుడుగూడ చేయక పరిశుద్ధాంతఃకరణులు కాక మలిన-చంచలమునైన అంతఃకరణము గల పురుషులు 'అకృతాత్మ' లనబడుదురు.

2. సూర్య-చంద్ర అగ్నుల తేజస్సుయే యని తెలిపి భగవంతుడు ఆ మూడిటిలో అవి దేవతలుగా గల నేత్రము, మనస్సు, వాక్కు ఇత్యాది వస్తువులను ప్రకాశింపజేయు శక్తి యంతయు నా తేజస్సులోని ఒక అంశము మాత్రమే యనునభిప్రాయము తెలిపెను. కనుకనే ఆరవ శ్లోకములో భగవంతుడు సూర్యచంద్రాగ్నులందరు నా స్వరూపమును ప్రకాశింపజేయుటకు సమర్థులు కారు అని చెప్పెను.

"గామావిశ్యచ భూతాని ధారయామ్యహ మోజసా ।
పుష్ణామి చౌషధీః సర్వాః సోమో భూత్వా రసాత్మకః॥" 13

"అర్జునా! నేను భూమిలో ప్రకాశించి నా శక్తిచేత సర్వభూతములను ధరించుచున్నాను.[1] రస స్వరూపుడనై అనగా అమృతమయుడగు చంద్రుడనై నేను ఓషధులను అనగా వనస్పతులనన్నిటిని పరిపుష్టము చేయుచుండెదను.[2]

"అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః।
ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్॥" 14

"అర్జునా! నేను సర్వ ప్రాణుల శరీరములందుండు ప్రాణాపానములతో గూడిన వైశ్వానరుడనెడు అగ్నిరూపుడనై నాలుగువిధములుగల అన్నమును పచనము (జీర్ణము) చేసెదను.[3]

---

1. దీనిచేత భగవంతుడు తెలిపిన భావమేమనగా యీ భూమిగాని మరియే యితరములకు గాని గల ధారణ చేయుశక్తి వాస్తవముగా వాటిదికాదు. అది నా శక్తియొక్క ఒక అంశము మాత్రమే. కనుకనే నేను స్వయముగానే భూమిలో ప్రవేశించి నా బలముచేత సర్వప్రాణులను ధరించెదను అని.

2. 'ఓషధిః' అను శబ్దమునకు పత్ర-పుష్ప-ఫలాది సర్వావయవ సహిత వృక్ష-లతా-తృణాది వనస్పతులన్నియు ఓషధి భేదములే యగును. నేనే చంద్రుడినై ఓషధుల నన్నిటిని పోషించెదను. అను మాటచేత భగవంతుడు తెలిపినదేమనగా చంద్రునకు గల ప్రకాశన శక్తి నా ప్రకాశాంశమైనట్లే చంద్రునకు గల ఓషధి పోషణశక్తిగూడ నా శక్తియొక్క ఒక అంశమేయగును అని. కనుకనే నేనే చంద్రుని రూపములో ప్రకటితుడనై అన్నింటి పోషణము చేసెదనను నభిప్రాయము భగవంతుడు తెలిపెను.

3. ఇక్కడ భగవంతుడు తెలిపిన వేమనగా అగ్నికిగల ప్రకాశనశక్తి నా తేజస్సుయొక్క అంశమైనట్లే అగ్నియొక్క ఉష్ణత్వ-పాచన దీపనశక్తులు గూడ నా శక్తియంశములే కనుకనే నేనే ప్రాణాపాన సహిత ప్రాణుల

"సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్తః స్మృతిర్జ్ఞానమపోహనం చ।
వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో
వేదాంత కృద్వేద విదేవ చాహమ్॥ 15

"అర్జునా! నేను సర్వప్రాణుల హృదయములో అంతర్యామిగా నున్నాను. నానుండియే స్మృతి జ్ఞానము-అపోహనము కలుగును.[1] అన్ని వేదముల చేతను నేనే తెలిసికొనదగినవాడను.[2] వేదాంతమునకు కర్తను[3] వేదములను తెలిసికొన వాడను గూడ నేనే యని తెలిసికొనుము.

---

శరీరమునందు నివసించు వైశ్వానరాగ్ని రూపములో భక్ష్య-భోజ్య-చోష్య-లేహ్యాది చతుర్విధాన్నములను పచనము(జీర్ణము)చేయుచుందును. దంతములతో నమిలి తిను రొట్టె మొదలగునవి భక్ష్యములని చప్పరించి తిను వెన్నవంటి పదార్థములు భోజ్యములు జుఱ్ఱబడు చారు పులుసు వంటివి 'చోష్యములు' అని నాకబడుచు తిను పచ్చళ్ళు, చెట్నీలు 'లేహ్యములు అని నాలుగు విధముల ఆహార పదార్థములు ప్రతిదినము తినునవి ఇక్కడ పేర్కొనబడినవి).

1. పూర్వము చూడబడినది వినబడినది ఏదో ఒక విధముగ అనుభవించబడినదియు నగు వస్తువు లేక సంఘటనము ఈ మొదలైన వానిని స్మరించుట 'స్మృతి' యనబడును. ఏ వస్తువునైనను యథార్థముగా ఉన్నట్లు తెలిసికొను శక్తి 'జ్ఞానము' అనబడును సంశయము-విపర్యము (వ్యత్యాసము) ఊహాసమూహము ఊహన మనబడును. ఆ ఊహనము తొలగిపోవుట 'అపోహన' మనబడును. ఈ మూడుగూడ నానుండియే కలుగును. అని చెప్పి భగవంతుడు తెలిపిన యభిప్రాయమేమనగా 'అందరి హృదయములో నున్న అంతర్యామి పరమేశ్వరుడనైన నేనే సమస్త ప్రాణులకు కర్మానుసారముగా స్మృతి-జ్ఞాన అపోహాది భావములను వారి అంతఃకరణములో కలిగించెదను' అని.

2,3. దీనిచేత భగవంతుడు తెలిపిన అభిప్రాయమేమనగా వేదములో వర్ణింప

సంబంధము-

మొదటినుండి ఆరవశ్లోకము వరకు వృక్షరూప సంసారమును దానిని దృఢవైరాగ్యము చేత ఛేదించుటను పరమేశ్వరుని శరణుజొచ్చుటను పరమాత్మను పొందిన పురుషుల లక్షణములను పరమధామ స్వరూపమును పరమేశ్వర మహిమనున్ను గూర్చి వర్ణించుచు అశ్వత్థ వృక్షరూప 'క్షర' పురుషుని ప్రకరణము ముగించబడెను. ఆ తర్వాత ఏడవ శ్లోకమునుండి 'జీవ' శబ్దముచేత చెప్పబడు ఉపాసకుడైన అక్షర పురుషుని ప్రకరణము నారంభించి అతని స్వరూప-స్వభావ శక్తి వ్యవహారములను వర్ణించిన తరువాత అతనిని తెలిసికొను వాని మహిమను గూర్చి చెప్పుచు పదకొండవ శ్లోకమువరకు ఆ ప్రకరణమును ముగించెను. తరువాత పన్నెండవ శ్లోకము నుండి 'ఉపాస్యదేవుడైన పురుషోత్తముని' ప్రకరణ మారంభించి పదునైదవ శ్లోకమువరకు ఆయనయొక్క గుణ-ప్రభావ-స్వరూపములను వర్ణించుచు ఆ ప్రకరణము ముగించెను. ఇప్పుడీయధ్యాయము ముగియ వరకు పూర్వోక్తములైన మూడు ప్రకరణముల సారమును సంక్షేపముగా తెలుపుటకు ఈ తరువాతి శ్లోకములో క్షరాక్షర పురుషోత్తమ వర్ణనము భగవంతుడు చేయుచున్నాడు.

"ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ।
క్షరః సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే[1]॥" 16

---

బడిన కర్మకాండ-ఉపాసనకాండ-జ్ఞానకాండములన్నిటి లక్ష్యమై సంసారమునందు వైరాగ్యము కలిగించి అన్ని విధములైన అధికారులకు నా జ్ఞానమే కలిగించుట యని అందుచే ఆ కర్మకాండాదుల ద్వారా నా స్వరూప జ్ఞానమును పొందు మనుష్యులే వేదముల అర్థమును బాగుగా తెలిసికొన గలరు అని దీనికి విపరీతముగా 'సాంసారిక భోగములందు ఇరికికొన్న మనుష్యులు వేదార్థము బాగుగా తెలిసికొనజాలరు అని,

1. దీనిచేత భగవంతుడు తెలిపిన యభిప్రాయమేమనగా వేదములలో తోచు విరోధములయొక్క వాస్తవిక సమన్వయము చేసి మనుష్యునకు శాంతి నిచ్చువాడను నేనే యని.

12. భగవద్గీత యేడవ అధ్యాయములో అపరాప్రకృతి 'పరాప్రకృతి' యను

"అర్జునా! ప్రపంచములో నాశవంతుడు-అవినాశి అని రెండు విధములైన పురుషు లున్నారు. వీరిలో సమస్త భూత ప్రాణుల శరీరము నాశవంతమని జీవాత్మ అవినాశియనియు చెప్పబడును.

"ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః ।
యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥" 17

"అర్జునా! యీ యిరువురి కన్నను ఉత్తముడైన పురుషుడు వేరుగానే యున్నాడు.[1] అతడు మూడు లోకములలోను ప్రవేశించి అందరిని భరించి పోషించును. ఈ విధముగా అవినాశి-పరమేశ్వర పరమాత్మ చెప్పబడెను.[2]

---

పేర్లతో (7-4,5) యెనిమిదవ అధ్యాయములో అధిభూత, అధ్యాత్మ అను పేర్లతో (8 4,3) పదమూడవ అధ్యాయములో క్షేత్రక్షేత్రజ్ఞ నామములతో (13-1) ఈ అధ్యాయములో ప్రారంభమునందు 'అశ్వత్థ జీవ నామములతోనూ రెండుతత్త్వములు వర్ణింపబడినవి. వానిలో నొకటి 'క్షరము' మరియొకటి అక్షరము అని చెప్పి భగవంతుడు ఈ రెండునూ పరస్పరము భిన్నములు. ఎందుకనగా 'భూతాని' అను పదము ఇక్కడ సర్వజీవుల యొక్క 'స్థూల సూక్ష్మ-కారణ శరీరములను' నీ మూడింటిని తెలుపును. 'కూటస్థ'శబ్దమునకు ఇక్కడ సమస్త శరీరములందుండు ఆత్మ యని అర్థము. ఈ ఆత్మ సర్వదా ఒకే విధముగనుండును. దీనికి మార్పు ఉండదు గనుక ఆత్మను 'కూటస్థ' మనెదరు-దీనికి ఎప్పుడు గూడ ఎట్టి పరిస్థితిలోనూ 'క్షయము' 'నాశము' గాని 'అభావము' గాని ఉండదు. కనుక ఇది అక్షరము అను అభిప్రాయమును భగవంతుడు తెలిపెను.

1. ఉత్తమ పురుష శబ్దమునకు 'నిత్య-శుద్ధ-బుద్ధ-ముక్త-సర్వశక్తి సంపన్న పరమదయాళు-సర్వగుణ సంపన్న-పురుషోత్తమ 'శబ్దవాచ్యుడైన భగవంతుడని యర్థము. ఆయన పూర్వోక్త 'క్షర'-అక్షర' 'పురుషులిద్దరి కన్నను విలక్షణుడు అత్యంతశ్రేష్ఠుడు.

2. ఏ పరమాత్మయైతే మూడు లోకములలోను ప్రవేశించియుండి అవి నశించి నను తానెప్పుడు గూడ నశించకుండనో, సర్వదా నిర్వికారుడు, ఏక

"యస్మాత్ క్షరమతీతోఽహ మక్షరాదపి చోత్తమః ।
అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః ॥" 18

"ఎందుకనగా అర్జునా! నేను నాశవంతమైన జడవర్గము కన్నా పూర్తిగా అతీతుడను. అవినాశియైన జీవాత్మకన్న గూడ ఉత్తముడను[1] కనుక నే లోకములో వేదములోను నేను 'పురుషోత్తమ' నామముతో ప్రసిద్ధుడను."

---

రసుడుగా నుండునో, ఎవడు క్షరాక్షరములు రెంటికి శాసకుడు, ప్రభువు గాను నున్నాడో. సర్వశక్తి సంపన్నుడో ఈశ్వరుడో, గుణాతీతుడో శుద్ధుడో, సర్వమునకు ఆత్మయో ఆ పరమాత్మయే 'పురుషోత్తముడు' అనబడును.

'క్షర-అక్షర ఈశ్వర' యను మూడు తత్త్వములను గూర్చి శ్వేతాశ్వతరోపనిషత్తులో:-"క్షరం ప్రధానమమృతాక్షరం. హరః క్షరాఽత్మానావీశతే దేవ ఏకః" (1-10) అని చెప్పబడెను.

అనగా "ప్రధానము-అనగా ప్రకృతికి క్షరమని పేరు. దానికి భోక్త (అనుభవించువాడు) అవినాశియునైన ఆత్మ అక్షరమనబడును. ప్రకృతి ఆత్మ ఈ రెండింటిని శాసించుదేవుడు (పురుషోత్తముడు) కర్త యనబడునని చెప్పబడినది.

1. తాను క్షరపురుషునికన్న అతీతుడనని తెలిసి భగవంతుడు తెలిపినదేమనగా "నేను క్షరపురుషునితో పూర్తిగా సంబంధము లేనివాడను అతని కన్న అతీతుడను" అని అక్షరపురుషునకన్న తాను ఉత్తముడనను భగవంతుడు తెలిపిన యభిప్రాయమేమనగా 'క్షరపురుషునకు వలె అక్షరపురుషునకు నేను అతీతుడను కాను. ఎందుకనగా అతడు నా యంశమే అయినందుచేత అవినాశిచేతనుడు కాని అతనికన్న నేను అవశ్యముగా నుత్తముడనే యగుదును. ఎందుకనగా అతడు అల్పజ్ఞుడు-నేను సర్వజ్ఞుడను. అతడు శాసింపబడువాడు-నేను శాసించువాడను, అతడు నన్ను ఉపాసించువాడు-నేనతనికి ప్రభువుగా ఉపాసించబడు వాడనుగానున్నాను అతడు అల్పశక్తిగలవాడు-నేను సర్వశక్తి సంపన్నుడను ఈ కారణముల చేతనే అతనికన్న నేను అన్నివిధముల నుత్తముడను.

"యో మామేవ మసమ్మూఢో[1] జానాతి పురుషోత్తమమ్ ।
స సర్వవిద్[2] భజతి మాం సర్వభావేన భారత ॥" 19

"భారతా! నన్ను ఈ విధముగా తత్త్వముతో పురుషోత్తముడనని తెలిసికొనిన[3] జ్ఞానవంతుడైన సర్వజ్ఞ పురుషుడు సర్వవిధముల నిరంతరము వాసుదేవుడను పరమేశ్వరుడను నైన నన్నే భజించును.[4]

---

1. ఎవని జ్ఞానము సంశయ-విపర్యయాది దోషరహితమో, ఎవనికి కొంచెము గూడ మోహము అంశమాత్రము గూడా లేదో అతడు 'అసమ్మూఢుడు' అనబడును.

2. ఈ యధ్యాయము నందు సర్వపదార్థములు 'క్షర-అక్షర-పురుషోత్తమ నామములతో విభజించి వర్ణింపబడెను. కనుకనే క్షరాక్షరములను యథార్థముగా తెలిసికొని ఆ రెండింటికన్న మిక్కిలి ఉత్తముడైన పురుషోత్తముని తాత్త్వికముగా తెలిసికొనినవాడే 'సర్వవిద్' అనబడును.

3. ఇట్లు చెప్పుటచేత భగవంతుడు తెలిపిన అభిప్రాయమేమనగా "సర్వశక్తి సంపన్నుడు, సర్వాధారుడను, సర్వప్రపంచ సృష్టి-స్థితి-సంహారాదులను చేయువాడను. అందరికన్న పరమమిత్రుడను, అందరకున్ను ఏకైక శాసకుడను, సర్వగుణ సంపన్నుడను, పరమదయాళుడను, పరమప్రేమ శీలుడను, సర్వాంతర్యామి సర్వవ్యాపి, పరమేశ్వరుడను నగునన్ను పై రెండు శ్లోకములలో వర్ణించిన విధముగా క్షరాక్షర పురుషులిద్దరికన్నను నుత్తముడు సగుణ-నిర్గుణ గుణాతీత స్వరూపుడు సాకార-నిరాకార-వ్యక్తావ్యక్త స్వరూప పరమపురుషుడునని తెలిసికొనుటయే నన్ను 'పురుషోత్తము' డని తెలిసికొనుట యగును.

4. భగవంతుని పురుషోత్తముడనితలచు పురుషుడు సర్వజగత్తునుండి ప్రేమను తొలగించి కేవలము పరమ ప్రేమాస్పదుడైన పరమేశ్వరుడొక్కనియందే పరిపూర్ణప్రేమ యుంచుట, బుద్ధిచేత భగవంతుని యొక్క గుణప్రభావ తత్త్వ-రహస్య-లీలా-విలాస-స్వరూప- మహిమలందు పరిపూర్ణవిశ్వాస ముంచుట, వాక్కుచేత ఆయనను కీర్తించుట, నేత్రములచేత ఆయనను

"ఇతి గుహ్యతమం[1] శాస్త్రమిదముక్తం మయాఽనఘ[2] ।
ఏతద్ బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్ కృతకృత్యశ్చ భారత ।" 20

"అర్జునా! అతిరహస్యము, గోపనీయమునైన యీ శాస్త్రము ఈ విధముగా నేను నీకు చెప్పితిని. దీనిని తాత్త్వికముగా తెలిసికొని మనుష్యుడు జ్ఞానవంతుడు కృతార్థుడునగును.[3]

---

దర్శించుట, ఆయన యాజ్ఞానుసారముగా అంతయు ఆయనదే యని తలచి అంతట ఆయన వ్యాపించియున్నాడనితలచి, కర్తవ్యకర్మలద్వారా అందరికిన్ని సుఖము కలిగించు ఆయన సేవాదులు చేయుట, ఆయన యొక్క నామ-గుణ-ప్రభావ-చరిత్ర స్వరూపాదులను శ్రద్ధ-ప్రేమ పూర్వకముగా మనస్సులో ధ్యానించుట, అవి చెవులతోవినుట ఇత్యాదులు చేయుటయే అన్ని విధముల భగవంతుని భజించుట యనబడును.

1. ఇది గుహ్యతమమనితెలిపి భగవంతుడుతెలిపిన భావమేమనగా ఈ యధ్యాయమునందు సగుణ పరమేశ్వరుడనగు నా యొక్క గుణ-ప్రభావ తత్త్వరహస్యవిషయము ప్రధానముగా చెప్పబడెను కనుక ఇది మిక్కిలి గుప్తముగా నుంచదగిన విషయము. నేను ప్రతియొకని యెదుట ఇట్లు నాగుణప్రభావ తత్త్వ ఐశ్వర్యములను ప్రకటించను. కనుక నే నీవుగూడ అయోగ్యునికి ఈ రహస్యమును చెప్పగూడదు.

2. భగవంతుడు అర్జునుని ఇచట 'అనఘా!' యని సంబోధించి నీ యందు పాపములు లేవు. నీయంతఃకరణము శుద్ధము నిర్మలమునైనది కనుక నీవు నా యీ రహస్యతమోపదేశమును వినుటకు, ధరించుటకు అర్హుడవు అను నభిప్రాయము తెలిపెను.

3. ఈ యధ్యాయములో వర్ణింపబడిన భగవంతుని యొక్క గుణ ప్రభావ తత్త్వ-స్వరూపాదులను బాగుగాతెలిసికొని భగవంతుని పూర్వోక్త ప్రకారముగా సాక్షాత్పురుషోత్తముడని తలచుటయే యీ శాస్త్రమును తత్త్వముగా తెలిసికొనుట యగును. అది తెలిసినవాడు, పురుషోత్తముడైన భగవంతుని అపరోక్షభావములో పొందుటయే అతడు బుద్ధిమంతుడు అనగా

ఇతి శ్రీ మహాభారతే భీష్మపర్వణి, శ్రీ మద్భగవద్గీతా పర్వణి
శ్రీ మద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే, పురుషోత్తమ ప్రాప్తియోగో నామ,
పంచదశోఽధ్యాయః[1] భీష్మపర్వణి తు ఏకోనచత్వారింశోఽధ్యాయః

శ్రీ మహాభారతమునందు భీష్మపర్వాంతర్గత-భగవద్గీతా పర్వమునందు
శ్రీమద్భగవద్గీతోపనిషత్తులందు, బ్రహ్మవిద్యయందు, యోగశాస్త్రమునందు
శ్రీకృష్ణార్జునసంవాదమునందు పురుషోత్తమప్రాప్తి యోగమనబడు
పదునైదవ యధ్యాయము సమాప్తము.
భీష్మపర్వమునందు ముప్పది తొమ్మిదవ అధ్యాయము సమాప్తము.

---

జ్ఞానవంతుడగుట యనబడును. సమస్త కర్తవ్య కర్మలను ఆచరించుట సర్వఫలములను పొందుటయే 'యతడు కృతకృత్యుడగుట' యనబడును.

1. దీని తరువాతి విషయము భగవద్గీత మొదటి యధ్యాయము చివర * ఈ గుర్తుగల అధోజ్ఞాపికలో నున్నట్లు గ్రహింపవలెను.

(భీష్మపర్వమునందు 40 వ అధ్యాయము)

# శ్రీ భగవద్గీత పదియారవ అధ్యాయము

## దైవాసుర సంపద్విభాగ యోగము:

**సంబంధము:-**

భగవద్గీత యేడవ అధ్యాయము పదునైదవ శ్లోకములో, తొమ్మిదవ అధ్యాయము పదకొండవ పన్నెండవ శ్లోకములలోను భగవంతుడు 'ఆసురీ-రాక్షసీ, ప్రకృతులుగల మూఢులు నా భజనచేయరు సరిగదా నన్ను తిరస్కరించెదరు అని చెప్పియుండెను. తొమ్మిదవ అధ్యాయము పదమూడవ-పదునాలుగవ శ్లోకములలో దైవీ ప్రకృతిగల మహాత్ములు నన్ను సర్వభూతములకు ఆదియని, అవినాశియనియు తలచి అనన్య ప్రేమతో, అన్ని విధముల నిరంతరము నా భజనము చేసెదరు అని భగవంతుడు చెప్పియుండెను. కాని ఇతర విషయమక్కడ వర్ణింపబడుచుండనందుచేత దైవీ-ఆసురీ, ప్రకృతుల లక్షణములు వర్ణింపబడలేదు. మరల పదునైదవ అధ్యాయము పందొమ్మిదవ శ్లోకములో భగవంతుడు 'నన్ను పురుషోత్తము'డని తెలిసికొనిన జ్ఞానులైన మహాత్ములు అన్నివిధముల నా భజనము చేసెదరు అని చెప్పెను. దీని పైన భగవంతుడు పురుషోత్తముడని తలచి సర్వభావములతో ఆయన భజనము చేయువారైన దైవీ ప్రకృతి గల మహాత్ముల లక్షణములేవియని, భగవద్భజనము చేయని అసురీ ప్రకృతి గల అజ్ఞానుల లక్షణము లేవియనియు తెలిసికొనుటకు సహజముగానే యిచ్ఛగలుగును. కనుకనే భగవంతుడు-ఆయిరువురి లక్షణములను-స్వభావములను విస్తారముగా వర్ణించుటకు పదియారవ అధ్యాయము అరంభించుచున్నాడు. దీనిలో మొదటి మూడు శ్లోకములచేత, దైవీ సంపదగల సాత్త్విక పురుషులయొక్క స్వాభావిక లక్షణములను విస్తారపూర్వకముగా భగవంతుడు వర్ణించుచున్నాడు.

శ్రీ భగవానువాచ :

"అభయం సత్త్వసంశుద్ధిః జ్ఞానయోగ వ్యవస్థితిః ।
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప[1] ఏవచ॥" 1

అర్జునా! భయము పూర్తిగా లేకుండుట-అంతఃకరణమునందు పరిపూర్ణ నిర్మలత్వము-తత్త్వజ్ఞానముకొరకు ధ్యానయోగములో నిరంతర దృఢస్థితి సాత్త్విక దానము-ఇంద్రియనిగ్రహము భగవంతునియొక్క, దేవతలయొక్క గురుజనుల యొక్కయు పూజ-అగ్నిహోత్రాదులైన ఉత్తమ కర్మల ఆచరణము వేద శాస్త్రముల పఠన-పాఠనములు, భగవంతుని నామ-గుణ సంకీర్తనము, స్వధర్మ పాలనము కొరకు కష్టమును సహించుట, శరీరేంద్రియ సహితాంతః కరణమునందు సరళత్వము.

"అహింసా[2] సత్యమక్రోధస్త్యాగః[3] శాంతిరపైశునమ్[4] ।

---

1. స్వధర్మ పాలనము కొరకు కష్టములు సహించి, అంతః కరణమును, ఇంద్రియములను తపింపజేయుటయే యిక్కడ 'తపః' అను పదమునకు అర్థము. భగవద్గీత పదియేడవ అధ్యాయములో నిరూపింపబడిన 'శారీరక-వాచిక-మానసిక' తపస్సులు ఇక్కడ 'తపః' అను పదముచేత నిర్దేశింపబడలేదు. ఎందుకనగా వానిలో తపస్సునకు అంగములుగా నిరూపింపబడిన 'అహింసా-సత్య-శౌచ స్వాధ్యాయ లక్షణములు ఇక్కడ వేరుగా వర్ణింపబడినవి.

2.3.4. ఏ ప్రాణికైనను, ఎప్పుడైనను, లోభముచేతగాని, మోహముచేతగాని, క్రోధముచేతగాని, ఏవిధమైన కష్టమును, అధికముగాగాని, సాధారణముగా గాని, అల్పముగాగాని, తాను కలిగించుట లేదా యితరులచేత కలిగింపజేయుట లేక ఇతరులు కష్టపెట్టుచుండుటనుచూచి తాను అనుమోదించుట వీనిలో ఏవిధమైనను 'హింస' యే యగును. ఇటువంటి హింస ఏ కారణముచేతనైనను, 'మనో-వాక్ శరీరములచేత చేయకుండుట-అనగా 'మన మనస్సులో ఎవరి చెడుపును కోరకుండుట హాని కలిగించు మాటలాడి నొప్పింపకుండుట శరీరములో ఎవరినిగూడ కొట్టకుండుట కష్టపెట్ట

దయా[1] భూతేష్వలోలుప్త్వం మార్దవం[2] హ్రీరచాపలమ్[3]॥" 2

కుండుట ఏ విధమైన హాని కలిగింపకుండుట ఇత్యాదులన్నియు అహింసా భేదములని తెలియవలెను.

'కేవలము గుణములే గుణములందున్నవి. నాకు ఈ కర్మలతో ఏలాంటి సంబంధములేదు. అని తలచిగాని, లేక నేనైతే భగవంతుని చేతిలోని బొమ్మమాత్రమే యగుదును. భగవంతుడే తన యిచ్ఛానుసారముగా నా 'మనో.వాక్ శరీరములచేత అన్ని కర్మలు చేయించుచున్నాడు, స్వయముగా చేయు శక్తి నాకు లేదు, నేనిమియుచేయను. అని తలచి కర్తృత్వాభిమానమును విడుచుటయే 'త్యాగము' అథవా కర్తవ్యకర్మలు చేయుచునే, వాని యందు 'మమకార ఆసక్తి - ఫల'ములు స్వార్థము పూర్తిగా విడుచుటగూడ 'త్యాగము'అనబడును. ఇట్లు ఆత్మోన్నతికి విరుద్ధమైన 'వస్తువులను-భావములను-క్రియా సామాన్యమును' విడుచుటగూడ'త్యాగ' మనబడును.

ఇతరుల దోషములను కనిపెట్టుట లోకులలో వాని ప్రచారముచేయుట-అథవా, ఎవరినైనా నిందించుట, ఇతరులపై కొండెములు చెప్పుట ఇవన్నియు కలిగియుండుట 'పిశునత్వము' అనబడును. ఇది పూర్తిగా లేకుండుట 'అపైశునము'అనబడును.

1. ఏ ప్రాణియైనను దుఃఖపడుటచూచి అతని దుఃఖమును ఏ విధముగనైనను ఏలాటి స్వార్థములేకుండ నివారించుటకు అన్నివిధముల ఆ ప్రాణికి సుఖము కలిగించు భావము 'దయ' యనబడును. ఇతరులకు కష్టము కలిగింపకుండుట 'అహింస' యని, వారికి సుఖము కలిగించు భావము 'దయ' యనబడును. ఇదియే అహింసకు, దయకున్ను గల భేదము.

2. అంతఃకరణములో, వాక్కులో, వ్యవహారములోను కఠినత్వము పూర్తిగా లేకుండ అవి మిక్కిలి మృదువుగా, కోమలముగాను నుండుటయే 'మార్దవము' అనబడును.

3. హస్త పాదాదులను కదిలించుట-వ్రేళ్లను విరుచుట, నేలగీరుట విరువ

అర్జునా! మనో-వాక్-శరీరములచేత ఎవరికిన్ని ఏ విధమైన కష్టమున్ను కలిగింపకుండుట, సత్యముగా, ప్రియముగాను మాట్లాడుట తనకు అపకారము చేసినవాని యెడలగూడ క్రోధములేకుండుట తాను చేయు కర్మలందు తన కర్తృత్వాభిమానమును విడుచుట-అంతఃకరణమునందు ఉపరతి. సమస్త భూతప్రాణులందు నిష్కారణదయ గలిగియుండుట ఇంద్రియాకర్షకమైన విషయముల సంబంధము గలిగినను వానిపైన ఆసక్తి లేకుండుట కోమలత్వము (మృదుస్వభావము) లోకమునకు శాస్త్రములకున్ను విరుద్ధములైన ఆచరణములు చేయుటలో లజ్జగలిగియుండుట వ్యర్థ (పనికిమాలిన)ములైన చేష్టలు (ప్రయత్నములు-కర్మలు) చేయకుండుట—

"తేజః క్షమా ధృతిః శౌచమద్రోహో నాతిమానితా ।
భవంతి సంపదం దైవీమభిజాతస్య భారత॥" 3

అర్జునా! "తేజస్సు[1], క్షమ, ధైర్యము[2], బాహ్యశుద్ధి, దేనియందుగూడ శత్రుభావము లేకుండుట, తాను పూజ్యుడనని అభిమానము లేకుండుట" ఇవి

---

యోగముగా వదరుట-తల తోకలులేని పనికిమాలిన మాటలాడుట వానిని యోచించుట ఈ మున్నగు హస్తపాదవాక్ మనస్సులచే చేష్టలు చేయుట చపలత్వము అనబడును. దీనినే, "ప్రమాదము" (ఏమరుపాటు అనికూడా అనెదరు) ఇది ఏమాత్రము లేకుండుట "అచాపలము" అనబడును.

1. శ్రేష్ఠ పురుషుల శక్తి విశేషము "తేజస్సు" అనబడును. ఆ శక్తిచేత ఆ పురుషుల ఎదుట విషయాసక్తులు-నీచ ప్రకృతి గలవారుకూడ తరుచుగా అన్యాయాచరణమును విడిచి ఆ శ్రేష్ఠులు చెప్పినట్లు మంచి పనులలో ప్రవృత్తి గలవారగుదురు.

2. అత్యధిక దుఃఖములు ఆపదలు భయములు గలిగినపుడుగూడ ఏమాత్రము చలించకుండ ఉండుట కామ-క్రోధ-లోభ-భయములచే ఏ విధముగగూడ తమ ధర్మమునుండి కర్తవ్యమునుండియు విముఖులు కాకుండుటయే 'ధైర్యము' అనబడును.

యన్నియు దైవీ సంపదతో ఉత్పన్నులైన వారి లక్షణములని తెలిసికొనుము[1].

"దంభో[2] దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవచ ।
అజ్ఞానం చాభిజాతస్య పార్థ! సంపద మాసురీమ్ ॥" 4

"పార్థా! 'దంభము-పొగరు[3]-అభిమానము[4]-క్రోధము-కఠోరత్వము[5]-అజ్ఞా

---

1. ఈ యధ్యాయము మొదటి శ్లోకమునుండి ఈ శ్లోకము పూర్వార్థము వర కున్న రెండున్నర శ్లోకములలో 26 లక్షణముల రూపములో దైవీ సంపద రూపములైన సద్గుణములు సదాచారములు మాత్రమే వర్ణింపబడెను. కనుక ఈ లక్షణములన్నియు ఎవనియందు స్వాభావికముగా ఉన్నవో అథవా ఎవడు సాధనముచేత ఆ లక్షణములను పొందెనో ఆ పురుషుడే దైవీ సంపద గల వాడనబడును.

2. అభిమానము- పెద్దతనము- పూజ-ప్రతిష్ఠ వీని కొరకు లేక ధనాదుల లోభముచేత లేక ఎవరినైన మోసగించు నభిప్రాయముచేత తాను ధర్మా త్ముడను, భగవద్భక్తుడను, జ్ఞానవంతుడను, మహాత్ముడను, అని ప్రక టించుకొనుట అథవా పైకి కనపరచుటకు ధర్మపాలన-దాన-భక్తి-వ్రతో పవాసాది-యోగసాధన పరుడని మరి యితర విధములుగా తన కార్యము సాధించుకొనునో అదియే యతని 'దంభము' (దంబము) అనబడును.

3. విద్యా-ధన- కుటుంబ-జాతి- వయో-బల- ఐశ్వర్యాదుల సంబంధముచేత మనస్సులో గర్వించుట అది కారణముగా ఆ మనుష్యుడు ఇతరులు తుచ్ఛులని తలచి వారిని తిరస్కరించి అవమానపరచుట అతని 'దర్పము' అనబడును.

4. తాను శ్రేష్ఠుడను-పూజ్యుడను-పెద్దవాడను అని తలచుట గౌరవము-పెద్ద తనము-ప్రతిష్ఠ-పూజ ఇత్యాదులు తనకు కలుగవలెనని కోరుట ఇవి యన్నియు లభించిన తరువాత ప్రసన్నుడైయుండుట 'అభిమాన' మన బడును.

5. దురభ్యాసములచేత, కోపిష్ఠుల సాంగత్యముచేత లేక ఎవరైన తనను తిరస్కరించి తనకు అపకారముచేసి నిందించుటచేత మనస్సుకు విరుద్ధ

వము[6] ఇవన్నియు ఆసురీ సంపదలో ఉత్పన్నులైన పురుషుని లక్షణములు.[7]

"దైవీ సంపద్ విమోక్షాయ నిబంధాయాఽసురీ మతా ।
మాశుచః సంపదం దైవీమభిజాతోఽసి భారత ॥" 5

"అర్జునా! దైవీ సంపదముక్తిని[8] ఆసురీసంపద బంధమును కలిగించునవి

---

మైన పనులచేత తననెవరైన దుర్భాషలాడుట విని లేక తనకు అన్యాయ మితరులు చేయుటను చూచినప్పుడు గాని మరి యితర కారణములచేత గాని తన యంతఃకరణములో ద్వేషభావము ఉప్పొంగి అందుచేత మనస్సులో ప్రతీకారభావము కలుగును. కన్ను లెఱ్ఱబడును. పెదవులదరుము ముఖము భయంకరాకృతి కలదగును. బుద్ధి నశించును. కర్తవ్యవివేక ముండదు. ఈ మొదలగు "ఉత్తేజవృత్తి" (ప్రేరణ) యేది కలిగినప్పటి కిన్ని అది 'క్రోధము' అనబడును.

స్వభావములో ఏ మాత్రము మృదుత్వము లేకుండుట 'పారుష్యము' (కాఠిన్యము) అనబడును. ఎవరినైన తిట్టుట కటువుగా మాట్లాడుట-గేలి చేయుట ఇత్యాదులు వాక్కులో పారుష్యము, వినయములేకుండుట శరీర పారుష్యము. ఓర్పు-దయలకు వ్యతిరేకముగా ప్రతిక్రియ-క్రూరత్వము ఈ భావములు కలిగియుండుట మనస్సుయొక్క కఠోరత్వము అనబడును.

6. సత్యాసత్య, ధర్మాధర్మాదులను యథార్థముగా తెలిసికొనకుండుట లేక వీనిని గూర్చి వ్యతిరేకముగా నిశ్చయించుటే అజ్ఞానమనబడును.

7. ఈ శ్లోకములో దుర్గుణ దురాచారముల సముదాయరూపమైన ఆసురీ సంపద సంగ్రహముగా తెలుపబడినది కనుక ఇవియన్నిగాని లేక వీనితో ఏ కొన్ని లక్షణములు గాని ఉన్నవాడు ఆసురీ సంపదగలవాడని తెలిసి కొనవలెను.

8. ఇదే అధ్యాయము మొదట మూడు శ్లోకములలో వర్ణింపబడిన సాత్త్విక గుణ—తదాచరణముల రూపమునైన దైవీ సంపద మనుష్యుని సంసార బంధనమునుండి యెల్లప్పటికిన్ని విముక్తుని చేసి, సచ్చిదానంద ఘన

తలచబడినది కనుక నీవు శోకింపకుము. ఎందుకనగా నీవు దైవీసంపదలో ఉత్పన్నుడవైనావు.

"ద్వౌ భూతసర్గౌ[1] లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ ।
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ మే శృణు ॥" 6

"అర్జునా! ఈ లోకమునందు భూతముల సృష్టి-అనగా మనుష్య సముదాయము రెండు విధములుగానే యున్నది.[2] ఒకటి దైవీ ప్రకృతి గలది రెండవది ఆసురీ ప్రకృతి గలది. ఆ రెంటిలో దైవీప్రకృతి గలవారిని గూర్చి విస్తారముగా చెప్పబడినది. ఇప్పుడు నీవు ఆసురీప్రకృతిగల మనుష్య సముదాయముగూర్చి గూడా విస్తారముగా నానుండి వినుము.

"ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదు రాసురాః ।
న శౌచం నాపి చాఽచారో న సత్యం తేషు విద్యతే ॥" 7

"అర్జునా! ఆసురీ స్వభావముగల మనుష్యులు ప్రవృత్తి-నివృత్తులు రెండింటిని గూడ నెరుగరు.[3] కనుక వారికి బాహ్యాంతర శుద్ధి లేదు. ఉత్తమాచరణము సత్యభాషణము లేవు.

---

పరమేశ్వరునితో కలుపునని వేద-శాస్త్రములు- అందరు మహాత్ములును తలచెదరు.

1. సృష్టిని 'సర్గ' మనెదరు. భూతముల సృష్టిని 'భూతసర్గ' మనెదరు. ఇక్కడ 'అస్మిన్ లోకే' అను వాక్యముచేత మనుష్యలోకము సూచింపబడెను. ఈ యధ్యాయములో మనుష్యలక్షణములు తెలుపబడెను కనుక ఇక్కడ 'భూతసర్గౌ' అను పదమునకు 'మనుష్య సముదాయము' అని యర్థము చెప్పబడెను.

2. మనుష్యులలో సాత్త్వికులు దైవీ ప్రకృతి గలవారు, రజోగుణ సహిత తమోగుణ ప్రధానులు ఆసురీ ప్రకృతి గలవారు. 'రాక్షసీ' మోహినీ ప్రకృతులు గలమనుష్యులు ఇక్కడ 'ఆసురీ ప్రకృతి' గలవారిలో అంతర్గతులని తెలిసికొనవలెను.

3. ఇహలోక పరలోకములందు మనుష్యునకు యథార్థముగా శుభములు గలి

"అసత్యమప్రతిష్ఠం తే జగదాహురనీశ్వరమ్ ।
అపరస్పర సంభూతం కిమన్యత్ కామహైతుకమ్ ॥ 8

"అర్జునా! ఆసురీ ప్రకృతిగల మనుష్యులు ప్రపంచమునకు ఆశ్రయము లేదు. అది పూర్తిగా అసత్యము. దానికి ఈశ్వరుడు లేడు.[1] ప్రపంచము స్త్రీ పురుష సంయోగముచేత తనంతట స్వయముగానే ఉత్పన్నమైనది. కనుక కేవలము కామమే ప్రపంచోత్పత్తికి కారణము. ఇంతకన్నా మరియేమున్నది? అని చెప్పెదరు.

---

గించుకర్మలాచరించుటయే 'కర్తవ్యము' అనబడును. మనుష్యులాకర్మలందే ప్రవృత్తులుకావలెను. శ్రేయస్సుకలిగించని కర్మలాచరించుట 'అకర్తవ్య' మనబడును. ఆకర్మలనుండి నివృత్తులు కావలెను. భగవంతుడిక్కడ 'ఆసురీ స్వభావము గలవారు ఈ కర్తవ్యాకర్తవ్యములందు ప్రవృత్తి-నివృత్తులనే మాత్రము నెరుగరు కనుక వారికితోచిన పనులే చేసెదరు' అను భావము తెలిపెను. ఇక్కడ ఆసురీ ప్రకృతిగలవారి మనస్సుకు తోచినకల్పనలు వర్ణింపబడినవి. వారు ఈ చరాచరజగత్తుకు భగవంతుడు గాని ధర్మాధర్మములుగాని ఆధారములు కావు. జగత్తునకు శాశ్వతమైన సత్త లేదు—అనగా జన్మకు పూర్వముగాని, మరణించిన తరువాతగాని ఏ జీవునకు గూడ అస్తిత్వము లేదు. ఈ జగత్తునకు ఎవడుగూడ కర్త నియామకుడు—కారకుడైన ఈశ్వరుడు లేడు" అని తలచెదరు.

1. నాస్తిక సిద్ధాంతములు గలవారు ఆత్మయొక్క సత్తను అంగీకరించరు. వారు కేవలము దేహాత్మవాదులు—భౌతికవాదులు నగుదురు. దీనిచేత వారి స్వభావము భ్రష్టమగును. వారికి ఏ సత్కార్యమునందుగూడ ప్రవృత్తి యుండదు. వారి బుద్ధి గూడ మందముగా నుండును. వారు తమ నిశ్చయము లన్నియు సుఖభోగముల దృష్టిచేతనే చేసెదరు. వారి మనస్సు నిరంతరము అందరికి అహితము చేయు విషయములనే యోచించుచుండును. దీనిచేత వారు తమ అహితము గూడ చేసికొనెదరు. వీరు మనో-వాక్-శరీరములచేత చరాచర జీవులను బెదరించి దుఃఖపెట్టి ఆ జీవులకు

సంబంధము :-

ఇటువంటి నాస్తిక సిద్ధాంతము నవలంబించినవారి స్వభావము ఆచరణము ఎట్లుండును? ఇట్టి జిజ్ఞాసపైన, భగవంతుడిప్పుడు ఈ తరువాత నాలుగు శ్లోకములలో వారి లక్షణములను వర్ణించుచున్నాడు.

"ఏతాం దృష్టిమవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః ।
ప్రభవన్త్యుగ్ర కర్మాణః క్షయాయ జగతోఽహితాః ॥ 9

"అర్జునా! ఈ మిథ్యాజ్ఞానమునవలంబించి యెవరి స్వభావము నష్టమై యున్నదో ఎవరి బుద్ధి మందమైనదో అట్టివారు అందరికి అపకారము చేయు క్రూరకర్ములైన మనుష్యులు. వారు కేవలము ప్రపంచ నాశముకొరకే సమర్థులై యున్నారు.

"కామమాశ్రిత్య దుష్పూరం దంభమాన మదాన్వితాః ।
మోహాద్గృహీత్వాఽసద్గ్రాహాన్ ప్రవర్తన్తేఽశుచివ్రతాః ॥ 10

"అర్జునా! దంభ-మాన-మదములుగల ఆ మనుష్యులు ఏ విధముగ గూడ నెరవేరని కామనల నాశ్రయించి, అజ్ఞానముచేత మిథ్యాసిద్ధాంతముల నవలంబించి భ్రష్టాచారములను గ్రహించిన వారై[1] ప్రపంచములో తిరుగుచుందురు.

"చిన్తామపరిమేయాం చ ప్రలయాన్తాముపాశ్రితాః ।
కామోపభోగపరమా ఏతావదితి నిశ్చితాః ॥" 11

"అర్జునా! వారు మరణించువరకు అనుసరించుచున్న అసంఖ్యాకములైన

---

నాశము కలిగించు పెద్దపెద్ద భయంకర కార్యములు చేయుచుందెదరు. ఇట్లు వారు తమకే కాక ప్రపంచమునకు గూడ నష్టము కలిగించెదరు.

1. ఆహార-పానీయములు స్థితి గతులు, మాటలు. నడకలు, ప్రయత్నములు, వాణిజ్యము, కృషికర్మలు, ఇచ్చి-పుచ్చుకొనుట, వర్తన-వ్యవహారములు ఇత్యాదులు శాస్త్ర విరుద్ధముగా చేసి భ్రష్టులగుదురు. అట్టివారు 'భ్రష్టాచారులు' అనబడెదరు.

చింతలనాశ్రయించువారై, విషయోపభోగములననుభవించుటలో నాసక్తిగలవారై ఇంతయే సుఖముండును అని తలచుచున్నవారై యుందురు.

"ఆశపాశశతైర్బద్ధాః[1] కామక్రోధ పరాయణాః ।
ఈహన్తే కామభోగార్థమన్యాయేనార్థ సంచయాన్ ॥" 12

"అర్జునా! నూర్లకొలది ఆశాపాశములతో బంధింపబడిన ఆ మనుష్యులు కామ క్రోధములందాసక్తి గలవారై విషయసుఖముల ననుభవించుటకు అన్యాయ పూర్వకముగా ధనాది పదార్థములను సంపాదించి చేకూర్చుకొనుటకు ప్రయత్నములు చేయుచుందురు.[2]

"ఇదమద్య మయా లబ్ధమిమం ప్రాప్స్యే మనోరథమ్ ।
ఇదమస్తీదమపి మే భవిష్యతి పునర్ధనమ్ ॥" 13

"అర్జునా! వారు నేడు నాకిది లభించినది, ఈ కోర్కెను నెరవేర్చుకొనె

---

1. ఆసురీ స్వభావము గలవారు, మనస్సులో కలిగిన కల్పనలను నెరవేర్చుకొనుటకు వివిధములైన నూర్లకొలది ఆశలు పెట్టుకొని యుండెదరు. వారి మనస్సు ఒకప్పుడొక విషయమును ఆశించును. మరియొకప్పుడు ఒక విషయమువైపు లాగబడును. ఇంకొకప్పుడొక విషయమునందు తగుల్కొనును. ఈ విధముగా వారు ఆశల బంధనములనుండి యెప్పుడు గూడ విముక్తిపొందరు. కనుకనే వారు నూర్లకొలది ఆశలపాశములతో బంధింపబడినారని చెప్పబడినది.

2. విషయ సుఖములననుభవించు నుద్దేశముతో కామ-క్రోధముల నాశ్రయించి అన్యాయపూర్వకముగా అనగా "చౌర్యము, మోసము, దోపిడి, అసత్యము, కపటము, దంభము, కొట్టుట, కునీతి, మాయ-జూదము, వంచన-విషప్రయోగము తప్పుడు వ్యాజ్యములు, భయపెట్టుట ఈ మొదలైన శాస్త్రవిరుద్ధములైన నుపాయముల ద్వారా ఇతరుల ధనాదులను అపహరించుటకు ప్రయత్నించుటయే 'విషయసుఖానుభవము కొరకు అన్యాయముగా ధనసంపాదన చేయుటకు ప్రయత్నించుట యనబడును.

ధను. నావద్ద ఇదిగో ఇంత ధనమున్నది. ఇంకను ధనము నాకు లభించగలదు" అని యోచించుచుందురు.

"అసౌ మయా హతశ్శత్రుర్హనిష్యే చాపరానపి।
ఈశ్వరోఽహమహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ॥" 14

"అర్జునా! ఆ శత్రువులను నేను చంపితిని, ఇతర శత్రువులను గూడ చంపగలను. నేను ఈశ్వరుడను. ఐశ్వర్యము ననుభవించువాడను, నాకు అన్ని సిద్ధులు ఉన్నవి. బలవంతుడను సుఖుడను." అని కూడ వారు తలచుచుండెదరు.[1]

---

1. దీనిచేత అహంకారముతో పాటే వారికి అభిమానము గూడ పూర్తిగా నిండియుండును. దీనిచేత 'ప్రపంచములో మాకంటే పెద్దవారెవరున్నారు మేము తలచినచో ఎవరినైనా కొట్టగలము చంపగలము బ్రతికించగలము మేము తలచినచో ఎవరినైనను నిర్మూలించివేయగలము అని తలచెదరు. కనుక వారు మిక్కిలి గర్వముతో. "అరే! మేము పూర్తిగా స్వతంత్రులము. అంతయు మా చేతిలోనే కదా యున్నది మేము తప్ప మరియొక దెవరు ఐశ్వర్యవంతుడున్నాడు? అన్ని ఐశ్వర్యములకున్ను మేమే కదా ప్రభువులందరికంటే పరమేశ్వరుడైన పరమ పురుషులము మేమే కదా! అందరు మమ్ము పూజింపవలెను. మేము కేవలము ఐశ్వర్యమునకు మాత్రమే ప్రభువులము కాము సమస్తైశ్వర్యములను గూడ ననుభవించెదము. మేము మా జీవితములో ఎప్పుడు గూడ విఫలత్వమే అనుభవించలేము. మేము చేయిపట్టిన చోట్లలో నెల్ల సఫలత్వమే మమ్ము వరించెను. మా జీవితమెప్పుడు గూడ సఫలమే. మా కోరికలు సర్వదా సిద్ధించును. భవిష్యత్తులో జరుగబోవు సంఘటనములన్నియు మాకు మొదలే తెలియును. మేమంతయు నెరుగుదుము. మా యొక్క మానసిక శారీరక బలమెంత గొప్పదనగా మా బలమునాశ్రయించిన వారెవరైనను సరియే ఆ మా బలప్రభావముచేత వారు ప్రపంచమును జయించగలరు. ఈ యన్ని కారణముల చేతనే మేము మిక్కిలి సుఖముగా నున్నాము. ప్రపంచము నందలి సర్వసుఖములు మా కాళ్ళ దగ్గరకు వచ్చి మాకు సేవలు చేయుచుందును. అని చెప్పుచుండెదరు.

"ఆఢ్యోఽభి జనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా ।
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞాన విమోహితాః॥ 15

అనేక చిత్త విభ్రాన్తా మోహజాల సమావృతాః ।
ప్రసక్తాః కామ భోగేషు పతన్తి నరకేఽశుచౌ॥" 16

"అర్జునా! అసుర ప్రవృత్తి గలవారు, "నేను చాల గొప్ప ధనవంతుడను. పెద్ద కుటుంబము గలవాడను; నాతో సమానుడెవనున్నాడు? నేను యజ్ఞములు చేసెదను, మహానంద-విలాసములలో నుండెదను." అని యీ విధముగా అజ్ఞానము చేత మోహము చెందినవారు, అనేక విధముల భ్రమించుచున్న చిత్తముగలవారు మోహమనెడువలచేత చుట్టబడి చిక్కుకొని, విషయ సుఖభోగములందు మిక్కిలి ఆసక్తులై మిక్కిలి అపవిత్రమైన నరకములో పడిపోయెదరు[1].

"ఆత్మసమ్భావితాః[2] స్తబ్ధా[3] ధనమానమదాన్వితాః ।
యజన్తే నామయజ్ఞైస్తే దమ్భేనావిధి పూర్వకమ్॥" 17

"అర్జునా! వారు తామే శ్రేష్ఠులమని తలచుచు పొగరుబోతులుగ నుండి ధన-అభిమాన-మద యుక్తులై, కేవలము పాషండులవలె శాస్త్రవిధి రహితముగా పేరుకుమాత్రమే యజ్ఞములు చేసెదరు".

---

1. ఇందలి యభిప్రాయమేమనగా, 'ఇట్టి మనుష్యులు కామోపభోగముకొరకు వివిధ పాపములను చేసెదరు. ఆ పాపఫలము ననుభవించుటకు వారు-మల, మూత్ర, రక్తములు, చీము మొదలైన దుర్గంధ మలిన వస్తువులతోనిండి దుఃఖప్రదములైన కుంభీపాక రౌరవాది ఘోర నరకములందు పడవలసిన వారగుదురు.' అని

2. తామే 'అన్నిట సర్వశ్రేష్ఠులము-పూజనీయులము ఉన్నతులము గౌరవింప దగినవారము' అని తమ మనస్సులలో తలచువారు 'ఆత్మసంభావితులు' అనబడెదరు.

3. పొగరబోతుతనములో సామాన్యులతోనే కాక పూజ్యులతోగూడ వినయ పూర్వకముగా వ్యవహరించనివారు స్తబ్ధులు అనబడెదరు.

"అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః ।
మామాత్మ పరదేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః[1]" 18

"అర్జునా! వారు, 'అహంకారము-బలము-పొగరు-కామన-క్రోధాదులు' వీని యందాసక్తులై, ఇతరులను నిందించు పురుషులు తమ శరీరములలో నున్న అంతర్యామినైన నన్ను ద్వేషించెదరు[2].

సంబంధము–

ఈ విధముగా ఏడవ శ్లోకమునుండి పదునెనిమిదవ శ్లోకమువరకు ఆసురీ స్వభావము గల వారి దుర్గుణ-దురాచారాదులను వర్ణించి, యిప్పుడు భగవంతుడు. ఆ దుర్గుణ దురాచారములలో త్యాజ్య (విడువదగిన) బుద్ధిని కలిగించుటకొరకు, ఈ తరువాతి రెండు శ్లోకములలో అట్టి వారిని ఘోరముగా నిందించుచు వారికి గలుగు దుర్గతినిగూర్చి వర్ణించుచున్నాడు.

"తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ ।
క్షిపామ్యజస్ర మశుభా నాసురీష్వేవ యోనిషు॥" 19

"అర్జునా! అట్లు ద్వేషించు పాపాచారులు-క్రూరకర్ములునైన ఆ నరాధములను నేను ప్రపంచములో మాటి మాటికి ఆసురీ యోనులందే పడవేసెదను[3].

---

1. ఇతరుల దోషములనుచూచుట, వారిని నిందించుట, వారి గుణములను ఖండించుట, వారి గుణములందు దోషముల నారోపించుట భగవంతునందు సత్పురుషులందు దోషములెన్నుట, ఇత్యాది దోషములు గలవాడు అభ్యసూయకు డనబడును.

2. అందరిలోను భగవంతుడు అంతర్యామిగా నున్నాడు. కనుక ఎవరితోనైనా విరోధముగాని, ద్వేషముచేయుట, ఎవరికైన అహితముచేయుట ఎవరినైన దుఃఖపెట్టుట యనునది తన శరీరములో, ఇతరుల శరీరములలోను నున్న పరమేశ్వరుని ద్వేషించుటయగును.

3. సింహ-వ్యాఘ్ర-సర్ప-వృశ్చిక-వరాహ-శునక-కాకాది పశు-పక్షి-కీటక-శలభాది జంతువులన్నియు ఆసురీ యోనులగును.

"ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని ।
మామప్రాప్యైవ కౌంతేయః తతో యాంత్యధమాం గతిమ్॥" 20

"అర్జునా! అట్టి మూఢులు నన్ను పొందక[1]. జన్మ జన్మలందున్ను, ఆసురీ యోనిని పొందెదరు. తరువాత, అంతకన్నా నీచగతినే పొందెదరు. అనగా ఘోరనరకములందు పడెదరు.

సంబంధము-

అసురీ స్వభావము గలవారు ఎడతెగక ఆసురీ యోనులను, ఘోర నరకములను పొందెదరను విషయమువిని, వారు ఈ దుర్గతిని తప్పించుకొని, పరమ గతిని పొందుటకు ఉపాయమేమి? అని జిజ్ఞాసకులడగగా, భగవంతుడిట్లను చున్నాడు.

"త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః ।
కామః క్రోధస్తథా లోభస్తస్మాదేతత్ త్రయం త్యజేత్॥" 21

"అర్జునా! కామ-క్రోధ-లోభములు ఈ మూడు విధములైన ద్వారములు నరకమునకుగలవు. ఇవి ఆత్మనాశముచేయును. అనగా ఆత్మను అధోగతికి కొని పోవునవి[2]. కనుకనే, యీ మూడింటిని విడువవలెను."

---

1. జీవునకు మనుష్యయోనియందు భగవత్ప్రాప్తికి అధికారముగలదు. ఈ యధికారమును పొందియు, ఏ మనుష్యుడైతే యీ విషయము మరచి దైవ స్వభావ రూపమైన భగవత్ప్రాప్తి మార్గమునువిడిచి; ఆసురీ స్వభావ మార్గము నాశ్రయించునో, అతడు మనుష్య శరీరమనెడు సదవకాశమును పొందియు భగవంతుని చేరజాలడు. ఈ భావమును తెలుపుటకే భగవంతుడు తనను మూఢులుపొందరు, అను విషయమును తెలిపెను.

2. భార్యా పుత్రాది సర్వ భోగములందు కామన 'కామ' మనబడును. ఈ కామనకు వశులై మనుష్యులు చౌర్య-వ్యభిచార అభక్ష్య భక్షణాది వివిధ పాపములను చేయుదురు. మనస్సు విపరీతమైనప్పుడు కలుగు ఉద్రేక వృత్తి 'క్రోధ' మనబడును, క్రోధావేశముతో మనుష్యుడు హింసా-ప్రతి

"ఏతైర్విముక్తః కౌన్తేయ తమోద్వారైస్త్రిభిర్నరః ।
ఆచరత్యాత్మనః శ్రేయస్తతో యాతి పరాం గతిమ్॥" 22

"అర్జునా! యీ మూడు నరక ద్వారములనుండి విముక్తుడైనవాడు తన శ్రేయస్సును ఆచరించగలడు[1]. దీనిచేత నతడు పరమగతికి పోగలడు-అనగా, నన్ను పొందగలడని యర్థము."

యః శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామ కారతః ।
న స సిద్ధిమవాఽప్నోతి న సుఖం న పరాం గతిమ్॥" 23

"అర్జునా! యెవడు శాస్త్ర విధానమును విడిచి తన యిష్టము వచ్చినట్లు ఆచరించునో అతడు సిద్ధిని పొందడు. పరమగతిని, సుఖమునుగూడ పొందడు[2]".

---

హింసాది వివిధ పాపములను చేయును. ధనాది విషయములందు మిక్కిలి వృద్ధిచెందు లాలస (ఆశ) 'లోభ' మనబడును. లోభియగువాడు తగిన సమయములో ధనత్యాగము చేయడు. అనర్థ రీతిలోగూడ నతడు ధనోపార్జన వస్తు సంగ్రహములు చేయును. కాబట్టి యతడు అసత్య-చౌర్య-కపట-విశ్వాసఘాతాది మహాపాపములను చేయును. మనుష్యుడు కామ-క్రోధ-లోభములకు వశుడైనప్పటినుండియే అతడు తన విచార ఆచరణ భావములనుండి దిగజారిపోవును. కామ క్రోధ లోభములచేత అతడు, శరీరపతనము కలిగించునట్టి మనస్సును దుష్టచింతనములలో నుంచునట్టి, బుద్ధి చెరచునట్టి కర్మలు చేయును. అతని పనులన్నియు దూషితములగును. దాని ఫలముగా అతని వర్తమాన జీవనము సుఖ-శాంతి-పవిత్రత్వ రహితమై దుఃఖమయమగును. మరణించిన తరువాత అతనికి అసురీ యోనులు, నరకములు ప్రాప్తించును. ఈ కారణముచేతనే ఈ త్రివిధ దోషములు 'నరకద్వారములు-ఆత్మవినాశనములు' అని తెలపబడెను.

1. కామ-క్రోధ-లోభాది అసురీ సంపదనువిడిచి శాస్త్రములలో ప్రతిపాదింపబడిన సద్గుణ సదాచార రూపమైన సంపదను నిష్కామ భావముతో సేవించుటయే 'శ్రేయస్సు' కొరకు ఆచరించుట యనబడును.

2. వేదములు వానియాధారముపై రచితములైన స్మృతి పురాణేతి హాసాదు

"తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ ।
జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం కర్మ కర్తు మిహార్హసి॥" 24

"అర్జునా! యీ కర్తవ్యా కర్తవ్య వ్యవస్థలో నీకు శాస్త్రమే ప్రమాణము. అని తెలిసికొని, నీవు శాస్త్రవిధి ననుసరించి నియతమైన కర్మనే చేయుటకు యోగ్యుడవుసుమా!"[1].

ఇతి శ్రీ మహాభారతే భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా పర్వణి

---

లన్నియు 'శాస్త్ర' మనబడును. ఆసురీ సంపదయొక్క ఆచార వ్యవహారాదుల త్యాగము దైవీ సంపద్రూపమైన శ్రేయస్కర గుణాచారముల సేవనము రెంటి జ్ఞానము శాస్త్రముల నుండియే కలుగును. కర్తవ్యా కర్తవ్యముల జ్ఞానము కలిగించు శాస్త్రముల విధానమును నిందించి, పరిహసించి తన బుద్ధికి తోచినట్లు స్వాభిమాన గౌరవ ప్రతిష్ఠాదులకు తగినట్లు స్వేచ్ఛగా ఆచరించుటయే శాస్త్రవిధిని విడిచి ఇష్టమువచ్చినట్లు ఆచరించుట యనబడును, ఇట్టి కర్మలు చేయు కర్తకు ఏలాటి ఫలముగూడ లభించదు. అనగా పరమగతి లభించదు సరికదా, అతనికి లౌకికములైన అణిమాది సిద్ధులు సర్వప్రాప్తి రూపసిద్ధి ప్రపంచమునందు సాత్త్విక సుఖముగూడ లభించవు.

1. దీనిచేత తెలిపిన భావమేమనగా ఏది చేయవలెను? ఏది చేయగూడదు? అను నీ రెంటియొక్క వ్యవస్థ శ్రుతిచేత, వేదమూలకములైన స్మృతి పురాణేతిహాసాది శాస్త్రములచేతనే తెలియును. కనుకనే ఈ విషయములో మనుష్యుడు తన యిష్టమువచ్చినట్లు ఆచరించక శాస్త్రములనే ప్రమాణముగా తీసికొని వానిలో చెప్పబడినట్లు ఆచరించవలెను. అనగా శాస్త్రములలో ఏ కర్మలు చేయవలెనని చెప్పబడినదో వానిని చేయవలెను. ఏ కర్మలు నిషేధింపబడినవో వానిని చేయగూడదని తాత్పర్యము.

శాస్త్ర విహిత శుభ కర్మలనుగూడ నిష్కామ భావముతో చేయవలెను. ఎందుకనగా నిష్కామభావములో చేయబడిన శుభకర్మలుమాత్రమే భగవత్ప్రాప్తికి హేతువులని శాస్త్రములలో తెలుపబడినది.

శ్రీమద్భగవద్గీతా సూపనిత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే దైవాసుర సంపద్విభాగయోగో నామ షోడశోఽధ్యాయః
భీష్మపర్వణి తు చత్వారింశోఽధ్యాయః[1]

శ్రీమద్భగవద్గీతోపనిషత్తులందు, బ్రహ్మవిద్యయందు, యోగశాస్త్రమునందు,
శ్రీకృష్ణార్జున సంవాదమునందు, గుణత్రయ విభాగయోగ మనబడు
పదునారవ అధ్యాయము సమాప్తము[1] (16) భీష్మపర్వమునందు
నలుబదవ అధ్యాయము సమాప్తము.

---

1. దీని తరువాతి విషయము భగవద్గీత మొదటి అధ్యాయము చివరి • ఈ గుర్తుగల అధోజ్ఞాపికలోనున్నట్లు గ్రహించవలెను.

(భీష్మ పర్వము 41వ అధ్యాయము)

# శ్రీ మద్భగవద్గీత పదియేడవ అధ్యాయము

## శ్రద్ధా త్రయ విభాగయోగము

సంబంధము :

భగవద్గీత పదియారవ అధ్యాయములో భగవంతుడు, నిష్కామ భావముతో సేవించబడు శాస్త్రవిహిత గుణములు ఆచరణములున్ను దైవీ సంపదయని వర్ణించి, శాస్త్ర విపరీతమైన ఆసురీ సంపత్తిని గూర్చి చెప్పెను. దానితోపాటే, ఆసురీ స్వభావముగల పురుషులు నరకములో పడుదురను విషయము చెప్పి కామ–క్రోధ లోభములే ఆసురీ సంపదయొక్క ముఖ్య దుర్గుణములు ఈ మూడే నరక ద్వారములు కనుక వీనిని త్యజించి ఆత్మ శ్రేయస్సు కొరకు సాధనము చేయువాడు పరమగతిని పొందగలడు" అని తెలిపెను. ఆ తరువాత ఇట్లనెను. శాస్త్రవిధిని విడిచి తన యిష్టము వచ్చిన విధముగా తనకు మంచిదని తోచినది మాత్రమే చేయువానికి తన కర్మఫలము లభించదు. ఇదియు మంచిదే కాని శాస్త్ర విధి తెలియనందు చేత, లేక ఇతర కారణములచేత ఫలము విడిచి యజ్ఞపూజాది శుభకర్మలు శ్రద్ధాపూర్వకముగా చేయువారి స్థితి యెట్టిది? అను జిజ్ఞాసతో అర్జును డిట్లడుగు చున్నాడు.

అర్జున ఉవాచ :

"యే శాస్త్ర విధిముత్సృజ్య యజంతే శ్రద్ధయాఽన్వితాః ।
తేషాం నిష్ఠాతు కా కృష్ణ సత్త్వమాహో రజస్తమః ॥ 1

అర్జునుడిట్లనెను :-

శ్రీకృష్ణా! శాస్త్రవిధిని విడిచి దేవతలు మొదలైన వారిని శ్రద్ధతో పూజ

చేయు[1] మనుష్యుల స్థితి యెట్టిది? అది సాత్త్వికమా? రాజసమా? లేక తామస శ్రద్ధయా?[2]

---

1. శాస్త్రవిధి త్యాగమును గూర్చి భగవద్గీత పదియారవ అధ్యాయము ఇరువది మూడవ శ్లోకములో గూడ చెప్పబడెను. ఇక్కడ గూడ చెప్ప బడుచున్నది. అయినను ఈ రెంటి భావములలో చాల భేదమున్నది. అక్కడ తిరస్కార పూర్వకముగా చేయబడు శాస్త్రవిధి త్యాగము వర్ణ నము గలదు. ఇక్కడ అది తెలియనందువలన విడువబడు శాస్త్రవిధి వర్ణనమున్నది. వారికి శాస్త్రమనగా లెక్కయే లేదు గనుక ఇష్టము వచ్చి నట్లు ఏ కర్మవారు మంచిదని తలచెదరో దానినే చేసెదరు. ఇందుచేతనే అక్కడ 'వర్తతే కామకారతః' అని చెప్పబడెను. ఇక్కడనైతేనో 'యజంతే శ్రద్ధయాఽన్వితాః' అని చెప్పబడినది. కనుక వీరికి శ్రద్ధగలదు. శ్రద్ధయున్నచోట తిరస్కారభావముండజాలదు. వీరికి ప్రతికూల పరిస్థి తులు-వాతావరణమున్ను ఉండుటచేత అవకాశము లేకుండుటచేత అథవా పరిశ్రమము-అధ్యయనము ఇత్యాదుల అల్పత్వముచేతను శాస్త్రవిధిజ్ఞానము కలుగదు. ఈ యజ్ఞానము కారణముగానే, వీరు దానిని విడిచె దరు. శాస్త్రము తెలియకుండుటచేత శాస్త్రవిధిని విడిచి శ్రద్ధతో పూజ పూజచేయు వారి స్వభావమెట్లుండును? వారు దైవస్వభావము గలవారా? అను విషయమును స్పష్టముగా తెలుసుకొని చెప్పలేదు. కనుక అది తెలియు టకే అర్జునుడు ఇట్టివారి స్థితి సాత్త్వికియా? రాజసియా? తామసియా? అనగా వారు దైవీ సంపదగలవారా? లేక అసురీ సంపదకలవారా? అని ప్రశ్నించెను.

పైన చెప్పబడిన వివేచనము చేత 'ప్రపంచములో ఈ క్రింది యైదు విధ ముల మనుష్యులున్నారని తెలియుచున్నది.

శ్రద్ధ-శాస్త్రవిధిపాలనము ఈ రెండు గలవారిలో రెండు భేదములున్నవి ఒక వర్గమువారు నిష్కామ భావముతో కర్మలు అచరించువారు రెండవ తెగవారు సకామ భావముతో కర్మాచరణము చేయువారు. నిష్కామ భావ ముతో కర్మాచరణము చేయు దైవీ సంపదగల సాత్త్వికులు మోక్షము

పొందెదరు. వీరి వర్ణనము ముఖ్యముగా భగవద్గీత పదియారవ అధ్యాయము మొదటి మూడు శ్లోకములలో ఈ యధ్యాయము పదకొండవ, పదునాలుగవ శ్లోకములలోను కలదు. సకామ భావములో కర్మలనాచరించు సత్త్వయుక్త రాజస పురుషులు, సిద్ధి, సుఖము స్వర్గాది లోకముల పొందెదరు. వీరి వర్ణనము భగవద్గీత రెండవ అధ్యాయము నలుబది రెండవ-నలుబది మూడవ-నలుబది నాలుగవ శ్లోకములలో, నాలుగవ అధ్యాయము పన్నెండవ శ్లోకములో, ఏడవ అధ్యాయము ఇరువదవ-ఇరువది ఒకటవ ఇరువది రెండవశ్లోకములలో తొమ్మిదవ అధ్యాయము, ఇరువదవ, ఇరువదియొకవ ఇరువది మూడవ శ్లోకములలో ఈ యధ్యాయము పన్నెండవ-పదునెనిమిదవ ఇరువది యొకటవ శ్లోకములలోను గలదు.

2. శాస్త్రవిధిలో నేదోయొక యంశమును పాలించుచు యజ్ఞతపోదానాది కర్మలైతే చేసెదరు కాని శ్రద్ధలేని ఆపురుషులకర్మలు అసత్తులు(నిష్ఫలములు) అగును. వారికి ఈ లోకమునందు, పరలోకము నందున్న ఆ కర్మల వల్ల ఏలాటి లాభము గూడ నుండదు. వీరి వర్ణనము ఈ యధ్యాయము ఇరువది యెనిమిదవ శ్లోకములో చేయబడినది.

3. తెలియని వారగుట చేత శాస్త్రవిధిని ఎవరైతే విడిచెదరో అయినను శ్రద్ధగల అట్టి పురుషులు శ్రద్ధాభేదముచేత సాత్త్వికులు-రాజసులు తామసులు గూడ నగుదురు. వీరి పరమగతి గూడ స్వభావము ననుసరించియే యుండును. వీరి వర్ణనము ఈ యధ్యాయము రెండవ-మూడవ-నాలుగవ శ్లోకములలో చేయబడినది.

4. ఎవరైతే శాస్త్రమునంగీకరించరో, ఎవరికి శ్రద్ధలేదో దానిచేత కామ-క్రోధ లోభవశులై తమ పాపపు బ్రతుకు గడపెదరో, అసురీ సంపదగల ఆ మనుష్యులు నరకములలో పడెదరు. నీచ యోనులలో జన్మించెదరు. దాని వర్ణనము భగవద్గీత యేడవ అధ్యాయము పదునైదవ శ్లోకములో, తొమ్మిదవ అధ్యాయము పన్నెండవ శ్లోకములో, పదియారవ అధ్యాయము ఏడవ శ్లోకమునుండి యిరువదవ శ్లోకమువరకు ఈ యధ్యాయము ఐదవ ఆరవ-పదమూడవ శ్లోకములలోనూ గలదు.

శ్రీ భగవానువాచ :

"త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా[1] ।
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు॥" 2

భగవంతుడిట్లనెను :-

"అర్జునా! మనుష్యులకు శాస్త్రీయ సంస్కార రహితమై కేవలము స్వభావము చేతనే కలిగిన శ్రద్ధ సాత్త్విక-రాజస-తామస భేదములచేత మూడు విధములుగా నుండును. ఆ మూడు విధములైన శ్రద్ధను గూర్చి చెప్పెదను వినుము."

"సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత ।
శ్రద్ధామయోఽయం పురుషో యోయచ్ఛ్రద్ధః స ఏవ సః ॥" 3

"భారతా! పురుషులందరికి శ్రద్ధ వారి యంతః కరణమునకు తగినట్లుగా నుండును ఈ పురుషుడు శ్రద్ధామయుడు గాబట్టి ఏ పురుషుడెట్టి శ్రద్ధగలవాడో

---

౬. ఎవరైతే తిరస్కార భావముతో శాస్త్రవిధిని విడిచెదరో, తమకు మంచిదని తోచిన కర్మనే చేసెదరో, శాస్త్ర నిషిద్ధ కర్మలు యథేచ్ఛగా చేయుదురో అట్టి తామస పురుషులకు నరకాది దుర్గతులు కలుగును. మంచి కర్మలు చేయువారు శాస్త్రవిధిని విడుచుట చేత వారికి ఏలాటి ఫలము గూడ లభించదు. వీరి వర్ణనము భగవద్గీత పదియారవ అధ్యాయము ఇరువది మూడవ శ్లోకములో చేయబడినది. వీరు చేయు పాపకర్మల ఫలముగా తిర్యగ్ (పశు పక్ష్యాది) యోని ప్రాప్తి-నరక ప్రాప్తియు తప్పకకలుగును. ఈ యైదు విధములైన మనుష్యుల వర్ణనము నందు ప్రమాణముగా సూచించబడిన శ్లోకములకన్న వేరుగా అనేక శ్లోకములలో గూడ వీరి వర్ణనము గలదు. కాని యిక్కడ ఆ యన్నింటిని ఉల్లేఖించినచో గ్రంథ విస్తారము అధికముగా నగును. గనుక ఉల్లేఖించలేదు.

1. శాస్త్ర శ్రవణ, పఠన, పాఠనాదులచేత గలుగు శ్రద్ధ 'శాస్త్రజ శ్రద్ధ' యనబడును పూర్వజన్మ-ఇహజన్మముల కర్మల సంస్కారముల ననుసరించి కలుగుశ్రద్ధ 'స్వాభావిక శ్రద్ధ' యనబడును.

అతడు స్వయముగా గూడ నతడే యగును.'

సంబంధము-

మనుష్యుని శ్రద్ధ ననుసరించి యతని నిష్ఠ తెలుపబడెను. దీనిచేత ఇట్టి మనుష్యులను ఎవరెటువంటి నిష్ఠ గలవారని గుర్తించుట యెట్లు? అని యిచ్ఛ కలుగుగవచ్చును. దానిపైన భగవంతుడిట్లనుచున్నాడు.

"యజంతే సాత్త్వికా దేవాన్ యక్ష-రక్షాంసి రాజసాః ।
ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే యజంతే తామసా జనాః ॥" 4

"అర్జునా! సాత్త్విక పురుషులు దేవతలును పూజించెదరు.[2] రాజస పురుషులు యక్షరాక్షసులను[3] ఇతర తామస మనుష్యులు ప్రేతములను భూతగణము

---

1. పురుషుని వాస్తవ స్వరూపమైతే గుణాతీతమే కాని, యిక్కడ ప్రకృతి యందుండి, ప్రకృతినుండి ఉత్పన్నములైన త్రిగుణముల సంబంధము గల పురుషుని విషయము చెప్పబడినది. ఎందుకనగా గుణజన్యభేదము ప్రకృతిస్థ పురుషుని యందే సంభవమగును. గుణాతీతునకు గుణభేదము సంభవించునని తెలుపుటకే వీలుపడదు. ఇక్కడ భగవంతుడు తెలుపుచున్నదేమనగా, 'ఎవని యంతఃకరణమునకు తగినట్లుగా ఎటువంటి సాత్త్విక-రాజస-తామస శ్రద్ధయుండునో, అటువంటిదే ఆ పురుషుని యొక్క నిష్ఠ-స్థితి యుండును-అనగా ఎవనికి ఎటువంటి శ్రద్ధయుండునో అదియే అతని స్వరూపము. అని దీనిచేత భగవంతుడు శ్రద్ధా-నిష్ఠా-స్వరూపములకు ఐక్యము చేయుచు అర్జునుడు చేసిన 'వారి నిష్ఠ యెటువంటిది' అని చేసిన ప్రశ్నమునకు ఉత్తరము చెప్పెను.

2. ఇందలి యభిప్రాయమేమనగా దేవతలను పూజించు మనుష్యులు సాత్త్వికులు-సాత్త్విక నిష్ఠ గలవారు. దేవతలనగా నిక్కడ 'సూర్య-చంద్రాగ్ని ఇంద్ర-వరుణ వాయు-యమ-అశ్వినీదేవ-విశ్వేదేవాది శాస్త్రోక్త దేవతలు అని తెలిసికొనవలెను.

3. ఇక్కడ దేవ పూజాకర్మ సాత్త్వికమగుటచేత ఆ పూజాకర్మ చేయువారు

లను[7] పూజించెదరు.

"అశాస్త్ర విహితం ఘోరం తప్యంతే యే తపో జనాః।
దంభాహంకార సంయుక్తాః కామరాగ బలాన్వితాః॥" 5

"అర్జునా! యే మనుష్యులు శాస్త్రవిధిరహితముగా కేవలము తమ మనస్సు చేత కల్పించుకొనిన తపస్సు చేసెదరో దంబము-అహంకారమున్ను గలవారో[2] కామనా-ఆసక్తి బలాభిమానములు గలవారో-

"కర్శయంతః శరీరస్థం భూతగ్రామమ[3] చేతసః।
మాం చైవాంతఃశరీరస్థం తాన్ విద్ధ్యాసురనిశ్చయాన్॥" 6

"అర్జునా! శరీరరూపముతో నున్న భూతసముదాయమును, అంతఃకర

---

సాత్త్వికులని చెప్పెను. కాని సాత్త్విక కర్మలు నిష్కామ భావముతో చేయువాడే పరిపూర్ణముగా సాత్త్వికుడగును.

యక్షశబ్దముచేత కుభేరాదులని, రాక్షస శబ్దముచేత రాహుకేత్వాదులనియు తెలిసికొనవలెను.

1. మరణించిన తరువాత పాపకర్మ వశముచేత భూత ప్రేతాది వాయు ప్రధాన దేహములను పొందినవారు 'భూత-ప్రేత' ములనబడెదరు.

2. అనేక విధాడంబరములచేత శరీరేంద్రియములకు కష్టము కలిగించుచు మహాభయంకర స్వరూపముతో శాస్త్రవిరుద్ధ తపస్సు భయంకరముగా చేయువారికి శ్రద్ధయుండదు. వారు లోకులను మోసగించుటకు, వారిపైన తమ ప్రభావము పడవేయుటకు హఠయోగము చేయుచు సర్వదా-అహంకారములతో బలసియుండెదరు. కనుకనే వారు 'దంభాహంకారయుక్తు' లనబడెదరు.

3. ఐదు మహాభూతములు (పృథివ్యాదులు) మనోబుద్ధ్యహంకారములు పది ఇంద్రియములు-ఐదు యింద్రియ విషయములు ఈ యిరువదిమూడు తత్త్వముల సమూహము 'భూతగ్రామము' అనబడును.

ణము నందున్న పరమాత్ముడనైన నన్ను గూడ ఎవరు కృశింపచేయుదురో[1] అట్టి యజ్ఞానులను నీవు ఆసురీ స్వభావము గలవారని తెలిసికొనుము".

సంబంధము :

మూడు విధములైన స్వాభావిక శ్రద్ధగల వారియొక్క- ఘోరతపస్సు చేయువారి యొక్క-యు లక్షణములు చెప్పి, యిప్పుడు భగవంతుడు సాత్త్వికము లను గ్రహింపజేయు నుద్దేశముతో రాజస తామసములను విడిపించు నుద్దేశము తోను సాత్త్విక-రాజస-తామసములైన 'ఆహార-యజ్ఞ-తపో-దానముల భేదములను వినుమని అర్జునుని ఆజ్ఞాపించుచున్నాడు.

"ఆహారస్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః।
యజ్ఞస్తపస్తథా దానం తేషాం భేదమిమం శృణు॥' 7

"అర్జునా! ఆహారము గూడ అందరికిన్ని వారి వారి ప్రకృతి ననుసరించి మూడువిధములైనవి ప్రియమగును. అంటే యజ్ఞ-తపో-దానములుగూడ మూడు మూడు విధములుగా నుండును.[2]

వారియొక్క- వేర్వేరు భేదములను చెప్పెదను వినుము :-

---

1. శరీరము క్షీణము దుర్బలము చేయుట తాను తన ఆత్మకు గాని యిత రుల ఆత్మకుగాని దుఃఖము గలిగించుట యనునది. 'భూత సముదాయ మును ఆత్మను కృశింపచేయుట యనబడును. ఎందుకనగా అందరి హృదయములో ఆత్మరూపముతో పరమాత్మయే యున్నాడు.

2. మనుష్యుడు తిను ఆహారము ప్రకారమే అతని యంతఃకరణ మేర్పడును. అంతఃకరణమునకు అనురూపముగానే శ్రద్ధ గలుగును. ఆహారము పరి శుద్ధమైనదో పరిణామముగా అంతఃకరణముగూడ పరిశుద్ధమగును. 'ఆహార శుద్ధౌ సత్త్వశుద్ధిః' అని ఛాందోగ్యోపనిషత్తులో గూడ చెప్పబడినది. (ఛాం 7-26-2)అంతఃకరణశుద్ధిచేతనే విచార-భావ-శ్రద్ధాది గుణములు-క్రియలు శుద్ధములగును. కనుకనే ఈ సందర్భములో ఆహారమును గూర్చిన వివే చనము చేసి సాత్త్విక-రాజస-తామసాహారములలో ఏయాహారమెవనికి ప్రియమగునో అతడు ఆ గుణముగలవాడే యగును. అను నభిప్రాయము

"ఆయుః సత్త్వ బలాఽరోగ్య సుఖప్రీతి వివర్ధనాః ।
రస్యాః[1] స్నిగ్ధాః[2] స్థిరా[3] హృద్యా[4] ఆహారాః[5] సాత్త్వికప్రియాః॥"

"అర్జునా! ఆయుస్-బుద్ధి-బల-ఆరోగ్య-ప్రీతి-సుఖములను వృద్ధిపొందించు[6] రసయుక్తములు స్నిగ్ధములు (జిడ్డుగలవి) స్థిరముగా నుండునవి స్వాభావికము గానే మనస్సునకు ప్రియములు నైనవియునగు ఆహారములు అనగా భోజన పదార్థములు సాత్త్విక పురుషులకు ప్రియములగును.

---

భగవంతుడు తెలిపెను. ఈ భావముచేతనే ఈ శ్లోకమునందు 'ప్రియ' శబ్దము చెప్పి విశిష్టముగా సూచించెను. కనుక ఆహారము దృష్ట్యాకూడ వానిని గుర్తింపవచ్చును. ఈ విషయమే యజ్ఞ-దాన-తపో విషయము లలో గూడ తెలిసికొనవలెను.

1. పాలు చక్కెర మొదలైన రసముగల పదార్థములు 'రస్యాః' అనబడును.

2. వెన్న నేయి సాత్త్వికపదార్థములనుండి తీయబడిన నూనె ఈ మొదలగు జిడ్డు వస్తువులు 'స్నిగ్ధాః'అనబడును.

3. చాలాకాలమువరకు శరీరములో స్థిరముగా నిలిచియుండు సారముగలిగి, తేజస్సు కలిగించునట్టి ఆహార పదార్థములు 'స్థిరాః'అనబడును.

4. మురికిగాను, అపవిత్రములుగాను నుండక చూడగనే మనస్సుకు సాత్త్విక రుచి కలిగించు వస్తువులు 'హృద్యాః'అనబడును.

5.6. 'ఆయు'వనగా వయస్సు. జీవితముయొక్క అవధి పెరుగుట ఆయుర్వృద్ధి యనబడును.

'సత్త్వ' మనగా బుద్ధి. బుద్ధి నిర్మలముగా, తీక్ష్ణము (చురుకు)గా, సత్త్వ ముగా, సూక్ష్మములను కనిపెట్టునదిగా నుండుటయే 'సత్త్వవృద్ధి'యన బడును.

'బల' మనగా సత్కార్యములను సఫలముచేయు మానసిక శారీరకశక్తి ఈ అంతర బాహ్యశక్తుల వృద్ధియే 'బలవృద్ధి' యనబడును.

కట్వామ్ల లవణాత్యుష్ణ తీక్ష్ణ రూక్షవిదాహినః ।
ఆహారా రాజసస్యేష్టా దుఃఖ శోకాఽమయప్రదాః॥ 9

అర్జునా! చేదు పులుపు ఉప్పు అధికముగా గలిగి మిక్కిలి ఉష్ణములుగా నుండు, తీక్ష్ణములు, కరకైనవి దాహముగలించునవి దుఃఖ చింతా రోగములు గలిగించునవియునగు ఆహారపదార్థములు[1] రాజస పురుషులకు ప్రియములుగా నుండును.

"యాత యామం[2] గతరసం[3] పూతి[4] పర్యుషితం[5] చ యత్ ।

---

1. వేప, కాకర మొదలైన చేదు పదార్థములు, చింతపండు మొదలైనవి పులుపులు, కారము మొదలైనవి, లవణవస్తువులు ఉప్పులు, మిక్కిలి వేడివేడిగా నున్నవి ఉష్ణములు, మిరప మొదలైన వికారములు, వేగించబడిన వడియములు మొదలైనవి కరకులు గట్టివి, అవాలు మొదలైనవి దాహకరములు.

పైన చెప్పబడిన పదార్థములు తినునపుడు, 'కంఠములో బాధగలుగుట నాలుక దవడలు మొదలైనవి మండుట, దంతములు పులియుట నమలుటలో బాధగలుగుట, కన్నులలో ముక్కులలో నీరుగారుట వెక్కిళ్లు మొదలైనవివచ్చుట'. ఈ మొదలైన కష్టములు గలుగును. అవి దుఃఖములనబడును. తినిన తరువాత గలుగు పశ్చాత్తాపము, 'చింత' యనబడును. తినుటచేత గలిగిన జబ్బులు 'రోగము' లనబడును. ఈ చేదు-పులుపు మొదలైన పదార్థములు తినుటచేత ఈ దుఃఖ-చింతా-రోగములు ఉత్పన్నములగును. కనుక ఇవి 'దుఃఖ-చింతా-రోగములు ఉత్పన్నము చేయునవి', యనబడును. కనుకనే వీనిని విడుచుట ఉచితము.

2,3,4,5 యాత యామమనగా అర్ధపక్వములైన పండ్లు, లేక ఆహారవస్తువులని యెరుగవలెను. సగము పండినపండ్లు-సగము ఉడికిన అన్నాదులు-సగము వేగిన బజ్జీలు ఇత్యాదులు. (యాతయామ శబ్దమునకు, పండిన తరువాత ఒక జాము (3 గంటలు) గడచినపిదప తినవలసినవస్తువు అని కూడా చెప్పవచ్చును.

ఉచ్ఛిష్టమపి[1] చామేధ్యం[2] భోజనం తామసప్రియమ్।" 10

"అర్జునా! సగము పక్వమైనది, రుచిలేనిది, దుర్గంధముగలది చద్దిది, తినగా మిగిలినది లేక యెంగిలిది, అపవిత్రమైనదియునగు భోజనపదార్థము తామస పురుషులకు ప్రియమైనదిగా నుండును".

---

ఈ శ్లోకములోనే 'పర్యుషితమ్' అనగా చలిదియన్నము తామసమని చెప్పబడినది. యాతయామమనగా ఒక జామునకుముందు వండబడినది యని అర్థము చెప్పబడుటచేత అదియే తామసమైనప్పుడు 'పర్యుషితమ్' తామస మనుటలో అర్థముండదు గనుక ఇక్కడ యాతయామ శబ్దమునకు అర్ధ పక్వము యని చెప్పబడినది.

అగ్ని సెగ సోకుటచేత ఏవిధమైన వేడిమిచేత, గాలిచేత, ఋతువు గడచినందుచేతగాని, రసముగల వస్తువులలోని రసము ఎండిపోయి యుండినయెడల (నిమ్మ, కమలా మొదలైన పండ్లు చెరకు ఇత్యాదులు) అవి గతరసములు అనబడును.

పూర్వదినము వండబడిన ఆహార వస్తువు 'పర్యుషితము' అనగా చలిది యనబడును. చాల కాలము క్రింద కోయబడిన పండ్లుకూడ చలివే.

1. తానుగాని, యితరులుగాని తినగా మిగిలిన వస్తువు 'ఉచ్ఛిష్ట'మనబడును. ఎంగిలిగూడ ఉచ్ఛిష్ట మనెదరు.

2. స్వాభావికముగానే అపవిత్రములైన మాంసము-గ్రుడ్లు మొదలైన హింసామయములు. సారా-కల్లు మొదలైన నిషిద్ధములగు మత్తుపదార్థములుగాని లేక సంగదోషముచేత అపవిత్రములైన వస్తువులు-స్థానములు-పాత్రములు-వ్యక్తులు, ఈ మొదలైన వాని సంబంధముచేత లేక ఇతరకారణములచేత, అధర్మముచేతను సంపాదింపబడిన, చెడుధనముచేత పొందినందుచేత అపవిత్రములైనవస్తువులు 'అమేధ్యములనబడును' ఇట్టి వస్తువులు దేవపూజకు గూడ నిషిద్ధములు. ఇవియేకాక, గంజాయి, భంగు, నల్లమందు, పొగాకు సిగరేట్లు, బీడీలు, కల్లు, సారా మొదలైనవి అపవిత్రములైన మందులు ఇవి యన్నియు తమోగుణమును గలిగించును కనుక ఇవి అపవిత్రముల లనబడును.

"అఫలాఽకాంక్షి[1] భిర్యజ్ఞో[2] విధిదృష్టో య ఇజ్యతే ।
యష్టవ్యమేవేతి మనః సమాధాయ స సాత్త్వికః[3] ॥" 11

"అర్జునా! శాస్త్రవిధిచేత నియమింపబడిన యజ్ఞము చేయుటయే తన కర్తవ్యము, అని మనస్సును సమాధాన పరచుకొని, ఫలాపేక్షలేని పురుషులచేత చేయబడు యజ్ఞము 'సాత్త్వికయజ్ఞ'మనబడును.

---

గమనిక:- ఇది 8వ శ్లోకమునకు చెందినది.

మానసిక శారీరక రోగములు నష్టములగుటయే 'ఆరోగ్య' మనబడును.

హృదయ సంతోషము-బుద్ధి ప్రసన్నత్వము-పుష్టి-ముఖాది శరీరాంగములందు, శుద్ధభావమువలన గలిగిన ఆనందచిహ్నములు ప్రకటితములగుట, ఇవి యన్నియు వృద్ధిజెందుటయే 'సుఖవృద్ధి' యనబడును.

చిత్తవృత్తిలో ప్రేమభావము గలిగియుండుట శరీరమునందు ప్రీతికర చిహ్నములు ప్రకటితములగుట ఇవియే 'ప్రీతివృద్ధి' యనబడును.

1. యజ్ఞములుచేయువారు ఆ యజ్ఞములద్వారా భార్యా, పుత్ర, ధన, గృహ, అభిమాన, గౌరవ, ప్రతిష్ఠా, విజయములు లేక స్వర్గాది ప్రాప్తి అన్నివిధములైన అనిష్టముల నివృత్తి ఇహపరలోకములందలి సర్వవిధ సుఖభోగములు లేక దుఃఖ నివృత్తి ఈ మొదలైన వానియందు కొంచెముగూర ఇచ్ఛ పడకుండుటయే 'అఫలాకాంక్షిభిః'అను పదమునకు అర్థము.

2. దేవతాదులను ఉద్దేశించి ఘృతాదులచేత అగ్నియందు హోమముచేయుట లేక యితర విధములచేత ఏవస్తువునైనను సమర్పించి యెవరికైనను యోగ్యతానుసారముగా పూజచేయుట 'యజ్ఞము'అనబడును.

3. వారి వారి వర్ణాశ్రమములననుసరించి, యెవరికి ఏ యజ్ఞములు శాస్త్రములలో విధింపబడినవో ఆ యజ్ఞములు తప్పక అనుష్ఠించవలెను. ఇటువంటి శాస్త్రవిహిత కర్తవ్యములైన యజ్ఞములను అనుష్ఠించకుండుట భగవంతుని ఆజ్ఞను ఉల్లంఘించుటయగును. ఈ విధముగా యజ్ఞములుచేయుట కొరకు మనస్సులో దృఢముగా నిశ్చయించుకొని నిష్కామ భావముతో చేయబడు యజ్ఞమే 'సాత్త్వికయజ్ఞ'మనబడును.

పైన చెప్పబడిన ఆయుస్ - బుద్ధి - బలాదులను పెంచు పాలు, నేయి, కూరలు, ఫలములు, చక్కెర, గోధుమలు, యవలు, సెనగలు, పెసలు, బియ్యము ఇత్యాదులు సాత్త్వికాహారములు. ఈ యన్నిటిని వివరించి తెలుపుటకే ఈ ఆహార లక్షణము చెప్పబడినది.

"అభిసంధాయ తు ఫలం దంభార్థమపి చైవ యత్।
ఇజ్యతే భరత శ్రేష్ఠ తం యజ్ఞం విద్ధి రాజసమ్ ॥" 12

కాని అర్జునా! కేవలము దంభాచారము కొరకు లేక ఫలమునే దృష్టిలో నుంచుకొని చేయబడు యజ్ఞము రాజసమని నీవు తెలుసుకొనుము.[1]

"విధిహీన[2] మసృష్టాన్నం[3] మంత్రహీనమదక్షిణమ్।
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే॥" 13

"అర్జునా! శాస్త్ర విధిహీనముగా అన్నదాన రహితముగా, మంత్రహీనముగా దక్షిణ లేనిదిగా శ్రద్ధారహితముగాను చేయబడు యజ్ఞము తామసయజ్ఞ మనబడును.

**సంబంధము:-**

ఈ విధముగా మూడు విధములైన యజ్ఞముల లక్షణములు తెలిపి

---

1. ఫలప్రాప్తి యుద్దేశముతో చేయబడిన యజ్ఞము శాస్త్రవిహితముగా శ్రద్ధాపూర్వకముగాను చేయబడినదైనను అది రాజసమే యగును. దంభముతో చేయబడినది గూడ రాజసమే. ఇట్లుండగా ఈ రెండు దోషములు గల యజ్ఞము రాజసమని వేరుగా చెప్పవలసినదేమున్నది?

2. శాస్త్ర విహితము కానిది, శాస్త్రవిధుల ఆనంపూర్ణత్వముతో చేయబడినది లేక శాస్త్రోక్త విధానములను తిరస్కరించి, పరిహసించి నిందించి ఇష్టము వచ్చిన విధముగా చేయబడునదియు నగు యజ్ఞము 'విధిహీన' మనబడును.

3. శాస్త్రోక్త మంత్ర రహితము-మంత్ర ప్రయోగమే లేనిది- లేక విధివత్తు కానిది లేక తిరస్కారాదులచేత లోపసహితమునగు విధమున చేయబడిన యజ్ఞము 'మంత్రహీన' మనబడును.

ఇప్పుడు భగవంతుడు తపస్సు ప్రకరణము నారంభించుచు నాలుగు శ్లోకముల చేత సాత్త్విక తపస్సు లక్షణము తెలుపుచున్నాడు.

"దేవ ద్విజగురు ప్రాజ్ఞ పూజనం[1] శౌచమార్జవమ్ ।
బ్రహ్మచర్యమహింసా చ శారీరం తప ఉచ్యతే॥" 14

"అర్జునా! దేవ-బ్రాహ్మణ-గురు-జ్ఞానవంతులను పూజించుట పవిత్రత్వము[2]

---

1. ఏ బ్రహ్మ, రుద్ర, సూర్య, చంద్ర, దుర్గ, అగ్ని, వరుణ, యమ ఇంద్రాది శాస్త్రోక్త దేవతల పూజావిధానము శాస్త్రములలో విధింపబడి నదో వారందరున్ను ఇక్కడ 'దేవ' శబ్దముచేత చెప్పబడెదరు. 'ద్విజ' శబ్దముచేత బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు త్రైవర్ణికులు చెప్పబడినను, ఇక్కడ కేవలము బ్రాహ్మణులనియే అర్థము. ఎందుకనగా శాస్త్రము ననుసరించి బ్రాహ్మణుడే అందరికిన్ని పూజ్యుడు. ఇక్కడ 'గురు' శబ్దమునకు తల్లి, తండ్రి, ఆచార్యుడు, వృద్ధులు వర్ణాశ్రమములలోగాని లేక వయస్సులోగాని పెద్దవారుఅని యర్థము. 'ప్రాజ్ఞ' అను శబ్దమునకు ఇక్కడ పరమేశ్వర స్వరూపమును పూర్తిగా తెలుసుకొనిన మహాత్ములైన జ్ఞానులని యర్థము. వీరందరికి వారివారి యోగ్యతననుసరించి ఆదర సత్కారములు చేయుట, నమస్కరించుట, సాష్టాంగప్రణామము చేయుట, కాళ్ళు కడుగుట, చందన, పుష్ప, ధూప నైవేద్యాదులు సమర్పించుట, యోగ్యతానుసారముగా సేవాదులు చేయుట, సుఖము కలిగించుట, మొద లైనవి వారిని పూజించుట యనబడును.

2. ఇక్కడ పవిత్రత్వమనగా కేవలము శారీరక శౌచమని యే యర్థము. ఎందుకనగా వాక్శుద్ధి వర్ణనము ఈ తరువాతి పదునైదవ శ్లోకములో మనశ్శుద్ధి వర్ణనము పదియారవ శ్లోకములోను వేరుగా వర్ణింపబడినవి. జల మృత్తికాదులచేత శరీరమును స్వచ్ఛముగా పవిత్రముగానుంచుట శరీరసంబంధి చేష్టలన్నియు ఉత్తమముగా చేయుటయే శరీర పవిత్రత్వ మనబడును.

సరళత్వము[1], బ్రహ్మచర్యము[2], అహింస[3], ఇవి శరీర సంబంధముగల తపస్సు అని చెప్పబడును.[4]

"అను ద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్ ।
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే[5] ॥ 15

---

1. 'సరళ' త్వమనగా శరీరము బిగించుకొని, ఇటునటు త్రిప్పుకొనుచు, వక్రముగా కూర్చునుటను విడుచుట సరళత్వ మనబడును.

2. బ్రహ్మచర్య శబ్దమునకు, శారీరకములైన సర్వవిధ మైథునములను త్యజించి పూర్తిగా వీర్యధారణము చేయుట యని యర్థము.

3. అహింస యనగా శరీరముచేత ఏ ప్రాణికి గూడ ఏ విధమైన కష్టమును కొంచెము గూడ కలిగింపకుండుట యని భావము.

4. పైన చెప్పబడిన కర్మలు చేయుటలో శరీరమునకు ప్రాధాన్యము కలదు. అనగా ఈ కర్మలలో శరీరమునకు విశేష సంబంధము గలదు. ఇవి ఇంద్రియములను శరీరమును వాని దోషములన్నిటిని వశింపచేసి పవిత్రములు చేయును. కనుక ఈ కర్మలన్నియు శారీరక తపస్సు అన బడును.

5. ఎవరి మనస్సు లోను కొంచెము గూడ ఉద్వేగము కలిగించక నిందలు చేయుట, కొండెము చెప్పుట ఈ మొదలగు దోషములు ఏ మాత్రము లేకుండు మాట 'అనుద్వేగకర' మనబడును. తాను చూచినట్లు, వినినట్లు, అనుభవించినట్లు సరిగా ఉన్నదున్నట్లుగా, ఇతరులకు చెప్పబడు మాట 'సత్య' మనబడును. వినువారికి ప్రియముగా కటుత్వ, తీక్ష్ణత్వ, రూక్షత్వ, అసమాన భావములు లేకుండ ఇతర వాగ్దోషము లేవియు లేకుండ ప్రేమలో, మధురముగా, సరళముగా, శాంతముగా నున్న వచనములు ప్రియములనబడును. పరిణామమునందు హితకరముగా పూర్తిగా హింసా ద్వేష, వైరాగ్య శూన్యములు ప్రేమ దయ శుభ పరిపూర్ణములు నగు మాటలు 'హితము' లనబడును పైన చెప్పబడిన యన్ని గుణములు గలిగి శాస్త్రములందు వర్ణింపబడిన సర్వ విధ వాగ్దోషములు లేవి వాక్యోచ్చారణము 'వాచిక తపస్సు' అనబడును.

"అర్జునా! ఉద్వేగము గలిగించనిది, ప్రియము, హితకరము యథార్థము మాట్లాడుట వేదశాస్త్రములు చదువుట, పరమేశ్వరుని నామములు జపించుట, ఇవి అభ్యసించుటయే వాక్కునకు సంబంధించిన తపస్సు అని చెప్పబడును.

"మనః ప్రసాదః[1] సౌమ్యత్వం[2] మౌనమాత్మవినిగ్రహః[4] ।
భావసంశుద్ధి[5] రిత్యేతత్ తపోమానసముచ్యతే ॥ 16

"అర్జునా! మనస్సుయొక్క ప్రసన్నత్వము, శాంతభావము, భగవచ్చింతనము చేయు స్వభావము మనో నిగ్రహము అంతఃకరణ భావములయొక్క పరిపూర్ణ పవిత్రత్వము-ఇటువంటి వన్నియు 'మానస తపస్సు' అనబడును.

"శ్రద్ధయా పరయా తప్తం తపస్తత్త్రివిధం నరైః।

---

1. భయ-చింతా-శోక-వ్యాకులత్వ-ఉద్వేగాది దోషరహితమై సాత్త్విక ప్రసన్నత్వ-హర్ష-జ్ఞానశక్తి యుక్తమగుట మనః ప్రసాద మనబడును.

2. రూక్షత్వ-దాహ-హింసా-ప్రతిహింసా-క్రూరత్వ-నిర్దయత్వాది సంతాపకర దోష శూన్యమై మనస్సు సర్వదా శాంతముగా చల్లగాను నుండుటయే 'సౌమ్యత్వ' మనబడును.

3. మనస్సు నిరంతరము భగవద్గుణ ప్రభావ-తత్త్వ-స్వరూప లీలా విలాస నామాది చింతనము నందు లేక బ్రహ్మ విచారము నందుండుట 'మౌన' మనబడును.

4. అంతః కరణమునందు చంచలత్వము పూర్తిగా నశించి అది స్థిరముగా బాగుగాను తన వశములో నుండుటయే 'ఆత్మనిగ్రహ' మనబడును,

5. అంతఃకరణమునందు రాగ-ద్వేష, కామ, క్రోధ, లోభ, మోహమును మాత్సర్య-ఈర్ష్యా ద్వేష-ఘృణా (రోత) తిరస్కార, అసూయా అసహిష్ణుత్వ ప్రమాద (పొరపాటు) వర్ణవిచార, ఇష్టవిరోధ, అనిష్ట చింతనాది దుర్భావములు పూర్తిగా నష్టమగుట. ఈ గుణములకు విరోధులైన దయా, క్షమా, (ఓర్పు) ప్రేమ వినయాది సమస్త సద్భావములు సర్వదా వికసితములై యుండుట, 'భావ సంశుద్ధి' యనబడును.

అఫలాఽఽకాంక్షిభిర్యుక్తైః[1] సాత్త్వికం పరిచక్షతే॥" 17

"అర్జునా! ఫలము కోరని యోగిజనముచేత మిక్కిలి శ్రద్ధతో చేయ బడిన[2] పూర్వోక్తతపస్సులు 'సాత్త్విక తపస్సులు'[3] అనబడును.

సంబంధము :-

ఇప్పుడు రాజస తపస్సు యొక్క లక్షణములు తెలుపబడుచున్నవి.

---

1 ఇహపరలోకముల సుఖభోగములు దుఃఖనివృత్తి రూపములు ఇవియేనియు నెప్పుడున్ను కొంచమైనను, ఏ కారణముచేత గూడ కోరకుండువాడు 'అఫలాకాంక్షి' అనబడును. మనోబుద్ధీంద్రియములు ఆసక్తిలేనివై, నిగ్రహింపబడి శుద్ధములై యుండుటచేత ఎప్పుడున్ను ఏ విధములైన సుఖభోగముల సంబంధముచేత చలించకుండ పూర్తిగా ఆసక్తి లేనివాడు 'యుక్తుడు' అనబడును. పైన చెప్పబడిన మూడు విధములైన తపస్సు నిష్కామ పురుషులచేత చేయబడినప్పుడే అతడు పరిపూర్ణముగా సాత్త్వికు డగును.

2. శాస్త్రములో పైన చెప్పబడిన తపస్సులకు తెలుపబడిన మహత్వ-స్వరూప ప్రభావములన్నిటి పైన ప్రత్యక్షము కంటే ఎక్కువగా సమ్మానపూర్వక మైన పరిపూర్ణ విశ్వాసము కలుగుట 'పరమశ్రద్ధ' యనబడును. ఇట్టి శ్రద్ధతో గూడినవారై మహా మహా విఘ్నములను లేక కష్టములను ఏ మాత్రము లెక్కచేయక సర్వదా చలించకుండుచు మిక్కిలి ఆదర ఉత్సాహ పూర్వకముగా పైన చెప్పబడిన తపస్సులను ఆచరించుచుండు టయే ఆ తపస్సులు పరమశ్రద్ధతో చేయుట యనబడును.

3. ఇచటలి యభిప్రాయమేమనగా పైనచెప్పబడిన శరీర-వాక్ మనః సంబంధము గల తపస్సులే సాత్త్వికములు కాగలవు. దీనితో పాటే తెలిపిన దేమనగా ఈ మూడు తపస్సులు పూర్తిగా సాత్త్వికములైనను, ఈ శ్లోక ములో చెప్పబడిన భావముతో అవి చేయబబడినప్పుడే పరిపూర్ణముగా సాత్త్వికములు కాగలవు. అని

"సత్కార మాన పూజార్థం తపోదంభేన[1] చైవ యత్ ।
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చలమ[2]ధ్రువమ్ ॥" 18

"అర్జునా! సత్కార-గౌరవ పూజాదుల కొరకు, ఏదైన యితర స్వార్థము కొరకు గూడ[3] స్వభావముచేత లేక, పాషండత్వముచేత చేయబడు తపస్సు, అనిశ్చితము క్షణికము నైన ఫలము నిచ్చునది. గనుక అది 'రాజసము' అన బడును.

సంబంధము :

ఇప్పుడు తామస తపస్సు యొక్క లక్షణములను భగవంతుడు చెప్పు చున్నాడు. అవి సర్వదా విడువదగినవి.

---

1. వాస్తవముగా తపస్సు నందు ఆస్థ (శ్రద్ధ) లేకున్నను లోకులను మోస గించి తన స్వార్థము నేవిధముగనైన సిద్ధింపజేసికొనుటకు తపస్వి వలె నటించుచు ఏదైన లౌకిక-శాస్త్రీయ తపస్సు బాహ్యముగా చూపించుటకు మాత్రమే ఆచరింపబడునది దంభముతో తపస్సుచేయుట యనబడును.

2. ఏ ఫలప్రాప్తి కొరకు ఆ తపస్సు చేయబడుచున్నదో ఆ ఫలము లభిం చుట నిశ్చితము గాదు. అది సంశయాస్పదము కనుక అది 'అధ్రువ' మనబడును. ఏదైన ఫలము లభించినను అది సర్వదా స్థిరముగా నుండు నది కాదు. అది నిశ్చయముగా నశించునదియే కనుక అది 'చల' మన బడును.

3. ఇతడు చాల గొప్ప తపస్వి. ఇతనికి సమానుడెవడున్నాడు. ఇతడు చాల శ్రేష్ఠుడు అను గొప్పతనము గౌరవము ప్రపంచములో అతవి తపస్సు యొక్క ప్రసిద్ధిచేత కలుగును. అది 'సత్కార' మనబడును. తపస్వికి స్వాగతం చెప్పి యెదుట నిలిచి ప్రణామముచేసి అభినందన పత్రము సమర్పించి ఇటువంటివే యైన ఇతర కార్యములద్వారా అతనికి ఆదరము చేసి గౌరవించుట 'మాన' మనబడును. అతనికి ఆరతి యిచ్చి, కాళ్ళు కడిగి పత్ర పుష్పాలతో షోడశోపచారములతో పూజ చేసి ఆయన ఆజ్ఞను పాలించి గౌరవించుట ఈ మొదలైన వానిపేరు 'పూజ' యనబడును.

"మూఢగ్రాహేణాత్మనో[1] యత్పీడయాక్రియతే తపః ।
పరస్యోత్సాదనార్థం వా తత్తామస ముదాహృతమ్ ॥" 19

"అర్జునా! మూర్ఖత్వముతో పట్టుదలతోను మనోవాక్ శరీరములకు పీడ గలిగించునది లేక యితరులకు కీడు గలిగించుటకొరకు గాని చేయబడు తపస్సు తామస తపస్సు అనబడును.

---

ఈ యన్నిటి కొరకు ఆచరించబడు లౌకిక-శాస్త్రీయ తపస్సులే సత్కార మాన పూజలకొరకు తపస్సు చేయుట యగును ఇదిగాక ఏదైన ఇతర స్వార్థ సిద్ధికొరకు చేయబడు తపస్సు గూడ 'రాజస' మనబడును-

1. తపస్సు యొక్క వాస్తవ లక్షణము నెరుగక యేదొఒక కర్మ తపస్సనుకుని అది చేయుటకు హఠము లేక దురాగ్రహము గలిగియుండుట 'మూఢగ్రాహ' మనబడును, ఏ తపస్సు ఈ యధ్యాయము ఐదవ ఆరవ శ్లోకములలో వర్ణింపబడినదో ఏది అశాస్త్రీయము మనః కల్పితము-ఘోరము స్వాభావికము గనే తామసమో దేనిని దంభము యొక్క ప్రేరణచేత లేదా అజ్ఞానము చేత తన కాళ్ళను చెట్టుకొమ్మలకు భిగించి తలక్రిందుగా వ్రేలాడజేయుట ఇనుపముండ్లమీద కూర్చునుట ఇటువంటి వే వివిధ క్రియలు చేసి చెడు తలంపుతో అనగా ఇతరుల సంపద హరించుటకు వారి వంశము నిర్మూలనము చేయుటకు లేదా వారికి ఏదోవిధముగా నేదోయొక కీడు చేయుటకు మనో-వాక్-శరీరములను తపింపజేయుట 'తామస తపస్సు' అనబడును.

వర్ణాశ్రమములు-వయస్సు-పరిస్థితి వీని ననుసరించి శాస్త్ర విహిత దానము చేయుట-అనగా తన స్వత్వమును ఇతరుల హితము కొరకు వ్యయము చేయుట మనుష్యుని కర్తవ్యము. అతడట్లు చేయని యెడల మానవత్వము నుండి దిగజారిపోవును. భగవంతుని శ్రేయస్కరమైన ఆదేశము అనాదరించుట యగును. కనుక ఇట్టి ఇహపరలోకముల ఫలములు కొంచెము గూడ అపేక్షించక కర్తవ్యబుద్ధితో చేయబడు దానమే 'పరిపూర్ణసాత్త్విక' మనబడును.

సంబంధము :-

త్రివిధ తపస్సుల లక్షణములు చెప్పి యిప్పుడు దానముయొక్క త్రివిధ లక్షణములు భగవంతుడు చెప్పుచున్నాడు.

"దాతవ్యమితి యద్దానం దీయతేఽనుప కారిణే।
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్॥" 20

"అర్జునా! దానము చేయుటయే కర్తవ్యము[1] అను నభిప్రాయము చేత దేశము-కాలము[2] పాత్రములు లభించినప్పుడు[3] తనకు ఉపకారము చేయనివారికి

---

1. ఏ దేశములో, ఏ కాలములో, ఏ వస్తువు ఆవశ్యకమో ఆ వస్తువు అందరికిన్ని వారి వారి యోగ్యతానుసారముగా సుఖము కలిగించుటకు దానము చేయుటకు అదియే యోగ్యమైన దేశము కాలము నగును. ఇదిగాక కురుక్షేత్ర-హరిద్వార-మథురా-కాశీ-ప్రయాగ నైమిశారణ్యాది పుణ్యక్షేత్రములు గ్రహణ-పూర్ణిమా-అమావాస్యా సంక్రాంతి. ఏకాదశ్యాది పుణ్యకాలములు దానము కొరకు ప్రశస్తములని తలచబడినది.

2. ఎవని వద్ద-ఎక్కడ-ఎప్పుడు ఏ వస్తువులేదో అతడు అక్కడ అప్పుడు ఆ వస్తువును దానము పొందుటకు అర్హుడగును. ఎట్లనగా ఆకలి-దప్పి దిగంబరత్వ-రోగ-పీడా-అనాథత్వ-భయాదులచేత బాధపడు ప్రాణులు అన్న-జల-వస్త్రములు జరుగుబాటుకు ధనము-ఔషధము-ఊరడింపు ఆశ్రయము అభయము ఇత్యాదులు పొందుటకు అర్హులు. ఇవిగాక ఉత్తమాచారము గల విద్వాంసులు, బ్రాహ్మణులు, ఉత్తమ బ్రహ్మచారులు-వానప్రస్థులు-సన్న్యాసులు-నియమ వ్రతములు గలవారు గూడా దానార్హులే. ఎవరికి ఏ వస్తువు దానము చేయుట శాస్త్రములో కర్తవ్యమని తెలుపబడెనో వారే వారివారి అధికారముననుసరించి యథాశక్తి ధనాదులైన అన్ని ఆవశ్యక వస్తువుల దానమునకు పాత్రులు.

3. తనకు ఉపకారము చేసిన వారికి సేవ చేయుట తనకు వీలైనంతవరకు అతనికి సుఖము కలిగించుటకు ప్రయత్నించుట మనుష్యుని కర్తవ్యమే యగును. అది దానమని తలచువారు వాస్తవముగా ఉపకారాదులను

ఇవ్వబడు దానము 'సాత్త్వికదానము' అనబడును.[1]

"యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః ।
దీయతే చ పరిక్లిష్టం తద్ దానం రాజసం మతమ్॥" 21

కాని అర్జునా! క్లేశపూర్వకముగా[2], ప్రత్యుపకార ప్రయోజనముచేత[3] లేదా ఫలము దృష్టిలోనుంచుకొని[4] చేయబడు దానము, 'రాజసదాన'మనబడును.

---

తిరస్కరించుచున్నారు. ఉపకారిసేవ చేయగోరనివారు కృతఘ్నుల తర గతిలో చేరెదరు. కనుకనే తనకు ఉపకారము చేసిన వారికి తప్పక సేవ చేయవలెను.

1. ఇక్కడ తనకు ఉపకారము చేయని వారికి దానము చేయు విషయము తెలిపి భగవంతుడు తెలిపిన భావమేమనగా దానము చేయువారు, దానము పొందువారి నుండి దానమునకు బదులుగా ఏ విధమైన ప్రత్యుపకారము కొంచెము గూడ పొందుటకు ఇచ్ఛయించ కుండవలెను. ఎవని నుండి ఏ విధమైన స్వార్థము కొంచెము గూడ ఆశింపబడదో అట్టి మనుష్యునకు ఇవ్వబడు దానము 'సాత్త్విక'మనబడును. దీనిచేత వాస్తవముగా దాతకు స్వార్థ బుద్ధి పూర్తిగా నిషేధింపబడినది.

2. ఎవరైన మొండికిపడి కూర్చొనినపుడు, హఠముచేసినపుడు, భయపెట్టిన పుడు లేదా ఎవరైనా మాననీయులు ప్రభావముగలవారునైన పురుషులు ఒత్తిడిచేసినపుడున్ను, తన యిచ్ఛలేకయున్నను మనస్సులో దుఃఖపడుచు గత్యంతరములేక చేయబడు దానము క్లేశ పూర్వకముగా చేయబడు దానమనబడును.

3. నిరంతరము తన పనికి ఉపయోగపడునట్టిది లేదా భవిషత్తులో తన పని చిన్నదో, పెద్దదో అతనివలన నెరవేరునని భావింపబడునట్టి లేక ఆశింప బడునట్టియు వ్యక్తికిగాని సంస్థకుగాని చేయబడు దానము ప్రత్యుపకార ప్రయోజన దృష్టితో చేయబడు దాన మనబడును.

4. ఇహ-పరలోకములందు అభిమాన-గౌరవ-ప్రతిష్ఠా స్వర్గాది భోగములను

"అదేశకాలే యద్ దానమపాత్రేభ్యశ్చ దీయతే ।
అసత్కృతమవజ్ఞాతం తత్ తామస ముదాహృతమ్॥" 22

"అర్జునా! సత్కారము లేకుండ[1], లేదా తిరస్కార పూర్వకముగా[2] అయోగ్య దేశ కాలములలో[3], అనర్హులకున్ను[4] చేయబడు దానము 'తామసదాన' మనబడును".

---

పొందుటకొరకు లేక రోగాదుల నివృత్తికొరకు ఏవ్యక్తికిగాని, సంస్థకు గాని చేయబడు దానము ఫలోద్దేశముతో చేయబడు దానమనబడును.

4. దానము పుచ్చుకొనువారిని, వారి యోగ్యతననుసరించి అభివాదన.కుశల ప్రశ్న-ప్రియభాషణ-ఆసనాదులద్వారా సమ్మానించకుండ రూక్ష భావ ములో మొగము ముడుచుకొని చేయబడునది 'సత్కారరహిత' దాన మనబడును.

5. నాలుగు తిట్లుతిట్టి, మొగముజెర గద్దించి, చేదుగా మాట్లాడి, మరల ఎప్పుడుగూడ నాగడపత్రొక్కవద్దని గట్టిగాచెప్పి, పరిహసించి లేదా మరి యితర విధముగా, కఠినముగా మాట్లాడి అతనిని తన శరీరావయవము లతో త్రోసి, లేక వెక్కిరించి, అవమానపరిచి చేయబడు దానము 'తిర స్కార పూర్వక దాన' మనబడును.

6. ఏ దేశకాలములందు దానముచేయుట ఆవశ్యకమో లేక ఎక్కడ దానము చేయుటకు శాస్త్రములో నిషేధింపబడినదో, ఆ దేశకాలములు దానము చేయుటకు అనర్హములనబడును.

7. ఏ మనుష్యులకు దానముచేయుట ఆవశ్యకముకాదో ఎవరికి దానముచేయుట శాస్త్రములో నిషేధింపబడినదో, అట్టి ధర్మధ్వజులు(దంభాచారులు-వంచ కులు) వేద బాహ్యులు కపట వేషధారులు హింసకులు - పరనిందకులు, ఇతరుల బ్రతుకుదెరువును భంగపరుచువారు తమ స్వార్థసాధనమునందు తత్పరులు కృత్రిమ వినయము చూపించువారు మద్య-మాంసాదులైన అభక్షణ వస్తువులను తినువారు-దొంగతనము, వ్యభిచారము మొదలైన నీచకర్మలు చేయువారు-మోసగాండ్రు జూదరులు. నాస్తికులు ఈ మొద లైన వారందరున్ను దానమునకు అపాత్రులు (అయోగ్యులు)

"ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధః స్మృతః ।
బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా॥" 23

అర్జునా! ఓం, తత్, సత్ ఈ మూడు విధములైన నామము సచ్చిదానంద ఘన బ్రహ్మమునకు చెప్పబడినది[1]. ఆ బ్రహ్మమునుండియే సృష్ట్యాదికాలములో బ్రాహ్మణులు వేదములు ఉత్పన్నము చేయబడినవి[2].

"తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదాన తపఃక్రియాః ।
ప్రవర్తన్తే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినామ్॥" 24

అర్జునా! ఈ కారణముచేత, వేద మంత్రోచ్చారణముచేయు శ్రేష్ఠ పురుషులచేత శాస్త్రవిధిచేత నియమింపబడిన యజ్ఞదాన తపో రూప క్రియలు సర్వదా 'ఓమ్' అను పరమాత్మనామము ఉచ్చరించియే ఆరంభింపబడుచున్నవి[3].

---

1. సమస్త కర్తలు, కర్మలు - కర్మ విరోధులున్ను ఏ పరమాత్మనుండి ఉత్పన్నులైనారో, ఆ భగవంతుడే ఓం,తత్,సత్ అను పదములకు అర్థము. ఆయనకు ఈ మూడు పేర్లు గలవు. కనుక ఈ మూడింటి ఉచ్చారణాదులచేత ఆ కర్మలన్నింటి అంగ వైగుణ్యము నశించిపోవును. కనుకనే ప్రతి కార్యము యొక్క ఆరంభమునందు పరమేశ్వరుని నామముల ఉచ్చారణము పరమావశ్యకము.

2. ఇక్కడ బ్రాహ్మణ శబ్దమునకు 'బ్రాహ్మణాది సమస్త ప్రజలు 'వేద'శబ్దమునకు నాలుగు వేదములు(ఋగ్వేద-యజుర్వేద-సామవేద-అథర్వవేదములు) యజ్ఞశబ్దమునకు యజ్ఞ-తపోదానాది సమస్త శాస్త్రవిహిత కర్తవ్య కర్మలునని యర్థము.

3. ఏ పరమేశ్వరునినుండి యీ యజ్ఞాదికర్మలు ఉత్పన్నములైనవో ఆ పరమేశ్వరుని నామముగాబట్టి ఓం కారము యొక్క ఉచ్చారణముచేత సమస్త కర్మల అంగవైగుణ్యము దూరమైపోవును. ఆ కర్మలు అప్పుడు పవిత్రములు, శ్రేయోదాయకములు నగును.

ఇది భగవంతుని నామముయొక్క అపారమైన మహిమ. ఈ కారణము

"తదిత్యనభిసన్ధాయ ఫలం యజ్ఞతపః క్రియాః ।
దానక్రియాశ్చ వివిధాః క్రియన్తే మోక్షకాంక్షిభిః ॥" 25

అర్జునా తత్-అనగా 'తత్' అనుపేరుతో చెప్పబడు పరమాత్మనిదే యిది యని ఫలాపేక్ష లేకుండ వివిధ యజ్ఞ తపోరూపక్రియలు, దాన రూప క్రియలు పురుషులు చేయుదురు.[1]

"సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ ప్రయుజ్యతే ।
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే ॥" 26

అర్జునా 'సత్' అనబడు పరమాత్మని యీ నామము సత్య భావమునందు[2] శ్రేష్ఠభావమునందున్ను[3] ప్రయోగింపబడును. ఉత్తమకర్మ యందుగూడ[4] 'సత్' శబ్దము ప్రయోగింపబడును.

---

చేతనే వేదోక్త మంత్రములయొక్క ఉచ్చారణ పూర్వకముగా యజ్ఞాది కర్మలను చేయునధికారము విద్వాంసులైన బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు చేయు యజ్ఞ-తపోదానాదులైన సమస్త శాస్త్రవిహిత శుభకర్మలు సర్వదా ఓం కారోచ్చారణ పూర్వకముగానే ఆరంభింపబడునని తెలియవలెను.

1. విహితకర్మలు చేయు సామాన్య వేదవాదులు ఫలేచ్ఛ, లేక అహంకార-మమకారములు త్యజించరు. కాని వారు శ్రేయస్కాములైన మనుష్యులు. పరమేశ్వర ప్రాప్తి దప్ప, ఏ యితర వస్తువుల ఆవశ్యకత లేనివారు సర్వకర్మలు అహంకార మమకార-ఆసక్తి-ఫలేచ్ఛలను పూర్తిగా విడిచి కర్మలు కేవలము పరమేశ్వరునికొరకే ఆయన ఆజ్ఞానుసారము చేసెదరు.

2. సద్(సత్య)భావమనగా, నిత్యభావము, అనగా సర్వదా అస్తిత్వముగల అవినాశి తత్త్వము. అదియే పరమేశ్వరుని స్వరూపము కనుక, ఆయన 'సత్' అను పేరుతో చెప్పబడును.

3. ఇక్కడ సాధుభావ పదమునకు అంతఃకరణముయొక్క శ్రేష్ఠభావమని యర్థము. అది పరమేశ్వరుని ప్రాప్తికి కారణము కనుక దానికి పరమేశ్వరుని 'సత్'అను పేరు ప్రయోగింపబడును. అది 'సత్కర్మ' యనబడును.

4. శాస్త్రవిహితములైన కర్తవ్య శుభకర్మలు నిష్కామ భావముతో చేయబడి

యజ్ఞే తపసి దానే చ స్థితిః సదితి చోచ్యతే।
కర్మచైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే ॥ 27

అర్జునా! అట్లే యజ్ఞ తపోదానములందలి స్థితిగూడ 'సత్' అని చెప్పబడును.[1] పరమాత్మునికొరకు చేయబడిన కర్మలు నిశ్చయముగా 'సత్' అనియే చెప్పబడును.

సంబంధము:-

శ్రద్ధా పూర్వకముగా చేయబడిన శాస్త్రవిహితములగు యజ్ఞ-తపో-దానాది కర్మల మహత్త్వము ఇక్కడ చెప్పబడెను. అది విని "శాస్త్రవిహితయజ్ఞాదికర్మలు శ్రద్ధలేకుండ ఏవైతే చేయబడునో ఆకర్మల ఫలమేమి? అను జిజ్ఞాసకలుగును. దానికి భగవంతుడు, ఈ యధ్యాయము ఉపసంహరించుచు నిట్లనుచున్నాడు.

"అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్।
అసదిత్యుచ్యతే పార్థ న చ తత్ ప్రేత్య నో ఇహ ॥" 28

అర్జునా! శ్రద్ధా రహితముగా చేయబడిన హోమ-దాన-తపస్సులు మొదలైన శుభకర్మలన్ని 'అసత్' చెప్పబడును. కనుక, అవి యీ లోకములో గాని, మరణానంతరం గాని లాభదాయకములుకావు.[1]

---

నదో, అవి పరమాత్మ ప్రాప్తికి హేతువులగును. కనుక ఆ కర్మకు 'సత్' అను పేరు పెట్టబడినది. అనగా అది 'సత్కర్మ' యనబడును.

1. ఏ కర్మయైనను కేవలము భగవదానుజ్ఞానుసారముగా ఆయన కొరకే చేయబడునో, ఏ కర్మయందు కర్తకు ఏమాత్రము స్వార్థము ఉండదో అట్టి కర్మ, కర్తయొక్క అంతఃకరణమును పరిశుద్ధము చేసి, ఆ కర్తకు పరమేశ్వర ప్రాప్తి కలిగించును. కనుక అది సత్ అనబడును.

దీని తరువాతి విషయము భగవద్గీత మొదటి యధ్యాయము చివర ఈ గుర్తుగల అధోజ్ఞాపికలో నున్నట్లు గ్రహింపవలెను.

ఇతి శ్రీ మహాభారతే భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా పర్వణి
శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణా
ర్జున సంవాదే శ్రద్ధాత్రయ విభాగయోగో నామ సప్తదశోఽధ్యాయః
భీష్మపర్వణి తు ఏకచత్వారింశోఽధ్యాయః

శ్రీమద్భగవద్గీతోపనిషత్తులందు, బ్రహ్మవిద్యయందు, యోగశాస్త్రమునందు,
శ్రీకృష్ణార్జున సంవాదమునందు, శ్రద్ధాత్రయ విభాగయోగ మనబడు
పదునేడవ అధ్యాయము సమాప్తము (17) భీష్మపర్వమునందు
నలువది ఒకటవ అధ్యాయము సమాప్తము.

# శ్రీ మద్భగవద్గీత పదునెనిమిదవ అధ్యాయము

## మోక్ష సన్న్యాస యోగము:-

సంబంధము—

భగవద్గీత రెండవ అధ్యాయము పదకొండవ శ్లోకమునుండి భగవద్గీతోప దేశారంభమైనది. అక్కడినుండి ముప్పది యవ శ్లోకము వరకు భగవంతుడు జ్ఞానయోగము నుద్దేశించి ప్రసంగవశాత్తు క్షాత్ర ధర్మదృష్టితో యుద్ధము చేయుట కర్తవ్యమని ప్రతిపాదించి ముప్పది తొమ్మిదవ శ్లోకమునుండి ఆ అధ్యాయము ముగియువరకు కర్మయోగము నుపదేశించెను. ఆ తరువాత మూడవ అధ్యాయము నుండి పదిహేడవ అధ్యాయమువరకు కొన్నిచోట్ల జ్ఞానయోగ దృష్టితో మరికొన్ని చోట్ల కర్మయోగ దృష్టితోనూ పరమాత్మ ప్రాప్తికొరకు అనేక సాధనములను చెప్పెను. ఆ యన్నిటిని వినిన తదుపరి ఇపుడు అర్జునుడు ఈ పదునెనిమిదవ అధ్యాయంలో అన్ని అధ్యాయములలో ఇంతదాక భగవంతుడు చేసిన ఉపదేశము యొక్క సారమును తెలుసుకొను ఉద్దేశముతో భగవంతుని ఎదుట సంన్యాసము యొక్క-అనగా జ్ఞానయోగము యొక్క త్యాగముయొక్క అనగా ఫలాసక్తి త్యాగరూపమైన కర్మయోగము యొక్కయు, తత్త్వములను పరిపూర్ణముగా బాగుగా విడివిడిగానూ తెలుసుకొను నిచ్ఛను ప్రకటించుచున్నాడు.

అర్జున ఉవాచ:

సంన్యాసస్య మహాబాహో తత్త్వమిచ్ఛామి వేదితుమ్ ।
త్యాగస్య చ హృషీకేశ పృథక్ కేశినిషూదన ॥ 1

అర్జునుడిట్లనెను :-

మహాబాహో! సర్వాంతర్యామీ! వాసుదేవా! నేను సంన్యాసము యొక్క

త్యాగముయొక్కయు తత్త్వమును వేరు వేరుగా తెలిసికొనగోరుచున్నాను.[1]

శ్రీభగవానువాచ :

కామ్యానాం కర్మణాం న్యాసం సంన్యాసం కవయో విదుః ।
సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః ॥ 2

---

1. అర్జునుని ప్రశ్నమునకు అభిప్రాయమేమనగా - సంన్యాసము (జ్ఞాన యోగము) యొక్క స్వరూపమేమి? దానిలో ఏవి భావములున్నవి? ఈ భావములలో ఏవేవి కర్మలకు సహాయకములు - బాధకములునగును? ఉపాసనా సహిత సాంఖ్యయోగము యొక్కయు కేవల సాంఖ్యయోగము యొక్కయు సాధనములే విధములుగా చేయబడును? ఈ విధముగనే త్యాగముయొక్క అనగా-ఫలాసక్తి త్యాగరూప కర్మయోగముయొక్క స్వరూపమేమి? కేవల కర్మయోగ సాధనమెట్లుండును? దీనికొరకు ఏమి చేయుట ఉపయోగకరముగా నుండును? ఏమిచేయుట దీనికి బాధకమగును? భక్తిసహిత కర్మయోగమనగానేది? భక్తి ప్రధాన గుణకర్మయోగమేది? లౌకిక శాస్త్రీయ కర్మలు చేయుచూ భక్తి మిశ్రిత-భక్తి ప్రధాన సాధనములు ఏ విధముగా చేయబడును. ఈ విషయములన్నియు బాగుగా తెలియగోరుచున్నాను.

పై ప్రశ్నములకు ఉత్తరములుగా భగవంతుడు ఈ యధ్యాయము పదమూడవ శ్లోకమునుండి పదియేడవ శ్లోకము వరకు సంన్యాసము (జ్ఞాన యోగము) యొక్క స్వరూపమును తెలిపెను. పందొమ్మిదవ శ్లోకము నుండి నలుపదవ శ్లోకమువరకు తెలుపబడిన సాత్త్విక భావములు-కర్మలు దీని సాధనమునకు ఉపయోగకరములు. రాజస-తామసములు దీనికి విరోధులు, ఏబదవ శ్లోకమునుండి ఏబదిఐదవ శ్లోకమువరకు ఉపాసనా సహిత సాంఖ్యయోగవిధులను-తత్ఫలములను తెలిపెను. పదిఏడవ శ్లోకములో కేవలము సాంఖ్యయోగ సాధనము చేయు విధమును గూర్చి తెలిపెను.

భగవంతు డిట్లనెను :-

అర్జునా! కామ్యకర్మల త్యాగము[1] సంన్యాసమని ఎందరో పండితులు తలచెదరు. కర్మ ఫలత్యాగము త్యాగమని విచారకులైన ఇతరులు చెప్పెదరు.[2]

త్యాజ్యం దోషవదిత్యేకే కర్మప్రాహుర్మనీషిణః ।
యజ్ఞదాన తపః కర్మ న త్యాజ్యమితిచాపరే ॥ 3

---

ఈ విధముగనే ఆరవ శ్లోకములో, ఫలాసక్తి త్యాగరూప కర్మయోగ స్వరూపమును తెలిపెను. తొమ్మిదవ శ్లోకమునందు సాత్త్విక త్యాగమను పేరుతో, కేవలము కర్మయోగ సాధన ప్రణాలిని గూర్చి తెలిపెను. నలుపది ఏడవ-నలుపది ఎనిమిదవ శ్లోకములలో ఈ సాధనమునకు స్వధర్మ పాలనము ఉపయోగకరమని తెలిపెను. ఏడవ ఎనిమిదవ శ్లోకములలో వర్ణింపబడిన రాజస-తామస త్యాగము ఈ సాధనమునకు బాధకమని చెప్పెను. నలుపది ఐదవ-ఆరవ శ్లోకములలో భక్తిమిశ్రిత కర్మయోగము, ఏబదియారవ శ్లోకమునుండి యరువది ఆరవ శ్లోకమువరకు భక్తి ప్రధాన కర్మయోగమును వర్ణింపబడినవి. నలుపదిఆరవ శ్లోకములో సమస్త లౌకిక శాస్త్రీయ కర్మలు చేయుచు భక్తి మిశ్రిత కర్మయోగ సాధనము చేయు రీతిని ఏబదిఏడవ శ్లోకములో భగవంతుడు భక్తి ప్రధాన కర్మయోగ సాధనము చేయు పద్ధతిని గూర్చి తెలిపెను.

1. భార్యాపుత్ర-ధన-స్వర్గాదులైన ప్రియవస్తువులనుపొందుటకు రోగ-సంకటాదులైన అప్రియముల నివృత్తి కొరకున్ను యజ్ఞ-తపోదానోపాసనాది శుభకర్మలు 'కామ్యకర్మ' లనబడును.

2. శాస్త్ర విహిత కర్తవ్య కర్మలైన పరమేశ్వర భక్తి దేవతాపూజ, మాతాపితాది గురువులసేవ, యజ్ఞదాన తపస్సులు, వర్ణాశ్రమానుసారముగా బ్రతుకు దెరువుకుగానూ చేయబడు కర్మలు శరీరమునకు సంబంధించిన అన్నపానీయాది శాస్త్రవిహిత కర్తవ్య కర్మలన్నింటిని అనుష్ఠించుటచేత పొందబోవు భార్యా-పుత్ర-ధన-గౌరవ-అభిమాన-ప్రతిష్ఠా-స్వర్గసుఖాదులైన ఇహ-పరలోక భోగములన్నింటి కోరకను పూర్తిగా విడుచుటయే, 'సర్వకర్మ ఫలత్యాగము చేయుట' అనబడును.

అర్జునా! కర్మలే దోషయుక్తములు కనుక, అవి విడువదగినవి. అని ఎందరో విద్వాంసులు చెప్పెదరు.[1] మరికొందరు విద్వాంసులు యజ్ఞ-దాన-తపో రూపకర్మలు విడువదగినవి కావు.[2] అని చెప్పెదరు.

సంబంధము:-

ఈ విధముగా సంన్యాసము-త్యాగము విషయములో విద్వాంసులు వేర్వేరుగా చెప్పిన అభిప్రాయములను తెలిపి యిపుడు భగవంతుడు త్యాగము విషయమై తన నిశ్చయము తెలుపుటకు అరంభించుచున్నాడు.

నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ ।
త్యాగో హి పురుషవ్యాఘ్ర! త్రివిధః సంప్రకీర్తితః ॥ 4

భరతశ్రేష్ఠ! అర్జునా! సంన్యాస త్యాగములు రెంటిలో తొలుత త్యాగము విషయమై నీవు నా నిశ్చయము వినుము. ఎందుకనగా త్యాగము సాత్త్విక రాజస తామసములని మూడు విధములుగా చెప్పబడినది.

యజ్ఞదాన తపః కర్మ న త్యాజ్యం కార్యమేవతత్ ।
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్[3] ॥ 5

---

1. కర్మలకు ఏదో ఒక పాప సంబంధముండును కనుక, విహిత కర్మలు గూడా పూర్తిగా నిర్దోషములు కావు అని ఎందరో విద్వాంసులు చెప్పెదరు. ఇట్టి భావములోనే వారు శ్రేయస్సు కోరు మనుష్యుడు నిత్యనైమిత్తిక కామ్యాది కర్మలన్నియు విడువవలెనని చెప్పెదరు.

2. అనేక విద్వాంసులు యజ్ఞ దాన తపో రూపకర్మలు వాస్తవముగా దుష్టములు కావు. ఆ కర్మల నిమిత్తమే చేయబడు ప్రయత్నంలో హింసాది పాపములు అవశ్యముగా జరుగుచుండుట కలదు. అవి పాపములు కావు. అని చెప్పెదరు కనుక శ్రేయస్సు కోరు మనుష్యుడు నిషిద్ధ కర్మతే విడువవలెను. శాస్త్ర విహిత కర్తవ్య కర్మలను విడువకూడదు.

3. శాస్త్రవిధిననుసరించి కర్మలు అంగోపాంగ సహితముగా నిష్కామభావముతో

అర్జునా! యజ్ఞ దాన తపరూపమైన కర్మలు విడువదగినవి కావు సరికదా అవి అవశ్యముగా చేయబడవలసినవి.[1] ఎందుకనగా యజ్ఞ దాన-తపస్సులు మూడు కర్మలే బుద్ధిమంతులైన పురుషులను పవిత్రులను చేయునవి.[2]

---

బాగుగా అనుష్ఠించు బుద్ధిమంతులైన పురుషులనిమిక్కడ 'మనీషిణామ్' అను పదముచేత నిర్దేశించిరి.

1. వారివారి వర్ణాశ్రమానుసారము ఎవరికి ఏ కర్మ శాస్త్రములలో విధింపబడినదో ఎవడు ఎప్పుడు ఎట్టి యజ్ఞదాన-తపస్సులు చేయుటకు చెప్పబడెనో అతడు దానిని విడువగూడదు. అనగా శాస్త్రము యొక్క ఆజ్ఞను తిరస్కరించకూడదు. ఎందుకనగా ఇట్టి త్యాగముచేత ఎలాంటి లాభము కలుగదు సరిగదా పెచ్చు ప్రత్యవాయము (పాపం) కలుగును. కనుక ఆ కర్మలు తప్పక చేయవలెను.

2. ఇట్లు భగవంతుడు చెప్పుటలో అభిప్రాయమేమనగా "విద్వాంసుల అభిప్రాయానుసారము పైన చెప్పబడిన త్యాగ-సంన్యాసముల లక్షణములు సమగ్రములు కావు ఎందుకనగా కామ్యకర్మలను మాత్రమే పూర్తిగా, త్యజించిననూ ఇతర నిత్యనైమిత్తికకర్మలందు తత్ఫలమందున్న మనుష్యునకు మమకార-ఆసక్తి కామనలుండుటచేత అవిబంధన హేతువులగును. సర్వకర్మల ఫలత్యాగము చేసినప్పటికిన్ని, ఆ కర్మలందు మమకార ఆసక్తులుండుటచేత నవిబంధన కారకములు కాగలవు. అహంకార-మమకార-ఆసక్తి-కామనలు విడువక కర్మలన్నియు దోషయుక్తములని కర్తవ్య కర్మలు గూడ పూర్తిగా విడిచినచో మనుష్యుడు కర్మబంధనము నుండి విముక్తుడు కాజాలడు. ఎందుకనగా ఇట్లు చేసినప్పుడతడు విహిత కర్మలు విడుచుటవలన పాపము పొందును. ఇట్లే యజ్ఞ-దాన-తపోరూపక కర్మలు చేయుచున్నను, ఆ కర్మలందాసక్తి-కర్మఫలేచ్ఛ విడువనియెడల ఆ కర్మలు బంధహేతువులగును. కనుక ఈ విద్వాంసులు తెలిపిన లక్షణములు గల సంన్యాసము త్యాగము ఈ రెంటిచేత మనుష్యుడు కర్మబంధనమునుండి పూర్తిగా విముక్తుడు కాజాలడు. ఎందుకనగా కర్మలు పూర్తిగా బంధన కారకములు కావు. వానితోపాటు మమకార-ఆసక్తి-ఫల

ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ
కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మతముత్తమమ్ ॥ 6

కనుక అర్జునా! ఈ యజ్ఞ దాన తపో రూపకర్మలను అన్ని కర్తవ్య కర్మలనున్ను ఆసక్తి ఫలములను విడిచి తప్పక అనుష్ఠించవలెనని నిశ్చితమైన నా యభిప్రాయము.

సంబంధము :

ఇప్పుడు మూడు శ్లోకములలో ముందుగా పైన చెప్పబడిన మూడువిధము లైన త్యాగముల లక్షణములను భగవంతుడు చెప్పుచున్నాడు.

నియతస్య తు సంన్యాసః కర్మణో నోపపద్యతే ।
మోహాత్ తస్య పరిత్యాగః తామసః పరికీర్తితః॥ 7

అర్జునా నిషిద్ధములు కామ్యములైన కర్మలను పూర్తిగా విడుచుట ఉచితమే యగును. కాని నియత కర్మలను పూర్తిగా త్యాగము చేయుట ఉచితముకాదు[1] కాబట్టి మోహముచేత దానిని విడుచుట 'తామస త్యాగమనబడును.[2]

---

సంబంధము మాత్రమే బంధన కారకమగును. కనుక కర్మలందును మమకారఫలాసక్తుల త్యాగమే వాస్తవిక త్యాగమనబడును. ఎందుకనగా ఇట్లు కర్మ చేయువాడు, సర్వకర్మబంధముక్తుడై మోక్షము పొందును.

1. వర్ణాశ్రమ స్వభావ పరిస్థితులను బట్టి ఏ మనుష్యులకొరకు యజ్ఞ తపో-దాన-అధ్యయన-అధ్యాపన-ఉపదేశ-యుద్ధ ప్రజాపాలనమూ పశుపాలన కృషి-వ్యాపార-ఆహార-పానీయాదులైన యే యే కర్మలు శాస్త్రములలో అవశ్య కర్తవ్యములని చెప్పబడెనో, ఆ మనుష్యుని కొరకు ఆ కర్మలు నియతములు. ఇట్టి కర్మలు పూర్తిగా విడిచిన మనుష్యుడు అతని కర్తవ్య పాలనము చేయకుండుట చేత గలుగు పాపము పొందగలడు. ఎందు కనగా దీనిచేత కర్మల పరంపర తెగిపోవును. సర్వజగత్తులో విప్లవము కలుగును. (గీత-3, 23, 24) కనుక నియతకర్మలు పూర్తిగా విడుచుట ఉచితముగాదు.

2. కర్తవ్య త్యాగము పొరపాటున ముక్తిహేతువనుకొని, త్యజించుట మోహ

దుఃఖమిత్యేవ యద్ కర్మ కాయక్లేశభయాత్ త్యజేత్
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్ ॥ 8

అర్జునా! కర్మలన్నియు దుఃఖరూపములే యగునని తలచి ఎవరైన శరీర క్లేశభయములచేత కర్తవ్య కర్మలు విడిచినచో[1] అతడిటువంటి రాజస త్యాగము చేసి త్యాగ ఫలమును ఏ విధముగానూ పొందజాలడు.[2]

కార్యమిత్యేవ యత్ కర్మ నియతం క్రియతేఽర్జున ।
సంగం త్యక్త్వా ఫలం చైవ స త్యాగః సాత్త్వికో మతః ॥ 9

అర్జునా! శాస్త్ర విహిత కర్మలు చేయుట కర్తవ్యమను అభిప్రాయముచేత

---

పూర్వకమగుటచేత తామస త్యాగమనబడును. కనుక పైన చెప్పబడిన త్యాగము ఏ త్యాగము చేయుటచేత మనుష్యుడు కర్మబంధమునుండి విముక్తుడగునో అట్టి త్యాగముకాదు. ఈ తామస త్యాగమయితే పాప హేతు వగుటచేత దానికి విపరీతముగా మానవుని అధోగతి పాలు చేయును.

1. కర్తవ్య కర్మానుష్ఠానమందు శరీరేంద్రియ మనస్సులకు పరిశ్రమ కలుగును. వివిధ విఘ్నములు కలుగును. అనేక సామగ్రులు ఏకత్రచేకూర్చుకొనవలసి వచ్చును. శరీరసౌఖ్యము దూరముచేసికొనవలసివచ్చును వ్రతోపవాసాదులచేత కష్టములు సహింపవలసివచ్చును. అనేక భిన్న భిన్న నియమములను పాటింపవలసివచ్చును. ఈ కారణములచేత సమస్త కర్మలు దుఃఖరూపములని తలచి శరీరేంద్రియ మనస్సులకు పరిశ్రమ లేకుండా చేయుటకు సుఖానుభవేచ్ఛచేత శాస్త్రవిహిత యజ్ఞతపోదానాది కర్మలు విడుచుటయే అవి దుఃఖమయములని తలచి శారీరక క్లేశభయము చేత ఆ కర్మలను విడుచుట యనబడును.

2. మనుష్యుని శరీరేంద్రియ మనస్సులందు మమకారాసక్తులున్నంతవరకు అతడు ఏ విధమయిన కర్మబంధనము చేతగూడా విముక్తుడు కాజాలడు. కనుక ఈ రాజసత్యాగము నామమాత్ర త్యాగమే యగును. కనుక శ్రేయస్కాములైన సాధకులు ఇట్టి త్యాగము చేయగూడదు. ఎందుకనగా శరీరేంద్రియ మనస్సులకు సుఖమునందు ఆసక్తియుండుట రజోగుణ

వానియందాసక్తిని ఫలమును విడచి చేయబడినచో అది సాత్త్విక త్యాగమన బడును[1].

సంబంధము :

పైన చెప్పబడిన విధముగా 'సాత్త్వికత్యాగము చేయు పురుషులు నిషిద్ధ కర్మలను, కామ్యకర్మలను విడుచుటలో కర్తవ్యకర్మలను ఆచరించుటలోనూ ఎటువంటి భావము ఉండును'? ఈ జిజ్ఞాస పైన సాత్త్విక త్యాగముచేయు పురుషులయొక్క అంతిమస్థితి లక్షణములను భగవంతుడిపుడు చెప్పుచున్నాడు.

"న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే ।
త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః ॥" 10

---

కార్యమగును. కనుకనే యిట్టి త్యాగముచేయు మనుష్యులు సమస్త కర్మ బంధనములనుండి విముఖులై పరమాత్మను పొందు వాస్తవిక త్యాగమును చేయజాలరు.

1. వర్ణాశ్రమ పరిస్థితి స్వభావము అద్యాపి ఏ మనుష్యులకు ఏయె కర్మలు శాస్త్రములో అవశ్య కర్తవ్యములుగా చెప్పబడినవో, ఆ కర్మలన్నియు నియత కర్మలనబడును. నిషిద్ధములు-కామ్యములైన కర్మములు నియత కర్మలు కావు. నియతకర్మలు చేయకుండుట భగవదాజ్ఞనుల్లంఘించుట యగును అను నభిప్రాయముచేత ప్రభావితులై, ఆ కర్మలందు తత్ఫలము లైన ఇహలోక-పరలోకములందు సమస్తసుఖభోగములందు మమకారాసక్తి కామనలు పూర్తిగా త్యజించి ఉత్సాహముగా విధివత్తుగా ఆ కర్మలను అనుష్ఠించుచుండుటయే "సాత్త్వికత్యాగ" మనబడును ఎందుకనగా కర్మ ఫల రూపములైన ఇహలోక-పరలోక సుఖభోగములందు ఆసక్తికామనల త్యాగమే "వాస్తవిక త్యాగ" మనబడును. త్యాగమునకు పరిణామముగా కర్మసంబంధము పూర్తిగా విచ్ఛిన్నముకావలెను. ఇట్టి పరిణామము-మమ కారాసక్తి కామనలయొక్క త్యాగముచేతనే ఏర్పడగలదు. కాని కేవలము కర్మలను పూర్తిగా విడుచుటచేత ఆ త్యాగము ఏర్పడదు.

అర్జునా! అశుభకర్మలను ద్వేషించక[1] శుభకర్మలందు ఆసక్తిలేని[2] శుద్ధ సత్త్వగుణయుక్త పురుషులు సంశయరహితులై బుద్ధిమంతులై యథార్థ త్యాగు లగుదురు.[3]

"న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః ।
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే ॥" 11

ఎందుకనగా అర్జునా! శరీరధారియైన ఏ మనుష్యునకు కూడా పూర్తిగా

---

1. శాస్త్రనిషిద్ధ కర్మలు-కామ్యకర్మలు అన్నియు అశుభకర్మలు. ఎందుకనగా పాపకర్మలు మనుష్యులను వివిధ నీచయోనులలో నరకములలోనూ పడవేయును. కామ్యకర్మలు గూడ ఫలానుభవముకొరకు పునర్జన్మల నిచ్చునవేయగును. సాత్త్విక త్యాగికి రాగద్వేషములు పూర్తిగా లేకుండుటచేత అతడు నిషిద్ధ కామ్యకర్మలు రెండును ద్వేషబుద్ధితో విడువడు. శాస్త్రదృష్టితో లోకసంగ్రహార్థమై వానిని విడుచును.

2. శాస్త్ర విహితములైన నిత్యనైమిత్తికములగు యజ్ఞ తపోదానాది శుభ కర్మలు నిష్కామభావముతో చేసినప్పుడు మనుష్యుని యొక్క పూర్వ జన్మ కృత పాపములను అవి నశింపచేసి అతనిని కర్మబంధమునుండి విముక్తుని చేయుటకు సమర్థములగును కనుక ఈ కర్మలు శుభకర్మలన బడును. సాత్త్విక త్యాగి, పైన చెప్పబడిన శుభకర్మలు ఆసక్తిపూర్వకముగా అనుష్ఠించడు: శాస్త్రవిహిత కర్మలుచేయుట మనుష్యునికర్తవ్యమను భావముతో మమకార - ఆసక్తి-ఫలేచ్ఛలు త్యజించి లోక సంగ్రహము కొఱకే అని అనుష్ఠించును.

3. ఇట్లు రాగద్వేష రహితుడై కేవలము కర్తవ్యబుద్ధితో కర్మలుగ్రహించుట-త్యజించుటయే చేయు శుద్ధ సత్త్వగుణయుక్తుడైన పురుషుడు సంశయ రహితుడనబడును-అనగా అతడు పూర్తిగా నిశ్చయించిన దేమనగా ఈ కర్మయోగ రూప సాత్త్విక త్యాగమే కర్మ బంధమునుండి విముక్తిపొంది పరమపదప్రాప్తికి పరిపూర్ణసాధనమగును కనుకనే అతడు బుద్ధిమంతుడు అతడే యథార్థ త్యాగి యనబడును.

సర్వకర్మ త్యాగము సాధ్యము కాదు.[1] కనుక కర్మఫల త్యాగియే "త్యాగి" అన బడునని చెప్పబడెను.[2]

"అనిష్టమిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్।
భవత్యత్యాగినాం ప్రేత్య న తే సంన్యాసినాం క్వచిత్ ॥" 12

పార్థా! కర్మ ఫల త్యాగము చేయనివారి కర్మలకు మంచి-చెడ్డ-మిశ్రమ ఫలములు మూడు విధములయినవి. తప్పక కలుగును.[3] కాని కర్మ ఫలత్యాగము

---

1. దేహధారియగు మనుష్యుడెవడైననూ కర్మలు చేయకయుండజాలడు(గీత. 3-5) ఎందుకనగా కర్మలు చేయక శరీర నిర్వాహమే కాజాలదు (గీత-3-8)కనుక మనుష్యుడు(బ్రహ్మచర్యాదులలో ఏ ఆశ్రమములో నున్నను అతడు జీవించి వున్నంతవరకున్నూ తన పరిస్థితి ననుసరించి, అన్నపానాదులు-నిద్రించుట-మేల్కొనియుండు-కదలుట-నడచుట మాట్లాడుట ఈ మొదలగు కర్మలలో ఏదో ఒకటి చేయవలసియే యుండును. కనుకనే అతడు అన్నికర్మలు పూర్తిగా విడుచుట సంభవము కాదు

2. నిషిద్ధకర్మలు-కామ్యకర్మలు పూర్తిగా విడిచి తన అవసరమును బట్టి శాస్త్ర విహిత కర్తవ్యకర్మలు చేయుచూ, ఆ కర్మలందు, తత్ఫలము లందున్నూ, మమకార-ఆసక్తులను విడుచువాడే యధార్థ త్యాగిఅనబడును. బాహ్యముగా ఇంద్రియ కర్మలు అరికట్టి మానసికముగా విషయచింతనము చేయువాడు త్యాగికాడు. అహంకార-మమకార ఆసక్తి-కామనలుండగా శాస్త్రవిహితములైన యజ్ఞ తపోదానాది కర్తవ్యకర్మలు పూర్తిగా విడుచువాడు కూడా త్యాగి అనిపించుకొనడు.

3. తాము చేయుకర్మలందు తత్ఫలములందునూమమకార-ఆసక్తి కామనలు విడవనివారై ఆసక్తి ఫలేచ్ఛా పూర్వకముగా సర్వవిధ కర్మలు చేయువారు అనుష్ఠించిన శుభకర్మలకు స్వర్గాదిప్రాప్తి లేక, ఇతర సాంసారికములగు ఇష్ట భోగములప్రాప్తి రూపఫలము-మంచిఫలమగును, వారుచేసిన పాపకర్మలకు పశు పక్షి-కీటక-శలభ-వృక్షాది తిర్యక్ యోని ప్రాప్తి, లేక నరక ప్రాప్తి,

వేయు మనుష్యుల కర్మలకు ఫలము ఏ కాలమునందు గూడ కలుగదు.[1]

సంబంధము :-

మొదటి శ్లోకములో అర్జునుడు సంన్యాస-త్యాగముల తత్త్వములనుగూర్చి

---

అథవా ఇతర దుఃఖప్రాప్తి, మున్నగుఫలములు చెడ్డఫలములనబడును. ఇట్లే మనుష్యాది శరీరములతో జన్మించి ఒకప్పుడు ఇష్టభోగములను పొందుట. మరిఒకపుడు అనిష్టభోగములను పొందుట 'మిశ్రిత ఫల' మన బడును.

పురుషులు చేసిన కర్మలు తమ ఫలములను అనుభవింప చేయక నశిం చవు. అవి జన్మజన్మాంతరములందునూ గూడ శుభాఽశుభ ఫలముల నిచ్చుచుండును కనుకనే ఇట్టి మనుష్యులు సంసార చక్రములో పరిభ్ర మించుచుందురు.

1. కర్మలందు తత్ఫలములందున్న మమకార-అసక్తి-కామనలు పూర్తిగా ఎవరువిడిచినారో ఈ అధ్యాయము ఏడవశ్లోకములో త్యాగియను పేరుతో ఎవని లక్షణములు చెప్పబడెనో గీత ఆరవఅధ్యాయం మొదటి శ్లోకములో ఎవరిని గూర్చి 'సంన్యాసి'. యోగి అను రెండు పదములు ప్రయోగింప బడినవో గీత రెండవ అధ్యాయము ఏబదిఒకటవ శ్లోకములో ఎవరికి 'అనామయ' పదప్రాప్తియగుట చెప్పబడెనో అట్టి కర్మయోగులు ఇక్కడ "సన్న్యాసులు" అని చెప్పబడినారు.

ఇట్లు కర్మఫల త్యాగము చేయు "త్యాగి" చేసిన కర్మలన్నియు నిప్పు పైన వేగించబడిన విత్తనములవలె ఫలోత్పత్తి చేయుశక్తి గలిగియుండవు ఇట్లు యజ్ఞార్థమే చేయబడు నిష్కామకర్మలచేత పూర్వసంచితములైన శుభాఽశుభకర్మలు గూడ నశించును. (గీత-4-23) ఈ కారణముచేత అతడు ఈ జన్మలోగాని లేక జన్మాంతరములలో గాని, చేసిన ఏకర్మ గూడ ఏ విధముగగూడ ఎట్టి దశలో గూడ, ఏలాంటి ఫలమునూ అతడు జీవించియుండగా గాని లేక మరణించిన తరువాత గాని ఎప్పుడు గూడ అతనికి కలిగించవు. అతడు పూర్తిగా కర్మబంధనమునుండి విముక్తు డగును.

విడివిడిగా తెలిసికొనగోరెను. దానికి ఉత్తరము చెప్పుచూ భగవంతుడు రెండవ మూడవ శ్లోకములలో ఈ విషయమై విద్వాంసులకు గల వేర్వేరు అభిప్రాయము లను తెలిపి తన యభిప్రాయానుసారముగా నాలుగవ శ్లోకమునుండి పన్నెండవ శ్లోకమువరకు త్యాగము యొక్క అనగా కర్మయోగముయొక్క తత్త్వము తెలు పుటకొరకు తొలుత సాంఖ్య సిద్ధాంతానుసారంగా కర్మలసిద్ధికి గానూ ఐదు కారణములు చెప్పుచున్నాడు.

పంచైతాని మహాబాహో కారణాని నిబోధ మే।
సాంఖ్యే కృతాంతే[1] ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్[2]॥ 13

మహాబాహూ! సమస్త కర్మలసిద్ధికి ఈ ఐదు హేతువులు కర్మల నాశనము కొఱకు ఉపాయములు అని సాంఖ్య శాస్త్రమునందు చెప్పబడినవి. వానిని చెప్పెదను బాగుగావినుము.

అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్।
వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పంచమమ్॥ 14

---

1. 'కృత' అనగా కర్మలు కనుక వాటిని నశింపచేయుటకు ఉపాయములు తెలుపు శాస్త్రము కృతాంతము అనబడును. 'సాంఖ్య' మనగా జ్ఞానము సమ్యక్ఖ్యాయతే, జ్ఞాయతే పరమాత్మా అనేనేతి సాంఖ్యమ్-తత్త్వజ్ఞానం అనగా దీనిచేత పరమాత్మ బాగుగా తెలియబడుచున్నాడు. ఇది తత్త్వ జ్ఞానమనియు అనబడును. కనుకనే శాస్త్రజ్ఞాన సాధనరూపమైన జ్ఞాన యోగము ప్రతిపాదించు శాస్త్రము సాంఖ్యమనబడును. కాబట్టి ఇక్కడ 'కృతాంతే' అను విశేషణముతోకూడిన "సాంఖ్యే" అను పదమునకు దేని యందు జ్ఞానయోగము బాగుగా ప్రతిపాదింబడినదో అట్టి శాస్త్రము ననుస రించి సర్వకర్మలు ప్రకృతిచేత చేయబడినవి. ఆత్మ ఇందులో ఏమాత్రము కర్తకాదు అని తెలిసికొని కర్మాభావము చేయు పద్ధతి తెలుపబడినదని అర్థము.

2. "సర్వకర్మణామ్" అను పదమునకు ఇక్కడ శాస్త్ర విహితములు శాస్త్ర నిషిద్ధములునైన అన్ని కర్మలు అని యర్థము. ఏకర్మయైన పరిపూర్ణ మగుటయే అనగా అది నెరవేరుటయే దాని సిద్ధి అనబడును.

అర్జునా! ఈ విషయములో అనగా కర్మలసిద్ధిలో అధిష్ఠానము[1], కర్త[2], వేర్వేరు విధములైన కరణములు[3], అనేక విధములైన విడివిడి చేష్టలు[4] అటువంటిదే అగు ఐదవహేతువు దైవము[5].

శరీరవాఙ్మనోభిర్యత్కర్మ ప్రారభతే నరః ।
న్యాయ్యం[6] వా విపరీతం[7] వా పంచైతే తస్య హేతవః॥ 15

---

1. 'అధిష్ఠాన'శబ్దమునకు ఇక్కడ ముఖ్యముగా కరణ- క్రియలకు ఆధారమయిన శరీరము అని అర్థము. కాని గౌణముగా(అప్రధానంగా) ఈ పదము యజ్ఞాది కర్మలయందు వానికి సంబంధించిన క్రియలకు ఆధారమైన భూమ్యాదులు అను అర్థముకూడా అంగీకరింపబడింది.

2. "కర్తా" అను పదమునకు ప్రకృతిస్థ పురుషుడు అని అర్థము. ఇదియె భగవద్గీత పదమూడవ అధ్యాయము ఇరువది ఒకటవ శ్లోకములో 'భోక్తా' అని తెలుపబడెను.

3. మనోబుద్ధ్యహంకారములు లోపలిఇంద్రియములు పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, ఈ పది బాహ్యకరణములు. ఇవిగాక స్రుక్, స్రువాదులైన గౌణసాధనములుకూడా యజ్ఞాది కర్మలందు సహాయకములుగా నున్నవి. ఇట్లే వేర్వేరు కర్మలు చేయుటలో ఎన్నియైతే వేర్వేరు ద్వారములు లేక సహాయకములున్నవో అవన్నియు ఇక్కడ బాహ్యకరణములు అని చెప్పవచ్చును.

4. ఒక స్థానమునుండి మరియొకచోటికి పోవుట హస్తపాదాద్యంగములు కదిలించుట, ఉచ్ఛ్వాసనిశ్వాసములు, అవయవములు ముడుచుట విడుచుట- కన్నులు తెరచుట మూయుట, మనస్సులో సంకల్ప వికల్పములు కలుగుట ఇత్యాది సంచలన రూప క్రియలన్నియు అనేకములైన వేర్వేరు చేష్టలుగా భావింపవలెను.

5. పూర్వజన్మకృత శుభాఽశుభ కర్మల సంస్కారములు దైవము అన బడును ప్రారబ్ధముకూడా దీనిలో అంతర్గతము.

6-7. వర్ణ-ఆశ్రమ-పరిస్థితుల భేదముచేత ఎవరికి ఏకర్మలు కర్తవ్యములని నియ

అర్జునా! మనుష్యుడు[1] మనోవాక్ శరీరములచేత శాస్త్రానుకూలముగ లేక శాస్త్ర విపరీతముగా చేయు కర్మకు ఈ ఐదు కారణములు[2] గలవని తెలియవలెను.

సంబంధము -

ఈ విధముగా సాంఖ్యయోగం సిద్ధాంతంచేత సమస్త కర్మల సిద్ధికి అధిష్ఠానాదులైన ఐదు కారణములు నిరూపించి ఇప్పుడు భగవంతుడు వాస్తవముగా ఆత్మకు, కర్మలతో ఎలాటి సంబంధలేదు: ఆత్మపూర్తిగా శుద్ధము నిర్వికారము కర్తృత్వ రహితమునై యున్నది. అను విషయము వివరించి చెప్పుటకొరకు, ఆత్మ కర్తయని తలచువారిని నిందించి అకర్తయను వారిని స్తుతించుచున్నాడు:-

తత్రైవం సతి కర్తార మాత్మానం కేవలం తు యః ।
పశ్యత్యకృతబుద్ధిత్వాన్న[3] స పశ్యతి దుర్మతిః॥ 16

---

తములైయున్నవో, న్యాయముగా చేయబడు యజ్ఞ-తపో-దాన-విద్యా-ధ్యయన-యుద్ధ-కృషి-గోరక్షా-వ్యాపార-సేవాది సమస్త శాస్త్ర విహితకర్మ సముదాయము "న్యాయం"పదమునకు అర్థము.

వర్ణ-ఆశ్రమ-ప్రకృతి-పరిస్థితుల భేదముచేత ఎవరికి ఏకర్మలుచేయుట శాస్త్రములో నిషేధింపబడినవో, ఏకర్మలు నీతికి ధర్మమునకు ప్రతికూలములో అటువంటి అసత్య భాషణ చౌర్య-వ్యభిచార-హింసా-మద్యపాన-అభక్ష్యభక్షణాది సమస్త పాపకర్మలు 'విపరీతం'అను పదమునకు అర్థము.

1. మనుష్య శరీరమందే జీవుడు పుణ్య పాప రూప నవీన కర్మలు చేయును. ఇతరములన్నియు భోగయోనులు వానియందు పూర్వకృత కర్మల ఫలము అనుభవింపబడును. అక్కడ నవీన కర్మలు చేయుటకు అధికారంలేదు.

2. ఇక్కడ మనోవాక్ శరీరములచేత చేయబడు పుణ్య పాప రూప కర్మల ఫలము లన్నియు ఈ జన్మమునందు జన్మాంతరమునందు జీవునకు అనుభవింప వలసియుండును. ఆయన్నిటికి "ఈ ఐదు కారణములుగలవు"వీనిలో ఏ ఒక్కటి లేకున్ననూ కర్మ ఏర్పడదు. కనుకనే కర్తృత్వరహితముగా చేయబడు కర్మలు వాస్తవములో కర్మలుకావు.

3. సత్సంగంచేత, సచ్ఛాస్త్రము లభ్యసించుటచేత వివేక-విచార-శ్రమ-దమా

కాని, అర్జునా! ఇట్లైనప్పటికిని ఏమనుష్యుడు అపరిశుద్ధ బుద్ధిగలవాడగుట చేత ఆ విషయములో అనగా కర్మలు నెరవేరుటలో కేవలము శుద్ధ స్వరూపుడైన ఆత్మకర్తయని తలచునో అట్టి మలినబుద్ధిగల అజ్ఞాని యథార్థమును తెలిసికొన జాలడు[1].

యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే ।

---

దులైన ఆధ్యాత్మిక సాధనములచేత పరిశుద్ధము చేసికొనబడని బుద్ధిగల ప్రాకృతుడైన అజ్ఞాని "అకృతబుద్ధి"అనబడును.

1. వాస్తవములో ఆత్మనిత్య-శుద్ధ-బుద్ధ-నిర్వికారుడు పూర్తిగా అసంగుడు ప్రకృతితోగాని, ప్రకృతిజనిత పదార్థములతోగాని, లేక కర్మలతోగాని అతనికి ఏమాత్రము సంబంధంలేదు కాని, అనాది సిద్ధమైన అవిద్య (అజ్ఞానము) కారణంగా, అసంగుడైన ఆత్మకే ఈ ప్రకృతితో సంబంధం ఉన్నట్లు తోచుచున్నది. కనుక దుర్బుద్ధిగల యతడు ప్రకృతిచేసిన కర్మలందు అసత్యాభి మానముగలవాడై (గీత 3-27). తాను ఆ కర్మలకు కర్తయగును. ఇట్లు కర్తయైన పురుషుడే 'ప్రకృతిస్థపురుషు'డనబడును. అతడు ప్రకృతిచేసిన కర్మలకు కర్తయగును. అపుడే ఆకర్మలకు "కర్మలు" అను పేరు ఏర్పడి, అతడా కర్మఫలముల నిచ్చువాడగును. ఇందుచేతనే ఆ ప్రకృతిస్థ పురుషుడు ఉత్తమ నీచయోనులందు జన్మించి, ఆ కర్మఫలములను అనుభవించవలసిన వాడగును (గీత 13-21) కాబట్టి, పదునాలుగవ శ్లోకములో కర్మలసిద్ధికి చెప్పబడిన ఐదు హేతువులలో 'కర్త'గా తలచబడినవాడు ప్రకృతిస్థ పురుషుడని ఒక హేతువు చెప్పబడినది. ఇచట ఆత్మ కేవలుడు అనగా సంగరహితుడైన శుద్ధ స్వరూపుడని వర్ణింపబడినది. కనుక ఆత్మ అకర్తయని తెలిపి, ఆయన యథార్థ స్వరూపంయొక్క లక్షణము చెప్పబడినది. ఆత్మయొక్క యథార్థ స్వరూపము తెలిసికొనినవానికి కర్మలందు "కర్త" యనబడు ఐదవ హేతువుండదు. ఈ కారణంచేతనే ఆయన చేయు కర్మలకు "కర్మములు" అని పేరు ఉండదు. ఈ విషయమే ఈ తరువాత శ్లోకములో వివరించి చెప్పబడినది.

హత్వాఽపి స ఇమాన్ లోకాన్ న హంతి న నిబధ్యతే॥ 17

అర్జునా! ఏ పురుషుని అంతఃకరణమునందు "నేనుకర్తను" అనుభావము లేదో[1], ఎవనిబుద్ధికి ప్రాపంచిక వస్తువులు. కర్మలు అంటవో[2] అట్టి పురుషుడు సమస్తలోకములను హత్యచేసినను వాస్తవముగ అతడు హంతకుడుకాడు, పాపము చేత [3]బంధింపబడడు.

---

1. సాంఖ్యయోగికి మనశ్శరీరేంద్రియములచేత చేయు సమస్త కర్మలందు "ఈ కర్మ నేను చేసినాను. ఇది నా కర్తవ్యము" అనుభావము లేశ మాత్రముకూడా ఉండదు. ఇదియె "నేను కర్త కాను" అను నభిప్రాయము లేకుండుట యనబడును.

2. కర్మలందు తత్ఫలరూపములైన భార్యా-పుత్ర- ధన-గృహ- అభిమాన గౌరవ-స్వర్గసుఖాదులైన ఇహపరలోకములందలి సమస్త పదార్థము లందును, మమకార-ఆసక్తి-కామనలు లేకుండుట ఏ కర్మలోకూడ లేక తత్ఫలములోనూ తనకు ఎలాంటి సంబంధం లేదని తలచుట, ఆకర్మ లన్నియు స్వప్నమునందలి కర్మలు, తదనుభవమున క్షణికములు, నాశ వంతములు- కల్పితములునని తలుచుటచేత అంతఃకరణమునందు కాని సంస్కారములు చేరకుండుటయె బుద్ధికి అంటకుండుట యనబడును.

3. పైన చెప్పబడిన విధముగా ఆత్మస్వరూపమును బాగుగా తెలిసికొనుటచేత ఎవని అజ్ఞాన జనితమైన అహంభావము పూర్తిగా నష్టమైనదో, మనోబుద్ధీం ద్రియ శరీరములచేత చేయబడు కర్మలతో లేక తత్ఫలములతో కొంచెము గూడ సంబంధంలేదో, అట్టి పురుషుని మనో బుద్ధీంద్రియములచేత లోక సంగ్రహార్థము ప్రారబ్ధానుసారముగా కర్మలు చేయబడునో, అవన్నియు శాస్త్రానుకూలములు. అందరికీ హితము అగునవియగును. కనుక ఎట్లైతే అగ్ని వాయు జలాదులచేత ప్రారబ్ధవశమున, ఏ ప్రాణియైన మరణించిన యెడల ఆ యగ్నివాయుజలాదులు వాస్తవములో ఆ ప్రాణిని చంపునవి కావో, ఆ కర్మల బంధనము వానికి వుండదో, ఆ విధముగానే పైన చెప్ప బడిన మహాపురుషుడు శుభకర్మలుచేసి, వానికి కర్త కాడు. ఆ కర్మఫల

సంబంధము—

ఈ విధముగా సంన్యాసము (జ్ఞానయోగము)యొక్క తత్త్వము వివరించి తెల్పుటకొఱకు ఆత్మకు అకర్తృత్వమును ప్రతిపాదించి ఇప్పుడు భగవంతుడు దానిననుసరించి కర్మయొక్క అంగప్రత్యంగములను పూర్తిగా తెలుపుటకై కర్మ ప్రేరణ. కర్మసంగ్రహం వాని సాత్త్వికాది భేదములను ప్రతిపాదించుచున్నాడు.

జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా ।
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః ॥ 18

అర్జునా! జ్ఞాత-జ్ఞానము-జ్ఞేయం అను ఈ మూడువిధముల కర్మ ప్రేరణ[1]

---

ములచేత బంధింపబడదు. ఇట్లుండగా క్షాత్రధర్మమువంటి యేకారణము చేతనైననూ, తనకు యోగ్యత ప్రాప్తించిన తరువాత సమస్త ప్రాణుల సంహార రూపమైన క్రూరకర్మలు చేసిననూ, ఆ కర్మలకు అతడు కర్త కాడు. తత్ఫలముచేతనతడు బంధింపబడడనుటలో వేరుగా చెప్పవలసినదే మున్నది.

1. ఎట్లైతే భగవంతుడు జగదుత్పత్తి పాలన సంహారాది కార్యములు చేయు చున్ననూ, వాస్తవముగా ఆ కర్మలకు కర్తకాడో (గీత-4-13) ఆ కర్మ లతో ఆయనకు ఎలాంటి సంబంధం లేదో (గీత-4-14, 9-9) అట్లే సాంఖ్యయోగికూడ, అతని బుద్ధీంద్రియములచేత చేయబడు కర్మలన్నింటి తోనూ, కొంచెంకూడా సంబంధం ఉండదు కాని, అతని అంతఃకరణము మిక్కిలి పరిశుద్ధమైయుండుటచేత, అతడు అజ్ఞానమూలకములైన చౌర్య-వ్యభిచార-అసత్యభాషణ హింసా-కపట దంభాది పాపకర్మలు చేయడు.

ఏదైనా పదార్థముయొక్క స్వరూప నిశ్చయము చేయువాడు 'జ్ఞాత' యనబడును. అతడు ఏ వృత్తిచేత వస్తువుయొక్క స్వరూప నిశ్చయము చేయునో, దాని పేరు 'జ్ఞానమ'నబడును. ఏ వస్తువుయొక్క స్వరూపమును నిశ్చయించునో ఆ వస్తువు 'జ్ఞేయ" మనబడును. ఈ మూడింటి సంబంధమే మనుష్యునకు కర్మలందు ప్రవృత్తి కలిగించును. ఎందుకనగా ఎప్పుడైతే అధికారియైన మనుష్యుడు జ్ఞానవృత్తిచేత ఈ

చెప్పబడినది. కర్త-కరణం-క్రియ అను ఈ మూడువిధముల కర్మసంగ్రహము[1] చెప్పబడినది.

జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః ।
ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావచ్ఛృణు తాన్యపి ॥ 19

అర్జునా! గుణముల సంఖ్యను చెప్పు శాస్త్రమునందు జ్ఞానకర్మ కర్తల యొక్క గుణముల భేదముచేత మూడు మూడు విధములుగానే చెప్పబడెను. వానినిగూర్చి చెప్పెదను. నీవు శ్రద్ధగా వినుము.[2]

---

సాధనములద్వారా, ఈ విధముగా ఈ సుఖప్రాప్తికొరకు నేను చేయవలెనని తలచునో అపుడే అతనికి కర్మయందు ప్రవృత్తి కలుగును.

1. చూచుట, వినుట, తెలిసికొనుట, స్మరించుట, తినుట, త్రాగుట ఈ మొదలయిన కర్మలన్నియు చేయు ప్రకృతిస్థ పురుషుడు 'కర్త' అనబడును. పైన చెప్పబడిన కర్మలుచేయు అతని మనోబుద్ధీంద్రియములు 'కరణము' లని పైన చెప్పబడిన కర్మలన్ని 'కర్మలని' అనబడును. ఈ కర్త-కర్మ-కరణములుగా మూడింటి సంయోగముచేతనే కర్మసంగ్రహమగును. ఎందుకనగా మనుష్యుడు స్వయముగా కర్తయై తన మనోబుద్ధీంద్రియములచేత ఏదైన కర్మచేసినపుడే అది కర్మ యనబడును. అట్లుకానిచో ఏదియు కర్మ కాజాలదు. ఇదే అధ్యాయము పదునాలుగవ శ్లోకములో తెలుపబడిన కర్మసిద్ధియొక్క అధిష్ఠానాదులైన ఐదు హేతువులలో, అధిష్ఠానమును దైవమును విడిచి తక్కిన మూడింటికి "కర్మసంగ్రహ" నామము పెట్టబడెను.

2. సత్త్వ రజస్తమోగుణముల సంబంధంచేత సమస్త పదార్థములు వేర్వేరు భేదములు కలవిగా గణించుశాస్త్రము "గుణసంఖ్యానే" అను పదమునకు అర్థము. కనుక అందులో తెలుపబడిన గుణముల భేదముచేత మూడు మూడు విధములైన జ్ఞాన-కర్మ-కర్తలను వినుమని అర్జునునకు చెప్పి భగవంతుడు ఇక చెప్పబోవు ఉపదేశము ధ్యానముతో వినుమని అర్జునుని సావధానుని చేసెను.

సర్వభూతేషు యేనైకం భావమవ్యయమీక్షతే ।
అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధిసాత్త్వికమ్ ॥ 20

పార్థ! ఏ జ్ఞానముచేత మనుష్యుడు వేరువేరుగా అన్ని భూతప్రాణులయందు అవినాశియైన ఒక్క పరమాత్మ భావమే విభాగరహితముయిన సమభావముతో నున్నట్లు చూచునో ఆ జ్ఞానమే నీవు సాత్త్విక జ్ఞానమని తెలిసికొనుము.[1]

పృథక్త్వేన తు యజ్జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్ ।
వేత్తి సర్వేషు భూతేషు తద్జ్ఞానం విద్ధిరాజసమ్ ॥ 21

కాని, పార్థా! ఈ జ్ఞానము అనగా ఏ జ్ఞానముచేత మనుష్యుడు సర్వభూత ప్రాణులందు వేర్వేరు విధములైన అనేక భావములను వేర్వేరుగానున్నట్లు తెలిసికొనునో ఆ జ్ఞానమును నీవు రాజసజ్ఞానమని తెలిసికొనుము.[2]

---

జ్ఞాత–కర్త వేర్వేరుకారు. కాబట్టి భగవంతుడు జ్ఞాతను వేరుగా చెప్పలేదు. కరణభేదము ధృతి బుద్ధియను పేర్లతో జ్ఞేయభేదము, సుఖము అనుపేరుతో ఇకపైన చెప్పబోవును. కనుక ఇక్కడ పూర్వోక్తములైన ఆరు పదార్థములలో మూడింటి భేదమును మాత్రమే తొలుత చెప్పెదను అని సూచించెను. ఆ విషయమిక్కడ దృష్టిలో నుంచుకొనవలెను.

1. ఆకాశ తత్త్వమును తెలిసినవాడు ఘట–గృహ-గుహ-స్వర్గ–పాతాళాది సర్వవస్తుసహిత బ్రహ్మాండమునందు ఒకటే ఆకాశ తత్త్వమును చూచి నట్లే లోకదృష్ట్యా వేర్వేరుగా తోచుచున్న సమస్త చరాచర ప్రాణులలో భగవద్గీత ఆరవ అధ్యాయము ఇరువది తొమ్మిదవ శ్లోకములో, పద మూడవ అధ్యాయము ఇరువది ఏడవ శ్లోకములోను వర్ణింపబడిన సాంఖ్య యోగ సాధనముచేత గలుగు అనుభవముద్వారా అద్వితీయ అవినాశి నిర్వికార- జ్ఞానస్వరూపి పరమాత్మ భావమొక్కటే. విభాగరహితమైన సమ భాగముచేత వ్యాపించునట్లు చూచుటయె సాత్త్వికజ్ఞానమనబడును.

2. కీట-శలభ-పశుపక్షి-మనుష్య-రాక్షస- దైవతాది ప్రాణులన్నిటియందున్న ఆత్మ ఆయాశరీరముల ఆకృతి భేదముచే స్వభావ భేదముచేత వేర్వేరు విధములని విడివిడిగా నున్నవనియు తలచుటయె రాజసజ్ఞానమనబడును.

యత్తు కృత్స్నవదేకస్మిన్ కార్యేసక్తమహైతుకమ్ ।
అతత్త్వార్థవదల్పం చ తత్తామసముదాహృతమ్ ॥ 22

అర్జునా! ఏ జ్ఞానము కార్యరూపమైన ఒక్క శరీరమే సంపూర్ణమైనదని దాని యందే ఆసక్తి కలిగియుండునో, యుక్తిరహితమో, తాత్త్వికమైన అర్థములేనిదో తుచ్ఛమో అట్టిజ్ఞానము తామసజ్ఞానమనబడును.[1]

నియతం[2] సంగరహితమరాగద్వేషతః[3] కృతమ్ ।
అఫలప్రేప్సునా కర్మ యత్తత్ సాత్త్వికముచ్యతే॥ 23

అర్జునా! ఏ కర్మ, శాస్త్రవిధిచేత నియతము చేయబడినదో కర్తృత్వాభిమాన రహితమో, ఫలాపేక్షలేని, పురుషులచేత రాగద్వేషరహితముగ చేయబడినదో[4]

---

1. విపరీత జ్ఞానముచేత మనుష్యుడు ప్రకృతి కార్యమైన శరీరమే తన స్వరూపమని తలచి క్షణభంగురము నాశవంతమునైన శరీరమునందే తన సర్వస్వమునందువలె ఆసక్తుడై యుండి అనగా దాని సుఖదుఃఖముచేత నే నని తలచి, అది నశించినచో తన సర్వస్వము పోయినదని తలచునో ఆత్మ సర్వవ్యాపియని తలచదో అట్టివాని జ్ఞానము వాస్తవముగా జ్ఞానము కాదు. కనుక భగవంతుడు ఈ శ్లోకమునందు జ్ఞానపదమే ప్రయోగించ లేదు. ఎందుకనగా ఈ విపరీత జ్ఞానము వాస్తవముగా అజ్ఞానమేయగును.

2. నియత కర్మయొక్క వ్యాఖ్య ఇదే అధ్యాయము ఏడవ శ్లోకములో చూడ వలెను. ఇక్కడ "సంగము" అనగా ఆసక్తియనికాదు.

3. ఎందుకనగా ఆసక్తియొక్క అభావము "అరాగద్వేషతః"అను పదముచేత వేరుగా చెప్పబడినది. కాబట్టి ఇక్కడ కర్మలయందు కర్తృత్వాభిమాన ముంచి వానితో తనకు సంబంధము కలిగించుకొనుటయె సంగము అని తెలిసికొనవలయును.

4. కర్మఫల రూపములైన ఇహపరలోక సుఖభోగము లన్నిటియందు మమ కారాసక్తులు లేకుండుటచేత కొంచెంకూడా ఆ భోగములందు ఎవనికి ఆకాంక్షవుండదో, ఎవడు ఏ కర్మనుండికూడ తనయొక్క స్వార్థమును

అది సాత్త్విక కర్మయనబడును[1].

యత్తు కామేప్సునా[2] కర్మ సాహంకారేణ[3] వా పునః ।
క్రియతే బహులాయాసం తద్ రాజసముదాహృతమ్ ॥ 24

కాని, అర్జునా! ఏ కర్మ మిక్కిలి పరిశ్రమతో నెరవేరునో,[4] భోగములు

---

కూడ సిద్ధింపచేసి కొనుటకు ఇచ్ఛయింపడో, ఎవడు తనకొరకు ఏవస్తువు కూడ ఆవశ్యకమని తలచడో అట్టి పురుషునిచేత రాగద్వేషములు కేవలము లోక సంగ్రహముకొరకు చేయబడు కర్మలు "రాగద్వేష రహితముగ చేయబడు కర్మలు" అని అనబడును.

1. ఇదే అధ్యాయము తొమ్మిదవ శ్లోకములో వర్ణింపబడిన సాత్త్విక త్యాగము లోను, ఈ సాత్త్విక కర్మమునందును కల విశేషమేమనగా, ఇందులో కర్తృత్వాభిమానము లేకుండుట, రాగద్వేషములు లేకుండుటయు చెప్పబడినది. కాని తొమ్మిదవ శ్లోకమునందు కర్మాసక్తి ఫలేచ్ఛ ఇవి విడుచుటయె చెప్పబడెను. కర్తృత్వాభావ విషయము చెప్పబడలేదు. సరిగదా! తద్విపరీతముగా కర్తవ్యబుద్ధిలో కర్మలు చేయవలెనని చెప్పబడెను. ఆ రెంటియొక్క ఫలము తత్త్వజ్ఞానముద్వారా పరమాత్మ ప్రాప్తియే. అనుష్ఠాన ప్రకారమునందు మాత్రమే ఈ రెంటికి భేదముకలదు.

2. భార్యాపుత్ర ధన గృహ అభిమాన ప్రతిష్ఠా గౌరవాదుల కొరకు ఇహపర లోక సుఖములకొరకు మాత్రమే కర్మలుచేయు స్వార్థపరాయణులైన పురుషులు ఇక్కడ "కామేప్సునా" అను పదమునకర్థము.

3. ఇక్కడ "సాహంకారేణ" అను పదమునకు శరీరాభిమానము కల్గి ప్రతి కార్యము అహంకారముతో చేయుచు నేను ఈపనిచేయువాడను, నావంటి వాడితరుడెవడున్నాడు. నేనిది చేయగలను. అది చేయగలను; అని ఇట్టి భావము మనస్సులో నుంచుకొని అట్లే చెప్పుచుండు వాడు అని యర్థము.

4. సాత్త్విక కర్మకన్న రాజస కర్మకుగల భేదమేమనగా సాత్త్విక కర్మలు కర్తయొక్క శరీరమునందు అహంకారముండదు. ఆ కర్మలందు అతనికి

కోరు పురుషులచేత లేదా అహంకారంగల పురుషులచేత చేయబడునో ఆ కర్మ రాజసకర్మ యనబడును.[1]

అనుబంధం క్షయం హింసామనవేక్ష్య చ పౌరుషమ్ ।
మోహాదారభ్యతే కర్మ యత్తత్ తామసముచ్యతే ॥ 25

పార్థా! పరిణామమునందు హాని, హింస తన సామర్థ్యము నెరుగక కేవలము అజ్ఞానము వీనితో ఆరంభింపబడిన కర్మ తామసము అనబడును.[2]

---

కర్తృత్వముండదు. కనుక అతనికి ఏ కర్మ చేసిననూ ఎలాటి పరిశ్రమలేక క్లేశముయొక్క జ్ఞానముండదు. కనుక అతనికర్మ ఆయాసయుక్తముకాదు. కాని రాజసకర్మయొక్క కర్త శరీరములో అహంకారముండుటచేత అతడు శరీర పరిశ్రమచేత దుఃఖములచేతను, తాను బాధపడును. ఇందుచేత అతనికి ప్రతియొక కర్మలోను పరిశ్రమ జ్ఞానముండును. ఇదిగాక, సాత్త్విక కర్మలయొక్క కర్తచేత, కేవలము శాస్త్ర దృష్టిచేత-లేక-లోక దృష్టిచేత కర్తవ్యముగా ఏర్పడిన కర్మలుమాత్రమే చేయబడును, కనుక అతనిచేత కర్మవిస్తారము కాదు, కాని రాజసకర్మయొక్క కర్త ఆసక్తి కామనలచేత ప్రేరితుడై ప్రతిదినము క్రొత్త క్రొత్త కర్మలను ఆరంభించుచుండును. దీనిచేత అతనికర్మలు విస్తార మధికమగును. ఇందుచేత అధిక పరిశ్రమగల కర్మలు రాజసములని చెప్పబడినవి.

1. భోగలాలస- అహంకారము ఈ రెండునుగల పురుషుడు చేయు కర్మ రాజసమనబడునని చెప్పవలసిన యక్కరలేదు. కాని, వీనిలో ఏదో ఒక దోషముగల పురుషుడు చేయుకర్మ గూడ రాజసమేయగును.

2. ఏదైన కర్మ ఆరంభించుటకు పూర్వము బుద్ధిలో విచారించవలసియుండును. ఇంతబలము ప్రయోగించవలసియుండును. ఇంతకాలముపట్టును. ఈపని యొక్క ఈ అంశంలో ధర్మహానియగును. ఈ విధమైన ఇతర హానులు కలుగును, అని యోచించుట, హానినిగూర్చి విచారించుట యగును. ఈ కర్మచేత ఈ మనుష్యులకు లేక ఇతరప్రాణులకు ఈ విధమైన కష్టము కలుగును. ఈ మనుష్యులకు లేక, యీ ప్రాణులకు జీవన

ముక్త [1]సంగోఽనహంవాదీ[2] ధృత్యుత్సాహ సమన్వితః ।
సిద్ధ్య సిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే ॥ 26

అర్జునా ! సంగరహితుడు, అహంకారముతో మాట్లాడనివాడు, ధైర్యోత్సాహములు కలవాడు, కార్యము నెరవేరినను నెరవేరకున్నను హర్షశోకాది వికారములు లేనివాడునైన కర్త సాత్త్వికకర్త యనబడును.[3]

---

నష్టము కలుగును. అని యోచించుట హింసనుగూర్చి విచారించుటయగును. ఇట్లే ఈ కర్మచేయుటకొరకు ఇంతటి సామర్థ్యము అవసరము కనుక దీనిని పూర్తిగా నెరవేర్చగల సామర్థ్యము మనలోయున్నదా ? లేదా? అని విచారించుట పౌరుషము - అనగా, సామర్థ్యముయొక్క విచారము చేయుట యగును. ఈ విధముగా పరిణామములతోని హింస-పౌరుషము ఈ నాలుగుగాని, లేక, ఈ నాలుగింటిలో ఏదో విచారించక, కేవలము మోహముచేత, కర్మను ఆరంభించుటయే 'తామస', కర్మయనబడును.

1. శరీరేంద్రియ మనస్సులచేత చేయబడు కర్మలన్నిటియందు తత్ఫలరూపములైన అభిమాన-ప్రతిష్ఠా-గౌరవ-భార్యా-గృహాదులైన ఇహలోక పరలోక భోగములన్నిటియందు కొంచెముకూడ మమకార-ఆసక్తి-కామనలు లేని మనుష్యుడు "ముక్తసంగుడు" అనబడును.

2. అనాత్మ వస్తువులైన మనోబుద్ధీంద్రియ శరీరములందు ఆత్మబుద్ధి లేకుండుటచేత ఏ కర్మయందుగూడ కర్తృత్వాభిమానము లేకుండువాడు ఆ కారణముచేతనే ఆసురీ ప్రకృతి గలవారివలె నేను ఈ కోరికను నెరవేర్చుకొంటిని. ఈ కాంక్షను ఇకపైన తీర్చుకొందును. నేను ఈశ్వరుడను, భోగిని, బలవంతుడును, సుఖిని, నా సమానుడు మరియొకడెవడున్నాడు నేను యజ్ఞదానములు చేసెదను. (గీత 16-1, 16-13, 14, 15) "ఈ మొదలైన అహంకారపు మాటలు చెప్పకుండు వాడుగానుండి సరళభావముతో అభిమాన శూన్యముగ మాట్లాడు మనుష్యుడు" అనహంవాది యనబడును.

3. శాస్త్రవిహిత స్వధర్మపాలన రూపకర్మ ఏదైనను చేయునప్పుడు మహా

రాగీ[1] కర్మఫలప్రేప్సు:[2] లుబ్ధో[3] హింసాత్మకో[4]ఽశుచి:[5] ।
హర్ష శోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః ॥ 27

మహా విఘ్నములు, బాధలు కలిగిన సందర్భములో చలింపకుండుట ధైర్యమనబడును. "కర్మ నిర్వహణమునందు సఫలత్వము కలుగనప్పుడు లేదా తనకు ఫలేచ్ఛ లేనపుడు కర్మ చేయవలసిన అవశ్యకత యేమి? అని తలచక కర్మకూడ చేయుటకు ఉత్సాహపడక ఉండికూడా కర్మలో సఫలత్వముపొందినవారు, కర్మఫలమును కోరువారు కర్మలు చేయునట్లే శ్రద్ధాపూర్వకముగ చేయుటకు ఉత్సుకులైయుండుట "ఉత్సాహ" మనబడును. ఈ రెండును గుణములుగల మనుష్యుడు ఏ కర్మగూడ పూర్ణమగుటలో హర్షితుడుకాడు. దానియందు విఘ్నములు గలిగినపుడుగూడ శోకింపడు. ఇట్లే ఎవనికి ఇతర వికారములేవి కలుగవో, ఎవడు ప్రతియొక దశలోను సర్వదా సమభావములో నుండునో, ఇట్టి సమత్వముగల పురుషుడే "సాత్త్వికకర్తా" యనబడును.

1. కర్మలందు, తత్ఫలములగు ఇహ-పరలోక భోగములందున్ను మమతారాసక్తులుగల, మనుష్యుడు "రాగి" యనబడును.

2. కర్మఫల రూపములగు భార్యా-పుత్ర-ధనగృహ-అభిమాన-గౌరవ-ప్రతిష్ఠాదులైన ఇహపరలోకములందలి వివిధ భోగములందు ఇచ్ఛగల స్వార్థపరాయణుడైన పురుషుడు "కర్మఫలేప్సు:" అనబడును.

3. ధనాది పదార్థములందు ఆసక్తి యుండుటచేత, ఎవడైతే, న్యాయమైన అవసరమేర్పడినను, తాను యథాశక్తిగా వ్యయముచేయడో, న్యాయాన్యాయముల విచారము చేయక సర్వదా ధనసంగ్రహమునందు లాలసగలవాడై యుండునో, యితరుల ధనాది వస్తువులనుగూని అపహరించుటకుగూడ వెనుదీయడో, అట్టి మనుష్యుడు "లుబ్ధు"డనబడును.

4-5. ఏ విధముగనైనను ఇతరులకు నష్టము గలిగించు స్వభావము ఎవనికుండునో, ఎవడు తనకోరిక తీర్చుకొనుటకు పనిచేయుచున్నప్పుడు తన సుఖభోగములకొరకు ఇతరులకు కష్టము గలిగించుచుండునో, హింసా

ఆసక్తి కలిగి, కర్మఫలాకాంక్ష కలవాడై, లోభియై, యితరులకు కష్టము కలిగించు స్వభావము కలవాడై, అపవిత్రాచారము కలవాడై, హర్ష శోకములు గల కర్త రాజసకర్త యనబడును.

అయుక్తః[1] ప్రాకృతః[2] స్తబ్ధః శఠో[3] నైష్కృతికో<sup></sup>ఽలసః ।
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే ॥ 28

అర్జునా ! అయుక్తుడు, విద్యలేనివాడు పొగరుబోతు,[3] ధూర్తుడు[4] ఇతరుల

---

పరాయణుడైన అట్టి మనుష్యుడు ఇక్కడ హింసాత్మకః అను పదముచేత చెప్పబడినాడు.

ఎవడు తన వస్త్రములను, శరీరమును జలమృత్తికాదులచేత శుభ్రపరచుకోడో, తన యోగ్యతానుసారముగా వ్యవహరించి, తన ఆచరణములను శుద్ధముగా నుంచుకొనడో, కాని, భోగాసక్తుడై నానావిధ భోగములను బొందుటకొరకు, పరిశుద్ధాచారమును సదాచారమును విడుచునో, అట్టి మనుష్యుడిక్కడ "అశుచిః" అను పదముచేత చెప్పబడెను.

1. మనస్సును, ఇంద్రియములను వశమునందుంచుకొనక, వానికే వశీభూతుడై శ్రద్ధానక్తులు లేనివాడు "అయుక్తు"డనబడును.

2. మంచి శిక్షణము విద్యలేక బాల స్వభావము గలిగియుండి, ఏమాత్రము, తన కర్తవ్యజ్ఞానము లేక, అంతఃకరణము ఇంద్రియములు సంస్కార రహితములై స్వాభావికముగా సంస్కారములేని మూర్ఖుడు "ప్రాకృతు" డనబడును.

3. అతి కఠిన స్వభావముగలిగి, వినయములేకుండ, సర్వదా దర్పముతో త్రుళ్లిపడుచు, తనయెదుట ఇతరులను ఏమాత్రము లెక్కచేయనివాడు "పొగరుబోతు" అనబడును.

4. ఇతరులను మోసగించు వంచకుడు ద్వేషమును కప్పిపుచ్చుకొని గుప్తముగా ఇతరులకు అపకారము చేయువాడు- మనస్సులోనే యితరులకు కీడు చేయుటకు కుట్రలుపన్నువాడున్ను "ధూర్తుడు" అనబడును.

బ్రదుకు తెరువును నష్టపరచువాడు[1], శోకించువాడు, సోమరి[2] దీర్ఘసూత్రి[3] (విలంబముగ పనిచేయువాడు) నగు కర్త తామసకర్త యనబడును.[4]

సంబంధము-

ఈ విధముగా తత్త్వజ్ఞానమునకు సహాయకమైన సాత్త్వికభావము తెలుపుటకు, దానికి విరోధులైన రాజస-తామస భావములను త్యజింపజేయుటకు కర్మప్రేరణ-కర్మ సంగ్రహములనుండి జ్ఞాన-కర్మ కర్తలయొక్క సాత్త్వికాది భేదములు మూడు మూడు క్రమముగా తెలిపి ఇప్పుడు భగవంతుడు బుద్ధి-ధృతి వీనియొక్క సాత్త్విక-రాజస-తామస-భేదములను క్రమముగా చెప్పుటకు ప్రస్తావించుచున్నాడు.

బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణతస్త్రివిధం శృణు ।
ప్రోచ్యమానమశేషేణ పృథక్త్వేన ధనంజయ ॥ 29

ధనంజయా! ఇప్పుడు నీవు ధృతి-బుద్ధి వీనియొక్క గుణముల ననుసరించి

---

1. ఇతరుల వృత్తిలో వివిధబాధలు గలిగించుటయే స్వభావముగాగల మనుష్యుడు ఇతరుల జీవికను నష్టపరచువాడనబడును.

2. రాత్రింబగళ్ళు పని చేయుకపడియుండు స్వభావము గలిగి యేలాంటి శాస్త్రీయములు లేక వ్యావహారికములునైన కర్తవ్య కర్మయందు ప్రవృత్తి ఉత్సాహము లేకుండ, అంతఃకరణములో, ఇంద్రియములలోను సోమరితనము నిండియుండు మనుష్యుడు "అలసుడు" (సోమరి) అనబడును.

3. ఏ కార్యమునైనను ఆరంభించి, చాలకాలముదాక దానిని నెరవేర్చక నేడు చేయుదముగాని, రేపు చేయుదముగాని, అని యీ విధముగా విచారము చేయుచు చేయుచునె, ఒక దినములో నెరవేరుపనికిగాను, చాలకాలము గడిపినను అది నెరవేర్చజాలని శిథిల ప్రకృతిగల మనుష్యుడు "దీర్ఘసూత్రి" యనబడును.

4. పైన చెప్పబడిన లక్షణములన్నిగాని లేక వానిలో అధిక లక్షణములుగాని ఉన్న పురుషుడు తామస కర్తయని యెరుగవలెను.

మూడు విధములైన భేదములనుకూడ నేను పూర్తిగా విభాగపూర్వకముగా చెప్పెదను వినుము[1].

ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే ।
బంధం మోక్షం చ యా వేత్తి బుద్ధిస్సా పార్థ సాత్త్వికీ॥ 30

పార్థా! ఏ బుద్ధి ప్రవృత్తిమార్గము[2], నివృత్తిమార్గము[3], కర్తవ్యాకర్తవ్య

---

1. ఇక్కడ 'బుద్ధి' శబ్దమునకు నిశ్చయించు శక్తి విశేషమని యర్థము. ఈ యధ్యాయము ఇరువదవ ఇరువది యొకటవ ఇరువదిరెండవ శ్లోకములలో జ్ఞానముయొక్క ఏ మూడు భేదములు తెలుపబడెనో ఆ జ్ఞానము బుద్ధిచేత ఉత్పన్నమగు జ్ఞానము-అనగా బుద్ధియొక్క వృత్తి విశేషము ఈ బుద్ధి ఆ జ్ఞానమునకు కారణము. పదునెనిమిదవ శ్లోకములో 'జ్ఞాన' శబ్దము కర్మ ప్రేరణలో అంతర్గతమని చెప్పబడెను. బుద్ధిగ్రహణము "కరణము" అను పేరుతో కర్మ సంగ్రహమునందు చెప్పబడెను. ఇదియే జ్ఞానమునకు బుద్ధికి గల భేదము. ఇక్కడ కర్మ సంగ్రహములో వర్ణింపబడిన కరణముల సాత్త్విక-రాజస-తామస భేదములు బాగుగా వివరించి తెల్పుటకు 'ప్రధాన కారణ' మైన బుద్ధికి మూడు భేదములు తెలుపబడెను.

'ధృతి' శబ్దమునకు ధారణచేయు శక్తి విశేషము అని యర్థము. ఇదిగూడ బుద్ధి వృత్తియే. మనుష్యుడు ఏ క్రియయైనను-లేక-భావమైనను ఈ శక్తి చేతనే దృఢముగా ధారణచేయగలడు. ఈ కారణముచేత అది కరణము లోనే అంతర్గతమైనది. ఈ యధ్యాయము ఇరువదియారవ శ్లోకములో సాత్త్విక కర్తలక్షణములో "ధృతి" శబ్దము ప్రయోగింపబడినది. దీనిచేత "ధృతి" కేవలము సాత్త్వికమనియే చెప్పుటకు అవకాశము కలదని తెలియుచున్నది. కాని అదిసరికాదు. దీనికికూడ ("ధృతి"కి) మూడు భేదములు తెలుపబడినవి.

2,3. గృహస్థ-వానప్రస్థాద్యాశ్రమములందుండి, మమకార-ఆసక్తి-అహంకార-ఫలేచ్ఛలను విడిచి, పరమాత్మప్రాప్తి కొరకుగాను, ఆయన ఉపాసన, శాస్త్ర విహిత యజ్ఞ-దాన-తపస్సులు మొదలైన శుభకర్మలు, తన వర్ణాశ్రమ

ములు[1], భయాభయములు[2], బంధ మోక్షములు ఇవి యథార్థముగా తెలిసికొనునో అది సాత్త్వికబుద్ధి యనబడును.

---

ధర్మానుసారముగా బ్రతుకుదెరువు పనులు, శరీరమునకు సంబంధించిన అన్నపానాది కర్మలున్ను నిష్కామ భావముతో చేయు, ఆచరణరూపమైన పరమాత్మ ప్రాప్తిమార్గము, 'ప్రవృత్తిమార్గ'మన బడును జనక- అంబరీషాది రాజుల- యాజ్ఞవల్క్య వసిష్ఠాది మహర్షులవలె, ఆ మార్గమును బాగుగా తెలిసికొని తదనుసారము నడుచుటయే దానిని యథార్థముగా తెలియుట.

సర్వకర్మలు, భోగములు బాహ్యాంతరములచేత విడిచి, సంన్యాసాశ్రమమునసుండి, పరమాత్మ ప్రాప్తికొరకు సర్వవిధ ప్రాపంచిక వ్యవహారములనుండి విరక్తుడై, అహంకార మమకార - ఆసక్తి-త్యాగపూర్వకముగా, శమ-దమ - తితిక్షా (ఓర్పు)ది సాధన సహితుడై, నిరంతరము శ్రవణ-మనన-నిదిధ్యాసనములు చేయుట-లేదా-కేవలము భగవద్భజన స్మరణ-కీర్తనాదులందు నిమగ్నుడై యుండుట- ఈ విధముగా చేయుటయే పరమాత్మ ప్రాప్తికి మార్గము. అది 'నివృత్తిమార్గ' మనబడును. సనకాదుల - నారదుడు ఋషభదేవుడు - శుకదేవులవలె, ఆ మార్గమును బాగుగా తెలిసికొని, తదనుసారముగా నడచుకొనుటయే, దానిని యథార్థముగా తెలిసికొనుట యనబడును.

1. వర్ణ-ఆశ్రమ- ప్రకృతి-పరిస్థితి-దేశ-కాలములదృష్ట్యా, ఎవనికి ఎప్పుడు ఏ కర్మచేయుట ఉచితమో, అదియే అతనికి 'కర్తవ్యకర్మ' యగును. ఎప్పుడు ఎవనికి, ఏకర్మ విడుచుట ఉచితమో, అదియే అతనికి, అకర్తవ్య కర్మ యగును. ఈ రెంటిని బాగుగా తెలిసికొనుట అనగా, ఏదైన కార్యము చేయవలసినప్పుడు "ఇది నాకు కర్తవ్యమా లేక, అకర్తవ్యమా అను విషయము యథార్థముగా నిర్ణయించుకొనుటయే, కర్తవ్యా కర్తవ్యములను యథార్థముగా తెలిసికొనుట" యగును.

2. భయమునకు వ్యతిరేకమయిన భయా భావ వృత్తి 'అభయమనబడును', ఈ రెంటి స్వరూపము తెలిసికొనుటయే 'భయా భయ వృత్తి జ్ఞానము'

యయా ధర్మమధర్మం చ కార్యం చాకార్యమేవ చ ।
అయథావత్ప్రజానాతి బుద్ధిః సా పార్థ రాజసీ॥ 31

పార్థా! మనుష్యుడు ఏ బుద్ధిచేత ధర్మాధర్మములు[1], కర్తవ్యా[2] కర్తవ్యములు గూడ యథార్థముగ తెలిసికొనడో అది రాజసబుద్ధి[3] యనబడును.

---

1. అహింసా-సత్య-దయా-శాంతి-బ్రహ్మచర్య-శమ-దమ-తితిక్షా-యజ్ఞ తపో-దానములు, అధ్యయన-ప్రజాపాలన-కృషి-పశుపాలన-సేవాదులైన శాస్త్ర విహిత వర్ణాశ్రమ శుభకర్మలన్నియు అచరించుటవలన ఫలము శాస్త్రములో ఇహపరలోక సుఖభోగములని తెలుపబడినవి ఇతరుల హితము కొఱకు చేయబడు కర్మలన్నియు "ధర్మము"లనబడును. అసత్య-కపట-చౌర్య-వ్యభిచార-హింసా-దంభ- అభక్ష్యభక్షణాది పాపకర్మలన్నింటి యొక్క ఫలము శాస్త్రములందు దుఃఖమయమని తెలుపబడినది. అవి అన్నియు అధర్మములనబడును. ఏ సమయమునందు, ఏ పరిస్థితిలో ఏ కర్మ ధర్మ మగునో ఏ కర్మ అధర్మమగునో ఇది సరిగా నిర్ణయించుటలో బుద్ధి కుంటు బడి పోవుట లేక సంశయగ్రస్తమగుటయె 'ఆ రెంటియొక్క యథార్థ జ్ఞానము తెలియకుండుట' అనబడును.

2,3. ఈ వర్ణాశ్రమ ప్రకృతి-పరిస్థితి-దేశ-కాలములదృష్ట్యా ఏ మనుష్యునకు ఏ కర్మ చేయదగినదని శాస్త్రవిహితమో అది కర్తవ్యకర్మము, ఏ కర్మ చేయదగినదికాదు అని శాస్త్రములో చెప్పబడినదో అది నిషిద్ధమని తెలుప బడెను. విశేషించి అట్టి నిషిద్ధకర్మ చేయకుండుటయె ఉచితము. అది కర్తవ్యకర్మగనే భావించవలయును ఈ దృష్టితో చూచినపుడు శాస్త్ర నిషిద్ధ పాపకర్మలయితేనో ఎట్లైననూ చేయదగినవికావు. కాని శాస్త్రవిహిత శుభ కర్మలలోగూడ కొందరికి కొన్ని కర్మలు చేయదగినవి, మరి కొందరికి చేయదగనివి అగును. ఎట్లనగా శూద్రునకు సేవాకార్యము చేయదగినది, వేదాధ్యయనాదులు చేయదగినవి. సన్న్యాసికి వివేక వైరాగ్య శమదమాది సాధనములు చేయదగనివి. యజ్ఞదానాదులు ఆచరించుటతగనిది బ్రాహ్మ ణునకు యజ్ఞముచేయుట, చేయించుట, దానముచేయుట తీసికొనుట, వేదమునేర్చుట, నేర్పించుట చేయదగినపనులు. సేవావృత్తి బ్రాహ్మణు

అధర్మం ధర్మమితి యా మన్యతే తమసాఽవృతా ।
సర్వార్థాన్ విపరీతాంశ్చ బుద్ధిః సా పార్థ తామసీ॥ 32

అర్జునా! తమోగుణముచేత అవృతమైన ఏ బుద్ధికలదో అది అధర్మమును కూడ "ఇదిధర్మము" అని తలచును[1] ఇట్లే ఇతర సమస్త పదార్థములనుకూడ

---

నకు చేయదగినవికావు. వైశ్యులకు కృషి-గోరక్షణ వాణిజ్యాదులు చేయదగినవి. దానము పుచ్చుకొనుట వారికి అకార్యము. ఇట్లే స్వర్గాదులను కోరు మనుష్యునకు కామ్య-కర్మలు చేయదగినవి. ముముక్షువునకు అకార్యములగును. విరక్తుడగు బ్రాహ్మణునకు సంన్యాసము గ్రహించుట. చేయదగినకార్యము భోగాసక్తునకు అకార్యమగును. దీనిచేత, శాస్త్రవిహిత ధర్మమైనంత మాత్రముచేత అది అందరికిన్ని కర్తవ్యంగాదు. ఈ విధముగా ధర్మము కార్యము, అకార్యముగూడనగును. ఇదియె ధర్మాధర్మ కార్యాకార్యముల భేదమని తెలియవలెను. ఏదైన కర్మచేయవలసినపుడు, విడువవలసినపుడున్ను ఈ కర్మకు కర్తవ్యమా? లేక అకర్తవ్యమా? నేను ఏ కర్మ ఏవిధముగా చేయవలెను. ఏది చేయగూడదు అను విషయము బాగుగా నిర్ణయించుకొనుటలో, కింకర్తవ్యతా మూఢముగా బుద్ధియగుట, లేక, సంశయ యుక్తమగుటయె, కర్తవ్యాకర్తవ్యములను యథార్థముగా తెలిసికొనకుండుట యగును.

ఏ బుద్ధిచేత మనుష్యుడు ధర్మాధర్మ, కర్తవ్యాకర్తవ్యములను బాగుగా నిర్ణయించ చాలకుండునో, ఏ బుద్ధి ఇట్లే అనేక విషయములనుగూడ బాగుగా నిర్ణయించుటలో సమర్థముకాదో, ఆ బుద్ధి రజోగుణసంబంధముచే వివేకమునందు స్థిరముగా నిలువక, విక్షేపముగలదై, అస్థిరముగా నుండునో, ఆకారణముచేతనే అది రాజసబుద్ధి యనబడును.

1. ఈశ్వరనింద-దేవతానింద-శాస్త్రవిరోధము-తల్లిని, తండ్రిని, గురువులను అవమానించుట. వర్ణాశ్రమ ధర్మములకు ప్రతికూలమైన ఆచరణము-అసంతుష్టి-దంభ-కపట-వ్యభిచార, అసత్యభాషణ - పరపీడన - అభక్ష్య భక్షణ-యథేచ్ఛాచార-పరస్వత్వాపహరణాదినిషిద్ధ పాపకర్మములు ధర్మములని తలచుట, ధృతి-క్షమా, మనోనిగ్రహ-చౌర్యభావ-శౌచ, ఇంద్రియ

విపరీతముగ తలచును[1]. అది తామసబుద్ధి యనబడును.

ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేంద్రియ క్రియాః ।
యోగేనా వ్యభిచారిణ్యా ధృతిః సా పార్థ సాత్త్వికీ ॥ 33

పార్థా! అవ్యభిచారి (చెదరని) దారుణశక్తిచేత మనుష్యుడు ధ్యానయోగము ద్వారా ప్రాణేంద్రియ మనస్సుల క్రియలను అనుష్ఠించుచున్నాడు. అదిసాత్త్విక[2] ధృతి యనబడును.

---

నిగ్రహ-బుద్ధి, విద్యా-సత్యఅక్రోధ ఈశ్వరపూజా-దేవోపాసనా-శాస్త్ర సేవన-వర్ణాశ్రమ ధర్మాచరణ మాతాపితృగురువుల ఆజ్ఞపాలన-సరళత్వ-బ్రహ్మచర్య-సాత్త్వికభోజన-అహింసా-పరోపకారాది శాస్త్రవిహిత పుణ్య కర్మలు అధర్మములని తలచుట 'ఇదియె' అధర్మమును ధర్మముగా, ధర్మమును అధర్మంగా తలచుట యనబడును.

౨. అధర్మము ధర్మమని తలచునట్లే, అకర్తవ్యము, కర్తవ్యమని దుఃఖము సుఖమని, అనిత్యము నిత్యమని, అపరిశుద్ధము పరిశుద్ధమని, హాని లాభ మనియు తలచుట, ఇత్యాది విపరీతములైన తలంపులన్నియు ఇతర వస్తువులను విపరీత వస్తువులు అనుభావములో చేరినది యనబడును.

1. ఏ క్రియ, భావము, వృత్తి ధరించుటకు, దానిని దృఢముగా స్థిరపరచు కొను శక్తి విశేషము, దానిచేత ధరింపబడిన క్రియ, భావన, వృత్తి విచలితముకాదు. తద్విపరీతముగ అది చిరకాలము స్థిరముగనుండును. అట్టి శక్తి 'ధృతి' అనబడును. కాని దీనిచేత మనుష్యుడు వేర్వేరు ఉద్దేశ్యములతో వివిధ విషయములను ధరించుచుండునంతవరకు ఈ ధృతియొక్క వ్యభిచారదోషము (చలించుదోషము) నష్టముకాదు. దీనిచేత మనుష్యుడు తన స్థిరమైన ఒక ఉద్దేశ్యమును అచంచలముగా నిలుపుకొనినప్పుడు ఇది అవ్యభిచారియగును.

పరమాత్మను పొందియే తీరవలెను. అను ఒక్కటే ఉద్దేశ్యము సాత్త్విక, ధృతికి ఉండును. ఈ కారణముచేత అది అవ్యభిచారి అనబడును. ఇట్టి ధారణశక్తిచేత పరమాత్మను పొందుటకొరకు ధ్యానయోగముద్వారా మనః

యయా తు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున ।
ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతిః సా పార్థ రాజసీ ॥ 34

కాని, అర్జునా ! ఫలేచ్ఛగల మనుష్యుడు ఏ ధారణశక్తి చేత మిక్కిలి ఆసక్తితో ధర్మార్థ కామములను ధరించునో[2] ఆ ధారణశక్తి రాజసి యన బడును.

యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ ।
న విముంచతి దుర్మేధా[3] ధృతిః సా పార్థ తామసీ ॥ 35

పార్థా ! దుష్టబుద్ధిగల మనుష్యుడు ఏ ధారణశక్తి చేత నిద్రాభయం చింతా దుఃఖములను ఉన్మత్తతనుకూడ విడువడో, అనగా ధరించియుండునో[4] అది తామసధృతి యనబడును.

---

ప్రాణేంద్రియ క్రియలను అచంచల రూపముతో పరమాత్మయందు ఉంచి అక్కడినుండి అవి కదలకుండ చేయుటయే సాత్త్విక ధృతి యనబడును.

2. అనక్తి పూర్వకముగ ధర్మమును పాలించుట ధృతిచేత ధర్మధారణచేయుట అనబడును. ధనాది పదార్థములు వానిచేత ఏర్పడు సుఖములే జీవిత లక్ష్యములుగా చేసికొని మిక్కిలి ఆసక్తితో దృఢముగా వానిని బంధించి యుంచుట ధృతిచేత అర్థకామములను ధరించుట యనబడును.

3. ఎవనిబుద్ధి మిక్కిలి మందముగా, మలినముగానూ ఉండునో, ఎవని యంతః కరణములో ఇతరులకు కీడుచేయుట మొదలగు భావములు నిండియుండునో అట్టి దుష్టబుద్ధిగల మనుష్యుడు 'దుర్మేధా' అనబడును.

4. మనస్సును ఇంద్రియములను తమోగుణముచేత కప్పి బాహ్య క్రియా రహితములను, మూఢములనుగను చేయు నిద్ర, కునికిపాట్లు మొదలగు భావములు నిద్రయనబడును. ధనాది పదార్థముల నాశము, మృత్యువు, దుఃఖప్రాప్తి, సుఖనాశము అథవా ఇటువంటివే ఇష్టనాశములైనవి. అనిష్ట ప్రాపకములైనవి సంభవించునను శంకచేత అంతఃకరణమునందు కలుగు

సంబంధము :

ఈ విధముగ సాత్త్వికబుద్ధిని, ధృతిని ధరించుట, రాజస తామసబుద్ధుల ధృతులను త్యజించుట అవసరమని బుద్ధి ధృతుల సాత్త్వికాది భేదత్రయమును క్రమముగా తెలిపి భగవంతుడు. ఇప్పుడు, మనుష్యుడు ఏ సుఖముకొరకు సమస్త కర్మలు చేయునో ఆ సుఖముకూడ సాత్త్విక-రాజస-తామసములు-అని మూడు విధములు క్రమముగా చెప్పుచున్నాడు.

సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ ।
అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాంతం చ నిగచ్ఛతి ॥ 36

యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్ ।
తత్సుఖం సాత్త్వికం ప్రోక్త మాత్మబుద్ధి ప్రసాదజమ్ ॥ 37

భరతశ్రేష్ఠా! ఇప్పుడు మూడు విధములైన సుఖములనుగూర్చి చెప్పెద వినుము. సాధకుడు భజన-ధ్యాన- సేవాదుల యభ్యాసముచేత ఏ సుఖమునందు రమించుచుండునో,[1] ఏ సుఖముచేత దుఃఖాంతమును పొందునో[2] ఏది ఆరంభము

---

వ్యాకులత్వము—బెదరుపాటు కలిగించు వృత్తి, "భయము" అనబడును. మనస్సునందు గలుగు వివిధ దుశ్చింతలు "శోకమన"బడును.

1. మనుష్యునకు ఈ సుఖానుభవము, అతడు ఇహపరలోకములందలి సమస్త భోగ సుఖములు క్షణికములని తలచి వానినుండి ఆసక్తిని తొలిగించి నిరంతరము పరమాత్మ స్వరూప చింతనమును అభ్యసించునప్పుడే కలుగును. (గీత-5-21) సాధనము లేకుండ దీని అనుభవము కలుగజాలదు అనుభావము తెలుపుటకొరకే అభ్యాసముచేత రమింపబడు ఈ సుఖము యొక్క లక్షణము చెప్పబడెను.

2. ఏ సుఖమునందు రమించు మనుష్యుడు ఆధ్యాత్మిక—ఆధిదైవిక-ఆధిభౌతికములు అను దుఃఖత్రయ బంధనమునుండి ఎల్లప్పటికి విముక్తుడగునో ఏ సుఖానుభవఫలము నిరతిశయ సుఖ స్వరూపుడైన సచ్చిదానందఘన పరబ్రహ్మమైన పరమాత్ముని ప్రాప్తి యని తెలుపబడెనో (గీత 5-21, 24, 6-28) అదియే సాత్త్విక సుఖ మనబడును.

వందు విషతుల్యముగా తోచినను[1] పరిణామమునందు అమృతతుల్యమగునో[2] ఆ కారణముచేతనే ఏది పరమాత్మ విషయక బుద్ధికి ప్రసన్నత కలిగించునో[3] అది సాత్త్విక సుఖమనబడును.

విషయేంద్రియ సంయోగాత్ యత్తదగ్రేఽమృతోపమమ్ ।
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్ ॥ 38

విషయేంద్రియ సంయోగముచేత కలుగు సుఖము తొలుత భోగకాలమునందు అమృత తుల్యముగ తోచినప్పటికి పరిణామమందు విషతుల్యమగును.

---

1. ఏ విధముగ బాలకుడు తన యింటివారినుండి విద్యా మహిమను విని విద్యాభ్యాసమనకు ప్రయత్నము చేసియు విద్యా మహత్త్వము యథార్థముగ అనుభవమునకు రాని కారణముచేత ప్రారంభకాలమునందు అభ్యాసము చేయునపుడు ఆ బాలకునకు క్రీడలను విడిచి విద్యాభ్యాసమునందు నిమగ్నుడై ఉండుట మిక్కిలి కష్టప్రదము కఠినముగా తోచునో ఆ విధముగానే సాత్త్వికసుఖముకొరకు అభ్యాసము చేయు మనుష్యునకు కూడ విషయములను త్యజించి నిగ్రహ పూర్వకముగా వివేక వైరాగ్య శమదమతితిక్షాది సాధనములందు నిమగ్నుడైయుండుట మిక్కిలి శ్రమ పరిపూర్ణము కష్టప్రదములని తోచును. ఇదియే సాత్త్వికసుఖము ఆరంభ కాలమునందు విషతుల్యముగా తోచుట యనబడును.

2. సాత్త్విక సుఖప్రాప్తికొరకు సాధనము చేయుచున్న సాధకునకు ధ్యాన జనిత సుఖానుభవము కలుగునప్పుడు అది అతనికి అమృతతుల్యముగ తోచును. అప్పుడు దానిముందర సాంసారిక సుఖభోగములన్నియు తుచ్ఛములు గణనీయములు కానివి దుఃఖరూపములు అని తోచును.

3. పైన చెప్పబడిన విధముగా, అభ్యాసము చేయుచు చేయుచు నిరంతరము పరమాత్మ ధ్యానము చేయుటకు ఫలముగా అంతఃకరణము స్వచ్ఛమైనట్టి ఈ సుఖము కలుగును. కనుక ఈ సుఖము పరమాత్మబుద్ధి ప్రసన్నత చేత కలుగునని చెప్పెదరు.

కనుక అది రాజససుఖము అనబడును.[1]

యదగ్రే చానుబంధే చ సుఖం మోహనమాత్మనః ।
నిద్రాఽఽలస్య ప్రమాదోత్థం తత్తామసముదాహృతమ్ ॥ 39

అర్జునా! భోగకాలమునందు పరిణామమునందును మోహపరచు నిద్ర-సోమరితనము-ఏమరుపాటు - వీటినుండి ఉత్పన్నమైన సుఖము[2] తామస సుఖమనబడును.

---

1. మనుష్యుడు మనస్సులో, ఇంద్రియములలోను, ఏదైన విషయము సేవించినపుడు, దానియందతనికి ఆసక్తియుండుటచేత, అది ప్రియమనిపించును. దానిముందతడప్పుడు కనబడనియే సుఖముగూడ లెక్కచేయడు. కాని యీ రాజససుఖము, సుఖముగా తోచునది మాత్రమేయగును. అది వాస్తవముగా సుఖముగాదు. అది విషయములందు ఆసక్తి పెరుగుటచేత, మరల ఆ సుఖప్రాప్తి కలుగనప్పుడు, అది లేనందుచేత దుఃఖముగలుగును. అవి విడిపోవునప్పుడున్ను మిక్కిలి దుఃఖము గలుగును. కనుక విషయేంద్రియ సంయోగముచేత గలుగు ఈ క్షణికసుఖము వాస్తవముగా, అన్నివిధముల దుఃఖరూపమే యైనప్పటికిన్ని ఎట్లయితే రోగి, ఆసక్తిచేత రుచి లోభముచేత, పరిణామము నువిచారించక, అపథ్య వస్తువు తిని, పరిణామమునందు రోగము పెరుగుటచేత దుఃఖము పాలగునో, అథవా, మరణించునో అట్లే, విషయాసక్తుడైన మనుష్యుడుగూడ మూర్ఖత్వముచేత, ఆసక్తివశుడై, పరిణామమును విచారించక, సుఖ బుద్ధిచేత, విషయములను సేవించి పరిణామమున, అనేకవిధ భయంకర దుఃఖములను అనుభవించును. (గీత-5-22)

2. నిద్రించునపుడు మనస్సుయొక్క, ఇంద్రియములయొక్కయు క్రియలు ఆగిపోవుటచేత, అలసటవలన గలిగిన దుఃఖము లేకుండుటచేత, మనస్సుకు ఇంద్రియములకున్ను విశ్రాంతి లభించుటచేత తోచుసుఖము, నిద్రాజనిత సుఖము ఉన్నంతవరకే ఉండును. ఆ సుఖము నిరంతరము ఉండదు. అందుచేత అది క్షణికసుఖమగును. ఇదిగాక అప్పుడు మనస్సు-బుద్ధి-యింద్రియములు వీనియందు ప్రకాశము ఉండదు. వానికి ఏ వస్తువును

న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః ।
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిః స్యాత్ త్రిభిర్గుణైః ॥ 40

---

గూడ అనుభవించు శక్తియుండదు. కనుక ఆ సుఖము, భోగకాలములో ఆత్మకు అనగా. అంతఃకరణమునకు, ఇంద్రియములకు వానియొక్క అభిమాని పురుషునకున్ను మోహము కలిగించునది యగును. ఈ సుఖాసక్తి కారణముగా, చివరకు మనుష్యునకు, అజ్ఞానమయములైన వృక్ష-పర్వతాది జడయోనులందు జన్మించవలసివచ్చును. కనుకనే యీసుఖము పరిణామమునందుగూడ ఆత్మను మోహింపజేయునదియేయగును.

ఈ విధముగనే, సర్వకర్మలను త్యజించి యుండినప్పుడు శరీరేంద్రియ మనస్సుల పరిశ్రమను విడుచుటచేత, సుఖప్రతీతి గలుగును. సోమరితనమువలన గలిగిన ఆ సుఖముగూడ, నిద్రవలన గలిగిన సుఖమువలె భోగకాలమునందు పరిణామకాలమునందున్ను మోహము గలిగించునదియే యగును.

వ్యర్థముగా కర్మలు చేయుటయందు మనస్సునకు ప్రసన్నత్వము గలుగుటచేత, కర్తవ్య త్యాగమునందు పరిశ్రమ లేకుండుటచేతను, మూర్ఖత్వము కారణముగా తోచునటువంటి ఆ ప్రమాద జనిత సుఖము ననుభవించునపుడు మనుష్యునకు కర్తవ్యాకర్తవ్యజ్ఞానము కొంచెముగూడ ఉండదు. అతని వివేకశక్తి, మోహముచేత కప్పబడియుండును. కనుక కర్తవ్యమును తిరస్కరించును. ఈకారణముచేత, ప్రమాద(ఏమరుపాటు) జనిత సుఖము భోగకాలమునందు ఆత్మను మోహింపజేయును. పైన చెప్పబడిన వ్యర్థకర్మలలో, అజ్ఞానముయొక్క, అనక్తిచేత చేయబడు అసత్య-కపట-హింసాది పాపకర్మలయొక్క, కర్తవ్యా కర్తవ్యముల త్యాగముయొక్కయు ఫలము అనుభవించుటకు సూకర - శునకాది నీచ యోనులు-నరకములున్ను ప్రాప్తించును. ఇందుచేత ఈ సుఖము పరిణామమునందుగూడ ఆత్మను మోహింపజేయునది యగును.

అర్జునా! భూమండలమునందు లేక ఆకాశమునందు అథవా దేవతలలో¹ ఇదికాక మరెక్కడనైనను ప్రకృతినుండి పుట్టిన ఈ మూడు గుణములు లేనిది ఏ సత్త్వముగూడ లేదు.

**సంబంధము :**

ఈ యధ్యాయము నాల్గవ శ్లోకమునుండి పన్నెండవ శ్లోకమువరకు భగవంతుడు తన అభిప్రాయానుసారముగ త్యాగముయొక్క త్యాగియొక్కయు లక్షణములు చెప్పెను తరువాత పదమూడవ శ్లోకమునుండి పదియేడవ శ్లోకము వరకు సన్న్యాస (సాంఖ్య)ముయొక్క స్వరూపమును నిరూపించి సన్న్యాసమునందు సహాయకమైన సత్త్వగుణ గ్రహణమునకు విరోధులైన రజస్తమోగుణముల యొక్క త్యాగము చేయించు నుద్దేశ్యముతో పదునెనిమిదవ శ్లోకమునుండి నలువదియవ శ్లోకమువరకు గుణములననుసరించి జ్ఞాన-కర్మ-కర్త్రాదిముఖ్యముఖ్య పదార్థముల భేదమునుగూర్చి వివరముగ తెలిపి చివర సమస్త సృష్టి గుణయుక్తమని తెలిపి ఆ విషయమును ఉపసంహరించెను.

ఇక్కడ త్యాగ స్వరూపము తెలుపునపుడు భగవంతుడు చెప్పినదేమనగా నియతకర్మలు పూర్తిగా విడుచుట ఉచితముకాదు. (గీత 18-7) కాని, నియతకర్మలను అనాసక్తితో ఫలత్యాగపూర్వకముగ చేయుటయే వాస్తవికత్యాగము (గీత 18-9) అని కాని అక్కడ ఎవనికొరకు ఏకర్మ నియతమైనది అను విషయమును తెలుపలేదు. అందుచేతనే ఇప్పుడు సంక్షేపముగ నియతకర్మల స్వరూపము

---

1 ఇక్కడ సత్త్వశబ్దమునకు, సర్వవిధప్రాణులు సమస్త పదార్థములునని యర్థము. ప్రకృతి జన్యములైన యీ మూడు గుణములులేని వస్తువేదియు లేదు. ఎందుకనగా, సమస్త జడపదార్థములు ఈ గుణములనుండి పుట్టినవి కనుక, ఇవి గుణమయములేయగును. సమస్త ప్రాణులకు, ఆ గుణములతో, గుణములనుండి పుట్టిన పదార్థములతోను సంబంధముగలదు. కనుక ఈ యన్నియు గుణయుక్తములేయగును. ఈ కారణముచేత, భూలోక- అంతరిక్షలోక- దేవలోకములందు, అన్ని యితర లోకములందు నున్న సమస్తప్రాణులు పదార్థములుగూడ ఈ మూడు గుణములతో గూడినవే యగును.

త్యాగము అను పేరుతో వర్ణింపబడిన కర్మయోగమునందు భక్తి సహయోగమును దాని ఫలము పరమసిద్ధి ప్రాప్తియనియు తెల్పుటకొరకు మరల ఆ త్యాగరూప కర్మయోగ ప్రకరణమునే ఆరంభించుచున్నారు.

బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాం చ పరంతప ।
కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవైర్గుణైః ॥ 41

పరంతపా! బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులయొక్క[1] కర్మలు స్వభావముచేత ఉత్పన్నములైన గుణములద్వారా విభజింపబడియున్నవి.[2]

1. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యజాతులవారే ద్విజులు ఈ మూడు జాతుల వారికే యజ్ఞోపవీతధారణ పూర్వకముగా వేదాధ్యయనమునందు యజ్ఞాది వైదిక కర్మలందును అధికారము కలదు. ఈ కారణముచేత బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు ముగ్గురు సమ్మిశ్రితము చేయబడి, ఏకముగా ఇక్కడ చెప్పబడిరి. శూద్రులు ద్విజులుకారు. కనుకనే వారికి యజ్ఞోపవీత ధారణమునందు వేదాధ్యయనమునందు యజ్ఞాది వైదికకర్మలందును అధికారములేదు. అను సభిప్రాయము తెలుపుటకు ఈ శ్లోకమునందు శూద్రులు ముగ్గురికన్న వేరుగ చెప్పబడిరి.

2. ప్రాణులకు జన్మ జన్మాంతరములందు చేయబడిన కర్మల సంస్కారమునకు స్వభావం అని పేరు. ఆ స్వభావమునకు తగినట్లుగానే ప్రాణుల అంతఃకరణమునందు ఉత్పన్నములగు సత్త్వరజస్తమోగుణ వృత్తులననుసరించియే బ్రాహ్మణాది వర్ణములందు మనుష్యులు పుట్టెదరు. ఈ కారణము చేత ఆ గుణములదృష్ట్యా విచారించియే శాస్త్రమునందు నాలుగు వర్ణములకు కర్మల విభాగము చెప్పబడినది. కేవలము సత్త్వగుణ స్వభావము అధికముగా గలవాడు బ్రాహ్మణుడగును. కనుక అతనికి స్వాభావిక కర్మలు శమదమాదులు అని తెలుపబడెను. సత్త్వమిశ్రిత రజోగుణ స్వభావము అధికంగా గలవాడు క్షత్రియుడగును. కనుక అతని స్వాభావిక కర్మలు శౌర్య-వీర్య-బలాదులు తెలుపబడెను. తమోమిశ్రిత రజోగుణ స్వభావము అధికంగా గలవాడు వైశ్యుడగును. కనుక అతని స్వాభావిక కర్మలు కృషిగోరక్షాదులని తెలుపబడెను. రజోమిశ్రిత తమోగుణ స్వభా

శమో[1] దమ[2]స్తపః[3] శౌచం[4] క్షాంతి[5] రార్జవమేవ[6] చ ।
జ్ఞానం[7] విజ్ఞాన[8]మాస్తిక్యం[9] బ్రహ్మకర్మ స్వభావజమ్॥ 42

---

వము ప్రధానముగా కలవాడు శూద్రుడగును. కనుక అతని స్వాభావిక కర్మలు పైమూడు వర్ణములకు సేవచేయుట అని చెప్పబడెను. ఈవిధంగా గుణకర్మల విభాగముచేతనే వర్ణవిభాగము ఏర్పడెను. కాని స్వేచ్ఛగా కర్మచేత వర్ణము మారును అని దీనియర్థముకాదు. వర్ణమునకు మూలము జన్మమే. కర్మ ఆజన్మ స్వరూపరక్షణములో ప్రధానముగా కారణమగును.

1. అంతఃకరణము, వశమునందుంచుకొని అది చలించకుండ శాంతముగా నుంచుట, ప్రాపంచిక విషయముల చింతనము విడుచుట శమము.

2. ఇంద్రియములన్నిటిని వశపరచుకొనుట, వశపరచుకొనబడిన ఇంద్రియములను బాహ్యవిషయములనుండి తొలగించి పరమాత్మ ప్రాప్తి సాధనములందు లగ్నముచేయుట దమము.

3. స్వధర్మ పాలనముకొరకు కష్టములను సహించుట - అనగా అహింసాది మహావ్రతములను పాలించుట భోగసామగ్రిని త్యజించి నిరాడంబరముగ నుండుట ఏకాదశ్యాది వ్రతోపవాసాదులు చేయుట, వనవాసము ఇవి యన్నియు తపస్సులో అంతర్గతములు.

4. శరీరేంద్రియ మనస్సులను, అవిచేయు పనులను, పవిత్రములుగనుంచుట వానిలో ఏ విధమైన అపరిశుద్ధిని ప్రవేశింప చేయకుండుట శౌచము. ఇది భగవద్గీత పదమూడవ అధ్యాయము ఏడవ శ్లోకము టిప్పణిలో విస్తారముగ చెప్పబడినది.

5. ఇతరులు చేసిన అపరాధములను క్షమించుట క్షాంతి భగవద్గీత ప్రథమాధ్యాయము నాల్గవశ్లోకపుటిప్పణిలో దీని విస్తారము కలదు.

6. శరీరేంద్రియ మనస్సులను సరళముగానుంచుట- అనగా మనస్సులో ఏ విధమైన దురాగ్రహము, పొగరు లేకుండుట, మనోభావమును ఇంద్రియముల ద్వారా ప్రకటించుట, ఇదిగాక శరీరమునందుకూడ ఏ విధమైన

అర్జునా! అంతఃకరణ విగ్రహము చేయుట, ఇంద్రియముల దమనము చేయుట, ధర్మపాలనము కొరకు కష్టములు సహించుట, బాహ్యముగను అంతరంగములోను పరిశుద్ధముగనుండుట, ఇతరుల అపరాధములను సహించుట శరీరేంద్రియ మనస్సులను సరళముగనుంచుట వేదశాస్త్ర పరమేశ్వర పరలోకాదులందు శ్రద్ధగలిగియుండుట, వేదశాస్త్రములయొక్క అధ్యయన అధ్యాపనములను చేయుట, పరమాత్మ తత్త్వమును అనుభవించుట- ఇవియన్నియు బ్రాహ్మణునకు స్వాభావికములైన కర్మలు.

శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్ ।
దానమీశ్వర భావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్ ॥ 43

అర్జునా! శూరత్వము, తేజస్సు, ధైర్యము, చాతుర్యము, యుద్ధము నుండి పారిపోకుండుట, దానమిచ్చుట, స్వామిభావము ఇవియన్నియు క్షత్రియుని స్వాభావికకర్మలు.

కృషి గౌరక్ష్య వాణిజ్యం వైశ్యకర్మ స్వభావజమ్ ।

---

గర్వాభిమానములు లేకుండుట ఇవియన్నియు ఆర్జవము నందంతర్గతములు.

7. వేదశాస్త్రములను. శ్రద్ధతో అధ్యయనాధ్యాపనములను చేయుట, వానిలో వర్ణింపబడిన ఉపదేశమును పూర్తిగా తెలిసికొనుట ఇక్కడ జ్ఞాన మనబడును.

8. వేదశాస్త్రములందు చెప్పబడినట్టి మహాపురుషులనుండి వినబడినట్టి సాధనములద్వారా పరమాత్మ స్వరూపమును సాక్షాత్కరింపజేసికొనుట ఇక్కడ విజ్ఞాన మనబడును.

9. వేద-శాస్త్ర- ఈశ్వర- పరలోకముల అస్తిత్వమందు పరిపూర్ణ విశ్వాసముంచుట, వేదశాస్త్రములయొక్క, మహాత్ములయొక్కయు వచనములు యథార్థములని తలచుట- ధర్మపాలనమందు దృఢమైన విశ్వాసముంచుట ఇవియన్నియు ''ఆస్తికత్వము" యొక్క లక్షణములు.

పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్ ॥ 44

అర్జునా! కృషి (వ్యవసాయము) గోపాలనము, క్రయవిక్రయరూప సత్య వ్యవహారము, ఇవి వైశ్యుని స్వాభావిక కర్మలు. అన్నివర్ణములవారి సేవచేయుట శూద్రుని స్వాభావిక కర్మ.

సంబంధము :

ఈ విధముగా భగవంతుడు నాల్గు వర్ణములవారి స్వాభావికకర్మలను వర్ణించి యిప్పుడు భక్తి సహిత కర్మయోగ స్వరూపము, దాని ఫలము తెలుపుట కొఱకు ఆ కర్మలను ఏ విధముగా ఆచరించుటచేత మనుష్యుడు అనాయాసముగా పరమసిద్ధిని పొందగలడు? అను విషయము రెండు శ్లోకములలో చెప్పుచున్నాడు.

స్వే స్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః ।
స్వకర్మనిరతః సిద్ధిం యథా విందతి తచ్ఛృణు ॥ 45

అర్జునా! తన తన స్వాభావిక కర్మలందు ఆసక్తితో నిమగ్నుడైన మనుష్యుడు భగవత్ప్రాప్తి రూపమైన పరమసిద్ధిని పొందగలడు.[1] తన స్వాభావిక కర్మయందు నిమగ్నుడైన మనుష్యుడు ఏ విధముగ కర్మ చేసి పరమసిద్ధిని పొందునో ఆవిధిని చెప్పెదవినుము.

---

1. సమాజ శరీరమునకు మస్తిష్కము వంటివాడు బ్రాహ్మణుడు. బాహువులు క్షత్రియులు, తొడలు వైశ్యులు, చరణములు శూద్రులు. ఈ నాల్గు తెగల వారు సమాజ శరీరమునకు ఆవశ్యకములైన నాల్గు అంగములు. వీరు ఒండొరుల సహాయముతో సురక్షితముగా జీవించుచున్నారు. ఇందులో అసహ్యము అవమానము అనుభావములు పెట్టుకొనవలసిన అవసరము లేదు. అందులో ఏ ఒక తెగకుకూడ కొంచెమైనను తిరస్కారము నింద చేయకూడదు. ఈ నలుగురిలో ఉచ్చ నీచ భావము కల్పించుటకు వీలు లేదు. తమ తమ స్థానములను, తమ తమ కార్యములను అనుసరించి నలుగురును పెద్దవారే. బ్రాహ్మణులు జ్ఞానబలముతో, క్షత్రియులు బాహుబలముతో, వైశ్యులు ధన బలంతో, శూద్రులు జన బలముతో అథవా పరి-

యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్ ।
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః॥ 46

అర్జునా! ఏ పరమేశ్వరునినుండి సమస్త ప్రాణుల ఉత్పత్తి ఐనదో ఏ పరమేశ్వరుడు జగత్తునందు అంతట వ్యాపించియున్నాడో అట్టి పరమేశ్వరుని తన స్వాభావిక కర్మలచే పూజించిన[1] మనుష్యుడు పరమసిద్ధిని పొందగలడు.

---

శ్రమ బలములో పెద్దవారు ఈ నలుగురు సమాజమునకు పరిపూర్ణముగా ఉపయోగపడువారే.

ఒక పేయింటిలో నలుగురు సోదరులవలె సమ్మిళితముగా ఆయింటి ఉన్నతి కొఱకు ఆ నలుగురు సంతోషముతో తమ తమ యోగ్యతానుసారముగ వేర్వేరు ఆవశ్యక కర్తవ్యములను పాలించుటలో నిమగ్నులై యుండెదరు. ఈ నాల్గు వర్ణములవారు పరస్పరము బ్రాహ్మణ ధర్మ స్థాపనము ద్వారా క్షత్రియ బాహుబలము ద్వారా, వైశ్య ధన బలముద్వారా, శూద్రుల శారీరక శ్రమ బలముద్వారా ఒండొరుల హితముకొఱకు పాటుపడుచు సమాజ శక్తిని వృద్ధి పొందించుచు పరమ సిద్ధిని పొందెదరు.

1. భగవంతుడు జగదుత్పత్తి స్థితిసంహారములు చేయువాడు. సర్వశక్తి సంపన్నుడు. సర్వాధారుడు, సర్వప్రేరకుడు - సర్వాత్మ సర్వాంతర్యామి. సర్వవ్యాపియైయున్నాడు. ఈ సమస్త ప్రపంచము అతని రచనయే. ఆయన స్వయముగనే తన యోగమాయచేత జగద్రూపములో ప్రకటితుడైనాడు. కనుకనే ఈ సర్వజగత్తు భగవంతునిదే నా శరీరేంద్రియ మనోబుద్ధులచేత నేను చేయు స్వభావరుచితములైన యజ్ఞదానాది కర్మలన్నియు భగవంతునివే నేను భగవంతునివాడనే. సమస్త దేవతలయొక్క యితర ప్రాణుల యొక్కయు ఆత్మయగుటచేత, ఆయనయే సర్వకర్మలకు భోక్త (గీత 5-29) మిక్కిలి శ్రద్ధా విశ్వాసములతో ఇట్లు సర్వ కర్మలయందున్ను, మమకార-ఆసక్తి-ఫలేచ్ఛలను పూర్తిగావిడిచి, భగవదాజ్ఞానుసారముగా, ఆయన సంతోషముకొరకే, తన కర్తవ్యములను పాలించుచు, తన స్వాభావికకర్మలచేత సమస్త ప్రపంచమును సేవించుట, సమస్త

సంబంధము :-

పూర్వ శ్లోకములో మనుష్యుడు తన స్వాభావిక కర్మలద్వారా పరమేశ్వర పూజచేసి, పరమసిద్ధిని పొందగలడు. అను విషయము చెప్పబడెను. దీని పైన ఒకవేళ క్షత్రియుడు తన యుద్ధాది క్రూర కర్మలను చేయక బ్రాహ్మణులవలె అధ్యాపనాది శాంతిమయ కర్మలచేత తన జీవన నిర్వాహమును చేసికొని పరమాత్మను పొందుటకొఱకు ప్రయత్నించిన యెడల-లేక ఈ విధముగనే ఎవరైన వైశ్యులు శూద్రులుగూడ తమ కర్మలు ఉన్నతజాతివారి కర్మలకంటె హీనమని తలచి వానిని విడిచి తనకంటె పై జాతివారి వృత్తిచేత జీవన నిర్వాహముచేసికొని పరమాత్మను పొందుటకొఱకు ప్రయత్నము చేసినయెడల అది ఉచితమా! కాదా అను శంక కలుగవచ్చును. దానికి సమాదానముగ భగవంతుడు ఇతరుల ధర్మము కంటె స్వధర్మము శ్రేష్ఠమని తెలిపి స్వధర్మ-త్యాగమును నిషేధించుచున్నారు.

---

ప్రాణులకు సుఖము గలిగించుటయే తన స్వాభావిక కర్మలచేత పరమేశ్వరుని పూజచేయుట యనబడును.

ఏ వర్ణాశ్రమములందున్న వాడైనను, ప్రతి మనుష్యుడు తన కర్మలచేత భగవంతుని పూజించి, పరమసిద్ధి రూపుడైన పరమాత్ముని పొందగలడు. పరమాత్ముని పొందుటకుఅందరికిని సమానముగా నధికారముకలదు. తన శమ దమాది కర్మలను, పైన చెప్పబడిన విధముగా భగవంతునకు అర్పించి దానిచేత భగవంతుని పూజించు బ్రాహ్మణుడు ఏ పదము పొందునో, తన శౌర్య పరాక్రమాది కర్మలద్వారా భగవంతుని పూజించు క్షత్రియుడుగూడ ఆ పదమునే పొందును. అట్లే తన కృషికర్మాదులచేత భగవత్పూజచేయు వైశ్యుడు తన సేవలకు సంబంధించిన కర్మలచేత భగవంతుని పూజచేయు శూద్రుడుగూడ, ఆ పరమపదమునే పొందగలడు కనుకనే, కర్మబంధనములనుండి విముక్తిపొంది, పరమాత్మను పొందుటకు ఇది చాల సులభమైన మార్గము-కాబట్టి మనుష్యుడు పైన చెప్పబడిన భావముచేత, తన కర్తవ్య పాలనముద్వారా, పరమేశ్వరునియొక్క పూజ చేయుటకు అభ్యాసము చేయవలెను.

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్ ।
స్వభావనియతం కర్మ కుర్వన్ నాఽఽప్నోతి కిల్బిషమ్॥ 47

అర్జునా! బాగుగా ఆచరించబడిన పరధర్మముకంటె[2] గుణహీనమైనను

---

1. వర్ణాశ్రమ స్వభావ పరిస్థితుల దృష్ట్యా ఎవనికి ఏ కర్మ విహితమైనదో అతనికి అదియే స్వధర్మము అసత్య-కపట-చౌర్య-హింసా-వంచన-వ్యభిచారాది నిషిద్ధకర్మలు ఎవరికికూడ స్వధర్మములుకావు. కామ్య కర్మలుగూడ ఎవరికిని అవశ్య కర్తవ్యములుకావు. కనుక వాని గణనము ఇక్కడ ఏ స్వధర్మములందును చేయబడలేదు. అవి విడిచి, ఏ వర్ణమునకు ఆశ్రమమునకు, ఏ విశేషధర్మములు తెలుపబడెనో. వేనియందు ఇతర వర్ణాశ్రమములవారికి అధికారము లేదో అవియైతే ఆయా వర్ణాశ్రమముల వారికి విడివిడిగా స్వధర్మములు. ఏ కర్మలు చేయుటకు ద్విజులకు మాత్రమే అధికారము ఉన్నదని చెప్పబడెనో ఆవేదాధ్యయన యజ్ఞాది కర్మలు ద్విజులకు స్వధర్మములు. ఏవియైతే అన్ని వర్ణాశ్రమ స్త్రీపురుషులకు అనుష్ఠించుట కధికారముకలదో అట్టి ఈశ్వరభక్తి, సత్య భాషణము, మాతా పితృసేవ, ఇంద్రియ నిగ్రహము. బ్రహ్మచర్య పాలనము, వినయము ఇత్యాది సామాన్య ధర్మములు అందరికి స్వధర్మములే.

2. ఏ కర్మలు గుణయుక్తములో, వేని యనుష్ఠానముగూడ పూర్తిగా చేయబడెనో కాని ఏవి అనుష్ఠానము చేయువారికొఱకు విహితములుకాక ఇతరులకు విహితములో అట్టి కర్మలు శ్రద్ధగా బాగుగ ఆచరించుటకన్న-అనగా ఎట్లైతే వైశ్య క్షత్రియాదులకన్న బ్రాహ్మణుని విశేష ధర్మములందు అహింసాది సద్గుణములు అధికముగనుండునో గృహస్థునికన్న సన్న్యాసాశ్రమధర్మములందు సద్గుణముల బాహుళ్యముండునో ఆ విధముగనే శూద్రుని కన్న వైశ్య క్షత్రియులకర్మలు గుణయుక్తములు-అటువంటి పరధర్మము కన్న గుణరహితమైన స్వధర్మమే శ్రేష్ఠము. ఇందలి భావమేమనగా ఎట్లైతే చూచుటకు కురూపుడుగానుండి గుణరహితుడైనను భార్యకు తన పతి సేవనము శ్రేయోదాయకమో అవిధముగనే చూచుటకు గుణ హీన

తన ధర్మము శ్రేష్ఠము[1]. ఎందుకనగా స్వభావముచేత నియమింపబడిన స్వధర్మ రూపమైన కర్మ చేయుచున్న మనుష్యుడు పాపమును పొందడు[2].

సహజం[3] కర్మ కౌంతేయ సదోషమపి న త్యజేత్ ।
సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్ని రివావృతాః ॥ 48

---

మైనను వాని అనుష్ఠానమునందు అంగములలోపమున్నను ఎవనికి ఏకర్మ విహితమో అదియే అతనికి శ్రేయస్సు కలిగించునదిగా నుండును.

1. క్షత్రియుని స్వధర్మము యుద్ధముచేయుట-దుష్టులను దండించుట. అతని యందు అహింసా-శాంత్యాది గుణములు తక్కువగానుండును. ఇట్లే వైశ్యుని కృషి కర్మాదులలోగూడ హింసాదికర్మల దోషముల బాహుళ్య ముండును. కనుక బ్రాహ్మణుల శాంతిమయ కర్మలకన్న అవిగుణ హీనములుగ నుండును. శూద్రులకర్మలు, క్షత్రియ వైశ్యుల కర్మలకన్న తక్కువ తరగతికి చెందినవి. ఇదిగూడ ఆకర్మల అనుష్ఠానములో ఏ యంగము లోపించినను. గుణ హీనమగును. పైన చెప్పబడిన విధముగా స్వధర్మములో గుణములు తక్కువైనను అవి గుణయుక్తములైన పర ధర్మములకన్న శ్రేష్ఠములని తెలియవలెను.

2. ఇతరులధర్మముల ననుష్ఠించుటచేత వానిలో హింసాదిదోషములు తక్కువగ నున్నప్పటికిన్ని, ఇతరులవృత్తిని భంగము గలిగించుటవలన గలుగు పాపము సంభవించును. కాని తన స్వాభావికకర్మలను వరించునప్పుడు, వానిలో ఆనుషంగికముగా (వాని ననుసరించి తప్పనిసరిగా) పాపములు సంభవించినను అవి వానికి అంటవు.

3. వర్ణ ఆశ్రమ స్వభావ పరిస్థితుల దృష్ట్యా ఎవనికి ఏ కర్మ విహితమని చెప్పబడెనో అతనికి అదియే సహజకర్మయగును. కనుకనే ఈ యధ్యా యమునందు ఏ కర్మలవర్ణనము స్వధర్మ స్వకర్మ నియతకర్మ స్వభా వని యతకర్మ స్వభావజకర్మలు అనుపేర్లతో చేయబడెనో అవియే యిక్కడ "సహజ"కర్మలని చెప్పబడెను.

అర్జునా ! కనుకనే దోషయుక్తమైనను సహజకర్మ[1] విడువకూడదు. ఎందు కనగా ధూమముచేత అగ్నివలె కర్మలన్నియు ఏదోయొక దోషము కలిగియే యుండును.[2]

సంబంధము :

భగవంతుడు పదుమూడవ శ్లోకమునుండి నలువదియవ శ్లోకమువరకు సంన్యాసము అనగా సాంఖ్యమును నిరూపించెను. తరువాత నలువది యొకటవ శ్లోకమునుండి ఇంతవరకు కర్మయోగ రూపమైన త్యాగముయొక్క తత్త్వమును వివరించి తెలుపుటకొరకు స్వాభావిక కర్మల స్వరూపమును వాని అవశ్య కర్తవ్యత్వమును నిర్దేశించి చెప్పి కర్మయోగమునందు భక్తియొక్క సహయోగమును తెలిపి దానిఫలము భగవత్ప్రాప్తియేయని చెప్పెను. కాని అక్కడ సన్న్యాస ప్రక

1. శ్రేష్ఠగుణయుక్తమైన స్వభావకర్మను విడువకూడదు. ఇట్లనుటచేత దేనిలో సాధారణముగా హింసాది దోష మిశ్రణము కనబడునో ఆ కర్మలుకూడ శాస్త్రవిహితములు న్యాయోచితములు నగుటచేత దోషయుక్తములుగా కనబడినను వాస్తవముగా అవి దోషయుక్తములుకావు- కనుక ఆ కర్మలు గూడ విడువకూడదు. అని వేరుగా చెప్పవలసిన అవసరమేమున్నది.

2. ఏవిధముగ ధూమముచేత అగ్ని ఓతప్రోత (మిశ్రిత)మై యుండునో ధూమము అగ్నినుండి పూర్తిగా వేరుకాజాలదో ఆ విధముగనే ఆరంభ దోషముచేత మాత్రమే ఓతప్రోతమై క్రియా మాత్రమునందు ఏదోయొక విధముగ ఏదియోయొక ప్రాణికి హింసకలుగును. ఎందుకనగా సన్న్యాసాశ్రమమునందుకూడ శౌచస్నాన భిక్షాటనాది కర్మలద్వారా ఏదోయొక అంశమునందు ప్రాణుల హింస జరుగనే జరుగును. బ్రాహ్మణుల యజ్ఞాది కర్మ ఆరంభమునందుకూడ క్రియాబాహుళ్య ముండుటచేత క్షుద్రప్రాణుల హింస జరుగును. కనుక ఏ వర్ణాశ్రమ కర్మలుకూడ సాధారణ దృష్టితో పూర్తిగా దోషరహితములుకావు. కర్మచేయక ఎవరును ఉండజాలరు. (గీత 3-5) ఈ కారణముచేత స్వధర్మ త్యాగము చేసిన తరువాతగూడ ఏదోయొక కర్మ మనుష్యుడు చేయవలసియే యుండును. అతడు ఏకర్మ చేయునో, అది నీచమని తలచి స్వధర్మత్యాగము చేయరాదు.

రణమునందు సన్న్యాసమునకు ఏమిఫలము కలుగును. కర్మములందు కర్తృత్వాభిమానము విడిచి ఉపాసనా సహిత సాంఖ్యయోగ సాధనము. ఏ విధముగా చేయవలెను. అను విషయము చెప్పలేదు. కనుక ఇక్కడ ఉపాసనా సహిత వివేకము వైరాగ్య పూర్వకముగా ఏకాంతమునందు ఉండి సాధనము చేయువిధి, దాని ఫలము తెలుపుటకొరకు మరల సాంఖ్యయోగ ప్రకరణము ఆరంభించుచున్నాడు.

అసక్తబుద్ధిః సర్వత్ర జితాత్మా విగతస్పృహః ।
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసేనాధిగచ్ఛతి ॥ 49

అర్జునా! అన్నిటియందు ఆసక్తి లేని బుద్ధిగలవాడు, స్పృహలేనివాడు అంతఃకరణమును జయించిన పురుషుడు[1] సాంఖ్యయోగముద్వారా ఆ పరమ నైష్కర్మ్య సిద్ధిని పొందగలడు [2]

సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాఽప్నోతి నిబోధ మే ।
సమాసేనైవ కౌంతేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా ॥ 50

---

1. ఇంద్రియ మనస్సహితమైన శరీరమందు, వానిచేత చేయబడు కర్మలందు సమస్త భోగములందు చరాచర ప్రాణి సహిత సమస్త జగత్తునందు ఎవనికి ఆసక్తి పూర్తిగా లేదో, ఎవని మనోబుద్ధులకు కొంచెముకూడ వానితో సంబంధము లేదో అతడు "అంతట ఆసక్తి లేని బుద్ధి గలవాడు" అనబడును. ఎవనికి స్పృహ పొత్తిగా లేదో, ఏ ప్రాపంచిక వస్తువునందున్న కొంచెముకూడ లక్ష్యములేదో అతడు "స్పృహా రహితుడు అనబడును. ఎవనికి ఇంద్రియములు మనస్సు లెశమునందు ఉన్నవో అతడు జయించబడిన అంతఃకరణము కలవాడు అనబడును. పైన చెప్పబడిన మూడు గుణములు కలవాడు. సాంఖ్యయోగముచేత పరమాత్మయొక్క యథార్థ జ్ఞానమును పొందగలడు.

2. సన్న్యాసము జ్ఞానయోగము అనగా సాంఖ్య యోగ స్వరూపమునుగూర్చి భగవంతుడు ఏబది యొకటవ శ్లోకమునుండి ఏబది మూడవ శ్లోకమువరకు చెప్పెను. ఈ సాధనములకు ఫలము కర్మబంధనమునుండి పూర్తిగా విడి

కుంతీపుత్రా! ఏదియైతే జ్ఞానయోగముయొక్క పరానిష్ఠయో అనైష్కర్మ్య సిద్ధిని[1] ఏ విధముగాపొంది మనుష్యుడు బ్రహ్మనుపొందగలడో[2] ఆవిధము సంక్షేప ముగా చెప్పబడును, వినుము.

బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాఽఽత్మానం నియమ్య చ ।
శబ్దాదీన్ విషయాంస్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ॥ 51

వివిక్తసేవీ లఘ్వాశీ[3] యతవాక్కాయమానసః ।
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః॥ 52

అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్ ।
విముచ్య నిర్మమః శాంతో బ్రహ్మభూయాయ కల్పతే॥ 53

---

వడి సచ్చిదానంద ఘన నిర్వికార పరమాత్మయొక్క యథార్థ జ్ఞానమును పొందుటయే పరమ నైష్కర్మ్యసిద్ధి అనబడును. అది సంన్యాసముచేత పొందబడును.

1. ఏది జ్ఞానయోగముయొక్క అంతిమస్థితియో, దేనినిపరాభక్తి తత్త్వజ్ఞానము అనికూడ అనెదరో ఏది సమస్త సాధనములకు చివరి పరిమితియో, ఏది పూర్వ శ్లోకములో నైష్కర్మ్య సిద్ధియని చెప్పబడెనో అదియే యిక్కడ సిద్ధి అని పరాకాష్ఠ అని చెప్పబడెను.

2. నిత్య-నిర్వికార, నిర్గుణ-నిరాకార, సచ్చిదానందఘన, పూర్ణబ్రహ్మమైన పరమాత్మ యిక్కడ "బ్రహ్మ" పదమునకు అర్థము. తత్త్వజ్ఞానముచేత, ఏబదియైదవ శ్లోకములో చెప్పబడినట్లు అభిన్నభావముచేత ఆ పరమాత్మలో ప్రవేశించియుండుటయే ఆయనను పొందుట యనబడును.

3. సాధనమునకు ఉపయుక్తముగా, అనాయాసముగా జీర్ణించు సాత్త్విక పదార్థములు (గీత 17-8) తన ప్రకృతికి, ఆవశ్యకతకున్న అనుగుణముగా శక్తి ననుసరించి, నియమితముగా, పరిమితముగాను భోజనముచేయు యుక్తాహార విహారుడు (గీత 6-17) "లఘ్వాశి" యనబడును.

అర్జునా! విశుద్ధ బుద్ధిగలవాడు[1] తేలికయైన సాత్త్వికమైన నియమితమైన భోజనం చేయువాడు శబ్దాది విషయములను త్యజించి ఏకాంతము పరిశుద్ధమునైన ప్రదేశమును ఆశ్రయించి యుండువాడు[2] సాత్త్విక ధారణశక్తిచేత అంతఃకరణమును ఇంద్రియములను నియంత్రణములో నుంచుకొనినవాడు[3] మనో వాక్శరీరములను వశపరచుకొనినవాడు[4] రాగద్వేషములను పూర్తిగా నశింపజేసి[5] బాగుగా దృఢ వైరాగ్యము నాశ్రయించువాడు అహంకార బలదర్ప కామ క్రోధ పరిగ్రహములను విడిచి నిరంతరము ధ్యానయోగ పరాయణుడై యుండువాడు[6] మమకార

---

1. పూర్వజన్మ సంపాదిత పాపసంస్కారములులేని అంతఃకరణముగలవాడు విశుద్ధబుద్ధి గలవాడనబడును.

2. వాతావరణము పవిత్రముగా అనేకుల రాకపోకలు సహజముగానే యేకాంతముగా, స్వచ్ఛముగా ఊడ్చి-కడుగబడి-తుడువబడియు నుండిన నదీతీర-దేవాలయ-వన-పర్వత గుహాది స్థానములలో నివసించుటయే ఏకాంతము పరిశుద్ధమునైన ప్రదేశమును సేవించుటయగును.

3. ఇంద్రియములకు-అంతఃకరణమునకు సమస్త విషయముల సంబంధము విచ్ఛిన్నము చేయుటయే ఇంద్రియాంతః కరణముల నిగ్రహమనబడును.

4. మనో-వాక్-శరీరములు స్వేచ్ఛగా సంచరించుట, బుద్ధిని చలింపజేయు శక్తి లేకుండునట్లు చేయుటయే, వానిని వశములోనుంచుకొనుట యనబడును.

5. ఇహలోక-పరలోకము లందలి యే భోగమునందుగూడ, ఏప్రాణియందున్ను, ఏపదార్థమునందున్ను, కర్మయందున్ను, ఘటనమునందున్ను, కొంచముగూడా, ఆసక్తిగాని, ద్వేషముగాని లేకుండ జేయుటయే రాగద్వేషములను పూర్తిగా నశింపచేయుట యనబడును.

6. శరీరేంద్రియాంతః కరణములందు ఆత్మబుద్ధి గలిగియుండుట చేత మనుష్యులు మనో-బుద్ధి-శరీరములచేత చేయబడు కర్మలకు తాము కర్తయని తలచు భావము 'అహంకార' మనబడును. అన్యాయపూర్వకముగా, బలాత్కారముచేత, ఇతరులందు అధికారమువహించు సాహసము, "బల"మన

రహితుడై[1] శాంతియుక్తుడైన పురుషుడు[2] సచ్చిదానంద ఘన బ్రహ్మమునందు అభిన్న భావముతో ఉండుటకు పాత్రుడగును.

---

బడును. ధన-జన-విద్యా-బల-జాతి-శరీరక శక్తులు మొదలైనవి కారణములు గాగలుగు గర్వము 'దర్పము' అనగా 'పొగరు' అనబడును. ఇహలోక - పరలోకములను పొందవలెను ఇచ్ఛ 'కామ' మనబడును. తన మనస్సునకు వ్యతిరేకముగా ఆచరించువారి యెడల, నీతి విరుద్ధముగా నాచరించువారి యెడలను అంతఃకరణము నందు ఉత్తేజన (కోప) భావము ఉత్పన్నమై దానివలన మనుష్యుని కన్నులు ఎఱ్ఱబడి, పెదవులు అదరుచుండి, హృదయములో మండుచుండి ముఖము వికృతమైయుండుట, (క్రోధ)మనబడును. అనుభవించదగినవను తలంపుచేత ప్రాపంచిక సుఖ సామగ్రిని చేకూర్చుకొనుట, 'పరిగ్రహ'మనబడును. కనుక నే యీ యన్నిటిని విడిచి, పూర్వోక్త విధముగా సాత్త్విక ధృతిచేత, ఇంద్రియముల యొక్క మనస్సు యొక్కయు క్రియలను నివారించి అన్ని స్ఫురణ (తోచుట)ములను పూర్తిగా లేకుండ జేసికొని, సర్వధా నిరంతరము సచ్చిదానంద ఘన బ్రహ్మమును అభిన్నబావముతో ధ్యానించుట (గీత 6-25) లేచుట, కూర్చొనుట నిద్రించుట మేల్కొనుట, శౌచ-స్నానములు, ఆహార పానీయములు మొదలైన అవశ్యకకర్మలు చేయునప్పుడుగూడ సర్వదా, నిరంతరము పరమాత్మస్వరూప ధ్యానముచేయుచుండుట, అదియే అన్నిటి కంటె మించి పరమకర్తవ్యముగా భావించుట, ధ్యానయోగ పరాయణుడై యుండుట" యనబడును.

1. ఇంద్రియ-మనస్సహిత శరీరమునందు, సర్వప్రాణులందు సర్వకర్మలందు, సమస్తసుఖములందు జాతి-కుల-దేశ-వర్ణ-ఆశ్రమములందున్న మమకారము పూర్తిగా విడుచుట మమకార రహితముగా నుండుట'యనబడును.

2. అంతఃకరణమునందు విక్షేపము (చంచలత్వము) పూర్తిగా లేకుండి, అంతఃకరణము అచంచలముగా, శాంతితో శుద్ధముగా, ప్రసన్నతతోను వ్యాపించి యుండి అన్ని విషయములు అణిగిన పురుషుడు 'శాంతియుక్తు' డనబడును.

బ్రహ్మభూతః[1] ప్రసన్నాత్మా[2] న శోచతి న కాంక్షతి ।
సమః సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్॥ 54

అర్జునా! తరువాత నతడు సచ్చిదానంద ఘన బ్రహ్మమునందు ఏకీభావంతోఉండిన ప్రసన్న మనస్సుగల యోగియై దేని కొరకుగూడ శోకించడు. దేనిని ఆకాంక్షించడు[3]. ఇట్లు సమస్త ప్రాణులయందు సమభావంగల యోగి నా పరమ భక్తిని[4] పొందగలడు.

---

1. ఎవడు సచ్చిదానంద ఘన బ్రహ్మమునందు అభిన్నభావముతో నుండునో ఎవని, దృష్టిలో సచ్చిదానంద బ్రహ్మముకంటే వేరైన యే వస్తువు యొక్క అస్తిత్వములేదో "అహం బ్రహ్మాస్మి - నేను బ్రహ్మ" [బృహదారణ్యకోపనిషత్తు 1-4-10] సోఽహమస్మి-అ బ్రహ్మ మే నేను, ఇత్యాది వాక్యముల ప్రకారము, ఎవనిస్థితి పరమాత్మయందు అభిన్న భావముతో శాశ్వతము అచంచలమునైయున్నదో అట్టి సాంఖ్యయోగి యిక్కడ 'బ్రహ్మభూతః'అను పదముచేత చెప్పబడియున్నాడు. గీత 5వ అధ్యాయము 24వ శ్లోకముతో, 6వ అధ్యాయము 27వ శ్లోకములోగూడ ఈ స్థితిగలయోగి బ్రహ్మభూతుడు అనబడెను.

2. ఎవని మనస్సు పవిత్రము స్వచ్ఛము శాంతముగనుండునో నిరంతరము పరిశుద్ధముగ ప్రసన్నముగనుండునో ఆతడు ప్రసన్నాత్మయనబడును.

3. బ్రహ్మభూతుడైన యోగికి అంతట బ్రహ్మబుద్ధియుండుటచేత ప్రపంచమునందు ఏవస్తువులోకూడ బ్రహ్మకంటె భిన్నమైన సత్త రమణీయ బుద్ధి మమకారముఉండవు. కనుకనే శరీరాదులతో సంయోగ వియోగములు కలిగినపుడు అతనికి హర్ష శోకములుఉండవు. కనుక అతడు ఎట్టి పరిస్థితిలోకూడ ఏ కారణముచేతనైనను కొంచెముకూడ చింతా శోకములు పొందడు. అతడు పూర్ణకాముడగును. కనుక అతడు ఏవియుకోరడు.

4. ఏది జ్ఞానయోగఫలమో, దేనిని జ్ఞానముయొక్క పరాకాష్ఠ తత్త్వజ్ఞానము అనికూడ అనెదరో అదియే 'పరమభక్తి' అనబడును.

భక్త్యా మామభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః ।
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్ ॥ 55

అర్జునా! ఆ పరాభక్తిచేత అతడు పరమాత్మయైన నన్ను, నేనెవడనో ఎట్లుగా ఉన్నానో అట్లే ఉన్నదున్నట్లు సరిగా తాత్త్వికముగా తెలిసికొనును[1]. ఆ భక్తిచేత నన్ను తాత్త్వికముగా తెలిసికొనిన వెంటనే నా యందు ప్రవేశించి పోవును[2].

సంబంధము:-

అర్జునుని జిజ్ఞాసననుసరించి త్యాగముయొక్క అనగా కర్మయోగముయొక్క సన్న్యాసముయొక్క అనగా సాంఖ్యయోగముయొక్క తత్త్వము వేరు వేరుగా వివరించి తెలిపి భగవంతుడు ఆ రెండింటిలో నీకు సాధనమే కర్తవ్యము అని చెప్పలేదు. కనుకనే అర్జునునకు భక్తి ప్రధాన కర్మయోగము ఉపదేశించు నుద్దేశ్యముతో ఇప్పుడు భక్తి ప్రధాన కర్మయోగ మహిమనుగూర్చి చెప్పుచున్నారు.

సర్వకర్మాణ్యపి[3] సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః ।

---

1. ఈ పరాభక్తి రూప తత్త్వజ్ఞానప్రాప్తి కలుగుటతోపాటే ఆ యోగి ఆ తత్త్వ జ్ఞానముద్వారా నా యథార్థరూపమును తెలిసికొనును. నాయొక్క నిర్గుణ నిరాకార రూపము ఏది? సగుణ నిరాకారరూపము సగుణ సాకారరూపము ఏది? నేను నిరాకారమునుండి సాకారముగ ఎట్లు అయ్యేదను? సాకారము నుండి నిరాకారుడ నెట్లయ్యేదను? ఇత్యాదులేవియు అతనికి తెలిసికొన వలసినవి మిగిలియుండవు.

2. పరమాత్మ తత్త్వజ్ఞానము, తత్ప్రాప్తిలో వ్యవధానముఉండదు. పరమాత్మ స్వరూపమును యథార్థముగ తెలిసికొనుట ఆయనలో ప్రవేశించుట ఇవి రెండు ఒకటిగానే జరుగును. ఆయన సర్వాత్మ స్వరూపుడగుటచేత వాస్తవముగా ఎవరికిని అప్రాప్యుడుకాడు కనుక అతని యథార్థ స్వరూప జ్ఞానము లోనే అతని ప్రాప్తి కలుగును.

3. తన వర్ణాశ్రమముల ననుసరించి, ఇంతకుపూర్వము నియతకర్మ స్వభావజ

మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్॥ 56

అర్జునా! నాయందు ఆసక్తిగల[1] కర్మయోగి సమస్త కర్మలను ఎల్లప్పుడు చేయుచుండియు నా కృపచేత సనాతనము అవినాశియునైన పరమపదమును[2] పొందగలడు[3].

---

కర్మ అను పేర్లతో వర్ణింపబడిన శాస్త్రవిహిత కర్మలన్నియు భగవంతుని ఆజ్ఞకు ప్రేరణకు అనుకూలములైనవి. అది 'సర్వకర్మాణి' అను పదము చేత చెప్పబడినవి.

1. సర్వకర్మలు తత్ఫలములైన భోగములు విడిచి భగవంతునే ఆశ్రయించి తన మనస్సు ఇంద్రియములు శరీరము వానిచేత చేయబడు సర్వకర్మలు తత్ఫలములు భగవంతునకు సమర్పించి వానినుండి మమకార-ఆసక్తి కామనలు తొలగించి భగవత్పరాయణుడే అయి భగవంతుడే తన పరమ ప్రాప్య-పరమ ప్రియ-పరమ హితైషి-పరమాధార సర్వస్వమని తలచి భగవంతుని విధానములందు ప్రసన్నుడైయుండి ప్రాపంచిక వస్తువు యొక్క సంయోగ వియోగములందు మరి యే యితర సంఘటనము లందును హర్షశోకములు చేయక ఎల్లప్పుడు భగవంతునియందే తన సర్వ భారమునువేసి ఉన్న భక్తి ప్రధాన కర్మ యోగియే భగవత్పరాయణుడు అనబడును.

2. ఎల్లప్పటికి ఎవరు ఉండినవాడు, ఉండగలడో, ఎవని అభావము ఎప్పుడు కూడ ఉండదో అట్టి సచ్చిదానంద ఘన పూర్ణ బ్రహ్మ సర్వశక్తి సంపన్న సర్వాధారుడైన పరమేశ్వరుడు పరమ ప్రాప్యుడు గనుక ఆయన "పరమ పదము" అని చెప్పబడెను. ఇదియే నలువదియైదవ శ్లోకములో "సంసిద్ధి" యని నలువదియారవ శ్లోకములో "సిద్ధి" యని ఏబదియైదవ శ్లోకములో "మాం"అను పదములచేత చెప్పబడెను.

3. సాంఖ్యయోగి సమస్త పరిగ్రహములను (సామగ్రిని కూర్చుకొనుట) సర్వ భోగములను విడిచి ఏకాంత ప్రదేశమునందు నిరంతరము పరమాత్మ ధ్యానముచేయుచు ఏ పరమాత్మనుపొందునో, భగవదాశ్రయముపొందిన

చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః।
బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తః సతతం భవ॥ 57

అన్ని కర్మలను మనసా నాయందర్పించి[1] సమబుద్ధి రూపయోగమును[2] అవలంబించి మత్ పరాయణుడై[3] నిరంతరం నాయందు చిత్తం కలవాడవుకమ్ము[4].

---

కర్మయోగి తన వర్ణాశ్రమోచితములైన అన్ని కర్మలు సర్వదా చేయుచునే ఆ పరమాత్మనే పొందగలడు. ఆ రెంటి ఫలములో ఏ విధమైన భేదము లేదు.

1 తన యింద్రియ మన శ్శరీరములు-వానిచేత చేయబడు కర్మలు-సమస్త ప్రాపంచిక వస్తువులు భగవంతునివేయనితలచి, ఆయన్నిటియందు మమకార, ఆసక్తి-కామము పూర్తిగా పరిత్యజించుట. నాకు ఏపని చేయుటకు కూడ శక్తిలేదు. భగవంతుడే సర్వవిధ శక్తినిఇచ్చి, నాచేత తన ఇచ్ఛానుసారముగా సమస్త కర్మలు చేయించుచున్నారు. నేనేమియు చేయనని తలచి, భగవదాజ్ఞానుసారము, ఆయనకొరకే, ఆయన ప్రేరణచేతనే, ఆయన చేయించినట్లే, నేను నిమిత్తమాత్రుడనై, సమస్త కర్మలు ఆట బొమ్మవలె చేయుచుండుటయే, సమస్త కర్మలను భగవంతునియందు సమర్పించుట యనబడును.

2. అసిద్ధి, సుఖము-దుఃఖము, లాభము-హాని మొదలగు ప్రాపంచిక సమస్త పదార్థములందు ప్రాణులందు సమబుద్ధియుండుట బుద్ధి యోగ మనబడును.

3. భగవంతుడే తనకు పరమప్రాప్యుడు, పరమగతి పరమహితైషి, పరమప్రియుడు, పరమాధారుడునని తలుచుట, అతని విధానమునందు సర్వదా సంతుష్టుడగుట, తత్ప్రాప్తి సాధనములందు ఆసక్తుడైయుండుట, "భగవత్పరాయణుడగుట"యనబడును.

4. మనోబుద్ధులు స్థిరముగా భగవంతునందు లగ్నముచేయుట, భగవంతుని యందుదప్ప ఇతర వస్తువులందు కొంచెముగూడ ప్రేమ సంబంధము పెట్టుకొనక అనన్య ప్రేమ పూర్వకముగా నిరంతరము భగవంతుని ధ్యానించుచుండుట క్షణమాత్రముగూడ భగవంతునివిస్మృతి సహింప

మచ్చిత్తః సర్వదుర్గాణి మత్ప్రసాదాత్ తరిష్యసి।
అథచేత్ త్వమహంకారాన్న శ్రోష్యసి వినంక్ష్యసి॥ 58

అర్జునా! పైన చెప్పబడిన విధముగా నీవు నాయందు మనస్సు ఉంచిన వాడవై నా కృపచేత సమస్త సంకటములను అనాయాసముగానే తరించగలవు[1]. ఒకవేళ అహంకారమువలన నా మాటలు నీవు విననియెడల నశించెదవు. అనగా పరమార్థమునుండి భ్రష్టుడవయ్యెదవు[2].

---

కుండుట, కూర్చొనుచు, లేచుచు కదులుచు, నడచుచు, తినుచు, త్రాగుచు, నిద్రించుచు, మేల్కొనుచు, ఇతర సర్వకర్మలు చేయుచూగూడ, సర్వదా నిరంతరము, మనస్సులో భగవంతుని దర్శనము చేయుచుండుట. ఇదియే నిరంతరము భగవంతునందు చిత్తముగలవాడగుట యనబడును.

1. నిరంతరము నాయందు మనస్సు లగ్నముచేసిన తరువాత నీకు చేయవలసినదేదియు ఉండదు. నా దయా ప్రభావముచేత అనాయాసముగానే నీ యొక్క ఇహపరలోకముల దుఃఖములన్నియు తొలగిపోవును. నీవు అన్ని విధములైన దుర్గుణ దురాచారములు లేనివాడవై జనన మరణ రూప మహా సంకటమునుండి ఎల్లప్పటికిని విముక్తుడవు కాగలవు. నిత్య-ఆనంద ఘన పరమేశ్వరుడునైన నన్ను పొందగలవు.

2. భగవంతుడు తొలుత "నీవు నా భక్తుడవు" (గీత 4-3)" అని చెప్పెను. "నమేభక్తః ప్రణశ్యతి"అనగా నా భక్తుడెప్పుడుకూడ పతనము చెందడు. (గీత 9.31) అని చెప్పెను. ఇక్కడ "నీవు నశించెదవు-అనగా నీ పతన మగును"అని చెప్పుచున్నాడు. ఇందులో విరోధము తోచుచున్నది. కాని భగవంతుడు స్వయంగానే పైన చెప్పబడిన వాక్యమునందు "చేత్" అను పదము ప్రయోగించి యీ విరోధమునకు పరిహారము చెప్పెను. ఇందలి అభిప్రాయమేమనగా "భగవద్భక్తుడనుట సత్యమే కనుక అతడు భగవంతుని మాట వినడు, ఆయన ఆజ్ఞను పాటించడు అనుమాట ఎప్పుడును సంభవించనే సంభవించదు. కాని ఇంతయైనను ఒకవేళ అహంకారవశుడై భగవదాజ్ఞను తిరస్కరించినచో అతడు భగవద్భక్తుడని తలచబడడు. కనుక అతని పతనము జరుపుటగూడ యుక్తియుక్తముగానున్నది.

యదహంకారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే ।
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి॥ 59

అర్జునా! అహంకారము కలవాడవై "నేను యుద్ధము చేయను[1]" అని నీవు తలచి నిశ్చయించినయెడల అది మిథ్యా నిశ్చయమగును. ఎందుకనగా నీ స్వభావమే నిన్ను యుద్ధమునందు బలవంతముగా నియమించును[2].

స్వభావజేన కౌంతేయ[3] నిబద్ధః స్వేన కర్మణా ।

---

1. మొదట భగవంతుడు యుద్ధముచేయుమని ఆజ్ఞాపించినప్పుడు (గీత 2-3) అర్జునుడు భగవంతునితో "నయోత్స్యే" - (నేను యుద్ధము చేయను) (గీత 2-9) అని చెప్పియుండెను. ఆ విషయమును జ్ఞప్తికి తెచ్చుచు భగవంతుడు "నేను యుద్ధముచేయను"అని నీవు తలచుట కేవలము అహంకారము మాత్రమే. యుద్ధము చేయకుండుట నీచేతకాదు అని చెప్పుచున్నాడు.

2. జన్మ జన్మాంతరములందు చేయబడిన కర్మల సంస్కారము ఈ జన్మమునందు స్వభావముచేతనే ప్రాదుర్భవించెను. ఆ కర్మ సముదాయము ప్రకృతి అనగా స్వభావము అనబడును. ఈ స్వభావము ననుసరించియే మనుష్యుడు వేర్వేరు కర్మలు అనుభవించవలసిన ప్రాణి సముదాయములో జన్మించును. ఆ స్వభావమును అనుసరించియే వివిధ మనుష్యులకు వివిధ కర్మలందు ప్రవృత్తి కలుగును. కనుకనే ఇక్కడ పైన చెప్పబడిన వాక్యముచేత భగవంతుడు ఏ స్వభావమువలన నీవు క్షత్రియకులమునందు జన్మించితివో ఆ స్వభావము నీకు ఇచ్ఛలేకున్నను నిన్ను బలవంతంగా యుద్ధమునందు ప్రవర్తింపజేయును. యోగ్యతకలిగినప్పుడు శౌర్యముతో యుద్ధము చేయవలెను. భయపడి పారిపోగూడదు. ఇది నీ సహజకర్మ. కనుకనే నీవు యుద్ధముచేయక ఉండజాలవు. నీవు యుద్ధము తప్పక చేయవలెను. ఇక్కడ క్షత్రియ సంబంధముచేత అర్జునునకు యుద్ధ విషయమై ఏ మాట చెప్పబడునో ఆ మాటయే ఇతర వర్గములవారుగూడా తమ తమ స్వాభావిక కర్మల విషయములో తెలిసికొన వలయును.

3. అర్జునునితల్లి గొప్ప వీరవనితగానుండెను. ఆమె శ్రీకృష్ణునిచేత సందేశము

కర్తుం నేచ్ఛసి యన్మోహాత్ కరిష్యస్యవశోఽపి తత్॥ 60

కుంతీపుత్రా! ఏకర్మ అయితే నీవు మోహముచేత[1] చేయ గోరకున్నావో దానినికూడ నీపూర్వ జన్మకృత స్వాభావిక కర్మచే బంధింపబడి పరవశుడవై చేసెదవు[2].

---

పంపునపుడు పాండవులను యుద్ధముకొరకు పురికొలిపి యుండెను. కనుక భగవంతుడు ఇక్కడ అర్జునుని "కౌంతేయా!"అని సంబోధించి నీవు వీర మాతకు పుత్రుడవు, స్వయముగాకూడ శూరుడవు కనుక నీవు యుద్ధము చేయకుండ ఉండజాలవు అను భావము తెలిపెను.

1. న్యాయముచేత ప్రాప్తమైన సహజకర్మ చేయకుండుటకు అవివేకమే కాక మరియొక యుక్తి యుక్తమైన కారణము లేదు.

2. ఇక్కడ భగవంతుడు తెలిపిన భావమేమనగా యుద్ధము నీవు నీ స్వభావ మునకు వశుడవై తప్పక చేయవలసియే యుండును. కనుక నొకవేళ నా ఆజ్ఞానుసారముగ అనగా ఏబదియేడవ శ్లోకములో తెలుపబడిన విధి ననుసరించి నీవు యుద్ధము చేసినచో కర్మబంధమునుండి విముక్తుడవై నన్ను పొందెదవు చేయనిచో రాగద్వేషముల వలలో చిక్కుకొని జనన మరణ రూప సంసార సాగరమునందు మునుగుచు తేలుచు నుండెదవు.

ఏ విధముగ నదీ ప్రవాహములో కొట్టుకొని పోవు ఆ మనుష్యుడు ప్రవా హము నెదరించి అవలియొడ్డును చేరలేడు కాని తన నాశమును చేసి కొనునో, ఏదైనఒడను లేక పడవను ఆశ్రయించి, లేక ఈతయందు కళతో జలముపైన ఈదుచు ఆ ప్రవాహమునకు అనుకూలముగ పోయి ఒడ్డు చేరునో ఆ విధముగనే ప్రకృతిప్రవాహమునందు బడిన మనుష్యుడు ప్రకృతిని ఎదురించును. అనగా మొండి పట్టుదలలో కర్తవ్యములను విడిచినవాడు ప్రకృతిని దాటి పోవజాలడు సరికదా అందులో ఇంకను ఎక్కువగా గట్టిగా చిక్కుకొని పోవును. పరమేశ్వరుని లేక కర్మయోగమును ఆశ్రయించి కాని జ్ఞానమార్గానుసారముగగాని తనను ప్రకృతికంటె పైకి ఎత్తి ప్రకృతికి అనుకూలముగా కర్మచేయువాడు కర్మ బంధనమునుండి విముక్తుడై ప్రకృతిని దాటిపోవును అనగా పరమాత్మను పొందును.

సంబంధము :-

పూర్వశ్లోకమునందు కర్మచేయుటలో మనుష్యుడు స్వభావమునకు ఆధీనుడని చెప్పబడెను. దీనిపైన ప్రకృతి (స్వభావము) జడము. అది దేనినైనను తన వశమునందెట్లు తీసికొనును? అను శంకకలుగును. దానికి భగవంతుడిట్లను చున్నాడు.

ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి।
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా॥ 61

అర్జునా! శరీరమను యంత్రమునందు అమర్చబడిన సమస్త ప్రాణులకు అంతర్యామిగానున్న పరమేశ్వరుడు[1] తన మాయచేత వారి కర్మల ననుసరించి భ్రమింపచేయుచు ప్రాణులందరి హృదయములందు నిలిచియున్నాడు[2].

సంబంధము :-

ఇక్కడ కర్మ బంధనమునుండి విడివడి పరమశాంతి లాభమును పొందుట

1. ఇక్కడ శరీరమును యంత్రములోపోల్చి భగవంతుడు తెల్పిన భావమేమనగా రైలుబండి మొదలైన వాహనములుఎక్కిన యాత్రికులు స్వయముగా నడువకుండినను ఆ బండి యంత్రము నడుచుటచేత అతడు గమ్యమునకుపోవును అట్లే ఆత్మనిశ్చలము. దానికి ఏ క్రియతోను వాస్తవముగా ఏలాంటి సంబంధము లేకున్నను అనాది సిద్ధమైన అజ్ఞానముచేత తన శరీరముతో సంబంధము ఉన్నదికనుక ఆ శరీరక్రియ అతని క్రియగా తలచబడుచున్నవి అట్లే ఈశ్వరుడు ప్రాణులందరి హృదయమందు ఉన్నాడనితెలిపి యంత్రము నడుపువాడు. ఆ యంత్రములో తానుగూడ ఉండునట్లే, ఈశ్వరుడుగూడ ప్రాణులందరి హృదయమునందున్నాడను విషయము భగవంతుడు తెలిపెను.

2. సమస్త ప్రాణులు వారి పూర్వార్జిత కర్మసంస్కారములను ఫలము ననుభవించుటకు నానాయోనులందు మాటి మాటికి వారిని పుట్టించుట వేర్వేరు పదార్థములతో, క్రియలతో, ప్రాణులతోను వారికి సంయోగ వియోగము

లను కలిగించుట, వారికి ప్రేరణకలిగించుటయే, పరమేశ్వరుడు తన మాయలో వారిని భ్రమింపజేయుట యగును.

ఇక్కడ ఒకవేళ ఎవడైన 'కర్మచేయుటకుగాని చేయకుండుటకుగాని, మనుష్యుడు స్వతంత్రుడా? పరతంత్రుడా? అని యడుగవచ్చును. పరతంత్రుడైనచో నతడు ప్రకృతికి (స్వభావమునకు) పరతంత్రుడా లేక పరమేశ్వరునకు పరతంత్రుడా? ఎందుకనగా ఏబదితొమ్మిదవ, అరువదవ శ్లోకములలో "ప్రాణి ప్రకృతికి అధీనుడని తెలిపి ఈ శ్లోకములో పరమేశ్వరునకు అధీనుడని తెలిపెను", అని ప్రశించవచ్చును. దీనికి సమాధానముగా 'కర్మ చేయుటకు, చేయకుండుటకున్ను మనుష్యుడు పరతంత్రుడు కనుక ఎవడుగూడ క్షణకాలముగూడ కర్మ చేయక ఉండజాలడు' (గీత 3-5) అని చెప్పబడెను. మనుష్యునకు కర్మ చేయుటలో అధికారమున్నదని తెలుపుటగూడ, అతడు స్వతంత్రుడని తెలుపుటకుగాదు, పరతంత్రుడనియే తెలుపుటయగును. ఎందుకనగా అక్కడ కర్మత్యాగము అశక్యమని తెలుపబడెను. 'మనుష్యుడు ప్రకృతికి అధీనుడని తెలుపుట, స్వభావమునకు అధీనుడని తెలుపుట, ఈశ్వరునకు అధీనుడని తెలుపుట' ఈ మూడు విషయములున్నూ ఒకటియే యగును. "స్వభావము-ప్రకృతి" అను పదములు ఒకే అర్థముగలవి. ఈశ్వరుడు స్వయముగా నిరపేక్షభావముతో, అనగా పూర్తిగా నిర్లిప్తుడైయుండియే, జీవుల ప్రకృతికి తగిన కర్మలందు, తన మాయాశక్తిచేత, వారిని నియోగించును. కనుక జీవుడు 'ఈశ్వరాధీనుడని చెప్పుట, ప్రకృత్యధీనుడని చెప్పుటయే యగును. రెండవ పక్షములోనైతే, ఈశ్వరుడే ప్రకృతికి ప్రభువు-ప్రేరకుడుగనుక జీవుడు ప్రకృతికి అధీనుడని చెప్పుటగూడ ఈశ్వరునకే అధీనుడనని చెప్పినట్లగును.

దీనిపైన మనుష్యుడొకవేళ పూర్తిగా పరతంత్రుడే యయినచో అతనిని ఎదిరించుటకు ఉపాయమేమియని, దానికొరకు కర్తవ్య-అకర్తవ్యముల నిధానము చేయు శాస్త్రముల అవశ్యకమేమి"యని ప్రశ్నించవచ్చును. దానికి సమాధానముగా 'కర్తవ్యా కర్తవ్యములను విధించు శాస్త్రము, మనుష్యుని అతని స్వాభావిక కర్మలనుండి తొలిగించుటకుగాని లేక అతనిచేత

కొఱకు మనుష్యుడు ఏమిచేయవలెను? అను ప్రశ్నకు భగవంతుడు ఇట్లు చెప్పుచున్నాడు.

తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత ।
తత్ప్రసాదాత్ పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్॥ 62

భారతా! నీవు అన్నివిధముల ఆ పరమేశ్వరునే శరణుపొందుము[1]. ఆ పర

---

స్వభావ విరుద్ధ కర్మలు చేయించుటకుగాకాదు - 'న్యాయపూర్వకములైన కర్తవ్య కర్మలయందు నిమగ్ననిచేయుటకే' అని తెలియవలెను. కనుక మనుష్యుడు కర్మచేయుటలో స్వభావమునకు పరతంత్రుడై యుండియు, ఆ స్వభావమును సంస్కరించుటలో పరతంత్రుడుగాడు. ఒకవేళ శాస్త్రముల యొక్క మహాపురుషులయొక్క యుపదేశములచేత సచేతనుడై ప్రకృతికి ప్రేరకుడైన పరమేశ్వరుని శరణుజొచ్చి, రాగద్వేషాది వికారములను త్యజించి, శాస్త్రవిధిప్రకారముగా, న్యాయపూర్వకముగను, తన స్వాభావిక కర్మలు నిష్కామ భావముతో చేయుచుండినచో అతని ఉద్ధారమగును.

1. భగవంతుని గుణప్రభావ తత్త్వస్వరూపములను శ్రద్ధగా నిశ్చయించుకొని భగవంతుడే పరమ ప్రాప్యుడు, పరమగతి, పరమాశ్రయుడు, సర్వస్వము అని తలచుట, ఆయన తన ప్రభువు, భర్త్ర ప్రేరకుడు, రక్షకుడు, పరమ హితైషి అని తలచి సర్వవిధముల అతనిపై తన భారమువేసి నిర్భయుడై యుండుట, అంతయు భగవంతునిదేయని తలచి భగవంతుడు సర్వవ్యాపి అని తెలిసికొని సర్వకర్మలందు మమకార-అభిమాన ఆసక్తి కామనలు విడిచి భగవదాజ్ఞానుసారముగ తన కర్మలచేత సమస్తప్రాణుల హృదయమందు ఉన్న పరమేశ్వరుని సేవించుట, ఏవైన సుఖదుఃఖముల అనుభవములు ప్రాప్తించినప్పుడు, అవి భగవంతుడు పంపిన బహుమానములని తలచి సర్వదా సంతుష్టుడై యుండుట, భగవంతునియొక్క ఏ విధానమునందుకూడ కొంచెముకూడ అసంతుష్టుడు కాకుండుట అభిమానము గౌరవము ప్రతిష్ఠ విడిచి భగవంతుడుతప్ప మరియొక ప్రాపంచికవస్తువు దేనియందుగూడ మమకార-ఆసక్తులు లేకుండుట అతిశ్రద్ధతో అనన్యప్రేమతో

మాత్మని కృపచేతనే నీవు పరమశాంతిని సనాతనమైన పరమధామమును పొంద గలవు[2].

సంబంధము :

ఈ విధముగ అర్జునునకు అంతర్యామియైన పరమేశ్వరుని శరణు పొందుమని ఆజ్ఞయిచ్చి భగవంతుడు ఇప్పుడు చెప్పిన ఉపదేశమును ఉపసంహరించుచు ఇట్లను చున్నాడు.

ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా ।
విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు॥ 63

అర్జునా! ఈ విధముగ ఈ అతిరహస్య విషయముకూడ నీకు నేను చెప్పితిని[1]. ఇప్పుడు నీవు ఈ రహస్య జ్ఞానమునుగూర్చి పరిపూర్ణముగ బాగుగ విచా

---

భగవంతుని నామగుణ ప్రభావ లీలావిలాస తత్త్వస్వరూపములయొక్క శ్రవణ చింతన కథనములు సర్వదా నిరంతరము చేయుచుండుట యన్ని భావములు. క్రియలు సర్వవిధములుగ పరమేశ్వరుని శరణుపొందుటలో అంతర్గతములై యున్నవి.

2. పైన చెప్పబడిన విధముగ భగవంతుని శరణుపొందు భక్తునిపై పరమ దయాళువు పరమమిత్రుడు, సర్వశక్తి సంపన్నుడునైన పరమేశ్వరుని యొక్క అపారదయాస్రోతస్సు ప్రవహించుచుండును. ఆ వరదలో అతని సర్వదుఃఖములు, బంధనములు ఎల్లప్పటికిని కొట్టుకొని పారిపోవును. ఈ విధముగా భక్తుడు సమస్త దుఃఖములనుండి బంధనములనుండి ముక్తుడై ఎప్పటికిన్ని పరమానందయుక్తుడగుట, సచ్చిదానంద ఘన "పూర్ణబ్రహ్మ-సనాతన-పరమేశ్వరుని పొందుట యగును. ఇదియే పరమేశ్వరుని కృపచేత పరమశాంతిని సనాతనమైన పరమధామమును పొందుట" యన బడును.

1. భగవంతుడు భగవద్గీత రెండవ అధ్యాయము పదకొండవ శ్లోకమునుండి ఆరంభించి యింతదాక, అర్జునునకు తన గుణ-ప్రభావ-తత్త్వ-స్వరూప

రించి నీయిచ్ఛ ప్రకారము ఎట్లులోచిన నట్లుచేయుము[1].

---

ముల రహస్యములు బాగుగా వివరించి తెలుపుటకొరకు చేయబడిన ఉపదేశములన్నియు, ఇక్కడ "జ్ఞాన" శబ్దమునకు అర్థమని భావించవలెను. ఆ ఉపదేశములన్నియు భగవంతుని ప్రత్యక్ష జ్ఞానము కలిగించునవి కనుక దాని పేరు "జ్ఞాన" మని పెట్టబడెను. ప్రపంచములో, శాస్త్రములలోను, గుప్తములుగా నుంచదగిన రహస్యములని తలచబడిన విషయములన్నిటి యందున్న భగవంతుని గుణ-ప్రభావ స్వరూపములయొక్క యథార్థ జ్ఞానమును కలిగించు నుపదేశము లన్నిటికన్నమించి గుప్తముగా నుంచదగినదని తలచబడుటచేత, ఈ యుపదేశముయొక్క మహత్త్వమును వివరించి తెలుపుటకు అనధికారికి, ఈ విషయములు తెలుపగూడదని వివరించి చెప్పుటకున్ను ఈ జ్ఞానము అతిరహస్యమని తెలుపబడెను.

1. భగవద్గీత రెండవ అధ్యాయము పదకొండవ శ్లోకమునుండి ఉపదేశమును ఆరంభించి భగవంతుడు అర్జునునకు సాంఖ్యయోగ కర్మయోగములు అను రెండు సాధనములనే యనుసరించి, స్వధర్మరూపమైన యుద్ధము చేయుట అక్కడక్కడ(గీత 2.18-37;-3-30;-8-7;-11.34)కర్తవ్యమని తెలిపి, తనను శరణుబొందుటకు చెప్పెను. దీని తరువాత అర్జునుడు ఊరకుండుటచూచి భగవంతుడు మరల అర్జునునకు హెచ్చరిక చేయుట కొరకు, పరమేశ్వరుడు అందరకు ప్రేరకుడు-అందరి హృదయములో నున్నవాడు, నని తెలిపి, ఆయనను శరణు పొందమని చెప్పెను. ఇంత చెప్పినను అర్జునుడు ఏమాత్రము మాట్లాడకుండినప్పుడు, ఈ శ్లోకము యొక్క పూర్వార్ధమునందు, ఆ ఉపదేశముయొక్క ఉపసంహారముచేసి, అట్లు తాను చేసిన ఉపదేశముయొక్క మహత్త్వమునుతెలిపి యీ వాక్యము చేత మరల దానిపైన విచారముసలుపుమని, అర్జునునకు హెచ్చరికచేయుచు చివరకు భగవంతుడు, "నేను తెలిపిన కర్మయోగ జ్ఞానయోగ భక్తి యోగాదులు వివిధ సాధనములలో నీకు ఏ సాధనము మంచిదనిపించునో దానిని అనుసరించుము-లేదా-ఇంకను నేదైన నీవు మంచిదని తలచినచో దానినేచేయుము"అని చెప్పెను.

సంబంధము :—

ఈ విధముగా అర్జునునకు అన్ని విషయములు ఉపదేశించిన మీదట వానిని విచారించి తన కర్తవ్యమును నిర్ధారించుకొనుమని చెప్పినతరువాతకూడ అర్జునుడు ఏ సమాధానముకూడ చెప్పక తాను అనధికారి, కర్తవ్య నిశ్చయము చేయుటలో అసమర్థుడు అని తలచి ఖిన్నుడై ఉండినప్పుడు అందరి హృదయములలోని విషయములను తెలిసికొను అంతర్యామియైన భగవంతుడు తానే అర్జునునిపై దయతలచి యిట్లనుచున్నాడు:—

సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః ।
ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్॥ 64

అర్జునా! రహస్యాతి రహస్య విషయములకన్న పరమ, రహస్యములగు నా మాటలు మరల చెప్పెదను నీవు వినుము[1]. నీవు నాకు మిక్కిలి ప్రియుడవు[2]. అందుచేత ఈ పరమ హితకరమైన మాట నేను నీకు చెప్పెదను.

---

1. భగవంతు డింతవరకు అర్జునునకు చెప్పిన మాటలన్నియు గుప్తముగా నుంచదగినవి కనుక ఆ మాటకు భగవంతుడు అక్కడక్కడ "పరమ గుహ్యము" "ఉత్తమ రహస్యము" అని పేరు పెట్టెను. ఆయుపదేశము లందంతటను ఎక్కడైతే భగవంతుడు ముఖ్యముగా తన గుణ ప్రభావ స్వరూప మహిమ ఐశ్వర్యములను ప్రకటించి-అనగా నేనే స్వయముగా సర్వవ్యాపి సర్వాధార-సర్వశక్తి సంపన్న సాక్షాత్సగుణ నిర్గుణ పరమేశ్వరుడను, అని చెప్పి అర్జునునిలో తన భజనను చేయుటకు, తన శరణము జొచ్చుటకు చెప్పెనో, ఆ వచనములన్ని అత్యంత గుప్తముగా ఉంచదగినవి. (గీత 9-1,2) ఆ మాటనే తరువాతగూడ చెప్పబడెను (గీత9. 34 12-6,7; 18-56,57) కనుక ఇక్కడ భగవంతుడు చెప్పిన మాటలోని అభిప్రాయమేమనగా ఆయన తొలుతచేసిన ఉపదేశమునందుగూడ ఏదైతే అతి గుప్తముగా ఉంచదగినదో అన్నిటికంటే అతి మహత్త్వము కలదో అట్టి విషయము నేను నీకు ఈ తరువాత రెండు శ్లోకములలో చెప్పెదను అని.

2. అరువదిమూడవ శ్లోకములో చెప్పబడిన విషయము విని భగవంతుడు

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే॥ 65

అర్జునా! నీవు నాయందు మనస్సు కలవాడవు కమ్ము[1]. నాకు భక్తుడవు కమ్ము[2] నాపూజ చేయువాడవుకమ్ము[3]. నాకు ప్రణామముచేయుము[4]. ఇట్లు

---

అర్జునునకు అతని కర్తవ్యమును నిశ్చయించుటకు స్వయముగా విచారించు కొనుమని అతనికి చెప్పెను. ఆ భారము తనయందు భగవంతుడు ఉంచు కొనలేదు. ఆ మాటపిని అర్జునుని మనస్సులో నిరుత్సాహము కలిగి "నాకు భగవంతునియందు విశ్వాసము లేదా? నేను ఈయనకు భక్తుడనుకానా? అని విచారించినప్పుడు అర్జునునకు కలిగిన శోకము పోగొట్టుటకొరకు అతనికి ఉత్సాహము కలిగించుటకొరకు భగవంతుడు "నీవు నాకత్యంత ప్రియుడవు, మన యిరువురి ప్రేమ సంబంధము అచంచలము. కనుక నీవు ఏవిధంగాగూడ శోకింపకుము" అను భావము తెలిపెను.

1. భగవంతుడు "సర్వశక్తిసంపన్నుడు సర్వాధారుడు సర్వజ్ఞుడు సర్వాంతర్యామి సర్వవ్యాపి సర్వేశ్వరుడు అతిశయ సౌందర్య మాధుర్య ఐశ్వర్యాది గుణములకు సముద్రుడు" అని తలచి అనన్య ప్రేమ పూర్వకముగా నిశ్చల భావముతో మనస్సును భగవంతునియందు లగ్నముచేయుట క్షణ మాత్రముకూడ భగవంతుని మరచుటను సహింపకుండుట "భగవంతుని యందు మనస్సు కలవాడగుట" అనబడును.

2. భగవంతుడొక్కడే తనకు భర్త ప్రభువు సంరక్షకుడు పరమగతి పరమాశ్రయుడు అని తలచి పూర్తిగ ఆయనకు అధీనుడగుట కొంచెముకూడ తన స్వతంత్రత ఉంచుకొనకుండుట, అన్నివిధముల ఆయనపైన తన భారము వేయుట, ఆయనయొక్క ప్రతియొక్క విధానమునందున్న సర్వదా సంతుష్టుడై యుండుట ఆయన యాజ్ఞను ఎల్లప్పుడును పాటించుట, భగవంతుని యందు అతి శ్రద్ధా పూర్వకముగా, అనన్య ప్రేమ కల్గియుండుట యే భగవద్భక్తుడగుట, యనబడును.

3. భగవద్గీత తొమ్మిదవ అధ్యాయము ఇరువదియారవ శ్లోకమునందు వర్ణింప

చేయుటచేత నీవు నన్నే పొందెదవు[5]. ఈ విషయము నేను నీతో సత్యముగా

---

బడిన విధమున "పత్రపుష్పాదులచేత శ్రద్ధా భక్తి ప్రేమపూర్వకముగా భగవంతుని మూర్తిని పూజించుట. మనస్సులో భగవంతుని ఆవాహనము చేసికొని, ఆయన మానసిక పూజ చేయుట ఆయన వచనములకు- ఆయన లీలా భూమికి ఆయన మూర్తికిని, అన్ని విధములా ఆదర సమ్మానములు చేయుట అంతటను భగవంతుడు వ్యాపించియున్నాడని తలచి, లేదా, సమస్త ప్రాణులు భగవత్స్వరూపులని తలచి ఆయనకు యోగ్యతాను సారముగా సేవా, పూజలు, ఆదర సత్కారములు చేయుట "ఈ మొదలగునవన్నియు" భగవత్పూజ చేయుటలో చేరినవి.

4. సగుణ-నిర్గుణ-సాకార-నిరాకారాద్యనేక రూపములు కలవాడు అర్జునుని ఎదుట శ్రీకృష్ణరూపములో కనబడి భగవద్గీతోపదేశమును వినిపించుచున్నవాడు- రామావతారములో ప్రపంచమునందు ధర్మముయొక్క మర్యాద (కట్టుబాటు ను స్థాపించినవాడు-నృసింహావతారములో భక్త ప్రహ్లాదుని ఉద్ధరించినవాడు, సర్వశక్తి సంపన్నుడు సర్వగుణ సంపన్నుడు సర్వాంతర్యామి- పరమాధారుడు-సమగ్ర పురుషోత్తముడు, పరమేశ్వరుడైన భగవంతుని యొక్క రూపమునకుగాని చిత్తరువునకుగాని పాద చిహ్నములకుగాని, పాదుకలకుగాని, ఆయన యొక్క గుణ-ప్రభావ-తత్త్వముల వర్ణనము చేయు శాస్త్రములకుగాని, ప్రణామము చేయుట లేక, సమస్త ప్రాణులలో ఆయన వ్యాపించియున్నాడని, లేక, సమస్త ప్రాణులు భగవత్స్వరూపులని తలచి అందరికి నమస్కరించుటయే భగవంతునకు నమస్కరించుట యనబడును.

5. భగవంతుడు స్వయముగా భగవద్గీత యెనిమిదవ అధ్యాయము పదునాలుగవ శ్లోకములో ఒక్క అనన్య చింతనము చేతనే తనను సులభంగా పొందవచ్చునని చెప్పినందుచేత, భగవత్ప్రాప్తికి నాలుగు సాధనములలో యేదోయొక సాధనమొందిన చాలునని స్పష్టమగుచుండగా, నాలుగు సాధనములు గలవానికి భగవత్ప్రాప్తి కలుగునని వేరొకటి చెప్పవలసిన దేమున్నది? భగవద్గీత యేడవ అధ్యాయము ఇరువదిమూడవ శ్లోకములో తొమ్మిదవ అధ్యాయము ఇరువదియారవ శ్లోకమునుండి యింత

ప్రతిజ్ఞచేసి చెప్పెదను[1]. ఎందుకనగా నీవు నాకు అత్యంత ప్రియుడవు.

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః॥ 66

అర్జునా! సమస్తధర్మములను అనగా సమస్త కర్తవ్య కర్మలను నాయందు విడిచి[2] నీవు సర్వశక్తి సంపన్నుడు సర్వాధారుడు పరమేశ్వరుడును ఐన నన్నొక్కని మాత్రమే శరణు పొందుము[3] నేను నిన్ను అన్ని పాపములనుండి విము

---

వరకు ఈ యధ్యాయము నలువదియారవ శ్లోకములోను కేవలము తనను పొందవచ్చునని చెప్పెను.

1. అతనియందు దయా ప్రేమలు విశ్వాసము కల్గించుటకొరకు అర్జునుడుని మత్తముగా విశ్వాసముగూడ ధృఢముగా చేయించుటకు భగవంతుడు నేను నీతో సత్య ప్రతిజ్ఞ చేయుచున్నాను అని చెప్పెను.

2. వర్ణ-ఆశ్రమ-స్వభావ-పరిస్థితుల ప్రకారము-ఏ మనుష్యునకు ఏయే కర్మలు కర్తవ్యములని తెలుపపడెనో, భగవద్గీత పన్నెండవ అధ్యాయము ఆరవ శ్లోకములో "సర్వాణి" అను విశేషణముతో ప్రయోగింపబడిన "కర్మాణి" అను పదముచేత ఈ యధ్యాయము ఏబదియేడవ శ్లోకములో "సర్వకర్మాణి" అను పదముచేత, వేని వర్ణనము చేయబడెనో, శాస్త్రవిహితములైన ఆ సమస్త కర్మలు ఆ రెండు శ్లోకముల వ్యాఖ్యానమునందు తెలుపబడిన విధముగా భగవంతునియందు సమర్పించవలెను-అనగా అంతయు భగవంతునిదేయని తలచి శరీరేంద్రియ మనస్సులందు వానిచేత చేయబడు కర్మలందు, ఆ కర్మఫలములైన సమస్త సుఖభోగములందును మమకార-ఆసక్తి-అభిమానకామనులు పూర్తిగా విడుచుట కేవలము భగవంతుని కొఱకే భగవదాజ్ఞా భగవత్ప్రేరణల ప్రకారము ఆయన చేయించిన విధముగా ఆటబొమ్మవలె ఆ కర్మలను చేయుచుండుటయే ఇక్కడ "సమస్త ధర్మములను పరిత్యజించుట' అనబడును. కాని వానిని పూర్తిగ విడుచుటయని కాదు.

3. భగవద్గీత పన్నెండవ అధ్యాయము ఆరవ శ్లోకములో తొమ్మిదవ అధ్యా

క్తుని చేసెదను[1] నీవు శోకింపకుము[2].

---

యము అంతిమశ్లోకములో ఈ యధ్యాయము ఏబదియేడవ శ్లోకములోను చెప్పబడిన విధముగ "భగవంతుడే తనకు పరమప్రాప్యుడు-పరమగతి-పరమాధారుడు-పరమప్రియుడు - పరమహితైషి-పరమ సుహృత్తు-పరమాత్మీయుడు - భర్త - ప్రభువు సంరక్షకుడు" అని తలచి లేచునపుడు కూర్చొనునపుడు తినునపుడు త్రాగునపుడు కదలునపుడు నడచునపుడు నిద్రించినపుడు మేల్కొనినపుడు అన్నివిధముల ఆయన ఆజ్ఞలను పాలించునపుడును పరమశ్రద్ధాపూర్వకముగ అనన్యసేవతో సర్వదా నిరంతరము ఆయన చింతనము చేయుచుండుట ఆయన విధానమునందు ఎల్లపుడు సంతుష్టుడై యుండుట సర్వవిధముల ఒక్క భగవంతునియందు మాత్రమే భక్తప్రహ్లాదునివలె తన భారమంతయు వైచిఉండుట "ఒక పరమేశ్వరుని శరణువేడుట" అనబడును.

1. శుభాశుభ కర్మలకు ఫలము కర్మ బంధనము, దాని చేత బంధింపబడిన మనుష్యుడు జన్మ జన్మాంతరములనుండి అనేక యోనులందుపడి పరిభ్రమించుచూనున్నాడు. ఆ కర్మబంధనమునుండి ముక్తుని చేయుటయే పాపవిముక్తుని చేయుటయగును. కనుక భగవద్గీత మూడవ అధ్యాయము ముప్పదియొకటవ శ్లోకములో 'కర్మభిఃముచ్యతే' అను వాక్యముచేత, పన్నెండవ అధ్యాయము ఏడవ శ్లోకములో "మృత్యు సంసార సాగరాత్ సముద్ధర్తా భవామి" అను వాక్యముచేత ఈ యధ్యాయము ఏబదియెనిమిదవ శ్లోకమునందు "మత్ప్రసాదాత్ సర్వ దుర్గాణి తరిష్యసి" అను వాక్యము చేతను చెప్పబడిన విషయమే-ఇక్కడ నేను నిన్ను సర్వపాపములనుండి విముక్తుని చేసెదను" అను వాక్యముచేత చెప్పబడెను.

2. భగవద్గీత రెండవ అధ్యాయపు పదకొండవ శ్లోకములో "అశోచ్యాన్"అను పదముచేత ప్రారంభించిన ఉపదేశము "మాశుచః"అను పదముచేత ఉపసంహరించి భగవంతుడు "భగవద్గీత రెండవ అధ్యాయము ఏడవ శ్లోకములో నీవు నన్ను శరణుపొందియేయున్నావు. ఇపుడు పరిపూర్ణము శరణాగతుడవైన నీవు కొంచెముగూడ చింతచేయకుము. పూర్తిగా శోకమువిడిచి,

సంబంధము-

ఈ విధముగ భగవంతుడు గీతోపదేశమును ఉపసంహరించి ఇప్పుడు ఆయుపదేశమును ఇతరులకు నేర్పుట తాను నేర్చుకొనుట ఇత్యాదుల మహాత్మ్యమును తెలుపుటకొరకు మొదట అనధికారి లక్షణము తెలిపి అతనికి గీతోపదేశము వినిపించుట నిషేధించుచున్నాడు.

ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన।
న చాశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి॥ 67

అర్జునా! ఈ భగవద్గీత యనెడి రహస్యమైన ఉపదేశమును ఎప్పుడుకూడ నీవు తపస్సుచేయని మనుష్యునకు, భక్తి రహితునకు, విన నిచ్ఛలేనివానికి, చెప్పకుము. నాయందు దోషదృష్టిగల వానికైతే ఎప్పుడుకూడ నీవు చెప్పనేకూడదు[1].

---

సర్వదా పరమేశ్వరుడనైన నాపైన నీ సర్వభావము ఉంచియుండుము. శోకముయొక్క పూర్తిగా అభావము. భగవత్సాక్షాత్కారము ఇదియే భగవద్గీతయొక్క ముఖ్య తాత్పర్యము" అను నభిప్రాయమును తెలిపెను.

1. దీనిచేత భగవంతుడు తెలిపిన దేమనగా గీతా శాస్త్రము మిక్కిలి గుప్తముగా ఉంచదగిన విషయము. నీవు నాకు మిక్కిలి ప్రేమపాత్రుడైన భక్తుడవు. దైవీ సంపత్తు కలవాడవు. కనుక దీనికి అధికారివనితలచి నేను నీ హితముకొఱకు నీకు ఈ యుపదేశము చేసితిని కనుక స్వధర్మపాలన రూపమైన తపస్సుచేయని మనుష్యునకు నా యొక్క గుణ-ప్రభావ-తత్త్వముల వర్ణనముచేత పరిపూర్ణముగా నిండిన ఈ గీతా శాస్త్రమును వినిపించ కూడదు.

పరమేశ్వరుడనైన నాయందు ఎవనికి విశ్వాసము, ప్రేమ, పూజ్యభావము లేదో, ఎవడు తానే సమస్తమును తెలిసినవాడనని తలచు నాస్తికుడో అట్టివానికిగూడ ఈ అత్యంత రహస్యమైన గీతా శాస్త్రమును వినిపించ కూడదు.

ఒకవేళ ఎవడైన తన ధర్మమును పాలించుటయను తపస్సుకూడచేయునో, కాని గీతా శాస్త్రమునందు శ్రద్ధా ప్రేమలు లేకుండుటచేత అతడు దానిని

య ఇమం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి ।
భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః॥ 68

అర్జునా! నాయందు ప్రేమచేత ఎవడైతే ఈ పరమరహస్య యుక్తమైన[1] గీతా శాస్త్రమును నా భక్తులకు[2] చెప్పునో, అతడు నన్నే పొందగలడు. ఇందులో

---

వినగోరనియెడల అతనికిగూడ పరమ రహస్యమైన యీ గీతాశాస్త్రమును వినిపించకూడదు. ఎందుకనగా అట్టి మనుష్యుడు ఆ శాస్త్రములను గ్రహింపజాలడు. దానిచేత నన్ను నా ఉపదేశమును అతడు ఆదరింపడు. ప్రపంచము నుద్ధరించుటకు సగుణ రూపముచేత అవతరించిన పరమేశ్వరుడనైన నాయందు ఎవనికి దోషదృష్టికలదో, ఎవడు నాగుణములందు దోషారోపణముచేసి నన్ను నిందించువాడో అట్టి మనుష్యునకైతే ఎట్టి పరిస్థితిలోను ఈ యుపదేశము చేయనేకూడదు. ఎందుకనగా అతడు నా గుణ, ప్రభావ, ఐశ్వర్యములను సహింపడు కాబట్టి ఉపదేశముచేని నా తిరస్కారము మొదటికంటె ఎక్కువచేయును గనుక అతడు అధిక పాపము పొందగలడు.

1. ఈ ఉపదేశము మనుష్యుని సంసారబంధమునుండి విముక్తునిజేసి సాక్షాత్తు పరమేశ్వరుని ప్రాప్తి కలిగించునదిగాబట్టి, మిక్కిలి శ్రేష్ఠము రహస్యముగా నుంచదగినది యగును.

2. దీనిచేత, భగవంతుడు, నేను సమస్త ప్రపంచముయొక్క ఉత్పత్తి స్థితి-పాలన, సంహారములు చేయువాడను, సర్వశక్తి సంపన్నుడను సర్వేశ్వరుడను నని తెలిసికొని, నాయందు ప్రేమచూపి, మనస్సులో నా గుణ ప్రభావ లీలా విలాస, తత్త్వ విషయములను వినటకు ఉత్సుకతగలిగి విని ప్రసన్నుడగువాడు నాకు భక్తుడు" అను నభిప్రాయము తెలిపెను. అతనియందు, పూర్వ శ్లోకములో వర్ణింపబడిన నాలుగు దోషముల అభావము తనంతట కలుగును. కనుక, నా భక్తుడే దానికి అధికారి. ఏజాతికి వర్ణమునకు చెందిన వారైనను మనుష్యులందరు నా భక్తులు కాజాలుదురు (గీత 9-32) కనుక, జాతివర్ణాదులు కారణముగా, దీనికి ఎవరు గూడ అనధికారి కాదు.

ఏమాత్రము సందేహము లేదు[1].

న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియ కృత్తమః ।
భవితా న చ మే తస్మాదన్యః ప్రియతరో భువి॥ 69

అర్జునా! అంతకంటెమించి నాకు ప్రియమైన కార్యము చేయువాడు మనుష్యులలో మరియొక డెవడునులేడు. భూమండలమంతట అతనికంటెమించి నాకు ప్రియుడు మరియొకడు భవిష్యత్తులోకూడ ఉండబోవడు[2].

---

1. భగవంతునియందు, లేక, ఆయన వచనములందు అతిశ్రద్ధగలవాడై, భగవంతుని నామ, గుణ, లీలావిలాస, ప్రభావ, స్వరూపముల స్మృతి చేత, ఆయన ప్రేమలో మైమరచి, భగవంతుని ప్రసన్నుని చేయుటకే, నిష్కామ భావముతో, పైన చెప్పబడిన భగవద్భక్తులకు ఈ గీతా శాస్త్రమును చెప్పుట, దీని మూల శ్లోకములను చదివించుట, వాని వ్యాఖ్యానము అర్థము వివరించిచెప్పుట, పరిశుద్ధముగా పఠింపచేయుట, వాని భావములను బాగుగా ప్రకటించి వివరించి చెప్పుట, శ్రోతల శంకలకు సమాధానముచెప్పి, గీతోపదేశము వారి హృదయమునకు అవగతమగునట్లు చెప్పుట, గీతోపదేశము ప్రకారము నడచుకొనుటకు వారికి దృఢమైన భావన కలిగించుట, ఈ మొదలైన క్రియలన్నియు భగవంతునియందు మిక్కిలి ప్రేమఉంచి భగవద్భక్తులకు గీతాప్రవచనము చేయుటయగును.

దీనిలో భగవంతుడు, 'గీతా శాస్త్ర ప్రచారముపైన చెప్పబడిన విధమున ప్రచారముచేయుట యనునది నన్ను పొందుటకు ఏకమాత్రమగు ఉపాయముకనుక నా ప్రాప్తినికోరు అధికారులైన భక్తులు, ఈ గీతా శాస్త్ర ప్రవచనము ప్రచారము తప్పక చేయవలెను' అను నభిప్రాయము తెలిపెను.

2. ఇక్కడ భగవంతుడు తెలిపిన భావమేమనగా, యజ్ఞ దాన, తపస్, సేవా, పూజా, జప, ధ్యానాదులైన నాకు ప్రియములగు కార్యములన్నిటికన్న మించి, నా భావములను నా భక్తులందు విస్తరింపజేయుట, నాకు అధిక ప్రియమైనది. కనుక, నాయందు ప్రేమగల భక్తుడెవడైతే, నా భావములను శ్రద్ధా భక్తిపూర్వకముగా నా భక్తులందు విస్తరింపజేయునో, అతడే,

సంబంధము -

ఈ విధముగా పైరెండు శ్లోకములలో భగవద్గీతను శ్రద్ధా భక్తులు గల భగవద్భక్తులకు విస్తరించి చెప్పుటలో ఫలమును మహిమనుగూర్చి చెప్పెను కాని మనుష్యులందరు ఈ కార్యము చేయజాలరు. ఈ పనికి అధికారి అరుదుగానే ఉండును. కనుక ఇప్పుడు భగవంతుడు గీతాశాస్త్రముయొక్క అధ్యయన ప్రభావ మును గూర్చి చెప్పుచున్నాడు.

అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాదమావయోః ।
జ్ఞానయజ్ఞేన తేనాహమిష్టః స్యామితి మే మతిః॥ 70

అర్జునా![1] ధర్మమయమైన మన యిరువురి సంవాద రూపమైన యీ గీతా శాస్త్రమును ఏ పురుషుడు చదువునో[2] ఆతడుగూడ నన్ను జ్ఞాన యజ్ఞముచేత పూజించినవాడగును అని నా యభిప్రాయము.

---

అందరికన్నమించి నాకు ప్రియమగు కార్యము చేసినవాడగును. ఆతని కన్న అధికుడు మరియొక డెవడునులేడు. కేవలము ఇప్పుడుమాత్రమే అతని మించినప్రియుడు నాకు లేడనుటకాదు, అతనినిమించి నాకు ప్రియమైన కార్యము చేయువాడు మరియొకడు ఉండబోవడు. కాబట్టి, నన్ను పొందుటకు అనుసరింపబడు సాధనములన్నిటిలోను భక్తి పూర్వక ముగా నా భక్తులలో నా భావములను విస్తరింపజేయుటయనబడు ఈ సాధ నము సర్వోత్తమమైనదని భావించి, నా భక్తులే ఈ కార్యము చేయవలెను.

1. ఇది సాక్షాత్పరమేశ్వరుడు చెప్పిన శాస్త్రము. కనుక దీనిలో చేయబడిన ఉపదేశము లన్నియు ధర్మముచేత ఓత ప్రోతముగ (పడుగుపేకలవలె) నిండియున్నవి.

2. గీతా మర్మము తెలిసిన భగవద్భక్తులు ఈ గీతా శాస్త్రమును చదువుట దాని యర్థమును తెలిసికొని విచారించుట అది తెలిసిన భక్తులనుండి విశే షార్థములను గ్రహించుటకు ప్రయత్నించుట ఈ యభ్యాసము లన్నియు గీతా శాస్త్రపఠనములో అంతర్గతములు.

శ్లోకార్థమును తెలిసికొనక గీతను చదువుటకంటే అర్థముతోపాటు చదువుట

సంబంధము—

ఇట్లు గీతా శాస్త్రాధ్యయనముయొక్క మాహాత్మ్యమునుగూర్చి తెలిపి ఇప్పుడు భగవంతుడు పైవిధముగ అధ్యయనము చేయుటకు అసమర్థుడైన మనుష్యునకు ఆ శాస్త్ర శ్రవణముగూడ ఫలదాయకమే అని చెప్పుచున్నాడు.

శ్రద్ధావాననసూయశ్చ శృణుయాదపి యో నరః ।
సోఽపి ముక్తశ్శుభాన్ లోకాన్ ప్రాప్నుయాత్పుణ్యకర్మణామ్॥

అర్జునా! మనుష్యుడు[1] శ్రద్ధాయుక్తుడై దోషదృష్టి రహితుడై ఈ గీతా శాస్త్రమును వినినప్పటికిని[2] అతడుకూడ పాపవిముక్తుడై ఉత్తమ కర్మలు చేసిన

---

ఉత్తమము. అట్లు అర్థముతో చదువునప్పుడు ఆ భావములలో నిమగ్నుడై మైమరచియుండుట ఉత్తమోత్తమము.

ఈ గీతా శాస్త్రాధ్యయనము చేయుటచేత మనుష్యునకు నా యొక్క సగుణ నిర్గుణ సాకార నిరాకార తత్త్వముయొక్క జ్ఞానము యథార్థము బాగుగా కలుగును. కనుక దీనిని అధ్యయనముచేయుట జ్ఞానయజ్ఞము ద్వారా నాపూజ చేసినట్లగును. ఎందుకనగా అన్యసాధనములకు చివరిఫలము భగవత్తత్త్వము బాగుగ తెలిసికొనుటయే. ఆ ఫలము ఈ జ్ఞానయజ్ఞముచేత అనాయాసముగ లభించును.

1. గీతా శాస్త్రమును శ్రద్ధగా వినుటకు అభిరుచిలేనివాడు మనుష్యుడనిపించు కొనదగడు. ఎందుకనగా అతడు మనుష్యజన్మ పొందుట వ్యర్థమగు చున్నది. కనుక మనుష్యరూపములో జన్మించిన పశువుగనే అతడు భావింపబడును.

2. భగవంతుని యస్తిత్వమునందు, ఆయన గుణప్రభావములందున్ను విశ్వాసముంచి, ఈ గీతాశాస్త్రము భగవంతుని వాణియే, ఇందులో చెప్పబడిన దంతయు యథార్థమే అని నిశ్చయపూర్వకముగా విశ్వసించి, దీని ప్రవచనము చేయు వక్తయందు, విశ్వాసముంచి, ప్రేమతో, అభిరుచితోను భగవద్గీత మూల శ్లోకముల పారాయణముచేయుట, లేక, దాని యర్థమును వ్యాఖ్యానమును చెప్పుచుండగా వినుటయనునది, శ్రద్ధతో గీతాశాస్త్రమును

వారు పొందు ఉత్తమ లోకములను పొందగలడు[1].

సంబంధము:—

ఇట్లు గీతాశాస్త్రముయొక్క ప్రవచనము పఠనము శ్రవణముయొక్క మహిమను తెలిపి భగవంతుడిప్పుడు అన్ని స్వయముగా తెలిసినవాడైనను అర్జునుడు సావధానుని చేయుటకొఱకు అతని స్థితినిగూర్చి ఇట్లడుగుచున్నాడు:-

"కచ్చిదేతత్ శ్రుతం పార్థ త్వయైకాగ్రేణ చేతసా ।
కచ్చిదజ్ఞానసమ్మోహః ప్రణష్టస్తే ధనంజయ॥ 72

పార్థ! ఈ గీతాశాస్త్రమును నీవు ఏకాగ్రచిత్తముతో శ్రవణముచేసితివా[1]

---

వినుటయగును. దాని శ్రవణముచేయునపుడు భగవంతునందు, లేక భగవద్వచనములందు ఏవిధమైన దోషమును ఆరోపింప కుండుటయనునది, దోషదృష్టి రహితుడై దాని శ్రవణము చేయుటయగును.

1. ఎవడైతే, అరువదియెనిమిదవ శ్లోకములో చెప్పబడినవిధముగా, ఈ గీతాశాస్త్రమును ఇతరులచేత అధ్యయనము చేయించునో, డెబ్బదియవ శ్లోకములో చెప్పబడినట్లు స్వయముగా దీని యధ్యయనము చేయునో, అటువంటి వారి విషయమై వేరుగా చెప్పవలసిన యవసరము లేనేలేదు. ఎందుకనగా దీనిని శ్రద్ధతో వినినంతమాత్రమున, జన్మ జన్మాంతరములలో పశుపక్ష్యాదుల నీచయోనులందు జన్మించుటకు నరకమునకున్ను కారణభూతములైన పాపకర్మములనుండి విముక్తులై, ఇంద్రలోకము మొదలుకొని, భగవంతుని పరమధామమువరకుగూడ, తమ తమ శ్రద్ధాప్రేమలకు అను రూపముగా వేర్వేరు పుణ్యలోకములకుపోయెదరనగా, పైవారి మాట యెంత? వారు తప్పక పోయెదరని తాత్పర్యము.

1. భగవంతుని యీ ప్రశ్నకు అభిప్రాయమేమనగా! "నా యీ ఉపదేశము చాల దుర్లభము. నేను ప్రతిమనుష్యునియెదుట నేనే సాక్షాత్తు పరమేశ్వరుడను. నీవు నాశరణువేడుము. ఇత్యాది వచనములు చెప్పజాలను. కనుక నీవు నా ఉపదేశము బాగుగ ధ్యానపూర్వముగ వింటివికదా! ఎందుకనగా·

అజ్ఞాన జనితమైన నీ మోహము నష్టమైనదా!'

అర్జున ఉవాచ:

నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత ।
స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ॥ 73

అర్జునుడిట్లనెను:—

అచ్యుతా! నీ కృపచేత నా మోహము నష్టమైపోయెను. నాకు స్మృతి

---

ఒకవేళ దానిపైన నీవు ధ్యానము ఉంచకుండినయెడల నీవు చాల పొరపాటు చేసితివి సుమా"! అని.

1. భగవంతుని ఈ ప్రశ్నయొక్క భావమేమనగా "ఏ మోహముచేత నీవు ధర్మము విషయములో మూఢ చేతనుడనని చెప్పుచుంటివో (గీత 2-7) నీ స్వధర్మ పాలనముచేయుట పాపమని తలచుచుంటివో (గీత 1-36 నుండి 39), సమస్త కర్తవ్య కర్మలను విడిచి భిక్షాన్నముతో జీవనము గడపుట శ్రేష్ఠమని తలచుచుంటివో. (2-5) దానివలన నీవు స్వజన వధ భయముచేత వ్యాకులుడవైయుంటివో (గీత 1-45 నుండి 47) నీ కర్తవ్య నిశ్చయము చేయజాలకుంటివో (గీత 2-6,7) అట్టి నీ అజ్ఞాన జనిత మోహము ఇప్పుడునశించినదా లేదా? నా ఉపదేశ మొకవేళ దానియందు ధ్యానముంచి నీవు వినియుండినయెడల నీ మోహము తప్పక నష్టము కావలెను. నీ మోహమొకవేళ నష్టముకానిచో నీవు ఆ నా ఉపదేశమును ఏకాగ్రచిత్తముతో వినలేదు అనుకొనవలసి యుండును.

ఇక్కడ భగవంతునియొక్క ఈ రెండు ప్రశ్నములలోగల ఉపదేశమేమనగా, మనుష్యుడు ఈ గీతాశాస్త్రముయొక్క అధ్యయన శ్రవణము మిక్కిలి శ్రద్ధతో ఏకాగ్ర మనస్సుతో తత్పరుడై వినవలెను. అజ్ఞాన జనిత మోహము పూర్తిగా నశించనంతవరకు "ఇంతవరకు నేను భగవంతుని ఉపదేశము యథార్థముగా తెలిసికొన జాలనైతిని. కనుక మరల దానిని శ్రద్ధతో వివేక పూర్వకముగ విచారించుట అవశ్యకము" అని తలచవలెను.

ప్రాప్తించెను. ఇప్పుడు నేను సంశయరహితుడనై యున్నాను కనుక నీయాజ్ఞను పాలించెదను[1].

సంబంధము :-

ఇట్లు సంజయుడు ధృతరాష్ట్రుని ప్రశ్నము ననుసరించి శ్రీకృష్ణార్జున సంవాదరూపమైన గీతాశాస్త్రము వర్ణించిచెప్పి ఇప్పుడు దాని ఉపసంహారము చేయుచు సంజయుడు ధృతరాష్ట్రునకు భగవద్గీతా మహిమను ప్రకటించుచున్నాడు.

## సంజయ ఉవాచ

ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః ।
సంవాద మిమ మశ్రౌష మద్భుతం రోమహర్షణమ్ ॥ 74

---

1. అర్జునుడు ఇట్లు చెప్పుటలో అభిప్రాయమేమనగా "భగవన్" నీవు ఈ దివ్యోపదేశమును వినిపించి నాయందు పరిపూర్ణదయచూపితివి. నీ ఉపదేశము వినుటచేత నా అజ్ఞానజనిత మోహము పూర్తిగా నష్టమైపోయెను. అనగా నీయొక్క గుణ-ప్రభావ-ఐశ్వర్య-స్వరూపములను యథార్థముగా తెలియనందుచేత ఏమోహము కలిగి నేను నీయాజ్ఞను అంగీకరించుటకు సంసిద్ధుడను కాకుంటినో (గీత 2-9; బాంధవుల వినాశ భయముచేత శోక వ్యాకులుడనై యుంటినో (గీత 1-28 నుండి 47) ఆమోహమంతయు ఇప్పుడు పూర్తిగా నశించిపోయెను. నాకు నీయొక్క గుణ ప్రభావ ఐశ్వర్య స్వరూపముల పరిపూర్ణస్మృతి కలిగినది. నీ సమగ్రరూపము నాకు ప్రత్యక్షమైనది ఇప్పుడు నాకుతెలియనిది ఏదియును లేదు. నీ గుణ ప్రభావ ఐశ్వర్య సగుణ నిర్గుణ సాకార నిరాకార స్వరూప విషయములో ధర్మాధర్మ కర్తవ్యాకర్త వ్యాదివిషయములలోను నాకు ఏమాత్రము సంశయములేదు. నీ దయచేత నేను కృతకృత్యుడనైతిని. ఇప్పుడు నాకు కర్తవ్యమేమియు మిగిలి యుండలేదు. కనుకనే నీవు చెప్పిన విధముగా లోకసంగ్రహము కొఱకు యుద్ధాది సమస్త కర్మలు నీవు చేయించినట్లే నేను నిమిత్త మాత్రుడుగానుండి నీలీల అని తలచుచు చేసెదను.

సంజయుడిట్లనెను :-

ధృతరాష్ట్ర మహారాజా! ఈ విధముగా నేను శ్రీ వాసుదేవునియొక్క మహాత్ముడైన అర్జునుని యొక్క రహస్య యుక్తము, రోమాంచము కలిగించు నది యగు ఈ సంవాదమును వింటిని.

వ్యాస ప్రసాదాత్ శ్రుతవానేతద్గుహ్యమహం పరమ్ ।
యోగం యోగేశ్వరాత్ కృష్ణాత్ సాక్షాత్కథయతః స్వయమ్॥

రాజా! వ్యాస మహాముని కృపచేత [2] నేను దివ్య దృష్టిని పొంది ఈ పరమ రహస్యమైన యోగమును [3] అర్జునునకు స్వయముగా చెప్పుచున్న యోగేశ్వరుడైన శ్రీకృష్ణ భగవానుని నుండి ప్రత్యక్షముగా వింటిని.

---

1. సంజయుడిట్లు చెప్పుటలో భావ మేమనగా సాక్షాత్తు నరమహాముని యవతార రూపుడు మహాత్ముడునైన అర్జునుడడిగినప్పుడు అందరి హృదయములలో నివసించు సర్వవ్యాపియై పరమేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఈ యుపదేశము చేసెను. కనుక ఇది చాలా మహత్త్వ పూర్ణమైనది. ఈ యుపదేశము చాల ఆశ్చర్యజనకము అసాధారణమునైయున్నది. దీనిచేత మనుష్యునకు భగవంతుని యొక్క దివ్యము అలౌకికము-గుణ-ప్రభావ- ఐశ్వర్యయుక్తమునైన సమగ్రరూపము యొక్క పరిపూర్ణ జ్ఞానము కలుగును. మనుష్యుడు ఏ విధముగా దీనిని విని తెలిసికొనునో, ఆయా విధముగానే సంతోషము ఆశ్చర్యము పొందుటచేత అతని శరీరము నంతట పులకలు పొడమును.

2. సంజయుడిట్లు చెప్పుటలో అభిప్రాయమేమనగా- "వ్యాస భగవానుడు దయదలచి నాకు ఏ దివ్యదృష్టిని అనగా దూర దేశమునందు జరుగుచున్న సమస్త సంఘటనములను చూచుట వినుట తెలిసికొనుట మొదలైన వాటిని అద్భుతమైన శక్తిని అనుగ్రహించునో ఆ దృష్టిచేత నేడు నాకు భగవంతుని యీ దివ్య ఉపదేశము వినుట కవకాశము లభించెను. కాకున్నచో నాకు ఇట్టి సుయోగము ఎట్లు లభించియుండును ?

3. భగవత్ప్రాప్తికి ఉభయ భూతములైన కర్మయోగ జ్ఞానయోగ ధ్యానయోగ

రాజన్ సంస్మృత్య సంస్మృత్య సంవాదమిద మద్భుతమ్ ।
కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః ॥ 76

రాజా! భగవంతుడైన శ్రీకృష్ణునకు అర్జునునకు జరిగిన రహస్య యుక్తము కల్యాణ కారకములైన యీ యద్భుత సంవాదమును మాటి మాటికి తలచుకొని సంతోషము చెందుచుండెదను. [4]

తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూపమత్యద్భుతం హరేః[1] ।
విస్మయో మే మహాన్ రాజన్ హృష్యామి చ పునః పునః॥ 77

---

భక్తియోగాదుల సాధనముల వర్ణనము ఇందులో పూర్తిగా బాగుగా చేయ బడినది. శ్రద్ధాపూర్వకముగా దీని పఠనము కూడ పరమాత్మ ప్రాప్తికి సాధనమగుటచేత ఆయన స్వయముగానే యోగరూపుడగును.

4. సంజయుడిట్లు చెప్పుటలో భావమేమనగా శ్రీకృష్ణార్జునుల దివ్య సంవాద రూపమైన ఈ గీతా శాస్త్రము యొక్క అధ్యయనాధ్యాపన శ్రవణ మనన వర్ణనలు చేయు మనుష్యుని ఇది పరమపవిత్రునిచేసి, అన్ని విధములుగా అతనికి శ్రేయస్సు కలిగించును. భగవంతుని ఆశ్చర్యమయ గుణ ప్రభావ - ఐశ్వర్య- తత్త్వ- రహస్య- స్వరూపములను తెలుపును. కనుక ఇది మిక్కిలి పవిత్రము దివ్యము- అలౌకికమైనది. ఈ ఉపదేశము నా హృదయమును ఎంతగా ఆకర్షించినదనగా, ఇప్పుడు నాకు ఏ యితర విషయము గూడ మంచిదిగా తోచదు. నా మనస్సులో ఆ ఉపదేశ స్మృతి మాటి మాటికి కలుగుచున్నది. ఆ భావావేశములో నేను, అనంతమైన హర్షమును అనుభవించుచున్నాను. ప్రేమ సంతోషముల చేత మైమరచి యున్నాను." అని భావము

1. శ్రీకృష్ణభగవానుని యొక్క గుణప్రభావ లీలావిలాస ఐశ్వర్య మహిమ నామ స్వరూపములయొక్క శ్రవణ మనన కీర్తన దర్శన స్పర్శాదులచేత ఆయనతో ఏదో ఒక విధముగా సంబంధము కలుగుటచేత, ఆయన మనుష్యులయొక్క సర్వపాపములను, అజ్ఞానమును, దుఃఖమునున్ను హరించును. ఆయన తన భక్తుల మనస్సును దొంగిలించును. కనుక ఆ భగవంతునకు "హరి"యను పేరు సార్థకము.

రాజా! అత్యంత విలక్షణమైన ఈ శ్రీహరియొక్క రూపమును మరల మరల స్మరించి నా చిత్తమునందు మిక్కిలి ఆశ్చర్యము కలుగుచున్నది నేను మాటి మాటికి హర్షము చెందుచున్నాను[1].

సంబంధము :

ఈ విధముగా తన స్థితిని వర్ణించుచు గీతోపదేశముయొక్క భగవంతుని అద్భుతరూపము యొక్కయు స్మరణముయొక్క మహత్త్వమును ప్రకటించి సంజయుడిప్పుడు ధృతరాష్ట్రునితో పాండవుల విజయము నిశ్చయముగా సంభవించును. అని ప్రకటించుచు ఈ యధ్యాయమును ఉపసంహరించుచున్నాడు.

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః ।
తత్ర శ్రీర్విజయో భూతిః ధ్రువా నీతిర్మతిర్మమ॥ 78

రాజా! ఎక్కడ యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు ఉన్నాడో, ఏవైపు గాండీవ ధనుర్ధారియైన అర్జునుడు ఉన్నాడో అక్కడనే సంపద విజయము విభూతి అచం

---

1. అత్యాశ్చర్యమయ-దివ్య విశ్వరూపమును ఏ భగవంతుడు అర్జునునకు ప్రదర్శించెనో, ఏ విశ్వరూప మహత్త్వమునుగూర్చి భగవంతుడు పదకొండవ అధ్యాయము నలువదియేడవ - నలువదియెనిమిదవ శ్లోకములలో స్వయముగా తెలిపెనో, ఆ విరాట్‌స్వరూపమునే సూచించుచు సంజయుడు "భగవంతుని ఆరూపము నా మనస్సునుండి తొలగిపోవనేపోవదు. దానిని నేను మాటి మాటికి స్మరించుచుందును. అని చెప్పెను. అతి దుర్లభమైన ఆదివ్యస్వరూప దర్శనము నాకు లభించునంతటిపుణ్యమేదియు నేను చేసియుండలేదే. అట్టి నాకీదర్శనమెట్లు లభించినది? అని నాకు ఆశ్చర్యము కలుగుచున్నది అహా! ఆదర్శనము నాకు లభించుటకు కేవలము భగవంతునకు నాపైగల నిష్కారణ దయా విశేషమేయగును. ఆ విశ్వరూపము యొక్క అత్యద్భుత దృశ్యములను, ఘటనములను స్మరించుకొలది నాకు చాల ఆశ్చర్యము గలుగుచున్నది. ఆ రూపమును మాటి మాటికి స్మరించుకొని నేను హర్ష ప్రేమ ప్రవాహములో మునుగుచు, లేయుచు మైమరచియున్నాను. నా యానంద పారావారమునకు అంతములేదు.

చలస్థైన నీతి ఉండునని నా అభిప్రాయము[1].

ఇతి శ్రీ మహాభారతే భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా పర్వణి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే మోక్షసన్న్యాసయోగో నామ అష్టాదశోఽధ్యాయః॥ (18)[4]
భీష్మపర్వణి తు ద్విచత్వారింశోఽధ్యాయః (42)

---

1. ఇక్కడ సంజయుడు చెప్పినదానిలో భావమేమనగా శ్రీకృష్ణ భగవానుడు సమస్త యోగశక్తులకు ప్రభువుగానున్నాడు ఆయన తన యోగశక్తిచేత ఒక్క క్షణమాత్రమున సమస్త ప్రపంచోత్పత్తి పాలన-సంహారములను చేయజాలును. సాక్షాత్తు శ్రీమన్నారాయణుడైన శ్రీకృష్ణ భగవానుడు సహాయకుడుగానున్న ధర్మరాజైన యుధిష్ఠిరునకు విజయము సిద్ధించుటలో సంశయమేమున్నది"అని.

ఇదిగాక, అర్జునుడుగూడ 'నర" మహామునియొక్క అవతారముగదా! అతడు భగవంతునకు అత్యంతప్రియసఖుడు. గాండీవధనుస్సును ధరించిన మహావీర పురుషుడతడు. ఇట్టి మహనీయుడైన అర్జునుడుగూడ తన అన్న యుధిష్ఠిరుని విజయముకొరకు సదుముబిగించి సంసిద్ధుడైయున్నాడు. కనుక, నేడు ఆ యుధిష్ఠిరునకు ఈడైనవాడు, స్పర్ధతో పోరాడి నిలుచు వీరుడు మరియొకడెవడున్నాడు? ఎందుకనగా సూర్యుడున్నచోటనే ప్రకాశము ఆయనతోపాటే ఉండునుగదా! అవిధముగనే యెక్కడ యోగేశ్వరులైన శ్రీకృష్ణపరమాత్ముడు-అర్జునుడునున్నారో, అక్కడనే పరిపూర్ణశోభ-సర్వైశ్వర్యము అచంచల న్యాయ ధర్మము యివియన్నియు వారితోపాటే యుండును. ఏ పక్షమునందు ధర్మముఉండునో, ఆ పక్షమునకే విజయము సిద్ధించుటతథ్యము. కనుక పాండవులకు విజయము సిద్ధించుననుటలో ఏమాత్రము సందేహములేదు. ఇప్పటికైనను ఒకవేళ నశ్రేయస్సు కోరుచుండినయెడల, నీ పుత్రులను సమాధానపరచి, వారికి ఈ విషయములన్నియు బాగుగా వివరించి తెలిపి పాండవులతో సంధిచేసి కొనుము.

4. దీని తరువాత భగవద్గీత మొదటి అధ్యాయము చివర

ఈ విధముగ శ్రీమహాభారతమునందు భీష్మపర్వాంతర్గతం శ్రీమద్భగవద్గీతా పర్వమునందు శ్రీమద్భగవద్గీతోపనిషత్తులందు, బ్రహ్మవిద్యయందు, యోగశాస్త్రమునందు, శ్రీకృష్ణార్జున సంవాదమునందు మోక్షసన్న్యాస యోగ మనఁబడు పదునెనిమిదవ అధ్యాయము సమాప్తమగును. (18)

భీష్మపర్వమునందు నలువది రెండవ అధ్యాయము సమాప్తము.

శ్రీమద్భగవద్గీత ఆనంద చిద్ఘనుఁడు షడ్గుణైశ్వర్య పరిపూర్ణుడు చరాచర వందితుడు పరమ పురుషోత్తముడు సాక్షాత్తు భగవంతుడునైన శ్రీకృష్ణునియొక్క దివ్యవాణియగును. ఇది అనంత రహస్యములతోకూడినది. పరమదయామయు డైన శ్రీకృష్ణభగవానుని కృపచేతనే దీనిరహస్యములు ఏకొంచెమో తెలియగలవు. పరమ శ్రద్ధచేత ప్రేమమయమైన విశుద్ధ భక్తిచేత హృదయము నిండినవారై భగవంతుని మననముచేయు పురుషుడే భగవత్కృపను ప్రత్యక్షముగా అనుభ వించి గీతా స్వరూపముయొక్క ఏదో ఒక యంశమును మాత్రమే అనుభవించ గలడు. కనుకనే తమ శ్రేయస్సును కోరు స్త్రీ పురుషులు భక్తశ్రేష్ఠుడైన అర్జునుని ఆదర్శముగా పెట్టుకొని తమయందు అర్జునునివంటి దైవగుణములను సంపా దించుకొనుచు శ్రద్ధాభక్తి పూర్వకముగ గీతయొక్క శ్రవణ-మనన-అధ్యయన ములనుచేసి భగవదాజ్ఞానుసారముగా తమ యోగ్యత ప్రకారము అనసక్తితో సాధనముచేయుట ఉచితము. ఇట్లు ఏపురుషులు చేయుదురో వారి అంతఃకరణము లందు నిత్య నూతనములు పరమానంద దాయకములు అసమానములు దివ్యములు నైన భావములు స్ఫురించును. వారు సమగ్రముగ పరిశుద్ధాంతఃకరణులునై భగవం తుని యొక్క లౌకిక కృపామృత రసమును ఆస్వాదించుచు శీఘ్రముగనే భగ వంతుని పొందెదరు.

---

* ఈ గుర్తుగల అధోజ్ఞాపికలో నున్నట్లు గ్రహించవలెను.

# భగవద్గీతా మాహాత్మ్యము

(భీష్మ పర్వము 43వ అధ్యాయము)

వైశంపాయన ఉవాచ :

గీతా సుగీతా కర్తవ్యా కిమన్యైః శాస్త్రసంగ్రహైః ।
యా స్వయం పద్మనాభస్య ముఖపద్మాత్ వినిః సృతా ॥ 1

వైశంపాయను డిట్లనెను :

"జనమేజయ మహారాజా! అనేకములైన యితర శాస్త్రములను సంగ్రహించుకొన (తెలిసికొన) వలసిన అవశ్యకత యేమున్నది? భగవద్గీతనే బాగా గానము-శ్రవణము-కీర్తనము-పఠనము-పాఠనము-మననము-ధారణము) చేయ వలెను. ఎంచుకనగా గీత స్వయముగా పద్మనాభుడైన సాక్షాత్తు భగవంతుని ముఖకమలము నుండి వెడలినది.

"సర్వశాస్త్రమయీ గీతా సర్వదేవమయో హరిః ।
సర్వతీర్థమయీ గంగా సర్వవేదమయో మనుః" ॥ 2

భగవద్గీత సర్వశాస్త్ర స్వరూపము (గీతలో సమస్త శాస్త్రముల సారము యొక్క తత్త్వము చేరియున్నది) భగవంతుడైన శ్రీహరి సర్వవేద స్వరూపుడు. గంగానది సర్వతీర్థముల స్వరూపము. మనువు (అతని ధర్మశాస్త్రము) సర్వ వేదముల స్వరూపమేయని తెలియవలెను.

గీతా గంగా చ గాయత్రీ గోవిందేతి హృది స్థితే ।
చతుర్గకార సంయుక్తే పునర్జన్మ న విద్యతే ॥ 3

"గీత-గంగ-గాయత్రీ గోవింద" "అనబడు"గ కారయుక్తములైన ఈ నాలుగు పేర్లు హృదయములో ధరించినప్పుడు మనుష్యుడు మరల ఈ ప్రపంచ ములో జన్మించడు.

"షట్ శతాని సవింశాని శ్లోకానాం ప్రాహ కేశవః
అర్జునః సప్తపంచాశత్ సప్తషష్టిం చ సంజయః
ధృతరాష్ట్రః శ్లోకమేకం గీతాయా మానముచ్యతే"

ఈ గీతలో శ్రీకృష్ణుడు భగవానుడు అరునూర్ల యిరువది శ్లోకములు చెప్పెను. అర్జునుడు ఏబదియేడు శ్లోకములు చెప్పెను. సంజయుడు అరువది ఏడు శ్లోకములు చెప్పెను. ధృతరాష్ట్రుడు ఒక్క శ్లోకము చెప్పెను. ఈ విధముగా భగవద్గీత యొక్క ప్రమాణము (శ్లోకసంఖ్య తెలుపబడెను).

భారతామృత సర్వస్వ గీతాయా మథితస్య చ
సారముద్ధృత్య కృష్ణేన అర్జునస్య ముఖే హుతమ్ 5

భారతమనబడు అమృతరాశి (సముద్రము) యొక్క సర్వస్వ సారభూతమైన భగవద్గీతను మథించి, దాని సారమును వెలికిదీసి శ్రీకృష్ణ పరమాత్ముడు అర్జునుని ముఖము (చెవులద్వారా బుద్ధి)లో విడిచెను.

---

* పైన చెప్పబడిన యైదు శ్లోకములు మహాభారతము యొక్క అనేక ప్రతులలో లేవు. అనేక ప్రతులలో నున్నవి.

# భీష్మపర్వము-నలుబదిమూడవ అధ్యాయము

## యుధిష్ఠిరుడు యుద్ధమునకు పెద్దల అనుమతిని కోరుట

భగవద్గీత తరువాత కథ సంజయుడు ధృతరాష్ట్రునకు ఇట్లు చెప్ప దొడగెను.

రాజా! భగవంతుని యుపదేశము వినిన తరువాత, అర్జునుడు గాండీవ ధనుస్సును బాణములను ధరించుట చూచి పాండవ మహారథికులు సోమకులు వారి ననుసరించిన సైనికులున్న మరల మిక్కిలి ఉత్సాహముతో సింహనాదము చేసిరి. వారితోపాటే వీరులందరూ సముద్రమునందు పుట్టిన తమ తమ శంఖములు మహాసంతోషముతో పూరించిరి. తరువాత భేరీ మృదంగాది వాద్యములు వాయింపబడెను. దానితో యుద్ధభూమిలో మహాధ్వని బయలుదేరెను.

రాజా! అపుడు దేవగంధర్వాదులు, మహర్షులున్నూ ఇంద్రునితోపాటు ఆ భీషణ సంగ్రామము చూచుటకు వచ్చి చేరిరి.

రాజా! తరువాత వీరవరుడైన యుధిష్ఠిరుడు సముద్రమువలె అనంతముగా నున్న ఆ రెండు సైన్యములు యుద్ధమునకు సాగుచుండుట చూచి తన కవచము ఆయుధములను క్రింద పడవేసి రథము దిగి పాదచారియై చేతులు జోడించుకొని భీష్మపితామహుని కడకు పోయెను.

యుధిష్ఠిరుడిట్లు శత్రుసైన్యముల వైపు పోవుచుండుట చూచి అర్జునుడు త్వరగా రథము దిగి సోదరులతో ధర్మరాజు వెనుక పోసాగెను. వారి వెనుకనే శ్రీకృష్ణ భగవానుడు ఆప్తులైన యితర వీరులున్నూ వెడలిరి.

అప్పు డర్జునుడు యుధిష్ఠిరునితో నిట్లనెను-

"రాజా! నీవు మమ్ము విడిచి పాదచారివై తూర్పు దిక్కుగా శత్రుసేన వైపు ఎందుకు పోవుచున్నావు? నీ యిచ్ఛ యేమి?" భీముడిట్లు ధర్మరాజునడిగెను.

"మహారాజా! నీవు కవచము, ఆయుధములను క్రింద పడవైచి సోదరులను

గూడా విడిచి కవచాదులతో యుద్ధసన్నద్ధులైన శత్రు సైనికులతో ఎక్కడికి పోవుచున్నావు?

నకులుడిట్లు పాండవాగ్రజు నడిగెను.

"భరతవంశభూషణా! నీవు నాకు జ్యేష్ఠభ్రాతవు. నీవు ఈ విధముగా శత్రుసేనవైపు పోవుచుండుట చూచి నాకు చాలా భయమగుచున్నది. చాలా బాధపడుచున్నాను. నీ వెక్కడికి పోయెదవు? తెలుపుము?

తరువాత సహదేవుడు కూడా ధర్మరాజును ఇట్లడిగెను.

జననాథా' శత్రుసేనా సమూహములన్నియు ఒకచోట చేరి మహాభయంకరముగా నున్న ఈ రణరంగమునందు నీవు మమ్ము విడిచి శత్రువులవైపు ఎక్కడికి పోవుచున్నావు?

వారి మాటలు వినిన సంజయుడు ధృతరాష్ట్రునితో నిట్లనెను.

"రాజా! తమ్ములిట్లు చెప్పుచుండినను లెక్కచేయక కురునందనుడైన ధర్మరాజు పలుకకుండ ముందుకు సాగిపోవుచునే యుండెను. అపుడు శ్రీకృష్ణ భగవానుడు నవ్వుచూ ఆ నలుగురు పాండుపుత్రులతో నిట్లనెను.

"యుధిష్ఠిరుని అభిప్రాయము నాకు తెలిసినది. ఈయన యిప్పుడు భీష్మ ద్రోణ, శల్యాది గురుజనుల యాజ్ఞ తీసుకొని శత్రువులతో యుద్ధము చేయును. ప్రాచీనకాలములో గురుజనుల అనుమతి తీసుకొనకుండా యుద్ధము చేయువాడు ఆ గురుజనుల దృష్టిలోనుండి పడిపోవుచుండెనని వినుచున్నాము. శాస్త్రము ననుసరించి పూజనీయుల యాజ్ఞదీసికొని యుద్ధము చేయువానికి తప్పక విజయం సిద్ధించునని నా విశ్వాసము".

ఇట్లు శ్రీకృష్ణుడు చెప్పుచుండగనే దుర్యోధనుని సేనలో దూరిపోవుచున్న యుధిష్ఠిరుని శత్రువీరులు సైనికులు అందరు కూడా రెప్పవాల్చక చూచుచుండిరి. సైనికులు కొందరు హాహాకారము చేయుచుండిరి. కొందరు మాటరాక నిలిచి యుండిరి. దూరమునుండియే అతనిని చూచి కొందరు "కురుకులమునకు కళంకమును తెచ్చుచున్న యీ యుధిష్ఠిరుడిప్పుడు భయపడి తమ్ములతో బయలుదేరి భీష్ముని శరణువేడుటకు పోవుచున్నాడు. భీమార్జునాదుల సహాయముండగా

యుధిష్ఠిరునకు భయమెందుకు కలిగెను? ఇతడు సుప్రసిద్ధ క్షత్రియ వంశములో పుట్టలేదు. ఇతనికి మనోబలము బొత్తిగా లేదు కనుకనే యుద్ధ సమయమునకు ఇతడింతగా భయపడుచున్నాడని యనుచుండిరి.

అప్పుడు కురు సైనికులందరు సంతోషములో కౌరవులను ప్రశంసించుచూ శస్త్రము లెగురవేయుచుండిరి. రాజా! నీ సైనిక వీరులందరు పాండవులను శ్రీకృష్ణుని నిందించుచుండిరి. ఇట్లు యుధిష్ఠిరుని ఈసడించుచూ నీ సైనికులు ఊరకుండిరి.

"యుధిష్ఠిరుడిపుడు భీష్మునితో ఏమి మాట్లాడును? భీష్ముడు ఏమి ఉత్తరము చెప్పును? యుద్ధ గర్వముగల భీమార్జునులు ఇపుడేమి చెప్పెదరు" అని నీ సైనికులందరు మనస్సులోనే యోచించుచుండిరి.

ఇట్లు ఉభయ సైనిక వీరులు అనుకొనుచుండగనే యుధిష్ఠిరుడు భీష్మ పితామహుని సమీపించి ఆయన రెండు పాదములను స్పృశించి ఒత్తుచు నిట్లనెను.

పితామహా! నీ యాజ్ఞ కోరుచున్నాను. నేను నీతో నిపుడు యుద్ధము చేయవలెను. తాతా! నాకు అజ్ఞ యిమ్ము. నన్ను ఆశీర్వదింపుము.

భరతకులనందనా! యుధిష్ఠిరా! నీవొకవేళ ఈ విధముగా నిప్పుడు నాకడకురాకుండిన యెడల నేను నీకు అపజయము కలుగవలెనను శాపమిచ్చి యుందును. పుత్రా! ఇప్పుడు నీవు యుద్ధము చేసి విజయము సాధింపుము. ఇదియేకాక యింకను నీ కోరికలన్నీ యుద్ధములో సిద్ధింపగాక! పార్థా! వరము కోరుకొనుము. నేను నీకేమి సహాయము చేయవలెను ? ఇట్టి పరిస్థితులలో నీకు ఓటమి కలుగదు.

నాయనా! పురుషుడు అర్థమునకు దాసుడు. అర్థము ఎవరికి కూడా దాసభావమును పొందదు. ఇది యథార్థము. నేను కౌరవులచేత అర్థములో బంధింపబడినాను. కనుక కురునందనా! నేను నేడు నీ యెదుట నపుంసకుని వలె మాట్లాడుచున్నాను. ధృతరాష్ట్రపుత్రులు ధనముచేత నన్ను భరించి పోషించినారు. కనుక నేను నీవైపుచేరి ధార్తరాష్ట్రులతో యుద్ధముచేయుట తప్ప, మరియే యితరమైనను కోరుకొనుము ఇచ్చెదను.

రాజా!- అప్పుడు భీష్మ - యుధిష్ఠిరుల కిట్లు సంవాదముజరిగెను.

యుధిష్ఠిరుడు : మహాబాహూ బలశాలీ! పితామహా! నీవు సర్వదా నా హితమును కోరుచు, నాకు మంచి ఉపదేశము నిచ్చుచుండుము. దుర్యోధనుని కొరకు అతని వైపుననే నిలిచి యుద్ధము చేయుచుండుము. నేను సర్వదా యీ వరమే నిన్ను కోరెదను.

భీష్ముడు : కురునందనా! నేనిప్పుడిక్కడ నీకు ఏమి సహాయము చేయవలెనో చెప్పుము. యుద్ధమైతే నా యిచ్ఛానుసారముగా నీ శత్రుపక్షమున నిలిచిచేయుచున్నాను కదా! నీ విప్పుడు చెప్పదలచినది యేమి ?

యుధిష్ఠిరుడు : పితామహా! నీవైతే యెవరికిని ఓడనివాడవు కదా! ఇట్లుండగా, నేను యుద్ధములో నిన్నెట్లు జయింపగలుగుదును ? నీవు నా శ్రేయస్సు కోరిన యెడల ఇట్టి స్థితిలో నీవు నా హితము కోరి ఇప్పుడేమి చేయవలెనో ఉపదేశింపుము.

భీష్ముడు : కుంతీనందనా! నన్ను యుద్ధములో ఓడింపగల వీరుడెవ్వడును లేడు. యుద్ధకాలమునందు ఎవడుగూడ. చివరకు ఇంద్రుడు గూడ సాక్షాత్తుగావచ్చి నన్ను ఓడింపజాలడు.

యుధిష్ఠిరుడు : పితామహా! నీకు నమస్కారము చేసెదను. అందుకొఱకే యిప్పుడు నిన్ను అడుగుచున్నాను. నీవు యుద్ధము చేయుచున్నప్పుడు నీ శత్రువులు నిన్ను ఏ విధముగా ఏ ఉపాయము చేత చంపగలుగుదురో చెప్పుము.

భీష్ముడు : పుత్రా! ఇంతమాత్రము చెప్పెద వినుము. నన్ను యుద్ధరంగములో నెవడుకూడా జయింపజాలడు. ఇప్పుడింకను నా మృత్యుకాలము రాలేదు. కనుక, ఈ నీ ప్రశ్నకు ఉత్తరము మరల ఎప్పుడైన వచ్చి అడుగుము చెప్పెదను.

జనమేజయా! యిట్లు భీష్మయుధిష్ఠిరులకు జరిగిన సంభాషణమును సంజయుడు ధృతరాష్ట్రునకు చెప్పి మరల యిట్లనెను.

ధృతరాష్ట్రా! అప్పుడు యుధిష్ఠిరుడు భీష్ముని యాజ్ఞను శిరసావహించి

ఆయనకు నమస్కారముచేసి, ద్రోణాచార్యుని రథము వైపునకు పోయెను. కురు సైనికులందరు దిగ్భ్రాంతులై చూచుచుండిరి. ఆయన తన తమ్ములతో ద్రోణాచార్యుని సమీపించి ఆయనకు ప్రదక్షిణము చేసి నమస్కరించెను. తరువాత ద్రోణాచార్యునకు యుధిష్ఠిరునకు నిట్లు సంవాదము జరిగెను.

యుధిష్ఠిరుడు : భగవాన్ నాకు అపరాధము, పాపము అంటకుండునట్లుగా నీతో యుద్ధము ఎట్లు చేయగలుగుదును ? బ్రాహ్మణోత్తమా నీయాజ్ఞచేత నేను సమస్త శత్రువులను జయింపగలుగుదును. దయచేసి నాకు ఉపదేశింపుడు.

ద్రోణాచార్యుడు : మహారాజా నీవొక వేళ యుద్ధనిశ్చయము చేసికొనిన తరువాత నా దగ్గరకు రాకుండిన యెడల నేను నీవు ఓడిపోవుటకు శపించి యుందును.

కనుక యుధిష్ఠిరా! ఇప్పుడు నేను నీయెడల ప్రసన్నుడనై యున్నాను. నీవు నన్ను ఆదరించి పూజించితివి. నీకు ఆజ్ఞ యిచ్చుచున్నాను. శత్రువులతో పోరాడి గెలువుము.

రాజా నీ కోరిక తెలుపుము నెరవేర్చెదను. ఇప్పటి పరిస్థితులలో నేను నీవైపుచేరి యుద్ధము చేయజాలను. అవితప్ప నీవు వేరేమి కోరెదవు ? రాజా పురుషుడు అర్థమునకు దాసుడు. అర్థము ఎవరికిని దాస్యము చేయదు. కౌరవులు నన్ను అర్థముచేత బంధించినారు. ఈ విషయము నీకు నపుంసకునివలె చెప్పుచున్నాను. యుద్ధసహాయము తప్ప మరియేమి కోరెదవు? నేను దుర్యోధనుని కొరకు అతనివైపునిలిచి మీతో పోరాడెదను. కాని నీ విజయమునే కోరుచుండెదను.

యుధిష్ఠిరుడు : బ్రహ్మన్! నీవు నా విజయమునుకోరి నాకు హితమైన ఉపదేశమును చేయుచుండుము.

ద్రోణుడు : రాజా! నీ విజయము నిశ్చితమైయున్నది. ఎందుకనగా సాక్షాత్తూ

భగవంతుడైన శ్రీకృష్ణుడు నీకు మంత్రిగానున్నాడు. నీవు శత్రుసంహారము చేసెదవు.

రాజా! ధర్మమెక్కడ ఉండునో అక్కడ కృష్ణుడు ఉండును. ఎక్కడ కృష్ణుడుండునో ఆ వైపు విజయము తప్పక సిద్ధించును. కౌంతేయా! పొమ్ము యుద్ధము చేయుము. ఇంకను అడుగుము నీకు ఏమి కావలెను? చెప్పెదను.

యుధిష్ఠిరుడు : బ్రాహ్మణోత్తమా! నా మనోవాంఛితము నీకు తెలిపి అడిగెదను. నీ వెవరిచేతిలో కూడా ఓడిపోవువాడవు కావు, అట్టి నిన్ను యుద్ధములో నేనెట్లు జయింపగలుగుదును? చెప్పుము.

ద్రోణుడు : రాజా! నేను యుద్ధభూమిలో నిలిచి యుద్ధము చేయుచున్నంత వరకు నీకు విజయము సిద్ధింపజాలదు. నా మృత్యువు శీఘ్రముగా గలుగు ఉపాయమును నీ తమ్ములతో యోచించి ప్రయత్నింపుము.

యుధిష్ఠిరుడు : ఆచార్యా! ఇప్పుడు నీవు నీ వధోపాయము చెప్పుము. నీ చరణముల పై బడి ప్రణామముచేసి అడుగుచున్నాను.

ద్రోణుడు : నాయనా నేను రథమునందు కూర్చొని కోపముతో బాణ వర్షము చేయుచు యుద్ధములో నిమగ్నుడనై యున్నప్పుడు నన్ను చంపగల శత్రువెవడు గూడ నాకు కనబడకున్నాడు. రాజా! నేను ఆయుధము విడిచి అచేతనుడనై మరణాంతము నిరశన వ్రత దీక్షలో నున్నప్పుడు తప్ప మరి యెప్పుడుకూడా ఎవడు నన్ను చంపజాలడు. అట్టి పరిస్థితిలోనే యెవడైన ఉత్తమ యోధుడు నన్ను చంపగలడు. ఇది సత్యము.

ఒకవేళ విశ్వసనీయుడెవడైన నాకు అప్రియమైన మాట వినిపించిన యెడల నేనప్పుడు అస్త్రములను క్రింద పడవేసెదను. ఈ సత్యము నీకు తెలుపుచున్నాను.

జనమేజయా! యిట్లు సంజయుడు ద్రోణునితో యుధిష్ఠిరునకు

జరిగిన సంభాషణమును ధృతరాష్ట్రునకు చెప్పి తరువాతి వృత్తాంతమిట్లు చెప్పదొడంగెను.

రాజా! ద్రోణాచార్యుని మాటవిని యుధిష్ఠిరుడు ఆచార్యుని యాజ్ఞ తీసికొని కృపాచార్యుని వద్దకు పోయెను. అయనకు ప్రదక్షిణ నమస్కారములు చేసి యిట్లు అడిగెను.

అనఘా గురుదేవా నేను మనస్సులో ఎలాంటి పాపచింతనము లేకుండా నీతో యుద్ధము చేయతలపెట్టినాను. ఆజ్ఞయిమ్ము. నీ యాజ్ఞనుపొంది యుద్ధమునందు శత్రువులందరిని ఓడింప గలుగుదును.

ఆ మాటకు కృపాచార్యుఁడిట్లనెను:-

రాజా! నీవు యుద్ధముచేయుటకు నిశ్చయించుకొనిన తరువాత, ఒకవేళ నావద్దకు రాకుండినయెడల, నీకు యుద్ధములో అపజయము కలుగునట్లు శపించి యుందును.

పురుషుడు అర్థమునకు దాసుడు. అర్థము ఎవరికిన్ని దాస్యముచేయదు. ఇది సత్యము. నన్ను కౌరవులు అర్థముతో బంధించినారు. కనుక వారి కొరకు నేను వారివైపే నిలిచి యుద్ధముచేయుట నా కర్తవ్యము. నేను నపుంసకునివలె చెప్పుచున్నాను. యుద్ధసహాయముతప్ప మరియేదైనాకోరుకొనుము నెరవేర్చెదను. ఆమాటకు యుధిష్ఠిరుడు కృపాచార్యునితో నిట్లనెను:-

ఆచార్యా! కనుకనే, నేను నిన్ను అడుగుచున్నాను. నామాట వినుము. అని అంతమాత్రముచెప్పి, అచేతనునివలె, కృపాచార్యుని ఏమియు అడుగ జాలక పోయెను.

జనమేజయా! యీ విషయము సంజయుడు ధృతరాష్ట్రునకు చెప్పి అతనితో "రాజా! యుధిష్ఠిరుడు తనను ఏమి అడుగదలచినదియు కృపాచార్యుడు కనిపెట్టి యుధిష్ఠిరునితో నిట్లనెను"అని చెప్పెను:-

యుధిష్ఠిరా! నేను అవధ్యుడను. నన్నెవరును చంపజాలరు. పొమ్ము, యుద్ధముచేయుము జయముపొందుము.

రాజా! నీ విప్పుడు నావద్దకు వచ్చుటచేత నాకు చాలా సంతోషము కల్గినది. కనుక నీ విజయముకొరకు శుభాకాంక్షలు నేను సర్వదా చేయుచుందును. ఇది సత్యము

ధృతరాష్ట్రమహారాజా! కృపాచార్యుడిట్లు చెప్పిన తరువాత యుధిష్ఠిరుడు ఆయనకు ప్రణామముచేసి, అజ్ఞతీసికొని, రాజైన శల్యుని కడకుపోయి, అతనికి ప్రదక్షిణ నమస్కారములుచేసిన తరువాత ఆ ఇరువురికి యిట్లు సంవాదము జరిగెను:-

యుధిష్ఠిరుడు : నరవరా! నాకు పాపము-అపరాధము అంటకుండ నీతో యుద్ధము చేయదలచినాను. దీనికొరకు నీ అనుమతి కోరుచున్నాను.

రాజా! నీ యాజ్ఞపొంది యుద్ధము చేసినచో నేను శత్రువుల నందరను ఓడించగలను

శల్యుడు : యుద్ధ నిశ్చయము నీవు చేసినతరువాత నావద్దకు రాకుండిన యెడల ఓటమికొరకు నేను నిన్ను శపించియుందును. ఇప్పుడు నాకు చాలా సంతోషమైనది. నన్ను ఆదరించి పూజించితివి. నీ కోరికలు నెరవేరుగాక. నీకు ఆజ్ఞయిచ్చుచున్నాను. ఇంకను నీకు ఏమికావలెను? నీకు నేనేమిత్తును? కోరుకొనుము.

మహారాజా! యీ పరిస్థితిలో, నీకు యుద్ధములో సహాయము చేయుటతప్ప మరియేదైన కోరుకొనుము. నెరవేర్చెదను. పురుషుడు అర్థమునకుదాసుడు. అర్థము ఎవరికికూడా దాస్యము చేయదు. రాజా! ఇది సత్యము కౌరవులు నన్ను అర్థముచేత బంధించినారు.

మేనల్లుడా! కనుక, నేను నపుంసకునివలె నీతో చెప్పుచున్నాను. యుద్ధసహాయముతప్ప నన్నేమికోరెదవో చెప్పుము. నేను తప్పక నీ యిష్టము నెరవేర్చెదను.

యుధిష్ఠిరుడు : మహారాజా! నీవు ప్రతిదినము నాకు మంచి ఉపదేశము నా హితముకోరి చేయుచుండుము, నీ యిష్టమొచ్చినట్లే, యితరుల కొరకు యుద్ధము చేయుము.

శల్యుడు : రాజోత్తమా! ఈ విషయములో నీకు నేనేమి సహాయము చేయవలెనో చెప్పుము. కౌరవులు నన్ను అర్థముచేత బంధించినారు కనుక, నా యిష్టప్రకారము యుద్ధమైతే నేను నీ శత్రుపక్షములో నుండి చేసెదను.

యుధిష్ఠిరుడు : మామా! యుద్ధ ప్రయత్నములు జరుగుచుండినప్పుడు, ఆ దినములలో నీవు నాకిచ్చినవరమునే యిప్పుడు కోరుచున్నాను. అదియే నాకిప్పుడావశ్యకమైంది. కర్ణునకు అర్జునునితో యుద్ధము జరుగునప్పుడు కర్ణునకు రథసారథిగా నిన్ను దుర్యోధనుడు తప్పక నియమించును. అతనికి సారథిగావుండుటకు నీవంటి శూరుడు మరియొకడు లేడు కదా! అప్పుడు నీవు కర్ణుని ఉత్సాహ భంగపరచవలెను.

శల్యుడు : కుంతీకుమారా! నీ యీ కోరిక తప్పక తీర్చెదను. ఇక పొమ్ము. నిశ్చింతగా యుద్ధముచేయుము. నీ కోరిక నెరవేర్చుటకు ప్రతిజ్ఞ చేయుచున్నాను.

తరువాత సంజయుడిట్లనెను.

ధృతరాష్ట్రమహారాజా! యీ విధముగా యుధిష్ఠిరుడు, తన మేనమామ (శల్యుడు మాద్రికి సోదరుడు) యైన మద్రరాజు శల్యుని ఆజ్ఞ తీసికొని, తమ్ములతో పాటు కురుసైన్యము నుండి వెడలిపోయెను.

రాజా! అప్పుడు శ్రీకృష్ణుడు ఆ సైన్యములోనున్న కర్ణునికడకుపోయి పాండవుల హితము కోరుచు నతనితో నిట్లనెను.

కర్ణా! నీవు భీష్మునితో ద్వేషము పెట్టుకొని యుద్ధము విడిచితివని వింటిని. ఇట్టి పరిస్థితిలో నీవు భీష్ముడు మరణించువరకు మా పక్షములోచేరి యుద్ధము చేయుము. భీష్ముడు చనిపోయినతరువాత, నీకు మంచిదనితోచినచో, అప్పుడు మరల దుర్యోధనుని సహాయము కొరకు పోవుదువుగాని. అని చెప్పెను. ఆ మాటకు కర్ణుడిట్లనెను:

కేశవా! నేను దుర్యోధనుని హితము కోరువాడనని నీవు తెలిసికొనవలెను.

అతనికొరకు నా ప్రాణములను బలియిచ్చియున్నాను. కనుక అతనికి అప్రియ మెప్పుడుకూడ చేయను.

ధృతరాష్ట్రమహారాజా! కర్ణుడిట్లనిన తరువాత కృష్ణుడు వెడలిపోయి పాండవులతో కలసికొనెను. అప్పుడు యుధిష్ఠిరుడు సేనామధ్యములో నిలిచి, యిట్లు చాటెను:-

ఏ వీరుడైనను, మాకు సహాయము చేయుటకు మా పక్షమున చేరదలచినచో అతనిని నేను అంగీకరించెదను రావచ్చును. రాజా! అప్పుడు నీ పుత్రుడు యుయుత్సుడు-సంతోషముతో ధర్మరాజుతో నిట్లనెను.

యుధిష్ఠిరా! నన్ను ఒకవేళ నీవు స్వీకరించినచో, నేను నీవైపుచేరి దుర్యోధనాదులతో యుద్ధముచేసెదను.

ఆ మాటకు యుధిష్ఠిరుడు యుయుత్సునితో నిట్లనెను:-

యుయుత్సా! రమ్ము! రమ్ము! మనమందరం కలసి, మూర్ఖులైన నీ సోదరులతో యుద్ధము చేయుదము. ఈ మాట మేము, శ్రీకృష్ణుడు అందరము చెప్పుచున్నాము. నిన్ను నేను స్వీకరించెదను. నాపక్షమునుండి పోరాడుము ధృతరాష్ట్రుని వంశపరంపర, అతనికి పిండోదకకర్మలు చేయుభారము నీపైననే యున్నట్లు కనబడుచున్నది. నిన్ను ఆత్మీయునిగా మేము స్వీకరించెదము. నీవు కూడా మమ్ము అంగీకరించుము. దుర్బుద్ధి-కోపిష్ఠుడునైన దుర్యోధనుడిక ప్రపంచములో బ్రతుకడు.

ధృతరాష్ట్రమహారాజా! యుధిష్ఠిరుని మాటలు విని యుయుత్సుడు, నీ యితర పుత్రులందరినివిడిచి, దుందుభి వాయించుచు పాండవుల సేనలోనికి పోయెను. అతడు దుర్యోధనుని పాపకర్మలను నిందించుచు పాండవుల పక్షమునందుచేరి యుద్ధముచేయుటకు నిశ్చయించి వారి సేనలోనే యుండెను.

రాజా! తరువాత యుధిష్ఠిరుడు సువర్ణకవచము తొడిగికొనెను. తక్కిన వీరులందరు తమ తమ ఆయుధములు ధరించి రథములనెక్కి, సేనా వ్యూహములు పన్ని యుద్ధ సన్నద్ధులైరి. అనేక వాద్యములు మ్రోగించిరి. సింహనాదములు చేసిరి. ధృష్టద్యుమ్నాదులు పాండవులనుచూచి సంతుష్టులైరి. గౌరవించుచున్న పాండవులనుచూచి రాజులందరు వారిని ప్రశంసించిరి పాండవులమైత్రి దయ, సమయోచితముగా కర్తవ్య నిర్వహణము, కుటుంబజనులయెడల వారికి గల అభిమానము, ఈ గుణములను రాజులందరు ప్రశంసించిరి.

## కౌరవ-పాండవుల ప్రథమదిన యుద్ధమారంభము:—

(భీష్మ 44వ అధ్యాయము)

జనమేజయా! ధృతరాష్ట్రుడు సంజయునిట్లడిగెను :

సంజయా! యీ విధముగా సేనావ్యూహములను మావారు పాండవులు ఏర్పరచుకొనిన తరువాత మొదట అస్త్రప్రయోగము కౌరవులు చేసిరా ? లేక పాండవులు చేసిరా ?"

ఆ ప్రశ్నమునకు సంజయుడు ధృతరాష్ట్రునితో నిట్లనెను :

రాజా! తరువాత నీ పుత్రుడైన దుర్యోధనుడు తమ్ములతో పాటు భీష్ముని ముందిడుకొని సేనతో ముందుకు సాగెను.

అట్లే పాండవులందరు భీమసేనుని ముందు పెట్టుకొని భీష్మునితో పోరాడగోరుచు. సంతోషముతో ముందుకు సాగిరి. ఇరువైపులను సింహనాదములు- కలకల శబ్దములు వివిధ వాద్యధ్వనులు అశ్వముల సకిలింపులు గజముల ఘీంకారములు చెలరేగిన తరువాత పాండవులు మనవారిపైకి ఉరుకుచు వచ్చిరి. మనవారు గూడ వారిపైబడిరి.

రెండు మహాసేనలు ఇట్లు యుద్ధ సన్నాహముతో సాగినప్పుడు అవి కౌరవ పాండవుల సేనలయొక్క శంఖమృదంగాది వాద్య ధ్వనులచేత వాయువు చేత వనముల వలె కంపించెను.

రాజా! ఆయమంగళముహూర్తమునందు, అక్కడ చేరియున్న రాజవీరులు, గజములు, అశ్వములు, రథములు మొదలైన సైన్యములు మహాప్రభంజనము చేత కలగుండువడిన సముద్రమువలె మిక్కిలి వ్యాకులములయ్యెను.

ఆ మహాధ్వని వినినవెంటనే భీమసేనుడు, ఆబోతు బిగ్గరగా రంకె వేసినట్లు-సింహనాదముచేసెను. ఆధ్వని యితరధ్వనుల నన్నిటిని అణచివేసెను. ఆ నాదము వినిన మీవారు భయపడిరి. అతని ధ్వని పిడుగువడునప్పుడు మేఘ

ధ్వనివలె భయంకరముగానుండెను. సింహధ్వని వినినప్పుడు ఇతర మృగముల వలె, వాహనములన్నియు నప్పుడు మలమూత్రములు విడచెను.

భీమసేనుడు ఘోరరూపమును చూపుచు, మహామేఘమువలె ఘోషించుచు, నీ కుమారులను భయపెట్టుచు, పైబడుచువచ్చెను. అప్పుడు దుర్యోధన-దుర్ముఖ-దుశ్శలాదులైన నీ పుత్రులు భీముని, మేఘములు సూర్యునివలె చుట్టిముట్టిరి. బాణ సమూహములచేత గప్పిరి. వారు విద్యుత్తులవంటి ధనుస్సులను ఆడించుచు, కుబుసమువీడిన సర్పములవంటి బాణముల నెక్కుబెట్టుచు, పాండవ సేనాగ్ర భాగమునందు దృఢముగా నిలిచిరి.

ఇక ఆవైపు ద్రౌపదీపుత్రులు - అభిమన్యుడు - నకుల సహదేవులు ధృష్టద్యుమ్నుడున్ను పదునైన బాణములను ప్రయోగించుచు ధార్తరాష్ట్రులను ఎదుర్కొనిరి. వారు పర్వత శిఖరములను వజ్రాయుధములువలె మీ వారిని కొట్టుచుండిరి.

భీమసేనుని సింహనాదముతో గగ్గోలుపడిన ఆ మొదటి సంగ్రామమునందు మీ వారుగాని, శత్రుసైనికులుగాని వెనుకాడక పరమోత్సాహముతో పోరాడ జొచ్చిరి, రాజా! అప్పుడు నేను ద్రోణాచార్య శిష్యులైన కౌరవ-పాండవులయొక్క యుద్ధలాఘవము చూచితిని. వారందరును నిమిత్త వేధులుగానున్నారు.

చాపధ్వనులు శమింపకుండెను. వారి బాణములు ఆకాశమునందు నక్షత్రములవలె సంచరించుచుండెను. అప్పుడు శత్రువులపైకి ఉరికివచ్చుచున్న భీమసేనుడు మిక్కిలి దర్శనీయుడుగానుండెను. అన్య రాజులందరు ప్రేక్షకులవలె అతనిని చూచుచు నిలుచుండిరి.

ఇరు సైన్యములు మిక్కిలి సంరంభముతో, ఒండొరుల దోషములను ఎత్తి పొడుచుకొనుచు-స్పర్ధతో-పరస్పరము చతురంగ సైన్యములతో నెదుర్కొను నప్పుడు చిత్రపటమునందలి చిత్తరువులవలె శోభిల్లిరి.

నీ పుత్రుని ఆజ్ఞపై రాజులందరు ధనుర్ధారులై తమ తమ సేనలతో నీ పుత్రుని సేన పైబడిరి. ఆ రెండు సేనలచేత రేగిన ధూళిచేత కప్పబడి సూర్యుడు అంతర్ధానము చెందెను.

అప్పుడు చెలరేగిన సైనికులలో, ఎవరు పోరాడుచుండినది, ఎవరు భంగ

పడినది, ఎవరు తిరిగి యుద్ధమునకు వచ్చినదియు రెండు సేనలలోను బేదము తెలియకుండెను. ఆ ఉభయ సేనలలోను అతి భయంకరముగా సందడి సమరము జరుగుచున్నప్పుడు సైనికులందరిలోను, అందరికన్నమించి నీతండ్రి భీష్ముడు దేదీప్యమానుడై మెరయుచుండెను.

నలుబది యైదవ అధ్యాయము

## ఉభయ పక్ష సైనికుల ద్వంద్వయుద్ధము:-

జనమేజయా! సంజయుడు ధృతరాష్ట్రునకు తరువాతి యుద్ధ వృత్తాంత మిట్లు చెప్పదొడగెను.

రాజా! పరస్పర జయేచ్ఛతో పోరాడుచున్న కౌరవ పాండవులకు మొదటి నాటి పూర్వాహ్ణమునందు పరస్పర దేహములను ఛేదించుకొనునంత మహాఘోర ముగా యుద్ధముజరిగెను. సింహనాదములు-వివిధ వాద్యధ్వనులు తలత్రములు (చేతితొడుగులు) ఛేదించునట్టి అల్లెతాళ్ళశబ్దములు-పదాతిసైన్యముల పాదధ్వనులు- అశ్వహేషలు సకిలింపులు బృంహితములు. ఆయుధధ్వనులు ఒండొంటిపై ఉరుకు చున్న గజముల మెడలలోని ఘంటములశబ్దములు - తోత్రములు (ఏనుగులను పొడుచువానికోల) అంకుశములధ్వనులును ఒక్కసారిగాకలసి యుద్ధరంగమునందు మహాధ్వనికలిగెను. మేరుధ్వనితో సమానమైన ధ్వనితో రథములన్నియు నొక్క-సారిగా పాండవులపైకి ఉరికెను.

రాజా! అప్పుడు భీష్ముడు యమదండమువంటి ధనుస్సుతో భయంకర ముగా అర్జును నెదిరించి పొదివెను. అర్జునుడుకూడా గాండీవధనుస్సుతో భీష్ముని పొదివెను. వారిరువురు ఒండొరులవధేచ్ఛతో పోరుచుకూడ ఒకరినొకరు బాధించ లేకపోయిరి. ఇరువురున్ను కంపించక పోరాడుచుండిరి.

అట్లే సాత్యకి, కృతవర్మలు-అభిమన్యు, బృహద్బలులు ఘోరముగా పర స్పరము పోరాడుచుండిరి. బృహద్బలుడు అభిమన్యుని రథధ్వజములవిరిచి, సారథిని నొప్పించెను. అభిమన్యుడది సహించక బృహద్బలుని రథసారథులను కొట్టి అతనిని నొప్పించెను.

అప్పుడు భీమసేనుడు దుర్యోధనుడి నెదిరించి పోరాడెను. ఆ యిరువురి ఘోరమైన విచిత్రయుద్ధముచూచి, సర్వప్రాణములు ఆశ్చర్యముచెందెను. రాజా! నీ పుత్రులు దుశ్శాసన-దుర్ధర్షులకు నకులునితో తీవ్రముగా యుద్ధముజరిగెను. అట్లే నీ కొడుకు దుర్ముఖుడు సహదేవునితో పోరాడెను. యుధిష్ఠిరుడు శల్యునితో పోరాడుచుండగా శల్యుడు యుధిష్ఠిరుడి ధనుస్సు విరిచెను. అతడు మరియొక ధనుస్సు తీసుకొని బాణవర్షములు శల్యునిపైకురిసి తరిమెను.

ద్రోణాచార్యునకు ధృష్టద్యుమ్నునకు జరిగిన ద్వంద్వయుద్ధములో శత్రు ప్రాణహరణమైన ధృష్టద్యుమ్నునిధనుస్సును ద్రోణుడుఖండించెను. బాణములఅతని శరీరమునందు గ్రుచ్చెను. మరియొకధనుస్సుతో ధృష్టద్యుమ్నుడు ద్రోణుని బాణ వర్షములో ముంచెను. అలంబుష రాక్షసుడు, ఘటోత్కచుడు తలపడి పోరాడిరి. శిఖండికి అశ్వత్థామకు పోరాటముజరిగెను. భగదత్తునకు విరాటరాజునకు, కృపా చార్యునకు, బృహత్క్షత్రునకు ద్రుపదునకు సైంధవునకు, సుశర్మకు చేకితానునకు శకునికి యుధిష్ఠిరపుత్రుడు ప్రతివింధ్యునకు ఈ విధముగనే వేలకొలది వీరులకు ద్వంద్వయుద్ధములు అతి ఘోరముగా జరిగెను.

రాజా! ఆ ద్వంద్వయుద్ధములొక క్షణకాలము అతిమనోహరముగా చూచు వారికి తోచెను. అప్పుడు దేవర్షులు-సిద్ధులు - చారణులు దేవాసురుల యుద్ధము వంటి ఆ పోరాటమును వినోదముగా చూచుచుండిరి. ఇట్లు చతురంగ బలములు ఇరువైపుల అతిఘోరముగా పోరాడుచుండగా, బంధుత్వ మర్యాదలుకూడా అతి క్రమించి యోధులు తండ్రికొడుకులు, అన్నదమ్ములు, బావమరుదులు పరస్పర జయేచ్ఛతో యుద్ధముచేసిరి.

నలుబది యాఱవ అధ్యాయము

## కౌరవ పాండవ వీరుల తుముల (దొంబి) యుద్ధము :-

రాజా! ఉభయవీరులు-సైనికులుకలసి ఎవరికిదొరికిన శత్రువులను వారు తమకు అందిన రథచక్రములతో-దండములతో, విరిగిన రథావయవములతో వివే చన లేకుండ దొంబిగా యుద్ధముచేసిరి. పరస్పరము కొట్టుకొని దిక్కుతోచక, రక్తసిక్తాంగములతో దప్పిగొని, రుధిరపంకములందు పొర్లాడుచు ఆక్రోశించుచు

మీ సైనికులు కొందరు తమకు ఇట్టి దుర్దశకలిగించిన నీ పుత్రులను నిందించు చుండిరి.

కొందరు పటపట పండ్లుకొరకుచు శత్రువులపై దుముకుచుండిరి. కొందరు నిరథులై క్రిందబడి, ఏనుగులచే తొక్కబడి హాహాకారములు చేయుచుండిరి. ఈ విధముగా కురు పాండవ వీరులకు సంకుల సమరము జరిగెను. ఇట్టి సంకుల యుద్ధములో పాండవసేనలు భీష్మునిజేరిరి. ఆయా నక్షత్రములు-తాళవృక్షములు గల రజత ధ్వజముతో విరాజిల్లుచున్న మేరు పర్వతముపై చంద్రునివలె శోభిల్లుచుండెను.

## నలుబది యేడవ అధ్యాయము

## భీష్మాభిమన్యుల యుద్ధము :-

రాజా! ఆనాటి పూర్వాహ్ణమునందు జరిగిన ఘోర సంకుల సమరములో అనేకులు మహావీరులు నశించిన తరువాత దుర్యోధనుడు భీష్మ రక్షణముకొఱకు నీకొడుకులు దుర్ముఖ వివింశతులను కృతవర్మ-కృపశల్యులను పంపెను. ఈ యైదుగురిచేత రక్షింపబడుచు భీష్ముడు పాండవసేనలోదూరెను. ఆయన శత్రువుల రథ-ధ్వజములను శిరస్సులను ఖండించుచు శత్రుసేనలో నృత్యముచేసెను. శత్రుసైన్యములు ఆర్తధ్వనులు చేయుచుండెను.

అప్పుడు అభిమన్యుడు పచ్చనిగుఱ్ఱముల రథమునందు బంగారు వర్ణము గల కర్ణికారధ్వజము విరాజిల్లుచుండగా భీష్ముని, ఇతర రథికులను ఎదుర్కొనెను. కృతవర్మను ఒక బాణముచేత, శల్యుని ఐదింటిచేత తన పితామహుడైన భీష్ముని తొమ్మిది బాణములచేత కొట్టగ ధ్వజమునొక్క బాణముచేత కొట్టి, ఒక భల్లముచేత కృపాచార్యుని సువర్ణ ధనుస్సును ఛేదించెను.

ఇట్లు అతిలాఘవముతో పోరాడుచున్న అభిమన్యునిచూచి దేవతలు సంతోషించిరి. భీష్మాదులప్పుడు సాక్షాత్తు అర్జునుడే యుద్ధముచేయుచున్నాడాయని తలచిరి. అభిమన్యుని చాపధ్వనిగూడ గాండీవధ్వనివలె భయంకరముగానుండెను.

ఆ విధముగా మండుచున్న కొరవివలె యుద్ధరంగమంతటను భయంకర

ముగా తిరుగుచున్న అభిమన్యుని భీష్ముడు తొమ్మిది నిశిత బాణములచేత కొట్టి నొప్పించెను. అతని ధ్వజమువిరిచి సారథినికొట్టెను. ఈ విధముగానే, కృతవర్మ కృపాచార్యులున్ను అభిమన్యునికొట్టిరి, కాని అతడు ఏమాత్రముచలించక మైనాక పర్వతమువలె నిలిచియుండెను.

అప్పుడభిమన్యుడు ఆ యైదుగురు రథికులపైన శరవర్షము గురియించి సింహనాదము చేయుచు బాహుబల పూర్ణముగా భీష్ముని బాణములలో ముంచెను. ఇతరులపైకి ఉరుకుచున్న అభిమన్యుని భీష్ముడు నివారించి, బాణప్రయోగము చేయగా నభిమన్యుడు వానిని తుంపలుచేసి భీష్ముని రజతధ్వజమును విరిచెను. అప్పుడు సైనికులందరు ఆక్రోశించిరి.

భీష్ముని ధ్వజము క్రిందపడగాచూచి భీమసేనుడు బిగ్గరగా అరచుచు నభిమన్యుని అభినందించెను. అప్పుడు భీష్ముడనేక అస్త్రంబులచేత నభిమన్యుని కొట్టెను. అదిచూచి పదుగురు పాండవవీరులు అభిమన్యు రక్షణార్థమైవచ్చిరి. ఆ వచ్చిన విరాట-ద్రుపద-ధృష్టద్యుమ్న-భీమ సాత్యక్యాదులను భీష్ముడు కొట్టి అందరిని చిందరవందరచేసి, భీమసేనునియొక్క సింహచిహ్నిత సువర్ణధ్వజము క్రింద పడగొట్టెను. అప్పుడు భీముడు మూడు శరములచేత భీష్ముని, కృప కృతవర్మలను కొట్టెను.

## శల్యుడు ఉత్తరుని వధించుట :-

రాజా! అప్పుడు విరాట రాజపుత్రుడైన ఉత్తరుడు గజారూఢుడై శల్యుని పైకి ఉరుకుచువచ్చెను. అతనిని శల్యుడు నిలువరించిపోరాడెను. ఉత్తరుని వాహన మైన గజము శల్యుని రథముపైబడి నాలుగు రథాశ్వములను త్రొక్కి చంపెను. అప్పుడు శల్యుడు క్రుద్ధుడై కాలసర్పమువంటి ఉక్కుశక్తిని ఉత్తరునిపై ప్రయోగించెను. దానిచేత ఉత్తరుని కవచాదులు భిన్నములై గజమునుండి నేలకూలి మరణించెను. శల్యుడు రథముకుంది దుమికి ఆ గజముయొక్క తొండమును ఖడ్గముతో నరికెను. దానితో ఆ యేనుగుకూడ మరణించెను.

అప్పుడు శల్యుడు కృతవర్మ రథమెక్కెను అప్పుడు భీముడు బిగ్గరగా ఆర్తస్వరముచేసెను. తన సోదరుడు మరణించుటచూచి విరాటపుత్రుడు శ్వేతుడు అతి క్రుద్ధుడై శల్యుని చంపుటకు పరుగెత్తివచ్చెను. మహా పరాక్రమశాలియైన

శ్వేతుడట్లు వచ్చుటచూచి మీ సేనలోని రథికులు చాలామంది యేకమై యతని పైకురికి బాణవర్షము గురిసిరి. వారి చేతులలోని ధనుస్సులు మేఘములలోని విద్యుత్తులవలె మెరయుచుండెను.

అప్పుడు మీ వీరులతో శ్వేతకేతునకు మహాఘోరముగా యుద్ధము జరిగెను. శ్వేతుడందరను గగ్గోలు పరచి అందిరి ధ్వజములను వాహనములను పడగొట్టి శల్యునిపైకి ఉరికెను.

అప్పుడు నీ పుత్రులతో భీష్ముడు శల్యరక్షణార్థమై శ్వేతునిపైబడి శల్యుని విడిపించెను అప్పుడు మీ వారికి అభిమన్యు భీమసేనాదులకు సంకుల సమరము జరిగెను. భీష్ముడు శత్రువీరులపై బాణవర్షము కురిపించెను.

(నలుబది యెనిమిదవ అధ్యాయము)

## భీష్ముడు శ్వేతుని వధించుట :

జనమేజయా! శ్వేతుని పరాక్రమమును గూర్చి విని ధృతరాష్ట్రుడు సంజయునితో "సంజయా! ఇట్లు శ్వేతుడు శల్యుని రథముపైకి ఉరికినప్పుడు కౌరవపాండవులేమి చేసిరి? భీష్ముడేమి చేసెను? అని యడిగెను.

ఆ మాటకు సంజయుడిట్లనెను?

రాజా! అనేక సహస్ర సంఖ్యలో పాండవ క్షత్రియ వీరులు ఏకమై శ్వేతుని రక్షించుటకు శిఖండిని ముందిడుకొని భీష్ముని వైపు పరుగెత్తిరి. అప్పుడు మహాభయంకరమైన తుముల యుద్ధము రెండు సైన్యములకు జరిగెను. ఆ యుద్ధములో వివేచనారహితముగా తండ్రికొడుకులు, అన్నదమ్ములు బావమరుదులు పరస్పరము చంపుకొనుచుండిరి. ఇట్లే గజాది వాహనములు కూడ ఒండొంటిని చంపుకొనుచుండెను. భీష్మునిచేత గాయపడనివాడు శత్రుసేనలలోను ఎవడును లేడు. శ్వేతుడు నూర్లకొలది కురువీరులను హతమార్చుచుండెను. అందరు శ్వేతుని దాడికి తట్టుకొనజాలక భీష్ముని మరుగుచొచ్చిరి. భీష్మ డొక్కడే ఆ యుద్ధమునందు పర్వతమువలె స్థిరముగా నిలిచియుండెను.

రాజా! భీష్ముడు శిశిర ఋతువు తరువాత సూర్యుడు సర్వజలమును

పిల్చినట్లు శత్రువుల ప్రాణములు తీయుచుండెను. ఆయన యింద్రుడు రాక్షసులను వలె శత్రువుల సంహరించుచుండెను. ఆయన ధాటికి తాళజాలక చాలామంది యుద్ధరంగము వీడి పారిపోవుచుండిరి. ఈ విధము భీష్ముడు పాండవవీరులను శంకింపచేయుచు నేల గూల్చుచుండెను.

ఇట్లు భయంకరముగా యుద్ధము చేయుచు భీష్ముడు శ్వేతుని ముట్టడించెను. శ్వేత–భీష్ములు ఆబోతుల వలె, మత్తగజముల వలె వ్యాఘ్రముల వలెను ఒండొరులను కొట్టుకొనుచు పరస్పరవధేచ్ఛతో యుద్ధము చేయుచుండిరి. ఒకవేళ శ్వేతుడే అడ్డురాకుండిన యెడల భీష్ముడొక్క నాటిలోనే పాండవ సేనను దహించియుండును.

రాజా! అప్పుడు శ్వేతుడు భీష్ముని విముఖుని జేసెను. అదిచూచి పాండవులు హర్షముచెంది సింహనాదము చేసిరి. అప్పుడు నీ పుత్రుడు దుర్యోధనుడు మహావీరులనందరను చేర్చి భీష్మ రక్షణార్థమై పంపెను. అప్పుడు పాండవ వీరులకు. కౌరవ వీరులకు పరస్పర మారణహోమము జరుగుచుండుటను చూచి శ్వేతుడు భీష్ముని వీడి కురువీరులపై బడెను. అతడు వాయువు వృక్షములను వలె దుర్యోధన సేనను గూల్చుచుండెను. వారినందరిని తరిమివేసి మరలశ్వేతుడు భీష్మునివైపు వచ్చెను.

అప్పుడా యిరువురు ఇంద్ర వృత్రాసురుల వలె అరి భయంకరముగా పోరాడిరి. శ్వేతుడు ఏడు తీవ్రశరములతో భీష్ముని కొట్టగా ఆయన ఆ బాణములను నివారించి ఘోరముగా పోరాడెను. ఆ యిరువురు మదగజముల వలె తలపడి యుద్ధము చేసిరి. శ్వేతుడు భీష్ముని ఇరువదియైదు తీవ్ర బాణములతో కొట్టగా భీష్ముడు పదిబాణములతో శ్వేతుని గొట్టెను.

అప్పుడు శ్వేతుడు అతిక్రుద్ధుడై బాణప్రయోగముచేసి భీష్ముని ధనుస్సును తాళధ్వజమును పడగొట్టెను. అది చూచి నీ పుత్రులు భీష్ముడు శ్వేతుని చేత చచ్చెనని తలచిరి. పాండవులు హర్షించి శంఖములూదిరి.

అప్పుడు దుర్యోధనుడు వీరులందరితో మనము చూచుచుండగనే శ్వేతుని చేతిలో భీష్ముడు మరణించుట తగదు అని యరచెను. అది విని వీరులందరు చతురంగ బలములతో పోయి భీష్ముని రక్షించిరి. అందరు శ్వేతునిపై బాణ

ప్రయోగము చేసిరి. ఆ శరములన్నిటిని శ్వేతుడు ఖండించివానిని సింహము గజములనువలె తరిమివేసి మహాహస్తలాఘవముతో భీష్మునిధనుస్సు ఖండించెను.

భీష్ముడు మరియొక ధనుస్సు తీసికొని శ్వేతుని గొట్టెను. శ్వేతుడు తీవ్ర శరములతో భీష్ముని మిక్కిలి నొప్పిపరచెను. అంతటితో భీష్ముడు యుద్ధ రంగము విడిచిపోయెను.

రాజా! అప్పుడు నీ సైనికులను ఆదుకొనువారు లేకుండిరి శ్వేతుని చేతిలో భీష్ముడు చచ్చెననియే అందరు తలచిరి. కాని భీష్ముడప్పుడు అత్యంత క్రుద్ధుడై తన ధ్వజము పడియుండుటను సేన నివారింపబడుటను చూచి వ్యాకులుడై శ్వేతునిపై అనేక తీవ్ర బాణములను ప్రయోగించెను. శ్వేతుడా బాణము లన్నింటిని ఖండించి భీష్ముని ధనుస్సును మరల భేదించెను.

అప్పుడు భీష్ముడు మరియొక బలవత్తరమైన ధనుస్సు తీసికొని పాషాణ సదృశములైన భల్లములను సంధించి శ్వేతుని యశ్వములను, ధ్వజమును సారథిని పడగొట్టెను. అప్పుడు శ్వేతుడు హతాశ్వరథసారథియై రథమునుండి దుమికెను. అట్టి పరిస్థితిలోనున్న శ్వేతుని భీష్ముడు నిశితశరములచేత కొట్టెను.

శ్వేతుడు తన రథముపై ధనుస్సు విడిచి మృత్యుదేవత జిహ్వవలె అతి భయంకరముగా నున్న శక్తిని ధరించి భీష్మునితో ఇప్పుడు నీవు దృఢముగా నిలువుము. నన్ను నా శక్తి యాయుధమును చూడుము. పౌరుషముతో నుండుము అని చెప్పి సర్పమువంటి శక్తిని భీష్మునిపై విసిరివేసెను. దానికి పాండవులు హర్షించిరి. కౌరవులు హా హా కారము చేసిరి అది అప్పుడు కుబుసము వీడిన సర్పము వలె పైకి లేచి ఆకాశమునందు మంటలు గ్రక్కుచు భీష్మునిపై బడు చుండగా భీష్ముడు దానిని బాణములతో ఖండించెను.

అట్లు తన అమోఘ శక్తి భేదింపబడుట చూచి శ్వేతుడతి క్రుద్ధుడై అతనికి కాలము సమీపించినందుచేత ఏమియుతోచక గద తీసుకొని నవ్వుచు భీష్ముని ప్రవాహము పర్వతమును ఢీకొన్నట్లు ఢీకొని అతనిపైకి గదతోవచ్చెను. అతని వేగము అనివార్యమని తలచి భీష్ముడు ఆ వేగ ప్రవాహము తప్పించు కొనుటకు భూమిపై దిగెను.

శ్వేతుడు భీష్మునిపై విసిరిన ఆ గద భీష్ముని రథాశ్వ ధ్వజ సారథులను మగ్గుచేసెను భీష్ముడు దానిని తప్పించుకొనెను.

అప్పుడు విరథుడైన భీష్ముని జూచి కౌరవ రథికులందరు పారిపోయిరి. అది చూచి నీ పుత్రుడు దుర్మనుడు శ్వేతునిపై దాడి సలిపెను అతనిని చూచి భీష్ముడు మహావీరులకు సాధ్యము కాని పనికి ఇతడు పూనుకొనెనని నవ్వుకొనెను.

ఇంతలో ఆకాశము నుండి దివ్యవాణి భీష్ముని హితము గోరుచు "భీష్మా! త్వరపడుము. ఇదియె యతనిని జయించు సమయమని భగవన్నిర్ణయము" అని పలికెను. అది విని భీష్ముడు సంతసించి శ్వేతుని వధించుటకు ప్రయత్నించెను.

అప్పుడు శ్వేతుడు విరథుడై పదాతిగా నుండుట జూచి ధృష్టద్యుమ్నుడు సాత్యకి, భీమసేనాది పాండవ పక్షపు వీరులు అతనికి బాసటగా పోరాడుటకు వచ్చిరి. వారిని భీష్ముడు శల్యకృపాదుల సహాయముతో నిలువరించెను. అదిచూచి శ్వేతుడు ఖడ్గముతో భీష్ముని ధనుస్సు ఖండించెను. అప్పుడు భీష్ముడు ఆకాశములో దేవదూత పలికిన మాటలలచి శ్వేతుని వధించుటకు మరియొక ధనుస్సు తీసికొని భీమసేనాది మహారథిక పరివృతుడైన శ్వేతునిపై దాడిచేసెను అప్పుడు భీముడు ముందుకురాగా అతనిని అరువది బాణములతో కొట్టి భీష్ముడు ధృష్టద్యుమ్నాది వీరులను కూడ కొట్టి తరిమి శ్వేతునిపైకి ఉరికెను.

"రాజా! భీష్ముడు మహోగ్ర బాణముతో బ్రహ్మాస్త్రమును సంధించి శ్వేతునిపై ప్రయోగించెను. అది యాతని కవచమును బేదించి హృదయముచీల్చి నేలపైబడెను. దానితో శ్వేతుడు నిహతుడై పర్వత శిఖరమువలె కూలి పడి పోయెను.

రాజా! విరాటపుత్రుడైన శ్వేతుని మరణముచేత పాండవులు శోకించిరి. నీ పుత్రులు హర్షించిరి. దుశ్శాసనుడు వాద్యములు ప్రయోగించుచు నృత్యం చేసెను. శిఖండి మున్నగువారు వడికిరి. కృష్ణార్జునులు జరిగిన అపజయమును గూర్చి చింతించుట తగదని ఊరటపొందిరి. ఇట్లు చిన్నవోయిన మనస్సుతో పాండవులు తిరిగిపోయిరి.

జనమేజయా! ఇట్లు మహాపరాక్రమ శాలియైన విరాటపుత్రుడు శ్వేతుడు మరణించిన తరువాత ధృతరాష్ట్రుడు సంజయునితో నిట్లనెను.

సంజయా! శ్వేతుని వధానంతరం పాండవ-పాంచాలురేమి చేసిరి అతనిని రక్షించుటకు మన శత్రువులు చాలా ప్రయత్నించి విఫలులై పలాయానము చిత్తగించవలసినవారైరి. కనుక మనకు జయము కలిగెను. ఇదివిని సంతసించితిని. శత్రువులకు ప్రతీకారము చేయుటకు యాచించుచున్న నాకు మావారు చేసిన అవినీతిని స్మరించుకొని సిగ్గు కలుగుచున్నది. వృద్ధుడైన భీష్ముడు మా యెడల సర్వదా అనురాగము కలిగియున్నాడు. కనుకనే ఆయన శ్వేతునితో అట్లు వ్యవహరించెను.

సంజయా! బుద్ధిమంతుడైన విరాటపుత్రుడు శ్వేతుడు తన తండ్రితో శత్రుత్వము కలవాడై యుండెను కాబట్టి, తండ్రివలన తనకు దుఃఖము భయము కలుగవచ్చునని శ్వేతుడు తొలుతనే పాండవుల శరణుజొచ్చెను. మొట్టమొదట శ్వేతుడు సమస్తసేనను విడిచి ఒంటరిగానే దుర్గమునందు దాగియుండెను. తరువాత పాండవుల ప్రతాపముచేత దుర్గమమైన ప్రదేశమునందు ఉండి నిరంతరము శత్రువులను బాధించుచు సత్ప్రవర్తనతో నుండెను. ఎందుకనగా పూర్వకాలమునందు తనను విరోధించిన రాజులయెడల అతని మనస్సులో చెడు తలంపు ఉండెను. ఇట్లుండినను అత్యంత శూరుడైన శ్వేతుడు యుధిష్ఠిరునకు భక్తుడై యుండి కూడా ఎట్లు చంపబడెను. ఈ విషయములో సంజయా! నాకు చాలా ఆశ్చర్యము కలుగుచున్నది.

"నా పుత్రుడు పురుషాధముడు. భీష్ముడు-ద్రోణాచార్యుడు, కృపాచార్యుడు గాంధారి, నేను, వాసుదేవుడు, ధర్మరాజు, భీమార్జున నకులసహదేవులు. వీరెవ్వరికి గూడ యుద్ధముచేయుట ఇష్టముకాదు. సంజయా! నేను, గాంధారి, విదురుడు పరశురాముడు వ్యాసుడు మొదలైన వారందరు నివారించుచున్నను దుర్యోధనుడు యుద్ధమునుండి విరమించలేదు.

సంజయా! దుర్యోధనుడుకర్ణ-శకుని-దుశ్శాసనుల అభిప్రాయము ప్రకారమే దుష్టముగా నాలోచించి యుద్ధమునకు దిగెను. అతడు పాండవుల బలపరాక్రమములను గూర్చి విచారించనే లేదు. ఆ కారణము చేతనే అతనికి ఘోరమైన వ్యసనమిప్పుడు ప్రాప్తించినదని తలచెను.

సంజయా! శ్వేతుని వధచేత భీష్ముని విజయముచేత మిక్కిలి కోపించిన కృపార్జునులేమి చేసిరి? మరల అర్జుననినుండి మిక్కిలి భయము గలుగుచున్నది

అది శాంతించుట లేదు. అర్జునుడు ఇంద్రునివంటి మహాశూరుడు. శత్రువులను సంహరించగలడు. అతనిని చూచినప్పుడు మన వారందరి మనస్సులు ఎట్లుండినవి? మహాశూరవరుడైన ధృష్టద్యుమ్నుడు శ్వేతుని వధానంతరము, పూర్వముకన్న అధిక వైరముతో పోరాడగలడని తలచెదను. వారందరికి గల క్రోధమును గూర్చి విచారించుచున్న నాకు అధికసంతాపము గలుగుచున్నది. రాత్రింబగళ్ళు శాంతిలేక బాధపడుచున్నాను దుర్యోధనుడు కారణముగా సంభవించిన యీ మహాయుద్ధపు వార్తను సవివరముగా చెప్పుము

జనమేజయా! ఆ మాటకు సంజయుడు ధృతరాష్ట్రునితో నిట్లనెను. రాజా! నీ దుష్టనీతి కారణముగా ఏర్పడిన అనర్థమును గూర్చి చెప్పెదవినుము ఇందులో నీవు దుర్యోధనునిపై తప్పు మోపగూడదు. ఇప్పుడు నీవు చింతించుట గతజల సేతుబంధము వంటిది. ఇల్లు కాలిన తరువాత బావిత్రవ్వినట్లు నీవిప్పుడు చింతించి యేమి లాభము ?

ఆనాటి భయంకర పూర్వాహ్ణమునందు మరల మీవారికి శత్రువులతో యుద్ధము ప్రవర్తిల్లెను. విరాట సేనాపతియైన శ్వేతుడు వధింపబడుటచూచి 'శంఖుడు' అను విరాట చమూపతి అక్కడ కృతవర్మతో నిలుచున్న శల్యుని చూడగనే హవిస్సుచేత మండిన అగ్నివలె జ్వలించుచు ఇంద్రచాపమువంటి తన ధనుస్సుతో శల్యుని సంహరించుటకు ఉరికెను. అతనిని మీవారు ఏడుగురు రథికులు అడ్డగించి మృత్యువు కోరలలో ఇరికిపోవుచున్న శల్యుని రక్షించిరి. వారితోపాటే అనేక వీరులు మీ వారు వివిధ ధనుస్సులతో మేఘములలో విద్యుత్తులవలె మెరయుచుండగా ముందుకు వచ్చి శంఖునిపైన బాణవర్షము కురియించిరి. ఆ బాణవర్షము గ్రీష్మాంతరమునందు వాయువుచేత చెదరగొట్టబడిన మేఘముల వర్షము పర్వతములపై గురిసినట్లుండెను.

అప్పుడు శంఖుడు క్రుద్ధుడై భల్లములచేత వారి ధనుస్సులను ఛేదించెను.

## నలుబది తొమ్మిదవ అధ్యాయము

# భీష్ముని ప్రచండయుద్ధము

అదిచూచి భీష్ముడు మేఘమువలె గర్జిల్లుచు తాటిచెట్టువలె దీర్ఘమైన ధనుస్సుతో శంఖునిపైకి వచ్చెను. అట్లు వచ్చుచున్న భీష్మునిజూచి పాండవ సేన వాయువేగ హతమైన నౌకవలె చెదరిపోయి భయపడియుండెను. అది చూచి అర్జునుడు శంఖుని భీష్ముని నుండి రక్షించుటకు అతనిముందు నిలిచెను. అప్పుడు పరస్పరము యోధులకు ఘోరయుద్ధము జరిగెను. శల్యుడు ముందుకు వచ్చి శంఖుని నాలుగు రథాశ్వములను సంహరించెను. వెంటనే శంఖుడు రథమునుండి ఖడ్గహస్తుడై దుమికి అర్జునుని రథము చేరెను

భీష్ముడు అనేక బాణములు ప్రయోగించి పాంచాల మాత్స్యకేకయాది సైనికులను హతమార్చుచు అర్జునుని విడిచి ద్రుపదునిపైకి ఉరికెను. ద్రుపద సైన్యములను భీష్ముడు శిశిరాంతమునందు అగ్ని వనములనువలె దహించు చుండెను. అతడప్పుడు నిర్ధూమాగ్నివలె ప్రజ్వరిల్లుచుండెను. మధ్యందిన మార్తాండుని వలె మండుచున్న భీష్మునివైపు పాండవ సైనికులు కన్నెత్తియైన చూడజాలకుండిరి. రక్షకుడు లేకవారు చలిలోన వణకుచున్న గోవుల వలె నుండిరి. సింహము గోవుల మందను వలె పాండవ సైనికులను భీష్ముడు చెదర గొట్టి చంపుచుండెను. ఆ సేనలు నశించుచుండగా సాయంకాలమాయెను. సూర్యు డస్తమించగానే ఉభయసైనికులు యుద్ధము ఆనాటికి విరమించిరి.

(యాబదివ అధ్యాయము)

## యుధిష్ఠిరుడు చింతించుట

ప్రథమ దిన యుద్ధము ముగిసిన తరువాత భీష్ముని ఆనాటి యుద్ధ సంరంభము చూచి దుర్యోధనుడు హర్షించెను. ధర్మరాజు చింతిల్లుచు శ్రీకృష్ణుని శిబిరము నకు పోయి యతనితో నిట్లనెను.

కృష్ణా! చూచితివా నేడు భీష్ముని పరాక్రమము. అతడు వేసవిలో గడ్డి

వామిని అగ్ని దహించునట్లు మన సైనికులను దహించును గదా! మంటలు గ్రక్కుచున్న అగ్నివలె మన నితడు నాకివేయుచుండగా నెట్లు భరించగలము? ఇతనిని ఏ విధముగా సాధించవలెను? యముడు దండధరుడై వచ్చినను, వజ్రాయుధధరుడై యింద్రుడు వచ్చినను భీష్ముని ఎదిరించజాలరని తోచుచున్నది. దిక్పాలకు లందరు వచ్చినను భీష్ముని నిలువరింపజాలరు. భీష్మ మృత్యు ముఖములో రాజులందరిని వేయజాలను కనుక నేను వనమునకు పోయి సుఖముగా జీవించెదను. మహాస్త్రకోవిదుడైన భీష్ముడు మన సైనికులనందరిని శలభములను జ్వాలితాగ్నివలె దహించగలడు. నా కారణముగా సోదరులు రాజ్యభ్రష్టులై పరితపించుచున్నారు. ఇక వనములో తపస్సు చేసికొనెదరు నావారిని సైనికులను రథగజాదులను భీష్మునకు ఎరబెట్టజాలను.

కేశవా! యిట్టి పరిస్థితిలో నేనిప్పుడేమి చేయవలెనో ఉపదేశింపుము జనమేజయా! యీ విధముగా యుధిష్ఠిరుడు సోదరులతో. రాజులతోను, కృష్ణుని ప్రార్థింపగా శ్రీకృష్ణుడు నవ్వి ధర్మరాజుతో నిట్లనెను.

భరతశ్రేష్ఠా! శోకింపకుము. వీరపరులైన సోదరులు నీకు ప్రియముగూర్చుటకు నేను సాత్యకి-ధృష్టద్యుమ్నుడు ఇందరు మహావీరులుండగా భయపడెదవేల? భీష్ముని చంపుటకే కదా! శిఖండియున్నాడు. నీవు భయపడవలసిన అవసరము లేదు.

జనమేజయా! అప్పుడు ధృష్టద్యుమ్నునితో ధర్మరాజు ఇట్లనెను.

నాయనా! నీవు కుమారస్వామి దేవసేనకు అధిపతివలె పాండవసేనాపతిగా నున్నావు. నీ పరాక్రమముతో శత్రువులను సంహరింపుము. మేమందరము నీకు బాసటగా నుంటి పోరాడెదము.

ఆ మాట విని ధృష్టద్యుమ్నుడిట్లనెను.

రాజా! నేను ద్రోణవధకై పరమేశ్వరునిచేత పుట్టింపబడినాను. భీష్మాది మహావీరులను ప్రతిఘటించి పోరాడగలను.

అదివిని పాండవులందరు హర్షించిరి అప్పుడు ధర్మరాజు ధృష్టద్యుమ్నునితో వివిధ వ్యూహములు పన్నుమని చెప్పెను.

## ద్వితీయదిన యుద్ధము-ధృష్టద్యుమ్నుని వ్యూహరచన

పూర్వము దేవాసుర యుద్ధములో బృహస్పతి యింద్రుని చేత నిర్మింప జేసిన 'క్రౌంచారుణ' వ్యూహమును ధృష్టద్యుమ్నుడు రచియించెను. అది సర్వ శత్రువినాశకరం. అదృష్టపూర్వము. దానిముందు భాగమునందు అర్జునుడు, శిరస్సుగా ద్రుపదుడు, కుంతిభోజ-చైద్యులు రెండు కన్నులుగాను, మెడగా అనేక సైనికులు-పౌండ్రక నిషదాది సేనలు వీపుగాను ఆ క్రౌంచపక్షి రెండు రెక్క లుగా భీమసేన ధృష్టద్యుమ్నులు కుడివైపుగా ద్రౌపదేయాభిమన్యులు మొదలైన వారు నకుల సహదేవాది సైనికులు వామన పక్షమునందును నిలిచిరి. పదివేల గజములు రెండు రెక్కలుగాను శిరస్సుగా ఒక లక్ష గజములు పృష్ఠముగా పది కోట్ల గజములు-మెడగా ఇరువది వేలు రెక్కల కొనలందు, రెక్కల లోపల చిన్న చిన్న రెక్కలుగాను పదికోట్ల డెబ్బదివేల గజములును నిలుపబడెను.

అట్లు ఆ క్రౌంచ వ్యూహము పర్వతమువలె ముందుకు సాగుచుండెను. ఈ వ్యూహము సూర్యోదయము వరకు రచియించి పాండవులు సిద్ధముగా నుండిరి

(యాబదిఒకటవ అధ్యాయము)

## కౌరవసేనా వ్యూహరచన

మహారాజా! తరువాత అభేద్యము, మహాఘోరము, అర్జున రక్షితములైన క్రౌంచ వ్యూహమును నీ పుత్రుడు చూచి ద్రోణాచార్యాది కురువీరులతో నిట్లనెను.

వీరులారా! మీరందరు మహాశస్త్రాస్త్ర కోవిదులు. మీలో ఒక్కొక్కరే పాండవులను జయింపసమర్థులై యున్నారు. ఇట్లుండగా మీరందరు ఏకముగా నున్నప్పుడు చెప్పవలసినదేమున్నది? అయినప్పటికి భీష్మ రక్షితమైన మన సేన శత్రువులను జయించుటకు చాలకున్నది. భీమరక్షితమైన శత్రుసైన్యమును జయింప జాలియున్నది. కనుక మీరందరు ఇతర సైనిక పరివారములతో భీష్మునే రక్షింపుడు.

ధృతరాష్ట్ర మహారాజా! నీ పుత్రుని మాటలు విని వీరులందరు భీష్ము

రక్షణార్థమై పూనుకొనిరి. తరువాత పాండవ వీరుల నెదిరించదగిన వ్యూహమును పన్ని మీవారు భీష్మ రక్షణమునకై సర్వప్రయత్నములు చేసిరి ఆ సేనామధ్యము నందు భీష్ముడు దేవతలమధ్య ఇంద్రునివలె ప్రకాశించుచుండెను. ద్రోణాచార్యుడు భీష్ముని అనుసరించి వెనువెంట పోవుచుండెను. శకుని గాంధారాది సైనికవీరులతో ద్రోణాచార్యుననుసరించి రక్షించుచుండెను.

రాజా! తరువాత దుర్యోధనుడు, తన సోదరులందరితో, శక-దరదాది సైనికులతోను, శకుని రక్షణార్థమై వెడలెను. అతని వామపార్శ్వమును శల్యుడగ దత్తాదులు రక్షించుచుండిరి. కుడిపార్శ్వమును సుశర్మాదులు సేనా పృష్ఠభాగము అశ్వత్థామాది వీరులు రక్షించుచుండిరి. వారందరి వెనుక పార్శ్వము నానాదేశ రాజవీరులు రక్షించుచుండగా మీవారందరు యుద్ధమునకు సాగిపోవుచు శంఖములు ఊదిరి. సింహనాదములు చేసిరి. ఇట్లు హర్షోత్సాహములతోనున్న వీరులందరిని చూచి భీష్ముడు తన శంఖము ఊది సింహనాదము చేసెను. అది విని మీ సైనికులందరు ఒక్కపెట్టున అరచి సంతోషమును ప్రకటించిరి.

రాజా! అప్పుడు శ్వేతాశ్వరథమునందున్న కృష్ణార్జునులు పాంచజన్య దేవదత్త శంఖములను భీముడు పౌండ్రనామక శంఖమును యుధిష్ఠిరుడు అనంత విజయము అను పేరుగల తన శంఖమును నకుల సహదేవులు సుఘోష-మణి పుష్పక నామకశంఖములను, ధృష్టద్యుమ్నాది రథికులందరు తమ తమ శంఖములను ఊది సింహనాదములు చేసిరి. ఆ ధ్వనిచేత భూమ్యాకాశములు ప్రతిధ్వనించెను, రాజా! ఈ విధముగా కౌరవ పాండవయోధవీరులు రెండవనాడు మహాహర్షోత్సాహములతో ఒండొరులను తమ మాటలతో ఉడికించుచు యుద్ధమునకు వెడలిరి.

(యాబది రెండవ అధ్యాయము)

## భీమార్జునుల యుద్ధము

జనమేజయా! అప్పుడు ధృతరాష్ట్రుడు సంజయునితో నాయనా! ఆ తరువాత మావారికి శత్రువులకు ఎట్లు యుద్ధము జరిగెనో చెప్పుమని అడుగగా సంజయుడిట్లు రెండవనాటి యుద్ధము వర్ణింపజొచ్చెను.

ధృతరాష్ట్ర మహారాజా! ఇరు సైన్యములు యుద్ధసన్నద్ధములై హర్షోత్సాహములతో నిలుచున్నప్పుడు, ఉప్పొంగుచున్న అపార సముద్రమువలె నుండెను. సైన్యమధ్యములో నిలిచి నీ పుత్రుడు దుర్యోధనుడు అందరిని ప్రోత్సహించెను. అప్పుడందరు పాండవసైనికులపై పడిరి. అప్పుడు చాలా ఘోరముగా ఇరువాగుల వారికిని సంకుల సమరము జరిగెను. ఎందరో సైనికులు అనేక రథగజాశ్వములు ఇరువైపుల నేలగూలెను.

రాజా! అది చూచి భీష్ముడు ముందుకు వచ్చి అభిమన్యు-ధృష్టద్యుమ్నాది యోధులపై శరవర్షము గురిసెను. అట్లు భీష్మ పితామహుడు క్రౌంచ వ్యూహమును రక్షించుచున్న పాండవ వీరులను చిందరవందర చేయుచుండెను.

రాజా! మహాపరాక్రమము ప్రదర్శించుచున్న భీష్ముని జూచి యర్జునుడు కృష్ణునితో ఇట్లనెను.

కృష్ణా! మనరథమును భీష్మునివైపు పోనిమ్ము. ఇతడు నేడు మన సేననంతటిని సంహరించగలడు. దుర్యోధనాదులు మన పాంచాలాదులను తుడిచి పెట్టగలరు. నేడు భీష్ముని సంహరించెదను. సైన్యమును రక్షించెదను.

ఆ యర్జునుని మాటకు శ్రీకృష్ణుడిట్లనెను:-

అర్జునా! యుద్ధసన్నద్ధుడవై దృఢముగా నిలువుము. ఇదుగో యిప్పుడు రథమును భీష్ముని రథమువైపు తోలుచున్నాను.

అప్పుడు అర్జునుడు శ్వేతాశ్వ కపికేతనాదులతో విరాజిల్లుచున్న రథములో, కట్లు త్రెంపికొనిపోవుచున్న క్రుద్ధ మదగజమువలె పోవుచు తన కెదురైన కౌరవ వీరుల నందరను హతమార్చుచుండెను.

రాజా! అదిచూచి భీష్ముడు అర్జునునితాకెను. భీష్మ-ద్రోణ కర్ణులు దప్ప అర్జునుని ఇతరులెవరు ఎదుర్కొనగలరు? భీష్ముడు అర్జుననిపైన డెబ్బదియేడు, ద్రోణుడు ఇరువదియైదు, కృపుడు ఏబది. దుర్యోధనుడు అరువదినాలుగు, శల్యుడు తొమ్మిది, బాణములను ప్రయోగించిరి. ఈ విధముగా సైంధవాది వీరులు అనేక బాణములను అర్జుననిపై ఒక్కసారిగా ప్రయోగించిరి. ఇందరు ఇంతగాకొట్టినను అర్జునుడుకొంచెముకూడ చలించక, వానగురియుచుండగా పర్వతమువలె నిలిచెను.

తరువాత అర్జునుడు భీష్మ ద్రోణాదులపైన బహుసంఖ్యాక తీవ్ర బాణము లను పంపెను. అతనికి బాసటగావచ్చిన సాత్యకి-ధృష్టద్యుమ్నాదులుగూడ కురు వీరులపై అనేక బాణములు గురిసిరి.

అప్పుడు భీష్ముడు సేనామధ్యమునవచ్చి నిలిచెను. అర్జునుడు తమ సైన్య మును పీడించుటచూచి దుర్యోధనుడు భీష్మునితో నిట్లనెను.

తాతా! నీవు జీవించియుండగనే కృష్ణార్జునులు మన సైన్యమును సమూల ముగా నరుకుచున్నారు. నీ వలననే కర్ణుడుకూడ అస్త్రసన్న్యాసముచేసి యుద్ధము చేయకున్నాడు. అతడు సర్వదా నా హితముకోరినాడు. ఎట్లైనను అర్జునుడు చచ్చు నుపాయము చూడుము.

ఆమాటవిని భీష్ముడు క్షాత్రధర్మమెంత చెడ్డది ఛీ? అని తలపోసి అర్జునుని పైకి ఉరికెను. ఆ శ్వేతహయ రథికులిరువురు తలపడుటచూచి రాజవీరులు సింహనాదముచేసి శంఖములూదిరి.

అప్పుడు అశ్వత్థామ-దుర్యోధన-వికర్ణులు భీష్మునికాపాడుచుండిరి. పాండ వులుకూడ అర్జునుని రక్షణార్థమై నిలిచిరి. అప్పుడు భీష్మార్జునులకు ఘోర యుద్ధము జరిగెను. అనేక బాణములు పరస్పరము ప్రయోగించిరి. ఒండొరుల బాణములొండరులు భేదించుచుండిరి. భీష్ముడే వైపు పోవకుండ అర్జునుడు అతనిని నలువైపుల బాణములతో అడ్డగించెను. ఆ బాణములను భీష్ముడు నివారించెను. ఒకరికొకరు తీసిపోకుండ పోరాడుచుండిరి. భీష్ముని బాణములను అర్జునుడు, అతని బాణములను భీష్ముడును నడుమనే ఛేదించుచుండిరి. ఒండొరుల రథాశ్వ ధ్వజముల నొండొరులు కొట్టుచుండిరి.

రాజా! అప్పుడు భీష్ముడు మూడు బాణములతో శ్రీకృష్ణుని యెదపై కొట్టెను. ఆ దెబ్బతో శ్రీకృష్ణుడు పుష్పించిన మోదుగుచెట్టువలె విరాజిల్లెను. అట్లు భీష్మునిచేత దెబ్బతిన్న కృష్ణునిచూచి అర్జునుడు మిక్కిలి క్రుద్ధుడై భీష్ముని సారథినికొట్టెను. ఒండొరులను వధించుటకు ఇరువురును ప్రయత్నించుచుండిరి.

రాజా! భీష్మార్జునుల సారథుల రథచాలన లాఘవమువలన ఆ రెండు రథ ములు మండలాకారములో విచిత్రముగా తిరుగజొచ్చెను. అప్పుడెవరెవరిపై ఎప్పుడు బాణప్రయోగము చేయుచుండునదియు తెలియకుండెను. ఇరువురును

శంఖములూది, ధనుష్టంకారములుచేసిరి ఆ ధ్వనులచేత భూమి కంపించెను. ఇరువురి యుద్ధ కౌశలములో భేదము కనబడకుండెను. ఇరువురును సమాన వీరులే కాబట్టి ఇరువురి చిహ్నములనుబట్టి చూపరులు వారిని గుర్తించుచుండిరి. ఆయిరువురి సమాన పరాక్రమముచూచి సమస్త భూతలము విస్మయము చెందుచుండెను. ఆయిరువురి యుద్ధములో ఏలోపము, ధర్మాత్ములలో పాపము కనపడనట్లు తోచకుండెను. శరజాలములో ఆ యిద్దరు మునిగి కనబడకుండిరి అ జాలము విడిపోయినప్పుడు కనబడుచుండిరి.

రాజా! వారి యుద్ధమును చూచుచు దేవాసుర గంధర్వాదులు-ఇతరజనులు ఇట్టి మహాద్భుత యుద్ధ మెచ్చటను చూడలేదు. యుద్ధములో భీష్ముని అర్జునుడు గాని, అతనిని భీష్ముడుగాని జయింపజాలడు. ఇరువురి యుద్ధము సమానముగా సాగుచున్నది"అని అనుకొనుచు ఇరువురిని స్తుతించుచుండిరి.

రాజా! ఇట్లు భీష్మార్జునులు పోరాడుచుండగనే ఇతర యోధ వీరులుకూడ పరస్పరము తలపడి యుద్ధము చేయుచుండిరి ఖడ్గాదిశస్త్రములచేత నొండొరులు కొట్టుకొనుచుండిరి. అప్పుడు ద్రోణాచార్య- ధృష్టద్యుమ్నులు తలపడి పోరాడజొచ్చిరి.

యాబదిమూడవ అధ్యాయము

## ద్రోణాచార్య-ధృష్టద్యుమ్నుల యుద్ధము:-

సంజయా! ద్రోణాచార్య - ధృష్టద్యుమ్నుల యుద్ధ వివరములనుగూర్చి చెప్పుము. పౌరుషముకన్న దైవమే బలవత్తరమని తలచుచున్నాను. భీష్ముడు క్రుద్ధుడైనచో చరాచర లోకములన్నిటిని చంపగలడుకదా! అట్టివాడు అర్జునుని ఎట్లు అణచజాలకపోయెను. అను దృతరాష్ట్రుని ప్రశ్నమునకు సంజయుడిట్లు బదులుచెప్పెను.

రాజా! ఈ భయంకర యుద్ధమునుగూర్చి చెప్పెదను. స్థిరుడై వినుము. ఇంద్రాదిదేవతలుగూడ పాండవులను జయింపజాలరు. ఇక ధృష్టద్యుమ్న - ద్రోణాచార్యుల యుద్ధమునుగూర్చి చెప్పెదను:-

రాజా! ద్రోణాచార్యుడు నిశిత శరములచేత ధృష్టద్యుమ్నుని కొట్టి, అతని సారథిని భల్లముతో క్రిందపడగొట్టెను. అతని నాలుగు గుఱ్ఱములను నొప్పింపజేసెను. ధృష్టద్యుమ్నుడు తొంబది బాణములతో ద్రోణుని కొట్టెను. ద్రోణాచార్యుడు అతిక్రుద్ధుడై యమదండమువంటి బాణమును సంధించి ధృష్టద్యుమ్నుని వధింపబూనెను. అదిచూచి, సైన్యములు హాహాకారములుచేసెను. అప్పుడు ధృష్టద్యుమ్నుడు మహాద్భుతముగా, ద్రోణునిపై శరవర్షము గురిసెను. ద్రోణుని సంహరించుటకై శక్తిని విసిరెను. దానిని ద్రోణుడు మూడుముక్కలుచేసి, అతని ధనుస్సును ఖండించెను.

రాజా! అప్పుడు ధృష్టద్యుమ్నుడు గదను ద్రోణునిపైకి వేసెను. దానిని ద్రోణుడు విరిచి భల్లములు అతనిపైవేసెను. అవి అతని కవచము ఛేదించి రక్తమయము చేసెను. ధృష్టద్యుమ్నుడు మరియొక ధనుస్సు తీసికొని ద్రోణునిపై బాణవర్షము గురిసెను. అప్పుడా యిరువురి శరీరములు పూచిన మోదుగులవలె రక్తసిక్తములయ్యెను. ద్రోణుడు మరల ధృష్టద్యుమ్నుని ధనుస్సును ఖండించి బాణములు గురియగా నతడు వానచేత పర్వతమువలె కదలక నిలిచి మరియొక ధనుస్సుతీసికొనగా దానినిగూడ ద్రోణుడు ఖండించి భల్లములతో నతని సారథిని, అశ్వములనుగొట్టెను.

రాజా! అట్లు భిన్నాశ్వ ధనుస్సారథులు గలవాడై ధృష్టద్యుమ్నుడు గదాపాణియై రథమునుండి దుమికి గదను ద్రోణునిపై విసిరెను. దానిని ద్రోణుడు ఖండించెను. అప్పుడు ధృష్టద్యుమ్నుడు ఖడ్గముగొని ద్రోణునిచంపుటకు అతనిపై సింహము గజముపై కురికినట్లు ఉరికెను.

రాజా! అప్పుడు ద్రోణాచార్యుని అద్భుత పౌరుషమును, అస్త్రవేగమును, హస్తలాఘవమును చూడవలెను సుమా! ద్రోణుడు ధృష్టద్యుమ్నుని వారింపగా, అతడు కదలలేకుండెను. ధృష్టద్యుమ్నుడు ద్రోణుని బాణములను తనడాలు చేతనే నివారించెను. అప్పుడు భీముడు ధృష్టద్యుమ్నునకు సహాయకుడుగావచ్చి నిశిత శరములతో ద్రోణుని కొట్టి, ధృష్టద్యుమ్నుని తన రథముపై నెక్కించుకొనెను.

రాజా! అప్పుడు దుర్యోధనుడు కళింగరాజైన భానుమంతుని అతని సైన్య

ముతో ద్రోణాచార్య రక్షణమునకు పంపెను. ఆ సేన భీముని ఎదుర్కొనెను. అప్పుడు ద్రోణుడు ధృష్టద్యుమ్నునివిడిచి, వృద్ధులైన ద్రుపద విరాటులనుదాకెను. ధృష్టద్యుమ్నుడు ధర్మరాజుకు బాసటగాపోయెను.

రాజా! తరువాత కళింగసేనలకు భీమునకు మహాఘోరముగా తుముల యుద్ధము జరిగెను. అది ప్రపంచమునకు ప్రళయము సంభవించెనా యనునంత భయంకరముగా నుండెను.

## యాబదినాల్గవ అధ్యాయము

## భీముడు-కళింగ సేనలను వధించుట:-

"సంజయా! అద్భుత పరాక్రమశాలియైన భీమసేనుని కళింగసేనలు ఎట్లు ఎదిరించి పోరాడగలిగిరి" అను ధృతరాష్ట్రుని ప్రశ్నకు సంజయుడిట్లు బదులు చెప్పెను.

రాజా! దుర్యోధనునిచేత ప్రోత్సహింపబడి కళింగరాజు మహాసేనతో భీమసేనుని ముట్టడించెను. శ్రుతాయువనువాడు మహాసేనతో భీమసేనుని, అతని సైన్యములను చుట్టుముట్టెను. ఆ యిరుసేవలకు ఘోరయుద్ధము జరిగెను. ఇంద్రుడు రాక్షస సేనలతో పోరాడినట్లు భీముడా సైన్యములతో పోరాడి గగ్గోలు పరచుచుండెను. పరులు తమవారు అను భేదము తెలియకుండగ, అందరుగూడ ఎదురు పడిన వారిని చంపుచుండిరి.

రాజా! భీమసేనుడొక్కడుదప్ప, చేదిసైన్యములు తిరిగిపోయెను. అప్పుడు భీముడు తన బాహుబలమాధారముగా ఒక్కడే కళింగాది సైన్యములతో పోరాడదొడగెను. కాళింగుడు అతని పుత్రుడు శక్రదేవుడు భీమసేనుని బాణములతో గొట్టిరి. భీముని అశ్వములనుచంపి విరథునిచేసిరి శక్రదేవుడపుడతని పై కురికి బాణ వర్షములు, గ్రీష్మాంతమునందు మేఘమువలె వర్షించెను. అప్పుడు భీమసేనుడు సర్వశైక్యమైన (అంతటను పుష్పచిత్రములు చెక్కబడిన) ఉక్కుగదను శక్రదేవునిపై విసిరెను. ఆ దెబ్బతో అతని సారథి చనిపోయి యతడు క్రిందపడెను.

రాజా! అట్లు కొడుకు శక్రదేవుడు మరణించుటచూచి కళింగరాజు ఖాను

మంతుడు అనేక సహస్ర రథములతో భీముని చుట్టుముట్టెను. అప్పుడు భీముడు గదను విడిచి ఖడ్గమును, బంగారు నక్షత్రములు చంద్రుడు పొదుగబడిన యెలుగు బంటి చర్మపు డాలును తీసికొని పోరాడజొచ్చెను. కాళింగుడు క్రుద్ధుడై సర్పము వంటి బాణమును భీముని పై విడిచెను. ఇట్లు వారిరువురు వివిధములుగా యుద్ధము చేసి బిగ్గరగా సింహనాదములు చేయగా ఇరుసేనలు భయకంపితములయ్యెను. భీముడు కాళింగుడు ఎక్కిన యేనుగుదంతములు పట్టుకొనియెగిరి గజముపైనెక్కి ఖడ్గములో భానుమంతుని భుజమునరికి క్రింద పడగొట్టి, ఆ గజమునుండి దిగెను.

రాజా! తరువాత భీముడు కళింగుల గజసైనికులను ఛిన్నాభిన్నముచేసి చంపుచువచ్చెను. అతని ధాటికి తట్టుకొనజాలక హతశేషులు భీష్ముని. మరుగు జొచ్చిరి.

రాజా! అప్పుడు కళింగ సైన్యాధిపతి శ్రుతాయువను వానిపై భీమసేనుడు దాడిచేయగా నతడు భీముని యెదపై కొట్టెను దానితో భీముడు రెచ్చిపోయెను అప్పుడు అశోకుడను భీముని సారథి రథముతేగా దానినెక్కి శ్రుతాయువును తరిమెను. ఆ యిరువురికి ఘోరయుద్ధము జరిగినతరువాత భీముదతనిని చంపెను. తరువాత సత్యదేవుడు - కేతుమంతుడు అను కళింగ వీరులనుకూడ భీముడు హతమార్చెను.

అప్పుడు కళింగ సైనికులనేకులు భీమసేనుని చుట్టుముట్టగా, అతడా యేడునూర్ల మందిని తన గదా దండముతో సంహరించెను. తరువాత రెండువేల సైనికులనుగూడ చంపెను. భీముని వీరవిహారమిప్పుడు అత్యద్భుతముగా నుండెను. ఇట్లే అనేక సహస్ర సంఖ్యలో కళింగ సైనికులను భీష్ముడు చూచు చుండగా భీముడు చంపి బిగ్గరగా సింహనాదముచేసి కళింగులను కంపింపజేసి, మొసలి సరస్సును క్షోభింపజేసినట్లు కళింగసేనాసరసిని క్షోభిల్లజేసెను.

రాజా! యీ విధముగా భీమునిచేత చెదరగొట్టబడిన కళింగ సైనికులు మరల ఒక్కటిగాగూడి పాండవసేనపై దాడిచేయగా, పాండు సేనాపతి యాజ్ఞ చేత శిఖండి మొదలైన పాండవవీరులు భీమసేనునకు తోడుగాపోయిరి. వారి వెనుక ధర్మరాజుగూడ వారిని ప్రోత్సహించుచు పోయెను.

రాజా! ఈ విధముగా నందరిని పురికొల్పుచు సేనాపతియైన ధృష్టద్యు మ్నుడు భీమునకు బాసటగా అతని ప్రక్కనచేరెను. అంతలో సాత్యకిగూడ

వచ్చి వారితో చేరెను. ఆ ముగ్గురు భీష్మునిపై దాడిసలిపిరి. భీష్మునకు భీమ-సాత్యకి-ధృష్టద్యుమ్నులకు ఘోరయుద్ధము జరిగెను. భీష్ముడు భీముని-రథ సైన్యమును హతమార్చెను. అప్పుడు అశ్వములు చచ్చిన రథమునుండియే భీముడు భీష్మునిపై మహాశక్తిని విసరెను. దానిని భీష్ముడు మూడుముక్కలుచేసెను. తరువాత భీముడు తన శైక్యాయస(పుష్పచిత్రములు చెక్కబడిన యినుప)గదను భీష్మునిపై విసరెను. ఇంతలో సాత్యకి భీష్ముని సారథినిపడగొట్టెను. సారథిలేని భీష్ముని రథమును అశ్వములు దూరముగా ఈడ్చుకొనిపోయెను.

రాజా! అట్లు భీష్ముడు తొలగిపోవగనే భీముడు కోపాగ్నిచేత మండుచు ఎండుగడ్డి వామినివలె దహించుచు సమస్త కళింగ సైన్యములనుచంపి సేనామధ్యమున నిలిచెను. రాజా! అప్పుడు భయముతో మీ సైనికులతనివైపు కన్నెత్తియైన చూడజాలకుండిరి.

అంతట ధృష్టద్యుమ్నుడు భీముని తన రథముపై నెక్కించుకొని దూరముగా తోడ్కొనిపోయెను. అప్పుడు భీముని అందరు ప్రశంసించిరి. అతడు ధృష్టద్యుమ్నుని ఆలింగనముచేసికొని సాత్యకి కడకుపోయెను. సాత్యకి భీముని మిక్కిలి ప్రశంసించి కళింగరాజ రాజపుత్ర శక్రదేవ కేతుమంతులను, కళింగ సైన్యములనన్నిటిని అతడొక్కడే తుదముట్టించినందుకు సంతోష సూచకముగా తన రథమునుండి ఎగిరి భీముని రథముపైదుమికి అతనిని కౌగిలించుకొనెను. తిరిగి తన రథమునకువచ్చి సాత్యకి మీ సైనికులను చంపజొచ్చెను.

జనమేజయా! ఇట్లు రెండవనాటి యుద్ధమును వర్ణించుచు సంజయుడు ధృతరాష్ట్రునితో మరల ఆనాటి తరువాతి యుద్ధమునుగూర్చి యిట్లు వర్ణింపజొచ్చెను:-

యాబదిఐదవ అధ్యాయము

## అర్జునాభిమన్యుల పరాక్రమము :-

"రాజా! ఆనాటి పూర్వాహ్ణమునందు అనేక రథ-గజ-తురగ-పదాతి దళములు మడిసిన తరువాత అశ్వత్థామ-శల్య-కృపాచార్యులు ధృష్టద్యుమ్నునితో తలపడిరి. అతడు అశ్వత్థామాశ్వములను చంపెను. అప్పుడతడు శల్యునిరథముపై

నెక్కి, దృష్టద్యుమ్నునిపై నిశిత శరవర్షము కురిసెను. అది చూచి అభిమన్యుడు దృష్టద్యుమ్నునకు బాసటగావచ్చి పదునైన ఇరువదియైదు బాణములు శల్యునిపై తొమ్మిది కృపాచార్యునిపై, ఎనిమిది అశ్వత్థామపైనను ప్రయోగించెను.

"అప్పుడు వెంటనే అశ్వత్థామ శల్య-కృపులు అభిమన్యుని బాణములతో కొట్టిరి. తరువాత రాజా! నీ పౌత్రుడు దుర్యోధన పుత్రుడునైన లక్ష్మణుడు అతి క్రుద్ధుడై అభిమన్యునితాకెనును. అప్పుడా యిరువురకు ఘోరయుద్ధము జరిగెను. అభిమన్యుండాతనిపై ఏబది బాణములను వేయగా, లక్ష్మణుదభిమన్యుని ధనుస్సు ఖండించెను. అపుడభిమన్యుడంతకన్న దృఢమైన కార్ముకము తీసికొనెను. ఆ యిరువురకు అత్యద్భుతముగా యుద్ధము జరిగెను.

"అంతట దుర్యోధనుడు తన పుత్రుడు అభిమన్యునిచే పీడింపబడుటజూచి పుత్రుని సహాయము కొరకురాగా, తక్కిన రాజులందరు అభిమన్యుని చుట్టుముట్టి దాడిసలిపిరి. కృష్ణతుల్య పరాక్రమముగల అభిమన్యుడేమాత్రము కంపించక అందరిలో పోరాడుచుండెను. అట్లు అంతమంది మహావీరులచేత ఆక్రమింపబడిన అభిమన్యునిచూచి అర్జునుడు, తన పుత్రుని రక్షణముకొరకు వచ్చెను.

"రాజా! అర్జునుడురాగానే భీష్మ ద్రోణాదివీరులు చతురంగ బలములతో వచ్చి, అర్జునునితాకిరి. ఆ సైన్యపు త్రొక్కిడిచేత రేగిన ధూళి ఆకాశమునందు క్రమ్మి సూర్యుని రథముకప్పెను. అర్జునుని బాణములదెబ్బకు, గజాశ్వాది సైన్యములు అక్కడికక్కడనే మడియజొచ్చెను. సర్వప్రాణులు అరచెను. దిక్కులలో చీకట్లుక్రమ్మెను. అప్పుడు కౌరవుల అవినీతి స్పష్టముగా కనబడుచుండెను. భూమ్యాకాశములు, దిక్కులు, సూర్యుడుగూడ అర్జునునిబాణములచేత కప్పబడి తెలియకపోయెను.

"రాజా! అర్జునునిధాటికి తాళజాలక యెందరో పారిపోయిరి. ఎందరో సైనికులు, గజాశ్వములుచచ్చెను. ఎక్కడవారక్కడ చెదరి తమ అశ్వములను గజములను విడిచి పారిపోయిరి. అర్జున బాణములచేత క్రిందపడి దొర్లుచున్న అనేక రథికాశ్విక గజారోహక వీరులు, అన్నిచోట్ల కనబడుచుండిరి అర్జునుడు మహారౌద్రాకారములోగదా, ఖడ్గ-ప్రాస-శర-కార్ముక-అంకుశములను ధరించి పోరాడుచున్న శత్రుసైనికులను నరకుచుండెను ఖడ్గాద్యనేక వివిధశస్త్రములు అర్జున బాణములచేత నుగ్గునుగ్గై రణరంగమునందు గుట్టలుగుట్టలుగా పడియుండెను.

రాజా! నీ సైన్యములో నొక్కడుగూడ అర్జును నెదిరించగలవాడు లేకుండెను ఎదిరించినవారందరు పరలోకయాత్ర చేయుచుండిరి. అట్లు చావగా మిగిలిన శత్రువులు పారిపోవుచుండుటచూచి కృష్ణార్జునులు తమ శంఖములూదిరి.

అట్లు భగ్నమైన సైన్యమునుచూచి, భీష్ముడు నవ్వుచు ద్రోణాచార్యునితో నిట్లనెను:-

"ఆచార్యా! అగ్నికి వాయువుతోడైనట్లు అర్జునునకు కృష్ణుడు తోడుగా నుండి, అగ్నివలె కురుసైన్యమును మసిచేయుచున్నారు. ప్రళయ కాలయముని వలెనున్న అర్జునుని జయించుటకు ఏమాత్రము శక్యముకాదు. ఈ పాండవసేనను మరలించుటగూడ అసాధ్యమే. ఇప్పుడు సూర్యుడస్తమించుచున్నాడు. చీకట్లు క్రమ్ముచు, కన్నులు కనబడకున్నవి కనుక ఈనాటి యుద్ధమిక చాలించుదమని మనయోధులు అలసి, భయపడియున్నారు. ఇక నేడు పోరాడజాలరు".

ఇట్లు ద్రోణాచార్యులకు చెప్పి భీష్ముడు ఆనాటి యుద్ధము ఆపెను.

అంతట పాండుసేనలు గూడ జయకారములు చేయుచు యుద్ధమును ఆపి అర్జునుని ముందిడుకొని తిరిగిపోయిరి.

(యాబదియారవ అధ్యాయము)

## తృతీయ దివసయుద్ధము, ఉభయుల వ్యూహరచన

జనమేజయా! సంజయుడు ధృతరాష్ట్రునకు తరువాతి యుద్ధవృత్తాంత మిట్లు చెప్పెను.

"రాజా! మూడవదినము ప్రభాతమునందు భీష్ముడు నీ పుత్రుల జయము గోరుచు గరుడవ్యూహమును రచియించెను. గరుడపక్షి తుండము (ముక్కు) నందు భీష్ముడు స్వయముగా నిలిచెను. రెండుకన్నుల స్థానములో ద్రోణాచార్య-కృతవర్మలను నిలిపెను. గరుడుని శిరస్సు స్థానములో అశ్వత్థామ-కృపాచార్యులను నిలిపెను. త్రిగర్త-కైకయ-వాటధానులను, భూరిశ్రవస్-శల-శల్య-భగదత్తులను-మద్రక-సింధు-సౌవీర-పాంచనద సైనికులను-సైంధవునితో గరుడుని మెడ స్థానమునందు నిలిపెను. దానివీపుగా దుర్యోధనాదులైన నూర్గురు సోదరులను

నిలిపి, దాని పుచ్ఛస్థానమునందు విందానువింద-కాంభోజ-శక సైనికులను నిలిపెను. కుడి పార్శ్వ స్థానములో మగధ-కళింగ-దాసేరకగణములను నిలిపెను. వామపార్శ్వ స్థానములో కరూష-వికుంజ-ముండ-కుండీవృష సైనికులతో బృహద్బలుని నిలిపెను.

"రాజా! అట్లు భీష్ముడు తీర్చిన గరుడవ్యూహమును చూచి అర్జునుడు, ధృష్టద్యుమ్నునితో గలిసి అతిభయంకరమైన అర్ధచంద్రవ్యూహమును పన్నెను. ఆ అర్ధచంద్రుని దక్షిణశృంగ స్థానమునందు అనేకశస్త్రాస్త్ర కోవిదులైన నానా దేశ రాజవీరులతో పాటు భీమసేనుడు నిలచెను. అతని ప్రక్కనే విరాట ద్రుపదులు ఆ తరువాత నీలాయుధములతో నీలుడు ఆ పిదప చేది-కాశి-కరూష-పౌరవ సైనికులతో మహాబలశాలి ధృష్టకేతుడున్ను నిలిచిరి. అర్ధచంద్ర మధ్యభాగమునందు ధృష్టద్యున్న-శిఖండి-పాంచాలసైనికులు ప్రభద్రకులు గజసేనలో యుధిష్ఠిరుడున్ను నిలిచిరి. వారిప్రక్కన సాత్యకి-ద్రౌపదీ పుత్రులైదుగురు అభిమన్యుడు భీమసేన పుత్రుడైన ఇరావంతుడున్ను నిలిచిరి. వారిప్రక్కన మహారథికులైన కేకయులు నిలిచిరి. ఆ తరువాత అర్ధచంద్రుని ఎడమకొమ్మునందు నరోత్తముడైన జగత్పతి శ్రీకృష్ణుడు నిలిచెను.

రాజా! యీ విధముగా పాండవులు ప్రతివ్యూహమును నిర్మించి నీ పుత్రుల కొరకు అందరు ఏకమై నిలిచిరి.

తరువాత మహోత్తముల యుద్ధము రెండు సేనలకు మొదలయ్యెను అందు అనేక చతురంగబలములు ఇరువైపుల మరణించెను. ఎందరో భయపడి పారిపోయిరి. తరిమి తరిమి యొండొరులను కొట్టుకొనుచుండిరి. ఆ దొమ్మియుద్ధధ్వనిలో దుందుభి ధ్వనులు గలిసి ఆ ధ్వని మిన్నంటెను. రాజా! యిట్లువారికి తుముల యుద్ధము సాగెను.

(యాబది యేడవ అధ్యాయము)

## తుముల యుద్ధము

జనమేజయా! సంజయుడు ధృతరాష్ట్రునకు మూడవనాటి తరువాతి యుద్ధ వృత్తాంతము నిట్లు చెప్పదొడిగెను.

"రాజా! రెండుసేనా వ్యూహములు ఏర్పడిన తరువాత అర్జునుడు మీ రథ సైన్యమును సంహరించుచు ఆ సేనను చీల్చుచు అందులో దూరి రథయూధ పతులను వధించెను. అట్లు చంపబడుచు ధార్తరాష్ట్ర యుద్ధవీరులు అతి ప్రయత్నములో శత్రువులతో పోరాడుచుండిరి. యశమోమృత్యుమో యని తెగించివారు ఏకాగ్రతతో పాండవసేనను భంజించుచుండిరి. అప్పుడిరువైపుల నున్న వీరులకు ఏమియు తెలియకుండెను. భూమ్యాకాశములు, సర్వదిక్కులు దూళి గప్పగావారు యుద్ధమెట్లు చేయుదురు?

ఊహచేత, నామగోత్రములచేతను, ఒండొరులను గుర్తించుకొనుచు కొట్టు కొనుచుండిరి.

కౌరవుల యుద్ధవ్యూహము బేదింపబడ లేదు. దానిని సత్యసంధుడైన ద్రోణాచార్యుడు రక్షించుచుండెను. అట్లే పాండవుల వ్యూహము గూడ అర్జునుని చేత రక్షింపబడినదై బేదింపబడలేదు. భీమసేనుడు గూడ దృఢముగా నిలిచి దానిని రక్షించుచుండెను. సేనముందుభాగమునుండి కూడ ఎగిరి దుమికి సైనికులు పోరాడుచుండిరి.

రెండంచులకత్తులతో ప్రాసాద్యాయుద్ధములతో నొండొరులు వధించుకొనుచుండిరి. అశ్వికులను-రథికులు రథికులు-గజారోహకులను గజారోహకులుఎదిరించి పరస్పరమువధించుచుండిరి. కొందరు శత్రువులు పట్టియీడ్చి తలలు పగులగొట్టుచుండిరి. మరికొందరు గజదంతములను ఎదలో గ్రుచ్చి చంపుచుండిరి. అంతటను వీరులు రక్తము గ్రక్కుచుండిరి. గజదంతముపైన గూర్చొనినవారిని శక్తిచేత శత్రువు చంపెను. అశ్వికులను గజారోహకులు వారిని అశ్వికులు వారిని పదాతి దళములు, పదాతిదళములను పైముగ్గురు సైనికులు ఎట్లు దొరికినఅట్లు వివేచనా రహితముగా చంపుచుండిరి. ఖడ్గములతో, గదలతో కణపము (ఇనుపగుండ్లు నించిన ఆయుధము)లతో కంపనము (కంపింప జేయునాయుధము) లతో, బాణములతోను పరస్పరము పోరాడిరి.

"భూమి పరిస్తోమ (గజముపై పరచురత్నకంబళి)ములతో భాసిలుచుండెను నరాశ్వగజశరీరములుపడి, రక్తమాంసకర్దమమై భూమి నడచుటకు వీలుగాక యుండెను. నెత్తుటివరదల చేత ధూళి అణగెను. దిక్కులు స్వచ్ఛములయ్యెను.

కబంధములు (మొండెములు) అసంఖ్యాకములుగా ఎగురుచుండెను. అట్లు ఎగురుట ప్రపంచ వినాశసూచకము.

అతిభయంకరమైన ఆ యుద్ధములో పరుగెత్తిపోవుచున్న తమయోధులను చూచి భీష్మ ద్రోణాదివీరులు ముందుకుసాగి శత్రుసేనలను భంజించిరి. అట్లే భీమసేనుడు ఘటోత్కచుడు సాత్యకి మొదలైన వీరులు మీవారిని నీ పుత్రులను రాజవీరులను కొట్టి దేవతలు రాక్షసులను వలె పారదోలుచుండిరి.

"రాజా! ఇట్లు సంకులసమరములో పరస్పరము చంపికొనుచు సైనికులు దోగి రాక్షసులవలె ఘోరముగా కనబడిరి. ఇట్లు ఉభయసేనలలో వీరులు పరస్పరము జయించుకొనుచు ఆకాశమునందు గ్రహ నక్షత్రములవలె దోచిరి.

"రాజా! తరువాత నీ పుత్రుడు దుర్యోధనుడు వేయిరథములతో ఘటోత్కచుని ఎదిరించెను. అర్జునాది పాండవులందరు మహాసేనతో భీష్మద్రోణాదివీరుల నెదిరించిరి. అభిమన్యు సాత్యకులు శకుని సైన్యములపై కురికిరి. అప్పుడు మహా ఘోరముగా మీవారికి పాండవులకు యుద్ధము జరిగెను.

(యాబది యెనిమిదవ అధ్యాయము)

## పాండవ వీరుల పరాక్రమము

జనమేజయా! సంజయుడు తరువాతి యుద్ధ వృత్తాంతము ధృతరాష్ట్రున కిట్లు చెప్పదొడగెను-

రాజా! మీరాజ వీరులందరు మిక్కిలి క్రుద్ధులై వివిధాయుధములతో నర్జునుని పొదివిరి. అగ్నిపైన శలభములవలె వచ్చి పడుచున్న ఆ యాయుధము లన్నింటిని అర్జునుడు తన శరపరంపరచేత వధించెను.

అప్పుడు అర్జునుని హస్తలాఘవము చూచి ఆకాశమునందు దేవదానవ గంధర్వులు, పిశాచోరగ రాక్షసులున్ను సాధువాదములచేత అర్జునుని ప్రశంసించిరి. తరువాత అభిమన్యు సాత్యకులు గొప్పసేనతో గాంధార-సౌబల సేనలను తాకిరి. అప్పుడు సౌబల సైనికులు సాత్యకి రథమును ధ్వస్తము చేసిరి. సాత్యకి

అభిమన్యు రథము నెక్కెను. ఆ యరువురొక్క రథము నుండియే శకుని సౌబలసైన్యమును నుగ్గునుగ్గుగా కొట్టిరి.

భీష్మద్రోణులు ధర్మరాజు సైన్యముపై దాడిచేసికొట్టిరి. అప్పుడు యుధిష్ఠిరుడు నకులసహదేవులున్ను అందరు చూచుచుండగా, ద్రోణాచార్య సైనికులను మట్టడించిరి. అప్పుడా యిరుసేనలకు దేవదానవులకువలె తుముల యుద్ధము జరిగెను.

అంతట భీమసేన ఘటోత్కచులు పెద్దగా పోరాడుచు దుర్యోధనుని సేనను తరిమికొట్టిరి. దుర్యోధను డాయిరువురిపై దాడిచేసెను. అప్పుడు ఘటోత్కచుడు అత్యద్భుతముగా తండ్రికంటె మించి యుద్ధము చేసెను. భీమసేనుడు మిక్కిలి క్రుద్ధుడై దుర్యోధనుని మెదపై తీవ్రమైన బాణముతో కొట్టగా నతడు రథముపైన ఒరగి మూర్ఛిల్లెను. అప్పుడు దుర్యోధనుని సారథి దూరముగా రథమును తీసికొని పోయెను. అంతటితో నతని సైన్యమన్ని దిక్కుల పారజొచ్చెను.

తరువాత అట్లు పరుగెత్తుచున్న నీ పుత్రుని సైనికులను ధృష్టద్యుమ్న ధర్మపుత్రులు భీష్మద్రోణులు చూచుచుండగనే నిశితశరములచేత హత మార్చుచుండిరి. అట్లు పారిపోవుచున్న సేనను భీష్మద్రోణులు నివారించుచున్నను భయముచేత ఆ సేన పారిపోవుచుండెను.

ఇట్లు వేలకొలది రథములు పారిపోవుచుండగా ఏకరథస్థులైన అభిమన్యు సాత్యకులు సుబలసేనను నరకుచుండిరి. అప్పుడాయిరువురు అమావాస్యనాడు ఆకాశమునందు కలిసియున్న చంద్రసూర్యులవలె శోభిల్లుచుండిరి.

రాజా! అర్జునుడు క్రుద్ధుడై మీ సైన్యముపై శరవర్షమును, మేఘము ధారాపాత వర్షమువలె గురిసి బాధించెను. అప్పుడు సైన్యము చెదరిపారిపోయెను. భయదుఃఖములతో కంపించుచు పారిపోవుచున్న మీ సైనికులను చూచి భీష్మద్రోణులు దుర్యోధనుని హితము గోరుచు ఆ సైన్యమును నివారించిరి.

రాజా! అప్పుడు దుర్యోధనుడు పారిపోవుచున్న సైనికులను సమాధాన పరిచి అందరిని తిరిగి యుద్ధభూమికి మరలించెను. అప్పుడు యుద్ధరంగము చంద్రోదయమునందు సముద్రమువలె ఉప్పొంగెను అట్లు తిరిగి వచ్చిన సైనికులను జూచి దుర్యోధనుడు భీష్మునితో నిట్లనెను

పితామహా! నేను చెప్పునది వినుము. నీవు ద్రోణ-అశ్వత్థామ-కృపాదులైన మహావీరులున్ను జీవించియుండగా ఇట్లు సేన పారిపోవుట తగదు. మీ ముందు పాండవు లెంత? వారు మీరు సమానులెప్పటికిన్ని కాజాలరు. నీవు పాండవుల పై దయతో వ్యవహరించుచున్నట్లు కనబడుచున్నావు. అందుచేతనేవారు నా సేనను చంపుచుండగా నీవు చూచి క్షమించుచున్నావు. నీవు పాండవులతో ధృష్టద్యుమ్న సాత్యకులతోను యుద్ధముచేయనని తొలుతనే నాకు చెప్పవలసి నది అప్పుడే నేను మీ మాటలువిని కర్ణునితో సమాలోచనచేసి నా కర్తవ్యమును నిర్ణయించుకొని ఆచరించియుందును గదా! కనుక ఇప్పటికవేళ నన్ను విడువక నాకు సహాయము చేయదలచిన యెడల మీరిరువురున్ను పూర్తిగా పరాక్రమము చూపి యుద్ధము చేయవలెను.

రాజా! ఇట్లు దుర్యోధనుడు అధిక్షేపించుచు పలికిన మాటలు విని భీష్ముడు మాటిమాటికి నవ్వుచు కోపముతో కన్నులెగుర వేయుచు నీ కొడుకుతో నిట్లనెను.

దుర్యోధనా! నీతో నేను అనేక పర్యాయములు తథ్యముగా హితవచన ములు చెప్పితిని. పాండవులను యుద్ధమునందు ఇంద్రాదిదేవతలుగూడ జయింప జాలరు. వృద్ధుడనైన నేను నా సాధ్యమయినంతవరకు యథాశక్తి పోరాడెదను చూడుము. నేడు నేనుఒక్కడనే పాండవులను బంధుసైన్యములతోపాటు సమస్త లోకములు చూచుచుండగా నివారించెదను.

ధృతరాష్ట్రా మహారాజా! ఇట్లు భీష్ముడు చెప్పగనే నీ పుత్రులు మహా సంతోషముతో శంఖము లూదిరి. భేరీ మృదంగాది వాద్యములను ప్రయోగించిరి.

రాజా! ఆ ధ్వనిని విని పాండవులు గూడ శంఖములు ఊది, భేరీమృదం గాది వాద్యములను వాయించిరి.

(యాబదితొమ్మిదవ అధ్యాయము)

## భీష్ముని పరాక్రమము

జనమేజయా! ధృతరాష్ట్రుడు సంజయునితో మరల నిట్లనెను.

సంజయా! ఆ విధముగా దుఃఖించుచు దుర్యోధనుడడిగిన మాటకు కుపితు

డైన భీష్ముడు తరువాత యుద్ధమెట్లు చేసెను? పాండవపాంచాలురు భీష్మునితో నెట్లు పోరాడిరి?

ఆ మాటకు సంజయుడిట్లు బదులు చెప్పెను.

రాజా! ఆనాడు పగటిపూర్వభాగము గడచి సూర్యుడు అస్తాద్రి చేర పోవునపుడు విజయముతో పాండవులు హర్షించుచుండగా ధర్మజ్ఞుడైన భీష్ముడు గొప్ప సైన్యముతో నీ పుత్రులతోను గూడి పాండవులను ముట్టడించెను. అప్పుడు ఇరుసేనలకు ఘోరముగా దొమ్మి యుద్ధము జరిగెను. పర్వతములు చీలిపోవు చున్నట్లుగా మహాధ్వని కలిగెను "కొట్టుడు-పట్టుడు-చంపుడు" మొదలైన వీరో చిత వచనములు రెండువైపుల వారున్ను పలుకుచుండిరి. వారి శరీరమునుండి కవచములు, కిరీటములు, రథధ్వజములు క్రిందపడుచున్న ధ్వనులు పాషాణపతన ధ్వనులవలెనుండెను. వేలకొలది తలలు-బాహువులు క్రిందపడి కదలాడుచుండెను కొన్ని మొండెములు ధనుర్బాణములతో నట్లే నిలిచియుండెను మహావేగముగా రక్తనది ప్రవహించుచుండెను.

ఏనుగుల యంగములతో పాషాణములతో రక్తమాంసముల బురదతో యుద్ధభూమి వ్యాపించియుండెను. ఆ రక్తనది పరలోక సముద్రమునకు అభి ముఖముగా నున్నట్లుండి నక్కలకు, గ్రద్దలకు ఆనందదాయకముగా నుండెను. రాజా! ఇట్టి యుద్ధము కనివిని యెరుగము.

రాజా! రథాశ్వ గజపదాతిదళముల యవయవములు చిందరవందరగా యుద్ధరంగమంతయు పడి రథమార్గమునకు అడ్డుగానుండెను. గిరిశృంగముల వంటి గజశవములచేత విచిత్రములైన కవచ కిరీటములచేతను వ్యాప్తమైన రణ రంగము శరత్కాలమునందలి ఆకాశమువలె శోభిల్లుచుండెను. అనేకులు శర తాడనములచేత పీడితులై "తండ్రీ! అన్నా! కొడుకా! మామా! అని అరచుచు నేల వ్రాలుచుండిరి. మరికొందరు భయమువలదు ఇదిగో మేమున్నాము. అని దెబ్బలు తిన్నవారికి అభయమిచ్చుచుండిరి.

రాజా! అటువంటి యుద్ధ భూమిలో భీష్ముడు ధనుర్బాణధరుడై అన్ని దిక్కులకొరవివలె భయంకరముగా తిరుగుచు కనబడెను. ఆయన ఒక్కడైనను లాఘవమునుబట్టి అనేక శతసహస్ర సంఖ్య భీష్ములుగా తోచెను. మాయచేత

ఇన్ని రూపములు ధరించెనా యనుచూ పరులాశ్చర్యము చెందిరి. తూర్పుదిక్కున కనబడినట్లేయుండి వెంటనే నలువైపుల ఆయన అత్యద్భుతముగా కనపడు చుండెను. పాండవేయులలో నొక్కడుగూడ ఆయనను తేరిపార జూడజాలకుండెను ఆయన బాణములనే చూచుచుండిరి అనేకులు ఆయన దెబ్బకు అరచుచు చచ్చు చుండిరి మానవాతీత శక్తితో శత్రువులను నుసుమాడుచున్న భీష్మాగ్నిలో సైనికులు శలభములవలె పడి మ్రగ్గుచుండిరి.

రాజా! భీష్ముని బాణమొక్కటిగూడ వ్యర్థమగుటలేదు గజాశ్వ పదాతి దళ కాయములందు ఆయన శరములు కప్పి వానిని ఛేదించెను గజకంటకములు (ఇనుప అంబారీలు) గల గజములను పర్వతములను వజ్రాయుధమువలె అతని బాణములు చీల్చుచుండెను. ఇద్దరు ముగ్గురు గజారోహులను ఒక్కటిగా ఒక్క బాణముతోకొట్టుచుండెను: ఆయన నెదుర్కొనిన వారందరు ముహూర్తకాలములో పడిపోవుచుండిరి.

రాజా! యీ విధముగా భీష్మునిచేత చంపబడుచున్న ధర్మరాజు సేన పలు విధములుగా చెదిరి నశించుచుండెను. కృష్ణార్జునాదులు చూచుచుండగనే యిట్లు పాండవసేనను భీష్ముడు ధ్వంసము చేయుచుండగా నతనిని ఎవ్వరున్ను వారింప జాలకుండిరి.పాండవసేన హాహాకారము చేయదొడగెను తండ్రికొడుకులు. మిత్రులు సోదరులు పరస్పరము వివేచనారహితముగా దొమ్మి యుద్ధములో వధించుకొను చుండిరి. పాండవ సైనికులు కవచములు వీడి అరచుచు జుట్టు విరియబోసికొని పారిపోవుచుండిరి. ఆ సైన్యమంతయు చెదరిన గోవులమందలవలె భ్రాంతిజెంది ఉరుకుచుండెను.

## భీష్మవధకు కృష్ణుడు పూనుట

రాజా! యీ విధముగా ఖండింపబడుచున్న సైన్యమును చూచి శ్రీకృష్ణుడు రథమును ఆపి అర్జునునితో నిట్లనెను.

పార్థా! నీవు కోరిన కాలమిప్పుడు సంప్రాప్తమైనది. ఇక నిప్పుడు భీష్ముని కొట్టుము. లేకున్నచో మోహము చెందెదవు సుమా! పూర్వము రాజవీరుల సమూహములో భీష్మ ద్రోణాది ధార్తరాష్ట్రవీర సైనికుల నందరను యుద్ధములో చంపెదను. అని ప్రతిజ్ఞచేసియుంటివి ఆ మాటనిప్పుడు సత్యము చేయుము.

చూడుము. నీ సైన్యమెట్లు వధింపబడుచున్నదో రాజవీరులు పారిపోవుచున్నారు చూడుము. నోరు తెరచుకొని పైనబడుచున్న యమునివలెనున్న భీష్ముని జూచి భయార్తులై సింహమును చూచిన క్షుద్రమృగములవలె అందరున్ను చెదరి పారి పోవుచున్నారు.

రాజా! ఈ మాట విని అర్జునుడు కృష్ణునితో కృష్ణా! ఈ సైన్య సముద్రములో దూరి భీష్మునివైపు రథము తోలుము. నేడు దుర్ధర్షుడైన (చెనకుటకువీలు లేని) కురుపితామహుని పడగొట్టెదను.

రాజా! ఆ మాట వినగానే శ్రీకృష్ణుడు వెండి పక్కెరలు (జీనులు) గల గుఱ్ఱములను మధ్యందిన సూర్యునివలె చూచుటకు అరివిగాకున్న భీష్ముని వైపు త్రోలెను. వెంటనే పారిపోయిన యుధిష్ఠిర సైన్యములన్నియు తిరిగి యుద్ధరంగమునకు వచ్చెను.

రాజా! తరువాత భీష్ముడు సింహమువలె గర్జించి అర్జున రథముపై శరవర్షము గురిసెను. ఆ రథము క్షణకాలము కనవడకుండ బాణములతో కప్పబడియుండెను. అప్పుడు వాసుదేవుడు ఏమాత్రము సంభ్రమము చెందక, ధైర్యముతో భీష్మబాణాచ్ఛాదితములైన గుఱ్ఱములను బలముగా త్రోలెను. అప్పుడు అర్జునుడు మేఘగంభీర ధ్వనిగల ధనుస్సు తీసికొని మూడు బాణములతో భీష్ముని ధనుస్సు ఛేదించెను అంతట భీష్ముడు మఱియొక ధనుస్సు తీసికొని నిమిషములో అల్లెత్రాడు ఎక్కించెను. ఆ ధనుస్సును గూడ అర్జునుడు ఛేదించెను. అప్పుడు భీష్ముడు అర్జునుని హస్తలాఘవమును ప్రశంసించుచు నిట్లనెను.

పార్థా! బాగు బాగు పాండునందనా! ఇట్టి మహాకార్యము నీ వొక్కరవే చేయగలవు. ఇది నీకే తగినది. నీ యెడల నేను చాల సంప్రీతుడ నైతిని పుత్రా! నాతో యుద్ధము చేయుము.

రాజా! ఈ విధముగా భీష్ముడు అర్జునుని ప్రశంసించి మఱియొక ధనుస్సు తీసికొని పార్థుని రథముపై బాణవర్షము కురిసెను. అప్పుడు వాసుదేవుడు అశ్వములను తోలుటలో చాతుర్యము బలము ప్రదర్శించి వానిని మండలాకారముగా త్రిప్పుచు భీష్ముడు ప్రయోగించిన బాణములను వ్యర్థము చేసి అవి తమ రథమునకు తాకకుండ చేసెను. అట్లుచేసినను భీష్ముడు కృష్ణార్జునులను బిగ్గరగా కొట్టెను.

కొమ్ములతో గీరబడిన వృషభములవలె కృష్ణార్జునులు భీష్మ బాణఘాతముచేత రక్తసిక్తాంగులై శోభిల్లుచుండిరి.

రాజా! భీష్ముడు రోషముతో కృష్ణుని నిశితశరములతో కొట్టి నొప్పిపరచగా శ్రీకృష్ణుడు భీష్ముని మహాపరాక్రమమును అర్జునుడు మెత్తబడియుండుటను భీష్ముడు ఎడతెగక బాణవర్షము కురియుచుండుటను సూర్యునివలె భీష్ముడు మండుచుండుటను చూచి సహించజాలక "ఈ విధముగా భీష్ముని విడినచో ఒక దినములోనేయుధిష్ఠిర సైన్యమంతయు నితడు హతమార్చగలడు" అని తలంచి సేనల మధ్యలో దూరెను.

రాజా! పాండవుల మహాసైన్యము తిరుగుచుండెను. కౌరవ సైనికులు సోమకాదులను తరుముచుండిరి అదిచూచి భీష్మాదులు హర్షించుచుండిరి. దానిని కృష్ణుడు సహించక ఇక నేను నేడు పాండవుల హితముకొరకు భీష్ముని వధించి పాండవుల భారము దింపెదను అతితీక్ష్ణ శరములచేత కొట్టబడుచున్నప్పటికిన్ని అర్జునుడు భీష్మునియందలి గౌరవముచేత తన కర్తవ్యమును తెలియకున్నాడు. అని చింతించుచుండనే భీష్మ పితామహుడు మరల పార్థునిపై బాణప్రయోగము చేసెను.

రాజా! భీష్మ ప్రయుక్త బాణములు అసంఖ్యాకములగుటచేత అవి అన్ని దిక్కులు కప్పివైచెను ధూమ్యాకాశములు దిక్కులు సూర్యుడు కనబడకపోయెను ధూమసహితమైన సుడిగాలులు దిక్కులను క్షోభిల్ల చేయుచువీచెను. భీష్ముని యాజ్ఞచేత ద్రోణ-వికర్ణ-సైంధవాది వీరులందరు ఒక్కపెట్టున అర్జునుని పొదివిరి.

రాజా! అట్లు అనేక సేనలచేత పొదువబడిన అర్జునుని చూచి అతనికి బాసటగా సాత్యకి అనేక గజ సైన్యములతో వచ్చెను. అతడు అర్జునునకు విష్ణువు ఇంద్రునకు వలె సహాయము చేయవచ్చెను. భీష్మునకు భయపడి చెదరిపారిపోవు చున్న యుధిష్ఠిర సైన్యమునుచూచి సాత్యకి క్షత్రియవీరులారా! మీరు పారిపోవుట ధర్మముగాదు మీ ప్రతిజ్ఞను మరువకుడు, అది సత్పురుష లక్షణము గాదు. మీ మీ ధర్మమును పాలింపుడు అని యనెను.

శ్రీకృష్ణుడు గూడ పరిగెత్తుచున్న రాజవీరులను అర్జునుడు మెత్తబడి

యుండుటను, భీష్ముని జృంభణమును చూచి సహించక సాత్యకిని ప్రశంసించుచు ధార్తరాష్ట్ర సైనికులు తమపై బడుచుండుట చూచి సాత్యకితో "శైనేయా! పారిపోయినవారు పోవుదురుగాక ఇక్కడ నిలిచియున్న వారుగూడ పోవుదురు గాక ఇదిగో ఇప్పుడే నేను భీష్ముని, ద్రోణుని వారిరథములనుండి పడగొట్టెదను చూడుము సాత్యకీ! కౌరవవీరులలో నెవడుగూడ ఇప్పుడు నన్ను తప్పించుకొని పోవజాలడు అని చెప్పి మరల నిట్లనెను.

సాత్యకి ఇదుగో యిప్పుడే నేను చక్రము ధరించి భీష్మద్రోణులను వధించి పాండవులకు సంతోషము గూర్చెదను. ధృతరాష్ట్ర పుత్రులను తత్పక్షములను అందరిని సంహరించి అజాతశత్రువైన యుధిష్ఠిరునకు రాజ్యపట్టాభిషేకము చేసెదను.

ధృతరాష్ట్ర మహారాజా! ఈ విధముగా శ్రీకృష్ణుడు చెప్పి, తన చక్రమును స్మరించిన మాత్రముననే శ్రీకృష్ణుని చేతిపై సుదర్శన చక్రము వచ్చి నిలిచెను. తరువాత శ్రీకృష్ణభగవానుడు సూర్యునివలె వెలుగొందుచు, పిడుగువలె నుండి చురకత్తుల అంచులు గల చక్రమును పైకెత్తి రథమునుండి యెగిరిదుమికి తన పాదఘాతములతో భూమిని కంపింపజేయుచు భీష్మునిపైకి ఉరికెను.

రాజా! మదించిన యేనుగు పైకి సింహమువలె భీష్మునిపైకి కృష్ణుడు ఉరుకుచుండగా మిక్కిలి శోభాయమానుడుగా నీలమేఘమువంటి ఆయన శరీరమునుండి ఆ వస్త్రముతటిత్తువలె ప్రకాశించుచుండెను. ఆయన భుజమనెడు నాళముపైన పద్మమువంటి చక్రము విరాజిల్లుచుండగా బాల సూర్యునివలె ప్రకాశించుచున్న ఆదిపద్మము శ్రీమన్నారాయణుని నాభినుండి పైకి లేచుచున్న నట్లుండెను. ఆ చక్రము శ్రీకృష్ణుని కోపమనెడు ఉదయసూర్యునిచేత వికసించిన ఆ చక్రపు అంచులచురకత్తులనెడు రేకులతో విరాజిల్లుచు శ్రీమన్నారాయణమూర్తి బాహునాళమునుండి శ్రీకృష్ణుని దేహమనెడు పెద్ద సరస్సునుండి పుట్టిన ఆది పద్మమాయనునట్లు ప్రకాశించెను.

రాజా! యిట్లు సుదర్శన చక్రము ధరించి శ్రీకృష్ణుడు బిగ్గరగా సింహనాదముచేయుచు కోపముతో భీష్ముని పైకి వచ్చుచుండగా చూచి సమస్త భూతములు ఇంతటితో కౌరవులనాశనమైందని పెద్దగా అరచిరి. వాసుదేవుడు చక్రము ధరించి సమస్తలోకములకు ప్రళయము గలిగించువానివలె సమస్త

లోకములకు ప్రళయము గలిగించువానివలె, సమస్తభూతములను దహించుచున్న ధూమకేతువు (తోకచుక్క) వలె భీష్మునిముందుకు దూసుకొనివచ్చెను.

ఆ విధముగా వచ్చుచున్న శ్రీకృష్ణుని చూచి భీష్ముడు ఏ మాత్రము తొందరపాటు లేనివాడై, తనచేతి ధనుస్సును ఉపసంహరించుకొని అనంత పౌరుషముగల గోవిందునితో విజ్ఞానతేజస్సుతో నిట్లనెను.

దేవేశా! జగన్నివాసా! చక్రపాణీ! మాధవా! రమ్మురమ్ము! నీకు నమస్కారము. సర్వశరణ్యా! లోకనాథా! యుద్ధమునందు నా రథమునుండి బలాత్కారముగా నన్నులాగి క్రింద పడవేయుము. నేడు నీచేత చంపబడిననాకు ఇహపరలోకములలో శ్రేయస్సు కలుగును. కృష్ణనాథా! నాపైకి నీవు వచ్చుట చేత మూడు లోకములందుగూడ నాకు గౌరవమే కలుగును.

## అర్జునుని ప్రతిజ్ఞ

మహారాజా! అప్పుడు అర్జునుడు తన రథమునుండి త్వరగా ఎగిరి దుమికి శ్రీకృష్ణుని వెంట పరుగెత్తి తన బాహువులచేత ఆయన బలిసిన బాహువును పట్టుకొని ఆపెను అప్పుడు మహాయోగ బలముగల ఆది దేవుడైన శ్రీకృష్ణుడు తనను పట్టుకొనిన అర్జునుని మహావాయువు ఒంటి వృక్షమునువలె ఈడ్చుకొనుచు ముందుకుసాగి భీష్మునిపైకి పోవుచుండెను.

రాజా! అట్లు భీష్మునకు అభిముఖముగా పరుగెత్తుచున్న శ్రీకృష్ణుని అర్జునుడు గట్టిగా తన పాదములను భూమిపైనపూని బలమంతయు ఉపయోగించి శ్రీకృష్ణుని పట్టుకొని అతనివెంట ఈడ్వబడుచు చివరికి పదడుగుల తరువాత అతనిని ఆపగలిగెను. ఇట్లు ఆగిన శ్రీకృష్ణునకు అర్జునుడు ప్రీతితో నమస్కరించి యిట్లనెను.

భగవాన్! కోపమును ఉపసంహరించుకొనుము నీవే కదా పాండవులకు గతి. నేను చేసిన ప్రతిజ్ఞ విడువను. నా పుత్రులపైన సోదరులపైన ఒట్టు పెట్టుకొని చెప్పుచున్నాను నీ సహాయముతో కురువీరులను అంతమొందించెదను.

ధృతరాష్ట్రి మహారాజా! ఈ విధముగా అర్జునుడు ప్రతిజ్ఞచేసిన తరువాత శ్రీకృష్ణుడు ప్రీతిచెంది అతని మాటవిని అతనియెడల ప్రీతిగలవాడై చక్రముతో మరల తన రథమెక్కి సారథ్యమునకు పూనుకొనెను.

## అర్జునుడు కౌరవసేనను ఓడించుట

రాజా! తరువాత కృష్ణుడు మరల పగ్గములు తీసికొని పాంచజన్య శంఖమును ఊదెను. ఆ ధ్వనితో దిక్కులు ప్రతి ధ్వనించెను. వివిధాభరణభూషితుడై పాంచజన్యమును పూరించిన శ్రీకృష్ణుని చూచి కౌరవ సైనికులు భయముతో ఆక్రోశించిరి. వివిధ వాద్యధ్వనులు రథనేమి (చక్రముల అకులు) ధ్వనులు, సింహనాదములు కురుసేనయంతటను ఉగ్రముగా మ్రోగెను.

రాజా! తరువాత మేఘగంభీరముగా గాండీవము ధ్వనించెను. అది భూమ్యాకాశములు నలుదిక్కులునిండెను. అతని ధనుర్ముక్తములైన బాణములు అన్ని వైపుల వ్యాపించెను.

రాజా! అప్పుడు కౌరవాధిపుడైన దుర్యోధనుడు భీష్మ భూరిశ్రవులతో ధూమకేతువు గడ్డివామిని కాల్చుచున్నట్లు పార్థునిముట్టడించెను అప్పుడు అర్జునుని పైన భూరిశ్రవుడు ఏడుబాణములను దుర్యోధనుడు తోమరాయుధమును శల్యుడు గదను, భీష్ముడు శక్తిని ప్రయోగించిరి.

రాజా! అర్జునుడు ఆయా యుధములన్నింటిని ఛేదించి గాండీవమునుండి మహేంద్రాస్త్రమును ప్రయోగించెను. దానినుండి వెడలిన బాణములచేత పార్థుడు వారినందరిని వారించెను. అప్పుడు అర్జునధనుర్విముక్తములైన బాణములచేత రథ-ధ్వజాగ్రములు తెగిపడెను. సేనల దేహములలో ఆ బాణములు చొచ్చుకొని పోయెను. అవి అన్ని దిక్కులకు వ్యాపించెను. సైనికుల హృదయములు గాండీవశబ్దము చేత ఛేదిల్లెను. దానితో చతురంగబలములలో ధ్వనులు రేగెను. ఆ ధ్వని విని ద్రుపద-విరాటాది ముఖ్యవీరులు అక్కడికి మరలివచ్చిరి.

రాజా! అప్పుడు మీ సైనికులు అణగిపోయి అర్జునుని ఎదుర్కొనజాలకుండిరి. అనేక రథాశ్వగజాదులు తొత్తునియలై అర్జునునిచేత ఛేదింపబడెను. అట్లు ఇంద్రాస్త్రముక్త శరపరంపరచేత అర్జునుడు శత్రుసేనను చిందరవందర చేసి వీరుల శరీరములనుండి రక్తనదులను ప్రవహింపజేసెను.

రాజా! ఆ రక్తనదులందు మానవుల మేదస్సే (క్రొవ్వు) నురుగుగా గజాశ్వ శరీరములే తీరములుగా రాజుల శరీరపు మజ్జ (ఎముకలందలి చిక్కని నీరు) బురదగా రాక్షస గణము భూతములుగా శిరస్సులు-పురియలు-కేశములు నాచుగా, వచ్చికలుగాను అనేక కవచములే అలలుగా ఎముకల ముక్కలే గులకరాలుగా శునకాద్యనేక క్షుద్రజంతువులుగా అక్కడ నిలిచియున్న

మనుష్యులు అర్జునబాణములచేత మహా వైతరిణీ నదియే అచట సంతతరక్త ప్రవాహములో ప్రవర్తిల్లెను.

రాజా! యీ విధముగా అర్జునుడు కురుసేనను హతమార్చెను. అదిచూచి చేది పాంచాలాది వీరులందరు హర్షముతో నినాదము చేసిరి జయజయనాదములు చేసిరి. దానితో కౌరవయోధులు భయపడిరి. కృష్ణార్జునులు సంతోషముతో సింహనాదము చేసిరి.

రాజా! అప్పుడు సూర్యుడు అస్తమించుచుండగా అందరు యుద్ధము ఆ మూడవ నాటికి ముగింపజూచిరి అర్జునుని మహేంద్రాస్త్రముక్త బాణములచేత గాయబడినవారై మీ సైనికులు భీష్మ ద్రోణాదులతో పాటు యుద్ధము ముగించిరి.

రాజా! శత్రు జయముచేత మహాకీర్తిని వరించిన అర్జునుడు గూడ తమ వారితో యుద్ధభూమినుండి తిరిగిపోయెను. మీవారందరు ఆనాటి అర్జునుని పరాక్రమమును వేనోళ్ళ కొనియాడుచు గుంపులు గుంపులుగా తమతమ శిబిరములకు పోయిరి. అంతటితో భీష్ముని మూడవనాటి యుద్ధము ముగిసెను.

(అరువదవ అధ్యాయము)

## నాలుగవనాటి యుద్ధము-వ్యూహముల రచన

జనమేజయా! సంజయుడు ధృతరాష్ట్రునకు నాలుగవనాటియుద్ధ వృత్తాంత మిట్లు చెప్ప దొడగెను.

రాజా! మూడవనాటి రాత్రి గడచిన తరువాత ప్రభాతకాలమునందు భీష్ముడు సేనాముఖమునందు నిలచి శత్రువులయెడల మిక్కిలి కోపముగలవాడై సమగ్ర బలపరాక్రమములతో నుండెను. ఆయనను ద్రోణదుర్యోధనాదులు అనుసరించిరి. ఆ వీరులందరితో గూడియున్న భీష్ముడు దేవతలచేత పరివృతుడైన ఇంద్రునివలె ప్రకాశించుచుండెను. గజముల స్కంధములపై వివిధ వర్ణముల ధ్వజములు ఎగురుచుండెను. ఆ సైన్యము అప్పుడు వర్షాకాలమునందుతటిత్తులతో గూడిన మేఘములతో విరాజిల్లుచున్న ఆకాశమువలె శోభిల్లుచుండెను. ఈ విధముగా భీష్మరక్షితమైన సేన యుద్ధోన్ముఖమై పోవుచుండగా అది అతిభయంకరముగా ప్రవహించుచున్న మహానదివలె నుండెను.

రాజా! అట్లు గజవ్యూహమునందు కట్టబడినందుచేత వివిధముగా ఆ సేన కనబడుచు దాని శక్తి దాగియుండెను. ఆ వ్యూహమునకు చతురంగ బలములు రెక్కలుగా నుండెను. అట్లు పక్షములు గల మహామేఘమువలె నున్న ఆ వ్యూహము దూరమునుండియే అర్జునుడు చూచెను. అతడు తన రథములో సేనలోను సర్వశత్రు సంహారము చేయుతలంపుతో ముందుకు సాగివచ్చెను. అతనిని చూచి మీవారందరు విషాదము చెందిరి. సర్వలోక మహారథికుడైన అర్జునునిచేత రక్షింపబడుచున్న ఆ సేన వ్యూహమును మీవారు భయములో చూచిరి. ఆ వ్యూహమునకు నాలుగు నాలుగువేల గజములు ప్రతిదిక్కునందు ఉండెను. ఆనాటి పూర్వాహ్ణమునందు ధర్మరాజు పన్నిన వ్యూహముతో సమానమైన వ్యూహము మానవలోకములో పూర్వము కనివిని యెరుగనిదిగా నుండెను.

రాజా! తరువాత పాంచాలాది వీరులు వారివారి నియత స్థలములలో వచ్చి నిలిచిరి. శంఖ-భేరీ మృదంగాది ధ్వనులు మారుమ్రోగెను. అట్లు అంతరిక్షమున వ్యాపించిన ధ్వని విని, రేగిన ధూళిచూచి వీరులందరు యుద్ధసన్నద్ధులై వచ్చి అర్జునునిచేరిరి. రథికుడు ధ్వజసారథి సహితమైన శత్రురథమును గజారోహకుడు గజమును అశ్వికు డశ్వమును పదాతి పదాతిని కూల్చుచుండిరి. ఖడ్గ ప్రాసాద్యాయుధధారులు ఘోరముగా పరస్పర యుద్ధము నలుపుచుండిరి ఒండొరులు కొట్టుకొని నేలగూలుచుండిరి. గజములు రథములను, రథములు గజములను అశ్వములు పదాతులను, పదాతి దళములశ్వములను వివేచపలేకుండ కూల్చుచుండెను. అందరు ఆర్తితో హాహాకారములు చేయుచుండిరి.

రాజా! ఈ విధముగా జరిగిన దొమ్మి యుద్ధములో అర్జునుడు బహుసంఖ్యాకమైన సైన్యమును వధించుచు ముందుకుసాగి వచ్చుచుండగా నతనిని భీష్ము డెదిరించెను.

## భీష్మార్జునుల ద్వైరథ యుద్ధము

రాజా! ఐదుతాటిచెట్ల పొడవుగల తాళ ధ్వజము గలిగి మహావేగముగల అశ్వములు పూనిన రథముపై భీష్ముడు వచ్చి దీప్తిమంతములైన ధనుర్బాణములతో విరాజిల్లుచున్న అర్జునుని తాకెను. ఆయనకు సహాయకులుగా ద్రోణ-కృప శల్యవివింశతి దుర్యోధనాదులు గూడ వచ్చిరి. అప్పుడు బంగారు కవచము ధరించి మహాశూరులైన అభిమన్యుడు వచ్చి ద్రోణాద్యులను తాకెను. ఆ మహారథి

కుల మహాస్త్రములన్నిటిని అభిమన్యుడు ఖండించి యజ్ఞవేదికపై ప్రజ్వరిల్లుచున్న అగ్నివలె వెలుగొందుచుండెను.

రాజా! అట్లు మధ్యనవచ్చిన అభిమన్యుడు రక్తనదులను ప్రవహింపజేయుచుండగా చూచి భీష్మ దళనిని దాటిపోయి అర్జునుని తాకెను. భీష్మ ప్రయుక్త బాణములను అర్జునుడు శిలలవంటి పదునైన విపాఠబాణములచేత నవ్వుచు త్రుంచెను. సర్వధనుర్ధరోత్తముడైన భీష్ముని అర్జునుడు శర-భల్లాద్యాయుధవర్షములచేతముంచెను. అట్లే భీష్మనిర్ముక్తములైన మహాస్త్రములు అర్జునుని సూర్యుని అంధకారమువలె కప్పెను. ఇట్లు భీష్మార్జునులకు జరిగిన ద్వైరథ యుద్ధమును కౌరవ-యాదవ-సృంజయాదులు విచిత్రముగా జూచుచుండిరి.

(అరవై ఒక్కటవ అధ్యాయము)

## అభిమన్యు పరాక్రమము

జనమేజయా! సంజయుడు ధృతరాష్ట్రునకు తరువాతి యుద్ధ వృత్తాంతమిట్లు చెప్ప దొడగెను.

ధృతరాష్ట్ర మహారాజా! అశ్వత్థామ-శల్య-భూరిశ్రవస్-చిత్రసేనాదులు ఐదుగురు అభిమన్యుని ఐదుగజములు సింహకిశోరమును చుట్టుముట్టినట్లు ముట్టడించిరి. వారిలో ఒక్కడుగూడ గురిలో, శౌర్యములో అస్త్ర లాఘవములోను అతనికి సమానుడు కాకుండెను.

రాజా! ఆ విధముగా పరాక్రమము ప్రదర్శించుచున్న శత్రుదమనుడైన పుత్రుని జూచి అర్జునుడు సింహనాదము చేసెను. అట్లు మీ సైన్యమును పీడించుచున్న నీ మనుమని మీవారందరు చుట్టుముట్టిరి. వారందరిని అభిమన్యుడు బల పరాక్రమములచేత తాకెను. సూర్య సమాన ప్రభతో అతి లాఘవముగా బాణములు ప్రయోగించుచున్న అతని ధనుస్సు వెలుగొందుచుండెను. అతడు అశ్వత్థామ నొక బాణముతో శల్యుని ఐదింటితో కొట్టి వారి ధ్వజములు విరిచెను. సోమదత్త పుత్రుడు ప్రయోగించిన బంగారు శక్తిని ఒక్కబాణముతో హరించెను. శల్యుడు విడిచిన బాణములను ఛేదించి అతని ధనుస్సు ఖండించి గుఱ్ఱములను చంపెను.

రాజా! భూరిశ్రవుడు-శల్యుడు-సాంయమని పుత్రుడైన శలుడు అభిమన్యుని

దాడికి తాళజాలకపోయిరి. త్రిగర్తులు-మద్రులు-కేకయులు మొదలైన యిరువది యైదువేల సైనికులను దుర్యోధనుడు పురికొల్పి అర్జునాభిమన్యులను వధించుటకు పంపెను. వారందరు ధనుర్వేద విద్వాంసులు-అజేయులు.

రాజా! అట్లు మీ సైనికులచేత చుట్టబడిన తండ్రి కొడుకులను చూచి సేనా పతియైన ధృష్టద్యుమ్నుడు అనేక సహస్ర గజాశ్వ సైన్యములతో వచ్చి శత్రు సైన్యములను మరలించెను. మద్ర కేకయ సైన్యములు అర్జునునకు ఎదురుగా వచ్చుచుండగా ధృష్టద్యుమ్నుడు శల్యుని భుజముల సంధి యెముకలను మూడు బాణములతో గొట్టెను. పదుగురు మద్రకులను పది బాణములతో గొట్టి కృత వర్మాది పృష్ఠ రక్షకులను చెదరగొట్టెను.

(అరవై రెండవ అధ్యాయము)

## ధృష్టద్యుమ్నుడు శలుని వధించుట

రాజా! అప్పుడు సాంయమని పుత్రుడైన శలుడు ముప్పది బాణములతో ధృష్టద్యుమ్నుని, అతని సారథిని పదిబాణములతోను కొట్టెను. అట్లు కొట్టబడిన ధృష్టద్యుమ్నుడు అతికోపముతో పెదవుల మూలములను నాకుచు భల్లముచేత శలుని ధనుస్సు ఛేదించి యతనిని ఇరువదియైదు బాణములతో కొట్టి రథాశ్వము లను సారథిని గాయపరచెను.

రాజా! అప్పుడు శలుడు ధృష్టద్యుమ్నునితో ఖడ్గ యుద్ధమునకు పూను కొనెను. అట్లు పాదచారియై ఆకాశమునుండి పడుచున్న సర్పమువలె, ప్రళయ కాల యమునివలె, సూర్యునివలె ప్రకాశించుచు మదపుటేనుగువలె వచ్చుచున్న శలుని పాండవులు ధృష్టద్యుమ్నుడున్ను చూచిరి అప్పుడు ధృష్టద్యుమ్నుడు తన కెదురుగా ఖడ్గధారియై సమీపించుచున్న శలునిశిరస్సు గదచేత పగులగొట్టెను. అంతటితో శలుని చేతినుండి డాలు క్రిందపడి అతడు మరణించెను. ధృష్టద్యు మ్నుడు సంతోషించెను.

రాజా! శలుడు చావగా మీ సైన్యములో హాహాకారము రేగెను అప్పుడు శలుని తండ్రియైన సాంయమని పుత్రమరణముచేత అతిక్రుద్ధుడై మూడు బాణము లతో అంకుశములతో ధృష్టద్యుమ్నుని ఏనుగువలె కొట్టెను. శల్యుడుగూడ ధృష్ట ద్యుమ్నుని వక్షస్థలముపైన బాణప్రయోగము చేసెను. అప్పుడు మహాఘోరముగా వారికి యుద్ధము జరిగెను.

జనమేజయా! ధృతరాష్ట్రుడు సంజయునితో నిట్లనెను.

సంజయా! పౌరుషముకంటె దైవమే శ్రేష్ఠమని తలచెదను. నా పుత్రుని మహాసైన్యమును పాండవసేన బాధించుట వినగా, పౌరుషము పనికిరాదని నిరూపించబడుచున్నది. ఎల్లప్పుడు నీవు మావారు చచ్చుచున్నట్లు పాండవులు ఏ బాధలులేక సంతోషములోనున్నట్లును చెప్పుచుంటివి. మావారు పౌరుషహీనులనీ వారు పడిపోయినారని పడుచున్నారనియు చెప్పుచున్నావు. వారు యథాశక్తి విజయముకొరకు పోరాడుచున్నారుగదా! ఇట్లున్నను పాండవుల విజయము మావారి పరాజయము వినుచున్నాముకాబట్టి దుర్యోధనుడు కారణముగా నేను దుస్సహములైన అనేకదుఃఖవార్తలను వినవలసియున్నదనుకొనెదను. పాండవులు ఓడిపోవుట మావారు గెలుచుటకు తగిన ఉపాయమేదియు నాకు తోచుటలేదు చెప్పుము.

## ఇరుపక్షముల యుద్ధము

ఆ మాటకు సంజయుడిట్లు ధృతరాష్ట్రునితో ననెను.

రాజా! నీ అవినీతివలననే యేర్పడిన చతురంగ సైన్య నాశనమును గూర్చి చెప్పెద వినుము. శల్యుని తొమ్మిది బాణములచేత పీడితుడైన ధృష్టద్యుమ్నుడు శల్యునిపై బాణప్రయోగముచేసి బాధించెను. అప్పుడు ధృష్టద్యుమ్నుడు మహాద్భుత పరాక్రమము ప్రదర్శించుచు శల్యుని అడ్డగించి పోరాడుచుండగా ఆ యిరువురిలో భేదమే తెలియకుండెను. శల్యుడు ధృష్టద్యుమ్నుని ధనుస్సుఛేదించి యతనిపై బాణవర్షము వర్షాకాలమేఘము పర్వతముపై వానగురిసినట్లు కురిసెను.

రాజా! అప్పుడు ధృష్టద్యుమ్నుడు పీడింపబడుట చూచి అభిమన్యుడు క్రుద్ధుడై శల్యునిపైకి ఉరికి ఆర్తాయనియైన శల్యుని నిశిత శరములచేత కొట్టెను. రాజా! అప్పుడు మీవారు అభిమన్యుని ముట్టడింపదలచి శల్యునిచుట్టు చేరిరి. దుర్యోధన వికర్ణాదులు శల్యుని రథమును రక్షింపదలచి నిలిచిరి. అప్పుడు భీమసేనుడు-మాద్రీపుత్రులు-ధృష్టద్యుమ్నాభిమన్యులు ద్రౌపదేయులు పదుగురు పదిమంది ధార్తరాష్ట్రుల రథములను పొడిచిరి. ఇరుపక్షములవారు నానా రూపశస్త్రాస్త్రములను ప్రయోగించుచు పరస్పర వధకాంక్షతో ఆ యుద్ధములో నిలిచిరి. నీ దుర్మంత్రమువలననే కదా యంత ఘోరయుద్ధమును ప్రాప్తమాయెను.

రాజా! అట్లు ఆ పదుగురు పదుగురు రథికులకు పరస్పరయుద్ధము సాగు

చుండగా మీ వీరులు పాండవవీరులు ప్రేక్షకులై చూచుచుండిరి. ఆ యిరువైపుల నున్న దళ-దళ రథికులు అన్యోన్యము కొట్టుకొనుచు పరస్పర స్పర్ధలో మహాస్త్రములను ప్రయోగించుచుండిరి. దుర్యోధన-దుర్మర్షణ-చిత్రసేనాదులైన నీ పుత్రులు చాలమంది పదులు ఇరువదులు బాణములతో ధృష్టద్యుమ్నుని కొట్టిరి. అతడు ఆ బాణములన్నింటిని ఛేదించివారందరిని తిరిగి ఒక్కొక్కరిపై ఇరువది యైదు బాణముల చొప్పున ప్రయోగించి వేధించెను.

రాజా! అభిమన్యుడు సత్యవ్రత-పురుమిత్రులను పదిపది బాణములతో కొట్టెను. నకుల-సహదేవులు మేనమామ శల్యుని తీక్ష్ణ బాణములతో కొట్టిరి. అది అత్యద్భుతముగా నుండెను. అప్పుడు శల్యుడుగూడ మేనల్లుండ్రను అనేక బాణములతో కొట్టి బాధించెను. కాని వారు చలించకుండిరి.

రాజా! అంతట మహాబలశాలియైన భీమసేనుడు దుర్యోధనుని చంపి అంతటితో యుద్ధాంతము చేయుటకు గదగొని అతనిపై బడెను. శిఖరమువంటి గదతో కైలాసమువలె పై బడుచున్న భీమసేనుని చూచి నీ పుత్రులు భయపడి పారిపోయిరి.

## భీమసేనుడు గజ సైన్యమును సంహరించుట

రాజా! అప్పుడు దుర్యోధనుడు మహాక్రోధముతో పదివేల యేనుగుల సైన్యముతో మాగధుని భీమునిపైకి పురికొల్పి వానిని ముందిడుకొని భీమసేనునిపై దాడిచేసెను.

రాజా! అట్లు తనపై బడుచున్న గజసైన్యమును భీముడుచూచి పర్వతము వలె దృఢమైన మహాగదతో రథమునుండి దుమికి సింహమువలె నినాదముచేసి నోరుతెరచుకొనిన యమునివలె ఆ గజ సేనపై దాడిచేసెను. వజ్రాయుధముతో నింద్రునివలె గదాపాణియైన భీముడు గదతో గజములను చంపుచు యుద్ధరంగములో విచ్చలవిడిగా తిరుగుచుండెను. అతడు బిగ్గరగా గర్జిల్లెను. ఆనాదము విని గజములు చేష్టలుడిగి గడగడ వణకెను.

రాజా! తరువాత ద్రౌపదీ పుత్రులు అభిమన్యుడు నకులసహదేవ ధృష్టద్యుమ్నులు భీముని వెనుకవైపు అతని రక్షకులుగా నుండి గజములపై బాణవర్షము మేఘములు పర్వతములపై గురిసినట్లు వర్షించిరి అనేక శస్త్రములంచే గజారోహకుల తలలు చిదుగగొట్టుచుండిరి. వారి తలలు బాహువులు తెగి గజ

ములు క్రిందకుపడుచుండగా అది పాషాణవర్షమాయనున్నట్లు చూపరులకుతోచెను. తలలేని మొండెములు గజస్కంధములపై ఒరసియుండగా అవి పర్వతాగ్రము లందు కొనలుతెగిపడియున్న వృక్షములవలె కనబడెను. ధృష్టద్యుమ్నుడు మహా గజములను నేల గూల్చెను.

రాజా! అంతట మగధరాజు ఐరావతమువంటి గజముపైవచ్చి అభిమన్యుని తాకెను. అట్లు వచ్చుచున్న గజమును అభిమన్యుడు ఒక్క బాణముతో కొట్టి అతని శిరస్సును గూడ ఛేదించెను.

రాజా! తరువాత భీమసేనుడు ఆ గజయూథములో దూరి యింద్రుడు పర్వతములను వలె గజములను మర్దించుచుండెను. ఒక దెబ్బలోనే అనేక గజ ములు వజ్రాయుధముచేత పర్వతములవలె నేలగూలుచుండెను. అనేక గజముల దంతములు, తొండములు, పార్శ్వములు తెగి అవి మలమూత్రములు చేయుచు భయముతో చెదిరి పారిపోవచ్చెను. కొన్ని రక్తము గ్రక్కుచు కుంభస్థలములు పగిలి పర్వతములవలె నేలగూలుచుండెను.

రాజా! భీమసేను డప్పుడు మేదస్సుచేత రక్తముచేత వ్యాపించిన శరీర రముతో రణభూమియందు మహాభీకరముగా తిరుగుచుండెను. అతడు నెత్తుట తడిసిన గదను ధరించి పినాకధనుస్సును ధరించిన శివునివలె నుండెను.

అట్లున్న భీముని అభిమన్యు ప్రముఖులైన రథికులు దేవతలు ఇంద్రుని వలె రక్షించుచుండిరి. అప్పుడు భీముడు రౌద్రాకారముతో యమునివలె కన బడెను. శంకరుడు తాండవనాట్యము చేయుచున్నట్లు అతడు అంతట ఎగురుచుం డెను. పినాకముతో పశువులను సంహరించు క్రుద్ధుడైన పశుపతి వలె భీముడు రక్తసిక్తమైన గదతో భాసిల్లెను. గోపాలకుడు కఱ్ఱతో పశువుల మందను తోలు నట్లు గజములను గదతో తోలుచుండెను. అవి తమ సైనికులనే త్రొక్కుచు పోవుచుండెను. సుడిగాలి మేఘములను వలె భీముడు గజముల చెదరగొట్టుచు శ్మశానమునందు శివుని వలె రణరంగమునందు నిలచెను.

(అరవై మూడవ అధ్యాయము)

## భీమ-భీష్ముల యుద్ధము

జనమేజయా! సంజయుడు ధృతరాష్ట్రునకు తరువాతి యుద్ధ వృత్తాంత మిట్లు చెప్పదొడగెను.

రాజా! భీమసేనుడు ప్రచండపరాక్రమములో గజసైన్యమును సంహరింపగా నీ పుత్రుడు దుర్యోధనుడు అతని పరాక్రమము సహింపజాలక భీమసేనుని వధింపుడు అని సర్వసైన్యములను పురికొల్పెను. ఆ యాజ్ఞచేత సైన్యములన్నియు అతిభయంకరముగా బొబ్బరిలుచున్న భీమసేనునిపై బడెను. దేవతలకుగూడ దుస్సహములైన ఆ బలములు అపార సముద్రమువలె ఒప్పుచు అనంతములుగా వచ్చి భీముని ముట్టడించెను.

రాజా! ఆ చతురంగబలములు సింహనాదములు చేయుచున్నప్పుడు రేగిన ధూళి అంతటను వ్యాపించెను. రెండవ మహాసముద్రముగానున్న ఆ సేనాసాగరమును భీమసేనుడు ఎల్లవలె అడ్డగించెను. అప్పుడు అతడు చూపిన అతిమానుషమైన కర్మ అత్యాశ్చర్యముగా నుండెను. పెచ్చురేగిన ఆ చతురంగబలమును రాజవీరులను భీమసేనుడు ఏమాత్రము భ్రాంతిజెందక నివారించి మేరుపర్వతమువలె అచంచలముగా నిలిచెను.

రాజా! అట్లు సాగుచున్న తుములయుద్ధములో భీమునకు బాసటగా అతని సోదరులు-పుత్రులు-ధృష్టద్యుమ్నుడు-శిఖండి వచ్చిరి. తరువాత భీముడు తన తన ఉక్కుగదతో దండపాణియైన యముడువలె పరుగెత్తి పోయి గజారథాదులను నుగ్గుచేసి అనేకులను ప్రళయకాలయముడువలె సంహరించెను. వచ్చిక బయళ్ళలో ఏనుగువలె భీముడు అవలీలగా ఆ సేనలో తిరుగుచు రథములను లాగిలాగి నలుగగొట్టుచుండెను. రథములనుండి రథికులను గజములనుండి గజయోధులను అశ్వపృష్ఠములనుండి అశ్వికులను పదాతిదళములను గదతో మర్దించుచు నేలపై పడగొట్టెను. మహావాయువు వృక్షములను నిర్మూలించినట్లు భీముడు నీ పుత్రుని సేనను ధ్వస్తము చేసెను.

రాజా! మజ్జ (ఎముకల యందలి జిడ్డురసము) వసా (క్రొవ్వు) మాంస రక్తములలో మునిగి అతని గదాదండము గూడ భయంకరముగా కనబడుచుండెను. అంతటను చచ్చిపడియున్న సైన్యముచేత ఆరణ భూమి మృత్యు దేవతకు నివాస భూమివలె నుండెను. అతని గద అప్పుడు క్రోధములో పశువులను చంపుచున్న పశుపతి పినాకధనుస్సువలె, యమదండమువలె, ఇంద్రుని వజ్రాయుధమువలెను చూచువారికి అతిరౌద్రముగా కనబడుచుండెను. అతని రూపము గూడ యుగాంత యమునిరూపమువలె ప్రకాశించుచుండెను.

రాజా! అట్లు ఆ మహాసైన్యమును మాటిమాటికి తరిమికొట్టుచు మృత్యు

దేవతవలె వచ్చుచున్న భీముని చూచి సైనికులందరు మిగులభయపడిరి. అతడు గదాపాణియై కనబడినచోట్ల నెల్ల సైన్యములు చీలి పారిపోవుచుండెను.

రాజా! ఆ విధముగా నోరుతెరచుకొనిన యముని వలె సర్వసైన్యములను మ్రింగుచు గదతో మహాభయంకరముగా నున్న భీముని భీష్ముడు తాకెను. ఎడ తెగని బాణవర్షము గురియుచు యుగాంత మేఘమువలె సూర్య తేజస్సుతో తన పైన పడుచున్న భీష్ముని భీముడెదిరించెను. అతనితోపాటే సాత్యకికూడ వచ్చి మీ సైన్యమును కంపింపజేసెను. సాత్యకిని మీవారెవరు గూడ నివారింపజాల కుండిరి అతడు భీమునితో గలసి భీష్మునితో ఘోరముగా యుద్ధము చేసెను.

రాజా! సాత్యకిని అలంబుషుడను రాక్షసుడు బాణములతో గొట్టెను. అలంబు షుని సాత్యకి తరిమికొట్టెను. మీవారందరు సాత్యకిపై పర్వతముపైన మేఘములు వాన గురిసినట్లు శర వర్షము గురిసిరి. అయినను అతనిని వారింపజాలకుండిరి. సాత్యకి మధ్యందిన మార్తాండునివలె ప్రకాశించుచుండెను.

రాజా! అప్పుడు మీ సేనలో సోమదత్త పుత్రుడైన భూరిశ్రవుడు దప్ప అందరున్ను విషాదము జెందిరి భూరిశ్రవుడు సాత్యకి నెదుర్కొని సాత్యకిని బాణములతో అంకుశములతో ఏనుగువలె కొట్టెను. సాత్యకి అతనిని నివారించెను అప్పుడు సేనతో దుర్యోధనుడు భూరిశ్రవునకు సహాయకుడుగా వచ్చెను. పాండవ వీరులుగూడ సాత్యకి సహాయకులుగా వచ్చిరి. ఇరుపక్షముల వీరులకు ఘోర యుద్ధము ఆరంభించెను.

(అరవైనాల్గవ అధ్యాయము)

## భీమ ఘటోత్కచుల పరాక్రమము

రాజా! భీమసేనుడు అతి క్రోధముతో గదాపాణియై దుర్యోధనాదులను తాకెను. అతనికి అనేక సహస్రరథికులు తోడుగానుండిరి. నీ కొడుకు నంద కుడు ఆరు బాణములతో భీమసేనుని కొట్టెను. దుర్యోధనుడు తొమ్మిది బాణము లతో భీముని యెదపై కొట్టెను.

రాజా! భీమసేను డప్పుడు రథమెక్కి సారథితో నిట్లనెను.

సారథీ! యీ ధార్తరాష్ట్రులు అతి సంక్రుద్ధులై అందరు ఒక్కటిగా చేరి నన్నే వధించుటకు పూనివచ్చుచున్నారు. అనేక సంవత్సరములనుండి తలచు చున్న మా మనోరథ వృక్షము నేడు ఇక్కడ సఫలమగుచున్నది. నా యెదుట

ఇప్పుడు నా సోదరులు దుర్యోధనాదులు కనబడుచున్నారు. విశోకా! అదుగో రథ ధూళి రేగుచున్నది. అచ్చోటికి రథము తోలుకొని పొమ్ము అక్కడనే యుద్ధ సన్నద్ధుడైన యోధనుడు నిలిచియున్నాడు. పొగరుబోతులైన అతని తమ్ములు గూడ అక్కడనేయున్నారు. ఇదుగో నీవు చూచుచుండగానే వీరందరినిచంపెదను. కనుక నా అశ్వములను గట్టిగా పట్టుకొని తోలుము.

వెంటనే భీమసేనుని రథమును సారథి విశోకుడు దుర్యోధనాదులకడకు తోలుకొని పోయెను.

రాజా! తరువాత భీముడు పదిబాణములతో దుర్యోధనుని మూడింటితో సందకుని కొట్టెను. అంతట దుర్యోధనుడు అరువది బాణములతో భీముని మూడింటితో విశోకునికొట్టి భీముని ధనుస్సు ఛేదించెను. అతనిచేత పీడితులైన విశోకుని చూచి భీముడు అతి క్రుద్ధుడై మూడు భల్లములచేత దుర్యోధనుని ధనుస్సు ఛేదించెను. వెంటనే దుర్యోధనుడు మరియొక ధనుస్సు తీసికొని మృత్యువువంటి బాణమును భీమునిపై ప్రయోగించెను. ఆ దెబ్బతో భీముడు రథమునందుకూలి మూర్ఛిల్లెను. అప్పుడు అభిమన్యుడు మొదలైనవారు అది సహించలేక నీపుత్రుని తలపై తీవ్ర శస్త్ర వర్షమును గురిపించిరి.

రాజా! తరువాత భీమసేనుడు మూర్ఛదేరి దుర్యోధనుని ఎనిమిది బాణములతో, శల్యుని ఇరువదియైదింటితో కొట్టెను. ఆ బాధ సహించలేక శల్యుడు రణ రంగము వీడిపోయెను. తరువాత నీపుత్రులు పదునాలుగురు సేనాపతులు-సుషేణ జలసంధాదులు భీమసేనుని ఎదుర్కొని అతనిపైన అనేక బాణములు ప్రయోగించిరి.

రాజా! అట్లు తనను కొట్టుచున్న నీ పుత్రులను భీమసేనుడు చూచి, పశువుల మందలో తోడేలువలె వారిమధ్యలో ప్రవేశించి అతిక్రోధముతో ఓష్ఠ మూలములు నాకుచు వారిపై బడి గరుడుని వేగముతో నీ పుత్రుడైన సేనాపతి శిరస్సును క్షురప్రము (అర్ధచంద్ర బాణము)తో నరికెను. మూడు బాణములతో జలసంధుని వధించెను. ఇట్లే నీ పుత్రులైన సుషేణ-ఉగ్ర-వీరబాహు-భీమ-భీమ రథ-సులోచనాదులను గూడ వివిధాయుధములతో సంహరించెను.

రాజా! భీమసేన పరాక్రమమునకు తాళజాలక నీ యితర పుత్రులు భయపడి దిక్కులకు పారిపోయిరి. వారిని భీమసేనుడు తరిమితరిమి చంపుచుండెను.

రాజా! అది చూచి భీష్ముడు మహారథికులతో నిట్లనెను.

వీరులారా! భీమసేనుడు ధార్తరాష్ట్రుల సంహరము పడగొట్టుచున్నాడు. ఇక జాగుచేయక భీముని పట్టుకొనుడు.

రాజా! అట్లు భీష్ముడు చెప్పగనే దుర్యోధన సైనికులందరు భీమసేనునిపైకి ఉరికిరి. భగదత్తుడు తన గజముతో భీమునివైపు పోయి భీముడు కనబడనంతగా బాణములతో మేఘములు సూర్యుని గప్పినట్లు కప్పెను.

రాజా! అది సహించక అభిమన్యుడు మొదలైన వీరులు శరవర్షముచేత భగదత్తుని నివారించిరి. అతని గజమును గూడ కొట్టిరి. ఆ శరవర్షముచేత భగదత్తుని గజము శరీరమంతట నెత్తురు చిమ్మగా సూర్యకిరణములచేత కప్పబడిన మేఘమువలె అది అందముగా నుండెను. ఆ గజము యమునివలె శత్రువులను పారద్రోలుచుండెను. దాని మహారూపమును చూచి అందరు భయపడిరి. తరువాత భగదత్తుడు భీమసేనుని యెదపై బాణముతో కొట్టెను. ఆ దెబ్బతో భీముడు మూర్ఛిల్లి ధ్వజదండమును పట్టుకొనెను. అట్లు సైనికులు భీతులగుటను భీమసేనుడు మూర్ఛిల్లుటను చూచి భగదత్తుడు బిగ్గరగా సింహనాదము చేసెను.

రాజా! అప్పుడు ఘటోత్కచుడు తండ్రియైన భీముడు మూర్ఛిల్లియుండుట చూచి మిక్కిలి కోపముతో రాక్షసుడు గాబట్టి అక్కడ అంతర్ధానము చెంది అతి భయంకర మాయచేత ఘోరరూపము ధరించి, తాను మాయచేత సృజించిన ఐరావణ గజము నెక్కి యింద్రునివలె వచ్చెను. ఆ యైరావత గజమును దిగ్గజములుగూడ అనుసరించి వచ్చెను. అవిగూడ మాయా సృష్టములే. ఆ దిగ్గజములలో అంజన వామన-మహాపద్మ గజములపై రాక్షసులు కూర్చొనియుండిరి. ఆ మూడు గజములు మహాకాయములుగలవై మదజలము స్రవించుచుండగా ఆ గజములపై నున్న రాక్షసవీరులు బలపరాక్రమవంతులై శోభిల్లుచుండిరి.

రాజా! ఘటోత్కచుడు భగదత్తుని అతని గజమును చంపదలచి తన గజము నతనిపై తోలెను. దానితో పాటు ఇతర గజములను గూడ రాక్షసులు తోలిరి. నాలుగు దంతములుగల ఆ గజములు నలుదిక్కులు చుట్టియుండెను. అవి భగదత్తుని గజమును పీడించెను. వాని దెబ్బలతో బాధపడుచు భగదత్తుని గజము బిగ్గరగా అరచెను. అది పిడుగు చప్పుడువలె నుండెను.

ఆ ధ్వని విని భీష్ముడు ద్రోణదుర్యోధనులతో నిట్లనెను.

ఈ భగదత్తుడు దురాత్ముడైన ఘటోత్కచునితో పోరాడుచు కష్టము

లలో చిక్కుకొనినాడు. ఘటోత్కచ రాక్షసుడు. మహాకాయుడు భగదత్తు డతి కోపిష్ఠుడు. ఈ యిరువురు యముడు మృత్యుదేవతలవలె పరస్పరము పోరాడు చున్నారు. పాండవులు సంతోషముతో అరచుచున్నారు. భగదత్తుని గజము భయ పడి రోదన చేయుచున్నది. మనమిప్పుడు భగదత్తుని రక్షణార్థమై అక్కడకు పోవుదము మనమతని రక్షింపనియెడల నతడు తప్పక మరణించగలడు. కనుక త్వరపడుడు జాగు చేయకుడు, అతిరౌద్రముగా మహాసంగ్రామము జరుగుచున్నది. భగదత్తుడు మనకు భక్తుడు. సత్కులసంజాతుడు-శూరుడు-సేనాపతి కనుక నతనిని రక్షించుట మనకు యుక్తమైనపని.

రాజా! భీష్ముని మాటలు విని ఆ మహారథికులందరు భగదత్తరక్షణార్థమై భీష్మద్రోణులను ముందిడుకొని భగదత్తుడున్న చోటికి పోయిరి.

రాజా! అట్లుపోవుచున్న వారిని చూచి పాండవ పాంచాలురుగూడ యుధిష్ఠి రుని ముందిడుకొని ఘటోత్కచుని సహాయార్థమైపోయిరి. శత్రువులను చూచి ఘటోత్కచుడు బిగ్గరగా సింహనాదము చేసెను" అది పిడుగు చప్పుడువలె నుండెను.

రాజా! ఘటోత్కచుని ధ్వని విని గజములు పరస్పరము యుద్ధము చేయుచుండుట చూచి భీష్ముడు మరల ద్రోణాచార్యునితో నిట్లనెను.

ఆచార్యా! దురాత్ముడైన యీ ఘటోత్కచునితో యుద్ధముచేయుట మంచి దని నాకు తోచుట లేదు. అతడు బలపరాక్రమవంతుడే కాక యిప్పుడు సహాయ వంతుడై కూడ ఉన్నాడు. అతనిని యుద్ధములో నింద్రుడుగూడ జయించజాలడు. అతడు మంచి లక్ష్యశుద్ధిలో బాగుగా యుద్ధము చేయగలవాడు. మనవాహనము లన్నియు అలసియున్నవి. ఇవి ఈ దినమంతయు పాంచాలపాండవుల దెబ్బలచేత గాయబడియున్నవి. కనుక నేడు పాండవ సేనతో యుద్ధము చేయుట మంచిది కాదని నాకు తోచుచున్నది. నేటికి యుద్ధము ఆపుటకు ప్రకటింపుడు రేపు శత్రువులతో పోరాడుదము.

రాజా! అట్లు భీష్మ పితామహుడు చెప్పిన తరువాత కౌరవులు ఆనాటికి యుద్ధము చాలించిరి. ఘటోత్కచుని దెబ్బలకు బాధపడిన కురు సైనికులు అంత టితో ఆ రాక్షసుని తప్పించుకొని యుద్ధము చాలించిరి.

రాజా! కౌరవులు యుద్ధభూమిని విడిచి తిరిగి పోవగానే పాండవులు జయ శీలురై సింహనాదము చేయుచు శంఖములు పూరించిరి. ఈవిధముగ ఆ నాలుగవ

నాటి యుద్ధము ముగిసెను. పాండవులు ఘటోత్కచుని ముందిడుకొని తిరిగి పరస్పరము ప్రశంసించుకొనుచు తమ శిబిరములకు పోయిరి.

రాజా! కౌరవులు పాండవులకు ఓడిపోయి క్షతగాత్రులై సిగ్గుతో స్వశిబిరములకు పోయిరి.

దుర్యోధనుడు తమ్ములవధచేత దీనుడై దుఃఖించుచుండెను.

జనమేజయా అప్పుడు ధృతరాష్ట్రుడు సంజయునితో నిట్లనెను

(అరవై ఐదవ అధ్యాయము)

## ధృతరాష్ట్ర సంజయుల సంవాదము

సంజయా! దేవతలకు గూడ దుష్కరమైన కర్మ పాండుపుత్రులు చేసినట్లు అంతటను నా పుత్రుల పరాభవము జరిగినట్లున్ను విని నాకు చాల భయాశ్చర్యములు కలుగుచున్నవి. ఇక ఈ యుద్ధమెట్లు సాగునాయని మహా చింత గలుగుచున్నది. విదురుని మాటలు నా మనస్సును దహించుచున్నవి. ఇదియంతయు దైవయోగముచేతనేయిట్లైనదని తోచుచున్నది.

సంజయా! మహాయోధాగ్రేసరులు సర్వశస్త్రాస్త్ర పండితులు నైన భీష్మద్రోణాదులతో పాండవవీరులు పోరాడుచుండుట ఆశ్చర్యము గాదా!

నాయనా! పాండవులు మహాత్ములు-మహాబలశాలులై అవధ్యులుగా నుండునట్లు ఎవరు చేసిరి? ఎవరు వారికి ఇట్టివరమిచ్చిరి? వారికెట్టి జ్ఞానము గలదు? ఆకాశములో నక్షత్ర గణములవలె వారు నాశనము చెందకుండుటకు ఏ వరములు అడ్డుపడుచున్నవి?

సంజయా! పాండవులచేత మా సైన్యము హతమైనట్లు మాటిమాటికివిని నేనేమాత్రము ఓర్వజాలకున్నాను. ఈ అతిభయంకరమైన దండము దైవయోగముచేత నాపైన పడుచున్నది. పాండవులు అవధ్యులగుటకు నా పుత్రులు వధ్యులగుటకున్ను కారణములన్నియు నాకు యథార్థముగా తెలుపుము. ఈ దుఃఖమునకు అంతము లేనట్లు తోచుచున్నది. మనుష్యుడు బాహువులతో సముద్రము ఈదిదాట జాలనట్లున్నదీ యుద్ధ విజయము.

సంజయా! నా పుత్రులకు అతిదారుణమైన వ్యసనము ప్రాప్తించెను. వారినందరిని భీముడు సంహరించుననుటలో సంశయములేదు. అతనినుండి నా కొడుకులను కాపాడు వీరుదెవడు గూడనున్నట్లు నాకు కనబడుటలేదు. తప్పక

నా పుత్రులకు వినాశము సంప్రాప్తమైనది. కాబట్టి ఇట్టి శక్తి (బలము) పాండవులకు కలుగుటకు నా పుత్రుల జయమునకున్న కారణము నాకు తెలుపుము.

సంజయా! తమవారు యుద్ధమునందు విముఖులై పోయినప్పుడు దుర్యోధనుడేమి చేసెను? అప్పుడు భీష్మ ద్రోణ కృపాదులందరున్న నా పుత్రులు యుద్ధ విముఖులైనప్పుడు ఏమి చేయవలెనని నిశ్చయించిరి? చెప్పుము.

జనమేజయా! ధృతరాష్ట్రుని ప్రశ్నములకు సంజయుడిట్లు బదులు చెప్పజొచ్చెను.

రాజా! నేను చెప్పబోవు విషయములన్నియు జాగ్రత్తగా విని నిశ్చయించుకొనుము. పాండవులు మంత్రతంత్రములుగాని, మాయలుగాని, భయపరచుటగాని చేయుటలేదు. వారు శక్తిమంతులై న్యాయముగా పోరాడుచున్నారు. తమ జీవన నిర్వాహమునకు కార్యములు వారు ధర్మములోనే చేయుచు అన్నిపనులు మహాయశస్సు కోరియే చేయుచు ధర్మయుక్తులై పోరాడుచు యుద్ధమునుండి తిరిగి పోవరు. వారు మహాబలశాలురు. ధైర్యలక్ష్మీసంపన్నులు. ధర్మమెక్కడ ఉండునో జయమక్కడనే యుండును గదా! కనుక వారికి యుద్ధములో పరాజయము ఉండదు. వారు వధ్యులు కారు.

రాజా! నీ పుత్రులు దురాత్ములు-కఠినులు. పాపేచ్ఛ గలవారు. నీచకర్మల యందాసక్తిగల వారు కాబట్టి యుద్ధమునందు పరాజయము చెందుచున్నారు. రాజా! నీ పుత్రులు అనేక క్రూరకర్మలు చేసినారు నీచులవలె పాండవులయెడ కుట్రలు పన్నినారు. పాండవులను ఎప్పుడు కూడా నీ పుత్రులు గౌరవించలేదు. మీవారుచేసిన పాపకర్మలకు ఇప్పుడు ఘోరమైన మహాదుష్ఫలము అనుభవించుచున్నారు. ఆ ఫలము నీవు పుత్రమిత్ర బాంధవులతో అనుభవింపుము.

రాజా! మిత్రులు విదురుడు, భీష్ముడు, ద్రోణుడు, నేను అనేక పర్యాయములు నీకు హితబోధ చేసి యుద్ధము మానుకొనుమని చెప్పినప్పటికి నీవు తెలిసికొనలేకపోయితివి. సామాన్యముగా రోగియైన మానవుడు ఔషధము, పథ్యము సేవించనట్లు మా హితవచనములను గ్రహించుటకు నిరాకరించితివి నీ పుత్రుల మాటలు విని, పాండవులు జయింపబడినట్లుగా తలంచుచున్నావు. నీ ప్రశ్నములకు సమాధానము చెప్పెద వినుము.

రాజా! పాండవులు జయము పొందుటకు కారణము నాకు తెలిసినంత

వరకు చెప్పెదను. దుర్యోధనుడు ఈ విషయమునే భీష్మపితామహుని అడిగెను. రణమునందు మహారథికులైన తన సోదరులు ఓడిపోవుటను చూచి, దుఃఖార్తుడై దుర్యోధనుడు ఒక రాత్రివేళ మహాప్రాజ్ఞుడైన భీష్ముని కడకు అతి వినయముగా పోయి ఆయనలో అతడు ఇట్లనెను.

"పితామహా! నీవు, ద్రోణ, అశ్వత్థామ, కృతవర్మాది మహారథికులు అతిబలపరాక్రమశాలురని ప్రసిద్ధి చెందినారు. సత్కుల సంజాతులు, మూడు లోకములను కూడా జయింపజాలిన వారని నా యభిప్రాయము. అట్టి మీరందరు కలిసి కూడా పాండవుల పరాక్రమమును ఎదురింపజాలకున్నారు. ఈ విషయములో నాకు సందేహము కల్గుచున్నది. ఏ బలము నాశ్రయించి పాండవులు క్షణక్షణము మమ్ము జయించుచున్నారో తెలుపుము."

ధృతరాష్ట్ర మహారాజా! దుర్యోధనుని ప్రశ్నమునకు భీష్ముడిట్లు బదులు చెప్పెను.

రాజా! నేను చెప్పబోవు మాటను జాగ్రత్తగా వినుము. ఇంతకు పూర్వమే అనేక పర్యాయములు నీకు బోధించితిని కాని నేను చెప్పినట్లు నీవు చేయవైతివి. నీవు పాండవులతో శాంతముగా సంధి చేసికొనుము. అదియే నీకు సమస్త భూమండలమునకు క్షేమకరము.

రాజా! నీవు సోదరులతో కలిసి సుఖముగా నీ సామ్రాజ్యమును అనుభవింపుము. శత్రువులను అణచి బంధువులను ఆనందపరచి సుఖముగ నుండుమని చెప్పితిని గాని నేను ఎంత ఆక్రోశించినను నీవు వినవైతివి. పాండవులను నీవు అవమానించినందులకు ఫలమిప్పుడు సంప్రాప్తమైనది. వారు అక్లిష్ట కర్ములు. వారు అవధ్యులగుటకు కారణము చెప్పెద వినుము.

శ్రీకృష్ణ భగవానుని చేత రక్షింపబడుచున్న పాండవులను జయింపగలవాడు ఏ లోకమునందు కూడ ఇంతదాక పుట్టలేదు పుట్టబోవడు. దేవ దానవ మానవులందు ఆ మహానుభావుడైన శ్రీకృష్ణుని యభిప్రాయమునకు వ్యతిరేకముగా పోవు వాడెవడున్నాడు?

నాయనా! పూర్వము మహానుభావులైన మునీశ్వరులు నాకు చెప్పిన పురాతనగీతమును ఉన్నదున్నట్లు చెప్పెద వినుము.

## విశ్వోపాఖ్యానము

పూర్వకాలమునందు సమస్తదేవతలు, ఋషులు గంధమాదన పర్వతము

నందు బ్రహ్మదేవుని ఉపాసించుచుండిరి. అప్పుడు వారి మధ్య కూర్చునియున్న ప్రజాపతికి ప్రకాశించుచున్న విమాన మొకటి ఆకాశమునందు కనబడెను. అప్పుడు వెంటనే బ్రహ్మదేవుడు ధ్యానముచేత దానిని తెలిసికొని నియమముతో చేతులుజోడించి ఆ పరమపురుషునకు నమస్కారము చేసెను. ఋషులు దేవతలు కూడ బ్రహ్మదేవుని చూచి అంజలి బంధముతో ఆ యద్భుతమును తిలకించు చుండిరి.

రాజా! అప్పుడు బ్రహ్మదేవుడు ఆ పరమపురుషుని విధివత్తుగా పూజించి ఇట్లనెను.

మహానుభావా! నీవు ప్రపంచ స్వరూపుడవు. విశ్వేశ్వరుడవు. మహాదైవ స్వరూపుడవు. నిన్ను శరణుజొచ్చెదను. నీవు సర్వ విధముల సర్వోత్కృష్టుడవై జయశీలుడవు కమ్ము. నీవు సర్వ ప్రపంచ స్వరూపుడవు. ప్రపంచ సృష్టి స్థితి సంహార కారకుడవు. ధర్మ సంస్థాపనమునకు భూమిలో అవతరించువాడవు. ప్రపంచధారణము కొరకు నేను ఏమిచేయవలయునో ఉపదేశించుము. నీవు వాసుదేవునిగా ఉద్భవించి ప్రద్యుమ్నుని కంటివి. అతని నుండి అనిరుద్ధుడు పుట్టెను. అనిరుద్ధుడు లోకధారణార్థమై నన్ను కనెను.

కనుక భగవన్! నేను వాసుదేవ స్వరూపుడను. నీ చేతనే నిర్మింపబడి తిని. నీవు నాలుగు భాగములుగా విభజింపబడి మానవత్వమును పొందుము. రాక్షసవధచేసి సర్వలోకములకు సుఖము కలిగించుము. ధర్మము యశస్సు పొందగలవు. బ్రహ్మర్షులు దేవతలు నీ నామగానము చేయుచుందురు. నీవు ఆది మధ్యాంతరహితుడవు, సమస్త లోక సంరక్షకుడవని అందరు నిన్ను స్తుతించెదరు.

(అరవైయారవ అధ్యాయము)

## నర-నారాయణుల మహిమ

ధృతరాష్ట్ర మహారాజా! భీష్ముడు దుర్యోధనునితో తర్వాతి వృత్తాంత మిట్లు చెప్ప నొడగెను.

దుర్యోధనా ఈ విధముగా బ్రహ్మదేవుడు శ్రీమన్నారాయణ మూర్తిని

స్తుతించిన తరువాత భగవంతుడు బ్రహ్మదేవుడితో స్నేహముతో గంభీరముగా నిట్లనెను.

నాయనా నేను నీ కోరికనంతయు యోగదృష్టితో తెలిసికొంటిని. నీవు కోరినట్లే అగుగాక! అని వరమిచ్చి అంతర్ధానము చెందెను.

రాజా! ఆ అద్భుతమును చూచిన దేవర్షి గంధర్వులందరు అత్యాశ్చర్యము చెంది కుతూహలముతో బ్రహ్మదేవునితో నిట్లనిరి.

"మహాత్మా! నీ విప్పుడు నమస్కరించి స్తుతించిన ఆ మహానుభావుడెవరు మాకు తెలుపుము".

ఈ విధముగా అడిగినవారికి పితామహుడు మధుర వచనములతో ఇక పైన అవశ్యం భావిగా జరుగనున్న విషయములను గూర్చి ఇట్లు చెప్పెను.

నాయనలారా! నేను జగత్పతియైన భగవంతుని ప్రపంచమును అనుగ్రహించుటకు మనుష్యలోకములో వాసుదేవుడుగా అవతరించి దుష్టశిక్షణ చేయుమని యాచించితిని. యుద్ధములో చంపబడిన రాక్షసులే ఇక్కడ ఘోర రూపముతో పుట్టిరి. అట్టి వారి వధకొరకు భగవవంతుడైన నారాయణుడు నరునితో కలిసి భూమండలమునందు అవతరించెను. ఆ నర నారాయణ మహర్షులే కృష్ణార్జునులుగా అవతరించిరి. దేవదానవులు ఏకమైవచ్చి కూడ యుద్ధములో వారిని జయింపజాలరు. ఆ నారాయణునకు నేను పుత్రుడను.

మహామునులారా! కృష్ణార్జునులు నరనారాయణులని మహర్షులైన మీరు ఎరుగరు. కనుక సర్వలోకేశ్వరుడైన వాసుదేవుడు మీరందరకు పూజనీయుడు. ఈ శంఖచక్రగదాధారుడైన శ్రీకృష్ణుడు మనుష్యుడని అవమానింపదగదు.

"మునులారా పరమగుహ్యము, పరమపదము, పరబ్రహ్మ స్వరూపము అక్షరము అవ్యక్తమునైన ఈ శాశ్వత తేజో రూపము మనోవాచామగోచరము. ఇట్టి మహాపురుషుని ఎవడైతే మందబుద్ధితో మనుష్యమాత్రుడని అవమానించునో వాడు పురుషాధముడనబడును. తామస ప్రవృత్తి కలవాడే ఇట్లనును. శ్రీవత్సాంకుడైన పద్మనాభుని తెలిసికొనజాలనివాడు తామస ప్రవృత్తి కలవాడనబడును. భగవానుని అవమానపరచినవాడు ఘోరనరకమునందు మునిగిపోవును కనుక శ్రీకృష్ణ భగవానుడు అందరికిని నమస్కరింపదగినవాడు".

ధృతరాష్ట్ర మహారాజా! ఇట్లు భీష్ముడు దుర్యోధనునకు బోధించి తరువాతి వృత్తాంతమును ఇట్లు చెప్పుచున్నాడు.

"దుర్యోధనా! భగవంతుడైన బ్రహ్మదేవుడు దేవతలకు మహర్షులకు ఇట్లు చెప్పి వారిని పంపించి తాను తనలోకమునకు పోయెను. తరువాత దేవ-ముని-గంధర్వాదులు బ్రహ్మదేవుడు గానము చేసిన ఆ కథ విని ప్రీతులై స్వర్గమునకు పోయిరి.

దుర్యోధనా! ఈ విషయమును మహర్షులు వాసుదేవుని గూర్చి చెప్పుచుండగా వింటిని. పరశురాముడు, మార్కండేయుడు, వ్యాస నారదులు కూడ శ్రీకృష్ణ భగవానుని మహిమను చెప్పగా నేను, విని తెలిసికొని శ్రీకృష్ణుడు మహాత్ముడని లోకేశ్వరుడైన శ్రీమన్నారాయణుడని బ్రహ్మాదిదేవతలకు సృష్టికర్తయని తెలిసికొనినాను. అట్టి వాసుదేవుడు మానవులకు ఎట్లు పూజ్యుడు కాకుండును?

నాయనా! దుర్యోధనా! నేను వేదవిదులైన మునులు వాసుదేవునితో నీవు యుద్ధము చేయవద్దని ఆయన ఆశ్రయముగల పాండవులతో పోరాడవద్దనియు పలుసార్లు బోధించితిమి. మూర్ఖుడవైన నీవు వినలేదు. నీవు రాక్షస ప్రవృత్తిగల క్రూరుడవు. తామస ప్రవృత్తి గలవాడవు కనుకనే నరనారాయణ స్వరూపులైన కృష్ణార్జునులను ద్వేషించుచున్నావు. నీవుదప్ప మరి ఎవ్వరు కూడా వారిని ద్వేషించరు.

దుర్యోధనా! ఆ కారణముచేత చెప్పుచున్నాను వినుము. ఈ కృష్ణుడు శాశ్వతుడు, అవ్యయుడు, సర్వలోకమయుడు, విశ్వసంరక్షకుడు, లోకములను ధరించిన చరాచరగురువని తెలిసికొనుము. అతడే యోధుడు, జయము జయశీలుడు, సర్వమయుడు, రాగద్వేష రహితుడని తెలిసికొనుము.

నాయనా! కృష్ణుడెక్కడ ఉండునో అక్కడ ధర్మము ఉండును. ధర్మమున్నచోట జయము ఉండుట తథ్యము. ఆ మహానుభావుని యోగమహిమచేత పాండుపుత్రులు ధరింపబడియున్నారు. అట్టివారికి జయము తథ్యము.

దుర్యోధనా శ్రీకృష్ణుడు పాండవులయెడ శ్రేయోబుద్ధిగలవాడై యున్నాడు. యుద్ధమునందు వారికి బలము అతడే. వారిని సర్వదా సర్వభయములనుండి

కృష్ణుడు రక్షించును. ఆయన సర్వమంగళ స్వరూపుడైన వాసుదేవుడు అని తెలిసికొనుము. బ్రాహ్మణ క్షత్రియాది నాలుగు వర్ణముల వారిచేత ద్వాపర యుగాంతమునందు కలియుగాదియందు ఆ శ్రీకృష్ణుడు సేవింపబడుచున్నాడని, లోకరక్షకుడని దేవమానవాది సమస్తలోకములను సృజించువాడనియు సంకర్ష ణుడు గానము చేసెను.

(అరవైయేరవ అధ్యాయము)

## శ్రీకృష్ణ భగవానుని మహిమ

ధృతరాష్ట్ర మహారాజా! భీష్ముని యుపదేశము విని దుర్యోధనుడు ఆయనతో మరల నిట్లనెను.

"పితామహా! వాసుదేవుడు సర్వలోకములయందు మహాభూతము అని చెప్పబడుచున్నాడు గదా! ఆయన అవతారమును ప్రతిష్ఠను గూర్చి తెలిసికొన గోరుచున్నాను. దయయుంచి తెలుపుము."

ధృతరాష్ట్ర మహారాజా! ఆ విధముగా అడిగిన దుర్యోధనునకు భీష్మ పితామహుడు శ్రీకృష్ణ మహిమను గూర్చి ఇట్లు చెప్పదొడగెను.

"దుర్యోధనా! శ్రీకృష్ణుడు సర్వదేవాది దేవుడు. పుండరీకాక్షుని కంటే తత్త్వము లేదు. ఆ గోవిందుని మార్కండేయ మహాముని ఇట్లు కీర్తించెను.

ఆయన సర్వభూతాత్ముడు. ఆ పురుషోత్తముడు జలమును వాయువును అగ్నిని పృథివిని సృజించి, జలమునందు శయనించెను. సర్వతేజోమయుడైన ఆ దేవుడు యోగముచేత జలమునందు శయనించెను. సర్వతేజోమయుడైన ఆ దేవుడు యోగముచేత జలమునందు నిద్రించెను. ముఖమునుండి అగ్నిని ప్రాణ వాయువునుండి వాయువును, మనస్సునుండి వాక్కును, వేదములను ఆ అచ్యు తుడు సృజించెను.

ఆ మహానుభావుడు లోకములను, దేవతలను, ఋషులను ప్రజల సృష్టి స్థితి లయములు కల్పించెను. ఆ వరదుడు ధర్మజ్ఞుడు, ధర్మస్వరూపుడు సర్వ కామప్రదుడు ఆయనయే కర్త, కార్యము. దేవతలకు మొదటివాడు స్వయం

భూతుడు, భూతభవిష్యద్వర్తమానములను ఉభయసంధ్యలను దిక్కులను ఆకాశ మును, నియమములను కల్పించెను. ఋషులను వారికి తపస్సులను సృష్టించెను. జగత్సృష్టి కర్తయైన ఆ మహాత్ముడు సర్వభూతములకు అగ్రజుడైన సంకర్షణుని సృష్టించెను.

ఆ సంకర్షణునినుండి దేవదేవుడైన నారాయణుడు పుట్టెను. ఆ విష్ణువు నాభినుండి పద్మము, దానినుండి సృష్టికర్తయైన బ్రహ్మదేవుడు అతనినుండి ఈ సమస్త ప్రజలు జన్మించిరి.

తరువాత ఆదిశేషుని సృష్టించెను. ఆ శేషుడు సమస్త భూతములను పర్వత సహితమైన భూమిని ధరించుచున్నాడు. ఆ మహాశేషుని బ్రాహ్మణులు ధ్యానయోగముచేత తెలిసికొనుచున్నారు.

"బ్రహ్మదేవుని కర్ణరంధ్రమునుండి మధువు అను మహారాక్షసుడు ఉగ్ర కర్ముడై ఉగ్రముగా జన్మించెను. అతనిని పురుషోత్తముడు బ్రహ్మను అర్చించి వధించెను. అందువలన దేవదానవ మానవులు ఆ నారాయణమూర్తిని మధు సూదనుడు అని పిలుచుచున్నారు. వరాహనారసింహ వామనావతారములు ధరించి ఆ నారాయణమూర్తి రాక్షసులను అణచెను. ఆయన సమస్త లోకములకు తల్లి దండ్రులవంటివాడు.

ఆ పుండరీకాక్షుని మించినవాడు ఎవడు కూడ పుట్టలేదు. పుట్టబోవడు. ఆయన ముఖమునుండి బ్రాహ్మణులను, బాహువులనుండి క్షత్రియులను తొడల ండి వైశ్యులను పాదములనుండి శూద్రులను సృజించెను.

తపో నియమముతో ఆ దేవదేవుని అమావాస్యయందు పౌర్ణమాస్యయం దను బ్రహ్మస్వరూపునిగా తలచి పరిచర్యలు చేయువాడు ఆ మహాస్వరూపుని పొందగలడు. ఆ కేశవుడే (క-బ్రహ్మ, అ-విష్ణువు, ఈశ-శివుడు అని కేశవ శబ్దమునకు వ్యుత్పత్తి) పరమతేజః స్వరూపుడు, సర్వలోక పితామహుడు అని మునీశ్వరులు ఆయనను కీర్తించుచుందురు.

దుర్యోధనా! ఈ విధముగా నీవు శ్రీకృష్ణుని తెలిసికొని అతడే తండ్రి, ఆచార్యుడు, గురువు అని భజించుము. ఎవనియెడల శ్రీకృష్ణుడు ప్రసన్నుడగునో

ఆతడు అక్షయ పుణ్యలోకములను జయించగలడు. భయపడినవాడు ఆయనను శరణు వేడవలెను.

దుర్యోధనా! ఈ భగవదుపాఖ్యానమును సర్వదా పఠించునరుడు సర్వ శుభములను పొంది సుఖవంతుడగును. కృష్ణుని ప్రపత్తి చేసిన వారు మోహమును చెందరు. మహాభయగ్రస్తులను ఆ జనార్దనుడు సర్వదా రక్షించును.

దుర్యోధనా! శ్రీకృష్ణ భగవానుడు సాక్షాద్భగవంతుడు, మహిమసంపన్నుడు, అని యదార్థముగా తెలిసికొనినవాడు కాబట్టియే యుధిష్ఠిరుడు సర్వాధారుడైన ఆ జగదీశ్వరుని శరణువేడి ప్రపత్తితో సేవించుచున్నాడు. కనుక యుధిష్ఠిరునకు జయము కలుగుననుటలో సంశయము లేదు.

ధృతరాష్ట్ర మహారాజా! ఇట్లు భీష్ముడు దుర్యోధనునకు శ్రీకృష్ణ మహిమను గూర్చి వర్ణించి చెప్పి తరువాతి వృత్తాంతమిట్లు చెప్పదొడగెను.

(అరవై ఎనిమిదవ అధ్యాయము)

## పంచభూత స్తోత్రము

దుర్యోధనా! బ్రహ్మభూత స్తోత్రము చెప్పెద వినుము. దీనిని పూర్వము బ్రహ్మర్షులు దేవతలు చెప్పిరి. దేవదేవుడైన శ్రీకృష్ణుడు లోకేశ్వరుడని నారదుడు ఆ దేవుని స్తుతించెను. అట్లే మార్కండేయుడు కూడ శ్రీకృష్ణుడు త్రికాల స్వరూపుడని యజ్ఞదాన స్వరూపుడని స్తుతించెను. భృగుమహర్షి వ్యాసమహర్షి ఆ దేవదేవుని గూర్చి ఇట్లు వర్ణించిరి.

మహానుభావా! నీవు పరమపురుషుడవు. వాసుదేవుడవు. ఇంద్రుని స్థాపించినవాడవు దేవదేవుడవు, పూర్వము దక్షప్రజాపతి ప్రజాసృష్టి చేసెనని చెప్పెదరు. సర్వలోక సృష్టికర్తవు నీవే.

దుర్యోధనా! అంగిరసుడిట్లు అనెను.

నీ మనస్సులో అవ్యక్తముగా నున్నది మాయచేత వ్యక్త ప్రపంచముగా మారెను. దేవతలు నీ నుండియే పుట్టిరని అసితుడైన దేవలుడు చెప్పెను.

నీవు శిరస్సుచేత ఆకాశమును, బాహువులచేత పృథివిని ఉదరముచే మూడు లోకములను వ్యాపించియున్న సనాతన పరమపురుషుడవని తపస్వులు తెలిసికొనియున్నారు.

పరమాత్మ దర్శన సంతృప్తులైన మహర్షులందరికి నీవు సర్వోత్తముడవని తెలియును. యుద్ధమునుండి వెన్నుచూపని క్షత్రధర్మ ప్రధానులైన రాజర్షులకు నీవు ఆశ్రయుడవు.

దుర్యోధనా! ఈ విధముగా యోగీశ్వరులైన సనత్కుమారాదులు శ్రీహరిని కీర్తించుచుందురు. ఈ విషయము నీకు విస్తారముగా చెప్పితిని. శ్రీకృష్ణునియొక్క యథార్థతత్త్వము తెలిసికొని ఆయనను సేవించుము.

దుర్యోధనా! ఈ విధముగా యోగీశ్వరులైన సనత్కుమారాదులు శ్రీహరిని కీర్తించుచుందురు. ఈ విషయము నీకు విస్తారముగా చెప్పితిని. శ్రీకృష్ణుని యొక్క యథార్థతత్త్వము తెలిసికొని ఆయనను సేవించుము.

ధృతరాష్ట్ర మహారాజా! ఈ విధముగా భీష్ముడు అతిపవిత్రమైన బ్రహ్మభూతస్తోత్రమును దుర్యోధనునకు ఉపదేశించెను.

మహారాజా! నీ పుత్రుడు భీష్ముని ఉపదేశము విని, శ్రీకృష్ణుని యెడల పాండవుల యెడల మిక్కిలి గౌరవము కలవాడయ్యెను. అట్లున్న అతనితో భీష్ముడు మరల నిట్లనెను.

## కృష్ణార్జునుల మహిమ

దుర్యోధనా! రాజా! కృష్ణార్జునుల మహిమను, వారి యథార్థ తత్త్వమును గూర్చి నీవు నన్నడిగితివి. చెప్పెద వినుము.

రాజా! నరనారాయణ మహర్షులు మానవులుగా అవతరించిరి. వారు యుద్ధములలో ఎవరికిని ఓడని మహావీరులు. ఎవరు కూడ వారిని వధింపజాలరు. అట్లే పాండవులు కూడ శ్రీకృష్ణుని ప్రేమను సంపాదించినవారు కాబట్టి వారిని వధించుట అసాధ్యమని తెలిసికొనుము.

దుర్యోధనా! ఈ కారణములచేత నీవు శాంతి వహించి పాండవులతో

సంధి చేసుకొని ఇంద్రియవశము కలవాడవై సమస్త భూమండల సామ్రాజ్యమును సోదరులతో అనుభవింపుము. దేవదేవులు నరనారాయణ స్వరూపులైన శ్రీకృష్ణార్జునులను అవమానపరచినచో నీవు నశించెదవు.

ధృతరాష్ట్ర మహారాజా! మీ తండ్రియైన భీష్ముడు ఇట్లు ఉపదేశించి దుర్యోధనుని పంపి, శయనమునకు పోయెను. దుర్యోధనుడు కూడ ఆ మహాత్మునకు నమస్కరించి తన శిబిరమునకు పోయి శయనించెను.

విశ్వోపాఖ్యానము సమాప్తము.

(అరవైతొమ్మిదవ అధ్యాయము)

## పంచమ దివస యుద్ధము :

కౌరవులు మకర వ్యూహమును-పాండవులు శ్యేన వ్యూహమును నిర్మించుట

జనమేజయా! సంజయుడు ధృతరాష్ట్రునకు ఐదవనాటి యుద్ధవృత్తాంతము నిట్లు చెప్పదొడగెను.

రాజా! ఆ రాత్రి గడచి తెల్లవారి సూర్యోదయమైన తరువాత ఉభయ సేనలు యుద్ధసన్నద్ధము లాయెను. అవి పరస్పర జయకాంక్షతో క్రుద్ధములై యుద్ధమునకు పరిగెత్తెను. కౌరవ పాండవులు నీ దురాలోచన ఫలముగా పోరాడుటకు వ్యూహములు పన్నిరి. భీష్ముడు మకర (మొసలి) వ్యూహమును రక్షించుచుండెను.

రాజా! అది చూచి యుధిష్ఠిరుడు ధౌమ్యాచార్యుని యుపదేశముచేత శ్యేన (డేగ) వ్యూహము నిర్మించి శత్రువుల మనస్సులను కంపింపచేసెను. ధౌమ్యాచార్యుడు అగ్ని చిత్యాది యాగములందు శ్యేన వ్యూహమును గూర్చి బాగుగా నెరిగినవాడు.

రాజా! ద్రోణాచార్యుని యుపదేశము ప్రకారము మీవారు మకర వ్యూహమును నిర్మించిరి. దానిని భీష్ముడనుసరించి పెద్ద రథసేనతో యుద్ధమునకు సాగిపోయెను. ఆయన వెంటనే సైన్యములన్ని తరలిపోవుచుండెను.

రాజా! అది చూచి పాండవులు ఎవరికిని అలవికాని శ్యేనవ్యూహముచేత భాసిల్లుచసాగిరి. దాని ముఖముగా భీమసేనుడు నిలిచియుండెను. దానికి నేత్రములుగా శిఖండి-ధృష్టద్యుమ్నులుండిరి. శిరస్సుగా సాత్యకియుండెను. గాండీవములను ఆడించుచు అర్జునుడు ఆ శ్యేనమునకు మెడగా నిలచెను. ఆ దేగకు ఎడమ పక్షము (రెక్క)గా ద్రుపదుడు ఒక అక్షౌహిణీ సేనతో నిలచెను. కుడిరెక్కగా ఒక అక్షౌహిణీతో కైకేయుడు నిలిచెను. వెనుక భాగమందు ద్రౌపదీ పుత్రులు, అభిమన్యుడున్ను నిలిచిరి. అందరివెనుక యుధిష్ఠిరుడు నకుల సహదేవులతో నిలిచియుండెను.

రాజా! తరువాత భీముడు యుద్ధమునందు శత్రువుల మకర వ్యూహము యొక్క మొసలి ముఖము గుండా ప్రవేశించి, తిన్నగా భీష్ముని కడకుపోయి అతనిని బాణములతో కప్పివేసెను.

అంతట భీష్ముడు సైన్యముపై మహాస్త్రములు ప్రయోగించి మోహపరచెను ఆప్పుడు అర్జునుడు త్వరపడుచు వేయి బాణములతో భీష్ముని కొట్టెను. భీష్ముడు విడిచిన బాణములను ఖండించుచుండెను వారి సైన్యము హర్షించెను.

"రాజా! తరువాత దుర్యోధనుడు ద్రోణాచార్యునితో పూర్వము బలవంతులైన తన తమ్ముల వధను స్మరించుకొనుచు నిట్లనెను-

ఆచార్యా! నీవెల్లప్పుడు నా హితమును కోరుచుందువు. మేము నిన్ను భీష్మునిఆశ్రయించి దేవతలనుగూడ జయింపగోరుచున్నాము. ఇట్లుండగా పాండవులెంత? వారు మీ ముందు హీన పరాక్రములే కదా!

ధృతరాష్ట్ర మహారాజా! దుర్యోధనుని మాటలు విని కుపితుడై ద్రోణుడాతనితో నిట్లనెను.

"దుర్యోధనా! నీవు మూర్ఖుడవు. పాండవుల పరాక్రమము నెరుగజాలకున్నావు. నేను నీ కొరకు ఎంత బలపరాక్రమములను ప్రదర్శించినను మహాబలశాలులైన పాండవులను జయింపజాలినంత బలము చూపజాలకున్నాను".

ధృతరాష్ట్ర మహారాజా! నీ పుత్రునితో ద్రోణాచార్యుడిట్లు చెప్పి సేనలో ప్రవేశించి, సాత్యకి చూచుచుండగానే పాండవ సైన్యమును భేదించెను. సాత్యకి ద్రోణుని అడ్డగించెను. ఆ యిరువురకు ఘోర యుద్ధము జరిగెను. ద్రోణా

చార్యుడు నిశితశరముతో సాత్యకిని కొట్టెను అంతలో భీమసేనుడు క్రుద్ధుడై భారద్వాజుని (ద్రోణుని) సాత్యకిని రక్షించుచు కొట్టెను.

రాజా! తరువాత భీష్మ ద్రోణ శల్యులు భీమసేనుని బాణములతో కప్పిరి. అప్పుడు అభిమన్యు ద్రౌపదేయులు వారందరిని బాణములతో కొట్టిరి. ద్రోణ భీష్ములు వారి పైబడిరి. అప్పుడు శిఖండి మేఘ గంభీరధ్వనిగల ధనుస్సుతో బాణములచేత సూర్యమండలమును గప్పుచు శరవర్షము వారిపై గురిసెను.

రాజా! అప్పుడు భీష్ముడు శిఖండిని సమీపించి, యతని స్త్రీత్వమును స్మరించుచు దూరముగపోయెను. తరువాత ద్రోణుడు నీ పుత్రుడిచేత పురికొల్ప బడి భీష్మ రక్షణార్థమై, శిఖండిపైకి ఉరికెను. అప్పుడు శిఖండి ప్రళయాగ్నివలె జ్వలించుచున్న ద్రోణాచార్యునిచూచి భయపడి యుద్ధమునుండి విముఖుడాయెను.

రాజా! దుర్యోధనుడు మహాసైన్యముతో భీష్ముని రక్షణార్థమై యతనిని సమీపించెను. రాజా! అట్లే పాండవులుగూడ అర్జునుని ముందిడుకొని, భీష్ముని జయించవలెనని దృఢసంకల్పముతో ముందుకుసాగిరి. ఆ యుద్ధమప్పుడు పరస్పర జయేచ్ఛతో కీర్తికాంక్షతోను దేవదానవులకు జరిగినట్లు ఘోరముగా జరిగెను.

జనమేజయా! సంజయుడు ధృతరాష్ట్రునకు తరువాత యుద్ధవృత్తాంతము నిట్లు చెప్పదొడగెను.

డెబ్బదవ అధ్యాయము

## భీష్మ భీమసేనుల తుములయుద్ధము:-

రాజా! అప్పుడు భీష్ముడు, భీమసేన భయమునుండి నీ పుత్రులను రక్షింప గోరి భయంకరముగా తుములయుద్ధము చేసెను ఆనాటి పూర్వాహ్ణమునందు దొమ్మి యుద్ధము రాజ వీరులకు మహాఘోరముగా జరిగెను. దానిలో కౌరవ పాండవ ముఖ్యవీరులు నశించిరి. ఆ దొమ్మి యుద్ధములో ఆకాశము వ్యాపించు నంతటి మహాధ్వనికలిగెను. అది అతి భయంకరముగానుండెను. గజ ఘీంకార ములు గుర్రముల సకిలింపులు భేరీ శంఖ నినాదములున్ను ఏకమై ఆ ధ్వని మిన్ను ముట్టెను.

రాజా! ఉభయపక్షములవారు యథేచ్ఛతో పరాక్రమముచూపుతూ గోశాల లలో వృషభములవలె రంకెలువేయుచూ ఒండొరుల నామోచ్ఛారణముచేయుచు నిశిత శరములతో సైనిక శిరములను ఖండించుచుండగా ఆకాశమునుండి పాషాణ వర్షము కురియుచున్నదా యనునట్లు ఉండెను.

రాజా! బంగరు కుండలములు తలపాగలు ధరించిన శిరస్సులు నేలకూలు చుండెను. బాణములతో ఖండింపబడిన సైనికులు హస్తాభరణములతో ధనుస్సుం తోను తెగిపడి భూమిని ఆచ్ఛాదించిరి. వీరుల కవచ సహితావయవములు రక్త నేత్రములుగల చంద్రసమాన ముఖములు గజాశ్వ పదాతిదళముల సర్వావయవ ములను క్రిందపడి సమస్త భూమండలము వానితో పరచబడెను. ధూళియనెడు మేఘములు శస్త్రములనబడు విద్యుత్తులతో ఆయుధ ధ్వనులనెడు గర్జనములతోను గూడి అకాల వర్షాకాలము సంప్రాప్తమై నట్లుండెను.

రక్తజలముచేత వ్యాప్తమైన ఘోరయుద్ధము కుతూహలముగా కౌరవ పాండవ వీరులకు జరిగి శరవర్షము నిరంతరముగా కురిసెను. క్షత్రియ వీరులు ఆక్రోశించిరి. శర వర్షములచేత బాధపడిన ఏనుగులు గర్జిల్లెను. ఆ మహాధ్వనిచేత ఏమియు తెలియకుండెను. కబంధములు ఎగురుచుండగా అంతట రక్తజలములు గల యుద్ధరంగమునందు రాజవీరులు శత్రువధేచ్ఛతో అంతట పరుగెత్తుచుండిరి. బాణ, శక్తి, గదా, ఖడ్గాద్యాయుధములతో పరస్పరము చంపుకొను చుండిరి.

రాజా! గజారోహకులు అశ్వికులునుచచ్చి, ఆ వాహనములపై పడియుం డగా నవి యుద్ధభూమిలో నంతటను నిరంకుశముగా భ్రమించుచుండెను. నీవైపు వారివైపునున్న యోధుల భూషణాలంకృతావయవములు భీమ భీష్మ యుద్ధము లందు నలిగి రాశులు రాశులుగా పడియుండెను. కొందరు బాహుయుద్ధములు (కుస్తీలు) చేయుచు కూలిరి. ఇట్లు రాజా! యుద్ధభూమిలో నంతటను, ఘోర యుద్ధము తుములముగా జరిగెను. విరథులైన వీరులు ఖడ్గధారులై భూమియుద్ధము చేసిరి.

తరువాత దుర్యోధనుడు అనేక కళింగ సైన్యములతోకూడి, భీష్ముని ముందిడుకొని పాండవుల నెదిరించెను. అట్లే, పాండవులుకూడ వందరు భీమ

సేనుని ముందిడుకొని భీష్ముని ముట్టడించిరి. ఇట్లు ఘోరయుద్ధము వారికి జరిగెను.

తొంబదిఒక్కటవ అధ్యాయము

## భీష్మార్జునాది వీరుల తుముల యుద్ధము:-

జనమేజయా! సంజయుడు ధృతరాష్ట్రునకు ఆ తరువాతి యుద్ధ వృత్తాంతము నిట్లు చెప్పదొడగెను.

"రాజా! అట్లు భీష్మునితో పోరాడుచున్న సోదరులను, రాజవీరులనుచూచి అర్జునుడు భీష్ము నెదిరించెను. శ్రీకృష్ణుని పాంచజన్యధ్వని, అర్జునుని గాండీవ ధ్వనివిని. మనవారికందరికి భయముకలిగెను. జ్వలించుచున్న పర్వతమువలె, సింహముతోకవలె వృక్షములకు తగులకుండనుండు ధూమకేతువు(తోకచుక్క)వలె పైకిలేచి, బహువర్ణచిత్రితమైన అర్జునుని దివ్య వానరధ్వజమును చూచితిమి. ఆ ధ్వజము ఆకాశమునందు మేఘములమధ్య విద్యుత్తువలె వెలుగొందుచుండెను".

"రాజా! ఆవిధముగా వచ్చుచున్న గాండీవధారి సింహనాదమువింటిమి. అప్పుడు అదురునట్లుగా త్రొక్కిసలాడుచూ నీ సైన్యముండెను. అర్జునుడు, ప్రచండవాతముతో విద్యుత్తుతోను గర్జిల్లుచున్న మేఘమువలె శర (బాణములు. నీరు) వర్షము గురియుచు భీష్మునితాకెను. అప్పుడు అతనిని చూచుచున్న మేమందరము రాజా! మోహముచెంది, దిక్కుతెలియక యుంటిమి. అప్పుడు మీ సైనికులు, వాహనములు అలసిపోవగా, అశ్వములు చావగా, చైతన్యముడిగి, ఒండొరులను కౌగిలించుకొనుచు, భీష్ముని అండజేరిరి. అట్లే నీ పుత్రులుకూడ భీష్ముని ఆశ్రయించిరి".

"రాజా! అప్పుడు భీష్ముడు ఆర్తులైన ఆ వీరులకు ఆశ్రయమాయెను. గాండీవధ్వని వినిన రథికులు రథములనుండి, ఆశ్వికులు అశ్వపృష్ఠములనుండి, భూమియందు పదాతిదళములు భయముచేత ఎరిగిపడుచుండిరి. తరువాత రాజా! కాంభోజ అశ్వములతో, గోపాలకుల గోవృషభములతో, మద్ర, సౌవీర-గాంధార-త్రైగర్తులతో, కాళింగులతోనూ కళింగదేశాధిపతి, అనేక పదాతి దళములతో

దుశ్శాసనుని ముందిడుకొని సైంధవుడు, సర్వరాజ వీరులతో కలసివచ్చు చుండిరి. నీ పుత్రుని ప్రోత్సాహముచేత ఈ పదునాలుగు వేల సైన్యములు సైంధవునితో గూడుకొని, అర్జునుని, వేరువేరుగా పొదివికొట్టిరి".

"రాజా! చేది-కాశీ-దేశ పదాతిదళములతో, రథములతో పాంచాలురతో, సృంజయులతోగూడి పాండవులందరు ధృష్టద్యుమ్నుని ముందిడుకొని, ధర్మ పుత్రునిచేత ప్రోత్సాహితులై మీవారిని పొదివిరి. ఆ సేనలనుండి రేగిన దుమ్ము మేఘాకారముతో ఆకాశమునందు క్రమ్మెను. అప్పుడు ఘోరముగా యుద్ధము జరిగెను. అప్పుడు అనేకాయుధ ధారులైన వీర యోధులతో భీష్ముడు అర్జునుని తాకెను.

రాజా! అవంతిరాజు కాశీరాజుతో, సైంధవుడు భీమసేనునితో, యుధిష్ఠిరుడు మంత్రులతో, సోదరులతో పుత్రులతోనుగూడి శల్యునితో, వికర్ణుడు సహదేవునితో, శిఖండితో చిత్రసేనుడు, దుర్యోధనుడు మాత్స్యులతో, శకుని ద్రుపదునితో, సాత్యకి ద్రోణాశ్వత్థామలతో, కృప, కృతవర్మలు ధృష్టద్యుమ్నునితోను తలపడి పోరాడజొచ్చిరి.

రాజా! యుద్ధరంగమంతటను చతురంగ సైన్యములు భ్రాంతములై చెదురుచుండెను. అప్పుడు ఆకాశమునందు తీవ్రముగా విద్యుత్తులు వెలిగినట్లుండెను. కొరవులు గురియుచుండెను. ప్రచండముగా సుడిగాలివీచెను. దూళి గురిసెను. సేనాధూళిగ్రమ్మి సూర్యుడు అదృశ్యుడయ్యెను. ప్రాణులన్నింటికీ మోహము గల్గునంతగా నచట దుమ్ము-ఆయుధ సమూహములు గురిసెను. వీరులు ప్రయోగించిన బాణములు, అందరి కవచములను భేదించుచుండగా నపుడు మహాఘోరమైన తుముల యుద్ధము జరిగెను.

రాజా! అప్పుడు నక్షత్ర కాంతివంటి కాంతితో వెలుగొందుచున్న ఆయుధముల చేత ఆకాశమునందు ప్రకాశముకల్గెను. అంతట పడుచుండు యోధుల శరీరములు-శిరస్సులు అన్నిదిక్కుల వ్యాపించెను. అనేక మహారథములు, అశ్వములు, ధ్వజములు ఇరుసులు కాడిమ్రాకులు ధ్వంసములై పడిపోయెను. శస్త్రముల చేత గాయపడిన-రథాశ్వములు రథములను ఈడ్చుకొని పోవుచుండెను.

రాజా! అంతటను చచ్చిన మదగజముల మదజల దుర్గంధము వ్యాపించి, యుద్ధరంగము అసహ్యముగాయుండెను. గజారోహకులుచచ్చి గజములనుండి

పడుచుండిరి. గజములు యోధుల జుట్టుపట్టి యీడ్చుచూ చంపుచుండెను. అవి అట్లు లాగుచుండగా సరస్సులలో ఇంకిన తామర పూవులను లాగుచున్నట్లుండెను. రాజా! యీవిధముగా ఆ దొమ్మి పోరాటములో యుద్ధభూమి సందులేకుండా సేనలు పడియుండెను.

డెబ్బదిరెండవ అధ్యాయము

## ఉభయసైన్యముల పరస్పర తుముల యుద్ధము:-

జనమేజయా! సంజయుడు ధృతరాష్ట్రునకు ఐదవనాటి తరువాతి యుద్ధ వృత్తాంతమిట్లు చెప్పదొడగెను:-

రాజా! విరాటరాజుతోకలసి శిఖండి దుర్జయుడైన భీష్ముని ఎదురించెను. అట్లే అర్జునుడుకూడ ద్రోణాది వికర్ణాది మహావీరులను అనేకులను పొదివెను. భీమసేనుడు, దుర్యోధన సైంధవాదులను ముట్టడించెను. సహదేవుడు శకుని ఉలూకుడు అను తండ్రికొడుకులను తాకెను. యుధిష్ఠిరుడు గజ సైన్యముతో నీ కొడుకులతో యుద్ధమునకు పూనుకొనెను. నకులుడు త్రిగర్త సైన్యములతో యుద్ధము చేయుటకువచ్చెను సాత్యకి, అభిమన్యుడు ధృష్టకేతువు, ఘటోత్కచుడు నకులపుత్రుడైన శతానీకుడు వీరందరుకలిసి నీ పుత్రుల రథ సైన్యములను అడ్డగించిరి. సేనాపతియైన ధృష్టద్యుమ్నుడు, వీరాగ్రేసరుడైన ద్రోణాచార్యునితో పోరాడుటకు పూనుకొనెను.

రాజా! ఈ విధముగా, మీ యోధవీరులు పాండవులతో యుద్ధముచేసిరి. ఆనాడు సూర్యుడు, మధ్యందినగముడై మధ్యాహ్నముకాగా, కౌరవ పాండవ వీరులు పరస్పరము వధించుకొనజొచ్చిరి.

వ్యాఘ్ర చర్మము కప్పబడిన అనేక రథములు రణాంగణమునందు తిరుగుచుండెను. వీరులు జయేచ్ఛతో బిగ్గరగా సింహనాదము చేయుచుండిరి. కౌరవ సంజయులు అతి భయంకరముగా, పరస్పరము పోరాడుచుండిరి. భూమ్యాకాశము లందంతటను బాణములునిండి, ఆకాశము, దిక్కులు, సూర్యుడు కనపడకుండ పోయెను.

శక్తితోమర ఖడ్గాద్యాయుధములయొక్క నల్లకలువలవంటి కాంతులు అంతటను ప్రసరించెను. విచిత్రములైన కవచ భూషణములయొక్క కాంతులు అన్ని దిక్కులు వెలుగొందెను. చంద్ర సూర్యకాంతులుగల రాజుల శరీరములు రణరంగమునందు విరాజిల్లెను. యుద్ధభూమియందు ఒండొరులను ఎదిరించుచున్న వీరులు ఆకాశమునందు గ్రహములవలె ప్రకాశించిరి.

రాజా! భీష్ముడు, సైనికులందరు చూచుచుండగా, భీమసేనుని పొడిచెను. ఆయన విడిచిన బాణములు భీమునకు గ్రుచ్చుకొనెను. అవి పాషాణములపై ఒరపిడి చేయబడి, నూనెతో కడుగబడినవి గనుక మిక్కిలి పదునైనవిగా ఉండెను. భీముడు సర్పమువంటి శక్తిని, భీష్మునిపై ప్రయోగించెను. దానిని భీష్ముడు, వచ్చుని భల్లముచేత ఛేదించి మరియొక భల్లముతో భీముని ధనుస్సును ఖండించెను. మరియొక ధనుస్సు తీసికొని భీముడు భీష్మునిపై శరవర్షముకురిసెను.

రాజా! తరువాత సాత్యకి భీష్మునిపైకివచ్చి అనేక బాణములను కర్ణాంతము వరకు లాగి ప్రయోగించెను. అప్పుడు భీష్ముడు, పదునైన బాణముతో సాత్యకి సారథిని రథమునుండి పడగొట్టెను. సారథి చచ్చుటతో రథాశ్వములు చెదరి పరుగెత్తజొచ్చెను. అప్పుడు పాండవసేనలో హాహాకారములు బయలు వెడెను. పరుగెత్తుడు, అశ్వములను పట్టుకొనుడు, సాత్యకి రథమును కాపాడుడు అని పాండవ సైనికులు అరచిరి.

రాజా! ఇంతలోనే, భీష్ముడు పాండవసేనను, రాక్షససేనను ఇంద్రుడు వలె వధింపజొచ్చెను. అట్లు వధింపబడుచున్న పాంచాల సోమక వీరులు స్థిరముగా భీష్ముని ఎదుర్కొనజొచ్చిరి. ధృష్టద్యుమ్నాది వీరులుగూడ మీ సేనను చుట్టుముట్టిరి. అట్లే భీష్మద్రోణాది కౌరవ వీరులుకూడ ముందుకు సాగుచుండిరి.

జనమేజయా! సంజయుడు కౌరవ పాండవసేనల తుముల యుద్ధమును గూర్చి ధృతరాష్ట్రునకు వర్ణించిచెప్పి తరువాతి యుద్ధ వృత్తాంతమిట్లు చెప్పదొడగెను.

తొంబదిమూడవ అధ్యాయము

## ఉభయవీరుల ద్వంద్వ యుద్ధములు:-

రాజా! విరాటరాజు మూడు బాణములతో భీష్మునికొట్టి, మరి మూడు బాణ

ములతో అతని రథాశ్వములను కొట్టెను. అంతట భీష్ముడు, పది బాణములతో విరాటుని తిరిగి కొట్టెను.

అశ్వత్థామ ఆరు బాణములతో అర్జునుని యెదపైకొట్టెను. అప్పుడు, అర్జునుడు, అశ్వత్థామ ధనుస్సును ఛేదించి అతనిపై బాణ ప్రయోగముచేసెను. అతడు మరియొక ధనుస్సు తీసికొని అర్జునుడు తన ధనుస్సును ఖండించుటను ఓర్వజాలక తొంబది బాణములను అర్జునునిపై ప్రయోగించెను. శ్రీకృష్ణుని డెబ్బది బాణములతోకొట్టెను. అప్పుడు కృష్ణార్జునులు క్రోధావిష్టులైరి. అర్జునుడు చింతించుచు, గట్టిగా ఎడమచేత గాండీవమునుపట్టుకొని, ప్రాణాంతకములైన నిశితశరములను అశ్వత్థామపై విడిచెను. దానిచేత, అతని కవచము ఛిన్నమై, శరీరము రక్తసిక్తమయ్యెను. అయినను, అశ్వత్థామ ఏమాత్రము వ్యథచెందక అర్జునునిపై బాణప్రయోగము చేయుచు భీష్మరక్షణార్థమై నిలిచెను.

రాజా! అట్లు మహాద్భుతముగా పోరాడుచున్న అశ్వత్థామను మీ వీరులందరు ప్రశంసించిరి. కృష్ణార్జునులతో, నిలిచి యుద్ధముచేయగలవాడు అశ్వత్థామయే అని వారు తలచిరి. అర్జునుడుగూడ అందరు వినుచుండగా అశ్వత్థామను ఈ విధముగా ప్రశంసించెను:-

"ఈ నా ఆచార్యపుత్రుడు, తండ్రినుండి అనేక అస్త్రములను ప్రయోగోపసంహారపూర్వకముగా నేర్చినవాడు విశేషించి బ్రాహ్మణుడు కాబట్టి నాకు పూజనీయుడు".

రాజా! ఇట్లు తలచి అర్జునుడు, అశ్వత్థామపై దయజూపి, అతనిని విడిచి, ఇతరులతో యుద్ధము చేయుటకుపోయెను.

రాజా! దుర్యోధనుడు, పది బాణములతో భీమసేనునికొట్టెను. భీముడు క్రుద్ధుడై, తిరిగి పది బాణములను అతనిపైవిడిచి బంగారు సూత్రముతో కట్టబడిన యతని మణిహారమును త్రెంచి పారవేసెను. భీమసేన తాడితుడైన నీ కొడుకు ఆకాశమునందు ప్రకాశించుచున్న గ్రహాధిపతియైన సూర్యునివలె భాసిల్లెను. అప్పుడు సర్పమువలె బుసకొట్టుచు భీముని బాణములతో కొట్టెను. పాండవసైన్యము భయపడెను. అట్లు పోరాడుచున్న నీ ఇరువురు కొడుకులు శోభిల్లిరి.

రాజా! అభిమన్యుడు, చిత్రసేనుని పది బాణములతో ఏడింటితో పురు

మిత్రుని, డెబ్బది బాణములతో భీష్మునికొట్టి ఇంద్రసమాన తేజస్సుతో యుద్ధ భూమియందు నృత్యముచేయుచు అందరిని పీడింపజొచ్చెను. అప్పుడతనిపై చిత్ర సేనుడు పది, భీష్ముడు తొమ్మిది పురుమిత్రుడు ఏడు బాణములు విడిచిరి.

అప్పుడు రాజా! అభిమన్యుడు చిత్రసేనుని ధనుస్సు, కవచము ఖండించి, అతని యెదపై బాణములతో కొట్టెను. తరువాత మీ వీరులందరు ఒకటిగా చేరి, నిశిత శరములతో అభిమన్యుని కొట్టిరి. అతడు ఆ బాణములన్నింటిని ఛేదించెను. అది చూచి, నీ పుత్రులు అతనిని చుట్టుముట్టిరి. అప్పుడభిమన్యుడు మీ సైన్యమును గడ్డి వామిని అగ్నివలె దహించుచు, గ్రీష్మకాలమునందు మండుచున్న అగ్నివలె ప్రకాశించెను.

రాజా! అట్లు విజృంభించిన అభిమన్యునితో నీ మనుమడు లక్ష్మణుడు తలపడి పోరాడెను. అభిమన్యుడు, లక్ష్మణుని ఆరు బాణములతో, అతని సారథిని మూడు బాణములతో కొట్టెను. అట్లే లక్ష్మణుడుకూడ అభిమన్యుని తిరిగికొట్టెను. రాజా! నీ మనుమల మధ్య యుద్ధము అత్యద్భుతముగ నుండెను.

రాజా! తరువాత అభిమన్యుడు లక్ష్మణుని రథాశ్వములను సారథిని చంపి, అతనిని తరిమెను. లక్ష్మణుడు హతాశ్వమైన రథమునందుండి అభిమన్యునిపై శక్తిని విసిరెను. తనపై పడుచున్న ఘోరశక్తిని అభిమన్యుడు ఛేదించెను.

తరువాత కృపాచార్యుడు, లక్ష్మణుని తన రథముపై నెక్కించుకొని సైనికులందరు చూచుచుండగా, తొలగించుకొని పోయెను.

"రాజా! తరువాత మీ వారు పాండవసైనికులు పరస్పర వధేచ్ఛగలవారై యుద్ధాగ్నిలో ప్రాణములను హోమముచేయుచు ఒండొరులను చంపుకొను చుండిరి. సృంజయులు కురుసేనలతో బాహుయుద్ధము చేసిరి.

తరువాత రాజా! భీష్ముడు, అతి క్రోధముతో దివ్యాస్త్రములచేత పాండవ సైనికులను సంహరించెను. హతములైన చతురంగ సైన్యములు యుద్ధభూమి యంతట వ్యాపించియుండెను.

జనమేజయా! సంజయుడిట్లు వీరుల ద్వంద్వయుద్ధములనుగూర్చి వర్ణించి ధృతరాష్ట్రునకు చెప్పి, తరువాతి యుద్ధవృత్తాంతమును ఇట్లు చెప్పదొడగెను.

డెబ్బదినాల్గవ అధ్యాయము

## సాత్యకి-భూరిశ్రవుల యుద్ధము:-

రాజా! మహాబాహు పరాక్రమశాలియైన సాత్యకి, సర్పములవంటి బాణములను విడుచుచు, మీ సైనికులకు భయోత్పాతము కలిగించెను. అతని హస్త లాఘవము అతి విచిత్రమైనది సాత్యకి, అర్జునుని శిష్యుడు కాబట్టి, అర్జునుని నుండి నేర్చుకొనిన అస్త్రవిద్యా కౌశలమును ప్రదర్శించుచు బాణములను అతి వడిగా, మేఘము వర్షించునట్లు ప్రయోగించుచుండెను.

రాజా! అట్లు విజృంభించుచున్న 'సాత్యకినిచూచి దుర్యోధనుడు పది వేల రథములను సాత్యకిపై పంపెను. సాత్యకి దివ్యాస్త్రములచేత ఆ రథములనన్నింటిని కొట్టెను.

రాజా! తరువాత సాత్యకి ధనుర్ధారియై భూరిశ్రవుని సమీపించెను. సాత్యకి చేత ధ్వస్తమైన మీ సేననుచూచి, భూరిశ్రవసుడు, మిక్కిలి క్రుద్ధుడై సాత్యకికి ఎదురుగానుండి అతనిపై వేలకొలది బాణములను ప్రయోగించెను. ఆ దెబ్బతో సాత్యకి సైనికులు తాళలేక, సాత్యకిని విడిచి పరుగెత్తిపోయిరి.

రాజా! భూరిశ్రవసుని ఘోరపరాక్రమముచూచి, మహాబలశాలురైన పదుగురు సాత్యకి కొడుకులు భూరిశ్రవసుని ఎదిరించి, ఇట్లనిరి. కౌరవవీరా! మా అందరితోగాని, మాతో ఒక్కొక్కరితోగాని పోరాడుము. నిన్ను మేము ఓడించెదము.

ఇట్లు సాత్యకి పుత్రులు చెప్పగావిని, యూపధ్వజుడైన భూరిశ్రవసుడు "రండు మిమ్ము వధించెదను" అని యనెను. అంతట భూరి శ్రవసునిపై సాత్యకి పుత్రులు శరవర్షము కురిపించుచు ఎదిరించిరి.

ఆ యపరాహ్ణమునందు మహాతుముల యుద్ధము వారికి జరిగెను. ఒక్క రథికుని పదుగురుచేరి కొట్టజొచ్చిరి. వర్షాకాలమునందు మేరు పర్వతముపై మేఘములు వర్షించునట్లు వారు, అతనిపై బాణవర్షము కురిపిరి.

యమదండములవలె వచ్చుచున్న ఆ బాణములను భూరి శ్రవసుడు నడుమనే ఛేదించెను. అప్పుడు. సోమదత్తపుత్రుడైన భూరి శ్రవసుడు చూపిన పరా

క్రమము మహాద్భుతముగనుండెను. ఎందుకనగా, అనేకులతో అతడు ఒక్కడే పోరాడవలసి వచ్చెను.

రాజా! ఇట్లు సాత్యకి పుత్రులు శరవర్షముకురిపి భూరిశ్రవసుని సంహరింప దలచిరి. అప్పుడు ఆ వీరుడు క్రుద్ధుడై ఆ పదుగురి ధనస్సులను ఛేదించెను. వారి ధనుస్సులు విరిగిన తరువాత ఆ పదుగిరి తలలనుగూడ భూరిశ్రవసుడు నరకెను. దానితో వారు పిడుగుపడిన వృక్షములవలె చచ్చి క్రిందపడిరి.

రాజా! అట్లు చచ్చిపడియున్న పుత్రులనుచూచి, సాత్యకి బిగ్గరగా అరచి భూరి శ్రవసునిపైకి ఉరికెను. ఆ ఇరువురు పరస్పర రథాశ్వములనుచంపిరి. అట్లు విరథులై సాత్యకి భూరి శ్రవసులు ఖడ్గయుద్ధము చేయుటకు ఆరంభించిరి. ఖడ్గములతో ఒండొరులను కొట్టుకొని పీడితులైరి. శరీరములనుండి రక్తము స్రవిం చుచుండగా పుష్పించిన మోదుగులవలె వారు శోభిల్లిరి.

రాజా! తరువాత భీమసేనుడు త్వరగావచ్చి ఖడ్గధారియైన సాత్యకిని తన రథముపై నెక్కించుకొనెను. నీ కొడుకు దుర్యోధనుడుకూడ భూరి శ్రవసుని తన రథముపై నెక్కించుకొనెను.

రాజా! అట్లు ఘోరయుద్ధము సాగుచుండగా, పాండవులు సంరంభముతో భీష్ము నెదుర్కొని పోరాడిరి. ప్రొద్దుగ్రుంకుచుండగా అర్జునుడు, ఇరువది యైదు వేల మహారథికులను సంహరించెను. వారందరు దుర్యోధనుతో పురికొల్పబడి, అర్జునుని చంపుటకువచ్చి, అర్జునాగ్నిలో శలభములైరి.

రాజా! తరువాత ధనుర్వేద విశారదులైన మాత్స్యకేకయ వీరులు అర్జునా భిమన్యులకు బాసటగావచ్చిరి. అంతలోనే సూర్యుడు, అస్తమించుచుండెను. సైనికులందరు మోహముజెందిరి. రాజా! అప్పుడు నీ తండ్రి భీష్ముడు ఆ ఐదవ నాటి యుద్ధ సమాప్తిని ప్రకటించెను. తరువాత అందరుకలిసి తమ తమ శిబిర ములకు పోయి విశ్రాంతి తీసికొనిరి

జనమేజయా! సంజయుడిట్లు ధృతరాష్ట్రునకు ఐదవనాటియుద్ధక్రమమును చెప్పి, తరువాతి యుద్ధ వృత్తాంతము ఇట్లు చెప్పదొడగెను.

## ఆరవనాటి యుద్ధము :

డెబ్బదిఐదవ అధ్యాయము

## పాండవ కౌరవులు మకర క్రౌంచవ్యూహములు నిర్మించుట:

రాజా! ఐదవనాటి రాత్రి గడిచిన తర్వాత ఆరవనాటి ఉదయమున మరల కురుపాండవులు యుద్ధమునకు పోవుటకు సన్నద్ధులగుచుండిరి. అప్పుడు చతురంగ సైన్యములను ఆయత్తపరచుటలో కల్గిన ధ్వనులు శంఖ దుందుభి స్వనములు కలసి మిన్ను ముట్టెను.

రాజా! తరువాత యుధిష్ఠిరుడు ధృష్టద్యుమ్ననితో "శత్రు నాశకరమైన మకరవ్యూహమును పన్నుము" అని చెప్పెను. తరువాత ధృష్టద్యుమ్నుడు రథిక వీరులతో మకరవ్యూహమును పన్నుడని ఆజ్ఞాపించగా వారు పన్నిరి.

రాజా! ఆ మకరమునకు శిరస్సుగా ద్రుపదుడు, అర్జునుడున్ను నిలిచిరి. కన్నులుగా నకులసహదేవులు, తుండముగా-భీమసేనుడు అభిమన్యుడు-ద్రౌపదీ పుత్ర ఘటోత్కచులు, యుధిష్ఠిర సాత్యకులు ఆ వ్యూహమునందు గ్రీవా (మెడ) స్థానమునందు ధృష్టద్యున్ను, విరాటులు దాని పృష్ఠభాగమునందు పెద్ద సేనలో నిలచిరి. ఐదుగురు కేకయసోదరులు వామపార్శ్వమునందు, ధృష్టకేతుచేకితానులు కుడివైపునను వ్యూహరక్షణమునకు నిలిచిరి. కుంతిభోజుడైన శతానీకుడు మహా సేనతో ఆ వ్యూహమునందు పాదద్వయముగా నిలిచెను. శిఖండి, సోమక సేనలో ఇరావంతుడున్ను ఆ మకరమునకు పుచ్ఛముగా నిలిచిరి.

రాజా! యీ విధముగా పాండవులు మకరవ్యూహమును పన్ని సూర్యోదయము వరకు యుద్ధసన్నద్ధులై చతురంగబలముతో కౌరవసేన నెదుర్కొనిరి. ధ్వజచ్ఛత్ర శస్త్రములు మెరయుచుండగా ముందుకుసాగి వచ్చుచున్న పాండవ సేననుచూచి, రాజా! నీ తండ్రి భీష్ముడు, మకర వ్యూహమునకు ప్రతి వ్యూహముగా క్రౌంచ వ్యూహమును నిర్మించెను.

రాజా! ఆ క్రౌంచపక్షి తుండమునందు ద్రోణాచార్యుడు నిలిచెను. కృపాశ్వత్థాములు కన్నులుగా, కాంభోజ బాహ్లీక సేనలతో కృతవర్మ క్రౌంచ శిరస్సుగా, దాని గ్రీవగా శూరసేనుడు-అనేక రాజవీరులతో నీ పుత్రుడు దుర్యోధను

దున్ను నిలిచిరి. ప్రాగ్జ్యోతిషపతియైన భగదత్తుడు, మద్ర సౌవీర సైనికికులతో ఆ పక్షివక్షముగా నిలచెను. ప్రస్థలాధిపుడైన సుశర్మ తన సేనతో ఆ పక్షి వామ పక్షముగా, తుషార-యవన-శక-చూచుక సైనికులు కుడిపక్షముగాను నిలచిరి. శ్రుతాయువు-శతాయువు సోమదత్తుడున్ను భూరిశ్రవుడున్ను క్రౌంచవ్యూహము యొక్క జఘన (పిరుదు) స్థానమునందు నిలిచిరి.

రాజా! ఇట్లు మకర క్రౌంచవ్యూహములు పన్ని కౌరవ పాండవులు యుద్ధమునకు బయల్వెడలిరి. ఇరుపక్షములవారికి మహయుద్ధము జరిగెను. గజసైనికులు రథికులను రథికులు గజములను. అశ్వికులను రథికులు రథికులను అశ్వికులున్ను ఇట్లు వివేచనారహితముగా పోరాడజొచ్చిరి

రాజా! భీమార్జున నకుల సహదేవులచేత రక్షింపబడుచున్న పాండవసేన, నక్షత్రములచేత ఆకాశమువలె శోభిల్లెను అట్లే భీష్మ ద్రోణ కృప శల్య దుర్యోధనాదులచే రక్షింపబడుచున్న మీ సేన గ్రహములచేత ఆకాశమువలె శోభిల్లెను.

రాజా! తరువాత భీమసేనుడు ద్రోణాచార్యునిపై దాడిచేసెను. ద్రోణుడు భీముని తొమ్మిది బాణములతో కొట్టెను. అట్లు మర్మములందు కొట్టబడిన భీముడు ద్రోణసారథిని వధించెను. అప్పుడు ద్రోణుడు స్వయముగా రథాశ్వములను తోలుచు పాండవసేనను అగ్ని దూదిపింజలనువలె నశింపజేయుచుండెను. భీష్మ ద్రోణులచేత కొట్టబడుచున్న సృంజయ కేకయులు పరుగెత్తిపోయిరి.

రాజా! అట్లే మీసేనగూడ భీమార్జునులచే దెబ్బతిని అక్కడి కక్కడనే మదమత్తయైన అంగనవలె మోహముచెందెను. అట్లు వీరులు నశింపగా ఉభయ వ్యూహములు భీతిల్లి బెదరెను. అప్పుడు ఇరుసేనలు కలిసిపోయి సంకుల సమరమునకు పూనుకొనిరి. ఒక స్థలమునందేనిల్చి పరస్పరము కౌరవ పాండవ సైనికులు పోరాడదొడగిరి. ఆ యుద్ధముచూచువారలకు అత్యద్భుతముగా కనపడుచుండెను.

## దెబ్బదియారవ అధ్యాయము

### ధృతరాష్ట్రుని చింత :

జనమేజయా! అట్లు సంజయుడు చెప్పగావిని ధృతరాష్ట్రుడతనితో నిట్లనెను:- సంజయా! ఈ విధముగా బహుగుణ సంపన్నము, అనేక విధము, అమో

షము నైన సైన్యవ్యూహము శాస్త్రసమ్మతముగా నింతకుపూర్వము రచింపబడి నట్లు కని విని యెరుగను. ఈ మా సైన్యము మా కోరికలకు అనురూపముగా నున్నది. ఈ సేన పరాక్రమము పూర్వము పరికింపబడినదే. అందరు సంతోష పూర్వకముగా పోరాడువారే. వారికి ఏ దుర్వ్యసనములు లేవు.

సంజయా! మా సేనలో అతి వృద్ధులుగాని, బాలకులుగాని, అతి కృశాంగులు గాని, అతిగా బలిసినవారుగాని, పొట్టివారు, మిక్కిలి పొడవైనవారుగాని లేరు. అందరుగూడ ఏ జబ్బులులేని మహాయోధులు. అనేక శస్త్రాస్త్ర విద్యా కోవిదులు. ఖడ్గ-బాహు గదా యుద్ధాది పండితులు. ప్రాస-ఋష్టి (రెండంచులకత్తి)తోమర-పరిఘ భిందివాల-శక్తి-ముసలాద్యాయుధ ప్రయోగములందు నిపుణులు.

యుద్ధవిద్యను ప్రత్యక్షముగా తెలిసినవారు మా వారందరు బాగుగా వ్యాయామము చేసినవారు. ముష్టియుద్ధములందు క్షిపణులను ప్రయోగించుట లోను సమర్థులు. చురుకుగా ఎక్కుట, ఎగిరి దుముకుట, ప్రాకుట ఆయుధ ప్రయోగము చేయుట ఈ మొదలైన వాటిలో మా సైనికులు నేర్పరులు. గజాశ్వ రథములను నడుపుటలో మంచి శిక్షణ పొందినారు. న్యాయము ప్రకారముగా అందరికినీ వేతనములు ఇవ్వబడుచున్నవి. బంధుప్రేమ, మిత్రప్రేమలతో ఎవరి యెడల పక్షపాత బుద్ధితో చూచుటలేదు. కులీనులు కానివారిని కొలువులో తీసి కొనుటలేదు. సంపన్నుని, పూజ్యుని, సంతుష్టమైన బంధుసంఘము కలవారిని, కీర్తి వంతులను, ఉపకారులను, అభిమానవంతులను, లోగడ పరీక్షింపబడిన కార్య చాతుర్యము కలవారిని, స్వజనులను, లోకపాల సమానులను మాత్రమే మా సేనలో తీసికొనినారు.

సంజయా! మా సైన్యము ప్రసిద్ధులైన అనేక క్షత్రియులచేత రక్షింప బడుచున్నది. స్వేచ్ఛగా మావైపు వచ్చిన బలవంతులనే సేనలో చేర్చుకొని నాము. మా సేన, వివిధ సేనలతో నిండిన మహాసముద్రమువలె, అంతటను వ్యాపించియున్నది. మా గజాశ్వరథములు రెక్కలులేని పక్షులవలె భాసిల్లుచున్నవి మా సేనా సముద్రము భయంకరమైన అనేక యోధ జల వాహన తరంగ సము జ్జ్వలము అనేక శస్త్రాస్త్ర సమాకులమై ధ్వజభూషణములు గలిగి రత్నాకరము వలె అపారముగా గర్జించుచున్నది.

సంజయా! భీష్మ, ద్రోణ, కృతవర్మ, కృప, దుశ్శాసన, జయద్రథ,

భగదత్త, వికర్ణ, అశ్వత్థామ, సౌబల, బాహ్లికాది మహావీరులచేత రక్షింపబడు చున్నది. వారందరు మహాత్ములు, బలవంతులు.

సంజయా! ఇట్టి మహాబలోపేతమైన, మా సైన్యము యుద్ధమునందు చంప బడినదనగా, దానికి దైవ ప్రాతికూల్యమే కారణము. ఇట్టి మా ప్రయత్నమును మానవులు, ఋషులు, కనులార చూచియేయున్నారు. సర్వాస్త్రసంపన్నమైన ఇటు వంటి మా సైన్యము యుద్ధమునందు వధింపబడుటకు దైవ ప్రాతికూల్యము తప్ప మరి ఏ కారణము కలదు?

సంజయా! ఇట్టి కౌరవ మహాసేన పాండవసేనను ఓడించలేదనగా, ఇది నాకు అత్యంత విపరీతముగా తోచుచున్నది. పాండవులకొరకు దేవతలే యుద్ధ ములో వచ్చి మా సైన్యమును వధించుచున్నారనుట నిశ్చయము.

సంజయా! పూర్వము విదురుడు హితమును, పథ్యమును బోధించు చుండెను. కాని దానిని మందబుద్ధియైన నా పుత్రుడు దుర్యోధనుడు గ్రహించ లేదు దానికి కారణము ఈ విధముగా జరుగుటకు దైవనిర్ణయమని నా నిశ్చ యము. కనుక సంజయా! దైవము నిర్ణయించినట్లు కావలసినది కాకమానదు.

జనమేజయా! ఇట్లు ధృతరాష్ట్రుడు చెప్పిన మాటలు విని సంజయుడు ఆ రాజుతో నిట్లనెను:

## తొంబదియేడవ అధ్యాయము

## ద్రోణ, భీమ, ధృష్టద్యుమ్నుల పరాక్రమము:

రాజా! నీ దోషము వలననే నీకు, ఇటువంటి వ్యసనము సంప్రాప్తమైనది. ధర్మ సాంకర్యమువలన సంభవించు దోషములను నీవు చూచినంతగా దుర్యోధ నుడు చూడలేదు. అతనిని నిందించి ప్రయోజనములేదు. నీ దోషమువలననే పూర్వము ద్యూత ప్రసంగము కలిగినది. పాండవులతో యుద్ధము సంభవించి నది. నీవుచేసిన పాపపు ఫలమునే ఇప్పుడు నీవనుభవించుచున్నావు. లోకములో మానవుడు తానుచేసిన కర్మపు ఫలమును తానే అనుభవించును. ఈ ఫలాను భవము పరలోకమునందుగూడ పొందక తప్పదు.

రాజా! కావున, నీకు సంప్రాప్తమైన వ్యసనమును తలంచుచు స్థిరుడవై యుండి నేను యథాతథముగా చెప్పబోవు యుద్ధ వృత్తాంతమును వినుము.

రాజా! భీమసేనుడు పదునైన బాణములచేత, నీ మహాసేనను ఛేదించి దుర్యోధనుని తమ్ములందరిని ఎదుర్కొనెను. క్రుద్ధులై నిలిచియున్న దుశ్శాసన, దుర్విషహ దుస్సహ దుర్మదాదులైన నీ పుత్రులందరిని చూచి, భీష్మ పరిరక్షిత మైన మహాసేనలో ప్రవేశించెను.

రాజా! అట్లు ప్రవేశించిన భీముని మీ రాజవీరులందరు జీవముతోనే పట్టి బంధింపవలెనని చుట్టుముట్టిరి. అప్పుడు సోదరులతో కలిసిన భీముడు, ప్రజా సంహారార్థము క్రూరములైన మహాగ్రహములతో కూడిన సూర్యునివలె సైన్య మధ్యములో దూరెను. అప్పుడు పాండవసైన్యములు భయరహితములయ్యెను. దేవదానవ యుద్ధమునందు దేవతలందరు ఇంద్రుని ప్రాపు చేరినట్లు పాండవ సేనలు భీముని ఆశ్రయించెను.

రాజా! శతసహస్ర సంఖ్యాకులైన మీ రథికులు, సాయుధులై భీముని ఒక్కనిని అంతటను చుట్టుముట్టిరి. అప్పుడు భీముడు ధార్తరాష్ట్రుల చతురంగ బలములను సంహరించుచుండెను. తనను పట్టి బంధింపదలచుచున్న శత్రువుల ప్రయత్నమును తెలిసికొని భీముడు అందరిని ఒక్కసారిగా వధించుటకు కృత నిశ్చయుడయ్యెను.

రాజా! అట్లు నిశ్చయించి భీముడు గదాపాణియై రథమునుండి ఎగిరి దుమికి మహాసముద్రమువలె నున్న ధార్తరాష్ట్ర సైన్యమును కొట్టెను. భీమగదా తాడితములైన గజముల కుంభస్థలములు వీపులు, అవయవములు పగిలి గజా రోహకులతో పాటు గజములు పర్వతముల వలె నేలకు ఒరిగిపోయెను.

రాజా! ఆ విధముగనే రథములు రథికులతోపాటు, నుగ్గునుగ్గుగా చూర్ణములై పడిపోయెను అశ్వికులతోపాటు అశ్వములు, పదాతిదళములు హత మారుచుండెను.

రాజా! ఈ విధముగా భీమసేనుడొక్కడే యుద్ధమునందు అద్భుతపరాక్ర మము ప్రదర్శించుచుండెను. అతడు ప్రళయాంతమునందు దండపాణియైన యముడు ప్రజాసంహారము చేసినట్లుగా, ధార్తరాష్ట్రసేనను మట్టుబెట్టుచుండెను.

రాజా! అట్లు భీముడు సేనాప్రవేశముచేసి విజృంభించుచుండగా ధృష్ట ద్యుమ్నుడు ద్రోణుని విడిచి శకునిని ఎదుర్కొనెను. సమస్త సేనను అర్దగించుచు ధృష్టద్యుమ్నుడు శూన్యముగానున్న భీమసేనుని రథము చేరెను ఆ రథము నందున్న భీముని సారథి విశోకుడను వానిని చూచెను. దుఃఖించుచు ధృష్టద్యు మ్నుడు విశోకుని నా ప్రాణప్రియుడైన భీముడెక్కడ? అని యడిగెను. అప్పుడు విశోకుడు ఇట్లు చెప్పెను.

మహావీరా! భీమసేనుడు నన్నిక్కడ నిలిపి మహాపరాక్రమముతో ధార్త రాష్ట్రసేనా సముద్రమును ప్రవేశించెను అయన పోవునప్పుడు నాతో సారథీ అశ్వములను ఆపి నేను వచ్చుదాక ఇచ్చటనే వేచియుండుము. నన్ను చంపుటకు వచ్చిన శత్రువీరులను చంపి వచ్చెదను అని నాతో చెప్పి గదాహస్తుడై భీమసేనుడు ఆ మహాసైన్యములో ప్రవేశించెను. అప్పుడు సర్వసైన్యములు సంతోషముతో ముప్పొంగెను. అతి భయంకరముగా జరుగుచున్న తుములయుద్ధములో శత్రు వ్యూహమును చీల్చుకొని భీముడు సేనలో దూరెను.

రాజా! ఇట్లు విశోకుడు చెప్పగా విని ధృష్టద్యుమ్నుడు అతనితో నిట్లనెను.

సారథీ! ఇప్పుడు నేను జీవించి ప్రయోజనము లేదు. రణరంగమునందు భీముని ఒంటరిగా విడిచి పాండవులయెడల స్నేహము విసర్జించి భీముడు లేకుండ నేను తిరిగిపోయినయెడల క్షత్రియవీరులందరు నన్నేమవెదరు? ఒంటరిగా నిలిచి యున్న భీమునకు సహాయము చేయకుండ నేను తిరిగిపోయినచో ఇంద్రాది దేవ లు నాకు అశుభము చేసెదరు.

విశోకా! మహాబలశాలియైన వాడు భీమసేనుడు. అతనియెడల నేను భక్తి గలవాడను. కనుక నేనిప్పుడే భీమునకు సహాయకుడుగా పోయెదను. రాక్షసులను ఇంద్రుడువలె శత్రువులను సంహరించుచున్న నన్ను చూడుము.

ధృతరాష్ట్ర మహారాజా! ధృష్టద్యుమ్నుడీ విధముగా చెప్పి భీముడున్న చోటికి పోయెను. అప్పుడు భీముడు శత్రుసేనను దహించుచు మహాప్రభంజనము వృక్షములను వలె శత్రువులను నిర్మూలించుచుండెను. అట్లు చంపబడుచున్న

చతురంగబలములు ఆర్తనాదము చేయుచుండెను. శత్రుసైన్యములో హాహాకారములు బయలుదేరెను.

రాజా! తరువాత అస్త్రవిద్యాపారంగతులైన మీ వీరయోధులు భీమసేనుని నిర్భయముగా చుట్టుముట్టి అతనిపై శస్త్రవర్షము గురిపించిరి అట్లు శత్రువులతో పోరాడుచున్న భీమసేనుని కడకు ధృష్టద్యుమ్నుడు పోయి పాదచారిగనున్న అతనికి ఆశ్వాసము కలిగించెను. అతడప్పుడు గదాహస్తుడై ప్రళయకాలయముని వలె నుండెను. ధృష్టద్యుమ్నుడు పోయి పాదచారిగనున్న అతనికి అశ్వాసము కలిగించెను. అతడప్పుడు గదాహస్తుడై ప్రళయకాలయమునివలె నుండెను. ధృష్టద్యుమ్నుడు భీమసేనుని శరీరమునుండి శల్యములను ఊడదీసి తన రథమెక్కించుకొని అతనిని ఆలింగనము చేసికొనెను. దానితో భీముడు ఊరడిల్లెను.

రాజా! అప్పుడు దుర్యోధనుడు ఆ మహాయుద్ధమునందు తమ్ములకడకు వచ్చి ఇట్లనెను

దురాత్ముడైన ఈ ధృష్టద్యుమ్నుడు భీమసేనునకు సహాయకుడుగా వచ్చెను. మనమందరము కలసిపోయి వారిని ఎదిరింతము.

రాజా! దుర్యోధనుని చేత పురికొల్పబడిన అతని తమ్ములు ఆయుధధారులై యుగాంతమునందు ధూమకేతువులవలె ఆ ఇరువురిపై బడిరి. అప్పుడు తాకిడి చేత భూమి కంపించెను. ద్రుపదపుత్రునిపై శరవర్షమును మేఘములు జలమును వలె వారు నిరంతరము కురిసిరి.

రాజా! అప్పుడు ధార్తరాష్ట్రులను ధృష్టద్యుమ్నుడుకూడ నిశిత బాణముల చేత కొట్టెను. వారిపై ప్రమోహనాస్త్రమును ప్రయోగించెను దానిచేత వారు తెలివిదప్పి మూర్ఛిల్లిరి అట్లు పడియున్న నీ పుత్రులకు సహాయకములుగా చతురంగసైన్యములు వచ్చి తెలివిదప్పి ప్రేతములవలె పడియున్న నీ పుత్రులను చూచెను.

రాజా! ఇంతలో ద్రోణాచార్యుడు ద్రుపదరాజును, మూడు బాణములతో కొట్టెను. ద్రుపదుడు ఆ దెబ్బతో పూర్వవైరమును స్మరించుచు రణరంగమును విడచిపోయెను. ఇట్లు ద్రుపదుని జయించి ద్రోణాచార్యుడు శంఖమును పూరించెను. ఆ శంఖధ్వని విని సోమకులందరు భయపడిరి.

రాజా! తరువాత ద్రోణుడు ప్రమోహనాస్త్రముచేత నీ కొడుకులు మూర్ఛిల్లి వారని విని తన యుద్ధరంగమునుండి భీమ ధృష్టద్యుమ్నులున్న చోటికి పోయెను.

రాజా! అప్పుడు ద్రోణాచార్యుడు ప్రజ్ఞాస్త్రముచేత ధృష్టద్యుమ్న ప్రయుక్తమైన మోహనాస్త్రశక్తిని అణచి నీ పుత్రులను మూర్ఛదేర్చెను. తర్వాత వారు భీమ ధృష్టద్యుమ్నులతో యుద్ధము చేయుటకు పూనిరి.

రాజా! అప్పుడు యుధిష్ఠిరుడు తమ సైనికులను పిలిచి భీమధృష్టద్యుమ్నులకు సహాయకులుగా పొమ్మనెను. అభిమన్యుడు మొదలైన వీరులు గూడ బయలు దేరిపోయిరి. ఇట్లు యుధిష్ఠిరాజ్ఞచేత ఆ వీరులందరు మధ్యాహ్నకాలమునందు బయలుదేరిరి. కేకయులు ద్రౌపదీ పుత్రులు, ధృష్టకేతువు అభిమన్యుని ముందిడు కొని 'సూచీ ముఖము' అను వ్యూహమును పన్ని యుద్ధమునకు సాగిరి.

రాజా! వారు ధార్తరాష్ట్రుల రథసైన్యమును చీల్చి ముందుకు సాగు చుండిరి. అట్టివారిని భీమసేన భయముచేత మోహితులైన మీ సైనికులు నివారింపజాలకపోయిరి. మదముచేత దిక్కుతెలియక నిలిచియున్న స్త్రీవలె నీ సేన శత్రువులను చూచుచు నిలుచుండెను. తరువాత వారందరు ధృష్టద్యుమ్న వృకోదరుల కడకుపోయిరి. ఆ యిరువురు వారిని చూచి సంతోషించి మీ సేనను చంపుచుండిరి ద్రోణాచార్యుని గూడ కొట్టిరి.

రాజా! హఠాత్తుగా వచ్చుచున్న ద్రోణాచార్యుని ధృష్టద్యుమ్నుడు చూచెను కేకయుడు భీముని తన రథమెక్కించుకొని ద్రోణుని ఎదిరించెను. అట్లు వచ్చు చున్న అతని ధనుస్సును ద్రోణుడు ఖండించి నూర్లకొలది బాణములను ధృష్ట ద్యుమ్నునిపై ప్రయోగించెను. ద్రోణుడు ఇది యంతయు ప్రభువుపెట్టిన యన్నమును స్మరించుచు దుర్యోధన హితము కొరకు చేసెను.

రాజా! అప్పుడు ధృష్టద్యుమ్నుడు మరియొక ధనుస్సు తీసికొని ద్రోణుని పాషాణములవంటి ఇరువది బాణములతో కొట్టెను. అతని ధనుస్సును ద్రోణాచార్యుడు ఛేదించి రథాశ్వములు నాల్గింటిని సంహరించి సారథిని కూడా చంపెను.

అంతట హతాశ్వమైన తన రథమునుండి ధృష్టద్యుమ్నుడు ఎగిరి దుమికి

అభిమన్యుని రథముపైకి పోయెను. అప్పుడు భీమధృష్టద్యుమ్నులను చూచి మీ సేనలు గడగడ వణకెను.

రాజా! అప్పుడు ద్రోణాచార్యునిచేత సేన చంపబడుచుండెను. ఆ మహా సేన ద్రోణుని వారింపజాలకుండెను. ఆ సైన్యమచ్చటనే క్షోభిల్లిన సముద్రము వలె భ్రమించుచుండెను అట్లున్న శత్రుసైన్యమును చూచి మీవారు సంతోషించి మహాక్రుద్ధుడైన ద్రోణాచార్యుని క్రిందపడుచున్న శత్రుసేనను చూచి మీ సైనికులు "బాగు బాగు" అని బిగ్గరగా సింహనాదములు చేసిరి.

(తొంబది ఎనిమిదవ అధ్యాయము)

## ఉభయసైనికుల సంకుల సమరం

జనమేజయా! సంజయుడు ధృతరాష్ట్రునకు తరువాతి యుద్ధవృత్తాంత మిట్లు చెప్పదొడగెను.

రాజా! తరువాత నీ పుత్రుడు దుర్యోధనుడు మోహముచేత తిరిగివచ్చి శరవర్షములు గురియుచు భీమసేనుని నివారించెను. తక్కిన నీ పుత్రులందరు గూడ దుర్యోధనునకు సహాయకులుగా వచ్చి భీముని పొదివిరి.

రాజా! భీమసేనుడు గూడ తన రథము నెక్కి, నీ పుత్రుడున్న చోటికి పోయి శత్రుప్రాణహరములైన బాణములతో అతనిని కొట్టెను. తరువాత దుర్యోధనుడు నిశితబాణముచేత భీముని మర్మస్థలమునందు కొట్టెను. అప్పుడు భీముడు మూడు బాణములు దుర్యోధనుని బాహువులపై వక్షముపై ప్రయోగించెను. అప్పు డతడు శిఖరములతో పర్వతరాజువలె శోభిల్లెను.

రాజా! ఆ ఇరువురట్లు క్రోధావిష్టులై పరస్పరము పోరాడుచుండగా నీ యితర పుత్రులు భీముని యెడల పూర్వవైరము తలచుచు నతనిని ముట్టడించిరి. అట్లు వారు వచ్చుచుండగనే భీముడు మహాగజము ప్రతిగజములను వలె వెదురొక్కని చిత్రసేనాదులైన నీ పుత్రులను పదునైన అనేక బాణములతో కొట్టెను.

రాజా! తరువాత ధర్మరాజు ఆ సేనలను నిలువరించుచు అభిమన్యుడు మొదలైన పదుగురు మహారథికులను భీమసేనుని సహాయార్థమై పంపగా వారు

వచ్చి నీ పుత్రుల నెదుర్కొనిరి. రథములందు సూర్యాగ్ని తేజస్సుతో వెలుగొందుచున్నవారిని చూచి భీముని విడిచి నీ పుత్రులు వారిపైకి ఉరుకుచుండుట చూచి భీముడు వారిని ప్రాణములతో నట్లు పోనీయక మరల వారిని చుట్టుముట్టి బాధించెను.

రాజా! తరువాత భీమ, ధృష్టద్యుమ్నులతో చేరుటకు వచ్చిన అభిమన్యుని చూచి మీ మహారథికులు దుర్యోధనాదులు ఆ ముగ్గురిపైకి ఉరికిరి. ఆ యపర్నాహ్ణకాలమునందు వారికి మహాఘోరముగా యుద్ధము జరిగెను.

రాజా! అప్పుడు అభిమన్యుడు నీ పుత్రుడు వికర్ణుని రథాశ్వములను వధించి యతనిని ఇరువది అయిదు క్షుద్రక(కుప్పెకోల) బాణములతో కొట్టెను. గుఱ్ఱములు చచ్చిన రథమును విడిచి వికర్ణుడు తన సోదరుడైన చిత్రసేనుని రథముపైకి పోవగా అభిమన్యుడు వికర్ణ చిత్రసేనులను శరజాలముచేత అచ్ఛాదించెను. వికర్ణ చిత్రసేనులప్పుడు అభిమన్యుని ఐదుబాణములతో కొట్టిరి. అప్పుడు అభిమన్యుడు కంపించెను.

రాజా! దుశ్శాసను డైదుగురు కేకయులతో నద్భుతముగా పోరాడెను. ద్రౌపదీపుత్రులు ఐదుగురు నతిక్రుద్ధులై దుర్యోధనుని ముట్టడించిరి. సర్పముల వంటి బాణములతో నతనిని కొట్టిరి. అప్పుడు దుర్ధర్షుడను నీ పుత్రుడు ద్రౌపదీ పుత్రులను నిశితశరములచేత విడివిడిగా నొక్కొక్కరిని కొట్టెను. వారుగూడ నతనిని కొట్టగా దుర్ధర్షుడు గైరికాదిధాతువులు కలిసిన సెలయేళ్ళు పారుచున్న పర్వతమువలె రక్తనదులతో ప్రకాశించెను.

రాజా! తరువాత భీష్ముడు శత్రుసైనికులను గోపాలుడు గోవులనువలె పారద్రోలెను. అప్పుడు సైన్యపు దక్షిణ భాగమునందు సేనలను వధించుచున్న అర్జునుని గాండీవ ధ్వని వినపడెను. అక్కడ అర్జునహతులైన సైనికుల మొండెములు పైకి ఎగురుచుండెను.

రాజా! అప్పుడు కౌరవ పాండవసైనికులు రక్తమనెడు నీరు బాణములనెడు సుడులు గజద్వీపములు అశ్వతరంగములుగల సైన్య సముద్రమును, తమ రథములనెడు నౌకలతో దాటిరి. ఆ రక్త సముద్రమునందు చేతులు తెగి కవచములు ఊడి శరీరములు గాయపడిన సైనికులు నూర్లకొలదిగా వేలకొలదిగా పడియుండుట కనపడెను.

రాజా! చచ్చి రక్తములు ప్రవహింపగా భూమిపై బడియున్న మదగజములచేత భూమియంతయు పర్వతములవలె వ్యాపించినట్లుండెను. ఆ యిరుసైన్యములలోను ఎప్పుడు గూడ యుద్ధము కాక్షించని వాడు లేకుండెను. ఇది మహాద్భుతముగా నాకు తోచెను.

రాజా! యీ విధముగా కీర్తికాముకులైన మీ మహాయోధులు జయముగోరుచు పాండవ సైన్యములతో యుద్ధము చేసిరి.

జనమేజయా! సంజయుడు ధృతరాష్ట్రునకు తరువాతి యుద్ధ వృత్తాంతమిట్లు చెప్పదొడగెను.

(తెబ్బది తొమ్మిదవ అధ్యాయము)

## భీముడు దుర్యోధనుని జయించుట

రాజా! తరువాత సూర్యుడు ఎఱ్ఱబడుచుండగా దుర్యోధనుడు యుద్ధోద్ధరుడై భీమసేనుని చంపదలచి యతనిపైకి ఉరికికెను. అట్లు తనపైకి వచ్చుచున్న దుర్యోధనునితో భీముడు అతిక్రుద్ధుడై యిట్లనెను.

గాంధారీ పుత్రా! అనేక సంవత్సరములుగా నేను కాంక్షించుచున్న కాలమిప్పుడు లభించినది. నీవు యుద్ధము విడిచి పోవకున్నచో నేడు నిన్ను సంహరించెదను. నేడు కుంతీదేవికి గలిగిన దుఃఖము మాకు గలిగిన వనవాసక్లేశము ద్రౌపది దుఃఖము నిన్ను చంపి పోగొట్టెదను.

నీవు పూర్వము మచ్చరముతో పాండవులను అవమానపరచితివి. ఆ పాపమునకు ఫలముగా నిప్పుడు నీకు వ్యసనము సంప్రాప్తమైనది. కర్ణశకునుల దురుపదేశముచేత పాండవులను లెక్కచేయక కామవశుడవై నీ యిష్టము వచ్చినట్లు ఆచరించితివి. నీతో సంధిగోరి వచ్చిన శ్రీకృష్ణభగవానుని అవమానపరచితివి. నీవేదో మహాసంతోషము గలవానివలె ఉలూకునితో మాకు సందేశము పంపితివి. ఇవియన్నియు స్మరించుచు నేను నిన్ను నీ బంధువులను వధించెదను చూడుము. నీవు చేసిన పాపములన్నిటి ఫలము నేడు అనుభవించెదవు గాక!

ధృతరాష్ట్ర మహారాజ! యీ విధముగా భీమసేనుడు ఎత్తిపొడుపుమాట

లతో దుర్యోధనుని అధిక్షేపించి తన ధనస్సును ఎత్తి గిరగిర త్రిప్పి పిడుగుల వంటి యిరువదియారు బాణములను ఎక్కుపెట్టి సుయోధనుని కొట్టెను. మండు చున్న అగ్నివంటి బాణములతో దుర్యోధనుని ధనుస్సు ఖండించి సారథిని కొట్టి నాలుగు బాణములతో రథాశ్వములను చంపెను. రెండు బాణములతో ఛత్ర మును ఆరింటితో అతని నాగధ్వజమును నీ కొడుకు చూచుచుండగనే ఛేదించి బిగ్గరగా సింహనాదము చేసెను.

రాజా! అట్లు భీమునిచేత ఖండింపబడిన ధ్వజము రత్నభూషితమైన దుర్యోధన రథమునుండి, మేఘమునుండి విద్యుత్తువలె రాలి క్రిందపడెను. ప్రకాశించుచున్న దుర్యోధన నాగధ్వజము అట్లు పడుటను రాజులందరు చూచిరి. తరువాత భీముడు పదిబాణములతో, అంకుశములతో ఏనుగును వలె దుర్యోధనుని కొట్టెను. అప్పుడు సైంధవుడు దుర్యోధనునకు సహాయకుడిగా పోయెను. అంతట కృపాచార్యుడు దుర్యోధనుని తన రథముపైకి ఎక్కించుకొనెను. భీముని చేత గాఢముగా కొట్టబడిన దుర్యోధనుడు రథముపై కూలబడెను.

తరువాత సైంధవుడు జయేచ్ఛతో భీముని అన్నివైపుల అనేక సహస్ర రథములతో ఎదిరించెను.

రాజా! పిదప అభిమన్యు-ధృష్టకేతు-కేకయ-ద్రౌపదేయులు నీ పుత్రులతో యుద్ధము చేసిరి. చిత్రసేన-సుచిత్రాదులైన నీ పుత్రులు ఎనమండుగురు అభి మన్యుని రథమును చుట్టుముట్టిరి అప్పుడు అభిమన్యుడు వారినొక్కరిని ఐదైదు బాణములతో కొట్టెను. అది సహింపజాలక వారందరు అభిమన్యుని రథముపై బాణములను, మేఘములు మేరువుపై వానగురిసినట్లు వర్షించిరి.

ఆ బాణాఘాతము చేత పీడితుడైన యభిమన్యుడు దేవాసుర యుద్ధము నందు దేవేంద్రుడు రాక్షసులను కొట్టినట్లు మీవారిని కొట్టి కంపింప జేసెను. పదునాలుగు భల్లములను వికర్ణుని రథముపై ప్రయోగించి ధ్వజమును సారథిని అశ్వములను పడగొట్టెను. వికర్ణుని గూడ కొట్టి బాధించెను. వికర్ణుని రక్తముచేత తడిసిన ఆ బాణములు రక్తము గ్రక్కుచున్నట్లుండెను. అట్లు బాధపడుచున్న వికర్ణునకు సహాయకులుగా అతని సోదరులు వేగముగా వచ్చి అభిమన్యుడు మొదలైనవారిని ముట్టడించిరి. అట్లే పాండవవీరులు గూడ కౌరవ సైన్యము నెదు రించిరి. పరస్పరము ఘోరముగా యుద్ధము జరిగెను.

రాజా! నీ పుత్రుడు దుర్ముఖుడు ఏడుబాణములతో శ్రుతకర్మను కొట్టెను అతని ధ్వజమును సారథిని అశ్వములను పడగొట్టెను. శ్రుతకర్మ హతాశ్వమైన రథమునుండి మండుచున్న కొరవివంటి శక్తిని దుర్ముఖునిపై విసరెను. అది అతని కవచము ఛేదించి భూమిని చొచ్చెను. విరథుడైన శ్రుతకర్మను సుత సోముడు తన రథముపై నెక్కించుకొనెను.

రాజా! తరువాత శ్రుతకీర్తి నీ పుత్రుడైన జయత్సేనునిపై దాడి సలిపెను. జయత్సేనుడు శ్రుతకీర్తి ధనుస్సును విరిచెను. అట్లు అతని ధనుస్సు విరుగగా అతని సోదరుడు నకులపుత్రుడు శతానీకుడు వచ్చి కలిసికొనెను. శతానీకుడు జయత్సేనుని పది బాణములతో కొట్టెను. మదగజమువలె గర్జించెను. తరువాత శతానీకుడు తీక్ష్ణమైన మరియొక బాణముతో జయత్సేనుని యెదపై కొట్టెను.

రాజా! అట్లు వారు పోరాడుచుండగా నీ పుత్రుడు దుష్కర్ణుడు సోదరుని సమీపించి నకులపుత్రుని ధనుస్సు ఖండించెను. శతానీకుడు మరియొక ధనుస్సు తీసికొని 'నిలునిలు' మని దుష్కర్ణునితో ననుచు సర్పములవంటి బాణముల నతనిపై ప్రయోగించెను. తరువాత దుష్కర్ణుని అతని ధనుస్సును సారథిని కొట్టెను. పన్నెండు బాణములతో దుష్కర్ణుని యశ్వములను కొట్టి భల్లముచేత యతని యెదపై బిగ్గరగా తాడించెను. దానితో నతడు పిడుగుపడిన చెట్టువలె నేలపై వ్రాలెను.

రాజా ఇట్లు పీడితుడైన దుష్కర్ణుని జూచి ఐదుగురు రాజవీరులు శతానీకుని చంపుటకు చుట్టుముట్టి అతనిపై శరవర్షము గురిసిరి. బాణాచ్ఛాదితుడైన శతానీకుని చూచి కేకయసోదరులు అతనికి సహాయకులుగా వచ్చుచుండిరి. నీ పుత్రులు వచ్చి గజములను మహాగజములవలె నెదుర్కొనిరి. వారు దుర్ముఖ-దుర్జయ-దుర్మర్షణ-శత్రుంజయ-శత్రుసహాదులు. వీరందరు క్రుద్ధులై కేకయుల నెదుర్కొనిరి. మహా వేగముగల నగరములవంటి రథములతో విచిత్ర వర్ణ ధ్వజములతో నానావర్ణ కవచములు ధనుస్సులు ధరించి సింహములు ఒక వనమునుండి మరియొక వనములో దూరినట్లు వచ్చిరి.

రాజా! అప్పుడా వీరులు ఉభయ పక్షముల వారికి సంకుల సమరము జరిగెను. ఒండొరులను చంపుకొనుచుండిరి యముని రాష్ట్రములో జనసంఖ్యను

నిరుసేనలు పెంచుచుండిరి. సూర్యాస్తమయమునకు ఒక క్షణకాలము మిగిలి యుండగా వారు అతి భయంకరముగా యుద్ధము చేయుచుండిరి.

రాజా! అప్పుడు భీష్ముడు అతిక్రుద్ధుడై పాంచాలసేనను నశింపజేసి యమ లోకమునకు పంపెను. ఇట్లు ఆ మహా ధనుర్ధారుడు పాండవుల సైన్యమును ఛేదించి ఆనాటి యుద్ధమును చాలించి తన శిబిరమునకు పోయెను.

రాజా! ధృష్టద్యుమ్న వృకోదరులు గూడ కౌరవసేనను హతమార్చిరి. యుధిష్ఠిరుడు ఆ యిరువురి ప్రతాపమును ప్రశంసించి వారిని తలపై మూర్కొని సంతోషముతో తన శిబిరమునకు పోయెను.

రాజా! కృష్ణార్జునులు కూడ కౌరవసేనను హతమార్చి పారదోలి తమ శిబిరములకు పోయిరి. అంతటితో ఆరవనాటి యుద్ధము సమాప్తి చెందెను.

(ఎనుబదవ అధ్యాయము)

## సప్తమ దివస యుద్ధము-భీష్ముడు దుర్యోధనుని ఓదార్చుట

జనమేజయా! సంజయుడు ధృతరాష్ట్రునకు ఏడవనాటి యుద్ధవృత్తాంత మిట్లు వర్ణించి చెప్పదొడగెను.

రాజా! తరువాత ఉభయపక్షవీరులు ఒండొరులు తప్పులను చెప్పుకొనుచు తమ తమ శిబిరములకు పోయి మరునాటి యుద్ధమునకు సన్నాహము చేసుకొను చుండిరి.

రాజా! అప్పుడు నీ పుత్రుడు దుర్యోధనుడు చింతచేత వ్యాకులపడుచు శరీరమందు నెత్తురు ఒడియుచుండగా భీష్మపితామహునితో ఇట్లనెను.

పితామహా! పాండవ వీరసైనికులు భయంకరములు రౌద్రములు నైన మన సైన్యములను చీల్చి, చంపి బాధపెట్టి అందరినీ మూర్ఛపడగొట్టి వజ్ర సమానమైన మకరవ్యూహమును పన్ని కీర్తిమంతులై మనసేనలో భీమసేనునితో దూరిరి. భీముడు నన్ను మృత్యుదండముల వంటి బాణములచేత కొట్టెను. అట్లు మహాక్రోధావిష్టుడైన భీముని చూచి మూర్ఛితుడనైన నేను శాంతిలేకుండానున్నాను.

నీవు సత్యసంధుడవు నీ అనుగ్రహముచేత పాండవులను వధించి జయముసాధింప దలచినాను.

రాజా! ఇట్లు దుర్యోధనుడు దీనముగా చెప్పిన మాటలువిని మహాత్ముడైన భీష్ముడు నవ్వుచూ "దుర్యోధనుడు దుఃఖితుడై ఉన్నాడని" తెలిసి యతనితో నిట్లనెను.

రాజపుత్రా! నేను నీ కొరకు మహాయత్నపూర్వకముగా శత్రుసైన్యములో ప్రవేశించి సర్వవిధముల పోరాడుచూ నీకు జయము సుఖము కల్గింపవలెననియే కోరుచూ ఏ మాత్రము శరీరము దాచుకొనక యుద్ధము చేయుచున్నాను. పాండవ వీరులలో బహుళ సంఖ్యాకులు అతిరౌద్రులు-శూరులు-అస్త్రవిద్యా పండితులైన వారు. వారు పాండవులకు సహాయముగా ఉన్నారు. వారందరు క్రోధవిషమును గ్రక్కుచున్నారు. శౌర్యోద్ధతులు నీతో వైరముగలవారునైన ఆ వీరులను హఠాత్తుగా జయించుటకు సాధ్యము కాదు.

రాజా! నా జీవితమును త్యజించియైనను శత్రుసేనతో పోరాటము సలిపెదను. నీ హితము కొరకే అట్లు చేయుచున్నాను. నాకు నేడు నా జీవితము ముఖ్యముగా రక్షింపతగినది కాదు. నీ కొరకు అతిభయంకరులైన దేవదానవులను కూడా దహింపగలననగా, ఈ శత్రుసేన ఎంత? రాజా! పాండవులతో పోరాడెదను. నీకు అన్ని విధముల ప్రీతి కల్గించెదను.

ధృతరాష్ట్ర మహారాజా! భీష్మపితామహుడు చెప్పిన ఊరడింపు మాటలు విని దుర్యోధనుడు శాంతిల్లెను. తరువాత అతడు మరునాడు సంతోషముతో "ఇక యుద్ధమునకు బయలుదేరుడు" అని సర్వసైన్యములను ఆదేశించెను. అంతట మిక్కిలి హర్షముతో వేలకొలది మీ చతురంగ సైన్యములు యుద్ధమునకు సాగిపోయెను. అన్ని సైన్యములు హర్షముతో కళకళలాడుచుండెను.

రాజా! సైన్యములు నడుచుచుండగా రేగిన రజస్సు సూర్యకిరణములను గప్పెను. ధ్వజములు వాయువుచేత ఎగురుచుండెను పలురంగులతో ధ్వజములు మేఘములతో కూడిన విద్యుత్తులవలె ప్రకాశించుచుండెను గుంపులు గుంపులుగా గజములు నిలిచియుండెను. రాజవీరుల ధనుష్టంకార ధ్వనులు మ్రోగెను. నీ సైన్యమప్పుడు దేవదానవులు ఆదియుగమునందు మదించిన సముద్రమువలె

క్షోభిల్లెను. భయంకర గజములతో బహురూప వర్షములు గలిగిన నీ సేన శత్రు సేనలను సంహరించుటకు సిద్ధముగానుండి ప్రళయకాల మేఘసమూహమువలె ప్రకాశించుచుండెను.

జనమేజయా! సంజయుడు ధృతరాష్ట్రునితో తరువాత యుద్ధవృత్తాంతము నిట్లు చెప్పదొడగెను.

(ఎనభై ఒక్కటవ అధ్యాయము)

## ఏడవనాడు కౌరవపాండవులు మండల-వజ్ర వ్యూహములు నిర్మించి పోరాడుట

రాజా! తరువాత దుర్యోధనుడు ధ్యానస్థితుడై యుండగా నతనిని సంతోష పరచుచూ భీష్ముడు మరల నతనితో ఇట్లనెను.

దుర్యోధనా! నేను ద్రోణ-శల్య-కృతవర్మాది మహారథిక వీరులు సమస్త రథ-గజ-తురగ-పదాతి చతురంగ సేనలు ఇతర రాజవీరులందరూ కూడ నీ కొరకు జీవితములపై ఆశ విడిచి పోరాడుటకు సిద్ధముగా నున్నాము. వీరందరు యుద్ధమునందు దేవతలను గూడ జయింపగల సమర్థులని నా యభిప్రాయము.

కాని నాయనా! నీకు నేను సర్వదా హితమునే చెప్పుచుందును. అవశ్యముగా చెప్పవలసిన మాట చెప్పెద వినుము శ్రీకృష్ణుని సహాయముతో పోరాడుచున్న మహేంద్ర సమాన పరాక్రమముగల పాండవులను జయించుట ఇంద్రాది దేవతలకు గూడ శక్యము గాదని ఎఱుగుము నేనైతే అన్నివిధముల నీకిచ్చిన మాట చెల్లించుటకు ప్రయత్నించెను. నేను పాండవులను గాని, నన్ను వారు గాని యుద్ధమునందు జయించుట తథ్యము.

ధృతరాష్ట్ర మహారాజా! ఇట్లు చెప్పి భీష్ముడు దుర్యోధనునకు "విశల్యకరణి" యను ఓషధిని ఇచ్చెను. ఆ యోషధిని సేవించి దుర్యోధనుడు తన శరీరమునందు గ్రుచ్చుకొనిన శల్యములను పోగొట్టుకొనెను.

రాజా! మరునాడు ప్రాతఃకాలమందు భీష్ముడు సర్వచతురంగ సైన్యములతో మండలవ్యూహమును ఈ విధముగా నిర్మించెను.

ఒక్కొక్క ఏనుగునకు ఏడు రథములు- ప్రతిరథమునకు ఏడు అశ్వములు- ప్రతి అశ్వమునకు పదుగురు ధనుర్ధరులు- ఒక్కొక్క ధానుష్కునకు పదిమంది చొప్పున డాలులు ధరించినవారు- రాజా! ఈ విధముగా మహాసైన్యముతో గూడి రథికులు ఆ మండల సమూహములో నిలిచి యుద్ధ సన్నద్ధులైరి. ఆ సేననంతటిని భీష్ముడు రక్షించుచుండెను. రాజా! పదివేల గజములతో పదివేల అశ్వములతో పదివేల రథములతోను చిత్రసేనాదులైన నీ పుత్రులు ఒక్కటిగా చేరి భీష్మపితామహుని రక్షించుచుండిరి. వారిచేత భీష్ముడు ఆయన చేత వారున్నూ ఇట్లు పరస్పరము రక్షింపబడుచూ యుద్ధసన్నద్ధులై నిలచి యుండిరి.

రాజా! అప్పుడు దుర్యోధనుడు రథములో ఇంద్రుడు స్వర్గమునందు సంపద్యుక్తుడైయున్నట్లు విరాజిల్లెను. తరువాత నీ పుత్రుల సింహనాదము-రథ వాద్యముల ధ్వనులు మిన్ను ముట్టుచుండగా భీష్మరక్షితమై పడమటి ముఖముగా నున్న మండల సమూహము దుర్భేద్యమై అంతట శోభిల్లుచుండెను.

రాజా! అట్లు దుర్జయమైన మండలవ్యూహము చూచి యుధిష్ఠిరుడు స్వయముగా వజ్రవ్యూహమును పన్నెను. తరువాత సైన్యములన్నియు సింహనాదములు చేసి ఆ వ్యూహములను భేదించు నిచ్ఛతో బయలుదేరెను. సైనికులు పరస్పరము కొట్టుకొనుచుండిరి.

రాజా! ద్రోణాచార్యుడు విరాటరాజును అశ్వత్థామ శిఖండిని దుర్యోధనుడు ద్రుపదుని నకుల సహదేవులు శల్యుని విందానువిందులు ఐరావతుని ఎదుర్కొని పోరాడజొచ్చిరి. రాజవీరులందరు అర్జునునితో పోరాడుచుండిరి. భీమసేనుడు హార్దిక్యునితో చిత్రసేన-వికర్ణ-దుర్మర్షణులతో అభిమన్యుడున్నూ యుద్ధము చేసిరి. ప్రాగ్జ్యోతిషాధిపతి భగదత్తుడు ఘటోత్కచునితో పోరాడెను. ఆ ఇరువురు మదగజములవలె తలపడిరి. అలంబుష రాక్షసుడు సైన్యయుక్తుడైన సాత్యకి నెదురించి యుద్ధము చేసెను. భూరిశ్రవసుడు ధృష్టకేతువుతో యుధిష్ఠిరుడు శ్రుతాయువుతో చేకితానుడు కృపాచార్యునితోను యుద్ధము చేసిరి. తక్కినవారు భీష్మునెదుర్కొని పోరాడజొచ్చిరి.

రాజా! తరువాత రాజులందరు అర్జునుని వివిధాయుధములతో చుట్టుముట్టిరి. అప్పుడర్జునుడు మిక్కిలి క్రుద్ధుడై శ్రీకృష్ణునితో నిట్లనెను.

మాధవా! యుద్ధమునందు వ్యూహరచనలోని విద్వాంసుడైన భీష్మునిచేత పన్నబడిన ధార్తరాష్ట్ర సైన్యములను చూడుము. అందరు యుద్ధకాంక్షతో సాగుచున్న శూరులే. సోదరులతో వచ్చిన త్రిగర్తరాజు సుశర్మను చూడుము. నన్నెదురించుటకు వచ్చిన వీరులందరిని నీవు చూచుచుండగనే చంపెదను చూడుము.

ధృతరాష్ట్ర మహారాజా! యిట్లు చెప్పి అర్జునుడు రాజవీరులపై శరవర్షము కురిపించెను. మీవారుగూడ శత్రువీరులపై మేఘములు వర్షములతో తటాకమును నింపునట్లు బాణవర్షము గురిసిరి. అట్లు మీవారి శరవర్షముచేత కప్పబడిన కృష్ణార్జునులను చూచి మీ సైనికులు సంతోషముచేత హాహాకారముచేసిరి. అట్లు కృష్ణార్జునులు శరవర్షముచేత కప్పబడుట జూచి దేవతలు దేవర్షులు విస్మయము చెందిరి.

రాజా! తరువాత అర్జునుడు క్రుద్ధుడై ఐంద్రాస్త్రమును శత్రువులపై ప్రయోగించి అద్భుత పరాక్రమము ప్రదర్శించెను. అతడు శత్రుప్రయుక్తములైన బాణములను నివారించెను. అప్పుడు అర్జునుని బాణఘాతములచేత గాయపడని సైనికులు లేరు. అట్లు బాధితులైన భీష్ముని శరణుజొచ్చిరి. అగాధజలములలో మునిగిపోవుచున్నవారికిప్పుడు భీష్ముడు పడవగా సహాయపడెను. ఆ విధముగా మీవైపు పరుగెత్తి వచ్చిపడుచున్న సైనికులచేత నీ సైన్యమంతయు చీలిపోయి మహాప్రభంజనముచేత సముద్రమువలె క్షోభిల్లెను.

జనమేజయా! యిట్లు చెప్పి సంజయుడు ధృతరాష్ట్రునకు తరువాత యుద్ధవృత్తాంతము నిట్లు చెప్పదొడగెను.

(ఏనభై రెండవ అధ్యాయము)

## కౌరవసేన పలాయనం

రాజా! అట్లు ప్రవర్తిల్లుచున్న యుద్ధములో అర్జునుని దాడికి తట్టుకొనజాలక భగ్నులై కాగా, సైన్యసాగరము క్షోభిల్లగా భీష్ముడు పోరాడుటకు ముందుకు రాగా దుర్యోధనుడు యుద్ధమునందు పార్థుని పరాక్రమము చూచి త్వరగావచ్చి తమ వైరులందరితోను, విశేషించి వారిలో ముఖ్యశూరుడైన సుశర్మతో అతనిని సంతోషపరచుచున్నవాడువలె సైన్యమధ్యములో నిలచి యిట్లనెను.

రాజవీరులారా! భీష్మ పితామహుడు జీవితముపై పూర్తిగా ఆశ విడిచి అర్జునునితో పోరదలచి ముందుకు సాగిపోవుచున్నాడు. మీరందరు ఆయనను సర్వవిధముల రక్షించవలెను.

రాజా! దుర్యోధనుని ఆజ్ఞను శిరసావహించి మీ సైనికులందరు భీష్మ పితామహుని కదకుపోయిరి. తరువాత భీష్ముడు శ్వేతాశ్వము వానర ధ్వజము మేఘనాదమువంటి ధ్వనిగల రథముతో సర్వసైన్యముల పైకి వచ్చుచున్న అర్జునుని ఎదుర్కొనెను. అప్పుడు అర్జునుని రథపు పగ్గములు ధరించి రెండవ సూర్యుడు మధ్యందినగతుడై తేజరిల్లుచున్నట్లున్న కృష్ణుని చూచుటకు గూడ సైనికులు భయపడుచుండిరి.

రాజా! అట్లే శ్వేతాశ్వములతోను, శ్వేత ధనుస్సుతో విరాజిల్లుచున్న త్రిగర్త సైన్యములతో చుట్టబడిన భీష్ముని చూచి, పాండవులును భయపడిరి.

అప్పుడు ద్రోణాచార్యుడు విరాటరాజుపై బాణ ప్రయోగముచేసి అతని ధ్వజమును, ధనుస్సును ఛేదించెను. తర్వాత విరాటుడు దృఢమైన మరియొక ధనుస్సు తీసికొని సర్పములవంటి మూడు బాణములతో ద్రోణుని నాల్గు బాణములతో అతని యశ్వములను, అయిదింటితో సారథిని కొట్టెను. అప్పుడు ద్రోణుడు విరాటరాజ యొక్క అశ్వములను సారథిని వధించెను.

రాజా! అప్పుడు విరాటుడు తన పుత్రుని రథముపైకి పోయెను. ఆ ఇరువురు శరవర్షముచేత ద్రోణుని వారించిరి. తరువాత ద్రోణుడు క్రుద్ధుడై సర్పము వంటి బాణము విరాటపుత్రునిపై ప్రయోగించి శంఖము పూరించెను. దానితో నతడు ఎదచీలి చచ్చెను. అట్లు పడియున్న కొడుకును చూచి విరాటుడు యముని వలె నున్న ద్రోణుని చూచి భయపడి యుద్ధము వీడి పోయెను. రాజా! తరువాత ద్రోణాచార్యుడు త్వరగా పాండు సేనను బహువిధముల చీల్చి చెండాడెను.

రాజా! అప్పుడు శిఖండి అశ్వత్థామ యొక్క భ్రూమధ్య భాగమునందు మూడు బాణములతో కొట్టెను. అట్లు లలాటమునందు గ్రుచ్చుకొనిన మూడు బాణములతో అశ్వత్థామ మూడు బంగారు శిఖరములతో ప్రకాశించుచున్న మేరుపర్వతమువలె శోభిల్లెను.

రాజా! తరువాత అశ్వత్థామ క్రోధముతో ఒక క్షణములో శిఖండియొక్క

ధ్వజ సారథి తురగ శస్త్రములను అనేక బాణములతో ఛేదించి పడగొట్టెను. తరువాత శిఖండి హతాశ్వమైన రథమునుండి ఎగిరి దుమికి ఖడ్గహస్తుడై డేగవలె యుద్ధరంగమంతట విచరించెను. అట్లు విజృంభించి తిరుగుచున్న శిఖండిపై అశ్వత్థామ బాణవర్షము గురిసెను. ఆ బాణములన్నింటిని శిఖండి పదునైన కత్తితో ఛేదించెను.

రాజా! తరువాత అశ్వత్థామ శతచంద్ర శోభితమైన శిఖండి డాలును అతని ఖడ్గమును ఖండించి నిశితశరములతో శిఖండిని కొట్టెను. అట్లు బాధితుడైన శిఖండి సాత్యకి రథమెక్కెను.

రాజా! సాత్యకి క్రుద్ధుడై అలంబుష రాక్షసుని బాణములతో కొట్టెను. అలంబుషుడు అర్ధచంద్ర బాణముతో సాత్యకి ధనుస్సు ఛేదించి అతనిని బాణములతో కొట్టెను. రాక్షసమాయాబలముచేత నతడు శరములను సాత్యకిపై కురిసెను.

రాజా! అప్పుడు సాత్యకియొక్క అత్యద్భుతపరాక్రమము చూచి అందరు ఆశ్చర్యపడిరి. సాత్యకి ఐంద్రాస్త్రమును అర్జునుని నుండి కృష్ణుడియగా తీసికొని రాక్షసునిపై ప్రయోగించెను. అది రాక్షస మాయను భస్మీపటలము చేసెను. సాత్యకి అలంబుషునిపై శరవర్షము వర్షాకాలమేఘము జలధారలవలె కురిసెను. ఆ విధముగా సాత్యకి చేత పీడితుడైన రాక్షసుడు భయపడి సాత్యకిని వీడి పారిపోయెను.

రాజా! ఇంద్రునకు గూడ అజేయుడైన అలంబుష రాక్షసుని సాత్యకి జయించి పారద్రోలి నిశితశరములచేత నీ సైనికులను గూడకొట్టగా వారు భయపడి చెదరి పారిపోయిరి.

రాజా! ఇంతలో ధృష్టద్యుమ్నుడు దుర్యోధనుని శరములతో కప్పెను. అతడే మాత్రము వ్యథచెందక ధృష్టద్యుమ్నుని తొంబది బాణములతో కొట్టెను. అప్పుడు ధృష్టద్యుమ్నుడు క్రుద్ధుడై దుర్యోధనుని ధనుస్సు ఛేదించి అతని నాలుగు గుర్రములను చంపి పదునైన ఏడు బాణములతో అతనిని కొట్టెను. రాజా! అట్లు కొట్టబడిన దుర్యోధనుడు ఖడ్గపాణియై హతాశ్వమైన రథమునుండి ఎగిరిదుమికి ధృష్టద్యుమ్నునిపైకి ఉరికెను అప్పుడు శకుని దుర్యోధనుని తన

రథము ఎక్కించుకొనెను. దుర్యోధనుని జయించిన తరువాత ధృష్టద్యుమ్నుడు ఇంద్రుడు రాక్షస సైన్యమును వలె మీ సైన్యమును వధించెను.

రాజా! తరువాత కృతవర్మ మహామేఘము సూర్యునివలె శరముచేత భీముని ఆచ్ఛాదించెను. తరువాత భీముడు కృతవర్మను బాణములతో కొట్టెను. కృతవర్మ ఏ మాత్రము కంపము చెందక నిశిత శరముచేత భీముని కొట్టెను. భీముడు కృతవర్మయొక్క నాలుగు రథాశ్వములను చంపి అతని సారథిని రథ ధ్వజమును పడగొట్టి అతనిపై అనేక శరవర్షములను కురిపించెను. కృతవర్మ సర్వావయవములు గాయపడి హతాశ్వమైన తన రథమునుండి నీ స్యాలకుడైన వృషకుని రథముపైకి పోయెను. తరువాత భీముడు నీ సేనను సంహరించెను.

జనమేజయా! ఇట్లు సంజయుడు చెప్పిన యుద్ధ వృత్తాంతమును విని ధృతరాష్ట్రుడు సంజయునితో ఇట్లనెను

## ఉభయవీరుల పరస్పర పరాజయము

సంజయా! పాండవులు మావారితో చేసిన అతి విచిత్రములైన ద్వైరథ యుద్ధములను గూర్చి వినిపించితివి. మావారిని గూర్చిన సంతోషవార్త ఏమియు చెప్పుకున్నావు. ఎల్లప్పుడు పాండవులు హర్షించినట్లు మా పక్షము భంగపడినట్లు ప్రశంసించుచుంటివి. మావారు దీనులై తేజోహీనులై జీర్ణించుచున్నట్లు చెప్పుచుంటివి. దీనికి మా దౌర్భాగ్యము వారి సౌభాగ్యమే కారణము. సంశయము లేదు.

జనమేజయా! ధృతరాష్ట్రుని మాటలువిని సంజయుడు అతనితో ఇట్లనెను.

రాజా! మీవారు యుద్ధమునందు శక్తిని ఉత్సాహమునుచూపి ప్రయత్నించి పోరాడుచునే ఉన్నారు. తమశక్తి కొలది పౌరుషమును చూపుచున్నారు కాని, గంగానది యొక్క స్వాదుజలము సముద్రములో కలిసినప్పుడు లవణత్వమును పొందినట్లే మీవారి పౌరుషము గూడ పాండవులను జేరి వ్యర్థమగుచున్నది. మీ వారు యథాశక్తిగా దుష్కరమైన యుద్ధకర్మను చేయుచునేయున్నారు. లేశ మాత్రము గూడ వారి దోషము లేదు. రాజా! నీవు నీ పుత్రులు చేసిన మహాప రాధము వలన భూమండలమునకు నాశనము కల్గుచున్నది. దీనిచేత యమరాజు రాష్ట్రమునందు జనసంఖ్య పెరుగుచున్నది. నీ యపరాధము వలన కలిగిన ఈ క్షయమును గూర్చి నీవు శోకింపతగదు.

రాజా! యుద్ధము చేయుచున్న ఈ రాజవీరులు ఊరకున్ననూ, జీవితములను రక్షించుకొనజాలరు. ఎన్నటికైననూ మరణించవలసినవారే. కనుక యుద్ధములో పోరాడి పుణ్యాత్ములు పోవు స్వర్గమునకు పోదలచి సైన్యములో దూరి పోరాడుచున్నారు.

మహారాజా! ఆ ఏడవరోజు పూర్వాహ్ణమునందు మహాజన క్షయముకల్గెను. అప్పుడు జరిగిన దేవదానవుల యుద్ధమువంటి సమరముగూర్చి చెప్పెద వినుము.

రాజా! అవంతీ దేశీయులైన విందాను విందులు రణోత్సాహముతో ఇరావంతునిఎదుర్కొనిరి. వారికి రోమాంచకరమైన యుద్ధము జరిగెను ఇరావంతుడు క్రుద్ధుడై ఆ ఇరువురు సోదరులను నిశితశరములతో కొట్టెను వారు కూడా ఇరావంతుని కొట్టిరి. వారు ఒకరికి తీసిపోవక మరియొకరు పోరాడిరి. ఇరావంతుడు నాల్గు బాణములచేత అనువిందుని నాలుగు గుర్రములను చంపెను. అతని ధనుస్సును ధ్వజమును రెండు భల్లములతో ఛేదించెను.

(ఎనభై మూడవ అధ్యాయము)

రాజా! అంతటితో అనువిందుడు తన రథమును వీడి విందుని రథము ఎక్కెను. ఆ యిరువురు ఏక రథస్థులై ఇరావంతునిపై బాణవర్షము కురిపించిరి. ఆ బాణములు ఆకాశమును అచ్ఛాదించెను. అప్పుడు ఇరావంతుడు విందానువిందులపై బాణవర్షము కురిపించి వారి సారథిని పడగొట్టెను. సారథి చావగా అశ్వములు పట్టుతప్పి దిక్కులకు పారిపోయెను.

రాజా! అట్లు ఉలూపిసుతుడైన ఇరావంతుడు విందానువిందులను జయించి పౌరుషముతో నీ సేనను క్షయమొందించుచుండెను. అప్పుడు మీ సేన విషము త్రాగిన వానివలె మలమూత్ర విసర్జనము చేయుచూ, భయముచే పారిపోయెను.

రాజా! ఘటోత్కచుడు భగదత్తుని ఎదిరించెను భగదత్తుడు గజారూఢుడై ఇంద్రుడు తారకాసుర యుద్ధమునందు ఐరావతము నెక్కి వచ్చినట్లు వచ్చి ఆదిత్యవర్ణముకల ఘటోత్కచుని రథముపైకి ఉరికెను. అప్పుడు ఆకాశమునందు నిలచి ఆ యిరువురి అద్భుత యుద్ధమును చూచుచున్న మహర్షులకు గంధర్వ

లకు భగదత్త ఘటోత్కచులలో హెచ్చుతగ్గులు కనబడకుండెను. దేవేంద్రుడు రాక్షసులను భయపెట్టి పారద్రోలినట్లు భగదత్తుడు పాండవసేనలను పారద్రోలెను.

రాజా! అట్లు పారిపోవుచున్న పాండవసేనలు తమను రక్షించువారిని కానకుండిరి. ఘటోత్కచుడు రథమునందేయుండెను. మిగిలినవారు దీనులై పారిపోయిరి అట్లు పాండవ సైన్యములు తిరిగిపోవగా నీ సైన్యములు భయంకరముగా కనబడుచుండెను రాజా! తర్వాత ఘటోత్కచుడు భగదత్తునిపై బాణవర్షము కురిపించెను. భగదత్తుడు అది ఛేదించి అతని మర్మములలో కొట్టెను. అప్పుడు ఘటోత్కచుడు ఏ మాత్రము వ్యథచెందక నిలిచెను. మరల భగదత్తుడు పదునాలుగు తోమరాయుధములను విడువగా వాటిని ఘటోత్కచుడు ఛేదించి అతనిపై డెబ్బది బాణములు ప్రయోగించెను.

అప్పుడు భగదత్తుడు నవ్వుచూ, ఘటోత్కచుని నాలుగు రథాశ్వములను వధించెను. హతాశ్వమైన రథమునుండి ఆ రాక్షసుడు భగదత్తుని గజముపై శక్తిని విసిరెను. భగదత్తుడు దానిని మూడు ముక్కలుచేసి పడగొట్టెను దానితో హిడింబాసుతుడు భయపడి ఇంద్రుని యుద్ధమునుండి నముచి రాక్షసునివలె పారిపోయెను.

రాజా! అట్లు భగదత్తుడు యమ వరుణులకుకూడా అజేయుడైన ఘటోత్కచుని జయించెను. అతని గజము పాండవసేనను వనగజము కమలసరస్సునువలె మర్దించెను.

రాజా! శల్యుడు నకులసహదేవులనుఎదిరించి ఆ యిరువురు మేనల్లుండ్రను బాణములతో ముంచెను. సహదేవుడు మేఘము సూర్యుని కప్పినట్లు శరములతో మేనమామ విడిచిన బాణములను నివారించి అతనిని గప్పెను. బాణములచేత గప్పబడిన శల్యుడు అందముగా ఉండెను తల్లి కారణముగా ఆ యిరువురికి అతనిపైన అతులమైన ప్రేమ కలిగెను.

రాజా! తరువాత శల్యుడు నకులుని ధ్వజమును ధనుస్సును ఛేదించి అతని సారథిని చంపి రథాశ్వములను వధించెను. అప్పుడు నకులుడు హతాశ్వమైన తన రథమునుండి వేగముగా ఎగిరి దుమికి సహదేవుని రథము ఎక్కెను.

ఆ యిరువురు ఏకరథస్థులై క్షణకాలములో శల్యుని రథమును బాణములతో కప్పిరి. అట్లు మేనల్లుం(డ్ర) బాణములచేత గప్పబడికూడా శల్యుడు పర్వతమువలె కంపించక నిలిచి వారి బాణవర్షమును చెదరగొట్టెను.

రాజా! తరువాత సహదేవుడు క్రుద్ధుడై శల్యునిపై బాణము ప్రయోగించెను. అది గరుడానిల వేగముతో శల్యుని భేదించి క్రింద పడెను. అట్లు గాయ పడి శల్యుడు బాధతో రథమునందు కూలబడి మిక్కిలి పరితపించెను.

రాజా! అట్లు మూర్ఛిల్లిన శల్యుని రథమును అతని సారథి తొలగించుకొని దూరముగా పోయెను. అట్లు తిరిగి వచ్చిన శల్యరథమును చూచి ధార్త రాష్ట్రులందరూ దీనులై యిక నితడు లేడు అని తలచిరి.

రాజా! ఆ విధముగా నకుల సహదేవులు యుద్ధమునందు మేనమామయైన శల్యుని జయించి శంఖములు ఊది సింహనాదము చేయుచూ హర్షముతో మీ సైన్యముపైకి ఇంద్రోపేంద్రులు రాక్షససైన్యముపై ఉరికినట్లు ఉరికి ముట్టడించిరి.

జనమేజయా! ఇట్లు సంజయుడు పాండవ కౌరవవీరుల ద్వంద్వ యుద్ధ క్రమమును గూర్చి ధృతరాష్ట్రునకు వర్ణించిచెప్పి తరువాతి యుద్ధ వృత్తాంతము నిట్లు చెప్పదొడగెను.

(ఎనభైనాల్గవ అధ్యాయము)

## ఉభయవీరుల ద్వంద్వ యుద్ధములు-విజయములు

ధృతరాష్ట్ర మహారాజా! తరువాత యుధిష్ఠిరుడు ఆనాటి మధ్యాహ్నమునందు శ్రుతాయువును ఎదుర్కొని తొమ్మిది బాణములను ప్రయోగించెను. శ్రుతాతాయువు ఆ బాణములను విరిచి యుధిష్ఠురునిపై ఏడుబాణములు విడిచెను. అవి ధర్మరాజు కవచమును భేదించి అతని దేహములోని ప్రాణములను వెదకుచున్నవా యనునట్లు అతని నెత్తురు త్రాగెను.

రాజా! అప్పుడు యుధిష్ఠిరుడు క్రుద్ధుడై వరాహ కర్ణబాణములతో శ్రుతాయువు యొక్క యెదపై కొట్టెను. అతని ధ్వజమును భల్లముచేత పడగొట్టి

అతనిని గూడ రథమునుండి క్రింద పడగొట్టెను. శ్రుతాయువు తన ధ్వజము పడుటచూచి ధర్మరాజును ఏడు బాణములతో కొట్టెను.

రాజా! తరువాత ధర్మపుత్రుడు అతిక్రోధముతో యుగాంతమునందు సర్వప్రాణులనుదహించు ప్రళయాగ్నివలె మండుచుండెను అట్లున్న యుధిష్ఠిరుని దేవ గంధర్వ రాక్షసులు చూచి మిక్కిలి వ్యథచెందిరి. సమస్తప్రపంచము వ్యాకుల పడెను. ఇప్పుడు మూడు లోకములను క్రుద్ధుడైన ఈ యుధిష్ఠిరుడు దహించ గలడు అని సర్వభూతములు తలచెను. దేవతలు ఋషులు మంగళ వచనములు ప్రపంచ శాంతికొరకు పఠించిరి.

రాజా! అట్లు క్రోధావిష్టుడైన ధర్మపుత్రుడు పెదవుల కొసలను నాకు చున్న యతని శరీరము ప్రళయకాల సూర్యునివలె ఘోరరూపముతో నుండెను.

రాజా! తరువాత మీ సైన్యములన్నియు జీవితముపై ఆశ వదలెను. అప్పుడు తన మహాక్రోధమును ధైర్యముతో అదుపులోనికి తెచ్చుకొని యుధిష్ఠి రుడు శ్రుతాయువు ధనుస్సును ఛేదించెను. అతని మెడపై బాణముతో కొట్టెను. గుఱ్ఱములను సారథిని చంపెను.

రాజా! తరువాత శ్రుతాయువు హతాశ్వమైన తన ఆ రథమును విడిచి ధర్మరాజు పౌరుషమును చూచి భయముతో యుద్ధము వీడి పారిపోయెను.

రాజా! అట్లు శ్రుతాయువును ధర్మపుత్రుడు జయింపగా దుర్యోధనుని సైన్యమంతయు పెడముఖముపెట్టి తిరిగిపోయెను. అప్పుడు ధర్మరాజు నోరు తెరచుకొనిన యమునివలె భయంకరుడై మీ సైన్యమును తరిమి చంపెను.

రాజా! చేకితానుడు కృపాచార్యుని బాణములతో ముంచెను. ఆ శరము లను కృపుడు నివారించి చేకితానునిపై బాణప్రయోగము చేసెను. అతని ధనుస్సును ఛేదించి సారథిని పడగొట్టి అశ్వములను చంపెను.

రాజా! అప్పుడు చేకితానుడు గదతో కృపాచార్యుని అశ్వములను సారథిని పడగొట్టెను. అప్పుడు కృపుడు నేలపై నిలచి పదియారు బాణములతో చేకితా నుని కొట్టెను. అంత నతడు క్రుద్ధుడై కృపుని ఇంద్రుడు వృత్రుని వధించునట్లు వధింపదలచి అతనిపై గదనుసిరెను. దానిని కృపుడు బాణములతో నివారించెను.

తరువాత చేకితానుడు ఖడ్గధారియై కృపునిపైకి ఉరికెను. అంతట కృపాచార్యుడు కూడ ఖడ్గము ధరించి చేకితానుని ఎదుర్కొనెను.

రాజా! ఆ యిరువురు వీరులు ఖడ్గ యుద్ధముచేయుచు ఒండొరుల శరీరములను గాయపరచుకొనుచుండిరి. ఇట్లు భూమిపై నిలిచి క్రోధావిష్టులై ఆ యిరువురు పోరాడుచుండగా కరకర్షుడు చేకితానుని తన రథమెక్కించుకొనెను. అట్లే శకుని కృపాచార్యుని తన రథముపై నెక్కించుకొనెను.

రాజా! క్రుద్ధుడైన ధృష్టకేతుడు సోమదత్త పుత్రుడైన భూరిశ్రవు నెదుర్కొని తొంబది బాణములచేత అతని యెదపై కొట్టెను అట్లు వక్షః స్థలముపై గ్రుచ్చుకొనిన బాణములచేత భూరిశ్రవుడు తేజరిల్లుచున్న కిరణములతో మధ్యందిన మార్తాండుని వలె ప్రకాశించుచు ధృష్టకేతుని యొక్క సారథిని అశ్వములను వధించి యతనిని విరథునిచేసి యతనిపై బాణ వర్షము కురిసెను.

రాజా ! తరువాత ధృష్టకేతుడు తన రథమును విడిచి శతానీకుని రథము నెక్కెను.

రాజా ! నీపుత్రులు చిత్రసేన, వికర్ణ దుర్మర్షణులు మహోత్సాహముతో అభిమన్యుని ఎదిరించిరి. వారికి ఘోరముగా యుద్ధము జరిగెను. అది శరీరమునకు వాత, పిత్తకఫములు అను త్రిదోషములతో జరిగిన పోరాటమువలెనుండెను. అభిమన్యుడు, ఆ ముగ్గురు నీ పుత్రులను విరథులను చేసికూడ భీముని వచనములను స్మరించుచు తనకు చేజిక్కినవానిని చంపలేదు.

రాజా ! అనేక చతురంగబలములతో నూర్లకొలది రాజులచేత చుట్టబడి నీ కొడుకులను రక్షించుటకు బాలకుడైన అభిమన్యునిపైకి పోవుచున్న భీష్ముని చూచి అర్జునుడు శ్రీకృష్ణునితో నిట్లనెను :

హృషీకేశా ! అనేక రథికులున్న ఆ చోటికి రథమును పోనిమ్ము. దేవతలకుకూడ అశక్యుడైన భీష్ముడు, యుద్ధపండితులైన అనేకశూరులు మన సేనను వధింపనున్నారు. అక్కడికి త్వరగా మనము పోవలెను.

రాజా! అట్లు అర్జునుడు చెప్పగానే కృష్ణుడు అవైపు రథము తోలుకొని పోయెను. మీవారిపై క్రుద్ధుడై అర్జునుడు వచ్చుట చూచిన మీ సైన్యములో సంచలనము కంపము కలిగెను.

రాజా ! అర్జునుడిట్లు భీష్మరక్షితులైన రాజులపైకి వచ్చి సుశర్మతో నిట్లనెను :

దుర్మదాంధా! నీవు పూర్వవైరంచేత మాపైకి వచ్చిన యుద్ధవీరుడవని నాకు తెలియును. నేడు నీ అవినీతి ఫలమున ననుభవించుటకు భయంకరమైన సమయము సంప్రాప్తమైనది ప్రేతలుగానున్న నీ పితామహులను నేడు నీకు చూపించెదను.

రాజా! ఇట్లు పలుకుచున్న అర్జునుని పురుషవాక్కులు విని సుశర్మ మంచి చెడులేమియు అర్జునునితో ననక అనేక రాజవీరులతో పరివృతుడై మేఘములు సూర్యుని కప్పినట్లు బాణములచేత అర్జునుని కప్పెను. అప్పుడు నెత్తురు వరదలు పారగా కౌరవపాండవ వీరులకు మహాయుద్ధము జరిగెను.

జనమేజయా ! ఇట్లు సంజయుడు ధృతరాష్ట్రునకు యుద్ధమును గూర్చి వర్ణించి చెప్పి తరువాతి యుద్ధ వృత్తాంతమును ఇట్లు చెప్పదొడగెను :-

## ఎనభైఅయిదవ అధ్యాయము

### అర్జునుని పరాక్రమము ;

రాజా ! ఆ మహాయుద్ధమునందు శత్రుశరములచేత కొట్టబడిన ధనంజయుడు తొక్కత్రొక్కిన పామువలె బుసకొట్టుచు ఒక్కొక్క బాణముచేత శత్రు రథికుల ధనుస్సులను ఛేదించి, వారిని నిశ్శేషముగా నిర్మూలింపదలచి, అందరిపై ఒక్క పెట్టున బాణవర్షము కురిసెను. ఆ వీరులు నెత్తుటదోగి అవయవములు శిరస్సు తెగిపోగా ప్రాణములు వీడి క్రిందపడిపోయిరి.

రాజా! అట్లు అర్జున హతులైన రాజపుత్రులనుచూచి త్రిగర్తరాజైన సుశర్మ ముప్పదిద్దరు మహారథికులతో అర్జును నెదిరించి అతనిపై మేఘములు వర్షములు గురిసినట్లు బాణములు గురిసెను. అట్లు శరవర్షముచేత పీడితుడై అర్జునుడు రోషముతో పదునైన అరువది బాణములచేత ఆ రాజవీరులను కొట్టి జయించెను.

రాజా ! ఆ విధముగా అర్జునుడు సైన్యములను జయించి భీష్మవధకారకు

భీష్ముని పైకి ఉరికెను. అప్పుడు త్రిగర్తరాజైన సుశర్మ తన బంధువులైన రాజవీరులందరు అర్జునునిచేత చంపబడుటచూచి వీరసైనికులతో పార్థుని ముట్టడించెను.

రాజా ! అప్పుడు శిఖండి ప్రముఖులైన వీరులు అర్జునునకు సహాయముగా పోయిరి. పిదప అర్జునుడు సుశర్మతోపాటు ఇతర రాజవీరులను కూడ ధ్వస్తులను చేసి భీష్ముని పైకి పోవదలచెను.

రాజా! అప్పుడు దుర్యోధనుడు సైంధవాది రాజులు అర్జునుని నివారించిరి. అప్పుడర్జునుడు క్షణమాత్రములో దుర్యోధనుని రాజవీరులను విడిచి భీష్మునివైపు పోయెను. భీష్ముడుకూడ ఇతరత్ర యుద్ధముచేయుట మాని అర్జునునెదుర్కొనెను. అప్పుడు యుధిష్ఠిరుడు కూడ శల్యునితో యుద్ధముచేయుట మాని భీమ, నకుల, సహదేవులతో భీష్మునెదుర్కొనుటకు వచ్చెను.

రాజా ! అట్లువచ్చిన పాండవవీరులను చూచి, భీష్ముడు యేమాత్రము వ్యథచెందలేదు. అప్పుడు సైంధవుడు పాండవ మహారథికుల ధనుస్సులను ఛేదించెను దుర్యోధనుడు పంచపాండవులను కృష్ణుని అగ్నివంటి బాణములతో కొట్టెను.

రాజా ! తరువాత కృప, శల, శల్య, చిత్రసేనాదులచేత కొట్టబడిన పాండవసైనికవీరులు, దేవతలు, రాక్షసగణములతో పోరాడినట్లు వారితో యుద్ధము చేసిరి. అప్పుడు భీష్మునిచేత ఆయుధము ఖండింపబడియున్న శిఖండిని చూచి (ఇక్కడ భీష్ముడు శిఖండి ధనుస్సునే కొట్టెను. శిఖండిని కొట్టలేదు. కనుక దోషములేదు) అతి కోపముతో యుధిష్ఠిరుడిట్లనెను.

శిఖండీ ! నీవు "భీష్ముని యుద్ధమునందు చంపెదను" అని నీతండ్రి యెదుటనే నాతో ప్రతిజ్ఞ చేసితివి. కాని, అది నెరవేర్చలేదు. భీష్ముని చంపవైతివి. మిథ్యాప్రతిజ్ఞుడవు కాకుము. నీ కులమును, ధర్మమును, కీర్తిని రక్షించు కొనుము. ప్రళయకాలయముని వలె భయంకరవేగముతో బాణములను ప్రయోగించి నా సైన్యముల నన్నిటిని పరితపింపజేయుచున్న భీష్ముని చూడుము. అతనిచేత ఖండింపబడిన ధనుస్సు కలవాడవై యుద్ధమునందు ఆశ విడిచి భీష్మునకు ఓడి, బంధువులను సోదరులను విడిచి ఇప్పుడెక్కడికి పోవుచున్నావు? ఇది నీకు తగదు. ద్రుపదపుత్రా! అనంతపరాక్రమము గల భీష్ముని అతనికి ఓడి పారిపోవుచున్న సైన్యమును చూచి, నీవు నిక్కముగా భయపడుచున్నటు నీముఖ

వర్ణము వలన తెలియుచున్నది. యుద్ధమునందు అర్జునుని బలపరాక్రమములను గూడ నీవు తెలియజాలక భీష్మునకు భయపడుచున్నావు.

ధృతరాష్ట్ర మహారాజా! అట్లు యుధిష్ఠిరుడు కఠినముగా విరుద్ధాలాపములతో అధిక్షేపించుట చూచి శిఖండి అది యుధిష్ఠిరుని ఆజ్ఞగా తలంచి భీష్మవధ కొరకు త్వరగా అతనిపైకి ఉరికెను.

రాజా! అట్లు మహావేగముతో భీష్మునిపైకి వచ్చుచున్న శిఖండిని శల్యుడు బాణములచేత అడ్డగించెను. అప్పుడు శిఖండి ఏమాత్రము మోహము చెందక, శల్యుని యస్త్రమును త్రిప్పికొట్టెను. తరువాత శిఖండి వారుణాస్త్రము ప్రయోగించెను. ఆ యస్త్రము శల్యుడు నివారించెను. అప్పుడు దేవతలు. రాజవీరులు ఆశ్చర్యముతో చూచిరి.

రాజా! భీష్ముడు యుధిష్ఠిరుని ధనుస్సును, ధ్వజమును ఛేదించెను. అప్పుడు భయపడిన యుధిష్ఠిరునిచూచి భీమసేనుడు ధనుర్బాణములను విడిచి గదాపాణియై నడచుచు సైంధవుని ఎదుర్కొనెను. సైంధవుడు, భీమునిపై ఐదునూర్ల నిశితశరములను ప్రయోగించెను. దానితో అతిక్రుద్ధుడై భీముడు సైంధవుని అశ్వములను చంపెను.

రాజా! తరువాత దుర్యోధనుడు త్వరపడుచు భీమసేనుని చంపుటకు వచ్చెను. భీముడుకూడ సింహనాదము చేసి దుర్యోధనుని ఎదిరించెను. అప్పుడు సైంధవుడు హతాశ్వమైన తన రథమును విడిచి, దుర్యోధనునికి బాసటగా పోయెను. కాని, భీమునిచూచి భయార్తుడైనాడు. అంతట భీముడు గదతో సైంధవుని, దుర్యోధనుని చంపదలచి వారిపైకి ఉరికెను.

రాజా! కౌరవవీరులు యమదండము వంటి భీముని గదనుచూచి ఆ గదాఘాతములను తప్పించుకొనుటకు దుర్యోధనుని వీడి మహాభయంకరమైన సంకుల సమరమునుండి దూరముగ తొలగిపోయిరి.

అప్పుడు నీకొడుకు చిత్రసేనుడు తనపై పడబోవుచున్న గదనుచూచి ఏమియు తోచక ఖడ్గధారియై రథము విడిచి భూమిపైకి వచ్చి వేరుచోటికిపోయెను అప్పుడు ఆ గద చిత్రసేనుని రథమును సారథిని అశ్వములను నశింపజేసి మండుచున్న కొరవి ఆకాశమునుండి జారిపడినట్లుగా భూమిపై పడెను. ఆ మహాశ్చర్య

మును చూచి మీవారు, సంతోషించి సింహనాదముచేసి నీ పుత్రుడైన దుర్యోధ నుని శౌర్యమును అభినందించిరి.

జనమేజయా ! సంజయుడు ధృతరాష్ట్రునకు తరువాతి యుద్ధవృత్తాంత మిట్లు చెప్పదొడగెను.

ఎనభైయారవ అధ్యాయము

## భీష్మయుధిష్ఠిరుల యుద్ధము :

రాజా! అట్లు విరథుడైన చిత్రసేనుని నీ కొడుకు వికర్ణుడు తన రథము నెక్కించుకొనెను. ఆ విధముగ యుద్ధము జరుగుచుండగ భీష్ముడు, యుధిష్ఠిరుని పైకి త్వరగా ఉరికెను అతనిని చూచి, సృంజయుల చతురంగబలములు గడగడ వణికెను. యుధిష్ఠిరుడు కూడ నకులసహదేవులతో భీష్ము నెదిరించెను. భీష్మునిపై అనేక సహస్ర బాణములు ప్రయోగించెను. అవి మేఘము సూర్యునివలె భీష్ముని గప్పెను.

రాజా! అప్పుడు భీష్మప్రయుక్తములైన అనేక సహస్ర బాణములు ఆకా శమునందు పక్షులవలె తిరుగుచుండెను. ఆ బాణజాలము చేత భీష్ముడు యుధి ష్ఠిరుని కప్పి కనబడకుండచేసెను.

రాజా! తరువాత యుధిష్ఠిరుడు సర్పమువంటి బాణమును భీష్మునిపై విడి చెను. దానిని భీష్ముడు నడుమనే ఛేదించి యతని గుఱ్ఱములను చంపెను. అప్పుడు ధర్మరాజు హతాశ్వమైన తన రథమునుండియే భీష్మునిపై శక్తిని విసి రెను. యమపాశమువలె తనపై పడబోవుచున్న ఆ శక్తిని భీష్ముడు బాణముల చేత ఛేదించెను. అంతట తన రథమును వీడి ధర్మపుత్రుడు నకులుని రథము పైకి పోయెను.

రాజా! తరువాత భీష్ముడు నకులసహదేవులనుకూడ బాణములతో కొట్టెను అట్లు భీష్మపీడితులైన నకులసహదేవులను చూచి ధర్మరాజు చాల చింతచెంది "భీష్ముని వధింపుడు" అని తన వెంటనున్న రాజవీరులను పురికొల్పెను. అంతట

వారందరు భీష్ముని చుట్టుముట్టిరి. అప్పుడు భీష్ముడు ఆ మహారథికులను పడ గొట్టుచు రణములో క్రీడించెను.

రాజా! అట్లు మృగముల నడుమ తిరుగుచున్న సింహకిశోరము వలె వీర విహారము చేయుచున్న భీష్ముని పాండవులు భయముతో చూచిరి. అతడందరిని బెదిరించుచుండెను. అతనిని వారు, మృగములు సింహమును చూచి బెదరినట్లు భయపడిరి. వాయుసహాయముతో అగ్ని గడ్డివామును దహించినట్లు బాధపెట్టు చున్న భీష్ముని క్షత్రియులందరు చూచిరి. భీష్ముడు శత్రువులను తాటిచెట్లనుండి పండ్లను పడగొట్టినట్లు కొట్టి నేలపై పడవేయుచుండెను. ఆ శిరస్సులు పాషాణ ములవలె టపటప శబ్దములతో నేలవ్రాలుచుండెను. అట్లు ఆ సంకులసమరము జరుగుచున్నప్పుడు సేనలలో మహాకల్లోలములు కలిగెను. క్షత్రియులు ఒండొరు లను పిలుచుకొనుచు యుద్ధమునకు సన్నద్ధులయిపోవుచుండిరి.

రాజా! తరువాత శిఖండి భీష్ముని "నిలు నిలు"మని తరుముచు నతనిపై పడబోయెను. భీష్ముడు "శిఖండి పూర్వము స్త్రీ"యని తలంపుతో నతనిని విడిచి సృంజయులపైకిబోయెను. అపుడు సృంజయులు, భీష్ముడు తమపై వచ్చుచుండు టను జూచి సింహనాదములు చేసి శంఖములు పూరించిరి. అప్పుడు వారికి గొప్పగా రథయుద్ధము జరిగెను. సూర్యుడు పశ్చిమదిశకు వ్రాలుచుండెను.

## సాత్యకి-ధృష్టద్యుమ్నులు విందానువిందులతో పోరాడుట :

రాజా! ఆ యపరాహ్ణసమయమందు ధృష్టద్యుమ్న సాత్యకులు శక్తితో మరాధ్యాయుధములచేత శత్రుసైన్యములను పీడించుచు వధించుచుండిరి. అట్లు చంపబడుచుగూడ మీవారు యుద్ధము విడిచిపోవుట ధర్మముగాదని శక్తికొలది పోరాడుచునే శత్రుసంహారము చేయుచుండిరి. అప్పుడు ధృష్టద్యుమ్నుడు మీవారిని వధించుచుండగా మీ సైన్యములో పెద్దగా దుఃఖధ్వనులు బయలుదేరెను.

రాజా! అప్పుడు సైన్యరక్షణార్థమై అవంతీదేశ సోదరులైన విందాను విందులు ధృష్టద్యుమ్ననెదిరించి యతని యశ్వములను హతమార్చి యతనిపై శరవర్షము గురిసిరి. అప్పుడు ధృష్టద్యుమ్నుడు హతాశ్వమైన తన రథమునుండి దుమికి సాత్యకి రథమెక్కెను.

## ద్రోణాదుల పరాక్రమము :

రాజా! తరువాత యుధిష్ఠిరుడు మహాసేనతో విందానువిందుల నెదుర్కొనెను. అప్పుడు దుర్యోధనుడు మిక్కిలి పూనికతో ఆ యిరువురకు సహాయకుడుగా వచ్చెను. అప్పుడు అర్జునుడుగూడ క్రుద్ధుడై ముందుకువచ్చి ఇంద్రుడు రాక్షసులను వలె శత్రు క్షత్రియవీరులను చెండాడుచుండెను. ద్రోణాచార్యు డప్పుడు నీ పుత్రునకు హితము చేయగోరి ముందుకువచ్చి పాంచాల సైన్యమును అగ్ని దూదినివలె హతమార్చుచుండెను.

రాజా! అప్పుడు నీ పుత్రులు దుర్యోధనుని ముందిడుకొని భీష్మునితోచేరి పాండవులతో పోరాడిరి. సూర్యుడస్తమింపబోవుచుండగా దుర్యోధనుడు మీ సైన్యమును "త్వరగా యుద్ధముచేయుడు'' అని ప్రోత్సహించుచుండెను. ఇట్లు వారు యుద్ధముచేయుచుండగా సూర్యుడు ప్రకాశము తగ్గి అస్తమించుచుండెను. అప్పుడు గుల్మములను (గుల్మమనగా ప్రధానపురుషులతో గూడిన రక్షకదళము దీనిలో తొమ్మిది గజములు. తొమ్మిది రథములు. ఇరువది యేడుగురు ఆశ్వికులు నలుబదియైదుగురు పదాతులుండెదరు) విశ్రాంతికి విడిచిరి.

ఆ మునిమాపున రక్తనదులు రణరంగమునందు పారుచుండెను. నక్కలు అరచుచు భయంకరముగ ఏడ్చుచుండెను. ఆ యశుభధ్వనులతో యుద్ధము ఆ నాటికి ముగిసెను. అప్పుడు రాక్షసులు పిశాచములు అంతటను మూర్ఖకొలదిగ వేలకొలదిగ కనబడెను.

రాజా! అర్జునుడు సుశర్మాదులను జయించి తన శిబిరమునకు బోయెను. అటు యుధిష్ఠిరాదులు ఇటు భీష్మాదులు యుద్ధరంగమునుండి తమ తమ శిబిరములకు పోయి స్నానాదులు చేసి యెందొరులను ప్రశంసించుకొనుచు ఆ రాత్రి సుఖశయనము చేసిరి. అంతటితో ఏడవనాటి యుద్ధము సమాప్తమయ్యెను.

జనమేజయా! సంజయుడు ధృతరాష్ట్రునకు తరువాతి యుద్ధవృత్తాంత మిట్లు చెప్పదొడంగెను :

## ఎనభైయేడవ అధ్యాయము

# అష్టమ దివస యుద్ధము- ఉభయసైనికులు

రాజా! మరునాడు కౌరవపాండవ సైన్యములు మరల యుద్ధయాత్రకు వెడలిరి. అప్పుడు ఉభయ సేనల ధ్వని సముద్ర ధ్వనివలె విపరీతముగానుండెను.

రాజా! అప్పుడు దుర్యోధన-చిత్రసేన-వివింశతి-భీష్మ ద్రోణాదులు ఏకముగా చేరి "మహావ్యూహము"ను పన్ని యుద్ధమునకు సాగిరి. ఆ సేనావ్యూహము వాహనతరంగములచేత మహాసాగరమువలె నుండెను. దాని ముందుభాగమునందు భీష్ముడు, మాలవ- దాక్షిణాత్య- అవంతీ సైనికులతో నిలిచెను. ఆయన వెను వెంటనే ద్రోణాచార్యుడు, పుళింద-పారద-క్షుద్రక-మాలవ సైనికులతో నిలిచెను. ద్రోణుని వెనుక భగదత్తుడు, మాగధ-కళింగ-పిశాచ సైన్యములతో నిలిచెను. ఈ విధముగ బృహద్బల-సుశర్మ-అశ్వత్థామలు, ఒకరివెంటనొకరు అనేకసైన్యములతో సాగిపోవుచుండిరి. ఆ మహాసైన్యము వెనుక దుర్యోధనుడు తన సోదరులతో అశ్వత్థామకు వెనుకగా పోవుచుండెను. అతని వెనుక కృపుడుండెను.

రాజా! ఈ విధముగా సాగరము వంటి మీ మహాసైన్యము సాగిపోవుచుండెను. ఆ సేనలో ధ్వజచ్ఛత్రాదులు ప్రకాశించుచుండెను. సైనికుల భూషణాదులు వెలుగొందుచుండెను.

ఆ విధముగ సిద్ధమైయున్న మీ సైన్యమును చూచి యుధిష్ఠిరుడు సేనాపతియైన ధృష్టద్యుమ్నునితో నిట్లనెను:

రాజా! చూచితివా సముద్రము వంటి శత్రుసేనా వ్యూహమును, నీవుగూడ వెంటనే దానికి ప్రతిగా మనసైన్యపు మొగ్గరమును పన్నుము.

ఆ మాట విని దృష్టద్యుమ్నుడు 'శృంగాటక' వ్యూహమును నిర్మించెను. అది శత్రువ్యూహ వినాశకరముగానుండెను. దాని శృంగములందు భీమసేన సాత్యకులు నిలచిరి. వారికి తోడుగ వేయి రథములు పదాతిదళములు నుండెను. ఆ యిరువురితో కృష్ణసారథితో అర్జునుడు నిలిచియుండెను. ఆ వ్యూహమధ్యభాగమునందు యుధిష్ఠిరుడు నకులసహదేవులతో నిలిచెను. ఆ తరువాత ఉత్తర పార్శ్వమునందు మహారథికులైన రాజవీరులు సైన్యములతో నిలిచియుండిరి. ఆ

వెనుక అభిమన్యు-విరాట-ద్రౌపదీపుత్ర-ఘటోత్కచులు నిలచియుండిరి. రాజా! ఆ రెండు సేనలు వ్యూహరచనలు చేసి యుద్ధమునకు సన్నద్ధులై యుద్ధయాత్రకు వెడలిరి.

రాజా! తరువాత యోధుల సింహనాదములు, వాహనాల ధ్వనులు మిన్ను ముట్టెను. ఉభయసేనలు ఒండొరులను పేర్లుపెట్టి పిలుచుకొనుచు యుద్ధమునకు పూనిరి. అంతట మీవారికి, శత్రువులకు ఘోరముగ సంకులసమరము జరిగెను. ఒండొరులను చంపుకొనుచుండిరి. సర్పముల వంటి బాణములను ప్రయోగించు చుండిరి. అవి మేఘములనుండి పిడుగులవలె పడుచుండెను. పర్వత శృంగముల వంటి గదలు, ఒండొరులపై విసురుకొనుచుండిరి. స్వచ్ఛాకాశము వంటి ఖడ్గము లతో కొట్టుకొనుచుండిరి. ఇట్లు వారు దేవదానవులవలె ఒండొరులపై పరుగెత్తుచు కొట్టుకొనుచుండిరి.

రాజా! రథయుద్ధములో రథములనొగలు ఒండొంటిని ఒరసికొనుచు తిరుగు చుండెను. గజములు రాచుకొనుటచేత వాటి దంతములనుండి అగ్నిపుట్టెను. అది ధూమముతో నలువైపుల వ్యాపించెను. గిరి శృంగములవలె గజములు నేలగూలు చుండెను. పదాతిదళములు వివిధాయుధములచేత పరస్పరము కొట్టుకొనుచు చచ్చు చుండిరి.

రాజా! తరువాత భీష్ముడు రథధ్వనిచేత పాండవులనెదుర్కొని ధనుష్టం కారము చేత వారిని మోహపరచెను. పాండవులుగూడ తమ సేనాపతి ధృష్ట ద్యుమ్నుని ముందిడుకొని భీష్మాదివీరుల నెదిరించిరి. ఆ రెండు సేనలకు ఘోర ముగా యుద్ధము జరిగెను.

జనమేజయా! సంజయుడు ధృతరాష్ట్రునకు ఇట్లుచెప్పి తరువాతి యుద్ధ క్రమమిట్లు చెప్పదొడగెను :

### ఎనభై ఎనిమిదవ అధ్యాయము

## భీష్ముని పరాక్రమము ;

రాజా! తపించుచున్న సూర్యునివలె తమపైబడి వచ్చుచున్న భీష్ముని ఎది రించుటకు పాండవులకు శక్తి చాలకుండెను. అయినను ధర్మపుత్రుని ఆదేశము

చేత సర్వసైన్యములు భీష్ము నెదుర్కొని నిశితశరములు ప్రయోగించుచుండిరి. భీష్ముడు సోమక, సృంజయ, పాంచాలాది సైనికులను చెండాడుచుండెను. అట్లయినను ఆ సైనికులు మృత్యుభయమును వీడి భీష్మునిపైకే ఉరుకుచుండిరి. అప్పుడు భీష్ముడు ఆ సైనికుల శిరస్సులను బాహువులను ఛేదించి వారిని విరథులను చేసెను.

అప్పుడు పాండవసైన్యములో అశ్వికుల తలలు తెగి క్రిందపడుచుండెను. గజారోహకులు చచ్చుటచేత పర్వతముల వంటి గజములు నేలగూలుచుండెను. పాండవసేనలో భీమసేనుని తప్ప భీష్ముడు అందరిని మోహపరచుచుండెను. భీముడు భీష్మునిపై బాణప్రయోగము చేసెను. తరువాత భీష్మ భీమసమాగమమునందు ఘోరమైన నిష్ఠానకము (కోలాహలము) కలిగెను. (ఎక్కడివారక్కడ కదలక నిలచి చూచుచుండిరి.)

రాజా! అట్లే పాండవులుగూడ హర్షముతో సింహనాదముచేసిరి. తరువాత దుర్యోధనుడు సోదరులతో కలిసి భీష్మునకు బాసటగా వచ్చెను. అప్పుడు భీముడు భీష్ముని సారథిని చంపెను. హతసారథియైన భీష్మ నిరథము అదుపులేక తిరుగుచుండెను. భీముడు భయంకరముగా యుద్ధరంగమునందు తిరుగుచుండెను.

## భీముడు ఎనమండుగురు ధార్తరాష్ట్రులను వధించుట :

రాజా! అప్పుడు నీ పుత్రుడు 'సునాభుడు' భీమసేనుని పైకి వచ్చి అతనిని వదునైన ఏడు బాణములతో కొట్టెను. భీముడు ఒక్కబాణముతో సునాభుని శిరస్సు ఛేదించి నేలపైగూల్చెను. అతడు చావగా అతని సోదరులైన నీ పుత్రులేడుగురు భీమునిపై దాడిచేసిరి ఆ యేడుగురు "ఆదిత్యకేతువు-బహ్వాశి-కుండధారుడు-మహోదరుడు-అపరాజితుడు-పండితకుడు-విశాలాక్షుడు" అనువారు. ఈ యేడుగురు పరిపూర్ణ సన్నాహముతో భీమునెదిరించిరి.

రాజా! మహోదరుడు తొమ్మిది బాణములచేత ఆదిత్యకేతువు డెబ్బది బాణములచేత బహ్వాశి అయిదింటిచేత, కుండధారుడు తొంబది బాణములచేత, విశాలాక్షుడు ఐదింటిచేత, అపరాజితుడు అనేకబాణములచేత, రణపండితుడు మూడు బాణములతోను భీమసేనుని కొట్టిరి.

రాజా! అది సహింపజాలక భీముడు అపరాజితుని శిరస్సు ఛేదించి నేల గూల్చెను. ఇట్లే కుండధారుని, పండితకుని, విశాలాక్షుని, మహోదరుని, ఆదిత్య కేతువును, బహ్వాశిని ఒక్కొక్కరిని వధించి క్రింద పడగొట్టెను. అది చూచి రాజా! నీ యితర పుత్రులు "ఆనాడు సభలో భీముడు చేసిన ప్రతిజ్ఞ నేరవేర్చు కొనుచున్నాడు" అని తలచి పారిపోయిరి.

రాజా! తరువాత దుర్యోధనుడు భ్రాతృదుఃఖపీడితుడై మీ యోధులకు "ఈ భీముని చంపుడు" అని ఆజ్ఞాపించెను.

రాజా! ఇట్లు చచ్చిన నీ పుత్రులను చూచి తక్కిన పుత్రులు "ఆనాడు సభలో విదురుడు చెప్పిన హితవాక్యములు ఇప్పుడు సత్యములగుచున్నవి. అతడు దివ్యదృష్టి కలవాడు" అని తలచి దుర్యోధనునితో "రాజా! అప్పుడు విదురుని మాటలను నీవు పెడచెవిని పెట్టితివి. చూడుమిప్పుడు భీముడు మన సోదరులను వరుసబెట్టి చంపుచున్నాడు" అని యనిరి.

## భీష్మ దుర్యోధనులు ఆలోచించుట

ధృతరాష్ట్ర మహారాజా! తరువాత దుర్యోధనుడు సోదరుల మరణము వలన దుఃఖించుచు భీష్ముని కడకు పోయి బిగ్గరగా ఏడ్చి ఆయనతో నిట్లనెను.

"పితామహా! భీమసేనుడు నా సోదరులను చంపెను. ఇంకను చంప నున్నాడు. అతడు సర్వసైనికులను చంపుచున్నాడు. నీవైతే మధ్యస్థుడవైయుండి సర్వదా మమ్ము ఉపేక్షించుచున్నావు. నేను నిన్నాశ్రయించి పెడత్రోవపట్టి పోవుచున్నాను అని తలచుచున్నాను. దైవము నాకు ఎంతగా వ్యతిరేకమైనదో చూడుము.

రాజా! దుర్యోధనుని ఆ దురుసు మాటలు విని భీష్ముడు కన్నీళ్ళు దెచ్చు కొనుచు దుర్యోధనునితో నిట్లనెను.

సుయోధనా! పూర్వమే నేను ద్రోణాచార్యుడు, విదురుడు గాంధారి ఈ విషయము నీకు నొక్కి చెప్పితిమి మా మాట నీవు తెలిసికొనజాలకపోయితివి. నన్ను, ద్రోణాచార్యుని యుద్ధమునందు వియోగింపవద్దని ఆనాడే నీకు చెప్పితిని. యుద్ధమునందు కనబడిన నీ సోదరులనందరిని భీమసేనుడు తప్పక చంపును.

కనుక నీవు దృఢనిశ్చయముతో స్థిరముగా నిలిచి నీకు "పరమప్రాప్యము స్వర్గమే" అనితలచి పాండవులతో యుద్ధము చేయుము. ఇంద్రాదిదేవ రాక్షసులు ఏకమై వచ్చినను పాండవులను జయించుట శక్యము కాదు. కనుక స్థిరనిశ్చయముతో యుద్ధము చేయుము.

జనమేజయా! సంజయుడు ఇట్లు చెప్పగా విని ధృతరాష్ట్రు డిట్లనెను.

ఎనభై తొమ్మిదవ అధ్యాయము

## ఉభయ సైనికుల తుముల యుద్ధము

సంజయా! ఒక్కనిచేత ఇందరు నా పుత్రులు చంపబడుట చూచి భీష్మ ద్రోణకృపాచార్యులు ఏమిచేయుచుండిరి? ప్రతిదినము నా పుత్రుల మరణవార్తను వినుచున్నాను. సంజయా! నేను మిక్కిలి దైవోపహతుడను సుమా! భీష్మ ద్రోణ భగదత్త అశ్వత్థామాది మహాశూరులమధ్యనున్నప్పటికిన్ని నా పుత్రులు నశించు చున్నారే కాని జయించుట లేదు. ఇది నా దౌర్భాగ్యము తప్ప మరిఏమి యున్నది?

పూర్వము నేను భీష్ముడు, విదురుడు, గాంధారి ఎంతగా ఉపదేశించి యుద్ధము చేయవద్దని వారించినను మందబుద్ధియైన దుర్యోధనుడు దుర్బుద్ధి గలవాడై మా ఉపదేశమును మోహముచేత పెడచెవిని బెట్టెను. దాని దుష్ఫలితమే యిప్పుడు అనుభవించుచున్నాడు. ప్రతిదినము క్రుద్ధుడైన భీమసేనుడు, నా పుత్రులను యమలోకమునకు బంపుచున్నాడు. ఇక నా దుఃఖానికి అంతము లేదా?

జనమేజయా! ధృతరాష్ట్రుని మాటలువిని సంజయుడు అతనితో నిట్లనెను.

"మహారాజా! పూర్వము విదురుని సదుపదేశము వినవైతివి. విదురుడు "నీ కొడుకులను జూదమునుండి ఆపుము. పాండవులపై ద్రోహముతలపెట్టకుము" అని చెప్పెను. ఆమాటలే నీ హితము కోరు మిత్రులు గూడ చెప్పిరి. అవి నీవు పథ్యమును ఔషధమును సేవించనిరోగివలె వినకపోయితివి. దాని దుఃష్ఫలితమే ఇప్పుడు నీవు అనుభవించుచున్నావు.

విదుర-ద్రోణ-భీష్ములు నీ హితముకోరు యితరులున్ను చెప్పిన పథ్య

వచనములను వినని కౌరవులిప్పుడు నశించుచున్నారు. కనుక ఇప్పుడు జరుగుచున్న యుద్ధక్రమమును వర్ణించి చెప్పెద వినుము.

రాజా! ఎనిమిదవనాటి మధ్యాహ్నమునందు రౌద్రముగా మహాయుద్ధము జరిగెను. అది లోకక్షయకరముగా నుండెను. ధర్మపుత్రుని ఆదేశముచేత సమస్త పాండవ సైనికులు సంరంభముతో భీష్ముని చంపదలచి అతనిని ఎదిరించిరి.

రాజా! ధృష్టద్యుమ్నుడు-శిఖండి-సాత్యకి-సోమక సైన్యములతో ద్రుపద విరాటులు సేనలతో భీష్ముని ముట్టడించిరి. కేకయులు ధృష్టకేతువు, కుంతిభోజుడు కూడ వారిననుసరించిరి. అర్జునుడు ద్రౌపదీపుత్రులు, సాత్యకి, దుర్యోధనుడు పంపిన రాజవీరుల నెదిరించిరి. అభిమన్యు-ఘటోత్కచ-భీమసేనులు కౌరవులపై బడిరి.

రాజా! పాండవసేనలు మూడుగాచీలి కౌరవులను మూడువైపుల వధించిరి. అట్లే కౌరవులు కూడ పాండవసేనలను వధించుచుండిరి. ద్రోణాచార్యుని చేత చంపబడిన క్షత్రియవీరులు రోగగ్రస్తులై చేష్టలుడిగి పడిన మనుష్యులవలె పడియుండిరి. క్షతగాత్రులైన అనేకవీరులు క్రిందపడి ఆకలిగొన్న నరులవలె అరచుచు మొరబెట్టుచుండిరి.

రాజా! ఆ విధముగనే భీమసేనుడు గూడ ప్రళయకాల యముని వలె క్రుద్ధుడై యుద్ధము చేసి అనేక సైనికులను వధించెను. ఇట్లు చంపబడిన కౌరవ పాండవ సైనికులచేత యముని రాష్ట్రము వృద్ధిచెందుచుండెను.

రాజా! తరువాత భీముడు కోపముతో గజసైన్యమును మర్దింపగా నవి ఘీంకరించుచు నేల వ్రాలుచుండెను. కొన్ని తొండములు తెగి, అవయవములు ఛేదింపబడి దిక్కులకు పారిపోయెను. మరికొన్ని నేలపై పర్వతశిఖరముల వలె కూలెను.

రాజా! నకులసహదేవులు అశ్వసైన్యములను చంపజొచ్చిరి. సువర్ణాలంకృతములైన హయములు వేలకొలదిగను చంపబడుచుండెను. నాలుకలు తెగి విశ్వసించుచు సకిలించుచు పడియున్న గుఱ్ఱములచేత భూమి నానారూపములతో శోభిల్లెను.

రాజా! అర్జునునిచేత చంపడిన రాజవీరులచేత భూమియంతటను ప్రకా-

శించెను. అనుకర్షములు (ఇరుసులు) భగ్నములు కాగా విరిగిపడిన రథములు, ధ్వజములు, ఆయుధములు, చామర వ్యజనాదులు హారకేయూరసహితశిరస్సులు రణరంగమంతటను వ్యాపించి సంకీర్ణముఁగ భూమి వసంతఋతువునందు వివిధకుసుమములచేత భాసిల్లు వనమువలె కనబడుచుండెను.

రాజా! ఈ విధముగనే పాండవుల వైపు గూడ సైనికులు భీష్మ ద్రోణ అశ్వత్థామ కృప కృతవర్మాదులచేత చంపబడగా వారి యుద్ధరంగము కూడా ఇట్లే ఆయెను.

జనమేజయా! సంజయుడిట్లు ధృతరాష్ట్రునకు తరువాతి యుద్ధవృత్తాంతమిట్లు చెప్పదొడగెను.

(తొంబదియవ అధ్యాయము)

## ఇరావంతునిచేత శకుని సోదరులవధ

రాజా! వీరనాశంకరమైన ఘోరయుద్ధము జరుగుచుండగా శకుని పాండవులపై దాడి చేసెను. హార్దిక్యుడు పాండవుల సేనపై దాడిచేసెను. అప్పుడు అర్జున పుత్రుడైన ఇరావంతుడు వివిధదేశోత్పన్నములైన అశ్వములు సైన్యముతో ఆ కౌరవసైన్యము నెదిరించెను.

రాజా! ఇరావంతుని తల్లిని, ఆమె తండ్రి ఐరావంతుడు ఒక నాగరాజున కిచ్చి పెండ్లి చేసెను. ఆమె అనపత్యురాలుగనుండగనే ఆమెపతిని గరుత్మంతుడు సంహరించెను. అప్పుడామె దీనురాలై యుండెను. ఆ సమయమునందు తీర్థయాత్రగా నాగలోకమునకు పోయిన అర్జునుని చూచి ఆమె కామించెను. అర్జునుడామెను పెండ్లియాడి ఇరావంతుని కనెను. అతనిని తల్లి పెంచుచుండగా అతని పినతండ్రి యతనిని అర్జునునిపై ద్వేషముచేత విడిచెను. ఇరావంతుడు రూపగుణసంపన్నుడైన పరాక్రమవంతుడు.

అర్జునుడు స్వర్గమునకు పోయినాడని విని యిరావంతుడు స్వర్గమునకు పోయి అర్జునుని సందర్శించి, నమస్కరించి తాను అర్జునపుత్రుడనని చెప్పెను. అప్పుడు అర్జునుడు గత చరిత్రను స్మృతికి దెచ్చుకొని కొడుకును కౌగిలించు

కొని ప్రీతితో ఇంద్రునిభవనమునకు తోడ్కొనిపోయెను. అర్జునుడు కుమారునితో "యుద్ధకాలమునందు మాకు సహాయముగా రమ్ము" అని యనెను. తండ్రిమాటకు ఇరావంతుడు అంగీకరించి యీ యుద్ధకాలమునందు పాండవులకు సహాయము చేయుటకు వివిధవర్ణములు గల అశ్వముల సైన్యముతో వచ్చెను.

రాజా! ఆ యశ్వములు హంసలవలె ఎగురుచుండును. అవి యిప్పుడు మీ యశ్వసైన్యముల నెదుర్కొని వానిని నశింపజేయుచుండెను. ఇరావంతుని యశ్వసైన్యముల పోరాటమువలన గరుడుని పతనము వలన గలుగు శబ్దమువంటి ధ్వని భీకరముగా మ్రోగెను. మీ యశ్వసైన్యములు గూడ వానితో పోరాడు చుండెను. ఆ యశ్వ సైన్యములు రెండుగూడ ఒండొంటిని తాకి వధించుచుండెను అశ్వికులు కూడ చచ్చిరి.

రాజా! తరువాత ఆ సైన్యము క్షీణమై కొంచెము మిగిలియుండగా శకుని తమ్ములు మహాశౌర్యముతో యుద్ధముచేయుటకు వాయువేగముతో అశ్వసేనలపై వచ్చిరి. వారు గజ-గవాక్ష-వృషభులు చర్మమహుడు ఆర్జవ శుకనామకులు ఆరుగురు. వారు యుద్ధకుశలురు. మహాసైన్యములతో రౌద్రరూపము వహించిన వారు. శకుని వారిని వారించుచున్నను వారు ఇరావంతుని సైన్యమును ఛేదించి చొచ్చుకొని పోవజొచ్చిరి.

రాజా! వారిని చూచి ఇరావంతుడు తన సైనికులతో "ఈ ధార్తరాష్ట్రి యోధులందరు హతమారు విధమున మీరు పోరాడవలెను. అని చెప్పెను. అట్లే యని యిరావంతుని సైనికులందరు శత్రుసేనను వధించిరి. అప్పుడు శకుని తమ్ములు తమ సైన్యము చచ్చి పడుట చూచి సహించనివారై ఇరావంతునిపై బడిచేసిరి. అతనిని ప్రాసాయుధములచేత కొట్టి పీడించుచు ఎదురుగా ఉరికి సైన్యమును వ్యాకులపరచుచుండిరి.

రాజా! అట్లు శకుని సోదరులచేత గాయబడిన యిరావంతుడు అంకుశముతో పొడవబడిన గజమువలె విజృంభించి వారందరిపై బాణప్రయోగము చేసి వారిని మోహపరిచెను. అతడు తమ శరీరమునందు గ్రుచ్చుకొనిన శత్రువుల ప్రాసాయుధములను ఊడబెరికి వానితోనే వారిని కొట్టజొచ్చెను. తరువాత ఖడ్గము డాలు ధరించి యిరావంతుడు భూమిపైకి దుమికి ఆ యారుగురిని చంపుటకు వారిపై బడెను. వారును అతనిపైకి ఉరికిరి. ఇరావంతునకు వారికి ఘోర

ముగా యుద్ధము జరిగెను. వారు అశ్వములపైనుండిరి. భూమిపై నిలిచి పోరాడు చున్న యిరావంతుని వారు పట్టుకొనబూని దగ్గరకు రాగానే ఖడ్గముతో నతడు వారి యవయవములు ఛేదించెను. వారి ఆయుధములను గూడ ఖండించెను. అంతటితో అయిదుగురు శకుని తమ్ములు చచ్చి పడిపోయిరి. మిక్కిలి గాయబడిన వృషభుని యతడు విడిచెను. కాని తరువాత అతను కూడా పడిచచ్చెను.

రాజా! అట్లు వారందరు పడుటను చూచి దుర్యోధనుడు భయపడి ఋష్యశృంగ కుమారుడైన అలంబుషుడను రాక్షసుని వద్దకు పోయెను. అతడు మహామాయావి. బకాసురవధ కారణముగా నతడు పూర్వమునుండియు భీమసేనునితో వైరము పెంచుకొనినవాడు. అతనితో దుర్యోధనుడిట్లనెను.

## అలంబుషునిచేత ఇరావంతుని వధ

రాక్షసవీరా! చూడుము. అర్జునపుత్రుడైన యీ యిరావంతుడు నాకు అపకారము చేయదలచి నా సైన్యనాశనము చేసెను. ఇతడు మహామాయావి. నీవును కామగమనుడవే. మాయాస్త్ర ప్రయోగమునందు విశారదుడవు. భీమునితో నీకు పూర్వవైరము గలదు. కనుక ఈ యిరావంతుని యుద్ధమునందు వధింపుము.

రాజా! ఆ మాటకు అలంబుషుడు అట్లేయని యంగీకరించి యిరావంతుని పైకి అతిఘోరరూపముతో సింహనాదము చేయుచు పోయెను. అతనితో వివిధాయుధధారులు యుద్ధకుశలురు నైన యుద్ధవీరులు రెండువేలమంది హతశేషులై పోయిరి. అతడు యిరావంతుని వధించు నిచ్ఛతో నుండెను.

రాజా! అప్పుడు యిరావంతుడు తనను చంపుటకు వచ్చుచున్న అలంబుషుని నివారించెను. అట్లు వచ్చుచున్న యిరావంతునిపై అలంబుషరాక్షసుడు మాయను ప్రయోగించెను. ఆ మాయచేత అసంఖ్యాకములైన అశ్వములు-అశ్వారూఢులు ఉత్పన్నులయిరి. ఆ వివిధ శస్త్రధారులైన ఆ యాశ్వికులు సంరంభంతో వచ్చి యిరావంతుని రెండువేల అశ్వికులపైబడిరి. ఆ రెండు సేనలకు పరస్పరం యుద్ధము జరిగెను. ఎందరో ఆశ్వికులు అశ్వములతో యిరువైపుల చచ్చి నేలగూలిరి.

రాజా! ఆ సైన్యములు రెండున్ను నశించగా, ఆ యిరువురు వీరులు వృత్ర వాసవులవలె పరస్పర యుద్ధమునకు పూనిరి. యిరావంతుడు తనపైకి ఉరికి వచ్చుచున్న అలంబుషుని ఎదిరించెను. సమీపమునకువచ్చిన రాక్షసుని ధనుస్సును

యిరావంతుడు ఖడ్గముచేత ఖండించెను. అంతట అలంబుషుడు ఆకాశమునకెగిరి పోయి యిరావంతుని మోహపరచెను. అప్పుడు యిరావంతుడుకూడ అంతరిక్షము పైకెగిరిపోయి తన మాయలచేత అలంబుషుని మోహింపజేసి శరప్రయోగముచేత యవయవములు ఛేదించెను.

రాజా! యిరావంతునిచేత ఛిన్నములైన అలంబుషుని అవయవములు మరల మరల మొలచుచుండెను. అతడు మాయాబలముచేత యౌవనము ధరించెను రాక్షసులకు మాయ సహజము. యౌవనము రూపము వారి యిష్టప్రకారము కలుగుచుండును. ఈ విధముగ అ రాక్షసుని అంగము ఛిన్నాభిన్నమాయెను.

రాజా! అప్పుడు యిరావంతుడు మహాక్రుద్ధుడై ఖడ్గముచేత అతని యంగములు మాటిమాటికి ఖండించుచుండెను. అట్లు ఛిన్నాంగుడైన రాక్షసుడు ఘోరముగ నాదము చేసెను. అతని శరీరము నుండి నెత్తురు ప్రవహించుచుండెను.

రాజా! తరువాత అలంబుషుడు వేగముగ తన రూపమును మహాభయంకరముగ పెంచుకొని యిరావంతుని పట్టుకొనుటకు ఉరికెను. అట్లు రాక్షసుడు చేసిన మాయకు యిరావంతుడు ప్రతిమాయను సృష్టించెను. ఆ మాయాబలముచేత అతడు తన మాతృవంశమువారైన సర్పవీరులననేకులను రప్పించెను. ఆ నాగవీరులతో యిరావంతుడు మహారూపము ధరించి అనంత నాగరాజువలె శోభిల్లెను. రాజా! ఆ తరువాత ఇరావంతుడు సర్పసైన్యముచేత రాక్షసుని ఆచ్ఛాదింపజేయుచుండెను. అప్పుడా రాక్షసుడు మాయచేత గరుత్మంతుని రూపముధరించి సర్పములను భక్షించెను అట్లు తన మాతృవంశము వారైన సర్పవీరులు భక్షింపబడుటజూచి మోహితుడైన ఇరావంతుని అలంబుష రాక్షసుడు ఖడ్గముచేత సంహరించి ఇరావంతుని చంద్రసమాన ముఖముగల శిరస్సును కిరీటముతో నేలపై పడవేసెను.

రాజా! తరువాత యిరావంతుడు చంపబడగా నప్పుడు ధార్తరాష్ట్రులు శాంతిల్లిరి. తరువాత ఉభయసైన్యములకు ఘోరముగా భయంకరయుద్ధము జరిగెను. పరస్పరము వారు వివేచనారహితముగా చంపుకొనుచుండిరి.

రాజా! అప్పుడర్జునుడు తన కొడుకు చచ్చుట తెలియక భీష్మరక్షితులైన రాజవీరులను సైనికులను వధించుచు వచ్చెను. అట్లే మీవారు గూడ శత్రువులను హతమార్చుచుండిరి. బాహుయుద్ధములు చేయుచు జుట్టు విరియబోసికొని ధనుస్సులను ఛేదించుచు ఒండొరులను సంహరించుచుండిరి.

రాజా! అప్పుడు భీష్ముడు విజృంభించి పాండవపక్ష రాజవీరులను సైన్యములను చంపెను దానిచేత యుధిష్ఠిరసేనలో చాలామంది చచ్చిరి. చతురంగ బలములు చచ్చెను. ఆ యుద్ధములో భీష్ముని పరాక్రమము ఇంద్రుని పరాక్రమము వలె అత్యద్భుతముగా ఉండెను.

రాజా! ద్రోణాచార్యుని పరాక్రమము పాండవవీరులైన భీమధృష్టద్యుమ్న సాత్యకులు మొదలైనవారికి అతిరౌద్రముగానుండెను. ద్రోణుడొక్కడే సర్వ సైన్యములను హతమార్చగలడు. ఇట్లుండగా సతనికి తోడుగా రాజవీరులనేకులుండగా నికచెప్పవలసినదేమున్నది? అని ద్రోణపీడితులైనవారు చెప్పుకొనుచుండిరి.

రాజా! రాక్షసయుద్ధము వంటి పాండవ కౌరవయుద్ధమునందు ఉభయ వీరులు నొండొరులను సహింపజాలకుండిరి. ఆవేశముచేత రాక్షసులవలె మీవారు పాండవులు సంరంభముతో ప్రాణములపై ఆశవిడిచి పోరాడుచుండిరి.

జనమేజయా! అట్లు సంజయుడు చెప్పగా విని ధృతరాష్ట్రుడతనితో నిట్లనెను.

తొంబై ఒక్కటవ అధ్యాయము

## ఘటోత్కచ దుర్యోధనుల యుద్ధము :

సంజయా! ఇరావంతుడు చంపబడుటచూచి మహారథికులైన పాండవులు యుద్ధమెట్లు చేసిరి? చెప్పుము.

ఆ మాటకు సంజయుడతనికి తరువాతి యుద్ధవృత్తాంతమిట్లు చెప్పదొడగెను.

రాజా! ఇరావంతుడిట్లు చంపబడుటచూచి ఘటోత్కచుడు బిగ్గరగా సింహనాదము చేసెను. ఆ నాదముచేత భూమి కంపించెను. సర్వదిక్కులు అంతరిక్షము గగ్గోలుపడెను. ఘటోత్కచుని మహానాదము వినిన నీ సైనికులు స్తంభించిపోయి వారికి కంపము స్వేదము కలిగెను. మీవారందరు సింహమువలన భయపడిన గజములవలె దీనులై నిలిచిరి.

రాజా! అప్పుడు ఘటోత్కచుడు పిడుగువంటినాదము చేయుచు అనేక

శస్త్రధారులైన రాక్షసులు తోడురాగా జ్వలించుచున్న శూలమును పైకెత్తి భయంకరరూపముతో ప్రళయకాలయమునివలె క్రుద్ధుడై శత్రుసంహారము చేయుచుండెను.

రాజా! అట్లు తమపై బడుచున్న ఘటోత్కచునివలన తన సైన్యము భయము చేత తిరోగమనము చేయుచుండుటను చూచి దుర్యోధనుడు ఘటోత్కచుని పైకి త్వరగా నురికెను. అతనివెంటనే వంగదేశాధిపతి పదివేల యేనుగుల సైన్యములతో పోయెను. అట్లు గజసైన్యయుతుడైన వంగరాజుతో గూడి వచ్చుచున్న దుర్యోధనుని చూచి ఘటోత్కచుడు మిక్కిలి క్రుద్ధుడై యతనితో యుద్ధముచేయ గడగెను.

రాజా! అప్పుడు రాక్షససేనకు, నీ పుత్రుని సేనకు ఘోరముగా తుముల యుద్ధము జరిగెను. అప్పుడు రాక్షససేనలు వివిధాయుధములతో, పర్వతాగ్రములతో, వృక్షములతో గజసైన్యమును వధించుచుండిరి. అవి కుంభస్థలములు పగిలి నెత్తురుగారుచుండగా చచ్చి నేలగూలుచుండెను. అట్లు గజసైన్యములు క్షీణించగా దుర్యోధనుడు మహాక్రోధముతో జీవితముపై ఆశ వీడి రాక్షస సైన్యముపైకురికి బాణములతో వారిని చంపుచుండెను.

రాజా! తరువాత దుర్యోధనుడు క్రుద్ధుడై "విద్యుజ్జిహ్వుడు" అను రాక్షసుని నాలుగు బాణములతో చంపి రాక్షససేనపై బాణప్రయోగము చేసెను.

రాజా! నీపుత్రుని విజృంభణము పరాక్రమముచూచి క్రోధముతో మండుచు భీమసేనుని పుత్రుడు ఘటోత్కచుడు, ఇంద్రుని వజ్రాయుధము వంటి ధనుస్సును ఎక్కుబెట్టి దుర్యోధనునిపై దాడిచేసెను.

రాజా! ప్రళయకాలయముని వలె తనపైకి వచ్చుచున్న ఘటోత్కచుని చూచి దుర్యోధనుడు ఏమాత్రము వ్యథ చెందలేదు. తరువాత ఘటోత్కచుడు అతి క్రుద్ధుడై దుర్యోధనునితో నిట్లనెను.

దుర్మదాంధా! క్రూరుడవైన నీచేత చాలాకాలము అరణ్యవాసము చేయింపబడిన నా తలిదండ్రుల ఋణము నేడు తీర్చుకొనెదను. నీవు కపటద్యూతములో పాండవులనోడించినందుకు, ఏకవస్త్రయైన ద్రౌపదిని సభకు ఈడ్పించి బాధపెట్టినందుకు ఆశ్రమములోనున్న నా తండ్రులను దురాత్ముడైన సైంధవుడు అవమాన

పరచగా నీవు సంతసించినందుకు నీవు చేసన యితరదోషములకున్ను దుష్ఫలము నేడు అనుభవించెదవు గాక! నీవు యుద్ధము విడిచిపోవకుండిన యెడల నిన్ను అంతమొందించెదను.

రాజా! ఇట్లు ఘటోత్కచుడు చెప్పి ధనుస్సు ఎక్కుపెట్టి క్రోధముతో పెదవుల కొనలు నాకుచు, పెదవులు గరచుచు మహాబాణవర్షము వర్షాకాలమునందు మేఘము పర్వతముపై వారిధారలు గురిసినట్లు దుర్యోధనునిపై గురిసెను.

జనమేజయా! సంజయుడిట్లు చెప్పి ధృతరాష్ట్రునకు చెప్పి తరువాత యుద్ధవృత్తాంతమతనికిట్లు చెప్పదొడగెను :

తొంబది రెండవ అధ్యాయము

## ఘటోత్కచునితో దుర్యోధనాది వీరుల యుద్ధము :

రాజా! రాక్షసులకుకూడ దుస్సహమైన ఘటోత్కచుని బాణవర్షము దుర్యోధనునిపై ఏనుగుపై వానగురిసినట్లు కురియగా నతడు వ్యథచెందలేదు. తరువాత నతడు మహాక్రోధముతో తన జీవితమునందు సంశయగ్రస్తుడై యిరువది నిశిత శరములను ఘటోత్కచునిపై బడగా నతని శరీరము రక్తసిక్తమయ్యెను.

రాజా! అప్పుడు ఘటోత్కచుడు దుర్యోధనుని చంపదలచి పర్వతములనుగూడ చీల్చగల శక్తిని దుర్యోధనునిపై ప్రయోగింపబూనెను. ఆశక్తి జ్వలించుచున్న పిడుగువలె మండుచుండెను. దానిని చూచి వంగదేశాధిపతి తన యేనుగుతో ఘటోత్కచునిపైకి ఉరికెను.

రాజా! అట్లు పోవుచున్న వంగాధిపతి యేనుగు మార్గములో దుర్యోధనుని రథమును అడ్డగించి కాపాడెను. అప్పుడు ఘటోత్కచుడు తన శక్తిని ఆ గజముపైకి విసిరెను. ఆ దెబ్బతో ఏనుగు చచ్చి క్రిందపడెను. దానితో వంగపతిగూడ క్రిందపడెను. అప్పుడు దుర్యోధనుడు గజముపడుట తన సైన్యము చెదరుట చూచి మిక్కిలి వ్యథచెంది ఘటోత్కచుని పరాక్రమమును సహింపజాలక యతనితో ప్రతియుద్ధము చేయలేకపోయెను. కాని క్షాత్రధర్మమును పురస్కరించుకొని గిరివలె స్థిరముగా నిలిచి నిశితశరమును ఘటోత్కచునిపై ప్రయోగించెను.

రాజా! అట్లు యింద్రుని వజ్రాయుధము వంటి దుర్యోధనుని బాణము వచ్చుచుండుటచూచి ఘటోత్కచుడు అతి లాఘవముతో దానిని తప్పించుకొని బిగ్గరగా సింహనాదము ప్రళయకాల గర్జనమువలె చేసెను. అది విని దుర్యోధన సైన్యము మిక్కిలి భయపడెను.

రాజా! అట్లు భయంకరమైన ఆ ఘోరనాదము విని భీష్ముడు ద్రోణాచార్యునితో నిట్లనెను :

ఆచార్యా! ఘటోత్కచుని యీ ధ్వని చాలా ఘోరముగనున్నది. అతడు దుర్యోధనునితో పోరాడుచున్నాడు. దుర్యోధనుడేకాక యతనిని ప్రపంచములో ఏ ప్రాణులుగూడ జయింపజాలవు అక్కడికిపోయి రాజును రక్షింతము గాక! అతనిని ఘటోత్కచుడు తరిమికొట్టుచున్నాడు. అతనిని రక్షించుట యిప్పుడు మనకు పరమకర్తవ్యము.

ధృతరాష్ట్రమహారాజా! భీష్ముని మాటలు విని ద్రోణుడు మహారథికులైన రాజవీరులందరున్ను దుర్యోధనుని రక్షించుటకు పోయిరి. వారివెంట అనేక సహస్ర రథసైన్యములు పోయి పరుగెత్తుచున్న దుర్యోధనుని చేరెను.

రాజా! అట్లు తనను చంపుటకు వచ్చుచున్న కురుసైన్యమును చూచి ఘటోత్కచుడు బెదరక స్థిరముగా మైనాకపర్వతము వలె నిలిచెను. అతనికి దుర్యోధన సేనకు తుముల యుద్ధము ఘోరముగ జరిగెను. ధనుస్సుల పటపట శబ్దము కాలుచున్న వెదుళ్ల ధ్వనివలె వినబడుచుండెను. సైనికుల శరీరములందు పడి వారి కవచములు భేదించుచున్న శస్త్రముల ధ్వని పగులుచున్న పర్వతముల ధ్వనివలె వినబడుచుండెను. వీరులు ప్రయోగించిన తోమరములు ఆకాశమునందు ప్రాకుచున్న సర్పములవలె తోచెను.

రాజా! తరువాత ఘటోత్కచుడు మిక్కిలి క్రుద్ధుడై ధనుస్సునెక్కుపెట్టి మహాభయంకరముగా ధ్వనిచేయుచు ద్రోణాచార్యుని ధనుస్సును అర్ధచంద్ర బాణముచేత ఛేదించెను. సోమదత్తుని ధ్వజమును భల్లములో పడగొట్టి సింహనాదము చేసెను. మూడు బాణములచేత బాహ్లికుని యెదపైగొట్టెను. కృపాచార్యుని ఒక్కబాణముచేత, చిత్రసేనుని మూడింటిచేత కొట్టి పదునైన బాణముచేత వికర్ణుని యెదపై గొట్టెను. దానితో నతడు రక్తసిక్తుడై రథమునందు కూలబడెను.

రాజా! తరువాత ఘటోత్కచుడు పదునైదు బాణములు భూరిశ్రవునిపై ప్రయోగించెను. అవి యతని కవచము ఛేదించెను. వివింశతి - అశ్వత్థామల సారథులను చంపెను. వారు పగ్గములు విడిచి రథముపై పడిపోయిరి. సైంధవుని వరాహధ్వజమును ధనుస్సును ఛేదించెను. నాలుగు బాణములచేత అవంతిరాజు యొక్క నాలుగు రథాశ్వములను గూల్చెను. నిశిత శరముచేత బృహద్బలుని కొట్టగా నతడు వ్యథచెంది రథమునందే కూలబడెను. రాజా! ఘటోత్కచుడప్పుడు మహాక్రోధముచేత సర్పములవంటి పదునైన బాణములతో శల్యుని కొట్టెను.

జనమేజయా! యిట్లు ఘటోత్కచుని భయంకర యుద్ధమును సంజయుడు వర్ణించి ధృతరాష్ట్రునకు చెప్పి తరువాతి యుద్ధవృత్తాంతమతనికిట్లు చెప్ప దొడగెను :

తొంబదిమూడవ అధ్యాయము

## భీమాదులతో పోరాడి కౌరవులు పారిపోవుట :

రాజా! యీ విధముగ ఘటోత్కచుడు యుద్ధములో మీవారినందరిని ఓడించి దుర్యోధనుని వధించుటకు అతనిపైకి ఉరికెను. అట్లు వచ్చుచున్న యా రాక్షసుని యుద్ధపండితులైన మీవారు చాలామంది యెదిరించి యతనిపై శర వర్షము గురిసిరి అవి శరత్కాలమునందు మేఘములు పర్వతములపై జలధారలు కురిసినట్లుండెను.

రాజా! ఘటోత్కచుడట్లు బాణములచేత కొట్టబడి అంకుశములతో పొడువ బడిన గజమువలె వ్యథచెంది గరుత్మంతుని వలె ఆకాశమునకెగిరి శరత్కాల మేఘమువలె సింహనాదము చేసెను. ఆ ధ్వనితో సర్వదిక్కులు మారుమ్రోగెను.

రాజా! ఘటోత్కచుని ఆ ధ్వని విని యుధిష్ఠిరుడు భీమసేనునితో నిట్ల నెను :

సోదరా! యీ రాక్షసుడు ధార్తరాష్ట్రులతో పోరాడుచున్నాడు. మిక్కిలి భయంకరముగ ధ్వని చేయుచున్నాడు. భీష్మపితామహుడు క్రుద్ధుడై పాంచాలు

తను చంప నుద్యుక్తుడైయున్నాడు. వారిని రక్షించుటకు అర్జునుడు శత్రువులతో యుద్ధము చేయుచున్నాడు. ఇప్పుడు మనకు రెండు కర్తవ్యములేర్పడినవి. జీవిత సంశయములో పడిన ఘటోత్కచుని రక్షించుటకు పొమ్ము.

రాజా! అన్నగారి మాటప్రకారము భీమసేనుడు సింహనాదముచేత రాజవీరులను భయపెట్టుచు పర్వకాలమునందు మహాసముద్రము ఉప్పొంగినట్లు చెలరేగుచు వేగముగా ఘటోత్కచునకు బాసటగా పోయెను. అతనిని అనుసరించి అభిమన్యు-ద్రౌపదీపుత్ర-క్షత్రదేవాది మహారథికులు పోయిరి. వారు ఆరువేల గజసేనలతో ఘటోత్కచుని రక్షించుచుండిరి.

రాజా! ఆ సైన్యములు వచ్చుచున్నప్పటి శబ్దము మీవారు విని భీమసేనుని వలని భయముచేత దుఃఖితులై వివర్ణవదనులై ఘటోత్కచుని విడిచిరి. అప్పుడా రెండు సేనలకు ఘోరయుద్ధము జరిగెను. ఒండొరులను తరుముకొనుచు అనేక శస్త్రములను ప్రయోగించుచుండిరి. అశ్వములు గజములతో పదాతిదళములు రథికులతోను వివేచనా రహితముగా పోరాడుచుండిరి. యుద్ధభూమియంతట దుమ్ముగమ్మెను. "తమరెవరు-పరులెవరు" అని యెరుగకుండిరి. తండ్రిని-కొడుకు కొడుకును తండ్రియు చూడజాలకుండిరి. ఇట్లు పోరాడుచున్న యుభయసైనికుల శబ్దము ప్రేతశబ్దములవలె వినబడెను.

రాజా! సైన్యముల రక్తనదులు వారికేశ శైవలములతో ప్రవహించుచుండెను. వారి తలలు తెగి క్రిందపడుచు పాషాణ శబ్దముల వలె ధ్వనించుచుండెను. మనుష్యుల మొండెముల చేత తెగిన అంగములు గల గజముల చేత దేహములు గాయబడిన అశ్వములచేత భూమి వ్యాపించుచుండెను.

రాజా! రథికులనేక శస్త్రములను ప్రయోగించుచు ఒండొరులను తరుముకొనుచుండిరి. ఆశ్వికులచేత తోలబడిన అశ్వములు అశ్వములను, మనుష్యులు మనుష్యులను, గజారోహకుల చేత తోలబడిన గజములు గజములను, పరస్పరము చంపుకొనుచు అంతట రక్తనదులను ప్రవహింపజేసెను. రక్తసిక్తములైన సైన్యములు విద్యుత్తుతో గూడిన మేఘముల వలె కనబడుచుండెను. కొన్ని గజములు కుంభస్థలములు భగ్నములై యవి గర్జించుచున్న మేఘములవలె అరచుచు పరుగెత్తెను.

రాజా! కొన్ని గజముల తొండములు, అవయవములు భిన్నములై, రెక్కలు తెగిన పర్వతముల వలె నేలగూలెను. కొన్ని గజముల శరీరములు గాయపడి వానినుండి రక్తము పర్వతములనుండి గైరికాది ధాతుజాలము స్రవించు చున్నట్లు కారుచుండెను. కొన్నిగజములు బాణతోమరాది ఆయుధాలచేత హతములై శిఖరరహిత పర్వతముల వలె శబ్దించుచు పరుగెత్తెను. కొన్ని యేనుగులు మదాంధములై క్రోధముచేత అనేక రథ హయ పదాతిదళములను మర్దించుచుండెను.

రాజా! యీ విధముగ వీరసైనికులు జీవితములపై ఆశవీడి స్వర్గకాంక్షతో స్వయంవరమునందలి రాజులవలె సంతోషముతో పోరాడి చచ్చుచుండిరి. ఈ మహాసంగ్రామమునందు ధార్తరాష్ట్ర సైన్యములు తరచుగా ఓడిపోయి విముఖులయ్యెను.

జనమేజయా! సంజయుడిట్లు ధృతరాష్ట్రునకు చెప్పి తరువాతి యుద్ధ వృత్తాంతమిట్లు చెప్పదొడగెను:

తొంబది నాలుగవ అధ్యాయము

## భీమ-దుర్యోధనుల యుద్ధము:

రాజా! తన సైన్యము చంపబడుట చూచి దుర్యోధనుడు క్రుద్ధుడై భీమసేనునిపై దాడిచేసి అర్ధచంద్రబాణము చేత భీముని ధనుస్సు ఛేదించి త్వరపడుచు పర్వతములనుగూడ చీల్చగల బాణముతో భీముని యెదపై కొట్టెను. ఆ దెబ్బతో భీముడు బాధపడి తూలుచు తన స్వర్ణధ్వజమును పట్టుకొని నిలిచెను.

రాజా! అట్లు బాధపడుచున్న భీమునిచూచి ఘటోత్కచుడు అభిమన్యుడు మొదలైన వీరులు క్రోధావిష్టులై అగ్నివలె జ్వలించుచు దుర్యోధనునిపై దాడి చేసిరి.

రాజా! యిట్లు దుర్యోధనునిపై బడుచున్న పాండవవీరులను చూచి ద్రోణాచార్యుడు మీ మహారథికులతో నిట్లనెను:

వీరులారా! త్వరగా పొండు రాజును రక్షింపుడు. అతడు దుఃఖసముద్ర

ములో మునిగి జీవితసంశయములోనున్నాడు. పాండవ మహారథికులు భీమసేనుని పురస్కరించుకొని దుర్యోధనునిపై దాడిచేయుచున్నారు. వారు అతనిపై అనేకవిధాస్త్రములను ప్రయోగించుచున్నారు. భయంకరముగా అరచుచు మన రాజవీరులను భయపెట్టుచున్నారు.

ధృతరాష్ట్రమహారాజా! ఇట్లు ఆచార్యుడు చెప్పగా విని సోమదత్తాదులు పాండవసేనపై దాడిచేసిరి. కృప-అశ్వత్థామ-శల్యాదులు గూడ దుర్యోధనునకు సహాయకులుగా పోయిరి. వారు యిరువది యడుగుల దూరమున నిలిచి శత్రువులతో యుద్ధముచేసిరి.

కౌరవపాండవవీరులు పరస్పరము సంహరించుకొను నిచ్ఛతో యుద్ధము చేసిరి.

రాజా! తరువాత ద్రోణాచార్యుడు ఇరువదియారు బాణములతో భీముని కొట్టెను. వర్షాకాలమునందు మేఘములు పర్వతముపై వానలు గురిసినట్లు ద్రోణుడు భీమునిపై బాణవర్షము గురిసెను. అప్పుడు భీమసేనుడు పది బాణములతో ద్రోణుని తిరిగికొట్టెను. ద్రోణుడు యిరుపార్శ్వములందు గాయపడి వయోవృద్ధుడుగాబట్టి మిక్కిలి బాధపడి మూర్ఛిల్లి రథమునందే కూలబడెను.

రాజా! అట్లు బాధపడిన ఆచార్యుని చూచి దుర్యోధనుడు, అశ్వత్థామ మిక్కిలి క్రుద్ధులై భీమునిపై దాడిచేసిరి. అట్లు ప్రళయకాల యమునివలె వచ్చుచున్న ఆ యిరువురుని చూచి భీమసేనుడు అతి క్రోధముతో గదాపాణియై రథమునుండి క్రిందికి దుమికి పర్వతమువలె అచంచలముగా నిలిచెను

రాజా! అట్లు గదాపాణియై నిలిచియున్న భీమునిపైకి దుర్యోధనాశ్వత్థామలు ఉరికిరి. వారికెదురుగా భీముడున్ను ఉరికెను అట్లు వచ్చుచున్న భీమునిపై మీ మహారథికులు దాడిచేయుటకు వచ్చిరి. భీముని చంపుటకు వచ్చిన ద్రోణాచార్యాది మహావీరులు అనేక శస్త్రములతో భీముని యెదపై కొట్టిరి.

## అశ్వత్థామ-నీలుల యుద్ధము :

రాజా! అందరు వీరులు భీమసేనుని పీడించుటచూచి అభిమన్యుడు-నీలుడు కౌరవ వీరులపై దాడిచేసిరి. నీలుడు భీమునకు పరమమిత్రుడు అతడు పూర్వము

నుండియే అశ్వత్థామను ద్వేషించుచుండెను. గాబట్టి యతనినెదిరించెను. పూర్వము దేవతలకు కూడ భయంకరుడు, మూడులోకములను భయపెట్టిన విప్రచిత్తిని ఇంద్రుడు గొట్టినట్లు నీలుడు బాణముతో అశ్వత్థామను గొట్టి గాయపరచెను.

రాజా! అప్పుడు రక్తసిక్తుడై బాధపడిన అశ్వత్థామ నీలుని చంపుటకు కమ్మరిచేత పదును చేయబడిన భల్లములతో నీలుని నాలుగు రథాశ్వాలను, సారథిని, ధ్వజమును ఒక్కొక్క భల్లముతో ఏడవ భల్లముతో నీలుని యెదపైనను కొట్టెను. ఆ దెబ్బలో నీలుడు బాధచేత సోలుచు రథములో కూలబడెను.

రాజా! అట్లు మూర్ఛిల్లిన నీలరాజును చూచి ఘటోత్కచుడు క్రుద్ధుడై తనవారితో అశ్వత్థామపైకి ఉరికెను. ఇతర రాక్షసవీరులు కూడ వారిననుసరించి పోయిరి.

## ఘటోత్కచుని మాయచేత కురువీరులు పారిపోవుట :

రాజా! తనపైకి ఆ రాక్షసులు వచ్చుటచూచి అశ్వత్థామ త్వరగా వారి నెదిరించి ఆ రాక్షసులను వధించెను. కొందరు అతనికి భయపడి విముఖులై పోవుచుండుట చూచి ఘటోత్కచుడు క్రుద్ధుడై భయంకరమైన మాయను సృష్టించి అశ్వత్థామను మూర్ఛిల్లజేసెను.

రాజా! తరువాత మీవారందరు ఘటోత్కచుని మాయచేత విముఖులై ఖండింపబడి ఒండొరులను చూచుచు భూమిపై రక్తసిక్తులై చేష్టలుడిగిపోయి ద్రోణ దుర్యోధన శల్యాశ్వత్థామలను చూచుచుండిరి.

రాజా! ప్రధానులైన కౌరవవీరులు ఆ మాయచేత విధ్వస్తులైరి. అనేక చతురంగ సైన్యములు మాయచేత ఖండితములయ్యెను. అందరు పారిపోవజొచ్చిరి అట్లు పోవుచున్నవారిని చూచి నేను, భీష్ముడున్ను అరచుచు "వీరులారా! ఇది రాక్షసమాయ, ఘటోత్కచుడు ప్రయోగించెను. కనుక పారిపోవక యుద్ధము చేయుడు'' అని యెంత చెప్పినను వారు మాయిరువురి మాటవినక వారు భయముచేత పరుగెత్తుచునేపోయిరి.

రాజా! అట్లు మీవారు పరుగెత్తిపోవుటచూచి, విజయము సాధించిన పాండవులు, ఘటోత్కచుడున్ను బిగ్గరగా సింహనాదములు చేసిరి. శంఖదుందుభిధ్వనులు మారుమ్రోగెను.

రాజా! ఈ విధముగా మీ సైన్యమంతయు దురాత్ముడైన ఘటోత్కచుని చేత సూర్యాస్తమయవేళయందు భగ్నమై పారిపోయెను.

జనమేజయా! యిట్లు సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పి తరువాతి అష్టమ దివస యుద్ధవృత్తాంతమిట్లు చెప్పదొడగెను.

తొంబది ఐదవ అధ్యాయము

## భగదత్తుడు భీమఘటోత్కచులతో పోరాడుట :

రాజా! అప్పుడు దుర్యోధనుడు తమవారు రాక్షసునిచేత పరాజితులగుట సహింపజాలక భీష్ముని కడకుపోయి ఆయనకు వినయపూర్వకముగా నమస్కారముచేసి ఘటోత్కచుని విజయము, తమ పరాజయమునుగూర్చి అంతయు చెప్పి నిట్టూర్పుచు మరలనిట్లనెను :

పితామహా! పాండవులు వాసుదేవుని ఆశ్రయించినట్లు నేను నిన్ను ఆశ్రయించి పాండవులతో ఘోరమైన యుద్ధము చేయుటకు ప్రారంభించితిని. నా పదకొండు అక్షౌహిణీసేనలు నీ యధీనములోనే యుండి నీ యాజ్ఞప్రకారము నడచుచున్నవి. నేనుగూడ నీ యాజ్ఞావాహకుడనై యున్నాను. భరతకులభూషణా అటువంటి బలముగల నేను ఘటోత్కచుని ఆశ్రయించిన భీమసేనాది పాండవుల చేత యుద్ధమునందు ఓడింపబడితిని. ఈ యవమానాగ్ని ఎండుచెట్టును అగ్నివలె నా యవయవములను దహించుచున్నది. నీ యనుగ్రహముచేత ఆ దుష్టరాక్షసుని సంహరింపదలచితిని. ఆ యవకాశము నాకు కలిగింపుము.

ధృతరాష్ట్రమహారాజా! యిట్లు దుర్యోధనుడు చెప్పిన మాటలు విని భీష్ముడతనితో నిట్లనెను :

"రాజా! నేను చెప్పబోవు మాట వినుడు. నీవు యుద్ధమునందు నడచుకొనవలసిన విధము చెప్పెదను. నీవెప్పుడుగూడ ఆత్మరక్షణము చేసుకొనవలెను ఎట్టి పరిస్థితిలోగూడ నీ యాత్మరక్షణము ఆవశ్యకము. నీవు సర్వదా ధర్మజ-అర్జున-నకుల-సహదేవులతో క్షత్రధర్మమననుసరించి యుద్ధము చేయుము. క్షత్రియుడు క్షత్రియునే యెదిరించి పోరాడవలెను. దురాత్ముడైన ఘటోత్కచు

నితో యుద్ధము చేయకుము. నేను, నీతమ్ములు ద్రోణ కృతవర్మాదులు నీకొరకు ఆ రాక్షసునితో యుద్ధము చేసెదము. ఆ రాక్షసుడు నీకు సాధ్యుడు కానియెడల ఇంద్రసమానుడైన ఈ భగదత్తుడు అతనితో పోరాడుగాక !"

ధృతరాష్ట్రమహారాజా! భీష్మపితామహుడు దుర్యోధనునితో నిట్లని, తరువాత భగదత్తునితో దుర్యోధనుని సమక్షముననే ఇట్లనెను :

భగదత్తమహారాజా! నీవు శీఘ్రముగా యుద్ధోన్మత్తుడైన ఘటోత్కచుని ఎదిరించి యుద్ధముచేయుము. పూర్వమింద్రుడు తారకాసురునితో పోరాడినట్లు నీవతనితో పోరాడుము. నీ దివ్యాస్త్రములు, పరాక్రమము, నీవు అనేకులతో ధైర్యముగా పోరాడుట ఇవన్నియు పూర్వము నీవు దేవతలతో యుద్ధముచేయునప్పుడు చూపించితివి. మహాబలసుచేత పెచ్చుపెరిగిన ఘటోత్కచుడు ఇప్పుడు నీకు ప్రతియోధుడుగా నిల్చియున్నాడు. అతనితో తలపడి అతనిని వధింపుము.

ధృతరాష్ట్రమహారాజా! భీష్ముడు చెప్పిన మాటలువిని భగదత్తుడు సింహనాదము చేయుచు శత్రువులకు అభిముఖముగా పోయెను. ఇట్లు పరుగెత్తి గర్జించుచున్న మేఘమువలె వచ్చుచున్న భగదత్తునిచూచి పాండవమహారథికులు మిక్కిలి క్రుద్ధులై అతనిని ఎదిరించిరి. భీమసేనాభిమన్యుఘటోత్కచాదులు భగదత్తునిపై దాడిచేసిరి. భగదత్తుడుగూడ తన సుప్రతీకగజముపై వారి నెదిరించెను.

రాజా! తరువాత అతిభయంకరమైన యుద్ధము పాండవులకు భగదత్తునితో ఘోరముగా జరిగెను. దానిచేత యమరాష్ట్రము వృద్ధి జెందుచుండెను.

రాజా! పరస్పరము వీరులు ప్రయోగించుకొనిన నిశిత శరములు చతురంగ సైన్యములపై పడి అవి గాయపడి చెదరిపోవుచుండెను. గజములు ముసలముల వంటి దంతములచేత ప్రతిగజములను పొడుచుచుండెను. అశ్వములుగూడ పరస్పరము కొట్టుకొనుచుండెను. పదాతిదళములు నూర్ల వేలకొలదులు ఇరువైపుల నేలవ్రాలుచుండెను. రథికులు పరస్పరము కొట్టుకొనుచు సింహనాదము చేసిరి.

రాజా! ఇట్లు రోమాంచకరమైన యుద్ధము జరుగుచుండగా భగదత్తుడు గాయపడిన తన సుప్రతీకగజము నుండి, పర్వతము నుండి జలధారలు స్రవించుచున్నట్లు రక్తము ఏడుపాయలుగా కారుచుండగా భీమునిపై దాడిచేసెను. సుప్రవ

తీక గజముపైన భగదత్తుడు ఇంద్రుడు ఐరావతముపై నెక్కినట్లు కూర్చొని భీమసేనునిపై గ్రీష్మాంతమునందు జలధారలచేత మేఘము వర్షించినట్లు అనేక బాణములను కురిసెను.

రాజా! అప్పుడు భీమసేనుడు మిక్కిలి క్రుద్ధుడై గజాశ్వాది పాదరక్షకు లనేకులను హతమార్చెను. అట్లు వారు చంపబడుట చూచి భగదత్తుడు క్రోధముతో తన గజమును భీమసేన రథముపై తోలెను. ఆ గజము బాణమువలె దూసుకొని భీమసేనుని పైకి పోవుచుండెను. అట్లు వచ్చుచున్న గజమును భీమసేనాది పాండవవీరులు ఎదుర్కొని దానిని చుట్టుముట్టి బాణప్రయోగము చేసిరి. రక్తసిక్తమైన యా గజము ధాతుచిత్రితమైన పర్వతరాజువలె శోభిల్లెను.

రాజా! దశార్ణదేశాధిపతి తన గజముతో భగదత్తుని గజమును ఎదుర్కొనగా "బాగు బాగు" అని పాండవసేనలు అతనిని అభినందించెను. తరువాత భగదత్తుడు క్రుద్ధుడై పదునాల్గు తోమరాయుధములను దశార్ణపతి యొక్క గజముపై ప్రయోగించి దాని శరీరము చీల్చి సర్పములు వల్మీకములోవలె దూరెను. అట్లు కొట్టబడి ఆ గజము వ్యథచెంది భయంకరముగా ఘీంకరించుచు తన సైన్యమునే వాయువు వృక్షములను వలె మర్దించుచు పారిపోయెను.

రాజా! అట్లు దశార్ణుని గజము ఓడిపోగా పాండవవీరులు బిగ్గరగా సింహనాదము చేసి మరల భగదత్తునితో యుద్ధమునకు పూనిరి. వారికి ముఖముగా భీముడు నిలిచెను. ఆ వీరులు వచ్చుచున్నప్పుడు కలిగిన వివిధ ధ్వనులు విని భగదత్తుడు కోపముతో వారిపై తన ఏనుగును తోలెను. అంకుశములతోను, అంగుష్ఠములతోను పొడవబడి పోవుచున్న సుప్రతీకగజము అప్పుడు, ప్రళయ కాలాగ్ని వలె ప్రజ్వరిల్లెను. అది శత్రువుల చతురంగ సైన్యములను త్రొక్కి చంపుచు పరుగెత్తిపోవుచుండెను.

రాజా! అట్లు సుప్రతీకగజము చేత కలియబెట్టబడుచున్న పాండవసైన్యము అగ్ని సోకిన చర్మమువలె ముడుచుకొనిపోయెను

అట్లు భగదత్తునిచేత భగ్నమైన తమ సైన్యమునుచూచి ఘటోత్కచుడు క్రోధముతో అతని నెదిరించెను. అతిపరుషము, దీప్తము, రోషముచేత భయంకరమునైన తన రూపముతో ప్రకాశించుచు పర్వతములను గూడ చీల్చగల శూల

మును ధరించి సుప్రతీకమును చంపదలచి దానిపై విసిరెను. అది అంతట నిప్పులు గ్రక్కుచు తనపై వచ్చుచుండుట చూచి భగదత్తుడు అర్ధచంద్రబాణము చేత ఆ శూలమును రెండుగా చీల్చెను. అప్పుడాశూలము ఆకాశమునుండి పిడుగు వలె క్రిందబడెను.

రాజా! అట్లు భగదత్తుడు శూలమును ఖండించి క్రిందపడగొట్టి అగ్నిజ్వాల వంటి మహాశక్తిని ఘటోత్కచునిపై విసిరెను. అట్లు తనపై పిడుగువలె పడబోవు చున్న శక్తిని ఆ రాక్షసుడు పట్టుకొని సింహనాదముచేసి మోకాలితో భగదత్తుడు చూచుచుండగనే అద్భుతముగా విరిచెను. ఘటోత్కచుని యా యద్భుతకర్మను చూచి ఆకాశమునందు దేవతలు గంధర్వులు, మునులు, విస్మయము చెందిరి. భీమసేనాది పాండవవీరులు "బాగు బాగు" అని భూమండలము మారుమ్రోగునట్లు అరచిరి.

రాజా! అట్లు పాండవులు హర్షముతో చేయుచున్న ధ్వని విని భగదత్తుడు సహింపజాలక ఇంద్రుని వజ్రాయుధము వంటి తన ధనుస్సును ఎక్కుపెట్టి పాండవవీరులను భయపెట్టుచు అగ్నివంటి తీక్ష్ణబాణములను వారిపై ప్రయో గించెను. భీముని ఒక్కబాణముతో, ఘటోత్కచుని తొమ్మిదింటితో, అభిమన్యుని మూడింటితో, కేకయులను ఐదుబాణములతో కొట్టి ఒక బాణముతో క్షత్రదేవుని కుడిచేతిని ఛేదించెను. దానితో అతని బాహువు ధనుర్బాణములతో గూడ క్రింద పడెను.

రాజా! తరువాత భగదత్తుడు అయిదుగురు ద్రౌపదీ పుత్రులను ఐదు బాణములతో కొట్టి భీమసేనుని రథాశ్వములను చంపి అతని సింహధ్వజమును మూడు బాణములతో ఛేదించి మరి మూడు బాణములతో భీమసారథిని కొట్టెను. అతను గాఢముగా గాయపడి రథమునందు కూలబడెను. అట్లు తన సారథియైన విశోకుడు హతుడు కాగా భీముడు విరథుడై గదను ధరించి వేగముగా రథము నుండి ఎగిరి దుమికెను.

రాజా! అట్లు గదాపాణియై శిఖరముతో గూడిన పర్వతమువలె భీముని చూచి మీవారికి మహాభయము కలిగెను. ఇంతలో అర్జునుడు శత్రుసంహారము చేయుచు ఆ తండ్రి కొడుకులైన భీమఘటోత్కచులున్న చోటికి వచ్చి, వారి

రువురు భగదత్తునితో పోరాడుచుండుట చూచి తన సోదరుడు యుద్ధము చేయు చున్న చోటికి త్వరగాపోయి వారికి సహాయము చేయుచు భగదత్తునిపై బాణ ప్రయోగము చేసెను.

రాజా! తరువాత దుర్యోధనుడు అర్జునునిపై తన చతురంగబలమును తోలెను. అట్లు వచ్చుచున్న కౌరవసేన పైకి అర్జునుడు ఉరికి దానిని ఆపెను.

రాజా! భగదత్తుడు తన సుప్రతీక గజముచేత పాండవసేనను మర్దించుచు యుధిష్ఠిరునిపై దాడిచేసెను. అప్పుడు భగదత్తునకు పాంచాల, పాండవ, కేకయులతో ఘోరముగా యుద్ధము జరిగెను.

రాజా! తరువాత భీమసేనుడు ఇరావంతుని వధ మొదలైన యుద్ధవృత్తాంతమును కృష్ణార్జునులకు చెప్పెను.

జనమేజయా! ఇట్లు సంజయుడు భగదత్తాది వీరుల యుద్ధవృత్తాంతమును ధృతరాష్ట్రునకు చెప్పి తరువాతి యుద్ధసమాచారమిట్లు చెప్ప దొడగెను.

తొంబది ఆరవ అధ్యాయము

## ఇరావంతుని వధచేత అర్జునుని దుఃఖము :

రాజా! తన పుత్రుడైన ఇరావంతుడు వధింపబడుట విని అర్జునుడు దుఃఖములో సర్పమువలె బుసకొట్టుచు శ్రీకృష్ణునితో నిట్లనెను :

కృష్ణా! ఈ యుద్ధమునందు కురుపాండవుల నాశము కల్గునని ఇట్టి యుద్ధమును ఆపుమని పూర్వమే విదురుడు ఇతరవీరులు ధృతరాష్ట్రునకు చెప్పిరి. ఆ మాట నేడు నిక్కమయ్యెను ఎందరో వీరులు ఇరువైపుల చచ్చిరి. ఈ కుత్సిత కర్మ కేవలము ధనాశచేత చేయబడుచున్నది. ఛీ! ధనమెంత చెడ్డది? దాని ఆశ చేత బంధునాశము జరుగుచున్నది. జ్ఞాతివధ వలన ధనవంతుడగుటకంటె నిర్ధనుడై చచ్చుట మేలు.

కృష్ణా! జ్ఞాతులను చంపినందుచేత మనకేమి లాభము? శకుని దుర్యోధనుల యపరాధముచేత కర్ణుని దురాలోచనచేత క్షత్రియులు మరణించుచున్నారు.

వాసుదేవా! అర్ధరాజ్యముగాని, ఐదూళ్ళుగాని యుధిష్ఠిరుడు పూర్వము దుర్యోధనుని యాచించినది. పుణ్యకరమని ఇప్పుడు తలచుచున్నాను. కాని దురాత్ముడైన దుర్యోధనుడు అప్పుడు అంగీకరించలేదు.

మధుసూదనా! ఇట్లు యుద్ధములో నేలగ్రాలియున్న క్షత్రియులను చూచి నన్ను నేను నిందించుకొనుచున్నాను. ఛీ! క్షత్రియ జీవితమెంత క్రూరమైనది.

కృష్ణా! నేను అసమర్థుడనని క్షత్రియులు తలచెదరు. కాబట్టి నాకు ఇష్టము లేకున్నను శత్రువులతో పోరాడెదను. కౌరవసేనపై రథము తోలుము. నా భుజములచేత అపారమైన ఈ యుద్ధసముద్రము దాటెదను. ఇప్పుడు కాలమును వ్యర్థముగా గడపగూడదు.

ధృతరాష్ట్రమహారాజా! ఇట్లు అర్జునుడు చెప్పిన మాటలువిని శ్రీకృష్ణుడు రథాశ్వములను కౌరవసేనవైపు తోలెను. అప్పుడు మీసైన్యములో గొప్ప ధ్వని కలిగెను. ఆ ధ్వని పర్వకాలమునందు ఉప్పొంగిన సముద్రపు రొదవలె నుండెను.

రాజా! ఆ యపరాహ్ణకాలమునందు యుద్ధము జరిగెను. భీష్ముడు పాండవులతో పోరాడజొచ్చెను. అప్పుడు మేఘ గర్జనమువంటి ధ్వని వెడలెను. రాజా! అప్పుడు నీ పుత్రులు భీమసేనునిపై దాడిచేసిరి. వారు వసువులు ఇంద్రునిచుట్టు చేరినట్లు ద్రోణాచార్యుని యందజేరిరి.

రాజా! తరువాత భీష్మ-కృప-భగదత్త-సుశర్మలు అర్జునునిపై దాడిచేసిరి. హార్దిక్య-బాహ్లీకేయులు సాత్యకి నెదుర్కొనిరి అంబష్టకరాజు అభిమన్యుని పైకి ఉరికెను. తక్కిన వీరులు ఇతర వీరులపై దాడిచేసిరి. తరువాత వారికి పరస్పరము భయంకర యుద్ధము ఘోరముగా జరిగెను.

## భీమునిచేత తొమ్మండుగురు ధార్తరాష్ట్రుల వధ :

రాజా! భీమసేనుడు అప్పుడు నీ పుత్రులను చూచి హవిస్సుచేత అగ్నివలె క్రోధముచేత ప్రజ్వరిల్లెను. నీ పుత్రులు, వర్షాకాలమునందు మేఘములు పర్వతములపై జలధారలు గురిసినట్లు భీమునిపై శరవర్షములు గురిసిరి. బాణములచేత కప్పబడిన భీముడప్పుడు ఓష్ఠములను క్రోధముతో నాకుచు శార్దూలము వలె

గర్వితుడై తీక్ష్ణమైన క్షురప్రముచేత "వ్యూఢోరస్కు"డను నీ పుత్రుని గొట్టెను. అతడు గతప్రాణుడై క్రిందపడెను.

రాజా! తరువాత భీముడు మరియొక్క భల్లముచేత సింహము క్షుద్రమృగమును గొట్టి పడవేసినట్లు "కుండలి"యను నీ కొడుకును జంపెను. రాజా! తరువాత భీముడు "అనాధృష్టి కుండభేది-వైరాట-దీర్ఘలోచన-దీర్ఘబాహు-సుబాహు-కనకధ్వజ నామకులైన యేడుగురిపై నిశితశరములను ప్రయోగించెను. వారు చచ్చి క్రిందపడిరి. అట్లు పడిన నీ పుత్రులు వసంతఋతువునందు పుష్పించిన మామిడి చెట్లు పడినట్లు భూమిపై శోభిల్లిరి. రాజా! తరువాత నీ యితర పుత్రులు "భీముడు యముడ"ని తలచుచు పారిపోయిరి.

రాజా! అప్పుడు ద్రోణాచార్యుడు నీ పుత్రులను దహించుచున్న భీమునిపైన, పర్వతముపై జలధారలువలె బాణవృష్టి కురిసెను. అప్పుడు భీముని యత్యద్భుత పౌరుషము చూచితిమి.

రాజా! అట్లు ద్రోణుడు వారించుచు బాణవర్షము గురియుచున్నను భీమసేనుడా వృష్టిని, ఆబోతు వానను సహించునట్లు సహించుచు నీ పుత్రులను వధించుచునే యుండెను. రాజా! అట్లు ద్రోణుని వారించుచు నీ పుత్రులను చంపుచున్న భీముని అద్భుత పరాక్రమము చూడదగినట్లుగా నుండెను.

రాజా! వీరులైన నీ పుత్రుల మధ్య భీమసేనుడు, లేళ్ళ నడుమ వ్యాఘ్రము వలె చరించుచు, పశువుల మందలో జొరబడి తోడేలు పశువులను చీల్చునట్లు నీ పుత్రులను చెండాడుచు యద్భుతక్రీడలు సలుపుచుండెను.

రాజా! అప్పుడు భీష్మ-భగదత్త-కృపాచార్యులు అర్జునునిపై దాడిచేసిరి. అర్జునుడు వారితో పోరాడుచు మీ సైన్యములోని వీరులను వధించుచుండెను.

## అభిమన్యు-అంబష్ఠుల యుద్ధము:-

రాజా! అభిమన్యుడప్పుడు లోకవిఖ్యాత పరాక్రమశాలియైన అంబష్ఠ రాజుపై, విరథునిపైనను దాడిచేసి విరథుని వధించెను. అప్పుడు అంబష్ఠుడు తన రథమునుండి యెగిరి దుమికి ఖడ్గమును అభిమన్యునిపైవిసిరి, హార్దిక్యుని రథము పైకి పోయెను. ఆ ఖడ్గమును అభిమన్యుడు లాఘవముతో ఖండించెను. అట్లు ఖడ్గము

ఖండింపబడుటచూచి పాండవవీరులు 'బాగు బాగు' అని అభిమన్యుని అభినందించి సింహనాదముచేసిరి.

## యుద్ధపు భయంకర స్థితి:-

రాజా! ధృష్టద్యుమ్నాదులు మీ సేనలతో, మీ సేనలు వారితోను యుద్ధము చేయదొడగెను ఉభయసేనలలో నొండొరులను కొట్టుకొనుచున్నప్పటిధ్వని మిన్నుముట్టెను. వారు పరస్పరము కేశాకేశి, నఖానఖి, ముష్టిముష్టి జానూజానవిగా పోరాడుచుండిరి. తలము (కత్తిపిడి)ల చేత, ఖడ్గములచేతను కొట్టుకొనుచు పరస్పరము చంపుకొనుచుండిరి. తండ్రి కొడుకును, కొడుకు తండ్రిని వివేచనా రహితముగా వధించుచుండిరి.

రాజా! యుద్ధభూమియందు పడి ధనుస్సులు-ఆభరణములు-బాణములు-దంతపు పిడులు గల ఖడ్గములు-బంగారు చిత్రములుగల డాలులు-సువర్ణమయములైన ప్రాస-పట్టిశ-ఋష్టి (రెండంచులకత్తి)-శక్తి-ముసల-పరిఘ-భిందిపాలాది వివిధాయుధములు కుబుసము వీడిన సర్పములవలె ప్రకాశించుచుండెను.

రాజా! గజములపైని కుథములు (రత్నకంబళములు), వీవనలు క్రిందపడి శోభిల్లుచుండెను. చచ్చిపడియున్న మనుష్యులు జీవంతులవలె కనబడుచుండిరి. గదా-ముసలములచేత, గజాశ్వరథములచేతను మర్దింపబడిన మనుష్యులు భూశయనము చేయుచుండిరి. అట్లే ఛిన్నములైన గజాశ్వాదుల శరీరములుగూడ భూమిని పర్వతములవలె కప్పియుండెను. కొందరు మాటలేక, మరి కొందరు అల్పముగా మూలుగుచు పడియుండిరి.

రాజా! ఆ పడియున్న వీరుల శరీరములు చేతుల తొడుగులతో భుజకీర్తులతోను విరాజిల్లుచున్న బాహువులతో, తెగిపడిన యేనుగుతొండములవంటి తొడలతో, శిరోమణి కుండలములతో భాసిల్లు శిరస్సులలోను భూమి భాసిల్లెను. బంగారు కవచములు, మంటలు శాంతించిన అగ్నులవలె భూమిపై బడి కనబడుచుండెను.

రాజా! తెగిపడిన భూషణములు-ధనుస్సులు అంతట వరచుకొని శరములు అన్నిచోట్ల భగ్నములై పడియున్న రథములు బాణహతములై నాలుకలు తెగి నెత్తుట దోగిన అశ్వములు-ధ్వజములు అనుకర్షములు (ఇరుసులు) ఉపాసంగములు

(అమ్ముల పొదులు) వీరుల తెల్లని శంఖములు తొండములు తెగిన గజములు, ఈ మొదలైన వానిచేత యుద్ధభూమి నానారూపాలంకారములచేత భూషితయైన స్త్రీవలె ప్రకాశించెను.

రాజా! ఆ రణరంగమందు తెగిపడిన తొండములచేత తుంపిరులు గ్రక్కుచున్న గజములు, జలము స్రవించుచున్న పర్వతములవలె పడియుండెను. నానా వర్ణములు గల గజముల కంబళ్ళు-అంబారీలు-అంకుశము లు-గంటలు-రత్న కంబళములు-కంఠభూషణములు ఛిన్నములైన బంగారు కక్ష్యము (ఏనుగు నడుముకు కట్టు త్రాడు) యంత్రములు-తోమరములు- అశ్వముల వస్త్రాభరణములు ఆశ్వికుల ఛిన్న భుజములు ప్రాసాద్యాయుధములు తలపాగలు విచిత్రబాణములు రాజవీరుల విలువైన తలమానికములు వారి ఛత్ర, చామర, వ్యజనములు, కమలము వంటి ముఖములు ఈ మొదలైన వానిచేత రణభూమి గ్రహనక్షత్రాదుల చేత శోభిల్లుచున్న ఆకాశమువలె నుండెను.

రాజా! యిట్లు రెండు సేనలు మర్దింపబడియుండగా జీవితులుగానున్న వారు శ్రమచెందుచుండగా రాత్రియాయెను పరస్పరము కనుగొనజాలకుండిది. అప్పుడు కౌరవపాండవులు అష్టమ దివసయుద్ధ సమాప్తి చేసిరి కురుపాండవులు తమ శిబిరములకు పోయిరి.

జనమేజయా! యిట్లు సంజయుడు ఎనిమిదవనాటి యుద్ధమును వర్ణించి ధృతరాష్ట్రునకు చెప్పి తరువాతి వృత్తాంతమిట్లు చెప్పదొడగెను.

(తొంభైయేడవ అధ్యాయము)

## కర్ణునకు యుద్ధము చేయుటకు ఆజ్ఞ యిమ్మని దుర్యోధనుడు భీష్ముని నిర్బంధించుట :

రాజా! తరువాత దుర్యోధన- దుశ్శాసన- శకుని- సైంధవ కర్ణులు సమావేశము చేసి మంత్రాలోచనము చేసి "పాండుపుత్రులు యుద్ధములో నెట్లు జయింపబడుదురు?" అని విచారించిరి. అప్పుడు దుర్యోధనుడు మంత్రులతో విశేషించి కర్ణశకునులతోను మాట్లాడి యిట్లనెను :

మిత్రులారా! భీష్మ-ద్రోణ- సౌమదత్త- భూరిశ్రవస్- కృప - శల్యులు యుద్ధమునందు పాండవులను బాధించకున్నారు. దానికి కారణము నాకు తెలియకున్నది. పాండవులు వధింపబడని యెడల వారు నా సైన్యముయొక్క నాశము తప్పక చేసెదరు. కనుక కర్ణా! నేను క్షీణబలుడనై క్షీణశస్త్రుడనై యుద్ధమునందు నిలిచియున్నాను. నీవు యుద్ధవిముఖుడవు కాగా పాండవులు నన్ను జయించిరి భీష్ముడు ద్రోణుని యెదుటనే నా తమ్ములను వధించెను. దేవతలకు కూడ అవధ్యులైన పాండుపుత్రులచేత నేను అపకృతుడనైతిని. అట్టివారిని నేనెట్లు జయింపగలనని సందేహించుచున్నాను.

ధృతరాష్ట్రమహారాజా! యిట్లు దుర్యోధనుడనిన మాటలు విని కర్ణుడు దుర్యోధనునితో నిట్లనెను :

దుర్యోధనా! నీవు దుఃఖింపకుము. నీకు ప్రియము చేసెదను. భీష్ముడు శస్త్రములు వీడి యుద్ధరంగమునుండి తొలగిపోయిన యెడల, నేనువచ్చి భీష్ముడు చూచుచుండగనే సోమకులతోగూడ పాండవులను సంహరించెదనని రాజా! నీమీద ఒట్టు పెట్టుకొని శపథము చేయుచున్నాను. భీష్ముడు ఎల్లప్పుడు పాండవుల యెడల దయతోనుండును. కనుక నతడు యుద్ధాభిమానము గలవాడైనను రణప్రియుడైనను పాండవులను జయింపడు.

దుర్యోధనా! నీవిప్పుడే భీష్మునికడకు పోయి, అతనిని యుద్ధమును మానుటకు అంగీకరింపజేసి అస్త్రసన్యాసము చేయుమనుము. అతడు యుద్ధరంగమును వీడిన తోడనే నేనొక్కడనే పాండవులను మిత్రబంధుసహితముగా వధించెదను చూడుము.

ధృతరాష్ట్రమహారాజా! యిట్లు కర్ణుడు చెప్పగానే, దుర్యోధనుడు దుశ్శాసనునితో "నావెంట భీష్ముని కడకు పోవదగువారితో ప్రయాణసన్నాహము చేయింపు"మని చెప్పి కర్ణునితో నిట్లనెను :

కర్ణా ! మానవోత్తముడైన భీష్ముని అంగీకరింపజేసి త్వరగా నీవద్దకు వచ్చెదను. భీష్ముడు యుద్ధము వీడి వెడలిపోయిన తరువాత నీవు శత్రువులను సంహరింతువు గాక !

రాజా! యిట్లు చెప్పి దుర్యోధనుడు త్వరగా తమ్ములతో దేవతలతో

నింద్రుడు వలె భీష్ముని కతకు బయలుదేరెను. తరువాత దుశ్శాసనుడు అంగద ములు (భుజకీర్తులు) కిరీటము-హస్తాభరణములు ధరించి మార్గమునందు పోవుచు శోభిల్లెను. దిరిసెన పూవువంటి సువాసన బంగారు ఛాయగల చందనము అలది కొని, స్వచ్ఛవస్త్రములు ధరియించి సింహగమనముతో పోవుచున్న దుర్యోధనుడు ఆకాశమునందు సూర్యునివలె ప్రకాశించుచుండెను.

రాజా! అట్లు భీష్ముని శిబిరమునకు పోవుచున్న దుర్యోధనునితో అనేక రాజవీరులు తమ్ములు, వసువులు ఇంద్రునివెంట పోవుచున్నట్లు వెడలిరి. కొందరు అశ్వములపైన, మరికొందరు గజములపైన కొందరు రథములలోను కూర్చొని అతనిననుసరించి పోవుచుండిరి. అతని రక్షణము కొరకు కొందరు శస్త్రధారులై పోవుచుండిరి ఇట్లు కౌరవ వీరులచేత ఆదరింపబడుచు దుర్యోధనుడు భీష్ముని శిబిరమువైపు పోవుచుండెను.

రాజా! ఏనుగు తొండమువంటి తన కుడి భుజమువైపుగా అంజలిబద్ధులై వచ్చుచున్న నానా దేశవీరుల మధురవచనములు వినుచు సూతమాగధులచేత స్తుతింపబడుచు వారినందరిని ఆదరించుచు దుర్యోధనుడు పోవుచుండెను.

రాజా! సుగంధతైల పూరితములైన దీపములు తనచుట్టు వెలుగుచుండగా దుర్యోధనుడు దీపించుచున్న గ్రహములతో విరాజిల్లుచున్న చంద్రునివలె శోభిల్లు చుండెను. బంగరు తలపాగలు ధరించిన వేత్రహస్తులు జనమును దూరముగా తొలగించుచుండగా దుర్యోధనుడు భీష్ముని శిబిరము చేరి అశ్వముదిగి భీష్ముని సమీపించి యతనికి నమస్కారము చేసి యెదురుగానున్న ఆసనముపై కూర్చొని కన్నీరు స్రవింపగా డగ్గుత్తుకతో అంజలిబద్ధుడై భీష్మునితో నిట్లనెను :

పితామహా! యుద్ధమునందు మేము నిన్ను ఆశ్రయించి యింద్రాది దేవత లను రాక్షసులనుగూడ జయించుటకు ఉత్సాహపడుచున్నాము. ఇట్లుండగా సమిత్ర బాంధవులైన పాండవులను జయించుట యనగా నెంత ?

కనుక తాతా! మాపై దయతలచి వీరులైన పాండవులను ఇంద్రుడు రాక్ష సులను వలె వధించి సత్యవచనుడవు కమ్ము. నేను సోమక-పాంచాల-కేకయ కరూషాదులందరను సంహరించెదను.

పాండవుల యెడల దయచేతగాని, నాయందు ద్వేషభావము చేతగాని,

నా దౌర్భాగ్యము చేతగాని పాండవులను నీవు రక్షింపదలచిన యెడల కర్ణుడు యుద్ధము చేయుటకు అనుజ్ఞ యిమ్ము. అతడు పాండవులను మిత్రబాంధవ సహితముగా జయింపగలడు.''

ధృతరాష్ట్రమహారాజా! యీ విధముగా దుర్యోధనుడు భీష్ముని ప్రార్థించి మరి యేమియు పలుకక ఊరకుండెను.

జనమేజయా! సంజయుడిట్లు చెప్పి ధృతరాష్ట్రునకు తరువాతి వృత్తాంత మిట్లు చెప్పదొడగెను :

తొంభై ఎనిమిదవ అధ్యాయము

## భీష్ముడు అర్జున పరాక్రమము వర్ణించుట :

రాజా! యిట్లు నీ పుత్రుని వాక్కులు విని మహాత్ముడైన భీష్ముడు దుఃఖాతిశయముచేత దుర్యోధనునితో అప్రియవచనములు పలుకక చాలాసేపు ధ్యానించి దుఃఖకోపములతో అంకుశముచేత పొడవబడిన గజమువలె, వాక్బాణములచేత గ్రుచ్చబడి నిట్టూర్చుచు, కన్నులు త్రిప్పుచు క్రోధముతో దేవదానవ గంధర్వాది లోకములు దహించుచున్నవాడు వలె నుండియు దుర్యోధనునితో శాంతముగా నిట్లనెను :

దుర్యోధనా! నీకు ప్రియము చేయగోరి యుద్ధాగ్నిలో నా ప్రాణములను గూడ హోమము చేయుచు నా శక్తి కొలది పోరాడుచున్న నన్ను నీవిట్లు వాక్శల్యములచేత పొడుచుచున్నావే ఇది నీకు తగునా !

1. దుర్యోధనా! శూరుడైన అర్జునుడు ఖాండవ వనమునందు అగ్నిదేవుని తృప్తిపరచుటకు ఇంద్రునితో పోరాడి అతనిని ఓడించిన నిదర్శనము చాలదా !

2. మహాబాహూ! ఘోషయాత్రలో గంధర్వులు ఎత్తుకొనిపోయిన నిన్ను అర్జునుడు విడిపించెను. ఆ ఒక్క దృష్టాంతము చాలదా !

3. శూరులైన నీ తమ్ములు- కర్ణుడు అప్పుడు భయపడి పారిపోయిరి కదా! ఆ ఘోషయాత్ర నిదర్శన మొక్కటి చాలదా !

4. అర్జునుడు విరాటనగరమునందు ఉత్తర గోగ్రహణ కాలమందు మననందరను ఎదిరించి యేకాకియై పోరాడిన దృష్టాంతమొక్కటి చాలదా!

5. అప్పుడు నన్ను ద్రోణాచార్యుని నిర్జించి యతడు తలగుడ్డలు తీసుకొనిపోయిన నిదర్శనమొక్కటి చాలదా అర్జునుని పరాక్రమమునకు?

6. అట్లే అశ్వత్థామ కృపాచార్యులను గోగ్రహణకాలమందు అర్జునుడొక్కడే జయించిన దృష్టాంతమొక్కటి చాలదా!

7. తన పౌరుషముపైన మహాభిమానము గల కర్ణుని అప్పుడు జయించి అర్జునుడు వస్త్రములు గొనిపోయి ఉత్తరాకుమారికి ఇచ్చిన నిదర్శనమొక్కటి చాలదా!

8. ఇంద్రునకుగూడ అశక్యులైన నివాతకవచాది రాక్షసులను అర్జునుడొక్కడే యుద్ధమునందు జయించిన నిదర్శనమొక్కటి చాలదా!

దుర్యోధనా! పై కారణములే కాక, అర్జునుడికి రక్షకుడుగా జగద్రక్షకుడు శంఖచక్రగదాధరుడైన శ్రీకృష్ణుడు ఉండగా అతనిని రణమునందు జయింపగల సమర్థుడెవడున్నాడు? వాసుదేవుడు ప్రపంచ సృష్టి స్థితి సంహారములకు కర్త, అనంతశక్తిసంపన్నుడు. అతడు సర్వేశ్వరుడు దేవదేవుడు - పరమాత్ముడు- సనాతనుడు గదా!

దుర్యోధనా! పూర్వమే నీకు నారదాది మహర్షులు ఉపదేశించిరి. కాని నీవు మూర్ఖుడవై మంచి చెడుగులు తెలియకపోయితివి. చావుమూడినవాడు అన్ని వృక్షములు కాంచనములుగనే చూచునట్లు నీవుగూడ అన్నింటిని విపరీతబుద్ధితోనే చూచుచున్నావు. పాండవ సృంజయులతో స్వయముగా నీవు వైరము తెచ్చిపెట్టుకొంటివి గాని, ఇంద్రాది దేవతలు గూడ పాండవులను జయింపజాలరు.

దుర్యోధనా! నేనైతే ఒక్క శిఖండిని విడిచి సోమక పాంచాలుర నందరను సంహరించెదరు. వారైనను నన్ను చంపెదరు. నేనైనను వారిని సంహరించి నీకు ప్రియము గూర్చెదను.

రాజా! పూర్వము రాజగృహమునందు శిఖండి స్త్రీగా జన్మించి వరప్రభావము వలన పురుషుడాయెను. కనుక నతడు పూర్వము స్త్రీయే. అట్లు తొలుత

స్త్రీగా నుండి పురుషుడుగా మారిన వానిని నా ప్రాణము పోయినను సంహరింపను. కనుక దుర్యోధనా! సుఖముగా శయనింపుము. రేపు నేను ప్రపంచమున్నంత కాలము జనులు స్మరించుకొనునంతటి మహాయుద్ధము చేసెదను.

ధృతరాష్ట్రమహారాజా! ఇట్లు భీష్మపితామహుండు చెప్పిన మాటలు విని దుర్యోధనుడు పితామహునకు తలవంచి నమస్కారము చేసి తన శిబిరమునకు తిరిగిపోయెను.

రాజా! దుర్యోధనుడు స్వజనమును పంపివేసి శిబిరములో ప్రవేశించి ఆ రాత్రి గడిపెను. మరునాటి ప్రాతఃకాలమునందు రాజవీరులందరిని పిలిచి యుద్ధ సన్నాహములు చేయుటకు ఆజ్ఞాపించెను. "నేడు భీష్ముడు క్రుద్ధుడై సోమకులను సంహరింపగలడు" అనికూడా వారితో చెప్పెను.

రాజా! భీష్ముడు "తానటుచేయుట తగద"ని దుర్యోధనుని ప్రత్యాదేశము (యుద్ధమునుండి తొలగించుట) తలచి అతడు రాత్రి తన వద్దకువచ్చి దుఃఖించిన విధమును తలచి మిక్కిలి నిర్వేదము చెంది, పరాధీనత్వమును నిందించి అర్జునునితో యుద్ధము చేయుటకు నిశ్చయించుకొనెను.

## భీష్మరక్షణార్థము దుర్యోధనుని యేర్పాట్లు :

రాజా! అప్పుడు దుర్యోధనుడు భీష్ముని మనోభావమును అతని చింతనమును గ్రహించి దుశ్శాసనునితో నిట్లనెను :

తమ్ముడా! భీష్మరక్షణార్థము రథికులను సంసిద్ధులను చేయుము. ఇరువది రెండు సేనలనన్నింటిని పంపుము. అనేక సంవత్సరములుగా తలచినది యిప్పుడు సంప్రాప్తించినది. పాండవులను సైన్యయుక్తముగా సంహరించుటకు రాజ్య వ్యాప్తికి ఇది సమయము. కనుక ఈ కార్యసిద్ధికి ముఖ్యకర్తవ్యము యిప్పుడు మనకు భీష్ముని రక్షణమే. మనచేత రక్షింపబడిన భీష్ముడు పాండవులను యుద్ధమునందు సంహరించగలడు. మనకు సహాయకుడుగా నుండగలడు.

తమ్ముడా! భీష్ముడు శిఖండిని చంపనని చెప్పినాడు. శిఖండి పూర్వము స్త్రీగా నుండినవాడు గాబట్టి అతనిని తాను చంపనన్నాడు. "నేను తండ్రియైన శాంతనవకు ప్రియము చేయదలచి రాజ్యమును స్త్రీలకు విడిచినాను. కనుక

స్త్రీనిగాని పూర్వము స్త్రీగా నుండి పురుషుడిగ మారిన వానినిగాని చంపను. ఇది నా వ్రతము. సత్యముగా చెప్పుచున్నాను" అని భీష్ముడు నాతో చెప్పి మరల నిట్లనెను:

దుర్యోధనా' ఈ శిఖండి పూర్వము స్త్రీయని నీవు వినియుందువు. ఇంతకు పూర్వము ఉద్యోగపర్వములో చెప్పబడిన విధముగా శిఖండి పూర్వవృత్తాంతము తెలుసుకొనుము. పూర్వము కన్యకగా నుండిన శిఖండి యిప్పుడు నాతోయుద్ధము చేయబోవుచున్నాడు. ఏ పరిస్థితిలో గూడ నేనతనిపై బాణప్రయోగము చేయను. పాండవహితమునకై పోరాడుటకు వచ్చిన రాజవీరులందరిని యుద్ధమునందు సంహరించెదను.

దుశ్శాసనా! భీష్మపితామహుడిట్లు నాతో చెప్పెను కాబట్టి మనము సర్వ విధముల గాంగేయుని రక్షించవలెను. అది మన ముఖ్య కర్తవ్యము. అన్నివైపుల రక్షింపబడుచున్న తోడేలు గూడా సింహమును చంపగలదు గదా! కనుక తోడేలు వంటి శిఖండి పాండపరక్షితుడై యున్నాడు. అతనిచేత మనము భీష్ముని చంపింపగూడదు.

తమ్ముడా! మన మేనమామ శకుని శల్య.కృప-ద్రోణ-వివింశత్యాదులు సిద్ధముగానుండి భీష్ముని రక్షింతురుగాక- అతనిని రక్షించినచో మనకు జయం నిశ్చయము.

ధృతరాష్ట్ర మహారాజా! దుర్యోధనుని మాటలు విని అందరు రాజవీరులు అప్పుడు రథసైన్యములతో భీష్మునకు అండగా నతని చుట్టు చేరిరి. నీ పుత్రు లందరు గూడ పోయిరి. వారు భూమ్యాకాశములను కంపింపచేయుచు పాండవు లను క్షోభింపజేయుచుండిరి. అందరు చతురంగ సైన్యములతో భీష్ముని చుట్టు దేవరాక్షస యుద్ధములో దేవతలు ఇంద్రుని చేరినట్లు చేరిరి.

రాజా! తరువాత దుర్యోధనుడు దుశ్శాసనునితో మరలనిట్లనెను- తమ్ముడా! అర్జునుని యెడమ రథచక్రమును యుధామన్యుడు, దక్షిణ చక్రమును ఉత్తమౌజుడు రక్షించుచున్నారు. అర్జునుడు శిఖండిని రక్షించుచున్నాడు. ఇట్లు అర్జునునిచేత రక్షితుడైన శిఖండిని మనము నిర్లక్ష్యముచేసినాము. కనుక శిఖండి మనను, భీష్ముని చంపకుండునట్లుగా జాగ్రత్తగా ఏర్పాట్లు చేయుము.

ధృతరాష్ట్ర మహారాజా! అన్నగారు చెప్పిన మాటలు విని దుశ్శాసనుడు భీష్ముని ముందిడుకొని సేనతో ముందుకు సాగిపోయెను.

రాజా! అట్లు అనేక రథికవీరులచేత పరిరక్షింపబడుచు యుద్ధమునకు నకు వచ్చుచున్న భీష్ముని అర్జునుడు చూచి ధృష్టద్యుమ్నునితో నిట్లనెను.

పాంచాలరాజా! యిప్పుడు నీవు శిఖండిని భీష్ముని యెదుట నిలుపుము. అతనిని నేను రక్షించుచుండెదను.

జనమేజయా! యిట్లు సంజయుడు ధృతరాష్ట్రునకు తరువాత నవమదివస యుద్ధ వృత్తాంతమిట్లు చెప్ప దొడగెను.

తొంభైతొమ్మిదవ అధ్యాయము

## వ్యూహరచన-తుముల యుద్ధము-ఉత్పాతములు-తొమ్మిదవనాటి యుద్ధము

రాజా! తరువాత భీష్ముడు "సర్వతో భద్ర" వ్యూహమును రచించి యుద్ధమునకు పోయెను. కృప-కృతవర్మ-శైబ్య-శకుని-సైంధవ-కాంభోజ సుదక్షిణాది రాజవీరులు భీష్మునితో ఆ వ్యూహమునకు అగ్రభాగమునందు నిలిచిరి. ఆ వ్యూహమునకు దక్షిణపార్శ్వమునందు ద్రోణ-భూరిశ్రవస్-శల్య-భగదత్తులు వామపార్శ్వమునాశ్రయించి అశ్వత్థామ-సోమదత్త-అవంత్యులు (సుందోప సుందులు)న్ను మహాసేనలతో నిలిచిరి. వ్యూహమధ్యమునందు త్రిగర్తులతో దుర్యోధనుడు నిలిచెను. వ్యూహపృష్ఠభాగమునందు అలంబుష-శ్రుతాయువులు నిలిచిరి.

రాజా! యీ విధముగా మీవారు వ్యూహరచన చేసి ప్రజ్వలించుచున్న అగ్నుల వలె యుద్ధసన్నద్ధులై నిలిచిరి.

రాజా! తరువాత యుధిష్ఠిరుడు తన సైన్యమును గూడ వ్యూహముగా రచించి దానిముందు భాగమునందు భీమ నకుల సహదేవులతో నతడు నిలిచెను. ధృష్టద్యుమ్న-విరాట-సాత్యకుల గొప్పసైన్యములతో నచట నిలిచిరి. అట్లే శిఖండి అర్జున-ఘటోత్కచ-చేకితాన-కుంతిభోజులు కూడ మహాసేనలతో నిలిచిరి.

అభిమన్యు-ద్రుపద-యుయుధానయుధామన్యు - కేకయులు ఈ వ్యూహమందు నిలిచిరి.

రాజా! యీ విధముగా పాండవులుగూడ దుర్జయమైన గొప్ప ప్రతివ్యూహమును రచించి యుద్ధసన్నద్ధులై నిలిచిరి. రాజా! మీవారు సన్నాహముతో భీష్ముని ముందిడుకొని శత్రువులపై దాడిచేసిరి. పాండవులు గూడ భీముని ముందు పెట్టుకొని భీష్మునితో పోరాడుటకు బయలుదేరిరి వారు వివిధవాద్యముల అతిభయంకర ధ్వనులు మిన్నుముట్టగా మీవారిపై పడిరి అప్పుడు మీవారు గూడ వాద్యములు ప్రతినాదము చేయుచు నడిచిరి.

రాజా! అప్పుడా రెండుసేనలకు అతిఘోరముగా తుముల యుద్ధము జరిగెను. ఒండొరులను కొట్టుకొనుచుండిరి. ఆ ధ్వనిచేత భూమి కంపించెను భయంచేత పక్షులు గిరగిర తిరుగజొచ్చెను తేజస్సుతో నుదయించిన సూర్యుడప్పుడు ప్రభావహీనుడయ్యెను. సుడిగాలులు మహాభయమును సూచించుచు వీచెను. పిడుగులు పడెను. నక్కలు కూసెను

రాజా! ఆ ఉత్పాతములు మహాభయము తెలుపుచుండెను. దిక్కులు మండుచుండెను. పాంసువర్షము నెత్తుటదోగిన ఎముకలవర్షము గురిసెను. ఏడ్చుచున్న వాహనముల నేత్రములనుండి అశ్రువులు గురియుచుండెను. అవి మలమూత్రములు విడుచుచుండెను. నరభక్షకులైన రాక్షసులు కనబడకుండచేయు భయంకరధ్వనులు వినబడుచుండెను. వివిధ ధ్వనులు భయంకరముగా చేయుచు పక్కులు-కాకులు-కుక్కలు పడిపోవుచుండెను. మండుచున్న కొరవులు సూర్యమండలమును తాకి మహాభయమును సూచించుచు భూమిపై బడుచుండెను.

రాజా! అప్పుడు కౌరవపాండవసేనలు శంఖ మృదంగ ధ్వనులచేత, వాయువుచేత కంపించిన వనములువలె వణకెను. ఆ యశుభ ముహూర్తమునందు పరస్పరము ఎదిరించుచు వచ్చుచున్న చతురంగసేనల కోలాహలశబ్దము ఉప్పెన వాయువుచేత ఉప్పొంగిన సాగరముల ధ్వని వలె భయంకరముగా నుండెను.

జనమేజయా! యిట్లు సంజయుడు ధృతరాష్ట్రునకు చెప్పి తరువాతి యుద్ధవృత్తాంతమిట్లు చెప్ప దొడగెను

నూరవ అధ్యాయము

# ద్రౌపదీపుత్రులకు అభిమన్యునకు అలంబుషునితో యుద్ధము కౌరవసేనల పలాయనము

రాజా! తరువాత తేజస్వియైన అభిమన్యుడు దుర్యోధనుని సైన్యముపై దాడిచేసి మేఘము జలధారలు వలె అనర్గళముగా బాణవర్షము గురిసెను. మహా సముద్రములో దూరిపోవుచున్న ఆదివరాహము వలె క్రుద్ధుడై సేనాసాగరములో ప్రవేశించుచున్న అభిమన్యుని నివారించుటకు మీవారికి శక్తి చాలకుండెను. అతని బాణములు అనేక రాజవీరులను సంహరించుచుండెను అభిమన్యుడు యమ దండముల వంటి బాణములను ప్రయోగించుచు మీ చతురంగసేనలను ఎదురు లేకుండ చీల్చుచుండెను.

రాజా! అట్లు అతిఘోరముగా పోరాడుచున్న అభిమన్యుని రాజవీరులందరు మిక్కిలి ప్రశంసించిరి. మీ సైన్యములనతడు మహావాయువు దూది పింజలనువలె పారద్రోలుచుండెను. అప్పుడు మీ సేనలు రక్షకుడు లేక పంకములో దిగబడిన గజముల వలె బాధపడుచుండెను.

రాజా! అట్లు అభిమన్యుడు మీ సైన్యములను పారద్రోలి పొగలేని అగ్నివలె జ్వలించుచుండెను. అతనిని మీవారు మండుచున్న అగ్నిని శలభములవలె సహింప జాలకుండిరి. అప్పుడతడు వజ్రపాణియైన యింద్రుని వలె మీ వారికి కనబడెను. సువర్ణవర్ణము గల యతని ధనుస్సు మేఘములో విద్యుత్తువలె కనబడెను. యుద్ధమునందంతటను కలయదిరుగుచున్న యతని బాణములు పుష్పవికసితమైన వృక్షములనుండి భ్రమరములు వచ్చుచున్నట్లు తోచెను. అంతటను అతని రథము తిరుగుచుండగా ఎచట గూడ శత్రువులకు అవకాశము లేకుండెను.

రాజా! అభిమన్యుడు ద్రోణాశ్వత్థామ సైంధవ బృహద్బలాదులను మోహింపజేయుచు అంతటను సంచరించుచుండగా సూర్యమండలమువలె మండలీ కృతమైన అతనిధనుస్సు సేనను తపింపజేయుచుండెను. అట్లు తిరుగుచున్న అభి మన్యునిచూచి రాజవీరులందరు లోకములో ఇద్దరు అర్జునులున్నారా! యనితలచిరి. అభిమన్యునిచేత మర్దింపబడుచున్న కౌరవసైన్యము మదముచేత భ్రమించుచున్న ప్రమదవలె భ్రమించుచుండెను.

రాజా! ఆ విధముగా అభిమన్యుడు సైన్యమును పారద్రోలి మహారథికులను కంపింపజేసి యింద్రుడు మయాసురుని జయించినట్లు జయించి మిత్రులను సంతోషపరచెను. అట్లు అతనిచేత పారద్రోలబడుచున్న మీ సైన్యములు మేఘ గర్జనము వలె ఆర్తస్వరము చేసిరి.

రాజా! అటు ఉప్పెన వేగముచేత క్షోభిల్లిన సముద్రము వలె అరచుచున్న మీ సేనల ఆర్తధ్వని విని దుర్యోధనుడు, ఋష్యశృంగ పుత్రుడైన అలంబుష రాక్షసునితో నిట్లనెను.

మహాబాహూ! ఈ అభిమన్యుడు రెండవ యర్జునుడాయన్నటుగా క్రోధము చేత వృత్రాసురుడు దేవసేనను తరిమినట్లు తరిమికొట్టుచున్నాడు. మహావీరా! అభిమన్యు రోగమును అణచుటకు నీవు దప్ప మరియొక ఔషధము నాకు కనబడుటలేదు. కనుక నీవుత్వరగాపోయి మాయాదివిద్యలచేత నతనిని చంపుము. మేము భీష్మద్రోణాదులను ముందిడుకొని యర్జునుని సంహరించెదము.

రాజా! యిట్లు దుర్యోధనుడు చెప్పగనే బలవంతుడైన అలంబుష రాక్షసేంద్రుడు ప్రతాపముతో యుద్ధరంగములో దూరి వర్షాకాల మేఘము వలె బిగ్గరగా గర్జిల్లెను. అతని ఆ మహాధ్వనిచేత పాండవ సైన్యము సుడిగాలి దెబ్బచేత మహాసముద్రమువలె క్షోభిల్లెను. ఆ రాక్షసుని ధ్వని వినినతోడనే అనేక క్షత్రియవీరులు భయముచేత తమ ప్రియ ప్రాణములు పరిత్యజించి భూమిమీద పడిపోయిరి.

రాజా! అప్పుడు అభిమన్యుడు ధనుర్బాణధారియై తన రథమునందే నృత్యముచేయుచున్నవానివలె ఆడుచు ఆ రాక్షసునిపై దాడిచేసెను. అలంబుషుడు క్రుద్ధుడై అభిమన్యుని చూచి అనతిదూరములోనున్న యతని సేనను తరిమికొట్టెను. అట్లు వధింపబడుచున్న పాండవసేనను ఆ రాక్షసుడు దేవసేనను బలాసురుడువలె ఎదిరించెను. అట్లు అలంబుషునిచేత వధింపబడుచున్న పాండవసేనలో త్రొక్కిడి అలజడి బయలుదేరెను. తరువాత అలంబుషుడు వేలకొలది శరములచేత పాండవసేనను కొట్టుచు పారద్రోలుచుండెను.

రాజా! అట్లు పాండవసేనను అలంబుషుడు పద్మసరస్సును గజమువలె మర్దించి ద్రౌపదీపుత్రులపై దాడిచేసెను. వారుగూడ అతిక్రుద్ధులై పంచగ్రహములు

సూర్యునిపై ఉరుకునట్లు ఆ రాక్షసునిపై ఎదురుదాడి చేసిరి. అట్లు యైదుగురు ద్రౌపదేయులచేత ఆ రాక్షసుడు ప్రళయకాలమందు అయిదు గ్రహములచేత చంద్రుడువలె పీడితుడయ్యెను.

రాజా! అప్పుడు 'ప్రతివింధ్య' రాక్షసునిపై మొక్కపోని నిశితశరములను ఆ అయిదుగురు ప్రయోగించిరి. అవి యతని కవచముచీల్చి శరీరములో గ్రుచ్చు కొనగా నతడు సూర్యకిరణములు దూరిన మేఘమువలె శోభిలుచుండెను. అట్లే వారు అలంబుషుని శరీరములో గూడ బాణములను గ్రుచ్చగా నతడు దీపించు చున్న శిఖరముగల పర్వతమువలె బాసిల్లెను. తరువాత ఆ అయిదుగురు నిశిత శరములచేత ఆ రాక్షసుని కొట్టిరి. అతడు కుపితములైన సర్పములవంటి ఆ బాణములచేత కొట్టబడిన నాగేంద్రునివలె కోపించెను. ఆ బాణఘాతములచేత ఆ రాక్షసుడు మూర్ఛిల్లి కొంతసేపటికి తేరుకొనెను. రెట్టించిన కోపముతో ఆ అయిదుగురి బాణములను ధ్వజములను ధనుస్సులను ఖండించి వారి రథాశ్వము లను సారథిని సంహరించెను.

రాజా! అట్లు అలంబుషుడు బహువిధములైన అనేక సహస్రబాణములచేత ఆ అయిదుగురిని విరథులను చేసి వారిని సంహరించుటకు ఉరికెను.

రాజా! అప్పుడు మీవారు పాండవులు అట్లు క్రోధదీప్తులై పరస్పరము ప్రళయకాలాగ్నులవలె జ్వలించుచు సమరముచేయుచుండగా నందరు విస్మయము నొంది చూచుచుండిరి. ఆ యిరువురి సమాగమమప్పుడు దేవాసుర యుద్ధమునందు ఇంద్ర-శంబరాసురుల సమాగమువలె భీషణముగా నుండెను.

జనమేజయా! ఇట్లు అలంబుషుని పరాక్రమము వర్ణించి చెప్పిన సంజయు నితో ధృతరాష్ట్రు డిట్లనెను.

## అభిమన్యునిచేత అలంబుషుని పరాజయము

సంజయా! అట్లు అభిమన్యుడు యుద్ధములో అనేక మహారథికులను వధించుచుండగా, అతనితో నలంబుషుడెట్లు ప్రతియుద్ధము చేసెను? ఆ యిరువు రకు జరిగిన యుద్ధమెట్లుండెను? ఆ క్రమమంతయు నాకు చెప్పుము. అప్పుడు అర్జునుడు, భీమసేనుడు, ఘటోత్కచుడు, నకులసహదేవులు సాత్యకి మా సైన్య

ములతో ఎట్టి యుద్ధము చేసిరి? అదియంతయు కథాకథనకుశలుడవైన నీవు నాకు వివరించి చెప్పుము.

జనమేజయా! యిట్లు ధృతరాష్ట్రుడు ప్రశ్నింపగా నతినికి సంజయుడు తరువాతి యుద్ధవృత్తాంతమిట్లు చెప్పదొడగెను.

రాజా! అలంబుషాభిమన్యులకు జరిగిన రోమాంచకరమైన యుద్ధమును గూర్చి భీమార్జున నకులసహదేవులు చూపించిన పరాక్రమమును గూర్చి భీష్మ ద్రోణాదులైన మీవారందరు నిర్భయముగా ప్రదర్శించిన అద్భుతపరాక్రమమును గూర్చి నీకు వివరించి చెప్పెద వినుము.

రాజా! తరువాత అలంబుషుడు, అభిమన్యుడు సింహనాదములు చేసి పరస్పరము నెదిరించుకొనుచు "నిలునిలు" మని పిలుచుకొనుచు ఒండొరులపై పోరు సలిపిరి. మాయావియైన రాక్షసుడు దివ్యాస్త్రకోవిదుడైన అభిమన్యుడు తలపడి దేవదానవుల వలె పోరాడజొచ్చిరి.

రాజా! అప్పుడు అభిమన్యుడు ఎనిమిది తీక్ష్ణబాణములను తన తండ్రికి శత్రువైన అలంబుషునిపై ప్రయోగించెను. అలంబుషుడు గూడ అభిమన్యుని మెడపై తొమ్మిది బాణములతో, అంకుశములతో మహాగజమును వలె కొట్టెను. తరువాత అభిమన్యుడు అతని మెడపై తొమ్మిది బాణములు ప్రయోగించెను. బాణములు గ్రుచ్చుకొని ఆ యిరువురు పూచిన మోదుగులచేత వ్యాపించిన పర్వత ద్వయము వలె శోభిల్లిరి.

రాజా! తరువాత అలంబుషుడు జ్వాలలతోగూడిన పర్వతము వలె క్రుద్ధుడై అభిమన్యుని బాణజాలముతో కప్పెను. ఆ బాణములు అభిమన్యుని గ్రుచ్చి నేలపై పడెను. అట్లే అభిమన్యుడు యమదండములవంటి శరములతో అలంబుషునికొట్టి ఇంద్రుడు మాయాసురుని వలె నతనిని యుద్ధవిముఖుని చేసెను.

రాజా! అట్లు తనను చంపుటకు పైబడి కొట్టుచున్న అభిమన్యునిపై అలంబుషుడు, శత్రుతాపకరమైన రాక్షసమాయను ప్రయోగించెను. తరువాత అందరు మాయాంధకారముచేత తిరోహితులై తమను, శత్రువులను, అభిమన్యుని చూడజాలకుండిరి. అప్పుడు అభిమన్యుడు ఆ చీకట్లు విరియుటకు సూర్యాస్త్రము

ప్రయోగించెను. దానితో అన్ని యెడల ప్రకాశము కలిగెను. అభిమన్యుడట్లు ఆ రాక్షసుని మాయను నశింపజేసి అతనిని బాణములతో ముంచెను.

రాజా! తరువాత అలంబుష రాక్షసుడు అటువంటి అనేక మాయలనే ప్రయోగించెను. అప్పుడు సర్వాస్త్రకోవిదుడైన అభిమన్యుడు ఆ మాయలన్నిటిని వారించి అతనిని చంపబోయెను. అప్పుడారాక్షసుడు భయపడి తన రథమును విడిచి పారిపోయెను.

రాజా! మాయాయుద్ధము చేయుచున్న అలంబుషుడట్లు ఓడి పారిపోగా అభిమన్యుడు శత్రుసేనలను మదాంధమైన గజము పద్మసరస్సునువలె మర్దింపగా ఆ సైన్యము పారిపోవజొచ్చెను.

రాజా! తరువాత భీష్ముడు అట్లు పారిపోవుచున్న తమ సైన్యమునుచూచి మహాబాణవర్షము గురియుచు అభిమన్యుని వారించెను. అప్పుడు ధార్తరాష్ట్ర మహారథికులందరు ఏకమై యభిమన్యుని ఒంటరినిచేసి పొదివి బాణములచేతకొట్టిరి.

రాజా! అప్పుడు తండ్రి. మేనమామలతో సమానమైన బలపరాక్రమములు గల అభిమన్యుడు, కృష్ణార్జునులు, చూపునట్టి పరాక్రమమొక్కడే ప్రదర్శించుచు భయంకరముగా యుద్ధము చేయుచుండెను.

నూటఒక్కటవ అధ్యాయము

## అర్జునునితో భీష్మకృపాచార్యుల యుద్ధము:-

రాజా! అప్పుడు అర్జునుడు పుత్రునివద్దకు సైన్యమును సంహరించుచు వచ్చెను. అట్లే భీష్ముడుగూడ రాహువు సూర్యునెదుర్కొనునట్లు అర్జును నెదుర్కొనెను. అప్పుడు నీ పుత్రులు చతురంగబలముతో భీష్మునకు బాసటగావచ్చి అతని చుట్టుచేరిరి.

రాజా! అట్లే పాండవవీరులుగూడ అర్జున సహాయార్థమై యతనిచుట్టుచేరిరి. అప్పుడు భీష్మున కెదురుగానున్న యర్జునునిపై కృపాచార్యుడు ఇరువదియైదు బాణములను ప్రయోగించెను అప్పుడు సాత్యకి పాండవులహితము కోరుచు, పెద్దపులి యేనుగుపైబడినట్లు కృపాచార్యుని ఎదిరించి యతనిని నిశిత శరము

లతో కొట్టెను. కృపాచార్యుడు సాత్యకిపై తొమ్మిది బాణములు ప్రయోగించెను. ఆ దెబ్బలో సాత్యకి అతిక్రుద్ధుడై కృపాచార్య నాశకరమైన బాణమును ఎక్కుపెట్టి విడిచెను అట్లు కృపునిపైకి వచుచ్చున్న సాత్యకి బాణము ఇంద్రుని వజ్రాయుధమువలె నుండెను. దానిని అశ్వత్థామ క్రుద్ధుడై రెండుగాఛేదించెను.

## ద్రోణాశ్వత్థామలతో సాత్యకి యుద్ధము:-

రాజా! అప్పుడు సాత్యకి కృపాచార్యుని విడిచి అశ్వత్థామపైకి రాహువు చంద్రునిపైకి ఉరికినట్లు ఉరికెను. అప్పుడు అశ్వత్థామ సాత్యకి ధనుస్సును రెండుగా ఖండించి, అతనిని బాణములతోకొట్టెను. అప్పుడు సాత్యకి మరియొక ధనుస్సు తీసుకొని అరువది బాణములతో అశ్వత్థామ బాహువులపై, ఎదపైనను కొట్టెను. దానితో అశ్వత్థామ పీడితుడై ధ్వజదండము పట్టుకొని రథముపైకూలబడి మూర్ఛిల్లెను.

రాజా! తరువాత అశ్వత్థామ మూర్ఛదేరి ప్రతాపముతో సాత్యకిపై బాణ ప్రయోగముచేయగా అది అతనిని కొట్టి వసంతర్తువునందు సర్పశిశువు బిలములో దూరినట్లు భూమిలో దూరిపోయెను. అశ్వత్థామ మరియొక బాణముతో సాత్యకి రథధ్వజమును ఛేదించి సింహనాదముచేసి సాత్యకిని అనేక బాణములతో గ్రీష్మాంతమునందు మేఘము సూర్యునివలె కప్పెను.

రాజా! తరువాత సాత్యకి అశ్వత్థామ ప్రయోగించిన బాణములనుఛేదించి యతనిపై ననేక బాణజాలములువిడిచి, మబ్బులుపీడిన సూర్యునివలె అశ్వత్థామను తపింపజేసెను. తరువాత సాత్యకి అనేక బాణములతో అశ్వత్థామను ఆచ్ఛాదించి సింహనాదముచేసెను.

రాజా! అప్పుడు ద్రోణాచార్యుడు రాహుగ్రస్తుడైన చంద్రునివలె బాధ పడుచున్న పుత్రుని అశ్వత్థామనుచూచి అతనికి బాసటగాపోయి సాత్యకిపై దాడిచేసి సాత్యకిచేత పీడింపబడుచున్న అశ్వత్థామను విడిపింపదలచి ద్రోణాచార్యుడు సాత్యకిని తీక్ష్ణబాణముచేతకొట్టెను. అప్పుడు సాత్యకి అశ్వత్థామను విడిచి ద్రోణాచార్యుని ఇరువదిబాణములతో వేధించెను.

రాజా! అంతలో అర్జునుడువచ్చి క్రోధముతో ద్రోణునిపై దాడిచేసెను.

అప్పుడు ద్రోణార్జునులు యుద్ధమునందు ఆకాశమునందు బుధ-శుక్ర గ్రహముల వలె తలపడి పోరాడఁజొచ్చిరి.

జనమేజయా! యిట్లు సంజయుఁడు వర్ణించిచెప్పిన యుద్ధవృత్తాంతమువిని ధృతరాష్ట్రుఁడతని నిట్లు ప్రశ్నించెను:-

### నూటరెండవ అధ్యాయము

## ద్రోణ-సుశర్మలతో అర్జునుని యుద్ధము:-

సంజయా! ద్రోణార్జునులిట్లు పరస్పరము యుద్ధముచేసిరని చెప్పితివి. ద్రోణాచార్యునకు అర్జునుడు అత్యంత ప్రియశిష్యుడుగదా! అర్జునుని కతడెప్పుడు కూడ యుద్ధమునందు ప్రియముగానే వ్యవహరించునుగదా! ఆ యిరువురు యుద్ధమునందు హర్షించిన సింహములవలె నుండెదరుగదా! అట్టి ద్రోణార్జునులెట్లు పరస్పరము తలపడి పోరాడిరి?

జనమేజయా! ధృతరాష్ట్రుని ప్రశ్నములకు సంజయుడిట్లు చెప్పెను:- రాజా! ద్రోణాచార్యుడు యుద్ధమునందు అర్జునుడు తనకు ప్రియుడని తలచడు. అట్లే అర్జునుడుగూడ క్షత్రధర్మము పురస్కరించుకొని యుద్ధమందు ద్రోణాచార్యుని గురువుగా తలచడు.

రాజా! క్షత్రియులు యుద్ధమునందు ఒండొరులను విడువక, పరస్పర పరిమితులు మీరి పోరాడుచుందురు అప్పుడు వారు తండ్రులతో సోదరులతోను యుద్ధము చేసెదరు. కనుక అర్జునుడు ఆచార్యుని మూడు బాణములతో కొట్టెను. ఆ బాణముల దెబ్బను ద్రోణాచార్యుడు లక్ష్యపెట్టలేదు. అప్పుడు అర్జునుడు ఆగక శరవర్షములచేత ఆచార్యుని ఆచ్ఛాదించెను.

రాజా! తరువాత ద్రోణాచార్యుడు అడవిలో కార్చిచ్చువలె రోషముచేత మండిపడుచు వెంటనే అర్జునునిపై బాణవర్షముగురిసెను.

రాజా! తరువాత దుర్యోధనుడు సుశర్మను ద్రోణునకు సహాయకునిగా పంపెను. అంతట త్రిగర్తరాజైన సుశర్మ త్వరగాపోయి అర్జునునిపై నిశిత శరములను ప్రయోగించెను. రాజా! ద్రోణ సుశర్మలచేత ప్రయుక్తములైన బాణ

ములు అంతరిక్షమునందు శరత్కాలమందు హంసలవలె విరాజిల్లుచుండెను. ఆ బాణములు స్వాదుఫలభారముచేత వంగిన వృక్షముపైన పక్షులు వ్రాలినట్లు అర్జునునిపైబడెను.

రాజా! అప్పుడు అర్జునుడు సింహనాదముచేసి బాణప్రయోగంచేసి సుశర్మను, అతని పుత్రులను కొట్టెను. అట్లు అర్జునునిచేత కొట్టబడిన త్రిగర్తులు, మరణమునందు కృతనిశ్చయులై పార్థునిపైననే దాడిచేసిరి. అతనిపై శరవర్షము గురిసిరి. ఆ శరవర్షమును అర్జునుడు, పర్వతము జలవర్షమునవలె గ్రహించెను.

రాజా! అప్పుడు అర్జునుని హస్తలాఘవము అత్యద్భుతముగానుండెను. అందరు విడిచిన బాణములను అర్జునుడు, వాయువు మేఘసమూహమునువలె ఒక్కడే వారించుట అత్యద్భుతముగా నుండెను. అర్జునుని యుద్ధకౌశలముజూచి దేవదానవులు హర్షించిరి.

తరువాత, రాజా! అర్జునుడు అతిక్రుద్ధుడై, త్రిగర్తులపై వాయవ్యాస్త్రము ప్రయోగించెను. దాని నుండి బయలు వెడలిన మహావాతము ఆకాశమును క్షోభిల్లజేసెను. ఆ వాయువు వృక్షములను పడగొట్టుచు సైనికులను సంహరించుచుండెను.

రాజా! అప్పుడు ద్రోణాచార్యుడు దారుణమైన ఆ వాయవ్యాస్త్రమునుచూచి శైలాస్త్రము ప్రయోగించెను. దానిచేత వాయువు శాంతించి దశదిక్కులు ప్రసన్నములయ్యెను.

రాజా! తరువాత అర్జునుడు అనేక బాణములు గురిసి, త్రిగర్తుల రథసైన్యమును నిరుత్సాహపరచి తిరుగగొట్టెను.

రాజా! తరువాత దుర్యోధన-కృపాశ్వత్థామ-శల్య-సుదక్షిణ (కాంబోజరాజు)-విందానువింద-బాహ్లీకాదులు మహారథ సైన్యముతోవచ్చి అర్జునుని నలువైపుల చుట్టుముట్టిరి. అట్లే భగదత్త-శ్రుతాయువులు గజసేనలతోవచ్చి భీమసేనునిపై దాడి చేసిరి. భూరిశ్రవస్-శల-శకునులు, నకుల సహదేవులను ఎదిరించిరి. భీష్ముడు ధార్తరాష్ట్రులతోను వారి సేనలతోను యుధిష్ఠిరుని పొదివెను.

## భీమసేనుడు గజసేనను సంహరించుట:

రాజా! అట్లు తనపై బడుచున్న గజసైన్యమును భీమసేనుడుచూచి క్రోధముతో ఓష్ఠమూలములను నాకుచు గదాపాణియై యెగిరి రథమునుండి దుమికి అడవిలో విచ్చలవిడిగా సంచరించు సింహమువలె తిరుగుచు మీ సైన్యమునకు భయము గొలిపెను.

రాజా! అట్లు గదాహస్తుడైన భీమసేనుని గజసైన్యములు చుట్టుముట్టెను. అప్పుడు భీముడు గజసేనలోదూరి మేఘమధ్యములో సూర్యునివలె ప్రకాశించుచు గదతో గజములను మేఘసమూహములను మహావాతమువలె అణగగొట్టెను.

రాజా! భీమసేనునిచేత చంపబడుచున్న గజములు ఆర్తనాదము చేసెను. అవి మేఘగర్జనములవలె నుండెను. గజదంతముల పోటుపులచేత అనేక విధముల గాయపడిన భీముడు పుష్పించిన అశోక వృక్షమువలె రణరంగమున శోభిల్లెను

రాజా! అప్పుడు భీముడు గజదంతమును ఊడబెరకి గజమును దంతరహితముగజేసి, ఆ దంతముచేతనే దాని కుంభస్థలమునందు కొట్టి దండధరుడైన యమునివలె గజమునుచంపి పడగొట్టెను. అప్పుడు భీమసేనుడు నెత్తుటదోగిన గదనుధరించి మేదస్సు (మెదడు) మజ్జ (ఎముకలనడుమ జిడ్డుద్రవము)ల కాంతితో శోభిల్లుచురక్తాభ్యంజనము చేసికొనిన రుద్రునివలె కనబడెను.

రాజా! యీ విధముగా చంపబడుచు హతశేషములైన గజములు తమ సేనలనే త్రొక్కుచు దిక్కులబట్టి పారిపోయెను అంతటిలో దుర్యోధనుని సైన్యమంతయు తిరోగమనముచేసి పారిపోయెను.

జనమేజయా! యిట్లు సంజయుడు ధృతరాష్ట్రునకుచెప్పి తరువాత యుద్ధ వృత్తాంతమిట్లు చెప్పదొడగెను:-

### నూటమూడవ అధ్యాయము

## ఉభయసేనల సంకుల సమరము:-

రాజా! ఆనాటి మధ్యాహ్నమునందు సంగ్రామము భీష్మునకు సోమకులతో మహాఘోరముగా జరిగెను. భీష్ముడు వేలకొలది సైనికులను బాణములచేత

కొట్టెను. కశ్యములతో గోవులు ధాన్యమునువలె సైన్యమును భీష్ముడు మర్దించెను. అప్పుడు ధృష్టద్యుమ్న, శిఖండి, విరాట, ద్రుపదులు భీష్ముని ముట్టడించి శరములతో కొట్టిరి. భీష్ముడు ధృష్టద్యుమ్న విరాటులను మూడు మూడు బాణములతో ద్రుపదునిపై ఒక బాణము ప్రయోగించెను.

రాజా! అట్లు కొట్టబడిన ఆ ముగ్గురు తోకత్రొక్కిన పాములవలె మిక్కిలి క్రుద్ధులైరి. అప్పుడు శిఖండి భీష్ముని కొట్టెను. శిఖండి పూర్వస్త్రీరూపమునుదలచి భీష్ముడు అతనిపై బాణప్రయోగముచేయలేదు. ధృష్టద్యుమ్నుడు క్రోధముతో అగ్నివలె జ్వలించుచు భీష్ముని బాహువులందు, ఎదపైన మూడు బాణములతో కొట్టెను. ద్రుపదుడు ఇరువదియైదు, విరాటుడు పది, శిఖండి ఇరువదియైదు బాణములతో భీష్ముని కొట్టిరి.

రాజా! అప్పుడు భీష్ముడు నెత్తుటదోగుచు వసంతఋతువునందు నిండుగా పూచిన రక్తాశోకమువలె ప్రకాశించెను. అప్పుడతడు ఆ ముగ్గురిపై మూడు మూడు బాణములు వేసి భల్లముచేత ద్రుపదుని ధనుస్సు చేదించెను. ద్రుపదుడు మరియొక ధనుస్సు తీసికొని ఐదుబాణములతో భీష్ముని, మూడు బాణములతో అతని సారథిని కొట్టెను.

రాజా! తరువాత భీముడు, ద్రౌపదీపుత్రులైదుగురు, కేకయ సోదరులైదుగురును యుధిష్ఠిరుని ముందిడుకొని ద్రుపదరక్షణార్థమై ధృష్టద్యుమ్నునితోపాటు భీష్మునిపై దాడిచేసిరి. అట్లే మీవారందరును భీష్మరక్షణార్థము ఉద్యుక్తులై సైన్యములతో పాండవసేనను ఎదిరించిరి.

రాజా! అప్పుడు మీవారికి, పాండవులకు జరిగిన గొప్ప చతురంగ సైన్యముల యుద్ధము యమరాష్ట్రవివర్ధనముగా నుండెను. వారు పరస్పరము కొట్టుకొని చచ్చుచు రథికులులేని రథములదిక్కుకు పారిపోవుచు, ఇతర హయములను త్రొక్కుచు త్వరగా వీచు వాయువులవలె కనబడెను. రథహీనులై రథికులు కవచములతో, తలపాగలతో, కుండలాంగద విభూషణములతో ఇంద్రసమాన శౌర్యముగలిగి ఇంద్రపుత్రులవలె ఐశ్వర్యములో కుబేరునివలె, నీతిలో బృహస్పతివలె, నున్న శూరులు సామాన్య ప్రాకృతజనులవలె అంతటను పరుగెత్తుచుండిరి.

రాజా! మావటివారులేని గజములు బిగ్గరగా ఘీంకరించుచు తమ సైన

ములనే త్రొక్కుచు, డాలులు-ధ్వజములు-చామరములు, హేమదండములుగల శ్వేతచ్ఛత్రములు ఛేదింపబడగా దశదిశలు పరుగెత్తుచు నూతన మేఘములవలె గర్జిల్లుచు కనబడెను.

రాజా! అట్లే గజరహితులైన మావటివారు గూడ మీవైపు, వారివైపు సందడిగా పరుగెత్తుచుండిరి. నానాదేశజాతములైన హేమభూషణములుగల అనేక సహస్రాశ్వములు వాయువేగముతో పరుగెత్తుచు కనబడెను. అశ్వికులుగూడ తరుమబడుచు ఖడ్గహస్తులై పరుగెత్తుచుండిరి. గజము గజమునెదుర్కొని త్రొక్కుచు పదాతిదళములను త్రొక్కుచు అశ్వములను మర్దించుచు రథములను త్రొక్కి నలుపుచుండెను. రథములు అశ్వములను, అశ్వములు నరులను త్రొక్కుచుండెను.

## రక్తనదీ వర్ణనము:-

రాజా! యిట్లు ఆ సైన్యములు ఒండొంటిని త్రొక్కుకొనుచున్న ఆ మహా భయంకర యుద్ధ మిట్లు సాగుచుండగా ఘోరమైన రక్తనది ప్రవహించెను. ఆ నదిలో ప్రేగులు-అస్థులు రక్తముతోకలిసి ప్రవహించుచుండెను. దానిలో కేశములనెడు నాచుతీగెలు, రథములనెడు మడుగులు, శరములనెడు సుళ్ళు, అశ్వములనెడు మత్స్యములు, శిరస్సులనెడు శిలలు, గజములనెడు మొసళ్ళు, కవచోష్ణీషములనెడు నురుగులు, ధనుస్సులు ఖడ్గములనెడు తాబేళ్ళు, పతాకలు ధ్వజములనెడు వృక్షములుగలిగి మర్త్యులనెడు తీరములను కోయుచు రాక్షసులనెడు హంసలచేత వ్యాప్తమై ఆ రక్తనది యమరాష్ట్రవివర్ధనముగా నుండెను.

రాజా! శూరులైన క్షత్రియులు ఆ నదిని రథగజాశ్వప్లవము (పడవ)లతో నిర్భయముగా దాటిరి. ఆ యుద్ధమునందు భయశీలురు, కశ్మలము చెందినవారు. ప్రేతములు, వైతరణీనదిలోవలె దూరముగా విసిరివేయబడిరి.

రాజా! ఆ ఘోరసైనిక సంహారముచూచి క్షత్రియవీరు లిట్లు చింతించిరి:-

"దుర్యోధనుని యపరాధముచేత క్షత్రియులు నశించుచున్నారు. పాపాత్ముడు-లోభమోహితుడునైన ధృతరాష్ట్రుడు గుణవంతులైన పాండవులయెడల ఎట్లు ద్వేషము గల వాడయ్యెను?"

రాజా! యిట్లు పాండవులను స్తుతించుచున్న క్షత్రియుల మాటలువిని

సర్వదా అపరాధములనే చేయుచుండు దుర్యోధనుడు భీష్మ-ద్రోణ-కృప-శల్యులతో-

"మహావీరులారా! జాగుచేయక అహంకారము లేక పోరాటము సాగింపుడు" అని యనెను.

"రాజా! తరువాత కౌరవులకు పాండవులతో యుద్ధము జరుగజొచ్చెను. రాజా! నీవు పూర్వము జూదమునకు అంగీకరించిన పాపమిప్పుడు అనుభవించుచున్నావు. ఎందరు మహాత్ములు నిన్ను వారించినను ఆ పాపకృత్యము నీ పుత్రుని చేత మాన్పించకపోయితివి. ఈ భయంకరయుద్ధములో పాండవ కౌరవ వీరులైన మీవారందరున్ను దైవికముగాగాని, నీ కారణముచేత నశించెదరు."

జనమేజయా! యిట్లు సంజయుడు ధృతరాష్ట్రునకు చెప్పి తరువాతి యుద్ధ వృత్తాంతమిట్లు అతనికి చెప్పదొడగెను:-

నూటనాల్గవ అధ్యాయము

## అర్జునుని చేత త్రిగర్తుల పరాజయము:-

రాజా! తరువాత అర్జునుడు సుశర్మయొక్క అనుచరులనందరను సంహరించెను. అప్పుడు సుశర్మ అర్జునుని బాణములతోకొట్టెను. శ్రీకృష్ణునిపై డెబ్బది, అర్జునునిపై తొమ్మిది బాణములను ప్రయోగించెను. అర్జునుడా బాణములను వారించి సుశర్మ సహాయకులైన యోధులను కొట్టెను. అట్లు కొట్టబడిన యోధులు కొందరు గుఱ్ఱములను, కొందరు రథములను, కొందరు గజములను విడిచి దశదిశలకు పారిపోయిరి. మరికొందరు తమ వాహనములతోనే పారిపోయిరి. పదాతిదళములుగూడ శస్త్రపాణులై, సుశర్మ వారించుచున్నను పారిపోయిరి. తదితరులు గూడ యుద్ధరంగమునందు నిలువజాలకపోయిరి.

రాజా! అట్లు పారిపోవుచున్న సైనికులనుచూచి దుర్యోధనుడు భీష్ముని ముందిడుకొని సైన్యసమేతుడై అర్జునునెదుర్కొనెను. సుశర్మ జీవితరక్షణార్థమై అతని సామర్థ్యము నెరిగినవారైనను, హాహాకారముచేయుచు భీష్మునిపై దాడి చేసిరి. తరువాత భీష్ముడు పాండవసేనను బాణములతో నాచ్ఛాదించెను.

రాజా! అప్పుడు కురుపాండవ సైనికులు ఏకమై ఆ మధ్యాహ్నమునందు సంకుల సమరమును ఆరంభించిరి. సాత్యకి కృతవర్మ నైదు బాణములతో కొట్టి వేలకొలది బాణములను ప్రయోగించుచు స్థిరముగానిలిచెను. ద్రుపదుడు ద్రోణాచార్యుని డెబ్బది బాణములతో, అతని సారథి నైదుబాణములతోను కొట్టెను. భీమసేనుడు తన ముత్తాతయైన బాహ్లికునికొట్టి అడవిలో శార్దూలమువలె సింహనాదము చేసెను.

రాజా! చిత్రసేనునిచేత కొట్టబడిన అభిమన్యుడు వేలకొలది బాణములను చిత్రసేనునిపై ప్రయోగించుచు స్థిరముగా నిలిచెను. ఆ యిరువురు తలపడి ఆకాశమునందు బుధ-శని గ్రహములవలె పోరాడిరి. అభిమన్యుడు చిత్రసేనుని రథాశ్వములను సారథినిచంపి సింహనాదముచేసెను. అప్పుడు చిత్రసేనుడు హతాశ్వమైన తన రథమునుండి దుర్ముఖుని రథముపైకి పోయెను.

రాజా! ద్రోణాచార్యుడు ద్రుపదుని, అతని సారథినిగొట్టగా, ద్రుపదుడు యుద్ధమువీడి పూర్వవైరము స్మరించుచు తొలగిపోయెను. భీమసేనుడు బాహ్లికరాజు యొక్క రథాశ్వసారథులనుచంపి యతనిని విగతరథునిచేసెను. అప్పుడు బాహ్లికుడు త్వరగా లక్ష్మణుని రథముపైకి పోయెను.

## సాత్యకి-భీష్ముల యుద్ధము:-

రాజా! సాత్యకి కృతవర్మను అడ్డగించి, బాణములతోకొట్టి భీష్మునిపై దాడిచేసి, అతనిపై అరువది బాణములు ప్రయోగించి, తన రథమునందే నృత్యము చేయుచు నిలిచెను. అప్పుడు భీష్ముడు సాత్యకిపై ఉక్కుశక్తిని విసిరెను. నాగకన్యకవంటి ఆశక్తి వేగముగా సాత్యకిపై బడుచుండగా నతడు మృత్యువువంటి ఆశక్తిని నడుమనే విరుచుటచేత అది నేలపైమండుచున్న పెద్దకొరివివలెపడెను.

తరువాత సాత్యకి భీష్మునిపై శక్తిని విసిరెను. ఆ శక్తి కాళరాత్రి వలె భీష్మునిపైకి వచ్చుచుండగా భీష్ముడు రెండు బాణములచేత దానిని రెండుగా ఛేదించగా అది నేలపై బడెను. తరువాత భీష్ముడు సాత్యకిపై తొమ్మిది బాణములను ప్రయోగించి యతని మెడపై కొట్టెను.

రాజా! తరువాత పాండవులు చతురంగబలముతో, సాత్యకి రక్షణార్థమై

భీష్ముని చుట్టుముట్టిరి. పాండవకౌరవులు పరస్పర విజయేచ్ఛతో నప్పుడు తుముల యుద్ధము రోమాంచకరముగా చేసిరి.

జనమేజయా! ఇట్లు సంజయుడు ధృతరాష్ట్రునకు చెప్పి తరువాత యుద్ధ వృత్తాంత మిట్లు చెప్పదొడగెను.

(నూటయైదవ అధ్యాయము)

## దుశ్శాసనునకు దుర్యోధనుని యాదేశము

రాజా! గ్రీష్మాంతము నందు మేఘములచేత చుట్టబడినట్లు పాండవులచేత చుట్టబడిన భీష్ముని చూచి దుర్యోధనుడు దుశ్శాసనునితో నిట్లనెను.

తమ్ముడా! పాండవులు ముట్టడించిన భీష్ముని నీవు రక్షింపవలెను. అప్పుడు పితామహుడు పాండవులను పాంచాలురను సంహరింపగలడు. కనుక నిప్పుడు భీష్మరక్షణమే ముఖ్య కర్తవ్యము. మనకందరకు రక్షకుడాయనయే కదా! కనుక నీవు సర్వసైన్యములను కూడకట్టుకొని పోయి యతనిని రక్షింపుము.

ధృతరాష్ట్ర మహారాజా! దుర్యోధనుడిట్లు చెప్పగనే దుశ్శాసనుడు సమస్త సేనలతో భీష్ముని చుట్టుచేరి మహాప్రయత్నముతో భీష్మరక్షణము చేయుచుండెను.

## నకుల సహదేవులు శకుని అశ్వసైన్యమును ఓడించుట

రాజా! తరువాత ప్రాసతోమరాద్యనేకాయుధములను ధరించి సుశిక్షితులు యుద్ధకుశలురైన రాజవీరులతో అనేక సహస్ర హయసైన్యములతోను యుద్ధసన్నద్ధుడై వచ్చి యుధిష్ఠిరనకుల సహదేవులను అడ్డగించెను.

రాజా! తరువాత దుర్యోధనుడు గూడ అనేక సహస్ర హయసైన్యములను పాండవులను వారించుటకు పంపెను. అవి గరుత్మంతుని వలె అతివేగవంతములై సాగి వచ్చెను. వానితో శకుని దేవతలతో నింద్రునివలె శోభిల్లెను. వాని గిట్టల చేత త్రొక్కబడిన భూమి కంపించి దద్దరిల్లెను. అశ్వముల ఖుర శబ్దము పర్వతమునందు దహింపబడుచున్న వెదుళ్ళ పటపటా శబ్దము వలె వినబడెను.

అశ్వముల త్రొక్కుడిచేత రేగిన ధూరజస్సు సూర్యరథమును గప్పి సూర్యుని కనబడకుండ జేసెను. వేగవంతములైన ఆ యశ్వసేనలచేత పాండవసేనలు వ్యాకులము చెందెను. వాని హేషా (సకలింపు) శబ్దములచేత ఏమియు తెలియకుండెను.

రాజా! అప్పుడు యుధిష్ఠిర నకుల సహదేవుల తురగసేనలు వర్షాకాల పూర్ణిమనాడు పూర్తిగా నిండి ఉప్పొంగిన సముద్రమును తీరమువలె ఎదుర్కొని నిలువరించి అశ్వికుల శిరస్సులను బాణములచేత ఖండించిరి. అంత నా యాశ్వికులు పర్వతగుహయందు గజములచేత చంపబడిన సర్పములవలె క్రిందపడిరి. తరువాత పాండవులు ప్రాసాది నిశితశస్త్రములచేత చంపిన అశ్వసైనికుల తలలు చెట్లనుండి రాలిపడిన పండ్లవలె నేల వ్రాలెను. అచ్చటచ్చట అశ్వికులతోగూడిన హయములు కూలిపడెను. అట్లు చంపబడుచున్న హయములు, సింహమును చూచిన మృగములు వలె భయముతో దిక్కులకు పారిపోయెను.

రాజా! ఈ విధముగా పాండవులు శత్రువులను జయించి శంఖ భేరీ నాదములు చేసిరి.

## యుధిష్ఠిర నకులసహదేవులతో శల్యుని యుద్ధము

రాజా! దుర్యోధనుడు తన సైన్యమోడిపోవుట చూచి దీనుడై శల్యునితో నిట్లనెను.

మద్రరాజా! యుధిష్ఠిరుడు నకులసహదేవులతో గూడి మనము చూచుచుండగనే సైన్యమును పారద్రోలెను. సముద్రమును తీరమువలె అతనిని వారింపుము. నీవు మహాబలపరాక్రమశాలివి కదా!

ధృతరాష్ట్ర మహారాజా! దుర్యోధనుని మాటలు విని శల్యుడు రథసైన్యముతో యుధిష్ఠిరునిపై దాడిచేసెను. అతని వెంటనే శల్యుని సైన్యముగూడ అనుసరించిపోయెను.

రాజా! అట్లు తనపై బడుచున్న శల్యసైన్యమును యుధిష్ఠిరుడు అడ్డగించి శల్యుని మెడపై పదిబాణములతో గొట్టెను. నకులసహదేవులేడు బాణములతో గొట్టిరి.

రాజా! మద్రరాజు గూడ వారినందరను మూడు మూడు బాణములచేత గొట్టెను. మరల యుధిష్ఠిరుని అరువది శరములచేత గొట్టెను. నకులసహదేవులను గూడ మరల రెండు బాణములతో గొట్టి యుధిష్ఠిరునిపై అనేక నిశితశరములను ప్రయోగించెను.

రాజా! శల్యుని వశములో చిక్కుకొని బాధపడుచున్న యుధిష్ఠిరునకు సహాయకుడుగా భీమసేనుడువచ్చి బాణములతో మద్రరాజును గొట్టి బాధించెను.

రాజా! తరువాత భీష్మ ద్రోణులు సైన్యములతో శరవర్షములు గురియుచు శల్యునకు బాసటగా వచ్చిరి. తరువాత సూర్యుడు పశ్చిమ దిక్కునకు వ్రాలు చుండగా మహాఘోర యుద్ధమా యుభయసైనికులకు జరిగెను.

జనమేజయా! యిట్లు సంజయుడు ధృతరాష్ట్రునకు చెప్పి తరువాత యుద్ధ వృత్తాంతమిట్లు చెప్పదొడగెను.

(నూటయారవ అధ్యాయము)

## భీష్మునకు ఓడిన పాండవసేన పలాయనము

రాజా! తరువాత భీష్ముడు క్రుద్ధుడై నిశితసాయకములచేత ధర్మజ నకుల సహదేవాది పాండవవీరులను వారి సైన్యములను కొట్టెను. భీమునిపై పన్నెండు సాత్యకిపై తొమ్మిది, నకులునిపై మూడు, సహదేవునిపై మూడు, యుధిష్ఠిరునిపై పన్నెండు బాణములను ప్రయోగించి వారి బాహువులను, ఎదలను కొట్టెను. తరువాత భీష్ముడు సేనాపతియైన ధృష్టద్యుమ్నునిపై అనేక బాణములను ప్రయోగించి సింహనాదము చేసెను.

రాజా! తరువాత భీష్మునిపై నకులుడు పన్నెండు, సాత్యకి మూడు, ధృష్టద్యుమ్నుడు డెబ్బది, భీముడు ఏడు, యుధిష్ఠిరుడు పన్నెండున్ను శరములు ప్రయోగించి కొట్టిరి.

రాజా! ద్రోణాచార్యుడు యమదండము వంటి ఐదైదు బాణములచేత సాత్యకిని, భీమసేనుని కొట్టెను. వారు గూడ ద్రోణునిపై చెరి మూడు బాణము

లను ప్రయోగించిరి. అవి అంకుశములు ఏనుగును వలె ద్రోణుని గ్రుచ్చుకొని బాధించెను.

రాజా! సౌవీర, కితవ, ప్రాచ్య, ప్రతీచ్య, ఉదీచ్య, మాళవ, అభీషహ, శూరసేన, శిబి, వసాతి సైనికవీరులు భీష్మునిచేత దెబ్బలుతిని. అతనిని కొట్ట లేకుండిరి. అట్లే ఇతర నానాదేశవీరులు వివిధాయుధధారులై పాండవులపై దాడి చేసిరి. పాండవులు గూడ భీష్ముని చుట్టుముట్టిరి.

రాజా! అప్పుడు భీష్ముడు శత్రు రథ సైన్యములచేత చుట్టబడి అడవిలో రగులుకొనిన కార్చిచ్చువలె శత్రువులను దహించుచు, రథమనెడు హోమ గృహములో ధనుస్సు అనెడు జ్వాలలు రగులగా ఖడ్గశక్తి, గదలనెడు ఇంధన ముల నుండి బాణములనెడు మిణుగురులు గల భీష్మాగ్ని క్షత్రియులను దహించు చుండెను.

రాజా! భీష్ముడు నిశితములైన కర్ణి, నాళీకాది బాణములచేత శత్రుసైన్యము లను పతాకధ్వజములను, రథికులనున్ను ముందతాళ (కొమ్మలు పండ్లు విరి గిన తాటిచెట్టు) వనములను వలె చేదించెను. రథ గజాశ్వములను మనుష్యరహి తములుగ చేసెను. పిడుగుచప్పుడువంటి భీష్ముని ధనుష్టంకారమును విని సమస్త భూతములు కంపించెను.

రాజా! భీష్మ ప్రయుక్త బాణములు అమోఘములై శత్రువీరుల కవచము లను గ్రుచ్చుకొనెను. విరిగి పడియున్న రథములను అశ్వములు నలువైపుల ఈడ్చుకొని పోవుచుండెను.

రాజా! పదునాలుగువేల చేది, కాశి, కరూష సైన్యములు మహారథికులని ప్రఖ్యాతి చెందినవారు సత్కులీనులైన ఆ వీరులు శరీరములు విడుచుచు, భీష్ముని వైపు తిరిగి చూడజాలక నోరు తెరచుకొనిన యమునివలెనున్న భీష్మునిచేత చంపబడి పరలోకమునకు పోయిరి. భీష్మునిచేత వేలకొలది రథములు, నొగలు కాడిమ్రాకులు విరుపబడి నేలపై కనపడెను.

రాజా! అప్పుడు రథములు చచ్చిపడిన రథికులు ఆయుధచ్ఛిన్నములైన కవచములు గదాభిందివాల బాణాద్యాయుధములు, రథగమనమును అడ్డగించు టకు పాతబడిన గూటములు, అంబులపొదులు, ధనుస్సులను, ఖడ్గములను

ధరించిన బాహువులు, కుండలాలంకృతములైన శిరస్సులు, కత్తియొరలు, చేతి తొడుగులు, (అంగుళి త్రాణములు) ధ్వజములు, ధనుస్సులు-ఇవి యన్ని భగ్నములై యుద్ధభూమియందంతటను వ్యాపించియుండెను.

రాజా! గజారూఢులు అశ్వికులు, గజాశ్వములు గూడ వేలకొలదిగ చచ్చి నేలకూలియుండెను. క్రిందపడిపోయిన వీరులు భీష్మబాణపహతములై పరుగెత్తి పోవుచున్న రథములను ఎంతగా ప్రయత్నించినను వారింపజాలకుండిరి ఇంద్ర సమాన పరాక్రమశాలియైన భీష్ముని చేత భంజింపబడిన ఆ మహాసైన్యములో ప్రతివారు విడి విడిగానే పారిపోవుచుండిరి గాని, ఇద్దరొక్కటిగా చేరిపోవజాల జాలకుండిరి.

రాజా! చంపబడిన రథ గజాశ్వములచేత పడగొట్టబడిన ధ్వజములచేతను సంకులమైయున్న పాండవసైన్యము చైతన్యరహితమై హాహాకారము చేయు చుండెను. ఆ యుద్ధములో తండ్రికొడుకును, కొడుకు తండ్రిని, మిత్రులు పరస్పరము చంపుకొనుచుడిరి. పాండవసైనికులు కొందరు కవచములు వీడి జుట్టు విరియబోసికొని అంతట పరుగెత్తుచు కనపడిరి.

రాజా! అప్పుడు పాండవ సైన్యము భ్రాంతిలో నిటునటు ఉరుకుచున్న గోవులమందలవలె ఆర్తస్వరము చేయుచు కనపడెను.

(నూటయేడవ అధ్యాయము)

## భీష్మవధకొరకు ఉద్యుక్తుడైన శ్రీకృష్ణుని అర్జునుడు వారించుట

రాజా! అప్పుడు భీష్మునిచేత భంజింపబడుచున్న సైన్యమును చూచి శ్రీకృష్ణుడు రథము నిలిపి అర్జునునితో నిట్లనెను.

పార్థా! నీవు ఎన్నినాళ్ళుగానో కాంక్షించుచున్న సమయమిప్పుడు ఆసన్నమైనది. ఇప్పుడు నీవు భీష్ముని వధించనియెడల తరువాత మోహము చెందెదవు సుమా! పూర్వము నీవు విరాటనగరములో రాజులమధ్యమునందు సంజయుని సమక్షమున నీతో పోరాడు భీష్మ ధార్త రాష్ట్ర సైనికులనందరను సబాంధవముగా చంపెదను అని ప్రతిజ్ఞచేసియుంటివి. క్షత్రియధర్మమును స్మరించి ఏమాత్రము

సంతాపము చెందక ఇప్పుడు యుద్ధము చేసి ఆ ప్రతిజ్ఞ సత్యము చేయుటకిది సరియైన కాలము.

రాజా! ఇట్లు శ్రీకృష్ణుడు చెప్పిన మాటలు విని అర్జునుడు అధోముఖుడై, ఏ కోరికలు లేనివానివలె శ్రీకృష్ణునితో నిట్లనెను.

కృష్ణా! అవధ్యులను వధించుటవలన గాని, నరకముకంటె మించిన రాజ్యమును పొందుటవలనగాని, వనవాసదుఃఖములనుభవించుట వలనగాని, నాసుకృతమేమున్నది? భీష్మునివైపే రథము తోలుము. నీ మాట ప్రకారము చేసెదను. కురుపితామహుడైన భీష్ముని పడగొట్టెదను.

ధృతరాష్ట్ర మహారాజా! అర్జునుని మాట విని సూర్యునివలె చూచుటకు అశక్యుడుగా నున్న శ్రీకృష్ణుడు శ్వేతాశ్వములను భీష్మునివైపునకు తోలగా అతనిపై దాడిచేయుచున్న యర్జునుని పాండవసైన్యము మరల చేరెను.

రాజా! అప్పుడు భీష్ముడు సింహనాదము పలుసార్లుచేసి అర్జునునిరథముపై బాణవర్షము గురిసెను. ఒక్కక్షణములో అర్జున రథమును సారథిని, అశ్వములను కప్పగా నవి కనపడకుండెను.

రాజా! అప్పుడు వాసుదేవుడు ఏ మాత్రము భ్రాంతి చెందక ధైర్యముతో భీష్మబాణ తాడితాశ్వములను భీష్మునిపైకి తోలెను. అప్పుడు అర్జునుడు మేఘగర్జనము వంటి ధ్వనిగల గాండీవమునుండి విముక్తములైన బాణములచేత భీష్ముని ధనుస్సు ఛేదించి పడగొట్టెను. వెంటనే భీష్ముడు మరియొక ధనుస్సు ఎక్కుపెట్టగా అర్జునుడు దానినిగూడ ఖండించెను. అప్పుడు భీష్ముడు అర్జునుని హస్త లాఘవమును చూచి "మహాబాహు బలశాలీ! కుంతీపుత్రా! బాగుబాగు" అని ప్రశంసించి మరియొక ధనుస్సు తీసికొని యర్జునునిపై బాణవర్షము గురిసెను.

రాజా! అప్పుడు శ్రీకృష్ణుడు అశ్వచాలన లాఘవమును ప్రదర్శించుచు, భీష్ముని బాణములను వ్యర్థము చేయుచూ తన సారథ్య నైపుణ్యము చూపుచు కనపడెను.

రాజా! అప్పుడు భీష్ముడు అతిక్రుద్ధుడై అర్జునునిపై మరల బాణములను అద్భుతముగా ప్రయోగించెను.

రాజా! అర్జునుడుగూడ క్రోధముతో తన కభిముఖముగా నున్న భీష్మునిపై బాణ ప్రయోగము చేసెను. దుర్ధర్షులైన ఆ యిరువురు పరస్పరము పోరాడుచు భయంకర బాణములచేత గాయపడిన కొమ్ములచే పరస్పరము కొట్టుకొని గాయ పడిన ఆబోతులవలె శోభిల్లిరి. భీష్ముడు బాణములతో అర్జునుని శిరస్సుపైకొట్టి సింహనాదము చేసెను.

రాజా! అప్పుడు శ్రీకృష్ణుడు అర్జునుడు యుద్ధము చేయుచుండుటను, యుద్ధమునందు నిరంతరము శరవర్షము లు గురియుచు సూర్యునివలె తపించుచు రెండు సేనలమధ్య నిలిచి శ్రేష్ఠులైన పాండవసైనికవీరులను వధించుచు యుధిష్ఠి రుని సేనలో మహాప్రళయము సృష్టించుచున్న భీష్ముని చూచి సహించజాలక అర్జున రథాశ్వములను విడిచి వాసుదేవుడు రథమునుండి యెగిరి క్రిందకుదుమికి తన భుజములందు ఆయుధములు మెరయుచుండగా, చేతిలో అశ్వములను తోలు చబుకు ధరించి సింహనాదము చేయుచు యోగీశ్వరుడైన ఆ జగదీశ్వరుడు పాద ఘాతములచేత భూమిని చీల్చుచున్నాడా యనునట్లు క్రోధముచేత ఎఱ్ఱబడిన కన్నులతో ఆ మహాయుద్ధమునందు మీవారి మనస్సులను మింగుచున్నాడా యనునట్లు అమితద్యుతితో భీష్ముని వధించుట కతనిపైకి ఉరికెను.

రాజా! ఆ విధముగా భీష్మవధ ప్రయత్నముతో వచ్చుచున్న శ్రీకృష్ణుని చూచి మీవారు మిక్కిలి భయపడి భీష్ముడు చచ్చె చచ్చెనని బిగ్గరగా ఆక్రంద నము చేసిరి.

రాజా! అప్పుడు ఇంద్రనీలమణిశ్యాముడు పీతాంబరధారియునై భీష్ముని పైకి ఉరుకుచున్న శ్రీకృష్ణభగవానుడు విద్యున్మాలతో మెరయు నీలాంబుదము వలె శోభిల్లుచుండెను. అప్పుడు శ్రీకృష్ణుడు సింహము ఏనుగుపైకి ఆబోతులమేటి ఆబోతుపైకి ఉరుకునట్లు నదించుచు వేగముగా భీష్మునిపైకి పరుగెత్తిపోయెను.

రాజా! అట్లు కృష్ణుడు తనపైకి వచ్చుటచూచి భీష్ముడు తన ధనుస్సును ఉపసంహరించుకొని ఏ మాత్రము తొందరపాటు లేక శాంతముగా శ్రీకృష్ణునితో నిట్లనెను.

పుండరీకాక్షా! వాసుదేవా! నీకు నమస్కారము చేయుచున్నాను. రమ్ము రమ్ము. మహాయుద్ధమునందు నేడు శ్రీకృష్ణా నన్ను పడగొట్టుము. దేవదేవా!

గ్రహమున్న యెడల నా స్వధర్మమునకు విరోధము గాకుండ నా హితమేదియో చెప్పుము.

ధృతరాష్ట్ర మహారాజా! యుధిష్ఠిరుడిట్లు బహువిస్తారముగా చెప్పిన మాటలను దయతో విని శ్రీకృష్ణు డతనిని ఊరడించుచు నిట్లనెను.

ధర్మపుత్రా! నీవు విషాదము చెందకుము. నీ సోదరులు శూరులు దుర్జయులు భీమార్జునులు వాయు అగ్ని సమాన తేజస్సుగలవారు, నకుల సహదేవ లింద్ర సమానులు. వారు తప్పక జయము సాధించెదరు. లేదా నన్ను ఆజ్ఞాపింపుము. భీష్మునితో యుద్ధము చేసెదను. మహారాజా! నీ యాజ్ఞయైనచో ఈ మహాయుద్ధమునందు ఏ కార్యమైనను చేసెదను.

ఒకవేళ అర్జునుడు భీష్మునితో పోరాడగోరని యెడల నేనే భీష్ముని యుద్ధమునకుఆహ్వానించి ధార్తరాష్ట్రులందరు చూచుచుండగా నతనిని సంహరించెదను. భీష్ముడు చచ్చినచో నీకు జయము తథ్యము. నేను ఒక్క రథసహాయముతోనే ఆ కురు పితామహుని సంహరించెదను. దేవేంద్రునివంటి నా పరాక్రమము చూడుము.

యుధిష్ఠిరా! భీష్ముడు బాణప్రయోగము చేయుచుండగనే యతనిని రథము నుండి పడగొట్టెదను. పాండుపుత్రులకు శత్రువైనవాడు నాకుగూడ శత్రువేకదా! ఇందులో సందేహము లేదు. నీ వారందరు నావారే! నావారందరు గూడ నీవారే కదా!

రాజా! అర్జునుడు నాకు మిత్రుడు, బావమరిది, శిష్యుడు గూడ నగును. అతనికొరకు నా శరీరము నుండి మాంసమును ఛేదించియైన నిచ్చెదను. అర్జునుడుగూడ. నాకొరకు తన జీవితమునైనను త్యజించును. ఇదియే మేమిరువురము చేసికొనిన ప్రతిజ్ఞ ఒడంబడిక ఈ ప్రతిజ్ఞను మేమిరువురము తప్పక నెరవేర్చెదము.

యుధిష్ఠిరా! కనుక యుద్ధము చేయుటకు నాకు అనుజ్ఞయిమ్ము. పూర్వము ఉపప్లవ్య నగరమందు అర్జునుడు తాను భీష్ముని సంహరించెదనని అందరి సమక్షములో ప్రతిజ్ఞచేసి యుండెను. గదా! ఇప్పుడు పార్థునిమాట కాపాడవలెను. పార్థుని యనుజ్ఞచేత నేనే ఆ కార్యమును నిస్సంశయముగా నెరవేర్చెదను.

ధర్మరాజా! ఒక వేళ నేను భీష్ముని సంహరించుటచేత పార్థునికీర్తికి లోపము కలుగునని మీరు భావించినచో అర్జునుడే భీష్ముని యుద్ధమునందు వధించగలడు. పార్థుడు సామాన్యుడని తలచకుము. అతడు పూనుకొనినచో అశక్యకార్యముగూడ చేయగలడు. దైత్య, దానవ, దేవతలు కలిసి ఒకటిగా వచ్చినను అర్జునుడు యుద్ధములో వారినందరిని వధించగలడు. ఇట్లుండగా నతనికి భీష్ముని లెక్కయెంత? ఇప్పుడు భీష్ముని మహావీర్యము తగ్గి బలము ఉడిగి అల్పజీవనుడై యున్నాడు. అతడు కర్తవ్యము నెరుగడు. ఇది నిశ్చయము.

ధృతరాష్ట్ర మహారాజా! యిట్లు శ్రీకృష్ణుడు చెప్పిన మాటలువిని యుధిష్ఠిరుడతనితో నిట్లనెను.

మహాత్మా! నీవు చెప్పినదంతయు నిక్కమే. నీ వేగమునకు తట్టుకొనగలవారు ఎవరుగూడ లేరు. వీరందరు నీకు చాలరు. నా కోరికలన్నియు నీ యనుగ్రహముచేత తప్పక నెరవేరగలవు. నీ పక్షమునందున్న మాకు ఆపద లెక్కడివి? నీవు మా వైపుండినచో నింద్రాది దేవతలను గూడ జయింపగలము. నీ యండలోనున్న మాకు ఈ భీష్ముడెంత?

మహానుభావా! నీవు యుద్ధము చేయకుండ మాకు సాహాయ్యము చేసెదనని పూర్వము ప్రతిజ్ఞచేసి యుంటివిగదా! అట్టి నిన్ను నా ఆత్మగౌరవము కాపాడుకొనుటకై అసత్యవాదిని చేయగోరను.

కృష్ణా! భీష్ముడు నాతో "నీతో మంత్రాలోచన చేసెదను. కాని నీ వైపు నిలిచి యుద్ధము చేయను. దుర్యోధనుని కొరకు పోరాడెదను." అని ప్రతిజ్ఞచేసి యుండెను. కనుక కృష్ణా! భీష్ముడు నాతో తప్పక మంత్రాలోచన చేయగలడు అతడే నాకు రాజ్యమిప్పించగలడు. నాకు ఆయన మాటలందు పూర్తిగా విశ్వాసము గలదు.

శ్రీకృష్ణా! కాబట్టి నీవు మేము కలసి మరల భీష్మునికడకు పోవుదము. ఆయనను వధించుటకు ఉపాయము కోరుదము. ఆయన తప్పక మనకు హితము బోధించగలడు. ఆయన చెప్పినట్లే యుద్ధము చేసెదను. ఆయనయే మాకు సరియైన ఉపదేశము చేసి జయము కలిగించగలడు.

కృష్ణా! మేము పితృ విహీనులమై బాలకులముగా నున్నప్పుడు భీష్మపితా

మహాడే మమ్ము పోషించి పెంచి పెద్దజేసెను. అటువంటి మా పితామహుని నేను చంపగోరినయెడల ఛీ అది ఎంత నింద్యము. అట్లు నేను చేయను.

ధృతరాష్ట్ర మహారాజా! యుధిష్ఠిరుని మాటలు విని శ్రీకృష్ణుడు అతనితో నిట్లనెను.

ధర్మపుత్రా! నీ మాట నాకు నచ్చినది. సమర్థుడైన భీష్ముడు చూపుచేతనే శత్రువులను దహించగలడు. ఆయన వధోపాయమడుగుటకు ఆయన యొద్దకే పోవుదము గాక! నీవడిగినచో నతడు తప్పక సత్యము చెప్పగలడు. కనుక మన మతనికడకే పోయి ఆలోచన అడుగుదము. ఆయనయే మనకు శత్రువులతో యుద్ధము చేయుటకు ఉపాయము చెప్పగలడు.

ధృతరాష్ట్ర మహారాజా! ఈ విధముగా శ్రీకృష్ణునితో పాండవవీరులు ఆలోచించి శస్త్ర కవచములను విడిచి భీష్ముని శిబిరమునకు పోయి ఆయనకు ప్రణమిల్లి పూజించిరి. వారితో భీష్ము డిట్లనెను.

శ్రీకృష్ణా! అర్జునా! ధర్మపుత్రా! భీమసేనా! నకుల సహదేవులారా! మీ కెల్లరకు స్వాగతము. ఇప్పుడు మీకు ప్రీతి కలిగించు కార్యము ఏమి చేయుదునో చెప్పుడు. నాయనలారా! మీ వైపు యుద్ధము చేయుటదప్ప ఏదియైనను కోరుకొనుడు. సంశయింపకుడు. ఆ పనియెంత దుష్కరమైనను చేసెదను.

ధృతరాష్ట్ర మహారాజా! యీ విధముగా ప్రేమతో చెప్పుచున్న భీష్ముని మాటలు విని ప్రీతియుక్తుడై ధర్మరాజు దైన్యముతో నిట్లనెను.

పితామహా! నీవు సర్వజ్ఞుడవు, ప్రజలకు సంశయము రాని విధముగా చెప్పుము. ఎట్లు మేము జయము సాధించగలము? ఎట్లు మాకు రాజ్యము లభించును? నీ వధోపాయము చెప్పుము. యుద్ధములో నిన్ను మేమెట్లు సంహరింపగలము. నీలో సూక్ష్మమైన లోపము గూడ కనపడదు. ఎల్లప్పుడున్ను నీ ధనుస్సు మండలాకారముగానే యుండును. నీవు దానిని తీసుకొనుట ఎక్కుపెట్టుట, లాగుట యివి యేవియు తెలియవు. రథమునందు నీవు రెండవ సూర్యునివలె కనపడుచుందువు చతురంగ సైన్యములను చంపుచున్న నిన్ను జయించుటకు ఎవడు ఉత్సహించును? శరములను వర్షించుచు నీవు శత్రుసంహారముచేయుగా

యా మహాసేన నశించెను. మహాత్మా నిన్ను జయించు విధము మాకు రాజ్యము లభించు విధము, మా సేనకు క్షేమము కలుగు విధమున్ను మాకు తెలుపుము.

ధృతరాష్ట్ర మహారాజా! యుధిష్ఠిరుని ప్రార్థన విని భీష్ముడు పాండవులతో నిట్లనెను.

నాయనలారా! నేను జీవించియుండగా ఎంత ప్రయత్నించినను నన్ను యుద్ధములో జయించుట కల్ల. ఇది సత్యము. నేను జయింపబడిన తరువాత మీరు యుద్ధముచేసి శత్రుజయము సాధింపుడు. మీకు యుద్ధములో జయము సాధించు కోరిక యున్నచో నన్ను త్వరగా సంహరింపుడు. మీరు నన్ను అవలీలగా చంపుటకు అనుజ్ఞ యిచ్చుచున్నాను. మీరు ఇప్పటికయినను నా శక్తిని తెలిసికొన దలచుట మంచిదని తలచెదను. నేను మరణించిన యెడల అంతయు చచ్చినట్లు తెలిసికొనుడు. కనుక నేను చెప్పబోవునట్లు చేయుడు.

ఆ మాట విని యుధిష్ఠిరుడు భీష్మునితో నిట్లనెను.

పితామహా! మేము యుద్ధములో జయము సాధించు నుపాయము చెప్పుము. నీవు యుద్ధములో దండధరుడైన యమునివలె క్రుద్ధుడై పోరాడుచుండగా ఇంద్రాది దేవతలు దానవులు వరుణాదులు కూడా నిన్ను జయింపజాలరు గదా!

ఆ మాటలు విని భీష్ముడు యుధిష్ఠిరునితో నిట్లనెను.

యుధిష్ఠిరా! నీ మాట సత్యము. నేను శస్త్రము ధరించి యుద్ధములో పోరాడుచున్నప్పుడు లోకత్రయమునందెవరు గూడ నన్ను జయింపజాలరు. నేను శస్త్రము విడచి శస్త్రసన్యాసము చేసినప్పుడే ఈ మహారథికులందరు నన్ను సంహరింపగలరు.

ధర్మపుత్రా! శస్త్రములు క్రిందపడవేసినవాడు స్వయముగా క్రిందపడినవాడు కవచము, ధ్వజము తొలగినవాడు పారిపోవుచున్నవాడు, భయపడినవాడు నేను, నీ వాడను అని శరణువేడినవాడు స్త్రీ, స్త్రీగా పూర్వమున్నవాడు. స్త్రీనామధేయము గలవాడు, వికలాంగుడు, ఏకపుత్రకుడు, దుర్బలుడై అప్రశస్తుడైనవాడు (అప్రఖ్యాతుడు) ఈ మొదలైన వారితో యుద్ధము చేయుటకు నాకు ఇష్టములేదు. ఇంతయే కాక అమంగళ ధ్వజము గలవానితో గూడ నేను ఎప్పుడు గూడ యుద్ధము చేయను. కనుక మీకు ఉపాయము చెప్పెద వినుడు.

యుధిష్ఠిరా! మీ సైన్యములో ద్రుపద పుత్రుడు శిఖండియున్నాడు గదా! అతడు మహారథికుడు. యుద్ధశూరుడు. శత్రు విజయిగా నున్నాడు. అతడు పూర్వము స్త్రీగా జన్మించి తరువాత పురుషత్వము పొందినాడు. ఈ విషయ మంతయు మీరు గూడ నెరుగుదురు.

నాయనా! ఆ శిఖండిని అర్జునుడు ముందిడుకొని నాపైన పదునైన బాణము లను ప్రయోగించుచు నన్ను ఎదిరించుగాక! అమంగళ ధ్వజము కలిగి స్త్రీ పూర్వుడైన శిఖండి నామీద బాణప్రయోగము చేసినను ఆయుధధారినై కూడ అతనిని కొట్టుటకు ఇచ్ఛగింపను. ఆ యవకాశమును చూచి అర్జునుడు నన్ను త్వరగా శరములతో కొట్టవలెను.

యుధిష్ఠిరా! నేను యుద్ధసన్నద్ధుడనై యుండగా నన్ను చంపగలవాడు మూడు లోకములలో నెవడును గూడ లేడు. కృష్ణార్జును లిరువురు మాత్రమే నన్ను సంహరింపగలరు అదియు నేను శస్త్రసన్న్యాసము చేసినప్పుడే జరుగును. కనుక తొలుత శిఖండి నాపై బాణప్రయోగము నా కెదురుగానుండి చేసినప్పుడు నేను అస్త్రసన్న్యాసము చేసెదను. ఆ సందు చూచి అర్జునుడే నాపై బాణప్రయో గము చేసి నన్ను పడగొట్టగలడు. మరియొకడు చేయలేడు. అట్లైననే నీకు జయము కలుగుట నిశ్చయము. కనుక యుధిష్ఠిరా! నేను చెప్పినట్లు చేసి యుద్ధ ములో ధార్తరాష్ట్రులందరిని సంహరింపుము.

ధృతరాష్ట్ర మహారాజా! యిట్లు పాండవులు భీష్మునివలన తద్వధోపా యము తెలిసికొని భీష్మపితామహునకు అభివాదముచేసి తమ శిబిరములకు తిరిగి పోయిరి.

రాజా! పరలోకమునకు పోవుటకు దీక్ష వహించి భీష్ముడిట్లు తన వధో పాయమును చెప్పగా వినిన అర్జునుడు దుఃఖముచేత పరితపించి సిగ్గుతో నిట్లనెను.

శ్రీకృష్ణా! మాకు గురువు, మా కురుకుల వృద్ధుడు, మహాప్రజ్ఞాశాలి. బుద్ధిమంతుడు నైన పితామహునితో నేనెట్లు యుద్ధము చేయగలను?

వాసుదేవా! నేను బాల్యమునందు క్రీడించుచు భీష్ముని యొడిలో దూరి, దుమ్ముగొట్టిన నా శరీరముతో నతనిని మురికిగా చేసి యతనిని తండ్రీ! యని పిలిచినప్పుడు ఆ మహాత్ముడు బిడ్డా! నేను నీ తండ్రిని కాను. నీ తండ్రికి

తండ్రిని అని నా బాల్యమునందు నాకు చెప్పి నన్ను ప్రేమించిన నా తాతతో నిప్పుడెట్లు యుద్ధము చేసి యతనిని చంపుదును? నా సైన్యము నతడు వధించు గాక! కాని యంతటి ప్రేమమూర్తితో నేను యుద్ధము చేయను. నాకు జయము గాని, వధగాని నీవు తలచినట్లే జరుగును. కృష్ణా! సర్వసనాతన ధర్మముల నెరిగిన నావంటివాడు అస్త్రసన్న్యాసముచేసిన వృద్ధుడైన పితామహు నెట్లు బాణములతో కొట్టగలడు?

ధృతరాష్ట్ర మహారాజా! అట్లు అర్జునుడు చెప్పిన మాటలువిని శ్రీకృష్ణుడు అర్జునునితో నిట్లనెను.

పార్థా! యుద్ధమునందు భీష్ముని సంహరించెదనని పూర్వము అందరి యెదుట ప్రతిజ్ఞచేసి క్షాత్రధర్మము ననుసరించుచున్న నీ విప్పుడెట్లు అతనిని సంహరింపకుందువు? కనుక యుద్ధ దుర్మదుడైన యా క్షత్రియోత్తముని రథము నుండి పడగొట్టుము. భీష్ముని సంహరింపక నీకు విజయము లభింపదు. భీష్ముడు యమలోకమునకు పోవుచుండుట దేవతలు పూర్వము చూచినారు. అది అన్యథా జరుగదు. భీష్ముడు తప్పక మరణించును.

అర్జునా! యమునివలె నోరు తెరచుకొని పైబడుచున్న భీష్మునితో నీవుతప్ప మరియొకడు మూడు లోకములలో యుద్ధము చేయజాలడు. అది యింద్రునకు గూడ అసాధ్యము. కనుక అర్జునా! నా మాటవిని స్థిరుడవై భీష్ముని సంహరింపుము. పూర్వము బృహస్పతి యింద్రునకు క్షత్రియ నీతి యిట్లు చెప్పెను.

ఇంద్రా! శత్రువు తనకన్న వయస్సులో పెద్దవాడైనను, వృద్ధుడైనను, గుణవంతుడైనను సరియే, అతడు తనను చంపుటకు వచ్చినప్పుడు అట్టి ఆతతాయిని తప్పక చంపవలెను. ఇది స్థిరమైన శాశ్వత క్షత్రియధర్మము క్షత్రియుడు యుద్ధము చేయవలెను. రక్షించవలెను. అసూయా రహితులతో కలసి యజ్ఞాదులు చేయవలెను. ఇది క్షత్రియధర్మము.

రాజా! శ్రీకృష్ణుని యుపదేశము విని యర్జునుడతనితో నిట్లనెను.

కృష్ణా! శిఖండి భీష్మునకు మృత్యువగుట నిశ్చయము. భీష్ముడతనిని చూచిన వెంటనే యెల్లప్పుడు ముఖము త్రిప్పికొని పోవుచుండెను. కనుక మనము శిఖండిని ముందుపెట్టుకొని ఉపాయముతో భీష్ముని పడగొట్టుదమని నా యభి

ప్రాయము. నేను భీష్మునకు బాసటగా వచ్చిన యితర వీరులను బాణములతో వద్దగించెదను. యోధాగ్రేసరుడైన శిఖండి భీష్మునే ఎదిరించి యుద్ధము చేయును పూర్వము కన్యకగా నుండి తరువాత పురుషుడైన శిఖండితో యుద్ధము చేయను అని భీష్ముడు చెప్పగా వింటిమి గదా!

రాజా! యిట్లు అర్జునుడు చెప్పిన మాటలు విని శ్రీకృష్ణుడు పాండవులు మిక్కిలి హర్షించి పులకాంకితులైరి. ఇట్లు భీష్మునికడకు పోయి యతనిని అంగీకరింపజేసిన పాండవులు, కృష్ణుడు ఆ రాత్రి నిశ్చింతగా నిద్రించిరి.

జనమేజయా! ఈవిధముగా పాండవ-భీష్ముల రహస్యాలోచన వృత్తాంతము చెప్పిన సంజయుని ధృతరాష్ట్రు డిట్లు ప్రశ్నించెను.

నూటయెనిమిదవ అధ్యాయము

## దశమ దివస యుద్ధము : ఉభయసేనల యుద్ధయాత్ర

సంజయా! శిఖండి భీష్మునెట్లు ఎదిరించెను? పాండవులపై భీష్ము డెట్లు దాడిచేసెను? అది యంతయు నాకు వివరముగా చెప్పుము.

జనమేజయా! అట్లడిగిన ధృతరాష్ట్రునితో సంజయు డిట్లనెను.

రాజా! తరువాత సూర్యోదయమునందు పాండవులందరు భేరీ, మృదంగ పటహాది వాద్యములు పెరుగువంటి తెల్లనిశంఖములు అంతటను మ్రోగుచుండగా శిఖండిని ముందిడుకొని యుద్ధమునకు బయలుదేరిపోయిరి.

రాజా! ఆ తరువాత సైన్యసమేతుడైన విరాటుడు ఆ వెనుక ద్రుపదుడు పోయిరి. ఆ వ్యూహపు జఘనభాగము నైదుగురు కేకయ సోదరులు, ధృష్టకేతువు రక్షించుచుండిరి. ఈ విధముగా పాండవులు వ్యూహరచన చేసి జీవితములపై ఆశ వీడి, మీ సేనపై దాడిచేసిరి.

రాజా! అట్లే మీవారు గూడ మీ మహాసేనకు అగ్రభాగమందు భీష్ముని నిలిపి పాండవుల నెదిరించుచుపోయిరి. భీష్ముని నీ పుత్రులందరు రక్షించుచు, ఆయనవెంట సాగిపోయిరి. అట్లు భీష్ముడు పాండవ సైన్యముపైకి దాడి వెడలెను.

రాజా! భీష్ము ననుసరించి వెనుకగా మహావీరులైన ద్రోణాశ్వత్థామలు, గజసైన్యముతో భగదత్తుడు, అతని ననుసరించి కృప, కృతవర్మలు వారివెనుక మహాబలవంతుడు, కాంభోజరాజునైన సుదక్షిణుడు, మగధరాజైన జయత్సేనుడు సుబలవంశ్యుడైన బృహద్బలుడు, అట్లే సుశర్మ ప్రముఖులైన యితర రాజ వీరులు నీ సైన్యవ్యూహపు జఘన భాగమును రక్షించుచుపోయిరి. ప్రొద్దు ఎక్కు కొలది భీష్ముడు ఆసుర పైశాచిక వ్యూహములను నిర్మించుచు ఘోరముగా యుద్ధము చేయుచుండెను.

రాజా! తరువాత ఆ రెండు సైన్యములు పరస్పరము చంపికొనుచు యమ రాష్ట్ర వివర్ధనమైన యుద్ధము ఘోరముగా చేసిరి. అప్పుడు అర్జునాది వీరులు శిఖండిని ముందిడుకొని వివిధ శరములను ప్రయోగించుచు భీష్ము నెదిరించిరి.

రాజా! అక్కడ భీముని చేత కొట్టబడిన మీ సైనికులు పాండవ సైన్యమును వారింప జాలకుండిరి. తరువాత అన్నివైపుల చంపబడుచున్న మీ సైన్యము దశ దిక్కుల పారిపోవుచు తమకు రక్షకుని గానకుండిరి వారు పాండవ, సృంజయుల నిశితశరముల చేత వధింపబడుచుండిరి.

జనమేజయా! అప్పుడు ధృతరాష్ట్రుడు సంజయునితో నిట్లనెను.

సంజయా! ఆ విధముగా పాండవులచేత పీడింపబడుచున్న మన సైన్య మును చూచి పరాక్రమశాలియైన భీష్ముడు క్రుద్ధుడై యుద్ధమునందేమి చేసెను? చెప్పుము.

ఆ మాటకు సంజయుడు ధృతరాష్ట్రునకిట్లు బదులు చెప్పెను.

రాజా! అట్లు శూరులైన పాండవులు హర్షముతో నీ పుత్రుని సేనను చంపు చుండగా ఆ చతురంగ బలనాశము చూచి సహింపజాలక భీష్ముడు అనేక బాణ ములను పాంచాల సృంజయులపైన తన జీవితాశ విడిచి వర్షించి పంచపాండవు లను గూడ నివారించెను. అనేక శత్రుసేనలను నానా శస్త్రాస్త్రములచేత చంపెను. రథికులను రథములనుండి అశ్వికులను అశ్వములనుండి పదాతిసమూహము లను పడగొట్టి గజారోహకులను గూడ నశింపజేసెను.

రాజా! భీష్ముడొక్కడే త్వరగా పైబడి వచ్చుచుండెను. ఆయనను పాండవులు ఇంద్రుని అసురులు వలె ఎదుర్కొనిరి. భీష్ముడు ఇంద్రుని వజ్రా

యుధము వంటి తీక్ష్ణ శరములను ప్రయోగించుచు అవి అన్ని దిక్కుల వ్యాపింప జేయుచు అతి ఘోర శర శరీరముతో కనపడెను. అతని ధనుస్సు సర్వదా మండలీకృతమై యుండెను. ఇంద్రుని ధనుస్సుతో సమానమైన భీష్ముని ధనుస్సునుచూచి నీ పుత్రులు మిక్కిలి విస్మయముచెంది అతనిని అభినందించిరి.

రాజా! అప్పుడు పాండవులు దీనమనస్కులై యుద్ధములో శౌర్యముతో పోరాడుచున్న భీష్ముని దేవతలు విప్రచిత్తిని చూచినట్లు చూచిరి. నోరు తెరచు కున్న యముని వంటి భీష్ముని పాండవులు నివారింపజాలకుండిరి.

## భీష్మ శిఖండుల సమాగమము

రాజా! పదియవ దినమునందు శిఖండి సైన్యములు నిశితబాణములచేత అడవిని కార్చిచ్చువలె మనసేనను దహించుచు మూడు బాణములచేత భీష్ముని యెదపై కొట్టెను. క్రోధావిష్టమైన సర్పమువలె ప్రళయకాల యముని వలెను న్నన్న భీష్ముడు శిఖండి బాణములచేత గట్టిగా కొట్టబడినవాడై శిఖండిని చూచి మిక్కిలి క్రుద్ధుడై అతనిని చూచుటకు ఇచ్ఛలేని వాని వలె నవ్వుచు నిట్లనెను.

శిఖండీ! నీ యిష్టము వచ్చినట్లు నన్ను కొట్టుము. లేదా కొట్టకుండుము. ఎంతగా బాధపడినను నేను నీతో యుద్ధము చేయను. నీవు బ్రహ్మచేత ఎవతె వుగా పుట్టింపబడితివో ఆ శిఖండివే.

రాజా! ఆ మాటలు విని శిఖండి క్రోధములో ఓష్ఠమూలకములు నాకుచు భీష్మునితో నిట్లనెను.

"మహాబాహూ! నీవు క్షత్రియ నాశకరుడవని ఎరుగుదును. నీవు పరశు రామునితో యుద్ధముచేసితివి. నీ ప్రభావము దివ్యమనియు నేను చాలా విన్నాను. నీ సామర్థ్యమెరిగిన వాడనైనను నేడు నీతో యుద్ధము చేసెదను. దానిచేత పాండవులకు నాకును ప్రీతి కలిగించెదను. పురుషోత్తమా! నేడు నీ చేత యుద్ధము చేయించి, నిన్ను సంహరించెదను. ఇది నిశ్చయముగా జరిగి తీరును. సత్యముపై ఒట్టుపెట్టుకొని నీ యెదుట చెప్పుచున్నాను. ఈ నా మాట విని నీవు చేయదగినదేదియో చేయుము. నీవు పోరాడినను పోరాడకున్నను సరియే! నిన్ను జీవితములో నేడు విడువను. కనుక భీష్మా! నేడు యుద్ధవిజయుడవైన నీ పరాక్ర మము చూచెదను గాక!

ధృతరాష్ట్ర మహారాజా! యిట్లు చెప్పి శిఖండి భీష్ముని తన వాగ్బాణముల చేత వేధించుటతో పాటు పదునైన బాణములతో కొట్టెను.

## భీష్మవధకు శిఖండిని అర్జునుడు ప్రోత్సహించుట

రాజా! అట్లు శిఖండి యనిన మాటలు విని యర్జునుడు ఇది భీష్మవధకు సరియైన కాలము అని తలచి శిఖండినిట్లు పురికొల్పెను.

"మహాబాహూ! నేను శత్రువులను పారద్రోలుచు నిన్ను అనుసరించుచుండెదను. నీవు సంరంభములో భీమపరాక్రమశాలియైన భీష్మునిపై దాడిచేయుము. ఆయన సమర్థుడైనను యుద్ధములో నిన్ను పీడింపడు కాబట్టి నేడు నీవు మిక్కిలి పూనికతో భీష్ముని తరుముము

వీరవరా! ఒకవేళ నీవు నేడు యుద్ధమునందు భీష్ముని సంహరింపక తిరిగిపోయిన యెడల లోకములో నీకు నాకున్ను పరిహాసము కలుగును. వీరా! మనము పరిహాసపాత్రులము గాకుండు లాగు నీవు ప్రయత్నించి నేడు భీష్ముని వధింపుము.

మహాబలశాలీ! నేను యుద్ధములో ద్రోణాశ్వత్థామ కృప, దుర్యోధనాది వీరులను మహాబలశాలురై పోరాడుచున్న సమస్త కురువీరుల సైన్యములనున్ను మహాసముద్రమును తీరమువలె నివారించుచు నిన్ను రక్షించుచుండెదను. నీవు నిర్భయముగా పనుకాదక నేడు భీష్ముని వధింపుము.

జనమేజయా! ఇట్లు అర్జునుడు శిఖండిని ప్రోత్సహించెనని సంజయుడు చెప్పగా విని ధృతరాష్ట్రుడు సంజయునిట్లు ప్రశ్నించెను.

నూటతొమ్మిదవ అధ్యాయము

## భీష్మ దుర్యోధనుల సంవాదము

సంజయా! క్రుద్ధుడై శిఖండి ధర్మాత్ముడైన భీష్మ పితామహునెట్లెదిరించెను? పాండవులలో నెవరు శిఖండిని రక్షించిరి? ఆ దశమదిన యుద్ధమందు భీష్ముడు పాండవ సృంజయులతో నే విధముగా యుద్ధము చేసెను? శిఖండి

భీష్మునంతటివానిని ఎదిరించుట విని నేను సహింపజాలకున్నాను. భీష్ముని రథము గాని, ధనుస్సుగాని భగ్నము కాలేదు గదా!

జనమేజయా! ధృతరాష్ట్రుని ప్రశ్నములకు సంజయుడిట్లు బదులు చెప్పెను.

రాజా! భీష్మ పితామహుని ధనుస్సు నశించలేదు. అతని రథము గూడ భగ్నముకాలేదు. యుద్ధమునందతడు శత్రువులను శరములచేత సంహరించుచునే యుండెను. అనేక శతసహస్ర సంఖ్యాకులైన మీ రథికులు-చతురంగ సైన్యము లున్ను పితామహుని ముందిడుకొని యుద్ధము చేయుచు ముందుకు సాగుచునే యుండిరి. భీష్ముడు తాను చేసిన ప్రతిజ్ఞమేరకు పాండవసేనలను నశింపజేయు చునే యుండెను.

రాజా! యీ విధముగా భీష్ముడు శత్రువులను శరములతో చంపుచు, పాంచాల పాండవ సైనికులను ఆ దశమదిన యుద్ధమునందు నివారించుచునే యుండెను. నిశితశరములచేత నతడు శతసహస్ర సంఖ్యాకములైన శత్రుసైన్యము లను వధించుచుండగా నతనిని పాండవులు పాశహస్తుడైన యమునివలె యుద్ధము నందు జయింపజాలకుండిరి.

రాజా! అప్పుడు అపరాజితుడైన అర్జునుడు మీ రథికులనందరను భయ పెట్టుచు సింహనాదము ధనుష్టంకారము బాణప్రయోగమున్ను చేయుచు యుద్ధ నందు యమునివలె ముందుకు వచ్చి అన్నిచోట్ల సంచరించుచుండెను.

రాజా! అర్జునుని సింహనాదము విని మీ వారందరు సింహధ్వని వినిన మృగములవలె పారిపోవజొచ్చిరి జయశీలుడైన అర్జునుని చూచి నీ సైన్యము పీడితమయ్యెను.

రాజా! అప్పుడు దుర్యోధనుడు మిక్కిలి బాధపడి భీష్మునితో నిట్లనెను.

తాతా! కృష్ణ సారథియైన యర్జునుడు శ్వేతాశ్వరథములో వచ్చి మన వారందరిని అడవిని అగ్నివలె దహించుచున్నాడు. పారిపోవుచున్న మనసైన్యము లను చూచితివా? వానిని యుద్ధములో నర్జునుడు పారద్రోలుచున్నాడు అవి గోపాలకునిచేత తోలబడుచున్న పశుగణములవలె పారిపోవుచున్నవి. అర్జునుని శరములచేత నచ్చటచ్చట సైన్యములు భగ్నములైనవి.

పితామహా! ఈ విధముగానే భీమసేన, సాత్యకి, నకుల, సహదేవ, అభి

మన్యు, ధృష్టద్యుమ్న, ఘటోత్కచులుగూడ అడ్డులేక మన సైన్యములను కొట్టి పారద్రోలుచున్నారు చూచితివా! ఈ విధముగా వారందరిచేత వధింపబడుచు పారిపోవుచున్న మన సైనికుల రక్షణార్థమై యుద్ధము చేయుట తప్ప మరియొక యుక్తమైన గతి కనపడుట లేదు. తాతా! దేవతుల్య పరాక్రముడవైన నీవు దప్ప నిప్పుడు వారిని ఎదుర్కొనువారు లేరు దానికి నీవే చాలుదువు. కనుక పీడితులైన సైనికులకు గతివి కమ్ము.

ధృతరాష్ట్ర మహారాజా! ఈ విధముగా దుర్యోధనుడు చెప్పిన తరువాత భీష్ముడు క్షణకాలము చింతించి ఒక నిశ్చయమునకు వచ్చి దుర్యోధనుని పట్టుకొని యిట్లనెను.

దుర్యోధనా! నేను చెప్పబోవు మాటలు స్థిరుడవై వినుము. నేను దినమునకు పదివేల క్షత్రియ సైన్యములను సంహరించి యుద్ధమునుండి విరమించెదను అని పూర్వము నీతో ప్రతిజ్ఞచేసి యుంటిని. అట్లే చేసితిని. నేడు గూడ అట్లే చేసెదను. నేడు నేనైనను మరణించెదను లేదా పాండవులనైనను సంహరించెదను. రాజా! ఈనాటితో నేడు భర్తృపిండము (నీ యన్నము) తినినందుకు నీ ఋణమును నేను మరణించి తీర్చుకొనెదను.

## భీష్ముడనేక సేనలను సంహరించుట

ధృతరాష్ట్ర మహారాజా! భీష్మపితామహుడీ విధముగా దుర్యోధనునితో చెప్పి విజృంభించి క్షత్రియవీరులను చెండాడుచు అడ్డులేకుండ పాండవులను ఎదుర్కొనెను.

రాజా! అప్పుడు సేనామధ్యములో సర్పమువలె క్రుద్ధుడై నిలిచియున్న భీష్ముని పాండవులు అడ్డగించిరి.

రాజా! ఆ పదియవ దినమునందు భీష్ముడు తన సర్వశక్తులను ప్రదర్శించి ఘోరముగా యుద్ధముచేసి లక్షసైన్యములను వధించెను. పాంచాలురలో మహారథికులైన రాజపుత్ర శ్రేష్ఠుల తేజస్సును సూర్యుడు కిరణములచేత జలమును వలె బాణములచేత హరించెను.

రాజా! భీష్ముడా పదవనాడు గజారోహకులతో పాటు పదివేల ఏనుగులను

అశ్వికులతో పాటు పదివేల యశ్వములను, రెండులక్షల పదాతి సైనికులను ధూమరహితాగ్ని వలె మండుచు యుద్ధమునందు దహించివైచెను.

రాజా! అట్లు విజృంభించి ఆనాడు యుద్ధము చేయుచున్న భీష్ముని పాండవులలో నెవరుగూడ తేరిపార చూడజాలకుండిరి భీష్ముడు ఉత్తరాయణములో తపించుచున్న సూర్యునివలె తీక్ష్ణముగా భయంకరుడైయుండెను.

రాజా! అప్పుడు పాండవులు సృంజయాదివీరులు భీష్ముని చేత పీడితులై అతి సంరంభముతో భీష్ముని వధించుటకు అతనిపైకి ఉరికిరి. అప్పుడు వారితో యుద్ధముచేయుచున్న భీష్ముడు మేఘములచేత ఆవరింపబడిన మేరు పర్వతమువలె మెరయుచుండెను.

రాజా! అప్పుడు నీ పుత్రులు భీష్ముని చుట్టు అన్నివైపులనుండి గొప్ప సేనతో చేరిరి. ఆ తరువాత భీకరయుద్ధము జరిగెను.

జనమేజయా! యిట్లు సంజయుడు యుద్ధవృత్తాంతము ధృతరాష్ట్రునకు చెప్పి తరువాతి యుద్ధ వృత్తాంతమిట్లు వర్ణింపదొడగెను.

నూటపదవ అధ్యాయము

## అర్జునుని ప్రోత్సాహముచేత భీష్మునిపై శిఖండి ఆక్రమించుట

రాజా! అర్జునుడు యుద్ధమునందు భీష్ముని పరాక్రమము చూచి శిఖండితో నిట్లనెను.

వీరవరా! భీష్మపితామహు నెదుర్కొనుము భీష్మునకు నీవేమాత్రము భయపడకుము. నేనతనిని రథమునుండి పడగొట్టెదను.

ధృతరాష్ట్రా! యిట్లు అర్జునుడు చెప్పగానే శిఖండి భీష్మునిపై దాడిచేసెను.

పార్థుని మాటలు వినిన ధృష్టద్యుమ్నాభిమన్యులు వృద్ధులైన విరాట ద్రుపదులు కుంతిభోజుడు యుధిష్ఠిర, నకుల సహదేవులు ఇతర సైనిక వీరులున్ను హర్షముతో దుర్యోధనుడు చూచుచుండగనే భీష్ముని ముట్టడించిరి.

రాజా మీవారుగూడ ఆ మహారథికుల నెదిరించిరి. మీవారు ఉత్సాహముతో శక్తికొలది శత్రువులతో పోరాడిన క్రమము చెప్పెద వినుము

రాజా! వృషభముపై వ్యాఘ్ర శిశువు దాడిచేసినట్లు భీష్మునిపై బడుటకు వచ్చుచున్న చేకితానుని చిత్రసేనుడు ఎదిరించెను. యుద్ధసన్నద్ధుడై త్వరగా భీష్మునిపైపడుచున్న ధృష్టద్యుమ్నుని కృతవర్మ నివారించెను. భీష్మ వధేచ్ఛతో క్రుద్ధుడై త్వరగా వచ్చుచున్న భీమసేనుని సోమదత్త పుత్రుడైన భూరిశ్రవుడు నివారించెను. అట్లే అనేక బాణములను ప్రయోగించుచు వచ్చుచున్న నకులుని భీష్మ జీవితమును కోరుచున్న వికర్ణుడు అడ్డగించెను. భీష్ముని రథముపైకి వచ్చుచున్న సహదేవుని కృపాచార్యుడు క్రోధముతో నివారించెను. క్రూర కర్ముడైన ఘటోత్కచుడు భీష్మవధకై వచ్చుచుండగా దుర్ముఖుడెదుర్కొనెను. భీష్మవధేచ్ఛతో వచ్చుచున్న సాత్యకిని దుర్యోధనుడు అడ్డగించెను.

రాజా! యిట్లే భీష్ముని రథముపైకి పోవుచున్న అభిమన్యుని సుదక్షిణుడు నివారించెను. వృద్ధులైన విరాటద్రుపదులను అశ్వత్థామ క్రోధముతో నడ్డగించెను. అట్లే భీష్మవధేచ్ఛతో వచ్చుచున్న యుధిష్ఠిరుని ద్రోణాచార్యుడు నివారించెను.

మహారాజా! శిఖండిని ముందిడుకొని దశదిక్కులు ప్రకాశింపజేయుచు భీష్మునిపైకి వచ్చుచున్న యుద్ధరతుడైన అర్జునుని దుశ్శాసనుడెదిరించెను. అట్లే భీష్మునిపై దాడిచేయుటకు వచ్చుచున్న అనేక పాండవవీరులను మీ వీరులనేకులు అడ్డగించిరి.

రాజా! అప్పుడు ధృష్టద్యుమ్నుడు సైన్యములతో మాటి మాటికి నిట్లనెను.

వీరులారా! మీరందరు సంరంభముతో ఒక్క భీష్మునిపైననే దాడిచేయుడు. ఇదుగో అర్జునుడు భీష్మునెదిరించుచున్నాడు. అతనితో పోరాడుటకు ఇంద్రుడు గూడ సమర్థుడు కాడన్నచో శక్తి ఉడిగి అల్పజీవితముగల భీష్ముడు అర్జును నెట్లెదిరించి పోరాడగలడు?

ధృతరాష్ట్ర మహారాజా! ఇట్లు తమ సేనాపతియైన ధృష్టద్యుమ్నుడు చెప్పగానే రథిక వీరులందరు భీష్ముని రథముపై దాడిచేసిరి.

రాజా! అట్లు ప్రళయకాల జల ప్రవాహములవలె వచ్చుచున్న పాండవ వీర సైనికులను మీ వీరవరులు హర్షముతో నివారించిరి. రాజా! దుశ్శాసనుడు భయము వీడి అర్జునునిపై దాడిచేసెను.

## దుశ్శాసనార్జునుల యుద్ధము

మహారాజా! అప్పుడు అర్జునుడు దుశ్శాసనునితో పోరాడుచు అతనిని మించకుండుట జూడగా అదియొక అత్యద్భుతముగా చూచువారికి తోచెను. దుశ్శాసనుడు అర్జున వేగమును సముద్రవేగమును తీరమువలె అడ్డగించెను. రథిక శ్రేష్ఠులు, దుర్జయులు, కాంతిదీప్తులతో చంద్రసూర్య సమానులు మిక్కిలి సంరంభముతో అన్యోన్య వధేచ్ఛతో పోరాడువారు వృత్రాసుర ఇంద్రులవంటి దుశ్శాసనార్జునులు ఆ మహాయుద్ధమునందు మయాసుర ఇంద్రులవలె ఒండొరులు తలపడిరి.

రాజా! అప్పుడు దుశ్శాసనుడు అర్జునుని మూడు బాణములతో శ్రీకృష్ణుని ఇరువది బాణములతోను కొట్టి ఓడింపచేసెను. అట్లు పీడితుడైన వాసుదేవుని చూచి యర్జును డతిక్రుద్ధుడై దుశ్శాసనుని నూరుబాణములతో కొట్టెను. ఆ బాణములు దుశ్శాసనుని కవచమును ఛేదించి యతని రక్తమును దప్పిగొన్న సర్పము తటాకోదకమును వలె త్రాగెను.

రాజా! తరువాత దుశ్శాసనుడు మూడు బాణములతో అర్జునుని లలాటమునందు కొట్టెను. ఆ బాణములతో నతడు శృంగత్రయ శోభితమైన మహామేరువు వలె ప్రకాశిల్లెను. అట్లు దుశ్శాసనుని చేత కొట్టబడిన యర్జునుడు పూచిన మోదుగు వలె విరాజిల్లెను.

రాజా! అప్పుడర్జునుడు క్రుద్ధుడై పర్వకాలమునందు రాహువు చంద్రుని పీడించినట్లు శరవర్షము చేత దుశ్శాసనుని బాధించెను. అట్లు పీడితుడైన దుశ్శాసనుడు నిశితశరములతో అర్జునుని కొట్టగా నతడు దుశ్శాసనుని బాణములను, ధనుస్సును ఖండించి మూడు బాణములలో నతని రథమును భగ్నముచేసి యతనిపై బాణవర్షము గురిసెను.

రాజా! తరువాత దుశ్శాసను డతిక్రుద్ధుడై మరియొక ధనుస్సు తీసికొని భీష్ముని సమ్ముఖమున నిలిచి అర్జునుని బాహువులపై, ఎదపైనను ఇరువదియైదు బాణములతో గొట్టెను. అప్పుడు క్రోధముతో నర్జునుడు యమదండమువంటి అనేక బాణములను దుశ్శాసనునిపై ప్రయోగింపగా నతడు ఆ బాణములను నడుమనే ఛేదించి యర్జునుని ప్రయత్నము భగ్నముచేసి యతనిపై నిశితబాణము

లను ప్రయోగించెను అప్పుడు రాజా! నీ పుత్రుని శౌర్యము అత్యద్భుతముగా నుండెను.

రాజా! తరువాత క్రుద్ధుడైన యర్జునుడు శరసంధానముచేసి యనేక బాణములు దుశ్శాసనునిపై విడిచెను. ఆ బాణములు దుశ్శాసనుని శరీరములో సరస్సులో హంసవలె మునిగిపోయెను.

రాజా! ఆ విధముగా నర్జునుని చేత పీడితుడైన నీ పుత్రుడు దుశ్శాసనుడు మూర్ఛిల్లుచు అర్జునుని విడిచి భీష్ముని రథము వైపునకు పోయెను. అప్పుడు అగాధజలములో మునుగుచున్నవానికి ద్వీపమువలె భీష్ముడు అతనికి ఆశ్రయమాయెను.

రాజా! తరువాత తెలివి వచ్చిన దుశ్శాసనుడు మరల తన పరాక్రమము ప్రదర్శించుచు అర్జునుని నివారించుచు సతనిని బాణములతో వృత్రాసురుని నింద్రుడువలె కొట్టెను. కాని యర్జునుడేమాత్రము వ్యథ చెందలేదు.

జనమేజయా! ఇట్లు దుశ్శాసనార్జునుల ద్వంద్వ యుద్ధమును గూర్చి సంజయుడు ధృతరాష్ట్రునకు వర్ణించి చెప్పి తరువాతి యుద్ధ వృత్తాంతమిట్లు చెప్పదొడగెను.

## నూటపదకొండవ అధ్యాయము

## కౌరవ-పాండవ ముఖ్యరథికుల ద్వంద్వ యుద్ధము

రాజా! భీష్ము నెదిరించుచున్న సాత్యకిని ఋష్యశృంగ పుత్రుడైన అలంబుషుడు ఎదురొడ్డి నివారించెను. అప్పుడు సాత్యకి మిక్కిలి క్రుద్ధుడై అలంబుష రాక్షసుని తొమ్మిది బాణములతో నవ్వుచు కొట్టెను.

అట్లే ఆ రాక్షసుడు సాత్యకిపై తొమ్మిది బాణములను ప్రయోగించి బాధించెను. దానికి ఎదురుగా సాత్యకి గూడ కొట్టెను. ఇట్లు వారిరువురు పరస్పరము ఘోర యుద్ధము చేసిరి

రాజా! తరువాత ప్రాగ్జ్యోతిష పతియైన భగదత్తుడు క్రుద్ధుడై నిశిత బాణ

ములను సాత్యకిపై ప్రయోగించెను. అవి అంకుశములు గజమును వలె గ్రుచ్చు కొనెను. అప్పుడు సాత్యకి అలంబుష రాక్షసుని విడిచి భగదత్తుని కొట్టెను. అతడు సాత్యకి ధనుస్సును ఖండించెను. సాత్యకి మరియొక ధనుస్సుగొని యత నిపై శరములు విడిచెను. అప్పుడు భగదత్తుడు క్రుద్ధుడై యమదండమువంటి ఉక్కుశక్తిని సాత్యకిపై ప్రయోగించెను. దానిని సాత్యకి రెండుగా ఖండించెను. అది క్రిందపడుట చూచి దుర్యోధనుడు గొప్ప రథసేనతో సాత్యకి నెదిరించి తన తమ్ములతో నిట్లనెను.

సోదరులారా! ఈ సాత్యకి ఈ రథసేననుండి జీవముతో తిరిగి పోవ కుండునట్లు చేయుడు. ఇతడు మరణించినచో పాండవుల సేనయంతయు చచ్చి నట్లు తలచెదను.

రాజా! దుర్యోధనుని మాట ప్రకారము ఆ రథికులందరు భీష్మునిపైకి పోవుచున్న సాత్యకిని పొదివికొట్టిరి.

రాజా! భీష్మునిపైకివచ్చుచున్న అభిమన్యుని కాంభోజరాజైన సుదక్షిణుడు అడ్డగించి అరువది బాణములతో కొట్టెను. సారథిని తొమ్మిది బాణములతో కొట్టెను. అట్లా యిరువురకు మహా ఘోరయుద్ధము జరిగెను.

రాజా! శత్రుహంతకుడైన శిఖండి భీష్మునిపై దాడిచేయుటకు పోవుచున్న ప్పుడు విరాట ద్రుపదులు శత్రుసేనలను వారించుచు శిఖండికి సహాయకులుగా భీష్మునిపైకి ఉరికిరి.

రాజా! అప్పుడు రథికోత్తముడైన అశ్వత్థామ క్రుద్ధుడై వచ్చి విరాట ద్రుపదులను నివారించి యుద్ధము చేసెను. అప్పుడు విరాటుడు పది భల్లముల చేత, ద్రుపదుడు మూడు బాణములచేతను గురుపుత్రుని కొట్టిరి. అశ్వత్థామ ఆ యిరువురిపైన ప్రయోగించిన బాణములను ఆ వృద్ధులిద్దరు ఛేదించుట చూడగా మహాద్భుతముగా నుండెను.

రాజా! సహదేవుని కృపాచార్యుడు వనమునందు మదగజము మరియొక మదగజము నెదుర్కొనినట్లెదిరించెను. కృపాచార్యుడు సహదేవునిపై డెబ్బది బాణములు ప్రయోగించెను. కృపాచార్యుని ధనుస్సు ఛేదింపగా అతడు మరి యొక ధనుస్సు తీసికొని సహదేవుని యెదపై పదిశరములతో కొట్టెను. అట్లే

అతడు కూడా కృపాచార్యుని యెదపై కొట్టెను. భీష్ముని రక్షించుటకు కృపాచార్యుడు, భీష్ముని వధించుటకు సహదేవుడు పరస్పరమిట్లు ఘోరముగా యుద్ధము చేసిరి.

రాజా! నకులుని వికర్ణుడు క్రుద్ధుడై అరువదిబాణములతో కొట్టగా అతనిని నకులుడు డెబ్బదియేడు బాణములతో కొట్టెను. అట్లా యిరువురు గోశాలలో ఆబోతులవలె పరస్పరము కొట్టుకొనిరి.

రాజా! ఘటోత్కచుడు మీ సేనను కొట్టుచు భీష్మునిపైకి వచ్చుచుండగా దుర్ముఖుడా రాక్షసుని భీష్మ రక్షణార్థమై యెదిరించెను. ఘటోత్కచుడతనిని యెదపై కొట్టగా అతడు కూడా అరువది బాణములతో ఆ రాక్షసుని కొట్టెను.

రాజా! భీష్మవధేచ్ఛతో వచ్చుచున్న ధృష్టద్యుమ్నుని అతని ఐదు బాణములతో కొట్టెను. మరల ధృష్టద్యుమ్నుని 'నిలు-నిలు' మనుచు ఏబది బాణములతో కొట్టగా ధృష్టద్యుమ్నుడు కూడా ఘోరయుద్ధమున ఒకరిని మించి ఒకరు ఇంద్ర వృత్రాసురులవలె పోరాడిరి.

రాజా! భీష్మునిపైకి వచ్చుచున్న భీమసేనుని, సోమదత్త పుత్రుడైన భూరిశ్రవుడు నిలునిలుమని వారించి అతని యెదపైకొట్టెను. అట్లు వక్షస్థలములో నిరికిన బాణముతో భీముడు పూర్వము కుమారస్వామి ప్రయోగించిన శక్తిచేత క్రౌంచపర్వతము వలె ప్రకాశించెను అట్లా యిరువురు కమ్మరిచేత పదునుచేయబడిన బాణములతో పరస్పరము క్రోధయుక్తులై యుద్ధము చేసిరి.

రాజా! గొప్ప సేనతో భీష్మునెదిరించుటకు వచ్చుచున్న యుధిష్ఠిరుని ద్రోణాచార్యుడు నివారించెను. ఆ యిరువురికి యుద్ధము ఘోరముగా జరిగెను. మేఘగర్జనము వంటి ద్రోణుని రథధ్వని విని ప్రభద్రకులసేన ద్రోణుడు నివారించుచున్నను చలించక ద్రోణునితో పోరాడెను.

రాజా! భీష్మునిపై దాడిచేయుటకు వచ్చుచున్న చేకితానుని నీ మిత్రుడు చిత్రసేనుడు నివారించెను. భీష్మరక్షణార్థమై చిత్రసేనుడు చేకితానునిపై శక్తిని విసిరెను. అట్లే చేకితానుడు కూడా చిత్రసేనుని అడ్డగించి కొట్టెను. ఆ యిరువురికి అప్పుడు యుద్ధము అతిఘోరముగా జరిగెను.

రాజా! దుశ్శాసనుడు అర్జునుని ఎంతగావారించుచున్నను ఆగక అర్జునుడు

నీ పుత్రుని వారించి నీ సేనను చెండాడజొచ్చెను. అప్పుడా దుశ్శాసనుడు శక్తిని ప్రయోగించి అర్జునుడిని అడ్డగించెను. అప్పుడు దుశ్శాసనుని కొట్టగా మీ సేన మిక్కిలి బాధపడి అర్జుననెదిరింపగా మరల అర్జునుడు ఆ సేనను కొట్టగా అది సమరభూమిపై పడి పొర్లాడజొచ్చెను.

జనమేజయా! యిట్లు సంజయుడు వీరుల ద్వంద్వయుద్ధ క్రమమును గూర్చి ధృతరాష్ట్రునకు వర్ణించి చెప్పి, తరువాతి యుద్ధవృత్తాంతమిట్లు చెప్ప దొడగెను.

## ద్రోణాచార్యుడు అశ్వత్థామకు అశుభనిమిత్తములను సూచించుట

రాజా! వీరుడు, మహాధానుష్కుడు-మదగజ పరాక్రమశాలి మత్తగజ నివారకమైన మహాధనుస్సును ఆడించుచున్న పురుషోత్తముడు పాండవులసేనను పారద్రోలుచు సైన్యములో ప్రవేశించుచున్న మహాబలశాలి వీర్యవంతుడునైన ద్రోణాచార్యుడు వివిధ నిమిత్తముల నెరిగినవాడు కాబట్టి సేనలను తప్పింప జేయుచున్న తన పుత్రుడైన అశ్వత్థామతో ఆ నిమిత్తములను గూర్చి యిట్లనెను.

పుత్రా! నేడు మహాబలశాలియైన అర్జునుడు యుద్ధమునందు భీష్ముని సంహరింప నిశ్చయించు మహాప్రయత్నము చేయగలడు. నాయనా! నేడు నా చేతినుండి బాణములు పైకెగురుచున్నవి. ధనుస్సు అదురుచున్నట్లు తోచుచున్నది వివిధాస్త్రములమంత్రముల ప్రయోగము జ్ఞప్తికి రానున్నది. నా బుద్ధిక్రూరముగా నున్నది.

పుత్రా! దిక్కులందు మృగపక్షులు అశాంతముగా ధ్వనించుచున్నవి. భారతసేనల క్రిందుగా గ్రద్దలుదోగుచున్నవి. సూర్యుడు తేజస్సునశించినవాడుగా కనిపించుచున్నాడు. అన్ని దిక్కులు ఎరుపురంగుగలవైయున్నవి. భూమి ధ్వనించుచూ దద్దరిల్లుచు కంపించుచున్నది. రాబందులు-గ్రద్దలు-కొంగలు-నక్కలు మాటిమాటికి అశుభమును తెలుపుచు అమంగళధ్వనులు ఘోరముగా చేయుచున్నవి ఆ జంతువులు సూర్యునకు అభిముఖముగా నోర్లు తెరచుకొని అరచుచున్నవి.

నాయనా! సూర్యమండల మధ్యమునుండి కొరవులుపడుచున్నవి. విష్కం

ఖాదులైన యిరువదియేడు యోగములలో నొకటైన 'పరిఘము' అను దుర్యోగము కబంధయుక్తమై (మొండెముతో) సూర్యునిచుట్టుముట్టి నిలిచియున్నది. రాజుల దేహనాశకరము ఘోరము భయంకరమునైన ఘోరపరివేషము(సూర్యచంద్రుల చుట్టు ఏర్పడు మండలము- దీనిని గాలిగుడియందురు. సూర్యచంద్రుల చుట్టు ఏర్పడెను.

పుత్రా! దుర్యోధనుని దేవాలయములలోఉన్న దేవతావిగ్రహాలుకంపించుచు నవ్వుచూ-నర్తించుచూ ఏడ్చుచున్నవి. గ్రహములు అపసవ్యముగా సూర్యునిచుట్టి సూర్యమండలము గుర్తింపబడునట్లు చేయుచున్నవి. చంద్రుడు తలక్రిందులుగా నిలిచియున్నాడు.

నాయనా! నరేంద్రుల శరీరములు శోభతరిగినట్లుగా కనబడుచున్నవి. ధార్తరాష్ట్ర సైన్యములలో కవచధారులు మెరయుటలేదు.

పుత్రా! ఉభయసేనలలోను శ్రీకృష్ణుని పాంచజన్యశంఖనాదము గాండీవ ధ్వనియు, ఇతర ధ్వనులను అణచి వినబడుచున్నవి. ఇదుగో అర్జునుడు ఉత్తమా స్త్రములను ధరించి యుద్ధమునందు ఇతర యోధులను ప్రక్కకు తొలగించుచు భీష్ముని ఎదిరించుటకు పైబడి వచ్చుచున్నాడు.

## భీష్మ రక్షణార్థము—ధృష్టద్యుమ్నునితో పోరుడుటకున్ను ద్రోణుడు పుత్రుని ఆజ్ఞాపించుట

నాయనా! ఈయశుభ నిమిత్తములను గమనించి అర్జునుడు ఉత్తేజితుడై భీష్మునిపైకి వచ్చుటను చూచి నా శరీరములో రోమాంచము కల్గుచున్నది. నా మనస్సు కృంగిపోవుచున్నది.

పుత్రా! భీష్మార్జునుల సమాగమమును గూర్చి చింతించుచున్నాను. కపట కృత్యములందే ప్రజ్ఞకల్గి పాపపుమనస్సుగల శిఖండిని ముందిడుకొని అర్జునుడు భీష్మునితో పోరాడుటకు పోయెను.

నాయనా! భీష్ముడు పూర్వము నాతో 'పూర్వము స్త్రీగా పుట్టింపబడి, తర్వాత దైవికముగా పురుషుడై అమంగళ ధ్వజముగలిగి మహాబలశాలియైన

ద్రుపదపుత్రుడైన శిఖండిచే నేను సంహరించబడుదునని' చెప్పియుండెను. కనుక అమాంగళికుడైన శిఖండిపై భీష్ముడు బాణప్రయోగము చేయడు.

పుత్రా! ఇవియన్నియు చింతించుచున్న నా ప్రజ్ఞమిక్కిలి సన్నగిల్లు చున్నది. అర్జునుడు యుద్ధసన్నద్ధుడై భీష్మునిపై దాడిచేయుచున్నాడు. నాయనా యుధిష్ఠిరుని క్రోధము భీష్మార్జునుల సమాగమము నా అస్త్ర సమారంభము వివిధాస్త్ర ప్రయోగయత్నము ఈ మూడును ప్రజలకు అశుభసూచకములు. ఇది నిశ్చయము.

నాయనా! అభిమానవంతుడు–బలవంతుడు. శూరుడు- అస్త్రవిద్యాపండితుడు లాఘవ పరాక్రమశాలి- దూరమువరకుకూడా పోయి పోరాడువాడు దృఢమైన బాణసంపద గలవాడు సర్వనిమిత్తముల నెరిగినవాడు- యుద్ధమునందు ఇంద్రాది దేవతలకు కూడా అజేయుడు- బలవంతుడు బుద్ధిమంతుడు- యుద్ధములో క్లేశ మెరుగనివాడు–యోధశ్రేష్ఠుడు యుద్ధమునందు ఎల్లప్పుడు విజయశీలుడు-భయంకరములైన అస్త్రములు గలవాడు నైన అర్జునుని మార్గము తప్పించుకొనిపొమ్ము.

పుత్రా! నేడు ఈ మహాఘోర సంగ్రామమందు మహావైశసము (హాని) జరుగనున్నది చూడుము. నేడు అత్యంత క్రోధోద్రిక్తుడైన అర్జునుడు సైనిక వీరుల బంగారు కవచములను నిశితశరములచేత చీల్చును. ధ్వజాగ్రములను తోమరములను ధనుస్సులను–శక్తిప్రాసాదులను-గజముల వెక్కములను ఛేదించును. కనుక యశస్సునో–జయమునో ఆశించి స్వర్గమును ముందిడుకొని యుద్ధమునకేగుము.

నాయనా! నేడు అర్జునుడు మహాఘోరము- దుర్గమము రథగజాశ్వముల నెడు సుడులు గల సంగ్రామ నదిని దాటగలడు.

పుత్రా! యుధిష్ఠిరుని యందున్న (బ్రహ్మణ్యత్వము బ్రహ్మనిష్ఠత్వము బ్రాహ్మణ హితత్వము)ఇంద్రియ నిగ్రహము, దానము తపస్సు–సత్ప్రవర్తనము ఈ సద్గుణములన్నియు నేడు ఇక్కడ కనబడును. ఆ మహామహునకు అండగా అర్జునుడే కాక మహావీరులైన భీమ నకుల సహదేవులు కూడా ఉన్నారు. అన్నిటికి మించి అతనికి నాథుడై రక్షకుడై సర్వలోకేశ్వరుడైన శ్రీకృష్ణభగవాను డున్నాడు.

పుత్రా! అట్టి మహాత్ముడైన యుధిష్ఠిరునకు దుర్మతియైన దుర్యోధనుని

యెదలగల కోపము భరతభూమిని దహించగలదు. ఆ మహనీయుడు తపస్సుచేత కృశించిన శరీరము గలవాడు సుమా! నాయనా! ఇదిగో వాసుదేవుని యాశ్రయముగల అర్జునుడు ధార్తరాష్ట్ర సైన్యములనన్నిటిని చీల్చి చెండాడుచు కనబడుచున్నాడు. అతనిచేత క్షోభిల్లిన ధార్తరాష్ట్ర సైన్యము 'తిమి' యను మహామత్స్యముచేత క్షోభింపచేయబడిన మహాతరంగసయుతమ్రుదముపలెనున్నది చూడుము.

పుత్రా! సేనాముఖమునందు మహాశబ్దములు వినబడుచున్నవి. నీవు ధృష్టద్యుమ్నునిపై దాడిచేయుటకు పొమ్ము. నేను యుధిష్ఠిరుని పైకి పోయెదను. అమిత తేజశ్శాలియైన ఆ మహారాజు యొక్క వ్యూహము సముద్రకుక్షివలె దుర్గమముగా ఉన్నది.

నాయనా! దానిచుట్టు అతిరథులైన వీరులు నిలిచియున్నారు. ఆ వ్యూహములో ఉన్న యుధిష్ఠిర మహారాజును-అభిమన్యు-సాత్యకి-ధృష్టద్యుమ్న-భీమసేన-నకుల సహదేవులు పరివేష్టించి రక్షించుచున్నారు.

పుత్రా! ఇదిగో గొప్ప మద్దిచెట్టు వలె ఉన్నతుడు శ్యామవర్ణుడు శ్రీకృష్ణ సమానుడైన ధృష్టద్యుమ్నుడు రెండవ అర్జునుడా అనునట్లు సేనాగ్రభాగమునందు పోవుచున్నాడు చూడుము.

నాయనా! ఉత్తమాస్త్రశస్త్రములును మహాధనుస్సునుతీసికొని ధృష్టద్యుమ్న భీమసేనుల నెదిరించి యుద్ధము చేయుము.

పుత్రా! ప్రపంచములో తన ప్రియపుత్రుడు శాశ్వతముగా అనేక సంవత్సరములు జీవించవలెనని ఏ తండ్రి కోరడు? కాని క్షత్ర ధర్మమును పురస్కరించుకొని మనము ఆ ధర్మము నాశ్రయించినాము కాబట్టి నిన్ను యుద్ధము చేయుటకు నియోగించుచున్నాను.

నాయనా! ఇదిగో ఈ మహారణమునందు భీష్ముడు మహాసైన్యమును దహించుచున్నాడు. అతడు యుద్ధములందు అసమానుడు.

ధృతరాష్ట్ర మహారాజా! ప్రతాపశాలియైన ద్రోణాచార్యుడిట్లు పుత్రుడైన అశ్వత్థామకు ఆజ్ఞయిచ్చి తాను యుధిష్ఠిరునితో యుద్ధము చేసెను.

జనమేజయా! యిట్లు సంజయుడు ధృతరాష్ట్రునకు చెప్పి తర్వాత యుద్ధ వృత్తాంతమునిట్లు చెప్పదొడగెను.

## భీమసేనుని యద్భుత పరాక్రమము

రాజా! భగదత్త-కృప-శల్య-కృతకర్మ-వింద-అనువింద-సైంధవ-చిత్ర

సేన-వికర్ణ దుర్మర్షణాదులు పదుగురు మహారథిక వీరులు-నానాదేశజాతములైన సేనలతో యుద్ధమునందు భీష్ముని యశస్సు కోరుచు భీమసేనునిపై దాడిచేసిరి.

రాజా! శల్యుడు తొమ్మిది బాణములు, కృతవర్మ మూడు, కృపుడు తొమ్మిది, చిత్రసేన వికర్ణభగదత్తులు తలకు పది పది, సైంధవుడు విందానువింద వీరు లైదైదు దుర్మర్షణుడు ఇరువది నిశితశరములు భీమసేనునిపై ప్రయోగించి కొట్టిరి.

రాజా! అట్లు సర్వలోకవీరులైన ధార్తరాష్ట్రులు తనను విడివిడిగా కొట్టగా భీమసేనుడు అతిక్రుద్ధుడై శల్యుని ఏడుబాణములతో కృతవర్మను ఎనిమిదింటితో కొట్టి, కృపాచార్యుని ధనుస్సును ఛేదించి, ఏడు బాణములతో అతనిని కొట్టెను. విందానువిందులను మూడింటితో, దుర్మర్షణుని ఇరువది బాణములతో చిత్రసేనుని ఐదింటితో, వికర్ణుని ఏడింటితో, జయద్రథుని ఐదుబాణములతోనుకొట్టి హర్షముతో సింహనాదము చేసి మరల సైంధవుని మూడుశరములతో కొట్టెను.

రాజా! తరువాత రథిక వరుడైన కృపాచార్యుడు మరియొక ధనుస్సు తీసికొని సంరంభముతో భీముని పది బాణములతో అంకుశములతో ఏనుగును పొడిచినట్లు కొట్టెను. అప్పుడు భీముడు అతిక్రుద్ధుడై బిగ్గరగా సింహనాదముచేసి అనేక బాణములతో కృపాచార్యునికొట్టి ప్రళయకాలమువలె మూడు బాణములతో సైంధవుని రథాశ్వములను సారథిని సంహరించెను.

రాజా! తరువాత హతాశ్వమైన తన రథమునుండి యెగిరి దుమికి సైంధవుడు ధనుర్ధారియై భీముని నిశిత బాణములతో కొట్టెను. అప్పుడు భీముడు రెండు భల్లములచేత సైంధవుని ధనుస్సు ఖండించెను. అతడు ఛిన్నధన్వుడై, విరథుడై హతాశ్వుడై హతసారథియై దిక్కుతోచక త్వరగా చిత్రసేనుని రథముపైకి పోయెను. అప్పుడు భీమసేనుడు మహారథికులను వారించి, శరములతో కొట్టి అందరు చూచుచుండగా సైంధవుని విరథుని చేయుట వంటి అత్యద్భుత యుద్ధ కర్మను చేసెను.

రాజా! అప్పుడు భీమసేనుని పరాక్రమము సహింపక శల్యుడే పదునైన బాణములతో 'నిలునిలు' మని అనుచు భీముని కొట్టెను. అప్పుడు కృప కృతవర్మాదులైన తక్కిన వీరులు శల్యరక్షణార్థమై భీమసేనుని కొట్టిరి. అప్పుడు భీముడు వారినందరను ఐదైదు బాణములచేత తిరిగికొట్టెను.

రాజా! తరువాత భీముడు శల్యుని ఎనుబది బాణములతో కొట్టగా శల్యుడు పదునాలుగు బాణములచేత భీముని బాధించి అతని సారథియైన విశోకుని బాణములచేత శల్యుని బాహువులందు ఎదపై కొట్టి భగదత్తాదులైన యితరవీరులను మూడు మూడు బాణములతో కొట్టి సింహనాదము చేసెను.

రాజా! తరువాత ఆ వీరులందరు విడివిడిగా మూడుమూడు బాణములతో భీముని కీళ్ళయందు గాఢముగా కొట్టిరి. అట్లు దెబ్బలు తినినను భీమసేనుడు మేఘజలధారలచేత పర్వతము వలె ఏ మాత్రము వ్యథచెందక శల్యుని మూడు బాణములతో కృపుని తొమ్మిదింటితో, భగదత్తుని నూరుబాణములతో కొట్టి, కృతవర్మ ధనుస్సును ఛేదింపగా అతడు మరియొక ధనుస్సుతీసికొని బాణముతో భీమసేనుని కనుబొమల నడుమ కొట్టెను.

రాజా! అట్లు కొట్టబడిన భీముడు క్రుద్ధుడై శల్యునిపై తొమ్మిది భగదత్తునిపై మూడు, కృతవర్మపై నెనిమిది, కృపాచార్యాదులపై రెండురెండు బాణములు ప్రయోగించి కొట్టెను. వారందరు మరల నతనిని కొట్టి బాధించిరి. ఇట్లు భీముడు బాధితుడైనా ఏ మాత్రము చలింపక వారందరిని తృణ సమానులుగా తలచి వ్యథితుడు కాకుండెను. వారందరు కూడా మరల భీమునిపై నూర్లకొలది వేలకొలది బాణములను ప్రయోగించి కొట్టిరి.

రాజా! తరువాత భగదత్తుడు శక్తిని భీమునిపై విసిరెను. సైంధవుడుతో మరపట్టిశాయుధములను కృపుడు శతఘ్నిని (నాలుగుమూరల పొడవుగల ఇనుప ముండ్ల దండము) శల్యుడు ఒక బాణమును ఇతరులు ఐదైదు బాణములను భీమునిపై ప్రయోగించి కొట్టిరి.

రాజా! అప్పుడు భీముడు తోమరము (చిల్లకోలను) క్షురప్రము (అర్ధచంద్ర బాణము)చేత పట్టిశము (అడ్డకత్తి)ను మూడుబాణములచేతను, నువ్వుచెట్టుకాడను వలె ఛేదించెను. శతఘ్నిని తొమ్మిది శరములచేత శల్యుని బాణమును ఛేదించి భగదత్తుని శక్తినికూడా ఖండించెను. ఇతరులు ప్రయోగించిన బాణములుకూడా మూడు మూడు శరములచేత ఛేదించెను.

రాజా! యిట్లు భీమసేనుడొక్కడే ఏడుగురితో ఘోరముగా యుద్ధము చేయుచుండగా అర్జునుడు చూచి భీమునకు బాసటగా వచ్చెను. ఆ యిరువురు మహావీరులను మీవారు చూచి తమ విజయముపై ఆశవీడిరి.

రాజా! అట్లు మహారథికులతో పోరాడుచున్న భీమసేనునితో పాటు అర్జునుడు శిఖండిని ముందిడుకుని ఆ ఏడుగురితో యుద్ధముచేసి భీముని సంతోష పరచెను.

రాజా! తరువాత నీ పుత్రుడు దుర్యోధనుడు భీమార్జునులను వధించుట కొరకు సుశర్మను ప్రోత్సహించగా ఆ త్రిగర్తాధీశుడు వెంటనే అనేక సహస్ర రథ సైన్యములతో భీమార్జునులపై దాడిచేసెను. అప్పుడు అర్జునుడు శత్రువులతో ఘోరముగా యుద్ధము చేయ నారంభించెను.

జనమేజయా! యిట్లు సంజయుడు భీముని పరాక్రమమును గూర్చి ధృత రాష్ట్రునకు వర్ణించి చెప్పి మరల నతనితో తరువాతి యుద్ధవృత్తాంతమిట్లు చెప్ప దొడగెను.

## భీమార్జునుల యుద్ధ పరాక్రమము:

రాజా! అర్జునుడు యుద్ధమునందు తన నెదుర్కొనిన శల్యుని రాబందుల నెమళ్ళ రెక్కలు గల అనేక బాణములతో కప్పెను. అట్లే కృప సుశర్మలను మూడు మూడింటితో భగదత్త-సైంధవ-చిత్రసేన-వికర్ణ-కృతవర్మ-దుర్మర్షణ వింద అనువిందుల నొక్కొక్కరిని మూడుమూడు బాణములతో కొట్టి మీసేనను మిక్కిలి బాధించెను.

రాజా! చిత్రసేనుని రథమునందున్న సైంధవుడు భీమార్జునులపై బాణ ప్రయోగము చేసెను. శల్య కృపులు అర్జునుని కొట్టిరి. నీ పుత్రులు చిత్రసేనా దులు కూడా భీమార్జునులను ఒక్కొక్కరైదైదు బాణములతో కొట్టిరి.

రాజా! భీమార్జునులప్పుడు త్రిగర్తులను కొట్టగా, సుశర్మ అర్జునునిపై తొమ్మిది బాణములు ప్రయోగించి కొట్టి సింహనాదము చేసెను. ఇతర త్రిగర్త సైనిక వీరులుగూడా భీమార్జునులను కొట్టిరి

రాజా! భీమార్జునులు రథికులమధ్య చిత్ర విచిత్రగతులతో గోవులమందలో మాంసమును కోరుచు తిరుగుచున్న సింహమువలె క్రీడించుచు అనేక సైనికుల ధనుర్బాణములను శిరస్సులను ఛేదించి పడగొట్టిరి. ఆ యుద్ధమునందు భీమార్జున బాణహతములై శత సహస్ర సంఖ్యాకములైన చతురంగ సైన్యములు నేల కూలెను. అనేకులు వారిదెబ్బకు గడగడ వణికిరి.

చచ్చిన సేనలు నేలపై అంతటను వ్యాపించిపడియుండెను. ఛత్రచామర ధ్వజాదులు విరిగి పరవబడియుండెను. సైనికులయొక్క అనేక రత్నభూషణముల వస్త్రాదులచేత భూమి వ్యాప్తమైయుండెను. ఆ విధముగా బాణఘాతములచేత అనేకులను సంహరించిన భీమార్జునుల శౌర్యమత్యద్భుతముగ నుండెను.

రాజా! అప్పుడు దుర్యోధనుడు భీమార్జునుల పరాక్రమము చూచి భీష్ముని కడకు పోయెను. కృప-కృతవర్మ-సైంధవ-విందానువిందులు రణరంగమును విడువకుండిరి.

రాజా! తరువాత భీమార్జునులు ఘోరమైన కౌరవసేనను కొట్టి తరుము చుండిరి.

రాజా! అప్పుడు మీ రాజవీరులు నెమలి రెక్కల బాణజాలములతో అర్జునుని రథము గప్పిరి. వారి నందరిని అడ్డగించి అర్జునుడు సంహరించెను. శల్యుడు అర్జునుని యెదపై కొట్టగా నతని ధనుస్సును పార్థుడు ఖండించెను. అతని కాళ్ళను బాణములతో కొట్టెను.

రాజా! అప్పుడు శల్యుడు మరియొక ధనుస్సు తీసికొని మూడు బాణములతో అర్జునుని, ఐదింటితో కృష్ణుని, తొమ్మిదిబాణములతో భీమసేనుని బాహువులందు ఎదపైనను కొట్టెను.

రాజా! తరువాత ద్రోణాచార్యుడు జయత్సేనుడున్ను దుర్యోధనుని యాజ్ఞపై భీమార్జునులపై దాడిచేసిరి. మగధాధిపతియైన జయత్సేనుడు ఎనిమిది బాణములతో భీమునికొట్టగా నతడు పదునైదు బాణములతో జయత్సేనుని కొట్టి యతని సారథిని రథమునుండి పడగొట్టెను. సారథిలేని అశ్వములు భ్రాంతి చెంది యిటునటు పరుగెత్తగా జయత్సేనుడు రణరంగమునుండి తొలగిపోయెను.

రాజా! అంతలో ద్రోణుడు భీమునిపై అరువదియైదు బాణములు ప్రయోగించెను. అప్పుడు భీముడు పితృసముడైన గురుని మరల అరువదియైదింటితో కొట్టెను.

రాజా! అర్జునుడు సుశర్మపై అనేక బాణములు ప్రయోగించి అతని సైన్యమును కూడా సుడిగాలి మహామేఘములను వలె చెదరగొట్టెను.

రాజా! తరువాత భీష్ముడు కోసలరాజు బృహద్బలుడు ఈ ముగ్గురు మిక్కిలి క్రుద్ధులై భీమార్జునుల నెదిరించిరి. అప్పుడు పాండవులు దృష్టద్యుమ్నుడును భీష్ము నెదిరించిరి. అతడప్పుడు నోరుతెరుచుకున్న యమునివలె నుండెను. శిఖండి భీష్మపితామహునిపై నిర్భయముగా దాడిచేసెను.

రాజా! అప్పుడు యుధిష్ఠిరాది పాండవులు శిఖండిని ముందిడుకొని సైనికులందరితో భీష్ము నెదిరించిరి. అప్పుడు మీ వీరులందరు భీష్ముని ముందిడుకొని శిఖండి మొదలైనవారితో పార్థులతోను యుద్ధము చేసిరి.

రాజా! తరువాత భీష్ముని విజయము కోరుచున్న మీవారికి పాండవులతో భయంకరముగా యుద్ధము జరిగెను. మీవారికి యుద్ధద్యూతములో భీష్ముడు పందెముగా నుండెను. ఆ పందెమును ఒడ్డి జయాపజయముల కొరకు జూదము ఆడబడుచుండెను.

రాజేంద్రా! ధృష్టద్యుమ్నుడు రథికోత్తములతో భయపడక భీష్మునిపై దాడిచేయుడు అని చెప్పి వారిని ప్రోత్సహింపగా సేనాపతి యాజ్ఞమేరకు పాండవసేన ప్రాణములపై ఆశవీడి భీష్మునిపై దాడిచేసెను. భీష్ముడు ఆ సేనను మహాసాగరమును తీరమువలె అడ్డగించెను.

జనమేజయా! యిట్లు సంజయుడు యుద్ధము వర్ణించి చెప్పగా విని ధృతరాష్ట్రుడు సంజయునిట్లు ప్రశ్నించెను.

## భీష్మాజ్ఞచేత యుధిష్ఠిరుడు భీష్మునిపై ఆక్రమించుట: ఉభయసైనికుల తుముల యుద్ధము:

సంజయా! పదవనాడు భీష్ముడు పాండవ సృంజయులతో ఏ విధముగా యుద్ధము చేసెను? కౌరవులు పాండవుల నెట్లు నివారించిరి? యుద్ధశోభాకరుడైన భీష్ముని మహాయుద్ధమును గూర్చి విపులముగా నాకు వివరించి చెప్పుము.

## ప్రశ్నమునకు సంజయుడిట్లు ధృతరాష్ట్రునకు బదులుచెప్పెను:

రాజా! అర్జునుడు ప్రతిదినము క్రుద్ధుడైన మీ మహారథికులను సంహరించెను. భీష్ముడు కూడా తన ప్రతిజ్ఞమేరకు పాండవుల సేనను నశింపజేయు-

చుండెను. కౌరవులతో కూడి యుద్ధము చేయుచున్న భీష్ముని పాంచాలురతో కూడిన అర్జునుని చూచి ఆయా సమాగమము వలన పదవనాడు ఇరువురికికూడా విజయమునందు సంశయము కలిగెను.

రాజా! ఆనాడు సైన్యనాశకరమైన ఘోరయుద్ధము జరిగెను. ఆనాడు ఎందరో చచ్చిరి. వారి పేర్లు ఊర్లు గోత్రములు తెలియవు.

రాజా! యీ విధముగా పది దినములు భీష్ముడు మహాయుద్ధముచేసి పాండవ సైనికులను అసంఖ్యాకముగా సంహరించి మిక్కిలి పరితపించిన తరువాత ఆ మహాత్మునకు జీవితముపై నిర్వేదము కలిగెను.

రాజా! భీష్ముడు త్వరగా తన వధను కాంక్షించుచు ఇకపైన యుద్ధము నందు అభిముఖుడుగా నిలిచి అనేక మానవోత్తములను సంహరింపను అని నిశ్చయించి తన సమీపములోనున్న యుధిష్ఠిరునితో నిట్లనెను.

సర్వశాస్త్ర విశారదా! మహాప్రాజ్ఞా యుధిష్ఠిరా! ధర్మసమ్మతము స్వర్గ యోగ్యము నైన నా మాట వినుము. అనేక ప్రాణములను సంహరించుచు నా జీవితకాలమంతయు గడిపితిని. నా దేహము పైననే నాకిప్పుడు చాలా నిర్వేదము కలుగుచున్నది. కనుక నాయనా! నీవిపుడు పాంచాల సృంజయ సైన్యములతో అర్జునుని ముందిడుకొని నా ప్రీతిని నీవు కోరినయెడల నా వధకు ప్రయత్నము చేయుము.

ధృతరాష్ట్ర మహారాజా! యుధిష్ఠిరుడు భీష్ముని అభిప్రాయము తెలిసికొని సృంజయాది సేనలతో భీష్ముని ఎదిరించెను. యుధిష్ఠిర ధృష్టద్యుమ్నులు భీష్ముని మాటవిని తమ సేనలను ప్రోత్సహించుచు నిట్లనిరి.

'సైనిక వీరులారా! పరుగెత్తుడు! యుద్ధము చేయుడు! భీష్ముని జయింపుడు.

మిమ్మందరిని జయశీలుడైన అర్జునుడు రక్షింపగలడు. ఈ ధృష్టద్యుమ్న భీమసేనులు కూడా మీకు రక్షకులై యున్నారు. సృంజయ వీరులారా! నేడు భీష్మునివలన మీరిక భయపడవలసిన అవసరము లేదు. శిఖండిని ముందిడుకొని నేడు తప్పక భీష్ముని జయింపగలము. ఇది నిశ్చయము.'

ధృతరాష్ట్ర మహారాజా! పాండవులందరు అట్లు నిర్ణయించుకొని బ్రహ్మ

లోకము కాంక్షించుచున్నవారై అత్యంత క్రోధముతో శిఖండి అర్జునుని ముందిడుకొని భీష్ముని పడగొట్టుటకు పరమ ప్రయత్నము చేసిరి.

రాజా! తరువాత దుర్యోధనుని యాజ్ఞచేత ద్రోణాచార్యునితో పోరాడుచుండిరి. చేది పాంచాలురతో కలసి యర్జునుడు శిఖండిని ముందిడుకొని భీష్మునిపై దాడిచేసెను. సాత్యకి అశ్వత్థామను, ధృష్టకేతుడు పౌరవుని, అభిమన్యుడు అమాత్య సహితుడైన దుర్యోధనుని, విరాటుడు తన సైన్యముతో యుక్తుడైన వృద్ధక్షత్ర పుత్రుడైన సైంధవుని, యుధిష్ఠిరుడు సైన్యసహితుడైన శల్యుని ఎదుర్కొనగా అన్నివైపుల రక్షితుడైయున్న భీమసేనుడు గజసైన్యముపైకి ఉరికెను.

రాజా! ధృష్టద్యుమ్నుడు తన సోదరులతో ఎదిరించుటకు అడ్డగించుటకును అలవికానివాడు సర్వశస్త్రాస్త్ర కోవిదుడైన అశ్వత్థామనెదిరించెను. సింహధ్వజము గల బృహద్బలుడు కర్ణికార (కొండగోగు) ధ్వజముగల అభిమన్యునెదిరించెను.

రాజా! నీ పుత్రులు రాజవీరులంతకూడి అర్జున వధార్థమై అర్జున శిఖండులపైదాడిచేసిరి. ఉభయసేనల పరాక్రమము అతిమహాభయంకరము కాగా సేనలు పరుగెత్తుచుండగా భూమి కంపించెను. ఉభయసైన్యములు యుద్ధరంగమందు భీష్ముని చూచి పరస్పరము తలపడెను.

రాజా! తరువాత ఆ విధముగా ఒండొరులపై దాడిచేయుచు ఆ రెండు సేనల ధ్వని సర్వదిక్కులల మారుమ్రోగెను. ఏనుగుల ఘీంకారములు శంఖ దుందుభుల ఘోషము సైన్యముల సింహనాదములు కలిసి ఆ ధ్వని అతిభయంకరముగా నుండెను.

రాజా! ఆ రాజవీరులందరియొక్క భుజకీర్తి-కిరీటములు చంద్ర సూర్య సమాన ప్రభలు కాంతిరహితమాయెను. శస్త్రములనెడు విద్యుత్తులచేత ఆవృతములైన రజస్సనెడు మేఘములేర్పడెను ధనుష్టంకారధ్వనులు భయంకరములాయెను. బాణశంఖ భేరీరథముల మహాధ్వనులు ఉభయసేనలలో బయలుదేరెను. రెండింటి మధ్యాకాశము ప్రాస (ఈటె) ఋష్టి (రెండంచులకత్తి) శక్తి సంఘములచేత బాణసమూహములచేతను వ్యాకులమై ప్రకాశరహితమాయెను.

రాజా! రథికులు-అశ్వములును ఆ యుద్ధమునందు పరస్పరము కొట్టుకొని కూలబడెను. ఏనుగులేనుగులను పదాతిదళములు పదాతి సైన్యములను చంపిరి.

రాజా! అక్కడ కౌరవులకు పాండవులకు భీష్ముడు కారణముగా రెండు దేగలకు వలె మహా యుద్ధము జరిగెను ఆ రెండు సేనల ఘోరసమాగమము యుద్ధమునందు జయేచ్ఛతో పరస్పర వధార్థమై భయంకరముగా నుండెను.

జనమేజయా! యిట్లు సంజయుడు యుద్ధక్రమమును గూర్చి ధృతరాష్ట్రునకు చెప్పి యుద్ధవృత్తాంతమిట్లు చెప్పదొడగెను.

## ఉభయరథికుల ద్వంద్వ యుద్ధము-భీష్ముని పరాక్రమము

రాజా! పరాక్రమశాలియైన అభిమన్యుడు భీష్ముని కొరకు మహాసేనతోను దుర్యోధనుని ఎదిరించెను. అప్పుడు దుర్యోధనుడు యుద్ధమునందు అభిమన్యుని యెదపై పన్నెండు బాణములతోకొట్టెను. అప్పుడు అభిమన్యుడు మిక్కిలి క్రుద్ధుడై దుర్యోధనునిపై మృత్యుదేవత యొక్క స్వస (చెల్లెలు) వంటి ఘోరమైన శక్తిని విసరెను. దానిని దుర్యోధనుడు బాణముచేత రెండుగా ఖండింపడెను. అది యట్లు వ్యర్థమై పడుటచూచి యభిమన్యుడు దుర్యోధనుని బాహువులందు ఎదపైనను పదమూడు బాణములతో మరలకొట్టెను. ఘోరవిచిత్రమునైన ఆ యుద్ధము చూచువారికి కన్నులపండువుగాను, సమస్తరాజవీరులు ప్రశంసింపదగినదిగాను నుండెను. అభిమన్యుడు భీష్మునివధకొరకు విజయముకొరకున్ను దుర్యోధనునితో అంత ఘోరముగా పోరాడెను.

రాజా! బ్రాహ్మణపుంగవుడైన అశ్వత్థామ తనపై అతిత్వరగా దాడిచేసిన సాత్యకి పై క్రోధముతో బాణము ప్రయోగించి కొట్టెను. సాత్యకి కూడా తొమ్మిదిబాణములతో కురుపుత్రుల మర్మములందు కొట్టెను. అప్పుడు అశ్వత్థామ సాత్యకి బాహువులందు ఎదపైనను ముప్పదితొమ్మిది శరములతో కొట్టెను.

అప్పుడు సాత్యకి అశ్వత్థామపై మూడు బాణములను ప్రయోగించెను. రాజా! పౌరవుడు, ధృష్టకేతువును అనేక బాణములతో వేధించగా ధృష్టకేతువు కూడా పౌరవుని ముప్పది బాణములతో కొట్టెను.

రాజా! అప్పుడు పౌరవ ధృష్టకేతువు లిరువురున్ను పరస్పరము మహాశర వర్షము చేత కొట్టుకొని యొండొరుల ధనుస్సులను ఛేదించి అశ్వములను గూర్చి యిరువురు విరథులై ఖడ్గయుద్ధము చేయబూనిరి. వారు ఆ ఖడ్గయుద్ధములో

ఎద్దుచర్మముతో చేయబడి శతచంద్రులయొక్క శత నక్షత్రముల యొక్కయు చిత్రములు గల డాలులను నిగనిగ నల్లగా మెరయుచున్న కత్తులను తీసికొని పోరాడిరి.

రాజా! ఆ పౌరవ ధృష్టకేతువులు మహావనమునందు ఆడఏనుగు (ఆడసింహము) కొరకు ఘోరముగా పోరాడు సింహముల వలె మండలాకారముగా విచిత్రగతులతో వెనుకకు ముందుకుపోవుచు, ఒండొరులసామర్థ్యము ప్రదర్శించుకొనుటకు రము రమ్ము' అని పిలుచుచు ఖడ్గయుద్ధము చేసిరి.

రాజా! అప్పుడు పౌరవుడు ధృష్టకేతువు యొక్క నొసలిపై కత్తితో కొట్టెను. ధృష్టకేతువు కూడా క్రుద్ధుడై 'నిలునిలు' మనుచు పౌరవుని నిశితఖడ్గముతో భుజములయందు కొట్టెను. ఇట్లు వారిద్దరు పరస్పరము కొట్టుకొని నేలపై పడిపోయిరి. అప్పుడు పౌరవుని నీ పుత్రుడు జయత్సేనుడు తన రథముపై నెక్కించుకొని యుద్ధరంగమునుండి తొలిగించుకొని పోయెను. అట్లే ధృష్టకేతువును కూడ సహదేవుడు తన రథముపై తోడ్కొని పోయెను.

రాజా! నీ పుత్రుడు చిత్రసేనుడు సుశర్మను అరువది తొమ్మిది బాణములతో కొట్టగా సుశర్మ క్రుద్ధుడై చిత్రసేనుని ఇరువది శరములతో కొట్టెను. అప్పుడు చిత్రసేనుడు ముప్పది బాణములతో కొట్టగా, సతడున్ను నీ కొడుకును తిరిగి కొట్టెను.

రాజా! భీష్మునితో పోరాడుటయందు తన కీర్తి అభిమానము పెంపొందించుకొనుచు అభిమన్యుడు అర్జునుని కొరకు భీష్మునకు తన పరాక్రమము చూపుచు అతనిపై దాడిచేయబోవుచు రాజపుత్రుడైన బృహద్బలు నెదుర్కొని పోరాడెను. అప్పుడు కోసలేంద్రుడైన బృహద్బలుడు అభిమన్యుని ఇరువదియైదు బాణములతో కొట్టెను. అప్పుడు అభిమన్యుడు క్రుద్ధుడై కోసలేంద్రుని ఎనిమిది బాణములతో కొట్టగా అతడు కంపింపకుండుట చూచి యభిమన్యుడు మరల నిశిత బాణములతో అతనిని కొట్టి అతని ధనుస్సును ఛేదించి మరల ముప్పది శరములు బృహద్బలునిపై ప్రయోగించెను.

రాజా! అప్పుడు బృహద్బలుడు మరియొక ధనుస్సుతీసికొని అనేక శరములతో నభిమన్యుని కొట్టెను. ఆ యిరువురకు మధ్య యుద్ధము దేవాసురయుద్ధమునందు బలి ఇంద్రులకు వలె అతి సంరంభముతో చిత్రవిచిత్రముగా జరిగెను.

రాజా! భీమసేనుడు గజసైన్యమును ఇంద్రుడు పర్వతములను చీల్చునట్లు చెండాడుచు మిక్కిలి శోభిల్లెను. అట్లు భీమసేనుని చేత వధింపబడుచున్న పర్వతములవంటి గజములు ఘీంకారములతో భూమిని ధ్వనింపజేయుచు అంజనపర్వతము ఛేదింపబడి ఖండఖండములుగా పడినట్లు భూమిపైనంతటను పడియుండెను... ,

రాజా! యుధిష్ఠిరుడు శల్యుని అతని సేనను యుద్ధమునందు పీడించెను. శల్యుడు కూడా భీష్మరక్షణార్థమై యుధిష్ఠిరుని పైన అనేక బాణములు ప్రయోగించి పీడించెను.

రాజా! సైంధవుడు విరాటునిపై మువ్వది బాణములు ప్రయోగింపగా విరాటుడు కూడా అన్ని శరములతోనే సైంధవుని యెదపై కొట్టెను. ఆ యిరువురు విచిత్ర ధనుః ఖడ్గములతో, విచిత్ర కవచ శస్త్ర ధ్వజములతో విచిత్ర రూపులై విరాజిల్లిరి.

రాజా! ద్రోణాచార్యుడు ధృష్టద్యుమ్ను నెదుర్కొని యతనిపై అనేక బాణములను ప్రయోగించి యతని ధనుస్సు ఖండించి అతనిని ఏబది బాణములతో కొట్టెను. ధృష్టద్యుమ్నుడు మరియొక ధనుస్సు తీసికొని ద్రోణునిపైన అనేక నిశితశరములను ప్రయోగించెను. ఆ అన్నింటిని ద్రోణుడు ఛేదించి యైదు బాణములను అతనిపై విడిచెను. అప్పుడు ధృష్టద్యుమ్నుడు ద్రోణునిపై గదను విసిరెను. యమదండము వంటి ఆ గద తనపై పడుచుండగా ద్రోణుడు ఏబది బాణములతో దాని ఛేదించగా అది చూర్ణమై నేలపై పడెను.

రాజా! అట్లు తన గద పడుట చూచి పార్షతుడు ఆచార్యునిపై బాణవర్షము కురిసి యతనిని పీడించెను. ఈవిధముగా ద్రోణధృష్టద్యుమ్నులకు మహాఘోర యుద్ధము జరిగెను.

రాజా! అతిఘోర భయానక రూపుడైన భీష్మునిపై అర్జునుడు దాడిచేసి యతని ననేక శరములతో పీడించి వనమునందు మదగజము నెదిరించినట్లు అతనిపై బడెను.

రాజా! అపుడు అర్జునుని భగదత్తుడు మూడు దళములతో నెదిరించెను. అట్లు ఐరావతమువంటి గజముపై వచ్చుచున్న ప్రాగ్జ్యోతిషపతి నెదిరించి అర్జునుడు కొట్టెను. తరువాత గజారూఢుడైన భగదత్తుడు శరవర్షములతో అతనిని నివారించెను. తరువాత అర్జునుడు తన శరవర్షములతో అతనిని నివారించెను. తరువాత అర్జునుడు తనపై వచ్చుచున్న భగదత్త గజమును బాణములతో కొట్టి పీడించెను.

రాజా! తరువాత అర్జునుడు శిఖండిని 'రమ్ము రమ్ము' అనిపిలిచి భీష్ముని సంహరింపుమని భీష్ముని పైకి తోలెను.

రాజా! తరువాత ప్రాగ్జ్యోతిషాధీశుడు అర్జునుని విడిచి ద్రుపదుని రథము వైపు పోయెను.

మహారాజా! తరువాత అర్జునుడు శిఖండిని ముందిడుకునిపోయి భీష్మునిపై దాడి చేసెను. అప్పుడు వారిద్దరికి భయంకరముగా యుద్ధము జరిగెను.

రాజా! తరువాత మీ శూరవీరులు అరచుచు యుద్ధరభసుడైన అర్జునునిపై అత్యద్భుతముగ బాణప్రయోగము చేసిరి. అప్పుడనేక విధములైన మీ సైన్యమును అర్జునుడు ఆకాశమునందు వాయువు మేఘములవలె అణచి చెదరగొట్టెను.

రాజా! అప్పుడు శిఖండి భీష్మ పితామహునిపై దాడి చేసి అనేక బాణములను ప్రయోగించెను. అప్పుడు భీష్ముడు రథమనెడు అగ్నిగృహమునందు, ధనుస్సు అనెడి జ్వాలలతో ఖడ్గ-శక్తి-గదలనెడు ఇంధనములతో శరసంఘముల నెడు మహాజ్వాలలతో ప్రజ్వరిల్లుచున్న అగ్నివలె నుండెను. వాయుసహాయముతో మండుచున్న అగ్ని గడ్డివాములలో చరించునట్లు సంచరించుచు దివ్యాస్త్రములను ప్రయోగించి క్షత్రియులను వధించుచుండెను.

రాజా! తరువాత భీష్ముడు అర్జునుని అనుసరించి వచ్చుచున్న సైనికులను సంహరించెను. అర్జునుని సైన్యముపై అనేక బాణములను ప్రయోగించి నివారించెను. అతడు సమస్తదిక్కులలో మారుమ్రోగించుచు రథికులను అశ్వికులను కొనలులేని తాటిచెట్లను వలె పడగొట్టెను. మహావీరోత్తముడై భీష్ముడు అప్పుడు రథ-గజాశ్వములను నిర్మానుష్యములనుగా చేసెను.

రాజా! పిడుగుచప్పుడువంటి భీష్ముని ధనుష్టంకారము విని సైనికులందరు అంతటను గగ్గోలు పడి కంపించిరి. అమోఘములైన భీష్మబాణములు సైనికుల శరీరములను గ్రుచ్చి క్రిందపడుచుండెను.

రాజా! నిర్మానుష్యములైన రథములను వానికి పూన్చబడిన వాయువేగము గల అశ్వములు ఈడ్చుకొనిపోవుచు కనబడెను.

రాజా! చేది-కాశీ-కరూష సైనికులు వేలకొలదులు మరణించిరి. అట్లే

భీష్ముడు ఆదేశముల కులపుత్రులైన సుప్రసిద్ధ రథికులు నలుగురిని కూడా సంహరించెను. అట్లువారు చతురంగ సేనలతోపాటు, తెరచిన నోరుగల యముని వంటి భీష్ముని వాతబడి పరలోకము చేరిరి.

రాజా! ఆ యుద్ధమునందు భీష్మునెదుర్కొనిన ఒక్కనికి కూడా జీవితము నందు ఆశలేకుండెను. జనులప్పుడు భీష్ముని పరాక్రమము చూచి వీరసైనికు లందరు యమరాజపురమునకు పోయినవారిగా తలచిరి.

రాజా! అక్కడ భీష్మునెదిరించగలవాడు అర్జునుడు, శిఖండి ధృష్టద్యుమ్నుడు తప్ప మరియొకడు కూడా లేకుండెను.

జనమేజయా! యిట్లు యుద్ధవృత్తాంతము సంజయుడు ధృతరాష్ట్రునకు చెప్పి తరువాతి యుద్ధమును గూర్చి యిట్లు చెప్పదొడగెను.

## ఉభయపక్ష సైనికుల యుద్ధము; దుశ్శాసనుని పరాక్రమము

రాజా! శిఖండి యుద్ధమునందు పురుషశ్రేష్ఠుడైన భీష్మునిపై దాడిచేసి అతని యెదపై పదినిశిత భల్లములతో కొట్టగా భీష్ముడతనిని కోపోద్రిక్తమైన దృష్టితో దహించుచున్నట్లు చూచి అతని స్త్రీ పూర్వత్వమును స్మరించి అతనిని కొట్టలేదు ఆ విషయమును శిఖండిగ్రహించలేదు. అప్పుడు అర్జునుడు శిఖండితో ఇట్లనెను.

వీరవరా! భీష్మపితామహు నెదుర్కొని నీవేమాత్రము వెనుకముందు ఆలోచింపక త్వరగా ఈ మహారథికుని వధింపుము. యుధిష్ఠిరు సైన్యములలో భీష్ముని యుద్ధములో నెదిరించి పోరాడగలవాడు నీవుతప్ప మరియొకడులేడు. ఇది నీకు స్పష్టముగా చెప్పుచున్నాను.

ధృతరాష్ట్ర మహారాజా! ఇట్లు అర్జునుడు చెప్పగానే శిఖండి అనేక విధ శరములను భీష్మునిపై వర్షింపగా, పితామహుడే బాణపు దెబ్బలను లెక్కచేయక అర్జునునిపై బాణప్రయోగముచేసి అనేక పాండవసైన్యములను సంహరించెను. అట్లే పాండవులుకూడా సేనలతో భీష్మునిపై అనేక బాణ వర్షములుకురిసి మేఘముల వలె అతనిని కప్పిరి. భీష్ముడట్లు అందరు తనను చుట్టుముట్టగా, అందరిని కూడా యుద్ధమునందు, వనమునందు కార్చిచ్చువలె దహించివైచెను.

రాజా! అప్పుడు నీపుత్రుడు దుశ్శాసనుని యద్భుత కృత్యముచూచితిమి. అతడు అద్భుత పౌరుషముతో, పితామహుని రక్షించుచు, అర్జునునితో పోరాడెను. మహా ధనుష్కుడైన దుశ్శాసనుడు అప్పుడు యుద్ధమునందు చూపిన కౌశలమును అందరు ప్రశంసించిరి. ఎందుకనగా, అతడొక్కడే పంచపాండవులను రణములో నెదిరించి యుద్ధముచేసెను. అట్లు విజృంభించుచున్న దుశ్శాసనుని పాండవులు నివారింపజాలక పోయిరి.

రాజా! అప్పుడు దుశ్శాసనుడు రథికులను విరథులనుచేసెను. గజాశ్వారోహకులైన వీరులు అతని శరముల దెబ్బలచేత తూలి క్రిందపడిరి. గజములు దిక్కులకు పారిపోయెను. ఇంధనములువేయుగా ప్రజ్వలించు అగ్నివలె దుశ్శాసనుడు బాణములువేసి పాండవసేనను దహించెను. భారత శ్రేష్ఠుడైన దుశ్శాసనుని పాండవసేనలో, అర్జునుడుతప్ప, ఇతరు డెవడునుకూడా, ఎదిరించుటకుకాని, జయించుటకుగాని ముందుకు రాజాలకుండెను.

రాజా! అంత మహాఘోరముగా యుద్ధముచేయుచున్న దుశ్శాసనుని అప్పుడు అర్జునుడు ఎదిరించి, జయించెను.

రాజా! తరువాత అర్జునుడు భీష్మునిపై దాడిచేసెను. అప్పుడు ఓడిపోయిన దుశ్శాసనుడు మాటిమాటికి అర్జునునితో పోరాడెను. అర్జునుడు అతనితో యుద్ధము చేయుచు మిక్కిలి విరాజిల్లెను.

రాజా! శిఖండి, యుద్ధమునందు, పిడుగులవంటి. సర్పములవంటి బాణములతో భీష్మునిగొట్టెను. ఆ బాణములను భీష్ముడు, ఉష్ణముచేత ఆర్తిచెందినవాడు. శీతల జలధారలనువలె, నవ్వుచు గ్రహించెను. అట్లు ఘోరరూపుడై పాండవ సేనలను దహించుచున్న భీష్ముని క్షత్రియవీరులు విస్మయముతో చూచుచుండిరి.

రాజా! తరువాత దుశ్శాసనుడు తమ సైన్యములతో నిట్లనెను! సైనిక వీరులారా! యుద్ధమునందు అర్జునుని అందరు అన్నివైపుల చుట్టుముట్టి యుద్ధము చేయుడు. ధర్మాత్ముడైన భీష్ముడు మిమ్మందరను కాపాడగలడు. కనుక మీరు ఏమాత్రము భయపడక, పాండవుల నెదిరించి పోరాడుడు. బంగారు తాటిచెట్టు ధ్వజముగల భీష్ముడు మిమ్ము రక్షించుచు నిలిచియున్నాడు. ఆయనయే. సమస్త ధార్తరాష్ట్రులకు సుఖముకల్గించి వారికి కవచమువలె రక్షకుడై నిలిచియున్నాడు.

దేవతలు యుద్ధసన్నద్ధులై వచ్చినను, భీష్ముని జయింపజాలరనగా ఆయనముందు మానవులైన పాండవుల శౌర్యమెంత? కనుక భయపడి అర్జునునెదిరింపక పారి పోవకుడు. మీరాజ వీరులందరితో నేనిప్పుడు పూనుకొని అర్జునునితో యుద్ధము చేసెదను.

ధృతరాష్ట్రమహారాజా! అట్లు దుశ్శాసనుడుచెప్పిన మాటలువిని మీ యోధ వరులైన విదేహ-కళింగ-దాసేకర-నిషధ-సీవర-బాహ్లీక-దరద-పశ్చిమ మాళవ-ఉత్తర మాళవ-అభీషాహ-శూరసేన-శిబి-వసాతి, శాల్వ-శక-త్రిగర్త-అంబష్ఠ-కేకయ" సైనికులందరు సంరంభములో శలభములవలె బిలబిలమని బయలుదేరి అర్జునాగ్నిపై దాడిచేసిరి.

మహారాజా! ఆ రాజవీరులందరను వారి సైన్యములతోకూడా అర్జునుడు దివ్యాస్త్రములతోగొట్టి తన ప్రతాపాగ్నిలో శలభములను వలె వారిని దహించెను. వేలకొలది బాణములను ప్రయోగించుచు అర్జునుని గాండీవము ఆకాశమునందు దీపించుచు కనబడెను.

రాజా! ఆ సైనిక వీరులందరు అర్జునశరార్తులై అతనియెదుట నిలువజాలక, ధ్వజములతో, రథములతోను నేలకూలిరి. ఆశ్వికులు అశ్వములతో గజారోహకులు గజములతోను అర్జున బాణ పీడితులై పడిపోయిరి.

రాజా! తరువాత అర్జున విసృష్టశరములచే, అతడు వధించిన సైనికులచేతను రణభూమియంతయు ఆవరింపబడెను. అనేకులు పారిపోయిరి.

రాజా! అర్జునుడట్లు ఆ సేనలనువధించి కొందరిని పారద్రోలి, దుశ్శాసనుని పైన అనేక నిశితశరములు ప్రయోగించెను. ఆ బాణములు దుశ్శాసనుని భేదించి భూమిలో, వల్మీకములో సర్పములవలె దూరెను. దుశ్శాసనుని అశ్వములను-సారథిని కూల్చెను.

రాజా! తరువాత అర్జునుడు వివింశతిని వింశతిబాణములతోకొట్టి విరథుని చేసెను. కృపాచార్యుని, వికర్ణుని, శల్యుని అనేక బాణములతో నొప్పించి వారిని గూడ విరథులను చేసెను.

రాజా! యిట్లు అర్జునునిచేత వివశులైన కృప-శల్య-దుశ్శాసన-వివింశతి-వికర్ణులు అర్జునునకు ఓడి రణరంగము వీడి పారిపోయిరి.

రాజా! అర్జునుడు ఆనాడు పూర్వాహ్ణమునందు మహారథికులను జయించి ధూమరహితాగ్నివలె జ్వలించుచుండెను.

రాజా! ఆవిధముగనే అర్జునుడు సూర్యుడు కిరణములవలె శరవర్షముగురిసి యితర రాజవీరులనుగూడ తపింపజేసి పారద్రోలి, కౌరవ పాండవ సేనలమధ్య భాగమందు రక్తనదిని ప్రవహింప జేసెను.

రాజా! గజాశ్వరథ పదాతియోధులు పరస్పరము కొట్టుకొనగా వారిశరీరములు శిరస్సులు సర్వదిక్కులందు పడిపోయెను.

రాజా! భుజకీర్తి కుండలాది భూషణధారులైన మహారథిక రాజపుత్రులు పడిపోయి పడగొట్టబడి, రణభూమిని ఆచ్ఛాదించిరి అట్లే రథచక్ర ఖండితములై గజములచేత నలగగొట్టబడిన రాజపుత్ర శరీరములుగూడ భూమిపై వ్యాపించి యుండెను.

రాజా! పదాతిసైన్యములు-ఆశ్వికులు-గజారోహకులు-రథికులున్న తమ తమ వాహనములతోచచ్చి అంతట పడియుండిరి. వాని రక్తముచేత తడుపబడిన రణరంగము శరత్కాలమునందలి యెఱ్ఱని ఆకాశమువలె విరాజిల్లెను.

రాజా! కుక్కలు-కాకులు-గ్రద్దలు-తోడేళ్ళు-నక్కలు వీనికి పరిపూర్ణ భోజనము అక్కడ లభించుటచేత అవి సంతోషముతో అరచెను. మృగ-పక్షులు వికారముగా అరచెను. సర్వదిక్కులందు వివిధ వాయువులు వీచెను. ఈ దుర్నిమిత్తములు రాక్షసులు భూతములు అరచుచు కనబడుచున్నందువలన గలిగెను.

రాజా! పడియున్న సైనికవీరుల బంగరు హారములు, విలువగల పతాకలు వాయువుచేత చలించుచు కనబడెను. శ్వేతచ్ఛత్రము-ధ్వజసహిత రథములున్న నూర్లకొలది వేలకొలదిగ పడి అంతట కనబడెను. పతాకలతో గజములు, శరీర పీడితములై, దిక్కులు పట్టి పారిపోయెను.

రాజా! ధనుస్-శక్తి-గదాధారులైన క్షత్రియులు యుద్ధభూమి యందంతటను పడిపోయి కనబడుచుండిరి.

(నూటపదుయేడవ అధ్యాయము)

## అర్జునుడు భీష్ముని మూర్ఛిల్లజేయుట:-

రాజా! తరువాత భీష్ముడు దివ్యాస్త్రము ప్రయోగించుటకు అర్జునునిపైకి ఉరికెను. అట్లు వచ్చుచున్న భీష్ముని, కవచధారియైన శిఖండి అడ్డగించెను. కాని తరువాత భీష్ముడు అగ్నివంటి ఆ యస్త్రమును శిఖండినిచూచి ఉపసంహరించు కొనెను.

రాజా! ఆ యవకాశమును పురస్కరించుకొని యర్జునుడు త్వరగా బాణ ప్రయోగముచేసి భీష్మ పితామహుని మూర్ఛిల్లజేసి నీ సేనలను చంపెను.

జనమేజయా! యిట్లు యుద్ధవృత్తాంతము సంజయుడు ధృతరాష్ట్రునకు చెప్పి తరువాతి యుద్ధక్రమమిట్లు చెప్పదొడగెను.

నూట పదునెనిమిదవ అధ్యాయము

## భీష్ముడు అద్భుత పరాక్రమముతో పాండవసేనను సంహరించుట:

రాజా! అనేక సేనలు వ్యూహరచనలు చేసియుండగా, అందరు బ్రహ్మ లోక ప్రాప్తి కోరువారై పరస్పరము తలపడిరి. ఆ సంకుల సమరమందు సేన-సేనతో, రథికులు రథికులతో, పదాతిదళములు పదాతిసేనలతో, అశ్వికు లాశ్వికులతో, గజసైనికులు గజారోహకులతోను పోరాడక, ఉన్మత్తులవలె వివేచనము లేకుండ, వ్యతిక్రమముగా తలపడి పోరాడజొచ్చిరి. ఆ రెండుసేనలలో గొప్పగా క్షోభము కలిగెను. ఇట్లు సేనలకు భయంకరనాశము కలిగెను.

రాజా! తరువాత శల్య-కృప-చిత్రసేన-దుశ్శాసన-వికర్ణులు రథారూఢులై పాండవసేనపై దాడిచేసి దానిని కంపింపజేసిరి. అప్పుడు పాండవసేన వారిచేత వధింపబడుచు, జలమునందు వాయువుచేత తిరుగుచున్న నౌకవలె దిక్కుతోచక గిరగిర తిరగజొచ్చెను. శిశిరఋతువునందు మంచుచేత గోవులమర్మములను ఛేదింప బడినట్లు భీష్ముని దెబ్బచేత పాండవుల మర్మములు ఛేదింపబడుచుండెను.

రాజా! ఆవిధముగానే అర్జునుడు, నూతన మేఘములవంటి మీ గజములను

కూల్చుచుండెను. అర్జునునిచేత మర్దింపబడుచు బాణఘాతములచేత పీడింపబడుచు మావటివాండ్రతోగూడ గజయూథపతులు ఘోరముగా ఆర్తధ్వని చేయుచు నేల కూలిరి. అతనిచేత చంపబడి వీరాగ్రేసరుల భూషణ సహితదేహములచేత కుండల యుక్త శిరస్సుల చేతనున్ను అంతట వ్యాపించిన రణరంగము విరాజిల్లుచుండెను.

రాజా! భీష్మార్జునులు పరాక్రమింపగా, మహావీరవరుల నాశకరమైన ఆ యుద్ధమునందు భీష్మపితామహుని పరాక్రమముచూచి, నీ పుత్రులందరు సైన్య సమేతులై, యుద్ధమునందు మరణించి స్వర్గమును చూరగొనగోరి పాండవుల నెదుర్కొనిరి.

రాజా! అప్పుడు పాండవులుగూడ, నీవు నీ పుత్రులున్ను పూర్వము వారికి కలిగించిన అనేకవిధ క్లేశములను తలచుకొనుచు, భయమువీడి బ్రహ్మలోక ప్రాప్తి యందాసక్తి గలవారై మీ సేనలతో వీరులతో, నీ పుత్రులతోను మిక్కిలి హర్షముతో యుద్ధము చేయుచుండిరి.

రాజా! అప్పుడు పాండవ సేనాపతియైన ధృష్టద్యుమ్నుని యాజ్ఞచే సోమక సృంజయాది సైనికవీరులందరు భీష్మునిపైదాడిచేసి శరవర్షముతో సతనినికొట్టగా భీష్ముడు మిక్కిలి క్రుద్ధుడై సృంజయులతో యుద్ధముచేసెను.

రాజా! కీర్తిమంతుడైన భీష్మునకు పూర్వము పరశురాముడు శత్రుసేనా వినాశకరమైన అస్త్రవిద్యను నేర్పియుండెనుగదా! ఆ విద్యా బలప్రయోగముచేసి భీష్ముడు శత్రుసైన్య నాశమును, దినమునకు పదివేల సేనలచొప్పున చేసెను.

రాజా! ఆ దశమదినమందు వృద్ధుడైన కురుపితామహు డొక్కడే అసంఖ్యాక ములైన పాంచాల-మాత్స్య గజాశ్వసైన్యములను, ఏడుగురు మహారథికులను, ఆరువేల రథికులను, పదునాలుగువేల పదాతిదళములను, పదివేల గజములను, పదివేల అశ్వములను సంహరించెను.

రాజా! సమస్త రాజవీరుల సేనలను భీష్ముడు నశింపజేసి, విరాటరాజు యొక్క ప్రియసోదరుడైన శతానీకుని నేలగూల్చి, అనేక సహస్ర రాజవీరులను గూడ భల్లములతో సంహరించెను. మృతశేషులై పీడితులైన కొందరు యోధులు ఏడ్చుచు అర్జునుని కడకుపోయి మొరపెట్టుకొనిరి. మరికొందరు భీష్ము నెదిరించి యమపురి జేరిరి.

రాజా! ఇంద్రుడు రాక్షససేనసువలె భీష్ముడు పాండవసేనను తపింపజేసి పార్థ్రదోలి ధనుర్ధారియై ఉభయ సేనల నడుమ గ్రీష్మకాల మధ్యందిన మార్తాండుని వలె నిలిచియుండగా ఆయనను రాజులెవరున్ను కన్నెత్తియైన చూడజాలకుండిరి.

రాజా! అవిధముగా పరాక్రమించుచున్న భీష్ముని జూచి మధుసూదనుడు అర్జునునకు ప్రీతి గొలుపుచు నతనితో నిట్లనెను:-

అర్జునా! ఇప్పుడీ భీష్ముడు రెండు సేనలనడుమ నిలిచియున్నాడు. ఇతనికి సేన దూరముగానున్నది. కనుక ఇప్పుడే యితనిని పొదిలి సంహరించి విజయము సాధింపుము. నీవుదప్ప ఇతరుడితని బాణముల ధాటిని సహింపజాలడు.

ధృతరాష్ట్రమహారాజా! అవిధముగా శ్రీకృష్ణునిచేత ప్రోత్సహింపబడి కపిధ్వజుడైన యర్జునుడు, శరజాలముచేత భీష్ముని అతని రథాశ్వధ్వజములను ఆచ్ఛాదించెను.

రాజా! అప్పుడు కురువృషభుడైన భీష్ముడు అర్జున ప్రయుక్త బాణములను, తన శరములచేత చెదరగొట్టి అర్జునుని మరల పిడుగులవంటి బాణములతో గొట్టెను.

రాజా! తరువాత ద్రుపద-ధృష్టకేతు - భీమసేన - ధృష్టద్యుమ్న-నకుల-సహదేవ - చేకితాన-పంచకేకయ సోదర-సాత్యకి - ఘటోత్కచ-పంచద్రౌపదీ పుత్ర-కుంతిభోజ-సుశర్మ-విరాట - శిఖండి-అభిమన్యు ప్రభృతులైన పాండవ వీరులు ఇతరులనేక రాజవీరులున్ను భీష్ముని బాణములచేత పీడితులై, శోకసాగరములో మునిగియుండగా నర్జునుడు భీష్ముని గొట్టి వారినుద్ధరించెను.

రాజా! తరువాత శిఖండి అర్జునుని చేత రక్షింపబడుచు పరమాయుధమును ధరించి భీష్మునిపై వేగముగా ముట్టడి చేసెను. తరువాత అర్జునుడు భీష్మానుచరులనందరిని సంహరించి భీష్మునిపైననే దాడిచేసెను.

రాజా! తరువాత సాత్యకి-చేకితాన-ధృష్టద్యుమ్న-విరాట-ద్రుపద-నకుల సహదేవాదులు గూడ అర్జునరక్షితులై అభిమన్యు-ద్రౌపదీ పుత్రులతో పాటు భీష్ముని పైకే ఉరికి నిశితశరములచేత భీష్ముని కొట్టిరి.

రాజా! అప్పుడు భీష్ముడు శత్రుబాణములను చెదరగొట్టి యేమాత్రము

దైన్యము చెందక పాండవసేనలో దూరి క్రీడించుచున్నవానివలె, బాణములచేత సైన్యమును హతమార్చుచు ద్రుపద సైన్యములో ఏడుగురు మహారథికులను సంహరించెను. కాని శిఖండిని మాత్రము ఊరక చూచి నవ్వి అతని స్త్రీ పూర్వత్వమును దృష్టిలో నుంచుకొని యతనిపై బాణప్రయోగము చేయలేదు.

రాజా! భీష్మునిపై దాడిచేసిన మాత్స్య-పాంచాల-చేది సైన్యములలో కిలకిల శబ్దము కలిగెను. వారు చతురంగ సైన్యములతో గలిసి భీష్మునొకనినే సూర్యుని మేఘములు వలె బాణములతో గప్పిరి. అయినను భీష్ముడు బాధ చెందక శత్రువులను యుద్ధములో తపింపజేయుచుండెను.

రాజా! అప్పుడు అతనికి వారికి దేవాసురులకు వలె యుద్ధము జరుగుచుండగా అర్జునుడు శిఖండిని ముందిడుకొని భీష్మునిపై దాడి చేసెను.

జనమేజయా! యిట్లు సంజయుడు భీష్మ పరాక్రమము గూర్చి ధృతరాష్ట్రునకు వర్ణించి చెప్పి తరువాతి యుద్ధవృత్తాంతమిట్లు చెప్ప దొడగెను.

నూట పందొమ్మిదవ అధ్యాయము

## కౌరవ రక్షితుడైన భీష్ముని అర్జునుడు పడగొట్టుట

రాజా! యీ విధముగా పాండవులందరు శిఖండిని ముందిడుకొని భీష్ముని చుట్టుముట్టి కొట్టిరి. శతఘ్ని-పరిఘ (గడియమ్రాను) పరశ్వథ (గండ్రగొడ్డలి) ముద్గర (ఇనుపగుదియ) ముసల (రోకలి) ప్రాస-క్షేపణీయ (విసిరి వేయదగిన గద) ప్రభృతి శస్త్రములచేత అనేకవిధ బాణములచేతను-వత్సదంతముల (ఒక విధమైన బాణములు) చేతను, భుశుండి (అగ్ని ఆయుధము) మొదలైన వివిధాయుధములచేతను సృంజయులందరు భీష్ముని అన్నివైపుల కొట్టిరి. ఈ విధముగా భీష్ముడు కవచము ఛేదింపబడి అనేకులచేత పీడింపబడినను తన మర్మములు భేదిల్లినను కొంచెముగా గూడా వ్యథ చెందలేదు.

రాజా! దీపించిన ధనుర్బాణాగ్ని శస్త్రవాయువులచేత పెంపొందింపబడి రథచక్రధ్వనుల సంతానము గలదైన మహాస్త్రవహ్ని, విచిత్రధనుస్సు అనెడు మహాజ్వాల గలదై సైనిక వీరులనెడు ఇంధనములను కాల్చుచున్న భీష్మప్రతాపాగ్ని ప్రళయకాలాగ్ని వలె పాండవసేనలకు తోచెను.

అప్పుడు భీష్ముడు రథ సంఘముల మధ్యనుండి దాటిపోయి రాజవీరుల మధ్య సంచరించుచునుండెను. తరువాత ద్రుపద ధృష్టకేతులను లెక్క-చేయక వారిని తప్పించుకొని పాండవసేనా మధ్యమున చేరెను.

రాజా! తరువాత భీష్ముడు సాత్యకి-భీమసేన-అర్జున-ద్రుపద-విరాట-ధృష్టద్యుమ్నుల నారుగురిని మర్మములను ఛేదించు భయంకర బాణములచేత కొట్టెను. అప్పుడా యార్గురు మహారథికులు భీష్మ ప్రయుక్త నిశితశరములను నివారించి ఒక్కొక్కరు పదిబాణముల చొప్పున ప్రయోగించి భీష్ముని ఏ మాత్రము బాధించలేదు.

రాజా! తరువాత అర్జునుడు శిఖండిని పురస్కరించుకొని సంరంభముతో భీష్మునెదిరించి యతని ధనుస్సు ఛేదించెను. భీష్మధనుశ్ఛేదములను కౌరవ మహారథికులు ద్రోణ-కృతవర్మ-సైంధవ-భూరిశ్రవస్-శల-శల్య-భగదత్తు లేడుగురున్ను సహింపక మిక్కలి క్రుద్ధులై యర్జునునిపై దాడిచేసి దివ్యశస్త్రములచేత అర్జునుని కప్పిరి.

రాజా! మీ రథికవరులు అర్జునునిపైబడి వచ్చుచున్న ధ్వని ప్రళయకాల సముద్రునివలె భయంకరముగా వినబడెను. చంపుచున్న వారి యొద్దకు పొండు పట్టుకొనుడు-కొట్టుడు-ఛేదింపుడు ఇత్యాది తుముల శబ్దము రోమాంచకరముగానుండెను.

రాజా! అర్జునుని చేత రక్షింపబడుచున్న శిఖండి పది బాణాలతో భిన్న ధనుష్కుడైన భీష్ముని కొట్టెను. భీష్ముని సారథిని పదిబాణములచేత కొట్టి ధ్వజమునొక్క బాణము చేత ఛేదించెను.

రాజా! తరువాత భీష్ముడు మరియొక ధనుస్సు తీసికొని నిశితశరములు ప్రయోగించి యర్జునుని కొట్టెను. ఆ ధనుస్సును గూడ మూడు శరములచేత అర్జునుడు ఛేదించెను. ఈ విధముగానే యర్జునుడు భీష్ముడు తీసుకొనిన ధనుస్సులను మాటిమాటికి ఛేదించుచు వచ్చెను. అప్పుడు భిన్నధన్వుడైన భీష్ముడు అతిక్రోధముతో పెదవుల కొనలు నాకుచు ధనుస్సు ఛేదింపబడుట చేత పర్వతములు గూడ చీల్చగల శక్తిని అర్జునుని రథముపై విసిరెను మండుచున్న పిడుగువలె వచ్చుచున్న శక్తిని చూచి పార్థుడు పదునైన బాణములతో దానిని

ఐదు ముక్కలుగా ఛేదించెను. అప్పుడాశక్తి మేఘబృందమునుండి జారిపడిన పిడుగువలె క్రిందబడెను.

రాజా! అట్లు ఛేదింపబడిన శక్తిని చూచి భీష్ముడు క్రోధముతో రణరంగమునందిట్లు చింతించెను.

'నేనొక్క ధనుస్సు సహాయముతో పాండవుల నందరినీ సంహరింపగలను కాని వారికి సర్వలోకవిజేతయైన శ్రీకృష్ణుడు సంరక్షకుడుగా లేని యెడల ఆ కార్యము నాకు సాధ్యమగును. నేను పాండవులతో యుద్ధము చేయకుండుటకు రెండు కారణములు గలవు. ఒకటి పాండవులను నేను చంపదలచకుండుట, రెండవది శిఖండి యొక్క స్త్రీ పూర్వత్వము. ఈ కారణద్వయముచేతనే పాండవులతో నేను పోరాడను.

నేను పూర్వము సత్యవతి సంతోషార్థమై నా తండ్రి శాంతనుని సంతోష పరచగా నా తండ్రి నాకు స్వేచ్ఛామరణము (ఎవరిచేతను వధింపబడకుండుట) వరముగా ప్రసాదించియుండెను. కనుక ఇప్పుడు నాకు మరణకాలము సంప్రాప్తమైనదని తలచెదను.'

ధృతరాష్ట్ర మహారాజా! యిట్లు భీష్ముని నిశ్చయమును తెలిసికొనిన ఋషులు-వసువులు ఆకాశమునందుండి యితనితో నిట్లనిరి.

"నాయనా! యీ నీ నిశ్చయము మాకు గూడ ప్రియమైనది. అట్లే చేయుము. యుద్ధమునుండి బుద్ధి మరలించుకొనుము."

రాజా! యిట్లు ఋషులు-వసువులు చెప్పిన మాట ముగియగనే సుగంధము గల అనుకూల వాయువు చల్లని నీటి తుంపరలతో వీచెను. దేవదుందుభులు మ్రోగెను. భీష్మునిపై పుష్పవృష్టి గురిసెను. ఆ ధ్వని రాజా! మునుల యనుగ్రహముచేత నాకు భీష్మునకు మాత్రమే వినపడెను. పరస్పరము వాదించుకొనుచున్న యితర సైనికులకు వీరవరులకు ఆ ధ్వని వినబడలేదు. అప్పుడు దేవతల మాటలు విని మహాతపస్సంపన్నుడు సర్వలోకప్రియుడునైన భీష్మపితామహుడు రథమునుండి పడబోవుచున్నాడని తెలిసి దేవతలలో మహాసంభ్రమము కలిగెను.

రాజా! తరువాత అర్జునుడు సర్వమర్మములను ఛేదించు పదునైన బాణములతో కొట్టినను భీష్ముడు తిరిగి అర్జునుని మించి పోరాడలేదు. అప్పుడు శిఖండి భరతపితామహుని వక్షఃస్థలముపై తొమ్మిది నిశితశరములచేత కొట్టెను. అట్లు శిఖండిచేత కొట్టబడిన భీష్ముడు భూకంపమునందు పర్వతమువలె ఏ మాత్రము కంపించకుండెను.

రాజా! తరువాత అర్జునుడు నవ్వి గాండీవమునందు ఇరువదియైదు క్షుద్రక (కుప్పకోల) బాణములను భీష్మునిపై ప్రయోగించి మాటిమాటికి నూర్ల కొలది బాణములతో నతనిని సర్వమర్మములందు కొట్టెను. ఇతరులు గూడ వేలకొలది బాణములతో భీష్ముని కొట్టిరి. ఆ బాణములనన్నిటిని భీష్ముడు తిరుగగొట్టెను. శిఖండి ప్రయోగించిన బాణములు భీష్ముని బాధించలేదు.

రాజా! తరువాత అర్జునుడు క్రుద్ధుడై శిఖండిని ముందిడుకొని భీష్ముని యెదిరించి యతని ధనుస్సును ఛేదించెను. తరువాత తొమ్మిది బాణములతో భీష్ముని కొట్టి యతని ధ్వజమును ఒక బాణముతో ఛేదించెను. సారథిని పది బాణములతో కొట్టి కంపింపజేసెను. అప్పుడు భీష్ముడు మరియొక ధనుస్సు తీసికొనగా దానిని గూడ అర్జునుడు క్షణములో మూడు బాణములతో మూడు ముక్కలుగా గొట్టెను. ఈ విధముగా నర్జునుడు భీష్ముని యనేక ధనుస్సులను ఖండించెను. తరువాత భీష్ముడు అర్జునుని మించి పోరాడలేదు. అప్పుడర్జునుడు భీష్ముని ఇరువదియైదు క్షుద్రక బాణములతో కొట్టెను. ఆ దెబ్బచేత బాధపడి భీష్ముడు దుశ్శాసనునితో నిట్లనెను.

దుశ్శాసనా! పాండవ మహారథికుడైన పార్థుడు యుద్ధమునందు క్రుద్ధుడై అనేక సహస్ర బాణములచేత నన్నే కొట్టెను. ఇతనిని యుద్ధమునందు ఇంద్రుడు గూడ జయించజాలడు. దేవదానవ రాక్షసులేకమై వచ్చినను అర్జునుని నన్ను జయింపజాలరనగా మర్త్యుల మాట ఎంత?

ధృతరాష్ట్ర మహారాజా! యీ విధముగా భీష్మదుశ్శాసనులు మాట్లాడుకొనుచుండగా అర్జునుడు శిఖండిని ముందిడుకొని నిశితశరములతో భీష్ముని కొట్టగా భీష్ముడు మిక్కిలి శరపీడితుడై మరల దుశ్శాసనునితో నవ్వుచు నిట్లనెను.-

దుశ్శాసనా! అర్జునిని బాణములచే మిక్కిలిగా కొట్టబడితిని. ఈ యర్జునుని

బాణములు వజ్రాయుధము వలె పిడుగువలె అవిచ్ఛిన్నముగా నాపై బడుచున్నవి కనుక నివి శిఖండిబాణములు గావు.

నాయనా! ఈ బాణములు ముసలాయుధముల వలె నా మర్మములను చేదించుచు నా కవచమును చేదించుచు నన్ను కొట్టుచున్నవి. కనుక ఇవి శిఖండి శరములు కావు.

ధార్తరాష్ట్రా! వజ్రదండసమాన స్పర్శగలిగి వజ్రవేగమువలె నెదిరింప జాలనివై నా ప్రాణములను బాధించుచున్నవి గనుక ఈ బాణములు శిఖండి ప్రయుక్తములు కావు.

దుశ్శాసనా! ఈ బాణములు గదా పరిఘాయుధముల వలె నన్ను స్పృశించుచు యమదూతలవలె నా ప్రాణములను తీయుచున్నవా! యను నట్లున్నవి. కాబట్టి యవి శిఖండి ప్రయోగించిన బాణములు కావు.

నాయనా! క్రోధముతో కోరలు నాకుచు విషమును గ్రక్కుచున్న సర్పములవలె ఈ బాణములు నా మర్మములలో దూరుచున్నవి. కనుక నివి శిఖండివి కావు.

దుశ్శాసనా! ఈ బాణములన్నియు మాఘమ (తల్లియైన యెండ్రకాయ)ను అప్పుడే పుట్టిన సేగవ (యెండ్రిపిల్ల) వలె నా యవయవాలను ఛేదించుచున్నవి గాబట్టి యవి యర్జునుని బాణములే గాని శిఖండివి కావు వీరుడైన యర్జునుడు దప్ప ఇతరరాజులెవరు గూడ నాకు యింతదుఃఖము గలిగింపజాలరు.

ధృతరాష్ట్ర మహారాజా! యిట్లు భీష్ముడు దుశ్శాసనునకు చెప్పుచు పాండవులను దహించుచున్న వాడు వలె శక్తిని అర్జునునిపై విసిరివేసెను. ఆ శక్తిని అర్జునుడు మూడు బాణములచేత మూడు ముక్కలుగా ఖండించి పడగొట్టెను.

రాజా! తరువాత భీష్ముడు ఖడ్గము డాలు తీసికొని మృత్యువునో, జయమునో ఏదోయొకటి పొందగోరుచుండగా నతడు రథమునుండి దిగుటకు పూర్వమే ఆ ఖడ్గమును డాలును అర్జునుడు అత్యద్భుతముగా తన బాణములతో ఖండించెను.

రాజా! తరువాత యుధిష్ఠిరుడు తమ సేనలను ప్రోత్సహించుచు "వీర

సైనికులారా! భీష్మనిపై దాడిచేయుఁడు. మీకు భయమక్కరలేదు అని చెప్ప గానే వారు తోమర-ప్రాస-బాణాద్యాయుధములచేత భీష్ముని ముట్టడించి పెద్దగా సింహనాదము చేసిరి.

రాజా! అట్లే నీ పుత్రులు గూడ భీష్ముని విజయము గోరుచు సింహ నాదము చేసి అందరు భీష్మునొక్కనినే రక్షించుచుండిరి.

రాజా! ఆ పదవదినమందు భీష్మార్జునులు ఒండొరులు తలపడినప్పుడు మీ వారికి పాండవ సైనికులతో తుముల యుద్ధమాయెను. పరస్పరము సంహరించు కొనుచు యుద్ధము చేయుచున్నప్పుడొక్క క్షణకాలము గంగానదిసుడివలె సముద్రపు సుడివలెను సేవలు తిరుగుచుండెను. రక్తసిక్తమైన భూమి సామ్య రూపమై మిట్టపల్లములు-సమవిషమస్థలములు తెలియకుండెను.

రాజా! పదవనాడు భీష్ముడు పదివేల యోధులను సంహరించి తన మర్మ ములు భేదిల్లగా రణభూమిలో నిలిచియుండెను.

రాజా! తరువాత సేనాముఖమునందున్న అర్జునుడు కురుసేనల మధ్య ముగా సేనను పరుగెత్తించెను. పాండవసేనలప్పుడు శరములతో మీ సేనలను తపింపజేసెను. అప్పుడు భీష్మరక్షకులుగా నుండిన సైనికులందరును పాండవ సేనలను బాణములతో కొట్టి ప్రారదోలిరి.

రాజా! మేము అర్జునునకు భయపడి అతని శరములచేత పీడితులమై పారిపోయితిమి.

తరువాత సౌవీర-మాళవ-శూరసేనాది సైనికులందరు అర్జున బాణపీడి తులై కూడ యుద్ధము చేయుచున్న భీష్ముని విడిచిపోవకుండిరి. వారందరు భీష్ముని చుట్టు చేరియుండిరి.

అప్పుడు పాండవసైనికులలో నొకరినొకరు పిలుచుకొనుచు "పడగొట్టుడు-పట్టుకొనుడు-పోరాడుడు-భీష్ముని చేదింపుడు" అని అరచుచున్న ధ్వని తుముల ముగా బయలుదేరెను.

రాజా! భీష్ముడు నూర్లకొలది-వేలకొలది శత్రువులను సంహరించుచు పోరాడునప్పుడు తన గాత్రమునందు రెండు అంగుళముల అంతరము గూడ గాయపడకయుండలేదు.

రాజా! యీ విధముగా నీ తండ్రి భీష్ముని అర్జునుడు నిశితశరములచేత కొట్టగా శరీరమంతయు శిథిలమై ఆ మహాత్ముడు రథమునుండి తూర్పుగా శిరస్సు పెట్టి క్రిందపడెను.

అప్పుడు పగలు కొంచెము మాత్రము మిగిలియుండెను. తామందరు చూచుచుండగా పడిపోయిన భీష్ముని చూచి మీవారందరు రాజులు, ఆకాశమునందు దేవతలున్ను 'హా హా' యని బిగ్గరగా యరచిరి.

రాజా! భీష్ముని పతనముతో మా యందరి హృదయములు గూడ పడిపోయెను. భూమిని ప్రతిధ్వనింపజేయుచు ఆయన పడిపోయెను.

రాజా! ఆయన శరీరము చుట్టు బాణసంఘములు చుట్టుకొని యుండుటచేత శరతల్పమునందు శయనించియుండెను. రథమునుండి పడినప్పుడు ఆయనకు ఒక దివ్యభావము కలిగెను.

రాజా! అప్పుడు మేఘములు వర్షించెను. భూమి కంపించెను. సూర్యునకు దక్షిణమువైపుగా భీష్ముడు పడుచు కనబడెను. ఆ కాలమును గూర్చి చింతించి మూర్ఛదేరెను. అంతరిక్షమునందు దివ్యవాక్కులు అతనికిట్లు వినబడెను.

సర్వశస్త్రధారులలో శ్రేష్ఠుడైన భీష్ముడు కాలజ్ఞానము గలవాడు గదా! అట్టి మహాత్ముడు దక్షిణాయనకాలమందు ఎట్లు పడిపోయెను? ఆ మాట విని ఆ వాణికి భీష్ముడు ఇట్లు బదులుచెప్పెను.

'భీష్ముడు భూమిపై పడిపోయినను ఉత్తరాయణమునెదురు చూచుచు అంతదాక ప్రాణములు ధరించియుండును.'

## మహర్షులు హంసరూపములో భీష్ముని కడకు వచ్చుట

రాజా! అప్పుడు మరణించదలచిన భీష్ముని యభిప్రాయమును తెలిసికొని గంగాదేవి మహర్షులను హంసరూపముతో భీష్ముని కడకు పంపెను. తరువాత మానససరోవర నివాసులైన హంసలు పరుగెత్తుచు శరతల్పమునందు శయనించియున్న భీష్ముని కడకువచ్చి అతనికి ప్రదక్షిణముచేసి మహాత్ముడై యుండికూడ భీష్ముడు దక్షిణాయనమునందు ఎట్లు ప్రాణములు విడుచుచున్నాడు

అని పరస్పరము మాట్లాడుకొని అక్కడ నుండి బయలుదేరి పోవుచుండగా అది దక్షిణాయనకాలమని భీష్ముడు తెలుసుకొని ఆ హంసలతో నిట్లనెను.

హంసలారా! నేను సూర్యుడు దక్షిణాయనమందుండగా ఏ విధముగగూడ చావకూడదని నిశ్చయించుకున్నాను. ఆదిత్యుడు ఉత్తరాయణమునందుండగనే మరణించవలెనని పూర్వమే నిర్ణయించుకొనినానని సత్యముగా చెప్పుచున్నాను. ప్రాణములు విడుచుటకు ఉత్తరాయణము ఐశ్వర్యకరమైనది గాబటి ఉత్తరాయణమునందు మరణమును కాంక్షించుచు ఆ కాలము నెదురుచూచుచు ప్రాణములు ధరించియుండెదను.

హంసలారా! పూర్వము నాకు నా తండ్రి స్వచ్ఛంద మరణము కొరకు వరమిచ్చియుండెను. ఆ వరము ప్రకారమే నేను మరణించుట నిశ్చయమైనచో ఉత్తరాయణము వరకు నా ప్రాణములు ధరించియుండెదను.

## భీష్మని ప్రాణధారణము

ధృతరాష్ట్ర మహారాజా! భీష్ముడట్లు హంసరూపధారులైన మహర్షులకు చెప్పి శరతల్పమునందు శయనించియుండెను.

రాజా! మహాపరాక్రమశాలి, కౌరవవంశ శిఖరాయమానుడైన భీష్ముడిట్లు పడిపోవగా పాండవ–సృంజయులు సింహనాదము చేసిరి.

రాజా! భీష్మపితామహుడు హతుడు కాగా, నీ పుత్రులు ఏమియు తోచక యుండిరి. కౌరవులలో సమ్మోహము కలిగెను. కృపదుర్యోధనాదులు నిట్టూర్చి ఏడ్చిరి. అందరు విషాదముతో జ్ఞానశక్తి యుడిగి నిలిచి ధ్యానముచేయుచుండిరి. ఎవరికి గూడ యుద్ధమునందు యిచ్ఛ లేకుండెను. కాళ్ళు తొడలు బిగుసుకొని పోయి పాండవులపై దాడిచేయజాలకుండిరి.

రాజా! ఎవరిచేతను వధింపబడజాలని భీష్ముడు హతుడు కాగా కురు రాజైన దుర్యోధనుడిక లేనట్లుగానే యందరు భావించిరి. "మన వీరులు చచ్చిరి. మనము గూడ అర్జునుని నిశితశరములచేత ఛేదింపబడితిమి. అతనిచేత జయింపబడిన మనకు ఇప్పుడు కర్తవ్యము తెలియకున్నది అని వీరులందరు తలచి నిర్విణ్ణులై యుండిరి.

రాజా! పాండవులు విజయము సాధించిరి. కొందరు పరలోకములో నుత్తమగతిని గూడా పొందిరి. పాండవ-పాంచాల-సృంజాయాది వీరులందరు సంతోషములో శంఖములు పూరించిరి.

రాజా! తరువాత అనేక సహస్ర తూర్యములు మ్రోగుచుండగా మహాబలశాలియైన భీమసేనుడు బిగ్గరగా చప్పట్లు చరచుచు బొబ్బరిల్లెను.

రాజా! గాంగేయుడు నిహతుడు కాగా ఉభయసేనలలోను వీరులు శస్త్ర సన్న్యాసముచేసి అంతటను చింతించుచుండిరి. కొందరు ఆక్రోశించిరి. మరి కొందరు పరుగెత్తిపోయిరి. కొందరు మోహము చెందిరి. వేరుకొందరు క్షత్ర ధర్మమును నిందించి భీష్ముని పూజించిరి.

రాజా! ఋషులు-పితృదేవతలు-భరతవంశపు పూర్వులు భీష్ముని ప్రశంసించిరి. అత్యంతబుద్ధిశాలియైన భీష్మపితామహుడు యోగసమాధినిష్ఠుడైయుండి ఉపనిషత్తులను జపించుచు ఉత్తరాయణకాలమునకై ప్రతీక్షించుచుండెను.

జనమేజయా! యిట్లు సంజయుడు భీష్ముని పదవనాటియుద్ధము అతని పతనమును గూర్చి ధృతరాష్ట్రునకు చెప్పగా ధృతరాష్ట్రుడు సంజయునిట్లు ప్రశ్నించెను.

నూట ఇరువదవ అధ్యాయము

## భీష్ముని మహత్త్వము ప్రకారము అర్జునుడు తలగడ సవరించుట

సంజయా! భీష్ముడు లేని మా యోధులెట్లుండిరి? ఆయన బలవంతుడు, దేవతుల్యుడు, తండ్రికొరకు బ్రహ్మచారిగా జీవితాంతము గడిపిన మహాత్ముడు గదా! అట్టి మహానుభావుడు లేకుండా మా యోధులెట్లు మనగలిగిరి? భీష్ముడు అసహ్యభావముతో శిఖండిని కొట్టిననాడే పాండవులు కౌరవులను ఇతరులను చంపినారనుకొంటిని. అంతకంటే దుఃఖతరమైనదేమనగా నేను నా తండ్రి సంహరింపబడుట, సంజయా నిక్కముగా నా హృదయము భీష్ముడు సంహరింపబడినట్లు తెలిసికూడ నూరు ముక్కలై పగలలేదనగా అది యినుమువంటిదని తలచెదను.

సంజయా! జయమునుగోరుచు పోరాడుచున్న కురుసింహుడైన భీష్ముడు యుద్ధములో చంపబడిన తరువాత ఏమి చేసెను? చెప్పుము. పూర్వము పరశురామునంతటి లోకైకవీరుడు గూడ దివ్యాస్త్రములను ప్రయోగించినను సంహరింపజాలని భీష్ముని సామాన్యుడైన శిఖండి చంపినాడను వార్త విని మాటి మాటికి నేను సహింపజాలకున్నాను.

జనమేజయా! ఆ మాటలు వినిన సంజయుడు ధృతరాష్ట్రునితో నిట్లనెను.

మహారాజా! ధార్తరాష్ట్రులను దుఃఖపరచుచు ఆ సాయంకాలమందు చంప బడిన కురుపితామహుడైన భీష్ముడు పాంచాలురకు హర్షము కలిగించెను.

రాజా! అప్పుడా మహాత్ముడు భూమిని తాకకుండ శరతల్పమునందు శయనించియుండెను.

రాజా! భీష్ముడు రథము నుండి జారి క్రిందపడిపోవగానే భూతప్రాణు లన్నియు హాహాకారము చేసెను. కౌరవులకు సీమావృక్షము వంటివాడైన భీష్ముడు పడిపోగానే ఉభయసేనల క్షత్రియులకు భయమావేశించెను.

రాజా! కవచ-ధ్వజములు నశించిపడియున్న భీష్ముని చూచి కౌరవపాండ వుల మనసులు దీనములయ్యెను. సూర్యుని తేజస్సు తగ్గి ఆకాశమునందు చీకటి క్రమ్మెను. భీష్ముడు పడిపోవగానే భూమి దద్దరిల్లి మ్రోగెను.

రాజా! అట్లు శయనించియున్న భీష్ముని చూచి భూతములు "ఇతడు బ్రహ్మవిదులలో శ్రేష్ఠుడు" అని యనెను. ఋషులు-సిద్ధచారణులు "ఈ భీష్ముడు పూర్వము కామార్తుడైన తండ్రి యాజ్ఞమేరకు ఊర్ధ్వరేతస్కుడై ఆజీవబ్రహ్మ చర్యమును అనుష్ఠించెను" అని శరతల్పగతుడైన భీష్ముని ప్రశంసించుచు మాట్లాడుకొనిరి.

రాజా! భీష్ముడు హతుడైన తరువాత నీ పుత్రులకేమియు తోచక కళ తగ్గి వారి ముఖములందు విషాదము అలముకొని యుండెను. వారు లజ్జతో తల వంచుకొని నిలిచియుండిరి.

రాజా! విజయము సాధించిన పాండవులు యుద్ధభూమిలో నిలిచి బంగారు

హారములచే అలంకరించబడిన శంఖములు పూరించిరి. అప్పుడు సంతోషములో తూర్యసహస్రములు మ్రోగెను.

రాజా! మహాబలశాలియైన శత్రువు మరణించుట వలన గలిగిన ఆనందమున భీమసేనుడు క్రీడించుచుండుట చూచితిమి.

రాజా! కౌరవులలో సమ్మోహము గలిగెను. అట్లు కురు పితామహుడైన భీష్ముడు పోవగా కర్ణ దుర్యోధనులు మాటిమాటికి నిట్టూర్చుచుండిరి. అంతటను అమితమైన హాహాకారము కలిగెను.

రాజా! అట్లు భీష్ముడు పడిపోవుట చూచి నీ పుత్రుడు దుశ్శాసనుడు దుర్యోధనుని యాజ్ఞపై తన సేనతోగూడి ద్రోణాచార్యుని సేన కడకు పోయెను. అట్లుపోవుచున్న దుశ్శాసనునిచూచి అక్కడి కురువీరులు అతనినిఆపి "ఏమి సమాచార" మని అడిగిరి. తరువాత దుశ్శాసనుడు ద్రోణాచార్యునితో "భీష్ముడు నిహతుడైనాడని" చెప్పగనే ద్రోణుడు ఆయప్రియవచనమువిని మూర్ఛిల్లి కొంత సేపటికి తెప్పరిల్లి తన సైన్యమును యుద్ధమునుండి నివారించెను.

రాజా! అట్లు కురుసైనికులు యుద్ధభూమినుండి తిరిగిపోవుట చూచి పాండవవీరులు గూడ తమ సైన్యములకు అశ్వికుల ద్వారా సమాచారము తెలిపి యుద్ధము నుండి నివారించిరి.

రాజా! ఉభయసైనికులు తిరిగిపోవగనే రాజులందరు తమ కవచాదులు విసర్జించి యుద్ధము నుండి విరమించుకొని వేలకొలదిగ మహాత్ముడైన భీష్ముని కడకు దేవతలు బ్రహ్మదేవుని కడకు పోయినట్లు పోయి యతని కడ భక్తితో నిలిచిరి.

రాజా! అట్లు శయనించియున్న భీష్ముని కడకు కౌరవ పాండవులుపోయి నమస్కరించి నిలిచిన తరువాత భీష్ముడు తన యెదుట నిలిచియున్న కౌరవ పాండవులతో "మహాభాగులారా! మీకు స్వాగతము. మీరు దేవతాసమానులు. మిమ్ముచూచి సంతోషించుచున్నాను. అనిచెప్పి "నా శిరస్సు మిక్కిలి వ్రేలాడుచున్నది. కనుక ఒక ఉపధానము(తలగడ)తెచ్చి ఈయవలెను." అని యడిగెను.

రాజా! వెంటనే రాజులు అతి మృదువులైన మంచి తలగడను తెచ్చిరి.

భీష్ముడు ఆ యుపధానములనిష్టపడక "రాజులారా! వీరశయ్యపై ఈయుపధాన ములు ఉపయోగపడవు". అని వారితో చెప్పి నరశ్రేష్ఠుడు, దీర్ఘబాహువు సర్వ లోకమహారథుడునైన అర్జునునిచూచి "ధనంజయా! నా శిరస్సు వ్రేలాడు చున్నది. ఈ వీరశయ్యకు యుక్తమైనతలగడ నీవు సమకూర్పుము"అని యనెను.

రాజా! అర్జునుడు భీష్మ పితామహుని మాట వినిన వెంటనే ఆ మహాత్ము నకు నమస్కారముచేసి తన గాండీవము నెక్కుపెట్టి కన్నుల అశ్రువులొలుకగా పితామహునితో నిట్లనెను.

"సర్వశస్త్రధారులలో శ్రేష్ఠుడవైన పితామహా! నేను నీకు సేవకుడను. నేనేమి చేయుదునో ఆజ్ఞాపింపుము".

ఆ మాట విని భీష్ముడు అర్జునునితో నిట్లనెను.

"నాయనా! నా శిరస్సు వ్రేలాడుచున్నది. నాకొక ఉపధానమును సమ కూర్చిపెట్టుము. అది ఈ శరతల్పమునకు అనురూపముగా నుండవలెను అది శీఘ్రముగా నాకు యిమ్ము. సర్వధనుర్ధారులలో శ్రేష్ఠుడవు గాబట్టి నీవే నా ఈ శయమునకు తగిన తలగడ సమకూర్చుటకు సమర్థుడవు. నీవు క్షత్రధర్మమును బాగుగా నెరిగినవాడవు. బుద్ధిబలగుణములు గలవాడవు కాబట్టి నీవొక్కడవే నాకు దిండు సమకూర్చగలవు". ధృతరాష్ట్రమహారాజా! అర్జునుడు భీష్మపితా మహుని ఆజ్ఞను శిరసావహించి ఉపధాన సంపాదనమునకు పూనుకొని గాండీవము నందు బాణములను సంధించి, భీష్ముని అనుమతిపై మూడు తీక్ష్ణబాణములను ఆ శరతల్పమునకు ఉపధానముగా నిలిపెను. భీష్ముడు తన యభిప్రాయము తెలిసికొని అర్జునుడు తనకు అనుకూలమైన తలగడ ఏర్పరచినందులకు సంతో షించి, యర్జునుని అభినందించెను. తరువాత భీష్ముడు అక్కడ నిలిచియున్న కురుపాండవ వీరులనుచూచుచు నర్జునునితో నిట్లనెను:—

'నాయనా! నా శరతల్పమునకు అనురూపమైన ఉపధానమును సమకూర్చి తివి. అట్లు కానియెడల కోపముతో నేను నిన్ను శపించియుందును. మహాబాహూ బలశాలీ! ఈ విధముగనే క్షత్రధర్మమును నిష్ఠతో పాలించు క్షత్రియుడు శర తల్పమునందు శరోపధానముతో శయనించవలెను'.

ధృతరాష్ట్ర మహారాజా! భీష్మపితామహు డీవిధముగా అర్జునుని ప్రశంసించి అక్కడనిలిచియున్న రాజులతో రాజపుత్రులతో పాండవులతోను నిట్లనెను.

క్షత్రియవీరులారా! అర్జునుడు సమకూర్చిన ఈ తలగడనుచూడుడు. నేను ఈ శయనమునందే సూర్యుడు ఉత్తరాయణమునకు వచ్చువరకు శయనించెదను. నా కడకు రాదలచినవారు నన్నిక్కడనే చూడవలెను. సూర్యుడు కుబేరదిక్కునకు వచ్చినప్పుడు నా ప్రాణములను మిత్రులు ప్రియమిత్రులను వలె విడిచెదను. నేను నివసించు ఈ చోటున ఒక పరిఖను (అగడ్తను) త్రవ్వుడు. ఈ విధముగా బాణశతములచేత వ్యాపించియుండియే నేను సూర్యుని ఉపాసించుచుండెదను. మీరందరు వైరము విడిచి యుద్ధము నుండి విరమింపుడు".

ధృతరాష్ట్ర మహారాజా! తరువాత శల్యోద్ధరణకోవిదులైన వైద్యులు భీష్ముని కడకు శస్త్రములతో భీష్ముని శరీరమందు ఇరికిన శల్యములను ఊడదీయుటకు ప్రయత్నించిరి.

రాజా! అప్పుడు భీష్ముడు దుర్యోధనునితో నిట్లనెను.

"నాయనా! దుర్యోధనా! ఈ శస్త్రచికిత్సకులను పూజించి ధనమిచ్చి పంపుము. నేను ఈ పరిస్థితిలో నుండగా వైద్యులతో పనియేమున్నది? క్షత్రధర్మమునందు ప్రశస్తమైన పరమగతిని నేను పొందినాను. రాజులారా! శరతల్పగతుడైన నాకు శరీరమునుండి శరములను ఊడదీయించుకొనుట ధర్మముకాదు. ఈ శరములతో నేను దగ్ధుడను కావలెను".

ధృతరాష్ట్ర మహారాజా! అట్లు భీష్ముని మాటలు విని దుర్యోధనుడు వైద్యులను వారి యర్హతలను బట్టి పూజించి పంపెను.

రాజా! అక్కడ నున్న నానాదేశరాజులు భీష్మునకు క్షత్రధర్మమునందు గల పరమనిష్ఠను చూచి మిక్కిలి విస్మయము చెందిరి.

రాజా! నీ తండ్రికి అర్జునుడు ఉపధానమును కల్పించిన తరువాత పాండవ కౌరవ మహారథికులందరు కలిసి శరతల్పమునందు శయనించియున్న భీష్ముని కడకు పోయి ఆయనకు మూడు ప్రదక్షిణములు చేసి నమస్కరించి ఆయన రక్షణమునకు ఏర్పాట్లుచేసి భీష్ముని ధ్యానించుచు వీరులందరు ఆ సాయంకాలమునందు రక్తసిక్త శరీరములతో తమ తమ శిబిరములకు పోయిరి.

## శ్రీకృష్ణ యుధిష్ఠిరుల సంవాదము

రాజా! భీష్ముని పతనము చేత సంతుష్టులై ప్రీతితో తమ శిబిరములలో ప్రవేశించిన పాండవుల యొద్దకు శ్రీకృష్ణుడు పోయి యుధిష్ఠిరునితో నిట్లనెను.

"యుధిష్ఠిరా! నీ యదృష్టము చేత భీష్ముడు పడగొట్టబడెను నీకు నీ భాగ్యమువలన జయము సిద్ధించెను. సత్యసంధుడు-మహారథికుడు-సర్వశాస్త్ర పండితుడునైన భీష్ముడు దేవమనుష్యలోకములలో నెవరిచేతగూడ మరణించడు. అట్టి మహావీరుడు చక్షుర్హణుడు (చూపుచేతనే సంహరింపగలవాడు). నిన్ను ఎదుర్కొని ఘోరమైన నీ దృష్టి పడి దహింపబడెను.

ధృతరాష్ట్రా! యిట్లు శ్రీకృష్ణుడు చెప్పగా ధర్మరాజు జనార్దనునితో నిట్లనెను.

"శ్రీకృష్ణా! నీవు అనుగ్రహించిన వారికి విజయము, కోపించినవారికి పరాజయము కలుగునుకదా! కృష్ణా! భక్తులకు అభయప్రదానము చేయుము. నీవు మాకు రక్షకుడవు గదా! ఎవరి పక్షమునందు నీవు ఉండిన వారికి జయము కలుగుటలో ఆశ్చర్యములేదుగదా! నిన్ను ఆశ్రయించినవారిని సర్వదా రక్షించుచు వారికి హితము చేయుచుందువు గదా! అట్టివారికి రక్షణము హితము కలుగుటలో నాశ్చర్యమేమున్నది?"

ధృతరాష్ట్ర మహారాజా! యిట్లు యుధిష్ఠిరుడు చెప్పగా శ్రీకృష్ణ భగవానుడు నవ్వుచు యుధిష్ఠిరునితో "రాజోత్తమా! ఇట్లు పలుకుట నీ వినయమునకు భక్తికి యుక్తముగా నున్నది" అని యనెను.

జనమేజయా! సంజయుడిట్లు భీష్మపధాన వృత్తాంతము ధృతరాష్ట్రునకు చెప్పి యతనితో మరల నిట్లనెను.

నూటఇరవై ఒకటవ అధ్యాయము

## అర్జునుడు దివ్యజలమును సృష్టించి భీష్ముని దప్పిక దీర్చుట

రాజా! మరునాడు తెల్లవారిన తరువాత రాజులు-పాండవ-ధార్తరాష్ట్రులు భీష్మ పితామహుని కడకు భక్తితో పోయి వీరశయననుందు శయనించియున్న భీష్మునకు నమస్కారము చేసి ఆ క్షత్రియోత్తముని సేవించుచు నిలచిరి.

రాజా! కన్యకలు వేలకొలదిగ అక్కడకు వచ్చి చందన చూర్ణములు పేలాలు-పుష్పమాలలు ఆయనపై చల్లిరి. స్త్రీలు-వృద్ధులు-బాలికలు ఇతర ప్రేక్షక జనులున్న ప్రజలు సూర్యుని చేరునట్లు వచ్చి అతని చుట్టుచేరిరి. నూర్లకొలది తూర్యములు (వాద్యములు) నటనర్తకులు శిల్పులు గూడ కురుపితామహుని యొద్దకు వచ్చిరి.

రాజా! కౌరవ-పాండవవీరులు ఇతర రాజవీరులు యుద్ధమును విరమించు కొని యుద్ధసన్నాహములు చేయకుండ ఆయుధములను దూరముగా పారవైచి అందరు కలిసి పరస్పరము వారివారి వయస్సులను బట్టి ప్రీతితో పలకరించు కొనుచు భీష్ముని ఉపాసించుచు అతనిచుట్టు నిలిచియుండిరి.

రాజా! అనేక వీరులతో వ్యాప్తమై భీష్మశోభితమైన ఆ భరతవంశజుల సమితి ఆకాశమునందు సూర్యమండలము వలె శోభిల్లుచుండెను. గంగానందను డైన భీష్ముని ఉపాసించుచున్న ఆ రాజసభ దేవతలచేత ఉపాసింపబడుచున్న సుధర్మ (దేవేంద్రుని సభ) వలె ప్రకాశించెను.

రాజా! అప్పుడు భీష్ముడు ధైర్యముతో తన బాధను నిగ్రహించుకొని బాణముల బాధచేత తపించుచు సర్పము వలె బుసకొట్టుచుండెను

రాజా! శస్త్రఘాతములచేత మూర్ఛితుడై శరముల వేడిమికి తపించిన శరీరముగల భీష్మపితామహుడు "దప్పిగొన్నాను. జలము కావలెను" అని రాజుల నడిగెను. అప్పుడా సమీపమునందు రాజులు వివిధములైన తినుబండారములను, శీతల జలకుంభములను భీష్మునికొరకు తెచ్చిరి. వారు తెచ్చిన జలమునుచూచి భీష్ముడు ఇట్లనెను.

"రాజవీరులారా! నాకిప్పుడు మనుష్యభోగములు-మనుష్య సంపాదిత ద్రవ్యములతో అక్కరలేదు. ఇదివరకే ఇవియన్నియు నేను అనుభవించి విడిచి నవి. ఇప్పుడు నేను శరతల్పగతుడనై యున్నాను. సూర్యచంద్రుల నివృత్తి (ఉత్తరాయణము) కొరకు ఎదురుచూచుచున్నారు".

ధృతరాష్ట్రా! మహారాజా! భీష్ముడిట్లు చెప్పి "ఆ రాజులనందరిని నిందించి అర్జునుడెక్కడ? అతనిని చూడగోరుచున్నాను". అని యనగానే అక్కడికి

అర్జునుడు వచ్చి పితామహునకు నమస్కారము చేసి వినయముతో తలవంచి "ఏమి యాజ్ఞ" అని భీష్ము నడిగెను.

రాజా! అట్లు తనకు నమస్కరించి యెదుట నిలిచియున్న అర్జునుని యెడ సంప్రీతుడై భీష్ముడిట్లనెను.

"నాయనా! నీ బాణములచేత కప్పబడిన నా శరీరము దహించుచున్నదా యనునట్లున్నది. నా మర్మములన్నియు నొప్పిచేత బాధపడుచున్నవి. నోరు ఎండిపోవుచున్నది. నొప్పిచేత పీడితుడనైన నాకు త్రాగుటకు నీరు యిమ్ము. శరతల్పమునందున్న నాకు శాస్త్రోక్తముగా త్రాగదగిన నీరు తెచ్చి యిచ్చుటకు నీవే సమర్థుడవు".

ధృతరాష్ట్ర మహారాజా! అప్పుడు అర్జునుడు పితామహునాజ్ఞ శిరసా వహించి రథమెక్కి గాండీవము నెక్కుపెట్టి ధనుష్టంకారము చేసెను. ఆ ధ్వని పిడుగు ధ్వని వలె నుండెను. దానిని వినిన రాజులు సమస్తభూతములున్ను భయ పడిరి.

రాజా! తరువాత అర్జునుడు ఆ రథముతోనే శరతల్పము మీద శయనించి యున్న భీష్మునకు ప్రదక్షిణము చేసి గాండీవమునందు శరసంధానము చేసి పర్జన్యాస్త్రమును అభిమంత్రించి భీష్ముని పార్శ్వమునందు భూమిపై ఆ యస్త్ర ముతో కొట్టగా అక్కడ నిర్మల వారిధార ఉబికి పైకి వచ్చెను. అర్జును డప్పుడు శీతలము-అమృతతుల్యము-సుగంధయుక్తమునైన ఆ నీటిచేత భీష్ముని దప్పిదీర్చి తృప్తి పరచెను. అర్జునుడు ఇంద్రునివలె చేసిన యా యాద్భుత కర్మకు అక్కడ నున్న రాజులందరు మిక్కిలి ఆశ్చర్యము చెందిరి.

రాజా! మానవాతీతమైన అర్జునుని ఆ యద్భుతకార్యము చూచి కౌరవులు చలిబాధచేత వణకుచున్న గోవులవలె గడగడ వడకిరి. అంతటను తమ ఉత్తరీయ వస్త్రములను ఎగురవేసిరి. శంఖదుందుభినాదములు అన్ని ఎడల తుములముగా బయలువెడలెను.

రాజా! అప్పుడు భీష్ముడు అర్జునుని యెడల మిక్కిలి సంతృప్తుడై రాజు లందరు చూచుచుండగా నర్జునుని ప్రశంసించుచు నిట్లనెను.

## భీష్ముడు అర్జునుని ప్రశంసించుచు దుర్యోధనునకు ఉపదేశించుట

పాండవనందనా! ఈ కార్యము నీవు చేయుట చిత్రమేమియు కాదు. దేవేంద్రుడు గూడ దేవసేనలతో చేయజాలని మహాకార్యము నీవు వాసుదేవుని సహాయముతో చేయగలవని పూర్వము నారదమహర్షి చెప్పియుండెను. సర్వ క్షత్రియులకు నీవు మృత్యువువని అందరు యుద్ధపండితులు తెలిసికొనియే యున్నారు. సమస్తభూమండలమునందలి ధనుర్ధారులందరిలోను నీవొక్కడవే సమర్థుడవు.

అర్జునా! ప్రపంచమునందు అందరిలో మనుష్యులు శ్రేష్ఠులు పక్షులలో గరుత్మంతుడు- జలాధారములలో సాగరము- నాలుగు కాళ్ళ జంతువులలో గోవులు- తేజోవంతులలో సూర్యుడు- పర్వతములలో హిమవంతుడు-జాతులలో బ్రాహ్మణుడు- శ్రేష్ఠుడైనట్లే నీవు ప్రపంచధనుర్ధారులందరిలోను శ్రేష్ఠుడవుగా నున్నావు.

అర్జునా! దుర్యోధనునకు నేను, విదురుడు, ద్రోణుడు, పరశురాముడు, శ్రీకృష్ణుడు సంజయుడున్ను మాటిమాటికి చెప్పినను అతడు వినలేదు. దుర్యోధనుడు విపరీతబుద్ధి కలవాడై మూర్ఛితుని వలె మా మాటలపై శ్రద్ధ చూపలేదు. విధిని అతిక్రమించిన దుర్యోధనుడు భీమసేనుని బలముచేత పరభూతుడై మరణించి దీర్ఘనిద్ర పొందగలడు.

ధృతరాష్ట్ర మహారాజా! భీష్ముడనిన మాటలు విని దుర్యోధనుడు దైన్యములో నుండుట జూచి భీష్ముడతనితో నిట్లనెను.

దుర్యోధనా! నీవు దుఃఖము కోపము విడిచి నేను చెప్పబోవు మాటలు వినుము. నీవిప్పుడే అర్జునుడు అమృతతుల్యములైన శీతల జలధారలను పుట్టించినది చూచితివి గదా! ఈ లోకము నందిట్టి యద్భుతకార్యము మరియొకడెవడు గూడ చేయజాలడు. ఆగ్నేయ-వారుణ-సౌమ్య-వాయవ్య-వైష్ణవ-ఇంద్ర పాశుపత-బ్రహ్మ-పారమేష్ఠ్యాదులైన దివ్యాస్త్రములను ప్రజాపతి-ధాత్వ-త్వాష్ట్ర-సవిత్ర-వైవస్వత దేవతాకములైన దివ్యాస్త్రములన్నిటిని గూడ ఈ మనుష్యలోకమునందు అర్జునుడు-శ్రీకృష్ణుడు మాత్రమే ఎరుగుదురు.

కనుక నాయనా! దుర్యోధనా! యుద్ధమునందు అర్జునుని జయించుట అసాధ్యము సుమా! ఇటువంటి మానవాతీతకర్మలు చేయునట్టి మహాత్ముడు బలవంతుడు-యుద్ధశూరుడు-రణశోభితుడు-సమరకుశలుడునైన అర్జునునితో సంధి చేసుకొనుము.

దుర్యోధనా! శ్రీకృష్ణుడు స్వాధీనుడై నీ మాట వినునంతవరకే అర్జునునితో సంధి చేసుకొనుము. నీ సైన్యము అర్జునుడు నశింపజేయులోపలనే సంధి చేసుకొనుము. హతశేషులైన నీ సోదరులు-ఇతర రాజులు సమరభూమిలో నిలిచియున్నంతలోపలనే సంధి చేసుకొనుము.

నాయనా! క్రోధముచేత మలచుచున్న చూపులతో యుధిష్ఠిరుడు నీ సేనను పూర్తిగా దహించులోపలనే సంధి చేసికొనుము. భీమనకుల సహదేవులు నీ నీ సేనను పూర్తిగా నశింపజేయులోపలనే నీవు పాండవులతో మైత్రి చేసికొనుట మంచిదని నాకు తోచుచున్నది.

నాయనా! దుర్యోధనా! నా యంతముతోనే నీవు పాండవులను శాంతింపచేసి యుద్ధము ముగింపుము. నేను చెప్పిన మాటలు నీకు రుచించుగాక! నాయనా యిందులో నీకు కులమునకు క్షేమము గలదు.

దుర్యోధనా! కోపమువిడిచి పాండవులతోకలసి ఉపశమింపుము. అర్జునుడు చేసిన పరాక్రమకార్యము భీష్మనిర్యాణాంతము వరకే చాలును. ఇకపైన అతని పరాక్రమము మీరు సహింపజాలరు. కనుక మీకు మైత్రి ఏర్పడుగాక! మిగిలిన వారైనను క్షేమముగా జీవింతురు గాక! రాజా! ప్రసన్నుడవు కమ్ము.

దుర్యోధనా! పాండవులకు అర్ధరాజ్యమిమ్ము. ధర్మరాజు ఇంద్రప్రస్థమునకు పోయి ఏలుకొనుగాక. మిత్రద్రోహం చేసి రాజులలో నీచుడవు కాకుము. పాపపు అపయశస్సును పొందగలవు సుమా! నా యవసానము తరువాత ప్రజలలో శాంతి నెలకొనుగాక. రాజులందరు ప్రీతితో తిరిగి వారి నెలవులకు పోవుదురు గాక. తండ్రి, కొడుకును, మేనమామను, మేనల్లుడు, అన్న తమ్ముని చేరుగాక.

దుర్యోధనా! అట్లు నామాట నీవు మోహావిష్టుడవై దుర్బుద్ధిచేత పాటింపని యెడల చివరకు తపించెదవు. అందరు గూడ దీనితో అంతమొందెదరు. ఈ మాట నేను సత్యముగా చెప్పుచున్నాను.

ధృతరాష్ట్ర మహారాజా! ఈ మాటను భీష్ముడు మైత్రితో దుర్యోధనునకు రాజులందరి సమక్షములో చెప్పి శల్యములచేత మర్మములు తపించుచుండగా నొప్పి బాధను అణచుకొని ఆత్మలో పరమాత్మను దర్శించుచు ధ్యానమగ్నుడై యుండెను.

రాజా! భీష్ముడిట్లు ధర్మార్థ సహితము అపాయరహితము- హితమునైన మాట చెప్పగా వినిన నీ పుత్రుడు దుర్యోధనునకు ఆ మాటలు - మరణించనున్న వానికి ఔషధమువలె రుచించలేదు.

జనమేజయా! యిట్లు ధృతరాష్ట్రునకు సంజయుడు, దుర్యోధనునకు భీష్ముడుచేసిన ఉపదేశమును గూర్చి చెప్పి తరువాతి కథ యిట్లు చెప్పదొడగెను.

నూటఇరవై రెండవ అధ్యాయము

## భీష్మ కర్ణుల రహస్య సంవాదము

మహారాజా! ఆత్మదర్శనము చేయుచు భీష్ముడూరకుండగా రాజులందరు తమ తమ నివాసములకు పోయిరి.

రాజా! భీష్ముడు హతుడైన సంగతి విని కర్ణుడు భయపడి త్వరగా భీష్ముని కడకు పోయి యితడు శరతల్పగతుడై యుండగా కుమారస్వామి తన జన్మస్థానమైన శరము (రెలు) లందు శయనించియున్నాడా యనునట్లున్న భీష్ముని చూచెను. కన్నులు మూసికొనియున్న భీష్మునితో కర్ణుడు ఇట్లనెను:-

భీష్మా! భీష్మా! మహాబాహూ! కురుశ్రేష్ఠా! ఎల్లప్పుడు నీవు చూచుచున్న రాధేయుడను నేను. అన్నిచోట్ల నీచేత ద్వేషించబడుచున్న నేను వచ్చినాను.

ధృతరాష్ట్రమహారాజా! కురువృద్ధుడైన భీష్ముడు కర్ణుని మాటలువిని కన్నులు తెరచి మెల్లగా కర్ణునిచూచి స్నేహపూర్వకముగా నతనిని దగ్గరకురమ్మని ఆచోట నెవరులేకుండుటచూచి తనకు రక్షకులుగానున్న వారిని దూరముగాపంపి తండ్రి కొడుకునువలె ఒకచేత కర్ణుని ఆలింగనముచేసికొని యిట్లనెను:-

నాయనా! నాకు సర్వదా వ్యతిరేకముగా వ్యవహరించుచు, నాతో నీవు స్పర్ధ (పోటీ) చేయుచుంటివి. రారమ్ము ఇప్పుడు నీవు నాయొద్దకు రాకుండిన యెడల నీకు నిశ్చయముగా శ్రేయస్సు కలిగియుండెడిదికాదు.

కర్ణా! నీవు కౌంతేయుడవు రాధేయుడవుకావు. నీ తండ్రి అతిరథుడుకాడు. నీవు సూర్యునికి జన్మించితివి అని నారదుడు నాకు చెప్పెను. వ్యాసమహాముని గూడ ఆ విషయమే నాకు చెప్పెను. ఇది సత్యము ఇందులో సంశయములేదు. నాయనా! నీయందు నాకు ద్వేషములేదు ఇది సత్యము.

కర్ణా! నీవు నిష్కారణముగా పాండవులనందరను ఆక్షేపించుచు ద్వేషించుటయేగాక, వారి పరాక్రమమును కించపరచుటకుగూడ కారణభూతుడవైతివని నీతో నేను పరుషముగా మాట్లాడుచుంటిని. నీవు అనేక పర్యాయములు దుర్యోధనుని చేత ప్రోత్సహింపబడి ధర్మలోపము చేయుచుంటివి. కనుక నీ బుద్ధి యీవిధముగా నైనది. గుణవంతుల బుద్ధిగూడ నీచాశ్రయమువలన ద్వేషము గలదగును. ఆ కారణముచేత నేను చాలసార్లు కౌరవసభలో కఠినముగా, కరకుగాను, నీతో మాట్లాడుచుంటిని.

కర్ణా! సమరమునందు శత్రువులకు సహింపరాని పరాక్రమము గలవాడవు నీవని నేనెరుగుదును. నీ బ్రహ్మణ్యత్వము, శౌర్యము, దానమునందు నీకు గల నిష్ఠ యివి యన్నియు చాలా ప్రశంసనీయములు. దేవతా సమానుడవైన నీకు యీడైనవాడు పురుషులలో మరొకడులేడు. కులభేద భయముచేత నేను సర్వదా నీతో కఠినముగా మాట్లాడుచుంటిని.

కర్ణా! నీవు బాణ అస్త్ర సంధానములలో లాఘవమునందు, అస్త్రబలమునందున్న-కృష్ణార్జునులతో సమానుడవు. పూర్వము నీవు దుర్యోధనుని కన్యార్థమై ఏకాకిగా కాశీరాజు పురమునకుపోయి యుద్ధమునందు అనేక రాజులను మర్దించితివి. అట్లే బలవంతుడైన జరాసంధుడుగూడ యుద్ధమునందు నీకు సమానుడు కాలేకపోయెను.

కర్ణా! నీవు బ్రహ్మణ్యుడవు తేజోబలముచేత సత్వయుద్ధము చేయువాడవు. యుద్ధమునందు దేవగర్భ (దేవతాపుత్ర) సముడవు మానవశక్తికిమించి యుద్ధము చేయగలవాడవు.

కర్ణా! నేను నీ యెడలచూపిన కోపము యిపుడు పోయినది పురుషకారము (పౌరుషము) చేత దైవము అతిక్రమించుట సాధ్యముకాదు. పాండవులు నీకు సహోదరులు-వీరులు. కనుక నీవు వారితో కలసియుండుము. నాకు నీవు ప్రియము

చేయగోరినయెడల వారితో ఏకముగా సోదరభావముతోనుండుము. నాఅంతము తోనే వైరము శాంతించుగాక భూమండలమునందు రాజులందరు క్షేమముగా నుందురుగాక!

ధృతరాష్ట్రమహారాజా! భీష్ముని మాటలువిని కర్ణుడతనితో నిట్లనెను:-

మహాబాహూ! ఈ విషయమంతయు నేనెరుగుదును. ఇందులో సంశయము లేదు. నీవు చెప్పినట్లే నేను కౌంతేయుడనే. సూతపుత్రుడను కాను కుంతీదేవి నన్ను విసర్జింపగా సూతుడు పెంచెను. పూర్వము నేను దుర్యోధనునితో మైత్రిచేసి అతనికి నేను "ఎంత అసాధ్యమైన కార్యమైనను చేసెదను" అని ప్రతిజ్ఞచేసితిని. నేను దుర్యోధనుని యైశ్వర్యమంతయు అనుభవించి అతని విశ్వాసము మిథ్యగా చేయజాలను.

పితామహా! శ్రీకృష్ణుడు అర్జునునకు ఎంత ఆప్తుడో నాకు దుర్యోధనుడు గూడ అట్టివాడే. నా శరీరము-ధనము-దారపుత్రాదులు యశస్సు-నా సర్వస్వము దుర్యోధనునికొరకు భూరిదక్షిణగా ఇచ్చినాను. ఈ వ్యాధి మరణములు కాకుండా క్షత్రధర్మముతో యుద్ధమరణము కావలెనని కోరుకొనుచున్నాను.

పితామహా! నేను దుర్యోధనుని ఆశ్రయించి పాండవులను సర్వదా కోపింప చేసితిని. ఇట్లు ఇది అవశ్యముగా జరుగవలసినదే, దీనిని మరలించుటకు శక్యము గాదు. పురుషకారముచేత దైవమును నివారించుటకు ఎవనికిశక్తి యుండును? ఇది నా దైవవిధి.

పితామహా! భూమండల వినాశమును సూచించు నిమిత్తములనేకములను మీరు చూచి సభలో చెప్పితిరి. పాండవులశక్తి, శ్రీకృష్ణునిశక్తి నేనెరుగుదును. వారిని ఏ పురుషులుగూడ జయింపజాలరని వారితో పోరాడుటకు ఉత్సాహముతో పూనుకొనినాము. పాండవులను యుద్ధములో జయింపగలనని నా నిశ్చయము. మాకు కలిగిన యీ వైరము పోగొట్టుకొనుట శక్యముకాదు. ఈ వైరము అత్యంత భయంకరముగా ఏర్పడినది. దీనిని విడచుట అసాధ్యము. స్వధర్మమునందు ప్రీతితో నేను అర్జునునితో తప్పక యుద్ధము చేసెదను. పితామహా! యుద్ధము చేయుటకు కృతనిశ్చయుడైన నాకు అనుజ్ఞయిమ్ము. నీయనుజ్ఞ పడసి యుద్ధము చేయవలెనని నా నిశ్చయము. నేనిక్కడ ఇప్పుడు చెడ్డగాగాని, వ్యతిరేకముగా

గాని, తొందరపాటుతోగాని, చాపల్యముచేతగాని ఏదైన చేసియుండినచో నన్ను నీవు క్షమింపుము.

ధృతరాష్ట్రమహారాజా! కర్ణుని మాటలువిని భీష్ముడతనితో నిట్లనెను:-

కర్ణా! అతిభయంకరమైన యీ శత్రుత్వము విడుచుటకు నీకు శక్యముకాని యెడల, నీవు స్వర్గకామనతో యుద్ధముచేయుము. నీకు అనుజ్ఞ యిచ్చుచున్నాను. కాని క్రోధము విచారము-తొందరపాటు లేకుండ రణమునందు క్శాలముతో యథాశక్తిగా నీ ఉత్సాహముమేరకు సత్ప్రవర్తనతో పోరాడుము. అనుజ్ఞ యిచ్చుచున్నాను. నీవు కోరినదిపొందుము. నీవు అర్జునునినుండి క్షత్రధర్మముచేత జయింపబడు లోకములను పొందగలవు. నీవు బలపరాక్రమముల నాశ్రయించి అహంకారరహితుడవై యుద్ధముచేయుము.

కర్ణా! క్షత్రియునకు ధర్మసమ్మతమైన యుద్ధముకంటే వేరైన శ్రేయస్సు లేదుగదా! శాంతికొరకు నేను చాలకాలము మహాయత్నముచేసితిని నా శక్తితో అది చేయకపోయితినని సత్యముగా చెప్పుచున్నాను.

ధృతరాష్ట్రమహారాజా! ఇట్లు భీష్ముడు చెప్పగా, కర్ణుడు అతనికి నమస్కారముచేసి అతని యాజ్ఞ తీసుకొని రథమునెక్కి నీ పుత్రునికడకు పోయెను.

## శ్రవణమహిమ:-

వైశంపాయనమహాముని జయమేజయ మహారాజునకు భీష్మపర్వ కథ యంతయు చెప్పి, యీ పర్వశ్రవణమునుగూర్చి యిట్లు చెప్పుచున్నాడు.—

జనమేజయా! అనేక వృత్తాంతములు గల యీ భీష్మపర్వమంతయు నీకు చెప్పితిని. ఇది సమస్త పాపహరము ఈ కథను సర్వదా వినిపించువాడు, శ్రద్ధతో వినిన మనుజులు, సర్వపాపములను పోగొట్టుకొని, చివరకు ఈ శరీరము విడిచిన తరువాత పునరావృత్తిరహితమైన విష్ణుపదమును శాశ్వతముగా పొందగలరు.

కనుకరాజా! సర్వవిధముల ప్రయత్నించి, ఇహపరలోకములందు సర్వసిద్ధులను పొందగోరువాడు, ఈ మహాభారత కథను వినవలెను. రాజా! యీ భీష్మపర్వము వినిన తరువాత విప్రులను గంధమాల్యాదులతో పూజించి భుజింపచేయవలెను.

భీష్మపర్వము సమాప్తము

॥క॥ "పురుషార్థ చతుష్టయమును
పురుషులు సాధించి, కీర్తిపుణ్యము లిచటన్
బరమునఁ గందురు, తథ్యము,
పరమ పవిత్రంబు భీష్మపర్వము వినినన్"

తప్పగంతుల లక్ష్మణశాస్త్రి